# ఆంధ్ర సర్వస్వము



ఆంధ్ర విశ్వ కళాపరిషదుపాధ్యక్షులయిన డాక్టర్ సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారి ముఖబంధము
తోను విద్యార్థికుల వ్యాసములతోను వందలకొలది చిత్రములతోను అలరారు గ్రంథరాజము.
ఆంధ్రదేశమునకును, ఆంధ్రులకును సంబంధించిన విషయములన్నీ ఇందు గలవు.


సంపాదకులు

## మాగంటి బాపినీడు

బి. ఎస్‌సి., (కార్నెల్), ఎమ్. ఎస్‌సి., (కాలిఫో)., ఎమ్. ఎల్. ఏ.
ఎక్స్ పార్లమెంటరీ సెక్రెటరీ ఫర్ ది మినిస్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్ఫర్మేషన్.



విశాలాంధ్ర పబ్లిషర్సు, మద్రాసు.


 1943. [వెల రూ 8 లు.

ఆంధ్ర వికాస ప్రవర్తకులై

కీర్తిశేషులయిన

## రా. బ. కందుకూరి వీరేశలింగం

## దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు

మహాశయుల

స్మరణ చిహ్నముగా



# ఆంధ్రదేశమునకు

## సమర్పితము



కీ. శే. కందుకూరి వీరేశలింగముగారు.



శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు

శ్రీ శివలెంక శంభుప్రసాదుగారి
ఆదరానుమతిని ప్రకటితము.

# ఎందుకీ గ్రంథము?

విజ్ఞానము, సంస్కృతి సర్వతోముఖముగా వ్యాపించియున్న దేశములందు ఇప్పుడు సకల విషయముల గురించిన్ని కూలంకషంగా కాకపోయినా సంగ్రహముగానైనా ప్రస్తావిస్తూ రచించిన వ్యాసములుగల సంపుటి గ్రంథములు వెల్వడుతూ ఉన్నవి. ఆంగ్లభాషలో ఎన్‌సైక్లొపీడియా అనే పేరను 24 వాలములుగల గ్రంథము 14 సారులు ముద్రితమయినది. ప్రతి క్రొత్త ముద్రణమందును గ్రంథము నూతన వికాసమును పొందుతూ పెద్దదిగా పెరుగుతూ వస్తున్నది. దీనితో పాటు ఇంకా అనేకముగా చిన్న చిన్న ఎన్‌సైక్లోపీడియా, సైక్లోపీడియా అనే గ్రంథములు సైతము ఆంగ్లభాషలో ప్రకటితము లగుతూ ఉన్నవి. మన దక్షిణదేశమున కన్నడభాషలో కూడా బాల ప్రపంచ 4 వాలములుగా ప్రకటితమైనది. ఇట్టి గ్రంథములు ప్రతిభాషలోను ఉండదగిన గ్రంథము లనుట నిర్వివాదాంశము గనుక ఎందుకీగ్రంథము? అని ప్రశ్నించుట కవకాశమే లేదు. ఇట్టి గ్రంథము మన ఆంధ్రభాషలో లేనందుకు చింతిలవలెనేకాని ఉన్నందుకు ఆశ్చర్యపడ నక్కరలేదు.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ మనే పేర నొక ఉత్కృష్ట గ్రంథమును—అందలి విషయములను అకారాదిగా ఏర్పరచి, ప్రకటించుటకు ఉద్యమించిన కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారి సంకల్పము అత్యల్పముగా మాత్రమే నెరవేరినది. అకారాదిగానున్న విషయములుగల మొదటి సంపుటము మాత్రమే ముద్రితమైనది. వారి నిర్యాణముతో వారు సంకల్పించిన గ్రంథముకూడా నిలిచిపోయినది. పిమ్మట మరికొంతకాలమునకు దేశోద్ధారకులయిన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఈ గ్రంథమును పునరుద్ధరించదలచి మొట్టమొదట లక్ష్మణరావుగారు ప్రకటించిన భాగమును అనేక విధముల సంస్కరించి, మరికొద్దిగా వృద్ధిపొందించి ప్రకటించినారు అంతే; అంతకంటె ఎక్కువగా వారి సంకల్పమైనా నెరవేరినదికాదు. వారి నిర్యాణముతో ఆ పని సాగింపగలదక్షులును కనబడలేదు. ఆంధ్రుల దురదృష్టమువల్ల ఆ దేశోద్ధారకుడు మరి కొంతకాలము జీవించియుండలేదు; ఆ మహానుభావుడు లేని లోపము పూర్తిచేయగలవారు మరి కనబడలేదు. ఇట్టి పరిస్థితులలో లక్ష్మణరావు నాగేశ్వరరావుగార్లు సంకల్పించినంత గ్రంథము సాధ్యముకాదని తలచి కొలది పాటి ఆశయములతో ఈ చిన్న గ్రంథమును ప్రకటింప నుద్దేశించినాను. ఇందు ఆంధ్రులగురించి అన్ని విషయములును గలవు.

ఈ ఉద్దేశము 1941లో తిరుచునాపల్లి జైలునందుండగా నాకు కలిగినది. వెంటనే నాతో పాటు బందీ కృతులయిన నా మిత్రులకు నా సంకల్పము తెలియజేసి గ్రంథస్వరూపము, గ్రంథమందుండవలసిన విషయములు చర్చించినాను. విముక్తుడనైన వెంటనే పని ప్రారంభించినాను. నాకు సహాయులైనవారిలో దక్షిణ భారత హిందీ ప్రచార సభా కార్యదర్శులయిన శ్రీయుత మోటూరి సత్యనారాయణగారు ప్రధానులు. నా ఉద్యమము కొనసాగించుటలో వారు అన్నివిధములా సమర్థులు గనుక వారి యాజమాన్యమున ఉన్న వారి సభా ముద్రణాలయమందే ఈ గ్రంథము ముద్రింపించుటకు నిశ్చయించి పని ప్రారంభించినాను. తే 16-4-1942 దీని ప్రారంభోత్సవము జరిపి మిత్రులను పత్రికా ప్రతినిధులను రచయితలను కొందరిని ఆహ్వానించినాను.

పిమ్మట ఏయే విషయములగురించి ఎవరెవరు వ్యాసములు రచించుటకు తగిన సమర్థత, అవకాశముగలవారో ఆలోచించి ఆయా రచయితలను ముఖస్థముగానో లేఖల ద్వారానో ప్రార్థించి వ్యాసములను తెప్పించుకొన్నాను. అనేక మిత్రులు, సంస్థలవారు నాకు వ్యాసములు పంపించిగాని చిత్రములు బ్లాకులు పంపించిగాని నాకు సహాయులైనారు. వారి అందరికిని నేను కృతజ్ఞుడను.

600 పుటలుగల గ్రంథము ఈ కరువుకాలములో కాగితము దొరుకుట కష్టముగానున్న సమయమందు ప్రకటించుట నా కసాధ్యమైనపని. అయినా సద్గ్రంథము తలపెట్టినపుడు సాహాయ్యము చేయగల ఉదారులు ఆంధ్రదేశమందు లేకపోవుదురా అనే నిండు నమ్మకముతో ప్రారంభించి చాలవరకు కృతకృత్యుడనైతిని. ఇందులో కొన్ని గుప్త దానములగుటచేత గ్రంథపోషకుల నామములు పేర్కొనలేదు. వారందరికిని కృతజ్ఞతా పూర్వక నమస్కారము లర్పిస్తున్నాను. కొందరు తమ కంపెనీల ప్రకటనలు ఈ గ్రంథములో ప్రకటించుటకు ఇచ్చి ఆ రూపముగా సాహాయ్యముచేసిరి. వారియెడలను నేను కృతజ్ఞుడను.

ఏయే పెద్దవిషయములు ఏయే విద్యావంతులు రచించినారో గ్రంథములో తెలియజేసినాను. అందలి అభిప్రాయములకు తద్రచయితలే కాని నేను బాధ్యుడనుకాను. తక్కిన విషయములు సంపాదకీయవర్గమువారము రచించినవి. నాకు సహాయులుగా ఈ సంపాదకీయవర్గమందు పనిచేసి నా యత్నము సఫలముగావించినవారందరును నా కృతజ్ఞతకు పాత్రులు.

తే 9-8-1942 దీని రాజకీయబందీనై నేను చెన్నపట్టణమునుండి వెడలిపోవునప్పటికి గ్రంథము సగమైనను పూర్తికాలేదు. నా కుమారుడుఅప్పటికి నెలబాలుడు. నా భార్యను పిల్లలను ఆ బాలుని విడిచిపెట్టుటకంటె ముద్రితమగుతూ ఉన్న నా ఆంధ్రసర్వస్వమును విడిచిపెట్టి పోవుట నాకు ఎక్కువ విషాదకరముగా నుండెను. దైవ సంకల్పితము గదా అని ధైర్యము తెచ్చుకొని నా గ్రంథము ఎంత వేగముగా ప్రకటితమగునా అని నిరీక్షిస్తూవచ్చినాను. ఆ పిమ్మట జరిగిన విషయములగురించి నా అర్ధాంగి తన "మనవి"లో తెలియజేసినది. ఆమె తోడ్పాటు నా అదృష్టఫలము. ఆంధ్ర విశ్వ కళాపరిషత్తుకు మూడవసారి ఉపాధ్యక్షులయి మన విద్యా సంస్థ నడుపుచున్న పండితులు శ్రీ కట్టమంచి రామలింగరెడ్డిగారు, కోరిన వెంటనే ఈ గ్రంథమునకు ముఖబంధము రచించి పంపినందుకు ఆమెతో పాటు నేనును వారికి కృతజ్ఞుడను.

తలపెట్టిన గ్రంథము పెద్దదగుటచేతను కొద్దిమంది విద్యావంతుల తోడ్పాటుతోనే గ్రంథము సాగించవలసి వచ్చుటచేతను గ్రంథములో అనేక లోపములున్నవి ; ఉండక తప్పదు. అంతేకాక, ఇట్టి గ్రంథము తరుచుగా దేశ కాలపరిస్థితులనుబట్టి సంస్కరిస్తూ అభివృద్ధిపరచవలసిన గ్రంథము ; గనుక, ఈసారి రాబోవు ముద్రణములో ఇందలి లోపములను సవరించి ప్రకటింపనగును. అందుకు ఉదారులయిన ఆంధ్రుల సహజ సాహాయ్యము ఆపేక్షించుచున్నాను. రాబోవు ముద్రణము ప్రజాదరణముపై ఆధారపడియుండును.

—మాగంటి బాపినీడు.

బి. ఎస్‌సి., (కార్నెల్), ఎమ్. ఎస్‌సి., (కాలిఫో)., ఎమ్. ఎల్. ఏ.

# మనవి

తా నొకటి తలచిన దైవ మొకటి తలచు నన్నట్లే అయినది. ఈ గ్రంథ ముద్రణము సగము సాగినవరకూ దీనితో నాకు సంబంధము ఏ మాత్ర మయినా ఉంటుందని నేను అనుకోలేదు, సంబంధము కలిగినందుకు సంతోషమే కాని, కలుగుటకుగల కారణము మాత్రము శోచనీయ మయినది. గ్రంథము సగమైన పూర్తికాక మునుపే దీనిని సంకల్పించి ముద్రణము ప్రారంభించిన నా భర్త శ్రీయుత మాగంటి బాపినీడుగారు రాజకీయ పరిస్థితులవల్ల ప్రభుత్వమువారి నిర్బంధములో నుండుటకు వెడలవలసివచ్చినది. మరియొక మాసమునకే ఈ ఉద్యమమందు వీరికి ప్రధాన సహాయులుగా నుండిన శ్రీయుత మోటూరి సత్యనారాయణగారున్ను ప్రభుత్వమువారి నిర్బంధములో నుండుటకే వెడలవలసి వచ్చినది. అందుచేత ఈ కార్యభారము నేను నిర్వహించవలసివచ్చినది.

ఇట్టి పనికి నే నలవాటుపడినదానను కాను గదా నే నేమి చేయగల నన్న భీతితో పని ప్రారంభించినాను. నా భర్తగారికి తోడ్పడిన మిత్రుల తోడ్పాటు నాకును గలుగుటవల్ల నా పని సులువై నాకు కొంత అనుభవము కలిగిన దని సంతోషించు నంతటిలో కాగితములేక గ్రంథ ముద్రణము రెండుమాసములకు పైగా ఆగిపోయినది. గ్రంథము 500 పుటలకు మించదన్న అంచనాతో అందుకు కావలసినకాగితము మాత్రమే నా భర్తగారు సేకరించియుంచిరి. 500 పుటలును అచ్చుపడినవి. గాని సుమారు మరి 150 పుటలు పట్టే గ్రంథము అచ్చుకావలసియుండెను. ఎట్టకేలకు హిందీ ప్రచార సభవారే ప్రయాసపడి కొద్దిగా కాగితము సంపాదించి ఇవ్వగలిగిరి. సంకల్పించిన గ్రంథమంతా అచ్చువేయుటకు తగినంత కాగితము లేనందున కడపటి 5 అధ్యాయముల గ్రంథమున్ను చాలవరకు క్లుప్తపరచవలసి వచ్చినది. ఎవరెవరు ? అనే అధ్యాయములో కొందరి జీవితాంశములను విడిచిపెట్టవలసి వచ్చినది. అవీ-ఇవీ అనే అధ్యాయములోని విషయము లనేకము విడిచిపెట్టుకోవలసి వచ్చినది. ఎట్లయినా చివరకు ఈ గ్రంథము పూర్తిగా ముద్రితమై ప్రకటింపజేయగల భాగ్యము నాకు కలిగినందుకు నేను ధన్యురాలను. నా భర్త సంకల్పము నెరవేర్చిన నా యిష్ట దేవతకు నా కృతజ్ఞతాభివందనములు. ఇట్టి పెద్ద గ్రంథములో లోపములు కొన్ని అనివార్యములే అయినా కొన్నిమాత్రము నా భర్తగారు ఇక్కడ ఉండిఉంటే కలుగకపోను. అందుకు నేనే బాధ్యురాలను. గ్రంథ సంకల్పము, విధానము, రచన మొదలయిన విషయములన్నీ నా భర్తగారు సంకల్పించినవిన్ని, వివిధ రచయితలు రచించినవిన్ని గనుక అందలి సుగుణములన్నీ వారివే. భర్తగారు దగ్గర లేకపోయినా ఏదోవిధముగా గ్రంథ ముద్రణము కొనసాగించినా నన్న సంతోషమే నాది.

ఈ గ్రంథమునకు ముఖబంధము రచించవలసినదని నాభర్తగారి తరపున నేను కోరిన వెంటనే నా మాట మన్నించి, ఇతర కార్యము లెన్నియున్నా అవకాశము చూచుకొని హెచ్చరిక వాక్యములతో తమ ప్రస్తావన రచించి దయతో పంపించిన సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారికి నేనెంతయు కృతజ్ఞురాలను. ఈ గ్రంథము ప్రారంభించినది మొదలు నా భర్తగారికి సహాయులుగా నుండి ఇందలి ప్రసంగములు కొన్ని రచించి, గ్రంథము పూర్తిగావించి, ప్రకటించుటలో నాకు తోడ్పడిన డా॥ గిడుగు వేంకటసీతాపతిగారికిని, గ్రంథము చక్కగా ముద్రించి, అనేకవిధముల మాకు సహాయులై ఈ గ్రంథము తమ గ్రంథమే అను ఆదరముతో ముద్రణము ఆకర్షణీయము గావించిన హిందీ ప్రచార సభా ముద్రణాలయ శాఖవారికిని, వారిలో ముఖ్యముగా శ్రీయుత గోవింద అవస్థీ గారికిని, కాగితము దొరకక పని ఆగిపోయినప్పుడు ప్రయాసపడి కాగితము తెప్పించి ఇచ్చి పని పూర్తియగుటలో తోడ్పడినందుకు హిందీ ప్రచార సభా కార్యదర్శిగా ఇప్పుడు పనిచేయుచున్న పండిత రఘువరదయాలు మిశ్రగారికిని నా కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథ ముద్రణకార్యమందు పనిచేసినవారందరిని చేర్చి ఛాయాపటము తీయించి ఈ గ్రంథమందు ప్రకటించవలసినదని నా భర్తగారు తెలియజేసిరి. గాని, ఈ గ్రంథ ప్రకటనకు ప్రధానులైన నా భర్తగారును, సహాయులలో ముఖ్యులయిన శ్రీయుత మోటూరు సత్యనారాయణ గారును లేని ఛాయా చిత్రము తీయించుకొనుటకు ఇక్కడనున్న తక్కినవారెవరును సమ్మతించక పోవుటచేత ఆ సంకల్పము విడిచిపెట్టినాము.

మకర సంక్రాంతి,
మద్రాసు.

—డా. మాగంటి శకుంతల, ఎల్. ఐ. ఎమ్.

# ముఖబంధము

నా ముఖ్య స్నేహితులలో నొక్కఁడగు మాగంటి బాపినీడు తన కర్తృత్వ సంపాదకత్వముల మూలముగ సంఘటించిన యీ 'ఆంధ్ర సర్వస్వము' అను సంహితకుఁ దిలకాయమాన వచనమును రచింపుమని కోరినందున నామంగళ కార్యమున కసమర్థుఁడనయ్యుఁ బ్రేమచాపల్యమున నంగీకరించితిని. సర్వంకష మయిన యిట్టి గ్రంథముయొక్క ముఖబంధ రచనకు సర్వకళానిపుణులు తక్క నావంటి యల్పజ్ఞుఁడు సాహసించుట హాస్యాస్పదమగునేమో! అయినను నామీఁద దనకున్న ప్రీతి నిట్లు బాపినీడు చూపినందున ధన్యుఁడనగుటయేకాక వాని యిష్టానుసారము ప్రవర్తింపవలసినవాఁడ నయితిని.

ఈ యాంధ్ర సర్వస్వము మన భాషలలో నపూర్వమార్గములంగూర్పంబడి యగ్రగణ్యములయిన గ్రంథములలో నొక్కటి. ఇంటింటనుండఁదగినది. ఎల్లరును జదువవలసినది. ఆంధ్రుల భూమి, దాని వర్ణనము, వారి చరిత్రము, వాఙ్మయము, సంస్కారోద్యమములు, ఆర్థిక స్థితిగతులు, జాతీయతా భావ పరిణామము, రాజకీయ ప్రయత్నములు, చిత్రకళా నైపుణ్యము, విద్యా విధానములు తద్వ్యాప్తి మొదలగు సర్వవిషయములను ఆదినుండి యాధునికము వఱకును వివరించి ప్రాచీన విషయ విజ్ఞానముతో పాటు వర్తమాన కర్తవ్యములను, భవిష్యత్తును భద్రపఱుచు రీతులను దెలిపి, జ్ఞానముతో శీలము, శీలమునకు నావశ్యకమయిన జ్ఞానము, పరస్పరవర్థకము లగు నీరెంటిని మన హృదయములను నాటునట్లు చేసి దేశోపకారము నమోఘముగా సల్పినా రీ గ్రంథకారకులు. ఇట్టి బృహద్గ్రంథమీావఱలో రచింపఁబడి యుండలేదు. ఇఁకముందుఁ గ్రొత్తగ రచింప నవసరమును లేదు. ఏలన దీనినే నాలుగైదేండ్ల కొక పర్యాయము లోపములంబూరించుచు నూత్నములను సమకూర్చుచు సవరించి సంస్కరించి ప్రచురించినయెడల నద్దియే నిత్యప్రమాణ గ్రంథమగును.

సకల విషయ సంశోభితమయిన యిట్టి సమగ్ర గ్రంథమును సర్వజ్ఞుఁడయినను నిస్సహాయముగ రచియింపఁజాలఁడు. అనేకులయొక్క సాహాయ్యమావశ్యకము. ఆంధ్రదేశములో నయ్యాయి విషయములఁ బారీణులయి ప్రామాణిక కర్తలనఁదగు విద్వద్వర్యులు బాపినీడునకుఁ దోడ్పడియుండుట యెంతయుఁ గొనియాడఁదగిన సంగతి. ఎల్లరును బ్రత్యేకముగఁ బేర్కొనఁదగినవారయ్యును స్థలము చాలనందున దృష్టాంత రూపముగఁ గొన్ని వ్యాసములను దత్కర్తలను మాత్రము పేర్కొందును:—

1. ఆదిమ నివాసులు—గిడుగు వేంకట సీతాపతిగారు.
2. ఆంధ్రుల చరిత్ర—పుట్టపర్తి శ్రీనివాసాచారిగారు.

3. హిందూ మతము—ఉన్నవ లక్ష్మీనారాయణగారు.

4. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర—పింగళి లక్ష్మీకాంతముగారు.

5. జాతీయోద్యమములు—భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు.

6. శిల్పము—అడవి బాపిరాజుగారు.

ఉదాహరణముల నింతటితోఁజాలించి యీ గ్రంథ శ్రుతి ఫలముల నా మనస్సునకుండట్టి నట్లు నివేదించెదను. ఆంధ్రుల సర్వతోముఖమాహాత్మ్యము గ్రుడ్డివానికయినను గోచరింపక పోదు. ఆంధ్రాభిమానము విజృంభించును. రిత్తకోరికలతో వట్టియాసలతోఁ బోక యా యభిమానమునకు ననురూపమయిన రీతిని నడచి కడతేరుదమను శ్రద్ధయు జనించును. వర్తమానమునకును భావికిని ననువగు రీతులఁ బ్రవర్తింపవలయునను నుత్సాహముతోఁగూడ నా రీతుల తెలుంగును విశదపఱుచును. వర్తనలేని జ్ఞానము నిష్ఫలము. జ్ఞానములేని వర్తన దుష్ఫలము. ఈ రెంటిని సమన్వయింప వలయునన్నఁ బ్రాచీన చరిత్ర జ్ఞానముతోపాటు ఆధునిక విషయ విమర్శన శక్తిని భవిష్య దృష్టిని గలిగియుండవలయును. దేశాభివృద్ధి కాధారములయిన యిట్టి క్రియలకును సిద్ధులకు నీ సంహిత యనేకవిధములందోడ్పడగలదు.

ఇది మంచి శైలిని వ్రాయంబడియున్నది. కొన్ని వ్యాసములు వ్యావహారిక భాషయందును మఱికొన్ని సలక్షణమైన గ్రాంథిక భాషయందును వ్రాయంబడి యుండుటలో వీనియొక్క తారతమ్యమును గ్రహించుట కవకాశము గలిగియుండుటయు నొక విశేషము. లక్షణ సమన్వితమో, లక్షణాతీతమో, ప్రతివ్యాసమును విస్పష్టార్థవంతము. ఇది రసప్రధానము గాదు; విషయ ప్రధానము. కావున నర్థవైశద్యమునకే ప్రాముఖ్యము. అది యిందున్నది గావున నే కొదువయును లేని పరిపూర్ణత్వము గల్గినది.

ఈ సంహితను సృష్టికిఁదెచ్చిన మాగంటి బాపినీడునకు భాషయొక్కయు దేశముయొక్కయుఁ బరముగాఁ గృతజ్ఞతాభివందనములను సమర్పించుచు నాతని ధన్యత్వముంగొనియాడుచున్నాను. ఆంధ్రదేశమున నూరూరను నింటింటను నీ గ్రంథమునకు సాంద్రమయిన వ్యాప్తి సమకూడును గాక !

పద్మప్రభాస, చిత్తూరు.<br>
కార్తిక పున్నమ, 1942.

కట్టమంచి రామలింగారెడ్డి.

# జన్మభూమి

ఏదేశ మేఁగినా ఎందుఁ గాలిడిన
ఏ పీఠ మెక్కినా యెవరెదురయిన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గర్వమ్ము
లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి ధీరులింకెందు !

ఏ పూర్వపుణ్యమో ఏ యోగబలమొ
జనియించి నాఁడ వీ స్వర్గలోకమున !
ఏ మంచి పూవులన్ ప్రేమించినావొ
నిను మోచె నీతల్లి కనకగర్భమున !
... ... ...
... ... ...
అవమాన మేలరా అనుమాన మేల
భరతపుత్రుఁడ నంచు భక్తితోఁ బలుక !

—రాయప్రోలు

## ప్రబోధము

అమరావతీపట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించు నాఁడు,
ఓరుగల్లున రాజవీరలాంఛనముగాఁ
బలు శస్త్రశాలలు నిలుపు నాఁడు,
విద్యానగర రాజవీథులఁ గవితకు
పెండ్లి పందిళ్లు కప్పించు నాఁడు,
పాట్నూరికి సమీపమున నాంధ్ర సామ్రాజ్య
దిగ్జయస్తంభ మెత్తించు నాఁడు,
ఆంధ్ర సంతతి కే మహితాభిమాన
దివ్య దీక్షా సుఖస్ఫూర్తి తీవరించె
నామహావేశ మర్థించి యాంధ్రులార
చల్లుఁ డాంధ్రలోకమున నక్షతలు నేఁడు!

కృష్ణా తరంగపంక్తిఁ ద్రొక్కి త్రుళ్లింత
నాంధ్ర నౌకలు నాట్యమాడు నాఁడు,
ఇంటింట దేశసాహిత్య దీపములతో
నాంధ్ర తేజస్సు రాపాడు నాఁడు,
సుకుమార శిల్పవస్తుప్రపంచము నందు
నాంధ్ర నైపుణి పంత మాడు నాఁడు
సమర సేనావ్యూహ జయపతాకల క్రింద
నాంధ్ర పౌరుషము చెండాడు నాఁడు,
చూచి సంతోషమున తలలూచి, గర్వ
మాచి, ఆంధ్ర పుత్రీపుత్రు లందఁగలరు
శాంతి, నందాక లేదు విశ్రాంతి మనకు
కంకణ విసర్జనల కిది కాలమగునె!!

—రాయప్రోలు

# వి ష య సూ చి క

అధ్యాయము. | పుటలు.

అధ్యాయము. పుటలు.

అధ్యాయము. | పుటలు.

పదుకొండవ భాగము



పండ్రెండవ భాగము



పదుమూడవ భాగము



పదునాల్గవ భాగము

# ఆంధ్రసర్వస్వము

## మొదటి భాగము

### 1. ఆదినుండి ఆంధ్రులవరకు



"ఆశ్చర్యములకెల్ల నాస్పదంబాదిత్యుఁ
డాతని వలనన భూతజాల
మఖిలంబుఁ జరియించు
నదియచ్చెరువుగాదె"

—భారతం శాంతి ఆ. 6

విషయసంగ్రహము : భూమి పుట్టి 200 కోట్ల సంవత్సరాలు; మానవుడు పుట్టి లక్ష సంవత్సరాలు; కాస్త నాగరికత పొంది పదివేల సంవత్సరాలు; మొట్ట మొదటి నాగరిక సంతతులు మూడు : నైలునదీ తీరాన హెమైట్, యూఫ్రటిస్-టైగ్రిస్ తీరాల సెమైట్, సింధుతీరాన ఆర్యసంతతులు (క్రీ. పూ. 3000) భారతదేశమందు ఆదిమవాసులు, ద్రావిడులు, ఆర్యులు; చరిత్రలో మొదటిది హిందూ మహాయుగము (క్రీ. పూ. 2500 క్రీ. శ. 1200) అందు ఋగ్వేదయుగం (క్రీ. పూ. 2500-1400), క్షాత్ర యుగం (క్రీ. పూ. 1400-1000), సూత్రయుగం (క్రీ. పూ. 1000-567), బౌద్ధయుగం (క్రీ. పూ. 567-క్రీ. శ. 500), పౌరాణికయుగం (క్రీ. శ. 500-1200). ఆంధ్రుల చరిత్ర ప్రారంభము.

ఓహో! మనభూమి ఎంత పెద్దదో! సుమారు 8000 మైళ్లు అడ్డకొలత, 24,000 మైళ్లు చుట్టుకొలత, 19,69,50,000 చదరపుమైళ్లు వైశాల్యముగల భూమి పెద్దది కాదనగలమా? చాలా పెద్దదే; కాని, విశాలమైన ఈ విశ్వములో—అనేక కోట్ల లోకాలుగల ఈ బ్రహ్మాండములో ఇంత పెద్ద భూమిన్నీ ఒక చిన్న బిందువుకంటెచిన్న విషయము గుర్తించారా? సూర్య కుటుంబములో సూర్యుని చుట్టును తిరుగుతూ ఉన్న గ్రహాలలో భూమి సైతము ఒక గ్రహము. కొన్ని గ్రహాలకంటె పెద్దదే అయినా, కొన్ని గ్రహాలకంటె చిన్నది. గురుని అడ్డకొలత సుమారు 88,640 మైళ్లు, అనగా భూమి అడ్డకొలతకు 11 రెట్లు అధికము. సూర్యుని అడ్డకొలత 109 రెట్లు అధికము. అయితే, సూర్యుడు మనకు ఒక చిన్న బింబమువలె కనబడుతున్నాడేమి? మన భూమికి 9,29,00,000 మైళ్లు దూరంగా ఉన్నాడు గనుక. మన భూమి సూర్యునికి ఒక చిన్న చుక్కవలె కనబడుతుంది.

తక్కిన గ్రహముల వలనే మన భూమిన్నీ సూర్యుని చుట్టూ తిరుగుతూ ఉంటుంది. సూర్యుని చుట్టూ ఒక్కసారి తిరిగి రావడానికి 365 దినముల 5 గంటల 49 మినిట్ల 46 సెకండ్లు పడుతున్నది. అంటే భూమి సెకండుకు 18½ మైళ్లు అనగా గంటకు 66,600 మైళ్లు పరుగెత్తుతూ తిరుగుతున్నదన్నమాట. అన్ని రైళ్లకంటె ఎక్కువ వేగంగా పోతుందనే పంజాబుమెయిలు వడి దీనిలో ఎన్నోవంతు? ఇంత వడిగా పరుగెత్తుతున్నదిగనుకనే దీని ఉత్తర-దక్షిణాల అడ్డకొలత దీని నడుమును తూర్పు-పడమరలుగా తీసే అడ్డకొలతకంటె కొంచెము తక్కువ. అంటే, ఉత్తర దక్షిణాల భాగాలు కొంచెము అదిమినట్లుంటవన్న మాట.




భూమికిని సూర్యునికి చంద్రునికిగల దూరము

అందుచేతనే భూమి మొత్తముమీద గుండ్రంగా ఉన్నదన వచ్చును గాని సరిగా బంతివలె గుండ్రంగా ఉన్నదని చెప్ప లేము. గుండ్రంగా ఉన్నదంటే, నున్నగా సైతము ఉం టుందనరాదు. ఎత్తుపల్లాలు భూతలమున మనకు కనబ డుతూనే ఉన్నవి. కొన్ని చోట్ల ఎత్తైన పర్వతాలు మరికొ న్నిచోట్ల లోతైన సముద్రాలు కలవు. గాని, ఎంత ఎత్తైన పర్వతమైనా 5 మైళ్లకంటె ఎక్కువ ఎత్తుగా ఉండదు; ఎం త లోతైన సముద్రమైనా 8 మైళ్లకంటె ఎక్కువ లోతుగా ఉండదు. 19,69,50,000 చదరపు మైళ్లు వైశాల్యంగల భూగోళమందు ఈమాత్రపు ఎత్తు పల్లాలు వడలిన వంకాయి మీది ముడతల వంటివి; అంతగా పరిగణింప దగినవి కావు.

మహావిశ్వములో భూమి చిన్న చుక్కవంటిదే అయినా మన దృష్టికి భూతలము విపులముగా వ్యాపించి యున్నది గనుక, ఈ మహాప్రపంచములో మానవుడెప్పు డేవిధమున ఉద్భవించాడు? మన భరతవర్షము ఎక్కడ ఉన్నది? అందులో మన ఆంధ్రదేశము, మన జిల్లా, మన ఊరు ఎక్క డ ఉన్నవి? మనదేశ చరిత్ర ఎట్లు పరిణమించినది? మన దేశభాగ్య మెట్లున్నది? మన విజ్ఞానము ఎంతవరకు విక సించినది? ఈ విధముగ అనేక విషయములు మనము తెలు సుకోవలసి యున్నది. అందుకే మనవారు ప్రాచీన కాల మునుండిన్ని ప్రతిదినము మూడు వేళలను సంధ్యవార్చి నప్పు డును, శుభమేకానీ అశుభమే కానీ కర్మలనుష్ఠించి నప్పుడును చెప్పే సంకల్పములో "శ్వేత వరాహ కల్పే వైవస్వత మన్వం తరే...కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరత ఖండే మేరోః దక్షిణ దిగ్భాగే గంగాకావేరీ మధ్యభాగే..." అని తామున్న దేశము తిథివారనక్షత్రాల లెక్కతో కాల ము నిర్ణయించు కొంటూ ఉంటారు.

ఆరంభములో కొన్ని యుగాలవరకు ఉష్ణాధిక్యము వలన భూతలము ఏ ప్రాణికిని వాసయోగ్యముగా ఉండేదికాదు. పిమ్మట కొంతకాలానికి భూమి చల్లపడిన తర్వాత, స్థావరజం గమజీవకోటి వివిధరూపములు దాల్చి ఉద్భవిల్లినది. అం దులో కొన్ని జలచరాలుగాను, కొన్ని భూచరాలుగాను పరి ణమించినవి. జంతుపరిణామములో నరజన్మ వానరదశ దాటి నేటికి ఉత్కృష్టమైనదిగా కనబడుతున్నది.

ఈ మానవకోటికి సంబంధించిన జగన్నాటకములో మన దేశమాక్రమించియున్న రంగస్థలమున్ను మన భారతీయులు— అందులో ముఖ్యముగా మన ఆంధ్రులు ధరించిన పాత్రస్వ రూపమున్ను తెలుసుకొందాము.

ఈ విశ్వములో మన భూమి పుట్టి సుమారు 200 కోట్ల సంవత్సరాలు అని పాశ్చాత్యశాస్త్రజ్ఞులును 400 కోట్ల సంవ త్సరాలని మనవారున్ను అంటారు. ఈ భూమిపై గల సకల స్థావర జంగమ ప్రాణికోటిలోను, మానవజాతి పుట్టి సుమారు లక్షసంవత్సరము లయి ఉండవచ్చును. అందులో సుమారు పండ్రెండువేల సంవత్సరముల క్రిందటివరకును, మానవుడు అడవిజాతి జంతువులవలనే నిలకడలేక తిరుగుతూ, వేటచేసి మృగములను, పక్షులను, నీటిలో దొరకు చేపలను తింటూ జీవించినాడు. కాస్త నాగరికత పొంది, పశువులను పెంచి నాగలితో భూమిదున్నుటకు మొదలుపెట్టి పదివేల సంవ త్సరములయినను కాలేదు. అయితే, మానవుడెప్పుడును తనతోడివారలతో సంఘచారియై జీవించెనే కాని ఏకాకియై జీవించలేదు. భూమి దున్ని పంటలు పండించుకొంటూ, స్థిరనివాసము లేర్పరచుకొనే స్థితిలోనికి మానవుడు వచ్చేసరికి మూడు నదీతీర ప్రదేశములందు, మూడు మానవజాతిసంఘ ములవారు, పల్లెలు, నగరములు నిర్మించుకొని చెప్పదగిన నాగరికత, విజ్ఞానసంపత్తి గలిగి అభివృద్ధిపొందుచుండిరి:

నైలునదీతీరములందు హేమైట్ సంతతివారున్ను, యూఫ్రెటిస్-టైగ్రిస్‌నదీతీరములందు సెమైట్ సంతతివారున్ను, సింధునదీతీరములందు ఆర్యసంతతివారున్ను.

ఆర్యులు మనదేశమునకు వచ్చేసరికి దేశములో అడవి జాతులవారున్ను, ద్రావిడులున్ను ఉండేవారు. వీరిలో అడవి జాతులవారు దేశములో అనాదిగా ఉన్నవారే అనిన్ని, ద్రావిడులు ఆర్యులవలనే ఆర్యులకు పూర్వము చాలాకాలము క్రిందట వచ్చియున్నవారనిన్ని చరిత్రకారుల అభిప్రాయము. అడవి జాతులవారనగా నేటి సంతాలులు, గదబలు, ముండాలు, సవరలు, మొదలయినవారి పూర్వులు. వీరి చరిత్ర తెలుసుకొనుటకు ఆధారములు కడుతక్కువ. ఋగ్వేదములలోను, ఆ తర్వాతి ప్రాచీన గ్రంథములలోను శబరులకు సంబంధించిన వాక్యములున్నవి. ద్రావిడులు, ఆర్యుల సంపర్కము కలిగిననాటికే, నాగరికులయి ఉండిరి; పల్లెలు, పట్టణములు, నగరములు నిర్మించుకొనియుండిరి; వ్యవసాయము సాగించుకొనుచుండిరి; రాగి, ఇనుము, మొదలయిన లోహములతో పనిముట్లు, గృహోపకరణములు చేసుకొని వాడుకొనుచుండిరి; రవసెల్లాలు, గంధపు చెక్కలు, ఏనుగు దంతములు, బియ్యము, ఎగుమతిచేసి ధనమార్జించుకొనుచుండిరి; ఆర్యులు మనదేశమునకు వచ్చిన సరికి ఉత్తర హిందూస్థానమునందు వ్యాపించియుండిరి. ఈ నడుమ కొద్దికాలము క్రిందట సింధునదికి కుడివైపుతీరమునందు (అనగా వాయవ్యపు రైలుదారికి శాఖగానున్న, కోటి–దాదు–లార్కానా–రైలుదారిలోగల డోక్రిస్టేషనుకు 8½ మైళ్ల దూరాన) మహేన్‌జొదారోవద్ద ఒక ప్రాచీననగరముయొక్క శిథిలభాగములు బయలు పడినవి. అక్కడ త్రవ్వి చూడగా ప్రాచీనకాలమునందు ఒక నగరము వెలసియుండినట్లు స్పష్టమయినది. అక్కడ కనబడిన వస్తువుల ప్రాచీనతను బట్టిన్ని, అక్కడి భూతలస్వభావమును బట్టిన్ని, ఆ ప్రాచీన నగరము నేటికి అయిదువేలసంవత్సరముల క్రిందటిదై ఉండవలెనని శాస్త్రజ్ఞు లూహించినారు. అనగా ఋగ్వేద కాలమునకు పూర్వమందు వెలసియుండిన నగరమని ఊహింపవలసియున్నది. ఆ నగరముయొక్క విస్తీర్ణత; అక్కడి వీధుల పొడవు, వెడల్పు; అక్కడి గృహనిర్మాణము; అక్కడి గొప్పమందిరముల శిథిలభాగములు; అక్కడి పెద్ద పెద్ద జాడీలు, అందమయిన నగిషీపనులుగల కుండలు, గోలెములు; స్త్రీలు ఆభరణముగా ధరించు పూసలపేర్లు; రాగితోను, రాతితోను చేసిన విగ్రహములు, పాత్రలు, దంతపు వస్తువులు, వివిధములైన పనిముట్లు, మొదలయిన వస్తువులు ఆనాడు ఆ ప్రాంతమందుగల జనుల నాగరికతను తెలియజేయగలవు. అంతకంటెను ఎక్కువ ముఖ్యమయిన వింతవస్తువులే వనగా పోతపోసిన చిత్రములున్ను, రేఖాగణిత శాస్త్ర సంబంధముగల గీతలున్ను గల వ్రాతలు. ఈ వ్రాతలు తృప్తికరముగా చదివి అర్థము చేసుకొనడము నేటికింకా ఎవరికిని సాధ్యము కాలేదు. చిత్రములలో ఎద్దు, ఖడ్గమృగము, ఏనుగు, ఎనుబోతు, పులి మొదలైన జంతువుల బొమ్మలు గలవు. ఈ నగరమందుండినవారు ద్రావిడులో ఆర్యులో స్పష్టముగా తెలియదు; గాని, ఈ నగరము మనదేశమందలి ప్రాచీననగరము లన్నిటను ప్రాచీనతమమైన నగరమని మాత్రము చెప్పగలము.

మనదేశచరిత్రలో హిందూమహాయుగము మొట్టమొదటిది. అది క్రీ. పూ. 2500 మొదలుకొని క్రీ. శ. 1200 వరకును వ్యాపించియున్నది. ఈ మహాయుగమును చరిత్రకారులు అయిదుభాగములుగా విభజింతురు.

| | | | | |
|---|---|---|---|---|
| (1) | ఋగ్వేదయుగము | క్రీ. పూ. | 2500– | 1400 |
| (2) | క్షాత్రయుగము | ,, | 1400– | 1000 |
| (3) | సూత్రయుగము | ,, | 1000– | 567 |
| (4) | బౌద్ధయుగము | ,, | 567– | క్రీ.శ. 500 |
| (5) | పౌరాణికయుగము | క్రీ. శ. | 500– | 1200 |

## ఋగ్వేద యుగము
## క్రీ. పూ. 2500—1400

సుమారు ఆరువేల సంవత్సరములకు పూర్వమే ఆర్యులు, ఆసియా మధ్యభాగమునుండి కొందరు యూరపు దేశమునకును, కొందరు పారశీక దేశమునకును చెదరిపోయిరి. పారశీక దేశమునకు పోయినవారిలో కొందరు పారశీక దేశమున నిలచిపోయిరి; కొందరు హిందూదేశమునకు వచ్చిరి. యూరప్ ఖండమునందు వెలసిన భాషలలో గ్రీక్, లాటిన్, భాషలున్ను, ఆసియాలో వెలసిన భాషలలో పార్సీభాషయు వేదకాలమునాటి సంస్కృత భాషయు, ఆనాటి ఆర్యుల భాషకు సంబంధించినవే!

హిందూదేశమునకు వచ్చిన ఆర్యులు, మొట్టమొదట సింధునదీ తీరమునందు వసతులేర్పరచుకొని, క్రమక్రమముగా తూర్పు, దక్షిణములకు వ్యాపించినారు. ‘సింధూ’ శబ్దమును

ఇతర దేశస్థులు 'హిందు' అని ఉచ్చరించడంచేత, సింధు దేశమునకు హిందూదేశమను పేరు వచ్చినది. ఈ పేరే ఆర్యులు వ్యాపించుతూ వచ్చిన దేశమంతటికినీ వర్తిస్తూ వచ్చినది. తుదకు ఆసేతుహిమాచలము వ్యాపించిన మన దేశమంతటికిని వర్తించియున్నది. సింధుశబ్దము పాశ్చాత్యులు 'ఇండస్' అని ఉచ్చరించుటచేత, ఇండియా అని పేరు వచ్చినది. హిందూదేశము, ఇండియా అనుపేళ్లు రెండున్ను ఇతర దేశస్థుల ఉచ్చారణమును బట్టి వచ్చినవే. మనదేశమునకు ఆర్యులు పెట్టిన పేరు భరతఖండము. దానిని బట్టియే భారతదేశమనుపేరు సైతము వచ్చినది.

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, అను నాలుగు వేదములలోను ఋగ్వేదము మొదటిది గనుక, ఈ యుగమునకు ఋగ్వేదయుగమను పేరు పెట్టినాము. ఈ యుగమందలి మనదేశచరిత్ర తెలుసుకొనుటకు ముఖ్యమైన ఆధారము ఋగ్వేదములోనే ఎక్కువగా కలదు.

మనదేశమునకు క్రొత్తగావచ్చిన ఈ ఆర్యులకున్ను, అదివరకే వ్యాపించియున్న ద్రావిడులకున్ను, అడవజాతి వారికిన్ని, యుద్ధములు జరుగుతూ వచ్చినవి. ద్రావిడులు ఎక్కువగా నాగరికతగలవారే అయినను, ఆర్యులతో జరిగిన యుద్ధములలో ఓడిపోయి, తూర్పుదక్షిణములకు పోవుచుండిరి. ఆర్యులు కొంతకాలమునకు పంజాబు దేశమందలి సింధూనదీ తీరములందే కాక, సింధుయమునా నదుల నడుమనున్న ప్రదేశములందు సైతము, రాజ్యములు స్థాపించుకొనిరి. ఈ ప్రదేశమునకు బ్రహ్మావర్తమని పేరు.

ఈ యుగమందు ఆర్యుల నాగరికత ఎట్లుండెనో వేదముల నుండియే మనము తెలుసుకోగలము. పల్లెలు, నగరములు అందులో రాతి కట్టడములు, మందిరములు; పెద్ద పెద్ద బావులు, అందుండి నీరుతోడి కాలువలగుండా పారించుటకు ఘట యంత్రములు, వ్యవసాయము; ఆవులు, మేకలు, గొర్రెలు, బర్రెలు, గుర్రములు మొదలయిన పెంపుడు జంతువులు; దారమువడకుట, బట్టలు నేయుట, రంగులు వేయుట; కర్రతోను, లోహములతోను పనిముట్లు గృహోపకరణములు, ఆయుధములు చేయుట; కవచము, శిరస్త్రాణము, డాలు, కత్తి, గండ్రగొడ్డలి, విల్లు, అమ్ములు, మొదలయిన ఆయుధ సామగ్రి; వెండి బంగారములతో చేసిన ఆభరణములు—ఇట్టి విషయములకు సంబంధించిన వాక్యము లెన్నియో ఋగ్వేదములో కలవు.

ఈ యుగములో ఆర్య, అనార్య భేదములేకాని, జాతి మత భేదములు ఏర్పడలేదు. ఋగ్వేదకాలములో స్త్రీలు కొందరు ఋషులతో కలిసి యజ్ఞములు చేస్తూఉండేవారు; మంత్రములు రచిస్తూ ఉండేవారు; యుద్ధములలో పురుషులకు తోడుగా నిలిచి పనిచేస్తూ ఉండేవారు. అతి బాల్యవివాహములుగాని, సహగమనములు గాని లేవు. స్త్రీలు స్వయంవర పద్ధతిని వివాహమాడుతూ ఉండేవారు. తగిన వరుడు దొరకక పోవుట చేతగాని, బ్రహ్మచర్య వ్రతము పూనుకొనుట చేతగాని, కొందరు స్త్రీలు వివాహమాడకుండా ఉండి పోవడము సైతము జరుగుతూ ఉండేది. ఋగ్వేదమునాటి ఆర్యులు అనేక దేవతలను కొలుస్తూ ఉండేవారు. అందులో ముఖ్యమయిన దేవతలు ముగ్గురు: అగ్ని, యింద్రుడు, సూర్యుడు. యజ్ఞములు చేయుట ముఖ్యమైన ధర్మకర్మగా ఆర్యులు చూచుకొనుచుండేవారు. జంతువులను బలిగా దేవతలకు సమర్పిస్తూ ఉండేవారు. మాంసము తినేవారు; మత్తు కలుగజేసే సోమరసము త్రాగుతూ ఉండేవారు.

## క్షాత్ర యుగము
## క్రీ. పూ. 1400—1000

ఈ యుగమునందు యజుస్సామాథర్వ వేదములున్ను వేదములకు సంబంధించిన బ్రాహ్మణములున్ను, ఆరణ్యకములున్ను, ఉపనిషత్తులున్ను, రామాయణ మహాభారతములున్ను రచితములైనవి. ఈ గ్రంథముల ఆధారమును బట్టి ఈ యుగమందలి దేశచరిత్ర తెలుసుకోవచ్చును. ఈ యుగములో అనేక రాజ్యములు వెలసియుండుట చేతను, క్షాత్ర ధర్మము ఎక్కువ ప్రాముఖ్యమును వహించి యుండుటచేతను, ఈ యుగమునకు క్షాత్రయుగమని పేరు వచ్చినది. ఈ యుగములో ఆర్యులు యమునానదీ తీరమును దాటి, గంగానదీ తీరము ననుసరించి, తూర్పుదేశము వరకును వ్యాపించి, రాజ్యము లేర్పరచుకొనిరి. ఆ రాజ్యములలో ముఖ్యమైనవి కురు, పాంచాల, కోసల, విదేహ రాజ్యములు. కురు రాజ్యమునకు హస్తినాపురము రాజధాని. హస్తినాపురము నేటి ఢిల్లీనగరమునకు చేరువగా నుండెను. అక్కడి కురుక్షేత్రమునందే కౌరవులకును పాండవులకును ఘోరమైన యుద్ధము జరిగినది. కురు రాజ్యమునకు ఆగ్నేయముగా పాంచాలరాజ్యముండెను. ఇది హిమాలయ పర్వతములనుండి చంబల్ (చర్మద్వతీ) నది వరకును వ్యాపించినది. ఈ దేశము

నందలి నగరములలో కనోజ్ (కన్యాకుబ్జము), కౌశాంబీ, మథుర ముఖ్యమైనవి. పంచపాండవులకును భార్యయైన ద్రౌపది ఈ పాంచాలరాజు కూతురే. నేడు ఔధ్ అను పేరుగల ఈ రాజ్యమునకు, ఆనాడు కోసలరాజ్యమని పేరు. దీనికి అయోధ్య రాజధాని. శ్రీరామచంద్రునిది ఈ రాజ్యమే. దీనికి ఆగ్నేయ దిక్కుగా విదేహరాజ్యముండెను. కోసల, విదేహరాజ్యములకు సరిహద్దు గండక్ నది. శ్రీరాముని భార్యయైన సీత, ఈ విదేహరాజ్యము నేలుచుండిన జనక మహారాజు కూతురు; గనుక, ఆమెకు వైదేహి అను పేరు సైతముండెను.

పైనిచెప్పిన నాలుగు ముఖ్యమైన రాజ్యములేకాక, ఇంకా చిన్న రాజ్యములుండెను. పంజాబ్ మొదలుకొని వంగదేశము వరకును, హిమాలయ పర్వతములు మొదలుకొని వింధ్యపర్వతముల వరకును, వ్యాపించియుండిన ఉత్తర హిందూస్థానమంతయు ఆర్యవంశీయుల రాజ్యములతో నిండియుండెను. ఆర్యులుగల ఈ ఉత్తర హిందూస్థానమునకు ఆర్యావర్తమని పేరు. "ఆర్యావర్తః పుణ్యభూమిర్మధ్యం విన్ధ్యహిమాలయోః" అని అమరకోశమందు ఆర్యావర్తశబ్ద నిర్వచనము గలదు.

ఈ యుగములో రాజులు పరిపాలించే రాజ్యములేకాక నాయకులు పరిపాలించే రాజ్యములు సైతముండెను. ఆ నాయకులకు విరాట్టులని పేరు. విరాట్ అనగా రాజు కానివాడని అర్థము. విరాట్టుల పరిపాలనమందున్న రాజ్యములకు ప్రజాసత్తాక రాజ్యములని పేరు. రాజులు పరిపాలిస్తూ ఉండే రాజ్యములలోనైనా రాజులు నిరంకుశాధికారులుగారు. బహుజనములు గల సభలు, కార్యాలోచనమందు తోడ్పడు సమితివర్గములు, మంత్రివర్గములు ఉండేవి. రాజుల ఆస్థానములలో కవులు, గాయకులు, పండితులు, పురోహితులు ఉండేవారు. పరిషత్తులను పేర విద్యాపీఠము లుండేవి. ఆ పరిషత్తులలో విద్యార్థులు శాస్త్రములున్ను, కళలున్ను, అభ్యసిస్తూ ఉండేవారు. స్త్రీలు, పురుషులు కలిసి విద్యాపీఠములందు విద్యాగోష్ఠి జరుపుతూ ఉండేవారు.

రామాయణమందు, రాముడు అయోధ్యను విడిచి లంకకు పోయినవరకును గల కథాభాగములో దేశస్థితికి సంబంధించిన ఘట్టములు ఎక్కువగా గలవు. మహాభారతములో కౌరవులకును, పాండవులకును, తోడ్పడిన రాజ్యముల పేళ్లు రాజులపేళ్లు కలవు.

## సూత్ర యుగము
## క్రీ. పూ. 1000—500

ఈ యుగములో ఆర్యుల నాగరికతకును, విజ్ఞానమునకును, సంబంధించిన అభివృద్ధి ఎక్కువగా కనబడును. అందులో కల్పసూత్రములు, వ్యాకరణసూత్రములు, షడ్దర్శనములకును, సంబంధించిన సూత్రములు పుట్టియుండుటచేత, ఈ యుగమునకు సూత్రయుగమని పేరు తగియున్నది. శ్రౌతసూత్రములందు, యజ్ఞములు మొదలైన శ్రౌత కర్మలుచేసే విధమంతా చెప్పినారు. గృహ్య సూత్రములలో ప్రతి గృహస్థున్ను చేయవలసిన 16 కర్మలకును సంబంధించిన నిబంధనలున్నవి. వేదములలోనిభాష ఈ యుగమునాటికే ప్రాచీనము కావడముచేత, నలుగురికీ స్పష్టముగా తెలియకుండేది. అందుచేత శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము, నిరుక్తము, కల్పసూత్రము అనే షడంగములును పుట్టినవి.

పిమ్మట షడ్దర్శనములు అనగా (1) కపిలుడు రచించిన సాంఖ్యము (2) పతంజలి రచించిన యోగము (3) గౌతముడు రచించిన న్యాయధర్మము (4) కణాదుడు రచించిన వైశేషికము (5) జైమిని రచించిన రాజ్యమీమాంస (దీనినే కర్మమీమాంస అని సైతము అందురు) (6) బాదరాయణుడు రచించిన ఉత్తరమీమాంస (బ్రహ్మసూత్రములు). ఈ షడ్దర్శనములును ఆధ్యాత్మిక విషయములకు సంబంధించినవి. ఇందులో ఉత్తరమీమాంస జీవునకు, పరమాత్మకు, సంబంధముగల ఉపనిషద్వాక్యములను ప్రమాణవాక్యములుగా చూపిస్తూ, జీవబ్రహ్మలకుగల సంబంధమును నిరూపించును; బ్రహ్మ విద్య కలదు; గనుక, బ్రహ్మమీమాంస యను పేరు సైతము దీనికి కలదు. ఈ బ్రహ్మసూత్రములకు ఇటీవల శంకరాచార్యులు అద్వైతపరముగాను, రామానుజాచార్యులు విశిష్టాద్వైతపరముగాను, మధ్వాచార్యులు ద్వైతపరంగాను, వల్లభాచార్యులు శుద్ధాద్వైతపరముగాను, భాష్యములు రచించి తమతమ మతము లుద్ధరించినారు.

సూత్రయుగము పూర్తియగుసరికి బ్రాహ్మణుల అధికారము ప్రబలమైనది. బ్రాహ్మణులు స్వార్థపరులై తక్కిన వర్ణముల వారిని స్వాధీనపరచుకొనుటకు ధర్మశాస్త్రములు, నిబంధనలు తమ పక్షముగాను, తమ యధికారము నిరంకుశముగా సాగునట్లుగాను, రచించినారు. వారితోడ్పాటులేక క్షత్రియులు గాని, వైశ్యులుగాని యజ్ఞయాగాదికర్మలు చేయు

టకు విలులేకపోయినది. శూద్రుల దురవస్థ దుర్భరముగా నుండెను. వేదములు, మంత్రములు ఉచ్చరించుటకేకాదు, వినుటకైనా శూద్రుల కర్హతలేదనిన్ని, వేదమంత్రములను వినే శూద్రులచెవులలో సీసము కరగించి పోయవలసినదనిన్నీ, బ్రాహ్మణులు శాసిస్తూ ఉండుటచేత, బ్రాహ్మణులపై తక్కిన వర్ణములవారికి క్రోధము అధికమగుతూ వచ్చినది. అట్టి పరిస్థితులలో జాతి భేదము పాటింపక, అందరికిని సమానమైన మతమును బోధింపవలెనన్న కోరిక కొందరికి పుట్టినది. వారిలో మహావీరుడు జైనమతమును, గౌతమబుద్ధుడు బౌద్ధమతమును బోధించిరి.

మహావీరుడు క్రీ. పూ. 555 లో వైశాలి నగరమున పుట్టెను. ఈ నగరము నేటి పాట్నానగరమునకు ముప్పది మైళ్లి దూరమున ఉండెను. అక్కడి ప్రజా సత్తాక రాజ్య మండలి నాయకులలో, ఒక నాయకుని చిన్నకుమారు డీమహావీరుడు. ఇతడు 30 యేండ్ల ఈడువాడు కాగానే, సర్వమును త్యజించి సన్యాసియై తనమతమును బోధించెను. వేదములు ఋషులు చెప్పినవేకాని అపౌరుషేయములు కావు; సర్వేశ్వరుడు తటస్థుడై యుండును; రక్షించుటగాని, దండించుటగాని చేయడు; జీవులందరును ఎవరికర్మకు తగినట్లు వారు ఫలమును పొందగలరు; అహింస ధర్మములన్నిటను పరమధర్మము అని బోధించెను. రాత్రి చీకటిలో భోజనము చేసిన యెడల చిన్నచిన్న పురుగులకు జీవహింస కలుగవచ్చునని జైనులు సాయంకాలము చీకటిపడకమునుపే భోజనములు ముగింతురు; నీరు వడియకట్టి త్రాగుదురు.

## బౌద్ధయుగము
## క్రీ. పూ. 567–క్రీ. శ. 500

కోసల దేశమునకు ఈశాన్యదిక్కునగల, ఒక చిన్న రాజ్యమును పాలించిన శాక్యవంశపు నాయకులలో ముఖ్యుడేయిన శుద్ధోదనుని కుమారుడు బుద్ధుడు. ఇతడు నవయౌవనుడుగా నున్నప్పుడే విరాగియై అరణ్యములకు పోయి, రోగ జరా మరణాది బాధలుగాని, దుఃఖములుగాని లేని నిర్వాణమార్గమును కనుగొనగోరి తుదకు గయవద్ద నొక రావిచెట్టుక్రింద కూర్చుండి ఆలోచింపగా కొంత కాలమునకు అతనికి జ్ఞానము కలిగినది. దానితో అతనికి నిర్వాణమార్గము కనపడినది. పిమ్మట అతడు తనమతమును ఇతరులకు బోధింప మొదలుపెట్టెను. గయ, కాశికి చేరువనున్న సారనాథు, మగధరాజ్యమునకు రాజధానియైన రాజగృహము, శ్రావస్తి, తనస్వస్థలమైన కపిలవస్తు మొదలయిన స్థలములయందు అతడు తనమతమును బోధించెను. అనేకులు అతని మతమును స్వీకరించి, అతని ననుసరించినారు.

బౌద్ధమతము—దేహము నశించునుగాని ఆత్మ నశించదు; అది కర్మఫలమును అనుభవించుచు నిర్వాణము కలిగినవరకును మరల మరల జన్మ మెత్తుచుండును; నిర్వాణము కలుగుటకు జ్ఞానము, మంచినడవడి ఉండవలెను; వేదములు అపౌరుషేయములు కావు; వేదములవలనగాని, యజ్ఞముల వలనగాని, ప్రయోజనములేదు; దానిని పొందుటకు అందరును సమానమైన అర్హతగలవారే; దుఃఖము కలుగుటకు కారణము తెలుసుకొన్నయెడల మరి దుఃఖము కలుగదు; అజ్ఞానమే దుఃఖమునకు కారణము గనుక, జ్ఞానమువలన దుఃఖము పోయి నిర్వాణము కలుగును అని అతడు బోధించెను.

ఈ మతము వేదములను, యజ్ఞయాగాది కర్మలను నిరసించినదని, దీనిని నాస్తిక మతముగా బ్రాహ్మణులు తిరస్కరిస్తూఉండేవారు; గాని, బ్రాహ్మణేతరులు మాత్రము అంతకంతకెక్కువగా దీనిని ఆదరిస్తూ వచ్చిరి. అందులోను శూద్రులకీ మతము ఆనందదాయకముగా నుండెను. వేదములు వినుటకైనా, యజ్ఞయాగాది కర్మలు చూచుటకైనా అర్హతలేక, బ్రాహ్మణులకు దాసులై యుండవలసినదని బోధించే బ్రాహ్మణ మతముకంటె, ఆబాధలేవీ లేక అందరును జ్ఞానము పొందుటకర్హులేననిన్ని, జాతిమతవ్యత్యాసము లేక అందరును సమానులుగా నుండవచ్చుననిన్ని బోధించు బౌద్ధమతము వారికి ఎక్కువ ఆదరణీయముగా నుండెను.

ఈ బౌద్ధయుగమందు ఉత్తర హిందూస్థానమున అంగ, మగధ, కాశి, కోసల, వంశ, కురు, పాంచాల, మత్స్య, శూరసేన, అస్సక, అవంతి, గాంధార, కాంభోజ యను రాజ్యములు పదుమూడున్ను, శాక్య, మల్ల, వజ్జియను సత్తాక రాజ్యములు మూడున్ను, మొత్తము 16 రాజ్యములుండేవి. ఈ రాజ్యములందలి నగరములలో కొన్ని కడుప్రసిద్ధికెక్కినవి.

తక్షశిల—ఇది గాంధారదేశమునకు రాజధాని. కొంత కాలమునకు ఇక్కడ విశ్వవిద్యాపీఠము ఏర్పడినది. క్రీ. పూ. 327లో అలెగ్జాండరు మనదేశమునకు దండెత్తి వచ్చినప్పుడు, ఇక్కడ అంభియను రాజు రాజ్యమేలుచుండెను.

వారణాసి—దీనికే కాశియని పేరు, వారణాసియను శబ్దము ఆంగ్లేయుల ఉచ్చారణలో బెనారస్ అయినది. ఉన్నత

దశలో నున్నప్పుడు ఈనగరము 80 మైళ్లు చుట్టుకొలత కలది. ప్రాచీన కాలమునందు ఇక్కడ సభలు విద్యా పీఠములు నెలకొనియుండెను.

మధురానగరము—ఇది సూరసేన రాజ్యమునకు రాజధాని. బుద్ధుడు పెక్కు సారులీనగరమునకు పోయి ఉండెను. బుద్ధుని శిష్యులలో మహాకక్కాణుడనువాడు ఇక్కడ నివాసమేర్పరచుకొని యుండెను. ఇతడు పాలీభాషకు వ్యాకరణము రచించిన వాడట.

రాజగృహము—ఇది మగధరాజ్యమునకు రాజధాని; బింబిసారుడు కట్టిన నగరము. ఇంతకు పూర్వము గిరివ్రజయను నగరము మగధకురాజధానిగా ఉండేది. అదియొక పర్వత దుర్గము; మహాగోవిందుడనే శిల్పి నిర్మించినది. ఈ గిరివ్రజము యొక్క రాతిగోడలు నేటికిని నిల్చియున్నవి. మనకు తెలిసినంతవరకు మన దేశమందలి ప్రాచీన శిల్పమునందు మహెంజొదారో శిల్పము తర్వాత ఇదియే ప్రాచీనతమ శిల్పము.

రోరుక—ఇది సౌవీర రాజ్యమునకు రాజధాని. సముద్రతీరమున గొప్ప వాణిజ్య వ్యాపారమునకు ప్రసిద్ధికెక్కిన రేవుపట్టణముగా నుండెను. దీనిలో ఒకభాగమే నేటి సూరత్ పట్టణము.

ఉజ్జయిని-అవంతీ రాజ్యమునకు రాజధాని. ఇటీవల దీని ప్రఖ్యాతి ఎక్కువయినది.

ఈ యుగములోనే ఉత్తర హిందూస్థానమునందు రాజమార్గములేర్పడి యుండెను.

## ఆలిగ్జాండరు దండయాత్ర

క్రీ. పూ. 327లో గ్రీసుదేశపు రాజయిన ఆలిగ్జాండరు జైత్రయాత్ర తలపెట్టి ఆసియామైనరుపారశీకదేశములను జయించి, హిందూదేశమును సైతము జయింప దలచి దండెత్తి వచ్చెను. ఇతడు సింధునదిదాటి తక్షశిలకు రాగానే అక్కడి రాజ్యమేలుచుండిన అంభి ఇతనికి లొంగి, సైన్యసాహాయ్యము చేసి, ఇరుగు పొరుగుల గల తన శత్రురాజులపై తనకున్న పగ సాధించుకొన జూచెను. పిమ్మట జీలమ్ నదియొద్దున, అక్కడి రాజ్యమేలుచుండిన పురుషోత్తముడు మాత్రము అంభివలె గాక ఆలిగ్జాండరు నెదిరించెను. వారిరువురకును ఘోరమైన యుద్ధము జరిగినది. తుదకు పురుషోత్తముడు ఓడిపోయెను. బందీకృతుడై అతడు ఆలిగ్జాండరువద్ద నిలబడి "నీవు నన్నెదిరించి యుద్ధములో పరాజితుడవై యున్నావు గదా నీయెడల నేనెట్లు ప్రవర్తింపవలనని కోరెదవో చెప్పు" మని ఆలిగ్జాండ రడిగినప్పుడు, "ఒక రాజునెడల నొక రాజెట్లు ప్రవర్తింపవలెనో అట్లు ప్రవర్తింపు"మని పురుషోత్తముడు ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు ఆలిగ్జాండరు మెచ్చుకొని, అతనితో మైత్రి చేసుకొని, అతని రాజ్యమతని కిచ్చివేసెను. ఆలిగ్జాండరు జైత్రయాత్ర బియాస్ నదివరకును సాగినది. అంతలో చంద్రగుప్తుడు ఆలిగ్జాండరువద్దకు వచ్చెను. ఇతడు మగధ రాజునకు శూద్రస్త్రీ కడుపున పుట్టిన వాడు. ఆరాజు చనిపోగానే ఆరాజునకు కులస్త్రీ కడుపున పుట్టిన నందుడు రాజయి, చంద్రగుప్తుని రాజ్యమునుండి వెడలగొట్టెను. మగధరాజ్య మెట్లయినను జయించి, నందుని వెడలగొట్టి రాజగుటకు ప్రయత్నిస్తూ ఉన్న చంద్రగుప్తుడు ఆలిగ్జాండరు సాహాయ్యము గోరుటకై అతనివద్దకు వచ్చెను. అందుకు ఆలిగ్జాండరు సమ్మతించెను. గాని, అయిదారు సంవత్సరములయి, యిల్లు విడిచివచ్చిన అతని సైనికులు, విసిగిపోయి యిల్లు చేరుకొగోరి అతని జైత్రయాత్ర ఇంకను సాగించుటకు సమ్మతించలేదు. అందుచేత, ఆలిగ్జాండరు బియాస్ నదీతీరము దాటి, మరి ముందుకు పోవక వెనుకకు మరలెను.

చంద్రగుప్తుడు తన పరాక్రమముతోనే సైన్యములను చేరదీసి, చాణక్యుని సాహాయ్యమున క్రీ. పూ. 320 లో మగధ రాజ్యము జయించి, నందుని జంపి, రాజాయెను. ఇతని తల్లిపేరు ముర; గనుక, ఇతడు స్థాపించిన రాజవంశమునకు మౌర్యవంశమని పేరు వచ్చినది.

చంద్రగుప్తుడు తన మగధరాజ్యాధికారమును నాలుగు వైపులను విస్తరింప జేసుకొనెను. ఆతని సామ్రాజ్యమందు 7 లక్షల కాల్బలము, 9 వేల ఏనుగులు, 30 వేల గుర్రపు దళము, 8 వేలకు మించిన రథములు ఉండెను. సామ్రాజ్యమందలి మండలములలో సరిహద్దు మండలములకు తన బంధువర్గమువారినే మండలాధిపతులుగా నిలబెట్టి సామ్రాజ్య పరిపాలనమంతా నెమ్మదిగా సాగించెను.

మగధ సామ్రాజ్యమునకు రాజధాని నగరమైన పాటలీపుత్ర నగరము (నేటిపాట్నా) 25 మైళ్లు చుట్టుకొలత గలది. దీనిచుట్టును ఎత్తైన ప్రాకారములున్ను, వాటిచుట్టును లోతైన అగడ్తయున్ను ఉండెను. ప్రాకారములందు 578 గోపురములున్ను, 64 ద్వారములున్ను కలవు. నగర పరిపాలనము నేటి పురపాలకసంఘములకంటె ఎక్కువ స్వాతంత్ర్యము అధికారముగల సంఘములద్వారా సాగినది.

గ్రామపరిపాలనము సూత్రయుగమునాటి నుండిన్ని సంప్రదాయ సిద్ధముగానున్న పద్ధతి ననుసరించియే యుండెను. ఈ క్రింద నిరూపించిన చిత్రములో నున్నట్లు, ఆధర్వప్రాయమైన గ్రామనిర్మాణము ఆర్యుల రాజ్యములన్నిటను ఉండెనని చెప్పవచ్చును.




గ్రామ నిర్మాణ రీతి

రాజవీధిన్ని వామనవీధిన్ని కలసినచోటను ఒక పెద్ద వృక్షమున్ను, ఆ వృక్షముక్రింద ఒక పెద్ద మండపమున్ను ఉండేవి. అక్కడ గ్రామస్థులు కూడి సభలు చేయుచుండేవారు. పంచాయితీ పరిపాలనము ప్రతి గ్రామమందును ఉండేది. పంచాయితీవారి నెన్నుకొను యధికారము గ్రామస్థులలో ప్రతియింటి పెద్దకున్ను ఉండేది. గ్రామము చుట్టును, మంగళవీధి ననుసరించి, గ్రామస్థులు మంగళగీతములున్ను, స్తోత్రములున్ను పాడుకొంటూ గ్రామముచుట్టును ప్రతి ఉదయమున్ను, ప్రతి సాయంకాలమున్ను తిరుగుచుండుట ఆచారము. రాజవీధి గ్రామమును చేరు స్థలమునందు గ్రామము వెలుపలను కొన్ని ఇండ్లు ఉండేవి. అంటురోగములు గల వారిని గ్రామములోనికి రానీయక ఆ వెలుపలి యిండ్లలో ఉంచేవారు.

చంద్రగుప్తుడు రాజ్యము చేయుచుండిన కాలములో సెల్యూకస్ అను యవనుడు (గ్రీస్‌దేశస్థుడు) దండెత్తివచ్చెను. ఇతడు అలెగ్జాండరు కొలువులో సైన్యాధ్యక్షుడుగా నుండెను. అలెగ్జాండరు ఇండియానుండి మరలి పోయిన కొద్ది సంవత్సరములలోనే చనిపోయెను. అతనికి పుత్రులులేక పోవుటచేత, అతని సామ్రాజ్యములో చీలికలు పుట్టినవి. తూర్పు భాగముపైగల అధికారము సెల్యూకసుకు వచ్చినది. అందుచేత, సెల్యూకసు దండెత్తివచ్చి, అలెగ్జాండరు ఇండియాలో జయించిన ప్రదేశములను స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నించెను; గాని, చంద్రగుప్తుని సైన్యములు అతనిని ఓడించినవి అప్పుడు చంద్రగుప్తునికిన్ని సెల్యూకసునకున్ను సంధి జరిగినది. దాని ప్రకారము సెల్యూకసు తనకుమార్తెను, చంద్రగుప్తునికిచ్చి వివాహము చేసెను; హిందూదేశములో అలెగ్జాండరు జయించిన భాగములను చంద్రగుప్తునికిచ్చివేసెను. ఆ సమయమునందే మెగస్తనీస్ అను యవన రాయబారి పాటలీపుత్రమందు కొన్ని సంవత్సరములుండి, మన దేశమునందలి యానాటి విశేషములను అనేకము వ్రాసి పెట్టుకొనెను. అతడు వ్రాసిన గ్రంథమంతా మనకు చిక్కలేదుగాని, చిక్కిన భాగములను బట్టి చరిత్రకారులు అనేక విషయములను తెలుసుకొనగలిగిరి. చంద్రగుప్తునికి తోడుగా నిలిచి సచివుడుగా పనిచేసిన చాణుక్యుడు అర్థశాస్త్రమును రచించెను. అది ఇటీవల కొద్ది సంవత్సరముల క్రిందటనే దొరికినది. దీనినిబట్టి సైతము అనేక విషయములు తెలియవచ్చినవి.

మెగస్తనీస్ వ్రాసిన దానినిబట్టి ఆనాటి మన ఆంధ్రుల విషయము కొంతవరకు మనకు తెలిసినది. ఇది ఆంధ్రుల చరిత్రలో తెలియజేసినాము.

చంద్రగుప్తుడు క్రీ. పూ. 297లో చనిపోయెను. పిమ్మట, అతని కుమారుడు బిందుసారుడు క్రీ. పూ. 273 వరకును రాజ్యమేలి, మగధ సామ్రాజ్యమును దక్షిణమున నెల్లూరు వరకును వ్యాపింపజేసెను. ఆ పిమ్మట, అతని కుమారుడైన అశోక చక్రవర్తి క్రీ. శ. 241 వరకును రాజ్యము చేసెను. ఇతడు తన తండ్రి తాతలకంటెను ఎక్కువ ప్రఖ్యాతి పొందుటయేకాక, ప్రపంచమందలి చక్రవర్తులలో సైతము, ఒక గొప్ప చక్రవర్తిగా ఘనత వహించిన మహాపురుషుడు. అయితే, యితని ఘనత యుద్ధములలో విజయము పొందుట వల్లను గాని, క్రొత్తదేశములను జయించుట వల్లనుగాని, వచ్చినదిగాదు. ప్రజల క్షేమము, భాగ్యము అభివృద్ధిపొందుటకు అనుకూల రాజ్యపరిపాలనము సాగించుటవల్లను, బౌద్ధ మతమును అవలంబించి, హిందూదేశమునందే కాక తక్కినదేశములందు సైతము వ్యాపించునట్లు చేయుటవల్లను, ఇతని ఘనత హెచ్చినది. ఆరంభములో ఇతడు తన తండ్రి తాతలవలెనే క్రొత్తదేశములను జయింపదలచి, కళింగదేశమునకు దండెత్తి పోయెను. విజయముపొంది కళింగదేశమును తన సామ్రాజ్యములో చేర్చుకొనెను. గాని, ఆ సమయమునందే ఆ యుద్ధ

ములలో అనేకులు మరణించి దేశము యుద్ధములవల్ల పాడగుట జూచి, మిక్కిలి దుఃఖించెను. అప్పుడే అతనికి వైరాగ్యము కలిగినది ; జీవహింసచేయుట పాపమని తోచినది. అప్పటి నుండిన్ని మరియుద్ధములు చేయక, ఉన్న సామ్రాజ్యముతో తృప్తిపొంది, పరిపాలనము ఆదర్శప్రాయముగా సాగించుటకు మొదలుపెట్టెను. అతడు దేశభాషలలో రచించిన శిలాశాశనములను సామ్రాజ్యమునందు పెక్కుచోట్ల నిలబెట్టించెను. కొన్నిశాసనములందు అతడు భోధించిన ధర్మోపదేశములు కలవు. కొన్నిచోట్ల మండలాధికారులు ప్రజలయెడల నెట్లు ప్రవర్తించవలెనో తెలియజేయు శాసనములు కలవు. కొన్నిచోట్ల ప్రజల ఆరోగ్యమునకు, క్షేమమునకు, అనుకూలించునట్లుగా అతడు స్థాపించిన వైద్యశాలలకున్ను త్రవ్వించిన బావులకున్ను, ఇంకా ఇతర సదుపాయములకున్ను సంబంధించిన వాక్యములు కలవు.

అశోకుని తర్వాత మగధ సామ్రాజ్యము అంతకంతకు ఎక్కువగా క్షీణించినది. మండలాధిపతులు స్వతంత్రరాజులయినారు. మౌర్యవంశపు రాజులలో కడపటివానిని అతని సైన్యాధ్యక్షుడైన పుష్యమిత్రుడు క్రీ. పూ. 185లో చంపి రాజయ్యెను. అతనితో శుంగవంశరాజుల పరిపాలనము ప్రారంభమయినది. ఇతని కాలములో మినాండర్ అను యవనుడు మన దేశమునకు దండెత్తివచ్చి సాకేతమును, మధ్య రాష్ట్రములను (అనగా రాజపుత్రస్థానము నందలి ప్రదేశములను) ముట్టడించి, మధురానగరమును, సౌరాష్ట్రమును (కాథియవాడ్) ఆక్రమించెను ; గాని, తుదకు పుష్యమిత్రుడు అతనిని దేశమునుండి పారద్రోలెను. కలింగదేశ రాజయిన ఖారవేలుడు స్వతంత్రుడై, పుష్యమిత్రుని కొన్ని యుద్ధములలో ఓడించెను. కాని పుష్యమిత్రుడు తుదకు విజయుడై ఖారవేలునివలన బాధలేకుండా చేసుకోగలిగెను. పుష్యమిత్రుని కుమారుడు అగ్నిమిత్రుడు విదిశానగరమందు రాజప్రతినిధిగా నిలిచి, మగధ సామ్రాజ్యమందలి పడమటి భాగమును, పాలించుచుండెను. అగ్నిమిత్రుని కుమారుడు వసుమిత్రుడు, తాతగారి కొలువులో సైన్యాధ్యక్షుడై, పని చేయుచుండెను. ఇట్లు కుమారుడున్ను, మనుమడున్ను తనకు సహాయులుగా నుండుటచే పుష్యమిత్రుడు పూర్వుల సంప్రదాయమును అనుసరించి, అశ్వమేధయాగము చేసెను. మగధరాజ్యమందు బౌద్ధమతమంతరించి, బ్రాహ్మణమతము మరల ప్రబలినదనుటకు ఇదిగొప్ప నిదర్శనము. ఈ వంశపు రాజులలో కడపటివాడైన దేవభూతిని అతని మంత్రియైన వసుదేవుడు క్రీ. పూ. 63లో చంపి, రాజ్యమాక్రమించుకొనెను. అతడు బ్రాహ్మణుడును, కణ్వ గోత్రుడును గనుక ఇతనితో కాణ్వవంశ రాజుల (కాణ్వాయనుల) పరిపాలనము ప్రారంభమయినది. ఈ వంశపు రాజులలో కడపటి వానిని క్రీ. పూ. 27లో ఆంధ్రులు చంపిరి. అప్పటినుండిన్ని మగధ రాజ్యము ఆంధ్రుల వశమయినది.

హిందూదేశ చరిత్రలో ఆంధ్రులచరిత్ర ఎప్పుడెట్లు ప్రారంభమైనదో ఈ ప్రస్తావన చదివి గ్రహించినారు గదా ఇక స్థలాంతరమున వివరించి రచించిన ఆంధ్రులచరిత్ర చదివి యానందింతురు గాక !



# 2. ఆంధ్రభూమి

"సూర్యుని వెలుతురు సోకునందాఁక
ఓడల జెండాలు ఆడునందాఁక
నరుఁడు ప్రాణాలతో నడచునందాఁక
మనభూమివంటి కమ్మని భూమిలేదు.
(రాయప్రోలు-జన్మభూమి)

విషయసూచిక : ఆంధ్రభూమి చెన్నపురి రాజధానిలో నున్నది; ఇందు 11 జిల్లాలు కలవు; విశాఖపట్టణము అన్నిటి కన్న పెద్ద జిల్లా; ఉత్కళమునుండి తమిళనాడువరకును తూర్పుతీరమునుండి బొంబాయి రాజధానివరకును ఆంధ్రభూమి వ్యాపించియున్నది; 67,500 చదరపుమైళ్లు వైశాల్యముగలది. కొండలలో తూర్పు కనమలందలి మహేంద్రగిరి, నదులలో గోదావరీ కృష్ణానదులు, సరస్సులలో పులికట్టు సరస్సు పెద్దవి. వర్షపాతము తూర్పు గోదావరిలో అధికము (55 అం.) అనంతపురం జిల్లాలో తక్కువ (21 అం.) కడప జిల్లాలలో మధ్యస్థము; శీతోష్ణస్థితి ఋతుధర్మము ననుసరించియుండును; గాని ఉత్తర హిందూస్థానములోవలె ఏదిన్ని ఎక్కువ తీవ్రముగానుండదు; చల్లదనమునకు, ఆరోగ్యమునకు చెప్పదగిన స్థలములలో వాల్తేరు, మదనపల్లి ముఖ్యమైనవి. పట్టికలు : తెలుగుదేశమునకు సంబంధించినవి.

బహుజనసంకులమై సస్యలక్ష్మికి కల్యాణనిలయమై, సౌఖ్యప్రదమైఉన్న మన ఆంధ్రావనియందు గల విశాఖపట్నము, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, బళ్లారి, అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు, అను పదకొండు జిల్లాలున్ను ఇప్పుడు చెన్నరాజధానిలో చేరియున్నవి.

ఉత్తరమున ఉత్కళదేశము, తూర్పున ఆంధ్ర సముద్ర మనదగిన బంగాళాఖాతము, దక్షిణమున తమిళనాడు (చెన్నపట్నమునుండి), నైరృతిని మైసూరు, పడమట బొంబాయిరాజధాని, వాయవ్యమున హైదరాబాదు, బస్తరు, ఉత్కళరాష్ట్రములోని మన్యప్రదేశములు మధ్యరాష్ట్రములునుగలవు. ఎల్లలు

ఈ ఆంధ్ర సముద్రతీరము గోపాలపురము మొదలు చెన్నపట్నమువరకు దాదాపు ఆరువందల మైళ్లు వ్యాపించియున్నది. తీరసామీప్యమున తూర్పుకనుమలు అను పేరుగల పర్వతపంక్తి ఉత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించియున్నది. ఇందు సస్యవంతములయిన పీఠభూములు మెండుగా కలవు. మూడువేల సంవత్సరములకు పూర్వము ఈ ప్రదేశము ఘోరకిరాతావృత దండకారణ్యమయమై, చీమలుదూరని చిట్టడవిగాను, కాకులు దూరని కారడవిగాను ఉండెనని మన పూర్వులు గ్రంథములలో వ్రాసియుండిరి.

నూతన-ఉత్కళరాష్ట్రములో చేర్చిన ఆస్కా- ఛత్రపురముల సరిహద్దువరకును గల ప్రదేశమున్ను, మైసూరు రాజ్యములోని కోలారు జిల్లా, బెంగుళూరు జిల్లాలో కొంత భాగమున్ను, దక్షిణమున చిత్తూరు సరిహద్దుదాటి కాంచీపురమువరకును, నెల్లూరు సరిహద్దులుదాటి చెన్నపట్నము వరకును వ్యాపించిన ప్రదేశమున్ను, నైజామురాష్ట్రమున తెలింగానా అని వ్యవహరింపబడు తెలుగు జిల్లాలున్ను, మధ్యమాగాణములో ఆంధ్రజనసంఖ్య ఎక్కువగాగల చాందా, బస్తరు, జిల్లాలున్ను, నూతనరాజ్యాంగ వ్యవస్థలో భాషాప్రయుక్తరాష్ట్ర విభజనము ననుసరించి రాబోవు ఆంధ్ర రాష్ట్రమునకు చేరవలసియున్నవి. [ఆం. రా. సరిహద్దులు, విస్తీర్ణము సూచిస్తూ ప్రజామిత్రవారు ప్రకటించిన పటము చూడండి.] సరిహద్దు సమస్య మనమందరము కలసి ఒక సరిహద్దు నిర్ణాయిక సంఘమేర్పరచి పరిష్కరించుకొనవచ్చును.

పైని పేర్కొన్న పదకొండుజిల్లాల విస్తీర్ణము 67,500 చదరపు మైళ్లు! ఇంత విస్తీర్ణముగల ఆంధ్రరాష్ట్రము, యూరప్‌లోని బెల్జియము, హాలెండ్, డెన్మార్కుదేశ విస్తీర్ణము ములకన్న నాలుగురెట్లున్ను, స్కాట్లెండు, ఐర్లండు, బల్గేరియా, గ్రీసులకు రెండేసిరెట్లున్ను, అధికముగానుండును. 64 వేల చదరపుమైళ్ల వైశాల్యముగల అస్సాము 46 వేల చదరపుమైళ్ల వైశాల్యముగల ఒరిస్సా, 32 వేల చదరపుమైళ్ల వైశాల్యముగల సింధు రాష్ట్రములకన్న నిస్సంశయముగా పెద్దదిగదా! 17222 చదరపుమైళ్ల విస్తీర్ణము గల మన విశాఖపట్నముమండలమంత విస్తీర్ణమైన మండలము భారతదేశమున మరియొకటిలేదు!

వాయువిమానమునుండి ఆంధ్రదేశమును ఒకసారి చూచినచో, తూర్పుతీరమున ప్రవహించు నదులు, రేవులు, మధ్య మధ్య కొన్ని జిల్లాలలోగల అడవులు, కొండలు, ఇంపుగా కనబడుతూ ఉంటవి. దేశమధ్యముగా బోవు రైలుమార్గమునకు తూర్పుభాగమున ఫలవంతములయిన భూములు, కాలువలు కలవు. ఈ ప్రాంతమున వాణిజ్యవ్యాపారములు, సమృద్ధిగా జరుగుచుండును. రైలుమార్గమున కిరువైపులను మెట్టభూములు, తోటలు, రాతినేలలు ఉన్నవి. విశాఖపట్నముయొక్క పడమటిభాగము తూర్పుకనుమల కొండలతో నిండియున్నది; తూర్పుభాగమున సముద్రమట్టమునకు సమానమగు భూమిగలదు. అందుచేత ఈ జిల్లా పడమర ఎత్తుగాను, తూర్పు పల్లముగాను ఉండును.

**కొండలు అరణ్యములు**

తూర్పు కనుమలు ఈశాన్యమునుండి నైరతి మూలకు వ్యాపించుటచేత ఈ జిల్లా రెండు భాగములుగా విభక్తమయినది. ఈ కనుమలకు పడమటివైపు మిక్కిలి ఎత్తైన ప్రదేశము గలదు. దీనిని పీఠభూమి అందురు. ఇవి సముద్రమట్టమునకు 3000 అడుగులు ఎత్తుగానున్నది. ఈ జిల్లాలోని నదులన్నియు ఈ పీఠభూమిగుండా ప్రవహించి బంగాళాఖాతమున గలియును. పీఠభూమి తూర్పుననుండు భూమికి పల్లపునేలయని పేరు. మిగిలినదంతయు మన్యము. మందసా చేరువను మహేంద్రగిరి (5000 అ. ఎ.) పాలకొండతాలూకాలో పాలకొండలు, (4000 అ. ఎ.) విజయనగరమువద్ద వెలగాడ కొండ, శృంగవరపు కోట తాలూకాలో గాలికొండలు, విశాఖపట్నమునకు ఆరుమైళ్ల దూరమున పుణ్యక్షేత్రమగు సింహాచలము, భీముని పట్నములో నరసింహాకొండ, గోల్కొండ తాలూకాలో గోల్కొండలు కలవు. సముద్రతీరముననే విశాఖపట్నము ఓడరేవుకు ప్రక్కకోణమువలె సముద్రములోనికి చొచ్చుకొనియున్న "డాల్ఫిన్సు నోజ్" అను కొండయున్నది. దీనిలో రమణీయములయిన ప్రకృతి దృశ్యములు కలవు; వీటికి లోవతోటలనిపేరు. అనంతగిరి కొండలలో విజయనగరం మహారాజుగారి కాఫీతోటగలదు. ఈఅనంతగిరి చుట్టునుగల ప్రదేశములోను, ఉత్తరమున పాతపట్నం టెక్కలి మొదలు దక్షిణమున గూడెమువరకును గల తాలూకాలలోను అడవులున్నవి. ఈ అడవులలో నల్లమద్ది, ఏగిస, గుగ్గిలము, టేకు, వెదురు, లక్క, మైనము, తేనె మొదలైనవి లభించును. ఈ అరణ్యములందు కోదులు, సవరలు, గదబలు మొదలయిన అడవిజాతులవారు నివసించియున్నారు. వీరు, కొండలలో పోడు పద్ధతినిచేయు వ్యవసాయము చాలా అనర్థదాయకము. తూర్పుగోదావరి జిల్లాలోని అన్నవరపు సత్యనారాయణకొండ అందరు ఎరిగినదే! ఈ జిల్లాలోని కొండలలో దూమ్‌కొండ, పాపికొండ, ఎత్తైన శిఖరములు. ఈ కొండలు 2000 మొదలు 4000 అడుగులవరకు ఎత్తైనవి. ఇక్కడి అడవులలో కుంకుళ్లు, తేనె, చింతపండు, మొదలైనవి ఎక్కువగా దొరకును. రామచంద్రపురం, అమలాపురం, కాకినాడ, తాలూకాలలో మెట్టలుగాని, కొండలుగాని లేవు. రామచంద్రపురం తాలూకాలో సాగుకాని నేల జేనెడైనాలేదు. ఇంటిగోడలదాకా పంటపొలమే! పశ్చిమ గోదావరిజిల్లా ఉత్తరమున మెరక దక్షిణమున పల్లముకలది. కొవ్వూరు సమీపమున, ద్వారకా తిరుమలయొద్ద మాత్రమే గుట్టలున్నవి. చింతలపూడి, కొవ్వూరు తాలూకాలలో మెట్టభూములున్నవి. మిగిలిన తాలూకాలు తణుకు, భీమవరం, నర్సాపురం, ఏలూరు పల్లపు తాలూకాలు. పల్లపుతాలూకాలలో ముఖ్యమైన పంట వరిపంట. కృష్ణాజిల్లాలో బెజవాడలోను, మొగలరాజపురములోను కొండలున్నవి. బెజవాడ కొండమీద కనకదుర్గగుడి గలదు. గుంటూరు జిల్లాలో పల్నాడుతాలూకాలో గనికొండ, నాగార్జునకొండలు, బెల్లంకొండ, మంగళగిరి, సీతానగరం, ఉండవల్లి, కొండవీడు, కోటప్పకొండ, వినుకొండ, చీమకుర్తి కొండలు గలవు. కడపజిల్లాలో పాలకొండ, శేషాచలము అనే కొండలున్నవి. కర్నూలు జిల్లాలో నల్లమలలు ఈ ప్రాంతములోని కొండలన్నింటను ఎత్తైనవి. వీనిపొడవు 70 మైళ్లు; వెడల్పు 25 మైళ్లు; ఎత్తు సుమారు 3000 అడుగులు. ఈ కొండలలో ఎత్తైన శిఖరము భైరేనికొండ. దీనిఎత్తు 3150 అడుగులు. ఇచ్చట మద్రాసురాజధానిలోని తూర్పుభాగపు అడవులలోనికెల్ల, అతిసుందరమైనదని చెప్పదగు నల్లమల అడవి ఉన్నది. వెలిగొండలు కర్నూలుజిల్లాకు, నెల్లూరు జిల్లాకు, సరిహద్దుగా వ్యాపించినవి. నెల్లూరులోని వెలిగొండలలో చిట్టడవులు కలవు. ఈ కొండప్రదేశమునకు తూర్పుననున్న మైదానములో రైలురోడ్డు, ట్రంకురోడ్డు వేయబడినవి. ఇవిగాక ఎర్రమల కొండలుకూడా కలవు. అనంతపురం జిల్లాలో మధ్యగా పెనుగొండ లున్నవి. వీని ఎత్తు 3091 అడుగులు. ఇవిగాక మడకసిర, మల్లప్పకొండలుగలవు.

పెనుగొండ బెంగుళూరు ఎత్తుకు సమమైన ఎత్తుమీదఉన్నది. బళ్లారిజిల్లాలో శాందూర్ కొండలు గలవు. చిత్తూరు జిల్లాలో కుప్పండివిజన్, పలమనేరు తాలూకా, పుంగనూరు డివిజన్, మదనపల్లి, వాయల్పాడు తాలూకాలు పీఠభూమిలో జేరినవి. ఈ జిల్లాలోని కొండలలో ముఖ్యమైనవి, మదనపల్లికి వాయవ్యముగా నుండిన హార్లకొండలు; సగటున 4100 అడుగుల ఎత్తుగలవి. పూర్వము దీనికి ఏనుగ ఎల్లమ్మ కొండయని పేరు. ఇక్కడ నివసించు ఎల్లమ్మయను పుణ్యాత్మురాలు ఏనుగులకు ఆహారము తెచ్చియిచ్చినటుల కథ గలదు. పీఠభూమిని ఆనుకొని ఉన్న ఆవులపల్లి కొండలు, చిత్తూరుజిల్లాకు ఉత్తరమున చంద్రగిరి తాలూకాలో ఉన్న తిరుపతి వెంకటేశ్వరస్వామి కొండలతో కలిసియున్నవి. కాళహస్తి, కార్వేటి నగరములలోను కొండలుగలవు. ఈ భాగము పర్వతమయము. గొప్ప గొప్ప పర్వతము లన్నింటి లోను, కనుమలున్నవి. ఈ కనుమలలోనివే మామండూరు, కల్లూరు, మొగలి సైనగుంట కనుమలు. అవులపల్లి, తిరుపతి కొండలలో అడవులున్నవి. ఇక్కడినుండి విశేషముగా కరక్కాయలు, సారెపప్పు ఎగుమతి యగును. కొండ ప్రదేశములలో సామాన్యముగా చిరుతపులి, పెద్దపులి, మొదలైన అడవి మృగము లుండును!

ఆంధ్రదేశపు పెద్ద నదులలో మన గోదావరి మొదటిది. పడమటి కనుమలలో త్రయంబకమనుచోట ఈ నది ఉద్భవించినది. దీని పొడవు 900 మైళ్లు.

**గోదావరీనది.** దీనిలో అనేక ఉపనదులువచ్చి చేరుచున్నవి. ఈనది తూర్పు కనుమలను చీల్చుకొని, తూర్పు గోదావరి జిల్లాకు సరిహద్దుగా, పారుచున్నది. కూనవరము దగ్గర శబరి అనే ఉపనది గోదావరిలో కలియుచున్నది. ఈ శబరిలంకపొగాకు చాలా ప్రశస్తమైనది! ఈ నది హైదరాబాదు సంస్థానముగుండా ప్రవహించుచు, మదరాసు రాజధానికి, ఆ సంస్థానమునకు సరిహద్దుగా ఏర్పడినది. ఈ నదికి దుమ్ముగూడెమువద్ద ఆనకట్ట కట్టినారు. పాపికొండల ఛేదించుకొని పారునపుడు ఈ నది యిరుకైన కోనగుండా ప్రవహించును. వాటినిదాటిన వెనుక ఈ నది విస్తరించి, మందమై ఒండు మట్టితో దిగబడినప్పుడు లంకలేర్పడుచున్నవి. 1852 లో ధవళేశ్వరమువద్ద ఈ నదికి ఆనకట్ట కట్టినారు. ముఖ్యముగా ఈ నది రెండు పాయలై, ఏడు చీలికలుగాసముద్రములో గలియుచున్నది. ఇచ్చట ఒండుమట్టి విస్తారముగా పేరుకొని, డెల్టాగా మారినది. దీనినే గోదావరి డెల్టా యందురు. రాజమహేంద్రవరము ఈ నదీతీరపు రేవు పట్నము; ఆదికవి నన్నయనాటినుండి ప్రసిద్ధికెక్కిన నగరము; వాణిజ్య వ్యాపారములకిది మూలకేంద్రముగా నున్నది. ఇక్కడనున్న గోదావరివంతెన చూడదగినది.

కృష్ణానది హైదరాబాదు సంస్థానమున మహాబలేశ్వరము అనుచోట ఉద్భవించి, కర్నూలు జిల్లాలోని సంగమేశ్వరమను పుణ్యక్షేత్రమునుండి, నల్లమలలగుండా

**కృష్ణానది.** ప్రవహించి, శ్రీశైలమును సమీపించి, గుంటూరు కృష్ణా జిల్లాలగుండా ప్రవహించి మచిలీపట్నముసామీప్యమున హంసలదీవి యనుచోట, బంగాళాఖాతములో గలియుచున్నది. దీని పొడవు 800 మైళ్లు. ఈ నదికి బెజవాడవద్ద ఆనకట్ట కట్టబడినది. పంట కాలువలు,



గోదావరివంతెన




బెజవాడ—కృష్ణానది

పొలముల కనువగు నీటి వసతి ఏర్పాటులు, జరుగుటచేత దీని క్రింద భూమిసాగుబడి బాగుగా నున్నది. మద్రాసు నుండి కాకినాడ వరకు బకింగుహామ్ కాలువ త్రవ్వెరి. రోజుకు అయిదు చరదపు మైళ్ల ప్రదేశముమీద, అడుగు ఎత్తున మేటవేయగల ఒండుమట్టిని తెచ్చే ఈ నదీమతల్లివల్ల కృష్ణాజిల్లా సారవంతమగుచున్నది! ఈనది దాదాపు 200 మైళ్ల మేర గుంటూరు జిల్లాలో ప్రవహిస్తూ ఉన్నది. బెజవాడవద్ద నీ కృష్ణానది ఎంత రమణీయముగా కనబడునో చూచినారా?

మైసూరు జిల్లాలోని నందిదుర్గమున బుట్టి, బళ్లారిగుండా కర్నూలు జిల్లాకు ఉత్తరసరిహద్దుగా ప్రవహించి, సంగ

మేశ్వరమను పుణ్యస్థలమున, కృష్ణా నది

తుంగభద్రానది. తో గలియుచున్నది. ఇది కృష్ణానది

యొక్క ఉపనదులలో ముఖ్యమైనది.

దీనికి హాస్పేటువద్ద, కర్నూలునుండి హైదరాబాదుకు పోవు రైలు మార్గమున పెద్ద వంతెన కలదు.

పినాకిని నదికి పెన్నాయను పేరు సైతము కలదు. ఇది మైసూరు రాజ్యములోని నందిదుర్గమను కొండలలో బుట్టి

అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలగుండా

పినాకిని. ప్రవహించి, పడమటి వెలిగొండలయందు సోమ

శిలయను కనుమద్వారా నెల్లూరుజిల్లాలలో

ప్రవేశిస్తున్నది. ఆత్మకూరుతాలూకా పొడవునను ఈ నది పారుతున్నది; అక్కడ బొగ్గేరు, బీరాపేరు కలసి కొంతదూరము ఈశాన్యముగను, కొంతదూరము తూర్పుగను ప్రవహించును; నెల్లూరు, కొవ్వూరు తాలూకాల మధ్య సరిహద్దుగా ప్రవహించి సముద్రమును జేరును. ఈ నదీ సంగమము వద్ద ఒక ఆనకట్ట కట్టినారు. దీనికిని డెల్టా ఏర్పడినది. దీని పంట కాలువలు వరిపంటకు ఆధార భూతములు.

ఇవిగాక విశాఖపట్నం జిల్లాలో మరికొన్ని నదులున్నవి. వాటిలో బాహుదా, మహేంద్రతనయ, వంశధార, నాగావళీ నదులు ముఖ్యమయినవి.

బాహుదానది పెద్దకిమిడి మాళువాలలో పుట్టి, ఇచ్ఛాపురమునకు కొంత దూరమున సముద్రములో గలియుచున్నది.

మహేంద్రతనయ మహేంద్రపర్వతములలో పుట్టి, బారువ వద్ద సముద్రములో కలియుచున్నది. ఈ పర్వతములలోనే పుట్టిన మఱియొక మహేంద్రతనయ పాతపట్నము తాలూకాలో వంశధారా నదిలో కలియుచున్నది.

వంశధార—ఇది నిమ్మగిరి కొండలలో పుట్టి, దక్షిణముగా గుణపురము తాలూకాగుండా ప్రవహించి, పిమ్మట తూర్పుగాపారి కళింగపట్టణమువద్ద, సముద్రమున కలియును. ఈ నది వెదురుపొదలలోనుండి ధారవలె పుట్టినదిగాన, దీనికి వంశధార యని పేరు వచ్చినది.

నాగావళికి లాంగుళ్య అని సైతము పేరు కలదు. ఈ నది నిమ్మగిరులలో పుట్టి, దక్షిణముగా పార్వతీపురము, పాలకొండ తాలూకాలగుండా ప్రవహించి, మోపసు బందరు వద్ద, సముద్రములో కలియును. స్వర్ణముఖి, వేగవతి, కుంభికోటగడ్డ యను మూడు ఉపనదులు ఈ నదిలో చేరును. దీని పొడవు 115 మైళ్లు.

చంపావతి—ఇది గజపతి నగరము తాలూకాలోని ఆంధ్ర కొండలలో పుట్టి గజపతినగరం, విజయనగరం, భీమునిపట్నం తాలూకాలలో ప్రవహించి, కోనాడవద్ద సముద్రమున కలియుచున్నది.

గోస్తని శృంగవరపుకోట తాలూకాలోని, కాశీపురపు కొండలలో పుట్టి, శృంగవరపుకోట, భీమునిపట్నము తాలూకాలలో ప్రవహించి భీమునిపట్నము వద్ద సముద్రములో గలియుచున్నది. గోస్తనములవంటి ఆకారముగల రాళ్లలో నుండి ధారగా ప్రవహించుటచే దీనికీపేరు సార్థకమైనది!

శారదానది—వీరవల్లి తాలూకాలోని మాడుగులలోపుట్టి అనకాపల్లి, సర్వసిద్ధి తాలూకాలగుండా పారి, వాలాడ వద్ద సముద్రములో గలియుచున్నది. దీని పొడవు 45 మైళ్లు.

వరహానది—గోలుగొండలలో పుట్టి, సర్వసిద్ధి తాలూకాలో ప్రవహించి, వాలాడ వద్ద, సముద్రమున గలియుచున్నది.

ఖాండవనది—ఇదిన్నీ గోలుగొండ తాలూకాలో పుట్టి, విశాఖపట్టణము, గోదావరి జిల్లాలకు సరిహద్దుగా ప్రవహించి, పెంటకోట వద్ద సముద్రగామి యగుచున్నది. పూర్వము కృష్ణార్జునులు ఖాండవ వనమును కాల్చుటచూచి, దేవేంద్రుడు దానిని చల్లార్చుటకు, కురిపించిన వర్షపు నీటి వలన ఈ నది పుట్టుటచే దీనికి ఖాండవ నదియని పేరు వచ్చినట్లు గాథ కలదు!

ఇవిగాక, ఇంద్రావతి, చిట్టివలస యేరు, కోలాబునది, మాచేరు గలవు. తూర్పు గోదావరి జిల్లాలో ఏలేరు, తాండవ నదులున్నవి. తుంగభద్రనుండి త్రవ్వబడిన 190 మైళ్లు పొడవైన కడప కర్నూలు కాలువ గలదు. నెల్లూరు జిల్లాలో సువర్ణముఖి, ప్రవహించును. గుంటూరు జిల్లాలో చారిత్రక కీర్తిగల చంద్రవంక, నాగులేరులున్ను, ఎత్తిపోతల జలపాతమున్ను గలవు. పాలేరు చిత్తూరునెల్లూరు జిల్లాలగుండా ప్రవహించుచున్నది. నెల్లూరు, చెంగల్పట్టు సరిహద్దులలో పులికట్టు వద్ద నొక సరస్సుగలదు. పాపఘ్ని నది కందుకూరు చెరువున కాధారమై, కడప జిల్లాలో ప్రవహించుచున్నది!

విశాఖపట్నము జిల్లాలో ఆరు సరస్సు లున్నవి. కొండకర్లఆవ, కొమరవోలు ఆవ మొదలైనవి.

కొండకర్ల ఆవ—సర్వసిద్ధి తాలూకాలో కొండకర్లఅను గ్రామమునకు సమీపమున ఉన్నది. దీనిలో ఎప్పుడును నీరుండుటచే జలపక్షులు వేలకొలది నివసించు సరస్సులు చుండును. విలాసార్థము పడవప్రయాణము చెరువులు చేయుటకు చాలామంది ఇక్కడకు వత్తురు. శారదా నదీనీరు దీనిలోనికి ఒక పెద్ద కాలువ ద్వారా ప్రవహించును. గోలుగొండ తాలూకాలో వరహానదియొక్క శాఖయైన "కొమరవోలు ఆవ" ఈ ఆవలో పడుచున్నది.

దమయంతి సరస్సు, జగన్నాథసాగరము, ఇవి రెండున్ను జయపురమునకు సామీప్యమున నున్నవి. కలువ, తామర తూళ్లతో నిండిన ఈ సరస్సులు కడురమ్యముగా నుండును.

తలతంపర—తంపరలను చిన్నచిన్న సరస్సులలో చేరినది. సోంపేటవద్ద ఈ సరస్సుగలదు. దీనిలోని నీరు పంటలకెక్కువగా ఉపచరిస్తున్నది.

పశ్చిమ గోదావరి జిల్లాలో కొల్లేటి సరస్సున్నది. పాతపట్నం తాలూకాలో పూర్వులు త్రవ్వించిన అసురుల సాగరము మొదలైన పెద్ద చెరువులు గలవు. ఇవిగాక కంభం చెరువు, భవనాశి చెరువు మొదలైన చెరువులున్నవి.

మన రాజధానిలోని పదకొండు తెలుగు జిల్లాలలోని వర్షపాతమును ఈ పట్టిక చూపును.

| వర్షపాతము | 1939-40 సంవత్సరమున అంగుళములు. |
|---|---|
| విశాఖపట్నము | 35.38 |
| తూర్పు గోదావరి | 55. 1 |
| పశ్చిమ గోదావరి | 51.39 |
| కృష్ణా జిల్లా | 45.42 |
| గుంటూరు జిల్లా | 44. 1 |
| నెల్లూరు | 44.86 |
| కర్నూలు | 25.33 |
| బళ్లారి | 22.88 |
| అనంతపురం | 20. 9 |
| కడప | 26.48 |
| చిత్తూరు | 39.06 |

మన తెలుగు జిల్లా లన్నిటికిన్నీ, నైర్పతి వానగాలుల వల్లనే వర్షములు వచ్చును. నైసర్గిక పరిస్థితులనుబట్టి, కొన్ని జిల్లాల కెక్కువగను, కొన్ని జిల్లాలకు తక్కువగను ఉండును. నైర్పతి వానగాలులు పడమటి కనుమలను దాటి, సూటిగాపోయి, మరల ఎత్తైన కొండలను తాకునప్పుడే వర్షించును గనుక, తూర్పు కనుమల పడమటి భాగములు గల జిల్లాలలో వర్షములు మెండుగాను, అట్టి సౌకర్యములు లేని బళ్లారి, అనంతపురం, కర్నూలు, కడప జిల్లాలలో తక్కువగాను ఉండును. ఈశాన్యపు వానగాలులెక్కువగా నెల్లూరు జిల్లాల దక్షిణమున నున్న దక్షిణదేశపు సముద్ర తీరమున ఎక్కువగా తగులుటచే చెన్నపట్న ప్రాంతపు ప్రదేశమున వర్షములు పడును.

సూర్యుని వైపు భూమి ఏభాగమున వాలియుండునో ఆ భాగమున ఉష్ణమెక్కువ; తక్కిన భాగమున ఉష్ణము తక్కువ. మనకు ఎండకాలము, వర్షకాలము, చలికాల మేర్పడుటకు భూమి ఒరిగి సూర్యుని చుట్టు తిరుగుచుండుటయే కారణము.




ఆరు ఋతువులు.

| | |
|---|---|
| వసంతఋతువు | శరదృతువు |
| గ్రీష్మఋతువు | హేమంతఋతువు |
| వర్ష ఋతువు | శిశిరఋతువు |

## అయనములు

భూమి ఒక సంవత్సరములో సూర్యునిచుట్టి వచ్చుచున్నది. ఇట్లు మనభూమి సూర్యుని చుట్టివచ్చునపుడు భూమిపై నుండువారికి సూర్యుడే ఆరు మాసములు దక్షిణమునకు పోవుచున్నట్లు కనుపించును. దీనినే దక్షిణాయనమందురు. ఉత్తరమునకు పోవునట్లు కనిపించు ఆరు మాసములకు ఉత్తరాయణమని పేరు.

| తెనుగు నెలలు | | ఇంగ్లీషు నెలలు |
|---|---|---|
| చైత్రము | = | మార్చి, ఏప్రిల్ |
| వైశాఖము | = | ఏప్రిల్, మే |
| జ్యేష్ఠము | = | మే, జూన్ |
| ఆషాఢము | = | జూన్, జూలై |
| శ్రావణము | = | జూలై, ఆగస్టు |

| | | |
|---|---|---|
| భాద్రపదము | = | అగస్టు, సెప్టెంబరు |
| ఆశ్వయుజము | = | సెప్టెంబరు, అక్టోబరు |
| కార్తికము | = | అక్టోబరు, నవంబరు |
| మార్గశిరము | = | నవంబరు, డిశంబరు |
| పుష్యము | = | డిశంబరు, జనవరి |
| మాఘము | = | జనవరి, ఫెబ్రువరి |
| ఫాల్గుణం | = | ఫెబ్రువరి, మార్చి |

ఉత్తర హిందూస్థానములోవలె, వేసవిలో వేడి, శీతాకాలములో చలి, ఎక్కువ తీవ్రముగా ఉండదు. బెజవాడ, గుంటూరు మున్నగు స్థలములలో వేడి 110°లవరకు శీతోష్ణస్థితి వెళ్లును. విశాఖపట్టణములో వాల్తేరులోను, భీముని పట్నములోను వేసంగిలో చల్లగా నుండును. ఇక్కడ ఉప్పాడ ఓడరేవులు, మదనపల్లి, రాయలసీమలోని పెనుగొండయున్న వేసంగిలో చల్లగానుండును.

## తెలుగు జిల్లాలు.

విస్తీర్ణము—జన సంఖ్య—రోడ్లు—శిస్తులు వగైరా.

| వరుస సంఖ్య. | జిల్లా లేక ప్రాంతము. | విస్తీర్ణము చ. మై. | జనసంఖ్య. | గ్రామముల సంఖ్య. | భూమిపన్ను రూపాయలలో. | డిస్ట్రిక్టు బోర్డుల రెవిన్యూ ఆదాయము. | చదువుకున్న వారి సంఖ్య నూటికి. | మైళ్లు, రోడ్ల పొడవు. |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | విశాఖపట్నం | 17186 | 3846000 | 11547 | 3848103 | 1411236 | 6 | 1154 |
| 2. | తూర్పు గోదావరి | 6220 | 2163000 | 1920 | 6490635 | 1229365 | 11 | 1920 |
| 3. | పశ్చిమ గోదావరి | 2361 | 1379000 | 716 | 5268715 | 830389 | 14 | 716 |
| 4. | కృష్ణా | 3547 | 1446000 | 981 | 5015477 | 1128851 | 13 | 981 |
| 5. | గుంటూరు | 5757 | 2277000 | 926 | 6831976 | 1263604 | 15 | 926 |
| 6. | నెల్లూరు | 7949 | 1617000 | 1621 | 3717583 | 721931 | 8 | 1621 |
| 7. | కడప | 5919 | 1057000 | 889 | 1915346 | 415013 | 9 | 889 |
| 8. | కర్నూలు | 7581 | 1144000 | 796 | 2151767 | 548197 | 8 | 796 |
| 9. | బళ్లారి | 5713 | 1081000 | 908 | 1357681 | 486767 | 8 | 908 |
| 10. | అనంతపురం | 6741 | 1172000 | 853 | 1683074 | 507327 | 8 | 853 |
| 11. | చిత్తూరు | 5901 | 1632000 | 2254 | 1676916 | 608190 | 8 | 2254 |

## ఆంధ్ర దేశము.

తాలూకావారి జనాభా—విస్తీర్ణము—గ్రామములు.

| జిల్లా, తాలూకా. | విస్తీర్ణము చ. మై. | జనాభా. | పట్టణములు. | పల్లెలు. | ఒక్కొక్క చ. మై. జన సంఖ్య. |
|---|---|---|---|---|---|
| **1 విశాఖపట్నం.** | | | | | |
| 1. ఇచ్ఛాపురం | 221 | 80,300 | — | 269 | 363 |
| 2. సోంపేట | 274 | 120,635 | 1 | 152 | 440 |
| 3. పాతపట్నం | 412 | 86,546 | 1 | 446 | 211 |
| 4. టెక్కలి | 239 | 152,236 | 1 | 331 | 637 |
| 5. శ్రీకాకుళం | 460 | 291,827 | 2 | 353 | 634 |
| 6. పార్వతీపురం | 401 | 132,581 | 2 | 207 | 331 |
| 7. పాల్కొండ | 334 | 242,618 | 3 | 323 | 726 |
| 8. సాలూరు | 180 | 99,621 | 1 | 125 | 553 |
| 9. బొబ్బిలి | 268 | 172,097 | 1 | 173 | 642 |
| 10. చీపురుపల్లి | 535 | 207,391 | — | 267 | 388 |

| జిల్లా, తాలూకా. | | విస్తీర్ణము చ. మై. | జనాభా. | పట్టణములు. | పల్లెలు. | ఒక్కొక్క చ. మై. జన సంఖ్య. |
|---|---|---|---|---|---|---|
| 11. | విజయనగరం | 319 | 221,917 | 1 | 191 | 696 |
| 12. | భీమునిపట్నం | 255 | 141,987 | 1 | 118 | 557 |
| 13. | శృంగవరపుకోట | 278 | 160,053 | 1 | 177 | 576 |
| 14. | విశాఖపట్నం | 175 | 134,287 | 1 | 73 | 767 |
| 15. | అనకాపల్లి | 301 | 182,546 | 1 | 144 | 606 |
| 16. | సర్వసిద్ధి | 341 | 192,063 | 1 | 142 | 563 |
| 17. | వీరవల్లి | 386 | 234,848 | 2 | 241 | 608 |
| 18. | గోల్కొండ | 500 | 159,944 | 1 | 154 | 314 |
| 19. | గూడెం | 738 | — | — | 278 | 32 |
| **2 తూర్పు గోదావరి.** | | | | | | |
| 1. | భద్రాచలము | 911 | 12,673 | — | 326 | 69 |
| 2. | చోడవరము | 710 | 7,074 | — | 230 | 46 |
| 3. | నూగూరు | 593 | 4,976 | — | 134 | 43 |
| 4. | పోలవరము | 543 | 16,205 | — | 120 | 136 |
| 5. | ఎల్లవరము | 919 | 9,643 | — | 304 | 48 |
| 6. | అమలాపురము | 367 | 50,909 | 1 | 104 | 706 |
| 7. | కాకినాడ | 297 | 50,867 | 2 | 104 | 887 |
| 8. | పెద్దాపురము | 604 | 46,538 | 1 | 201 | 354 |
| 9. | పిఠాపురము | 193 | 21,903 | 1 | 48 | 557 |
| 10. | రాజమండ్రి | 376 | 40,912 | 2 | 80 | 582 |
| 11. | రామచంద్రపురము | 291 | 53,127 | 3 | 114 | 953 |
| 12. | రాజోలు | 291 | 48,939 | — | 107 | 886 |
| 13. | తుని | 126 | 18,049 | 1 | 48 | 654 |
| **3 పశ్చిమ గోదావరి.** | | | | | | |
| 1. | భీమవరం | 282 | 174,083 | 1 | 89 | 617 |
| 2. | చింతలపూడి | 527 | 97,458 | — | 127 | 185 |
| 3. | ఏలూరు | 377 | 184,975 | 1 | 118 | 491 |
| 4. | కొవ్వూరు | 354 | 155,883 | 2 | 100 | 440 |
| 5. | నర్సాపురము | 278 | 233,736 | 3 | 87 | 841 |
| 6. | తాడేపల్లి గూడెం | 342 | 163,721 | — | 107 | 479 |
| 7. | తణుకు | 200 | 213,200 | 3 | 88 | 1,066 |
| **4 కృష్ణా.** | | | | | | |
| 1. | బందరు | 281 | 155,962 | 2 | 104 | 555 |
| 2. | బెజవాడ | 423 | 190,007 | 3 | 106 | 449 |
| 3. | దివి | 459 | 163,398 | — | 97 | 356 |
| 4. | గన్నవరము | 290 | 120,158 | 1 | 95 | 414 |
| 5. | గుడివాడ | 313 | 202,217 | 1 | 159 | 646 |
| 6. | కైకలూరు | 381 | 85,368 | — | 89 | 224 |

| జిల్లా, తాలూకా. | | విస్తీర్ణము చ. మై. | జనాభా. | పట్టణములు. | పల్లెలు. | ఒక్కొక్క చ. మై. జన సంఖ్య. |
|---|---|---|---|---|---|---|
| 7. | నందిగామ | 678 | 173,608 | 1 | 168 | 256 |
| 8. | నూజివీడు | 297 | 73,194 | 1 | 73 | 246 |
| 9. | తిరువూరు | 425 | 90,296 | — | 90 | 212 |
| **5 గుంటూరు.** | | | | | | |
| 1. | బాపట్ల | 688 | 298,869 | 5 | 110 | 434 |
| 2. | గుంటూరు | 502 | 297,835 | 2 | 109 | 593 |
| 3. | నర్సరావు పేట | 716 | 237,261 | 2 | 106 | 331 |
| 4. | ఒంగోలు | 820 | 277,986 | 3 | 163 | 339 |
| 5. | పల్నాడు | 1041 | 167,994 | 1 | 88 | 161 |
| 6. | రేపల్లె | 345 | 178,824 | 2 | 68 | 518 |
| 7. | సత్తెనపల్లి | 706 | 215,885 | 1 | 131 | 306 |
| 8. | తెనాలి | 295 | 256,627 | 3 | 79 | 870 |
| 9. | వినుకొండ | 644 | 104,379 | 1 | 72 | 162 |
| **6 నెల్లూరు.** | | | | | | |
| 1. | ఆత్మకూరు | 639 | 112,144 | — | 113 | 175 |
| 2. | దర్శి | 591 | 99,980 | — | 119 | 169 |
| 3. | గూడూరు | 460 | 99,356 | 1 | 114 | 216 |
| 4. | కందుకూరు | 801 | 175,970 | 1 | 166 | 220 |
| 5. | కనిగిరి | 1,000 | 134,395 | 1 | 182 | 134 |
| 6. | కావలి | 548 | 112,038 | 1 | 78 | 204 |
| 7. | కోవూరు | 385 | 148,090 | 2 | 84 | 385 |
| 8. | నెల్లూరు | 505 | 190,534 | 1 | 119 | 377 |
| 9. | పొదిలి | 564 | 75,632 | — | 110 | 134 |
| 10. | పోలూరు | 563 | 89,618 | 1 | 142 | 159 |
| 11. | రాపూరు | 594 | 72,119 | — | 110 | 121 |
| 12. | ఉదయగిరి | 871 | 101,928 | — | 132 | 117 |
| 13. | వెంకటగిరి | 427 | 74,418 | 1 | 152 | 174 |
| **7 కడప.** | | | | | | |
| 1. | బద్వేలు | 755 | 93,888 | 1 | 119 | 124 |
| 2. | కడప | 509 | 108,035 | 1 | 93 | 212 |
| 3. | జమ్మలమడుగు | 612 | 102,910 | 1 | 127 | 168 |
| 4. | కమలాపురము | 303 | 68,275 | 1 | 62 | 225 |
| 5. | ప్రొద్దుటూరు | 430 | 107,645 | 1 | 79 | 250 |
| 6. | పులివెందల | 565 | 96,157 | 1 | 91 | 170 |
| 7. | రాజంపేట | 1,035 | 158,356 | 1 | 130 | 153 |
| 8. | రాయచోటి | 1,103 | 150,962 | 1 | 111 | 137 |
| 9. | సిద్ధవట్టం | 606 | 63,169 | — | 77 | 104 |

| జిల్లా. తాలూకా. | | విస్తీర్ణము చ. మై. | జనాభా. | పట్టణములు. | పల్లెలు. | ఒక్కొక్క చ. మై. జన సంఖ్య. |
|---|---|---|---|---|---|---|
| **8 కర్నూలు.** | | | | | | |
| 1. | కంభం | 1,060 | 132,272 | — | 99 | 125 |
| 2. | ద్రోణాచలం | 817 | 108,101 | — | 76 | 132 |
| 3. | కోయిలకుంట్ల | 572 | 8,7034 | — | 85 | 152 |
| 4. | కర్నూలు | 640 | 155,528 | 1 | 95 | 243 |
| 5. | మార్కాపురం | 1,140 | 108,712 | — | 98 | 95 |
| 6. | నందికొట్కూరు | 1,308 | 117,007 | — | 99 | 89 |
| 7. | నంద్యాల | 679 | 101,028 | 1 | 77 | 149 |
| 8. | పత్తికొండ | 747 | 122,436 | — | 70 | 164 |
| 9. | సిరువేల్ | 617 | 92,848 | — | 97 | 150 |
| **9 బళ్లారి.** | | | | | | |
| 1. | ఆదోని | 766 | 193,200 | 3 | 164 | 252 |
| 2. | ఆలూరు | 613 | 105,400 | — | 94 | 172 |
| 3. | బళ్లారి | 652 | 132,133 | 1 | 102 | 203 |
| 4. | హడగల్లి | 587 | 86,292 | — | 87 | 147 |
| 5. | హర్పనహల్లి | 611 | 100,039 | 1 | 81 | 164 |
| 6. | హొస్పేట | 537 | 89,511 | 2 | 106 | 167 |
| 7. | కూడ్లిగి | 863 | 108,288 | 1 | 114 | 125 |
| 8. | రాయదుర్గము | 681 | 92,484 | 1 | 80 | 136 |
| 9. | సిరిగుప్ప | 403 | 62,432 | 1 | 80 | 155 |
| **10 అనంతపురం.** | | | | | | |
| 1. | అనంతపురం | 926 | 116,958 | 1 | 114 | 126 |
| 2. | ధర్మవరం | 736 | 90,024 | 1 | 63 | 122 |
| 3. | గుత్తి | 896 | 159,640 | 4 | 132 | 178 |
| 4. | హిందూపురం | 431 | 110,194 | 1 | 77 | 256 |
| 5. | కదిరి | 1,162 | 173,254 | 1 | 141 | 149 |
| 6. | కళ్యాణదుర్గము | 821 | 87,447 | 1 | 74 | 107 |
| 7. | మడకసిర | 446 | 97,081 | 1 | 57 | 218 |
| 8. | పెనుగొండ | 682 | 98,498 | 1 | 98 | 144 |
| 9. | తాడిపత్రి | 641 | 117,315 | 1 | 97 | 183 |
| **11 చిత్తూరు జిల్లా.** | | | | | | |
| 1. | చంద్రగిరి | 548 | 132,499 | 1 | 222 | 242 |
| 2. | చిత్తూరు | 786 | 258,100 | 1 | 344 | 328 |
| 3. | కాళహస్తి | 622 | 118,031 | 1 | 341 | 190 |
| 4. | కుప్పం | 305 | 61,367 | 1 | 250 | 201 |
| 5. | మదనపల్లి | 236 | 105,618 | 1 | 104 | 184 |
| 6. | పల్మనేరు | 411 | 59,567 | — | 87 | 145 |

| జిల్లా, తాలూకా. | | విస్తీర్ణము చ. మై. | జనాభా. | పట్టణములు | పల్లెలు. | ఒక్కొక్క చ. మై. జన సంఖ్య. |
|---|---|---|---|---|---|---|
| 7. | పుంగనూరు | 648 | 122,271 | 1 | 105 | 189 |
| 8. | పుత్తూరు | 542 | 196,111 | — | 347 | 362 |
| 9. | తిరుత్తని | 401 | 198,455 | 1 | 329 | 495 |
| 10. | వాయల్పాడు | 802 | 147,124 | — | 125 | 183 |

[1931 జనాభా లెక్కలు.]



విశాఖపట్టణం—బీచ్—హార్బరుకు ద్వారం.

"తనగీత యువజాతిని పోటురులనుగా
దిద్ది వర్ధిల్లిన తెనుఁగు వాణి
తన పోటులు విరోధి తండంబులకు సహిం
పనివిగా మెరసిన తెనుఁగు కత్తి
తన యందములు ప్రాంత జనుల కభిరుచి వా
సన నేర్ప నలరిన తెనుఁగు రేఖ
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ
లను జేయఁ జెలఁగిన తెనుఁగు భూమి

అస్మదార్ద్రి మనోవీధి నావహింప
జ్ఞప్తి కెలయించు చున్నాఁడ: చావలేదు
చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర
హృదయములఁ జీల్చి చదువుఁడో సదయులార!"

—రాయప్రోలు.

## మూడవ అధ్యాయము

# కాలానుక్రమణిక

మానవకోటికి సంబంధించిన ప్రధాన ప్రాపంచిక విషయములను హిందూదేశమునకు అందు ప్రత్యేకముగా ఆంధ్రదేశమునకు, ప్రత్యక్ష్యముగాను, పరోక్షముగాను సంబంధించిన చారిత్రక, ఆర్థిక, సాంఘిక, రాజకీయ విషయములను స్థూలముగా వత్సరక్రమమున సూచించు కాలానుక్రమణిక, తత్సంబంధమైన పట్టికలు.






ప్రపంచ జనులలో అయిదింట ఒకరు భారతీయులు.

### ప్రపంచపు స్థితిగతులు.

| | చ. మై. |
|---|---|
| ప్రపంచపు విస్తీర్ణము | 19,69,50,000 |
| భూమి ,, | 5,75,10,000 |
| నీటి ,, | 13,94,40,000 |
| సముద్రములోని దీవులు | 19,10,000 |
| భూమిపైనున్న సరస్సులు, నదులు | 10,00,000 |
| ఫల ప్రదమగు భూములు | 3,30,00,000 |
| ఎడారులు | 50,00,000 |

### సముద్రములు.

| | |
|---|---|
| శాంత మహా సముద్రము | 6,86,34,000 |
| అట్లాంటిక్ ,, | 4,13,21,000 |
| హిందూ ,, | 2,93,40,000 |
| అంటార్కిటిక్ ,, | 60,00,000 |
| ఆర్కిటిక్ ,, | 40,00,000 |

### ఖండములు.

| | |
|---|---|
| ఆసియా | 1,70,00,000 |
| ఆఫ్రికా | 1,15,62,000 |
| ఉత్తర అమెరికా | 80,00,000 |
| దక్షిణ అమెరికా | 68,00,000 |
| ఓషేనియా (ఆస్ట్రేలియాతో) | 40,00,000 |
| యూరప్ | 37,50,000 |
| ధ్రువ ప్రదేశములు | 62,05,000 |

## ముఖ్యమగు ఆర్యభాషలు




## ముఖ్య ద్రావిడభాషలు




ముఖ్య సెమిటిక్ శాఖ హిబ్రూ, అరబ్బీ భాషలు

ముఖ్య మంగోలు ,, తుర్కీ, చీనా, జపాను భాషలు

### కొన్ని ముఖ్య భాషలు.

ఆయా భాషలు స్వభాషలుగా గలవారి సంఖ్య.

| | |
|---|---|
| చైనా భాష* | రమారమి 30 కోట్లు |
| ఇంగ్లీషు † | ,, 20 ,, |
| హిందుస్థానీ ‡ | ,, 14 ,, |
| రష్యను | రమారమి 10 కోట్లు |
| జర్మన్ | ,, 8 ,, |
| జపాను | ,, 7 ,, |
| ద్రావిడ భాషలు మొత్తం § | ,, 7 ,, |
| బెంగాలి | ,, 5 ,, |
| ఫ్రెంచి | ,, 4 ,, |
| ఇటాలియన్ | ,, 4 ,, |

*ప్రాంతీయ భేదములనుబట్టి భాషా భేదములున్నవి.

† సర్వ వ్యాప్తమైన భాష.

‡ ప్రాక్ పశ్చిమ హిందీలలో కొంత భేదమున్నది.

§ ఇందు ఆంధ్ర భాషీకులు 2,63,00,000 పైబడియున్నారు

## జగత్కాలము

| | |
|---|---|
| కృతయుగము | 17,28,000 ఏండ్లు |
| త్రేతాయుగము | 12,96,000 ,, |
| ద్వాపరయుగము | 8,64,000 ,, |
| కలియుగము | 4,32,000 ,, |
| చతుర్యుగము అనగా ఒక మహా యుగము | 43,20,000 ఏండ్లు |
| మన్వంతరము అనగా 71 మహాయుగములు | 30,67,20,000 ,, |
| ఇప్పటికి ఆరు మన్వంతరములు గడచి, ఏడవదగు వైవస్వత మన్వంతరమున ఉన్నాము. కనుక ఆరు మన్వంతరములకు | 18,40,3,20,000 ఏండ్లు |
| ఈ 7వ మన్వంతరములో గడచిన 27 మహా యుగములకు | 11,66,40,000 ఏండ్లు |
| ఈ 28 వ మహా యుగములో కృత త్రేతా ద్వాపర యుగములకు | 3,88,80,000 ఏండ్లు |
| ఈ కలియుగములో ఇప్పటికైనవి | 5,035 ఏండ్లు |
| మొత్తం ఈ కల్పంలో అయిన ఏండ్లు | 1,99,58,45,035 |

ఇట్లు మన ప్రాచీనార్య సంప్రదాయపు లెక్కల ప్రకారము ఈ కల్పారంభకాలము, మన భూమికి ప్రత్యేక వ్యక్తిత్వము ఏర్పడుటకు వైజ్ఞానికులు చెప్పిన కాలము సుమారుగా సరిపోవును.

## కొన్ని దేశములందు ప్రాథమిక విద్యకై తల 1కి చేయు వ్యయము.

| | | | |
|---|---|---|---|
| డెన్మార్కు | రు. 17 | 5 | 0 |
| అమెరికా | 16 | 4 | 0 |
| ఇంగ్లండు | 9 | 0 | 0 |
| ఫ్రాన్సు | 9 | 0 | 0 |
| జపాను | 7 | 0 | 0 |
| భారత దేశము | 0 | 2 | 0 |

## కొన్ని దేశములందు జనుల వృత్తులు (నూటికి)

| దేశము | వ్యవసాయము నూటికి | పరిశ్రమలు | వర్తకము |
|---|---|---|---|
| అమెరికా | 22 | 29.3 | 15 |
| జర్మనీ | 28.9 | 38.1 | — |
| ఫ్రాన్సు | 38.3 | 31.1 | 12.9 |
| కెనడా | 34 | 26.9 | 13.9 |
| ఇంగ్లాండు | 6.4 | 40.0 | 14.0 |
| భారత దేశము | *71.2 | 11.2 | 5.0 |

## ఆయుర్దాయము-అక్షరజ్ఞానము

జననమరణముల స్థితిని తెలుపు పట్టిక.

| దేశము | సగటు ఆయుర్దాయము | చదువు కున్నవారు నూటికి | జననము నూటికి | మరణము నూటికి |
|---|---|---|---|---|
| ఇండియా | 23 | 8 | 3.3 | 2.7 |
| ఇటలీ | 44 | 90 | 2.3 | 1.4 |
| జపాను | 44 | 99 | 3.0 | 1.8 |
| ఫ్రాంసు | 47 | 94.2 | 1.6 | 1.6 |
| గ్రేటు బ్రిటన్ | 50 | 90 | 1.5 | 1.2 |
| స్విట్జర్లాండు | 51 | | 1.6 | 1.2 |
| అమెరికా సంయుక్త రాష్ట్రము | 51 | 94 | 1.7 | 1.1 |
| హాలండు | 52 | 92 | 2.0 | 0.8 |
| స్వీడను | 55 | — | 1.3 | 1.1 |
| నార్వే | 56 | — | 1.4 | 1.0 |
| డెన్మార్కు | 56 | — | 1.7 | 1.1 |
| ఆస్ట్రేలియా | 57 | 92 | 1.6 | 0.9 |
| న్యూజిలాండ్ | 67 | — | 1.6 | 0.8 |

— ఈ గుర్తుగల భాగమునకు సరియైన లెక్కలేదు. కాని ఈ ప్రాంతముల నూటికి రమారమి 90 మంది చదివినవారే.

* చాలామంది వ్యవసాయదార్లపైన, ఈనాములపైన ఆధారపడిన నిరుద్యోగులున్నారు.

# మనదేశము ఎంత పెద్దది?




జన సంఖ్య.

ప్రపంచంలోని జనసంఖ్యలో అయిదవవంతు హైందవులు.

| | | |
|---|---|---|
| ప్రపంచపు జన సంఖ్య | ... | 181,91,85,359 మంది |
| ఆసియా ఖండపు జన సంఖ్య | ... | 104,33,88,492 మంది |
| హిందూదేశపు జన సంఖ్య | ... | 35,29,86,876 మంది |
| హిందూదేశ విస్తీర్ణము | ... | 18,09,000 చ. మైళ్లు |

## జన సంఖ్య మతముల ననుసరించి (నూటికి)



హిందువులు 68.2



మహమ్మదీయులు 22.16



బౌద్ధులు 3.6



క్రైస్తవులు 1.8

| | | | |
|---|---|---|---|
| సిక్కులు | 1.2 | పారశీకులు | .03 |
| జైనులు | .36 | ఇతరులు | 2.4 |

## జన సంఖ్య భాషల ననుసరించి (నూటికి)

| | |
|---|---|
| పశ్చిమహిందీ | 25.3 |
| బెంగాలీ | 18.9 |
| తెలుగు | 9.3 |
| తమిళము | 7.2 |
| పంజాబీ | 5.6 |
| రాజస్థానం | 4.9 |
| మారాటీ | 4.7 |
| కన్నడము | 4.0 |
| ఓఢ్రము | 4.0 |
| గుజరాతీ | 3.8 |
| మళయాళము | 3.2 |
| బర్మా భాష | 3.1 |

## పల్లెలలో పట్టణములలో జన సంఖ్య.

(1931 జనాభా లెక్కల ప్రకారము) (నూటికి)

| రాష్ట్రము | పట్నములు | పల్లెలు | గ్రామము యొక్క సగటు జనాభా |
|---|---|---|---|
| బెంగాలు | 6.5 | 93.5 | 355 |
| బీహారు, ఒరిస్సా | 1.7 | 98.3 | 379 |
| బొంబాయి | 19.0 | 81.0 | 612 |
| మద్రాసు | 11.8 | 88.2 | 687 |
| బర్మా | 9.3 | 90.7 | 292 |
| మధ్య రాష్ట్రములు | 8.5 | 91.5 | 327 |
| పంజాబు | 11.8 | 88.9 | 521 |
| సంయుక్త రాష్ట్రములు | 10.2 | 89.8 | 400 |
| బ్రిటిష్ ఇండియా | 9.3 | 90.7 | 412 |

## మన దేశపు ముఖ్యమైన నదులు

| | పొడవు. మైళ్లు. |
|---|---|
| బ్రహ్మపుత్ర | 1,960 |
| గంగా | 1,556 |
| గోదావరి | 870 |
| సింధు | 1,929 |
| జీలం | 640 |
| కృష్ణా | 680 |
| నర్మదా | 801 |
| తపతి | 620 |

## మన దేశ సంపద-ప్రపంచము.

| | జనసంఖ్య మిలియను | సంవత్సర ఆదాయము రూ. (మి) | ధనము లేక ఆర్థిక సంపద రూ. (మి) |
|---|---|---|---|
| అమెరికా సంయుక్త రాష్ట్రములు | 122.77 | 2,053 | 9,356 |
| కెనడా | 10.37 | 1,268 | 8,023 |
| ఇంగ్లీషురాజ్యము | 46.18 | 1,092 | 6,371 |
| జపాను | 65.36 | 271 | 2,308 |
| బ్రిటిష్ ఇండియా | 271.73 | 82 | 441 |

## మన ప్రభుత్వోద్యోగుల వేతనములు.

నెలకు

| కేంద్ర ప్రభుత్వము | రు. | అ. | పై. |
|---|---|---|---|
| గవర్నరు జనరలు | 21,333 | 5 | 4 |
| కమాండర్ ఇన్ చీఫ్ | 8,333 | 0 | 0 |
| ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యులు | 6,666 | 10 | 8 |
| | (ఒక్కొక్కరికి) | | |
| **రాష్ట్రములు.** | | | |
| బెంగాలు గవర్నరు | 10,000 | 0 | 0 |
| బీహారు ,, | 8,333 | 5 | 4 |
| బొంబాయి ,, | 10,000 | 0 | 0 |
| మధ్యరాష్ట్రములు | 6,000 | 0 | 0 |
| మద్రాసు గవర్నరు | 10,000 | 0 | 0 |
| ఉత్కళరాష్ట్ర గవర్నరు | 5,500 | 0 | 0 |
| పంజాబు ,, | 8,333 | 5 | 4 |
| సంయుక్తరాష్ట్రముల గవర్నరు | 10,000 | 0 | 0 |
| బర్మా గవర్నరు | 10,000 | 0 | 0 |
| **ప్రధాన కార్యదర్శి.** | | | |
| అస్సాము ప్రధాన కార్యదర్శి | 2,250 | 0 | 0 |
| బెంగాలు ,, | 5,333 | 5 | 4 |
| బీహారు ,, | 3,000 | 0 | 0 |

| | | | | |
|---|---|---|---|---|
| బొంబాయి | ,, | 3,000 | 0 | 0 |
| మధ్యరాష్ట్రములు | ,, | 2,200 | 0 | 0 |
| మదరాసు | ,, | *3,750 | 0 | 0 |
| సంయుక్తరాష్ట్రములు | ,, | 3,000 | 0 | 0 |

## ఇతర దేశాలలోని పెద్ద ఉద్యోగస్థుల వేతనములు ఎంత తక్కువ?

| | | | |
|---|---|---|---|
| బ్రిటను | మాసమునకు రూ. | అ. | పై. |
| ప్రధాని | 11,111 | 1 | $9\frac{1}{3}$ |
| ఇండియా ప్రధాన కార్యదర్శి | 5,555 | 8 | $10\frac{2}{3}$ |
| సింహళ | | | |
| గవర్నరు జనరలు | 8,888 | 14 | $2\frac{2}{3}$ |
| కెనడా | | | |
| గవర్నరు జనరలు | 11,111 | 1 | $9\frac{1}{3}$ |
| ప్రధాని | 3,375 | 0 | 0 |
| జపాన్ | | | |
| ప్రధాని | 622 | 0 | 0 |
| ఇతరమంత్రులు | 440 | 9 | 4 |
| కార్యదర్శులు | 375 | 12 | 8 |
| అమెరికా సంయుక్తరాష్ట్రములు | | | |
| అమెరికా అధ్యక్షుడు | 17,062 | 8 | 0 |

గ్రేటు బ్రిటను ప్రధాని వేతనము మన ఇండియా గవర్నరు జనరలు వేతనములో సగము మాత్రమే.

## కొన్ని ప్రధాన నగరముల జన సంఖ్య.

| | | | |
|---|---|---|---|
| కలకత్తా | 1,485,582 | అలహాబాద్ | 183,914 |
| బొంబాయి | 1,161,383 | కాశి | 205,315 |
| మదరాసు | 647,230 | పూనా | 250,187 |
| హైదరాబాదు | 466,894 | మైసూరు | 107,142 |
| బెంగళూరు | 306470 | | |

## ప్రపంచములోని కొన్ని ముఖ్య ఘట్టములు.

క్రీస్తు పూర్వము.

4000 బాబిలోనియాలోని సుమేరియనులు, వారి నాగరికత.

3000 }
2500 } ఈజిప్టు పిరమిడ్లు కట్టిరి.

721 మొదటి చంద్రగ్రహణము గుర్తింపబడినట్లు టాలిమీ వ్రాసెను.

605 పర్షియా జొరాస్టరు.

551 కాన్‌ఫ్యూసియస్ అను పండితుడు చైనాలో జన్మించెను.

399 సోక్రటీస్‌ను చంపుట.

356 అలెగ్జాండరు పుట్టుక.

156 చైనాలో కాగితము చేయబడినది.

27 రోమన్ సామ్రాజ్య సంస్థాపన.

4 ఏసుక్రీస్తు పుట్టుక.

క్రీస్తు తర్వాత.

29 క్రీస్తును క్రాసుపైన చంపుట.

61 బొడీసియా తిరుగుబాటు-బ్రిటనులో.

64 రోమును తగులబెట్టుట-నీరో చక్రవర్తి క్రైస్తవ మతమును నాశనము చేయుట.

116 రోమను సామ్రాజ్యము-మహాదశ.

569 మహమ్మదు ప్రవక్త మక్కాలో జన్మించెను.

1206 చింగిస్ ఖాన్ మొగల్ సామ్రాజ్య స్థాపకుని పరిపాలనము.

1215 కింగ్ జాన్ ఇంగ్లీషురాజు మాగ్నాకార్టా జారీచేయుట.

1216 హెన్రీ III. ఆంగ్లేయరాజు, మొదటి పార్లమెంటును సమావేశ పరచెను.

1259 }
1292 } మంగోల్ చక్రవర్తి కుబ్లైఖాన్ చైనాలో పాలించుట.

1398 తైమూరు హిందూ దేశమునకు దండెత్తి వచ్చుట.

1450 }
1455 } గుట్టెన్‌బర్గ్ జర్మనీలో ప్రపంచములో మొదటి పుస్తకము అచ్చు వేసెను.

1431 ఆంగ్లేయులు రీమ్స్ నగరమున ఫ్రెంచి నాయకురాలగు దేవీజోన్‌ను కాల్చుట.

1453 కాన్‌స్టాన్‌టినోపుల్ తురుష్కులు పట్టుకొనుట.

1476 కాక్స్‌టన్ ఇంగ్లండునకు అచ్చు యంత్రమును తెచ్చుట.

1517 జర్మనీలో నూత్న శకారంభము—మార్టిన్ లూథరును బహిష్కరించుట.

---

*కాంగ్రెసు మంత్రిత్వకాలమున ప్ర. మంత్రి వేతనము నెలకు రు. 500 మాత్రమే.

1564 షేక్స్పియర్ మహాకవి పుట్టుట.
1600 బ్రిటిష్ తూర్పు ఇండియా వర్తక సంఘ స్థాపన.
1609 ఈస్టిండియా కంపెనీ రాయబారము ఇంగ్లండు నుండి ఇండియాకు వచ్చుట.
1616 షేక్స్పియర్ మృతి.
1632 }
1653 } తాజ్ మహల్ నిర్మాణము.
1649 ఛార్లెస్ స్టూఅర్టు రాజును ఆంగ్లేయులు తలగొట్టి చంపుట.
1775 అమెరికా స్వాతంత్ర్య యుద్ధారంభము.
1776 అమెరికా స్వాతంత్ర్య ప్రకటనము.
1779 నెపోలియన్ ఫ్రాన్సులో కాన్సలగుట.
1789 ఫ్రెంచి విప్లవ ప్రారంభము.
1792 ఫ్రాన్సు రిపబ్లిక్ అగుట.
1840 ఇంగ్లాండులో పెన్నీ పోస్టును ప్రవేశపెట్టుట.
1859 ఇంగ్లాండు ఇండియాలను తంతిద్వారా కలుపుట.
1869 సూయజ్ కాలువ తెరచుట.
1870 ఫ్రెంచి-రష్యా యుద్ధము
1881 జర్మనీ సామ్రాజ్య పునః ప్రతిష్ఠ.
1899 బోయర్ యుద్ధముల ప్రారంభము - గాంధీ మహాత్ముడు ఆంగ్లేయులకు తోడ్పడుట.
1900 చైనాలో బాక్సరు తిరుగబాటు.
1904 రష్యా-జపాన్ యుద్ధారంభము.
1912 చైనా రిపబ్లిక్ అగుట.
1914 మొదటి ప్రపంచయుద్ధము ప్రారంభము.
1917 అమెరికా జర్మనీలు విడిపడుట. రష్యా బోల్షివిక్ రిపబ్లికయ్యెను.
1918 విల్సన్ మహోపన్యాసము- ప్రపంచ సంగ్రామ సమాప్తి.
1919 వార్సలీస్ సంధి.
1920 నానా రాజ్యసమితి స్థాపన.
1921 ఇటలీలో ఫాసిస్టు ఉద్యమము.
1924 ఇంగ్లండులో మొదటి లేబరు ప్రభుత్వము.
1928 సోవియట్ యూనియన్ వ్యవసాయిక, పారిశ్రామికాభివృద్ధికై పంచవర్ష ప్రణాళికను ప్రవేశపెట్టుట.
1929 ఆఫ్ఘనిస్థానమున తిరుగుబాట్లు.
1930 నాజీపక్ష విజృంభణము-జర్మన్ రీచ్ స్టాగులో హిట్లర్ అధికార ప్రారంభము.
1934 అమెరికా సంయుక్తరాష్ట్రములు ఫిలిప్పైన్ దీవులకు స్వాతంత్ర్యమిచ్చుట.
1935 ఇటలీ అబిసీనియా యుద్ధము.
1936 స్పెయిన్ అంతర్యుద్ధము-ఎడ్వర్డు VIII ఇంగ్లాండు సింహాసనమును త్యజించుట.
1937 చైనా-జపాను యుద్ధారంభము.
1938 జర్మన్ ఆస్ట్రియా ఆక్రమణ.
1939 ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామ ప్రకటన (సెప్టెంబరు 3).
1940 నార్వే, డెన్మార్కు, హాలెండ్, బెల్జియమ్, లక్సమ్బర్గులను జర్మనీ జయించుట- ఫ్రాన్సు పతనము.
1941 జర్మనీ-రష్యా యుద్ధము.
1942 జపాను జర్మనీతో కలిసి యుద్ధమునకు దిగుట.

## హిందూదేశ చరిత్రలోని కొన్ని ప్రముఖ ఘట్టములు.

క్రీ. పూ.
4000-3500 మొహెంజొదారో నాగరికత విలసిల్లినది.
2500-2000 ఆర్యులు హిందూదేశమునకు వచ్చుట.
1500-1200 ఋగ్వేదయుగము.
700-330 బాబిలోనియాలో హిందువులు వర్తకము చేయుట.
650-325 మగధ సామ్రాజ్య వికాసము.
642 శిశునాగులు.
560 గౌతమ బుద్ధుని జననము.
527 మహావీర వర్ధమానుని మరణము.
522-486 డెరయస్ పాలన. భారతదేశములో నొక రాజ్యమును మొదట పాలించిన విదేశీయుడు.
487 బుద్ధుని నిర్యాణము.
400-300 పురాణాలకు సంబంధించిన చారిత్రక ఘట్టములు.
326 అలెగ్జాండరు సింధునదిని దాటెను. తక్షశిలా విశ్వ విద్యాలయము.

325 గోరక్‌పూర్‌లో మొదట దొరికిన సోరా రాతి శాసనము.

325-184 మౌర్యుల పాలన-చాణక్యుని అర్థశాస్త్రము.

323 (సు) మెగస్తనీసు మన దేశమునకు వచ్చుట.

322 మౌర్యవంశపు ప్రథమ చక్రవర్తి చంద్రగుప్తుడు.

270 అశోకుడు సామ్రాజ్యాధిపత్యము వహించుట.

261 కళింగ యుద్ధము.

150-140 పతంజలి వ్యాకరణ రచనచేసి యుండును.

క్రీ. త.

28-225 కుషాణ్ పాలన.

120 (సు) కనిష్క పాలన.

319-20 గుప్తసామ్రాజ్య ప్రారంభము.

330-374 సముద్రగుప్తుని పరిపాలన.

375-415 రెండవ చంద్రగుప్తుడు.

405-11 ఫాహియాన్ హిందూదేశములో నున్న కాలము.

587 వరాహమిహిరుని మరణము.

606 హర్షవర్ధనుని పరిపాలన-హ్యూన్‌త్సాంగు అనే చైనా యాత్రికుడు ఇండియాకు వచ్చుట.

620 బాణుని హర్ష చరిత్రము.

700-1000 రాజపుత్ర రాజ్యములు వర్ధిల్లినవి.

712 సింధు రాష్ట్రమున అరబ్బుల వాసము.

600 అజంతా చిత్ర నిర్మాణము.

675-85 "ఇత్సింగ్" అనే చైనా సంస్కృత విద్వాంసుడు, నలందాలో ఆచార్యుడుగా నుండుట.

730-740 వంగరాష్ట్రమున పాలవంశజుల పరిపాలన.

743-789 టిబెట్టులో బౌద్ధమత వ్యాపకము.

760 ఎల్లోరాగుహల నిర్మాణము.

1001 జయపాలుడు మహమ్మద్ గజ్నీతో ఓడిపోయి ఆత్మహత్య చేసుకొనెను.

1030 ఆల్ బెరూనీ హిందూదేశమునుగూర్చి గ్రంథము వ్రాసెను.

1191 స్థానేశ్వరయుద్ధమున పృథ్వీరాజు మహమ్మదీయుల నోడించుట.

1193 ఢిల్లీ పతనము.

1200-1526 ఢిల్లీ సుల్తానులపాలన.

1266-1290 బానిస వంశజులు.

1290-1320 ఖిల్జీల ప్రభుత్వము.

1292 మార్కో-పోలో అనే వెన్నిస్ వర్తకుడు ఇండియాకు వచ్చుట.

1320-1413 తుఘ్‌లక్ పరిపాలన.

1336 విజయనగర సామ్రాజ్యాంకురార్పణ.

1413-51 సయ్యద్ వంశజుల పాలన.

1498 వాస్కో-డిగామా ఇండియాకు వచ్చుట.

1510 పోర్చుగీసువారు గోవాను పట్టుకొనుట.

1525 పానిపట్ యుద్ధము. (బాబర్).

1526 మొగలాయి ప్రభుత్వము ఆరంభము.

1526-1818 హిందూదేశమున మొగలాయి ప్రభుత్వము.

1532-63 తులసీదాసు.

1540-1555 షేర్షా, సూర్ వంశము-వారిపాలన.

1556-1605 అక్బరు పరిపాలన.

1605-27 జహాంగీరు ,,

1608 కెప్టెన్ హాకిన్సు సూరత్‌కు వచ్చుట.

1608-49 తుకారామ్.

1615 సర్ థామస్ రో మొదటిజేమ్సు రాయిబారిగా జహాంగీరు ఆస్థానమునకు వచ్చెను.

1627 శివాజీ పుట్టుక.

1627-58 షాజహాన్.

1632-53 తాజ్‌మహాల్ నిర్మాణము.

1640 మద్రాసులో ఫోర్టుసెంటుజార్జి కోట కట్టుట.

1651 బెంగాలులో ఆంగ్లేయ కర్మాగారములు నిర్మించబడినవి.

1658-1707 ఔరంగజేబ్ పరిపాలన.

1707-1818 మహమ్మదీయ సామ్రాజ్య విచ్ఛిత్తి. బ్రిటిష్ పరిపాలన అంకురార్పణ.

1712 బహదూర్ షా మృతి.

1720-48 మహమ్మద్ షా.

1736 నాదర్షా దండయాత్ర.

1746 మొదటి కర్నాటక యుద్ధము.

1748-61 ఆంగ్లేయులకు, ఫరాసువారికి అధికారమునకై ఇండియాలో పోరాటములు.

1757 బెంగాలు ఆక్రమణము-ప్లాసీయుద్ధము.

1773 రెగ్యులేటింగు చట్టము.

1774 వారన్ హేస్టింగ్స్, ఇండియా మొదటి గవర్నరు జనరలు.

1774-1833 రాజారామమోహనరాయలు—ఆయన కృషి.

1774 రోహిల్లా యుద్ధము.

1775-82 మొదటి మహారాష్ట్ర యుద్ధము.

1776 పురంధర్ సంధి.

1778 వాడ్గాన్ నిర్ణయము.

1780-84 రెండవ మైసూరు యుద్ధము.

1781 1781 చట్టము. కలకత్తా, మద్రాసుల ప్రాధాన్యము.

1782 సాల్బాయి సంధి-హైదరు మరణము.

1784 మాంగళూరు సంధి. పిట్సు ఇండియా చట్టము.

1786 1786 చట్టము.

1790-92 మూడవ మైసూరు యుద్ధము.

1790 టిప్పుసుల్తాను తిరువాంకూరు ముట్టడి.

1791 బెనారసు సంస్కృత కళాశాల స్థాపన.

1792 శ్రీరంగపట్నం సంధి.

1793 బెంగాలులో పర్మనెంటు సెటిల్ మెంటు ప్రవేశము.

1795 మహారాష్ట్రులచే హైదరాబాదు ముట్టడింపబడుట.

1799 నాల్గవ మైసూరు యుద్ధము.

1800 నానాఫర్నవిస్ మరణము. వెల్లస్లీ ఫోర్టు విలియమ్ కాలేజీ నెలకొల్పుట.

1800-5 రెండవ మహారాష్ట్రయుద్ధము.

1801 నైజామును సబ్-సిడియరీ పద్ధతి కొప్పించుట.

1802 ఇంగ్లీషువారికి, బాజీరావునకు బెస్సిన్ సంధి జరుగుట.

1803 బాన్స్లా ఓడింపబడుట.

1809 సిక్కులతో సంధి.

1811 ఫ్రెంచివారిని డచ్చి దీవులలో ముట్టడించుట.

1813 కంపెనీ ఛార్టరు ఆక్టు చేయబడినది.

1814-16 గూర్ఖా యుద్ధములు.

1816-19 చివరి మహారాష్ట్ర యుద్ధము.

1818 మహారాష్ట్రులు ఆంగ్లేయులచే ఓడింపబడిరి.

1823-26 మొదటి బర్మాయుద్ధము.

1828 రాజా రామమోహనరాయలు బ్రహ్మసమాజమును స్థాపించెను.

1832 సతీ సహగమనపద్ధతిపై నిషేధము.

1837 ఇండియాలో మొదటి రైలుమార్గము వచ్చుట.

1837-41 మొదటి ఆఫ్ఘన్ యుద్ధము.

1839 రంజిత్ సింగ్ మరణము.

1843 సింధు ఆక్రమణ. ఇండియాలో బానిస వ్యాపార నిర్మూలము.

1845-48 మొదటి సిక్కు యుద్ధము.

1844 ప్రభుత్వోద్యోగులకు ఇంగ్లీషు అవసరమని శాసింపబడుట.

1848 లాహోరు సంధి.

1849 పంజాబు ఆక్రమణము. రెండవ సిక్కు యుద్ధము.

1852 రెండవ బర్మా యుద్ధము.

1854 విద్యా విషయిక సంస్కరణలు.

1857 సిపాయిల తిరుగబాటు. — బొంబాయి, మద్రాసు విశ్వవిద్యాలయములు నెలకొల్పుట.

1858 తూర్పు ఇండియా వర్తక సంఘమును రద్దుపరచి ఇంగ్లీషు ప్రభుత్వమువారు హిందూదేశపాలనాధికారము వహించుట.—విక్టోరియారాణి ప్రకటన.

1859 ఇండియా ఇంగ్లండులకు తంతి సౌకర్యములు.

1861 ఇండియా ప్రభుత్వ చట్టము.—కరెన్సీ నోట్లు వచ్చుట. సీమలుకోడు, హైకోర్టులు ఏర్పరుచుట.

1864-73 వాహాబీ సంచలనము.

1866 కేశవ్ చంద్రసేన్ బ్రహ్మసమాజమును నవీనముగా మార్చుట.

1868 మైసూరు రాజు మరణము.

1869 సూయజ్ కాలువ తెరచుట.

1870 ఎర్ర సముద్రము గుండా కేబిల్ గ్రాములు వెడలుట. ఆర్థిక సంక్షోభము.

1872 మొదట జనాభా లెక్కలను ప్రకటించుట.

1875 స్వామి దయానందు ఆర్యసమాజమును స్థాపించెను.—ఆలీఘర్ కళాశాల స్థాపన.

1877 విక్టోరియారాణి, హిందూదేశమునకు రాణియగుట. క్వెట్టా ఆక్రమణ.

1882-83 విశ్వవిద్యాలయాల సమాఖ్య.
1883 క్షామ నివారణ సంఘము.
1885 అఖిలభారత కాంగ్రెస్ సంఘసంస్థాపనము.
1886 సరిహద్దు నిర్ణాయకసంఘము. మూడవ బర్మా యుద్ధము.
1891 మణిపుర తిరుగుబాటు.
1893 స్వామి వివేకానందుడు అమెరికాలో మతోపన్యాసము చేయుట.—సైనికులలో హైందవుల ప్రవేశార్హత గుర్తింపబడుట.
1902-4 విశ్వ విద్యాలయ సమాఖ్య.
1906 ముస్లిం లీగ్, కలకత్తా కాంగ్రెసు స్వరాజ్య తీర్మానము.
1907 సూరత్ కాంగ్రెసు దెబ్బలాటలు.
1909 మింటో-మార్లీ సంస్కరణలు.
1910 ముద్రణ నిబంధనలు.
1911 హిందూదేశమునకు జార్జి చక్రవర్తి, రాణిగారు వచ్చుట.
1912 శాశ్వతమైన ఆర్థిక విధానములు ఏర్పరచుట.
1913 రవీంద్ర కవీంద్రుడు "నోబిల్" బహుమతి నందుట.
1914 "ఫారెస్టురీసర్చి ఇన్‌స్టిట్యూట్" తెరచుట. బొంబాయిలో ప్రాథమిక విద్యానిర్బంధ చట్టము.
1915 ఇండియా సంరక్షణ చట్టము ఆమోదింపబడి, స్వపరిపాలన సంస్థలు ఏర్పడుట.
1916 హోమ్‌రూల్ ఆందోళన.
1917 మాంటేగ్యు ఇండియాకు వచ్చుట.
1918 అఖిల భారత హిందూ మహాసభ ప్రథమ సమావేశము ఢిల్లీలో జరుగుట.
1918 మాంటేగ్యు చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు రౌలట్ కమిటీ రిపోర్టు.
1919 రౌలట్ చట్టము. జలియన్ వాలాబాగ్ దుర్ఘటన దురంతములు.
1920 గాంధీగారి అసహాయోద్యమ ప్రారంభము. క్రొత్త శాసన సభలకు ఎన్నికలు.
1921 కెన్నాట్ ప్రభువు క్రొత్త శాసనసభలను ప్రారంభించుట. మాప్లా విప్లవము.
1922 కార్మిక చట్టములు. చౌరీచౌరా దురంతములు గురుకాబాగ్ హత్య. గాంధీ అరెస్టు.
1923 స్వరాజ్యపార్టీవారు శాసనసభలకు ఎన్నుకోబడిరి.
1924 వంగాలు ఆర్డినెన్సులు.
1925 చిత్తరంజనదాసు మరణము.
1926 వ్యవసాయక సంబంధమైన "రాయల్ కమిషన్" నియుక్తమగుట. కలకత్తాలో హిందూ ముస్లిం అంతః కలహము.
1927 రూపాయి మారకము 1 షి. 6 పె. లకని నిర్ణయించిరి. ఇండియన్ బ్రాడ్ కాస్టింగ్ కంపెనీ ప్రారంభము.
1928 సకల రాజకీయ కక్ష్యల సమావేశము.
1929 లాహోరు కాంగ్రెసు స్వాతంత్ర్య ప్రమాణము చేసెను.
1930 "సివిల్ డిస్ ఒబీడియన్సు" ఉద్యమము. మొదటి రౌండ్ టేబిల్ సమావేశము లండన్‌లో జరిగినది.
1931 గాంధీ ఇర్విన్ ఒడంబడిక. రెండవ రౌండ్ టేబిల్ సమావేశము.
1932 మూడవ రౌండ్ టేబిల్ సమావేశము.
1933 "శ్వేత పత్రముల" ప్రకటనము.
1934 నిరుద్యోగ నివారణ సంఘము నియుక్తమగుట. రాయల్ ఇండియన్ నేవీ ప్రారంభము.
1935 ఇండియా ప్రభుత్వ చట్టము.
1936 బర్మా ఇండియానుండి ప్రత్యేకించబడి, రాష్ట్రమగుట.
1937 రాష్ట్ర స్వపరిపాలన. సప్తరాష్ట్రములలో కాంగ్రెసు అధికారము వహించుట.
1939 ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామ ప్రకటన. కాంగ్రెసువారు యుద్ధ తీర్మానము చేయుట. కాంగ్రెసు మంత్రుల రాజీనామా. సుభాస్ బోసు ఫార్వార్డు బ్లాకు నేర్పరచుట.
1940 "కాంగ్రెసు సివిల్ డిస్ఒబీడియన్సు మూవ్‌మెంటు" యుద్ధవ్యతిరేక ప్రచారము చేయుట.

1941 కాంగ్రెసు మంత్రులు, కార్యదర్శులు, శాసన సభ్యులు జైళ్లకు వెళ్లుట.
విడుదల.
సుభాసుచంద్రబోసు తప్పిపోవుట.
1942 బార్డోలీ-వార్ధా తీర్మానము.
ఇంగ్లండునుండి బ్రిటిష్ కాబినెట్ తరపున రాయబారిగా సర్ స్టాఫర్డ్ క్రిప్సు దేశ నాయకులతో సంప్రతించుట.
చీనాదేశ అధ్యక్షుడు చాన్‌షియాక్ హిందూ దేశమునకు వచ్చుట.

## ఆంధ్ర దేశము

### ప్రధాన చారిత్రిక ఘట్టములు

261 అశోకుడు కళింగదేశమును జయించుట.
230-220 ఆంధ్రరాజులు స్వతంత్రులయిరి అందు మొదటి రాజు శాతవాహన సిముఖుడు.
160 ఖారవేలుడు కళింగ రాజుగానుండెను.
78 ఆంధ్ర శాలివాహన శకప్రారంభము.
107-128 గౌతమీ పుత్ర శాతకర్ణి.
128-156 వాసిష్ఠీ పుత్ర పులమాయి (2)
166-195 యజ్ఞ శ్రీ శాతకర్ణి.
195-225 శివశ్రీ.
225 ఆంధ్ర శాతవాహన రాజ్యము అంతరించుట.
225-250 శ్రీ పర్వతవంశపు ఆంధ్రరాజుల పరిపాలనము.
340 సముద్రగుప్తుని దక్షిణదేశ దండయాత్ర.
340-360 మొదటి విష్ణుకుండిన రాజు శ్రీశైలమందు రాజ్యమేలుట.
కళింగ రాజ్యాధిపతి శక్తివర్మ మహారాజు పిష్ఠపురమున రాజ్యమేలుట.
399-414 ఫాహియాను ఇండియాలో సంచరించుట.
460 వేంగిలో విష్ణుకుండినుల పరిపాలనము ప్రారంభించుట.
500 కళింగ దేశమందు మొదటి గాంగవంశ రాజుల పరిపాలనము ప్రారంభించుట.
615 ఆంధ్ర చాళుక్య రాజ్యము కుబ్జవిష్ణు వర్ధనునితో ప్రారంభమగుట.
630-644 హ్యూన్‌త్సాంగ్ ఇండియాలో సంచరించుట.
668-795 ఈత్సింగ్ సంచారము.
720 మొదటి కామార్ణవునితో రెండవ గంగవంశము కళింగ దేశమందేర్పడుట.
945 ఆంధ్ర చాళుక్య రాజులు వేంగివిడిచి రాజమహేంద్రవరమును రాజధాని నగరముగా చేసికొనుట.
1023-1060 రాజరాజనరేంద్రుని ఆస్థానమందు నన్నయభట్టు ఆంధ్రమహాభారతమును రచించుట.
1050 శ్రీశైలమందు పండిత మల్లికార్జునుని జననము.
1078-1140 రెండవ గంగవంశపు రాజులలో ఎక్కువ ఘనత చెందిన అనంతవర్మచోడగంగదేవుని పరిపాలనము.
1130 అనంతవర్మచోడగంగదేవుడు కటకమును జయించుట.
1199 కాకతీయగణపతి రాజగుట.
1250 గణపతి చక్రవర్తి కాంచీపురము జయించుట.
1260 తిక్కనసోమయాజి, గోపరాజురామప్రధాని వెలయుట.
1292 రుద్రమదేవి; ఇటలీ యాత్రికుడు మార్కోపోలో ఇండియాకు వచ్చుట.
1323 రెండవ ప్రతాపరుద్రుని ఔన్నత్య ప్రారంభము.
1328 తుగ్లక్ వరంగలు ముట్టడించుట.
1328-1424 కొండవీటి రెడ్డికాలము.
1336 విజయనగర రాజ్య స్థాపనము.
1396-1430 శ్రీనాథుని ప్రాభవకాలము.
1509-1530 శ్రీకృష్ణదేవరాయల పరిపాలనము.
1512 కతుబ్-ఉల్-ముల్క్ గోల్కొండనవాబగుట.
1549 తంజవూరిలో ఆంధ్ర రాజ్యమేర్పడుట.
1559 మధురలో ఆంధ్ర రాజ్యము స్వతంత్రత పొందుట.
1565 తల్లికోట యుద్ధము; విజయనగర సామ్రాజ్యము నశించుట.
1569 ఆరవీటిలో తిరుమలరాయలు సదాశివరాయలను చంపిరాజగుట.
1570 మధుర ఆంధ్రరాజు సింహళమును జయించుట.
1579 కృష్ణజిల్లా మహమ్మదీయులు జయించుట.

1639 చంద్రగిరిరాజు రంగరాయలు ఇంగ్లీషు కంపెనీ వారికి చెన్నపురములో కోటకట్టుకొనుటకు అనుజ్ఞ ఇచ్చుట.

1674 ఆంధ్రరాజ్యమైయుండిన తంజావూరు మహారాష్ట్రులకు వశమగుట.

1739 మధురలో ఆంధ్ర రాజ్యమంతరించుట.

1757 బొబ్బిలి యుద్ధము.

కర్నల్ ఫోర్డు మచిలీపట్టణమును పట్టుకొనుట.

1764 సంగీత సమ్రాట్టు త్యాగరాజుగారి జననము.

1766 గంజాం, విశాఖపట్టణము, గోదావరి జిల్లాలను నైజాము ఆంగ్లేయులకిచ్చుట.

1768 ఇంగ్లీషువారు కృష్ణ జిల్లాను ఆక్రమించుకొనుట.

1770-1778 గంజాం, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణ జిల్లా లేర్పడుట.

1778 గుంటూరు జిల్లాలో ఇంగ్లీషువారు ప్రవేశించుట.

1794 పద్మనాభ యుద్ధము.

1800 కడప, కర్నూలు, అనంతపురము, బళ్లారి జిల్లాలను నైజాము ఇంగ్లీషువారికి ఇచ్చివేయుట.

1801 పైనిచెప్పిన జిల్లాలేర్పడుట.

## కొన్ని ముఖ్య ఘట్టములు.

1806 తెలుగు అచ్చు అక్షరములు తయారు చేయబడినవి.

1827 తెలుగు లిపితో అచ్చయిన ప్రథమ గ్రంథము శబ్దమంజరి.

1829 బందరు ఉప్పెన.

1834 ఆంధ్ర గ్రంథములు విరివిగా అచ్చుపడుట.

1835 ఆంధ్ర నిఘంటువు ముద్రణము.

1839 "ఏనుగుల వీరాస్వామిగారి కాశీయాత్ర" ముద్రణము.

1846 సంగీత సమ్రాట్టు త్యాగయ్యగారు పరమపదించిరి.

1848 వీరేశలింగం పంతులుగారి జననము.

1860 చిన్నయసూరి నీతిచంద్రిక, బాలవ్యాకరణముల ముద్రణము.

1862 సర్. ఆర్. వెంకటరత్నం నాయుడుగారు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగార్ల జననము.

1886 విశాఖపట్నం సరస్వతీనిలయం, మొదటిగ్రంథాలయము స్థాపించబడినది.

ప్రథమ కాంగ్రెస్ సమావేశమునకు అనంతపురమునుండి, పి. కేశవపిళ్లెగారు సభ్యులుగా వెళ్లిరి.

1887 వీరేశలింగం పంతులుగారి ఆంధ్ర కవుల చరిత్ర వ్రాయబడినది.

1893 శబ్దార్థచంద్రికను మహాకాళి సుబ్బారావుగారు ముద్రింపించిరి. మొదటి రైలు మార్గము వేయుట.

1898 హిందూదేశసాంఘికమహాసభ కందుకూరి వీరేశలింగం పంతులుగారి అధ్యక్షత క్రింద జరిగినది.

1900 సాహితీసంఘము గుంటూరులో స్థాపించబడినది.

1902 కాకినాడలో చెన్నరాజధాని దేశీయ సాంఘిక మహాసభ జరిగెను. గుంటూరు జిల్లాలో ప్రథమ వితంతువివాహము జరిగినది.

1903 కృష్ణానదీ వరదలు.

1904 వీరేశలింగం పుస్తక భాండాగార స్థాపనము.

1907 ఆంధ్రదేశమునకు బిపిన్‌చంద్రపాలు రాక.

1908 ఆంధ్రవారపత్రికను కాశీనాథుని నాగేశ్వరరావుగారు బొంబాయిలో స్థాపించుట.—వీరేశలింగంగారి షష్ఠి పూర్తి మహోత్సవము జరుగుట.

1911 బెజవాడ రామమోహన గ్రంథాలయ స్థాపనము ఆంధ్రదేశగంధ్రాలయోద్యమాంకురార్పణ.

1912 నిడదవోలులో కృష్ణాజిల్లా సభలలో ఆంధ్ర రాష్ట్ర సమస్య బహిరంగముగా చర్చించుట.

1913 మొదటి ఆంధ్రమహాసభ బాపట్లలో జరిగినది.

1914 ఆంధ్రపత్రిక దినపత్రికగా మద్రాసునుండి ప్రకటితమయ్యెను.—ఆంధ్ర గ్రంథాలయ సంఘస్థాపన.

1917 ఽ సెంటు అధ్యక్షతను కలకత్తా కాంగ్రెసు జరిగినప్పుడు, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘ నిర్మాణము గావించబడుట.—

భాషా ప్రయుక్తరాష్ట్ర విభజన సిద్ధాంతమును కాంగ్రెస్ అంగీకరించుట.

1918 బి. యన్. శర్మగారు కేంద్ర శాసన సభలో భాషా ప్రయుక్తరాష్ట్ర విభజనము ప్రభుత్వము అంగీకరించునట్లు చేయుట. ఆంధ్రరాష్ట్రఆయుర్వేదసమ్మేళనము.

1919 వీరేశలింగంగారి నిర్యాణము.

1922 స్వరాజ్య పత్రిక స్థాపన.

1923 ఆంధ్రదేశములో మొదట కాకినాడలో కాంగ్రెస్ సమావేశము జరిగినది.

1926 ఆంధ్ర విశ్వ విద్యాలయ స్థాపనము.

1927 శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవిగారి స్మృతి. ఆంధ్ర నాట్య కళాపరిషత్తు స్థాపనము.

1931 ఆంధ్ర దేశమున మొదటి తెనుగు శబ్ద చిత్రము తయారు చేయబడినది.

1933 తెలుగులో రెండవదినపత్రిక జనవాణి స్థాపన. రావుసాహెబ్ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవము నవ్యసాహిత్య పరిషత్తువారు రాజమహేంద్రవరములో జరుపుట.

1937 మద్రాసు రాష్ట్రమున కాంగ్రెస్ ప్రభుత్వము అధికారము వహించుట.

1938 శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు లోకారాధ్యులైరి.

1939 కాంగ్రెసు మంత్రివర్గములు రాజీనామా లిచ్చుట.

1940 కళాప్రపూర్ణ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి నిర్యాణము.

1941 విశాఖపట్నమున నౌకా నిర్మాణ కేంద్రమునకు, బాబూ రాజేంద్ర ప్రసాదుగారు శంకు స్థాపన జరుపుట—విశాఖపట్నమున ఆంధ్ర మహాసభ జరుగుట—చెన్నపురి ఆంధ్రమహాసభ రజతోత్సవము—కాంగ్రెస్ నాయకులను విడుదల చేయుట—16 వ అఖిల భారత మహిళా సమావేశము కాకినాడలో జరుగుట—నాట్యకళా పరిషత్సమావేశము చెన్నపురిలో జరగుట.

1942 కాకినాడ, విశాఖపట్టణమువద్ద జపానువారు బాంబులు వేయుట. పెద్దపాలెములో ఆంధ్రగ్రంథాలయము 23వ వార్షిక సభ. ఆంధ్ర సర్వస్వ ప్రకటనము.

## ఆంధ్ర దేశము

**విద్య-విద్యాలయములు.**

1857 విజయనగరం మహారాజావారి సంస్కృత కళాశాల, సంగీత పాఠశాలల సంస్థాపన.

1859 ఎంజినీరింగు కళాశాల, గిండీ.

1873 రాజమహేంద్రవరము కళాశాల సంస్థాపన.

1875 నెల్లూరు వేంకటగిరి రాజాగారు కళాశాల గట్టించిరి.

1877 విజయనగరము మహారాజావారి కళాశాల స్థాపన.

1878 మిస్. ఎ. వి. యన్. కళాశాలను విశాఖపట్నమున స్థాపించిరి.

1884 పిఠాపురం రాజాగారి కళాశాల, కాకినాడ—తిరుపతి వెంకటేశ్వర విద్యాలయము.

1885 ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరు.

1894 రాజమహేంద్రవరము ట్రెయినింగు కాలేజి. —మద్రాసు లా కాలేజి స్థాపన.

1895 పర్లాకిమిడి రాజావారి కాలేజీ స్థాపనము.

1901 మద్రాసులో ఆయుర్వేద కళాశాల గోపాలాచార్యుల వారు స్థాపించిరి.

1902 విశాఖపట్నం వైద్యపాఠశాల—అగ్రికల్చరల్ కాలేజి, కోయంబత్తూరు.

1908 బందరు జాతీయ కళాశాల స్థాపన.

1912 ఆంధ్ర గీర్వాణ విద్యాలయము కొవ్వూరులో స్థాపితము.

1916 అనంతపురం సెకండరీ గ్రేడ్ కాలేజి.

1927 మద్రాసు ఆయుర్వేద కళాశాల.

1926 ఆంధ్రవిశ్వవిద్యాలయ మేర్పడుట—వాల్తేరు కళాశాల—సైన్సు కాలేజి—మెడికల్ కాలేజి.

1937 శ్రీ రాజా రంగయ్యప్పరాయ కళాశాల, బెజవాడ.

## ఆంధ్ర దేశము.

### ఆర్థిక పరిస్థితులు

1802 పెర్మనెంటు సెటిల్ మెంటు, పట్టా రెగ్యులేషన్ చట్టము.
1852 గోదావరి ఆనకట్ట కట్టబడినది.
1855 కృష్ణా, ఆనకట్ట కట్టిరి.
1860 పెన్నా నీటి పారుదల విధానము నేర్పరచిరి.
1864 మచిలీపట్నపు గాలివాన.
1865 ల్యాండ్ రికవరీ ఆక్టు.
1870 కడప, కర్నూలు కాలువ త్రవ్వుట.
1877 బకింగుహామ్ కాలువ త్రవ్విరి.
1896 }
1897 } ఆంధ్రదేశమున పలు ప్రాంతముల కరువులు వచ్చెను.
1900 కేసరీకుటీరం మద్రాసులో స్థాపన—గుంటూరు జిల్లాలోని నర్సరావుపేట, వినుకొండ తాలూకాలు, తాడిపత్రి, కదిరి తాలూకాలు; అదోని తాలూకా, కంభం, మార్కాపురం, నంద్యాల, కోయిలకుంట్ల, పత్తికొండ, బద్వేలు, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, పులివెందల, కనిగిరి, ఉదయగిరి, దర్శి, పొదిలెలలో కరువు వచ్చుట.
1901 బద్వేలు, రాయచోటి, జమ్మలమడుగు, పులివెందల ప్రొద్దుటూరు, గుత్తి, తాడిపత్రి చిత్తూరు, చంద్రగిరి, మదనపల్లి, వాయల్పాడు, తాలూకాలలో క్షామము.
1908 ఎస్టేటులు ల్యాండు ఆక్టు అమలునకు వచ్చుట.
1910 ఆంధ్రా ఎస్యురెన్సు కంపెనీ స్థాపన.
1819 శ్రీ కృష్ణా ఆయుర్వేద ఫార్మసీ, ఏలూరు.
1919 లక్ష్మీ అండ్ కో వారు కుష్టరోగ ఔషధాలయము విశాఖపట్నమున నెలకొల్పుట. నందిగామ తాలూకా మునగాల పరగణాలలో క్షామము.
1921 మోపేడ్ నీటికట్ట గట్టిరి.
1922 ఆదోని, ఆలూరు, సిరిగుప్పం, బళ్లారి తాలూకాలు; గుత్తి, పత్తికొండ, దొనకొండ, నాడి కొట్టూరులలో కరువులు.
1923 ఆంధ్రా బ్యాంకు సంస్థాపన.
1924 బళ్లారి అనంతపురం జిల్లాలలో మరల కరువులు.
1925 ఆంధ్రా ఇనుస్సురెన్సు కంపెని స్థాపించబడినది.
1927 ఆంధ్రా సైన్టిఫిక్ కంపెనీ స్థాపించబడుట. —నెల్లూరి జిల్లాలలో గాలివాన.
మోతే నారాయణ రావుగారి ఆంధ్రా గ్యారంటి ఫిల్ము కంపెనీ మద్రాసులో స్థాపన.
1929 పోలవరం ప్రాజెక్టు వచ్చినది.
1931 బళ్లారి, ఆలూరు తాలూకాలలో మరల కరువులు.
1934 }
1935 } బళ్లారి, అనంతపురం జిల్లాలలో కరువులు. పులిగడ్డ ఆనకట్ట, తూర్పు కాలువ త్రవ్వుట.
1936 గుంటూరు జిల్లా, నెల్లూరు జిల్లాలలో పెద్ద గాలివాన.
1937 }
1938 } అనంతపురం కర్నూలు జిల్లాలలో కరువులు వచ్చెను.—కాంగ్రెస్ మంత్రి వర్గము వారు ఋణవిమోచన చట్టము పెట్టుట. త్రాగుడు నిషేధము సేలములో ప్రారంభించి తెలుగు జిల్లాలలో ప్రవేశపెట్టుట—ప్రకాశం కమిటీ రిపోర్టు జమీన్‌దారీ రైతు సమస్యా పరిష్కారము—ఆంధ్రా ఫార్మసిటికల్ వర్కు్సు స్థాపించుట (బందరు).

## మానవాభివృద్ధికి దోహదములైన నవయుగ నిర్మాణములు-పరిశోధనలు.

| శాస్త్రజ్ఞుని పేరు. | దేశము. | పరిశోధించిన విషయము. | కాలము. |
|---|---|---|---|
| ఫుల్టన్ | అమెరికా | మొదటి స్టీమరు కనిపెట్టెను | 1807 |
| కోల్టు | ,, | రివాల్వరు | 1837 |
| మోర్సు | ,, | విద్యుత్తంతి | 1835 |
| బెల్ | ,, | టెలిఫోను | 1876 |
| ఎడిసన్ | ,, | ఫోనోగ్రాఫ్ | 1876 |
| ఎడిసన్ | ,, | ఇన్కాండిసెన్ట్ల్యాంపు | 1878 |
| ఎడిసన్ | ,, | మోషన్ పిక్చరు యంత్రము | 1893 |
| రైటు సోదరులు | ,, | విమానము | 1903 |
| హాన్టు | ,, | సేఫ్టీ పిన్ను | 1849 |
| వెస్టింగ్హౌస్ | ,, | ఎయిర్ బ్రేక్ | 1869 |
| హియట్ | ,, | సెల్యులాయిడ్ | 1870 |
| వాట్ | ఇంగ్లండు | ఆవిరి యంత్రము | 1765 |
| తిమ్మోనియన్ | ఫ్రాన్సు | కుట్టు యంత్రము | 1830 |
| డాగ్యుఎర్, నీఎప్ జె | ఫ్రాన్సు | ఫోటోగ్రఫీ | 1837 |
| నోబెల్ | స్వీడన్ | డైనమైటు | 1867 |
| మార్కొనీ | ఇటలీ | వైర్లెస్ | 1895 |
| రోయన్ట్జెన్ | జర్మనీ | X' రే యంత్రము | 1895 |
| ఈస్టమన్ | అమెరికా | ఫోటో ఫిల్ము | 1883 |
| ఒక చైనావాసి | చైనా | అచ్చువేయుట | 593 |
| మదమ్ కరీ | ఫ్రాన్సు | రేడియమ్ | 1903 |
| బెయిర్డ్ | ఇంగ్లండు | టెలివిషన్ | 1926 |
| డైసెల్ | జర్మనీ | డైసెల్ మోటారు | 1893 |
| స్టీవెన్సన్ | ఇంగ్లండు | రైల్వే ఎంజిను | 1829 |
| టొరిసెల్లి | ఇటలీ | బరామిటరు | 1643 |
| హార్గ్రీవ్జు | ఇంగ్లండు | స్పిన్నింగ్ జెన్నీ | 1736 |
| బున్సెన్ | జర్మనీ | బున్సెన్బర్నరు | 1855 |
| స్కూల్ట్జ్ | అమెరికా | తోళ్లకు పదును పెట్టుట | 1884 |
| హ్యూగెన్సు | నెదర్లండు | గడియారము | 1656 |
| మర్డక్ | ఇంగ్లండు | గ్యాసు లైటు | 1792 |
| బెర్లైనర్ | అమెరికా | మైక్రఫోను | 1877 |
| గుడ్-యీయర్ | అమెరికా | వల్కనైజ్డు రబ్బరు | 1849 |

| శాస్త్రజ్ఞుని పేరు. | దేశము | పరిశోధించిన విషయము. | కాలము. |
|---|---|---|---|
| డన్ లప్ | ఐర్లండు | రబ్బరు టైరు | 1888 |
| మాక్ మిలన్ | స్కాట్లండు | బైసికిలు | 1840 |
| ల్యూమియేర్ | ఫ్రాన్సు | మోషన్ పిక్చరు ప్రొజెక్టరు | 1805 |
| పాస్కల్ | ఫ్రాన్సు | కూడికల యంత్రము | 1642 |
| మెర్ గన్ తాలర్ | అమెరికా | లినో టైపు అచ్చుకూర్చు యంత్రము | 1885 |
| గెలీలియో | ఇటలీ | టెలిస్కోపు | 1593 |
| బెస్సెమర్ | ఇంగ్లండు | ఉక్కు | 1858 |
| వాటర్ మన్ | అమెరికా | ఫౌన్ టెన్ కలము | 1864 |
| షోల్సు | అమెరికా | టైపు మిషన్ | 1873 |
| గిలెట్ | అమెరికా | సేఫ్టీరేజరు | 1904 |
| లాఏనెక్ | ఫ్రాన్సు | స్టెతస్కోపు | 1819 |

## గాంధీమహాత్ముని ఆంధ్రదేశ సంచారము.

గాంధీ మహాత్ముడు తొలిసారి నెల్లూరిలో జరిగిన చెన్న రాష్ట్రీయ కాంగ్రెసు మహాసభా సమయమున ఆంధ్ర దేశమునకు వచ్చెను.

రెండవసారి చెన్నపురికి వచ్చి, చెన్నపురినుంచి ఉత్తర దేశమునకు బోవుచు మార్గ మధ్యమున బెజవాడలో ఒక రోజు బస చేసెను. ఆ సమయమున ఆంధ్ర ప్రముఖులతో రాజకీయములగూర్చి ముచ్చటించెను. ఆ సాయంత్రము బహిరంగ సభలో మహాత్ముడిచ్చిన ఉపన్యాసమే ఆంధ్ర దేశమున అతని ప్రథమోపన్యాసము.

1921 సం. అఖిల భారత కాంగ్రెస్ సంఘము బెజవాడలో సమావేశమైనపుడు మహాత్ముడు ఆంధ్ర రాష్ట్రము నంతటను సంచారము గావించెను.

1929 సం. మహాత్ముని రెండవ ఆంధ్రదేశ సంచారము.

అఖిల భారత హరిజన యాత్ర 1933 సం॥ నవంబరు 8 లో మొదలు పెట్టి, జూలై ఆఖరు వరకును వివిధ రాష్ట్రములలో సాగింపవలెనని మహాత్ముడు సంకల్పించుకొని, డిశెంబరు 14 వ తేదీ ఆంధ్రరాష్ట్రమునకు వచ్చెను.





# రెండవ భాగము

## నాల్గవ అధ్యాయము



# హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ మతములు

"మతం వేరైతేను ఏమోయ్?
మనసు లొకటై మనుషులుంటే
జాతమన్నది లేచిపెరిగీ
లోకమున రాణించునోయీ" ॥

—గురజాడ.

**విషయ సంగ్రహము :** హిందూ మతము ఆర్యుల వైదికమతము. బ్రాహ్మణ నిరంకుశాధికారమును ప్రతిఘటించుటకును, యజ్ఞ యాగాది కర్మకాండకష్టము తొలగించుటకున్ను వెలసిన బౌద్ధ జైనమతములు ఆంధ్రులలో సైతము వ్యాపించినవి. శాతవాహన కోసల రాజులు బౌద్ధులు. పిమ్మట ఆంధ్ర దేశము నేలిన రాజులు వైదికధర్మావలంబులగుటచేతను, శంకరాచార్యుల వైదికధర్మప్రచారమువల్లను వైదికమతము ప్రబలి, బౌద్ధజైనమతములు నశించినవి. వీరశైవ, వైష్ణవ మతములు భక్తి ప్రధానములయిన వగుటచేత కొంత వరకు ఆంధ్రులలో వ్యాపించినను, శంకరుని స్మార్తమతము ఎక్కువగా నిలిచినది. ఇస్లాం మతము 14 వ శతాబ్దమునుండి ఆంధ్ర దేశమందు ప్రవేశించినను వ్యాప్తి తక్కువ. హిందూ ముసల్మానులకు ఆంధ్ర దేశములో మత వైషమ్యము తక్కువ; పరస్పర సౌహార్ద మెక్కువ. క్రైస్తవ మతము బ్రిటిషు యుగములో ప్రవేశించినను వ్యాప్తి ఎక్కువ కాలేదు. క్రైస్తవ మత ప్రచారము ఎక్కువగా గల వంగదేశమందు దాని వ్యాప్తి నరికట్టుటకు రాజారామమోహనరాయి స్థాపించిన బ్రహ్మసమాజ మతము, కేశవ చంద్రసేను, బిపిన్ చంద్రపాల్, హేమచంద్ర సర్కారు మొదలయిన ప్రచారకుల ప్రబోధము వల్లను, సర్. ఆర్. వెంకటరత్నం నాయడు, వీరేశలింగంగార్ల కృషివల్లను ఆంధ్రదేశమందు కొద్దిగా ప్రవేశించినను ఎక్కువగా వ్యాప్తి చెందలేదు; గాని, సంఘ సంస్కరణమునకు తోడుపడినది. ఉత్తర హిందూస్థానమందు ప్రబలియున్న ఇస్లాం మతవ్యాప్తి నరికట్టుటకు పంజాబులో దయానందస్వామి స్థాపించిన ఆర్య సమాజమతము ఆంధ్రులలో కొద్దిగా ప్రవేశించినను, ఆంధ్ర దేశమందు వ్యాప్తిచెందుటకు అవసరము లేకపోయినది. నూతన వైజ్ఞానిక మార్గము ననుసరించి వైదిక మతమును పునరుద్ధరించిన దివ్యజ్ఞానసమాజమతము ఆంధ్రదేశమందు వ్యాపించినది. రామకృష్ణపరమహంసుని ప్రబోధము స్వామివివేకానందుని ప్రచారమువల్ల ఆంధ్రులను కొంతవరకు ఆకర్షించినది. అరవింద మహర్షి ఆంధ్రుల ఆదరమునకు పాత్రుడయ్యెను. శ్రీ రమణ మహర్షి, కుసుమహరినాధబాబా, రాధాస్వామి, సాయిబాబాల ఆధ్యాత్మికప్రబోధములు ఆంధ్రులలో వ్యాపించినవి. బాల గంగాధరతిలకు గీతారహస్యము ఆంధ్రులకు నూతన ప్రబోధమును కలిగించెను. నైతిక విద్యా ప్రబోధకుడైన రవీంద్రనాధ ఠాకురు మహాకవి రచించిన గ్రంధములు ఆంధ్రులకు ఆదరణీయము లయినవి. మహాత్మాగాంధీ రాజకీయ వ్యవహారమందేకాక ఆధ్యాత్మిక నైతిక విషయములందును ఆంధ్రుల నవీన మనో వికాసములకు తోడుపడెను. కార్ల్‌మార్క్సు ఆర్థిక నైతిక విషయములందున, లెనిన్ రాజకీయ సామ్య విషయములందును ఆంధ్ర యువకులకు ఆచార్యులు ఆదర్శప్రాయులు నయిరి.

# హిందూమతము

[శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు]

ఆంధ్ర దేశములో వైదిక మతము ఎప్పుడు ప్రవేశించి ఏ విధముగా వ్యాప్తి జెందినదీ, తత్పూర్వ మే మత ముండినదీ, నిర్ధారణ చేయుట కవకాశము లేదు. పూర్వ సంస్కృత వాఙ్మయములో ఆంధ్రులు అనాగరక జనులుగా వర్ణింపబడి యున్నారు.

శ్రీరామచంద్రుడు అరణ్యావాసమునకు వచ్చి, గౌతమిని దాటి దక్షిణమునకు వచ్చినపుడు ఇచ్చట నివసించు ఋషులు రాక్షసులవలన తమకు గలుగుచున్న ఇక్కట్టులను, రామచంద్రులకు విన్నవించుకొనినట్లు రామాయణము నందున్నది. బళ్ళారి ప్రాంతమువాడగు హనుమంతుడు, సంస్కృత భాషా పరిచయము గలిగి వేదమత మవలంబించినవాడు. ఆంధ్ర దేశములో భాగమైన కళింగము ఎక్కువ నాగరికత కలిగి యుండినట్లు భారతమునందు వర్ణింపబడియున్నది. చాణూరడను ఆంధ్ర మల్లుడు శ్రీ కృష్ణునితో మల్లయుద్ధము చేసి, కీర్తిని గడించినాడు. మెగాస్తనీసు ఆంధ్రులను ప్రశంసించినాడు. ఫాహియానను చైనా యాత్రికుడు క్రీ. శ. 400 లలో ఆంధ్రులు పెద్ద కోటలు, సైన్యము గలవారనియు, బౌద్ధమత మిచ్చట విరివిగా వ్యాపించి యున్నదనియు, కృష్ణా తీరమున సుప్రసిద్ధమైన విశ్వ విద్యాలయము గలదనియు వ్రాసి యున్నాడు.

విశ్వగుణాదర్శ మను సంస్కృత నాటకములో ఆంధ్రి జాతి శైవమతము నవలంబించిన నాగరక జాతిగా వర్ణింపబడి యున్నది. ఆంధ్రజాతియొక్క శైశవ చరిత్ర మనకు తెలియదు. బాల్య చరిత్ర కూడా తెలియదు. చారిత్రక రంగములో ప్రవేశించు నప్పటికి, సిముఖుడను ఆంధ్రవీరుడు మగధ దేశ సింహాసనమును ఆక్రమించుకొని క్రీ. పూ. 225 మొదలు క్రీ. శ. 225 వరకు, 450 సం॥ అవిచ్ఛిన్నముగా ఉత్తర దక్షిణ హిందూస్థానములను ఏకము చేసి, కృష్ణా తీరమందలి ధనకటకమును రాజధానిగా నేర్పరచుకొని పాలించిన శాతవాహన రాజవంశమును స్థాపించినట్లు పురాణములలో చదువుచున్నాము. ఈ చక్రవర్తులలో నొకడగు శాలివాహనుడు క్రీ. శ. 78 లో పరరాజులు దేశముపై దండెత్తి రాగా వారల నోడించి, దేశ స్వాతంత్ర్యమును గాపాడి ఆ విజయముయొక్క జ్ఞాపకార్థముగ శాలివాహన శకమును స్థాపించినాడు. ఈ చక్రవర్తులలో మరియొకడు యజ్ఞశ్రీ శాతకర్ణి; ఆసేతుహిమాచలమును జయించి, ఏకచ్ఛత్రాధిపత్యమును నెలకొల్పి, అశ్వమేధ మొనర్చిన వీరాధివీరుడు. గ్రీకు యాత్రికుని సాక్ష్యమునుబట్టి ఆంధ్ర కీర్తిని దిగంతముల వరకును వ్యాపింప జేసినవాడు సుందరశాతకర్ణి.

"ఏలు మోయీ ఆంధ్ర వీరుడ-  
ఏలు మోయీ దిగంతములను  
ఏలుమా నా ఆంధ్ర దేశము  
ఏడు సంద్రములూ."

అను వాక్యములు సార్థకమగునట్లు, ఆంధ్రులు తమ నాణెములపై నౌకా ప్రతిమల చెక్కించి, తమ నౌకా సైన్యముల సాహాయ్యముతో తమ ఓడల వ్యాపారమును దిగంతముల వరకు వ్యాపింప జేసిరి.

శాలివాహనుల ప్రభుత్వము ప్రారంభింపక పూర్వమే అశోక చక్రవర్తి బౌద్ధమత సందేశమును ఆంధ్రులకు వినిపించి, అమరావతి మున్నగు స్థలములలో స్తూపముల స్థాపించియుండెను. ఈ మౌర్యచక్రవర్తులలో కొందరు వైదిక ధర్మావలంబులును, కొందరు బౌద్ధ ధర్మావలంబులును గలరు. బౌద్ధ మతము ఆంధ్ర దేశములో వ్యాపించిన తరువాత, పండితులు సామాన్యముగా వైదిక ధర్మమే యవలంబించుచు వచ్చినను, జన సామాన్యము మాత్రము, బౌద్ధ జైన ధర్మములలో చేరిపోయిరి. కృష్ణానది కిరువంకలను ఎచ్చట జూచినను బౌద్ధారామములును, స్తూపములును, జైనాలయములును నిర్మింపబడియుండెను. నాగార్జున కొండలో నాగార్జుని అధ్యక్షతను, విశ్వ విద్యాలయ మొకటి స్థాపించబడి విశ్వవిఖ్యాతి గాంచి యుండెను. తరువాత టిబెట్టులోని లాసానగరమున స్థాపింపబడిన విశ్వవిద్యాలయ భవనము, ఆంధ్ర విశ్వవిద్యాలయ భవనము ననుసరించినట్లు శాసనమొకటి అచ్చట చెక్కబడి యున్నదట. హిందూదేశ మంతటను వ్యాపించిన మహాయాన బౌద్ధ మతమును స్థాపించినవాడు నాగార్జునుడు. ప్రపంచమున మొట్ట మొదటి రసవాద శాస్త్రము (Chemistry) రచించినవాడితడే! బౌద్ధము రాజమతము. వైదిక మతమునకు నిషేధములేదు. వేద పండితులును బౌద్ధ పండి

తులతోపాటు సమాన గౌరవమునే పొందుచుండిరి. కాని, వైదిక మతమునకు జన సామాన్యములో ఆదరణము పోయినది. మతగ్రంథము లన్నియును అప్పటి రాజభాషయు, జనసామాన్యభాషయునైన పైశాచి యను ప్రాకృత భాషలో వ్రాయబడినవి. తెలుగు అనాగరక జాతులలో వాడుక భాషగా మాత్ర ముపయోగ పడుచుండెను. గుణాఢ్యపండితుడు కథాసరిత్సాగరమును ప్రాకృత భాషలోనే రచించెను. ఆ భాషలోని 200 కవుల గ్రంథములనుండి, 700 పద్యములను ఏరించి, శాలివాహన సప్తశతి యను పేర హాలుడు సంపుటము గావించెను. ఈ సప్తశతిలోని భాష తప్ప మిగిలిన భాష యంతయు, నేటికి సంపూర్ణముగా అంతరించి క్రమముగ తెలుగు పైకి వచ్చినది.

ఈ చక్రవర్తుల కాలముననే ఎల్లోరా, అజంతా, ఉండవల్లి గుహాలయములు బౌద్ధ భిక్షువుల నివాసమునకై నిర్మింపబడినవి. గుహాకుడ్యములమీద బౌద్ధ గ్రంథములన్నియు చిత్రింపబడినవి. ఆంధ్ర సామ్రాజ్య స్థాపనముతో పాటు, వారి వాఙ్మయ విభూతి, శిల్ప చిత్ర కళాకౌశలము, బౌద్ధమత వ్యాప్తి, శాస్త్రజ్ఞాన వైభవము మిన్ను ముట్టినవి.

శాతవాహనుల తరువాత, నాగార్జునకొండ రాజధానిగా నేర్పరచుకొనిన కోసలులు గూడ బౌద్ధులే. వారి తరువాత రాజ్యమునకు వచ్చిన సాలంకాయన, విష్ణు కుండినులు వైదిక మత ప్రవిష్టులు. వీరి కాలమున ప్రాకృతము మూలబడి, సంస్కృతము రాజభాష యైనది. శాసనములు సంస్కృతములోనే రచింపబడినవి.

తరువాత 7 వ శతాబ్ద ప్రారంభమున రాజ్యమునకు వచ్చిన వారు చాళుక్యులు. వీరికి వేంగి నగరము రాజధాని. వీరు వైదిక మతమును సంస్కృతమును అభిమానించుటయేకాక, బౌద్ధ రాజుల కాలములో రాజభాషగా నున్న ప్రాకృతము నశించుటచే, దానికి బదులు సామాన్య జనులచే మాట్లాడబడుచు, ఆదరములేకయున్న తెలుగు నుద్ధరింప మొదలిడిరి. అందుకు మొదటి మెట్టుగా శాసనములు తెలుగున రచించిరి.

ఆసేతుహిమాచలము, బౌద్ధజైనమతములు క్షీణింప మొదలిడినవి. రెండును దేవుని అంగీకరింపని మతములు. దేశమున నెక్కడ చూచినను సన్న్యాసుల ఆశ్రమములు ప్రబలినవి. వేలకొలది స్త్రీ పురుషులు సన్న్యాసులై, ఆశ్రమములలో నివసింప ప్రారంభించిరి. నీతి పూర్తిగా నశించినది. ఈ మతములు నశించినను అవియుండిన స్థలములన్నియు నిప్పటికిని నిల్చియున్నవి.

బౌద్ధ మతము నశించుటకు దానిలోని లోపము మాత్రమే కారణముగాదు. కుమారిలభట్టు, శ్రీ శంకరాచార్యులు ప్రబలి వైదిక ధర్మమును పునరుద్ధరించిరి. శంకరులు ఆసేతు హిమాచలమును తిరిగి వాదములో బౌద్ధులనెల్ల నోడించి, భాష్య గ్రంథములను రచించి వైదిక మతమునకు స్థిరమయిన పునాదులను వేసిరి.



శంకరాచార్యులు

బౌద్ధమతము ఆంధ్రదేశమున వ్యాపించక పూర్వము ఇచ్చట ఎట్టి మతముండెనో ఏయే జాతులు ఏయే ధర్మము లవలంబించుచుండిరో నిర్ధారణ చేయుట కష్టము. వైదిక మత గ్రంథములు దేశభాషలోనికి పరివర్తనము గాలేదు. కన్నడములో పంప భారతమును, పొన్న రామాయణమును వ్రాసిరిగాని యవి ఏ మూలగ్రంథములను అనుసరింపక, బౌద్ధమత ధర్మముల బోధించుటకు మాత్రము క్లుప్తముగ వ్రాయబడినవి. సంస్కృత గ్రంథములయినను, భాష్యములు లేనందున పలువురు బ్రాహ్మణుల కందికలో యుండి యుండవు. బ్రాహ్మణేతరులును ఇప్పటికంటె విరివిగా సంస్కృతమును జదువుచుండియుందురు. జైనులు, బౌద్ధులు

మాత్రము పెక్కురు శాస్త్రములందును, సాహిత్యమునందును ఉద్దండపండితులై, స్వతంత్రగ్రంథములను సైతము రచించియుండిరిగాని, జనసామాన్యమునకు మాత్రము సంస్కృత మత గ్రంథము లందికలో లేవు. జన సామాన్యమున జైన బౌద్ధ మతములు క్షీణించినను, వేదమతము మాత్రము వ్యాపించ లేదు. శంకరులవారి భాష్యగ్రంథములు జన సామాన్యమున కుపకరించునవిగావు. అప్పటికే ఉత్తర దేశములో మహమ్మదీయమతమును, దక్షిణదేశములో క్రైస్తవమతమును ప్రవేశించినవి. జైనమతములో వర్ణాశ్రమధర్మములు చెడకుండ నిలిచినవి; గాని, బౌద్ధమతములో ఆ కట్టుబొట్లన్నియు శిథిలములయినవి. వర్ణాశ్రమధర్మయుక్తమయిన వేదమతమును పునస్థాపితము చేయవలయునని శంకరాచార్యులవారి ప్రయత్నము. మానవసంఘములో నెక్కువ తక్కువలకు కారణమగు వర్ణాశ్రమధర్మములను, జ్ఞానకర్మకాండలను నిర్మూలించి, వాటిని నుపపాదించునట్టి వేదములను, తక్కిన సంస్కృత వాఙ్మయమును త్రోసివేసి, జనసామాన్యమునకు అందికలో నుండునట్టి భక్తిమార్గమును ప్రతిపాదించి, అందరికిని అందికలో నుండులాగున తమ వేదములను దేశభాషలలో వ్రాయవలయు నను మహోద్యమ మొకటి బయలుదేరినది. వర్ణభేదములు, సంస్కృతవాఙ్మయము, జ్ఞాన కర్మకాండలు త్యజించి, సర్వసమభావముతో గూడిన భక్తి మతమును స్థాపించవలయునని ఈ ఉద్యమముయొక్క ఆశయము.

ఇట్టి భక్తి మతములు ఉత్తర హిందూస్థానమునను, మహారాష్ట్ర దేశమునను 15, 16 శతాబ్దములలో తలలెత్తినవి; గాని, అంతకుముందే ఆంధ్రకర్నాటదేశములలో జైన బౌద్ధములు నశించిన వెంటనే పొడసూపి, విస్తరించి, వైదిక మతమును ప్రతిఘటించి, మూడు శతాబ్దములు వీరవిహారము గావించినవి.

**వీరశైవము**

శివుని పరదైవముగా భావించుచు, వేద ప్రమాణము గల మతము ఆదిశైవము. శివుని దైవముగా భావించుచు వేదశాస్త్ర పురాణముల ప్రమాణ మంగీకరింపక, సర్వ శైవ సమభావమును ప్రతిపాదించిన భక్తి మతము వీరశైవము. వీరశైవులు జందెములకు బదులు, లింగమును గట్టుకొందురు. పాల్కురికి సోమనారాధ్యుడు రచించిన, బసవపురాణము వీరి వేదము. ఈ నూతన మత స్థాపకుడు బసవేశ్వరుడు. చెన్న బసవయ్య ఏకాంత రామయ్య, బసవేశ్వరునికి మిక్కిలి తోడ్పడిరి. వీరు ముగ్గురును బ్రాహ్మణులే. బసవేశ్వరుడు తన సర్వసమభావమును ప్రకటించుటకు, మాదిగ కక్కయ్యను గురువుగా భావించినాడు; కుమ్మరి గుండయ్యయొక్క ఆతిథ్యము శివుడు అంగీకరించినట్లు చెప్పెను.

వారు మహాభక్తాగ్రేసురలని బసవపురాణము ప్రశంసించుచున్నది. వైదిక మతస్థులనుగాని, జైనులనుగాని చంపిన యెడల పాపములేదని బసవపురాణము వీరశైవులకు బోధించును. జంగాలు వీరి గురువులు. బ్రాహ్మణులను భూదేవత లన్నట్టుగనే, వీరి గురువులను జంగమ దేవర (నడచునట్టి దేవత) లందురు. ఈ జంగములలో వేద ప్రామాణ్యమును, వర్ణాశ్రమ ధర్మములను విడువని బ్రాహ్మణులు గలరు. వీరిని ఆరాధ్య లందురు. వీరు జందెములుంచుకొని లింగమును కట్టుకొందురు. ఈ తెగకు జంగమ మల్లికార్జునుడుముఖ్యుడు. భక్తిని బ్రాహ్మణ్యమునుగూడ వీరు స్వీకరింతురు.

కల్యాణములో పాలించునట్టియు, పశ్చిమ చాళుక్యుడును, జైనమతావలంబుడును అయిన బిజ్జలునకు బసవేశ్వరుడు ప్రధానమంత్రి. ఈ కాలమున వీరశైవులకు జైనులతోడను, వైదిక ధర్మావలంబుల తోడను, పెక్కు మతయుద్ధములు జరిగినవి. అనేకులు బలవంతముగా శైవ మతములోనికి చేర్పబడినట్లు, తెలియుచున్నది. కొందరు మహమ్మదీయులను గూడా చేర్చుకొనిరట. వీరిలో స్త్రీలకు పురుషులతోపాటు మత హక్కులు గలవు. స్త్రీలకు పునర్వివాహములుగూడా అంగీకరింపబడినవి.

వరంగల్ రాజ్యస్థాపకుడగు ప్రోలరాజు జైను డైనను తరువాతి వారగు గణపతి దేవుడు, ప్రతాపరుద్రుడు, రుద్రమ దేవి శైవమత ప్రవిష్టులు. వీరికడ ప్రధాన మంత్రిగనున్న శివదేవయ్య మిక్కిలి సమర్థుడు; శైవమత వ్యాప్తికిని, జైనమత వినాశనమునకును, మిక్కిలి తోడ్పడినాడు. ఈతడు తిక్కనకు సమకాలికుడై వైదికమతోద్ధారణకు మిగుల పాటు పడినవాడు. ఈతడు రెండవ ప్రతాపరుద్రునకు దీక్ష నిప్పించి, ఆరాధ్యబ్రాహ్మణత్వ మిప్పించినట్లు చెప్పుదురు. ప్రతాపరుద్రుని సేనాధిపతులలో నొకడును, ఆరాధ్య శైవుడును అగు రాజవంశజునితో ఇతడు వియ్యమందినాడు. శైవము కర్నాట దేశములో ఉన్నంత విరివిగా

ఆంధ్రదేశములో లేకున్నను, బ్రాహ్మణులనేకులు శైవు లగుటఆంధ్ర దేశములోనే జరిగినది. 64 బ్రాహ్మణ కుటుంబ ములు మొదట జంగములై యజ్ఞోపవీతమును, బ్రాహ్మణ్య మును విడిచి పెట్టినారు. బ్రాహ్మణ్యమును విడువక లింగ ధారణము జేసుకొని, ఆరాధ్యు లైనవారు పెక్కువే లున్నారు. వీరిలో లౌక్యులుగా నుండువారికి లింగధారి బ్రాహ్మణులని పేరు. కాశీనాథుని వారు లింగధారులు.

జైన బౌద్ధ మతములు క్షీణించిన తరువాత వైదికమత వ్యాప్తికి వీరశైవము కర్నాటదేశములో బయలుదేరినట్లు వైష్ణవము అరవదేశములో బయలు దేరినది. శ్రీ రామానుజాచార్యులవారు శైవులవలె పూర్వవిజ్ఞానమును విడువక, శ్రీ శంకరాచార్యులవారివలెనే వేదప్రమాణమును స్వీకరించి, భాష్యములు వ్రాసి భక్తి ప్రధానమైన వైష్ణవ మతమును స్థాపించినారు; సంస్కృతము సామాన్య జను లకు అందికలో నుండదని గ్రహించి, అరవ భాషలో భక్తి ప్రబోధకములయిన గ్రంథములకు ఉపనిషత్తులతో సమ మయిన స్థానము నిచ్చి, ఉభయ వేదాంత ప్రవర్తక బిరుద మును వహించినారు. శైవులవలె జ్ఞానకర్మకాండలను నిరసింపక, అవి రెండును భక్తికి సాధనము లన్నారు. మొత్తముమీద వైష్ణవము భక్తి ప్రధానమైన మతమగుటచే, జన సామా న్యములో వ్యాపించి, ఆంధ్ర దేశములో జైన బౌద్ధ మత ములను రూపు మాపుటకు మిక్కిలి తోడ్పడినది. వేద ప్రామాణ్యమును, వర్ణాశ్రమ ధర్మములను అంగీకరించుచు భక్తి ప్రధానముగా నుండుటచేతను, దేశ భాషా గ్రంథములకు ప్రామాణ్యము నిచ్చుట చేతను, పూర్వము ద్విజేతరులకు నిషేధింపబడిన తిరుమంత్రపఠనమునకు సర్వమానవులును అధి కారులని ప్రకటించుట చేతను, ఈ మతము సర్వులు అంగీక రించిరి. శ్రీ వచనభూషణ మను అరవ వేద గ్రంథము పంచములు నిరహంకారులగుటచేత, స్వాభావికముగా చతు ర్వర్ణముల వారికంటె ఎక్కువ అర్హులనియు, ఈ సత్యమును శంకించు బ్రాహ్మణుడు పతితుడనియు శాసించుచున్నది. ఈ గ్రంథమును రచించినది పిళ్లైలోకాచార్యుడను బ్రాహ్మణుడు. ఇది భగవద్గీతతో సమానమైన ప్రమాణ గ్రంథము. వైష్ణవులు సర్వసామాన్యోత్సాహమును ప్రద ర్శించి, నియమరహితముగా దిగువ జాతులను తమ గోష్ఠులలోనికి రానిచ్చుటచేత, బహుమంది వైష్ణవమత ములో జేరుటకు అవకాశము గలిగినను, వారు తమ దురాచార ముల విడువక రామానుజ (రా=రక్తము, మా=మద్యము ను= నురుగు, జ=జల పుష్పములు) మతములో మద్య మాంస నిషేధమునందును అపార్థములకు తావిచ్చి, కొన్ని చోట్ల గోష్ఠులలో వీటిని నియమముగ ప్రవేశింప జేయుటచే అందు చేరు బ్రాహ్మణులకు గూడా అవి అలవాటు కాజొచ్చినవి.



రామానుజాచార్యులు

11వ శతాబ్దమున వైష్ణవ మతోద్ధారకుడు

ఈ ముప్పును గ్రహించి, శైవు లందరికిని మద్య మాంస ములను నిషేధించి, చివరకు తాటి చాపల మీదనైనా పడు కొన కూడదని శైవులు కట్టడి చేసిరి. అందుచే జన సామాన్య ము విరివిగా శైవమతములో జేరకున్నను, చేరినవారు మాత్రము ఇప్పటివరకు పరిశుద్ధులుగా నున్నారు.

ఆంధ్ర దేశములో వైష్ణవము విరివిగా వ్యాపించినది. రాజులు, సామంతులు, మంత్రులు, పురోహితులు, సేనా పతులు, ఉద్యోగులు, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు, పంచములు, ఎరుకలు, ఏనాదులు, సమస్త జాతులు వైష్ణ వము స్వీకరించిరి. ఆంధ్ర దేశములో వైష్ణవము వ్యాపింప జేసినది అద్దంకి సీతము. ఇది కర్మకంటె భక్తి ఎక్కువయి నదిగా వాదించు తెంగల శాఖకు చెంది, శ్రీరామానుజుని

సామ్య సిద్ధాంతముల ననుసరించునది. మతమును బోధించు అధికారము బ్రాహ్మణ మతముల వారికేకాక, అన్ని మతములవారికిని ఈయబడినది. శూద్రశాఖలకు చెందిన వైష్ణవులందరకును హవ్యకవ్యములలోను, మతగోష్ఠులలోను అధ్యక్షత వహించువారు చాత్తాద (సాతాని) వైష్ణవులు. వీరుగాక, మరియొక రకపు శూద్ర దాసరులును, మాలదాసరులును, మాదిగ దాసరులును తమ కులములలో మతమును బోధించుటకు, హవ్యకవ్యమును నిర్వహించుట కేర్పరచబడిరి. పెక్కువందల సంవత్సరముల క్రిందట ఏర్పడిన ఏర్పాటు లన్నియు నిప్పటికిని నిలిచియున్నవి.

పై నుదాహరింపబడిన మతోద్యమము లన్నియు నూతన పరిస్థితులకు తగిన మార్పులతో, జైన బౌద్ధ మతస్థు లందరినీ తిరిగి తీసుకొని నూతనముగా జాతీయ నిర్మాణమును గావింపవలయునను బలవ దుద్దేశముతో బయలు దేరినవి. అయిననివి యేవియు సర్వతో ముఖమయిన జాతీయ నిర్మాణమును గావించుటకుగాని, పండితులను ఆకర్షించుటకుగాని, సంపూర్ణముగా శక్తిగలవి గాక పోయినవి. కన్నడ దేశములో ద్విజాతులు వీరశైవము నంగీకరింప లేదు. అరవ దేశములో నైతము వైష్ణవ మతములోని విశాలభావములకు నిరోధము గలిగినది. నూతన వైష్ణవముయొక్క పరుగును కళ్లెముల బిగబట్టి ఆపినవాడు వేదాంత దేశికులు. బ్రాహ్మణులకంటె భక్తి యెక్కువను సిద్ధాంతము వెనుకబడినది. తమిళ దేశమున కంటె ఆంధ్ర దేశములో నూతనోద్యమములకు విరోధము యెక్కువ గలిగినది.

సనాతన వైదికము, జైన బౌద్ధములు నశించిన పిదట జాతీయ భవన నిర్మాణమును శ్రీ ఆదిశంకరులు వేసిన పునాదుల మీద గావింపవలయునను నిర్ధారణ చేయబడినది. ఇది ఆంధ్ర ప్రయత్నము. శైవవైష్ణవములు ఆంధ్ర దేశములో బుట్టినవి గావు. పడమటినుండి శైవమును, దక్షిణమునుండి వైష్ణవమును ఆంధ్రదేశమును ఆక్రమింప జూచినవి. ప్రథమమున ఈ యుద్యమములు ఆంధ్రజాతి హృదయమును కొంతవరకు కంపింప జేసినను, వారి తత్వమున కివి సరిపడలేదు. వర్ణాశ్రమ ధర్మ ప్రయుక్తమైన శాంకర మతమే ఆంధ్రులది. ప్రస్తుతము ఆంధ్రదేశములో నున్న వైష్ణవ మాధ్వులలో నూటికి 99 మంది అరవలు కన్నడులు అనియే చెప్పవలయును. శైవమును, వైష్ణవమును స్వీకరించిన ఆంధ్ర బ్రాహ్మణులు స్మార్తులగనే యుండి, స్మార్తాచారముల నే యవలంబించుచు, క్రమముగ స్మార్తులతో పూర్తిగ కలసి పోవుచున్నారు. తమ అభిరుచినిబట్టి శివకేశవులకు భక్తులుగా నున్నను, వారిని త్రిమూర్తులలోని వారిగ నెంచుచున్నారు; గాని, పరదైవతములుగ భావించుట లేదు. మరియును వీరు స్మార్త పౌరోహిత్యమును విడువలేదు. బ్రాహ్మణేతర శైవవైష్ణవులును చాలావరకు ఈ స్థితియందే యున్నారు.

తెలుగు శబ్దము త్రిలింగ—త్రికలింగ శబ్దభవముకాదు; సంస్కృతపండితులాపాదించిన సంకరపితృత్వము సరికాదు.

**తెలగ-తెలుగు**

తెలగ శబ్దము మార, తెలుగు అయినట్లు గన్పట్టుచున్నది. ఉత్తరదేశీయులు మన దేశమును తెలింగాణమందురు. కృష్ణా గోదావరుల మధ్యను, నైజాము రాష్ట్రములో నుండు తెలుగు దేశము తెలంగాణము. దీనికి ఓరుగల్లు నడిబొడ్డు. తెలగ, తెలంగ అను రూపములు రెండును గలవు. ఆణియము, ఆణెము, ఆణ్యము అను శబ్దములు దేశము-నాడు అని అర్థమిచ్చు తెలుగు శబ్దములు. తెలగనాటి ఆంధ్ర వైదిక బ్రాహ్మణులు తెలగాణ్యులు. ఈ తెలుగు భాగపు శూద్రులలో కాపు లను పేరుగలవారు బహుసంఖ్యాకులయిన శుద్ధ తెలుగు తెలగాలు. బుడబుక్కల వారిలో తెలగ బుడబుక్కల, (ఆర్య) ఆరె బుడబుక్కల, అని రెండు తెగలున్నవి. ఉప్పర్లలో తెలగ ఉప్పర, ఒడ్డె (ఓఢ్ర) ఉప్పర అనే రెండు శాఖలున్నవి. ఇటులనే తెలుగు శబ్దమునకు పూర్వరూపమయిన తెలక శబ్దము ఇంకను నిలిచి యున్నది. పూర్వము మన దేశము తెలగాణ్యము, వెలనాడు, పాకనాడు, ములికినాడు, రేనాడు. వోత్తపినాడు, బడగలనాడు, పలనాడు, ఆరువేలనాడు అను మండలములు గలిగి యుండెను. ఇవి యన్నియు గలిసి, యిప్పుడు ఆంధ్రదేశ మను పేర నున్నవి. తెలుగు శబ్దముగూడ, ఆంధ్ర శబ్దమునకు పర్యాయ పదముగా నుపయోగింప బడుచున్నది.

ఈ తెలుగు లేక ఆంధ్ర జాతియొక్క ప్రస్తుత మత స్వరూపము శ్రీ ఆది శంకరులు వైచిన పునాధులపై మోపబడినదని చెప్పియున్నాము. శ్రీ శంకరులు వైదిక ధర్మము స్థాపించి, పండితులను తమ మతమునకు త్రిప్పుకొనగలిగిరి. కాని, వారు వేసిన పునాదులపై ఆంధ్ర జాతిని నిర్మింప వలసియున్నది. సంస్కృతవాఙ్మయము జన సామాన్య

మున కందికలో లేదు. అందుకై కొందరు దేశభాషలో మత వాఙ్మయము సృష్టింప బూనిరి. చాళుక్యులు తెలుగు భాషను, వైదిక మతమును అభిమానించినవారు; తెలుగు భాషను రాజ భాషగ జేసి గౌరవించిరి. దానిలో మత వాఙ్మయమును సృష్టించుటకు ప్రారంభము చేయబడినది. వేదములు తెలిగింప జేయుటకు తగు సాహసము 11 వ శతాబ్దములో కలుగ లేదు. ఆ పని 20 వ శతాబ్దములో గొల్లపూడి సీతారామశాస్త్రిగారికి వదలి వేయబడినది. గాని, పంచమవేదమయిన భారతము మాత్రము తెలిగించుటకు నిశ్చయింపబడినది. ఈ కృతి కర్తలును భర్తలును, నన్నయఋషి రాజరాజులై గౌతమీ తీరమున విలసిల్లిరి. ఈ పనిని తిక్కన మహర్షియు, ఎఱ్ఱాప్రగడయు పూర్తి చేసిరి. కోన బుద్ధిన రెడ్డియు, గంగనాధుడును రామాయణమును తెనిగించిరి. భాగవతమునకు ద్రష్ట పోతనామాత్యుడు. సామవేదమునకు ద్రష్ట త్యాగమహర్షి. పలువురు మహాకవులు సర్వాంగ సుందరమయిన వాఙ్మయమును సృష్టింపగలిగి, సంస్కృత వేదములను నిరసించిరి. వీరశైవకవులు బసవ పురాణాది, శైవ వేదములను సృష్టించిరిగాని, వైష్ణవులు తెలుగు వేదములను సృష్టించలేదు. శివాలయములలో నిప్పటికిని అరవ పాశురములనే ఏకరువు పెట్టుచున్నారు. ఈ విధముగా వైదిక మత ధర్మములను తెలుగులో చదువుకొనుటకు అవసరమైన వాఙ్మయ మంతయు తెలుగులో సృష్టించబడినది. మొత్తము మీద వర్ణాశ్రమధర్మప్రయుక్తమైన వైదికమతము ఆంధ్రదేశములో స్థిరపడినది. వర్ణ వైషమ్యములు భారత దేశమందలి యితర భాగములలో నుండునంతగ ఆంధ్రదేశమున లేకున్నను, సంస్కృతగ్రంథములలో నున్నంత భావ వైశాల్యము మాత్రము తెలుగులో లేదు. అనులోమ ప్రతిలోమ వివాహములు అంతరించినవి. గాంధర్వ వివాహములు అంతరించి, బ్రాహ్మణ వివాహములు మాత్రమే అన్ని కులములకును, ఆదర్శప్రాయములైనవి. నాలుగు జాతుల మధ్యగూడ, అస్పృశ్యతయును, దృష్టి దోషమును అమలులోనికి వచ్చినవి. శాస్త్రములో నాలుగు జాతులు మాత్రమే అంగీకరింపబడినను, శూద్ర జాతిగా పరిగణింపబడవలసిన అనేకులు పంచములుగా విడదీయబడిరి. నాలుగు జాతుల మధ్యగూడ శాస్త్రీయములు గానట్టి, భోజనప్రతిభోజనములు, పరస్పర వివాహములు పనికిరాని అంతశ్శాఖాభేదములు వందల కొలది బయలు దేరినవి. శూద్రులలో వృత్తులను బట్టి కూడా పెక్కు అంతశ్శాఖలు ఏర్పడుటచేత చాతుర్వర్ణములు అష్టాదశ వర్ణములు ఏర్పడి, వీరిలో పరస్పర సంబంధములను నిర్ణయించుటకు మంత్రి మహానాటి కట్టడు లేర్పడినవి. శూద్రులలో బ్రాహ్మణలక్షణము లున్నయెడల వారిని బ్రాహ్మణులుగా పరిగణింపవచ్చునని సంస్కృత భారతము చెప్పుచుండగా, అట్టివారు సచ్ఛూద్రులనబడుదురుగాని, బ్రాహ్మణు లనబడ రని తెలుగు భారతము మార్చినది. చాతుర్వర్ణ్యము గుణ కర్మలచే నేర్పడునని శాస్త్రము చెప్పుచున్నది. సాధారణముగా కుమారుడు తండ్రి వృత్తి నవలంబించును; గనుక, గుణ కర్మలచే నేర్పడు వర్ణధర్మము క్రమముగ, వంశపారంపర్యపద్ధతిగా స్థిరపడి, చివరకు, జాతికి జన్మయే ప్రధాన మను సిద్ధాంతమును, ఒకవేళ ఆపద్ధర్మముగా వృత్తి మారినను, కులము మారదను సిద్ధాంతమును అమలులోనికి వచ్చినవి. ఇప్పటికి కులమునకు జన్మయే ప్రధానము ; గుణకర్మ లప్రధాన మను సిద్ధాంతమేర్పడినది. వర్ణధర్మముయొక్క ప్రారంభ దశలో ఒక వర్ణమువారు, ఇతర వర్ణములయొక్క గుణ కర్మలను కొన్ని తరములవలంబించి, అలవరచుకున్నయెడల వారికి క్రొత్తకులము వచ్చుచుండెను. పై వర్ణములలో చేరుటకు ఈ అవకాశము రాజసమ్మతమై యుండుటచే, పై తరగతులవారు ఏ విధమయిన అసంతృప్తినిపొందక, విప్లవమునకు పూనుకొనక, సదాచారము లలవరచుకొని, ఉత్తమ వర్ణములజేరుచుండిరి. కృషివాణిజ్యపశుపాలనములు వైశ్య వృత్తులు; గాని, రానురాను కృషి పశుపాలనములను విడిచి, ఎక్కువ లాభకారియగు వాణిజ్యవృత్తిని మాత్రమే వైశ్యు లవలంబించుటచే, కృషిపశుపాలనము లితరుల చేతులకు జిక్కినవి. కమ్మ, రెడ్డి, వెలమ, తెలగ మున్నగు శాఖలవారీ రెండు వైశ్యవృత్తుల నవలంబించిరి. వీరికి జాతాశౌచ, మృతాశౌచములు శూద్రులకువలె 30 రోజులుగాక, వైశ్యులకువలె 15 రోజులే నిర్ధారణ చేయబడినవి. మరియు దక్షిణదేశమున క్షత్రియసంఘము తక్కువగుటచే అవకాశము గలిగినప్పుడెల్లను వీరు క్షత్రియ వృత్తి నవలంబించి, క్షత్రియ వేషభాషల నలవరచుకొని, రాజ్యముల స్థాపించి క్షత్రియజాతులుగా మారిపోయిరి. అందుచేతనే వీరిలో కొందరికి వైదిక గోత్రములును, సూర్య చంద్ర వంశములును సిద్ధించినవి. చాళుక్య ప్రభువులు రాజ్యము పాలించిన మొదటి రాజులలో శూద్రులమని శాసనములో నుదాహరించుకొనిరిగాని, కొన్ని తరములుగడచిన తరువాత



రామకృష్ణ పరమహంస

11 వ శతాబ్దములోని నందంపూడి శాసనము నాటినుండియు చంద్రశేఖర క్షత్రియులమని వ్రాసికొనిరి. ఈ క్షత్రియత్వము లభించిన తరువాత, అనులోమ పద్ధతి ననుసరించి వైశ్యుడగు కుసుమసెట్టి కుమార్తె కన్యకా దేవిని, చాళుక్యవిష్ణువర్ధ నుడు వివాహమాడ కోరెను. వైశ్యులు చాళుక్యుల వైశ్య త్వమును, క్షత్రియత్వమును గూడ నంగీకరింపక, 101 గోత్రముల వారు తిరుగుబాటు చేయుటయు, విష్ణువర్ధ నుడు బలవంతపెట్టుటయు జరిగినది. కన్యక యొక్క అగ్ని ప్రవేశముతో ఆ తగాదా అంత మయినది.

వైశ్యవృత్తి నవలంబించుచు తెలికలెసాలెకులస్థులు వైశ్యా చారము లవలంబించి, యజ్ఞోప వీత ధారణ మొనర్చు కొనిరి. భావనఋషి సాలెకులోద్ధారకుడు. ఆంధ్ర దేశ ములోని యొక సాలెసంస్కర్త టిప్పు సుల్తాను పాలించు చుండిన మైసూరురాజ్యమునకు బోయి అచ్చటి సాలెకుల జులలో ప్రబోధము కలిగించి, వారిచే జందెముల ధరింప జేయుచు, దేశములో విప్లవము గావించి, కలహముల బుట్టించు చుండెనని మైసూరు రాజ్యములోని శృంగేరీ పీఠమువారు సుల్తానుకు పిర్యాదులు చేయుటయు, అందుపై దివాను పూర్ణయ్యగారు, ఆసాలె సంస్కర్తను దేశమునుండి, వెడల గొట్టుటయు జరిగినవి. ఈ విషయములను తెలియజేయు ఉత్తర మిా మధ్య శృంగేరీ పీఠము రికార్డులలో దొరికినది.

ఆంధ్ర దేశములో క్రొత్త క్షత్రియ జాతు లేర్పడిన రోజు లలో ఉత్తర దేశమునుండి దక్షిణమునకు మహమ్మదీయుల దాడుల ఒత్తిడి బలమయినది. దాని నెదు ర్కొనుటకు దేశములో పాలనవిషయమునను, వైదికధర్మస్థాపన విషయమునను, దేశభాషాభివృద్ధివిషయమునను, ప్రభువు లకు దోడ్పడుటకు కొందరు బ్రాహ్మణులు నియోగులను పేరితో క్షత్రియవృత్తి నవలంబించి, మంత్రులుగను, సేనా పతులుగను, సామంత ప్రభువులుగను, పనిచేసి, వర్ణాశ్రమ సౌధనిర్మాణమునకు పాల్పడిరి. అందుచే వీరిలోను, వాణి జ్య తత్పరత్వముచే వైశ్యులలోను, కొంత వైదికాచార సంపత్తి కొరవడి నందున, ఇటీవల నియోగులలో నందిరాజు లక్ష్మీ నారాయణ దీక్షితులు గారును, ఆత్మకూరి వైశ్యులలో లక్ష్మీ నరసింహ దీక్షితులుగారును, బయలుదేరి తమ కులములలో స్మార్తా చారములు పునరుద్ధరించిరి. సరస్వతీ స్వాములవారు ఈ కాలమున వైదికాచార ప్రచారకులలో ప్రముఖులు. వీరు ముఖ్యముగా కమ్మవారిలో ఉపనయ నాది వైదిక కర్మల నెల కొల్పి, వారి క్షత్రియత్వమును పూర్తి చేయుటకు మిక్కిలి కృషి సల్పిరి. ఈ యుద్యమ ము రెడ్లలోను వ్యాపించినది.

అచలబోధ :—జైన బౌద్ధములు నశించి, వైదిక సంస్థా పన జరిగిన కాలములో, జ్ఞాన కర్మకాండలను సామాన్య జనులలో వ్యాపింప జేయుటకు, ప్రయత్నము జరుగ లేదు; గాని, చైతన్యుడు, కబీరు, నానకు, వల్లభాచార్యులు తుకారాము, బసవేశ్వరులు, రామానుజాచార్యులు మున్న గువారు ఉదార భావములతో గూడిన భక్తి మతముల స్థాపించి, జన సామాన్యమునకు వ్యాపింప చేసిరి. వీటి గాలి కొంత ఆంధ్రదేశమునకును సోకినదిగాని, ఇవి ఆంధ్ర దేశ జనితములు గాకుండుటచే నిచ్చట వీటికి నిలకడ కుదర లేదు. పైసంస్కర్తలు ఆయా భాగములలో భక్తి యోగ మును మాత్రమే వ్యాపింప జేయుటచే, జ్ఞానయోగ ప్రధా మగు శంకరా ద్వైతము, అచ్చటి సామాన్యజనులలో వ్యా పించలేదు. భక్తి యోగ మలవడి నంత సులభముగా జ్ఞాన యోగ మలవడదు. ఆంధ్రదేశములో మాత్రము కప్ప పిల్లలు నీటిలో ఈదుటకై యలవాటు పడినట్లు, అచల బోధ యను పేరితో అద్వైతమతము ఆంధ్ర దేశములో జనసామాన్యమున సులువుగా వ్యాపించినది. మహమ్మ

దీయులలోని సూఫీమతము దీనికికొంత చేరికగా నుండును. అందుచే కొందరు మహమ్మదీయ వేత్తలును వీరితో కలిసిరి. దీనిని నెలకొల్పి వ్యాపింప జేసినవారు పోతులూరి వీరబ్రహ్మంగారు, దూదేకుల సిద్ధయ్యగారు, వేమన్నగారు, సాలెకులజులు యాగంటివారు, బొందిలి వీరయ్యగారు, గుమిళ్ల కాల్వ కోటయ్యగారు, జెల్లంకొండ మస్తానుగారు, భాగవతుల శివరామ దీక్షితులుగారు, పున్నవ నందయ్యగారు, పాకల శేషాచల నాయుడుగారు మున్నగువారు పెక్కుఉన్నారు.

బ్రహ్మ సత్యం జగన్మిథ్యా అనే వాదము వీరిమతమునకు మూల కందము. అందులోను బ్రహ్మ సత్యమను తత్వముకంటె జగన్మిథ్యా అను తత్వమే ఎక్కువయినది. భక్తియందును వైదిక కర్మలయందును వీరికి ఆదరము తక్కువ. శంకరాచార్యులవారు గారడీ విద్యయని నిరసించిన హఠయోగమునందు వీరికి ఆదర మెక్కువ. గురువు వద్దను ఉపదేశము పొందుటను కారణమగుటయని చెప్పుదురు. కారణమును పొంది, ఈ శాఖకుచెందిన స్త్రీ పురుషులు కొందరయినను, లేని గ్రామము ఆంధ్ర దేశములో నుండుటరుదు. బిచ్చగాళ్లనేకులు వీరి తత్త్వములను రైళ్లలో బాడుచుందురు. వైదిక కర్మలను వీరు నిరసింతురు ; గనుక, శాంకరాద్వైతులు వీరిని ఆదరింపరు. అద్వైత వాద మనగా వితండవాదమని యర్థములోనికి దిగినది.

ఇది ఇట్లు జరుగు చుండగానే దేశములోనికి మహమ్మదీయ మతము వచ్చినది. గోలకొండనవాబులకడ హైందవ మంత్రుల ప్రాబల్య మెక్కువ. ఢిల్లీ చక్రవర్తులకు వెరచి గోలకొండ నవాబులు తమస్వాతంత్ర్యమునకై జనుల మీద నాధార పడవలసి వచ్చుటచే, జనుల నెప్పుడును తమ మతములో గలియు డని నిర్బంధింపలేదు. మసీదులతోపాటు హిందూ దేవాలయములను గూడా ఈ నాములిచ్చి పోషించు చుండిరి. అందుచేత, ఆంధ్రదేశములో హిందూ మహమ్మదీయులకు అన్యోన్య ద్వేషము తక్కువ. మహమ్మ దీయులతో సంపర్కమువలన, ప్రజలలో పౌరుష మెక్కువగుట తప్ప, మహమ్మదీయమతము ఆంధ్రుల భావములలో ఎక్కువ మార్పులను గలించ లేదు. మహమ్మదీయ భక్తుల ఉరుసులు మున్నగు పండుగలలో హిందువులు పాల్గొనుటయును గలదు.

ఇటీవల క్రైస్తవ మతము ఆంధ్రదేశములోనికి వచ్చినది. వారి మిషనరీలు ఇంగ్లీషు విద్యాలయములను, ఆస్పత్రులను బెట్టి అందుజేరువారికి బైబిలు నిర్బంధముగా బోధించుచుండిరి. ఇంగ్లీషు విద్యయును, ప్రకృతి శాస్త్రజ్ఞానము ఎక్కువయిన కొలదిని, హిందూ శాస్త్రములయందును, మతమందును, ఆచారములందును విశ్వాసము పోయినది. విద్యార్థులలో కొందరు క్రీస్తుయొక్క శుద్ధజీవితముచే ఆకర్షింపబడియు, కొందరు మిషనరీల ప్రజాసేవా శక్తికి హర్షించియు, మరికొందరు ఐహిక లాభముల కొరకును క్రైస్తవ మతములో ప్రవేశింపజొచ్చిరి. క్రైస్తవుల సంఖ్య కరువు సంవత్సరములలో హెచ్చుటయు మరుసటేడు తగ్గుటయు సంభవించుచున్నది. హరిజనులలో కొందరు ఈ మతములో చేరుటచే అన్ని విధములా బాధ పడినది సత్యమే. విద్యార్థులలో బహుమంది ప్రకృతి శాస్త్రముల తాకుడునకు తట్టుకొనలేక ఏ మతమునందును విశ్వాసము కుదరక, ఐహిక జీవితతత్పరత్వము మాత్రమే మిగిలి ఏమతములోనైనను జేరుట తటస్థించినది.

ఈ స్థితిలో బ్రహ్మసమాజము బంగాళమునుండి ఆంధ్రదేశమునకు వచ్చినది. కీ. శే. వెంకటరత్నం నాయుడు



స్వామి వివేకానంద
రామకృష్ణ పరమహంసుని మతమును
ప్రపంచమంతటను వ్యాప్తిచేసెను.

గారును, వీరేశలింగంగారును ఆంధ్రదేశములో బ్రహ్మసమాజ మతమును, సంఘసంస్కరణమును వ్యాపింపజేయుటకు మిక్కిలి తోడ్పడిరి. విద్యాలయములలో వారితో సంపర్కము గలిగినవారి సనాతనభావములను పూర్తిగా మార్చివేయగలిగిరి. హిందూ సంఘములో వారికి దురాచారములని తోచినవాని నెల్లను, వ్యాసములు వ్రాసియు, ఉపన్యాసము లిచ్చియు, నిర్మూలింపసాగిరి. ఆత్రముతో కలుపు దీయు కృషికుడు, చెడు మొక్కలతోపాటు పైరుమొక్కలను సైతము పీకివేయునట్లు సదాచారముల సైతము పెక్కింటిని పెరికి వైచిరి. వారు పుట్టించిన అలజడికి హిందూ సంఘము తట్టుకొని, యథాస్థితి కింకను రాలేదు.

బ్రహ్మసమాజము నాస్తికములో మునుగనున్న కొందరు యువకులను ఆస్తికులను శుద్ధవర్తనులను మాత్రము జేసినది. బ్రహ్మ మతము కేవలము అవైదికముగాదు.



సాయిబాబా

ఇంక, దివ్యజ్ఞాన సమాజము ఆంగ్ల విద్యాధికుల పాశ్చాత్య వ్యామోహమున కడ్డకట్టయై నిలిచినది ; అనేకులు క్రైస్తవులు గాకుండా జేయ గలిగినది ; హిందూమతమొక్కటియే ప్రకృతిశాస్త్రసిద్ధమయినది యని వాదించినది. హిందువులు పాశ్చాత్యులవలన నేర్చుకొనదగిన దేదియు లేదనియు, వైదికాచారము లన్నియు ప్రకృతి శాస్త్రముచే సమర్థింపవచ్చుననియు, చాటినది. విద్యార్థుల వ్యామోహము పూర్తిగా నశించుటయేకాక, హిందూసంఘములోని సదాచార దురాచారముల రెండింటికిని గూడా బలము గలిగినది. సంఘసంస్కర్తలకు చెడు రోజులు వచ్చినట్లు తోచినది. జనులు తమ పూర్వ గ్రంథములను చదివి, హర్షించుటకు ప్రారంభించిరి. మాక్సుముల్లర్ యొక్క పరివర్తన గ్రంథము లెంతయు, ఇందుకు తోడ్పడినవి. హిందువులకు తాము అనాగరికులు కారని స్పష్టపడినది. ఇది దివ్యజ్ఞానసమాజము కలిగించిన గొప్ప మార్పు.

ఆర్యసమాజము పంజాబులో ఉద్భవించినది. హిందువులు మహమ్మదీయులలో జేరుటఆపగలిగినది. ఆర్యసమాజము రానియెడల పశ్చిమోత్తర భాగములలో వైదిక మెట్టి స్థితియందుండెడిదో ఊహింప జాలకున్నాము. వేదము హైందవు లందరికిని వారసత్వపు హక్కని నిర్ధారణ చేసినది. భారత దేశములో మొట్టమొదట ఈ సిద్ధాంతమును పైకి దెచ్చినది దయానందసరస్వతియే. శంకరాచార్యులు ఉపనిషత్తులకు, భగవద్గీతలకు వేదాంతసూత్రములకే ప్రాముఖ్యమునిచ్చి, వేదసంహితలను వెనుకకు త్రోసిరి. దయానందుడు ఈ హిందూ విజ్ఞానమున కంతటికి వేదమే మాతయనియు, జ్ఞానమంతయు దానిలో ఇమిడియున్నదనియు, ప్రపంచమంతయు దానివలన తరించుననియు చాటినాడు. హైందవమతకర్తలలో ఈ విషయమున ఇత డద్వితీయుడు.

విద్యారణ్యుల వైదికభాష్యములు ఆంధ్రదేశములో వైదికధర్మ వ్యాప్తికి మిక్కిలి తోడ్పడినవిగాని, దయానందుడిచ్చిన విశ్వమానవసందేశమును, అవి యివ్వజాలక పోయినవి. దయానందుని సందేశము ఆంధ్రుల కెంతయు నచ్చినది.

రామకృష్ణ పరమహంస, అరవిందుల సందేశములును ఆంధ్రుల చెవిని బడినవి. హరనాథబాబా, రాధాస్వామి, స్వామి రామతీర్థ, రమణమహర్షి, సాయిబాబాలును ఆంధ్రుల దృష్టిని కొంతతవరకు ఆకర్షింపగలిగిరి. దీని ఫలితము భావికాలమున చూడవలసియున్నది. ఆంధ్రదేశములో మొదటినుండి యిప్పటివరకును మతోద్ధారకులు ప్రజలభావముల నేయేవిధముల మార్చ ప్రయత్నించిరో మనము కొంతవరకు పరిశీలించితిమి. వీటన్నిటి ఫలితముగా తేలిన హిందూమత ప్రస్తుత స్వరూపమును పరిశీలించుట కొంతవరకు అవసరము. వేదములకు అతిప్రాచీనమైన నిఘంటువు యాస్కాచార్యుల నిరుక్తము. వేదముయొక్క సారము వ్యాసశిష్యుడయిన జైమిని మహర్షి రచించిన పూర్వ మీమాంస సూత్రములయందును, వేదాంతముల అనగా ఉపనిషత్తుల సారము వ్యాసరచితమైన ఉత్తరమీమాంస అనగా వేదాంతసూత్రములయందును కలదు. వేదములును, పూర్వ మీమాంసయును ధర్మార్థకామములను బోధిం



శ్రీ అరవిందయోగి

చును. వీటి ప్రకారము సంసారము కర్మక్షేత్రము. ఇందు కర్మసన్న్యాసమునకు చోటులేదు. మానవుడు ఈ లోకమున తన్నెదుర్కొను సమస్యలతో పోరి విజయము గాంచవలసియుండును. ప్రపంచము బంధముగాదు; స్వర్గమునకు మార్గము. వేదాంత సూత్రముల ప్రకారము సంసారము బంధము; కర్మ బంధహేతువు; సన్న్యాసము ముక్తిమార్గము. ఇది బౌద్ధమునకు చాలా చేరిక. శంకరాద్వైతమును విరోధులు ప్రచ్ఛన్న బౌద్ధమని కూడ అన్నారు. ఈ రెండు శాఖలను సమన్వయము చేయుటకు గీత ప్రయత్నించినది. కర్మసన్న్యాసము పనికిరాదనియు, కర్మ బంధహేతువే కాని, నిష్కామకర్మ బంధహేతువు కాదనియు; కనుక, మానవుడు నిష్కామ కర్మను జేయుచు ముక్తిని బొందవలయుననియు చెప్పినది. మరియు గీత మానవ ప్రకృతిపై ఆధారపడి మతసాధనలను నిర్ణయించినది. జీవాత్మ యొక్క స్వభావధర్మములు మూడు: వ్యక్తిత్వము లేక అహంతత్వము లేక ఇచ్ఛాశక్తి (Will) మొదటిది; జ్ఞానము లేక మంత్ర శక్తి (Intellect) రెండవది; భక్తి, ప్రేమ, లేక దయా దాక్షిణ్యాది గుణములు, లేక ఉత్సాహశక్తి (Emotion) మూడవది. ఈ మూడింటిని పాశ్చాత్య తత్వశాస్త్రములున్ను, గీతయు అంగీకరించినవి. పరమాత్మ స్వరూపము గూడ నిదియే. ఈ మూడింటి ద్వారా జీవ పరమాత్మలకు స్పర్శ యోగము. మానవేచ్ఛను, భగవదిచ్ఛను ఐక్యపరచి నిష్కామ కర్మచేయుట కర్మయోగము. బుద్ధీంద్రియముద్వారా నిగి ధ్యానకలన సర్వజ్ఞత్వము నొందుట జ్ఞాన యోగము. వివిధభక్తిమార్గములద్వారా విశ్వమానవ ప్రేమను అలవర్చుకొని, భగవదైక్యమును సంపాదించుట భక్తి యోగము. ఈ మూడు యోగములద్వారా ఆత్మోపలబ్ధిని పొందవలయునని గీతా సిద్ధాంతము. ఈ మూటిలోను శంకరులు జ్ఞానయోగమును, రామానుజులు భక్తి యోగమును, తిలకు కర్మయోగమును ఉత్తమమని, తమ అభిప్రాయముల కనుగుణముగా ధర్మసాధనలను వ్యాపించిరి. కాని అరవిందుడు ఈ సాధనములలో ఉత్తమ ఊసరలు లేవనియు, ఇందులో ఏదేని ఒక యోగమును అవలంబించినంత మాత్రమున సంపూర్ణముగా ఆత్మోపలబ్ధి గలుగదనియు, మానవ సంపూర్ణ వికాసమునకు ఒక జన్మలోగాని, అనేక జన్మలలోగాని, ఈ మూడు యోగములను సాధింపక తప్పదనియు, ఈ మూడు యోగములను అవలంబించుటచేతనే, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు వికాసము పొందుననియు, అట్లు పొందినసేకాని జీవ పరమాత్మల హైక్యము గలుగదనియు చెప్పుచు అన్నింటిని చేర్చిన యోగమునకు పూర్ణయోగమని పేరిడినారు. దీనివలన అంతః కలహములు పోయి గీతాబోధకును, మానవ ప్రకృతికిని సమగ్రమయిన సమన్వయము కుదురగలదు.



శుద్ధాద్వైత మతప్రచారము చేసిన ఆంధ్రుడు, వీరి మతము గుజరాత్‌లో వ్యాప్తిచెందినది.

వల్లభాచార్యులు

అరవిందుడు మరికొంత జిజ్ఞాసయును గావించినాడు. మానవ వ్యక్తి మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు మూడును మాత్రమే కలిగియున్నదా? అన్నమయ ప్రాణమయ కోశములు మాత్రము వ్యక్తిలో భాగములు కావా? విశ్వరూపుడయిన పరమాత్మకు మాత్రము ఈ అయిదు కోశములు లేవా? జీవపరమాత్మలకు ఈ అయిదు కోశముల ద్వారా పరస్పరస్పర్శ కలుగుటయే పరిపూర్ణ యోగ మనదగదా! యని సమగ్రమైన మీమాంస గావించెను.

ప్రకృతి శాస్త్రమును, దీని కనుగుణముగానే యున్నది. ఎలక్ట్రానును, ప్రోటానును, న్యూట్రానులు గలిసి ఏర్పడిన రేణువు (atom) మొట్టమొదటి ఉపాధిసహితమయిన వ్యక్తి. ఈ వ్యక్తి వికసించి జీవ చర్యలు ప్రకటించే (Protoplasmic) కణము (cell) ఏర్పడును. ఈ ఏక కణ జీవులు బహుకణసంఘాతమగు జీవులగును. ఇవి వృక్షములుగను, జంతువులుగను, పక్షులుగను, మానవులుగను (evolve) పరిణమించును. ఈ పరిణామ వికాసమంతయు జీవుని మనోమయ, విజ్ఞానమయ కోశములను, వాని ఆచరణకు దగిన అంతరింద్రియ, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు గల స్థూల దేహమును వికసింప జేయుట కొరకే. ఈ సిద్ధాంతమునకును, పైని చెప్పిన అరవిందుని పూర్ణయోగమునకును, సమన్వయము కుదురుచున్నది.

ఈ వికాస (evolution) సిద్ధాంతమును వేదవేదాంత మతములు అంగీకరించునా? ఈ సృష్టి లేక సంసారము బంధము. జీవుడు ఈ బంధములో తగుల్కొని నిరంతరము పుట్టుచు చచ్చుచు ఉండును. ఈ సంసారము దుఃఖ భూయిష్ఠము; దీనిలోనుండి బయటపడుటయే ముక్తి; బయటపడుటకే మానవుడు ప్రయత్నించవలయును. ఇది బౌద్ధ సిద్ధాంతము. వేదాంత సూత్రములపై ఆధారపడిన ద్వైతా ద్వైత విశిష్టా ద్వైతములు స్వల్ప భేదములతో నీ



రమణ మహర్షి

దారినే పోవుచున్నవి. వీరి దృష్టిలో సృష్టి కర్మక్షేత్రము గాదు. సృష్టి అనిమిత్తము. దీనిలో మానవుడు పొంద వలసిన గమ్యస్థానము లేదు. అందుకై అతడిచ్చటికి రాలేదు. ఇది వేదాంత మతము.

వేదమతము ఇట్టిదిగా గన్పట్టదు. వేదమును, పూర్వమీమాంసయు సృష్టిని కర్మక్షేత్రముగా భావించును. ప్రకృతి శాస్త్రములు బోధించు పరిణామసిద్ధాంతములను సమగ్రముగ



మధ్వాచారులు. ద్వైతమతస్థాపకుడు.

బోధించకున్నను, వికాసపరిణామము మన దర్శనములకు క్రొత్తది కాదు. కొన్ని పురాణములు దీనిని స్పష్టముగా బోధించుచున్నవి. జీవుడు ప్రపంచయాత్రలో 84 లక్షల జీవరాసులుగా జన్మ లెత్తును. ఇందులో 16 లక్షల జన్మలు, ప్రాణ పదార్థపు (Protoplasm) స్థితి యింకను రాని నిర్జీవ ధాతు పదార్థములో గలుగును. వృక్ష వర్గములో 12 లక్షల జన్మలు, ఇటులనే జంతు వర్గములోను, మానవ వర్గములోను జన్మ లెత్తి, 84 లక్షల జన్మలను గడప వలయును. డార్విన్ మొదలగువారికన్న మనవారే ఈ సిద్ధాంతమును ఎక్కువ వివరముగా చెప్పినారు.

దివ్యజ్ఞాన సమాజము, వారు మన మత సిద్ధాంతములను ప్రకృతి శాస్త్రముతో సమన్వయించు ప్రయత్నములో మన యీ పూర్వసిద్ధాంతములను వెల్లడికి దెచ్చినారు. వీరి దృష్టిలో ప్రపంచము కర్మక్షేత్రము. ఇప్పుడు పొరపాటున బంధములుగా భావింపబడుచున్నవి జీవుని పూర్ణ వికాసమునకై యేర్పడిన నియమావళి. సృష్టిలోని సైతాను, బౌద్ధుల కామము, అరిషడ్వర్గములు, ఈషణత్రయములు మొదలగున వన్నియు మానవులు బాధపడుటకును, తప్పుదారిని బోవుటకును, భగవంతుడు చేసిన పన్నాగములు గావు. భగవంతునిశక్తికి మించిన మరియొకరి ఏర్పాట్లును గావు. అన్నియును ఒక విధానములోని భాగములు. భగవద్గుణానుభవమునకై ఏర్పరచబడిన సాధనలు. వీరి దృష్టిలో సృష్టి గమ్య స్థానములేనట్టియు అనిమిత్తమైనట్టియు పాడుగుంట గాదు. తిని త్రాగి నశించే నాస్తిక గమ్యస్థాన రహితమును, విధాన రహితమును అగు శుష్క మార్గమును గాదు. ఇదియొక మహా విద్యాలయము. మెట్లన్నియు ఎక్కవలయును. తరగతులన్నిటిలో ఉత్తీర్ణుడు గావలయును. బంధము లన్నియు గమ్యస్థానమును జేర్చుట కేర్పడిన నిబంధనలు.

మతముయొక్క గమ్యస్థానము అమృతత్వ మని అన్ని మతముల వారును అందురు. కాని అమృతత్వము అనగా పుట్టుక లేకుండా చేసుకొనుటయని వేదాంతులందురు. స్వర్గములో ప్రవేశించుట యని ఇతరమతస్థు లందురు. ఇవి డొంక తిరుగుడు అర్థములు.

హిందువుల మంత్రరాజమగు గాయత్రి గమ్యస్థానమును చక్కగా సూచించుచున్నది.

"ఓం భూర్ భువ స్వః। ఓం తత్ సవితుర్వరేణ్యం। భర్గో దేవస్య ధీమహి।"

భూలోక భువర్లోక స్వర్లోకములలో, అజ్ఞానములను పాపములను దహింపజేయునట్టియు, తేజస్స్వరూపుడయిన భగవానుడు మన అంతరింద్రియములను, జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను ప్రవేశించి వికసింపజేయుటకు ప్రార్థించుచున్నాను, అని దీని యర్థము.

సత్య, నిత్య, అమృత, ఆరోగ్య, ఆనంద, సుందర, రూపమును అనుగ్రహించుమని ప్రార్థించుటయే దీని సారాంశము. ఇది ఇప్పటికిని ఆంధ్రులు వికసింప జేసిన మతము యొక్క స్వరూపము.

# దేవాలయములు

దేవాలయముల యొక్క స్థితి, సమృద్ధి దేశమందలి ప్రజల మతపరాయణత్వదార్ఢ్యానికి చిహ్నములని చెప్ప వచ్చును. ఆంధ్ర దేశములో ప్రతి గ్రామములోను ఆలయములున్నవి. ఈ ఆలయములు ఉత్తమధార్మికమార్గములకు నిదేయులను ఉన్ముఖులను చేయుచున్నవి. హైందవ దేవాలయములలో ఆనందము, వినోదము, జిహ్వాతృప్తి కూడా సంప్రాప్తములగుచున్నవి. దేవాలయములు మతమునకు ప్రధానావాసములు; మతము యొక్క సింహాసనాస్థానములుగాను, తత్త్వజిజ్ఞాసాచోదకములుగాను, ఉండుటయే కాక, సౌందర్యవంతములై, కవిత్వం, శిల్పం మొదలైన వాటికి సమావేశస్థానములుగా కనుపించుచున్నవి, శ్రీ, లక్ష్మి అను నామములతో ప్రాపంచక సర్వసమృద్ధి, కమనీయత మన ఆలయములలో ఆరాధించబడుచున్నవి.



శ్రీశైలదేవాలయము
శైవులకు గొప్ప క్షేత్రము.

ఈ దేవాలయములను గురించి పండిత శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు, తమ పల్నాటి వీర చరిత్ర ద్వితీయభూమికలో ఇట్లు వ్రాయుచున్నారు "దేవుడు లేకడున్నాడని ప్రత్యయం లేని తత్త్వ జిజ్ఞాసువులు కొందరుండ వచ్చును. వారు సాధారణంగా శమదమాది సంపత్తి గలవారై, ఆత్మవంతులై వుంటారు గనుక, వారివల్లలోక ధర్మవిప్లవం సంభవించజాలదు. అయితే, అట్లాటి స్పృహణీయగుణసంపదమూలాలు ప్రజల్లో వుండ గలగడం అరుదు కనుక, నాస్తికత యేదేశంలోగాని సాధారణ జనులకు మతంగా వుండడానికి అర్హమయినది గాదు. తత్త్వ జిజ్ఞాస లేతీరుగా ప్రవర్తిల్లినా, రష్యా మొదలైన దేశాల్లో నాస్తికత యేమార్గాల్లో నడుస్తున్నా, దైవ భక్తి ముఖ్య లక్షణంగాగల మతం యొక్క ఆవశ్యకత, లోక సంగ్రహానికి అనివార్యమగుచున్నది. మానవులయందలి హేయగుణాలను చంపి అభ్యుదయప్రదమైన కల్యాణగుణాలు వర్ధిల్లజేసి, అందు గుప్తమయి వున్న దైవత్వాన్ని ప్రస్ఫుటం జేయడమే మతం యొక్క ప్రకృష్టప్రయోజనం. చిహ్నధారణాది బాహ్యలక్షణాలే మతం కావుగానీ, యేవీ లేకుండా వుండటం కంటే అవి కొంతమేలన వచ్చును. యేదేశమందైనా యెప్పటికైనా అవి వాటి సమీపాన వున్న శ్రేయః పథాన్ని చూపించ వచ్చును. కొందరు తమ దుష్ట చిత్త వృత్తులను కప్పిపుచ్చి, లోకాన్ని వంచించడానికి బాహ్యలక్షణాలను ధరిస్తుండడం సత్యం. అయితే, అది మతం యొక్క మిథ్యా యోగం. అంత మాత్రంచేత మతం దుష్టం కాజాలదు. మిథ్యా యోగం యొక్క నింద్యతను వస్తువునకు ఆరోపించడం అనుచితంగదా! ఈ దేవాలయాలు ప్రజలకు సమాగమస్థానాలని నేను భావిస్తున్నాను. ధనాదులచేత ప్రవేశం నియమితమై ప్రాకృత క్రీడా సుఖాలకోసం చేరే పాశ్చాత్యుల క్లబ్బుల వలెగాక, మన దేవాలయాలు నిర్ధనులకు సైతం నిరవధికంగా ప్రవేశం ప్రసాదిస్తున్నవి. పద్మపురాణ కర్త దుఃఖించినట్లు ఆశ్రమాలు యవనధ్వస్తాలు కాగా, మీమాంసకుల కర్మవాద పాటవం దేశంలో క్షీణించగా, విజ్ఞాన సీతం అరణ్యాలను వదలి, ఆలయాలకు మరలినట్లు కనబడుతున్నది. ఇంతేకాక, భారతవర్షమందలి మత సంరక్షకు లెందరో దేవాలయాలతో సంబంధించి వున్నారు."

దేవాలయములు వైదికయుగములో నిర్మితములైనట్లు కనబడదు. దేవతాస్వరూపము, దేవతల వాహనములు

ప్రతిమావర్ణనము మొదలైన విషయములకు సంబంధించిన వాక్యములు, వేదములందు కొన్ని గలవు; గాని, విగ్రహారాధనకు సంబంధించిన వాక్యములు లేవు. విగ్రహారాధనము ఆచరణలోనికి వచ్చిన తరువాతగాని, దేవాలయ నిర్మాణమునకు అవకాశముండదు. బౌద్ధమతములో మహాయాన భక్తి మార్గము ప్రబలిన తరువాత బౌద్ధులు బుద్ధుని దేవునిగా పరిగణించి, బుద్ధ విగ్రహమును ఆరాధించుటకు మొదలు పెట్టిరి. బౌద్ధులను చూచి వైదిక ధర్మావలంబులును, తమ దేవతలకు వేదములో గల వర్ణనము ననుసరించి విగ్రహములను నిర్మించి ఆరాధించుటకు మొదలు పెట్టిరి. విగ్రహారాధన ఏర్పడిన వెంటనే దేవాలయ నిర్మాణము నైతము ప్రారంభ మైనది.

బ్రహ్మస్వరూపమైన ఆత్మకు దేహము నిలయమైనట్లు దేవతా విగ్రహమునకు దేవాలయము నిలయముగా భావించి, దేవాలయనిర్మాణము శరీరనిర్మాణము ననుసరించి కావించినారు. ఈ విషయమే ఈ క్రింది శ్లోకార్థములో గలదు. "దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సదాశివః". కొంతవరకు దేవాలయ నిర్మాణమునకును, బౌద్ధుల చైత్య విహారనిర్మాణమునకును పోలిక గలదు. మనకు తెలిసినంత వరకు ఆంధ్రదేశమందు పల్లవులు మొదటి దేవాలయనిర్మాతలని చెప్పవచ్చును.

ఆంధ్ర దేశములో ప్రసిద్ధికెక్కిన దేవాలయములలో శ్రీ ముఖలింగ మధుకేశ్వరాలయము, శ్రీ కూర్మమువద్ద నరసింహేశ్వరాలయము, సింహాచల నరసింహాలయము, అన్నవరపు సత్యనారాయణ స్వామిఆలయము, ధవలేశ్వరమునందలి జనార్దన స్వామి ఆలయము, భద్రాచల రామాలయము, భీమేశ్వరాలయము, ద్వారకా తిరుమల వెంకటేశ్వరాలయము, పెనుగొండ కన్యకా పరమే



తిరుపతి కొండ ఎక్కునప్పుడు యాత్రికులు డోలీలలో ప్రయాణం చేయు దృశ్యం.

శ్వరీ ఆలయము, బెజవాడ దుర్గగుడి; పురాణాల్లోనేకాక, భవభూతి, బాణుడు, శ్రీహర్షుడు మొదలయిన ప్రాచీన భారతీయ విజ్ఞులకృతులలో సైతం ప్రస్తావించబడిన శ్రీశైలక్షేత్రములోని మల్లికార్జునాలయము, మాచెర్ల చెన్నకేశ్వర స్వామి ఆలయము, మహానంది చెన్నకేశ్వర స్వామి ఆలయము, కోటప్పకొండ కోటేశ్వరాలయము, మంగళగిరి పానకాల రాయుని ఆలయము, నెల్లూరి రంగనాయక స్వామి ఆలయము, పుష్పగిరి చెన్నకేశ్వర స్వామి ఆలయము, కాళహస్తీశ్వరుని గుడి, లేపాక్షి బసవేశ్వరాలయము, కదిరి లక్ష్మీనృసింహ స్వామిఆలయము, హంపీ విరూపాక్షాలయము మొదలైనవి గలవు.

## తెలుగు జిల్లాలలోని దేవాలయములు

### ఆదాయము.

| జిల్లా పేరు. | 2000 రూ. గాని అంతకుపైనిగాని సం. ఆదాయము గల దే. సంఖ్య. | రెండువేలకు తక్కువ సం. ఆ. గల దే. సంఖ్య. |
|---|---|---|
| విశాఖపట్నం | 40 | 142 |
| తూ. గోదావరి | 32 | 281 |
| ప. గోదావరి | 23 | 275 |
| కృష్ణా | 33 | 183 |
| గుంటూరు | 58 | 114 |
| నెల్లూరు | 18 | 16 |
| కడప | 4 | 8 |
| కర్నూలు | 12 | 23 |
| బళ్లారి | 9 | 10 |
| అనంతపురం | 8 | 9 |
| చిత్తూరు | 11 | 10 |

### విశాఖపట్నం జిల్లా

| గ్రామము పేరు. | ఆలయము పేరు. | ఆదాయము. |
|---|---|---|
| అనకాపల్లి | కన్యకాపరమేశ్వరి | 6,457 |
| పద్మనాభం | అనంత పద్మనాభ | 6,964 |
| బొబ్బిలి | వేణుగోపాల | 14,870 |
| పాలకొండ | జగన్నాథం (మ) | 6,000 |
| రాజాం | రాజగోపాలరామలింగేశ్వర సీతారామ | 17,260 |

| గ్రామము పేరు. | ఆలయము పేరు. | ఆదాయము. |
|---|---|---|
| సింహాచలం | వరలక్ష్మీ నరసింహ | 1,12,395 |
| విశాఖపట్నం | కోదండరామ | 6,000 |
| రామతీర్థం | రామస్వామి | 13,840 |
| విజయనగరం | కన్యకాపరమేశ్వరి | 6,500 |
| బలగ | జగన్నాథ | 26,000 |
| శ్రీకాకుళం | కోదండరామ | 5,000 |
| సరియాపల్లి | లక్ష్మీనారాయణస్వామి (మ) | 9,604 |
| మందసా | వాసుదేవస్వామి | 9,000 |
| కంచిలి | జగన్నాథ | 7,760 |

### తూర్పు గోదావరి జిల్లా

| | | |
|---|---|---|
| అన్నవరం | వీర వేంకట సత్యనారాయణ | 31,041 |
| పిఠాపురం | కుంతిమాధవ | 6,177 |
| ద్రాక్షారామ | భీమేశ్వర | 8,000 |
| అంతర్వేది | లక్ష్మీ నరసింహ | 5,000 |
| వాడపల్లి | వెంకటేశ్వర, వేణుగోపాల | 5,000 |

### పశ్చిమ గోదావరి జిల్లా

| | | |
|---|---|---|
| ఏలూరు | జనార్దన కన్యకాపరమేశ్వరి | 5,910 |
| ద్వారకా తిరుమల | వెంకటేశ్వర | 30,000 |
| పాలకొల్లు | క్షీరరామలింగేశ్వర | 5,250 |
| పెంటపాడు | వైరాగిమఠం | 6,5000 |

### కృష్ణా జిల్లా

| | | |
|---|---|---|
| బెజవాడ | కనకదుర్గ | 8,066 |
| లింగరాయపాలెం | బావాజీమఠం | 6,712 |
| వడాలి | జగన్నాథ | 19,428 |
| ఆగరపల్లి | శోభనాచల | 12,134 |

### గుంటూరు జిల్లా

| | | |
|---|---|---|
| పొన్నూరు | భావనారాయణ | 9,216 |
| మంగళగిరి | లక్ష్మీనరసింహ | 14,000 |
| వైకుంఠపురం | వెంకటేశ్వర | 7,710 |
| కోటప్పకొండ | కోటేశ్వర | 11,736 |
| మారుతోట | ముక్తీశ్వర | 5,461 |
| పెదపులివర్రు | వరదరాజు | 6,071 |
| అమరావతి | అమరేశ్వరస్వామి | 9,312 |

| గ్రామము పేరు. | ఆలయము పేరు. | ఆదాయము. |
|---|---|---|
| దోనెపూడి | సోమశేఖర | 10,442 |
| సంగం జాగర్లమూడి | సంగమేశ్వర | 7,613 |
| | **నెల్లూరు జిల్లా** | |
| నెల్లూరు | కన్యకాపరమేశ్వరి | 6,410 |
| నెల్లూరు | వేణుగోపాల | 7,000 |
| బుచ్చిరెడ్డిపాలెం | కోదండరామ | 9,045 |
| గండవరం | లక్ష్మీనరసింహ | 5,925 |
| జొన్నవాడ | మల్లికార్జున | 11,430 |
| సింగరాయకొండ | వరలక్ష్మీ నరసింహ | 9,787 |
| వెంకటగిరి | కాశీవిశ్వనాథ | 15,000 |
| | **కడప జిల్లా** | |
| పుష్పగిరి | చంద్రమౌళీశ్వర | 19,580 |
| రాజంపేట | కన్యకాపరమేశ్వరి | 5,000 |
| | **చిత్తూరు జిల్లా** | |
| తిరుపతి | హాతిరాంజీ మఠము | 57,698 |
| తిరుపతి | తిరుమల తిరుపతి దేవస్థానము | 9,81,854 |
| కాళహస్తి | కాళహస్తీశ్వర | 9,400 |
| నారాయణవనం | కల్యాణ వెంకటేశ్వర | 5,741 |
| కరింబేడు | నాదేశ్వర | 9,289 |
| తిరుత్తని | సుబ్రహ్మణ్యం | 20,525 |
| | **అనంతపురం జిల్లా** | |
| ఉరవకొండ | కోటబసవేశ్వర | 20,000 |
| కదిరి | లక్ష్మీ నరసింహ | 5,400 |
| | **బళ్లారి జిల్లా** | |
| గౌరీపురం | చింతామణిస్వామి | 5,000 |
| హంపి | శంకరభక్తిస్వామి | 10,000 |
| ఉజ్జయని | మారుల్ల సిద్ధేశ్వరస్వామి | 11,095 |
| | **కర్నూలు జిల్లా** | |
| గోరంట్ల | మాధవస్వామి | 6,150 |
| శ్రీశైలం | మల్లికార్జున | 16,225 |
| అహోబిలం | నారసింహ | 7,150 |

అయిదువేల రూపాయలకు పైబడిన సంవత్సరాదాయము గల దేవాలయములు మాత్రమే చూపబడినవి.

# మఠములు

మఠాచార్యులును, సన్యాసులును నివసించు ప్రదేశమునకు మఠమని పేరు. "మఠశ్ఛాత్రాదినిలయో" అని అమరకోశకారుడు నిర్వచించుటచేత, విద్యార్థులు వాసంచేసే ప్రదేశమునకు గూడా మఠమని చెప్పవచ్చును. ధర్మార్థ కామ మోక్షములను, చతుర్విధ పురుషార్థములను ఆర్జించుటకు సన్న్యాసాశ్రమ మొక ఉపకరణము. ఈ మఠాచార్యులలో గృహస్థులు కొందరుండుటచే గృహస్థమఠములును గలవు. శైవ, వైష్ణవ నిర్మితములైన కొన్ని మఠములలో గృహస్థులు నివసించుట పరిపాటిగా లేకపో లేదు. మఠములు వంటివి ఆదిలో బౌద్ధుల ద్వారా వ్యాప్తమైనని. వాటికి సంఘారామములు, విహారములు అని పేరు. పారమేశ్వరాది శివాగమములలోను, నారద పాంచరాత్రాది వైష్ణవాగమములలోను సూతసంహితాది పురణాలలోను, కొన్ని స్మృతులలోను, మఠముల చర్చ స్పష్టముగా నున్నందున భారతవర్షమున ఇవి మిక్కిలి ప్రాచీన కాలముననే ఏర్పడి యుండునని చెప్పవచ్చును. ఆదిశంకరాచార్యులు మఠామ్నాయమను గ్రంథమును రచించినట్లు ప్రతీతి కలదు. వీరు ముఖ్యమైన నాల్గు మఠములను స్థాపించిరి. శైవ, వీరశైవ వైష్ణవ, శ్రీవైష్ణవ, మాధ్వమతాచార్యులును, అనేక మఠములను, పీఠములను స్థాపించిరి. ఇంకను కబీరు, రామదాసు, గోరఖ్ నాథ్, రాధాస్వామి, రామకృష్ణ పరమహంసలకు సంబంధించిన మఠములు నెలకొనినవి. ఉత్తరదేశమున మఠముల సంఖ్య అధికము. అందు ఉదాసీన సన్న్యాస మఠములు సంపన్నములైనవి; ఇందు నాగాలు (నంగా దిగంబరులు) కొందరుందురు.

ప్రారంభదశలో మఠములు కేవలము నివసించు ఉద్దేశముతోనే కట్టబడి యున్నవి. నివసించు వారికి కావలసిన యోగా భ్యాసము, శాస్త్రాధ్యయనను కూడా ఈ మఠములలో రానురాను నేర్పుచుండిరి. కొంతమంది ఆచార్యులు మఠస్థాపనాదుల గావించి, తమ మఠములను సింహాసనములనియు, పీఠములనియు వ్యవహరించుచు, సంస్థానాధిపతులవలె తమ శిష్యులను స్వమతీయులను దండనమండనాదులు ధరించి పాలించు చుండిరి. ధర్మప్రచారమున్ను, మతప్రబోధమున్ను ఈ మఠముల ద్వారా ముఖ్యముగా జరుగుచున్నట్లు నిదర్శనములున్నవి. మఠాచార్య మఠాధిపతుల



సింహాచలం దేవాలయం మండపం.

తపః ప్రాబల్యమువల్లను, విద్వత్తువల్లను మఠములు ప్రాశస్త్యమునకు వచ్చెను. ఇప్పటికని కొన్ని మఠముల అధిపతులు ఉన్నత స్థితిలోనున్నారు. కాని, కొందరు మఠాధిపతుల జీవితములు ఆదర్శప్రాయములుగా లేవు.

ఆంధ్రదేశమున పలువురు సంప్రదాయాచార్యులున్నారు. ఓరుగల్లు ప్రతాప రుద్రుని కాలమున శివదేవుడు మున్నగు శైవులును, గోళకి మఠములును ఉన్నట్లు తెలియుచున్నవి. గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో శ్రీ శంకరాచార్యుల శాఖగా పుష్పగిరి పీఠపు మఠమొకటి గలదు. గుంటూరులో శ్రీ కళ్యానంద భారతీస్వాముల వారి శృంగేరీ పీఠమున్నది. వానమామల, అహోబలము, తోతాద్రి, ప్రతివాది భయంకరము మున్నగు పేళ్లతో అనేక వైష్ణవ మఠములును, తచ్ఛాఖా మఠములును గలవు. ఇట్లే కొంత కాలమునుండి శంకరమఠములనియు, రామానుజకూటములనియు చెప్పబడు సంస్థలనేకము బయలు దేరినవి. కొలను పాక (నిజాము) లో మిక్కిలి ప్రాచీన కాలమున రేణుకాచార్యులు పదునెనిమిది వీరశైవ మఠములను స్థాపించినారు. శ్రీశైలమునను, ఆత్మకూరులోను, గుంతకల్లులోను, పండితారాధ్యుల మఠములు కలవు. ఉత్తర దేశీయుల సంపర్కము వలన బావాజీల (సాధువుల) మఠములును, బ్రహ్మంగారి మఠములును, వివిధసంప్రదాయకుల సంస్థలును ఆంధ్రదేశమున గలవు.

వీటిలో కొన్ని సార్వజనీనమైనవి, కొన్ని స్వతంత్రమైనవి. ఉత్తర దేశము, బొంబాయి ప్రాంతముల కంటెను మద్రాసు రాజధానిలో మఠముల సంఖ్య మిక్కిలి తక్కువైనదని స్పష్టముగా తెలిసికొనవచ్చును. మఠ విషయికములైన వ్యవహారములకు సంబంధించిన హిందూ ధర్మాదాయ సంస్థ గలదు.

## ఆంధ్ర దేశములోని మఠములు

ఈ పట్టికలో 250 రూ. గాని దానికి పైబడిగాని సంవత్సరాదాయము కలిగినవి మాత్రమే సూచింపబడినవి.

| వరుస సంఖ్య. | పేరు | ఆదాయము, |
|---|---|---|
| **విశాఖ జిల్లా.** | | **రూపాయలు** |
| 1. | శ్రీ గోకర్ణమఠం, పాలకొండ | 803 |
| 2. | శ్రీ గోదూడు బావాజీ మఠం, | ... |
| | గంగు మఠము. | ... |
| 3. | శ్రీ లక్ష్మీనారాయణ బాలాజీ మఠం, | |
| | నన్నపాడు | 1,000 |

4. శ్రీ లక్ష్మణ బాలాజీ మఠం, టెక్కలి — 2,524
5. శ్రీరాధాకాంత మఠం, టెక్కలి — ...
6. శ్రీ గోపీనాథ మఠం గుండి చబాడి, తర్లకోట — ...
7. శ్రీ బృందావన చంద్ర మఠం, బత్తిలి, పాతపట్నం తా. — 867
8. శ్రీ బాలాజీ రామస్వామి మఠం, చంగుడి — 1,110
9. శ్రీ రఘునాథ మఠము, ముఖలింగం — ...
10. శ్రీరాధా గోవింద మఠము, తుంగ తంపర — 800

## తూర్పు గోదావరి జిల్లా

1. ఆంజనేయ మఠము — 1,500
2. గోడాడ గోశాయి మఠము — 650
3. జగన్నాథస్వామి మఠము — 1,000
4. నరసింహ-మాధ్వ మఠం — 286
5. వెంకటేశ్వర మఠము — 500

## పశ్చిమ గోదావరి జిల్లా

1. బైరాగి మఠం, కస్పా, పెంటపాడు, తాడేపల్లి గూడెం తాలూకా — 6,005

## గుంటూరు జిల్లా

1. బైరాగి మఠం, అమ్మన బ్రోలు — 685
2. బైరాగి మఠం, అన్నవరప్పాడు — 1,500
3. బైరాగి మఠం, చిరుత నుప్పలపాడు — 390
4. గోకర్ణ మఠం, నిజాం పట్నము — 600
5. జగన్నాథ మఠం, గుంటూరు — 2,805
6. శంభుదేవర మఠం, చేబ్రోలు — 1,800

## కృష్ణా జిల్లా

1. బావాజీ మఠం, బెజవాడ — 1,500
2. లింగాయతమఠం, శివలంకయ్య మఠం బెజవాడ — 600
3. బావాజీ మఠం, సింగరాయ పాలెం — 6,712
4. బ్రహ్మానందస్వామివారి మఠం జగ్గయ్య పేట — 600

## బళ్లారి జిల్లా

1. విరక్తి మఠం, బ్రూసుపేట — 4,800
2. నారాయణస్వామి మఠం, కుడితిని — 500
3. కొత్తూరు బసవేశ్వర మఠం, సిరిగుప్ప — 200
4. విరక్తి మఠం, ఉత్తంగి — 1,000
5. మదన స్వామి-గౌరీ బసవేశ్వర స్వామి మఠం, కూలహల్లి — 2,000
6. చింతామణి మఠము, గౌరీపురం — 2,000
7. శంకర భారతీ మఠం-విరూపాక్ష పీఠం — 5,000
8. విరక్తి మఠం, కంపిలి — 800
9. తెగ్గిన మఠం ,, — 600
10. మూరుల్ల సిద్ధేశ్వరస్వామి మఠం, ఉజ్జిని — 12,000
11. ఆనెగొంది సింహాసంధి మఠం, హీరెహాల్ — 500

## అనంతపురం జిల్లా

1. పార్వతీ సింహేశ్వర మఠం గుంతకల్లు — 1,728
2. విరక్తి మఠం, కనకండ్ల — 1,375
3. గవిమఠం, ఉరవకొండ — 20,000
4. చెన్నమల్లప్ప మఠం, ఉరవకొండ — 1,000
5. నిడిమామిడి జంగం మఠం, నిడిమామిడి — 1,000
6. సిద్ధలింగేశ్వర మఠం, ఎల్లమూరు — 800

## కర్నూలు జిల్లా

1. తిరుపతి నిరంబమఠం, కంభం, — 400
2. మురగి మఠం, కల్వ — 425

## కడప జిల్లా

1. శ్రీ చంద్రమౌళీశ్వర మఠం, పుష్పగిరి — 26,900

## చిత్తూరు జిల్లా

1. తిరుపతి బుగ్గ మఠం
2. తిరుపతి పెద్ద జియ్యంగారి మఠం — 2,912
3. తిరుపతి చిన్న జియ్యంగారి మఠం — 1,088
4. తిరుపతి గంగారామ్ మఠం
5. తిరుపతి హాతీరామ్‌జీ మఠం — 50,000
6. ఆవులపల్లి పెద్దమఠము — 500
7. చేడాల, చేడాల, మఠం — 700
8. కందూరు పెద్ద మఠం — 800

| | | |
|---|---|---|
| 9. | కొత్తకోట గవిమఠం | 520 |
| 10. | కుమారగుంట, కుమారగుంట మఠం | 800 |
| 11. | పుంగనూరు పెద్ద మఠం-సెక్కబంద మఠం | 1,130 |
| 12. | పుంగనూరు మహంతు మఠం | 300 |
| 13. | పుంగనూరు చిత్తారి మఠం | 320 |
| 13. | రామ సముద్రం, రామ సముద్ర మఠం | 640 |
| 15. | జంగాలపల్లి. జం . ాలపల్లి మఠం | 600 |

(హిందూ రెలిజియస్ ఎండోమెంటు బోర్డువారి పట్టికలను బట్టి తయారు చేయబడినది.)

## బ్రహ్మ సమాజము.

సంఘములో దుర్భరమైన దురాచారములు, మూఢ విశ్వాసములు ప్రబలమై, జాతి మత ద్వేష ఫలితమైన ఐకమత్యాభావము, క్రీస్తుమత ప్రచారము అధికంగా వున్న సమయంలో దేశ సముద్ధరణానికి వెలిగిన జగజ్జ్వాల శ్రీ రాజారామ మోహనరాయలు.

దేశాభి వృద్ధికి ప్రతిబంధకంగా, కంటక ప్రాయముగా వున్న మూఢాఛారములు, హైందవ మతములో వేళ్లు క్రమేపి పాతుకొని, ప్రజా జీవితమును భయంకరముగా మార్చుచుండుటచే నరహత్యలు, శిశుహత్యలు, సహగమనము మొదలైన దురాచారములుగల హిందూ మతమును సంస్కరించి, పరిశుద్ధాస్తిక మతమును నెలకొల్పుటకు రామమోహనులు బ్రహ్మ సమాజమును 1828 వ సం.'న స్థాపించెను ఆనాటి నుండి వర్ధమానమగుచు, దేవేంద్రనాథ ఠాకురు, కేశవ చంద్రసేనులుగార్ల కృషి ఈ సమాజమునకు ఒక క్రొత్త స్వరూపము నిచ్చెను. నూతనాదర్శములతో ప్రత్యేక సంఘముగా ఏర్పడిన ఈ సమాజము వంగ రాష్ట్రమునకేకాక దేశమంతటా శాఖోపశాఖలుగా విరాజిల్లినది.

రామమోహనరాయలు బ్రహ్మసమాజమును 1828 లో స్థాపించుట.

మొదట మద్రాసు రాజధానిలో కేశవచంద్రసేనుని యుపన్యాసములవలన బ్రహ్మ సమాజ మతానురక్తి హెచ్చి, చెన్నపట్నములో వేద సమాజము, అక్కడక్కడ ప్రార్థన సమాజములు, బ్రహ్మ సమాజములు వెలసెను. ఈ సమాజ కార్యక్రమానికంతకున్నూ, మన ఆంధ్రదేశమున రాజమహేంద్రవరము, మచిలీపట్నము, కాకినాడ కేంద్ర రంగములు,



శ్రీ రాజారామ మోహనరాయి.
(ఆధునిక భారత వికాసానికి మూలపురుషుడు).
బ్రహ్మసమాజ మతస్థాపకుడు (1827-32)

రాజమహేంద్రవరమున దీనికి నాయకులు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారున్నూ, బందరులో శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారున్నూ. వెంకటరత్నం నాయుడుగారు కాకినాడ పిఠాపురం రాజాగారి కళాశాల ప్రధానాధ్యాపకులుగా వెళ్లుటతో, కాకినాడకూడా ఈ మతమునకు కేంద్రరంగమయ్యెను.

బ్రహ్మసమాజ వ్యాప్తి – ఫలితము

వంగరాష్ట్రోద్యమము, స్వాతంత్ర్యోద్యమం మొదలైన సంచలనములు ఈ సమాజమునకు, ఆంధ్రదేశమున దాని వ్యాప్తికి బలమిచ్చినవి. బిపిన్‌చంద్రపాలుని ఆంధ్రదేశాగమనానంతరం, మనకున్నూ, ఈ సమాజమునకున్నూ సంబంధములు సన్నిహితములైనవి. రాజమహేంద్రవరమున బ్రహ్మసమాజ వ్యాప్తికి తోడ్పడినవారు పంతులుగారు గాక, దేశిరాజు పెదబాపయ్యగారు,

కవికొండల సాంబశివరావుగారు, ఇప్పకంటి సుబ్బ కృష్ణయ్యగారు, పాలపర్తి నరసింహంగారు, కామరాజు హనుమంతరావుగారు.

కాకినాడలో వెంకటరత్నంనాయుడుగారు సాధనా శ్రమమును నెలకొల్పి, కృషి చేసిరి. పిఠాపురంరాజాగారు నాయుడుగారి ప్రోత్సాహముతో దీనికి ఒక వన్నె దిద్దిరి. వారి కళాశాల, అనాథశరణాలయము, సమాజ భవనములు వీటి చరిత్రలు బ్రహ్మసమాజచరిత్రలోని భాగములు. నాయుడుగారి వద్ద విద్య నభ్యసించిన ముట్నూరి కృష్ణారావుగారు, అ. కాళేశ్వరరావుగారు పట్టాభిసీతారామయ్యగారు నూతనాదర్శముల పెంపొందించుకొని, విశాల భావములు గలిగి, అప్పటినుండియు సాంఘికజీవితములో ప్రత్యేక స్థానముల సముపార్జించుకొని అసమానమైన ప్రజాసేవ చేయుచున్నారు.

బ్రహ్మ సమాజ ముఖ్య ధర్మములు ప్రారంభమునుండి ఇప్పటివరకు ఒకే ఆదర్శములు గలిగియున్నను, కాల పాత్రాల ననుసరించి, రామమోహనుని కాలమున ఒక పుంతలోను, కేశవచంద్రసేనుని కాలమున ఒకపుంతలోను సమాజ కార్యక్రమము నడచినది.

అన్ని మతములును, అన్ని సిద్ధాంతములును సమరస భావమునే కలిగియున్నవనియు, దేవుడొక్కడే అనియు, "ఏకమేవాద్వితీయం" అనే సిద్ధాంతమును అందరూ నమ్మవలెననియు బ్రహ్మ సమాజము ఉన్నత ఆదర్శములు అందురు. సత్యస్వరూపుడు, జ్ఞాన స్వరూపుడు, సర్వవ్యాపి అయిన పరమాత్మ ఆత్మస్వరూపు డగుటచేత విగ్రహములు దైవములని తలంచుట గొప్ప దోషమందురు. నిశ్చల భక్తి విశ్వాసములతో ఈశ్వరేచ్ఛ ననుసరించుట జీవాత్మయొక్క పరమావధి అని తలంతురు. అవినాశి సిద్ధాంతమును వీరంగీకరింతురు. సర్వ జనసోదరభావము గలిగి, విశ్వమానవకోటి యేకకుటుంబముగా పరిగణించవలె నని వీరి ఆదర్శము. పరమేశ్వరుడు కరుణామయుడు; అతనిని భక్తిపూర్వముగా ధ్యానించి, పాపములను తలచుకొని పశ్చాత్తప్త హృదయముతో పాప విమోచనకు ప్రార్థన సలుపుదురు.

ఈ ఉన్నతాదర్శములు గలిగి యుండుటచే, ఈ మతము ప్రజాభిరుచికి పాత్రమైనది. సభ్యులందరును ప్రతిభావంతులు, ప్రజాసేవా ధురంధరులు.

కందుకూరు వీరేశలింగం పంతులుగారు, నాయుడుగారు దీనిని వ్యాపింప జేసిరని చెప్పియుంటిమి. 1893-94 నాటికే ఈ సమాజము చాలావరకు వ్యాప్తి చెందినది. పర్లా కిమిడిలో, బరంపురంలోగూడా ఈ ప్రార్థన సమాజములు ఏర్పడినవి. దానికి మూలకారులు పర్లాకిమిడిలో పైడి ఘంటం వెంకట కృష్ణారావుగారు, బరంపురంలో, ఎ.వి. పాత్రో, జయంతి వెంకటనారాయణ మొదలైనవారు.

జాతిమతకులభేదములు బ్రహ్మసమాజమునందు పాటింపబడవు. వివిధవర్ణములవారున్ను, కులభేదములు పాటింపక భోజనప్రతిభోజనములును వైవాహికాది సంబంధములును కలిగియుందురు. వీరు వినాశ బ్రహ్మసమాజ మత హేతువులగు కార్యములు సలుపక, ఫలితములు. స్నేహభావమునే అభివృద్ధి చేతురు. బ్రహ్మసమాజమున స్త్రీలకు పురుషులతో సమానస్వాతంత్ర్యము గలిగియుండుటచేత, విద్యా విజ్ఞాన కృషులలో స్త్రీలు పాల్గొని ముందంజవేసిరి. నారీమణులలో పెద్ద పెద్ద పరీక్షలలో ఉత్తీర్ణలైనవారు, శాస్త్రములలో పాండిత్యము సంపాదించుకున్నవారు బ్రహ్మ సమాజములో అనేకులు గలరు. సముద్రయాన, విధవా వివాహముల నిషేధమును వీరు తొలగించుటకు ప్రయత్నించిరి.

మతసాంఘిక జీవనసోపానమున బ్రహ్మసమాజము పెట్టిన పూల దీపాలు అనేకమున్నవి!

## దివ్యజ్ఞాన సమాజము

అమెరికాలో న్యూయార్కు నగరమందు 1875 సం॥ న నవంబరు 17 వ తేదీని దివ్యజ్ఞాన సమాజము స్థాపించబడెను. కర్నల్ స్టీవ్, ఆల్కాటు, మదాంబ్లావట్స్కి గార్లు సంస్థాపకులు. బొంబాయి నగరంలో 1879 సం. దీని ప్రధాన కార్యాలయము (హిందూ దేశమున) స్థాపించ బడినది.

ఈ కార్యాలయము 1882 సం॥ మున చెన్నపట్నమునకు సామీప్యమున నున్న అడయారుకు మార్చిరి. అప్పుడు ఈ సమాజములో జేరిన ఆంధ్రులలో ముఖ్యులు: శ్రీస్వామి



ఆనిబిసెంట్—దివ్యజ్ఞాన సమాజ ప్రవర్తకు రాలు; కలకత్తా కాంగ్రెస్ అధ్యక్షురాలు.

తల్లాప్రగడ సుబ్బారావు గారు, రావు సాహెబ్ జి. సుబ్బయ్య చెట్టి గారు, శ్రీ పి. అయ్యాలు నాయుడు గారు. వీరు సమాజ వ్యాప్తికి అనేక విధముల తోడ్పడిరి. 1882 సం, మే నెల లో నెల్లూరి లోను, గుంటూరు లోను, సమాజ శాఖ లేర్పరచ బడినవి. తరువాత, విరివిగా సమాజ శాఖలు దేశ మంతటా అల్లు కొన్నవి. ఇందుకు ఆనిబిసెంట్ అమ్మగారి ప్రాభవము ముఖ్య కారణము.

అప్పుడు సమాజ శాఖల పరిపాలన సౌకర్యము కొరకు, ఒక ఫెడరేషన్ ఏర్పడి, కొంత కాలమునకు గంజాం, విశాఖ, తూర్పు పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాలను దాని యాజమాన్యము క్రిందికి తెచ్చు కొనెను. రాయలసీమకును, నైజాము రాష్ట్రమున కున్ను ఇదే విధముగా ఫెడరేషనులు ఏర్పడి పనిచేయు చున్నవి. ఇప్పటికి ఈ సభ్యులు దాదాపు 1000 మందికి పైగానుందురని అంచనా వేయబడినది.

ఇది స్వమాతాభిమానమునే తిరిగి ప్రసరుజ్జీవింప జేసి హిందువులు క్రైస్తవ మతములో కలియకుండా నిరోధించి నది. స్వమాతాచారముల పైగల తిరస్కృతిని ఆదరణగా వీరు మార్చ గలిగిరి. నెల్లూరిలో ఈ సంఘమువారు ఒక వేద పాఠశాలనుగూడా స్థాపించిరి. రాజమహేంద్రవరంలో న్యాపతి సుబ్బారావుగారు దీనికి మూల విరాట్టు. వారు గీతాధ్యయనమును వృద్ధి చేయుటకు పరీక్షలను గీతా తరగ తులను ఏర్పరచిరి.

ఈ సమాజము వారు, ప్రజలలో విద్యా వ్యాప్తికి అనేక పాఠశాలలు స్థాపించిరి. వీరిచే నిర్వహింప బడుచున్న మదనపల్లి కళాశాల బాల బాలికలకు ఆత్మవికాసమును గలిగించు శిక్షణ మిచ్చుచున్నది. సర్కారులలో అనేక కార్యాలయములు గలవు. అందు గుడివాడలో రూ. 25000 లు, విలువగల మందిరమున్ను, గ్రంథాలయమున్ను ఉన్నవి.

జాతిమత స్త్రీ పురుష వ్యత్యాసములు పాటింపక సర్వమత సోదరత్వమును ప్రతిష్ఠించుట, ఆ ఉద్దేశమును సాధించుటకు సర్వమతములు పరిశోధించుట, మానవాభ్యున్నతికి, తగిన దేశీయమతమును అందచేయుట పరిణామరూపకమయిన ఈశ్వరసంకల్పమును మానవునకు బోధించుట, ఆసంకల్ప మును నెరవేర్చగల సోదరులతో (ఋషులతో) సహకా రముగ పనిచేయుట, జ్ఞానముతో గూడ, భక్తివిశ్వాసము లను కలిగించుట, ఐహిక జీవితమునకును పరలోక జీవిత మునకును గల సంబంధము నిర్ణయించుట మొదలైనవి



శ్రీ జిడ్డు కృష్ణమూర్తి.
(దివ్యజ్ఞాన సమాజంలో ప్రధాన పురుషుడు.)

ఈ సంస్థయొక్క ఆశయములు. వీరు అనేక గ్రంథములను రచించి దివ్యజ్ఞానసారత్వము అభివృద్ధి చేసిరి.

వీరున్నూ, హరిజనోద్ధరణమునకు, బాల్యవివాహ నిర్మూలమునకు, స్త్రీజనోన్నతికి తోడ్పడిరి. హిందూమతమునకు కల్పించిన కొన్ని కళంకములను శాస్త్రరీత్యా పరిశోధించి, వాటిని తొలగించి, హైందవమతము అనుసరణీయము గావించిరి.

ఈ సమాజము నందలి మహాపురుషులలో ఎన్నదగిన శ్రీజిడ్డు కృష్ణమూర్తిగారు ఆంధ్రులే! ఏమతమువారు ఆ మత ధర్మములను అనుష్ఠించి పురుషార్థమును పొంద వచ్చును; ఒక మతము నుండి మరియొక మతమునకు మార నక్కరలేదని ఈ సమాజమువారు వాదింతురు. ఈ సభ్యులలో ప్రముఖులు అల్లాడి మహాదేవ శాస్త్రిగారు, శ్రీ వావిలాల శివావధాన్లు గారు, శ్రీతల్లావజ్ఝల శివశంకర శాస్త్రిగారు, తూములచెర్ల రామచంద్ర రావుగారు, శ్రీజంగమకోట శ్రీనివాస రావు గారు, శ్రీ గుంటూరు వెంకట సుబ్బారావు గారు, కాకర పర్తి సత్యనారాయణ గారు, కుటుంబశాస్త్రిగారు, తుమ్మలపల్లి గోపాల కృష్ణమూర్తి గారు మొదలైన వారు.

ఈ సమాజము "ప్రాణులను ఐక్య మొందించు పరమ ప్రేమ; భూతకోటిని దీపించుజ్యోతిరేఖ" వంటిది. "సత్యాన్నాస్తిపరోధర్మః" అనే సిద్ధాంతము ఈ సమాజమునకు మూలసూత్రము!

## రాధాస్వామి మతము

రాధాస్వామి మతస్థులను సత్సంగులందురు. దేశములోని సత్సంగములకు దయాల్బాగు కేంద్ర సత్సంగము, రాధా స్వామి సంఘము యొక్క ఆశ్రమమునకు దయాల్బాగు అని పేరు. ఈ పదమునకు దయాళునితోట అని అర్థము. ఈ తోట ఆగ్రా నగరమునకు ఒక మైలు దూరములో వున్నది. సంఘ ఐక్యతకు, అభివృద్ధికి అవసరమయిన వివిధసంస్థలను నెలకొల్పి ప్రధానాశ్రమము నుండి రాధాస్వామి దయాళుని సందేశమును దిశదిశలకూ అందించుచున్నారు.

సంఘస్థాపకులు స్వామిజీ మహరాజావారు. రాధాస్వామి మతప్రవర్తకులలో అయిదవవారు, సాహెబ్జీ మహారాజుగారు. వీరి ఉద్యమవ్యాపకమునకై అనల్పమైన కృషిచేసిరి. ఈ మతస్థులకును పారమార్థికచింత ప్రధానము. అది వినా వారు జాతి, మత, కుల వివక్షతలను గూడా పాటించరు. దయాస్వరూపుడైన పరమాత్మ మోక్షమార్గము ఏర్పరచి, ముముక్షువులకు అనంతమైన తోడ్పాటు నిచ్చుచున్న పారమార్థికోపకృతికి కృతజ్ఞత సూచించుచు వీరు సత్సంగము చేయుదురు. దానిని బట్టి వీరికి సత్సంగులని పేరు.

ఈశ్వరాస్తిక్యము, మరణానంతరము జీవునిఅవినాశస్థితి, జీవేశ్వరైక్యములలో భక్తుల కాచరణపూర్వక విశ్వాసము లుండుట ప్రధాన విషయములు.

సృష్ట్యాది యందు చైతన్యశక్తి యందు గలిగిన సంచలనము చైతన్య ధారారూపమున నిర్గమించెననియు, ఆప్రచండ ధారనుండి చైతన్య శబ్దము లుద్భూతములైన వనియు, అవి మానవోచ్చారణలో "రాధా" "స్వామి" రూపముననుండుటచే రాధా స్వామి నామము ఆదిశబ్దము, సర్వేశ్వరుని నిజనామ మని ఈ మతస్థుల నమ్మకము.

భక్తుడు చైతన్య శక్తికి భంగము కలుగకుండా, మానసిక సమత చెడకుండా అంత రంగికముగా బహిరంగముగా తన కోరికలను నియమబద్ధము చేసికొని, శ్రమచేసి జీవించవలెనని సామాన్య సూత్రమును అవలంబించుచు జీవించ వలెను. గురువును జ్యేష్ఠ సోదరునిగా భావించుచు, పారమార్థికముగా పరిణితుడైన క్రమమునకు అనుగుణముగా, పరమాత్మకును, గురువునకును, తనకును స్వరూప భేధము లేదని ప్రత్యక్షానుభవములోనికి తెచ్చుకొనవలెనని వారందురు.

ఈ మతస్థులు రాజమండ్రి, తుని, అమలాపురం, శంఖవరం, సామర్లకోట, కొవ్వూరు, తణుకు, భీమవరం, పాలకొల్లు, బెజవాడ, గుంటూరు, నర్సరావు పేట, గుడిపాడు, బొగ్గరం, తెనాలి, గిద్దలూరు, జౌకు, ద్రోణాచలం, వెద్దసర్తి, గుంట కల్లు, చోడవరం, అనకాపల్లి, విశాఖపట్నం, విజయనగరం, బొబ్బిలి, సాలూరు, శ్రీకాకుళము, ఆస్కా, బరంపురం, హైదరాబాదు, హనుమకొండ మొదలైన ప్రాంతములందలి ఆంధ్రులలో అనేకులు గలరు.

నేడు మన ఆంధ్రదేశములో తక్కిన ప్రదేశములందున్నట్లే సనాతనులును గలరు, సంఘ సంస్కర్తలును గలరు; తమ తమ మతములందు పట్టుదల గలవారును గలరు, ఉదాసీనులును గలరు. అయితే, జాతిమత వైషమ్యులవల్ల దేశస్థుల ఐక్యమునకు భంగము కలుగరాదనువారి సంఖ్య ఎక్కువగుతున్నది.

# మహమ్మదీయ మతము



మహమ్మదు ప్రవక్త బోధించిన మతమగుటచే, దీనికి మహమ్మదీయమత మనే పేరు వచ్చినది. కాని, దీని వాస్తవమైన పేరు ఇస్లాం మతము. ఇస్లాం అనగా "శాంతి" అని అర్థము. సలాము అనే పదము ఈ ఇస్లాం అనే పదమునుండి వచ్చినది.

**మహమ్మదు ప్రవక్త — మహమ్మదీయ మతము**

క్రీ. శ. 570 లో మహమ్మదు ప్రవక్త అరేబియా దేశములో జన్మించెను. అప్పుడు అరేబియాదేశము నాగరికతలో ఇతర దేశములకన్న ఎక్కువ వెనుకబడి, ప్రజలు దురాచారములకు లోనై, కలహప్రియులుగా నుండిరి. ఈ దుస్థితి చూచి మహమ్మదు తన దేశస్థులను సన్మార్గమునందు పెట్టవలెనన్న కాంక్షతో ఈ నూతనమతమును ఉపదేశించెను. మహమ్మదు చాలా మృదుస్వభావుడు; 'దయార్ద్రహృదయుడు. వానినిగూర్చి "పర్దా వెనుకనున్న కన్యకకంటెను వినమ్ర స్వభావు"డని చెప్పబడెను.

"దేవుడు ఒక్కడే; నక్షత్రములు, గ్రహములు మొదలయినవాటిని దేవతలని అరబ్బులు పూజిస్తున్నారు; ఇవన్నియు దేవుడు పుట్టించినవి; ఆ దేవుడు రూపరహితుడు, అతనిని విగ్రహముగా చేయుట పాపము; విగ్రహారాధన చేయరాదు; దేవుని భక్తులైన జనులందరు, కలహింపక అన్యోన్యముగా మెలుగుచుండవలెను." అని తన మతమును మక్కాలో బోధించెను.

ఈ మతము అతడు బోధించినప్పుడు చాలా కొద్దిమందికే నచ్చినది. పెక్కుమంది దీనిని విపరీతముగా నున్నదని భావించి, పూర్వమునుంచీ వస్తున్న ఆచారములను విడిచిపెట్టుటకు ఇష్టపడక, కొందరు అతనిని హత్య చేయుటకే ప్రయత్నించిరి. మక్కాలో శత్రువులధికమగుటచే అతడు క్రీ. శ. 622 లో మక్కానుండి మదీనాకు పారిపోయెను. ఈ పారిపోవుటకే హిజారా అని పేరు. ఇదే మహమ్మదీయ శకారంభముగా పరిగణింతురు. మదీనాలోనివారు చాలామంది అతని మతమును అవలంబించిరి. తరువాత, మక్కాలోనివారుగూడ ఈ మతములో చేరిరి. పిమ్మట, ఈ మతము ఆదేశమునందుండి తక్కిన దేశములకు వ్యాపించినది. ఈ మతావలంబులనే మహమ్మదీయులనిన్ని, ముసల్మానులనిన్ని అందురు. క్రీ. శ. 632 లో మహమ్మదు చనిపోయెను. అతని మరణానంతరము, ఈ మతము అరేబియా, పెర్షియా, సిరియా, తుర్కిస్థానము, ఈజిప్టు, స్పెయిన్, సింధు దేశములకు వ్యాపించినది.

కురానుగురించి ఉమర్ అలీషాగారు వ్రాస్తూ, "ఈశ్వర దత్తమై ఇస్లాము మతమును శాసించు పవిత్ర గ్రంథము కురాను; 'అకార, లకార, మకారాత్మకమైన యీ గ్రంథము నిస్సందేహముగ ముముక్షువులకు ధర్మమార్గ మగపర్చుచున్నది' అని ప్రారంభమై, 'ఇస్లాము మత ధర్మము అమృతోపమున ముగించితిమి' అని ముగింపబడినది" అనిన్ని "ఈ కురాను కిప్పటి కెవరును నిజమైన టీకా తాత్పర్యములు వ్రాయలేదు. కావున దీని యథార్థము ప్రపంచమునకు గోచరమగుట లేదు. ఇదిపర వర్తకులు పురాణమువలె వ్రాయుచున్నారు. ఇది గొప్పప్రమాదము. దీని సరియైన యర్థమే లోకమునకు నివేదించిన మహమ్మదీయమతముపై గల ప్రవాదములంతరించు ననుట నిస్సంశయము. నేను దీనికి మూడువేల పేజీలలో ప్రతిపదార్థ వ్యాఖ్యానము వ్రాసినాడను గాని నేటివరకది ముద్రింపబడలేదు" అనిన్ని 1933-4 శ్రీముఖ సంవత్సరాది ఆంధ్ర పత్రిక సంచికలో తెలియజేసిరి.

డాక్టరు యం. హెచ్. సయ్యద్‌గారు "ఇస్లాం మతస్థులైన యోగులు కొందరు ఎన్నడును జంతువుల వధించు ఆచారమునకు చేయూత నీయలేదు. ప్రపంచమునందలి యావన్మంది మహమ్మదీయులును, భగవదారాధన నిమిత్తము సమావేశమగు, "హజ్" రోజులలో అహింసాధర్మ

మును సంపూర్ణముగా పాలింతురు. సమస్తమానవులకు గురువగు మహమ్మదుప్రవక్తను భగవంతుడు, "మేము సర్వలోకములపై జాలిదలచి మాత్రమే నిన్ను పంపుచుంటిమి (కురాన్ XXI 107)" అని ఆదేశించినప్పుడు అహింసా సిద్ధాంతము తప్ప మరియొక సిద్ధాంతమును వారు ఎట్లు బోధింపగలరు? కొన్ని చారిత్రక కారణముల వలన మహమ్మదీయ మతము హింసకు పర్యాయపదముగా పరిగణింపబడుచున్నది. మహమ్మదీయ ప్రభువులు ఒక చేత కురానును, మరియొక చేత కత్తిని ధరించి, దేశములను జయించిరని వర్ణింపబడియున్నది. కాని కురానున మాత్రము 'మతమున నిర్బంధము లేదు' అని స్పష్టముగా జెప్పబడినది. (సురా ii అయత్ 257) ఈ వాక్యమును వారు తమ ప్రథమ శిష్యులలో కొందరు తమ కుమారులనుగూడ బలవంతముగా మహమ్మదీయ మతమున జేర్చుటకు ప్రయత్నించుచుండినప్పుడు చెప్పిరి. తండ్రియే తన కుమారుని బలవంతముగా మహమ్మదీయ మతమున చేర్చుకొనరాదని చెప్పియున్నప్పుడు, ఇతరులపై బల ప్రయోగముచేసి వారికి మహమ్మదీయ మతమిప్పించుట, మహమ్మదు మతమునకు వ్యతిరేకము కాదా? ముమిన్ అగువాడు, 'ఎవడు వ్యభిచరించడో, ఎవడు అపహరించడో, ఎవడు మద్యపానము చేయడో, ఎవడు దోపిడి చేయడో, ఎవడు మోసము చేయడో వాడే. అతడు దయావిశ్వాసాది సుగుణములకు నిలయము. దయలేనివాడు విశ్వాసముకూడా లేనివాడు. సజీవమైన దేనినిగాని చంపకుము (యిబ్న్ అబాస్) హింసింపకుము' అని బోధించినాడు. అహింసయే దీని ప్రాతిపదిక" అని చెప్పియున్నారు. భరతఖండము సుల్తానుల పాలన క్రిందికి వచ్చిన తరువాత ఈ మతమున్ను మన దేశమున నెలకొన్నది.



డాక్టరు ఉమర్ అలీషా
(తెలుగు) కవి, ఎమ్. ఎల్. ఏ. (కేంద్ర)

మన ఆంధ్ర దేశమున గోలకొండ నవాబులకడ, హైందవ మంత్రుల ప్రాబల్య మెక్కువనియు; ఢిల్లీ చక్రవర్తులకు వెరచి, గోలకొండ నవాబులు తమ స్వాతంత్ర్యమునకై జనులపై నాధారపడియుండవలసి వచ్చుటచే, జనుల నెప్పుడును తమ మతములో గలియుడని నిర్బంధింపలేదు. మసీదులతోపాటు హిందూ దేవాలయములనుగూడ ఈనాములిచ్చి పోషించుచుండిరి. అందుచేత ఆంధ్ర దేశములో హిందూ మహమ్మదీయులకు అన్యోన్య ద్వేషము తక్కువ. మహమ్మదీయ మతసంపర్కమువలన హిందువులలో పౌరుష మెక్కువగుట తప్ప మరే మార్పులు రాలేదనియు; మహమ్మదీయ భక్తుల ఉరుసులు, పండుగలు మున్నగు వాటిలో హిందువులు పాల్గొనుట కద్దనియు పూర్వఖండమున చదివియే యున్నాము గదా!

అసలు ఆంధ్ర దేశమునకు ఈ మతము ఎప్పుడు ఎట్లు వచ్చినదన్న విషయమును పరిశీలించవలెను. దీనినిగూర్చి సుప్రసిద్ధులు డాక్టర్ ఉమర్ అలీషా కవి గారు ఇట్లు వ్రాయుచున్నారు.

" ఆంధ్ర దేశమున ముస్లిములు ౮ వ శతాబ్దమునుండియు ఉన్నట్లు చరిత్రలు చెప్పుచున్నవి. ఖాజాహిందర్ వలి, ఆతాయెరసూల్ అనే ఒక బలీయమైన జ్ఞాన సిద్ధుడు అజ్మీర్ ప్రవేశించి, ముస్లిం మతాంతర్గత యోగ మార్గమును (నమాజ్), ఏకేశ్వర తత్వ ప్రతిపాదకమైన ఆధ్యాత్మికతత్త్వ నిగూఢములు పాడ నారంభించెను. ఆతని మహామహిమాన్విత దివ్య ప్రచారమున కెందరో భారతీయులు ఇస్లాము

**మహమ్మదీయ మతవ్యాప్తి.**

మత మవలంబించిరి. ఆ విధానము ఆంధ్రదేశమున వివిధ రాష్ట్రముల వ్యాపించినది. పెక్కు ఫకీరులు సూఫీలయి వచ్చిరి. అందు కొందరు ఈ తెలుగు దేశమునకు వచ్చిరి. వారిలో షాజాబందే నవాజ్, గుల్బర్గ; షాహుస్సేన్, కర్నూలు; హిసమక్ మదీనా, విశాఖపట్నము; అఖిల్ అలీషా, పిఠాపురము; మీరాసాహెబ్, నాగూరు వచ్చిరి.

"ఖాదర్ వలీ మున్నగు ప్రతిభావంతు లెందరో సూఫీలు తెగలు తెగలుగా వచ్చుచు, మత ప్రచారము చేయుచుండిరి. వారి గోరీల దగ్గరకు నేటికిని యాత్రికులు పోయి దర్శించు చుందురు.

చరిత్రలో సంఘటిల్లిన అనంతాధిక సంక్షుభిత మహా సంగ్రామములలో పెక్కు ముస్లిం సైనిక కుటుంబములు ఈ తెలింగాణ దేశమునకు వచ్చి, నివసించి స్థిరనివాసము లేర్పరచుకొన్నారు. వారికి పెద్ద జాగీరులు ఇయ్య బడినవి. మసీదులు, పంజాలు నిర్మించబడినవి. నేటికిని వీరి మాతృభాష ఉరుదు. ఆంధ్రులకును ముస్లిములకును ఇక్కడేనాడును భేదభావములు లేవు. తెలుగు మాట్లాడు వారున్నా అక్కడక్కడ అనేకు లున్నారు. వారు పూర్వోక్త ఫకీరులచే మత పరివర్తనము చేయబడిన వారు. తెలుగు దేశమున మహమ్మదీయుల జనసంఖ్య చాలా తక్కువ. నూటికి నలుగురైదుగురు ఉందురు."

సాంఘికముగా, మహమ్మదీయులు, ఇప్పుడు మంచి స్థితిలో లేక పోలేదు. కొన్ని చోట్ల అత్తరులు చేయుట, చాపలు, గుడ్డలు నేయుట, కాగితములు చేయుట మొదలైన పారిశ్రామిక వృత్తులలో నున్నారు. నర్సరావు పేటలో చాలామంది మహమ్మదీయులకు వృత్తి క్యాంపు ఫర్నిచర్ చేయుట, ఏలూరులోను బందరులోను కొందరికి తివాసీల నేత వృత్తి. ఆదవానిలో కొందరు చక్కని జముఖానాలు నేయుదురు. కొందరు కూలీ నాలీ చేసుకొందురు.

వీరిలో ఉరుదూ, పారశీ భాషా పాండిత్యముగల వారున్న, కవులున్నా, అనేకులున్నారు. స్త్రీలలోను చదువు కొన్నవారు లేక పోలేదు. పండుగలలో తప్పక ఖురాన్ చదువు కొనుట కుటుంబీకుల ఆచారము. ఉరుదూ మహాకవులలో ఒక డగు "వలీ" ఆంధ్రుడు.

డా॥ ఆలమ్‌గారు (పెర్సనల్ అసిస్టెంట్ టుది సర్జన్ జనరల్), జహారుద్దీన్‌గారు (రిటైర్డ్ జిల్లా జడ్జి), అతని సోదరులైన షెహాబుద్దీన్‌గారు (ఐ. సి. ఎస్. జిల్లా జడ్జి), జయఉద్దీనుగారు (పోలీసు డెప్టీ కమిషనరు), కరమ్‌తుల్లాగారు (ఐ. సి. ఎస్. జిల్లా కలెక్టరు), హుమాయూన్ సాహెబ్‌గారు (రిటైర్డు, జిల్లా కలెక్టరు), జావాద్ హుసేన్‌గారు (ఐ. సి. ఎస్., జిల్లా కలెక్టరు), యాహయాలీగారు (జిల్లా జడ్జి), అజమ్‌తుల్లాఖాన్‌గారు (జిల్లా కలెక్టరు) మొదలయిన వారు మహమ్మదీయులలో ఉన్నతోద్యోగులు.

ఆంధ్ర దేశమున హిందువులకు ముస్లిములకు ఉన్న సామరస్యమును జూచి, షౌకతాలీగారు ఏలూరు వచ్చి నప్పుడు, "ఇక్కడ ఈ ఇరు తెగల మధ్య వైషమ్యములు ఈ షన్మాత్రము లేనప్పుడు నేను ఇక్కడికి దేనికి రావలసి వచ్చినదో నాకు భోధపడుట లే"దనిరి. వారి వాక్యము ఆశ్చర్య జనకము గాదు; గానీ, ఇటీవల నెల్లూరులో జరిగిన కలహములు లాంటివి మాత్రము ఆశ్చర్యసంతాపకరములు.

హిందువులు మహమ్మదీయ పండుగలకు పులి వేషములను వేసి, పీర్లకు మ్రొక్కుదురు. గోల్కొండ నవాబులు ఆంధ్ర సారస్వత పోషకులు. గుంటూరులో మస్తాను సాహెబు ఉరుసు, ఏలూరులో ఉరుసు, నర్సరావు పేటలో మదార్ సాహెబు ఉరుసులలోను, ఇంకా ఇతర ప్రాంతముల పీర్ల పండుగలలోను హిందువులు పాల్గొందురు. ఉమర్ అలీషా గారి తండ్రి మతప్రవక్త. వారికి హిందువులలో అనేకులు శిష్యులు గలరు.

కబీరు, రామదాసు, మొదలైన భక్తులు, వారి జీవితములు, హిందూ మహమ్మదీయ జాతీయ జీవన వికాసానికి స్వర్ణ రేఖలు. హిందూ మహమ్మదీయ సఖ్యత మన దేశపు కోట కొమ్ములు కట్టిన కాంతి ప్రదమైన స్వర్ణ తోరణము.



# క్రైస్తవ మతము



ఈశ్వరావతారముగా క్రైస్తవులు భావించు ఏసుక్రీస్తు జూడియాలో జన్మించెను. క్రీస్తు ప్రవక్త బోధలను బైబిలు లోని సువార్తలు తెలియజేయును. పతితమానవ జనోద్ధరణ మునకై, ఈశ్వరుని విశ్వజనీనత, పరలోక రాజ్య ప్రాప్తి అను నూతన సిద్ధాంతములను క్రీస్తు బోధించెను. ఆయన ప్రధాన బోధయైన పరలోక రాజ్య ప్రాప్తి సిద్ధాంతము మానవుల మనస్సుల కుత్తేజకమై పరిణామకరమయ్యెను. క్రైస్తవ సిద్ధాంతములను ప్రచారము చేసినవారిలో "పాల్" అను ప్రవక్త ముఖ్యుడు. క్రీ. శ. మొదటి రెండు శతాబ్దము లలో ఆమతము అనేక దేశములకు పరివ్యాప్తమై రోమక సామ్రాజ్య మతమయ్యెను. తరువాత ఈ మతము కొన్ని ప్రాంతముల క్షీణించినను; క్రమముగా బల పడి ఐరోపాదేశమత మయ్యెను.

క్రీ. శ. 3. 4. శతాబ్దముల కాలముననే కొందరు రోము సామ్రాజ్యపు క్రైస్తవులు వర్తకులతో దక్షిణ భారత దేశపు తీర ప్రాంతములకు వచ్చి, అచ్చట వాసములేర్పరచు కొని, క్రైస్తవ మతము బోధించినట్లు నిదర్శనములు కలవు. సిరియను క్రైస్తవులను ఆ సంప్రదాయపు క్రైస్తవులు తిరువా న్కూరు, ఇతర మళయాళ ప్రదేశములలో ఇప్పటికిని గలరు. వీరి కృషి ఆ మతము యొక్క వ్యాప్తి కే మాత్రము తోడ్పడ లేదు.

తరువాత, 15 వ. శతాబ్దపు కడపటి భాగములో పోర్చుగీజువారు హిందూ దేశమునకు వచ్చి, కార్ఖా నాలు ఏర్పరచుకొని వాణిజ్యము సాగించు చుండిరి. వీరిని జూచి డచ్చివారు, ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు హిందూ దేశపు ఆగ్నేయ మూలనున్న ద్వీపములతో తమ వాణిజ్యము సాగించుకొన వలెనని ఉద్దేశించి, సంఘము లేర్పరచుకొని వర్తకము చేయు చుండిరి. ఈ విదేశస్థులలో వ్యాపార విషయికములైన కలహములు పుట్టి, వారిలో ఆంగ్లేయులు విజేతలై, తుదకు, హిందూ దేశమునకు పాలకులైరి. ఆరంభములో పోర్చుగీజులతో వచ్చిన క్రైస్తవ మతము, దాక్షిణాత్య ప్రదేశములకు వచ్చి ఆంగ్లేయుల పాలనలో ప్రాబల్యము వహించినది. వారి మతము క్రైస్తవ మగుటచే "యథారాజా, తథా ప్రజాః" అనే లోకోక్తి ననుసరించి అనేకులు ఆ మతమును స్వీకరించు చున్నారు.

క్రైస్తవ మతాధికారి "పోపు." అతని పీఠము "రోము" నగరమున నుండును. 1485 లో ఐరోపాలో వచ్చిన నూతన వికాసము వలన కలిగిన మార్పులు, జర్మ నీలో "లూథర్" అను నతడు కలిగించిన సంచలనము, ఇంగ్లండులో హెన్రీ VIII అను ప్రభువు 'పోపు' అధి కారమును నిరసించి చేసిన మార్పులు, ఎలిజెబత్ రాణి స్థిర పరచిన 'చర్చి విధానము' క్రైస్తవ మతమున నూతన పరి ణామములకు కారణభూతమై, కాతలిక్కులు, జెసూట్లు, ప్రాటెస్టెంట్లు, కాల్వెనిస్టులు, మొదలైన నూతన మత శాఖలవారు, వారి పద్ధతులు, ప్రచారములోనికి వచ్చి నవి. కాతలిక్ మతమువారు క్రీస్తును దేవాంశ సంభూ తునిగా భావించి, ఆయనకు పూజలచేయుచు, క్రీస్తు ప్రోక్తమైన మత విధానమును అనుసరింతురు. కాతలిక్ మతాచార్యుల శిరోముండనము, మతస్థుల మ్రొక్కు బడులు, యజ్ఞవేదికలు, క్రొవ్వువత్తుల హారతులు, మంత్ర జపములు, విగ్రహములు, మొదలైన విషయములలో

కాతలిక్ మతాచార్యులకు హిందూ మతాచార్యులకు అనేక పోలికలున్నవి. అందుచేత ఈ కాతలిక్ మతము మొదట కొంత త్వరగా వ్యాప్తమయినది. మన ఆంధ్ర దేశమున గూడా ఈ కాతలిక్, ప్రాటెస్టెంటు చర్చిలకు సంబంధించిన మతస్థులు ఉన్నారు.

మన ఆంధ్ర దేశములోనికి కాతలిక్ మత మెట్లు వచ్చినది? అది ఇప్పుడు ఎట్టి స్థితియందున్నది? అన్న అంశమును పరిశోధించ వలసియున్నది. 18 వ. శతాబ్దములో జెసూట్ ఫాదరీలు 'కర్నాటక మిషన్' స్థాపన జేసి, ఆంధ్ర దేశపు దక్షిణ జిల్లాలలో ప్రచారముచేయ సాగిరి. జింజి, వేలూరు, చిత్తూరు, జిల్లాలోని పుంగనూరు, మైసూరు రాష్ట్రిమందలి చిన్నబలిపురములో కొంత భాగములోను, అనంతపురము జిల్లాలోను, వారు మత బోధ సాగించు చుండిరి. ఫాదర్ మాడ్విట్ అను నతడు పుంగనూరులో వెలమ వంశజురాలైన ఒక వితంతువునకు, ఆమె పిల్లలకు 'బాప్టిజము' నిచ్చెను. (1701) తర్వాత అనంతపురం జిల్లాలలో రెడ్లు, తోటీలు, కమ్మలు క్రైస్తవ మతము స్వీకరించిరి. కడప జిల్లాలోని కృష్ణాపురం, మాడిగుబ్బ, కంబలదిన్నెలలో (1533) చర్చిలు వెలసినవి. అక్కడ మొత్తము 16 కాతలిక్కుల స్థావరములు ఏర్పడినవి. 18 వ. శతాబ్ద ప్రథమార్థమున, నెల్లూరు జిల్లా కాతలిక్ మత రంగములో ప్రధాన స్థానము పొందియుండెను. వెంకటగిరిలో అనేకులు రాజబంధువులు, పురవాసులు అప్పటిలో ఆ మతమును స్వీకరించినట్లు తెలియుచున్నది. గండికోట సీమలో సాలెలు, కరుబలు, కమ్మలు గూడా అనేకులు ఈ మతమును స్వీకరించిరి.

కానీ, 1743 లో కంబలదిన్నె చర్చిని నైజాము నవాబులు పడ కొట్టించిరి. తర్వాత, మాడిగుబ్బ మొదలైన ప్రదేశములలోని క్రైస్తవాలయములను ఆప్రదేశపు పాళిగారులు విధ్వంసము చేసిరి. ఈ విధముగా క్రైస్తవ మత వ్యాపకమునకు ఆదిలో ఆటంకములు ఏర్పడినవి. దీనికి 1773 లో 'జీసస్ సొసైటీ'ని అణగ ద్రొక్కుట తోడైనది. పిమ్మట 'ఫ్రాన్సు ఫారిన్ మిషన్ సొసైటీ' వారు 1853 వరకు తెలుగు నాటి క్రైస్తవ మతానుయాయుల నైతికఆధ్యాత్మికాభివృద్ధికై కృషి సలిపిరి.

ఇటీవల స్థాపితములైన 'విశాఖపట్నం మిషన్' (1845); 'హైదరాబాదు మిషన్' (1851) లు తెలుగు నాటను, నిజాంమండలమునను కాతలిక్ మత వ్యాప్తిచేయుచుండెను.

ప్రారంభమునుండియు మత విషయికముగా మద్రాసులో కలపబడియున్న నెల్లూరు, గుంటూరు, కర్నూలు, కడప, అనంతపూరు, చిత్తూరు జిల్లాలు ప్రత్యేకింపబడి ఒక 'Diocese' మతమండలము క్రిందికి తేబడినవి. బళ్లారి, రాయచూరు జిల్లాలు ఒక ప్రత్యేక కత్యుక్రిందికి తేబడినవి. కృష్ణా· పశ్చిమ గోదావరి జిల్లాలు 1938 లో ఒక ప్రత్యేక 'Diocese' మతమండలముగా ఏర్పరచబడినవి.

1940 లో గుంటూరు జిల్లా నెల్లూరు నుండి విభక్తమయి ఒక ప్రధానమైన మతమండలమైనది. దీనికి ప్రథమ ఆంధ్ర బిషప్ రైట్ రెవ. పొతకమూరి తామస్. డి. డి. గారు అధికారము వహించి, మత బోధ గావించుచున్నారు.

విశాఖ, తూర్పు గోదావరి జిల్లాలలో 11,0900; కృష్ణా జిల్లాలో 29,000; గుంటూరు జిల్లాలో 31,000; నెల్లూరి జిల్లాలో 5,500; కర్నూలు జిల్లాలో 4,500; కడప జిల్లాలో 4,400; అనంతపురం జిల్లాలో 1800; బళ్లారి జిల్లాలో 2,500; చిత్తూరు జిల్లాలో 1,000;



రైట్ రెవరెండ్ పొతకమూరి తామస్ డి. డి.
ప్రథమాంధ్ర బిషప్ గౌరవమును పొందిన ఆంధ్రులు.

మంది కాతలిక్కులు గలరు. కాతలిక్ మిషన్ వారి యాజమాన్యము క్రింద, నూరు ప్రాథమిక పాఠశాలలు కలవు. బెజవాడలో బాలికా-ఉన్నత పాఠశాల, స్త్రీలకు రెండు ట్రెయినింగ్ పాఠశాలలు, పురుషులకొక ట్రెయినింగ్ స్కూలున్ను; నెల్లూరిలో పురుషుల కొక ట్రెయినింగ్ స్కూలున్ను; గుంటూరిలో ఒక ఉన్నత పాఠశాల, స్త్రీలకు ఒక ట్రెయినింగ్ స్కూలున్ను; ఫిరంగి పురములో ఒక ఉన్నత పాఠశాల; బళ్లారిలో ఒక ఉన్నత పాఠశాల నిర్వహించ బడుచున్నవి.

ఇంక ఆంధ్ర దేశమున మత ప్రచారము చేయుచున్న ఇతర క్రైస్తవ సంస్థలగురించి తెలిసికొనవలసి యున్నది. లండన్ మిషన్ సొసైటీ వారు 1805 సం. మున విశాఖపట్నము కార్యస్థానముగా ఏర్పరచుకొని పని చేయ మొదలుపెట్టిరి. వీరిలో పేర్కొనదగిన వారు జాన్ హాూ. ఆయన ఇచ్చట ఒక 'ఆంగ్లో వెర్నాక్యులర్ స్కూలు' నుగూడా స్థాపించెను. అదే వర్ధిల్లి ఇప్పటి L.M. School అయినది. 1847 సం॥న క్రైస్తవమతము స్వీకరించిన పులిపాక జగన్నాథముగారు శ్రీకాకుళ ప్రాంతమున మతప్రచారము చేసిరి. ఈ మిషన్ వారే 1822 లో కడపలో, తరువాత నంద్యాల, గుత్తి, అనంతపురం, బళ్లారులలో మత ప్రచారము చేసిరి. అనేకులు ఈ ప్రదేశములలోని నిమ్నజాతులవారు క్రైస్తవ మతములో చేరిరి. వీరు ఆరోజులలో బళ్లారిలో ఒక కళాశాల గూడా ఉన్నత విద్య బోధించుటకై స్థాపించిరి.

1836 సం॥మున నర్సాపురమున గోదావరి డెల్టా మిషన్ ప్రారంభింపబడినది. ఇక్కడ మతవ్యాప్తి చేయుచున్నది



ఏసుక్రీస్తు.

గోదావరి డెల్టా మిషన్. ఈ మిషన్‌లో మొదటివారు బౌడెన్, బీర్ దొరలు. ఈ మిషన్‌కు సంబంధించిన బోధకులలో సుప్రసిద్ధులు హీతిస్ దొరగారు.

1840 సం॥న రెవరెండు ఎల్. ఎస్. డే. దొరగారు ఆంధ్రదేశమునకువచ్చి, నెల్లూరిలో అమెరికన్ బాప్టిస్టు మిషన్‌ను స్థాపించిరి. ఈ మిషన్‌వారు నెల్లూరిలో, వొంగోలులో, రామాయపట్నములో ఉన్నత పాఠశాలలు, స్థాపించి విద్యాబోధ, క్రైస్తవమత ప్రచారము గావించు చుండిరి.

అసలు మచిలీపట్నము తూర్పు ఇండియా వర్తక సంఘ చరిత్రలో నేకాదు బహుముఖ ప్రజ్ఞావంతులకు నిలయమై ఆంధ్రదేశమున కొక. పీఠములాగు ఉన్నది. ఈ క్రైస్తవ మత చరిత్రలోనూ బందరుదే ప్రధాన భూమిక.

1843 సం॥న నోబుల్ దొరగారు ఒక పాఠశాలను స్థాపించి, మతబోధ చేసిరి. తరువాత అది ప్రసిద్ధమైన నోబుల్ కళాశాలగా మారినది; ఇప్పుడు గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలతో కలుపబడినది. నోబుల్ దొరగారి శిష్యులలో అనేకులు క్రైస్తవమతము స్వీకరించిరి. వారిలో గానుగపాటి కృష్ణయ్యగారు, మంచాల రత్నము గారు ముఖ్యులు. ఈ నోబుల్ కళాశాల, పాఠశాలలు అన్ని సి. యమ్. యస్. తెలుగుమిషనుకు చెందినవి. ఈ మిషన్ వారే బెజవాడ, ఏలూరులలోగూడా హైస్కూల్లు స్థాపించిరి. 1857 సం॥నుంచీ చాలాకాలము ఏలూరిలో పనిచేసిన కానన్ యఫ్. యస్. అలెగ్జాండరుగారు, దుమ్ముగూడెములో పనిచేసిన జాన్ కెయిన్ దొరగారు ముఖ్యముగా వారి కేంద్రములలో మతప్రచారము చేసిరి.

రెవ. హయోయను అనే జర్మనుదేశస్థుడు 1842 సం॥న అమెరికానుండి గుంటూరుకువచ్చి, అచ్చట అమెరికన్ లూతరన్ సొసైటీవారి తరపున ఒక మిషన్‌ను స్థాపించెను. తరువాత ఈ మిషన్‌వారి బోధకులుగా డాక్టరు హార్‌ప్స్టర్ దొరగారువచ్చి మతప్రచారము విస్తారముగా చేసిరి.

ఈ మిషన్‌వారి యాజమాన్యమున ఇప్పటికిని నిర్వహింపబడుచున్న గుంటూరు కళాశాల; కుట్టుపని, వడ్రంగము, నేర్పు ఒక పాఠశాల; బోధనాభ్యసన పాఠశాల ఒకటి; ఆంధ్ర దేశమున మిక్కిలి ప్రసిద్ధిగాంచిన కుర్లర్ స్త్రీల వైద్యశాలయున్ను, నిర్వహింపబడుచున్నవి. వీరు సత్తెనపల్లి పల్నాడు, రెంటచింతల మొదలైన కేంద్రములలో, గుంటూరు పరిసరములలో, మత ప్రచారము చేయుచున్నారు. ఈ మిషన్‌వారి ముఖ్యస్థానములలో రాజమహేంద్రవరము ఒకటి.

కెనేడియన్ బాప్టిస్టు మిషన్‌వారి కార్యరంగములో దక్షిణమున పుయ్యూరునుండి, ఉత్తరమున ఇచ్ఛాపురమువరకు గల ప్రదేశము చేరియున్నది. మిధునపుర ప్రాంతీయవాసి అయిన పురుషోత్తమ చౌదరిగారు క్రైస్తవమతమును స్వీకరించి ఒరిస్సారాష్ట్రమున, దాని సామీప్య ప్రాంతముల 27 సం॥లు క్రైస్తవమత ప్రచారము చేసిరి.

మొత్తముమీద దేశములో విజృంభించిన ప్రథమ స్వాతంత్ర్యసమరకాలమునాటికే (1857) దేశమంతటా ఈ మతప్రచార కేంద్రము లేర్పడి, దేశమున నెలకొన్నవి.

1700 నాటికే మంగళగిరి ఆనందకవి 'వేదాంత రసాయన' మనే ప్రబంధమును రచించెను. దీని వస్తువు క్రీస్తు పవిత్రకథ. పురుషోత్తమచౌదరిగారున్నూ అనేక గ్రంధముల వ్రాసిరి. బైబిలు ఆంధ్రీకృతమైనది. అప్పటి నుంచీ ఈ సారస్వతముగూడ అభివృద్ధిపొందుచున్నది.

కొన్నికొన్ని చోట్ల మత బోధకుల ప్రచారము హిందువులకు సమ్మతము కానప్పుడు కలహములు సైతము జరిగినవి. మొత్తముమీద ప్రచారకుల లోపములను పరిహరించినచో వారు ప్రజాదరణ పొంది కొన్ని ప్రయోజనకరములైన పనులను చేయగలిగిరని చెప్పవచ్చును.

ఈ మిషనరీలు తమ నాగరికత, ఆచారములను మన దేశమున పెంపొందింపజేసిరి. వారి నాగరకత కొంత మనకు విశాలదృష్టి, ఉన్నతాదర్శములకు దోహదము ఇచ్చినదని చెప్పవచ్చును. దీనికి నిదర్శనములు విశ్వ విద్యాలయములు, రాజకీయ సిద్ధాంతములు, వైజ్ఞానిక సంస్థలు మొదలైనవి. ఇవి ప్రత్యక్షముగా గాక పోయినను పరోక్షముగా నైనా, ఆ విజ్ఞానవ్యాప్తికి ఆధారభూతములైనవి. ఈ మిషనరీలే ఆంగ్లో వెర్నాక్యులర్ పాఠశాలను, ముద్రణాలయములను, వార్తాపత్రికలను, వైద్యశాలను, అనాథశరణాలయములను, కుష్టురోగ నివారణాలయములను దేశమున నెలకొల్పి, ప్రజలకు ఆధ్యాత్మికము గానే కాకుండా ఐహికముగా సైతము అనేక విషయ

ములలో తోడ్పడిరి ; ఆంధ్రదేశములో నిమ్న జాత్యుద్ధరణ మునకు ఎక్కువగా సహాయులైరి.

శ్రీరామనవమి, వైశాఖ శ్రావణ పూర్ణిమలు, కృష్ణాష్టమి, వినాయకచతుర్థి, దీపావళి, నాగులచవితి, కార్తిక పూర్ణిమ, ముక్కోటి యేకాదశి, మకర సంక్రాంతి, శివరాత్రి మున్నగు పండుగలు తమ ధర్మములను స్మరించుకొనుటకై హిందువులు జరుపుచున్నట్లుగానే మహమ్మదీయులు మిలాదున్నబి, బక్రీదు, రంజాన్, మొహరం మొదలైన పండుగలను జరుపుదురు. క్రైస్తవులు "క్రిస్మస్" పండుగలను, డిసెంబరు ఆఖరువారములో ప్రవర్తయగు క్రీస్తుపేరట ఉత్సవములను జరుపుదురు. ఇవిగాక ఈస్టరు మైకల్మస్, మొదలగు పండుగలనుగూడా జరుపుదురు.

## ఆంధ్రదేశమందలి క్రైస్తవమత సంస్థలు

| వరుస నంబరు | మిషన్ పేరు | వారివారి క్రైస్తవుల సంఖ్య | పాఠశాలల సంఖ్య | ప్రధాన కార్యస్థానము |
|---|---|---|---|---|
| 1 | యునైటెడ్ లూతర్న్, చర్చి మిషన్ | 1,89,057 | 908 | గుంటూరు |
| 2 | అమెరికన్ బాప్టిస్టు మిషన్ | 2,57,012 | 756 | వొంగోలు |
| 3 | అమెరికన్ లూథర్న్ చర్చి మిషన్ | 10,033 | 124 | గూడూరు |
| 4 | అమెరికన్ ఆర్కాటు మిషన్ | 29,439 | 82 | వెల్లూరు |
| 5 | చర్చి మిషనరీ సొసైటీ | 1,31,219 | 418 | బెజవాడ |
| 6 | సొసైటీ ఆఫ్‌గాస్పెల్ ప్రాపగేషన్ | 42,309 | 251 | నంద్యాల |
| 7 | కనేడియన్ బాప్టిస్టు మిషన్ | 67,675 | 458 | కాకినాడ |
| 8 | లండన్ మిషనరీ సొసైటీ | 46,595 | 206 | జమ్మలమడుగు |
| 9 | సెవెంత్‌డే అడ్వాన్టిస్ట్ మిషన్ | 1350 | 16 | బెజవాడ |
| 10 | శాల్వేషన్ ఆర్మీ | 17,356 | 137 | మద్రాసు |
| 11 | గోదావరి డెల్టా మిషన్ | —— | —— | నర్సపూరు |

(డా. జె. బి. విలియమ్సు ఎమ్. ఏ. పి. ఎచ్. డి. గారి లెక్కల ననుసరించి)



విశాఖపట్టణంలో ఏరాడ కొండపై దేవాలయమున్ను, క్రైస్తవుల గుడిన్ని: మన మత సామరస్యమునకు నిదర్శనము

## ఆంధ్రుల ఆధ్యాత్మిక నైతిక మనోవికాస పరిణామములకు కారకులు.

| కారకులు | కాలము | ఎట్లుకారకులయిరి ? |
|---|---|---|
| గౌతమబుద్ధుడు | క్రీ. పూ. 6-5 వ శతాబ్దం. | అశోకునికాలమునుండిన్ని బౌద్ధమతము ఆంధ్రులలో వ్యాపించినది. |
| మహావీరుడు | ,, ,, | చంద్రగుప్తునికాలమునుండిన్ని జైనమతము ,, ,, |
| యేసుక్రీస్తు | (క్రీస్తు శకక ర్త) | 18 వ శతాబ్దమునుండిన్ని క్రైస్తవ మతము ,, ,, |
| నాగార్జునుడు | క్రీ. శ. 3 వ శతాబ్దం | మహాయాన బౌద్ధమతోద్ధారకుడు |
| మహమ్మదు | ,, 6 వ శతాబ్దం | 13 వ శతాబ్దమునుండిన్ని ఇస్లాం మతము ,, ,, |
| బసవేశ్వరుడు | ,, 8 వ శతాబ్దం | వీరశైవమతము ,, ,, |
| శంకరాచార్యులు | ,, | అద్వైత వైదికమతము, బాదరాయణ సూత్రములు, భగవద్గీత ఆంధ్రదేశమున వ్యాప్తిచెందినవి. |
| రామానుజాచార్యులు | ,, 11 వ ,, | వైష్ణవ విశిష్టాద్వైతమతము ,, ,, |
| ఆనందతీర్థులు | ,, 13 వ ,, | ద్వైతమతము (మాధ్వమతము) ,, ,, |
| రాజారామమోహనరాయి | ,, 19 వ ,, (మొదటి భాగం) | బ్రాహ్మసమాజ సంఘసంస్కార స్థాపకుడు |
| (కేశవచంద్రసేన్, | ,, రెండవ భాగం | బ్రాహ్మసమాజ మత వ్యాపకుడు |
| బిపిన్‌చంద్రపాల్ హేమచంద్రసర్కారు) | 19-20 వ ,, | ,, రాజకీయాశయ ప్రబోధకుడు |
| రామకృష్ణపరమహంస | ,, 19 వ శతాబ్దం | ఆధ్యాత్మిక నైతిక మత ప్రబోధకుడు |
| స్వామి వివేకానంద | ,, | ,, ప్రచారకుడు |
| అనిబిసెంటు | ,, 19-20 వ ,, | దివ్యజ్ఞానసమాజ మతోద్ధారకురాలు |
| జిడ్డు కృష్ణమూర్తి | ,, 20 వ ,, | ,, మత ప్రచారకుడు |
| దయానందస్వామి | ,, ,, | ఆర్యసమాజ మతోద్ధారకుడు |
| శ్రీ రమణమహర్షి | ,, ,, | నూతన భక్తిమార్గ ప్రబోధకుడు |
| అరవిందమహర్షి | ,, ,, | పూర్ణయోగ సంయుక్తమైన ఆధ్యాత్మిక విద్యావ్యాపకుడు |
| కుసుమ హరనాథబాబా | ,, ,, | నూతన భక్తిమార్గోప దేశకులు |
| రాధాస్వామి | ,, ,, | ,, |
| సాయిబాబా | ,, ,, | ,, |
| బాల గంగాధరతిలక్ | ,, ,, | రాజకీయవేత్త ; గీతా రహస్య ప్రబోధకుడు |
| రవీంద్రనాథఠాకురు | ,, ,, | నైతిక విద్యా ప్రబోధకుడైన మహాకవి |
| మహాత్మాగాంధీ | ,, ,, | ,, రాజకీయ దేశనాయకుడు |
| కార్ల్ మార్క్సు | ,, ,, | సామ్యవాద స్థాపకుడు |
| లెనిను | ,, ,, | సామ్యవాద ప్రచారకుడు |

గౌతమబుద్ధుని నైతిక ధర్మము, మహావీరుని అహింసా తత్వము, నాగార్జునుని మహాయానభక్తి స్వరూపము, బాదరాయణుని బ్రహ్మవిద్య, శంకరుని అద్వైత సిద్ధాంతము, బసవేశ్వరుని వీరశైవము, రామానుజుని వైష్ణవ ప్రపత్తి, సూఫీల తత్వము, యేసు క్రీస్తుని ప్రేమ దయాస్వరూపము ఆంధ్రుల ఆధ్యాత్మిక విజ్ఞానమునకు తోడ్పడి మనోవికాసమును కలిగించినవి. పిమ్మట, కొంత కాలము నూతన ధర్మ ప్రబోధము లేక, సనాతన ధర్మమను పేర నిరర్థకదురాచారములు జనులలో ప్రబలినప్పుడు, రాజారామమోహనుడు బోధించిన బ్రాహ్మ మతమున్ను, అనిబిసెంటు ప్రచారములోనికి తెచ్చిన దివ్యజ్ఞానసమాజమతమున్ను, రామకృష్ణపరమహంస, దయానందస్వామి మొదలయిన మహాత్ముల ఉపదేశములున్ను ఆంధ్రుల నూతన మనోవికాసములకు సాధనములయినవి. బాలగంగాధరతిలకు బోధించిన గీతారహస్యము ఆంధ్రులు కొందరు కర్మవీరులగుటకు కారణ మయినది.

మానవ సంస్థలందును, ప్రపంచరాజకీయవాతావరణమందున్నుగల హింస, స్పర్థ, స్వార్థత్యాగము, పరస్పర ద్వేషము మొదలగు దుర్గుణములు తన హృదయమునకు రోత గలిగిన వెంటనే, గాంధిమహాత్ముడు పరభాషావేషములను డాంబిక జీవనమును పూర్తిగా పరిత్యజించి, వినీతవేషమును వినయశీలమును అవలంబించి భారతీయులకును, లోకమునకును ఆదర్శప్రాయమైన జీవితమును స్వీకరించెను. ఈ మహాత్ముడు అహింసావ్రతపరాయణుడు, శాంతిప్రియుడు, ప్రేమపూరితుడు, త్యాగశీలుడు. ఇతని సందేశములు రాజకీయరంగమందే కాక, అంతకంటె ఎక్కువగా ఆధ్యాత్మిక సాంఘిక నైతిక జీవనమందు మానవధర్మ పరిణామమునకు ప్రబలమైన సాధనములు. ధనవంతుల కంటె పేదలున్ను, డాంబిక వేషధారుల కంటె వినీత వేషధారులున్ను, ఉన్నతజాతివారి కంటె హరిజనులున్ను, రాజుల కంటె ప్రజలున్ను ఎక్కువ ఆదరమునకును, గౌరవమునకును పాత్రులగు నట్లు చేసిన మహనీయుడు; నిత్య జీవితమందు భగవద్గీతోపదేశము ఎట్లు ఆచరణీయమో బోధించిన ఆచార్యుడు; అహింసావ్రతమునకు భంగము రానీయకుండా విజయుడు గాదలచిన మహావీరుడు—ఈ గాంధీ మహాత్ముడు. ఇతని ఉపదేశములు ఆంధ్రులలో వ్యాపించి, ఆత్మప్రత్యయము, ఆత్మోద్ధరణము కలుగజేసి ఆంధ్రుల మనోవికాస పరిణామమునకు ఎక్కువగా సహకారములగు చున్నవి.

కార్ల్ మార్క్సు 1818 లో జర్మనీలో జన్మించి, మొట్టమొదట అర్థశాస్త్ర వేత్తగా పేరుపొంది, 1842 నుండిన్ని జర్మనీ, ఇంగ్లండ్, ఫ్రాన్సు మొదలయిన దేశములలో తన సామ్యవాద సిద్ధాంతములను బోధించి, కొన్ని గ్రంథములు సైతము రచించి 1883 లో చని పోయెను. లెనిన్ రష్యాకు మొదటి అధ్యక్షుడయి మార్క్సు సిద్ధాతములను తన దేశమున అమలులోనికి తెచ్చెను.

సంస్థలందు యజమానులున్ను, రాజ్యమందు పాలకులున్ను స్వార్థపరులై కార్మికులను ప్రజలను పీడించుట ఎక్కువగు నప్పుడు; విప్లవము కలుగక మానదు. యజమానులున్ను పాలకులున్ను అల్ప సంఖ్యాకులున్ను, కార్మికులున్ను ప్రజలున్ను అధిక సంఖ్యాకులున్ను గనుక, సంఘబలము, సమిష్టిబలము అధికమయి తుదకు సామ్యవాదిరాజ్య మేర్పడునని మార్క్సు చెప్పెను. ఆస్తి హక్కులందు సంఘస్వామ్యసిద్ధాంత మంగీకరించవలెనని సామ్యవాదు లందురు. సామ్యవాదము రవీంద్ర నాథ ఠాకూరు మహాకవికి సమ్మతము కాకపోయినా, సార్వ జనీన సర్వమానవ సౌభ్రాత్రమును బోధించు అతని నైతిక ప్రబోధమునకు అనుగుణముగానే ఉన్నదనవచ్చును. ప్రాచీనకాలములో మన దేశమున గల సంఘస్వామ్య బీజములు—ఇటీవల హిందూ యుగము నాటినుండిన్ని స్వార్థపరులయిన యేలికల ప్రాబల్యమువల్ల చెడిపోయినా, ఇంకను జీవించియున్నవని చెప్పవచ్చును. అందుచే, మత విషయములలో సార్వజనీన మత సిద్ధాంతముల వలెనే సంఘస్వామ్యమును బోధించే సామ్యవాదుల సిద్ధాంతములు సైతము మన ఆంధ్రులలో నేటి విద్యార్థులు కార్మికులు మొదలయినవారి హృదయములను కలతపెట్టి విప్లవమునకు పురికొల్పుతున్నవి.

## తెలుగు జిల్లాలలోని వివిధ మతస్థులు

(1931 జనభా లెక్కలు.)

| జిల్లా పేరు | మొత్తము జన సంఖ్య | హిందువులు | మహమ్మదీయులు | క్రైస్తవ మతస్థులు | ఇతరులు |
|---|---|---|---|---|---|
| విశాఖపట్నము | 3,607,948 | 3,400,922 | 25,934 | 34,124 | 146,968 |
| తూ. గోదావరి | 1,920,582 | 1,855,439 | 29,842 | 29,577 | 5,724 |
| ప. గోదావరి | 1,223,056 | 1,134,560 | 25,602 | 62,661 | 233 |
| కృష్ణా | 1,254,208 | 1,089,523 | 63,007 | 1,01,289 | 389 |
| గుంటూరు | 2,035,660 | 1,639,834 | 1,57,646 | 2,37,772 | 408 |
| నెల్లూరు | 1,486,222 | 1,317,420 | 1,03,192 | 65,593 | 17 |
| కడప | 949,397 | 788,192 | 1,24,481 | 36,667 | 57 |
| కర్నూలు | 1,024,961 | 805,032 | 1,45,561 | 74,255 | 113 |
| బళ్లారి | 969,774 | 857,425 | 1,03,804 | 7,113 | 1,432 |
| అనంతపురం | 1,050,411 | 943,768 | 98,954 | 6,546 | 1,143 |
| చిత్తూరు | 1,447,103 | 1,356,384 | 80,048 | 10,645 | 26 |
| | * | * | * | * | * |
| మద్రాసు | 647,230 | 520,161 | 70,031 | 54,114 | 2,924 |

మానవులందరూ
దేవుని
బిడ్డలే
—యేసు



నందికేశ్వరుడు, లేపాక్షి (అనంతపురం జిల్లా)

మానవుని
వెలిపెట్టినచో
భగవంతుని
వెలిపెట్టినట్లే
—గాంధీ



12వ శతాబ్దము నాటి కాకతిరాజుల రామప్ప దేవాలయము, పాలంపేట, ములగతాలూకా, వరంగల్ జిల్లా.
(నైజాం ప్రభుత్వమువారి అనుమతిని).

## సమతాధర్మము

ఆదికాలమున అందరు జనులూ అన్నదమ్ము లండి

*    *    *    *    *

కృతయుగమందలి ధర్మము లెల్ల క్రిందు మీదుగాగ
పాపముతోడ కలియుగమెల్ల మండిపోయెనండి

*    *    *    *    *

శంకలు దక్కి మీర లెల్లరును శపథముచేయండి
సమతాధర్మం ప్రపంచమందున స్థాపింతురుగాని.

—ఉన్నవ లక్ష్మీనారాయణ.



# మూడవ భాగము

## ఐదవ అధ్యాయము

# సంఘ సంస్కరణము



చెట్టపట్టాల్ పట్టుకొని దే
శస్థు లంతా నడవవలెనోయ్ :
అన్నదమ్ముల వలెను జాతులు
మతము లన్నీ మెలగవలెనోయ్!
—గురుజాడ.

విషయ సంగ్రహము: ఆంధ్రులు ఆదినుండిన్నీ సంస్కరణ ప్రియులు—హరిజనులకు ఆలయ ప్రవేశము. బౌద్ధ దీక్ష పొందుట కర్హత—రామానుజ బసవేశ్వరాది మత కర్తల సంఘ సంస్కరణ ప్రబోధము—చోడచాళుక్య గంగ వంశరాజ కుటుంబములలో వివాహ సంబంధములు—బ్రహ్మనాయని సంఘ సంస్కరణ సేవ—శాఖాంతర వివాహములు, కులభేదములు పాటింపని సహపంక్తి భోజనము—పిమ్మట కొంత కాలము సంఘమునందు ప్రబలిన సంకుచిత భావము, దురాచారములు; నేటికాలమున వీరేశలింగం, వెంకటరత్నం నాయుడుగార్లతో సంఘ సంస్కరణోద్యమ ప్రారంభము—అతిబాల్య వివాహముల నిరోధము—వితంతు వివాహోద్యమము—అస్పృశ్యతా నివారణ, శాఖాంతర వివాహములు—సకలజన పంక్తిభోజనములు—బ్రహ్మణేతరోద్యమము: వేదాధ్యయనము; స్వకుల పౌరోహిత్యము—గాంధీ మహాత్ముని జాతీయోద్యమమువల్ల కలిగిన తీవ్ర సంఘసంస్కరణము.

ఆంధ్రులు సహజముగా విశాలదృష్టిగలవారు. వారి హృదయము ఉదారమయినది. కొత్త మార్పులను, కొత్త పద్ధతులను స్వీకరించుటలో వీరు వెనుదీయరు. ఆంధ్ర దేశము ఇటు ద్రవిడ ప్రాంతమునకును, అటు ఆర్యప్రాంతమునకును నడుమ నుండుట వల్లనో, లేక వందలకొలది సంవత్సరములుగా వేరువేరు మతములకును, పంథాలకును తావరముగ నుండుట వల్లనో ఆంధ్రులు మొదటనుండిన్ని సంస్కరణ ప్రియులుగానే ఉన్నారు. మతసంస్కారములలో వీరు కనబరచిన ఔదార్యమున్ను, సంఘ సంస్కారము ఆచరణలో పెట్టుటకు వీరికిగల సంసిద్ధతయున్ను, విచ్చలవిడిగా ఇతర ప్రాంతములవారితో కలిసిమెలసి ఉండగలిగే సౌజన్యమున్ను వీరి కెప్పుడును ఉన్నతాశయములనే కలిగించుచు వచ్చినవి.

హిందూమతము అతిప్రాచీనమైన మతము. ప్రాచీనతమములైన మతములందున్ను, సంఘములందున్ను గల ఆచారములు ఆదిని ఉత్కృష్టములే అయినా, కొంత కాలానికి నిరర్థకములయి, అనర్థదాయకములు కాక తప్పదు. అందుచేత, కాలానుక్రమముగా వస్తూఉన్న ఎన్నో దురాచారాలు ఆంధ్రులలో సైతము లేక పోలేదు. ఇవి మతమును ఆశ్రయించుకొని కాని, కులాచారములను ఆశ్రయించుకొని కాని, క్షుద్ర దేవతా రాధనను ఆశ్రయించుకొని కాని పెరుగుతూ వచ్చినవి. ఈ దురాచారాలను ఖండించడానికిన్ని, సంఘ సంస్కరణమును ఆచరణలోనికి తీసుకొని రావడానికిన్ని ఆంధ్రులు ఇతర రాష్ట్రముల వారికంటె ఎక్కువగా ముందంజ వేస్తూనే వస్తున్నారు. ఇది ఆంధ్రుల ఔదార్యమునకు, వికాసపూరితమైన జీవితాశయమునకు ప్రబలమైన నిదర్శనము.

భారత దేశములో జరిగిన సంఘమతసంస్కరణములకు



కీర్తిశేషులగు నరాలశెట్టి దేవేంద్రుడు
హరిజన నాయకుడు. వర్తకుడు. ఏలూరు.
అనేక సంవత్సరములు స్థానిక సంస్థలలోను. మదరాసు
శాసనసభలోను సభ్యులుగా నుండిరి.

పునాది రెండు వేల సంవత్సరములకు పూర్వమే బౌద్ధయుగం లోనే వేయబడినది. బౌద్ధమతము జాతికుల భేదములను పాటింప లేదు. బ్రాహ్మణుడు మొదలు పంచముని వరకును అందరును బౌద్ధ దీక్షపొందుటకుగాని, అర్చనాదులందు పాల్గొనుటకుగాని సమానమైన అధికారము గలవారని ధాన్యకటక స్తూపము లందలి శాసనములను బట్టి రుజువయినది.

పిమ్మట, శంకర, రామానుజ, మాధ్వమతములను సైతము ఆంధ్రు లాదరించి సంస్కృతి వికాసప్రియులు, సంఘ సంస్కారాభిమానులు అని అనిపించుకొన్నారు. పిమ్మట, బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, దివ్యజ్ఞానసమాజము మొదలయిన నూతనమతసంస్థల ధార్మిక సాంఘిక సంస్కారములకు ఆంధ్ర దేశములో తగిన ప్రోత్సాహము కలిగినది; అనేకముగా ఆశ్రయములు నెలకొన్నవి. ఆంధ్రులనేకులు రామానుజ మతము నవలంబించి సంఘములోగల భేదభావములను నిర్మూలించుటకు ప్రయత్నించిరి. క్షత్రియుడైన అనుమరాజు, తన మంత్రియైన దొడ్డనాయుని పుత్రుడైన బారన్నను పెంచుకొని, అతనికి క్షత్రియ కన్యనిచ్చి వివాహము చేసెను. తూర్పుచాళుక్యరాజులలో విమలాదిత్యుడు చోళరాజు కూతురిని పెండ్లియాడెను. వారి కుమారుడు రాజరాజనరేంద్రుడును, అతని కుమారుడు కులోత్తుంగ చోడదేవుడును మేనరికములు చేసుకొనిరి; అనగా, చోళరాజుల కన్యలనే పెండ్లియాడిరి. కళింగదేశపు రాజయిన అనంతవర్మచోడగంగ దేవుని తల్లి చోళవంశపు రాజయిన రాజేంద్రుని కూతురు. ఈ విధముగా, పరిపాలకుల లోనే కాక ప్రజలలో సైతము, ప్రాచీనసంప్రదాయములకు విరుద్ధముగా శాఖాంతరవివాహములు జరుగుతూ ఉండేవి.

విజయనగరసామ్రాజ్యపతనానంతరము, ఆంధ్రదేశమందలి ఐక్యము చెడిపోయినది. పిమ్మట, చిన్నచిన్న రాజ్యము లేర్పడినవే కాని, ఆంధ్రదేశమంతా ఏకముఖముగా నడపించి సామ్రాజ్యమును మరల ఉద్ధరించగల పరిపాలకులు లేక పోయిరి. రాజ్యైక్యము పోయినట్లే సంఘైక్యము సైతము పోయినది. కులభేదములు మరల ఎక్కువ తీవ్ర



శ్రీ వేముల కూర్మయ్య. బి.ఏ., ఎల్.ఎల్.బి., ఎం.ఎల్.ఏ.
(హరిజన నాయకుడు)
ఆంధ్ర రాష్ట్రీయ హరిజన సేవాసంఘ సహాయ కార్యదర్శి.

హిందూ మహమ్మదీయ సమ్మేళనము.



రెలిజియస్ ఎండౌమెంటు బోర్డు అధ్యక్షులై యుండిన రావు సూర్యారావుగారి కుమార్తె లక్ష్మీదేవిగారు, వారి భర్త పోలీసు డిప్యూటీ కమీషనరుగా ఉన్న జియా ఉద్దీన్ గారు.

ముగా విజృంభించినవి. పసిపిల్లల పెండ్లిళ్లు, తత్ఫలితముగా వేలకొలది బాలవితంతువుల దుర్భరజీవనము, అంటరాని తనము, స్త్రీలకు దుస్సహమైన దాస్యము, కులకక్ష్యలు హెచ్చు పెరిగి పోయినవి. బ్రిటిష్ ప్రభుత్వము స్థిరముగా ఏర్పడి, దేశమందు శాంతి నెలకొన్న వరకును సంఘమందలి దురాచారములను నిర్మూలించవలె నన్న తలంపు గాని, అందుకు తగిన సంస్కర్తలుగాని పుట్టుటకు అవకాశమే లేక పోయినది. ఆరువందల సంవత్సరములకు పైగా సనాతన ధర్మమను పేర సంఘ మత దురాచారములు ప్రబలి యుండెను.

అరేబియాలోని జనులు అజ్ఞానకూపములోబడి దుర్మార్గ సంచారులైయున్నప్పుడు వారిని ఉద్ధరించుటకు మహమ్మదు పుట్టినట్లును, జుడియాలో పిచ్చినమ్మకములతో దుర్జనులయిన వారిని సన్మార్గవర్తనులను చేయుటకు యేసుక్రీస్తు అవతరించినట్లును, మన దేశమందున్ను ప్రవక్తలు, మహాత్ములు, మహానుభావులు జన్మిస్తూ ఉన్నారు. ఆరు శతాబ్దములకు పైగా అశాంతివల్ల దురాచారములలో మునిగి సారస్వత, విజ్ఞాన, నైతిక ధైర్యస్థైర్యాది విషయములలో వెనుకబడియున్న ఆంధ్రుల అభ్యున్నతికి పూనుకొన్న కందుకూరి వీరేశలింగం గారు మన ఆంధ్రదేశములో జన్మించడము ఆంధ్రుల భాగ్యము. అతడు నవీనాంధ్ర సారస్వత సృష్టికర్త; సంఘ సంస్కర్త, కార్యదీక్షా తత్పరుడు, అకుంఠిత ధైర్య సాహసములు గల వీరుడు, సర్వతోముఖమైన ఆంధ్ర వికాసమునకు పాటుపడి కృతార్థుడైన మహనీయుడు. అతడు నాటి పోషించిన సంఘ సంస్కరణ బీజము అనతికాలములో మహావృక్షమై ఫలించినది. నవ్యాంధ్రారామమునకు దోహదమొసగిన వనమాలి శ్రీ. శే. వీరేశలింగముగారు.

ఈ నవీనయుగమందు సంఘసంస్కరణమునకై బయలు దేరిన ఉద్యమములలో బ్రహ్మసమాజోద్యమము ముఖ్యమైనది. వంగప్రాంతమునుండి తరుచుగా మతప్రచారమునకై మన ఆంధ్రదేశమునకు వచ్చిన కేశవచంద్రసేను,

కేరళ, ఆంధ్ర సమ్మేళనము.



తిరుచునాపల్లి కలెక్టరు ఎస్. కె. చెట్టూర్ ఐ.సి.ఎస్. వారి సతీమణి (రావుసూర్యరావుగారి రెండవ కుమార్తె.)

కమ్మ-కాపు సమ్మేళనము



శ్రీ బాపినీడు-శకుంతలాదేవి వివాహము.
విశ్వదాత కీ. శే. కాశీనాధుని నాగేశ్వరరావుగారు పౌరోహిత్యము వహించిరి.

హేమచంద్రసర్కారు, బిపిన్ చంద్రపాలు మొదలయిన బ్రాహ్మ మత ప్రచారకుల ప్రబోధమువల్ల ఆ మతము అవలంబించినవారి సంఖ్య ఆంధ్రులలో అత్యల్పమే అయినా, ఆ మతముతోపాటు వచ్చిన సంఘసంస్కరణము మాత్రము కందుకూరి వీరేశలింగంగారున్ను, వేంకటరత్నంనాయుడు గారున్ను, వారి శిష్యులున్ను గావించిన కృషివల్ల ఆంధ్రదేశమందు ఎక్కువగా వ్యాపించినది. ఆ కృషిఫలితముగానే వితంతువివాహములు, శాఖాంతర వివాహములు, కులభేదములు దృష్టిదోషము పాటింపని పంక్తి భోజనములు, అనాథ శరణాలయములు, వివిధ సంస్కృతిసంస్థలు దేశమందు వ్యాపించినవి. పత్రికలద్వారా, పుస్తకములద్వారా, ఉపన్యాసములద్వారా కలిగిన ప్రబోధమువల్లను, సనాతన ధర్మమనుపేర ప్రబలియుండిన దురాచారములపై జరిగిన దండయాత్రలవల్లను ఆంధ్ర సంఘాభివృద్ధి తీవ్రగతిని సాగుతూ వచ్చినది.

బ్రహ్మసమాజముతోపాటు దివ్యజ్ఞాన సమాజముతవ్యాప్తి గావించిన అనిబిసంట్ అమ్మగారి ప్రబోధము సైతము ఆంధ్రుల సార్వజనీన సంఘాభివృద్ధికి సహాయమైనది. తిలక్, అనిబిసెంటుగార్లు గావించిన రాజకీయసంచలనము సైతము సంఘైక్యమునకు తోడుపడినది.

అన్నిటికంటెను అధికముగా గత 25 సంవత్సరముల లోను దినదినాభివృద్ధిపొందుతూ ఉన్న జాతీయోద్యమము వల్ల కలిగిన సంఘ సంస్కరణముతో నవీనయుగము ప్రారంభమైనదని చెప్పవచ్చును. ఈ ఉద్యమమునకు గాంధీమహాత్ముడు సారథి. ఈ మహాత్ముడు నడుపుతూ ఉన్న ఉద్యమము సర్వతోముఖమయినది.

రాజకీయరంగమందేకాక, ఆర్థిక, సాంఘిక, ఆధ్యాత్మిక రంగములందును మహాత్ముడు తీవ్రమైన కృషిసల్పి దేశస్థుల మనోవికాసమునకు, సంస్కృతికి కారకుడైయున్నాడు.

ఆయన తేజస్సు, బుద్ధి, ప్రతిభ, ఆయన జీవితము మన దేశస్థులనేకాక లోకమంతటిని ఆకర్షించినవి. ఆయన కార్యదీక్ష, ప్రబోధము, వ్యాసములు, ఉపన్యాసములు ఝంఝూమారుతమువలె ప్రతివాదిభయంకరములై చెలరేగినవి. అనేకసంవత్సరములనుండి ప్రయత్నిస్తూ ఉన్న సంఘసంస్కరణసభలు, ఉద్యమములు నెరవేర్చలేకపోయిన అస్పృశ్యతానివారణము, గాంధీమహాత్మునివలన కార్యసిద్ధిపొందినది.

గాంధీమహాత్ముని ఆశయములను ఆమోదించి ఆంధ్ర నాయకులు ఆ మహాత్ముని ఉద్యమములను ఆంధ్రదేశములో వ్యాపింపజేసిరి. అందు ముఖ్యమైనది అస్పృశ్యతానివారణము. ఈ సంఘసంస్కారమువల్ల హరిజనులలో ఎంతో మంది విద్యావంతులై మంచి సంస్కృతినిపొంది ఉన్నతిని పొందియున్నారు. మహాత్మునికి పూర్వమే కీ. శే. వెంకటరత్నంనాయుడుగారు హరిజన బాలికలను చేరదీసి పెంచి, పెద్దవారినిచేసి, విద్య చెప్పించి, వారికి పెండ్లిళ్లు చేయించినారు. ఇటీవల తెలుగునాయకులు చాలమంది హరిజనులను తమ ఇండ్లలో ప్రవేశింపజేసి ఆదరిస్తున్నారు. ప్రస్తుత హరిజననాయకులగు వేముల కూర్మయ్యగారు బి. ఏ. ఎల్. ఎల్. బి. అభివృద్ధికిరావడమునకు కీ. శే. కాశీనాధుని నాగేశ్వరరావుగారు, శ్రీఅయ్యదేవర కాళేశ్వరరావుగారు ఎంతోపాటుపడ్డారు. గుడివాడలో శ్రీ గూడూరు రామచంద్రరావుగారు, బందరులో శ్రీ వేమూరి రామాజీ రావుగారు, గుంటూరులో శ్రీ నల్లపాటి హనుమంతరావుగారు, ఏలూరిలో శ్రీ వెల్లంకి కృష్ణమూర్తిగారు హరిజనులకు చేసినసేవ చాలాగొప్పది.

అస్పృశ్యతా నివారణమునకు 12 వ శతాబ్దములో వ్యాప్తి చెందియున్న వైష్ణవమతము సైతము ఎక్కువగా తోడ్పడియుండెనని చెప్పవచ్చును. శుచిశుభ్రతకు సవర్ణహిందువుల కేమాత్రము తీసిపోవని మాలదాసరుల కుటుంబములు సంస్కృతి పొందిన కుటుంబము లన వచ్చును. భీమవరం తాలూకాలో ఉప్పులూరు అనే గ్రామములో హరిజనులు దేవాలయములో అర్చకులుగా పనిచేయుచున్నారు. సాంఘికముగా హరిజనులకు కలిగే యిబ్బందులే, వారి అభివృద్ధికి అడ్డువచ్చుననికదా చెప్పవలెను? గాంధీగారి హరిజనోద్యమము హరిజనులకు కొన్ని దేవాలయములలోను, స్కూళ్లలోను పఠనమందిరములలోను ప్రవేశమిప్పించి సర్వజన సమభావానికి స్థావరమైన పునాది వేసినది. తత్ఫలముగా విరివిగా సాగిన వివిధ రాజకీయ విద్యా విషయిక-ఉద్యమములలోగూడ హరిజనులు వెనుకబడక ఉండుటయేకాక నాయకత్వమునుగూడా వహించియున్నారని చెప్పవచ్చును. ఆంధ్రదేశమునందు 12 గురు చట్టనిర్మాణ సభ్యులుగాను, ఒకరు పార్లమెంటరీ కార్యదర్శిగాను పనిచేసిరి.

మన దేశములోనున్న సంఘభేదములు అధికముగా వృత్తి వలననే ఏర్పడినవని చెప్పవచ్చును. అంతేకాదు, మనకున్న కులములన్నీ వారివారి వృత్తుల ననుసరించి ఏర్పడినవే. వృత్తియొక్క గౌరవాగౌరవాలనుబట్టి జాతులకుకూడా హెచ్చు తగ్గులేర్పడినవని చెప్పవచ్చును. తమతమ కులవృత్తులను పురస్కరించుకొని, తమ గౌరవాన్ని ఏర్పరచుకొన్న



డాక్టర్. పి. కోదండరావు ఎమ్. ఏ. (ఆనర్సు) సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ కార్యదర్శి, కొంతకాలము సర్వెంట్స్ ఆఫ్ ఇండియా పత్రికా సంపాదకులు. వారి సతీమణి అమెరికాకన్య, మేరీ కోదండరావు (ఒహియో).



డాక్టర్ వి. ఎన్. శర్మగారు, వారి కుటుంబము, వారి సతీమణి జర్మన్ కన్య. మదరాసులో బాల బాలికలకు ఉద్యానవన విద్యాలయము నడుపుచున్నారు.

ప్రతి జాతిన్ని ఇతర జాతులను తక్కువగా చూడటము సహజమై పోయినది. అంతేకాక, ఒకే కులవృత్తికలిగిన జాతులలోకూడ, వారి క్రమములైనట్టిన్ని ఆచార పరములైనట్టిన్ని కారణ ములవల్ల భేదా లేర్పడి నవి. ఈ భేదములను నిర్ణ యించువారెవరు? దేశ ములో పెచ్చు పెరిగి యున్న జాతీయ భావ ఝంఝామారుతము కుల భేదములను, సంఘ భేద ములను, వర్గ భేదములను పెకలించి వైచుట కెంత యో సహాయమగుచున్న దని చెప్పవచ్చును. పాశ్చాత్య విద్యానాగరికతల సంపర్క మువల్లను, తత్ఫలితంగా నవీనాశయముల ప్రభావమువల్లను మనలో కలిగిన మార్పు మన సంకుచితత్వమును పోగొట్టి మనకు విశాలదృష్టినీ, దూర దృష్టినీ కలుగజేసినవి. ప్రస్తుత మాంధ్ర దేశములో కులభేదములలోను, శాఖా భేదముల లోను, మతభేదములలోను పోరాడిన వీరు లెంతోమంది లేక పోలేదు. అయినా, మన కులాభిమానము మన శరీరము లలో జీర్ణించి శల్యగతములై యున్నవి. మన రాజకీయ జీవితములోను, సాంఘిక జీవితములోను, వ్యాపారము లోను, నిత్య జీవనములోను కులాభిమానము పెనుభూతము వలె కనబడుతూనే ఉన్నది. కొన్ని కొన్ని చోట్ల మతము మారినను కులాభిమానము మారలేదు. జాతీయోద్యమమున కున్ను, సంకుచితమైన కులాభిమానమునకున్ను ఉత్తర దక్షిణ ధ్రువముల కున్నంతభేదమున్నది. ఇప్పుడు నఖశిఖపర్యం తము జాతీయోద్యమములో మునిగి తేలుతూఉన్న ఆంధ్రు లలో ఎందుకింకను ఈ కులాభిమానాలు? ఇందుకు కార ణము అజ్ఞానం, వంశ పరంపరాగతమైన ఆచారం, స్వార్థపరత తప్ప మరొకటి కనబడదు. అయినప్పటికీ, ఈ విషయ ములోకూడ మనము పొందిన జయము, ఆంధ్రోద్యమము ద్వారా మనము సాధించిన ఆంధ్రజాతీయసాక్షాత్కారము గర్వించదగిన విషయాలే! మన ఈ విశాలాంధ్రత్వం విశాలభారతీయత్వమునకు సహకారముగానే అభివృద్ధి పొందవలె నని నాయకుల ఆశయము. కులాభిమానముల తోను, మతాభిమానములతోను, శాఖాభిమానములతోను పోట్లాడి జయించిన ఆంధ్రయువకులను అభినందించవలెను.

శాఖాంతర జాతీయ వివాహములు లోగడ జరిగినవి సూచించినాము. ఇక మన కాలములో జరిగిన వివాహ ములలో కొన్ని పేర్కొనదగినవి కలవు. ఇంజనీరు గంటి, ఇప్పగంటి సుబ్బకృష్ణయ్య, ఆకురాతి చలమయ్య, భానోజీ రావు, ధన్వాడ ఆనందరావుగార్లు బంగాళా కన్యలను పెండ్లి యాడిరి. డా॥ కృష్ణమూర్తిగారు (నాగపూర్ రసాయన శాస్త్ర పండితులు) మహారాష్ట్ర కన్యను, డా॥ పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి (సుందరయ్యాగారి తమ్ముడు) డా॥ పురుషోత్తంగార్లు కర్నాటక కన్యలను పెండ్లియాడిరి. శ్రీ జి. వి. రావుగారు (రిటైర్డు శానిటరీ యింజనీరు) స్కాచి కన్యను. డా॥ ఉప్పల లక్ష్మణరావుగారు స్విస్ కన్యను, డా॥ వి.

యల్. శర్మగారు (మద్రాసు ఉద్యానవన బాలబాలికా పాఠశాల ప్రిన్సిపాలు) జర్మనీ కన్యను, డా॥ పంగులూరి సుబ్బారావుగారు ఇంగ్లీషు కన్యను, డా॥ భద్రప్పగారు కర్నాటక కన్యను, బి. హనుమయ్య గుప్తాగారు నాయుడు కన్యను పెండ్లియాడిరి.

మన సంఘసంస్కరణోద్యమములలో బ్రాహ్మణేతరోద్యమము రాజకీయముగా పరిణతి నొందినను, మూలములో అది సాంఘికమైనదనే చెప్ప వచ్చును. దీనికి వందల కొలది సంవత్సరములుగా విద్యాగంధము లేక, స్వభాషలో పాండిత్యము లేక, మత భాషయైన సంస్కృతముతో పరిచయము లేక, భౌతికముగా వెనుక బడియున్న బ్రాహ్మణేతరుల దుస్థితియే ప్రధాన కారణము. పాశ్చాత్య విద్యా సంపర్కమువల్లను, క్రైస్తవ, బ్రహ్మ సమాజ మత ప్రేరణము వల్లను, బ్రాహ్మణేతర సంఘములలో కూడ వేరు వేరు క్షేత్రములలో ఉన్నతికి రావలెనన్న ఆశ సహజముగా జనించినది. చరిత్రాత్మకమైన అనేక కారణములవల్లను, స్వతస్సిద్ధముగా తమకున్న ప్రతిభవల్లను, బ్రాహ్మణసంఘముపొందిన అభివృద్ధి లేక, వెనుక బడియున్న బ్రాహ్మణేతర జాతులవారు తమ దుస్థితిని తెలుసుకొనుటకు ఈ నవీన విద్యా విజ్ఞానములు మరింత తోడ్పడినవని చెప్ప వలెను. బ్రాహ్మణేతరోద్యమమునకు ముఖ్య కారణములు:— (1) శూద్రులు వేద మంత్రము లుచ్చరించరాదు, వినరాదు, చదువరాదు అని బ్రాహ్మణులు పెట్టిన నిషేధము; (2) మత గ్రంథములను (అనగా వేదోపనిషదాదిగ్రంథములు, కర్మకాండలకు సంబంధించిన శ్లోకములు, మంత్ర శాస్త్రములు) చదివి బోధించి, అనుష్ఠించే అధికారము తమకే కలదని వాదించిన పిడివాదము; (3) తమ ప్రతిభవల్లను, సౌకర్యముల వల్లను, సంఘటనము వల్లను ఆర్థికముగాను, సాంఘికముగాను, రాజకీయముగాను, వారు పొందిన ప్రఖ్యాతి, పురోభివృద్ధి, సాంఘిక విషయములందును, తమ సంఘ ప్రవృత్తులందును ఇతరుల కెడమీయక, తమ ఆధిక్యమును, శ్రేష్ఠత్వమును, నిరూపింప జేయడానికి చేసిన ప్రయత్నాలు; (4) వంశ పరంపరాగతంగా బ్రాహ్మణులలో గల మతప్రభావము వలన వారి యెడల బ్రాహ్మణేతరులకు ఏర్పడిన బ్రాహ్మణ భక్తిని, స్వలాభమునకై ఉపయోగించుకొనగోరే కొందరి ప్రముఖుల నిరంకుశాధికార తత్పరత; బ్రాహ్మణేతరోద్యమమునకు ఇవి ముఖ్య కారణములుగా కనబడును. ఈ అన్ని కారణములను ఎదుర్కొనుటకై బ్రాహ్మణేతరోద్యమము జయప్రదముగా పని చేసినది. దీనికి ఫలితముగా అనేక బ్రాహ్మణేతర సంఘములలో స్వకులపౌరోహిత్యము, సంస్కృత భాషాధ్యయనమేకాక వేదాధ్యయనము, వేదోక్తముగా కర్మకాండలను జరుపుకొనడంకూడా ఏర్పడినది. ప్రజాహితోద్యమములు



జి. వి. రావుగారు (రిటైర్డ్ సానిటరీ ఇంజనీరు.)
సతీమణి స్కాట్‌లెండ్ దేశస్థురాలు.

డా. ఉప్పల లక్ష్మణరావుగారు
పి. ఎచ్. డి. (జర్మని)
ఆంధ్ర సిమెంట్ కంపెనీ మానేజరు.

వారి సతీమణి షోలింగరు
లక్ష్మణరావు. స్విస్ కన్య.
సత్యాగ్రహిణి

ఎక్కువగుట వల్లను, ప్రజాప్రభుత్వమునకు దేశములో అంకురములు ఏర్పడుట వల్లను, ప్రభుత్వ సహాయము దొరకుటవల్లను, మత స్వాతంత్ర్యము, విద్యా స్వాతంత్ర్యము అధికమగుట వల్లను, విజ్ఞాన ప్రాప్తికి సాధనములు, సౌకర్యములు, మితి లేనివిగా లభించుట వల్లను, బ్రాహ్మణేతర సంఘములు కూడా ప్రస్తుతము చాల అభివృద్ధిలో నున్నవనియే చెప్పవచ్చును. బ్రాహ్మణేతరోద్యమము తన తీవ్ర రూపమును ఉపశమించుకొనుట కూడా ప్రస్తుత బ్రాహ్మణేతరసంఘాభివృద్ధికి తార్కాణము.

బ్రాహ్మణేతర ఉద్యమము సాముదాయికముగా నడచుచున్నప్పుడు కూడా ప్రతికులము తమతమ కులసభలను ఏర్పరచుకొని, తమ యభివృద్ధికై పాటుపడుతూ వచ్చెను. ఈ కులసభలు అనేక బ్రాహ్మణ శాఖలలో కూడా జరుగుతూ వచ్చెను:—నియోగి మహాసభ, కర్ణకమ్మ సంఘము, మాధ్వ మహాసభ మొదలయినవి. బ్రాహ్మణేతరులలో ఆర్య వైశ్య మహాసభ, క్షత్రియ మహాసభ, కమ్మ మహాసభ, రెడ్డి మహాజనసభ, కాపు మహాసభ, ముతురాజి మహాసభ, వహ్నికుల క్షత్రియ సంఘము మొదలయినవి గలవు. ప్రతిసంఘసభలోను తమ సంఘమందలి బాలికా బాలకులకు విద్యాభివృద్ధి కావలెననియు, స్త్రీ జనోద్ధరణము జరుగవలెననియు, బాల్య వివాహముల నరికట్ట వలెననియు, వితంతు వివాహముల జరుపవలె ననియు, వరకట్నములను మాన్పింప వలెననియు, దేవతారాధనకై జంతుహింస చేయకూడదనియు, అంతశ్శాఖా భేదములు పాటింపక సహపంక్తి భోజనములు, శాఖాంతరవివాహములు జరుపబడ వలెననియు అనేక తీర్మానములు సంఘాభివృద్ధి నిమిత్తమై సభాసమ్మతములగుచున్నవి. ఈ సభల మూలమునను, ప్రజలలో విరివిగా పెరిగిన వివేక విజ్ఞానముల వలనను ఇంచు మించు ఈ దురాచారములు తగ్గినవనియే చెప్పవచ్చును. కాని, ఇంచుమించుగా అన్ని కులములలోను విద్యాధికులలోను, విద్యావిహీనులలోను వరకట్నముల మీది మోజు తలితండ్రులకు ఇప్పటికిని చాల బాధకరముగా నున్నది. విజ్ఞానవంతులైన యువకులు కూడా కట్నములు పొందుటు, కట్నములు లేక వివాహములు చేసికొనుటకు నిరాకరించుట ఎంతో హేయమైన కార్యములు. దీనికై తీవ్రతరమైన ఉద్యమము నడపికాని, చట్టములు చేసికాని, దూష్యములైన ఈ ఆచారములను నిర్మూలింప వలసి యున్నది.

అతిబాల్య వివాహములు, వృద్ధులకు బాలికల నంటగట్టు దురాచారములు ఆంధ్ర సంఘములలో చాలా వరకు



కీ. శే. ఆత్మూరి లక్ష్మి నరసింహ సోమయాజులుగారు,
బి. ఏ., బి. ఎల్., జిల్లా మునసబు, బందరు.
గొప్ప సంస్కర్త: ఆర్యవైశ్య ప్రముఖులు; యజ్ఞము చేసినవారు.

తగ్గిపోయినను, పూర్తిగా పోలేదు. అతి బాల్య వివాహములు లేక పోవుటకు చాల వరకు శారదాచట్టమే కారణముగావచ్చును. అయినను, అన్ని సంఘములలోను వేల కొలది వితంతువులు సంఘనిరంకుశాధికారమును సహింప లేక ప్రమగ్గుచునే యున్నారు. వితంతు వివాహోద్యమము ఆంధ్రదేశమున ఈ నాటిది కాదు. దీనికి ప్రాతిపదిక, సంఘ సేవాధురంధరుడన దగు కందుకూరి వీరేశలింగంగారి రోజులలో పడినది. నరసాపురములో వారు మొదటి వితంతు వివాహమును జరిపిరి. అప్పుడు ప్రజలలో వారిపట్ల రగుల్కొనిన క్రోధాన్ని, తత్ఫలితంగా వారు పడిన యమయాతనలు, ఇప్పటికిని తలచుకొనిన ధైర్యవంతుల గుండెలు కూడా అవియును. ఆయన చూపిన ధైర్యము, ఎంతోమంది సంస్కర్తలకు మార్గదర్శకమైనది. ఆంధ్రదేశములోని వితంతువివాహోద్యమ ప్రథమదశనుగూర్చి వీరేశలింగముగారి స్వీయచరిత్రలో చక్కగా వివరింపబడినది. వితంతువివాహ శాసనకారకుడైన విద్యాసాగరుని ఉద్యమము వంగదేశమునకంటె ఆంధ్రదేశమున ఎక్కువగా కొనసాగుటకు వీరేశలింగముగారి కృషిన్ని, రాజమహేంద్రవరములో వీరు స్థాపించిన వితంతుశరణాలయమున్ను కారణములు. ఈ ఉద్యమము ఈ రాజమహేంద్రవర కేంద్రమునుండి తక్కిన జిల్లాలకున్ను వ్యాపించినది. ఇప్పుడు తెనాలి, నరసాపురము, కాకినాడ మున్నగుచోట్ల సైతము వితంతు వివాహసంఘము లేర్పడి పనిచేయుచున్నవి. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు, వెల్లంకి కృష్ణమూర్తిగారు, బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు మొదలయినవారు ఎక్కువగా వితంతు వివాహోద్యమములో పాల్గొనిరి. కమ్మ సంఘములో కలగరరామస్వామి పిచ్చమ్మ దంపతులు, డా॥ మూల్పూరి రంగయ్యగారు; వైశ్య సంఘములో మోతే నారాయణరావు, మాజేటి రామచంద్రరావు, దర్శి చెంచయ్య, తూంపూడి భగవంతము గుప్తగార్లు; విశ్వబ్రాహ్మణులలో పట్నాల గోపాలస్వామి, పెదప్రోలు సూర్యనారాయణరావుగారు పేర్కొనదగిన ఉద్యమనాయకులు. ఈ ఉద్యమము బాగుగా వ్యాప్తిచెంది సాగుచుండుట ముదావహము. ఈ ఉద్యమ పరిణామమునకు పంతులుగారే కారకులని ప్రత్యేకించి చెప్ప నవసరములేదు.

ఆధునిక భారత ప్రవక్త; మహాత్మా గాంధీ.



కొల్లాయి గట్టితే నేమీ మాగాంధి "మాలడై మెట్టితే" నేమీ ?
వెన్నపూసా మనసు; కన్నతల్లీప్రేమ; పండంటి మోముపై బ్రహ్మతేజస్సు

—బసవరాజు.

## ఆరవ అధ్యాయము

# సాంఘిక సేవ, దానములు

విద్య యిచ్చుట సత్పాత్ర విషయమైన
నవ్యయానంద పదముఁజేయంగఁజాలుఁ
దగఁగ దక్షిణయిచ్చి పేదలకు విద్య
యీ నియోగించుటయుఁదత్సమాన కృతియ

—భారతము.

విషయ సంగ్రహము: ఆరంభములో నాగార్జున బసవేశ్వరాది మత కర్తల సంఘసేవ—ఈ కాలమందలి సాంఘిక సేవ—ఆంధ్రుల దానశీలము—పూర్వకాలమందలి ఇష్టములు, పూర్తములు—రాజుల దానశాసనములు—నేటి సత్రములు, దేవాలయములు, గ్రంథాలయములు—పురమందిరములు మొదలైన సంస్థలకు ఇచ్చిన విరాళములు—వల్లూరి సూర్యనారాయణరావు, మల్లాడి సత్యలింగం నాయకరు గార్ల మరణశాసనములు—దానధర్మములు.

మన సంఘమునుగూర్చిన్ని, దాని పరిణామమునుగూర్చిన్ని పూర్వభాగమున చదివియున్నారుగదా! మానవునియొక్క అభ్యున్నతి సంఘముయొక్క అభ్యున్నతిపై ఆధారపడియుండును. సంఘముయొక్క అభ్యున్నతి ఆ దేశమందలి ప్రకృతిసిద్ధమైన సంపదనుబట్టిన్నీ, శీతోష్ణస్థితినిబట్టిన్నీ తదితరమైన పరిస్థితినిబట్టిన్నీ ఉండును. వికసించు సంఘము-పరిణామము చున్న సంఘమునకు ఆ సంఘములోని మానవుల మానసిక పరిణామమునకుగానీ, భౌతిక, ఆర్థిక, నైతిక, జీవనపరిణామమునకుగానీ; పరతంత్రతవల్లనో, మరియే యితర కారణములవల్లనో, ప్రబలమైన నిరోధములు కల్గినచో ఆ సంఘము వికసించదు.

సంఘముయొక్క అభ్యుదయమునకై కృషిసల్పుటయే సంఘసేవ.

హిందూమతమునందలి వైవిధ్యమువల్లను, హిందూదేశము అనేకజాతులకు ఆవాసమగుటవల్లను, సంఘాభివృద్ధికి తర్వాత, మహమ్మదీయ పాలనలో అంతరాయములు హిందూ మహమ్మదీయ సంస్కృతుల సంఘర్షణమువల్లను మన సంఘైక్యమునకు, అభివృద్ధికి అంతరాయము లేర్పడినవి.

సుషుప్త్యవస్థలోనున్న మన సంఘము, వీరేశలింగం, నాగేశ్వరరావులాంటి వైతాళికుల ప్రబోధమువల్ల మేలుకొని, ఉత్కృష్టతనందుచున్నది. పరోపకారబుద్ధితో, స్వార్థరహితులై సర్వజనక్షేమమును, లోకసంగ్రహ కళ్యాణములను వాంఛించుచు, సాంఘికులు చేయు కృషియే స్తవనీయమైన సంఘసేవ!

మన ఆంధ్రదేశమున మతవిషయములందును, రాజకీయ విషయములందును సంఘము నుద్ధరింప ప్రయత్నించిన వీరులు పెక్కురు గలరు.

మత విషయికమైన సంఘసేవ చేసినవారు నాగార్జునుడు, శంకరుడు, బసవేశ్వరుడు మొదలైనవారు. సాంఘికాభ్యున్నతికి సర్వవిధములా కృషిచేసిన కందు సంఘసేవా తత్పరులు కూరి వీరేశలింగం, వెంకటరత్నం నాయుడుగార్లు మొదలైనవారి నెరుగని వారెవరు? జనుల మనోవికాసమునకు కారకులైన రచయితలను, కవులను సారస్వత విషయమైన కృషి చేసిన వారినిగా పేర్కొనవలెను. రాజకీయముగా ప్రజాస్వామ్యమునకై కృషి సలుపుతూ, దేశమునకై ప్రాణములిచ్చిన దేశభక్తులు, నాయక శిఖామణులు అనేకులు మన తెలుగుసీమను



దానకర్ణ, నాళం రామలింగయ్యగారు.
వైశ్య సేవాసదన స్థాపకులు.

పుట్టెదిరి. అన్నివిధములా సంఘ శ్రేయస్సును వాంఛించుచు సంఘజీవియై మానవుడు ముందడుగు వేయుచుండవలెను.

## దానశీలము-దానములు.

మన దేశమతవాఙ్మయములకు దానశీలమే కొలికిపూసగా నున్న విషయము మీరెరుగుదురు. ప్రాచీన సంస్కృత వాఙ్మయమున కంతటికీ దానశీలమే ప్రధానభావము. బలి చక్రవర్తి, కర్ణుడు మొదలైన ఐతిహాసికవీరులు దాన తత్పరతకు ప్రసిద్ధిచెందినవారు. స్మృతులలోను, అవి నిర్దేశించిన ఆచారకాండలలోను, సంఘక్షేమము, లోక సంగ్రహము పరోపకారతత్పరత, ప్రస్ఫుటము చేయబడినవి. పురాణములు, భారతరామాయణాది సద్గ్రంథములన్నీ దానశీలము, సత్ప్రవర్తనము మొదలైన ఉన్నతాదర్శములను,

ప్రాచీన వాఙ్మయం; దాన మున్నతాశయం

విశ్వశ్రేయస్సును వాంఛించి, ప్రబోధము చేయుటకేర్పడినవి. బౌద్ధయుగమున చిత్రలేఖనాది శిల్పకళలు, బౌద్ధధార్మిక గాథలను, వాటినీతులను సులభముగా ప్రజలకు వ్యక్తపరచుటకే రచితములగుచుండెను. అట్లే దశావతారాది కథలు, రామాయణగాథలు మన పూర్వులు చిత్రించిరి.

వ్యక్తులకిచ్చు దానములను, జనులందరికి సమిష్టగానిచ్చు దానములను పూర్వులు రెండు వర్గములుగా విభజించిరి. వానిలో వ్యక్తులకు, యజ్ఞయాగాది సత్కార్మల నిర్వహించుటకై యిచ్చిన దానములకు "ఇష్టము" లని పేరిడిరి.

ఇష్టము, పూర్తము

జనోపయోగార్థమై నిర్మితములైన చెరువులు, బావులు, ఆలయ నిర్మాణములు, రోగచికిత్సా సౌకర్యములు మొదలైన దానములకు "పూర్తము"లని పేరిడిరి. మానవుడు లోకులందరి క్షేమమును అర్థించుచు, తన్ను సంఘజీవిగా భావించుకొని ఉన్నత దృక్పథము గలిగి చేయు సత్కార్మలైన పూర్తములకు ప్రత్యేక స్థానముగలదు. ఈ విషయమునే విష్ణు పురాణమునందు "ఇష్టేన లభ్యతే స్వర్గం, పూర్తే మోక్షం సమశ్నుతే" అనే శ్లోకము ఉద్ఘాటించుచున్నది.

సత్కార్యములు చేసి, పరోపకార తత్పరత, ఔదార్యము కలిగియుండుట సర్వజనాదరణీయమైన విషయము.

దానశాసనములు

ఆంధ్రరాజులు అనేక ఆలయములకు, సంస్థలకు అనల్పమైన దానములనిచ్చుచు రచించిన శాసనములు నేటికిని మన చరిత్రలో నిలిచియున్నవి. అనేకచోట్ల దేవాలయములు కట్టించి, పలుసంస్థల పోషించి, ప్రజోపయోగకరములైన పనులను చేసిన ఉదారులు అనేకులు గలరు. కాశీనాథుని నాగేశ్వరరావుగారు తాముచేసిన దానధర్మముల వల్లనే విశ్వదాత అన్న సార్థక నామమును పొందిరి.

పెద్ద సంస్థలను పోషించి, తమ ఔదార్యమును బహుముఖ మొనరించిన ప్రజ్ఞావంతులలో జయపురం, పానగల్లు,



శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు, కాకినాడ.
(సంఘ సేవకుడు).

పిఠాపురం, వుయ్యూరు, వెంకటగిరి, మైలవరం మొదలైన జమీందారులను పరిగణించవలెను.

నేటి జమీందారులు-దాతలు

వీరుగాక, మల్లాడి సత్యలింగం నాయకరు, వల్లూరి సూర్యనారాయణరావు, మోతే గంగరాజు, సాళం రామలింగయ్య, పైడా వెంకటాచలపతి, రేబా లక్ష్మీ నరసింహారెడ్డి, సుద్దపల్లి రామచంద్రారెడ్డి, మాడపాటి వెంకటేశ్వరరావు, క్రొత్త లక్ష్మయ్యనాయుడుగార్లు మొదలైన దానశీలుర నేకులుగలరు.

ఇంతేకాక, ప్రతి పట్టణములోను వర్తకులు "ధర్మఫండు" వసూలుచేసి అనేక సత్కార్యములుచేయుచున్నారు. గాని, కొన్ని ప్రదేశములలో ఈ ధనము సద్వినియోగమగుటలేదు.

ధర్మనిధి-సద్వినియోగం కాకపోవుట

కొన్ని సత్రములలో ఆసత్రములు కట్టించిన దాతల వంశపరంపరలోని వారు ఆర్థికముగా పతనముపొందుట చేతనో, తమకు ఇష్టము లేక పోవుటచేతనో వాటిని సక్రమముగా నిర్వహించుటలేదు. ఒక చట్టముద్వారా వీటిని ధర్మబద్ధము చేయుటమంచిది. ఈ విషయమున వల్లూరి సూర్యనారాయణరావుగారు కొంత ఆందోళనము జరిపిరి. ప్రజాహితైకకార్యనిర్వాహణములో లోపములు, కృత్రిమములు ఉండిన, సంస్థలకుగల ఆదర్శము వక్రించును.

సత్రములు

ప్రతి పట్టణములోను, పల్లెలోను ఆలయములు, సత్రములు గలవు. ఇప్పుడు అనేక చోట్ల పశుసంరక్షణశాలలను, అన్నదాన సమాజములను నిర్మించు చున్నారు.

ఆంధ్రదేశ వాసులలోని దానశీలము, ఔదార్యము అవగాహన చేసుకొనుటకు ఈ క్రింద ఉద్ధరింపబడిన కొన్ని అంశములు ఆధారభూతములు కాగలవు. దానశీలము మన సంఘోన్నతికీ, సంస్కృతికీ గీటురాయి.

## వల్లూరు సూర్యనారాయణరావుగారి ధర్మములు

శ్రీ సూర్యనారాయణరావుగారు ఆరువేల నియోగి బ్రాహ్మణులు; వంగవోలు దగ్గర వల్లూరు గ్రామస్థులు. పాండిత్యము, సంగీతము, మొదలైన విద్యలు బాగుగా అభ్యసించినవారు వీరియింటగలరు. వీరు బీదకుటుంబమ్మున పుట్టియూ బి.ఏ. వరకును కష్టపడి చదివి, బందరులో కొంత కాలము న్యాయవాదవృత్తిలో నుండి, ఎక్కువగా ధనము ఆర్జించి, ఆర్జించిన దనమంతయు దాన ధర్మములకు వినియోగించిరి. విద్యార్థిదశయందు గూడా, వీరు పేదలకు తమ కున్న దానిలో కొంత దానముచేసి తోడ్పడుచుండెడి వారు. వీరి జీవిత చరిత్ర ప్రశంసాపాత్రమై, పఠనార్హమైనది. వీరి విశాల హృదయము, ఔదార్యము వేరొకచోట చూపబడిన వీరి మరణ శాసనమే చాటు చున్నది.

వీరు బందరు జాతీయ కళాశాల, కోపల్లి హనుమంతరావుగారి స్మారకనిధికి రూ 1000 లున్ను, తిలకు ఫండుకు రూ1600 లును, బందరు కళాశాలకు 8 వేల రూపాయలు విలువగల వారి కవులవరములోని ఆస్తిన్ని, బెజవాడ రామమోహన ఆయుర్వేద ధర్మ వైద్య కళాశాల సంఘమువారికి సాలీన రూ. 500 లు వచ్చు ఆస్తిన్ని, పెద మద్దాలి గ్రామ దేవాలయములకు కొంత ధనమున్ను, అనేక విద్యార్థులకు, విద్యానిలయములకు దానములున్ను చేసిరి.

కొవ్వూరున విద్యా పీఠమను ఒక సంస్థను స్థాపించిన దేశభక్తుడు, స్వార్థత్యాగి, కవి, గ్రంథకర్త అయిన తల్లా ప్రగడ సూర్య నారాయణరావు గారి తర్వాత, ఆ సంస్థను పోషించే భారము వీరే నిర్వహించిరి. అసలు వీరి సర్వస్వమును దానికే నియోగించి నారు. 1931 సం॥ ఏప్రెల్ 9 వ తారీఖున ఆసంస్థకు 12 వేల రూపాయల విలువగల తమ ఆస్తి స్వాధీనపరచి ట్రస్టు దస్తావేజు వ్రాసి యిచ్చినారు; పలు ధర్మ సంస్థలు సక్రమముగా నడచునట్లు చేసి, వాటి వ్యవహారములు పరిష్కరించిరి. వీరు చేసిన కొన్ని దాన ధర్మముల వివరణములు మరణ శాసనములో నున్నవి.

## మల్లాడి సత్యలింగం నాయకరుగారి ధర్మములు

గోదావరి జిల్లా కోరంగి గ్రామము కీ. శే. మల్లాడి సత్యలింగం నాయకరుగారి జన్మస్థలము. వీరు అగ్నికుల క్షత్రియులు; మొదట సామాన్య కుటుంబీకులు; 1868 సం॥లో రంగూన్ వెళ్లి, అచ్చట మూడు సంవత్సరములకు ఒక పడవను సంపాదించి, పిమ్మట స్టీమర్లలోను పడవలలోను వ్యాపారము చేసి, కొన్నిలక్షల నార్జించిరి. వీరు దివి 29 జనవరి, 1915 సం॥న దివంగతులైరి. నాయకరుగారు నెలకొల్పిన దాన సంస్థకు సుమారు 7 లక్షల రూపాయిలు విలు

వగల భూములు కాకినాడ చుట్టుపట్లు గ్రామములలో ఉన్నవి. ఒక లక్ష యాభై వేల రూపాయలతో జగన్నాథ పురమున పాఠశాల, సత్రము మొదలైనవి కట్టినారు. ఈ సంస్థయొక్క ధర్మములలో నొకటియగు ఉచిత పాఠశాలలో 350 మంది బాలురు మొదటి తరగతి నుండి మూడవ ఫారమువరకు చదువు చున్నారు. సత్రములో విద్యార్థులకు, అనాథులకు దరిదాపు 100 మందికిపైగా ప్రతిపూటా భోజనము పెట్టుదురు. సంగమేశ్వరస్వామివారి ఆలయము చొల్లంగిలోనిది ఈ సంస్థవారి నిర్వహణములో నున్నది.

ఈ సంస్థచేసిన సాహాయ్యమువల్ల విదేశములకుపోయి, అక్కడ పలువిధములగు విద్యల నభ్యసించి, ఉన్నత పదవుల నున్నవారిలో అవుటుపల్లి నారాయణరావు; వై. వి. కృష్ణారావు (వ్యవసాయ శాఖా డిప్యూటీడైరెక్టరు); బి. శంకరరావు నిరోడి (మద్రాసు గవర్నమెంటు కన్నడ ట్రాన్సులేటరు); యల్లాప్రగడ సుబ్బారావు (వైద్యులు); లంక సుందరం (పత్రికావిలేఖరి); చావలి సుబ్రహ్మణ్యశాస్త్రి (ఆడిటరు); కె. పి. సత్య నారాయణ (ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టరు); సి. ఆర్. కులశేఖరం నాయకరు; కె. యస్. మూర్తి; నూగంటి బాపినీడు (మాజీపార్లమెంటరీ ప్రచురణ శాఖా కార్యదర్శి) గార్లు.

ఈ సత్యలింగం నాయకరుగారు చేసిన ఇతర దానధర్మముల వివరణములు వీరి మరణశాసనములో గలవు.

## మాడపాటి వెంకటేశ్వరరావుగారి ధర్మములు

మాడపాటి వెంకటేశ్వర రావుగారు, నిజాము రాజ్యములోని పరిటాల గ్రామ కాపురస్థులు. పిత్రార్జిత మేమియు లేదు. తాత తండ్రులవలెనే నూజివీటి సంస్థానమును కనిపెట్టుకొని, తన బుద్ధి కుశలత, చాకచక్యములవలన నెలకు 15 రూ. జీతమునుండి 300 ల రూ. వరకు జీతము తీసికొనుచు, ఉయ్యూరు నిడదవోలుజమీనులకు దివానుగా వీరు పని చేసిరి; 1917 లో పరమపదించిరి. వీరు బెజవాడ, నూజివీడు మొదలైనచోట్ల అనేక దాన ధర్మములను చేసిరి.

## ఏకా దండయ్యగారి ధర్మములు

వీరు గుంటూరులో ప్రసిద్ధికెక్కిన ప్లీడరు; అనేక సత్రములను కట్టించి, బావులను త్రవ్వించి, బీద విద్యార్థులకు భోజన సౌకర్యములు, జీతముల సదుపాయములు, మత గ్రంథముల ముద్రణ మొదలైన ఉత్కృష్ట కార్యములు చేసిరి.

గుంటూరు హిందూ కళాశాలకు వీరు 20 వేల రూపాయలకు పైగా విలువగల నొక భవనమును కట్టించి యిచ్చిరి.



దివాన్ బహదూర్ మోతే గంగరాజు జమీందారుగారు, ఏలూరు.

నర్సారావుపేట తాలూకా లోని కీ. శే. చింతలచెరువు కోటేశ్వర రావుగారు, బి.ఏ., బి.యల్. కోటప్పకొండవద్ద అన్న సత్రమును పూర్వము పెట్టించి, అనేక ఆలయములకు దాన ధర్మముల జేసి తోడ్పడిరి. శ్రీమంచికంటి వెంకట్రామయ్యగారు నర్సరావు పేటలోను, కోటప్పకొండవద్దను నిర్మించిన సత్రములును, కాకుమాను శాంతయ్యగారు కట్టించిన సత్రమును గలవు.

## సుద్దపల్లి రామచంద్రా రెడ్డిగారి ధర్మములు

వీరుకర్నూలు జిల్లా ఆర్లగడ్డ గ్రామములో 30 వేల రూపాయులకు పైగా కర్చుపెట్టి శివాలయము ఒక దానిని నిర్మించి, అందలి నిత్య ఖర్చులకును, కర్నూలు జిల్లా అహోబిల దేవాలయములో తిరునాళ్ల సమయమున అన్న సత్రం జరుపుటకుగాను, రూ. ఏడువేలుచేయు 60 ఎకరముల భూమిని కొని దానము చేసినారు; చిత్తూరు జిల్లా మదనపల్లి తాలూకాలో కళాశాల భవనములు కట్టునప్పుడు, 15 వేల రూపాయలతో ఒక భవనమును కట్టించి యిచ్చిరి.

కడప జిల్లాలో అనేక మంది బీద విద్యార్థులకు వీరు ధన సహాయము చేసిరి.

## బైసాని మాధవ చెట్టి ధర్మనిధి

1920 సం॥లో శ్రీ బైసాని మాధవ చెట్టిగారు, చిత్తూరు జిల్లాలోని ఒక పేద కుటుంబములో జన్మించిరి. సంపాదనార్థము, మద్రాసుకు వచ్చి, స్వసామర్థ్యముతో వర్తక శ్రేణిలో ఉన్నతస్థానము సంపాదించుకొని, సంపన్నులయిరి. వీ రానాటి వైశ్య ప్రముఖులలో అగ్రగణ్యులు. రామానుజ మతాభిమానులు. పరమహంస ఎంబార్ జియ్యరు స్వామి గారి సమకాలికులు. గ్రంథాలయములు, సంస్కృత గ్రంథములు, దేశీయ గ్రంథములు వ్యాపకముచేసి గ్రంథకర్తలను పోషించుట; విద్యార్థులకు సర్వవిధముల సాయపడుట, సంగీత సాహిత్య ఆదరణ, హైందవ మత, విజ్ఞానముల వ్యాపకత మొదలైన ఉన్నతాశయముల నెరవేర్చుటకు 1891 లో కొంత ధనము దానము చేసిరి. ఆనాటిట్రస్టు, వాటి మొత్తము రు. 1,35,000 లు ఇప్పుడు సెక్యూరిటీల క్రింద, కొన్ని పెద్దపెద్ద భవనములు కలిగి యున్నది. వీరు కొన్ని పాఠశాలలను, గ్రంథాలయములను పోషించు చున్నారు.

## రాజమహేంద్ర వరమున నాళం వారి ధర్మములు

గోదావరి జిల్లా రామచంద్ర పురం తాలూకా మరుపేట యను గ్రామమునందు నాళము భీమయ్యగారి వంశీకులు, రాజమహేంద్ర వరమున అన్నసత్రము ధర్మార్థముగా స్థాపించుటకు రు. 25,000 దానము చేసిరి.

## మోతే గంగరాజు గారి ధర్మములు

| | | |
|---|---|---|
| ఏలూరు సత్రమునకు | రు. | 50,000 |
| బ్రాహ్మణ గృహదానములకు | రు. | 5,000 |
| మెకానిక్ సభకు | రు. | 1,000 |
| శ్రీగాంధీ విద్యాలయమునకు | రు. | 25,000 |
| హైందవ యువతీ సంఘమునకు | రు. | 30,000 |
| ఉత్తర వైశ్య మహాసభకు | రు. | 4,000 |
| బెజవాడ హిందూ హైస్కూలునకు | రు. | 3,000 |

## పైడా వెంకటాచలపతి శ్రేష్ఠిగారి ధర్మములు

| | | |
|---|---|---|
| కాకినాడ విక్టోరియా వాటర్‌వర్క్సు | రు. | 42,500 |
| కాకినాడ లేడీస్ రిక్రియేషన్ భవనము | రు. | 6,000 |
| పైడా వెంకటాచలపతి టౌన్‌హాల్ | రు. | 30,000 |
| పిఠాపురం మహారాజా కళాశాల భవనములకు | రు. | 3,000 |

## మద్రాసు వైశ్య ప్రముఖుల ధర్మములు.

(i) శ్రీ కన్యకాపరమేశ్వరి ధర్మ ప్రతిష్ఠాపనము.

శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయ ఆవరణలోనుండు స్థలము కోమట్లతోట, కూరగాయలతోట, కొత్వాల్ చావడి అని మూడు పేళ్లు కలిగియున్నది. సుమారు 200 సం॥ల క్రిందట వైశ్య సంఘమునకు ఈ స్థలము లభ్యపడినది. మూలధనము ప్రస్తుత స్థిరాస్తులు చేరి దరిదాపు రు 23 లక్షలు. దేవాలయమునకు, పాఠశాల విద్యార్థుల ఉచిత వేతనములకును, బీద వైశ్యులకు అన్నదానము, రోగచికిత్స సహాయ మొనర్చుటకును, ఇంగ్లాండున విద్య నభ్యసించుటకు బోవు బీదవైశ్య విద్యార్థులకు ధన సహాయమిచ్చుటకును ఈ ధర్మ ప్రతిష్ఠాపనము వెలసినది.

(ii) పప్పిశెట్టి రాఘవయ్యశ్రేష్ఠిగారి ధర్మ ప్రతిష్ఠాపనము.

పప్పిశెట్టి రాఘవయ్య శ్రేష్టిగారు తమ విశేష ధర్మ సంపత్తిని ధర్మకార్యముల వినియోగార్థము, ది 24-7-1912 న ఒక ట్రస్టు స్థాపించిరి. వీరి ధనము వైశ్యజన సంఘోద్ధరణమునకు, జీర్ణ దేవాలయోద్ధరణమునకు, ద్రవిడ సంస్కృత జ్ఞానముగల పండితులకు, బ్రాహ్మణోత్తములకు తమ మత విషయిక గ్రంథములకు ధన విరాళముల నేర్పాటు చేసి యున్నారు. మూల ధనము రు 5 లక్షలు.

(iii) కలవల కణ్ణక్రశేష్టిగారి ధర్మ ప్రతిష్ఠాపనము.

కలవలకణ్ణక్ శ్రేష్ఠిగారు ధర్మదాతలని, ప్రతిభాశాలురని వాసికెక్కిరి.

| వారి ధర్మములు. | | రూపాయిలు. |
|---|---|---|
| ఆయుర్వేద ధర్మవైద్యశాల | తిరువల్లిక్కేణి | 9,000 |
| ఆయుర్వేద ధర్మవైద్యశాల | సుంగంబాకం | 45,000 |
| ఆయుర్వేద ధర్మశాల | నెల్లూరు | 3,000 |
| హైస్కూలు | పెరంబూదూరు | 6,000 |
| ,, | పురశువాకం | 5,000 |
| ,, | తిరువళ్లూరు | 3,000 |
| చింతాద్రిపేట బాలికా పాఠశాల | | 2,500 |
| సంస్కృత కళాశాల | తిరువల్లిక్కేణి | 6,000 |
| మాంబలము పాఠశాల | | 1,200 |
| శిశువులకు పాలకొరకు | తిరువల్లిక్కేణి | 7,009 |
| శిశు సంరక్షణకొరకు | | 1,080 |
| కృష్ణప్పనాయుని అగ్రహారమున ప్రతివారమున జరుగు బీదల భోజనములకు | | 600 |
| వీరి ఆధిపత్యముక్రింద జరుగు రాత్రి బడులకు | | 3,500 |
| ఎగ్మూరు సత్రమునకు | | 1,500 |
| కంజీవరమున వరదరాజస్వామి ఉత్సవమునకు | | 350 |

(iv) ఓలేటి రంగనాయకమ్మగారి ధర్మములు. (1904)

ముఖ్యముగా వైశ్యులలో విద్యా విషయకాభివృద్ధికిన్ని, అన్నదానములకు, ఆలయములకు మొదలైన సత్కార్య నిర్వహణములకు ఈ ధర్మబుద్ధిగల ఆంధ్ర నారీమణి ఈ ధర్మ ప్రతిష్ఠాపనముచేసినది. ట్రస్టు మొత్తము ధనము రు. 90,847.

# మరణ శాసనములు

మన ఆంధ్రులలో త్యాగబుద్ధి, ధర్మచింత గల ప్రజాహితైక జీవులు, ప్రజాసంస్థలకు దానము చేయుచు వ్రాసిన మరణశాసనములలో వారి చిత్తవృత్తి, విశాలహృదయము, పరోపకారపరాయణత ప్రతిబింబించును.

అట్టి మహనీయులలో శ్రీ వల్లూరి సూర్యనారాయణ రావు, శ్రీ మల్లాడి సత్యలింగం నాయకరుగార్ల మరణ శాసనములలో ముఖ్యమైన భాగములు ప్రకటించుచున్నాము.

## వల్లూరి సూర్యనారాయణ రావు బి. ఏ., బి. యల్., యల్. టి., గారి మరణశాసనము

* * * * * * * *

### iv నా కొమాళ్లు

నా స్వకాయ కష్టమువలన పితురార్జిత సహాయ మేమియు లేక ** సంపాదించు (కొన్న ఆస్తిలో) మూడవ వంతు యిదివరకే దాన ధర్మములు చేసికొంటిని. మిగిలిన రెండు వంతులునుకూడ నాకు యుక్తమని తోచిన ధర్మకార్యమునకు వినియోగించుటయే నా విధ్యుక్త ధర్మమని ** యెంచియుంటిని. నా కొమాళ్లు నాకంటె అదృష్టవంతులై, నా సహాయమువలన ఉన్నత విద్య గడించి, తమ సన్మార్గ ప్రవర్తనచేతను, ప్రయోజకత్వముచేతను నాకుకూడా మంచి పేరు తేగలిగిరి. వారి కుటుంబములను వారే పోషించుకొనగలరు; గనుక వారియెడల నా బాధ్యత తప్పిపోయినది. వీరి నింకను ధనవంతులను చేయుట నా కిష్టములేదు. అట్లు నేను చేయదలచుకొనినను వారు సంపాదించుకొనకుండ వచ్చిన ధనము వారి కుటుంబములో యెన్నటికిని నిలువనేరదు. ఒకవేళ ఒకటి రెండు తరములు కొద్దిగా నిలిచినను, అది తరువాత పూర్ణముగ నశించి తీరును ** నా కొమాళ్లుకూడ తమ సంతతివారియెడల నా మార్గమునే అనుసరించెదరని నమ్ముచున్నాను.

### v నాకు ప్రస్తుతమున్న స్థిరాస్తి.

కొవ్వూరు గ్రామములో నా బంగళాయున్ను, దాని కాంపౌండులోని తోటయున్ను, కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ సంఘమువారు తమ మేనేజిమెంటు క్రిందకు తీసుకొని ట్రస్టీలుగా వ్యవహరించ వలెను. ఈ యింటిలోను, తోటలోను మొదట నాభార్య తన జీవితాంతము వరకును, ఆమె చని పోయిన తరువాత నాయిద్దరు కొమాళ్లు

కృష్ణమోహన్ M. A. Bt., జగన్మోహన్ B. A. L. E. E. గార్లు, జీవితాంతము వరకు, వీరిద్దరు చనిపోయిన తరువాత పై రెండవ వారి కుమాళ్లు సూర్యమోహన్, శివరామకృష్ణ మోహన్, రామ మోహన్లు తమ జీవితాంతము వరకున్ను Right of residence (నివసించు హక్కు) మాత్రము కలిగియుందురు. వీరెవ్వరును కొవ్వూరు గ్రామములో స్థిరముగా నుండక, గ్రామాంతరములందు నివసించు కాలములో యీ



కీర్తిశేషులగు శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు
బి. ఏ., బి. ఎల్., యల్. టి.

యింటి ఉత్తర సగభాగము అంతలోగాని, కొంతలోగాని, సామాను పెట్టుకొని తాళము వేసుకొని, తాము తిరిగి వచ్చినప్పుడెల్లను, యీ భాగములో నివసించ వచ్చును; లేక ట్రస్టీలగు విద్యాపీఠ సంఘమువారికే స్వాధీనము చేయుచుండ వచ్చును. పై వారిలో ఎవరైన ఈ కొవ్వూరును స్థిరనివాసముగా చేసుకొన్న యెడల, యిల్లంతయు వారి స్వాధీనములోనే యుంచుకొన వచ్చును. విద్యాపీఠ సంఘము వారు యీ బిల్డింగులోనున్న బీరువాలను, కుర్చీలను, డెస్కులను, యింటి దక్షిణ భాగములోనే యుంచి వానిని వారే స్వయముగా గాని, నాసంతతి వారిక్కడ స్థిరనివాస మేర్పరచుకొన్న యెడల వీరి గుండాగానీ, నాట్రస్టు కార్యములకు వాడు చుండవలెను. వీరెవరును ఏ ఆస్తిగాని అద్దెలకు, పబ్లికు మీటింగులకు యీయగూడదు. ఈ గృహము దీని కాంపౌండు, తోట "మన స్వాతంత్ర్య మందిరము" అను పేరుతో వాడబడు చుండ వలెను. మత, సాంఘిక, రాజకీయార్థిక, విద్యా విషయములలో పరిశోధన, విమర్శన గ్రంథకర్తలకును, వారి కుపయోగించు గ్రంథాలయమునకును, విద్యా సంఘమువారు ప్రతిసాలున ప్రకటించు గ్రంథములను నిలువ చేయుటకును, పండితబృంద సమావేశములకును యీప్రశాంతమైన స్థలమును, నాసంతతి వారు, విద్యాపీఠ సంఘమువారు ఉపయోగించవలసినదేగాని, పబ్లిక్ మీటింగులకుగాని, మరియే యితర పనులకుగాని యెన్నడు నీయ గూడదు. నాసంతతి వారిక్కడ లేని యెడల, యీయింటి వెనుక భాగమున తూర్పు దిశనున్న రెండు వసారాకొట్లు, స్నానముల కొట్లు, తోట మొదలగునవన్నియు గూడ, విద్యాపీఠ సంఘమువారి మేనేజిమెంటులో నుండ వలయును. యీ యాస్తి అంతమీద యీయ వలసిన పన్నులు, దీనికగు మరమ్మతులు నౌకర్ల జీతములు, నూతనముగా కొనవలసిన బీరువాలు మొదలగు సామానులు, దీపములు, మొదలగు వాని ఖర్చులక్రింద నెలకు ఏబది రూపాయలకు మించ కుండా విద్యాపీఠ సంఘము వారే యెల్లప్పుడు భరించు చుండవలెను.

### కొవ్వూరులోని ఖాళీ స్థలము

నేను, కొవ్వూరు గ్రామములో ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠమున కెదురుగా, రైల్వే ఫీడరురోడ్డు పశ్చిమమున, రీసర్వే నెం 687 రు. 78 సెంట్లు విస్తీర్ణముగల ఖాళీస్థలమును కొని, దానిలో ఒక నూతిని గూడా త్రవ్వించితిని; దీనిని వినియోగ పరచవలసిన పద్ధతిని గురించి పై రెండవ పేరాలోని చివరి భాగములో వ్రాసి యున్నాను.

### vi నాకు ప్రస్తుతమున్న నిలవ రొక్కము.

నాకు కృష్ణా జిల్లా గుడ్లవల్లేరు కోఆపరేటివు ల్యాండు మార్ట్‌గేజి బ్యాంకులో 54 వేల రూ. ల డిబెంచర్లు మాత్రమున్నవి. దీనిమీద సాలుకు 23 వందల.రూ. ల వడ్డీ రాగలదు. దీనిని నాజీవితాంతము నాఖర్చుల కొరకుంచు కొంటిని. నాతదనంతరము యిదివరకు నేను ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ సంఘమువారి పేర 9-4-31 తారీఖున 12 వేల రూపాయలకు వ్రాసి యిచ్చిన ట్రస్టు ఫండులో

దీనిని గూడా జేర్చి, దానిలోని నాయుద్దేశ్యములను నెరవేర్చుటకు మాత్రమే దీనిని సదరు సంఘము వారు ఉపయోగించ వలెను. ఆ దస్తావేజులో వ్రాసిన ప్రకారమే యీ సొమ్మును Invest చేయుచుండ వలెను. కాని యీక్రింది ఖర్చులు పోను, మిగిలిన మొత్తమునే ట్రస్టీలు నాయుద్దేశ నిర్వహణమునకు ఖర్చుపరచు చుండవలెను.

(a) నావితంతు కోడలు వల్లూరి చంద్రమతి యే కళాశాలలో నైనను విద్య నభ్యసించు చున్నంత కాలము మాత్రమే సాలుకు రు. 360 యిచ్చు చుండవలెను.

(b) నాభార్యామేనకోడలును, సంతానహీనురాలైన వితంతువును నగు మానాప్రగడ వెంకాయమ్మకు, ఆమె జీవించి యున్నంత కాలము సాలుకు రు. 60 లు యిచ్చు చుండవలెను.

(c) నాకు కొవ్వూరులోవున్న యిల్లు, దాని కాంపౌండులోని తోటల మరమ్మతులకును, నౌకర్ల జీతములకున్ను, పన్నులకును, నూతన Furniture కును, దీపములు మొదలగు ఖర్చులకును సాలుకు 600 రూ. మించకుండా ఖర్చు పెట్టవచ్చును.

### vii పండిత బృందము

నేను 9-4-31 తారీఖున కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ సంఘమువారి పేర వ్రాసిన ట్రస్టు దస్తావేజులోని నాయుద్దేశ్యములను నెరవేర్చుటకు ఒక పండిత బృందమును ఏర్పాటు చేసెదనని వ్రాసియుంటిని. దాని నిర్మాణమును, అధికారములును ఈ విధముగా నుండ వలెను.

(1) నాకొమాళ్లిద్దరు, జటావల్లభుల పురుషోత్తము M. A. గారును దీనిలో జీవితకాలపు మెంబర్లుగా నుండి, వీరు ప్రతిసాలుకు ఏర్పరచుకొను మరియిద్దరు విద్యాధికులతో గలసి, మొదటి పండిత బృందముగా ఏర్పాటు కావలెను. వీరిలో యేకారణము చేతనైనను ఖాళీలు సంభవించినపుడు, తక్కినవారు ఆఖాళీలను పూర్తి చేసుకొను చుండవలెను. దీనిలో చేరు మెంబర్లందరు, యేమత గ్రంథము గూడ దైవదత్తమనిగాని, దానిలోని విషయముల నుల్లంఘనీయములనిగాని నమ్మమని ప్రమాణ పత్రము ముందుగా దాఖలుచేయ వలెను.

(2) ఈ పండిత బృందమువారు నాట్రస్టు డీడ్డులో నుదహరించిన విషయములను గురించి, విమర్శన గ్రంథములను ఆంధ్రములో వ్రాయించి, అచ్చొత్తించి, ఆంధ్రదేశములోని ముఖ్య గ్రంథాలయముల కన్నింటికి ఉచితముగా పంపించుట, వ్యక్తులకు విక్రయించుట మొదలగు పనులు నెర వేర్చుచుండ వలెను. ఈ పండిత బృందము కలసి పనిచేయ జాలనపుడు, నేను పై వ్రాసిన యోగ్యత గల మెంబర్లను, ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు యేర్పరచ వచ్చును.

(3) గ్రంథముల నచ్చొత్తించుటకును, పోస్టేజికిని విద్యాపీఠ సంఘమువారు దీనికొరకేర్పడిన ట్రస్టు ఫండు మీదవచ్చు వడ్డిలోనుండి కావలసిన సొమ్ము నెచ్చించు చుండవలెను.

(4) అచ్చొత్తించబోవు ప్రతి గ్రంథమును, విద్యాపీఠ సంఘములో శాశ్వత సభ్యుల మెజారిటీవలన అంగీకరింపబడుచుండవలెను.

(5) ఏకారణము చేతనైనా, ప్రస్తుత కళాశాలాధ్యక్షులగు జటావల్లభుల పురుషోత్తంగారు యీ విద్యా పీఠములో నుండుట తటస్థించకపోయినను, కళాశాలలోని ఏ ఉపాధ్యాయుడును, పరిశోధనా కార్యమునకు తగినవాడు కాడని పండితబృందమువారు తలచినను, అప్పటినుండియు విద్యాపీఠ సంఘమునారు, నేనట్టి ఉపాధ్యాయుని కొఱకే ది. 9-4-31 తేదీ ట్రస్టు దస్తావేజులో యేర్పరచిన నెల 1కి రు. 20 లు. కళాశాల నిమిత్తము ఖర్చు పెట్టగూడదు. ఆ మొత్తము విమర్శన గ్రంథకర్తలకు పారితోషికముగ నొసగ వలెను.

(6) ఈ పండితబృందమునకు విద్యాపీఠ సంఘమువారికిని, అచ్చువేయబోవు గ్రంథ ప్రాశస్త్యమునుగురించి భేదాభిప్రాయములు కలిగినప్పుడు, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి Academic Council వారి నిర్బంధ మధ్యవర్తిత్వమునకు ఉభయులు ఒప్పుకొని, వారి తీర్మానములబట్టి నడచుకొని తీరవలెను.

(7) నా ట్రస్టుఫండును బట్టి వెలువడు ప్రతి గ్రంథమును, నా చిరకాలమిత్రుడగు అద్దేపల్లి లక్ష్మణస్వామి

నాయుడుగారి, రాజమండ్రిలోని సరస్వతీ Power Press లోనే అచ్చొత్తించుచుండవలెను.

(8) నూతన పరిశోధన గ్రంథములతోబాటు, సమస్త భౌతిక శాస్త్రములలో పైస్మర్లు మొదలు స్టాండర్డు గ్రంథములవరకు యీ పండిత బృందమువారు వ్రాయించవచ్చును.

### viii ట్రస్టు మేనేజిమెంటు.

కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ సంఘమువారు, నేనిందుమూలముగా నిచ్చిన చర స్థిరాస్థులకు Executors & Trustees గా నుండి, సరిగా, ఆచంద్రార్కముగా నా ధర్మమును పాలింతురని నమ్ముచున్నాను. ఈ ట్రస్టు మొత్తమంతయు, యెల్లప్పుడు, ఎంతవడ్డీవచ్చినను, కోపరేటివ్ ల్యాండు మార్టగేజిబ్యాంకు డిబెంచర్లలోనే నుండవలెను. ఈ ధర్మమునందు అభిమానముగల ఆంధ్రసోదరులలో నెవరైనను, పైసంఘము వారి యొద్దనుండి లెక్క కాపీని, తడవకు రెండేసి రూపాయలిచ్చి పొందవచ్చును. అట్లు వారీయనియెడల Act XIV of 1920 ప్రకారం, ఏలూరు జిల్లా కోర్టులో పిటిషన్ బెట్టి, కావలసిన సముజాయిషీని పొందగలరు. ఈ సంఘమువారు, ఈ ధర్మమును సరిగా పాలించుటలేదని తెలిసినపుడు, ఆంధ్ర విశ్వ విద్యాలయమువారు ఈ ఆస్తి యంతయు కోర్టుద్వారా స్వాధీనము చేసికొని, నాయుద్దేశ్యములను యీ కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము లోనే నెరవేర్చుచుండుటకు, వారి క్లిష్టమైన యేర్పాట్లు చేయవచ్చును.

పై కొద్దియాస్తిలోకూడ, యెంత మిగులునో నేనిప్పుడు చెప్పజాలను. ధర్మ సంరక్షణకు ప్రజలు ఉదాసీనులై యుండుటవలన, నా చిరకాలానుభవమును బట్టి మనన్యాయస్థానములు తరచుగా జూదపుటిండ్లని నేను తెలుసుకొని యున్నను, ప్రకృతి యంతటిలోవలెనే, మానవ సంస్థలన్నియు అపరిపూర్ణ స్థితిలోనే యుండక తప్పవని గ్రహించి, సదరు న్యాయస్థానములే, న్యాయసిద్ధికి కొంతవరకు మనకు శరణ్యములని నమ్ముతున్నాను. కాబట్టి ధర్మ సంరక్షణోద్యమములో నేను వెచ్చించగా మిగిలిన ఆ స్తియే కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠమునుండి వెలువడు గ్రంథములకు ఉపయోగపడగలదు.

ఈ ఉయిలుమీది సాక్షీ దస్కత్తులను నేను స్వయముగా వెళ్లి చేయించుకొంటిని.

కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము } వల్లూరి సూర్యనారాయణ రావు దివి 1-1-36.

## మల్లాడి సత్యలింగం నాయకరుగారి కడపటి మరణ శాసనము.

1. రంగూన్ 82 వీధి నెం 32 రు యింట్లో నివసించు మల్లాడి సత్యలింగం నాయకరగు నేను వ్రాసిన మరణశాసనము కడపటిదై యున్నది.

2. ఇంతకు పూర్వము నేను వ్రాసియుండు మరణ శాసనములను ఇందుమూలముగా రద్దు పరచి, యిదియే నా ఆఖరి మరణశాసనమై యున్నదని తెలియజేయుచున్నాను.

3. దీనిని అమలు జరిపించుటకు నా దత్తకుమారుడైన సుబ్రహ్మణ్యము, నా వ్యవహారము చూచే గుమాస్తా పెనుపోతు గోవిందరాజులును యగ్జిక్యూటరులుగా నేర్పరచడమయినది.

4. ప్రస్తుతము నా అధీనమునందున్న, చరస్థిర రూపకమగు యావదాస్థియు నా స్వార్జితముగాన, నా బంధువులు గాని, మరియే యితరులుగాని నా యాస్థిలో నెట్టి భాగమున్ను కలిగియుండరని తెలియజేయుచున్నాను.

5. నా అవసానకాలమందు నా హక్కు భుక్తములు గలిగిన చరస్థిర రూపకమగు యావదాస్థియు పై నుదహరించబడిన యగ్జిక్యూటర్లకు, ఈ క్రింది పద్ధతులలో మరణ శాసన పూర్వకముగా వశపరచుచున్నాను.

మొదటిది :—నేనితరుల కివ్వవలసిన సొమ్ము, గుమాస్తా నౌకర్లు వగయిరా జనముల కివ్వవలసిన జీతముల నిచ్చివేయుట.

రెండవది :—ప్రొబేటు (వీలు బుజువుగాబడి, తగిన ఆఫీసరుచేత పుట్టబడిన సర్టిఫికేటుతోగూడిన పబ్లికు కాపీ) పుట్టిన వెంటనే నా వ్యవహారమును జూచు గుమాస్తా పెనుబోతు గోవిందరాజులుకు పదివేల రూపాయల నిచ్చివేయుట. చాలా కాలమునుండి నమ్మకముగా పని చేసినందుకుగాను యీ సొమ్ము అతని కీయబడినది. ఈ దిగువ

నుదహరించిన రీతిగా ధర్మకర్తృత్వపు పని నంగీకరించినను, లేకపోయినను, నా యనంతరము నాయెస్టేటు సంబంధమైన పనులుచేయుట మానినను, యీవీలు ప్రకారము అమలుజరుపుట విషయములో తా నంగీకరించకపోయినను, ప్రొబేటు పుట్టిన రెండు మాసములలో అతని సొమ్ము అతనికీయవలయును.

మూడవది :—"మల్లాడి సత్యలింగం నాయకరు ధర్మము" లను పేర, నీ దిగువ నుదహరింపబడు ధర్మములకొరకు 8 లక్షల రూపాయల మొత్తము నిచ్చుట. ధర్మపనులకొరకు ఈ దిగువ నుదహరించినవారిని ధర్మకర్తలుగా నేర్పరచుచున్నాను.

(1) నా దత్తపుత్రుడు మల్లాడి సుబ్రహ్మణ్యం

(2) నా వ్యవహారములగుమాస్తా పెనుబోతు గోవిందరాజు.

(3) ప్రస్తుతము కాకినాడ మునిసిపాలిటీలోనున్న దురిశేటి శేషగిరిరావు పంతులుగారు.

(4) కొవ్వూరి బసివిరెడ్డిగారి కుమారుడైన ఆదెయ్యారెడ్డిగారు.

ఈ దిగువ నుదహరింపబడు కట్టడములకున్ను, వాటి నిమిత్తము సంపాదింపబడు నివేశనముల నిమిత్తమున్ను రూ. 1 లక్షకు ఎక్కువగాని మొత్తమును ధర్మకర్తలు సాధ్యమయినంత త్వరలో ఖర్చుచేయవలెను.

(a) విశాలమగు ఆటస్థలములతోటి, నవీన ఏర్పాటులుగల జిమ్నాషియములతోటి, మద్రాసు యిలాకా కాకినాడ జగన్నాథపురంలో యిటుకలతో నొక స్కూలు కట్టుట.

(b) కాకినాడ సమీపమునందు చొల్లంగి గ్రామములో దేవస్థానమొకటి రాళ్లతో కట్టుట, దైవప్రతిష్ఠ ధర్మకర్తల మూలముగా జరుగవలయును. వారందరు ఏకీభవించనియెడల దురిశేటి శేషగిరిరావు పంతులుగారి యభిప్రాయము ప్రకారము జరుగవలెను. దేవస్థానము చుట్టు పెరడున్ను, ఒక నూయిన్ను ఉండవలెను.

(c) బీదలకు అన్నము పెట్టుటకు స్కూలుకు సమీపముగ జగన్నాథపురంలో నిటుకలతో నొక సత్రము కట్టుట, పై నుదహరింపబడిన కట్టడములకు నొక లక్ష రూపాయలు చాలనియెడల, కొదువ 7 లక్షల సొమ్మువల్ల వచ్చు వడ్డీవల్లగానీ, రాబడివల్లగాని సదరు పనులు పూర్తి కాబడవలెను. అసలు సొమ్ములు ఏ భాగమునైనను యేకారణముచేతనైనను తగ్గించకూడదు. స్కూలు, సత్రము, ఆలయము, ఉన్నత విద్యాభివృద్ధి ధర్మములకు, 1 లక్ష రూ. లు మూలధనముగా నుండవలెను. పై చెప్పబడిన ధర్మములు, పై నుదహరించిన 7 లక్షల ధనమునుండి ఆర్జన కాబడు వడ్డీవల్లగాని, మరి యితర రాబడివల్లగాని పోషింపబడవలెను.



కీ. శే. శ్రీ మల్లాడి సత్యలింగం నాయకర్, కాకినాడ.

మదరాసు యూనివర్సిటీ సంబంధముగా ప్రైమరి తరగతివరకు పిల్లవాళ్లకు, ఆడు పిల్లలకు విద్యనిమిత్తము స్కూలు ఏర్పాటు కాబడవలయును. జాతిమత భేదములు లేకుండా అన్ని జాతులపిల్లలకు స్కూలు తెరువబడవలసినది. వడ్రంగి, చేతిపనులు, నేత, కుండలు చేయుట, మొదలగు పనులను నేర్పుట కొరకు, నేర్పెడు క్లాసులు స్కూలుకు చేర్చవలెను. అందరికి సొమ్ము పుచ్చుకొనకనే విద్య నేర్పవలెను.

నానా జాతుల సంబంధమగు రెండువందల జనము భోజనము చేయుటకు తగిన వసతిగల సత్రము కట్టవలెను. భోజనమునకు జనము దొరికినయెడల, అధమం నూరుమందికి తక్కువకాకుండానుండు జనమునకు, రోజుకు ఒక పర్యాయము భోజనము పెట్టవలెను. సదరు నూటిలో 25 మంది బీద స్కూలు పిల్లలుండవచ్చును. ప్రతిరోజు కొంతమంది బ్రాహ్మణ పిల్లలకుకూడా భోజనము పెట్టవలెను. బ్రాహ్మ

ణుల చేతనే వంట చేయింపబడవలెను. కాయగూరలతో గాని ఆహారము సత్రములో ఉపయోగించకూడదు. పై నుదహరించిన 25 మందికిగాక, యికనొక 12 గురు బ్రాహ్మణులకు, రోజు వకటింటికి అధమం రెండుగంటలకాలము వేదపాఠమునందుపయోగించినయెడల అన్నము పెట్టవచ్చును.

దేవాలయములో రోజువొకటింటికి రెండు పర్యాయములు పూజ జరుగుచుండవలెను. కావలసినంతమంది నౌఖరులును, అర్చకులు, గాయకులు, దేవాలయమునకుండవలెను.

పై ధర్మములుగాక మా ధర్మకర్తలు ఒక మదరాసు హిందువును, ఉన్నత విద్యకొరకుగాని, పారిశ్రామిక విద్య కొరకుగాని, యూరప్, అమెరికా, జపాన్ లేక మరి యే యితర దేశమునకైనను ప్రతి సంవత్సరము పంపుచుండవలెను. అట్టి విద్యార్థివల్ల లాయున్ను, సాధారణవిద్యగాక మరియొక విద్యను ఎంచుకోవచ్చును. సయిన్సు, కెమిస్ట్రీ, ఫిజిక్సు, మొదలగు విషయములు కోరు విద్యార్థి గ్రాడ్యుయేటుగా నుండవలెను. ఇందు నిమిత్తం ప్రతిసంవత్సరము 4 వేల రూపాయలు వ్యయపర్చవలయును. ఒక విద్యార్థికొరకు యింత సొమ్ము ఖర్చు కాబడని యెడల, తగినంతమందిని పంపి, సదరు సొమ్ము ఖర్చుపరపించవలెను. న్యూసు పేపర్లలో ప్రచురము చేసినమీదట వచ్చిన దరఖాస్తులలో తగిన వారి నెంచవలయును. మదరాసు ప్రెసిడెన్సీలోని మొదటి తరగతి కాలేజి ప్రిన్సిపలుకును, ఖనిజములలో పనిచేయు విద్యార్థులను సిఫార్సుచేయు సమర్థతగలవారికిని, నోటీసు ప్రాముఖ్యముగా జారీచేయవలయును. అట్టి విద్యార్థులు, విద్యార్థులుగా దూరదేశములందున్నంతకాలము రాజద్రోహ సంబంధమెంత మాత్రము కలుగజేసుకొనగూడదు. వారు ఆలాగు కలుగజేసుకొనినయెడల, ఫండునుండి అంతటనుంచి పోషణ పొందుట కనర్హులగుదురు. కాని వెంటనే వారు యింటికి తిరిగి వచ్చిన యెడల దోవ ఖర్చుకుమాత్రము సొమ్ము యివ్వబడుటకు హక్కు కలిగియుందురు. విద్యార్థులు తాము యిండియాకు వెళ్లిన పిమ్మట, తమకు తగినస్థితి కలిగియున్న సమయమందు తమ వంతుకు మరియొక విద్యార్థిని అట్టిపనిని నేర్చుకొను నిమిత్తము పంపించుటకు తన గౌరవసాక్షిగా స్నేహితుల యెదుట వాగ్దానము చేయవలెను.

ధర్మకర్తృత్వపు సొమ్ము ఈ దిగువ నుదహరింపబడు ఏ ఆస్తులమీదనయినను, వినియోగింపవచ్చును.

1. ఇండియా గవర్నమెంటు బాండులమీదను.

2. రైల్వే డిబెన్చెరిల (తాకట్టుల) మీదను, పోర్టు ట్రస్టులమీదను, ఇండియా బర్మాలలోని మునిసిపాలిటీల మీదను.

3. రంగూను, కలకత్తా, బొంబాయి, మదరాసులలోని ఫ్రీహోల్డు యిళ్ల ఆస్తులమీదను.

4. మదరాసు ప్రెసిడెన్సీలోను, బర్మా ప్రావిన్సులోను ఉన్న వ్యవసాయపు భూములమీదను, ఫలములనిచ్చు తోటలమీదను, బర్మాలోని వ్యయసాయపు భూములు కొనునెడల గయాళు గ్రాంటు భూములు మున్ముందుగా నెన్నబడవలయును.

వ్యవసాయపు భూములమీద అయిదులక్షల రూప్యములను, కొదువ రెండులక్షల నితరాస్తులమీదను, వినియోగపరుపబడవలయును. ఏ కారణముచేతనయిన భూముల మీద పెట్టుబడి అయిదు లక్షల నెన్నడు తీసుకొనగూడదు. అట్టి సొమ్ము యితరాస్థిమీద వినియోగింప బడకూడదు.

పై నుదహరింపబడిన ధర్మములు, దిగువ కనపరచిన రీతిగా తరగతు లేర్పరుపబడును.

1. స్కూలు పెట్టుట.

2. విద్యార్థులను ఉన్నత విద్యలకుగాని, పారిశ్రామిక విద్య నిమిత్తముగాని పంపుట.

3. దేవాలయము నిర్మించుట, అనగా దైవప్రతిష్ఠ.

4. బీదజనులకు అన్నము పెట్టుట.

అన్ని ధర్మములు జరుపుటకు తగినంత రాబడి, ధర్మాస్థివల్ల రానియెడల రోజువకటింటికి 40 మంది జనమున కన్నమిడుచు, పై నుదహరింపబడిన వరుసను ధర్మములు నడుపబడవలయును. ఆ మాత్రపు సంఖ్యకైన అన్నమిడుటకు ఫండు చాలదని తోచినయెడల, పారిశ్రామిక విద్యకొరకు విద్యార్థులను పయికి పంపుటకు మాన్పుటగాని, మరియొక మార్పునుగాని చేయవలెను.

# నాలుగవ భాగము-చరిత్ర

## ఏడవ అధ్యాయము

# ఆదిమనివాసులు

డా. గిడుగు వేంకటసీతాపతి.

"ఒక్కయెఱుకుతేఁకు నక్కకొమ్మును నిఱ్ఱి
గోఱజంబు జున్నుఁ జాఱపప్పుఁ
బీలిగఱులయంప కోలలు సెలవిండ్లుఁ
గానుకిచ్చికర యుగంబు మొగిచి"

(మనుచరిత్ర ఆ. 4.)

విషయ సంగ్రహము : **ఆదిమనివాసులు ఆర్యులకును ద్రావిడులకును పూర్వము దేశములో నుండినవారు. సవరలు (శబరులు) గంజాం, విశాఖపట్నం జిల్లాల మధ్య ప్రదేశముల వారు ; ప్రాచీన శబరజాతి వ్యాప్తి ఆఫ్రికానుండి ఆస్ట్రేలియా వరకు; మన దేశంలో పూర్వము శబరరాజు లేలిన రాజ్యములు: సవరల మతము, ఆచార వ్యవహారములు ; కోదులు అందులో భద్రాచలం కోయలు ద్రావిడ భాషలలో చేరిన కోదు, కోయభాష మాటలాడువారు; కోదులభాషకు ఓఢ్ర ప్రాంతాలలో ఓఢ్ర భాషా సంపర్కము, తెలుగు ప్రాంతాలలో తెలుగు భాషా సంపర్కము. జాతపులు పాలకొండ, హీరమండలం కొండలలోనివారు; దొమ్మరులు కడప, నెల్లూరు జిల్లాలలో ఎక్కువగా నున్నారు; చెంచులు హైదరాబాదులోను, కర్నూలులోను ఎక్కువగా నున్నారు ; దొమ్మరులు, చెంచులు చాలా చోట్ల చెదరియున్నారు. కొరవలు (ఎఱుకులు) ఎఱ్ఱి గొల్లలు; ఏనాదులు నెల్లూరు జిల్లాలో ఎక్కువ; లంబాడీలు బిడారు వర్తకంచేసి తిరుగుతూ ఉండేవారు.**

మన దేశమునకు ఆర్యులు ఆసియా మధ్య భాగమునుండి రాక పూర్వము ద్రావిడులు వచ్చియుండిరనిన్ని, ఆ ద్రావిడులును రాక పూర్వము దేశములో కొందరుండిరనిన్ని చరిత్రకారులు కొన్ని విషయములు పరిశీలించి సిద్ధాంతము చేసి యున్నారు. ఆర్యులును, ద్రావిడులును రాక పూర్వము దేశములో ఉండినవారిని ఆదిమనివాసులు అని అంటున్నాము. గాని వీరిలో సైతము కొందరు పై దేశములనుండి వచ్చినవారే కావచ్చును. ఇప్పుడు దేశములో కనబడుతున్న వారిలో ఎవరెవరిని ఆదిమనివాసులుగా పరిగణింపవచ్చునో సరిగా నిర్ణయించి చెప్పుట సాధ్యముకాదు.

**ఆదిమనివాసులెవరు ?**



అందుకు నిదర్శనముగా శబరుల విషయము ఎత్తుకొందాము. భాషలోను ఆచార వ్యవహారములలోను ఇంకా మరికొన్ని విషయములలోను శబరులను పోలినవారు దక్షిణ ఆఫ్రికా తూర్పు దరిని గల మెడగాస్కర్ ద్వీపమందును, సుమత్రా, జావా, బోర్నియో మొదలయిన ద్వీపములందును కనబడు తున్నారు. హిమాలయపర్వతములు పుట్టక పూర్వము వాటిస్థలమున సముద్రమున్ను; అరేబియా సముద్రము, బంగాళాఖాతము, హిందూమహా సముద్రము పుట్టక పూర్వము వాటి స్థలమున భూభాగమున్ను ఉండిన కడు ప్రాచీనకాలములో శబరజాతి జనులు ఆఫ్రికా ఖండము మొదలుకొని ఆస్ట్రేలియా వరకును గల పెద్ద భూఖండమందు సంచరిస్తూ ఉండేవారేమో అని ఊహించుటకు అవకాశము లేకపోలేదు. ఈ విషయము ఇంత చిక్కుగా ఉన్నప్పుడు మన ఆంధ్రదేశమందుగల ఆదిమనివాసులు ఎంతకాలమయి ఇప్పుడు వారున్న చోటనే స్థిర నివాసము లేర్పరచుకొని యున్నారో చెప్పడం మరీ కష్టమయిన విషయం. గనుక మనుష్యశాస్త్రమునుబట్టి ఊహించి చెప్పుటకు అవకాశమున్నంతవరకు మన ఆంధ్రదేశమం దిప్పు డున్న ఆదిమ నివాసులలో ముఖ్యమైన వారిని గురించి ముఖ్యమైన విషయములుమాత్రము కొన్ని తెలియజేస్తున్నాము.

శబరజాతి వ్యాప్తి

## సవరలు

ప్రాచీన సంస్కృత సారస్వతములో అనగా ఐతరేయ బ్రాహ్మణము, రామాయణము, మహాభారతము, పురాణములు, కథాసరిత్సాగరము మొదలయిన గ్రంథాలలో చెప్పబడిన శబర వంశము వారే ఈనాటి సవరలు. ప్రాచీనకాలపు శాసనములలో సైతము, ఈ శబరులకు సంబంధించిన వాక్యములు కనబడుతున్నవి. వాటినిబట్టి చూడగా ఆనాటి శబరులు ఈనాటి సవరలవలెనే అడవులలోను, కొండలలోను గాక, పల్లపు భూములలో స్థిరనివాసము లేర్పరచుకొని రాజ్యము లేలుతూ, తక్కిన రాజులతో యుద్ధములు సైతము చేస్తూ, మంచి దశలో ఉన్నట్లు కనబడుతుంది. కళింగ దేశమందు గంగవంశ రాజ్యమును స్థాపించిన కామార్ణవుడు సుమారు క్రీ. శ. 730లో దంతాపురము వద్ద (విశాఖపట్టణము జిల్లాలో శ్రీకాకుళం రైల్వే స్టేషనుకు సుమారు 10 మైళ్ల దూరాన) అక్కడి ప్రదేశమునకు రాజుగా ఉండిన శబరాదిత్యుని ఓడించి, ఆ రాజ్య మాక్రమించుకొన్నట్లు నేను సంప్రతించి ప్రకటించిన 'కొర్ని' శాసనములో ఉన్నది.

శబర రాజ్యములు

శబరులు ఆర్యులకంటెను, ద్రావిడుల కంటెను పూర్వమే మన దేశములో ఉండినట్లు కనబడుతుంది. ఇప్పుడు మన దేశములో ఆదిమనివాసు లన దగిన వారిలో మధ్య పరగణాలలోగల ముండ, సంతాల్, బీర్‌హోర్, జూఆంగ్, హో మొదలయిన జాతులవారున్ను, విశాఖపట్టణము జిల్లాకు వాయవ్య దిక్కున మాళవా ప్రదేశములోగల గుతోబ్ (గదబ), పరేంగ్, రేమో జాతులవారున్ను, సవరలున్ను మాటలాడే భాషలన్నీ ఒకేభాషనుండి వేరువేరు భాషలుగా ఏర్పడినవని చెప్పవచ్చును. గనుక, వీరందరున్ను ప్రాచీనకాలమందలి శబరులకు సంబంధించినజాతులవారే అనవచ్చును. ప్రాచీనకాలమందలి శబరులు గంగానదీ దక్షిణ తీరమందును, వింధ్య పర్వత ప్రాంతములందును, మరికొంత కాలమునకు మధ్య పరగణాలలోను, మరికొంత కాలమునకు గంజాం విశాఖపట్టణం జిల్లాల వాయవ్య భాగములందును వ్యాపించినట్లు కనబడుతుంది.

ఆదిశబరులు

ఈ కాలములో సవరల దేశము గంజాం జిల్లాలోగల పర్లాకిమిడికి ఉత్తరమున ఉన్నది; తూర్పున మందసా (బి. ఎన్. ఆర్. రైల్వేస్టేషను) మొదలుకొని పడమట గుణుపురము వరకును, దక్షిణమున పర్లాకిమిడి మొదలుకొని ఉత్తరమున ఇరవై మైళ్లవరకును వ్యాపించి యున్నది. ఇది గాక, చిలుక సముద్రమునకు పడమటి కొండలలోను, పార్వతీపురము, పాలకొండ, టెక్కలి, పర్లాకిమిడి తాలూకాలలో సైతము సవరలు ఎక్కువగా ఉన్నారు. పల్లపు ప్రదేశములందలి సవరలు అక్కడి నాగరికుల సహవాసమువల్ల తమ ఆచార వ్యవహారముల సంప్రదాయములను విడిచి మన్యప్రదేశములందలి సవరలకు భిన్నముగా ఉన్నారు. భాషలో సైతము మార్పులు కలిగినవి. ఉత్తర భాగములందు ఓఢ్ర భాషా ప్రాభవము, దక్షిణ భాగములందు ఆంధ్ర భాషా ప్రాభవము ఎక్కువగుటవల్ల పల్లపు నేలలోగల సవరలు తమ భాష సైతము విడిచిపెట్టి ఓఢ్రమో, తెలుగో మాటలాడు తున్నారు. ఆంధ్రదేశ మందున్న సవరలు

శబరదేశము



సవరలు.

కాపు సవరలు. కాపు శబ్దమును కాంపు అని ప్రాచీనాంధ్రులు ఉచ్చరిస్తూ ఉండిన కాలములో సవరలకు తెలుగు వారితో పరిచయము కలిగినది; గనుకనే, తెలుగు అనే అర్థములో సవరలు నేటికిని కాంపు అంటున్నారు.

ఈ కాలములో సవరలు అడవులలోను కొండలపైని పండించిన పసుపు, కందులు, పాలగుండ మొదలయినవిన్ని, కట్టెలున్ను అమ్ముకొని జీవిస్తూ ఉన్న మొరకలవలె కనబడుదురుగాని, వీరికి కొంత విజ్ఞానము లేకపోలేదు. శాబర మంత్రాల ప్రసిద్ధి ప్రాచీన సంస్కృత సారస్వతములో కనబడుతుంది. వేదబుక్కులవలెనే వీరి పాటలు సైతము మూడు నాలుగు స్వరములతోనే ఉన్నవి.

**ఇప్పటి సవరల విజ్ఞానము**

వైద్యమునకున్ను, ఓషధులకున్ను సంబంధించిన విజ్ఞానము సవరలలో నేటికిని కొంతవరకు నిలిచియున్నది. పల్లపు నేలలోగల తెలుగువారు, ఓఢ్రులు కొందరు సవరల మంత్రాలు, సవరల మందులు ఉపయోగిస్తున్నారు. సవరలు 30 నక్షత్ర మండలములను గుర్తించి పేర్కొందురు; నక్షత్రములనుబట్టి ముహూర్తములు పెట్టుకొందురు. ఎక్కడ బావులు, నూతులు త్రవ్వినయెడల నీరు పుష్కలముగా పడునో సవరలకు బాగుగా తెలుసునన్న నమ్మకము మన తెలుగు వారిలో సైతము చాలామందికి కలదు. ఆధ్యాత్మిక విషయాలలో సైతము సవరలకు కొంత పరిజ్ఞానమున్నది. ప్రతిదేహంలోను జీవుడు, ఆత్మ అని రెండు కలవనిన్ని జీవుడు దేహముతో పుట్టి దేహముతో నశిస్తుందిగాని ఆత్మ చావులేక నిత్యంగా ఉండేదనిన్ని వీరి నమ్మకము. దేహము నశించిన తర్వాత, దానిలో ఉండిన ఆత్మ, కర్మజరిగిన వరకును ప్రేతగా ఉండి, కర్మ జరిగిన తర్వాత పితృలోకమునకు పోవుననిన్ని, కావలసిన యెడల మరియొక జన్మ మెత్తుననిన్ని అందురు. చనిపోయినవారి ఆత్మలతో సంభాషించుటకుగాను వారి ఆత్మలను తమ కాయములలోనికి ప్రవేశింప జేసుకోగల శక్తి సవరలలో కొందరికి కలదు. అప్పుడు వారు మాటలాడునదెల్ల ఆ యాత్మలు మాటలాడుతూ ఉన్నట్లే భావించి ఆ చనిపోయినవారి ఆత్మలతో ఇతరులు కొంతసేపు ప్రసంగించి తెలుసుకోవలసిన విషయములు తెలుసుకొంటూ ఉందురు.

సవరలలో యువతీయువకులు పరస్పరముగా ముందు ప్రేమించుకొని తలిదండ్రుల సమ్మతిబడసి వివాహములు చేసుకోవడము కద్దు; పెద్దలు తమ పిల్లలకు సంబంధము లెంచి వివాహములు చేయడమున్ను కద్దు. సంబంధము లేర్పడుటకుగాను ముందుగా పెండ్లికొడుకువంకవారు పిల్లనిమ్మని పిల్ల తల్లిదండ్రుల నడుగవలెను. కన్యాశుల్కము వారి

**సవరల సాంఘిక ఆచారములు**

వారి స్థితిగతులనుబట్టి మారుతూ ఉంటుంది; కాని, ఎంతో కొంత శుల్కము పెండ్లికొడుకు పెండ్లికూతురి తలిదండ్రులకు పెండ్లికి పూర్వమే పూర్తిగా చెల్లించవలసి ఉంటుంది. ఇన్ని కుండలకల్లు, ఇన్ని రూపాయిలు అని ముందుగా శుల్కం నిర్ణయం చేసుకోవలెను. ఆలిమగలకు పొత్తు చెడినప్పుడు వారు విడాకులిచ్చి వేరుపడవచ్చును. మగనాలిని లేవదీసుకొని పోయి పెండ్లియాడినవాడు గానీ, విడాకులవల్ల వెడలివచ్చిన ఆడుదానిని పెండ్లియాడినవాడు గానీ ఆస్త్రీని మొదట పెండ్లియాడినవానికి అతడు పెండ్లికిగాను పెట్టిన పైకమంతా ఇచ్చుకోవలెను. విధవా వివాహము లున్నవి. దేవరన్యాయములో ఉన్నట్లు విధవయైన తన వదినెను మరది పెండ్లియాడుట ఉచితమని సవరలు భావిస్తారు. తనను పెండ్లియాడగల మరది లేనప్పుడే విధవ ఇతరుని పెండ్లియాడుతుంది.

సవరలు పూజించే దేవతల సంఖ్య రెండువందలకుపైగా ఉన్నది. కొందరి మతమున సూర్యుడు ముఖ్యదేవత;

**సవరల మతము**

సృష్టికర్త; మరికొందరి మతమున సూర్యుని మించిన సృష్టికర్త మరియొకడు కలడు. వ్యాధులన్నీ దేవతల వల్లనే—అందులో ఎక్కువగా క్షుద్ర దేవతలవల్ల కలుగునన్న నమ్మకము సవరలకు పూర్తిగా కలదు, గనుక, ఆ దేవతలను పూజిస్తూ వారికి బలి సమర్పిస్తూ ఉందురు.

సవరభాష కోదు భాషకంటెను మిన్నయైన భాష.

అందు 7000 శబ్దములకు పైగా కలవు. సవరపాటలు, కథలు వేలకొలది ఉన్నవి.

వీరి కవితా నైపుణ్యమును చూపించడానికి వీరి పాటలలో ఒకటి ప్రదర్శిస్తున్నాను. సవర భాషలోనే ఆ పాట మొదట కనబరచి, దాని అర్థము తెలియజేయడానికి నేను ఆంధ్రీకరించిన పాట సైతము ప్రకటిస్తున్నాను.

భర్త తనయెడల ప్రేమలేనివాడయి, తనను చూడనైనా చూడక బయట తిరుగుతూ ఉంటే భార్య తన అత్తమామల యెదుట ఎట్లు విలపిస్తుందో చూడండి :

ఒత్తె మోడెజ్తె కొన్నె మోడెజ్తె డంగడా ఓన్నమ్.
ఉరున్తా నమ్ పోజ్ గిగ్గిల్లె డకోనాయ్ ?
పనోర్నమ్ పోజ్ గిగ్గిలె డకోనాయ్ ?
సుఉోజ్నమ్ పోజ్ డెడేలె డకోనాయ్ ?
కరుజ్నమ్ పోజ్ తనజ్లె డకోనాయ్ ?
ఇర్తె కు ఇూార్ ఇర్తె ప్రనుఉోల్ డెసా ఇూన్ ఎర్తె ;
కుడూబెన్ పోజ్ మల్గాడా ఇఞ్ ? ఉఆబ్ బెన్ పోజ్
మల్గాడా ఇఞ్ ?
డకోనా కుఇూార్ ! డకోనా కినార్ !
సెఏల్లిఞ్ నా సెఏల్లిఞ్ ; ఇూన్ నా సెఏల్లిఞ్.
కయెత్తిఞ్ నా కయెత్తిఞ్ ; ఇూన్ నా కయెత్తిఞ్.

అటు వైపు మెడత్రిప్పు-ఇటు వైపు మెడత్రిప్పు ,
నన్ను జూడడు నీదు-మిండకొడుకు
మీయింటివాసాలు-మీయింటిదూలాలు
చూచుటకుమాత్రమే-నుండవలెనె ?
మీయిల్లువాకిళ్లు-మీ పెరడుపాకలూ
కాచుకొనియుంటకే-నుండవలెనె ?
వెళ్తాను మామయా-వెళ్తాను ప్రనూలు
వెళ్తాను మావూరు-వెళ్తాను నేను.
వెళ్తాను అత్తయా-వెళ్తాను మావూరు
కన్నవారింటికే-వెడలిపోతాను.
మీయింటి కూటికై వాచిపోయితినె ?
మీయింటికూరకై-దేవులాడితినె ?
ఉండండి మామయా-ఉండండి మీరు
ఉండండి అత్తయా-ఉండీండి మీరు.
చెడిపోతి చెడిపోతి-నేనెచెడిపోతి
చనిపోతి చనిపోతి-నేనెచనిపోతి.

## కోదులు (కోయలు)

ఈ జాతివారి పేరు అనేక రూపములు దాల్చియున్నది. ఒక్కొక్క ప్రదేశములో ఒకొక్క పేరు వ్యవహారములో ఉన్నది. మీ జాతి పేరేమి ? మీ భాష పేరేమి ? అని అడిగినప్పుడు అన్ని ప్రదేశములవారున్ను మేము కుయ్ంగల్ మాభాష కుయ్ అని అంటారు ; గనుక, "కుయ్" అన్నదే భాషకున్ను, జాతికిన్ని మొదటి పేరు, "గల్" ప్రాచీన ద్రావిడ భాషలందు—తమిళ భాషలో నేటి కిన్ని బహువచన ప్రత్యయము. గల్ ప్రత్యయమునకు పూర్వమందున్న అనుస్వారము కుయ్ శబ్దముయొక్క మహ దర్థక ప్రత్యయము. ఈ కుయ్ శబ్దమునుండే కోయ, కోయలు, కోదులు, కోంధులు, గోంధులు, గోండ్ మొదలయిన రూపములు పుట్టినవి.

కుయ్ భాష

ఒరిస్సా దేశమందున్ను, గంజాం, విశాఖపట్నం జిల్లాలలో వాయవ్య భాగములందున్ను గల కోంధులకు ఓఢ్రుల సంపర్కము ఎక్కువగా ఉండుటవల్ల అక్కడి కోదు భాషలో ఓఢ్రభాషా పదములు ఎక్కువగా ఉన్నవి. మధ్య పరగణాలలోను, ఉత్తర హిందూస్థానమందు మరికొన్ని చోట్లనుగల గోంధుల భాషలో హిందీ మాటలు కలిసి పోయినవి. ఆంధ్రదేశములో భద్రాచలము మొదలయిన మన్యపు ప్రదేశములందు గల కోదుల భాషలో తెలుగు మాటలు ఎక్కువగా ఉన్నవి. ఏ సంపర్కములేని అసలు కుయ్ భాష ప్రాచీన ద్రావిడ భాషలలో చేరియుండిన భాష. అందుచేత అందులో నేటి అరవమాటలను, కన్నడ మాటలను, తెలుగు మాటలను పోలియున్న మాటలు అనేకముగా కనబడుతూ ఉంటవి.

సవరలలో వలెనే కోదులలో సైతము దేవతలకు జంతువులను (కోడి, మేక, ఎనుబోతు మొదలయిన జంతువులను) బలి ఇచ్చే ఆచారమున్నది. అంతేకాక, నూరేండ్ల క్రిందటి వరకున్ను, నరబలి ఇచ్చే ఆచారము సైతము ఎక్కువగా గంజాం జిల్లా మాళువా ప్రదేశములందలి కోదులలో ఉండేది. క్రీ. శ. 1840 మొదలు క్రీ. శ. 1850 వరకును బ్రిటిష్ ప్రభుత్వమువారు అధికారులద్వారా ఆజ్ఞలు పంపి ఎంతో కష్టపడి ఈ దురాచారమును మాన్పింప గలిగిరి.

అప్పటికిని మరి పదియేండ్లు దొంగతనముగా అక్కడక్కడ నరబలులు జరుగుతూ వచ్చినవి. ఇప్పుడు మనుష్యునికి మారు దున్నపోతును బలిగా వేస్తున్నారు. ఈ కోదుల నరబలి యాచారమే జయపుర సంస్థాన రాజులు సైతము అవలంబించి యుండిరి. దసరా

**నరబలి, స్త్రీ శిశు హత్య**

ఉత్సవములలో దుర్గకు నరబలి యిచ్చే ఆచారముండేది. అదికూడా ప్రభుత్వము వారి రాజశాసనమువల్ల అంతరించినది. నరబలి మాత్రమే కాక, స్త్రీ శిశుహత్యలు సైతము జయపుర సంస్థాన ప్రదేశములలో జరుగుతూ ఉండేవి. ఇదిన్నీ కోదుల యాచారమునుబట్టి వచ్చినట్లే కనబడుతుంది. స్త్రీ శిశుహత్య చేయవలసిన అగత్యమెందుకు వచ్చినదో తెలియజేస్తూ కోదులు చెప్పేదేమంటే "ప్రపంచమందలి దేవతలలో ముఖ్యమైనవి రెండు: సూర్యుడు, భూమి. సూర్యుడు పురుషుడు, సృష్టికర్త; అందరికిని మేలు చేసేవాడు; భూమి స్త్రీ; ప్రపంచమందలి దోషములకు, పాపములకు కారకురాలు గనుక స్త్రీ లెక్కువయిన కొలదిన్ని పాపమెక్కువగుతూ ఉంటుంది. అందుచేత, సంతతికి కావలసిన స్త్రీలు మాత్రమే తగుమాత్రముగా ఉండవలెను." ఈ విధముగా చెప్పి కోదులు స్త్రీ శిశుహత్య సమర్థించుకొంటూ ఉండేవారట.

స్త్రీని నిరసన భావముతో చూడడము మరికొన్ని విషయములలో సైతము కనబడుతుంది. యువకులు వేటకు బయలుదేరునప్పుడు స్త్రీ (కన్యకానీ, పుణ్య స్త్రీ కానీ, విధవకానీ) ఎదురుగా వస్తే దుశ్శకునముగా భావించి మరి వెడలక వచ్చివేస్తారు. అటువంటి

**స్త్రీయెడ నిరసన భావం**

సమయాలలో స్త్రీ లెవరూ ఎదురుగా రాకుండా ఉండే ఏర్పాట్లు ముందుగానే చేసుకొంటారు. ఋతుమతియైన స్త్రీ ఇంట్లో ఉన్నప్పుడు ఆ యింటివారు వేటకు బయలు దేరరు.

సవరలలో లేని యాచారము మరియొకటి కోదులలో కనబడుతుంది. సవరలలోవలెనే కోదులలో సైతము యువతీ యువకులు పరస్పరము ప్రేమించుకొని వివాహములు చేసుకొనుటకు అవకాశమున్నది. పరస్పర ప్రేమకుగల అవకాశము సవరల విషయములో అడవులలోను నిర్జన ప్రదేశములలోను మాత్రమే ఉన్నది. కోదులలోగల విశేషమేమంటే ప్రతి

**ప్రేమిక సదనములు**

గ్రామమందున్ను పెండ్లికాని కన్యలకొక ఇల్లున్ను, పెండ్లికాని యువకులకొక యిల్లున్ను ప్రత్యేకించి ఏర్పరుస్తారు. ఎవరికి నియమించిన యిండ్లలో వారు రాత్రులందు పడుకోవలెను. కన్యల కోసం ఏర్పరచిన యింట్లో ఒక ముసలిది కన్యలకు తోడుగా ఉంటుంది. ఆ ముసలిదాని ద్వారా యువకులకు కన్యలతో పరిచయ మేర్పడుతుంది; నియమాన్ని అనుసరించి ప్రేమబంధము బలపడుతుంది. అది తెలుసుకొని పెద్దలు పెండ్లి చేస్తారు.

## జాతపులు

తెలుగు సంపర్కముగల సవరలు కాపుసవర లయినట్లు తెలుగు సంపర్కముగల కోదులు జాతపు లయినారు. వీరు ఎక్కువగా పాలకొండ తాలూకాలోను, హీరమండలమునకు పడమటనున్న కొండల దిగువను గలరు. కోదులవలెనే వీరున్ను చనిపోయినవారిని దహనపరచక పాతి పెడతారు. జాకర దేవత వీరి దేవతలలో ప్రధానమయినది. ఆ దేవతకు కోడి, మేక, పోతు బలి ఇస్తారు. ప్రతి సంవత్సరము కొత్తపంట ఆ దేవతకు నైవేద్యం పెట్టకుండా తినరు.

**కొండదొరలు** అనేజాతివారు సైతము జాతపుల వంశమువారే. వీరు విశాఖపట్టణము జిల్లాలో పార్వతీపురం, సాలూరు, పాచిపెంట మొదలయిన తాలూకాల కొండల దిగువ నున్నారు.

## దొమ్మరులు

దొమ్మరులు ఆదిమనివాసులలో చేరగల వారో కారో నిశ్చయముగా చెప్పలేముగాని, వారి ఆచార వ్యవహారములను బట్టి చేరదగిన వారనవచ్చును. బందిపోటు, దొంగతనము, హత్య మొదలయిన నేరములకు పేరుపొందిన జాతులలో వీరిని పేర్కొనవలెను. వీరు ఒక చోట స్థిర నివాసము చేసే వారుకారు; దేశ దిమ్మరులు: అయినా మైసూరు, ఉత్తరార్కాడు, మధుర మొదలయిన ఇతర జిల్లాలలోనేకాక ఆంధ్రదేశములో కడప, నెల్లూరు మొదలయిన జిల్లాలలో ఎక్కువగా కనబడుదురు. దొమ్మరవిద్యలు (అనగా మొగ్గలు వేయడం, తాడుపై నడవడం, గడపైని తిరగడం మొదలయిన పనులు) ప్రదర్శించి వీరు జీవనం చేస్తూ

ఉంటారు. కొందరు బుట్టలల్లి, ఈత చాపలు నేసి పొట్ట పోషించు కొంటున్నారు.

## చెంచులు

నిజాం పరగణాలలో మహబూబ్ నగరము జిల్లాకు దక్షిణమున, కర్నూల్ జిల్లాకు ఉత్తరమున, నల్లమలై కొండల పీఠభూములందు చెంచులు నివసించి యున్నారు. వారి పల్లెలకు పెంటలని పేరు. అట్టి పెంటలు ఆ పీఠ భూములలో సుమారు 55 గలవు. ఒక్కొక్క పెంటలో 15 మొదలు 25 గుడిసెలుంటును. దుంపలు, కాయలు, పండ్లు, పిట్టలు, జంతువులు, తేనె మొదలయినవి వారికి ఆహార పదార్థములు.

కొండల దిగువనున్న చెంచుల కంటె కొండలపై నున్న చెంచులు ఎక్కువకాయ పుష్టి గలవారు. చక్కదనమన్న మాట మగవారికీ లేదు ఆడువారికీ లేదు. ఆడువారి వలెనే మగవారు సైతము తలజుట్టు నిండుగా పెంచుకొందురు. తలకు నూనె అయినా రాచుకోక వేళ్లతో ఎగదువ్వి, కొప్పు ముడి బిగించు కొంటారు. ఇప్పుడిప్పుడు మగవారు గడ్డములు గొరిగించు కొనుటయున్న ఆడువారు తలకు నూనె రాచుకొని కర్ర దువ్వెనలతో తల దువ్వుకొనుటయున్న నేర్చుకొన్నారు. కొద్దికాలము క్రిందటి వరకున్న ఆడువారు టేకాకుల తోరణాలు మొలకు చుట్టుకొనేవారు మగవారు అరటినార మొలకు కట్టుకొని పట్ట గోచీలు పెట్టుకొనేవారు. ఇప్పుడిప్పుడు మగవారు లంగోటీలు, గోచీలు ధరిస్తున్నారు ; ఆడువారు మూరెడు వెడల్పుగల గుడ్డలు మోకాళ్లవరకైనా రానీయకుండా చుట్టబెట్టు కొంటున్నారు. పైని మరియొక పెద్ద గుడ్డ, దుప్పటివంటిది మగవారూ ఆడువారూ ధరిస్తారు ; గాని, అది చలిగా ఉన్నప్పుడు కప్పుకోడానికి మాత్రమే ఉపయోగిస్తారు. ఇప్పుడిప్పుడు కొందరాడువారు రవికెలో కబ్బాలో తొడగడం నేర్చుకొంటున్నారు. ఎడమచెవిమీది అంచున మధ్యనొక పూసగల కొనగాడ, ఎడమ చేతికొక దండ కడియము మెడకొక పెద్ద పూసలపేరు—ఇవి మగవారి ఆభరణాలు ; ఆడువారు మెడచుట్టు మెండుగా పూసల పేర్లు ధరిస్తారు. విల్లమ్ములే చెంచువారికి ముఖ్యమైన ఆయుధములు. కడుపు నిండా తిండి లేకపోయినా, చురుకుగా పని చేయ గలరు. బరువులు మోచి కొండ లెక్కిదిగుటలో మంచి నేర్పుగలవారు.

సవరల వలెనే చెంచులు సైతము అమాయకులు ; అసత్య మాడుటగాని మోసము చేయుటగాని ఎరుగనివారు ; తమ దేశము చూడడానికి వచ్చినవారిని ఆదరించి తమ శక్తి కొలది మర్యాద చేస్తారు. ఉండడానికొక ఇల్లు ఏర్పాటు చేస్తారు.

నేలదున్ని పంటలు పండించుకొనే నేర్పు చెంచుల కింకా అలవడలేదు. దొరల పశువులను పచ్చిక బీడులలో మేపించుకొని కొందరు జీవిస్తున్నారు. సాధారణముగా వారికందరికీ మేకలు, కోళ్లు ఉంటవి ; కుక్కలను పెంచని చెంచు ఉండడు. ఉడుతలను, ఎలుకలను, చుంచులను, పాము సైతము కాల్చుకొనికాని వండుకొనికాని చెంచులు తింటారు. సవరలవలెనే వీరున్న ఇప్పసారాయి చేసుకొని ఎక్కువగా త్రాగుతూ ఉంటారు. తేనె, అడవి దినుసులు అమ్మి పొగాకు కొని ఉపయోగిస్తారు. పొగ చుట్టలు త్రాగడం తక్కువ ; పొగాకు ముక్కలు నములుతూ బుగ్గను పెట్టుకొని ఉమ్ముతూ ఉంటారు.

సవరలవలెనే పండుగలలోను, పెండ్లి సమయాలలోను ఆడువారూ మగవారూ కలిసి నాట్యమాడుతూ ఉంటారు. గొబ్బి తట్టుతూ నాట్య చేయడం సవరలలో వలెనే వీరిలో సైతము ఉంది.

ఆకాశమ్మ, భూమి అమ్మ, అమ్మతల్లి (అమ్మవారు) వీరికి ముఖ్యమైన దేవతలు. అందులో ఆకాశ దేవత అన్ని దేవతలకు పైదేవత అని వీరి నమ్మకము. సూర్యుని సైతము కొందరు ఆరాధిస్తారు. ఇటీవల రాతిలింగమో, కర్రలింగమో పెట్టుకొని పూజించుట సైతము కొందరు అలవరచుకొన్నారు. చెంచులలో పూజలు చేయించుటకుగాని పెండ్లి చేయించుటకుగాని జన్ని (పూజారి) అని చెప్పదగినవాడెవడూ లేడు. ఇటీవల కొందరు కర్నూలు జిల్లాలో ఉన్న చెంచులు బ్రాహ్మణ పురోహితులను పెండ్లిళ్లు జరిపించడానికి పిలుస్తున్నారు. ఎదిగిన పిల్లలకే పెండ్లి చేస్తారు. ఒక పిల్లను పెండ్లి చేసుకోదలచిన యువకుడు స్వయంగాగాని బంధువుల ద్వారాగాని పిల్ల తలిదండ్రులకు తన కోరిక తెలియ జేస్తాడు. వారు సమ్మతిస్తే పెండ్లి జరుగుతుంది. పెండ్లికొడుకు తన బంధువులతో పిల్లఊరికి వచ్చి పొలిమేర

ఆగుతాడు. పెండ్లికూతురు బంధువులు ఎదురుగా వచ్చి ఊరిలోనికి తీసుకొని వెళ్తారు. పెండ్లికూతురికి బట్టలు, పూసల పేర్లు; బంధువులకు, పూరివారికి ఇప్ప సారాయి పెండ్లి కొడుకు ఇస్తాడు. అందరి యెదుట వధూవరుల చేతులు కలిపి పెండ్లి అయినదంటారు. ఆ మధ్యాహ్నమే పెండ్లి కూతురిని పెండ్లికొడుకు తనఊరు తీసుకొని వెళ్తాడు. అక్కడ ఈ నూతన దంపతులకు వేరే ఒక గుడిసె కట్టినవరకు పెండ్లికూతురు తన అత్తగారి పక్కను పడుకోవలెను. పెండ్లి కొడుకు మరియొకచోట పడుకోవలెను. అయితే, పగటి పూట ఇద్దరూ కలసి అడవిలోనికిపోయి విహరించడం తప్పు కాదు; సాధారణముగా జరుగుతూ ఉంటుంది. యువ కుడు కన్యను లేవదీసుకొని పోయి రెండు దినాలు వేరే రహస్య స్థలములో ఆమెతో నివసించి, తర్వాత ఆమె తలి దండ్రుల సమ్మతిపొంది పెండ్లి చేసుకొనే ఆచారము సైతము కలదు.

అహోబిలనరసింహస్వామి చెంచితను పెండ్లియాడిన కథ చెంచులు సైతము చెప్పకొని, ఆ స్వామి ఉత్సవానికి చెంచులు సైతము పోయి ఆ స్వామికి, చెంచితకు, బట్టలు, పండ్లు సమర్పిస్తారు. చెంచులు చెప్పకొనే చెంచిత కథలు రెండు కలవు. చెంచులు మొట్టమొదట ఎఱ్ఱ గొల్లజాతివారేనట. నల్లమలై కొండలలో ఓబలకొండ గుడిలోనున్న ఓబలేశ్వరుడు ఆ ఎఱ్ఱ గొల్లజాతి కన్యను చెంచితగా నెంచి పెండ్లి చేసుకొని బిడ్డలను కనెనట. ఆ బిడ్డల వంశమువారు గనుక తాము చెంచు లయినట్లు చెంచులు చెప్పకొంటారు. మరి యొక కథ చెంచులలో అందమైన స్త్రీలు లేక పోవుటకు కారణముగా చెప్పు కొంటారు. చెంచిత చాలా అంద మయినది. చెంచితను ఓబలేశ్వరుడు బలాత్కారముగాబట్టి పెండ్లి చేసుకొన్నప్పుడు తన కులములో మరి యెవ్వరికిని ఇట్టి సంఘటన కలుగకుండునట్లు అందమైన స్త్రీలు మరి పుట్టకుందురుగాక అని కట్టడి చేసినదట. అందుచేతనే అందమైనవారు చెంచులలో మగవారిలోగాని ఆడువారిలో గాని మరి కనబడరట.

## కొరవలు (ఎరుకలు)

కొరవలు దక్షిణ దేశ మంతటను వ్యాపించి యున్నారు. దక్షిణాగ్రమునుండి ఉత్తరార్కాడు జిల్లా వరకు వ్యాపించి యున్నవారికి కొరవలని పేరు. ఉత్తరార్కాడు జిల్లాలో వీరిని కొరచలు, కొర్చలు అని అంటారు. రాయలసీమలో వీరినే ఎరుకులు ఎరకలు అని అంటారు. ఎఱుక చెప్పు టలో నేర్పుగలవారు గనుక వీరికి ఎఱుకులను పేరు వచ్చి నది. తెలుగు కావ్యములలో ఎఱుకులకు సంబంధించిన పద్యము లనేకముగా కలవు. ఈ ఎఱుకు శబ్దమే యెరుకు, యెరుక, యెరకు, యెరకగా మారినది. ఈ జాతివారు కొందరు రైళ్లు పడ్డ తర్వాత ఉత్తరమున కలకత్తా వరకు పడమట బొంబాయి వరకు పోయినారు. కలకత్తా, మిడ్న పూరు (మిథునపురం), కటకము, పూరి, అహ్మదాబాద్, బొంబాయి మొదలయిన స్థలములలో కనబడుతున్నారు.



డాక్టరు గిడుగు వేంకట సీతాపతి.

మీరేజాతివారని అడిగినప్పుడు మేము కుఱ్ఱులము అనిగాని కుఱ్ఱలము అనిగాని అంటారు. ఎక్కడివారు అక్కడ ప్రబలముగా ఉన్న భాషతో సంక్రమించిన తమ భాష మాటలాడుకొంటారు. తమ సొంత భాష ద్రావిడ భాషలతో సంబంధము గలదే కాని, అదియేదో నిర్ణయించి చెప్పడము కష్టముగా ఉన్నది. మందులు అమ్ముకొని, బుట్టలల్లి, ఎఱుక చెప్పి, బిచ్చమెత్తి ఎరుకులు జీవనము చేస్తున్నారు. వీరి కెక్కడా స్థిరమైన నివాసము లేదు. కొన్ని కుటుంబములవారు ఊరూర తిరుగుతూ ఒక్కొక్క ఊళ్లో కొన్ని మాసములు నివాసము చేస్తూ ఉంటారు. వీరిలో చిల్లర వ్యాపారములు అనేకంగా చేసి జీవించేవారు సైతము కలరు. సముద్రతీరాలనుండి లోపలి ప్రదేశాలకు

ఉప్పు తీసుకొనిపోయి అమ్మే ఉప్పు యెరకలు, అడవులలో దొరికే వెదురు బద్దలతో అల్లిన బుట్టలు, కురువేల్లు మొదలయిన వేళ్లతో చేసిన కుంచెలు అమ్మే కుంచుకొరవలు ఉన్నారు. పిట్టల వేట, దుప్పి మొదలయిల జంతువుల వేట చేయుటలో మంచి నేర్పుగలవారు సైతము కలరు. పాముల నాడించి జీవించే యెరుకలు కొందరున్నారు.

విశాఖపట్టణం జిల్లాలో యెరుకమ్మ గుడి ఉన్నది. ఆ ఎరుకమ్మ నొక దేవతగా ఎంచి అక్కడి జనులు పూజిస్తూ ఉంటారు. పూర్వము అక్కడ ఉండే దాసర్లకు ఎరుక చెప్తూ ఒక ఇంట్లో ఉన్నవారికి కీర్తి తెచ్చే బిడ్డ పుడుతుంది అనిన్ని దానికి దివ్యదృష్టి ఉంటుందనిన్ని ఎరుకసాని చెప్పినదట. ఆమె చెప్పినట్లే ఆ యింట నొక బిడ్డ పుట్టింది. దానికి రాబోవు సంగతులు తెలుసుకొనే శక్తి అలవడిందట. అందుచేత, ఆమెకు యెరుకమ్మ అను పేరు వచ్చినది. పెండ్లి అయిన తర్వాత ఒక దినము ఆమె మగడు వేటకు వెళ్లడానికి సిద్ధమవుతూ ఉంటే నేడు వెళ్లవద్దు రేపు వెళ్లుదురుగాని అన్నదట. ఏమి అని భర్త అడగగా, నేడు మీరు వేటకు వెళ్తే పులి మిమ్ము చంపి వేస్తుంది అని చెప్పినదట. సరే చూతాము నీ ఎరుక ఎట్టిదో అని అతడు వెళ్లి ఆమె చెప్పినట్లే పులి నోటబడి చచ్చిపోయెనట. అప్పుడామె సహగమనం చేసినది. ఆమె భర్తతో కాలిపోయిన చోటనే ఎరుకమ్మ దేవత కొక గుడి వెలసినది.

యెరుకలు, ఎర్ర గొల్లలవలెనే బందిపోటు, దొంగతనము, హత్య మొదలయిన నేరములు చేసే జాతివారుగా పేరు పొందినవారు. శకునాలు చూచుకొని, మంచిరోజు ముహూర్తము పెట్టుకొని దోచుకోడానికి బయలుదేరుతూ ఉంటారు. దొంగిలించిన వస్తువులలో చిన్నవి నోటిలోను, గొంతుకలోను, కడుపులోను, మర్మ స్థలములోను దాచే శక్తి మగవారికి ఆడువారికి సైతము కలదు. తమ కార్యము నెగ్గించుకోడానికి ఆడువారు సిగ్గువిడిచి ఏ పనికైనా పూనుకొంటారు. తమలో తాము మాటలాడుకొనే సంకేత పదములు వీరి భాషలో చాలా కలవు.

పెండ్లికిముందు ప్రధానం జరుగుతుంది. వరుడు కన్య యొక్క మేనమామకు 101 మాడలు (అనగా 202 రూపాయలు) ఇచ్చుకో వలెనన్న షరతు ఏర్పడుతుంది. అంతా ఒక్కసారిగా ఇవ్వడం జరగదు. వాయిదాల పైని ఇచ్చిన తర్వాత, పెండ్లి ముహూర్తము పెట్టించుకొని పెండ్లిచేస్తారు. బ్రాహ్మణ పురోహితుని పిలిచి అతని చేతను శుభకార్యం జరిపించు కొంటారు. మేనరికము జరగవలెనన్న కట్టడి ఉన్నది. ఒక పిల్లదానిని దాని మేనత్త కొడుకుకివ్వక పైవారి కిచ్చినప్పుడు, పెండ్లి కొడుకు ఆ పిల్ల దాని మేనత్త కొడుకుకు దండుగ ఇచ్చుకోవలెను. డబ్బుకోసము పెండ్లాన్ని కుదువపెట్టి అప్పు తెచ్చుకొనే ఆచారము వీరిలో కలదు. అప్పు తీర్చిన తర్వాత తిరిగి పెండ్లాన్ని తెచ్చుకోవచ్చు. మారు మనువులున్నవి. ఏడుమనువులు చేసిన ముత్తైదువు పెద్ద ముత్తైదువు. శుభకార్యాలలో ఆమె నెక్కువగా గౌరవిస్తారు.

యెరుకుల పేళ్లు వినోదకరంగా ఉంటవి. మగవాళ్లను పుంజు లంటారు. ఆడువాళ్లను పెట్ట లంటారు. మగవాళ్లలో నల్లవాడు, పొట్టివాడు, సెట్టకాలాడు, కుంటాడు, గూనోడు, మూగడు మొదలయిన పేళ్లు కలవు. కొందరికి దేవతల పేళ్లు—రాముడు, లచ్చిగాడు, వెంకటిగాడు, సుబ్బడు మొదలయిన పేళ్లు—సైతము ఉంటవి.

యెరుకలు తమ మగపిల్లలకు దొంగతనము చేసే విధము, ఎవరేమడిగినా నాకు తెలియదనడము, ఎంత కొట్టినా నిజము చెప్పక పోవడము నేర్పుతారు ; ఆడు పిల్లలకు ఎరుక చెప్పడము నేర్పుతారు. ఎరుకులలో దొమ్మరులు సైతము కలరు ; వెదురు గడపై ఈటె విద్యలుచేసే నేర్పు పిల్లలకు అలవడ జేస్తారు.

## యేనాదులు

యేనాది శబ్దము అనాది శబ్దమునుండి వచ్చినదేమో అని కొందరి ఊహ. పులికట్టు సరస్సు పరిసరములందున్ను, నెల్లూరు జిల్లాలోను-అందు ఎక్కువగా శ్రీహరికోట పరిసరము లందున్ను యేనాదు లెక్కువగా స్థిరనివాసము లేర్పరచుకొని యున్నారు. ఆదిమనివాసులకు సాధారణముగా గల లక్షణములలో కొన్ని వీరిలో సైతము కనబడుతున్నవి. గనుక, వీరున్ను ఆదిమనివాసులయి యుండవచ్చునని కొందరభిప్రాయపడుతున్నారు. తక్కిన ఆదిమనివాసులవలనే వీరున్ను ప్రకృతి విచిత్రములను, ప్రకృతి శక్తులను దేవతలని భావించి పూజిస్తూ ఉన్నారు. రోగములన్నీ క్షుద్ర దేవతల కోపమువల్లనే కలుగుతున్నవని, చిల్లంగి ప్రయోగాల వల్లను కూడా రోగములు, చావులు కలుగుతున్నవని పూర్తిగా

నమ్ముతారు. తక్కిన ఆదిమనివాసులవలెనే వీరున్ను నేటి కిని కఱ్ఱ తరచి నిప్పు చేసుకొంటున్నారు; వేటాడి, చేపలు పట్టి పొట్ట పోషించుకొంటున్నారు; కొందరు పచ్చి మాంసము కొంచెము కాల్చిగాని వెచ్చబెట్టిగాని తింటున్నారు. అయితే, వీరిలో కొందరు నాగరికతపొంది హిందువులలోని శూద్రజాతులవారి ఆచారవ్యవహారముల ననుసరించి జీవనము చేస్తున్నవారు లేక పోలేదు.

యేనాదులలో కొండరాగి యేనాదులు, తడయేనాదులు, రెడ్డి యేనాదులు, మంచి యేనాదులు, చెంచు యేనాదులు, అడవి యేనాదులు, చల్ల యేనాదులు, కప్పల యేనాదులు అని భిన్న జాతులవారు గలరు. పంట రెడ్లు రెడ్డి యేనాదులను తమ యిండ్లలో వంటపనులు చేయుటకు పెట్టుకొంటున్నారు. వేంకటగిరి జమీందారీ గ్రామాలయందు ఈ ఏనాదులలో కొందరు బొగ్గులమ్ముకొని జీవిస్తున్నారు. కృష్ణా గోదావరి జిల్లాలలో కొందరు కావలివాండ్రుగా పనిచేస్తున్నారు. కప్పల యేనాదులు అధమజాతి యేనాదులు. కొందరు కావలి తాలూకాలో పాకీపని సైతము చేస్తున్నారు; పెంటపై పారవేసిన పుల్లాకులలోని అన్నము సైతము తిని జీవిస్తున్నారు. వీరిని సోమారి యేనాదులంటారు. యేనాదు లందరును తాబేలు, పందికొక్కు, ఎలుక, బల్లి, ముంగి మొదలయిన చిన్న జంతువులను సైతము తింటారు.

యేనాదులు సాధారణముగా తమ గుడిసెలు వెదురుతోను, తాటి కమ్మలతోను కట్టుకొంటున్నారు. మీదికి కొన దేరిన పెద్ద పిట్ట గూడువలె గుడిసె కనబడుతుంది. లోపలికి పోవడానికి ఒకటే ద్వారము; అదైనా కడు చిన్నది. అందులోదూరి ప్రాకుతూ పోవలెను.

స్త్రీలలో వ్యభిచారము పెద్ద దోషముగా పరిగణింపరు. వివాహమునకు పూర్వము కన్యకు గర్భము కలిగినా పెద్ద తప్పుకాదు. ఏ స్త్రీయైనా ఏడు మనువులవరకును మారు మనువులు చేసుకో వచ్చును. దొంగతనము, బందిపోటు, హత్య మొదలయినవి తమ వృత్తి ధర్మములుగానే వారెంచుకొంటారు.

వేటచేయుటలోను, పాములను పట్టుకొని ఆడించుటలోను, మందులమారి పనులలోను యేనాదులు పేరు పొందినవారు. నాగరికులయిన యేనాదులు కావలివాండ్రుగాను, పంట కాపులుగాను, రాతి కట్టడపుపనులు చేసేవారుగాను, వడ్లు దంచేవారుగాను, ఇంటి సేవకులుగాను జీవనం చేస్తున్నారు.

## లంబాడీలు

వీరు వాస్తవముగా ఆదిమనివాసులలో కారో చెప్పలేము. వీరి మొఱకు జీవనము, అడవుల నివాసము మొదలయిన కొన్ని లక్షణములను చూచి ఆదిమనివాసులై ఉందురన వచ్చును. భాష, ఆచార వ్యవహారములు, పెండ్లి యాచారము, మతము మొదలయిన లక్షణములను చూచి సంకర జాతివారేమో అని చెప్పవచ్చును. వీరు మన దేశములో పడమటి భాగమున కాశ్మీర దేశమునుండి బళ్లారి జిల్లా వరకున్ను తూర్పు భాగమందు విశాఖపట్నం జిల్లా మన్యపు అడవులందును తూర్పు కనుమల పడమటి భాగములందును ఎక్కువగా కలరు. కొందరు కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురము, నెల్లూరు జిల్లాలలోను, మైసూరు అడవి ప్రదేశములందును, కోయంబత్తూరు జిల్లాలలో సైతము కనబడుచున్నారు. వీరికి లంబాడీలన్న పేరు సర్వ సామాన్యముగా ఉన్నది గాని వీరు ఇంకా అనేక నామములతో ఉన్నారు. బ్రింజారీ, బంజారీ, బొయిపారీ, సుగాలీ, సుకాలీ మొదలయిన పేళ్లతో కూడా కొందరు కనబడుతున్నారు. బ్రింజారీ, బంజారీ, వంజారీ అనే పేళ్లకు సంస్కృత భాషలో ఉన్న కారి, వాణిజ్య ప్రాకృత భాషలో ఉన్న వాణిజ్జ ఆరాఓఅనే పదముల నుండి వచ్చియుండవచ్చునని కొందరి అభిప్రాయము. లంబాడీ, లభానీ, లబానీ మొదలయిన పేళ్లు లవణ (=ఉప్పు) శబ్దమునుండి వచ్చినవేమో అని కొందరి అభిప్రాయము. సుగాలీ, సుకాలి అనే పేళ్లు సుపారి (=వక్క) అనే పదమునుండి వచ్చియుండునని కొందరి అభిప్రాయము. ఈ అభిప్రాయములకు ఆధార మేమంటే, ఈ లంబాడీలు వాణిజ్య వ్యాపారము అందులో బిడారి వర్తకము చేస్తూ ఉండేవారు. ఉప్పు, పోక చెక్కలు ఎడ్ల పైని వేసుకొని అవి ఉత్పత్తియైన స్థలములనుండి కావలసిన చోట్లకు తీసుకొని పోవుచుండేవారు.



లంబాడీ స్త్రీ.

వీరు మొగల్ చక్రవర్తుల కాలములో మొగల్ సైన్యములతో ఉత్తర దేశమునుండి దక్కను దేశమునకు వచ్చినట్లును, సైనికులకు కావలసిన సామానులు, యుద్ధ సామగ్రి ఎడ్లపై వేసుకొని తెచ్చినట్లును, ఆ వచ్చినవారు చాలామంది బళ్లారి మొదలయిన ప్రదేశములందు స్థిర నివాసము లేర్పరచుకొని ఉండిపోయినట్లును బళ్లారిలో ఉన్న లంబాడీలు చెప్పుకొంటూ ఉంటారు.

ఇప్పుడు మనకు కనబడుతూఉన్న లంబాడీలు కొందరు వ్యవసాయము చేసు కొంటున్నారు ; కొందరు పశుల మందలను పెట్టుకొని జీవించుచున్నారు ; కొందరు కోలార్ బంగారు గనులలో పనిచేస్తున్నారు.

లంబాడీల దుస్తులు ఉత్తర దేశములో తక్కువ జాతుల దుస్తుల వలెనే నిండుగా ఉన్నవిగాని, సవరలు, కోదులు మొదలయినవారి దుస్తులవలె స్వల్పముగా నుండవు. స్త్రీల దుస్తులు, అలంకారములు ఎట్లుండునో ఇందలి చిత్రము చూచి తెలుసుకొన వచ్చును. లంబాడీ స్త్రీలకు తక్కిన అడవిజాతి స్త్రీలకున్నట్లే ముఖమునకు, వక్షమునకు, చేతులకు, కాళ్లకు పచ్చబొట్లు మెండుగా నుండును ; అంతేకాక, ముక్కుపైని సైతము ఉంటవి.

ఈ కాలపు లంబాడీలు తిరుపతి బాలాజీకి, హనుమంతునికి, మల్లాలమ్మ, అంకాలమ్మ, పెద్దమ్మ, మారియమ్మ మొదలయిన దేవతలకు మొక్కుబళ్లు చెల్లిస్తున్నారు. హోళీ పండుగ—కామదహనము పండుగ చేస్తారు. కొందరు వైష్ణవ మతమును అవలంబించినట్లున్నారు. వీరు కృష్ణుని, రాధను ఆరాధిస్తారు. ఈ హిందూమతావలంబనము మొదట నుండినదో దరిమిలా వచ్చినదో చెప్పలేము. ప్రాచీన కాలములో దుర్గ మొదలయిన శక్తులకు నరబలియిస్తూ ఉండేవారు.

వాలి సుగ్రీవులనుండి ఉద్భవించిన వారమని చెప్పుకొనే లంబాడీలు సైతము కొందరు బళ్లారిలో గలరు. వీరికి సుగాళీ అనేపేరు తెలియదు.

ఈ లంబాడీలలో మంత్రాలు వచ్చునని చెప్పుకొనేవారు సైతము కలరు. పులులు తమ జోలికి రాకుండ కాపాడుకొన గలరట, చిల్లంగి పెట్టగలరట. ఇతరులు పెట్టిన చిల్లంగికి విరుగుడు చేయగలరట.

పెండ్లిండ్లు సులువుగా చేసుకొందురు. సన్నికల్లు చుట్టును ఏడుసారులు తిరగడం, వధూవరులు పసుపు త్రాళ్లు ఒకరికొకరు వేసుకొని ఏడుముళ్లు బిగించడం ముఖ్యం. బ్రాహ్మణ పురోహితుని పెట్టుకొందురుగాని అతడు చేయవలసిన పని అంతా "శోభన శోభన" అనడము మాత్రమే. చనిపోయినవారిలో పెండ్లి అయినవారికి దహనమున్ను, కానివారికి పాతిపెట్టడమున్ను ఆచారము.

## ఆదిమనివాసుల విజ్ఞానము.

పైని చెప్పిన సవరలు, కోదులు, చెంచులు, ఎరుకలు, ఏనాదులు, లంబాడీలు మొదలయిన ఆదిమనివాసులు నాగరికత, విజ్ఞానములేని పశుప్రాయులవలె మనకు కనబడుతున్నారు ; గాని, మనకు కనబడినంత అనాగరికులు, అజ్ఞానులు కారు. ప్రాచీనకాలమందు శబరులు, ఆర్యులకు చేరువగానే ఉండి, ఆర్యుల విజ్ఞానమును కొంతవరకు అన్ని విషయములలోను గ్రహించినవారని చెప్పగలము. అందులో చాలా భాగము నేటివరకున్ను సవరలలో నిలిచియున్నది. ఈ విషయము పైపైగా సవరలను చూచినంత మాత్రాన బయలుపడదు. వారి భాషలో వారితో ప్రసంగించి, వారికి మన సద్భావముయెడల పూర్తిగా నమ్మకము కలిగించి, తీరుబడిగా కూర్చుండి ప్రతి విషయము ప్రశ్నిస్తూ తెలుసుకోవలెను. వైద్య విషయములో సవరలు, చెంచులు, ఎరుకలు కొంత జ్ఞానము, అనుభవముగలవారు. నాగరికులయిన మనవారు కొందరు వారి మందులు పుచ్చుకొంటున్నారు ; వారి మంత్రాలవల్ల రోగములు కుదుర్చుకొనుటకున్ను, భూత పిశాచముల బాధ తొలగించుకొనుటకున్ను ప్రయత్నిస్తున్నారు. వేట విషయములో ఈ ఆదిమనివాసులు ప్రజ్ఞానంతులన్నవిషయము సంస్కృతాంధ్ర కావ్యములందు పెక్కుచోట్ల వర్ణించడము కనబడుతుంది. అందులో కిరాత, బోయ, ఎరుకు మొదలయిన పేళ్లు ఆదిమనివాసులయిన అడవిజాతులవారిని తెలియజేస్తవి. సత్యము పలుకుటలోను, పాతివ్రత్యవిషయములోను సవరలు మొదలయిన ఆదిమనివాసులు మంచి పేరుపొందినవారు. ఇప్పుడిప్పుడు పల్లపు దేశ నాగరికుల సంపర్కమువల్ల పైనిచెప్పిన సద్గుణములు వారిలో తగ్గిపోతున్నవి !



# ఎనిమిదవ అధ్యాయము

# ఆంధ్రుల చరిత్ర

డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యి, ఎం. ఏ., పి. ఎచ్. డి.,
ప్రిన్సిపాల్, ఎస్. ఆర్. ఆర్. కాలేజి, బెజవాడ.

అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించు నాఁడు.
ఓరుగల్లున రాజ వీరలాంఛనముగాఁ
బలు శస్త్రశాలలు నిలుపు నాఁడు.
విద్యానగర రాజవీధులఁ గవితకు
పెండ్లి పందిళ్లు కప్పించు నాఁడు.

పొట్నూరికి సమీపమున నాంధ్ర సామ్రాజ్య
దిగ్జయస్తంభ మెత్తించు నాఁడు.
ఆంధ్ర సంతతి కే మహితాభిమాన
దివ్యదీక్షా సుఖస్ఫూర్తి తీవరించె
నా మహావేశ మర్థించి యాంధ్రులార!
చల్లుఁ డాంధ్రలోకమున నక్షతలునేఁడు!

—రాయప్రోలు



విషయ సంగ్రహము : చరిత్రకు సంబంధించిన ఈ భాగములో ఆర్య ద్రావిడులకు పూర్వము నుండిన్ని ఆంధ్ర దేశమందుగల ఆదిమనివాసులగురించి క్రిందటి అధ్యాయములో చెప్పడమయినది. దేశచరిత్రలో ఆదినుండి ఆంధ్రుల వరకునుగలచరిత్ర గ్రంథారంభమున తెలియజేసినాము. ఈ అధ్యాయములో ఆంధ్రుల చరిత్ర విషయములు గలవు: రాబోవు అధ్యాయములలో రాష్ట్రేతర, దేశాంతర, ఖండాంతర - ఆంధ్రుల చరిత్ర; జమీందారీల చరిత్ర తెలియజేస్తున్నాము.

ఆంధ్రుల ప్రసక్తి ఐతరేయ బ్రాహ్మణ కాలమునుండి ప్రారంభము ; ఆంధ్రులు దక్షిణాపథ దేశస్థులు ; మౌర్యుల కాలములో ఆంధ్రరాజ్య ప్రసక్తి: ఆంధ్రులు బౌద్ధులు ; ఆంధ్ర శాతవాహన రాజ్యము ; అశోకుని తరువాత కొద్దికాలమునకు మగధ దేశమునకు విస్తరించుట ; పిమ్మట పడమటినుండి సముద్రతీరము వరకున్ను వ్యాపించుట ; మొదట శ్రీకాకుళము, పిమ్మట ధాన్యకటక నగరము ఆంధ్ర రాజధాని నగరములు ; ఆంధ్ర రాజ్యము క్రీ॥ పూ 225—క్రీ॥శ॥ 225 వరకు ; ఆంధ్రశిల్పము ; గౌతమీపుత్ర శాతకర్ణి, నాల్గవ పులమాయి :—పల్లవరాజులు 225-340 : బళ్లారి, కంచి, అమరావతుల నడుమనున్న రాజ్యమును పాలించినవారు : శివస్కందవర్మ కాంచీపుర శాసనములు ; విష్ణుగోపుడు 340 ; సముద్రగుప్తుని జైత్ర యాత్ర :—ఇక్ష్వాకరాజ్యము 250-340 ; స్థాపకుడు సిరిచాంతమూల ; శ్రీ పర్వతమునందలి విజయపురము రాజధాని ; ఇక్ష్వాకులలో కొందరు బ్రాహ్మణ మతమును, కొందరు బౌద్ధమతమునూ అవలంబించిరి ; బృహత్పాలాయనులు 275; కొండముడి తామ్ర శాసనములు ; సాలంకాయన రాజ్యము 275-450 ; విజయనందివర్మ ఏలూరి శాసనము ; నందివర్మ చంద్రవర్మ, మూడవ విజయనంది వర్మలు ముఖ్యమైన రాజులు ; వేంగీరాజ్యాధిపతులు; విష్ణుకుండినులు 350-610 ; మాధవశర్మ రామతీర్థ శాసనకర్త ; మరి అయిదుగురు రాజులు ; తూర్పుతీరమున వంశధారా కృష్ణా నదుల మధ్య భాగమునేలిరి ; లెందులూరు ముఖ్యపురము : శిల్పాభివృద్ధి :— రెండవ పల్లవ రాజ్యము 340-640 ; కుమార విష్ణునితో ప్రబలినది ; ఇందులో ఉత్తర శాఖవారు తెలుగు జిల్లాలలో అధిపతులు: తెలుగునాటి మహేంద్ర వర్మను రెండవ పులకేశి ఓడించెను 630—కళింగ రాజులు క్రీ॥ పూ॥ 160-1530 ; కళింగదేశము మహానదినుండి గోదావరి వరకు ; ఖారవేలుడు ఉత్కళింగరాజు క్రీ॥ పూ॥ 2 వ శతా

బ్దము ; సముద్రగుప్తుని అలహాబాదు శాసనములోని పిష్టపుర మహేంద్ర, గిరికొత్తూరుస్వామి దత్త పేళ్లు : వాసిష్ఠీపుత్ర శక్తి వర్మ రాగోలు శాసనము ; శ్రీకాకుళమువద్దనున్న సింహపురము రాజధానిగా చంద్రవర్మ, ఉమావర్మలున్ను, సరియాపల్లి రాజధానిగా నంద ప్రభంజనవర్మయున్ను:—గంగవంశపు రాజులలో రెండుకోవలు-మొదటికోవ 500-900 ; రెండవకోవ కామార్ణవునితో ప్రారంభము 720-1430 ; రెండవ కామార్ణవుడు 8 వ శతాబ్దమున ముఖలింగ నగరమున మధుకేశ్వరాలయమును నిర్మించినవాడు. ఎక్కువ ప్రఖ్యాతి చెందినవాడు; అనంతవర్మ చోళ గంగదేవు 1078-1142 ; 1130 లో ఇతడు కటకపురిని జయించి ఉత్కళ రాజ్యమును ఆక్రమించుట ; నాటనుండి ముఖలింగమునుండి కటకమునకు రాజధాని మారుట ; ఈ వంశములో కడపటిరాజు నాల్గవ భానుదేవు 1430 లో ఆతనిని, అతని మంత్రి కపిలేంద్రదేవు తొలగించి, గంగవంశ రాజ్య మంతరింపజేసి, తన గజపతి వంశరాజ్యమును (1430-1530) స్థాపించుట ; ఇతడు, ఇతని కుమారుడు పురుషోత్తముడు, మనుమడు ప్రతాప రుద్ర గజపతి క్రమక్రమముగా నెల్లూరి వరకును తమ అధికారమును వ్యాపింప జేసికొనుట ; తుదకు 1520 లో కృష్ణదేవరాయలు తెలుగు దేశమునుండి ప్రతాపరుద్రుని వెడలగొట్టుట: పశ్చిమచాళుక్యుల ప్రశంస క్రీ॥ శ॥ 6-7 వ శతాబ్దం—కుబ్జ విష్ణువర్ధనుడు వేంగీ రాజ్యమున స్వతంత్ర పరిపాలకుడయి తూర్పు చాళుక్యవంశరాజులకు మూలపురుషుడగుట ; తూర్పు చాళుక్యరాజులు క్రీ॥ శ॥ 630-1127 ; వేంగీపురము 920 వరకును రాజధాని; అమ్మరాజు 918-925, రాజమహేంద్ర బిరుదు గలవాడు; రాజమహేంద్రవరము రాజధాని యగుట ; ఈ రాజులలో విమలాదిత్యుని కుమారుడు రాజరాజ నరేంద్రుడు గొప్పరాజు 1022-1063, నన్నయ రచిత భారతాంధ్ర కృతిభర్త; ఇతని కుమారుడు రాజేంద్రుడు ; మాతామహుని చోళ రాజ్యమునకు రాజై, కులోత్తుంగ చోళ దేవుడని పేరుపొందిన చోళ చాళుక్య రాజాధిరాజు (1076-1118) ; అతని తర్వాతి రాజులు 1232 వరకు ; తరువాత, వెలనాటి చోళులు ; కోనమండలము నేలిన హైహయులు; వారి శాసనములు 1112,1206; నెల్లూరిలో చోళ తిక్కరాజు; మనుమసిద్ధి, మనుమసిద్ధి ఆస్థానకవి తిక్కన; కాకతీయ రాజ్యము 1089-1323; మొదటిరాజులు పశ్చిమ చాళుక్య రాజులకు సామంతులు ; ప్రోలరాజు స్వతంత్రుడగుట ; ఓరుగల్లు రాజధాని ; రుద్రుడు 1159-1195 తూర్పున సముద్రము వరకును దక్షిణమును శ్రీశైలము వరకును రాజ్యము చేసెను ; గణపతిరాజు దక్షిణమున కంచి, తిరుచునాపల్లి జిల్లాలోని జంబై వరకును కాకతి రాజ్యమున విస్తరింపజేసెను ; అతని తర్వాత రాజ్యమునకు వచ్చిన అతని కుమార్తె రుద్రమదేవి : వీర వనిత: పిమ్మట ఆమె మనుమడు ప్రతాపరుద్ర మహారాజు ; 1323 లో ఢిల్లీ సుల్తానుల వశమై చనిపోవుట ; పిమ్మట 1323-1450 వరకు రెడ్డి రాజ్యములు విస్తరిల్లినవి ; మంచికంటి కూనపనాయుడు రాజమహేంద్రవర దుర్గమునుండి మహమ్మదీయులను తరుముట—మహమ్మద్ తుఘ్లక్ కొలువులో సేనాధిపతిగానున్న హసన్ గంగూ 1358 లో కుల్బర్గలో భామినీ రాజ్యస్థాపనము ; 1489-1518 లో 5 చిన్న రాజ్యములుగా విడబడుట ; అందు గోల్కొండ రాజ్యము తెలుగు దేశములో వ్యాపించుట. మొదట నుండిన్నీ భామినీ విజయనగరముల రాజులకు యుద్ధములు.

## విజయనగర రాజ్యము (1336-1675)

హిందూ స్వాతంత్ర్యమునకున్ను, మత ధర్మములకున్ను మహమ్మదీయ దండయాత్రలవల్ల హాని కలుగుతున్నదని హరిహర బుక్కరాయలు 1336 లో విజయనగర రాజ్యము స్థాపించుట ; వారికి తోడుపడిన విద్యారణ్యులపేరు వారు నిర్మించిన నగరమునకు వచ్చి, విజయనగరముగా మారుట ; 1345 నాటి బుక్కరాయల శాసనము ; ప్రౌఢ దేవరాయల కాలములో (1421-1448) నికోలొకాంటై, అబ్దుర్ రజాక్ అను విదేశయాత్రికులు విజయనగరముచూచి వర్ణించుట ; పిమ్మట సాళువ, తుళువ వంశరాజులు ; అందు ప్రఖ్యాతిపొందిన కృష్ణదేవరాయల (1509-1530) రాజ్యపాలనము, సారస్వతసేవ, కళాపోషణము,-1565 తల్లికోట యుద్ధము ; విజయనగర సామ్రాజ్య విచ్ఛిత్తి: ఆర్వీటి వంశ వేంకటపతిరాయలు జీర్ణ విజయనగరరాజ్యమును ఉద్ధరించుట ; కడపటి రాజు శ్రీరంగరాయలు. (1675) విజయనగర రాజుల అధికారమునకు లోబడి ఉదయించి, స్వతంత్రతపొందిన తంజావూరి ఆంధ్రనాయకులు ; మధురనాయకులు, ఆంధ్ర సారస్వతాభివృద్ధి.

## బ్రిటిష్ యుగమునాటి ఆంధ్రుల చరిత్ర 1600-1942

తూర్పు ఇండియా సంఘము 1600 లో పుట్టి, ఇండియాలో వర్తకము సాగించుకొంటూ 1752 నుండిన్ని ఎక్కువ పలుకుబడి సంపాదించుట. 1764 నాటికి ఆంగ్లేయుల విజయము, ఫ్రెంచివారి అపజయము. 1801 నాటికి తెలుగు జిల్లాలు బ్రిటిష్ ప్రభుత్వము లోనికి వచ్చుట. 1884 స్థానిక ప్రభుత్వము ; 1919-20 మాంటెగ్యు ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణములు; ద్వంద్వ ప్రభుత్వము ; జస్టిస్ పార్టీవారు మంత్రి పదవులనుండుట ; సహాయనిరాకర ణోద్యమము; 1935 ఇండియాచట్టము; రాష్ట్రీయ స్వాతంత్ర్యము; కాంగ్రెస్‌పార్టీ విజయము; 1939 యుద్ధము. కాంగ్రెస్‌వారు రాజీనామాలిచ్చుట; 1942 జపాను యుద్ధము: విషమ పరిస్థితులు.

ఆంధ్రుల ప్రశంస అతి ప్రాచీనమైన ఐతరేయ బ్రాహ్మణమునందు గలదు. ఐతరేయ బ్రాహ్మణము సరిగా ఏకాలము నాటిదో నిర్ణయింప శక్యము కాదు; గాని, క్రీ॥ పూ॥ 1000 సం॥ ల॥ ఈవలనాటి గ్రంథము మాత్రము గాజాల దనవచ్చును. అప్పటికి ఆంధ్రులు వింధ్య పర్వతములకు దక్షిణ పరిసర ప్రదేశములందు నివసించు చుండిరని తెలియు చున్నది.

**ఉపక్రమణ**

ఈ ఆంధ్రుల పుట్టు పూర్వోత్తరములు తెలుసుకొనుట చాలా కష్టము. అసలు ఆంధ్రులు ఏజాతి వారు? అనేక సంవత్సరముల నుండియు, ఇప్పుడు మనము ఆంధ్రదేశమని వ్యవహరించు ప్రదేశమున నుండిరా? లేక యితర ప్రదేశముల నుండి యిచ్చటకు వచ్చిరా? అను విషయములు దుర్గ్రాహ్యములుగా నున్నవి. అది అట్లుండ, 'ఆంధ్ర' * 'అంధ్ర' అను పదముల అర్థమే సంశయాస్పదమైనవి. ఆంధ్ర యను పదము ప్రథమమున దేశపరముగా ప్రయోగింప బడినదా? లేక జాతి పరముగనా? ఈ పదములు ఆదిలో ఒక రాచకుటుంబము యొక్క పేళ్లైకాని, భాషకును, జాతికిని దేశమునకును సంబంధించినవి మాత్రము గావని పెక్కుమంది అభిప్రాయము. దీనికి తోడు, తెలుఁగు, తెనుఁగు అను పదములు గూడా కొంత చర్చకు అవకాశ మిచ్చినవి. అదిగాక, ఆంధ్రులు ఆర్యులని కొందరును, ద్రావిడు లని మరి కొందరును అను చున్నారు, ఈ చర్చలన్నియు సమగ్రముగా సశాస్త్రీయమైన దృష్టితో పరిశీలింపబడ లేదు గావున వీటిని వదలి ప్రస్తుతము అధిక సంఖ్యాకుల ఆమోదమును బడసిన ఒకటి రెండు చారిత్రకాంశముల మాత్రమే పరిగణింతము.

*ఐతరేయ బ్రాహ్మణములో "ఏతేంధ్రా" అనుట వల్ల అంధ్రశబ్దమే సాధువు; ఆంధ్ర శబ్దము కాదు; గాని వాడుకలోనికి వచ్చియున్నది.



కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు, ఏమ్. ఏ.,
చరిత్ర పరిశోధకోద్యమము, విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి స్థాపకులు, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ ప్రధాన సంపాదకులు.

**మౌర్యుల కాలము నాటి ఆంధ్రుల ప్రశంస**

మౌర్య చంద్ర గుప్తుని కాలమువరకు ఆంధ్రుల చరిత్ర తెలుసుకొనుట కనువైన ఆధారములు మనకు లభ్యపడుట లేదు. ప్రబలమైన ప్రమాణములు గనిపించు వఱకు ఆంధ్రులు దక్షిణాపథ వాసు లనిన్నీ, వారి దేశము దక్షి

ణాపథ దేశ మనిన్నీ నిశ్చయముగా చెప్ప గలము. మెగస్తనీసు వ్రాతలబట్టి చంద్రగుప్తుని కాలమున వీరు ఒక స్వతంత్ర రాజ్యమును ఏర్ప రచుకొని ; 30 కోటలతోను, ఒక లక్ష కాల్బల ముతోను, రెండు వేల అశ్వదళముతోను, ఒక వెయ్యి గజదళముతోను, వైభవోపేతముగా నున్నట్లు తెలియుచున్నది.

చారిత్రక కీర్తి వహించిన అశోకుడు చంద్ర గుప్తుని అనంతరము మౌర్యసామ్రాజ్యాధినాథు డయ్యెను. ఆసామ్రాట్టు చెక్కిన శాసనములలో ఆంధ్రులు బౌద్ధమతావలంబులలో అగ్రేసరులు. కాని, ఆంధ్రులు అశోకుని పరిపాలనకు లోబడి నట్లు స్పష్టముగా లేదు. వారు స్వతంత్రులైన ఒక ప్రజాస్వామిక గణముగా నుండి యుందురు.

అశోకుని అనంతరము మౌర్యుల ప్రాభవము అడుగంటి, మౌర్యసామ్రాజ్యము క్షీణింపగా, సామంత పాలకులు స్వతంత్రులైరి. మరికొంత కాలమునకు మగధ సామ్రాజ్యము ఆంధ్ర రాజు లకు వశపడినది. దీనితో ఆంధ్రుల చరిత్ర యందు ఒక నూతనాధ్యాయము ప్రారంభమై నది. శాతవాహన సామ్రాజ్యము నెలకొనినది.

ఈ శాతవాహనులు ఎవరు? ఏ వంశము వారు? అను విషయములు చర్చించ వలసి యున్నది. * 'శాతవాహన' 'శాతకర్ణి'† పద ముల అర్థము దుర్గ్రాహము. శత కర్ణములు (నూరు చెవులకు గాని) శాత వాహనము (సాత వాహనము) నకుగాని ఏమైనా సంబంధ మున్న దేమో! అశోకుని శాసనములలో ఆంధ్రుల పిదప సతీయ పుత్రుల ప్రస్తావన కలదు. శాత వాహనులా? వీరికినీ మార్కండేయ పురాణ ములో చెప్పబడిన శాతకులకును ఏమైన సంబం ధముగలదా? చారిత్రక పరిశోధనలుచేసి నిర్ణ యింప వలసిన సమస్య లిట్టివి ఎన్నియో కలవు.

ఈ శాతవాహన వంశజులలో ఆదిపురుషు డనదగినవాడు సిముఖుడు. వీనినే పురాణములు సిప్రకు డనియు, సింధుకు డనియు, గూడా వక్కా ణించు చున్నవి. ఇతనితో క్రీ॥ పూ॥ సుమారు 225 లో ఆంధ్ర శాతవాహన సామ్రా జ్యము ప్రారంభమైనదని యనుకొన వచ్చును. అప్పటినుండియు ఈ వంశము దాదాపు 450 సంవత్సరములు అఖండ వైభవముతో రాజ్య

*దక్షిణాపథ రాజైన దీపకర్ణి అను నాయనకు, పుత్ర సంతతి లేకపోయెను. అంతకుముందే అతని భార్య పాము కరచి మరణించెను. పుత్రులు లేరని విచారించుచున్న ఆ రాజునకు ఈశ్వరుడు "ఓ రాజా! నీవు వేటకు బోయి నప్పుడు, అడవిలో సింహముమీద సవారిచేయు బాలు డొకడు గనుపడును. వాని నింటికి తెచ్చుకొనుము, వాడే నీకు పుత్రుడని" చెప్పెను. రాజట్లే వేటకుబోయి సింహవాహనారూఢుడైయున్న బాలునిచూచి, సింహమును చంపెను. వెంటనే సింహము మనుష్యుడయ్యెను. పిమ్మట ఆ మనుష్యుడు "నేను కుబేరుని మిత్రుడను, యక్షుడను; నా పేరు సాతుడు; నేను పూర్వము గంగాస్నానము చేయుచు ఒక ముని కన్యకను గాంధర్వవిధిచే వివాహమాడగా 'సింహములగుదురుగాక' అని ఇద్దరమును శపింపబడితిమి" అని చెప్పెను. దీపకర్ణి ఆ బాలుని ఇంటికితెచ్చి, సాతు డతనికి వాహన మైనందున సాతవాహనుడని పేరుపెట్టి, కాలక్రమ మున పట్టాభిషిక్తునిజేసి, తపస్సుకై అరణ్యమునకు బోయెను. అది మొదలుకొని ఆ వీరుడు సాతవాహనుడై, సాతవాహన వంశమునకు మూలపురుషుడయ్యెనని బృహత్కథలో చెప్ప బడినది.

†కర్ణి అను పదమునకు "చుక్కాను" అని అర్థమున్నది. చుక్కాను పడవ కుండును. నూరు చుక్కానులు (శత కర్ణములు) గలిగిన వాడనగా, నూరు పడవలు గలిగినవాడని ఊహించ వచ్చును. నూరు పడవలు గలిగినవాడగుటచే శాతకర్ణి, అయి ఉండవచ్చును.



చక్రవర్తి మాంధాత:
సాతవాహన శిల్పము,
క్రీ. పూ. 2వ శతాబ్దము;
జగ్గయ్యపేట, కృష్ణా జిల్లా.



బుద్ధ పాదసేవ ; అమరావతి స్తూప
వేదికనుండి, సాతవాహనుల నాటి
శిల్పము ; అమరావతి, గుంటూరుజిల్లా.

[ వెనుక పేజి, ఈ పేజిలోని బొమ్మలు 4, మద్రాసు గవర్నమెంట్ మ్యూజియము వారి అనుమతిని. ]

## సాతవాహనుల నాటి నాణెములు

1. శ్రీశాతకర్ణి ; నానాఘాట్ గుహా శాసనమున పేర్కొనబడిన రాజు; క్రీ. పూ. 2వ శతాబ్దము; పశ్చిమ హిందూదేశమునుండి తీసినది. 2. గౌతమీ పుత్రుడు; 2వ శతాబ్దము; పశ్చిమ హిందూదేశమునుండి. 3. వాసిష్ఠీపుత్ర పులుమావి; 2వ శతాబ్దము; కృష్ణా, గోదావరి జిల్లాలనుండి. 4. వాసిష్ఠీపుత్ర పులుమావి ; 2వ శతాబ్దము; పడవముద్రగల నాణెము, కృష్ణా జిల్లానుండి. 5, 6. గౌతమీ పుత్ర శ్రీయజ్ఞ శాతకర్ణి ; 2వ శతాబ్దము; కృష్ణా, గోదావరి జిల్లాలనుండి. 7. గౌతమీపుత్ర శ్రీయజ్ఞ శాతకర్ణి ; 2వ శతాబ్దము మధ్య హిందూదేశము, చందా జిల్లానుండి.



వెస్సంతర రాజకుమారుడు గొప్పఏనుగును దానముచేయుట : ఇక్ష్వాకులనాటి శిల్పము, 3వ శతాబ్దము; గోలి, గుంటూరు జిల్లా.

మేలెను. ఇతని తమ్ముడు కృష్ణుడు పశ్చిమమున దాదాపు అరేబియా సముద్రము వరకు ఆంధ్ర సామ్రాజ్యమును వ్యాపింప జేసెను. త్వరలో విదర్భ (నేటి బేరారు) హైదరాబాదు మొదలైన ప్రదేశములు ఆంధ్ర సామ్రాజ్యాంత ర్గతములై పోయెను.

శాతవాహన వంశము



కీ. శే. శ్రీ చిలుకూరి వీరభద్రరావు, సుప్రసిద్ధ ఆంధ్రచరిత్రకారులు.

దినదిన ప్రవర్థమానమగుచున్న ఈ ఆంధ్ర సమ్రాట్టులకున్నూ ఉత్తమ ఖ్యాతి గడించిన మగధాధీశులకున్నూ సంఘర్షణము తప్పినది కాదు. క్రీ॥ పూ॥ 170 ప్రాంతమున మగధ చక్రవర్తియగు పుష్యమిత్రసుంగుని పుత్రుడైన అగ్నిమిత్రునికిన్నీ, ఆంధ్ర శాతవాహనుల సామంత మాండలికుడైన యజసేనునికిన్నీ యుద్ధము జరిగెను. దీని ప్రస్తావనయే కాళిదాసుని 'మాళవికాగ్ని మిత్రము' నందు గలదు. ఈ యుద్ధము నందు జయము సుంగులకే గలిగినట్లు కాళిదాసు సూచించియున్ననూ, కడకు ఆంధ్రులే ఈ భాగము నంతటినీ జయించి, తమ సామ్రాజ్యమున గలుపు కొసిరని తెలియు చున్నది.

పూర్వ మాల్వ దేశమునందున్న విదిశా నగరము నందు మూడవ శతాబ్దినాటి వీరి చరిత్రకు సంబంధించిన శాసన మొకటి గాన్పించు చున్నది. రెండవ శతాబ్ద మధ్యకాలము నాటికే పశ్చిమ మాల్వ దేశము నందున్న ఉజ్జయినీ నగరములో, ఆంధ్ర శాత వాహనుల నాణెములు చెలామణిలో నున్నట్లు తెలియు చున్నది. సుంగుల తరువాత ఆంధ్ర శాతవాహనులు ఈ భాగముల ఆక్రమించిరనుటకు పై రెండు ఆధారములే చాలును.

రాజ్యా క్రమణ

క్రీస్తు శకారంభమున యవనులు, శకులు, పహ్లావులు అను విదేశీయులు మన దేశముపైకి దండెత్తివచ్చి, ఉత్తర హిందూదేశమును స్వాధీన పరచుకొని, పిమ్మట దక్షిణాపథమునకు వచ్చిరి. ఆంధ్రులకు మొదట శ్రీకాకుళము రాజధాని యన్న ప్రతీతి గలదు. వారి ముఖ్యపట్నము చారిత్ర కాధారములబట్టి * ధాన్యకటకమని చెప్పవలెను.

పూనా నగరమువద్ద నాసికలో కొన్ని గుహాలున్నవి. వీటిలో ఈ శాతవాహన రాజుల ప్రతిమలున్నూ, శాసనములున్నూ గలవు.

*ధనకటకము, గుంటూరు మండలములో నున్నది. యిప్పుడు ధరణికోటయని వ్యవహారింపబడుచున్నది.



డాక్టరు కె. సుబ్రహ్మణ్యం, ఎమ్.ఏ., పి. ఎచ్. డి., విజయనగర కళాశాలా చార్యులు. బౌద్ధయుగమునాటి ఆంధ్ర చరిత్ర వ్రాసిరి.

నాటిలో సిముఖ, కృష్ణుల ప్రస్తావన కొంత యున్నప్పటికీ ముఖ్యముగా శాతకర్ణిని గూర్చి, సిన్హ అతని రాణి 'నాగనిక' ను గూర్చి ప్రశంసింప బడినది. ఈ శాసనము ననుసరించి శాతకర్ణి అశ్వమేధ యాగమును చేసెనని తెలియుచున్నది.

క్రమముగా శాతవాహనులు బలాఢ్యులై, మగధపైకి దండెత్తి సుంగులను, సుంగుల తర్వాత మగధ పాలకులైన కాణ్వాయణులను జయించి పాటలీపుత్రమును గూడా తమ వశ మొనర్చుకొనిరి. కాని, ఆనాటి చరిత్ర అంత స్ఫుటముగా తెలియుట లేదు. ఈ వంశజులైన కుంతల శాతకర్ణి, హాలాయుధుల ప్రసక్తి కొంతవరకు; కుంతల శాతకర్ణి మదన క్రీడయందు కర్తరీ ప్రయోగమును గావించి, దురదృష్ట వశమున తన రాణిని చంపెనని 'వాత్స్యాయనము'లో కలదు. హాల శాతకర్ణి 'గాథాసప్తశతి' యనుపేర ప్రాకృత పద్యసమీకరణము గావించెనని ఆగ్రంథములోనే ఉన్నది. ఇట్టి అంశములు ఒకటి రెండు సూచించుట కవకాశము లున్ననూ, శాతవాహన వికాసము మాత్రము ఆగిపోయినదన వచ్చును. శక వంశజుల శత్రుత్వము వీరి అధికారమునకు కొంత ఆటంకమైనది.

ఈ వంశజులలో గౌతమీ పుత్ర శాతకర్ణి యను రాజు దిగ్విజయము చేసి, పతనోన్ముఖమైన తన సామ్రాజ్య ప్రాభవమును పునరుజ్జీవింప జేసెను. ఇతని తల్లి నాసికలో వేయించిన శాసనమునందు, ఇతని ప్రభావ మభివర్ణిత మైనది.

**శాతవాహన అభ్యుదయము**

దీనిని బట్టి శాతకర్ణి తమ శత్రువులైన శకులను, యవనులను, పహ్లావులను నిర్జించి, బహురథ వంశము నుక్కడంచెనని నిర్ణయింప వచ్చును. ఇతని తల్లి శాసనమున ఇతడు, క్షత్రియుల గర్వమును, మాత్సర్యమును అణచిన విశిష్ట బ్రాహ్మణుడని చెప్పిన అంశము పై విషయమునే ధృవ పరచుచున్నది. మహారాష్ట్రము, ఉత్తర కొంకణము, బేరార్, గుజరాత్, కథియవాడ్, మాల్వ మొదలగు ప్రదేశము లన్నియు ఈ ప్రభువు పరిపాలనలోనివేనని ఈ శాసనము ఉద్ఘాటించు చున్నది. శత్రువుల కజేయుడైన ఈ రాజు, లోక విఖ్యాతి గాంచిన ఈ విజేత, ధాన్యకటకమున సింహాసనాసీనుడై, తన జ్యేష్ఠ కుమారుడైన పులమాయిని యువరాజుగా జేసి, గోదావరీ తీర ప్రాంతమున నున్న ప్రతిష్ఠాన పురాధికారమిచ్చి, ఏకచ్ఛత్రముగా క్రీ॥ వె॥ 130 వరకును రాజ్యమేలెను. ఇతని పాలనములో ఆంధ్ర కేతనము మరిమొకసారి దివ్యముగా విహరించినది.



ప్రొఫెసర్ శ్రీ రాళ్లబండి సుబ్బారావు, ఎమ్.ఎ.,ఎల్.టి., ఆంధ్రేతిహాస పరిశోధకమండలి కార్యదర్శిగాను, పత్రికా సంపాదకులుగాను, కళింగచరిత్ర ప్రత్యేక పరిశోధకులుగాను ఉండిరి.

గౌతమీ పుత్ర శాతకర్ణి అనంతరము, అతనిపుత్రుడు

పులమాయి రాజ్యమునకు వచ్చెను. యితడు శకులతో జరిగిన యుద్ధములలో పరాజితు డయ్యెను. శకుల రాజైన రుద్రదమనుడు ఇతనిని రెండుసారు లోడించి, పశ్చిమ భాగము నంతా ఆక్రమించి, తనకు పులమాయి సన్నిహిత బంధు వగుటచేత, సమూలముగా నాశనము చేయక విడిచిపెట్టినట్లు తన శాసనములో చెప్పి యున్నాడు. రుద్రదమనుని కుమార్తెను 'పులమాయి' యో లేక పులమాయి

గౌతమీ పుత్ర శాతకర్ణి తరువాతి వారు

కనుపించు చున్నందున ఇతడు పశ్చిమ క్షాత్రపులను జయించినట్లు తెలియు చున్నది. ఇతనికి ప్రతిష్ఠానము రాజధాని.

ఈ శాతవాహన రాజులలో నాల్గవ పులమాయి చివరివాడు. ఇతని పరిపాలన క్రీ॥ వె॥ 225 తో అంతమై యుండ వచ్చును. మొత్తము క్రీ॥ శ॥ 3-వ శతాబ్ది ప్రథమ పాదము నందు ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యము నశించెను.

ఆంధ్ర సామ్రాజ్య ప్రాభవ కాలములో చీనా, జపాన్, బర్మా, దేశములతో ఆంధ్రులు వర్తక వ్యాపారములు చేయుచుండెడి వారనుటకు



సాంచీస్తూపము. హిందూదేశమందుగల బౌద్ధస్తూపములన్నిటను శిల్ప నైపుణ్యమునకు ప్రఖ్యాతిపొందినది. గోళాకృతి నున్న కట్టడమునకు వ్యాసము 103 అడుగులు; ఎత్తు 42 అడుగులు. దాని చుట్టును జాతకాది కథల చిత్రములు చెక్కియున్నవి.

తమ్ముడో పరిణయమాడి యుండవలెను. పులమాయి క్రీ॥ వె॥ 130 నుండి - క్రీ॥ వె॥ 158 వరకు రాజ్యమేలెనని తెలియు చున్నది.

పులమాయి అనంతరము పది సంవత్సరములకు, యజ్ఞశ్రీ శాతకర్ణి, క్రీ॥ వె॥ 168 లో రాజ్యమునకు వచ్చెను. ఇతని శాసనములు మహారాష్ట్రము లోను, ఉత్తర కొంకణములోను నిదర్శనము లున్నవి. ఇంతేకాక, ఆంధ్ర రాజుల ప్రశంస చీనా దేశపు చరిత్రలలో గూడా వుండుటచేత, వీరి కీర్తి ఆ ప్రాంతములకు సైతము వ్యాప్తమై యుండవచ్చునని ఊహించ వచ్చును. చీనా చరిత్రకారులు ఈ యజ్ఞశ్రీ శాతకర్ణిని 'యజ్ఞాయ్' అని పేర్కొని, అతడు హిందూదేశపు చక్రవర్తి అని చెప్పియున్నారు. ఆంధ్ర

శాతవాహనరాజులలో చివరివాడైన పులమా యిని పౌలోమిస్ అని పేర్కొనిరి. ఈ శాత వాహన రాజులలో కొందరు బ్రాహ్మణ మత మును, కొందరు బౌద్ధమతమును అభిమానించిరి. నాటి ఆంధ్రులు నాగరికులై ప్రజ్ఞా విశేషముల వలన ఉన్నతికి వచ్చిరి.

ఆంధ్ర శాతవాహన సామ్రాజ్య విచ్ఛిత్తితో వారి సామంత మాండలికులుగా నుండిన పల్ల వులు, సాలంకాయనులు, బృహత్పాలాయనులు, విష్ణుకుండినులు మొద లైనవారు స్వతంత్రుల యిరి. వారి రాజ్యము నందలి పడమటి భాగ మున్నూ, మధ్య భాగ మున్నూ శత్రువులకు హ స్తగతమాయెను.

ఆంధ్ర సామ్రాజ్య ము విచ్ఛిన్నమైన తరు వాత, ప్రబలినవారిలో పల్లవులొకరని చెప్పి యుంటిమి. ఈ పల్ల వుల వంశమునుగూర్చి అనేక వాదోప వాదములున్నవి. పల్లవ శబ్దము పహ్లవ శబ్ద భవమని కొంద రనుచున్నారు, పహ్లవుల జన్మ స్థానముపారశీక దేశమై యుండుటచేత, వీరిని విదే శస్థులందురు. వీరే జాతివారైనను బళ్లారి, కంచి, అమరా వతి మధ్యగల భాగములపై స్వతంత్రాధికారమును కలిగి యుండిరి. వీరు తెలుంగు దేశపు మతాచారములను వేషభాషలను అను

**పల్లవులు-వారి రాజ్య పాలనము క్రీ॥ శ॥ (225-340)**



ఘంటశాలలో దొరకిన రోమనుదేశపు నాణెములు. క్రీ॥ శ॥ 2వ శతాబ్దము

సరించిరి. వీరు మొదట తెలుగు ప్రదేశములలో తమ రాజ్యమును సుస్థిరము చేసుకొని, తర్వాత బళ్లారి, కంచి వరకును తమ రాజ్యమును విస్త రింపజేసుకొనిరి. వీరి వంశము ఇది, అది అని చెప్పుటకు తగిన ఆధారములు లేవు. ఇప్పటికి లభించిన శాసనములను బట్టి పరిశీలించగా మొదటి పల్లవరాజు, శివస్కందవర్మ తండ్రియని తెలియుచున్నది (క్రీ॥ శ॥ 225). ఈ శివస్కంద వర్మ తండ్రి పేరు బప్పదేవుడు.

ఈ శివస్కందవర్మ కాంచీపురము నుండి మూడు తామ్ర శాసన ములను ప్రకటించి యున్నాడు. అందులో ఒకటి బళ్లారి జిల్లాలోని 'హిరహడగల్లి' (హ ర్పణ హల్లి తాలూ కా) లోను, రెండవది నర్సారావు పేటకు సమీపమున నున్న మైదవోలు గ్రామము లోను, మూడవది నెల్లూరు జిల్లాలోని కందుకూరు గ్రామములోను దొరికినవి.

శివస్కందవర్మ తరువాత, మహారాజా శివ స్కందవర్మ లేక విజయస్కందవర్మ, అతని తరువాత, యువరాజు బుద్ధ వర్మ, ఆ తరువాత బుద్ధాయనుడు వరుసగా ఈ వంశజులలో రాజ్య మునకు వచ్చిరి.

మొదటి పల్లవ రాజైన శివస్కంద వర్మ మొదట బళ్లారి జిల్లాలోని 'అదోని' పరిసర ప్రదేశమును ఏలెను. ఇతడు బ్రాహ్మణ మత



శ్రీ భావరాజు వెంకటకృష్ణరావు, ఎమ్. ఏ., బి. ఎల్., ఆంధ్రేతిహాస పరిశోధకమండలి పత్రికా సంపాద కులు, కార్యదర్శి, చాళుక్యచరిత్ర పరిశోధకులు.

వ్యాపకమునకు అనే కవిధముల తోడ్పడె ను. ఈయన కాల మున, కాంచీ, బళ్లారి, కృష్ణానదుల మధ్యస్థ భాగములన్ని యు ఆయన అధీనములో నుండెను. కృష్ణా నదికి సమీపమున పల్లవ సామంత రా జ్యమున్నట్లు మైద వోలు శాసనమును బట్టి తెలియు చున్నది.

తండ్రి మరణానంతరము, యువరాజైన శివ స్కందవర్మ పట్టాభిషిక్తు డాయెను. ఇతనికి ధర్మ మహారాజను బిరుద మున్నట్లున్నూ, ఇతడు అగ్నిష్టోమము, వాజపేయము, అశ్వమేధము మొదలైన క్రతువులు చేసినట్లున్నూ తెలియు చున్నది. వీటిని బట్టి తండ్రి కన్న ఇతడు బల వంతుడై యుండినట్లు ఊహించ వచ్చును. గాని, ఇతడు జయించిన రాజ్యముల విషయములు తెలు సుకొనుట కాధారములు లేవు. క్రీ. వె. 3-వ శతాబ్దపు మధ్యభాగములో ఈ ప్రభువు పరి పాలన చేయుచున్న సమయములో వేంగీ మండ లమున బృహత్పాలాయనులున్ను, గుంటూరు, కృష్ణా పరిసరముల ఇక్ష్వాకులున్ను ఏలుచుండిరి.

శివస్కంద వర్మ తరువాత వచ్చిన పాలకుల చరిత్ర బహిర్గతము కాలేదు. ఈ పల్ల వులలో మనకు శివస్కంద వర్మ తరువాత తెలిసిన పల్లవుడు కాంచీపుర విష్ణు గోపుడు. విష్ణుగోపుడు దిగ్విజయ యాత్రలు చేయుచున్న సముద్రగుప్తునిచే ఓడింపబడెనని ప్రతీతి. వర్ధ మాన మగుచున్న విష్ణుగోపుని అధికారమునకు సముద్రగుప్తుని జైత్రయాత్ర భంగము కలిగించు టచే, విష్ణుగోపుడు కాంచీపురమును వదలి తెలుఁగు నాటికి వచ్చి యుండవచ్చును. ఇంతలో కాంచీపురము చోళుల వశమయ్యెను. ఇతని తరు వాత ఏలిక కుమార విష్ణు. ఇతని సంతతి వాడైన బుద్ధవర్మ చోళ రాజుల నిరంకుశాధికారమును ప్రతిఘటించి, కాంచీ పురములో మరల పల్లవ సింహాసనమున ఆసీను డయ్యెను. తరువాత, పల్ల వులకున్నూ కదంబులకున్నూ అనేక సంగ్రామ ములు జరిగినవి.

శాతవాహనుల తరువాత, ఉన్నతికి వచ్చిన ఇక్ష్వాకులు, శాతవాహనుల సామంత రాజులు!



కృష్ణాజిల్లా ఘంటసాలలోని, క్రీ. పూ. మూడవ శతాబ్దినాటి ఆంధ్రుల శిల్పచాతుర్యమును కనబరచు ఘంటసాల సరస్వతి.

వీరికిన్నీ ఆంధ్ర శాతవాహనులకున్నూ వైవాహిక సంబంధ బాంధవ్యములు గూడా ఉండినట్లు తోచు చున్నది.

ఇక్ష్వాక సామ్రాజ్యమును స్థాపించినది 'సిరి చాంతమూల' యను రాజు. ఇక్ష్వాకులకున్నూ అయోధ్య చక్రవర్తులకున్నూ ఏమైనా సంబంధము గలదేమో తెలియదు. వీరును రమారమి క్రీ॥ శ॥ 250 ప్రాంతము లందు రాజ్యమును స్థాపించిరని తెలియు చున్నది. సిరి చాంతమూల శాసనములు ఏవిన్నీ దొరకలేదు. విజయపురము వీరికి రాజధాని. సిరిచాంతమూల పుత్ర పౌత్రుల శాసనములనుండి, యితడు అగ్ని ష్టోమము, అశ్వమేధము, వాజపేయము మొదలైన యాగముల చేసెనని తెలియు చున్నది. వాజపేయమును చేసి యుండుట గొప్ప విషయము. వాజపేయమును చేసిన మొదల రాజుకన్న అధికపదవి లభించి, సమ్రాట్టు అగునని శతపథ బ్రాహ్మణము నందును, కాత్యాయన శ్రౌత సూత్రములందును చెప్ప బడియున్నది. అందుకే, శాతవాహనులలో నొకడగు సిరిశాతకర్ణి, పల్లవరాజగు శివస్కంద వర్మ గూడా వాజపేయమును జేసిరి. ఇతడు గోహిరణ్యాది దానములను అధికముగా జేసినట్లు శాసనములవల్ల తెలియుటయే గాక, అట్టి సందర్భమున చిత్రించిన శిలాఫలకము గూడా ఒకటి మనకు దొరకినది.

ఇక్ష్వాకుల పాలన క్రీ. శ. 250-340

ఇతడిట్టి సనాతన మతావలంబుడైనను ఇతని సోదరులగు హమ్మసిరిణిక, చాంతసిరులు బౌద్ధులై యుండుట విచిత్రము!

చాంతమూల యనంతరము సిరివీరపురిసదత్తుడు రాజ్యమునకు వచ్చెను. ఇతడు శకమహా రాజు కూతురిని పరిణయ మాడెను. ఆమె పేరు మహాదేవీ రుద్రభట్టారిక. ఇతని చెల్లెలిని, చూటుశాతకర్ణు లనెడి వైజయింతీ ప్రాంత రాజున కిచ్చి వివాహము జేసి, తన పలుకు బడిని, అధికారమును బలపరచు కొనెను. ఇతని కాలముననే చాంతిసిరి, బుద్ధుని అస్తికలపైని విజయపురమున* ఒక మహాచైత్యమును నిర్మించి, చుట్టును విహారములు, ఇతర చైత్యములను క్రమముగా కట్టించెను. కాలక్రమమున ఇది ఒక మహాబౌద్ధ క్షేత్ర మయ్యెను.

మాధరీ పుత్ర సిరివీరపురిసదత్తుని తనయుడు ఎహువుళ చాంతమూల ఈ వంశము వారిలో కడపటి రాజు. ఇతని చెల్లెలు ఇచ్చిన కొడబలిపురి శాసనము నుండి ఇతడు 11 సంవత్సరములు రాజ్యము చేసెనని తెలియు చున్నది. ఇతని కాలమున గూడా చాలా విహారములు, చైత్యములు నిర్మించ బడెను; వీటిలో ముఖ్యమైనది దేవీ విహారము. దీనిని ఇతనిరాణి భట్టిదేవి నిర్మించినది. కొడబలిసిరి గూడా ఒక విహారమును నిర్మించెను. కదంబులు, సాలంకాయనులు విజృంభించుటచే వీరి ప్రాభవము క్షీణించినది.

మొత్తము మీద కృష్ణా, గోదావరీ నదీ ప్రాంత భూములన్నియు, ఇక్ష్వాకుల రాజ్యాంతర్భాగములే!

పల్లవులు, ఇక్ష్వాకుల తరువాత చెప్పవలసిన వారు సాలంకాయనులు. నేటి కృష్ణా, గోదా

---

* ఈ విజయపురి శ్రీ పర్వతము నందుగలదు.

వరీ మండలము ఆనాటి సాలంకాయనుల పరిపాలనములో నుండెను.

**బృహత్పాలాయనులు (క్రీ. వె. 275)**

**సాలం కాయనులు (క్రీ. వె. 275-450)**

సాలం కాయనులు బృహత్పాలాయనుల తరువాత క్రీ॥ వె॥ 275 ఆ ప్రాంతముల రాజ్య స్థాపనము గావించి వారి రాజ్య ప్రశంస యుందురు.

బృహత్పాలాయనుల చరిత్రకు సంబంధించిన ఆధారములలో మనకు లభించినవి ఒక్క కొండమూడి శాసనములు మాత్రమే. కొండమూడి తామ్ర శాసనముల బట్టి బృహత్పాలాయనులు మచిలీపట్నము, దాని పరిసర ప్రదేశములలో పరిపాలన చేసి నట్లున్నూ; ఆ శాసనము లందలి ప్రాకృతలిపి శివస్కందవర్మ శాసనములలోని లిపిని పోలియుండుటచేతను, మహారాజ జయవర్మ బృహత్పాలాయనుడు (క్రీ. వె. 275) శివస్కందవర్మకు సమకాలికుడై యుండ వచ్చునని యున్నూ ఊహించుట కవకాశమున్నది. ఇంతకు మించి బృహత్పాలాయనులను గురించి చెప్పలేము.

బృహత్పాలాయనుల తరువాత ప్రబలులైన సాలంకాయనులు వేదములందు పేర్కొనబడిన సాలంకాయన ఋషి సంప్రదాయము వారని చెప్పి కొనిరి. సాలంకాయన చరిత్ర కాధారములు విజయనందివర్మ యొక్క ఏలూరి ప్రాకృతశాసనము, విజయనందివర్మ, అతని కుమారుడు బుద్ధవర్మల ప్రాకృతశాసనము, పెద వేగీ తామ్ర శాసనములు, కొల్లేరు శాసనములు; ఇవి గాక సముద్రగుప్తుడు, హస్తివర్మల ప్రసక్తి గల అలహాబాదు స్తంభ శాసనము.

చరిత్రకు తెలిసి నంతవరకు సాలంకాయనులలో ప్రథముడు, ఈ వంశస్థాపకుడు మహారాజా విజయదేవవర్మ. ఈయన నేటి ఏలూరికి ఆరుమైళ్లు దూరములో నున్న వేంగీ పురమున రాజ్య స్థాపనజేసి, అశ్వమేధ యాగమును చేసెను. ఈ విజయదేవుడు బ్రాహ్మణ మతావలంబి. శివ సూర్యుల భక్తుడు. పెద వేగివద్ద సాలంకాయనులచే కట్టించబడిన సూర్య దేవాలయము శిథిలమై, నేటికిని వారి కీర్తికి కిరణముగా శేషించి యున్నది.

విజయదేవుని తరువాత మొదటి విజయ నందివర్మ, అతని తరువాత అతని కుమారుడు విజయబుద్ధవర్మ, అతని తరువాత హస్తివర్మ మహారాజు (క్రీ. వె. 340), పిమ్మట హస్తివర్మ తనయుడు నందివర్మ, నందివర్మ పుత్రుడు చంద్రవర్మ యున్నూ, చంద్రవర్మ పుత్రుడు మూడవ విజయనందివర్మలు వరుసగా సాలంకాయన రాజ్య చక్రమును త్రిప్పిరి.

హస్తివర్మ అనేక యుద్ధములలో విజయుడైనట్లు చెప్పబడి యున్నదే కాని వాటి వివరణములు తెలియుట లేదు. హస్తివర్మకున్నూ, సముద్ర గుప్తునికిన్నీ యుద్ధములు జరిగినట్లు అలహాబాదు శాసనమును బట్టి తెలియు చున్నది. విజయనంది వర్మను గురించి పెద వేగి శాసనములవల్ల సూర్య, విష్ణు భక్తుడనీ, విష్ణు దేవాలయమునకు దానముల జేసెనని మాత్రమే తెలియు చున్నది.

కుమార విష్ణువనే పల్లవ రాజు గుంటూరు మండలమునుండి కంచివరకును పోయి, అచ్చట చోళుల నోడించి, మరల కాంచీ పురాధీశుడయ్యెనని పల్లవ చరిత్రలో చెప్పితిమి. కుమార

విష్ణు తనయుడు నాల్గవ శతాబ్దాంతమగునప్పటికి, చోళుల నిర్జించి, వారిని కాంచీపుర పరిసరములనుండి తరిమి వేసెను. అప్పటి నుండియు పల్లవులు మరల విజృంభించిరి. అప్పుడు పల్లవులు సాలంకాయనుల జయించిరేమో! సాలంకాయనుల అనంతరము విష్ణు కుండినుల ప్రాబల్యము అధిక మయ్యెను.

సాలంకాయనుల పాలనా కాలమున బ్రాహ్మణ మతము ప్రబలమై, సంస్కృత



బెజవాడదగ్గర, విష్ణుకుండినుల శిల్ప సంపదకు నిలయమైన 5వ శతాబ్దపు ఉండవల్లి గుహాలయము.

వాఙ్మయమునకు ఆధిక్యము హెచ్చెను ; బౌద్ధ, జైన మతముల ఆధిక్యము అడుగంటెను. సాలంకాయన రాజులు యజ్ఞయాగాదు లనేకము చేసి, పెక్కు హిందూ దేవాలయములకు దానముల నిచ్చిరి. సాలంకాయనులు క్రీ. వె. 275 మొదలు 450 వరకూ పరిపాలించిరి.

సాలంకాయనుల తర్వాత బలవంతులై, విష్ణు కుండినులు ఆ రాజ్యాధికారమును వహించిరి. ఈ విష్ణుకుండినులు వేంగీ పురాధీశులగుట క్రొత్త, గానీ వీరు తెలుఁగు దేశమునకు క్రొత్త వారుగారు. వీరు శ్రీశైల ప్రాంతీయులు. ఈ విష్ణు కుండినుల శాసనము లన్నియున్నూ తెలుగు జిల్లాలలో దొరికినవి. విష్ణు కుండినులు వేంగీలో రాజ్య స్థాపన గావించు నప్పటికి (క్రీ. శ. 460) వాకాటకు*ల అధికారము ఉన్నతి నందుచుండెను. ఈ వాకాటకుల ప్రసక్తి క్రీ. వె. 2 శ. నాటి అమరావతి శాసనములలో నున్నది. వీరు మన హిందూ దేశము నందలి ఇప్పటి మధ్య రాష్ట్రములలో పాలకులుగా నుండియుందురు.

విష్ణు కుండినులు
క్రీ. శ. 350—610

వాకాటక ప్రశంస

* నేటి బేరారు నుండి కృష్ణవరకునుగల ప్రాంతము వాకాటకులది.

విష్ణు కుండినులు త్రికూట మలయ పర్వతములకు సంబంధించిన వారమని చెప్పి కొనిరి. అమరపురము వారి ముఖ్య పట్నము. విష్ణుకుండినుల చరిత్రకు సంబంధించిన శాసనములు కొన్ని గుంటూరు మండలములోని ఈపూరు లోను, విజయనగరం తాలూకా లోని రామతీర్థములోను దొరికినవి. విష్ణు కుండినుల కున్నూ వినుకొండకు*న్నూ సంబంధమున్నదని కూడ వ్రాయబడినది.

† రామతీర్థ శాసనమును ప్రకటించిన మాధవవర్మ, ఈపూరు తామ్ర శాసన కర్తయైన మాధవవర్మ ఒకడై యుండవచ్చును. ఈ రాజు విష్ణు కుండినులలో ఎక్కువ ప్రఖ్యాతి గలవాడు. ఈయన వాకాటక రాజకన్యను పరిణయ మాడి, సముద్ర తీర ప్రాంతమంతయు తన అధికారము లోనికి తెచ్చుకొనెను. ఈ వంశజులలో నాల్గవ మాధవవర్మ లిఖించిన గోదావరి శాసనమునుబట్టి, ఆయన రాచనగరు వదలి గోదావరీ పరిసరప్రదేశముల నాక్రమించు కొనుటకు పోయినట్లు తెలియును. చరిత్రాధారముల బట్టి ఆర్గురు రాజులు ఈ వంశజులలో రాజ్య మేలిరని చెప్పవచ్చును. వీరిలో మొదటివాడు పైని చెప్పిన మాధవవర్మ. అతని అనంతరము దేవవర్మ, రెండవ మాధవవర్మ, మొదటి గోవిందవర్మ, మూడవ మాధవవర్మ, మొదటి విక్రమ దేవవర్మ, ఇంద్ర భట్టారక, రెండవ విక్రమ దేవవర్మ, రెండవ గోవిందవర్మ, జనాశ్రయ బిరుదు వహించిన నాల్గవ మాధవవర్మ వరుసగా 260 సంవత్సరములు రాజ్యము చేసిరి. మూడవ మాధవవర్మ వేంగీలో పరిపాలన చేసిన మొదటి రాజు. నాల్గవ మాధవవర్మ విజయశీలుడు. ఈ రాజు పదకొండు పర్యాయములు అశ్వమేధ యాగములను, అనేక క్రతువులను చేసెను. నాల్గవ మాధవవర్మ కుమారుడైన దేవవర్మ తండ్రిని మించిన తనయుడు. అశేష క్షేమధురంధరుడు. ఈయన శివభక్తుడు. ఇంద్ర భట్టారకుని కాలము నుండియు విష్ణు కుండినులకు కాళింగులకు పోరాటములు జరుగు చుండెను. మలయ పర్వతములు ఉత్తరమునను, దక్షిణమున త్రికూట పర్వతములున్ను, వీరి రాజ్యమునకు హద్దులుగా నుండెను.

విష్ణుకుండినుల ముఖ్య పట్నము లెందులూరు (దెందులూరు). ఈ గ్రామము చారిత్రక కీర్తికెక్కిన వేంగికి సమీపమున నున్నది. సింహముఖ చిహ్నములు గల నాణెములు విష్ణుకుండినులు ముద్రించినవని తెలియు చున్నది. వీరి నాణెములు ఎక్కువగా విశాఖ జిల్లాలో దొరికినవి. వీరి కాలమున శైవము ప్రబలినది. ఈ రాజులకు శ్రీ శైలస్వామి కులదేవత, నేటి బెజవాడ పరిసరములలో నున్న ఉండవల్లి, మొగల్ రాజపురం, సీతానగరముల గుహాలయ నిర్మాణము వీరి శిల్పచాతురికి నిదర్శనములుగా నున్నవి.

సాలంకాయనుల తరువాత మరియొకసారి పల్లవ రాజ్య జ్యోతి జాజ్వల్యమానముగా భాసిల్లినది! కుమారవిష్ణు కంచి కధినాథుడు

---

* I. A. Vol. xii. P. 239 Vishnu is also a recognised gōtra. Vishnukudin is not in the extant gōtra list. The town of Vinukonda (Guntur District) is connected by some with Vishnukundins.

† Rāmathirtham C. P. (Vizayanagaram Taluk) M. E. R. 1909, P. 110; E. I. vol xii, P. 134; M. E. R. 1913-4, P. 102.

కాగానే అశ్వమేధ యాగమును గూడా చేసెను. ఈ రాజు కంచిలో పరిపాలన చేయుచున్న సమయములో మరియొక పల్లవ శాఖయులు తెలుగు దేశమున పరిపాలన జేయుచుండిరి (ఉత్తర జిల్లాలలో). ఈ రెండు శాఖలవారున్నూ పల్లవులే! వీరు తమ శత్రువులైన కదంబులతో పోరి, తమ సంయుక్తశక్తితో వారి నెదిరించు చుండిరి. కుమార విష్ణువు తరువాత కంచిలో పట్టాభిషిక్తుడైన బుద్ధవర్మ పల్లవ రాజ్యము నంతటినీ ఏకచ్ఛత్రముగా ఏలెను. చందలూరు శాసనములో ఈ కుమార విష్ణు గుంటూరు జిల్లాలో చేసిన దానములను బట్టి పై రీతిగా ఊహించుట కవకాశము కలిగినది. రెండవ కుమార విష్ణువు తరువాత, వీరవర్మ కుమారుడు స్కందవర్మ, తెలుగు దేశములోని పల్లవ రాజ్యాధికారమును స్వీకరించెను. ఈ స్కందవర్మ అనేక యుద్ధములుచేసిన యోధ! ఇతని చిన్న కుమారుడు విష్ణుగోపుడున్నూ చెప్పదగిన శౌర్య సంపత్తి గలవాడు. స్కందవర్మ పెద్ద కుమారుడు సింహవిష్ణువర్మ కాంచీపురమున రాజాయెను. ఉత్తర జిల్లాలలో, ఒకప్పుడు ఆ ప్రాంతపు పల్లవ ప్రభువున్నూ, స్కందవర్మ మనుమడు అయిన సింహవర్మ, అతని పుత్రుడు స్కందవర్మ యున్నూ అకలంక ధీరులు. వీరికి, మైసూరు ప్రాంతములలో రాజ్యము జేసిన పశ్చిమ గాంగులు సామంత రాజులు. వీరిద్వురున్నూ కదంబులతో అనేక ఘోర సంగ్రామములు చేసిరి. క్రీ. శ. 610 ప్రాంతమున పశ్చిమమున బాదామి నగరము రాజధానిగా చాళుక్యరాజ్యము నేలు చుండిన వీరవరుడు, రెండవ పులకేశి తూర్పు-ఆంధ్ర దేశమునకు దండెత్తి వచ్చి, కృష్ణ వరకునూ గలభూమిని జయించి, అప్పుడు తెలుగు నాటి పల్లవ రాజ్యాధినాథుడైయుండిన మహేంద్రవర్మను ఓడించెను. అంతటితో మహేంద్రవర్మ తెలుగు దేశము విడిచి కంచికి పోయి, అచ్చట నివాసమేర్పరచు కొనెను. ఈ సంతతి వారైన ఆంధ్ర పల్లవ రాజులు క్రమక్రమముగా దక్షిణ ప్రాంతముల జయించి, అనేక విధముల ఆ ప్రాంతములను ఉన్నతికి తెచ్చిరి! ఇప్పుడు ప్రస్తావించినది క్రీ. శ. 340—615 వరకుగల పల్లవుల సంక్షిప్త చరిత్ర.

క్రీ. శ. 340—615 నాటి పల్లవ చరిత్ర

రెండవ పులకేశియొక్క ఆంధ్ర దేశ విజయము (క్రీ. శ. 615) ఆంధ్రుల చరిత్రలో ఒక నూతనాధ్యాయమునకు ఆరంభ మన వచ్చును! గాని, ఇంతటితో పల్లవ రాజ్యాధిపత్య మస్తమించినదని చెప్ప వీలు లేదు. వీరిలో కడపటి వాడైన నందివర్మ 8 వ. శతాబ్దాంతము వరకున్నూ ఈ రాజ్యమును పరిపాలించెను.

ఇంక చాళుక్య ప్రశంస పూర్వము కళింగ దేశ చరిత్ర చూడవలసి యున్నది. కళింగ దేశము ప్రాచీన కాలములో మహానది నుండి గోదావరి వరకునూ వ్యాపించి యుండెను. ఇది మూడు భాగములుగా విభక్తమైనది. ఉత్కళింగము, మధ్య కళింగము, దక్షిణ కళింగము. ఉత్కళింగము నుండి ఉత్కళ మని పేరు వచ్చినది. ఈ కళింగ దేశము నేలిన రాజులలో మనకు తెలిసినంత వరకు, ఖారవేలుడు మొదటి రాజు. ఇతడు క్రీ. పూ. రెండవ శతాబ్దపు మధ్య కాలము నాటి వాడు. ఆంధ్ర

కళింగ రాజులు
క్రీ. పూ. 160
క్రీ. శ. 1530

రాజులు తమ సామ్రాజ్యము నెంత వరకు కళింగ దేశములో సైతము వ్యాపింప జేసి కొనిరో నిశ్చయముగా చెప్ప లేము. ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత ఇక్ష్వాకులు, సాలంకాయనులు ప్రబలి యుండిరి గదా! వీరిలో ఎవరెవరు ఎంత కాలము ఈ కళింగ దేశమును పాలించిరో నిశ్చయించుట కాధారములు లేవు. సముద్ర గుప్తుడు దక్షిణ జైత్రయాత్ర గావించి నప్పుడు కళింగ దేశములో సైతము అతని యాత్ర సాగి నట్లున్నది. అతని అలహాబాదు శిలా శాసనమునందు పిష్టపురము (నేటి పిఠాపురము) నందలి మహేంద్రుడున్నూ, గిరికొత్తూరు స్వామిదత్తుడున్నూ కళింగ దేశము నందలి రాజ్యముల నేలు చుండిన వారుగా కనబడు చున్నారు; అంతే కాక దేవరాష్ట్రము ఏరండపల్లి (ఆముదాలవలస), మొదలైన గంజాం, విశాఖపట్నం, జిల్లాలలో నున్న స్థలములు సైతము సూచింప బడినవి. వీటిని బట్టి ఆకాలములో కళింగ దేశమందు కొన్ని రాజ్యములు వెలసి యుండెనని చెప్ప గలము; గాని, కళింగ దేశమంతయు ఒక సామ్రాజ్యముగా నుండెనని మాత్రము చెప్ప లేము. పర్లాకిమిడికి చేరువగా నున్న గిరి కొత్తూరు నకు మహేంద్రుడు రాజని చెప్పి నప్పుడు ఏరండపల్లి, దేవ రాష్ట్రము, పిఠాపుర రాజ్యములు ఎంత మేర వ్యాపించి యుండెనో, ఆరాజులలో ఎవరు అధిరాజులో, ఎవరు సామంతులో చెప్పుట సైతము కష్టము.

మరి కొద్ది కాలమునకు సంబంధించిన రాగోలు శాసనమును బట్టి వాసిష్ఠీ పుత్ర శక్తి వర్మ కళింగ దేశమునకు అధిపతి యైనట్లు తోచును. పిఠాపురము నుండి ప్రకటితమైన ఇతని శాసనము, కళింగ విషయమునకు సంబంధించినది ఒకటి గలదు. ఈ శక్తివర్మ మగధ వంశ వతంసుడని చెప్పుట చేత గుప్తులకు సంబంధించిన వాడేమోనని అనుమానించవలసి యున్నది. మరి కొద్ది కాలమునకే క్రీ. వె. 5 వ. శ. లోనే చంద్రవర్మ, ఉమావర్మ, నంద ప్రభంజన వర్మలు కళింగ దేశము నేలినట్లు తెలియు చున్నది. గాని పైని చెప్పిన శక్తి వర్మకుగానీ, ఇటు తరువాత కళింగము నేలిన గాంగవంశపు రాజులకు గానీ ఎట్టి సంబంధము లుండెనో తెలియవు. నందప్రభంజనవర్మకు సరియాపల్లి రాజధాని నగరము. ఈ సరియాపల్లి పర్లాకిమిడి తాలూకా లోని సరియాపల్లియో, లేక విజయ నగరమునకు చేరువగా నున్న సరియాపల్లియో చెప్పుట కష్టము. చంద్రవర్మ, ఉమావర్మ రాజులకు సింహపురము (సింగుపురము) రాజధాని. ఇది శ్రీకాకుళమునకు నాల్గు మైళ్లు దూరమున నున్నది.

పిమ్మట, కళింగదేశ చరిత్రమందు ఏవంశమో తెలియని మరియొక రాజు పాలించినట్లు తెలియు చున్నది. అతని పేరు ఇంద్రరాజు. అతని సామంత రాజు పృథ్వీమల్లు.

అటు పిమ్మట 450 నుండి 700 వరకున్నూ 720 నుండి 1450 వరకున్నూ కళింగ దేశమును చాలా కాలము పాలించిన రాజులు గంగ వంశము వారు. ఈ గంగ వంశము వారిలో రెండు కోవలు కనబడు చున్నవి. పూర్వ గంగ వంశపు కోవవారి రాజ్యము ఎప్పుడు ప్రారంభ మైనదో నిశ్చయించుట కష్టము. శాసనాధారముల బట్టి చరిత్రకారు లొక్కొ-



విశాఖపట్టణం జిల్లా, ముఖలింగ క్షేత్ర మందలి మధుకేశ్వరాలయ ముఖ ద్వారము, క్రీ. శ. 8వ శతాబ్దము.

క్కరు ఒక్కొక్క విధముగా నిశ్చయించినారు. బహుశః వీరి పాలన నాలుగవ శతాబ్దములోనే ప్రారంభమై యుండ వచ్చును. రెండవ కోవ వారి రాజ్యము కామార్ణవుసితో 8 వ. శ. ఆరంభమున ప్రారంభ మైనది. ఈ రెండవ గంగ వంశపు రాజుల వంశావళి అనంతవర్మ చోళ గంగ దేవుని కొర్ని శాసనములోను, విశాఖ శాసనములోను విపులముగా నున్నది. ఈ రాజులలో రాజరాజు (క్రీ. శ. 1030), చోళ రాజకన్యయగు రాజ సుందరిని వివాహ మాడెను. అతని కుమారుడు అనంతవర్మ చోడ గంగదేవుడు, క్రీ. శ. 1078 మొదలు 60 సంవత్సరములు పైగా కళింగ సామ్రాజ్యమును ఏలియుండెను.

క్రీ. శ. 1130 లో యితడు ఉత్కళ రాజ్యమును సైతము జయించి, తన రాజధానిని కటక పురమునకు మార్చుకొనెను. అంత వరకును అతనికి రాజధానిగా ఉండిన నగరము ముఖలింగము (పర్లాకిమిడికి 20 మైళ్ల దూరముగా నున్నది). కళింగ పట్నము రేవు పట్టణము. ముఖలింగ నగరమునకు చేరువగా నగరి కటకమునందు రాజుల సిబ్బంది యుండెడిది. ముఖలింగ నగరము నందలి మధుకేశ్వరాలయము ఈ రెండవ కోవ రాజులలో రెండవ కామార్ణవుడు 8 వ. శతాబ్దమున కట్టించెను. అనంతవర్మ చోడ గంగ దేవుడు ఉత్కళ మును జయించిన నాటి నుండియున్ని ఈ గంగ వంశ మహారాజులు కటకపురి నుండియే తమ రాజ్యము నేలు చుండిరి. అంత వరకునూ వారి మాతృభాష ఆంధ్రము. వారి శాసనములు ఆంధ్రములోనే ఉండెను. కటకము రాజధాని నగరమైన తరువాత ఓఢ్రము వారి మాతృభాష, రాజ భాషయు నైనది. వీరిలో నాల్గవ భాను దేవుని తరువాత అతని ప్రధానిగా నుండిన కపిలేంద్రదేవు రాజయ్యెను (క్రీ. శ. 1430). కళింగ దేశము అంతయు ఈ కపిలేంద్ర దేవుస్థాపించిన సూర్య వంశపు రాజుల అధికారము లోనికి వచ్చినది. ఇతని కుమాడురు పురుషోత్తముడు, మనుమడు ప్రతాప రుద్ర గజపతి తమ రాజ్యాధికారములను గోదావరి దాటి నెల్లూరు వరకున్నూ వ్యాపింప జేసుకొనిరి. ఈ ప్రతాప రుద్ర గజపతి, కృష్ణ దేవరాయల సమ కాలికుడు.

పశ్చిమ చాళుక్య వంశజుడైన రెండవ పులకేశి విజయముతో (క్రీ. శ. 615) వేగినాట చాళుక్యుల పాలకవంశము సుప్రతిష్ఠిత మయ్యెను. మూడవ శతాబ్దము నాటి నాగార్జున కొండ శాసనములలో 'చాళికిరమణులు' అని చెప్పబడి యుండుటచేత వీరి చరిత్ర 615 కి పూర్వమే ఆరంభమై యుండునని ఊహించవలసి యున్నది. ఏది ఎట్లైనను, చాళుక్యులు మొదటి పులకేశి కాలములో (క్రీ. శ. 543) ఉచ్చస్థితికి వచ్చియుందురు. పులకేశి రాజధాని వాతాపి లేక బాదామి. (ప్రస్తుతము బిజాపూరు జిల్లాలోనున్నది) మొదటి పులకేశి తరువాత పాలకులైన అతని కుమారులు కీర్తివర్మ, మంగళేశులు

పశ్చిమ చాళుక్యుల ప్రశంస క్రీ. శ. 6—7 వ శతాబ్దము.

(క్రీ. శ. 566) తమ రాజ్యాధికారముల పెంపొందించు కొనిరి. మంగళేశుడు చేది దేశమును పాలించు చుండిన కాలచూర్యులను జయించెను. మంగళేశుని తరువాత రాజ్యమునకు వచ్చిన వాడు పైన పేర్కొనబడిన రెండవ పులకేశి. రెండవ పులకేశి, తన దండ యాత్రలలో కుడి భుజమువలె పని చేసిన తన తమ్ముని కుబ్జవిష్ణు వర్ధనుని, తాను జయించిన *వేంగి దేశమునకు ప్రతినిధిగా నియమించి దేశ పాలనము కావించు కొను చుండెను. త్వరలో ఈ కుబ్జ విష్ణు వర్ధనుడు స్వతంత్రుడై (క్రీ॥ శ॥ 630) తూర్పు చాళుక్య వంశమునకు మూల పురుషుడయ్యెను.

ఈ కుబ్జవిష్ణువర్ధనుని శాసనములు దిమిలి సీమలో గానవచ్చుచున్నందున, ఇతని రాజధాని, విశాఖ జిల్లాలోని సర్వసిద్ధి తాలూకా వరకూ వ్యాపించి యుండెనని ఊహించుట కవకాశమున్నది !

కుబ్జ విష్ణు వర్ధనుని తరువాత జయసింహుడు రాజ్యమునకు వచ్చెను. అతని రాజ్యము సింహాచలము మొదలుకొని నెల్లూరి మండలము వరకున్నూ వ్యాపించెను. ఇతని తరువాత ఇంద్ర భట్టారకుడు, విష్ణు వర్ధనుడు, మంగి యువరాజు,జయసింహుడు, కొక్కిలి రాజు, విష్ణు వర్ధనుడు, విజయాదిత్యుడు అను ఏడుగురు వరుసగా పరిపాలించిరి.

తూర్పు చాళుక్యులు క్రీ. శ. 630—1232

వీరి తరువాత విష్ణువర్ధనుడు(క్రీ. శ. 764—796), విజయాదిత్యుడు (క్రీ. శ. 799-843) పరిపాలించిరి.విజయాదిత్యుడు గంగ దేశము నేలిన రాష్ట్రకూట రాజులను నిర్జించెను. విజయాదిత్యుని తరువాత అతని కుమారుడు విష్ణువర్ధనుడు (843—844) రాజాయెను. తరువాత క్రీ. శ. 844 మొదలు 888 వఱకు పరిపాలించిన రాజు గణకవిజయాదిత్యుడు.

ఈ రాజులలో పదునాల్గవ వాడు చాళుక్య భీముడు. ఈయన 888 లో రాజ్యమునకు వచ్చి 30 సంవత్సరములు పరిపాలించెను. ఇతని పుత్రుడు విజయాదిత్యుడు కళింగము నేలుచుండిన రాజులను జయించెను. 918 లో రాజైన అమ్మరాజ విష్ణు వర్ధనుడు, 925 వరకు పరిపాలించెను.

ఈ రాజ్యమునకు సుమారు 300 సంవత్సములనుండియు ముఖ్య పట్నముగా యుండిన వేంగీ పురమును ఇతడు వదలి, గోదావరి యొడ్డున నొక పురము*నిర్మించుకొని, తన రాజధానిగా చేసి కొనెను. ఇతని తరువాత రాజ్యమునకు వచ్చిన వారిలో విమలాదిత్యుడు, రాజరాజ నరేంద్రుడు మొదలైన వారు చెప్ప దగినవారు.

విమలాదిత్యుడు క్రీ. శ. 1015-1022 వరకు రాజ్యము చేసెను. ఈ విమలాదిత్యుడు, చోళ రాజైన రాజేంద్రచోళుని సోదరి కుందమాంబా దేవిని పరిణయమాడెను. ఈ దంపతులకు జనించిన వాడే ఆంధ్ర భారతమ కృతినందిన రాజరాజ నరేంద్రుడు. కోరుమల్లి, నందంపూడి శాసనముల బట్టి, రాజరాజు 1022 లో రాజ్యమునకు వచ్చినట్లు

నన్నయాంధ్ర భారత కృతిభర్త రాజరాజ నరేంద్రుడు. క్రీ. శ. 1022 - 1063.

* వేగినాడు కృష్ణా గోదావరీ నదులకు, పూర్వ సముద్ర మహేంద్ర పర్వతములకును మధ్యనున్న ప్రదేశము.

* ఇతనికి రాజమహేంద్రుడను బిరుదు కలదు గనుక ఈ పురమునకు రాజమహేంద్రవరమను పేరు వచ్చినది.

విస్పష్ట మగుచున్నది. ఈయన కావ్యగీతి ప్రియుడు, వీర వతంసుడు.

రాజ మహేంద్రవరము వేగీ రాజ్య మధ్య స్థమై యున్నది. ఇది, ఇతని రాజధాని. రాజ మహేంద్రవరము అమ్మరాజవిష్ణువర్ధనుని కాలముననో, రాజరాజు కాలముననో కట్టబడి యుండును. రాజరాజునకు, ధారానగరము రాజ ధానిగా మాళవ దేశము నేలిన భోజమహా రాజు సమకాలికుడు. ఈ రాజరాజు తన మేన మామ రాజేంద్ర చోళుని కుమార్తె అమ్మంగ దేవిని వివాహ మాడెను. రాజరాజు తరువాత అతని కుమారుడు కులోత్తుంగచోళదేవుడు పట్టాభిషిక్తు డయ్యెను.

ఈ కులోత్తుంగచోళదేవుడు రాజేంద్ర చోళుని కూతురైన మధురాంతకదేవిని పరిణయమాడెను. ఇతడు వేగీదేశ పాలకు డైన మొదటి సంవత్సర ముననే చోళ రాజ్యము కూడా ఇతనికి సంక్ర మించెను. తరువాత, తన రాజధానిని ఇతడు చోళ దేశమునకు మార్చుకొని, తూర్పు చాళుక్య రా జ్యాధికారము తన పినతండ్రియైన విజయాదిత్యు నికి ఒప్పగించెను. ఈ విజయాదిత్యుడు వేగి దేశ మున 15 సంవత్సరములు రాజ్యము చేసెను. అటు తరువాత కులోత్తుంగుని రెండవ కుమా రుడు రాజరాజున్నూ, పిమ్మట రాజరాజు తమ్ముడు వీరచోళదేవుడున్నూ (1078-1100) వేగి దేశాధి పత్యము వహించిరి. ఈ కులోత్తుంగచోళ దేవుని కుమార్తెయే, ఇదివరలో చెప్పిన కళింగ రాజైన రాజరాజు భార్య రాజసుందరి.

చోళ - చాళుక్య రాజ్యముల కధినా థుడయిన కులోత్తుంగచోళదేవుని (క్రీ. శ. 1076-1118) తరువాత రాజ్యము చేసినది విక్రమ చోళుడు. తరువాత అతని కుమారుడు రెండవ కులోత్తుంగచోళదేవుడు రాజ్యము చేసెను. పిమ్మట చాళుక్యచోడుల అధికారము క్రింద గుంటూరు మండలములోని చందవోలు ప్రాంత ప్రదేశములలో పాలకులు గానుండి, వేంగీ దేశమును గూడ తమ అధికారము లోనికి తెచ్చుకొని, చతుర్థాన్వయ కులజులమని చెప్పు కొని ఒక చోళ శాఖీయులు కొంతకాలము పరిపాలించిరి. వారే వెలనాటి చోళులు. చాళుక్య చోడులకున్నూ, వెలనాటిచోళులకున్నూ లోబడి, కోనమండలము నేలిన రాజవంశమునకు హైహ యవంశమని పేరు. ఈ కోన సీమ రాజుల శాసనములు క్రీ॥ శ॥ 1112 మొదలు 1206 వరకును కనిపించు చున్నవి.

ఈ మధ్య కాలములో, చోళ తిక్కరాజు నెల్లూరు నగరమున పాలించు చుండెను. ఈ వీర భూపతి ద్రవిడ కర్నాటక సేనల దునిమి, కాంచీ పురి కేలికయై, ఆంధ్ర, చోళ ప్రదేశములను పాలిం చెను. ఈ రాజు తరువాత, ఇతని కుమారుడు మనుమసిద్ధి రాజ్యాధిపత్యము వహించెను. ఈ మనుమసిద్ధి ఆస్థానమును ఉభయకవిమిత్రుడని వాసికెక్కిన తిక్కనామాత్యుడు అలంకరిం చెను.

1278 లో కృష్ణా, గోదావరీ నదుల మధ్య దేశమంతయు కాకతి రాజుల వశమైనది.

చాళుక్య సామ్రాజ్య పతనానంతరము, వారి సామంత మాండలిక రాజులు ప్రబలులైరి. అట్టి వారిలో కాకతీయులు అగ్రగణ్యులు. వీరికి నేటి నైజాం మండలము నందలి ఓరుగల్లు లేక ఒరం గల్లు రాజధాని. చరిత్ర ప్రసిద్ధమగు ఈ కాకతీయ రాజవంశము 10 వ. శతాబ్దముననే నెలకొన్నది.



దేవదత్తుడు బుద్ధుని చంపబూనుట; 2వ శతాబ్దము, సాతవాహనులనాటి శిల్పము; గుంటూరు జిల్లా, అమరావతి వేదికనుండి.

[ఈ రెండు బొమ్మలు మద్రాసు గవర్నమెంటు మ్యూజియమువారి అనుమతిని.]



అమరావతి స్తూపము; 3వ శతాబ్దము, సాతవాహనుల నాటి శిల్పము; అమరావతి, గుంటూరు జిల్లా.



1



2



3

1. ద్వారపాలకుడు; తూర్పు చాళుక్యుల నాటి శిల్పము; వేగిరాజు శిల్పిచే చేయబడినదని దీని వెనుకనుండు శాసనము తెల్పుచున్నది. 7వ శతాబ్దము; బెజవాడ, కృష్ణా జిల్లా.

2. మహిషాసురమర్దని; కాకతీయుల నాటి శిల్పము, 12 వ శతాబ్దము; త్రిపురాంతకము, కర్నూలు జిల్లా.

3. బాలకృష్ణుడు. ఈ విగ్రహమును కృష్ణదేవరాయలు ఉదయగిరి నుండి విజయముతో గొనివచ్చి, దీనికి హంపియందు దేవాలయము కట్టి, ఆ మహోత్సవమున బాలకృష్ణాంకిత నాణెములు జేయించి వెల్లడిజేసెను. విజయనగరరాజుల నాటి శిల్పము, 16వ శతాబ్దము; హంపి, బళ్లారి జిల్లా.

[ఈ బొమ్మలు మద్రాసు గవర్నమెంటు మ్యూజియము వారి అనుమతిని.]

ఈ ఓరుగంటి రాజులు సుమారు ఒకటిన్నర శతాబ్దముల కాలము పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా నుండిరి. అయిననూ, ఈ వంశ జులలో కాకతి ప్రోలరాజు విజృంభించి, పశ్చిమ చాళుక్య వంశజుడైన తైలపదేవు నోడించి, స్వతంత్రుడయ్యెను. ప్రోలుని పరిపాలనా కాలముననే కాకతీయులు స్వతంత్రులై, తమ రాజ్యాధి కారము విస్తరింప జేసికొని యుందురు.

కాకతీయ ప్రభువులు-వారి పరిపాలన క్రీ. శ. 1089—1323

ఈ ప్రోలరాజునకు పూర్వము మొదటి బేటరాజు, ప్రోలరాజు, రెండవ త్రిభువన మల్లబేటరాజులు రాజ్యము చేసిరి. త్రిభువన మల్లుడు ప్రోలరాజు తండ్రి. కాకతీయ చరిత్రకు సంబంధించిన ప్రథమ శాసనా కాలము క్రీ॥ శ॥ 1089 అని నిర్ణయించబడినది. వీరు రెండున్నర శతాబ్దముల కాలము నిరాతంకముగా పరిపాలించిరి.

మొదటి కాకతి రాజులు ఒరంగల్లు పరిసరములలో పరిపాలించిరి. రెండవ ప్రోలుని కాలములో, నేటి నైజాం మండలములోని తెలింగాణము నంతయూ తమ అధికారము లోనికి తెచ్చుకొనిరి. ప్రోలుని తరువాత అతని రెండవ కుమారుడైన రుద్రుడు క్రీ॥ శ॥ 1159-1195 వఱకు పరిపాలించెను. ఈయన రాజ్యపు టెల్లలు తూర్పున సముద్రము వరకున్నూ, దక్షిణమున శ్రీశైలము వరకున్నూ వ్యాపించెను. దేవగిరి యాదవులకు ఉత్తరముననూ, పశ్చిమముననూ ఒక చాళుక్య మాండలిక వంశమువారు పరిపాలించు చుండిరి. వీరు కాకతీయ రాజ్య విస్తరణమునకు ప్రత్యర్థులుగా నుండిరి. రుద్రుని తరువాత మహాదేవుడు రాజాయెను. ఈయన నాల్గు సంవత్సరములు పరిపాలించెను. తరువాత యాదవ యుద్ధములలో విజయుడైన కాకతి గణపతి రాజ్యమునకు వచ్చెను. ఇతని రాజ్యాధికారము చెంగల్పట్టు జిల్లాలోని కంజీవరము వరకున్నూ, తిరుచునాపల్లి జిల్లాలోని జాంబై వరకున్నూ వ్యాపించి యుండెను. ఈ కాలమున దక్షిణ హిందూ దేశమున అనేకులు చిన్నచిన్న రాజులు పరిపాలనము చేయు చుండిరి. విక్రమ సింహపురము లేక నెల్లూరి రాజైన మనుమ సిద్ధికిన్నీ, అతని వంశజులలో కొందరికిన్నీ వచ్చిన తగాదాలలో గణపతి దేవుడు జోక్యము కలిగించుకొని, మనుమసిద్ధికి తోడ్పడెను. గణపతి రుద్రుని తరువాత, ఆయన చేతిక్రింద రాచకార్య నిర్వహణములో సుశిక్షితురాలైన ఆయన కుమార్తె రుద్రమదేవి రాజ్యాధికారము స్వీకరించెను. గణపతి రుద్రుని కాలమున ఢిల్లీలో సుల్తానా రజియా పరిపాలించు చుండెను. అట్లే తన కుమార్తె రుద్రమ కూడా రాజ్యపాలన జేయునని గణపతి దేవుడు భావించెనేమో! రుద్రమ అసమాన ప్రజ్ఞాధురీణ, వీర వనిత! పురుష వేషధారియై రాచకార్యముల నిర్వర్తించు చుండెను. రుద్రమతో, యాదవ రాజున్నూ, స్త్రీ పరిపాలన నంగీకరించని ఒకరిద్దరు మాండలిక రాజులున్నూ, విరోధము వహించి యున్నప్పటికీ ఆమె, రాజ్యమున శాంతి భద్రతలు కాపాడ గలిగెను. రుద్రమ తరువాత, ఆమె మనుమడు ప్రతాపరుద్రుడు రాజ్యమునకు వచ్చెను. ఈ ప్రతాపరుద్రుడే కాకతి రాజులలో కడపటి స్వతంత్ర పాలకుడు. ఈ రాజన్య చూడామణికి ఢిల్లీ సామ్రాజ్యము ప్రతిస్పర్థియై

నది. ఈయన దక్షిణమున అనేక రాజులను జయించి కీర్తివంతుడైనప్పటికీ, ఉత్తరమున ఢిల్లీ సమ్రాట్టుల నణచ లేక పోయెను. సురక్షితమైన ఒరంగల్లు దుర్గ ప్రాకారాంతర్భాగములనుండి వీరు మహమ్మదీయ దండయాత్రల కొంతకాల మెదుర్కొనిరి. కానీ, తుదకు దైవదుర్విపాక మువలన విజయశీలుడైన ప్రతాపరుద్రుడు క్రీ॥ శ॥ 1323 లో మహమ్మదీయులకు బందీయై ఢిల్లీకి కొనిపోబడుచుండగా, ఓటమి భరింపజాలక ఆత్మహత్య గావించుకొని పారతంత్ర్యాగ్నికి ప్రాణాహుతి నిచ్చెను. ఈ కాకతి రాజులు 11 వ. శతాబ్దము నుండి 14 వ శతాబ్దము వరకును ఏలిరి. వీర లేలినకాలము మన దేశ చరిత్రలో 'క్రొత్త ప్రాతల మేలి కలయిక'; నవోదయమునకు తొలిరేక దిద్దినది వీరి రాచరికమే!

కాకతీయుల పరిపాలనములో అనేక విధములైన మార్పులు వచ్చెను. లింగాయత, వీరశైవ మతములు విస్తరిల్లెను. జైన బౌద్ధములు గూడా ప్రజాదరణము కలిగి యుండెను. ప్రజా సాహిత్యము అభివృద్ధి చెందెను. ప్రతాపరుద్రుని కాలములో కావ్యనాటకాఖ్యాయికాది రచయితలు వెలసిరి. విద్యానాథుని, 'ప్రతాపరుద్ర యశోభూషణ,' మానాటిదే! ప్రభుత్వ సౌధమునకు మూల స్తంభము సమ్రాట్టు! గ్రామ పంచాయితీలు కుశ్యములుగానుండెను. దేశమున వర్తక వ్యాపారములు బాగుగా జరుగుచుండెను.

అంతేగాక తెలుగువర్తకులు, అరబ్బులు మొదలైన పాశ్చాత్య వర్తకులతో పోటీచేసి విదేశములతో వర్తక వాణిజ్యముల సాగించుచుండిరి. 'చౌ—జూ—క్వా' (Chau-ju-kua) అను చైనా గ్రంథమున, తెలుగు దేశపు తూర్పు కోస్తాలో విస్తారముగా వర్తకము జరుగుచుండెనని వ్రాయబడి యున్నది. గుంటూరు జిల్లాలోని మోటుపల్లి, తూర్పు తీరపు రేవు పట్నము. వర్తక సంఘములు గూడా యున్నట్లు ఆనాటి శాసనములందు సూచింపబడి యుండుటచే ఆకాలపు ఆంధ్ర దేశ ప్రాభవము ఊహించుకొన వచ్చును.

సహస్ర కిరణములతో విరాజిల్లిన కాకతి ప్రభ అంతరించి, రెడ్డి గాథలలో విద్యారణ్యుని తపోదీప్తిలో మరల ప్రభవించినది.

క్రీ. శ. 1323 తరువాత కాకతి సామ్రాజ్య మస్తమించి మహమ్మదీయులు విజృంభించిరి. తరువాత మహమ్మదీయులు ఓరుగల్లు మొదలు, రాజమహేంద్రవరము వరకును గల ప్రదేశమును కొల్లగొట్టుచు, దండయాత్రల గావించుచుండిరి. చివరకు వీరు రాజమహేంద్రవర దుర్గమును గూడా ముట్టడించిరి. ఈ రాజమహేంద్రవర దుర్గము మహమ్మదీయుల చేతిలో ఎంత కాలమో యుండ లేదు. మంచికొండ కూనపనాయకుడను వీరవరుడు ప్రోలయ నాయని సాయముతో రాజమహేంద్రవర దుర్గమును మహమ్మదీయుల నుండి లాగికొనెను. కూనప నాయకుడు కోరుకొండ వద్ద ఒక దుర్గమును నిర్మించి, ప్రజాపరిపాలన చేయుచుండెను. విజయ వాటికకును, రాజమహేంద్ర వరమునకును మధ్యస్థమైయున్న దేశము కాకతిరాజ వంశస్థులు పాలించుచుండిరి. ప్రతాప రుద్ర చక్రవర్తి సేనానిగానుండిన దొడ్డారెడ్డి బంధువు

**రెడ్డి రాజులు**
**క్రీ. శ. 1323-1450**
**వరకు**

ప్రోలయ వేమారెడ్డి, కృష్ణానదికి దక్షిణ భాగము నందున్న కొండవీడు, వినుకొండ రాజ్యముల కధినాథుడై, అద్దంకి ముఖ్య పట్టముగా ఏలుచుండెను. ఓరుగల్లునకున్నూ శ్రీశైలమునకున్నూ నడుమనుండు ప్రదేశమును దేవరకొండ, రాచకొండ, దుర్గములలో నివసించుచు రేచెర్ల సింగమ నాయడు పరిపాలించుచుండెను. రెడ్డి రాజుల అధికారము మొత్తము మీద నెల్లూరు జిల్లాలోని కందుకూరు మొదలు, చిలక సముద్రము వరకున్నూ, పడమట కర్నూలు, శ్రీశైల ప్రాంత మంతయున్నూ, కృష్ణకు దక్షిణ భాగ మంతయున్నూ, వ్యాపించి యుండెను.

దక్షిణ దేశమందలి భామినీ రాజ్యము క్రీ. శ. 1347-1556

పిమ్మట, క్రీ॥ శ॥ 1347 లో మహమ్మద్-బీన్-తుఘ్లుక్ కొలువులో సేనాధిపతిగా యుండిన హసన్ భామన్ అను తురుష్కుడు కల్బర్గులో ఒక రాజ్యమును స్థాపించి దానికి భామినీ* రాజ్యమని పేరు పెట్టెను. ఈ రాజ్య స్థాపకుడు 1358 లో చనిపోయి నప్పటికి, ఉత్తరమున పెన్గంగ మొదలు కొని దక్షిణమున కృష్ణానది వరకును, తూర్పున భువనగిరి మొదలు కొని, పడమట సముద్ర తీరము వరకున్నూ భామినీ రాజ్యము విస్తరించెను. కృష్ణానదికి దక్షిణ భాగమున ఈ కాలముననే వెలసిన విజయనగర సమ్రాట్టులకున్నూ, 1360 తరువాత ఏలిన భామినీ సుల్తానులకున్నూ అనేక ఘోర యుద్ధములు జరిగినవి. విజయనగర సామ్రాజ్య స్థాపన, వికాసములలో స్వర్ణపుటలను లిఖించు కొన్న ఆంధ్ర దేశ చరిత్రము తెలుసుకొన దగినది!

హిందూ మహమ్మదీయ సంఘర్షణము

మహమ్మదీయులు దక్షిణహిందూ దేశము నాక్రమించుట ప్రారభించినది మొదలు, దక్షిణ హిందూ దేశమునందలి ప్రజా సామాన్యము నందు నూతన ఆశయములు ఉదయింప నారంభించెను. అసలు, దక్షిణ హిందూ దేశస్థులు విదేశీయుల దండయాత్రలకు అంత అధికముగా గురి కాలేదు. ఆంధ్ర శాతవాహనుల కాలమున, శాతవాహన సామ్రాజ్యము యొక్క పశ్చిమోత్తర భాగములను శకులు జయించి ఆక్రమించు కొన్నప్పటికిన్నీ, వారి పాలన క్రింద ఆంధ్రులు ఎంత కాలమో యుండ లేదు. మహమ్మదీయులు దక్షిణ హిందూ దేశము నందు విజేతలై రాజ్యాధి కారము నిర్వహింప బూనుకొనుటలో, తమ ఆచార వ్యవహారములకు, అభిప్రాయములకు విముఖులైన హిందువులతో వైరమేర్పడినది. మహమ్మదీయులు రాక పూర్వము దక్షిణ హిందూ దేశమున యుద్ధములు జరుగక పోలేదు. యుద్ధములు జరిగినవి; అనేక కష్టనష్టములు వాటిల్లినవి. కానీ, ఆ యుద్ధములలో పాల్గొనిన ఇరు కక్ష్యముల వారున్నూ హిందూ ధర్మావలంబకులే! కొన్నికొన్ని స్వల్ప భేదములుండిననూ, అందరునూ వేదములందు పరిపూర్ణనమ్మకము, గోబ్రాహ్మణులందు గౌరవము, సనాతన ధర్మమునందు

* 1489-1518 లలో ఈ భామినీ రాజ్యము 5 వేరు వేరు చిన్న రాజ్యములుగా విభక్తమై పోయినది. అవి బిజాపూర్, బీదర్, అహమ్మద్ నగర్, గోల్కొండ, బేరారులు. గొల్కొండ రాజ్యము తెలుగునాట విస్తరించెను.

అభిరుచి, భూతదయాది సద్గుణసంపత్తియందు ఆకాంక్ష కలవారే! కానీ, మహమ్మదీయులన్న వేరు. వీరి అభిప్రాయములకున్నూ పై చెప్పినట్లు హిందువుల యభిప్రాయములకున్నూ హస్తిమసి కాంతరము గలదు. మహమ్మదీయ దండయాత్ర కేవలము రాజకీయ దండయాత్రయే కాదు; హిందూ మతముపైనను, ధర్మముపైనను, సంస్కృతి పైనను గావించబడిన దండయాత్ర. ఎట్టి నూతనాభిప్రాయములనో, ఎట్టి దురవగాహా విశేషములనో, అవగాహనము చేసుకొని, తనయందు లీనమొనర్చుకొన్న హైందవ ప్రపంచము ఇప్పుడు ఈ చంద్రధ్వజులధాటి నెదుర్కొన లేక పోయెను.

ఈ అంశము జన సామాన్యమునకు బోధపడు నంతలోనే అనల్పదేశము మహమ్మదీయుల వశమాయెను. దేవగిరి రాజ్యము మొదట సామంత రాజ్యముగను, క్రమక్రమముగా అంతకంతకు మహమ్మదీయ అధికారము అధికమై, చివరకు మహమ్మదీయ సామ్రాజ్యాంతర్భాగముగాను మారిపోయెను. కాకతీయుల ఒరంగల్లు కూడా క్రీ॥ శ॥ 1326 నాటికి మహమ్మదీయుల సంపూర్ణాధికారము క్రిందికి వచ్చెను. మహమ్మద్ తుఘ్లుక్ ఈ భాగము నంతటినీ మండల ద్వయముగా విభజించి, తూర్పు మండలమగు ఆంధ్ర దేశమునకు మలిక్‌మక్బల్ అను రాజ ప్రతినిధిని నియమించెను.

ఇట్టి స్థితికి ఆంధ్ర వీరులు వచ్చుటకు పరస్పర వైమనస్యములు, అంతఃకలహములే కారణము. హిందూధర్మసేవానిరతులైన కాకతీయులు, వారి అనుయాయులు అంతరించి పోయిరి. హిందూధర్మ మడుగంటి పోకుండా సంరక్షించుటకు, హైందవప్రభ పునరుజ్జీవింప జేయుటకు, ఆంధ్ర యోధులు, నాయకులు-హిందూ ధర్మ ప్రతిష్ఠాపకులనిపించు కొనుటకు తరుణము వచ్చినది! ప్రోలయ నాయకుడు, కాపయ నాయకుడు, ప్రోలయ వేమారెడ్డి, హరిహరుడు, సంగముడు మొదలైన ఆంధ్ర వీరులు అనేకులు విజృంభించి నడుములు కట్టి, కార్యమునకు గడంగిరి. దేశమున ఆందోళన బయలు దేరెను. కత్తిపట్ట గలిగిన మగవారందరున్నూ హిందూ మతోద్ధరణమునకు బయలు దేరిరి. కర్మ భూమి యనిపించుకున్న భరత ఖండమంతటికిన్నీ ఆంధ్ర దేశమే హిందూ మతోద్ధరణమునకు పూనుకొనవలసి వచ్చెను. కర్నాటక రాజైన హొయిసలబల్లాలుడు కూడా హిందూ ధర్మ స్థాపనమునకు బద్ధకంకణుడై యుండినది వాస్తవమేగాని, అతనియందు ధార్మిక దీక్షకన్న రాజ్య కాంక్ష అధికముగా నుండెను. హిందూ ధర్మ ప్రతిష్ఠాపనమునందలి ఆకాంక్షకన్న స్వాతంత్ర్య ప్రతిపాదనాభిరతి మెండు. ఆంధ్రుల దృష్టి యది కాదు. వారిని రాజకీయముల కన్న ధార్మిక చింతనయే పురి కొల్పినది. హిందూదేశపు మహమ్మదీయ రాజప్రతినిధి ఈ వీరవిజయని నాదములకు త్రుళ్లిపడి పలాయన మంత్రము పఠించెను. ఢిల్లీ సుల్తానుల కాశ్చర్యము కల్గినది. అయిననూ మహమ్మద్ తుఘ్లుక్ ఈ వీర పరాక్రమ మెరుగనివాడు కాడు. యువరాజుగా నున్నప్పుడు స్వయముగనే ఆంధ్రుల పైకిదాడి వెడలి, ఆంధ్రుల ధాటికి తన సేనలు తాళ లేక వెనుకకు మరలి నప్పుడు ఎన్నిమారులు విస్మయము చెంద లేదు! చివరకెట్లో తెలింగాణమును జయించి నప్పటికిన్నీ, సామ్రాజ్యమున

కేకచ్ఛత్రాధిపతి యైనప్పటికీ, ఉత్తర హిందూ స్థానమును వదలి, పారంపర్యముగా వచ్చు చున్న ఢిల్లీ రాజ నివాసమును వదలి దేవగిరి కేలవచ్చెను ? ఇందలి అంతరార్థమంతయు మహమ్మదు చక్కగా నెరిగినదే! అతను స్వయముగా సంకల్పించుకొని, ఆంధ్రుల నెదిరింప యత్నించినను జయము కలుగునన్న నమ్మక మతనికి లేకుండెను. దీనికితోడు అతనికి రాజకీయముగా అనేక చిక్కులు ఏర్పడెను. అతనికి ఉత్తర దేశమును విడుచుటకు వీలు లేకుండెను. అందుకై అతడొక యుక్తిని పన్నెను. 'దొంగను దొంగయే పట్టవలెను' అను నానుడిని బట్టి, ఈ కార్యమున కొక ఆంధ్రుని నియోగించుటే ఉచిత మనుకొనెను. అంతకన్న ఉత్తమ మార్గమతనికి తోచలేదు.

అందుకై తనకు ఖైదీలుగా నుండిన హరిహర బుక్కరాయల పిలపించి, వారి నీ కార్యమున నియుక్తుల చేసెను. ఈ యిరువురు సోదరులు రాజనీతి ననుసరించి మహమ్మదుకు తాత్కాలికముగా లోబడిననూ, తమ జీవిత పరమావధిని విడువలేదు. వీరు హిందూ ధర్మ ప్రతిష్ఠాపనాతత్పరులై సమయమునకు వెదకు చుండిరి! అందు వలననే, వీరు మహమ్మదు తలచిన విధముగా ఆంధ్ర దేశమును స్వాధీన పరచుకొన గలిగి నప్పటికిన్నీ, మహమ్మదునకు లోబడి యుండనందున వీరిని కృతఘ్నులనీ, ద్రోహులనీ మహమ్మదీయ చరిత్ర కారులు నిందించుచున్నారు.

ఆంధ్రదేశ పునర్విజృంభణమున్నూ, దక్షిణ దేశమున హిందూ ధర్మమును సుస్థిరము చేయుటయున్నూ పరమావధిగా నెంచి, అఖండ వైభవోపేతముగా మూడు శతాబ్దముల కన్న అధికముగా వర్ధిల్లిన విజయనగర సామ్రాజ్యమును స్థాపించి, దాని

**విజయనగర సామ్రాజ్య స్థాపన క్రీ. శ. 1336**

నాసోదరులు ప్రతిష్ఠించిరి. హరిహరుడు, బుక్కడే గాక వీరికి ముగ్గురు తమ్ములు గలరు. ఈ అయిదుగురును రాజ్యమునకు, దాని అభివృద్ధికి పాటుబడిరి. గాని, వారిలో జ్యేష్ఠులైన హరి హరుడు, అతని తర్వాత బుక్కడు మాత్రమే సింహాన మధిష్ఠించిరి.

హరిహరరాయలుకు, బుక్కరాయలుకు, కుడి భుజములవలె మాధవాచార్యులు, సాయనాచార్యులు మంత్రాంగము వహించి రాచకార్యముల నిర్వహించు చుండిరి. మాధవాచార్యులకు విద్యారణ్యులని మరియొక పేరు గలదు. హరిహరరాయలు విద్యారణ్యుని పేర విద్యానగరమును కట్టించెను. ఆ పేరు క్రమముగా విజయనగరమైనది. ఇంతే కాక బుక్కరాయల కాలములో క్రీ॥ శ॥ 1344-45 సం॥ లిఖియింపబడిన శాసనములో "విద్యాభిధాన నగరీ విజయోన్నతశాలినీ, విద్యారణ్య కృతాతస్యాం రత్నసింహాసనేస్థితః" అను వాక్యములు కనుపించు చున్నందున, విద్యా నగరము విద్యారణ్య కృతమని స్పష్టమగు చున్నది. హరిహరరాయల తరువాత బుక్కరాయలు రాజ్యమునకు వచ్చెను. బుక్కరాయలు కృష్ణానదికి దక్షిణమందుగల దేశము నేలెను. క్రీ. శ. 1399-1406 వరకునూ రెండవ బుక్క- రాయలు రాజ్యమేలెను. క్రీ. శ. 1421—1448 లో రాజ్యమేలు చుండిన ప్రౌఢదేవరాయల కాలములో

నికోలై కోంటీ (ఇటలీ యాత్రికుడు), అబ్దుర్ రజాక్ (హీరట్ దేశస్థుడు) లు విజయ నగరము నకు వచ్చి, వారు చూచిన విషయములను గ్రంథస్థము చేసిరి. వారి వర్ణనముల బట్టి, విజయ నగ



విజయనగర సమ్రాట్టు శ్రీకృష్ణదేవరాయలు—అతని సతులు. (1509-1530).

రము 60 మైళ్ల చుట్టు కొలత, ఉత్తర ద్వారము నుండి దక్షిణ ద్వారమునకు 8 మైళ్లు పొడవు గలిగి యుండెననియు, నగరము మహా వైభవో పేతముగా నలరారుచుండెననియు తెలియు

చున్నది. హరిహర బుక్కరాయల వంశపు రాజులలో కడపటి వానిని, చంద్రగిరి మండలాధిపతియైన సాళువ నరసింహ రాయలు క్రీ॥ శ॥ 1486 లో రాజ్యమునుండి తొలగించి, తాను సింహాసన మెక్కి, సాళువ వంశమునకు మూల పురుషు డయ్యెను. క్రీ॥ శ॥ 1505 లో సాళువ వంశము వారిలో కడపటి రాజును తొలగించి, తుళువ వంశపు నరసనాయకుడు రాజ

య్యెను. ఈ తుళువ వంశపు రాజులలో ప్రబలుడై, క్రీ. శ. 1509 నుండి 1530 వరకు రాజ్యమేలిన శ్రీకృష్ణ దేవరాయలు ప్రఖ్యాత పురుషుడు. కృష్ణ దేవరాయలు, అతని రాజ్యమును గురించి అనేకులు వ్రాసియున్నారు. ఈ కృష్ణ దేవరాయల పాలన విజయనగరసామ్రాజ్య చరిత్రలోనే కాదు, దక్షిణ హిందూ దేశ చరిత్రకే స్వర్ణ తోరణమై అలరారినది. కృష్ణ దేవరాయలకు మంత్రి ప్రజ్ఞావంతుడు తిమ్మరుసు. ఇతడు విజేత. ఈతని ఆస్థానమున అష్టదిగ్గజములని పేరొందిన ఆంధ్రి కవిశేఖరులున్నూ, సంస్కృత, ద్రవిడ, కర్నాట భాషా కోవిదులున్నూ అలంకరించి యుండిరి. కృష్ణ దేవరాయలు పండితుడు, కవి. సుప్రసిద్ధ ప్రబంధము ఆముక్తమాల్యద ఆయన విరచించినదే! కృష్ణదేవరాయలు ఉత్కళ రాజైన ప్రతాపరుద్రగజపతి అధికారములోనున్న ఉదయగిరిని ముట్టడించి, దానిని తన అధీనము లోనికి తెచ్చుకొనెను. పిమ్మట కొండవీటి దుర్గమును ముట్టడించెను. తరువాత కొండపల్లిని స్వాధీన పరచు కొనెను. తరువాత ఉత్కళ రాజ సేనలను వెన్నంటి ప్రతాపరుద్రగజపతి నోడించి, సింహాచలము దగ్గరనున్న పోట్నూరికి సమీపమున తన జయస్తంభమును నాటించెను. అప్పుడు ఉత్కళ ప్రభువు గజపతి క్రీ. శ. 1518 లో కృష్ణ దేవరాయలతో సంధి చేసుకొని, తన కుమార్తెయైన అన్నపూర్ణాదేవిని కృష్ణదేవరాయల కిచ్చి వివాహము చేసెను.

శ్రీకృష్ణ దేవ రాయలు
క్రీ. శ. 1509-1530

బిజాపూరు సుల్తానులకున్నూ, విజయనగర రాజులకున్నూ కృష్ణా తుంగభద్రా నదుల మధ్యస్థమై యుండిన రాయచూరును గురించి యుద్ధములు జరుగు చుండెను. ఈ కాలములో రాయచూరు దుర్గమును, ఇస్మాయిల్ ఆదిల్ షా ముట్టడించి యుండుటచేత కృష్ణ దేవరాయలు క్రీ. శ. 1520 లో యుద్ధమునకు పోయి విజయుడై, కృష్ణా, తుంగభద్రా నదుల మధ్యనున్న రాజ్యమును తన అధికారము క్రిందికి తెచ్చు కొనెను. ఈ విధముగా యుద్ధములు చేసి, తన విజయనగర సామ్రాజ్యమును, గోదావరి, కృష్ణా, జిల్లాల లోను; కృష్ణా నదికి దక్షిణమునగల దేశము నందున్నూ వ్యాపింప జేసెను. కృష్ణదేవరాయలు గొప్ప శూరుడే కాక, కళాపోషకుడు, రాజ్యతంత్రప్రవీణుడు. క్రీ. శ. 1530 లో కృష్ణదేవరాయలు చనిపోయెను. 15-16 శతాబ్దములయందు ఆంధ్రి సామ్రాజ్యలక్ష్మి నర్తించినది. కృష్ణదేవరాయల పరిపాలనా కాలమున, ఆంధ్రి నాయకులు దక్షిణ ప్రదేశములకు పోయి, చోళ, పాండ్య రాజుల నోడించి, తంజావూరు, మధురలలో తమ పరిపాలన ఏర్పరచిరి. ఈ దక్షిణ నాయక పాలకులు విజయనగరేంద్రులకు సామంతులుగా నుండి, చాలాకాలము పరిపాలనము గావించిరి.

తరువాత అతని తమ్ముడైన అచ్యుతరాయలు రాజయ్యెను. ఇతని కాలములో రాయచూరు ప్రదేశమును బిజాపూరు సుల్తానులు స్వాధీనము చేసుకొనిరి. తరువాత అచ్యుతరాయల అన్న కుమారుడు సదాశివ రాయలు 1542 లో రాజ్యమునకు వచ్చెను. అతనికి రామరాజు, తిరుమల రాయలు, వేంకటాద్రి మంత్రులుగా నుండిరి. వీరిలో రామరాజే వాస్తవమైన మంత్రిగా వ్యవహరించు చుండెను. ఇతడు దక్కనుదేశ సుల్తానులలో ఒకరితో నొకరికి పోరాటముల కల్పించి, అందరిపైన తన అధికారము చలాయించు కొను చుండెను. కానీ, ఈ పన్నుగడ లెంత కాలమో సాగలేదు! ఈ సుల్తానులందరు ఏకమై క్రి. శ. 1565 లో తళ్లికోట, లేక రాక్షసతంగడి యని ప్రసిద్ధిచెందిన యుద్ధములో రామరాయల నోడించిరి. మహమ్మదీయుల

ఘాటికి తాళలేక బలిష్ఠమైన విజయనగర సామ్రాజ్య స్తంభము ఈ నాటికి ఛిన్నభిన్నములై పోయినది. యుద్ధమునందు పట్టుబడిన రామరాజుకు శిరచ్ఛేదనము గావించి, తురక లాతని తలను జెండాకొయ్యకు తగిలించిరి. యుద్ధమైన వెంటనే విజయనగర విధ్వంసము గావించిరి.

తళ్లికోట యుద్ధము క్రీ. శ. 1565

ఈ విజయనగర సామ్రాజ్య ప్రాభవము ఈ యుద్ధానంతరము క్షీణింప ప్రారంభించినది. తళ్లికోట యుద్ధము తరువాత రాజ్యమునకు వచ్చిన రాజులు, తమ రాజధానిని పెనుగొండకు మార్చుకొనిరి.

1565 తరువాత విజయనగర సామ్రాజ్యమును ఉన్నతికి తెచ్చినది, ఆర్వీటి వంశస్థులు తిరుమల రాయలు, శ్రీరంగరాయలు, వెంకటపతి రాయలు మొదలైనవారు. తిరుమల రాయలు తన రాజ్యమును పరిపాలనా సౌకర్యమునకై 3 భాగములుగా విభజించెను. తిరుమల రాయల తరువాత వెంకటపతి రాయలొక భాగమునకున్నూ, రామరాయలొక భాగమునకున్నూ, శ్రీరంగరాయలు ఒక భాగమునకున్నూ అధిపతులైరి.

తళ్లికోట తరువాతి చరిత్ర క్రీ. శ. 1465-1675

వెంకటపతి రాయలు చంద్రగిరిని, శ్రీరామ రాయలు శ్రీరంగ పట్టణమును, శ్రీరంగ రాయలు పెనుగొండ పట్టణమును రాజధానులుగా ఏర్పరచుకొని పరిపాలించిరి. కాని, శ్రీరంగ రాయలు, రామ రాయలు మృతిజెందిన పిదప వెంకటపతి ఈ 3 భాగముల అధికారమును వహించెను. ఒకరిద్దరు సామంతమాండలికులు వెంకటపతి యధికారము నొప్పుకొనక ప్రతిఘటించినను, సమర్థుడగు వెంకటపతి వారిని పరాజితుల గావించెను. అట్టి వారిలో ఒకడు లింగమ నాయకుడు. లింగమ నాయకుని జయించుటకే వెంకటపతి యితని ముఖ్యస్థలమగు వెల్లూరునకు వచ్చి 17 వ శ. లో కొన్ని సంవత్సరము లక్కడ నివసించుటచేత, ఇతనిని వెల్లూరి రాజని గూడా విదేశస్థులు పిలుచుచుండిరి. యితనికి మొదటి నుండియు చంద్రగిరి ముఖ్యపట్నమగుటచేత యితనిని చంద్రగిరి రాజందురు.

దురహంకృతులై, స్వామిద్రోహము చేసిన పాళెగార్లను వెంకటపతి లోబరచుకొని, మహమ్మదీయులతో విజయవంతముగా పోరాడి, తన సామ్రాజ్య విభవమును పునః ప్రతిష్ఠితము చేసెను. ఇతని కాలమున న్యాయము, శాంతి నెలకొనెను. మహమ్మదీయ దాడుల వలన, యుద్ధముల వలన క్షైణ్యము పొందిన వ్యవసాయమును, సిరిసంపదలను పెంపొందింప చేసెను. ఇతడు వీరవరుడే కాక, ప్రజానురంజకము



16వ శతాబ్దమున జీర్ణ విజయనగర సామ్రాజ్యమునేలిన చంద్రగిరి రాజుల దుర్గము.

గాపాలించిన మేటి! ఇతని కాలమున జీవచ్ఛవములవలెనున్న గ్రామ పంచాయితీ సంఘములు మరల పని చేయ నారంభించెను.

వెంకటపతి ఈ రీతిగా రాజ్యపాలనము నిర్వహించుచున్నను, తన తదనంతర మేమగునో యని యోచించుచునే యుండెను. వెంకటపతికి సంతానము లేకుండుటచేత అన్న కుమారుడైన శ్రీరంగ రాయని రాజుగా నియామకము చేసెను. కాని, గొబ్బూరి వంశమున జన్మించిన వెంకటపతి రాణియు, ఆమె సోదరుడు జగ్గరాయడును శ్రీరంగనికి దాసోహమనుట కొప్పుకొనలేదు. ఈ జగ్గరాయడు శ్రీరంగని తొలంగిప అందరిని కూడ గట్టుకొనెను. కాని, వెంకటగిరి ప్రభువంశ పూర్వీకుడైన వెలుగోటియాచమనాయడు దీనికి ప్రతిఘటించెను. దురదృష్టము! జగ్గరాయడు ఒక రోజున హఠాత్తుగా వచ్చి, రాయని సకుటుంబసపరివార సమేతముగా బంధించెను. యాచమనాయడు రాజకుమారులలో ఒకరినైనను కారాగార విముక్తుని జేసి రక్షింప ప్రయత్నించి, తుదకు ఒక బాలిక సహాయము చేత శ్రీరంగని పది సంవత్సరములు వయస్సుగల 'రామరాయడను' రెండవ కుమారుని తన వశము చేసికొన గలిగెను. జగ్గరాయడు యాచమ నాయని ప్రయత్నములకు వెరచి రాజ కుటుంబమును సంహరించెను! తరువాత జగ్గ రాయడు తన మాతులుని చక్రవర్తిగా ప్రకటించి నందున, యాచమనాయడు శ్రీరంగని పుత్రుడైన రామరాయని చక్రవర్తిగా ప్రకటించి, జగ్గ రాయనితో యుద్ధమునకు గడంగెను. ఈ యుద్ధము కావేరికి దక్షిణమునను, ఆనకట్టకు సమీపములోను ఉన్న తోపూరు వద్ద రెండు సంవత్సరములు జరిగినది. ఇందు జగ్గరాయడు మృతి నొందెను. రామ రాయనికి సహాయము చేసిన వారిలో తంజావూరికి అధినాథుడైన రఘునాథరాయడను సామంత మాండలికుడు ఒకడు. యాచమనాయడు రామరాయనికి కుంభకోణమునందు పట్టాభిషిక్తుని జేసెను. ఈ రామ రాయలు 1617 మొదలు 1638 వరకును రాజ్యమేలెను.

రామరాయడు సింహాసన మెక్కినప్పుడు తంజావూరి నాయకుడు, యాచమ నాయడు, ఇంకొకరిద్దరు తప్ప, అందరును శత్రు పక్షావలంబులుగా నుండిరి. రామ రాయడు వారందరినీ వశీకృతము జేసికొనుటకు తన రాజ్యావసానము వరకు ప్రయత్నించుచునే యుండెను. మధుర నాయకుడును, జింజి నాయకుడును యితని నెదిరించిన వారిలో అగ్రేసరులు. జగ్గరాయని తమ్ముడగు యతిరాజు కూడా రామ రాయనికి శత్రువుగానే యుండెను.

రామరాయడు కడునేర్పరి. యతిరాజుతో మైత్రిగల్పించుకొని, అతని కుమార్తెను తన ద్వితీయ పత్నిగా పరిగ్రహించి, క్రమముగా తన అధికారమును వ్యాపింప జేసి కొనుచు, క్రీ. శ. 1629 నాటికి విచ్ఛిన్నమై పోయిన తన సామ్రాజ్యములోని చాల ప్రదేశము నాక్రమించు కొనెను. 1624 లో బిజాపుర సుల్తానులకు స్వాధీనమై పోయిన కర్నూలును మరల రాబట్టు కొనవలసి యుండెను. కానీ 1630 లో ఇతని మృతి సంభవించుటచేత ఈపని నెరవేర లేదు.

రామరాయలకు గూడా సంతానము లేక పోవుటచేత అతనిచే నియోగింపబడిన పెదవెంకటపతి రాయలు రాజయ్యెను. గానీ, ఈ పెద వెంకటపతి రాయలకున్నూ, రామ రాయలకు పినతండ్రియగు తిమ్మరాజుకున్నూ రాజ్యాధికారమునకై పోరాటము జరిగెను. క్రీ. శ. 1635 లో తిమ్మరాజు మృతినొందగా, వెంకట రాయలు నిరాటంకముగా వెల్లూరు ముఖ్య పట్నముగా రాజ్యము చేయసాగెను.

కానీ, తన అన్న కుమారుడగు శ్రీరంగరాయలకున్నూ తనకున్నూ వైరము లేర్పడుటచేత

వెంకటపతిరాయల కాలములో బిజాపూరు సుల్తానులు 1638 లోను, 1641 లోను అతని రాజ్యము పైకి దండెత్తి వచ్చుటకు కారణమయ్యెను. వెంకటపతిరాయలు వారికి అధికముగా ధనమిచ్చి, చేయునది లేక మొదటి సారి సంధి గావించుకొనెను (1638). రెండవమారు దక్షిణదేశ నాయకులు ఇతనికి సహాయము చేసినందున శత్రువును పారద్రోల గల్గెను. కానీ, నానాటికి కష్టములు వెంకటపతి రాయల కధికములగు చుండెను. ఈ తరుణముననే, గోల్కొండ నవాబు ఆంధ్ర దేశమందలి కోస్తా ప్రాంతమంతయు ఆక్రమించు కొనెను. తుదకు విసుగు చెంది, తన సిరిసంపద లన్నింటినీ కోల్పోయి, పరాజితుడై దుఃఖించి, చిత్తూరు ప్రాంత అరణ్యములందు ప్రాణముల గోల్పోయెను (అక్టోబరు 1642).

తరువాత, ఇదివరలో చెప్పబడిన వెంకటపతి అన్న కుమారుడు శ్రీరంగడు రాజ్యాధికారము వహించెను. ఈ శ్రీరంగడే ప్రోత్సహించిన మహమ్మదీయ దండయాత్రలను, అత డాపుటకు వీలు లేక పోయినది! పిమ్మట కొంత కాలమునకు మహమ్మదీయులలో కలిగిన వైషమ్యములవలన వారు బలహీనులైనప్పుడు శ్రీరంగ రాయలు వారల నెదిరించు చుండెను. క్రీ. శ. 1643-44 లలో గోల్కొండ నవాబు దండెత్తగా, శ్రీరంగ రాయలు బిజాపూరు సుల్తానుల సైన్య సహాయముతో గోల్కొండ నవాబును ఎదిరించి తరిమి వేసెను. కానీ, దేశమున అంతకంతకు శాంతి లేక పోయెను. దక్షిణ దేశ నాయకులు సామంతులైననూ, ఎప్పుడునూ ధిక్కరించుచునే యుండిరి. గోల్కొండ నవాబులు తరచుగా దాడులు సాగించుచునే యుండిరి.

బిజాపూరు, గోల్కొండ సుల్తాను లేకమై, తుదకు హిందూసామ్రాజ్యము నాక్రమించుకొనుటకు పూనుకొనిరి. శ్రీరంగరాయలు చేయునది లేక విహ్వాలుడై, దక్షిణ నాయకులగు సామంతుల శరణు జొచ్చెను. ఈ దక్షిణ నాయకులు కూడా ఒకరి తర్వాత నొకరు మహమ్మదీయులకు లోబడిరి. శ్రీరంగ రాయలు వెల్లూరినుండి జంజికిన్ని, జింజినుండి తంజావూరునకున్నూ, తంజావూరి నుండి మైసూరునకున్నూ పారిపోయెను. మైసూరున శ్రీరంగ రాయడు కొంత మంది నాయకుల సాయముతో తేజో విహీనమైన తన రాచరికమును నిల్పుకొనుటకు ప్రయత్నించుచు 1675 లో మరణించెను.

మొత్తము మీద విజయనగర సామ్రాజ్యకాలమున మత వాఙ్మయములు ఉన్నత స్థితికి వచ్చెను. సాయనుడు వేద వ్యాఖ్య రచించెను. కృష్ణ రాయల కాలమున, పాలన శాంతియుతమై, కళాకలితమై, ప్రజానురంజకముగా నుండెను. హంపిలోని రామస్వామి ఆలయము, తాడిపత్రి దేవాలయములు, లేపాక్షి, సోంపల్లి తిరుపతి, కుంద్రం మొదలైన ప్రదేశముల శిథిలమై యున్న వారి కళాప్రతిభ దర్శింప దగినది! విజయనగర రాజుల కాలమున సేచ్ఛ, కీర్తి, సూర్య చంద్రులవలె ధగధగద్ధావళ్యముతో భాసించినవి !!

## బ్రిటిష్ యుగమునాటి ఆంధ్రుల చరిత్ర 1600–1942 :–

1600 లో ఏర్పడిన ఆంగ్లేయుల తూర్పు-ఇండియా సంఘమువారు ఇండియాలో వర్తక వ్యాపారము చేసుకొంటూ 1639 లో చెన్నపురిని సంపాదించి, కోటకట్టుకొని, తమ పలుకుబడి వ్యాపింప చేసుకొనిరి. ఫ్రెంచి వారున్ను, ఆరీ తిగానే పుదుచ్చేరీ మొదలయిన స్థలములందు తమ పలుకుబడిని మరింత ఎక్కువగా వ్యాపింప జేసుకొనిరి. 1748 లో నైజాం, ఆర్కాట్

నవాబులు పదవులకై వారసులలో తగవులు పుట్టి నప్పుడు ఫ్రెంచి వారున్ను ఆంగ్లేయులున్ను యుద్ధములలో పాల్గొని, నైజాం రాజ్యమున ఫ్రెంచి వారున్ను, ఆర్కాట్ రాజ్యమున ఆంగ్లేయులున్ను ప్రాభవము సంపాదించిరి. తత్ఫలితముగా ఫ్రెంచివారు నైజామునుండి ఉత్తర సర్కారులు పొందిరి. 1757 లో శిస్తులు వసూలు చేసుకొనుటకున్ను, తన పలుకుబడి వ్యాపింప జేసుకొనుటకున్ను బుస్సీ, విశాఖపట్టణము జిల్లాకు పోయి, బొబ్బిలి కోట ముట్టడించి నాశనము చేసెను.

1764 నాటికి ఆంగ్లేయుల ప్రాభవము ఎక్కువయినది. ఫ్రెంచివారి పలుకుబడి, అధికారము పోయినవి. ఉత్తర సర్కారులు ఆంగ్లేయులకు నైజా మిచ్చెను. 1800 సరికి అవి ఆంగ్లేయులకు వశపడినవి. మైసూరు యుద్ధములలో ఆంగ్లేయులకు కలిగిన విజయమువల్ల టిప్పునుండి వారికి వచ్చిన ప్రదేశములలో బళ్లారి, అనంతపురము, కడప జిల్లాలను, 1799లో ఆంగ్లేయులు తమకు తోడ్పడిన నైజాము కిచ్చి వేసిరి ; గాని, ఆ వెంటనే ఏర్పడిన సైన్య సహకార పద్ధతి ననుసరించి నైజాము ఆంగ్లేయ సైన్య సహకారము పొంది, 1801 లో కర్చుల నిమిత్తము పై జిల్లాలను ఆంగ్లేయుల కిచ్చి వేసెను. ఈ విధముగా తెలుగు దేశము, ఇంచుమించుగా అంతయు ఆంగ్లేయ ప్రభుత్వమునకు వశమయినది.

1858 నాటికి బ్రిటిష్-ఇండియా సామ్రాజ్య మేర్పడినది. 1884 లో స్థానిక ప్రభుత్వ చట్టము వచ్చుటవల్ల, ఆంధ్ర దేశములో సైతము మ్యునిసిపాలిటీలు, తాలూకా బోర్డులు, జిల్లా బోర్డులు స్థాపించడమయినది. గాని, అప్పటికింకా కేంద్ర ప్రభుత్వమునందుగాని, రాష్ట్ర ప్రభుత్వమునందుగాని మన దేశస్థులకేమీ అధికారము లేక పోయినది. అప్పుడు అఖిలభారత దేశీయ మహాజనసభ (కాంగ్రెస్) ఉదయించినది. నాట నుండియున్ను స్వదేశీ, స్వరాజ్య ఉద్యమములు దినదినాభివృద్ధిని పొందుతున్నవి. వాటిననుసరించి ప్రభుత్వము వారున్ను దేశస్థులకు కొద్దికొద్దిగా పరిపాలనాధికారము ఇస్తూ ఉండడము జరుగుతున్నది.

1919-1920 లో మాంటెగ్యు చెమ్స్‌ఫర్డు సంస్కరణల ఫలితముగా కేంద్ర ప్రభుత్వమునందును, రాష్ట్ర ప్రభుత్వమునందును ప్రజాప్రతినిధులకు కొంతవరకు ప్రభుత్వాధికారము వచ్చినది. గాని, కాంగ్రెస్ వారికి ఈ సంస్కరణలు తృప్తికరములు కాకపోయెను. అందుచేత వారు సహాయనిరాకరణోద్యమము లేవదీసి, చెరసాలలకు సైతము అనేకులు పోయిరి. అప్పటికి మన రాష్ట్రములో కాంగ్రెస్ పార్టీతో స్పర్ధగా ఏర్పడిన బ్రాహ్మణేతర, జస్టిస్ పార్టీలవారు ప్రభుత్వము వారికి తోడ్పడి, ఈ సంస్కరణల ఫలమనుభవించుటకు సమ్మతించిరి. రాష్ట్ర పరిపాలనమందు కొన్ని శాఖలు గవర్నరు చేతిలోనుంచుకొని, కొన్ని శాఖలు మాత్రమే ప్రజాప్రతినిధులయిన మంత్రులకిచ్చుట జరిగినది. మన చెన్నపురి రాజధానిలో ప్రధానమంత్రి పదవి నలంకరించిన వారు పానగల్, బొబ్బిలి రాజా గార్లు.

కాంగ్రెస్ వారి ఉద్యమము దేశములో ఎక్కువగా వ్యాపించి అధిక సంఖ్యాకుల ఆదరము పొందినది. తత్ ఫలితముగా 1935 సంవత్సరపు ఇండియా చట్టము ననుసరించి ఎన్నికలు జరిగినప్పుడు, దేశమందు గల 11 రాష్ట్రముల లోను, మన చెన్నపురి రాష్ట్ర మందును మరి 7 రాష్ట్రములందునుకాంగ్రెస్‌పార్టీ వారికి విజయము కలిగికాంగ్రెస్ ప్రభుత్వములు ఏర్పడినవి. ప్రారంభములో కొన్ని మాసాలు నడుమంత్రపు మంత్రివర్గ మేర్పడి నప్పుడు సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు ప్రధాన మంత్రులైరి. పిమ్మట కాంగ్రెస్ విజయము కలిగిన రాష్ట్రములలో కాంగ్రెస్ వారు మంత్రి పదవులు స్వీకరించినప్పుడు,

సి. రాజగోపాలాచారిగారు ప్రధాన మంత్రులయినారు. మంత్రి వర్గములో 3 రున్ను, కార్యదర్శులలో 4 రున్ను తెలుగు వారు. స్పీకరు పదవినలంకరించిన వారు బులుసు సాంబమూర్తి గారు. ఈ సంస్కరణలవల్ల రాష్ట్రీయ స్వాతంత్ర్యమువచ్చినది. కాంగ్రెస్ ప్రభుత్వము చక్కగా సాగుచుండెను. గాని, కొద్ది కాలమునకే ప్రతికూల పరిస్థితులు సంభవించినవి.

1939 లో ప్రారంభమైన యుద్ధములో మన దేశము వారు ఆంగ్లేయులకు తోడుపడ వలెనన్న విషయము వచ్చినప్పుడు, బ్రిటిష్ ప్రభుత్వమునకు గల యుద్ధోద్దేశముల స్పష్టపరచి, హిందూ దేశ స్వరాజ్యాశయమునకు ప్రభుత్వము వారు సుముఖులన్న నిశ్చయము లేని యెడల తాము తోడ్పడమని కాంగ్రెసు వారు తెలియ చేయుటయున్ను, అందుకు ప్రభుత్వము వారి సమాధానము తృప్తికరము కాక పోవుటయున్ను, కాంగ్రెస్ వారు తమ మంత్రి మొదలయిన పదవులకు రాజీనామా లిచ్చుటయున్ను, గవర్నరు రాష్ట్రపరిపాలనా భారమంతయు వహించుటయు, కాంగ్రెస్ వాదులు చెరసాలలకు పోవుటయున్ను సంభవించినవి.

1942 లో జపాను యుద్ధములోనికి దిగి మన దేశమునకు దండయాత్ర భీతి కలిగించినప్పటి నుండియు విషమ పరిస్థితు లేర్పడినవి. ఎట్లు పరిణమించునో !

---

# మన చరిత్ర రచన

లోకమంతకు కాక పెట్టిన-కాకతీసతి కదనపాండితి
చీకి పోవని చేవ పదముల-చేర్చి పాడర తమ్ముడా !
—రాయప్రోలు

**చరిత్ర ప్రాముఖ్యము**

" దేశము యొక్క పురోభివృద్ధికి ప్రబల శత్రువై, జనసామాన్యము నావహించి యుండిన దురభిమాన పిశాచమును బారద్రోలి, ప్రజలను నీతి వర్ధిష్ణువులనుగాను, విజ్ఞానవంతులుగాను చేసి, భావి కాల పరంపరాభివృద్ధి భవనమునకు మూల బంధమై యొప్పునది దేశ చరిత్ర" అని శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు తమ ఆంధ్రుల చరిత్ర ప్రథమ భాగపు అవతారికలో వ్రాసియున్నారు.

మన ఆంధ్ర దేశమున ఇట్టి ఉత్తమచారిత్రక రచన చేసిన వారలెవరను విషయము తెలుసుకొన వలెను.

ఆంధ్ర దేశమున చరిత్ర రచన భరత ఖండములోని ఇతర ప్రాంతములకన్న పూర్వమే ప్రారంభమైనది ; దీనికి కారణము కొన్ని అనుకూలమైన పరిస్థితులు, కొంత చారిత్రక వాతావరణము ఈ దేశమున ఏర్పడుటయే ! తూర్పు ఇండియా వర్తక సంఘమువారి కొలువులో నియోజితుడైన ' మెకంజీ ' అనునాయన దాక్షిణాత్య ప్రజా జీవితములోను,

**చరిత్ర రచన ప్రారంభము**

వారి భాషలలోను, సాహిత్యములోను, సంప్రదాయముల లోను, ఆర్థిక విషయముల లోను అభిరుచిగలిగి, దక్షిణ హిందూదేశీయుల చరిత్ర సమగ్రముగా వ్రాయవలయునను దృఢ సంకల్పముతో, ఈ కార్యమునకై అనేక పండితులను నియోగించి, వారిని అనేక చరిత్ర ప్రసిద్ధములైన గ్రామములకు పంపి, తన. చరిత్ర రచనకు కావలసిన సామగ్రి వారిద్వారా సేకరించెను. ఈ పండితులు పలు ప్రాంతములకు పోయి, సంస్కృత గ్రంథములను, తెలుగు, తమిళము, కన్నడము మొదలైన దేశీయ గ్రంథములను ; పరంపరాగతములై అప్పటికి వాడుకలోనుండిన గ్రామకవిలెలు, దండ కవిలెలలోను

సూచింపబడిన గ్రామముల చరిత్రలను సేకరించి, ప్రతులు వ్రాసి తెచ్చిరి. ఆ గ్రంథ సముదాయము అంతయు, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందు భద్రపరచ బడినది. ఈ గ్రంథ సంచయము 19 వ శతాబ్దపు చరిత్ర పరిశోధకులకు, వారి పరిశోధనలకు ఆలంబనమైనది. అప్పటిలో, ప్రప్రథమమున చరిత్ర పరిశోధనలు ఆంధ్రులలో ఆరంభించినది కావలి వెంకటబుర్రయ్య, వారి సోదరులు రామస్వామిగార్లు. వెంకటబుర్రయ్యగారు పూర్వపు తెనుఁగు కన్నడ శాసనములలోని లిపి చదువుటకు మార్గమునన్వేషించి, చారిత్రక వీథులలో ఒక రాచబాటను చూపి మహోపకృతి ఒనరించిరి. వీరి ఈ అన్వేషణము, ఒక్క ఆంధ్రులకే కాదు, దాక్షిణాత్యులందరికీ ఫలవంతమై సుమియించినది. ఈ సోదరులిద్దరున్నూ, ఇంతటితో తృప్తి పడక, అనేక శాసనముల ప్రతుల వ్రాసిరి. అనేక చరిత్ర ఆధారములను పరిశోధించి, అన్నిటినీ ఒక చోట క్రమ విభజనము చేసి క్రోడీకరించి, ఆంధ్ర దేశమునందలి వివిధ ప్రదేశములకు సంబంధించిన చరిత్రల వ్రాయుటకు ఒక క్రమమైన, ఉన్నతమైన ప్రయత్నము చేసిరి. ఈ మెకంజీ సేకరించిన వస్తువు, అతని కార్యము యొక్క ఔత్కృష్ట్యత ఇతర ఆంగ్లేయ కుంపినీ ఉద్యోగులకు కూడ, ఆదర్శప్రాయమై భాసించినది. ఈ చరిత్ర వస్తు సమీకరణోద్యమమునందు కుతూహలముగలిగిన మరియొక కుంఫిణీ ఉన్నతోద్యోగి, 'కెన్నలే,' అనునాయన, బుక్క పట్నం రాఘవాచార్యులుగారను కంపెనీరివిన్యూ ఉద్యోగిని తెనుఁగు దేశ చరిత్ర వ్రాయుటకు ప్రోత్సహించెను. ఈ రాఘవాచార్యులు గారు రచించిన భాగములు సంపూర్ణముగా మనకు లభ్యపడలేదు. శిథిలము పొందిన కొన్ని ఖండములు మాత్రము దొరకినవి. ఈ రాఘవాచార్యులుగారు చరిత్ర నూతన పద్ధతుల పై రచించి, నేటి చరిత్ర రచనా పద్ధతికి పునాది వేసిరి. యిటీవల మన చరిత్రకారులకు అధికముగాలభించిన క్రొత్త సామగ్రివల్ల, దాని పరిశోధనా ఫలితములవల్ల రాఘవాచార్యులుగారి నిర్ణయములు మనకిప్పుడు స్వీకరణ యోగ్యములుగాక పోయినను, వారి రచనా పద్ధతి మాత్రము ప్రశంసనీయమైనదని చెప్పవలెను.

తరువాత మెకంజీ గ్రంథములను పరిశోధించి, మరల చరిత్రకు వన్నె దిద్దినది కందుకూరి వీరేశలింగం పంతులుగారని చెప్పవలెను. పంతులుగారు తమ ఆంధ్ర కవుల చరిత్రమునకు, కవులకాలమును నిర్ణయించుటకు చారిత్రక వస్తు పరిశోధనము చేసిరి. కానీ పంతులుగారు ప్రత్యేకముగా చరిత్ర రచనకు పూనుకొనలేదు. కానీ, పంతులుగారి ఈ కృషి, వారి తర్వాత కీ॥ శే॥ శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారికి ప్రాతిపదికమైనది. వీరభద్రరావుగారు ఆంధ్రులకు సరియైన చరిత్ర రచనమునకు బద్ధకంకణులై పూనుకొనిరి. వీరభద్రరావుగారు అనేక శాసనములను, సారస్వత గ్రంథములలో చెప్పబడిన చారిత్రకాంశములను, అనేక చరిత్రలను పరిశోధించి ఆంధ్రుల చరిత్రము వ్రాసిరి.

వీరేశలింగం పంతులు, వీరభద్రరావుగార్ల చారిత్రక కృషి

"పూర్వమొకప్పుడు రాజ్య విస్తారము నందును, ఉన్నత నాగరకత యందును, బుద్ధి వైభవ మందును, ఆంధ్రులు హిందూ దేశమునందలి అన్య రాష్ట్రీయుల వారికేఁ దీసిపోయినవారు కార"ని వీరి చరిత్రమున స్పష్టపడుచున్నది. వీరభద్రరావుగారి చరిత్ర, అందలి రచనా పటిమ, శైలి గాంభీర్యము, విషయ చిత్రణము అనేకుల నాకర్షించినది. కానీ, వీరి ఊహా చిత్రములు ఒక్కొక్కప్పుడు వాస్తవికతను దాటిపోవుచుండుట చేత, వీరి చారిత్రకాంశములు కొన్ని

చోట్ల సత్యదూరము లైనవని చరిత్రకారులందురు. అయిననూ, ఆంధ్ర చరిత్రకారులైన వీరభద్ర రావుగారు, వారి కృషి చిరస్మరణీయములు.

ఈ 20 వ శతాబ్దములో చరిత్ర పరిశోధన కొక సౌధము నిర్మించిన ప్రజ్ఞావంతులు కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు. లక్ష్మణరావు గారిని ప్రోత్సహించినది భండార్కారు, తిలక్ మొదలైన మహారాష్ట్ర పండితుల చారిత్రక రచనలు, ఆంధ్ర దేశాభిమానము. వీరు తెలుగు చరిత్ర పరిశోధనలో అనేక క్రొత్త మార్గముల వెతకిరి. 'హిందూ మహాయుగమ'ని మన దేశ చరిత్రమును తెనుఁగులో వ్రాసిరి. కానీ, వీరి రచన సంపూర్ణముగాక పూర్వమే కీర్తిశేషులైరి. ఈ చరిత్ర అసంపూర్ణమైనను, వారి చక్కని భాష, వస్తువును చిత్రించు పద్ధతి, విషయములు, నిర్ణయములు చరిత్ర శ్రేణిలో వెలుగు దివ్వెలలాగా అనేకులకు అభిగామినులైనవి. లక్ష్మణరావుగారు గ్రంథకర్తలేగాక, అనేక శాసనముల పరిష్కర్తలు గుడాను. వీరే అసలు శాసన పరిశోధనము విస్తారముగా జేసి దానిని పరివ్యాప్త మొనరించిరి. కళాప్రపూర్ణ కీ. శే. గిడుగు రామమూర్తి పంతులు, జయంతి రామయ్య పంతులుగార్ల వంటిమేధావులు, పండితులు గూడా శాసన పరిశోధనారంగమున కృషి చేసిరి. కానీ వారు లక్ష్మణరావు పంతులు గారి వలె తమ దృష్టినిందే కేంద్రీకరింప లేదు. లక్ష్మణరావుగారు అనేకులు యువకులను, చరిత్ర రచనము చేయ ప్రోత్సహించిరి. వారిలో ప్రస్తావింప దగిన మేటి శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ (రెడ్డి చరిత్ర పరిశోధనలు చేసినవారు) గారు. శర్మగారు అనేక శాసనముల పరిశోధించి, పరిష్కరించిరి. శాసన పరిశోధనారంగమున కుశాగ్రబుద్ధి గలిగి, ఉత్తమ రచయితలైనశర్మగారొక ప్రత్యేక పీఠాధిపతులు.

కొమర్రాజు లక్ష్మణ రావుగారి శాసన పరిశోధనము.

ఇంక, మన శాసన పరిశోధకులు, చరిత్రకారులలో డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య, ఎమ్.ఏ., పిహెచ్.డి., (మద్రాసు విశ్వవిద్యాలయము రీడరు, విజయనగర చరిత్ర పరిశోధకులు)గారు; శ్రీ భావరాజు వెంకట కృష్ణారావు ఎమ్.ఏ.,బి.ఎల్. (తూర్పు చాళుక్య చరిత్ర పరిశోధకులు, రాజమహేంద్రవరము వకీలు) గారు; రాళ్లబండి సుబ్బారావు ఎమ్.ఏ.,ఎల్.టి., (కళింగ గాంగ చరిత్ర పరిశోధకులు రాజమండ్రి ఆర్ట్సు కళాశాల) గారు; డాక్టరు మారేమండ రామారావు ఎమ్.ఏ.,పిహెచ్.డి., (కాకతీయ చరిత్ర పరిశోధకులు గుంటూరు హిందూ కళాశాల) గారు ; డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు ఎమ్.ఏ.,పిహెచ్.డి. (కాకతీయ, విజయనగర చరిత్రపరిశోధకులు వుయ్యూరు రాజ కళాశాల ప్రిన్సిపాల్ బెజవాడ) గారు ; శ్రీ ముట్నూరి వెంకట్రామయ్య (తెలుగు చోళుల చరిత్ర పరిశోధకులు) గారు ; చెప్పవలసిన వారు. డాక్టరు గిడుగు సీతాపతి పంతులు, డాక్టరు చిలుకూరి నారాయణ రావుగార్లు కొన్ని శాసనముల పరిశోధించి కొన్ని చారిత్ర కాంశముల పరిష్కరించిరి. కీ. శే. శ్రీనడింపల్లి జగన్నాథరావు పంతులుగారు ఆంధ్ర సామ్రాజ్య చరిత్రమునురచించిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలా ప్రధానాధ్యాపకులు గానుండిన పి. టి. శ్రీనివాసయ్యంగారు పల్లవ చరిత్రకు సంబంధించిన రచనలు అనేకము చేసిరి. డాక్టరు కే. సుబ్రహ్మణ్యంగారు (విజయనగరం కళాశాలాధ్యాపకులు) బౌద్ధయుగమునాటి ఆంధ్రుల చరిత్రను రచించినారు.

సుప్రసిద్ధ నవీన చరిత్ర పరిశోధకులు, రచయితలు

ఆంధ్ర దేశ సేవా పరతంత్రులు, విజ్ఞానోజ్జీవనాభిలాషులు మన చారిత్రక రంగమున ఇంకను చేయవలసిన కృషి అశేషముగావున్నది!!

తొమ్మిదవ అధ్యాయము

# రాష్ట్రేతర, ఖండాంతర ఆంధ్రులు

ఏదేశ మేగినా ఎందుగాలిడిన
ఏపీఠ మెక్కినా ఎవరెదురయిన
.........................
నిలుపరా నీజాతి నిండుగర్వమ్ము
.........................
లేదురా మనవంటి ధీరు లింకెందు ।

—రాయప్రోలు

విషయ సంగ్రహము : రాష్ట్రేతరాంధ్రు లనగా మన చెన్నపురి రాష్ట్రము గాక తక్కిన రాష్ట్రములలో గల ఆంధ్రులు: అక్కడి సంస్థానములందలి ఆంధ్రులు. దేశాంతర ఆంధ్రులు అనగా ఆశియాఖండములోని ఇండియాయందు గాక తక్కిన దేశములోని ఆంధ్రులు—సంస్థానాంధ్రులు నైజాము, మైసూరు, పుదుక్కోట, మొదలయిన సంస్థానములయందలి యాంధ్రులు. ఇందులో నైజాము సంస్థానమందు 80 లక్షలకుపైగా ఆంధ్రులు కలరు. సురవరం ప్రతాపరెడ్డిగారు మొదలయినవారు ఆంధ్ర జాత్యభివృద్ధికి తోడ్పడుచున్నారు. ఇక్కడి ఆంధ్ర గ్రంథాలయములు, ఆంధ్ర సంస్థలు, ఆంధ్ర నాయకులు మొదలగునవి తెలుసుకోదగిన విషయములు. మైసూరు సంస్థానాంధ్రులు 11 లక్షలకు పైగా నున్నారు. అనేకులు కర్మాగారములలో పనిచేయువారు. గొప్ప గొప్ప పదవులలో నున్నవారు సర్. ఎమ్. విశ్వేశ్వరయ్య మొదలగువారు. బెంగుళూరులో ఆంధ్ర భాషాభివర్ధినీ సమాజము. పుదుక్కోట సంస్థానాంధ్రులు 13250 మంది. రాజపురోహితులు నేటికిని ఆంధ్ర బ్రాహ్మణులు. కాపు, కమ్మ, వెలమ ; కమ్మరి, కుమ్మరి, వడ్డె మొదలయిన తెలుగు జాతులవారున్నారు. ఉద్యోగులలోకూడ కొందరు ఆంధ్రులు కలరు.

రాష్ట్రేతరాంధ్రులు—దక్షిణదేశమందలి అన్ని జిల్లాలలోను మొత్తముమీద 30 లక్షల ఆంధ్రులు కలరు. బొంబాయి రాష్ట్రములో 163000 మంది ఆంధ్రులున్నారు. అన్నిటను ఆంధ్ర నాయకులు, ఆంధ్ర సంస్థలు పనిచేయుచున్నవి. చెన్నపురి ఆంధ్రులు—చెన్నపురము చెన్నప్ప పేరునుండి వచ్చినది. యితడు విజయనగర రాజ్యపు ఆర్వీటి వంశమువాడు. వర్తకమునకై వచ్చిన యింగ్లీషు కంపెనీవారికి 1639లో ఇతని కుమారుడు ఆశ్రయమిచ్చెను. నాటినుండి పట్నము వెలసి వృద్ధిలోనికి వచ్చినది. మొదటినుండిన్నీ ఇది ఆంధ్రుల పట్నముగానే పెరిగినది. 100 సం॥ల క్రిందట దుబాష్ ఏనుగుల వీరాస్వామయ్యగారు రచించిన కాశీ యాత్ర చరిత్రలో చెన్నపట్న వర్ణనము కలదు. అప్పటికాంధ్రులు ప్రబలియుండిరి. ఆంధ్ర వర్తక శ్రేష్ఠులలో పెక్కండ్రుచేసిన దానములు ; ఆంధ్ర ప్రముఖులలో పూర్వకాలమందలి వారు నేటివారు. ఆంధ్ర సంస్థలు అందు ప్రధానమయినది చెన్నపురి ఆంధ్ర మహా సభ.

"కృష్ణా తరంగ పంక్తిౕ ద్రొక్కి త్రుళ్లింత నాంధ్ర నౌకలు నాట్యమాడు" నాడే, ఆంధ్రులు దశదిశలకూ వ్యాపించియుండిరి. నేటికిని అన్యరాష్ట్రములలోను, దేశాంతరములలోను తెలుగువారు విస్తారముగా గలరు. దక్షిణాంధ్రులకంటెను మైసూరు, బొంబాయి, మధ్యరాష్ట్రములలోని ఆంధ్రుల కంటెను నైజామాంధ్రుల సంఖ్య హెచ్చు!

నైజాము రాష్ట్రమున, మైసూరు సంస్థానమున, బొంబాయి సంస్థానములలోను, బరోడా, అస్సాము మొదలైన సంస్థానములలోను, నివసించుచున్న ఆంధ్రులగురించి 'సంస్థానాంధ్రులు' అనే ప్రత్యేక శీర్షిక క్రింద వివరింతుము. సంస్థానాంధ్రులేకాక, వంగ, ఉత్కళ, ఢిల్లీ, బొంబాయి మొదలగు అన్య రాష్ట్రములలోను, బర్మా, దక్షిణాఫ్రికా, ఇంగ్లండు అమెరికా మొదలగు ఇతర దేశములలోను గల తెనుగువారిని గురించి తెలుసుకోనవలసియున్నది.



శ్రీ రాజాబహదూర్ వెంకట్రామరెడ్డి, ఓ.బి.ఇ., హైదరాబాదు నగరమునకు కొత్వాలుగా నుండిన ఆంధ్ర నాయకులు.

## సంస్థానాంధ్రులు

ఆంగ్లేయులు మనకు పాలకులగునప్పటికి, ఆయా ప్రాంతములను వేర్వేరు రాజులు పాలించుచుండిరి. అట్టి రాజుల పాలనలోని కొన్ని ప్రదేశములను బ్రిటిష్‌వారు పూర్తిగా వశపరచుకొనిరి. డల్‌హౌజీ కాలములో బ్రిటిష్‌వారు, సాకు దొరికినప్పుడెల్ల స్వదేశ రాజ్యాక్రమణము జేయుచుండిరి. క్రమముగా వారు ఒక్కొక్క రాజ్యమునే ఆక్రమించుకొనిరి. తరువాత, కొంతకాలమునకు తమ రాజనీతిని మార్చుకొని, కొన్ని రాజ్యముల స్వాధీనపరచుకొనక వాటిపై కొంత కరోడామాత్రము పెట్టుకొన్నారు. ఇప్పుడు హిందూదేశములో 562 స్వతంత్ర రాజ్యములున్నవి. వీటిలో అనేక సంస్థానములు గలవు.

ఈ దేశీయ రాజ్యములన్నింటిలోను ప్రధానమైనవీ, ఆంధ్రుల కెక్కువ సంబంధించినవీ నైజాము, మైసూరు మొదలైన సంస్థానములు.

## నైజాం సంస్థానము

నైజాము సంస్థానము పరిమితి 82,698 చ॥ మైళ్లు.

**హైదరాబాదు, హిందువులు.** సంస్థాన ప్రజలలో హెచ్చుమంది అందులోను భారత దేశపు టాంధ్రి జనాభా యంతటిలోను మూడవ వంతు తెలుగువారు నైజాం రాష్ట్రిమున నివసించియున్నారు. ఇది తెలుగు ప్రదేశము. తెలుగువారు విశేషముగా నివసించుచున్న ప్రదేశమునే 'తెలింగానా' అని వ్యవహరింతురు.

**ఎనభై లక్షలకు పైగానున్న నైజాము-ఆంధ్రులు** ఈరాష్ట్రిపు జనాభా 1,61,94,313 మందిలో ఆంధ్రులు ఇంచుమించు 81 లక్షలు.

**తెలుగుకోడలు** ఈ రాష్ట్రిము ప్రాచీనకాలమునందు శాలివాహన ప్రభువులచేతను; పిమ్మట చాళుక్య, రాష్ట్రకూటపాలకులచేతను; ఓరుగంటిలో ప్రసిద్ధికెక్కిన కాకతిరాజులచేతను పరిపాలించబడెను. వీరి తర్వాత



శ్రీమతి ముత్యాల సరోజిని నాయుడు, హైదరాబాదు.



శ్రీ సురవరము ప్రతాపరెడ్డి
బి. ఏ., బి. ఎల్.
గోల్కొండ పత్రికాధిపతులు,
నిజామాంధ్ర నాయకులు.

కుతుబుషాహీ నవాబులు గోలకొండ రాజ్యమును స్థాపించి పాలించుచుండగా, ఈ నవాబులను ఔరంగజేబు ఓడించి, వారిని తన సామంతులనుగా జేసుకొని ఆసఫ్‌జా అను సుబేదారుని నియమించెను. ఔరంగజేబు అనంతరము ఆసఫ్‌జా స్వతంత్రరాజయ్యెను. ఆసఫ్‌జా క్రీ. శ. 1748 లో మరణించెను. ఈ రాష్ట్రి మునకు నేటివరకు ఈ ఆసఫ్‌జా వంశజులే పాలకులు.

ఇప్పుడు నైజాము రాజ్యమున క్రొత్త చట్టములు చేయుటకున్ను ఉన్నవాటిలో మార్పులుచేయుటకున్ను, ఫర్మానాలిచ్చుటకున్ను, ఇతరకార్యములలో తమ ఇష్టానుసారము ఆజ్ఞలు జారీచేయుటకున్ను నవాబు స్వతంత్రులు. శాసనములు చేయుటకు శాసనసభయు, తదితర ప్రభుత్వ శాఖలను నడుపుటకున్ను, ముఖ్యరాజకీయ సమస్యలను పరిష్కరించుటకున్ను 'బాబెహుకూమత్' అను కార్యనిర్వాహక సభ కలదు. ఈ రెండు సభలకు ప్రభువు అధికారము వహించును.



శ్రీ మాడపాటి హనుమంతరావు
బి. ఏ., బి. ఎల్.
నైజాము ఆంధ్రనాయకులు.

ఈ నైజాము రాష్ట్రము ముఖ్యముగా రెండు పెద్ద భాగములుగా విభజింపబడినది. (౧) తెలింగానా (౨) మరాట్వాడా. ఈ రెంటిను ౮ భాగములుగా విభజింపబడినవి. ఈ పైచెప్పబడిన తెలింగానా వైశాల్యము 41,502 చ. మైళ్లు. అది 8 జిల్లాలుగా విభజింపబడినది. ఆ ఎనిమిది జిల్లాలు మెదకు, మహబూబ్ నగర్, నల్లకొండ, నైజామాబాద్, ఒరంగల్, ఆదిలాబాద్, కరీంనగర్, అత్రఫి బల్దాలు. ఈ మండములలోనే కాకుండా బీదర్, గుల్బర్గా, రాయచూరు లలో గూడా తెలుగువారు వ్యాపించిన భాగము లున్నవి. రెడ్డి సామ్రాజ్యమునాటి సంస్థానములు గద్వాల, వనపర్తి, గోపాలపేట, పాపన్నపేటలే కాకుండా దోమకొండ, సిర్నేపల్లి, ఆత్మకూరు సంస్థానములునుగలవు. దోమకొండ రాజావారు ఇటీవల తమ పూర్వవిరచిత కావ్య సముచ్చయములను ప్రకటించిరి. గద్వాల వనపర్తి పూర్వరాజులు సంస్కృత



డాక్టరు పల్లెంపాటి గోపాలకృష్ణ,
పి. హెచ్. డి., (కార్నెల్)
రష్యా, అమెరికాలు వెళ్లి విద్య నభ్యసించి, నైజాము వ్యవసాయ శాఖ డిప్యూటీ డైరెక్టరుగా పనిచేయుచున్నారు.



శ్రీ ముందుముల నరసింగ రావు, వకీలు,
రైతు (ఉర్దూ) దినపత్రిక సంపాదకులు.



శ్రీ పింగళ కోదండరామరెడ్డి (హైదరాబాదు).

పండితులై, పండితపోషకులుగా వాసికెక్కి, అపారమైన సాహిత్య సేవచేసిరి.

ప్రజాబాహుళ్యపు దామాషా ప్రకారము ఆంధ్రులకు తగిన పలుకుబడి ఈ సంస్థానములో ఉన్నట్లు కనపడదు. ఈ ఆంధ్రులకు మాతృభాష నభివృద్ధిపరచుకొనుటకు తగినన్ని అవకాశములు లేవు. ఈ రాష్ట్రమున విద్యాధికుల సంఖ్య నూటికి 5-8 మధ్యయుండును. ప్రభుత్వమువారి విద్యాశాఖ చేయుచున్న కృషిచాలదు. ప్రజలు ప్రజాపక్షమున పాఠశాలల నెలకొల్పి కృషిచేయుటకు అవకాశములేదు. ఇందులకు నిదర్శనముగా 1334 ఫసలీలో 'ఖాన్గీ' (సొంత) పాఠశాలల గస్తీ యొకటి గావించబడినప్పుడు ప్రభుత్వమువారు తమ ఉత్తరువు లేనిది బళ్లను నడపకూడదని ఆజ్ఞాపించుటచే, అనేక ప్రైవేటుబళ్లు మూసివేయబడెను. ఈ రాష్ట్రమున సన్ (1327) ఫసలీలో ఉస్మానియా విశ్వవిద్యాలయము నెలకొల్ప బడెను. తర్వాత విద్యా విషయికములైన గొప్ప మార్పులు జరిగినవి. వాటినిగూర్చి సురవరము ప్రతాపరెడ్డిగారు ఈ క్రింది విధముగా వ్రాయుచున్నారు, "ఇంతవరకును బ్రిటిష్ యిండియాలోని మద్రాసు, బొంబాయి, కలకత్తావంటి విద్యాపీఠములలో ఇంగ్లీషు ద్వారా బోధ జరుగుచుండెను. ఉస్మానియా విశ్వ విద్యాలయములో అట్లుగాక ఉర్దూకు ప్రాధాన్యమిచ్చి దేశభాషలకును (ముల్కీజబాన్) ఇంగ్లీషునకును ద్వితీయస్థానమిచ్చిరి. అందుచే, ఉస్మానియా విశ్వ విద్యాలయము నెలకొలుపబడినతర్వాత ఉర్దూ ప్రాధాన్యమునకు వచ్చెను. దీనితో తెలుగు క్షీణించుచున్నది."

ప్రభుత్వమువారి గ్రంథాలయములు అనేకములున్నప్పటికీ యింకను ఇక్కడ ప్రజలు అనేక గ్రంథాలయములు స్థాపించుట కవకాశములున్నవి. ఇక్కడ ఆంధ్రులు నూరు గ్రంథాలయములకు పైగా నెలకొల్పినారు. 1901 లో శ్రీ కృష్ణదేవరాయల గ్రంథాలయమును స్థాపించిరి. హైదరాబాదులో మూడు లక్షల రూపాయిల విలువగల రెడ్డి విద్యార్థి వసతి గృహమున్ను, వసతి గృహమునకు 45 వేల రూపాయల విలువైన 12 వేలకు పైబడిన తెలుగు, ఉర్దు, సంస్కృతము, పార్సీ, గ్రంథములుగల పుస్తకాలయమున్ను ఉన్నది. ఇక్కడి ఆంధ్రులు ప్రజా-ఉద్యమములలో పాల్గొని ముందంజ వేయుచున్నారు. గ్రంథాలయములేకాక హైదరాబాదులో సారస్వత సాహిత్యకృషిజేయు సంస్థలు అనేకముగాగలవు. వాటిలోనివే సారస్వతసమితి, సాధన సమితి, బూరగంపాడు సాహిత్యసమితి.

ఇచ్చటి ఆంధ్రులకు 16 సం॥లనుండి ప్రకటితమగుచున్న సురవరము ప్రతాప రెడ్డిగారి గోల్కొండ పత్రిక, ఆంధ్ర కేసరి, దివ్యవాణి, అను వారపత్రికలు, శ్రీమతి ఆర్. ఎస్. దేవిగారు సంపాదకురాలుగానున్న తెలుగుతల్లి, ముందుముల నర్సింగరావుగారు ప్రకటిస్తున్న రైతు అనే ఉర్దూ దిన



రావుసాహెబ్ అనంత పద్మనాభ స్వామి,
సికింద్రాబాద్ లోని గొప్ప వర్తకులు.



శ్రీ ఎన్. బాలకృష్ణయ్య అడ్వకేటు, ఎమ్. ఎల్. సి.
బెంగుళూరు పురపాలక సంఘ మాజీ అధ్యక్షులు.

పత్రిక; చిదిరెమఠంవారి మాస పత్రిక, విభూతి, ఆయుర్వేద కళ మొదలైన పత్రిక లున్నవి.

హైదరాబాదు - ఆంధ్రులు తమ సర్వతోముఖాభివృద్ధికై 'ఆంధ్ర జన సంఘమును' స్థాపించుకొనిరి. ఈ సంస్థ యిప్పటికి 9 మహాసభలు జరిపినది. దీని శాఖోపశాఖలు ఈ రాష్ట్రమున పనిచేయుచున్నవి. సంఘకార్యదర్శి, మూలపురుషులు శ్రీ మాడపాటి హనుమంతరావు బి.ఏ., బి.ఎల్., గారు. యువకులలో నాయకులు బి. నారాయణ రెడ్డిగారు. ఆంధ్రసభ ఒక్కటేకాక రైతు సంస్థలు గూడా యిచ్చట పనిచేయుచున్నవి. ఆర్యసమాజము, హిందూమహాసభ, కిసాన్‌సభా శాఖలుగూడా గలవు. ఈ మధ్య జరిగిన సత్యాగ్రహ సమరంలో సంస్థానం ఆంధ్రులు ఎక్కువగా పాల్గొనిరి!

విస్తీర్ణములోను, జన సంఖ్యలోను, ఐశ్వర్యములోను హిందూదేశపు సంస్థానములందు ప్రాధాన్యము వహించిన నైజాము సంస్థానమువారు అనువైన ఓడరేవు తమకు లేకుండుటచే బ్రిటిష్ ప్రభుత్వమునకు ఇదివరలో తామిచ్చిన కృష్ణా జిల్లాలోని మచిలీపట్నము మరల వశపరచుకొనుటకు యత్నించుచున్నట్లు తెలియుచున్నది. రాబోవు నూతన రాజ్యాంగ విధానములో తెలుగు మాట్లాడువారిని అందరినీ భాషా ప్రయుక్త విభజనము ననుసరించి ఏక రాష్ట్రీయులనుగా చేయవలయునన్న ఆందోళన ఇక్కడి ఆంధ్రులకును గలదు.

నైజాము రాష్ట్రమునందలి ఆంధ్ర ప్రముఖులలో పేరెన్నికగన్నవారు: మేజర్ ముక్త్యాల గోవిందరాజులు నాయుడుగారు, వ్యవసాయశాఖ రసాయనిక శాస్త్రజ్ఞులు పి. జె. కృష్ణ, పి. హెచ్. డి. (కార్నెల్) గారు, ఉస్మానియా విద్యాలయాచార్యులు రాయప్రోలు సుబ్బారావుగారు, తణికెళ్ల వీరభద్రుడు, కురుగంటి సీతారామయ్యగార్లు, కావ్యతీర్థ చిదిరెమఠం వీరభద్రశర్మగారు; రాజా బహదూర్ వెంకట్రామరెడ్డి ఓ. బి. ఇ. గారు. వెంకట్రామ రెడ్డిగారు 50 ఏండ్లు ప్రభుత్వోద్యోగముచేసి హైదరాబాదు నగర పోలీసు కమీషనరుగా పనిచేసి, ఉపకార వేతనము పుచ్చుకొంటున్నారు. శ్రీ పింగళి వెంకట్రామ రెడ్డి దేశముఖిగారు పెద్ద కుటుంబీకులు, నాయకులు. నైజామాంధ్రులలో ఇప్పుడు అభివృద్ధిసూచకమైన చైతన్యము, సంచలనము గలదు.



శ్రీ కె. చెంగల్వారాయరెడ్డి బి. ఏ., బి. ఎల్.
మైసూరు అసెంబ్లీ కాంగ్రెస్ పార్టీ నాయకులు.



శ్రీ బైసాని నరసింహం గుప్త.
ఆంధ్రజ్యోతి (తెలుగు) ప్రజామాత (కన్నడ) వారపత్రికా సంపాదకులు ; త్వరలో 'జనవాణి' అను కన్నడ దినపత్రికను ప్రారంభించ నున్నారు.

## మైసూరు సంస్థానము

మైసూరు సంస్థానము హిందూ రాజ్యమని పైని చెప్పి యుంటిమి. ఈ రాజ్య చరిత్ర 1399 నాటినుండి ప్రారంభ మగుచున్నది. ఈ సంస్థానాధీశులు శ్రీ శ్రీ మహారాజా జయచామరాజేంద్ర వుడయార్ బహదూర్.

మైసూరు సంస్థానాంధ్రులు

ఆరంభమునుండియు, ఆంధ్రులు ఈ ప్రాంతమున నివసించియున్నారు. ఇచ్చటిఆంధ్రుల జన సంఖ్య 11,15,366కు పైబడి యున్నది. బెంగుళూరు జిల్లాలో 1,95,530 మంది, కోలారు జిల్లాలో 5,03,081 మంది, టుమ్కూర్ జిల్లాలో 1,16, 972 మంది, మైసూరు జిల్లాలో 15, 010 మంది, మండ్యా జిల్లాలో 10,004 మంది, చిటల్‌దుర్గ జిల్లాలో 1,12,573 మంది, హాస్సాన్ జిల్లాలో 13,128 మంది, కోడూరు జిల్లాలో 10,600 మంది. షిమోగా జిల్లాలో 21,722 మంది తెలుగువారున్నారు.

ఈ ఆంధ్రులలో చాలామంది దంతపు పనులు, సబ్బులు చేయుట, కోలారు బంగారు గనులలో పనిచేయుట మొదలగు పరిశ్రమలలోను ; రైల్వే ఆఫీసులలోను, కాగితములు ఉత్పత్తిచేయు కర్మాగారములలోను, నియుక్తులైయున్నారు. పట్నవాసులు ప్రభుత్వోద్యోగులుగను, అధ్యాపకులుగను, న్యాయవాదులుగను పనిచేయుచున్నారు. మైసూరు రాష్ట్రములో బట్టలనేత వృత్తి తెలుగువారి చేతులలో నున్నది. ఇక్కడ గూడా నేతగాండ్రను పద్మసాలీలందురు. తిరువాన్కూరు, మైసూరు, బరోడా, వగైరాలలోనున్న ఆంధ్రులకు రాజకీయ పరిజ్ఞానము, విద్య, నాగరికత కలదు.

మైసూరు ఆంధ్రులలో సుప్రసిద్ధులు సర్. మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు, ఎమ్. రామచంద్రరాజుగారు (హైకోర్టు జడ్జి), కె. చెంగల్రాయ రెడ్డి బి.ఏ., బి.ఎల్.గారు, బెంగళూరు రెప్రిజెంటేటివ్ అసెంబ్లి కాంగ్రెస్ పార్టీ నాయకులు, రాజమంత్రప్రవీణ దివాన్ న్యాపతి మాధవరావు (మైసూరు దివాన్) గారు ; బెంగుళూరు విశ్వకర్నాటక పత్రికా సంపాదకులు టి. టి. శర్మగారు, చిటల్ దుర్గ జిల్లాబోర్డు అధ్యక్షులు బి. వెంకట శ్యామన్న బి.ఏ. బి.ఎల్. గారు, కోలారు జిల్లా బోర్డు అధ్యక్షులు ఎల్. వేమారెడ్డిగారు, మైసూరు మహారాజ కళాశాల ఆంధ్రాధ్యాపకులు, బహుగ్రంథకర్తలైన రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ



డాక్టరు పి. వరదరాజులు నాయుడు
అఖిల భారత హిందూ మహాసభ ఉపాధ్యక్షులు.

గారు, శ్రీ కె. ఎస్. ఆచార్యులు ఎమ్. ఏ. (మైసూరు టెక్స్టుబుక్ కమిటీ కార్యదర్శి)గారు, శృంగేరీమఠస్వామి శ్రీ జగద్గురు శంకరాచార్యులువారు, విద్వాన్ బి. ఎస్. రాజయ్యంగారు, శ్రీ ఎస్. వి. శ్రీనివాస శెట్టిగారు, ఎన్. సి. తిమ్మారెడ్డిగారు, (మైసూరు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు), చిటల్ దుర్గ జిల్లా నాయకులు ఎమ్. వి. గోవిందరాజాచారిగారు, మైసూరు రైల్వే అసిస్టెంటు కంట్రాక్టరు బి. వి. నారాయణ రెడ్డిగారు, ఎన్. బాల కృష్ణయ్య (అడ్వకేటు) ఎమ్. ఎల్. సి. గారు, పత్రికాధిపతులైన బి. ఎన్. గుప్తాగారు, శ్రీమతి బి. కామేశ్వరమ్మ బి.ఏ. గారు మొదలైన వారుగలరు. వీరందరును ఉన్నత పదవులలోనివారు, సంస్కారముగల సంపన్నులు. మైసూరు ఆంధ్రుల అభ్యుదయమునకై పాటు పడుచున్న 'ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజ' మొకటి బెంగుళూరులో గలదు.



పుదుక్కోట సంస్థాన లాంఛన చిహ్నము.

## పుదుక్కోటసంస్థానము

ఇక, పుదుక్కోట సంస్థానములోని తెలుగు వారిని గురించి తెలుసు కొనవలసి యున్నది. ఆప్రదేశమునందలి ఆంధ్రులను గురించి పుదుక్కోట రాజ్య కార్యధురంధరులైన శ్రీజనాబ్ ఖాన్ బహదూర్ పి. కలీఫుల్లా సాహెబ్ బహదూర్ ఎమ్. ఏ., బి. ఎల్., గారు ఈ దిగువ ఉదాహరించబడిన కొన్ని వివరములను తెలియజేసిరి.

**పుదుక్కోట సంస్థానాంధ్రులు**

1941 జనభా లెక్కల ననుసరించి సంస్థానపు మొత్తము జనాభా 4,38,348 మందిలో 13,250 మంది తెలుగు వారు గలరు.

విజయ నగరరాజుల సామంతులై దక్షిణదేశమందు దిగ్విజయముగావించి తమ పరిపాలనము సాగించిన మధుర, తంజావూరి ఆంధ్రనాయకుల పాలనమందు ఈ ప్రాంతములకు తెలుగు వారు ఎక్కువగా వచ్చిరి. అట్లు వచ్చిన వారిలో రాజ కార్య నిర్వహణాధికారము వహించుటకై తెనుగు నియోగి బ్రాహ్మణులు, సత్కర్మల నిర్విఘ్నముగా కొనసాగించుటకై వైదిక బ్రాహ్మణులు గలరు. ఇక్కడే మురికినాడు, వెలనాడు, కరణకమ్మ, వేంగినాడు అను తెలుగు బ్రాహ్మణ కుటుంబము లనేకము లున్నవి. ఈ ఆంధ్ర బ్రాహ్మణులు రాజాస్థానమున గౌరవ సత్కారములు పొంది, ఉన్నతాధి కారములు వహించిరి. నేటికిని రాజ పురోహితులు ఆంధ్ర బ్రాహ్మణులే!

ఇచ్చట కాపు, కమ్మ, వెలమ, తెగలకు సంబంధించిన వారిని బలిజ వంశస్థులనియు, రాజులనియు అందురు. బలిజలలోచాలా మందికి వ్యవసాయము వృత్తి. ఇచ్చటి రాజులు క్షత్రియులమని చెప్పుకొందురు. వైవాహికాది శుభ కార్యములలో వీరుఖడ్గ పూజజేయుదురు. ఈ రాజులుసైన్యాధికారులుగా నున్నారు. సైనిక వృత్తులలో వీరు దక్షులు. బలిజశాఖలకు జెందిన గాజులకాపులు గూడా గలరు. కోలట్టూరు తాలూకాలో వీరి జన సంఖ్య అధికముగా నున్నది. గాజుల కులస్థులకు గాజులు చేయుట వృత్తి. వీరుగాక, జెట్టివాండ్రు, కమ్మరి, కుమ్మరి, వడ్ల మొదలగు కుల వృత్తులు చేసుకొను వారు, వైష్ణవ మత బోధకులైన 'దాసరులున్ను' గలరు. తోటీలు కొందరు జమీందారులు. వీరున్నూ తెలుగువారే! వీరు జక్కమ్మ, బొమ్మక్క మొదలైన దేవతలను ఆరాధింతురు. సంస్థానమునకు సంబంధించిన భట్రాజులున్ను, రౌతులున్ను ఆంధ్రులే!

పుదుక్కోట సంస్థానమున ఆంధ్రులు అనేక ఉన్నత స్థానముల నలంకరించిరి. ఈ ప్రాంత ప్రముఖులలో; విజయరఘునాథరాయల సలహాసంఘ సభ్యులలో ప్రధాను

డైన అనంతయ్యగారు (1812-1815); దివాన్ బహదుర్ ఎస్. వెంకట్రామదాసు నాయుడుగారు (1899-1909); దివాన్ బహదుర్ టి. రాఘవయ్యపంతులు సి. ఎస్. ఐ., (కౌన్సిల్ ఆఫ్ ఎడ్ మినిస్ట్రేషన్ అధ్యక్షులు 1929–1931) గారు; ప్రధాన న్యాయ మూర్తులు, సలహా సంఘ సభ్యులు అయిన పి. చెంచయ్యగారు (1931) చెప్ప దగినవారు.

పుదుక్కోట సంస్థానాధీశుల వంశ వివరణము, చరిత్ర తెలుసుకొనుటకు పుదుక్కోట ఆస్థానకవి, ఆంధ్ర భాషార్ణవము విరచించిన (1769-89) నుదురుపాటి వెంకనార్యుని



పండిత కె. నీలకంఠ శాస్త్రి, మద్రాసు విశ్వవిద్యాలయములో చరిత్రశాఖ ప్రధానాచార్యుడు.

తొండమాన్ వంశావళిన్ని; అతని కుమారుడు సాంబయ కవి కృతమైన తొండమాన్ విజయమున్ను, ఆధారములు. అనేక సంస్కృతాంధ్ర పండితులు ఈ రాజాస్థానము నలంకరించి యుండిరి. శ్రీ త్యాగరాజ స్వామి 19 వ. శతాబ్దమున ఈ ఆస్థానమునకు వచ్చి, జ్యోతిస్వరూపిణి అనే రాగమున కీర్తన యిచ్చట రచించినట్లు ప్రతీతి గలదు.

సంస్థాలాంఛనచిహ్నము గూడా తెనుగులోనే యున్నది. ప్రథమమున తొండమాన్ పాలకులు విజయనగర సామంతులైన ఆంధ్రనాయక పాలకులకు సామంతులు. 18 వ. శతాబ్దిమధ్య భాగము నుండియు వీరు స్వతంత్రులై రాజ్యముపాలించ మొదలు పెట్టిరి. నేటి పాలక వంశమునకు మూలపురుషుడైన ఆవడి రఘునాథ తొండమానునకు శ్రీరంగ రాయలు "రాయ రాహుత్తరాయ, రాయ మన్నీడు రాయ" అను బిరుదమును ఆయన శక్తి సామర్థ్యములను మెచ్చుకొని యిచ్చెను. ఈ వంశజు లందరికిని 'రాయ' అను బిరుదము కలదు. ఈ వంశజులు తమకు నేతలైన విజయనగర రాజుల గౌరవ చిహ్నముగా తమ సంస్థాలాంఛన చిహ్నమును తెనుగున వ్రాయించుకొనిరి.

ఈ సంస్థానాధీశులు, 'అమ్మన్ కాసు' అనే నాణెము, దసరా ఉత్సవములలో బీదలకు దానముగా నిచ్చుటకై ముద్రింపించెదరు. దానిపై 'విజయ' అని తెలుగున వ్రాయబడి యుండును. నాణెము విలువ ఒక పైసా.

వీరు గాక బొంబాయి రాష్ట్రపు స్వదేశ రాజ్యములలో 12,977 మంది; బీహారు, ఉత్కళ రాష్ట్రములకు జెందిన స్వదేశ సంస్థానములలో 7,405 మంది; వంగ రాష్ట్ర స్వదేశ సంస్థానములలో 368 మంది; ఆంధ్రులుగలరు.

## రాష్ట్రేతరాంధ్రులు

అన్య రాష్ట్రములలో నివసించుచున్న ఆంధ్రు లందరిలోను తమిళ నాడులో నివసించుచున్న ఆంధ్రుల జనసంఖ్య అధికము. వీరి తరువాత బొంబాయి ఆంధ్రుల జనసంఖ్య హెచ్చు.

ఈ క్రింది పట్టికలో దక్షిణదేశపు జిల్లాలయందు తెలుగు మాతృభాషగా మాటలాడేవారి సంఖ్య, 1931 జనాభా లెక్కలను బట్టి వివరిస్తున్నాము :—

| జిల్లా | తెలుగు మాటలాడు వారిసంఖ్య | జిల్లా | తెలుగు మాటలాడు వారిసంఖ్య |
|---|---|---|---|
| తిరుచునాపల్లి | 9,15,460 | రామనాథ్ | 1,97,019 |
| కోయంబత్తూరు | 5,29,640 | దక్షిణఆర్కాడు | 1,84,334 |
| సేలం | 4,16,224 | తిరునల్వెల్లి | 1,79,960 |
| | | తంజావూరు | 68,429 |
| చెంగల్పట్టు | 3,19,946 | మలబారు | 16,330 |
| ఉత్తరార్కాడు | 3,17,765 | నీలగిరి | 9,482 |
| మధుర | 3,03,689 | దక్షిణ కెనరా | 1,025 |
| | | మొత్తము | 34,59,303 |

నేటికి ఈ సంఖ్యలు ఇంకను అధికముగానుండునని ఊహించుటకు అవకాశమున్నది.




శ్రీ సాధు వరదరాజం పంతులు. తిరునల్వేల్లి.



శ్రీ ఎస్. సి. వెంకటప్ప చెట్టి, ఎమ్. ఎల్. ఏ., సేలం

మధుర విమానము, శ్రీ మీనాక్షి ఆలయ గోపురములు తంజావూరి సరస్వతీ గ్రంథ మహల్ వీరి పాలన నాటి నిదర్శనములు. సత్యభామా సాంత్వనము రచించిన కామేశ్వర కవి, రాధికా సాంత్వనము విరచించిన కృష్ణకవి, విజయ విలాస కావ్య కర్తయైన చేమకూరి వేంకటకవి, సంస్కృత కవియైన శ్రీనివాస దీక్షితుడు ఇక్కడి వారు. మధురాంధ్రకృతులకు వీరుమార్గదర్శకులు. రాజులు, కవులు "పండు వెన్నెలల తేటకు జొక్కు" రసహృదయులు.

ఇచ్చట జమీందార్లందరును కమ్మ, రెడ్డి, బలిజ వంశజులు. ఎట్టియాపురం, కురివికుళం, ఇలయరసనేందల్, వడకరై, తేవారం, కాపత్తూరు, మొదలైన 14 తెలుగు జమీందారీలున్నవి. ఈప్రాంతమున మొలకనాటి వారున్ను,

చోళ, పాండ్య, రాజుల నోడించి అప్రతిహతముగా ఆంధ్రనాయక రాజులు కొంత కాలమీ భాగములు పాలించిరి. తమ పతాకమును ప్రతిష్ఠించి వీరు తెలుగు జాతినీ, తెలుగు సంస్కృతినీ ఉన్నత స్థితికి తెచ్చిరి. ఈ నాయక వంశమున ప్రఖ్యాతి పొందిన తిరుమలనాయని ప్రతిమ మధుర మీనాక్షి ఆలయములో నున్నది. పాలనకే కాక, కళారాధనకు కూడ వీరు వాసి కెక్కిరి. శ్రీరంగనాథుని ఆలయములోని దంతపు బొమ్మలు,

ఆంధ్రనాయకపాలకులు; 30 లక్షల తమిళనాటి ఆంధ్రులు



శ్రీ పెరుమాళ్‌స్వామి రెడ్డి, ఎం.ఎల్.సి. ఉ. ఆర్కాడు జిల్లాబోర్డు అధ్యక్షులు.



శ్రీ పూసపాటి కుమారస్వామి రాజా, ఎమ్. ఎల్. ఎ. రామనాడు జిల్లాబోర్డు అధ్యక్షులు.



శ్రీ పి. ఎస్. రంగస్వామినాయుడు.
పి. ఎస్. జి. అంద్ సన్సు మేనేజరు, కోయంబత్తూరు.

కాసల నాటివారు, సాధువారు, టంగుటూరి వారు, న్యాపతి వారు మొదలైన బ్రాహ్మణ కుటుంబములకు చెందినవారున్ను; పూసపాటి వారు, ఆవుటుపల్లి వారు, చింతల పాటివారు, కాకర్ల వారు, గొట్టిపాటి వారు మొదలైన కమ్మ, రెడ్డి కుటుంబములకు చెందిన వారున్ను; జనపవారు, దేవాంగులు, చాకలి, మంగలి, యాదవులు, కంసాలి, కుమ్మరి, వడ్రంగి, మొదలైన తెగలకు సంబంధించిన వారున్ను గలరు. తమిళ నాడు కాంగ్రెస్ అధ్యక్షులుగానున్న ఓమందూరు రామ స్వామి రెడ్డిగారు మన తెలుగువారే. ఇచ్చటి క్షత్రియులు, ఉర్లను క్షత్రియులనబడు రాచ జాతి వారు. వీరు 300 సం. ల. క్రిందట విజయనగర ప్రాంతముల నుండి వచ్చి, పుదు ప్పాళియము, ఎళ్లసు ప్పాళియము, సింగ రాజు కోటలను మూడు కోటలను కట్టుకొని నివసించుటచే ఆభాగమును ఇప్పుడు రాజు పాళియ



శ్రీ రామస్వామి నాయుడు, ఎం.ఎల్.ఏ.
కోయంబత్తూరు.

మని అందురు. ఇచ్చట తెలుగు వారికిన్ని అరవ వారికిన్ని వైవాహికాది సంబంధము లుండవు. ఇచ్చట తెలుగువారు తెలుగు సంవత్సరాది, భోగిపండుగ, నాగుల చవితి మొదలైన పండుగలు కేవలము ఆంధ్రసంప్రదాయము ననుసరించి జరుపుదురు. దక్షిణాదిని ఎర్రనేలయంతా రెడ్లు, నల్లనేల యంతా కమ్మలు ఆక్రమించి యున్నారు.

కోయంబత్తూరు జిల్లాలో గూడా అధికముగా ఆంధ్రు లున్నారని చెప్పి యుంటిమి. అనేక దానములను చేసిన ఆంధ్ర ప్రముఖులలో పి. యస్. జి. వారి కుటుంబము



డాక్టర్ బి. వి. నారాయణస్వామి నాయుడు.
అన్నామలై విశ్వవిద్యాలయములో ఆర్థిక శాస్త్రాధ్యాపకుడు.

కోయంబత్తూరులో ఒక ఉన్నత పాఠశాలను పెట్టించిరి. వీరి యాజమాన్యమున అనేక కర్మాగారములు, ప్రత్తిమరలు కలవు. కోయంబత్తూరులో విదేశసంచారము చేసి, యంత్ర విషయికమైన విజ్ఞానము బడసివచ్చిన, జి. డి. నాయుడు అండ్ కంపెనీవారి విద్యుత్ యంత్రములు, రేడియోలు తయారు చేయు కర్మాగారము గలదు. కోయంబత్తూరు, తిరునల్వెల్లి, ఉత్తర ఆర్కాడు, దక్షిణ ఆర్కాడు, మధుర, చెంగల్పట్టు, రామనాడు జిల్లా బోర్డుల అధ్యక్షులు గను ఉపాధ్యక్షులుగను అనేకులు తెలుగు వారున్నారు. దివాన్ బహదూర్ కుమారస్వామి రెడ్డిగారు, సుబ్బ రాయులు రెడ్డిగారు ఆంధ్రులే.



ప్రొఫెసర్ ప్రతాపగిరి రామమూర్తి, ఎం. ఏ., విల్సన్ కాలేజి, బొంబాయి.

తమిళనాటి శాసన సభా సభ్యులలో నూటికి 50 మంది తెలుగు వారు. తమిళనాటి కాంగ్రెస్ కమిటిలో నూటికి 40 వ వంతు తెలుగు వారు.

తమిళనాటి తెలుగువారి పురోభివృద్ధికై ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజమును స్థాపించి శ్రీసాధు వరద రాజం పంతులుగారు అనల్పమైన కృషిజేయు చున్నారు.

ఇచ్చటి ప్రముఖులలో చెప్పుకొన దగినవారు దివాన్ బహదుర్ నాగమయ్య; ఆంధ్ర నాయకులు సాధు వరద రాజం **పంతులు** గారు; మద్రాసు విశ్వ విద్యాలయ చరిత్రాధ్యాపకులు ఆచార్య కె. నీలకంఠ శాస్త్రి ఎమ్. ఏ. గారు; పూసపాటి కుమారస్వామి రాజా ఎమ్. ఎల్. ఏ గారు; రావు బహదూర్ కె. సీతారామ రెడ్డి గారు, (దక్షిణ ఆర్కాడు జిల్లా బోర్డు అధ్యక్షులు) తమిళ నాటి కాంగ్రెస్ అధ్యక్షులు, మద్రాసు లెజెస్లేటివ్ కమిటీ సభ్యులు ఒమందూరి రామస్వామి రెడ్డి మొ॥ వారు.

దక్షిణాత్య సంగీతమునకు మహాసౌధం నిర్మించి పెట్టిన త్యాగరాజు ప్రాచీన దక్షిణాంధ్ర వంశజుడే. ఈయనను మనమేకాదు సంగీత వేత్తలందరూ నాద బ్రహ్మ అని పూజించెదరు. క్షేత్రయ్య పదాలు సంగీతములో రసవద్గుటికలు అని పేరు తెచ్చుకొన్నవే గదా! ఆయనకూడా ఈ ప్రాంతీయుడే.



డాక్టరు గంటి సత్యనారాయణ, బొంబాయి.

బొంబాయి రాష్ట్రపు ఆంధ్రులు, తమిళులు ఓఢ్రులు మాదిరిగా 30, 40, సంవత్సరముల క్రిందటమాత్రమే వచ్చి చేరినవారు కారు. మహారాష్ట్ర సామ్రాజ్య పతనానంతరము ఆంగ్లేయ సేనలందు సైనికులుగా చాలామంది తెలుగు వారు చేరి పనిచేసిరి. వీరి వంశ పరంపరలోని వారు పూనా ప్రాంతములోవిస్తారముగా గలరు. కొందరు ఆ రాష్ట్రమునకు రాష్ట్ర నిర్మాతలుగా వెళ్లిరి.



శ్రీ శిష్టా వెంకట్రావు, వస్తు ప్రకటనా ప్రవీణుడు, బొంబాయి.

**బొంబాయి ఆంధ్రులు 163 వేలు**

వీరి సంఖ్య 1931 నాటికి 163 వేలున్నదని ప్రభుత్వపు లెక్కలవలన తెలియుచున్నది. ఇప్పుడు వీరు దరిదాపు రెండు లక్షలకు మించియుందురు. ఒక్క షోలాపూరు, పూనా ప్రాంతములందే 48 వేలదాకా తెలుగువారున్నారు. ఒక్క బొంబాయిలోనే 17 వేలమంది కలరు. ఇక్కడి పద్మసాలీలు అందరూ ఇప్పుడు మంచి పరిస్థితిలో నున్నారు.

కామాటీపురం తెలుగువారి ఆదిమనివాసం. కామాటీపుర వాసులకు తెలుగు వ్రాయను చదువను బాగావచ్చును. ఈ ప్రదేశమున తెలుగు వారు స్థాపించిన గ్రంథాలయము, మారుతీ ఆలయము లున్నవి. బొంబాయి ఆంధ్రులు 1939 సం॥లో తెలుగు సేవాసంఘమును నెలకొల్పిరి. ఈ సంఘ సేవా ఫలితముగా తెలుగును బొంబాయి విశ్వవిద్యాలయము



శ్రీ పాత్రుని వెంకటనారాయణ, బొంబాయి.



శ్రీ చట్టా భాస్కరయ్య, ఎమ్. ఏ.,
ఈస్టు ఇండియన్ రైల్వే కంపెనీ
చీఫ్ ఆడిటర్ , కలకత్తా.

గుర్తించెను. తెలుగు సేవాసంఘ ప్రధాన కార్య నిర్వాహకులు ఎస్. ఎల్. శీలం గారు ; నల్లాని చక్రవర్తుల నర్సింహాచార్యులు బి. ఏ., బి. ఎల్. గారు. ఇచ్చటి ఆంధ్రులలో చాలా మంది పాటకపు జనులు. కర్మాగారములలో పనిచేయుదురు. స్త్రీలు బీడీలు చుట్టే కొట్లలో పనిచేసి 10 అణాలు మొదలు 12 అణాలు వరకు సంపాదింతురు. ఇక్కడ బొంబాయి ఆంధ్రసంఘమువారు స్థాపించిన తెనుగు పాఠశాల ఒకటి ఉన్నది. ఈ ప్రాంతీయ ఆంధ్రులు పలుశాఖలలో ప్రావీణ్యము వహించియున్నారు.

వీరిలో దివాన్ బహదుర్ విఠల్ శాయన, డాక్టరు రామచంద్ర హనుమంతరావు, డాక్టరు ఎస్. ఎస్. బేలంపల్లి, డాక్టరు గంటి సత్యనారాయణగార్లు ప్రతీతిగలవారు.

వర్తక ప్రముఖులలో కీ. శే. కంచెర్ల జానకి రామయ్యగారి కుటుంబము, శిష్టా వెంకటరావు, చిత్రకారులు చావలి నాగేశ్వరావు, బొంబాయి ఆంధ్రపరపతి సంఘానికి అద్యక్షులైన శ్రీపాత్రుని వెంకట నారాయణగార్లున్నూ చెప్పదగినవారు. ఇచ్చట ఆంధ్రస్త్రీ సమాజము గూడగలదు.



రావుసాహెబ్ శ్రీ కె. ఎస్. ఎన్. మూర్తి, ఎమ్. ఐ., ఆర్. ఏ.,
బెంగాల్ నాగపూర్ రైల్వే
అసిస్టెంటు ఆడిటరు , కలకత్తా.

మొత్తముమీద ఈ ఆంధ్రులు అధికారములు గలిగి ఉన్నత స్థానము లలంకరించి వున్నారు.

మధ్యరాష్ట్రములు, బీరారులలో మొత్తం 1,30,343 మంది ఆంధ్రు లున్నారు. విశేషముగా తెలుగువారు చాందా, బస్తరు జిల్లాలలోను, నాగపూర్, కాంప్టీ, కట్నీ, బిలాస్‌పూరు పట్నములలోను గలరు. ఈ ఆంధ్రులను రెండు రకములుగా వర్గీకరించవచ్చును. కాకతిరాజులు నైజాము మండలములను ఏలిన రోజులలో సామీప్యమునఉన్న చాందా, బస్తరు, జిల్లాలకు వచ్చినవారు.



శ్రీ పెండ్యాల సత్యనారాయణరావు,
ఐ. సి. ఎస్.
కమిషనర్, నాగపూర్.

**నాగపూరు ఆంధ్రులు**

బ్రిటిష్‌వారు వచ్చిన తరువాత, బందరునుండి మిలిటరీసామానులను కంట్రాక్టరులుగా ఎడ్ల బండ్లమీద తోలుకొనివచ్చి ఇక్కడే ఉండిపోయిన కమ్మవారు. ఈ సంతితిలోనివారే సుప్రసిద్ధులు డాక్టరు ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారు ; వీరు కేంద్రప్రభుత్వ రక్షణశాఖా సలహాదారులుగా ఢిల్లిలో ఉండి మొన్నమొన్ననే స్వర్గస్థులయిరి.

తూర్పు యిండియా వర్తక సంఘమువారి గుమాస్తాలుగా మచిలీపట్నము, కృష్ణాజిల్లా పరిసరములనుండి వచ్చిన బ్రాహ్మణకుటుంబములు, నాయుడుకుటుంబములవారు గలరు. నాయుళ్లలో పూనాకు వెళ్లి, పూనానుండి ఇక్కడకు వచ్చినవారు కొందరున్నారు. ఈ కోవలోనివారే ఆర్. ఎస్. నాయుడు సంతతివారైన కొరారు నారాయణస్వామి, శ్రీనివాస నాయుడు, క్రికెట్టు ఆటలో



కీ. శే. రావుబహదూర్
శ్రీ దహగం లక్ష్మినారాయణ, నాగపూర్,
నాగపూర్ విశ్వవిద్యాలయమునకు
గొప్ప భూరివిరాళ మిచ్చినవారు,
ఖనిజసంపన్నులు.

ప్రపంచ విఖ్యాతి పొందిన సి. కే. నాయుడు, సి. ఎస్. నాయుడు మొదలైనవారు. కోతారు నారాయణ స్వామిగారు నాగపూరు కాంగ్రెసునకు ఆహ్వాన సంఘాధ్యక్షులు. బందరు కాపురస్థులు శ్రీనివాసరావు నాయుడు గారు వార్ధాలో 17 సం॥ మ్యూనిసిపల్ ఛైర్మన్‌గాను, పబ్లిక్ ప్రాసిక్యూటరుగాను, 3 సం॥ మంత్రిగాను పనిచేసిరి. బ్రాహ్మణ కుటుంబములలో గణనకెక్కినవారిలో అమెరికా, జపాన్ మొదలగు విదేశములకు వెళ్లి, నాగపూర్ విశ్వ విద్యాలయమునకు వైసు చాన్సలరుగానుండిన హైకోర్టు జడ్జి మాచిరాజు భవానీ శంకర నియోగిగారు * పేర్కొనదగినవారు.

మన మదరాసు హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేసి, బీరారు ఏజంటుగా ఉండిన సర్. ముత్తా వెంకట సుబ్బారావుగారు, నాల్గు జిల్లాల కధికారియైన పెండ్యాల సత్యనారాయణగారను ఐ. సి. ఎస్. ఉద్యోగి, రాఘవేంద్రరావుగారి మేనల్లుడు, అభివృద్ధికి రానున్న బారిష్టరు కోసలేంద్రరావు, అసిస్టెంటు పోష్టుమాస్టర్ జనరల్ కాజ రామారావు గార్లు, సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ కార్యదర్శి కోదండరావుగారున్ను, నాగపూర్ సైన్సు కళాశాల ప్రధానాధ్యాపకులుగానున్న డాక్టరు కాకర్ల కృష్ణమూర్తిగారున్ను, కార్మిక నాయకులు కేలప్పన్‌గారున్ను మొ॥ ప్రముఖులు ఉత్తమ పదవులలో నున్నారు. వీరుగాక, కమ్మరి, కుమ్మరి, చాకలి, మంగలి, మొదలైన కుటుంబములనేకములున్నవి.

ఇక్కడి ఆంధ్రుల అభివృద్ధికై ఆంధ్ర సంఘమును స్థాపించి, దాని కధ్యక్షులుగానుండి పనిచేయుచున్నవారు రేకపల్లి భుజంగంగారు. ఈ ఆంధ్రసభకు ఒక గ్రంథాలయమున్ను, స్త్రీలశాఖయున్ను ఉన్నవి. వీరు ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ, భారతి మొదలైన పత్రికలు తెప్పించుకొంటున్నారు. ఈ సభ ఆంధ్రుల ఐక్యమునకు దోహదముగా నున్నది. సాధారణ కుటుంబములవారు తెనుగు మరచిపోయి, మహారాష్ట్రభాషను మాట్లాడుచున్నారు. వీరికిని మహారాష్ట్రులకును సంబంధ బాంధవ్యములు జరుగుచున్నవి. భవానీ శంకర నియోగిగారు, డాక్టరు కృష్ణమూర్తిగారు మహారాష్ట్ర కన్యల వివాహమాడిరి.

---

*న్యాయమూర్తి పదవుల నలంకరించినవారి పటములను 'అవి, ఇవి' అధ్యాయములో చూడగలరు.

### వంగరాష్ట్రములోని ఆంధ్రులు

మనము కలకత్తా రైలులో ప్రయాణము చేయుచున్నప్పుడు చాలామంది స్టేషన్ మాస్టరులను, గార్డులను, తెలుగువారిని చూతుము. కిడర్‌పూర్, ఖరగ్‌పూర్ బి. ఎన్. ఆర్. రైల్వే ఆఫీసులలోను, కర్మాగారములలోను ఆంధ్రులు పనిచేయుచున్నారు. వంగరాష్ట్రోద్యమము, వందేమాతరోద్యమములవలన మన దేశమున గలిగిన సంచలనముతో, అనేకులు అక్కడికి వెళ్లిరి. ఆర్యసమాజము, బ్రహ్మసమాజముల సంపర్కములవల్ల, బిపిన్ చంద్రుని ఆంధ్రదేశాగమనానంతరము వారికీ మనకూ సంబంధములు, వంగరాష్ట్రమునకు రాకపోకలు అధికమయ్యెను.



బారిస్టర్ శ్రీ ఆర్. శ్రీనివాసరావు నాయుడు.
వార్ధా మ్యూనిసిపల్ అధ్యక్షులుగా 17 సం॥లు పని చేసిరి.

నేషనల్ మెడికల్ కాలేజి, శాంతి నికేతనం, కలకత్తా విశ్వ విద్యాలయములలో ఎమ్. ఏ., బి. కామ్., ఎమ్. కామ్., పరీక్షల చదువుటకు అనేక విద్యార్థులు వెళ్లెడివారు. ఇంకా ఇప్పుడు అక్కడ చాలామంది చదువుకొనుచున్నారు. వీరుకాక, అక్కడ నారమిల్లులలో కూలీలుగా వెళ్లినవారున్నారు. కలకత్తా కర్మాగారములలో ప్రభుత్వ కార్యాలయములలో చాలామంది పనిచేయుచున్నారు. స్త్రీలుకూడా కలకత్తాకు చదువుకొనుటకు వెళ్లిరి. అట్టివారిలో ముఖ్యులు డా॥ శకుంతలరావుగారు ఎమ్.ఏ., కే. శే. మాగంటి అన్నపూర్ణాదేవిగార్లు.



శ్రీ పి. ఎస్. నారాయణ, కలకత్తాలో గోపాల పేపరు మిల్సు డైరెక్టరు, మారీ టైము స్టోర్సు లిమిటెడ్ డైరెక్టరు, ఛైర్మన్‌గా నున్నారు.

రాయప్రోలు సుబ్బారావు, కీ. శే. కవి కొండల సాంబశివ రావు, బెజవాడ గోపాల రెడ్డి, రాయసం వెంకట శివుడు, పెద్దాడ రామస్వామి తల్లావఝుల శివ శంకరశాస్త్రి, వేమూరి రామకృష్ణారావు, అక్కిరాజు ఉమాకాంత పండితులు, జొన్నల గడ్డ సత్యనారాయణమూర్తి గార్లు కలకత్తా చదువులకై వెళ్లియుండిరి.

కలకత్తాలో బహుకాలము విశ్వవిద్యాలయమున ప్రొఫెసరుగానుండిన, సర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు ప్రస్తుతము కాశీ విశ్వ విద్యాలయమున వైసు ఛాన్సలరుగా నున్నారు. కలకత్తా విశ్వ విద్యాలయములో కొందరు ఆంధ్రాధ్యాపకులున్నా గలరు. వర్తక వ్యాపారములు సాగించుచున్న వైశ్య ప్రముఖులున్నూ, కూలీనాలీ, ఉద్యోగములు చేసుకొనువారు అనేకులున్నూ ఉన్నారు.

కలకత్తాలోని ఆంధ్రులకు ఆంధ్రసంస్థ, అందు రెండు పాఠశాలలు గలవు. ఆంధ్ర విద్యార్థులు నెలకొల్పిన సంస్థ కూడా ఒకటి వున్నది. ఈ ఆంధ్ర సంఘముయొక్క 5వ మహాసభ 25-1-42 వ తేది ఆదివారమున సంఘ భవనమున జరిగినది. శ్రీ ఎన్. ఎల్. ఆర్. నాయుడుగారు అధ్యక్షులు. ఉపాధ్యక్షులు డాక్టరు సి. సాంబశివరావు కార్యదర్శులు ఎల్. నరసింహారావు, వి. ఎల్. ఆర్. మూర్తిగార్లు.

వంగరాష్ట్ర ఆంధ్రులలో చెప్పదగినవారు శ్రీ పి. ఎస్. నారాయణగారు; కలకత్తా ఇండస్ట్రియల్ బ్యాంకునకు డైరెక్టరుగా కొంతకాలము పనిచేసి, అనేక లిమిటెడ్ కంపెనీల కార్యదర్శిత్వము వహించిరి. ప్రస్తుతము వీరు లక్నోలో ఉన్నారు. ఆంధ్రసంస్థకు వీరు అమితమైన సేవజేసిరి. వీరుగాక ప్రస్తుతము కలకత్తాలో ఈస్టు ఇండియా రైల్వేకంపెనీలో చీఫ్ ఆడిటర్‌గా పనిచేయుచున్న చట్టా భాస్కరయ్యగారు, బి. ఎన్. రైల్వే అసిస్టెంటు ఆడిటరు రావుసాహెబు కె. ఎస్. ఎన్. మూర్తిగారు, జర్మనీలో ఇంజినీరింగ్ చదివివచ్చిన నడింపల్లి ఆంజనేయులు ఎమ్.ఎస్. సి., గారు మొదలైన ప్రముఖులు గలరు. వంగ రాష్ట్రములో 31,206, మంది అస్సాము రాష్ట్రమున 30,776 మంది, బీహారు ఒరిస్సాలలో 22,107 మంది ఆంధ్రులు వున్నారు.

బరంపురం, ఛత్రపురం తాలూకాలు, పూర్వమునుండియు రంభవరకూ ఉన్న ప్రాంతములన్నిటిలోను, విశేషముగా ఆంధ్రులున్నారు. రసుల్‌కొండ, కటకములలోనూ ఆంధ్రులున్నారు. ఇప్పటికీ బరంపురం,

**ఉత్కళాంధ్రులు**

కళ్లికోట, పర్లాకిమిడి కళాశాలలు ఆంధ్ర విశ్వ విద్యాలయము క్రిందనే ఉన్నవి. ఇక్కడి ఆంధ్రులలో చాలామందికి వర్తక వ్యాపారములు ముఖ్యవృత్తి. జయపురంలో నూటికి 40 మంది, పర్లాకిమిడిలో నూటికి 60 మంది, ఆస్కాలో నూటికి 30 మంది ఆంధ్రులు గలరు. ఈ ప్రాంతములలో ప్రసిద్ధులైన ఆంధ్రులు కీ. శే. వరహాగిరి వెంకట జోగయ్యగారు, తాడేపల్లి వెంకట కృష్ణయ్య గారు, కీ. శే. ఉన్నవ రామలింగంగారు, నాభి కృష్ణరావుగారు, పోచిరాజు రాజేశ్వరరావుగారు, పోచిరాజు వైకుంఠంగారు, గండికోట సత్యనారాయణగారు, కీ. శే. శ్రీగిడుగు రామమూర్తి పంతులు గారు, శ్రీ వరహాగిరి వేంకటగిరిగారు, డాక్టరు గిడుగు వేంకట సీతాపతి పంతులు గారు, ఆంధ్రప్రభ సంపాదకులుగా నుండిన న్యాయపతి నారాయణమూర్తిగారు మొదలయినవారు.



డాక్టర్ వంగలశివరామ్, పి. హెచ్. డి. లక్నో విశ్వావిద్యాలయములో రాజకీయ శాస్త్రశాఖాధిపతి.

ఉత్కళ రాష్ట్రమున చేరదగిన భాగ



శ్రీ రెడ్డి సన్యాసయ్య, రంగూన్

ములు, సరిహద్దుల విషయమై ఆందోళన జరిగినది. (1933). అప్పుడు సర్. కె. వి. రెడ్డి, డాక్టరు గిడుగు వేంకట సీతాపతి, కీ. శే. ఉన్నవ రామలింగం, అయ్యగారి సుబ్బారావు, పాకనాటి నారాయణరావు, వరదా నారాయణరావుగార్లు ఇంగ్లండు గూడా వెళ్లి బరంపురం, ఛత్రపురం, పర్లాకిమిడి తాలూకాలు ఆంధ్రులు అధికముగానున్న భాగములు కాబట్టి, ఉత్కళ రాష్ట్రములో చేర్చరాదని వాదించియున్నారు.

బరంపురములో కీ. శే. ఉన్నవ రామలింగముగారు ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజము, తెలుగు పాఠశాల స్థాపించి, ఆంధ్రుల అభివృద్ధికి కృషిచేసిరి. ఆదుర్తి లక్ష్మిబాయమ్మగారు (గిరిగారి సోదరి) స్త్రీల తరపున ఒరిస్సా లెజిస్లేటివ్ అసెంబ్లి సభ్యురాలుగా నుండిరి.

**ఇతర రాష్ట్రముల లోని ఆంధ్రులు**

బీహారులోని జెమ్‌షెడ్‌పూర్, టాటానగరం కర్మాగారములలో పనిచేయువారిలో దాదాపు 15 వేలమంది తెలుగువారున్నారు. పాట్నాలో ఇండియన్ నేషన్ పత్రికా సంపాదకులు చావలి హనుమంతరావుగారు; అలహాబాదులో లీడర్ పత్రికా సంపాదకులుగాను, మంత్రిగాను పనిచేసి, కీర్తిశేషులైన చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణిగారు, ప్రఖ్యాత పత్రికా రచయిత కుందూరి ఈశ్వరదత్తుగారు, లక్నోలోని నేషనల్ హెరాల్డు పత్రికా సంపాదకులు కోటంరాజు రామారావుగారు, కరాచీలోని 'సింధు అబ్జర్వరు' సంపాదకులు కోటంరాజు పున్నయ్యగారు, నర్సింగుహోమ్ నిర్వహించెడు వారిభార్య, లక్నో విశ్వవిద్యాలయాచార్యులు డాక్టరు వంగల శివరాంగారున్నూ గలరు. చదువులకై కుటుంబములతో వెళ్లిన విద్యార్థులు ఉత్తర దేశమున అనేకులున్నారు. కాశీయాత్రకు, వేదాంతము, తర్కము, మీమాంస, వ్యాకరణము మొదలైన ఉన్నత శాస్త్రములను అభ్యసించుటకు వెళ్లి, అక్కడే ఉన్నవారు కొందరు. అలీఘర్ విశ్వవిద్యాలయమున చదువుచున్న ఆంధ్ర మహమ్మదీయ విద్యార్థులూ, కాన్పూరులో పసుపు, మిర్చి, వర్తకము చేయుటకై గుంటూరునుంచి వెళ్లిన వర్తక ప్రముఖులు గలరు.

ఢిల్లీలో, ఇప్పుడు రేడియో శాఖలో పనిచేయుచున్న కపిల కాశీపతి, సోమంచి యజ్ఞేశ్వరశాస్త్రిగార్లు, స్త్రీల వైద్య కళాశాల ప్రిన్సిపల్ డాక్టరు లాజరస్, చింతామణిగారి వియ్యంకులును, వ్యవసాయ పరిశోధనాలయ డైరక్టరును ఐన భాగవతుల విశ్వనాథ్‌గారు, హిందూస్థాన్ టైమ్సు పత్రికా విలేఖరి జి. వి. కృపానిధి, వీనస్ ఇన్సురెన్సు కంపెని వ్యవహర్త నరసింహం, శాసనసభా కార్యాలయంలో చివుకుల నారాయణరావుగార్లు గలరు. శ్రీ కడియాల సరోజినీదేవి ఎమ్. ఏ., ఎల్. టి. గారు స్త్రీల కళాశాలకు ప్రిన్సిపాలుగా నుండిరి.



విద్వాన్ వరదాచారి ; సి. ఆర్. నాయుడుగార్లు, నేటాల్.

ఈ విధముగా ఆంధ్రులు ఒక్క ఇతర రాష్ట్రములకే కాదు; రాష్ట్రములను దాటి ఖండాంతర ప్రాంతములకు గూడా వలసపోయిరి.

## దేశాంతరాంధ్రులు.

యుద్ధమునకు పూర్వపు లెక్కలను బట్టి చూచినచో దాదాపు 30 లక్షలకు పైగా విదేశములలో నున్న భారతీయులలో నూటికి 80 మంది, సిలోను, మలయా, దక్షిణాఫ్రికా, ట్రినిడాడ్, ఫీజీరాష్ట్రములలో కనబడుదురు. వీరి పరిస్థితి కొన్ని కొన్ని ప్రాంతములలో క్లిష్టముగా నున్నది. విదేశములలోని భారతీయు లందరిలోను పదియవ వంతు ఆంధ్రులు. వలసలలో తెలుగు వారిలో విశాఖ పట్నం, గంజాం, గోదావరి, జిల్లాలవారు అధికము. బహుళముగా వీరు కూలీ నాలీకై వెళ్లినవారు. సంఖ్యను బట్టి బర్మా ఆంధ్రులు ప్రాధాన్యము వహింతురు. ఒక్క ఆంధ్రులే కాక తమిళులు, ఉత్తర కాళింగులును వలస పోయిరి. కాని, వారందరికన్నా తెలుగు వారు అధిక సంఖ్య గలవారు.

దేశాంతరాంధ్రులు

ఈ ప్రదేశములోని మొత్తపు జనాభా 10,18,000 లలో 1,60,640 తెలుగు వారు. ఇచ్చటి ఆంధ్రులు గృహ నిర్మాణము, గుడ్డలు కుట్టుట, నేయుట, ఖనిజములు తీయుట, రాక పోకల మార్గముల నిర్మించుట, నగలు చేయుట, అచ్చుపని మొదలైన పనులలో నున్నారు. 6,772 మంది చేతి పనులు చేయుదురు. 67,845 మందికి కూలీ నాలీ జీవనము. 2,534 మంది యితర వృత్తులలో నున్నారు. బర్మా కర్మా గారములలో పని చేయుట, రంగూనులో రిక్షాలు లాగుట ప్రధాన వృత్తులు. ఒక్క రంగూనులో 6,900 మంది ఆంధ్రులున్నారు. ప్రభుత్వ కార్యాలయములలోను, వ్యాపార కేంద్రములలోను వీరికిస్థానమున్నది. దూర ప్రాంతములలో వీరు సాంఘిక పౌర సత్వ హక్కులు సంరక్షించు కొనుటకు 'ఆంధ్ర సంస్థ' ను నిర్మించు కొన్నారు. దానికి ఆవుటుపల్లి నారాయణ రావుగారు అధ్యక్షులు. ప్రజోద్యమాభిలాషులైన వీరు ఒక పత్రికను సంపాద కత్వము గూడా వహించిరి. బర్మా ప్రభుత్వపు నామినేటెడ్ శాసన సభా సభ్యులు, కార్మిక సమస్యా పరిష్కర్తలు వీరే! ఆంధ్ర సంస్థకు కేంద్ర స్థానము రంగూను.

బర్మాలో ఆంధ్రులు ఎట్లున్నారు?

రంగూను ఆంధ్ర ప్రముఖులలో అక్కడికి చిన్న చిన్న పనులనుండి, పెద్ద పనులకు పోయి, భూములు, పడవలు,



నేటాలు (దక్షిణ ఆఫ్రికా)లో తెలుగు పాఠశాల.

లాంచీలు, సంపాదించి, లక్షలకొలది ధనము సంపాదించి, 8 లక్షల రూపాయలు దాన ధర్మములకు వినియోగించిన ఉదార సంపన్నులు కీ. శే మల్లాడి సత్యలింగం నాయకరు గారు, తర్వాత, బర్మా శాసన సభా సభ్యులు రంగూన్ కార్పరేషన్ సభ్యులు, ఆనరరీ మేజస్ట్రేటు, ఆంధ్ర మహాజన సంఘాధ్యక్షులు, ఆంధ్ర నాయకులును అగు దొమ్మేటి వెంకట స్వామిగారు, రెడ్డి సన్యాసయ్యగారు, గూడారు తాతయ్య సెట్టిగారు, వెలగల వెంకట రెడ్డిగారు, గుత్తుల సూర్య నారాయణ గారు, కూలీ సర్దార్ రామదేవు ఆది నారాయణ గారు, వర్తక ప్రముఖులు గూడాల వెంకట రెడ్డి నాయుడుగారు, పరిమి సోమ రాజు గారు, కర్రి అప్పలస్వామి గారు, సాలపు బుల్లి అప్పన్నగారు ముఖ్యులు. వీరు మోల్మిన్ ఆంధ్ర సంఘ కార్య నిర్వహణం అతి నిపుణతతో చేయుచున్నారు. పై నుదహరించిన వారందరూ వర్తక వ్యాపారములలోను, నౌకా వ్యాపారములలోను, అధికారములుగల పెద్దలు. భాషాభి

మానం హెచ్చు. వెంగల వెంకట రెడ్డిగారు ఇతిహాస తరంగిణీ గ్రంథ మాలా స్థాపకులు.

ఫిజీ ఆంధ్రులు

ఫీజీ ప్రాంతములో 8 వేలు దాకా ఆంధ్రులున్నారు. వీరు యిచ్చట వ్యవసాయ కేంద్రములలోను, తోట ఉద్యమములలోను పని చేయుదురు. ఫిజీ ప్రభుత్వము ప్రవేశ పెట్టిన 'భూమి శాసనము' అమలు లోనికి వచ్చిన యెడల వీరికి లాభించును. ముఖ్యమైన, ప్రాథమికాధికారమయిన 'ఓటింగు' హక్కు వీరికి ఇప్పటికీ లేదు.

దక్షిణాఫ్రికాలోని ఆంధ్రులు

విదేశములలో తెలుగుల జన సంఖ్యల క్రమమున చూచిన, దక్షిణాఫ్రికా రెండవది. ఆదిలో దక్షిణాఫ్రికా భూస్వాములు, పరిశ్రామికవర్గములను భారత దేశపు వివిధ ప్రాంతముల నుండి తీసుక వెళ్లిరి. వచ్చిన కూలీల నందరినీ స్థూలముగా, మధ్య రాష్ట్రములు-బీహారులనుండి వచ్చి హిందీ మాట్లాడు వారినీ, కలకత్తాలో ఓడ ఎక్కి వచ్చిన వారినీ 'కలకతియా'లనిన్నీ; తెలుగు, తమిళం మాట్లాడు ప్రదేశములనుండి వచ్చిన వారిని మదరాసీయు లనీ రెండు భాగములుగా విభజించిరి. 1867 లో మదరాసు రేవులో మొదటి ఓడ బయలుదేరి నేటాలునకు పోయెను. ఈ కూలీలకు నెలకు 10 షిల్లింగుల రొక్కం, అరబస్తా గోధుమలు లేక జొన్నపిండి, ఇచ్చునట్లుగా వారిచేత కూలీకి ఎగ్రిమెంటు వ్రాయించుకొని ఏర్పాటు చేసిరి. తెలుగులు కూడా మదరాసీయులలోనే లెక్కకు వచ్చిరి. వారికి వ్యక్తిత్వము లేదు. కారణము విద్యావిహీనులు, పేదలు కావడమే! అట్టి స్థితిలో సర్ కె. వి. రెడ్డి నాయుడుగారు ఆ ప్రాంతమును సందర్శించుటకు వెళ్లి, ఆంధ్ర సంఘ స్థాపనకు ప్రోత్సాహ పరచిరి. ఇప్పుడు డర్బనులో స్థాపించిన ఆంధ్ర మహాసభ పది ఉపశాఖలతో విరాజిల్లుతున్నది. సభకు పదియవ వార్షికోత్సవము గూడా పరి సమాప్తమయినది. ఆసంస్థ కాధారభూతులు, అధ్యక్షులును, ధనాఢ్యులు ఔదార్యవంతులైన ఎ. బి. నాయుడు గారు. దక్షిణాఫ్రికాలో 2,19,928 మంది ఆంధ్రులున్నట్లు నాయకుల అంచనాలవల్ల తెలియు చున్నది. ఆంధ్రులు ఇప్పుడిప్పుడు అభివృద్ధికి వచ్చుచున్నారు. వీరు తెలుగు విద్యా వ్యాపకమునకై రెండు పాఠ శాలలు గూడా నడిపిరి.

మారిషస్ ఆంధ్రులు

దక్షిణాఫ్రికాలోని మారిషస్ రాష్ట్రములో 10,000 మంది ఆంధ్రులున్నారు. రాష్ట్రపు జన సంఖ్యలో 2,68,701 భారతీయులు. వీరిలో కూలీలు చదువు సంధ్యలు రానివారు. ఫ్రెంచి భూముల లోను, కర్మాగారములలోను పని చేయుదురు. కొంతమంది తెలుగు వారు అధికారులుగాను, భూస్వాములుగాను ఉన్నారు. ఖండ వాసులకు వీరు పట్టుకొమ్మ!

మొదలైన ఇతర దేశములలోని ఆంధ్రులు

ఇక ఇంగ్లాండులో: బారిష్టరు, పంగులూరి సుబ్బారావుగారు, రష్యాలో పుయ్యూరు వాస్తవ్యులు, రసాయన శాస్త్రజ్ఞులైన, కొలిచెర్ల సీతారామయ్యా గారు గలరు. అనేక విద్యార్థులు, వ్యాపారస్థులు అమెరికాలో నున్నారు. ఒకప్పుడు అత్యుత్తమ స్థితిలో ఉండి, ఉత్తమ చరిత్రగల ఆంధ్రులకు, తెలుగు తేరు నడచిన చవిటి నేల లందైన బంగారు పండిన రోజులు పోయి, ఈ నాటికి పర రాష్ట్రములకు విదేశములకు కూలీకి పోవలసిన దుర్గతి పట్టినది! ఆంధ్రులు కొందరు మద్రాసులో పాకీ పనికి, రంగూనులో రిక్షాలు లాగుటకు, పూనా, సతారాలలో శవములు మోయుటకు గూడా పోవలసి వచ్చినది.

మద్రాసు రాజధానిలోని జనాభా వివరణ (1931)

| | | | జనసంఖ్య |
|---|---|---|---|
| రాజధానిలోని మొత్తము | | ... | 44,328,488 |
| ,, | ,, తమిళులు | ... | 18,517,415 |
| ,, | ,, ఆంధ్రులు | ... | 16,840,433 |
| 10 తమిళ జిల్లాలలో తమిళభాష మాట్లాడు వారు (మద్రాసు సహా) | | ... | 18,007,625 |
| 11 తెలుగు జిల్లాలలో తెలుగుభాష మాట్లాడువారు (మద్రాసు సహా) | | ... | 14,004,130 |

వివిధ ప్రాంతములలో చిందర వందరగానున్న ఆంధ్రులను, వారి సమూజ్వల శక్తినీ ఏకీకరణ మొనర్చుట ఆంధ్రుల సముచిత కర్తవ్యము.

తేజోవంతముగా వెలిగిన తెలుగు దీపము కొడి గట్టినది!

## వివిధరాష్ట్రములలో ఆంధ్రుల సంఖ్య

మద్రాసు రాజధాని జనాభా (1931) లో, గంజాం జిల్లా జనసంఖ్యగూడ కలుపబడినది.



# చెన్నపురి ఆంధ్రులు

చెన్నపురి ఆంధ్రులను గురించి చర్చించ బోయేముందు చెన్నపట్నపు పుట్టు పూర్వోత్తరములను అవగతము చేసుకొనవలెను. ఈ చెన్నపట్నమునకే మద్రాసు అనే మరియొక పేరు గూడా వాడుకలో నున్నది. ఈ పట్నము పుట్టుకను గూర్చి, అంక భూపాలుని ఉషాపరిణయమనే ప్రబంధములో,

> "ప్రళయ కావేరి మైలాపురంబు గల్గి
> తీరమున పోర నదిమట్టు వెట్ట దండ్రి
> పేర దన్మధ్య భూమిని పృథు విభూతి
> నలవరిచె చెన్నపట్టణ మయ్య నృపతి."

అని ఉన్నది. ఈ పట్టణ పాలక వంశమునకు సంబధించిన నాయకుల వంశ వివరణము దామెర్ల వెంకట కవి రచించిన బహుళాశ్వ చరిత్ర మనే గ్రంథములో కనిపించు చున్నది. అసలు ఈ పట్టణానికి ఈ పేరు చెన్నప్ప నుండి వచ్చినదని, చెన్న పట్టణమను శబ్దము వినగానే స్ఫురించు చున్నది గదా!

ఈ పట్టణ చరిత్ర ప్రారంభము క్రీ. శ. 1600 సంవత్సరము. 17 వ శతాబ్దారంభముననే తూర్పు-ఇండియా వర్తక సంఘమువారు మనదేశమునకు వచ్చి, గుజరాత్ దేశమందు మొగలాయిల కొలువు కూటమున తలదాచుకొని, సూరత్ లో వర్తకమునకై ఒక గిడ్డంగి నిర్మించు కొనిరి. కోరమాండల్ తీరమున ఆరోజులలో ఆంగ్లేయులు అతి కష్టము మీద పులికాట్టు వద్ద స్థావర మేర్పరచు కొనిరి. అప్పుడు పులికాట్టు నుండి కడలూరు వరకున్నూగల ప్రదేశమును వందవాసి ముఖ్యపట్నముగా చెన్నప్పనాయని కుమారుడు వెంకటప్ప నాయకుడు, కర్నాటకాధీశుడయిన పెద వెంకటపతి నాయని పేర, అతనికి సామంతుడై ఏలు చుండెను. ఈ పెద వెంకటపతి నాయుడు జీర్ణ విజయనగర రాజ్యమేలిన ఆర్వీటి రాజ వంశమువాడు.

క్రీ. శ. 1565 లో తల్లికోట యుద్ధమందు దక్కనుసుల్తానుల విజయమువలన విజయనగర రాజ్యము అంతమొందినను, పెనుగొండలోను, చంద్రగిరిలోను, చిన్న చిన్న రాజ్యములను కృష్ణ రాయల వంశపు (తుళువ) బంధువులైన ఆర్వీటి వారు పాలించుచుండిరి.

తంజావూరు, మధురలలో రాజ్యముల ప్రతిష్ఠించి, విజయనగర సమ్రాట్టుల సామంతులుగా ఏలుచుండిన నాయక రాజులు ఆప్రాంతముల ప్రాబల్యము వహించి యుండిరి. ఈ దాక్షిణాత్యప్రదేశములైన తంజావూరు, జింజి, పూనమల్లి, వందవాసి, వేలూరు, ప్రళయకావేరి (పులికాట్టు) వెంకటగిరి, కాళహస్తి, నాయక పాలకులు తమలో తాము అధికారమునకై పోటీ పడుచుండిరి. రమారమి 1600 సం॥ర ప్రాంతమున వెంకటపతి నాయుడు



కీ. శే. సర్ పిట్టి త్యాగరాయచెట్టి. మద్రాసు కార్పరేషను ప్రథమ హైందవ అనధికారాధ్యక్షులు (1922).
చెన్నపురి ఆంధ్ర మహాసభ స్థాపకులలో నొకరు.

దామెర్ల చెన్నప్ప నాయని సహాయముతో వేలూరు, జింజి, మున్నగు రాజుల నణచి, తాను వేలూరిలో రాజధాని నేర్పరచుకొని, దేశమున శాంతి నెలకొల్పెను. ఇంతలో మైలాపూరునందు పోర్చ్యుగీజులును, తరువాత డచ్చివారు (ఒలందులు)న్ను వచ్చి, వెంకటపతిరాయల నర్థించి, అక్కడ తమ గిడ్డంగు లేర్పరచుకొనిరి. వెంకటపతి రాయల అనంతరం చంద్రగిరి రాజ్యమునకు వచ్చిన రాజులలోని వారే పైచెప్పబడిన పెద వెంకటపతి రాయలు.

వెంకటప్ప నాయుడు పులికాట్టునుండి, కడలూరు వరకు గల దేశమునకు ఏలికయని చెప్పి యుంటిమి గదా. వెంకటప్ప



సుప్రసిద్ధ ఆంధ్ర వర్తకులు, శ్రీ సామి వెంకటాచలం చెట్టి,
కేంద్ర శాసన సభా సభ్యులు.

నాయుని తమ్ముడు అయ్యప్ప నాయుడు అన్నగారికి కుడి భుజముగా పూనమల్లి నేలు చుండెను. వెంకటప్ప నాయకుడు అప్పుడు ఉత్తరార్కాడు జిల్లాలో నున్న చెన్నసాగరమను తటాకమును, తన తండ్రి పేర కీర్తిచిహ్నముగా త్రవ్వించెను.

ఇక్కడ వర్తకమునకై వచ్చిన డచ్చి వారున్ను, పోర్చుగీజువారున్ను సర్వదా వర్తకమున పోటీపడుచుండిరి. నిప్పుకు గాలి తోడైనట్లు ఈ ఇరుకక్ష్యలవారున్ను యూరప్‌లో తమ దేశముల రెంటికిని కలహములు ఏర్పడుట చేత, హిందూ దేశములో సైతము తాము ఆక్రమించుకొన్న ప్రాంతముల తగవు లాడు కొనుచుండిరి. వీరివల్ల శాంతి చెడిపోవు చుండుటచే అయ్యప్ప నాయడు వీరి తగవణచి, వీరిని నొక్కి పెట్టియుంచుటకై ఈ చెన్నపట్టణమును కట్టించి, తన నౌకాబల మభివృద్ధిచేసికొని, వీరికిని ఇతర వర్తకులకును పోటీ పెట్ట యత్నించు చుండెను.

ఇదే సమయమున మచిలీ పట్నమునను, దుగరాజ పట్నమునను (Armagon) తమ వ్యాపారము మందగించుట చేతను, ప్రళయకావేరిలో డచ్చివారి పోటీ ప్రబలమగుట చేతను ఆంగ్లేయులు, మరియొక వర్తక స్థానమునకు అనుకూలమైన ఉనికిని తూర్పు తీరమున వెదకుకొను చుండిరి. అట్టి తరుణమందు వీరికి, అయ్యప్ప తన అన్నగారి అను మతిని పొంది 1639 లో ఆశ్రయ మిచ్చెను. 1640 మార్చి 1 వ తేదీ ఇంగ్లీషువారు ఇక్కడ కోటకు పునాదులెత్తిరి. దుర్గ నిర్మాణము సెంటుజార్జిడే (23 ఏప్రిల్) నాటికి పూర్తి యగుటచే దానికి సెంటుజార్జి కోటయని పేరు పెట్టిరి. 1653 నాటికి కోట కట్టుట సంపూర్ణమయినది. వీరితో వర్తక వ్యాపార సంబంధములు గలవారు ఈ కోటకు ఉత్తర దక్షిణముల తమ నివాసముల నేర్పరచు కొనిరి. అనతి కాలములో మద్రాసు పట్నములో నాలుగు వందల నేత గాండ్ర కుటుంబములు కాపురము పెట్టుకొనిరి. తరువాత వచ్చిన చెంద్రగిరి రాజులు గూడా ఆంగ్లేయులకు కొంత భూమిని దాన మిచ్చిరి. అట్టి రాజులలో శ్రీరంగరాయలు ఒకడు. ఈ శ్రీరంగరాయలు స్థలముతో పాటు ఫర్మానా కూడా నిచ్చినాడు. (దాని నకళ్లు 3 ఉన్నవి) ఈ శ్రీరంగ రాయల వంశస్థులకు, చంద్రగిరిలో తమ సింహాసనము ప్రతిష్ఠించిన దామెర్లవారికీ తగాదా ప్రారంభమై, దీనివల్ల చెన్ననగరమునకు చెన్నప్ప కుమాళ్లు పెట్టిన పేరు త్రోసి రాజని, తన పేరట శ్రీరంగరాయల పట్నమని దానిని



శ్రీ గద్దె రంగయ్యనాయుడు, ఎం. ఎల్. ఏ.
మద్రాసు కార్పరేషను సభ్యులు.

అనుడని, "ఇది తెలుగు సార్వభౌముడైన శ్రీరంగ రాయలు దయచేయించిన రాజ శాసనం; ఈ చెన్న పట్నమనే నగరం...ఇందలి దేవాదాయ, బ్రహ్మ దాయములను అవిచ్ఛిన్నముగా అమలు జరపాలి; ఇదిగాక ఎల్లప్పుడు దీనిని తెలుగు పట్నంగా గౌరవ ప్రతిపత్తులతో చూచుకుంటూ ఉండవలె" నని ఆ శాసనములో శాసించియున్నాడు. దీనిని బట్టి 1642 నాటికే ఇది దేవాదాయ బ్రహ్మ దాయములతో విరాజిల్లుతున్న చెన్నపట్నం అని, నిస్సంశయముగా తెలుగువారి పట్నమనీ తెలియు చున్నది!

మద్రాసు పట్నం అనే పేరును గూర్చి ఆలోచిస్తే దీనికి అనేక పర్యాయ పదములు కనపడుచున్నవి. అవి మాద్రి పట్నం, మాది రాజు పట్నం, మద్రాసు మొదలైనవి. కాళీ ఘట్టము దొరల నోట బడి కలకత్తా అయినట్లు, మాది రాజు పట్నం సంకుచితమై మద్రాసు అయి యుండునని ఊహించ వచ్చును. కొందరు మద్రాసీ అనే క్రైస్తవుని పేరునుండి వచ్చినదనుచున్నారు. కొందరు మదరసా అనే పదమునుండి వచ్చినదనీ, ఈ పదమునకు మహమ్మదీయుల భాషలో పాఠశాల అని అర్థమనిన్నీ, ఇచ్చట పూర్వము ఆకళాశాల యుండి యుండుటచేత దాని పరిసర ప్రాంతమునకు మద్రాసుపట్నం అనేపేరు వచ్చినదనీ అందురు. పలువురు ఈ ప్రాంతములోని Madre-deens అనే క్రైస్తవ చర్చినుండి దాని చుట్టుపట్ల ప్రదేశమునకు మద్రాసు అని పేరు వచ్చిన దని అందురు. కొందరు ఇది మాది రాజుచే పాలితమైన ప్రదేశము గనుక మాది రాజు పట్నము అనే పేరు వచ్చినదని ఊహించుచున్నారు. ఈ ప్రదేశము మద్రాసు అని పిలువబడే ఒక చిన్న గ్రామము. క్రమేణా చెన్న పట్నమున్ను మద్రాసున్నూ కలసిపోయినవి.

తరువాత తరువాత, ఆంగ్లేయుల పాలన బలపడి మద్రాసు ప్రసిద్ధనగరమైనది. పిమ్మట దీనిని మద్రాసు, చెన్నపట్నము, పట్నము అని అనుచున్నారు. ఈ పట్నము, తీరము ననుసరించి ఉత్తర దక్షిణములకు 9 మైళ్లు పొడవును, తూర్పు పడమరలకు మూడు మైళ్లు వెడల్పును రమారమి 30 చ. మై. వైశాల్యమును గలిగియున్నది. తండయార్పేట, జార్జి టౌన్, తిరువల్లిక్కేణి, చింతాద్రి పేట, మైలాపూరు, కీల్పాకు, పెరంబూదూరు, నుంగంబాకము, మాంబళము మొదలయినవన్నియు దీనిలో గలిసినవి. 1830-31 లో చెన్నపట్నమును గూర్చి ఏనుగుల వీరాస్వామయ్యగారు తమ కాశీయాత్ర చరిత్రలో ఇట్లు వ్రాసిరి.

"యీ చెన్నపట్నము కోడి (జండా) క్రింద యిప్పుడు సాలుకు సుమారు ఒకటింకాలుకోటి వరహాలు వసూలవుతున్నవి. స్థావరజంగమరూపమైన స్థితి మూడు కోట్ల వరహాలు వుండునని తోచుచున్నది. దండు ౫౦ వేల



క్రీ. శే. ఏనుగుల వీరాస్వామయ్య. చెన్నపట్టణం సుప్రీం కోర్టులో హెడ్ ఇంటర్ ప్రెటర్‌గా (1819) పనిచేసినారు. వీరు కాశీ యాత్ర సాగించి, దాని చరిత్ర వ్రాసినారు.

మంది ఫౌజు వున్నది. ఈ బస్తీకి మూడు ప్రక్కలా పహారు (పానా) గోడ పెట్టివున్నది. బస్తీకి కోసెడు దూరములో దక్షిణ ప్రక్క సముద్రము వారగా వుత్తర ప్రక్క సముద్రముగట్టున యెగుమతి దిగుమతి అయ్యే రేవున్ను, సరుకువేసే కొట్లున్ను కట్టివున్నవి. ఈ పట్నానికి అంతా సాపంవీధి; శాలవీధి విశాలమైనవి......దక్షిణమున తిరువళిక్కేణి, మయిలాపూరు, తిరువటేశ్వరునిపేట మొద

లయిన కొన్ని గ్రామములున్నవి. పడమటిప్రక్క చూళ, పారిశపాక, కోమలేశ్వరునిగుడి మొదలయిన కొన్ని గ్రామాదు లున్నవి. ఉత్తర భాగమునందు చాకలపేట, రాయపురము తండయారుపేడు మొదలయిన కొన్ని గ్రామాలు వున్నవి." (కాశీయాత్ర చరిత్ర ౩౭౧ పు. చూ.)

17 వ శతాబ్దమునుండి ఇచ్చట పాదుకొన్న కుటుంబ ములలో బేరీవారి కుటుంబము మొదటిది. దీని నాయకుడు బేరీ తిమ్మప్ప శెట్టి. ఈయన శ్రీరంగరాయలనుండి దాన శాస నమున్నూ, స్థలమున్నూ ఆంగ్లేయుల కిప్పించినాడు. చెన్న



సర్ అల్లాడి కృష్ణస్వామయ్య, బి. ఏ., బి. ఎల్.
అడ్వకేటు జనరల్.

పట్నం వెలయుటకు ప్రధానకారకులలో ఈయనపేరు కూడా చెప్పవచ్చును. ఈయన ఆంగ్లేయుల మన్నన సత్కారములకు పాత్రుడైన ప్రముఖుడు. ఈయనకు చేదోడు వాదోడుగా కాసా వీరన్న, సుంకురామచెట్టి, తంబుచెట్టి మొదలైన ప్రసిద్ధులుండిరి. కంపెనీవారి మన్నన బొందినవారిలో బండ్ల రామస్వామిగారొకరు. వీరు కంపె నీలో వ్రాతకాడుగా జేరి, తన సామర్థ్యముచే తిరునల్వెల్లి సిరస్తదారుడై, చెంగల్పట్టు జిల్లాలోని సేవారం గ్రామ మునకు జమీందారుడుగా నియమితుడయ్యెను. బేరీ తిమ్మప్ప శెట్టి కంపెనీవారికి మూల స్తంభము. ఈయన చెన్నమల్లేశ్వ రుని గుడి, కేశవపెరుమాళ్లాలయము గట్టించెను. ఇప్పటి కిన్నీ ఈపైచెప్పిన కుటుంబములవారు మద్రాసులో ఉన్నత స్థితిలో నున్నారు. వీరేగాక, బైసానివారు మొద లైన ఉన్నత కుటుంబములు ఆనాటినుండిన్ని ఇక్కడనే ఉన్నవి!

1780-1836 మధ్య చెన్నపట్టణములో వుండి ప్రజాసేవ చేసిన ఆంధ్రమహాపురుషులలో ప్రముఖులు, సామయ మంత్రి పుత్రులు, ఆంధ్రనియోగి బ్రాహ్మణులైన ఏనుగుల వీరాస్వామ య్యగారు; 1815 మొదలు 1829 వరకు చెన్నపట్ట ణంలో సదరు అదాలత్ కోర్టులో ద్విబాషిగానున్న వెన్నెలకంటి సుబ్బారావు పంతులుగారి బంధువులు. వీరాస్వామయ్యగారు 1819 లో నేటి హైకోర్టుకు పూర్వము వుండిన సుప్రీము కోర్టులో తెలుగు, అరవము, ఇంగ్లీషు, తర్జుమాచేసే ద్విభాషీ ఉద్యోగములో చేరిరి. తరువాత మొదటితరగతి ద్విభాషీయైరి. అది అప్పటి ఉన్నతో ద్యోగములలో నొకటి. ఆ కాలమున దొరలందరి ప్రేమకు, ప్రజాదరణకు పాత్రులై 1835 లో కొలువు చాలించు కున్నారు. వీరాస్వామయ్యగారు తెలుగు నిఘంటువు వ్రాసిన సి. పి. బ్రౌన్ దొరగారికి స్నేహితులు. బ్రౌను గారు ఇంద్రాణి, శీదా, పాలకట్ట అనే పదముల అర్థములకు, వీరినే ప్రమాణంగా పేర్కొనిరి.

వీరితోటి పేర్కొనదగినవారు నాటి తెలుగు ప్రముఖు లలో కోమలేశ్వరం శ్రీనివాస పిళ్లెగారు, ఐంబాకం రాఘ వాచార్యులుగారు. పిళ్లెగారు 1807 లో చెన్నపట్నములో స్థాపించిన మణేగారి సత్రానికి 11 మంది దొరలతోపాటు నియమితులైన 9 మంది దేశీయ ధర్మకర్తలలో వీరొకరు. రాఘవాచార్యులుగారు కంపెనీవారి కొలువులో మేజిస్ట్రే టుగాను, సూపరింటెండెంటుగాను పనిచేసిరి. ఈపై ముగ్గురు ప్రముఖులూ అనేక ప్రజోపయోగములైన పనులు చేసిరి. పిళ్లెగారు సంస్కర్త. స్వయముగా ఒక బాలికా పాఠ శాల నడపుతూ ఆడపిల్లలకు చదువు చెప్పవలయునని ప్రోత్స హించిరి. వీరిచ్చిన 70 వేల రూపాయలనిధితోనే ఇప్పటి హిందూబాలికా పాఠశాల స్థాపితమైనది. ఈ ముగ్గురికీ ముఖ్య స్నేహితుడు 1823 మొదలు 1853 వరకు మద్రాసు సుప్రీముకోర్టు అడ్వకేటుగా పనిచేసిన జార్జినార్టన్ దొరగారు. నార్టన్ దొరగారితో వీరు కలసి, పచ్చయ్యప్ప ఆరోజులలో చేసిన ధర్మములను వారి బంధువులు దిగమ్రింగుచుండగా, ఆ ధర్మములను బయటికితీసి, కష్టపడి సుప్రీము కోర్టులో

ఒక స్కీము తయారుచేసి దానిని సద్వినియోగపరచిరి. దాని ధర్మకర్తల బోర్డులో (1832) శ్రీనివాసపిళ్లెగారు ఒక ధర్మకర్త, రాఘవాచార్యులుగారు అధ్యక్షులు. తరువాత నార్టన్ దొరగారి ప్రోత్సాహముతో పచ్చయ్యప్ప కళాశాల స్థాపన జరిగినది. ఇంగ్లీషు విద్యావిధానం స్థాపించుటకు ఎల్ఫిక్ స్టన్‌గారు కొందరు దొరలును, దేశీయులును గల బోర్డును (1839) ఏర్పరచిరి. దానిలో రాఘవాచార్యులుగారు, శ్రీనివాసపిళ్లెగారు సభ్యులు. తరువాత స్థాపించబడిన మద్రాసు యూనివర్సిటీ అనే ఉన్నత పాఠశాలా పరిపాలక వర్గంలో కూడా వీరిని సభ్యులుగా నియమించిరి.

ఈ మిత్రత్రయం త్రిమూర్తులవంటి వారు. వీరు ముగ్గురు న్నూ కంపెనీ పాలనలోని లోపములను సరిజేసి, ప్రజల కష్టసుఖాలనుగుంచి యోచించెడివారు. ప్రజలు అప్పుడు అజ్ఞానులై, అనారోగ్యమున పడి, దారిద్ర్యంతో, పన్నుల భారంతో, అధికారుల నిరంకుశత్వంతో క్రుంగిపోవు చుండిరి. ప్రజలలో కొంత చైతన్యమునూ, విజ్ఞానవికాసమునూ గలిగించవలెనని, హిందూ లిటరరీ సొసైటీ అని (నార్టన్ గారి నాయకత్వము క్రింద) పెట్టి ఇంగ్లీషు విద్య అవసరమును గురించీ, పౌరసత్వ హక్కులనుగురించీ అనేక మహోపన్యాసములిచ్చి, ప్రజలను జ్ఞానపథములో పెట్టిరి.



చెన్నపురి ఆంధ్ర మహా సభ రజతోత్సవ సద్భావదిన సందర్భమున రాజాజీ అధ్యక్షతను సభ.

వీరాస్వామయ్య ప్రభృతులు ప్రజాసేవ ప్రారంభించిన పది సంవత్సరముల కాలములోనే ఆంధ్ర వర్తక ప్రముఖులు గాజుల లక్ష్మీనర్సింహంసెట్టిగారు నాయకులై, కంపెనీ వారి పాలనలోని లోపాలు, మిషనరీలు చేస్తున్న అన్యాయము పైవారికి నివేదిస్తూ; ప్రజాభ్యుదయానికి పాటుపడే స్వదేశ సంఘం అనే ప్రజాసంఘమును, క్రిసెంటు అనే జాతీయ పత్రికను 1844 లో స్థాపించి గొప్పరాజకీయ సంచలనమునకు దారితీసిరి!

వీరి కృషి ఫలితంగా గలిగిన విద్యావికాసములను, జాతీయాభ్యుదయమును ప్రశంసిస్తు పచ్చయ్యప్పకళాశాల భవనములో 1868 లో జాన్ బ్రూస్ నార్టన్‌గారు ఉపన్యసిస్తూ, ఉత్తరదేశములో రాజా రామమోహన రాయలవంటివారు ఇక్కడ మన శ్రీనివాస పిళ్లె, వీరాస్వామయ్యగార్లనిచెప్పిరి.

పిమ్మట మద్రాసు ఆంధ్ర ప్రముఖులలో కీర్తిశేషులయిన చిన్నయసూరిగారు, శబ్దరత్నాకర కర్త బహుజనపల్లి సీతారామాచార్యులుగారు, కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, వేదం వెంకటరాయ శాస్త్రిగారు, వావిళ్ల రామస్వామి శాస్త్రులుగారు, పి. సి. పార్థసారథి నాయుడుగారు, రెంటాల వెంకట సుబ్బారావు గారు, సర్ పిట్టి త్యాగరాజ చెట్టిగారు, పురాణం నాగభూషణం గారు, హోఅండ్‌కో ప్రొప్రయిటరు తిరువెంకట చెట్టిగారు, గడ్డిపాటి వీరయ్యానాయుడు గారు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు; ఇప్పుడున్న వారిలో సర్ కూర్మా వెంకట రెడ్డినాయుడుగారు, సర్ అల్లాడి కృష్ణస్వామయ్యగారు, సర్ ముత్తా వెంకట సుబ్బారావుగారు, బి. సోమయ్య పంతులుగారు, సామి వెంకటాచలం చెట్టిగారు, రా॥ బ॥ గోపతి నారాయణస్వామి చెట్టిగారు, ది॥ బ॥ జె. వెంకటనారాయణం నాయుడుగారు, కత్తే వెంకటస్వామి నాయుడుగారు, గద్దె రంగయ్య నాయుడుగారు, మోటూరి సత్యనారాయణగారు, బాలసుందరం నాయుడుగారు గాక, అనేక ఆంధ్రవైశ్య ప్రముఖులున్ను, వైద్యులు, న్యాయవాదులున్ను గలరు.



చెన్నపురి ఆంధ్ర మహాసభ రజతోత్సవ ప్రారంభోత్సవము. ఆంధ్ర మహాసభ అధ్యక్షులు సర్ విజయానంద గజపతిగారు జరుపుట.

చెన్నపురి ఆంధ్రులు, ఆంధ్ర సభను స్థాపించుటకై 1916 ఏప్రియల్ 17 వ తేది సాయంకాలము 6 గం॥ కు, చెన్నపురి జార్జి టౌనులోని, బ్రాడ్వేలో 14 వ గృహ సంఖ్యగల సౌధోపరి భాగమున చెన్నపురి ఆంధ్ర మహాజనుల సమావేశము శ్రీ. శే. సర్ పిట్టి త్యాగరాయచెట్టిగారి అధ్యక్షతను జరిగెను.

**చెన్నపురి ఆంధ్ర మహాసభ స్థాపన 1916**

శ్రీ రాజానాయని వెంకట రంగారావు బహద్దర్, సర్ బయ్యా నరసింహేశ్వరశర్మ, దివాన్ బహద్దర్ వారణాసి సుబ్రహ్మణ్యం పంతులు, సామి వెంకటాచలం చెట్టి, తమరపాకం వరదరాజులునాయుడు, కాశీనాధుని నాగేశ్వరరావుపంతులు, పి. వి. రంగారావు నాయుడు గార్లు మొదలైన ప్రముఖులు సభాభ్యున్నతికి తోడ్పడిరి. దీనికిప్పుడు బులుసు సాంబమూర్తిగారు 1938 నుండిన్నీ అధ్యక్షులు. ఒక్క మద్రాసు ఆంధ్రులకు మాత్రమేకాక, ఆంధ్ర జాతి కంతటికినీ సంబంధించి, ఆంధ్రాభ్యుదయ మునకై పాటుపడుచున్నది. దీనికి నాటక శాఖ, క్రీడాశాఖ, విద్యాశాఖ, మొదలైన ఉపశాఖలు గలవు.

ఆంధ్రనారీజనోద్ధరణ, ఆంధ్రాభ్యుదయము, మహిళా విజ్ఞాన వ్యాప్తికి పాటుపడు స్త్రీలశాఖ గూడా యుండినది. గాని, ఇప్పుడు ఈ శాఖలోనివారు, ఆంధ్ర మహిళా సభ అనే స్వతంత్ర సంస్థగా స్థాపించినారు. ఈ సంస్థకు శ్రీమతి గుమ్మిడి దల దుర్గాబాయమ్మగారు ప్రోత్సాహకురాలు.

చెన్నపురి ఆంధ్రమహాసభ రజతోత్సవము డిసెంబరు 21, (1941) నుండి జనవరి 5 (1942) వరకు జరిగినది. రజతోత్సవ ప్రారంభోత్సవమునకు అధ్యక్షులు సర్ విజయానంద గజపతిగారు. ఈ ఉత్సవములలో చిత్రకళా ప్రదర్శనము, ఆంధ్రమహిళాభ్యుదయము, తెలుగు పిల్లల పండుగ, నాట్యకళా పరిషత్తు, నవ్యసాహిత్యపరిషత్తు, తెలుగు పండిత, కవుల సన్మానము, హరిజనాభ్యుదయము, వేదపండితుల సభ, పురాణ కాలక్షేపము, ఫిలిం పరిశ్రమ, గుడ్ విల్ డే

వ్యాయామ, విజ్ఞాన, గాన, దినోత్సవములు, వారములు, అత్యంత వైభవముగా జరిగినవి. అన్నిటిలోను ఆంధ్ర ప్రముఖులు పాల్గొనిరి; ఆదర్శానుగుణ్యమైన కార్య క్రమము నిర్వహించబడినది.

కళాశాలలు, హైకోర్టులు మొదలైన పెద్ద పెద్ద కార్యాలయములు, వైద్యశాలలు, గ్రంథభాండాగారములు ఏర్పడినవి. మద్రాసు నగరము రాజధాని కంతటికీ ప్రధాన నగరమైనప్పటినుండియు రాష్ట్రములోని శ్రీమంతులు, మహారాజులు ఇక్కడ భవనముల గట్టుకొనిరి. ఇటీవల వృద్ధిచెందిన సినిమా పరిశ్రమకుకూడా ఇది కేంద్రమగుటచేత, ఆ పరిశ్రమకు సంబంధించినవారికి ఇది కూడలి అయినది. రైల్వే కర్మాగారములు, వైద్యశాలలు, మిల్లులు, ఆల్ ఇండియా రేడియో స్టేషను, దినవార పత్రికా కార్యాలయములు మొ॥ నవన్నిటికీ ఈ నగరము ఉనికి అగుటచేత దీని జన సంఖ్య నానాటికి పెరిగిపోవుచున్నది. మద్రాసు పాటకపు జనులలో చాలామంది తెలుగువారికి వృత్తులు రిక్షాలులాగుట, రోడ్ల నూడ్చుట మొదలైనవి. ఈ నగరము పెద్ద మద్రాసని జనాభా లెక్కలలోనే చెప్పబడి యున్నది. 1931 వ లెక్కల బట్టి ఈ నగరమున అప్పటి 647238 జనసంఖ్య మంది. ఈ నగరమున తమిళుల తరువాత జన సంఖ్యలో ఆంధ్రులు హెచ్చు.

మద్రాసు రాజధానియంతటిలోను పూర్వపు గంజాం జిల్లాతో సహా (1931. జ. ప్రకారము) 17,738024 మందికి పైబడిన ఆంధ్ర జన సంఖ్యగలదు.

మద్రాసు ప్రభుత్వములో తెలుగువారికి అనేక సంవత్సరములనుండీ అధికారములున్నప్పటికీ తెలుగులో ఓటర్ల లిస్టులను తయారుచేయించుటగానీ, వీధులకు తెలుగులో పేర్లను వ్రాయించుటగానీ చేసియుండలేదు. కొన్ని తెలుగుపేర్లు వెంకట్రామయ్య వెంకట్రామన్‌గాను, రాఘవయ్య రాఘవన్‌గాను కొన్ని లిస్టులలో వ్రాయబడుచున్నవి. ఇటీ



శ్రీ కెత్తె వెంకటస్వామి నాయుడు బి.ఏ., బి.ఎల్.
*మద్రాసు కార్పరేషను మాజీ అధ్యక్షులు.
మద్రాసు లెజెస్లేటివ్ కౌన్సిల్ ఉపాధ్యక్షులు.

వల పుల్లారెడ్డిగారు కమిషనరుగా వచ్చినతర్వాత తెలుగులో ఓటర్ల పట్టికలను తయారుచేయించిరి. తెలుగు పాఠశాలలు గూడా నెలకొల్పబడినవి. మైలాపూరులో ఒక ప్రత్యేక తెలుగు పాఠశాలగలదు. అనేకులు న్యాయవాదులు, తెలుగు కుటుంబములవారు మైలాపురములోను; సినీమా పారిశ్రామికులు మాంబళం, రాయపేట మొదలయిన ప్రాంతములలోను, వర్తకులు జార్జిటవున్‌లోను, చాకలివారు మొదలైన కులస్థులు చాకలపేటలోను నివాసముల నేర్పరచుకొని యున్నారు.

---

* గోపతి నారాయణస్వామి చెట్టి, కె. శ్రీరాములు నాయుడు, సామి వెంకటాచలం చెట్టి, బి. బాసుదేవు నాయుడు, గోపతి జానకిరామచెట్టి గార్లు కూడ మద్రాసు కార్పరేషను మేయరు పదవి నలంకరించి యుండిరి.



# పదియవ అధ్యాయము

# జమీందారులు

**విషయ సంగ్రహము:** మద్రాసు రాజధానిలోని 1,659 జమీందారులలో ఆంధ్ర జమీందారీల సంఖ్య 448. వీటిలో విజయనగరం పెద్దది. బంగనపల్లి ఒక్కటియే సంస్థానము. జమీందారుల యుత్పత్తి, వారి ఆదాయ, పేష్కష్‌లు. రైత్వారీ, జమీందారీ, హోలు, మైనరు యీనాము గ్రామములు. వాటి విస్తీర్ణపు పట్టిక, పూర్వకాలపు శిస్తులు వసూలు చేయు ఏజంట్లుగానుండిన జమీందారులు బ్రిటిష్ పాలనలో 1802 సం॥ పెర్మనెంటు సెటిల్మెంటు కారణముగా ఎట్టి స్థితికి వచ్చిరి? తద్వారా రైతులకు కలిగిన బాధలు, జమీందారీ రైతు సమస్య, సమస్యా పరిష్కారమునకు ప్రకాశం కమిటీ రిపోర్టు, సిఫార్సులు, అవి అమలు జరుగకపోవుట. భూఖామందు రైతా? జమీందారా? రైతులకు, జమీందారులకు భూమిపై గల హక్కులు, కొందఱు మహనీయుల యభిప్రాయ ములు, జమీందారులు ఆంధ్ర దేశీయ రాజకీయ, సాంఘిక, ఆర్థి కాది విషయములలో చేసినమేళ్లు.

ఆంధ్ర దేశచరిత్రలో జమీందారులు; వారి, ఆంధ్ర రాష్ట్రీయ ఆర్థిక, సాంఘిక, రాజకీయ, విద్యావైజ్ఞానికాధ విషయములలో నిర్వహించిన పాత్ర; తద్వారా కలిగిన మేలు మొదలయినవి తప్పక తెలిసికోదగినవై యున్నవి.

మన రాజధానిలోగల 26 జిల్లాలలోను, 12 జిల్లాల యందు మొత్తము 1659 జమీందారీలు గలవు. అందు 6 ఆంధ్ర జిల్లాలయిన విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో 448 జమీందారీలు ఉన్నవి. తూర్పుగోదావరి జిల్లాలో నూటికి 70 వంతులు, నెల్లూరు జిల్లాలో నూటికి 50 వంతుల భూమి జమీందారీ భూమియే. రాజధానిలోని జమీందారీలలోకెల్ల విజయనగరం జమీందారీ పెద్దది. ఆంధ్ర దేశమునకెల్ల, కర్నూలు జిల్లాలోని బంగనపల్లి మాత్రమే సంస్థానము (State). ఈ జమీందారుల లో, పర్లాకిమిడి, పిఠాపురం, జయపురం, వెంకటగిరి జమీందారులకు 'మహారాజా,' బిరుదమున్నూ; కాళహస్తి, కార్వేటినగరం, చల్లపల్లి, బొబ్బిలి, మీర్జాపురం మొదలగు జమీందార్లకు "రాజా" బిరుదమున్నూ వాడుకలో గలదు.



కళాప్రపూర్ణ, సాహిత్య సమ్రాట్,
డాక్టర్ శ్రీ విక్రమ దేవవర్మ బహదూర్
జయపూర్ మహారాజు

ఈ జమీందారుల యుత్పత్తి; రైతు జమీందారీ సంబంధము; వారి ఆదాయము, పేష్కష్; వారికిగల హక్కులు; పెర్మనెంటు సెటిల్మెంటు, ఎస్టేటులాండ్ ఆక్టుల ప్రవేశపెట్టవలసి వచ్చిన కారణములు; ప్రకాశం కమిటీయొక్క ఆవశ్యకత; రాబోవుకాలమున జరుగబోవు మార్పులు మొదలగునవి తెలిసికొనుట యవసరము.

## జమీందారుల యుత్పత్తి.

ఆంధ్రదేశ ప్రాచీన చరిత్రలో ఇప్పటి జమీందారీపద్ధతి యున్నట్లు ఎట్టి ఆధారములును లేవు. పూర్వపు హిందూ రాజులు తమ స్వాధీనములోనున్న ప్రదేశములలో అచ్చటి

రైతులవద్దనుండి తమ తరఫున శిస్తుల వసూలుజేయుటకు కొందఱుద్యోగస్థులను నియమించిరి. 16 వ శతాబ్దమున అప్పటి మహమ్మదీయ పరిపాలకులు తరువాత వచ్చిన బ్రిటిష్ ప్రభుత్వముగూడ తమ శిస్తుల రాబట్టుకొనుటకు ఈ పద్ధతినే అవలంబించి, ఆ యధికారులనే మార్చకుండ తమ తరఫునగూడ నియోగించిరి. వీరే జాగీరుదారులు, మొఖాసా, హవేలీ దార్లు, యీనాం, శ్రోత్రియందార్లు, పాళీగార్లు మొదలయినవారు. వీరినే పూర్వము చౌదరీ, క్రోరీ యని గూడ యనుచుండెడివారు. వీరు తమ పాలకులకు విధేయులై, భూమిపై స్వతంత్ర హక్కుగాని, శిస్తువసూళ్లు తప్ప మరియే యితర అధికారములుగాని లేక, పాలకుల క్రోధమునకు గురియైనప్పుడు సందర్భము వెంబడి బర్తరఫు, శిక్షల సహితము ననుభవించుచు యుండిరి. హిందూ మహమ్మదీయ ప్రభుత్వములవారు తమకు సైనిక సహాయముచేసిన వారికి, తామెక్కువ సేవను పొందిన ప్రభుత్వోద్యోగులకు పెద్దపెద్ద భూములను-శిస్తు వసూలుచేసి తమవాటా చెల్లించి, మిగిలినది వారుంచుకొను పద్ధతిపై యీనాములుగా నిచ్చిరి; వీరినే మహమ్మదీయులు జాగీరుదార్లు, హిందువులు యీనాందార్లు అనియు అందురు. విద్యా వైజ్ఞానిక విషయములలో ఎక్కువ కృషిచేసినవారికి, దేవాలయములు, సత్రములు, తదితర ధర్మకార్య నిర్వహణమునకు కొన్ని భూములను యీనాముగా యిచ్చుచుండెడివారు. వీరినే శ్రోత్రియందార్లు, అగ్రహారీకులు యందురు. ఒక్కొక్క భూమిని కొన్నికొన్ని భాగములు జేసి, (హవేలీ లేక మొఖాసా) శిస్తులు వసూలు చేయుటకు ప్రభుత్వమువారు కొందరికి యిచ్చియుండిరి ; వీరినే హవేలిదార్లు లేక హవేలీ ప్రొప్రైటర్లు, మొఖాసాదార్లు యందురు. కొందరు మొఖాసాదార్లు సరాసరి ప్రభుత్వమునకే శిస్తు కట్టుచుండిరి. పాళీయమనగా ప్రభుత్వము తరఫున శిస్తుల వసూలు జేసినందుకు ఫలితముగా తామనుభవించు ప్రతిఫలము; ఇట్టివారు పెర్మనెంటు సెటిల్మెంటునకు పూర్వము చాల చిన్నస్థితిలోనుండి సెటిల్మెంటునకు తర్వాత, మిగిలిన జమీందారుల పద్ధతినే యవలంబించి జమీందారుల తరగతిలో జేరిరి ; వీరినే పాళీగారులందురు.

ఇవిగాక, యితరధికారులతో సంబంధములేకుండ సరాసరి ప్రభుత్వము వద్దనుండియే పట్టాలనుపొంది, వారికి శిస్తులు వగైరా చెల్లించుచు, భూమిని సాగుచేయుపద్ధతిగూడ బ్రిటిష్ ప్రభుత్వమువారు అవలంబించిరి. వీటినే రైత్వారీ భూములందురు. అనగా ఇప్పుడు అనుభవములోనున్న భూమి నంతటిని 4 భాగములుగ జేయవచ్చును. (i) జమీందారీ భూములు, (ii) రైత్వారీ భూములు, (iii) హోలు యీనాములు, (iv) మైనరు యీనాములు ; అనునవి. మొదటి రెంటి సంగతి ముందు చెప్పియుంటిమి. మిగిలిన రెంటిలో:



శ్రీ రావు వెంకట మహీపతి సూర్యారావు బహదూర్, పిఠాపురం మహారాజు.

పన్నులు లేకుండ శిస్తులు వసూలు చేసికొని అనుభవించుటకు పారితోషికముగా యివ్వబడినవాటిలో, ఒక్కొక్క ప్రదేశమును ఏక మొత్తముగా నిచ్చినవాటిని హోలు యీనాములనియు, విడివిడి భాగములుగా నిచ్చినవాటిని మైనరు యీనాములనియు అందురు. మైనరు యీనాములు 100 మొదలు 120 ఎకరముల వరకును గూడ కలవు. ఇవి గ్రామములలోని వివిధ వృత్తులవారికి (చాకలి, మంగలి,

వగైరా) పన్నులులేకుండా యిచ్చిన ప్రదేశములు; వీనిలో ముఖ్యమైనవి గ్రామనౌఖరీ యీనాములు. ఇవన్నియు ఎస్టేటు అను పదము క్రింద వచ్చుటచే ఎస్టేటులాండ్ ఆక్టున జేరినవి.

ఆంధ్రదేశములోని జిల్లాలువారీగాగల జమీందారీ హోలు యీనాము గ్రామములు, రైత్వారీ, మైనరు, యీనాము గ్రామములు మొదలగునవి ఈ క్రింది పట్టికలో తెలియజేయుచున్నాము.

ఆంధ్ర జిల్లాలలోని గ్రామములు (1931 లెఖల ననుసరించి)

| సంఖ్య | జిల్లా | రైత్వారీ గ్రామములు | హోలు యీనాము గ్రామములు | జమీందారీ గ్రామములు | మొత్తము. |
|---|---|---|---|---|---|
| 1. | విశాఖ పట్టణం | 389 | 20 | 8,597 | 9,006 |
| 2. | తూర్పు గోదావరి | 437 | 79 | 331 | 847 |
| 3. | పశ్చిమ గోదావరి | 359 | 146 | 272 | 777 |
| 4. | కృష్ణా | 406 | 207 | 433 | 1,046 |
| 5. | గుంటూరు | 758 | 161 | 64 | 983 |
| 6. | నెల్లూరు | 531 | 286 | 927 | 1,744 |
| 7. | కడప | 758 | 218 | | 976 |
| 8. | కర్నూలు | 695 | 89 | | 784 |
| 9. | బళ్లారి | 962 | | | 962 |
| 10. | అనంతపురం | 752 | 134 | | 886 |
| 11. | చిత్తూరు | 469 | 498 | 1,641 | 2,608 |
| | మొత్తము | 6,516 | 18,38 | 12,265 | 20,619 |

## బ్రిటిష్ ప్రభుత్వ మేర్పరచిన పద్ధతులు.

రైత్వారీ భూములయందుగాక, ప్రస్తుతమున్న జమీందారీ భూములయందు జమీందారులకు పూర్వమున్న పద్ధతిని రద్దుజేసి, 1802 సం॥రములో పెర్మనెంటు సెటిల్మెంటు పద్ధతి నేర్పఱచి, ఎల్లప్పుడు శిస్తు ఒకే విధముగ మార్పులేకుండగ నుండునట్లు ఏర్పఱచి, ఆయా భూములను ప్రస్తుతము జమీందారులనబడు అధికారులకు శిస్తు వసూలు చేయుటకు గుత్తకు నిచ్చి, ఇంకను యీ క్రింది నిబంధనల నేర్పఱచిరి. పన్నులు ఎల్లప్పుడు 1802 సం॥నాటి లెక్క-ప్రకారమే వసూలు చేయవలెను. ఎస్టేటులాండ్ ఆక్టునందు జమీందారునకు భూమి ననుభవించు హక్కు-నిచ్చి, రైతునకు సాగుజేసుకొను హక్కు-నిచ్చి, జమీందారు 20 సం॥లలోపుగ పన్నులు పెంచరాదనియు, అథవా, పెంచదలచుకున్నను రూపాయకు 2 అణాలవంతుకంటె ఎక్కు-వ హెచ్చించగూడదనియు నిర్ణయించిరి.

కాని, న్యాయస్థానములుగాని, ప్రభుత్వముగాని, వాటిని నిక్క-చ్చిగా అమలు జరుపక పోవుటవల్లను, జమీందారులు రైతులవద్దనుండి అప్పటికి వసూలుచేయు పన్నులకంటె రెండు, మూడు రెట్లధికముగా పన్నుల వసూలుచేయుచు, అమిత ధనవంతులై, రైతుల కెక్కు-వ బాధలకు కారకులగుచున్నారు. మందాసా, పిఠాపురం, కిర్లంపూడి వగైరా జమీందారీల అంకెలవల్ల అక్క-డి శిస్తు రైత్వారీ భూముల కన్న విశేషముగా పెరిగినట్లు తెలియుచున్నది.

మొత్తము రాజధానిలోని జమీందారులు రు 232.6 లక్షలు శిస్తులు వసూలుచేసి, ప్రభుత్వమునకు రు 41.2 లక్షలు మాత్రమే పేష్కు-ష్ చెల్లించుచుండిరి. ఇట్టి జమీందారులలో రు 20 వేలకుపైగా ఆదాయము వచ్చువారు 1802 సం॥రమున ఎంత శిస్తు వసూలు చేసినది, ఎంత పేష్కు-ష్ కట్టినది, 1938 సం॥రములో పేష్కు-ష్ పెరుగక పోయినను శిస్తులను పెంచి, ఎంత ఆదాయము అభివృద్ధి చేసుకొనినది ఈ ప్రక్క-పట్టికలో వివరముగా తెలియనగును.

# జమిందారీలు, ఆదాయము, ప్రభుత్వమునకు చెల్లించు పేష్కస్.

[ ఇరవై వేలు, అంతకు పైబడిన ఆదాయముగల జమీందారీలు మాత్రమే చూపబడినవి. ]

| | జమీందారీ | | 1802 నాటి ఆదాయము | దాని పై నిర్ణీతమైన పేష్కస్ | ప్రస్తుతాదాయము | ప్రస్తుతపు పేష్కస్. |
|---|---|---|---|---|---|---|
| | విశాఖపట్నం జిల్లా | | రూ. | రూ. | రూ. | రూ. |
| 1. | కురుపాము | ... | 24,991 | 14,500 | 1,31,660 | 17,899 |
| 2. | విజయనగరం † | ... | 716,708 | 5,00,000 | 23,59,541 | 747,617 |
| 3. | పాలకొండ | ... | 77,765 | 55,000 | | |
| 4. | మందాసా | ... | 35,666 | 14,000 | 231,756 | 13,001 |
| 5. | పర్లాకిమిడి | ... | 1,05,742 | 80,000 | 306,299 | 79,483 |
| 6. | ముబగాము | ... | | | 33,961 | 600 |
| 7. | తిలారు | ... | | | 27,158 | 3,544 |
| 8. | ఉర్లాము | ... | | 11,770 | 32,961 | 6,423 |
| 9. | తర్ల | ... | 15,437 | 4,000 | 106,914 | 3,406 |
| 10. | పాతటెక్కలి | ... | | | 44,487 | 9,621 |
| 11. | రఘునాథపురం | ... | | 10,700 | 43,695 | 8,995 |
| 12. | తెంబూరు | ... | | | 22,023 | 4,910 |
| 13. | తలగాం | ... | | | 36,687 | 8,671 |
| 14. | మునగపాక | ... | 32,908 | | 40,826 | 24,680 |
| 15. | కశింకోట | ... | 17,685 | | 23,019 | 10,408 |
| 16. | మేలుపాక | ... | | | 49,411 | 18,865 |
| 17. | అనకాపల్లి | ... | 29,387 | | 64,803 | 28,361 |
| 18. | చీకటి | ... | 69,285 | 34,000 | 22,300 | 3,078 |
| 19. | మబుడారుసింగి | ... | 2500 | 500 | 24,805 | 447 |
| 20. | జలంత్ర | ... | 16,232 | 7,000 | 73,445 | 6,403 |
| 21. | పేట | ... | | | 20,468 | 3,844 |
| 22. | బారువ | ... | 9398 | 7,800 | 20,448 | 3,803 |
| 23. | నందిగామ | ... | | 16,000 | 43,695 | 8,995 |
| 24. | మునగవలస | ... | | | 24,648 | 3,942 |
| 25 | కరకవలస | ... | 11,258 | 11,392 | { 20,215<br>21,446 | 4,039 |
| 26. | పెదపెంకి | ... | | | 28,897 | 3,584 |
| 27. | బొబ్బిలి † | ... | 128,240 | 90,000 | 66,237 | 83,442 |
| 28. | తంగెడు గట్వాడ | ... | | | 55,991 | 1,511 |
| 29. | కోట ఉరట్ల | ... | 25,536 | | 36,500 | 19,059 |

| | జమీందారీ | | 1802 నాటి ఆదాయము రూ. | దానిపైని ర్ణీతమైన పేష్కస్ రూ. | ప్రస్తుతాదాయము రూ. | ప్రస్తుతపు పేష్కస్. రూ. |
|---|---|---|---|---|---|---|
| 30. | పెదబుడ్డిడి | ... | | | 24,811 | 4,489 |
| 31. | లక్ష్మీపురం | ... | | | 22,297 | 4,096 |
| 32. | సాలూరు | ... | 65,865 | 36,800 | 150,195 | 26,832 |
| 33. | సంగంవలస | ... | 25,210 | 6,700 | 28,371 | 3,506 |
| 34. | షేర్ మహమ్మద్ పురం (తూర్పు) | ... | | 18,098 | { 50,485<br>13,160 | 11,232 |
| 35. | షేర్ మహమ్మద్ పురం (పడమటి) | ... | | | 36,311 | 8,112 |
| 36. | గొడిచెర్ల | ... | 21,148 | | 51,709 | 16,798 |
| 37. | శ్రీరాంపురం | ... | 22,073 | | 56,184 | 17,918 |
| 38. | నక్కపల్లి | ... | 18,461 | | 28,408 | 5,299 |
| 39. | కురుప్రోలు | ... | | | 29,474 | 7,609 |
| 40. | మాడ్గోలు | ... | 42,396 | 35,000 | 124,012 | 28,784 |
| | తూర్పు గోదావరి జిల్లా | | | | | |
| 1. | వీరవల్లిపాలెం, చింతనలంక | ... | | | 17,676 | 3534 |
| 2. | భద్రాచలం ప్రొప్రయిటరీ | ... | | | 43,000 | 26,712 |
| 3. | పోలవరం బి. ఏస్టేటు, పట్టిసం | ... | 174,158 | 105,700 | 23,638 | 10,510 |
| 4. | బిల్లిమిల్లి, బయ్యనగూడెం, జంగారెడ్డి గూడెం | ... | | | 22,770 | 3,007 |
| 5. | గంగోలు | ... | | | 25,848 | 1,239 |
| 6. | కోలంక, వీరవరం | ... | | | 147,003 | 20,779 |
| 7. | గొల్ల ప్రోలు | ... | | | 55,017 | 11,236 |
| 8. | కోట్టాం | ... | | | 180,103 | 26,179 |
| 9. | పిఠాపురం † | ... | 392,182 | 258,979 | 877,450 | 231,418 |
| 10. | గోపాలపురం | ... | | | 62,627 | 18,141 |
| 11. | పలివెల | ... | | | 43,532 | 17,219 |
| 12. | వంగలపూడి | ... | | | 24,670 | 11,439 |
| 13. | గూటాల | ... | | | 26,049 | 6,720 |
| | కృష్ణా జిల్లా | | | | | |
| 1. | లింగగిరి | ... | 1,431 | 486 | 20,000 | 486 |
| 2. | మునగాల | ... | 13,496 | 4,497 | 80,876 | 4,510 |
| 3. | దేవరకోట † | ... | 154,049 | 102,690 | 237,451 | 78,705 |
| 4. | చింతలపాటివంతు | ... | | | 79,010 | 17,510 |
| 5. | సురవరం | ... | | | 21,410 | 2,871 |
| 6. | గొల్లపల్లి | ... | | | 25,000 | 2,500 |
| 7. | వుయ్యూరు | ... | | | 364,319 | 24,565 |

| జమీందారీ | | 1802 నాటి ఆదాయము రూ. | దానిపైనిర్ణీత మైన పేష్కస్ రూ. | జమీందారులు ప్రస్తుతా దాయము రూ. | ప్రస్తుతపు పేష్కస్ రూ. |
|---|---|---|---|---|---|
| 8. మీర్జాపురం | ... | | | 179,283 | 11,446 |
| 9. ఎలమర్రు | ... | | | 191,878 | 15,330 |
| 10. తూర్పు మైలవరం | ... | | | 27,461 | 2,679 |
| 11. చిన్నలపాడు, దక్షిణవంతు | ... | | | 21,706 | 787 |
| 12. దక్షిణ వల్లూరు 1-భా—2-భా— | ... | | | 77,133 | 10,45 |
| 13. ఉత్తర వల్లూరు | ... | | | 35,955 | 6,095 |
| 14. కపిలేశ్వర పురం | ... | | | 32,502 | 5,485 |
| 15. సంగంవలస | ... | | | 21,394 | 2,929 |
| 16. నూజవీడు | ... | 497,595 | 308,000 | | |
| నెల్లూరు జిల్లా | | | | | |
| 1. వెంకటగిరి † | ... | 854,906 | 388,703 | 1306,204<br>159,767 | 323,693<br>44,916 |
| 2. పామూరు | ... | | | 39,039<br>56,652 | 10,919<br>17,756 |
| 3. చుండి | ... | | | 51,120 | 136,114 |
| 4. సీతారాంపురం | ... | | | 39,038 | 10,919 |
| చిత్తూరు జిల్లా | | | | | |
| 1. బంగారుపాలెం | ... | 30,007 | 12,003 | 44,868 | 11,647 |
| 2. పోలచూరు | ... | | | 22,000 | 5,502 |
| 3. అనకోలు | ... | | | 31,387 | 3,319 |
| 4. నారాయణవరం | ... | | | 268,331 | 49,255 |
| 5. కీలపూడి | ... | | | 20,480 | 3,089 |
| 6. చెట్టినాడు | ... | | | 65,000 | 23,500 |
| 7. తిరుపతిదేవస్థానం | ... | | | 241,352 | 45,722 |
| 8. పుంగనూరు | ... | | | 162,196 | 91,169 |

పై పట్టిక 1938 సం॥ మద్రాసు గవర్నమెంటు వారిచే ప్రచురింపబడిన ప్రకాశం కమిటీనివేదికననుసరించి తయారు చేయబడినది.

† ఇది ల్యాండు రివెన్యూ సెటిల్‌మెంటు వారి, మద్రాసు రాజధాని 1347 ఫసలీ (1937-38), జిల్లాల నివేదికల ననుసరించి,

| | | ఆదాయము (రూపాయలు) | పేష్కస్ (రూపాయలు) |
|---|---|---|---|
| విశాఖ పట్నం జిల్లా— | విజయనగరం | 2123,290 | 494,816 |
| | బొబ్బిలి | 633,181 | 83,453 |
| తూర్పుగోదావరి జిల్లా— | పిఠాపురం | 799,352 | 262,782 |
| కృష్ణా జిల్లా— | దేవరకోట | 351,230 | 78,676 |
| నెల్లూరు జిల్లా— | వెంకటగిరి | 1306,205 | 368,734 |
| చిత్తూరు జిల్లా— | కార్వేటి నగరం | 743,719 | 173,842 |
| | కాళహస్తి | 357,556 | 172,982 |

## రైత్వారీ పద్ధతి.

ఈ పద్ధతి ప్రకారము ప్రభుత్వమువారు, భూమిని 12 రకముల క్రిందను, నీటిపారుదలనుబట్టి 24 తరముల క్రిందను విభజించి; తరమువారీని, సాగు ఖర్చుల పెట్టుబడి పోను వచ్చు ఆదాయములో సగము తాము మిగిలిన సగము రైతు నకుండునట్లు నిర్ణయించిరి. ఇదియే రైత్వారీ పద్ధతి. అయి నను, అనేకచోట్ల రకములను, తరములను, రేట్లను నిర్ణయిం చుటలో ప్రాదేశికమైన భేదములవల్ల రైతులకు యిబ్బందులు కలుగు చుండెను. అట్లయినను, రైత్వారీ భూములయందలి శిస్తు భారము జమీందారీ భూములయందలి దానికంటె చాల తక్కువ.

మెట్ట భూములకన్న పల్లపు భూములలో పంటల భేద ముల కారణముగా పన్నులు హెచ్చు. ఈ పల్లపు భూము లకు ఒకటవ పంట, రెండవ పంట పన్నుల (కాంపౌండు) నియమము కలదు. ఇదిగాక, నీటి సరఫరాచేయు విషయమై ప్రత్యేక పన్ను గలదు. ఈ పద్ధతి ఒకటవ ఫసలీ, రెండవ ఫసలీలయందు భేదించును. వాటి రేట్లు సాధారణ నీటివన రులకయిన ఖర్చులనుబట్టి ఎకరమున కింతయని విధింపబడును. ఈ రేట్లు రు 4/-లు మొదలు రు 14/-లు వరకునుగూడ కలవు. హోలు యీనాములలో 1908 సం॥ నాటి ఎస్టేటు లాండ్ ఆక్టును బట్టి శిస్తులు నిర్ణయింపబడినవి. మైనరు యీనాముల లో సాధారణముగా సాగుదారుడు యీనాందారుడే. కొన్ని చోట్ల శిస్తు, రైతు-యీనాందారుల ఒడంబడికనుబట్టి నిర్ణయ మగుచుండును. రైత్వారీ యీనాములలో పన్ను పేరునకు మాత్రముండి, స్థానికముగా శిస్తులు చెల్లించుట మాత్ర ముండును.

## పన్నుల వసూలు విధానము.

జమీందార్ల పేష్కష్, రైత్వారీ శిస్తులు, తదితర, వసూ ళ్లను రాబట్టుకొనుటకు ప్రభుత్వమువారికి 1865 సం॥రపు "రెంటు రికవరీ ఆక్టు" ద్వారా సర్వాధికారములు గలవు. న్యాయస్థానములలో వ్యాజ్యములువేయ నవసరములేకుండా, ఆశాసనాధికారములవల్ల రావలసిన పన్నులు వగైరాలువసూలు చేసుకొనుట, అట్లురానిచో, సదరు భూములనుతామే ఏలము వేయించి రాబట్టుకొనుట, తిర్గి భూములపై అవసరమువెంబడి యితరులకు పట్టాలను జారీచేయుట ఎవరి భూములను వారికి సక్రమముగా నమోజు చేయించుట, శిస్తు వగైరా లెక్కలను సరిగా నుంచుట రెవిన్యూ డిపార్టుమెంటు యందలి కలెక్టర్లు, డిప్యూటీ కలెక్టర్లు, తహసీల్దార్లు, రెవెన్యూ యినస్పెక్టర్లు, గ్రామ మునసబు, కరణములు చేయుచుందురు. సరిహద్దుల సంబంధములయిన పనులను సర్వే డిపార్టుమెంటువారు చూచుచుందురు. ఇక జమీందారులు తమ పన్నుల వసూలు జేసికొనుటకు, తగిన చర్యలు రివెన్యూ కోర్టుద్వారా జరిపించ వలెనేగాని ప్రభుత్వమువారివలె స్వతంత్రించి చర్యదీసుకొను టకు ఎట్టి హక్కును లేదు. నీటి వనరుల కలుగజేయవలసి వచ్చినప్పుడు, అనగా ఏదైన క్రొత్తగా ప్రాజెక్టు నిర్మింపవలసి వచ్చినప్పుడు, ఆ వనరులవల్ల సమృద్ధి కాబడే భూముల పట్టా దార్లవద్దనుండి ప్రభుత్వము నజరానాలు వసూలుచేయుట న్యాయము; గాని, కృష్ణ కాలువ ప్రాజెక్టు కట్టినప్పుడు, ఎక రమునకు రు 25/-లు వంతున నజరానాలు వసూలుచేయుట అన్యాయమనక తప్పదు. పైన వివరించిన భూములు మన ఆంధ్రదేశమందు ఎన్ని ఎకరములు యుండెనో యీ క్రింది పట్టికలో పొందుపరచుచున్నాము.

| జిల్లా | జమీందారీల సంఖ్య | పేష్కష్ లక్షలు రూ | ఆదాయము లక్షలు రూ | రైత్వారీ భూమి ఎకరములు | హోలు యీనా ముల విస్తీర్ణము | జమీందారీ భూమి ఎకరములు |
|---|---|---|---|---|---|---|
| †విశాఖపట్నం | 181 | 11.76 | 42.4 | 12,25,225 | 41718 | 3273616 |
| †తూర్పు గోదావరి | 74 | 5.39150 | 23.04590 | 939,656 | 93561 | 556340 |
| పశ్చిమ గోదావరి | 74 | 2.01470 | 7.65310 | 900,390 | 210938 | 399639 |
| కృష్ణా | 107 | 2.46180 | 18.26136 | 10,35,956 | 231234 | 1002596 |
| †నెల్లూరు | 4 | 4.22025 | 16.50583 | 23,32,297 | 426822 | 2130349 |
| చిత్తూరు | 8 | .99647 | 4.67009 | 17,27,825 | 594067 | 1350079 |

† ఏజెన్సీ భాగము-సూచింపబడలేదు.

## రైతు-జమీందారు సమస్య.

1802 సం॥రము నాటి రెగ్యులేషనులు, పెర్మనెంటు సెటిల్‌మెంటు చట్టము, 1865 సం॥రమునాటి రెంటు రికవరీ చట్టము, 1908 సం॥రమునాటి ఎస్టేటులాండు చట్టము మొదలగునవి రైతులవద్దనుండి శిస్తులు, పన్నులు వసూళ్లు స్పష్టీకరించుటకు చేయబడినవేయైనను, ప్రభుత్వమునకు రైతు జనముపైగల ఉదాసీనభావముచే వాటిని నిక్కచ్చిగా అమలు జరిపించకపోవుటవల్లను; శాసన సభ్యులచే నియమబద్ధముగా నేర్పరుపబడిన పద్ధతేమియు లేకుండుటచేతను; జమీందారులు తమ యిష్టానుసారము రేట్లు హెచ్చించి, పన్నులు వసూలు చేయుచుండుట; చెరువులకు మరమ్మతులు లేక నీటి వసరులు తగ్గిపోవుట; సర్వే లేక రైతుల భూములు అన్యాక్రాంతములైనప్పుడు తిర్గి తమకు ఆ పట్టాలను ట్రాన్సుఫర్ చేయించక యిబ్బందుల పెట్టుచుండుట మొదలగు కారణములవల్లను రైతులలో ఆర్థిక మాంద్యము హెచ్చి, పంటలు సమృద్ధిగా పండక ప్రజలలో దారిద్ర్యము, ఆందోళన హెచ్చె, తిరుగుబాటులు సంఘర్షణలు, కాల్పులు మొదలగునవి సంఘటిల్లుచు క్రమక్రమముగా తీవ్రమయిన రైతు-జమీందారీ సమస్యగా పరిణమించెను.



జుబ్దతుల్ ఆక్రాన్, శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహదూర్, చల్లపల్లి జమీందారు.

రైతుకు-భూమికి-జమీందారుకు మధ్యగల సంబంధములు; వారికిగల హక్కులు, భూమికి అసలు అధికారి ఎవరు; రైతుకూ జమీందారుకూ మధ్యగల సంబంధమెట్లు మారుతూ వచ్చెను; భూమికి అసలు అధికారి ఎవరు; ఎస్టేటులాండు ఆక్టు, పెర్మనెంటు సెటిల్మెంటులు. ఎందుకు ప్రవేశ పెట్టవలసి వచ్చెను; భూమిపై స్వతంత్రముగా పన్నులు విధించు హక్కు జమీందారులకు గలదా; రైతులిట్టి యధోగతి యందెందుకున్నారు; రైతుల బాధలు సమసిపోయి, జమీందారీ విధానములో ఎట్టి మార్పులు, ఎట్లు రావలెను మొదలగు, ఈ సమస్యనుండి యుద్భవించిన విషయముల నన్నిటిని తప్పక తెలుసుకొనవలెను. గ్రంథ విస్తరణ భీతిచే ఇచ్చట వివరించుటకు వీలులేకపోయినను, పై విషయముల నన్నిటిని సమగ్రముగా చర్చించి, స్థిరమైన పద్ధతి నేర్పాటు చేయుటకు కాంగ్రెసు ప్రభుత్వమువారిచే నియమింపబడిన 'ప్రకాశం కమిటీ' వారియొక్క రిపోర్టును ప్రతి వ్యక్తియు చదువదగినదై యున్నది. జమీందారీ విచారణ కమిటీలో గా॥ టంగుటూరి ప్రకాశం పంతులు (అధ్యక్షులు), తెన్నేటి విశ్వనాథం (కార్యదర్శి), మహబూబ్ ఆలీబేగ్, ఏ. రంగస్వామి అయ్యంగార్, యమ్. పల్లంరాజు, పి. ఎస్. కుమారస్వామి రాజా, వి. వి. జోగయ్య పంతులు, బి. వి. నారాయణస్వామి నాయుడు, బి. వెంకటాచలం పిళ్లె గార్లు గలరు. ఇందు విషయమై ఇంతటి శ్రద్ధ, పట్టుదల వహించి విచారణలు జరిపి, రిపోర్టును తయారుచేసిన ఈ కమిటీ అధ్యక్షులు, అప్పటి రివెన్యూ మంత్రులయిన టంగుటూరి ప్రకాశం పంతులుగారు, వారికి సహాయులై, కమిటీ కార్యదర్శిత్వము వహించిన తెన్నేటి విశ్వనాథంగారును, సభ్యులును శాశ్వత కీర్తివంతులై, చిరస్మరణీయులై యుండగలరు.

### భూఖామందు రైతా, జమీందారా ?

ఈ సమస్యవిషయములో ప్రకాశంకమిటీ రిపోర్టులోని కొన్ని సారాంశములు. "మన రాష్ట్రపు మొత్తము పరిమితి

14,3887 చ॥ మై॥. ఇందులో 19279 చ॥ మై॥ ఏజన్సీ భాగము. జమీందారీ భూమి 15,3,18,400 ఎకరములు అందులో సగము భాగము ఆంధ్ర జిల్లాలలో వున్నవి. ఈ భూముల కధిపతులు జమీందారులా లేక నేలను దున్ని, కష్టించి పండించి, పూజించి జీవించు రైతుదా యన్న విషయము, జమీందారీ పద్ధతి, దాని యుత్పత్తులు, పరివర్తన పరిశీలించిన, సూక్ష్మముగా జమీందారు ప్రభుత్వము తరఫున పన్నులు వసూలుచేయు 'ఏజంటు' అని విదితముకాగలదు. భూపతియనగా భూమిని రక్షించువాడనియేగాని, భూమికి హక్కుదారుడని మన హిందూరాజు లెన్నడును నిర్ణయించలేదను సంగతి అప్పటి గ్రామ స్వపరిపాలనము వల్లనే తెలియుచున్నది. భూమికి జమీందారే హక్కుదారను కొందఱి ముస్లింపాలకుల యభిప్రాయమును బ్రిటిష్ ప్రభుత్వమువారు కొన్నిచోట్ల తమస్వలాభమునకై యంగీకరించిరని సర్ హెన్రీమైన్ తన "గ్రామజాతులు" అను గ్రంథమునం దుదహరించెను. పూర్వపు మొగలాయి చక్రవర్తులుగూడ తమకు వలయు ప్రదేశములను జనులనుండియే ఖరీదునకు తీసుకొనుచుండుట చూడ, ముస్లింన్యాయానుసరణముగ గూడ జమీందారునకు భూమిపై హక్కులేదని తేలుచున్నదని "ఫీల్డు" అను న్యాయాధిపతి తన 'భూస్వామిత్వము' అను గ్రంథములో పేర్కొని యున్నాడు.

ఎస్టేటులాండు ఆక్టులోని 4 వ సెక్షను ప్రకారము రయితీ భూములలో రెంటు వసూలుచేయుట మాత్రమే భూస్వాములకుగల యధికారమని యిదివరకే నిర్ణయించబడెను. ప్రీవీ కౌన్సిల్‌వారి ఐ. ఎల్. ఆర్. 45 మద్రాసు 586 వ పేజీలో ప్రకటింపబడిన తీర్పునందు భూస్వామి, శిస్తు వసూలుదారు మాత్రమేననియు, రయితీభూముల స్వంతము జేసికొను హక్కు అతనికి లేదనియు నిర్ణయించిరి

ప్రాచీనకాలమునుండియు వచ్చుచున్న ఈ జమీందారులు, జాగీరుదారులు మొదలయినవారందరు విశాలమగు యాస్తుల ననుభవించుచు యుండినను, హిందూరాజులనుండి మహమ్మదీయ రాజులకు, వారినుండి బ్రిటిష్‌ప్రభుత్వము వారికి యధికారము మారుట ద్వారా వీరి హక్కుల స్వభావముకూడ మారుచూవచ్చి, తుదకు వీరందరును కేవలము ప్రభుత్వమువారి తరఫున శిస్తు వసూలుచేయుట కేర్పడిన ఏజంట్ల స్థితికి వచ్చిరి. ఇంగ్లీషు ప్రతిలో ఇట్లున్నది.

..."He (Ryot) is the owner of the soil subject to the payment of land revenue due to the government. He has not derived his title from the landholder. The amount he pays to the landholder is not rent that is paid by a tenant to a landlord, but it is only the dues to the government as assessment on land." (Report P. 25)



శ్రీ రావు శ్వేతచలపతి రామకృష్ణ రంగారావు బహదూర్, బొబ్బిలి రాజా, మాజీ ప్రథాన మంత్రి.

"...the landholder is only an agent of the government to collect rents from them as laid down in section 4 of the Estates Land Act. He is not entitled even to the possession of ryoti and, as laid down by the Privy Council in I. L. R. 45 Madras, 586. (Report P. 21.)

వెనుకటి మద్రాసు గవర్నరుగారగు ఎరిస్కిన్ ప్రభువుగారీ పద్ధతి "ప్రస్తుతకాలమునకు సరిపడనిది, పాతకాలపుది, నిర్బంధకరమయినదియైన పద్ధతి" అని లండన్ కాక్స్టన్ హాలు ఉపన్యాసములో అభిప్రాయమిచ్చి యుండిరి.

ఈపై యన్నికారణములవల్ల భూమికి హక్కుదారుడు నిస్సందేహముగా రైతేయని తేలుచున్నది.

పూర్వము వీరెట్లు ఏ హక్కులు గలిగియున్నను 1802 సం॥రపు పెర్మనెంటు సెటిల్మెంటు ఆక్టునకు పిమ్మట పన్నులు వసూలుచేయు ఏజంట్లు లేక కలెక్టర్లుగా నిర్ధారణ చేయబడిరి. వీరు ప్రజలకు ప్రభుత్వమునకు మధ్య ఇట్టి ఏజంట్లే అయినచో ఈ కాలములో ఈ జమీందారీపద్ధతి ఎంతవరకు అవసరమో నిర్ణయించవలసి యున్నది. ఎరిస్కిన్ ప్రభువుగారు కాక్సటన్ హాలులో చెప్పినట్లు ఈ పద్ధతి దౌర్జన్యయుతముగా మారినప్పుడు దీనిని మార్చుటయో, మాన్పుటయో అవసరమని ప్రజలలో అభిప్రాయము కలుగుచున్నది.



కీ. శే. శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావు బహదూర్, లక్కవరం జమీందారు, పత్రికాధిపతులు, ప్రసిద్ధకవులు.

## సమస్యా పరిష్కారమునకు ప్రకాశం కమిటీ సిఫార్సులు.

జమీందారీ - రైతు సమస్య పరిష్కరింపబడుటకు ప్రకాశం కమిటీ చేసిన కొన్ని సిఫార్సుల నిందు ప్రకటించుచున్నాము. (i) నేలకు హక్కుదారు రైతే; జమీందారు పన్నులు వసూలుచేయుట కేర్పడిన ఏజంటు; రైత్వారీ భూములలోని రైతుల వలె జమీన్ రైతుకు గూడభూమిపై పూర్తి హక్కులు వున్నవి. ఆ భూమిని రైతు తన యిష్టము ప్రకారము దాన విక్రయాదులకు వినియోగించ వచ్చును. (ii) రైతు న్యాయముగా 1802 కు ఏర్పడిన శిస్తు చెల్లించుట సబబు. 1802 నాటి కవులు ప్రకారము రొక్కపు శిస్తు వసూలుచేయవలెను. (iii) శిస్తు వసూలు నిమిత్తం వేలం, జప్తులు సర్కారు ఉద్యోగుల పరము చేయవలెను; (iv) గంజాం మొదలు గోదావరి జిల్లావరకుగల కొండ ప్రాంతము ఏజన్సీ ప్రాంతము. జిల్లా కలెక్టర్ల పాలనము క్రిందనుండి, ఈ ప్రాంతము లిప్పుడు పూర్వమున్నట్లు లేవు. ఏజన్సీలలో ఎల్లవరం, చోడవరం, పోలవరం, భద్రాచలం తాలూకాలను, గంజాం విశాఖపట్టణం జిల్లాలలోని కొన్ని ముందరి ప్రాంతములను వెల్లడిప్రాంతములలో జేర్చి, వాటికి రాకపోకల నేర్పఱచి, రయితులకు తోడ్పడవలెను. భూమినిబట్టిగాక, పంటను బట్టిపన్ను వసూలు చేయుట శాసన విరుద్ధము. దారుణమగుచున్న ముఠార్ల బాధల నివారించవలెను."

ఈ సిఫార్సులు, దురదృష్టవశమున కాంగ్రెసు ప్రభుత్వము రాజీనామా యిచ్చియుండుటవల్ల అమలులోనికి వచ్చుటకు వీలులేక రైతులకు చాల ఆశాభంగము కలిగెను. గాని ఎప్పటికయినను రైతులు - జమీందారులు, తాముగాగాని, ప్రభుత్వ సహాయముతోగాని తమ సమస్యను పరిష్కరించుకొనవలసియుండును. ప్రకాశం కమిటీ రిపోర్టు జమీందారులను మేల్కొల్పి, తమ బాధ్యల నెఱుంగ జేసి, తమ ఆర్థిక పరిస్థితుల చక్కపరచుకొనుటకు; రైతుల వ్యవహారముల యెడల శ్రద్ధ కలుగుటకు తోడ్పడినది. అంతకుముందు ఈ జమీందారులు తమతమ స్వస్థానములను విడిచి, పెద్ద పట్టణములయందు, విశేష ధనవ్యయముచేసి విలాస భవనముల నిర్మించి యందు సౌఖ్యములందుచుండిరి. రైతులకు దూరముగనుండుటచే వారి సాధారణ యవసరములను పరిశీలంచుటకు అవకాశములు కలుగజేయకుండిరి. అయినను జమీందారులలో కొందరయినను ప్రకాశం కమిటీ రిపోర్టునందలి సిఫార్సుల నమలుపరచుటకు సిద్ధమై యుందురు.

## జమీందారులు ఆంధ్ర దేశమునకు చేసిన మేలు.

రైతుల సందర్భములో ఎట్లున్నను, ఈ జమీందారులు ఉదారహృదయులై, ప్రజోపయోగములగు పనులుచేసి కీర్తి కెక్కిరి. విజయనగరం, పర్లాకిమిడి, పిఠాపురం, వుయ్యూరు, వెంకటగిరి రాజులు కళాశాలలను; మందాసా, చల్లపల్లి, రామచంద్రపురం, నూజవీడు మొదలగు జమీందారులు ఉన్నత విద్యాలయములను ఏర్పరచి, విద్యా సంస్థల పోషించి వాటి అభివృద్ధికి నెక్కువ తోడ్పడిరి. స్వయముగ కొందఱు పండితులై కవులను, నటకులను, గాయకులను ప్రోత్సహించి పురమందిరములను గట్టించి, కళలను పోషించి, విజ్ఞానాభివృద్ధికి, సంఘ సంస్కరణకు నెక్కువగా తోడ్పడిరి. జయపురం మహారాజులుంగారు ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు 10 లక్షల రూప్యముల భూరివిరాళమిచ్చి విశేషకీర్తివంతులైరి. పిఠాపురం మహారాజావారు ఆంధ్ర సాహిత్య పరిషత్తును స్థాపించి, అనేక ఉద్గ్రంథములు తెలుగున ప్రచురించిరి. సూర్య రాయాంధ్ర నిఘంటువును తయారు చేయించుచు, కాకినాడయందు తమ పేర పెద్ద కాలేజీని కట్టించి, అనాథ శరణాలయము నేర్పఱచి, బ్రహ్మ సమాజ మందిరము గూడ నేర్పఱచిరి. క్రితంసారి జరిగిన శాసన సభల ఎన్నికల సందర్భమున రాష్ట్రము నందంతటను "పీపిల్సుపార్టీ" అను నొకదానిని స్థాపించి, విశేష ధన వ్యయముజేసి స్వయముగా నాయకులై నడపిరి. బొబ్బిలి, విజయనగరం, వెంకటగిరి, మీర్జాపురం, చల్లపల్లి, పోలవరం, పిఠాపురం మొదలగు జమీందారులు రాజకీయములలో ఎక్కువ పాల్గొనుచు, చాల కాలమువరకు శాసన సభాసభ్యులుగా పాల్గొనుచు యుండిరి. పానగల్లు, బొబ్బిలి జమీందారులు ఈ రాష్ట్రపు ప్రధాన మంత్రిత్వము వహించిరి. పోలవరం, వుయ్యూరు, పానగల్లు జమీందారులు ఆంధ్ర మహాసభాధ్యక్షపీఠము నలంకరించిరి. అనేకమంది జమీందార్లు జిల్లా, తాలూకా బోర్డు అధ్యక్షులుగ కూడ యుండిరి. చల్లపల్లి, మీర్జాపురం జమీందార్లు ఆంధ్ర చలనచిత్ర పరిశ్రమయందు విశేష ధనమును వెచ్చించి పరిశ్రమకు చేయూతనిచ్చిరి. ఇట్టివి ఇంకను జెప్పవలయునన్న చాల గలవు.

కాలము మారిపోవుచున్నది! యుద్ధానంతర ప్రపంచ పునర్నిర్మాణమెట్లుండునో, ఎట్టివిప్లవకరమగు నూతన మార్పులు రానున్నవో ఊహకందని విషయములు. కాల గర్భమున నేమున్నదో !! వ్యవసాయమునకు జీవగర్రయైన రైతుల బాధలు నివారించు పద్ధతుల నాలోచించి నమలులో పెట్టక ప్రభుత్వ ముదాసీనము వహించియుండుట విచారకరము. ప్రకాశం కమిటీ రిపోర్టు ఏనాటికయినను సార్థకమై, రైతులలో, తిరుగుబాటులు, సంఘర్షణలు, కాల్పులు మొదలగు బాధలు తొలగి రైతు జమీందారీ సమస్య సాంతముగ పరిష్కారమగు గాక !





# అయిదవ భాగము - ఆర్థికసంపద

ప్రస్తావన :—దేశమందలి ఆర్థిక సంపదకు ఆధారములు భూమి, పరిశ్రమ, పెట్టుబడి. మానవునికి కావలసిన పదార్థములలో నూటికి 99 పాళ్లు భూమినుండే వచ్చును. పంటలకే కాక పారిశ్రామిక వృత్తులన్నిటికిని కావలసిన ముడి వస్తువులకు సైతము భూమి ముఖ్యము. వ్యవసాయమువలన ఇందనేకము లభ్యమగుతున్నవి ; గనుక, ఆర్థిక సంపదకు మొదటి విషయముగా వ్యవసాయమును పేర్కొని మన ఆంధ్ర దేశమందు వ్యవసాయ పరిస్థితు లెట్లున్నవో, ఎక్కడెక్కడ ఏయే రకము భూములున్నవో, ఏయేపంటలు విరివిగా పండిస్తున్నారో పట్టికలతో సైతము వివరించి తెలియజేసినాము. వ్యవసాయపు పనులకున్ను. బరువులు మోయుటకున్ను, బండ్లు లాగుటకున్ను, ఆహార పదార్థములకున్ను పశువులు మొదలయిన జంతువులు పనికివచ్చును; గనుక, వ్యవసాయము తర్వాత పశుసంపదకు సంబంధించిన అధ్యాయము ప్రకటిస్తున్నాము. పాడిపంటలకు జీవనాధారము నీరు గనుక, దేశమందలి నీటి వనరులు అనగా ఏఱ్లు, చెరువులు, కాలువలు మొదలయిన నీటి వసతులు, నీటి పారుదల ఏర్పాట్లు తెలుగు జిల్లాలలో ఎట్లున్నవో, గోదావరీ కృష్ణా నదుల ఆనకట్టలు, తుంగభద్రా ప్రాజెక్టు మొదలయిన విషయములు నీటివనరులనే అధ్యాయములో తెలియజేసినాము. తర్వాత, గృహనిర్మాణమునకు, ఉపకరణములకు, వంటచెరుకుకు మాత్రమే కాక, పంటలకు కావలసిన వర్షములను మెండుగా కురిపించుటకును ఉపచరించే కొండలు, అడవులు ఆర్థిక సంపదకు ముఖ్యమేకనుక అడవులు అనే అధ్యాయములో ఎక్కడెక్కడ కొండలు, అడవులు గలవో, ఏయే రకముల కలప గలదో, ఏయే అడవి దినుసు ఎంతవరకు ఉపయోగమగుతున్నదో వివరించినాము. భూతలమునకు సంబంధించిన విషయములే గాక భూగర్భమున గల లోహములు, గని (రాక్షసి) బొగ్గు మొదలయినవి సైతము ఆర్థిక సంపదకు తోడ్పడును. గనుక మన తెలుగు జిల్లాలలోని ఖనిజ సంపదను గురించి ఒక అధ్యాయము ప్రకటిస్తున్నాము. భూతలము నుండిగాని, భూగర్భమునుండిగాని లభించేముడివస్తువులు, ముడి ఖనిజములు మానవుని పరిశ్రమ లేకున్నయెడల ఎక్కువ విలువ గలవిగాని, దేశస్థుల ఆర్థిక సంపదకు ఎక్కువగా తోడ్పడ గలవి గాని కావు గనుక దేశమందలి పరిశ్రమల స్థితి తెలియజేయవలెను. అందునుగురించి ఒక అధ్యాయము ప్రత్యేకముగారచించి, అందులో చిరకాలము నుండిన్ని మన దేశములోగల చేతి పరిశ్రమలు, పల్లె పరిశ్రమలు ఎట్లు పరిణమించి ఉన్నవో, మానవుని కాయకష్ట శ్రమ ఫలితముగా వచ్చే శక్తికి మించిన యంత్రశక్తి పరిశ్రమలకెంత ఉపచరిస్తున్నదో, ఇప్పుడు తెలుగు జిల్లాలలో ఏయే పరిశ్రమలు ఎక్కడెక్కడ నున్నవో, అవి ఎంతెంత విలువగల వస్తువులను తయారు చేయుచున్నవో తెలియజేసినాము. యంత్రములు నడపుటకున్ను, వెలుతురిచ్చుటకున్ను ఇంకా ఇతర కార్మికశక్తిని కలుగజేయుటకున్ను కావలసిన విద్యుచ్ఛక్తి మన ఆంధ్ర దేశములో ఎట్లుపచరిస్తున్నదో, ఎక్కడెక్కడ ఈ శక్తి నుదయింప జేయుటకు అనుకూలమైన పరిస్థితులున్నవో తెలియజేస్తూ విద్యుచ్ఛక్తి అనే అధ్యాయము రచించినాము. పడించే పంట దినుసుగానీ, కార్ఖానాలలో తయారుచేసే వస్తువులుగానీ ఉత్పన్నములైన స్థలముల నుండి అమ్ముడుబోయే స్థలములకు సులువుగా పోయి చెల్లినగాని వాటికి తగిన విలువలేదు ; గనుక, అవి ఎక్కడపుట్టుతున్నవో, వాటికి ఎక్కడ గిరాకీగలదో, వాటిని రవానాచేయుటకు రాకపోకల సౌకర్యము లెట్టున్నవో సరుకుల విడుదల అనే అధ్యాయములో తెలియ జేస్తున్నాము. వ్యవసాయము చేసే రైతుకు, చేతి పరిశ్రమలే కానీ, కార్ఖానా పరిశ్రమలేకానీ నడపించే పెట్టుబడిదారుకుగానీ, పెట్టుబడి సంఘములకు గానీ పెట్టుబడి మూలధన ముండవలెను—ఆస్తి ఉండవలెను ; అప్పు పుట్టవలెను ; ధననంతులో, బ్యాంకులో, పెట్టుబడి ధనము సరఫరా చేయవలెను ; గనుక ఆస్తి, బ్యాంకులు, కంపెనీలు అనే అధ్యాయములో ఈ విషయములన్ని వివరించినాము. పైని చెప్పిన అధ్యాయముల విషయసంగ్రహము ప్రతి అధ్యాయము మొదటను తెలియజేస్తున్నాము.

# జాతిసంపద వృక్షము

సంగీతం
శిల్పము
వైద్యము
న్యాయశాస్త్రము
నాట్యము
ఆలయనిర్మాణం
సాహిత్యం
వర్తకము
ఎగుమతులు.
వినోదములు
సరుకులవిడుదల
శాస్త్రపరిశోధన
వేదాంతము.
రైతులు
కూలీలు
కూలీలు
కూలీలు
కూలీలు
కూలీలు

దేశమనియెడి దొడ్డ వృక్షం ప్రేమలను పూలెత్తవలెనోయ్ ;
నరుల చెమటను తడిసి మూలం ధనం పంటలు పండవలెనోయ్. —గురజాడ

# పదునొకండవ అధ్యాయము

# వ్యవసాయము

" కోటి విద్యలు కొంౘకులోపలే "

" ఎంచిన ఎరువేదిరా అంటే యజమాని పాదము "

" ఒక నాటి అదును ఏడాది బ్రతుకు "

" అరక అరిగితే గరిసెవిరుగును "

" ప్రత్తికి పది చాళ్ల జొన్నకు ఏడు చాళ్ల. "

**విషయ సంగ్రహము:-వ్యవసాయము వలన ఎక్కువ మంది జీవించేదేశాలలో హిందూ దేశము ప్రధానమైనది. నూటికి 93 రు పల్లెని వాసులు. దేశ సమస్య పల్లెల సమస్య, ఆంధ్ర దేశములోని 4 కోట్ల ఎకరాల భూమిలోను సాగుబడి భూమి $1\frac{1}{2}$ కోటిఎకరాలు. అన్ని రకముల భూములు గలవు, పఱ్ఱ భూములు, కంకర, ఎఱ్ఱనేల, డెల్టాభూములు, నల్లమట్టి నేలలు కలవు. ఇరిగేషను కాలువలవల్ల, ఏటికాలువలవల్ల, వర్షాధారమువల్ల, చెరువులవల్ల, భూమి సాగుబడి అగుచున్నది. పల్లపు భూములలో వరి, చెరుకు పెద్దపంటలు. మెట్ట భూములలో చోళ్లు, జొన్నలు, రాగులు మొదలగు తృణధాన్యములు; ఉలవలు, కందులు మొదలగు కాయ ధాన్యములు; వేరు సెనగ, నువ్వులు మొదలగు తైల వర్గాలు, మామిడి, అరటి, నారింజ, నిమ్మ మొదలగు పండ్ల జాతులు ; ప్రత్తి ప్రొగాకు మొదలగు పారిశ్రామిక పంటలు, పోపుమసాలా దినుసులు పండును. ఆంధ్ర దేశములో జిల్లాల వారిగా పండు పంటలు, వాటి విలువ తెలియజేయు పట్టీలు, వ్యవసాయమునకు సంబంధించిన సామెతలు.**

ప్రపంచములో వ్యవసాయమువల్ల జీవించే దేశాలలో మన హిందూ దేశం ముఖ్యమైనది. ఈ దేశం అంతటిలో నూటికి 93.5 గురు పల్లెలలోను, 6.5 మంది పట్టణాలలోను వసించుచున్నారు. మద్రాసు రాజధానిలో నూటికి 90.7 మంది పల్లెలలో జీవనము చేయుచున్నారు. అనగా, సగటున సుమారు, ఒక్కొక్క పల్లెకు 678 మంది చొప్పున ఉన్నారన్న మాట. అందుచేతనే, హిందూదేశ ఆర్థిక సమస్య పరిష్కారము కావలెనన్న, పల్లెటూళ్ల ఆర్థిక సమస్య పరిష్కరించవలెనన్న మాట. ఇది చూచే, మన దృష్టి పల్లెటూళ్లకు మరల్చుట ముఖ్యమని గాంధీ మహాత్ముడు చెప్పుచున్నాడు. మద్రాసు రాజధాని 223.700 చదరపు మైళ్లు వైశాల్యముగలది. జనాభా 46,74,000. ఆంధ్ర జిల్లాల మొత్తము వైశాల్యం సుమారు 65 వేల చదరపు మైళ్లు. అనగా, 4 కోట్ల ఎకరాలు. దీనిలో సాగుబడి నున్న భూమి $1\frac{1}{2}$ కోట్ల ఎకరాలు. ఇందు 40 లక్షల ఎకరాల భూమికి నీటి వసతులున్నవి. మిగిలిన భూమి కేవలం వర్షముపై ఆధారపడి ఉన్నది.

ఆంధ్ర దేశములో సారవంతమైన నల్లనేల మొదలు కంకరతో నిండివుండే నేలలు, పఱ్ఱ భూములు, బీడు భూములు అన్నిరకముల నేలలున్నగలవు. కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి, గుంటూరు, నెల్లూరు జిల్లాలలోని భూములు ఎక్కువగా కాలువల నీటివల్ల సాగుబడి అవుతున్నవి. రాయలసీమలోని భూములకు చాలవరకు ఆధారము పెద్దపెద్ద చెరువులు. ఇందును గురించిన వివరణములునీటి వనరులు అనే శీర్షిక క్రింద విపులముగా తెలియజేయడ మయినది. విశాఖపట్నం, గోదావరిజిల్లాలలోగల ఏజన్సీలోను, కర్నూలు జిల్లాలోగల అడవులలోను కలప, ఇతర అడవి సరుకులు మనకు లభిస్తున్నవి. వీటిని గురించి వివరణములు "అడవులు" అనే శీర్షికలో చూడ వచ్చును. ఆంధ్ర దేశములోని ముఖ్య పంటలు వరి, చెరకు, జొన్న, రాగి, చోళ్లు, కొఱ్ఱలు, మొక్కజొన్న, వేరుసెనగ, ప్రత్తి మిరప, పసుపు, పొగాకు, నువ్వులు మొదలైనవి,

మన దేశపు పంటలను గురించి తెలుసుకొనుటకు ముందు ఆంధ్రి జిల్లాలలోని భూమి ఏప్రాంతంలో ఎంత సారవంతమై వున్నదో తెలుసుకోవడం చాలా ముఖ్యం.

తూర్పు కనుమలకు సమీపంగా వున్నవి ఎఱ్ఱమట్టి నేలలు. ఇవి విశాఖపట్నం తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి కృష్ణా జిల్లాలలో వున్నవి. ఈ నేలలో పై భాగాన్ని

ఎఱ్ఱమట్టీ, లోతుగు త్రవ్విన కొద్దీ రాళ్లూ, తెల్లకంకరా వుండును.

గుంటూరు, నెల్లూరు, రాయలసీమ జిల్లాలలోను ఎఱ్ఱనేలా, నల్లరేగడి లేక ప్రత్తిరేగడి నేలలూ కలిసివున్నవి. ఈ నల్లరేగడి నేలలుండే ప్రదేశంలో వర్షం తక్కువైనా నీరు నిలవచేసుకొనే శక్తి ఈ నేలకి అధికము.

అంతేకాక, నదులతో కొట్టుకు వచ్చే ఒండలి లేక ఒండ మట్టి నేలలు తూర్పు, పశ్చిమ గోదావరి, కృష్ణా, నెల్లూరు జిల్లాలలో ఉన్నవి. ఈ భూమి పైరెండు రకాల భూముల కంటే సారవంతమైనది.

సముద్ర తీరాన్ని ఇసుకమేటు వేసిన తేలిక భూములున్నవి, ఇవి సరుగుడు, తాడి, జీడిమామిడి మొదలగు తోటలకు పనికి వస్తవి. ఇవి తూర్పు తీరము నందంతటా విస్తరించి వున్నవి.

ఈ ఇసుక నేలకున్ను సారవంతమైన ప్రదేశానికిన్ని మధ్య, సముద్రపు నీటి ఊటతో వుప్పు దుబ్బివుండే చవిటి పర్రలుకూడా అక్కడక్కడ వున్నవి; కాని, ఆంధ్ర దేశంలో ఈరకం భూమి చాలా తక్కువగానే వున్నది.

ఆంధ్ర దేశంలో మిక్కిలి వేడిమిగల ప్రదేశాలున్ను (120 డిగ్రీల వరకూ వేడిమిగలవి) సమశీతోష్ణస్థితిగల ప్రదేశాలున్ను గలవు. అందుచేత, ఉష్ణ మండలపు పంటలు పండడానికిన్ని, సమశీతోష్ణమండలపు పంటలు పండడానికిన్ని అవకాశాలున్నవి.

రాయలసీమలో రాళ్లతో నిండిన పోరంబోకులున్ను, చిన్నచిన్న అడవులుగల ప్రదేశాలున్ను గలవు. కాని, కేవలము ఇసుకతో నిండి, చెట్టూచేమ కానరాని ఎడారి ప్రదేశం మాత్రం ఆంధ్ర దేశంలో ఎక్కడా కనబడదు.

మన దేశం మొత్తం మీద పండే పంటలలో కేవలము తిండికి పనికివచ్చే పంటలు నూటికి 80 పాళ్లు; అనగా, సుమారు 140 లక్షల ఎకరాల భూమి అందుకుపరిచరిస్తున్న దన్నమాట. ఇందులో తృణ ధాన్యములైన వరి, జొన్న, కొఱ్ఱ, గంటి, చోడి పైరయే ప్రదేశం 110 లక్షల ఎకరాలు. ఆహారపు పైర్లలో కాయ ధాన్యాలయిన కంది, పెసర, మినుము, సెనగ వగైరాలు 16 లక్షల ఎకరాలా క్రమించుకుంటున్నవి. నూనె దినుసులైన నువ్వులు, వేరుసెనగ కొంత వరకు తిండికికూడా పనికి వచ్చును.

అరటి, మామిడి, నారింజ మొదలయిన జాతుల పళ్లూ దుంపలూ, కూరగాయలూ సాగుబడి అయే ప్రదేశం $2\frac{1}{2}$ లక్షల ఎకరాలు. కొబ్బరి తినుబడి ఫలమైనా, ముఖ్యంగా చమురు జాతులలో చేరుతుంది.

మొత్తం మీద, తిండికి పనికివచ్చే ఇతర పంటలన్నీ కలిసి 42 లక్షల టన్నుల బియ్యానికి సరిపోయే ఆహార పదార్థాలవుతవి. కాని, ఆంధ్ర దేశంలో జనాభానుబట్టి సగటున తల ఒక్కంటికి రోజుకి $1\frac{1}{2}$ పౌను చొ॥ సంవత్సరానికి $\frac{1}{4}$ టన్ను అని అంచనా వేస్తే, 50 లక్షల టన్నుల బియ్యానికి సరిపోయే పంటపండితేనే కాని చాలదు.

కొన్ని పోపు (మసాలా), పరిమళ ద్రవ్యాలు (మిరప, ఆవాలు, మెంతులు, ధనియాలు, పసుపు అల్లం వగైరా పదార్థాలు) వాటికి తిండి విలువ అంతగా లేక పోయినా ఆహార వస్తువులలోనే చేరును. వీటిలో మిరప ప్రత్యేకం 2 లక్షల ఎకరాల నేల సాగుబడి అవుతున్నది. మిగిలిన వన్నీ ఒక లక్ష ఎకరాల భూమిపై సాగవు తున్నవి.

తిండికి పనికిరాని తైల పదార్థాలు ఆముదాలు, అవిసె, కుసుమ మొదలైనవి కూడా ఆంధ్ర దేశంలో పండును. ఇవీ వేరుసెనగా, నువ్వులూ, కొబ్బరీ కలిసి 27 లక్షల ఎకరాల నేల సాగుబడి అవుతున్నది.

పారిశ్రామికపు పంటలలో ప్రత్తి ముఖ్యస్థానాన్నాక్రమిస్తున్నది. ఇది సుమారు 13 లక్షల ఎకరాల ప్రదేశంలో సాగుబడి అవుతున్నా, యంత్రాల పై సన్నసూలు తీయడానికి తగు నాణ్యమైన రకం కాకపోవడం చేత కావలసినంత ఎక్కువగా నూలు మిల్లులూ, నేత మిల్లులూ అభివృద్ధి కావడము లేదు.

గోగూ, జనుమూ, కొబ్బరా, తాటి పీచూ, నార పంటలలోనివి. వీటికి ఆంధ్ర దేశంలో 14 లక్షల ఎకరాల భూమి వినియోగ మవుతున్నది.

పొగాకు ఆంధ్ర దేశంలో $2\frac{1}{2}$ లక్షల ఎకరాల భూమి సాగుబడి అవుతున్నా విదేశాలకి ఎగుమతికి పనికి వచ్చే నాణ్యమైన సరుకుకు 1 లక్ష ఎకరాల భూమి మాత్రమే ఉపయోగమగుతూ ఉన్నది.

ఆంధ్రదేశములోని పంటలను సంబంధించిన వివరములు ఈ క్రింది పట్టికలలో విపులముగా తెలియనగును.




* పై సంఖ్యలను లక్షలలో లెక్కించవలెను.

### తెలుగు జిల్లాలలోని పంటలు ; నాటి పరిమితి, విలువ

| జిల్లాపేరు | వరి | చోళ్లు | జొన్నలు | రాగులు | కొర్రలు | వరిగలు | చామలు | మొక్క జొన్న | ఇతరకాయ ధాన్యములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| విశాఖ పట్టణం | 517 | 242 | 628 | 1163 | 56 | 12 | 45 | 11 | 67 |
| తూర్పు గోదావరి | 575 | 305 | 145 | 75 | 11 | 7 | 23 | 19 | 10 |
| పశ్చిమ గోదావరి | 590 | 192 | 24 | 16 | 2 | 3 | 2 | 6 | 1 |
| కృష్ణా | 448 | 656 | 51 | 22 | 2 | 15 | | 67 | 3 |
| గుంటూరు | 3059 | 1112 | 522 | 100 | 157 | 12 | .7 | 144 | 465 |
| నెల్లూరు | 2704 | 1216 | 558 | 616 | 80 | 259 | 4 | .4 | 49 |
| కర్నూలు | 486 | 1656 | 199 | 148 | 691 | 19 | 1 | .4 | 30 |
| బళ్లారి | 235 | 1478 | 247 | 75 | 811 | 4 | 22 | .7 | 9 |
| అనంతపురం | 1045 | 694 | 290 | 564 | 500 | 90 | 152 | .7 | 10 |
| కడప | 832 | 918 | 432 | 446 | 180 | 77 | 8 | .4 | 21 |
| చిత్తూరు | 1794 | 185 | 515 | 869 | 7 | 58 | 33 | .1 | .4 |
| మొత్తం టు॥ (వందలు) | 31469 | 8655 | 3612 | 4094 | 2498 | 564 | 290 | 249 | 667 |
| మొ॥ వెల రూ(లక్షలు) | 2203 | 519 | 217 | 205 | 125 | 22 | 11 | 17 | 27 |
| టన్ను 1కివెల రూ | 70 | 60 | 60 | 50 | 50 | 40 | 40 | 70 | 40 |

| జిల్లాపేరు | మామిడి పండ్లు | అరటి పండ్లు | నారింజ పండ్లు | నిమ్మ పండ్లు | వేరుశనగ, పొట్టుసహా | నువ్వులు | ఆముదాలు | కొబ్బరి10 లక్షలలో | ప్రత్తి 400 పౌ. బేళ్లచొ | పొగాకు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| విశాఖ పట్టణం | 1480 | 440 | 17 | | 875 | 243 | 1 | 33.9 | 1670 | 13400 |
| తూర్పు గోదావరి | 1250 | 582 | 56 | 40 | 9 | 117 | 9 | 212.6 | 2230 | 10750 |
| పశ్చిమ గోదావరి | 350 | 475 | 13 | 94 | 140 | 93 | 5 | 39.2 | 130 | 5070 |
| కృష్ణా | 340 | 58 | 13 | 59 | 795 | 10 | 8 | 3.0 | 1700 | 5070 |
| గుంటూరు | 80 | 70 | 68 | 40 | 1565 | 2 | 3270 | .5 | 14200 | 64800 |
| నెల్లూరు | 220 | 58 | 13 | 47 | 93 | 8 | 46 | .8 | 6320 | 1480 |
| కర్నూలు | 165 | 29 | 14 | 47 | 1995 | 2 | 20 | | 29740 | 3670 |
| బళ్లారి | 100 | 90 | | | 980 | 16 | 13 | 4.8 | 73500 | 1180 |
| అనంతపురం | 170 | 11 | | | 1800 | 35 | 45 | 1.1 | 15200 | 1070 |
| కడప | 570 | 20 | 69 | 69 | 1100 | 6 | 6 | .4 | 7230 | 620 |
| చిత్తూరు | 800 | 60 | 12 | 26 | 690 | 8 | 5 | 7.2 | 40 | 220 |
| మొ॥ ట॥ (వందలు) | 5525 | 1893 | 265 | 422 | 10403 | 540 | 191 | 303.5 | 151960 | 107330 |
| మొ॥ వెలరూ (లక్షలు) | 55 | 38 | 18 | 17 | 8030 | 70 | 19 | 61 | 67 | 429 |
| టన్ను 1కి వెల రూ | 10 | 20 | 70 | 40 | 80 | 130 | 100 | 100 | 400 | 400 |
| | | | | | | | | వెయ్యి1కి | బేలు1కి | |

| జిల్లాపేరు | సెనగలు | ఉలవలు | కందులు | మినుములు | ఇతరకాయ ధాన్యములు | మిరప కాయలు | బెల్లం | సుగంధ ద్రవ్యాలు, ఉల్లి, పసుపు, ధనియాలు వగైరా |
|---|---|---|---|---|---|---|---|---|
| విశాఖ పట్టణం | 1000 | 10700 | 3400 | 2700 | 2200 | 8750 | 95800 | 900 |
| తూర్పు గోదావరి | 1100 | 7170 | 1850 | 5970 | 890 | 6200 | 31700 | 1690 |
| పశ్చిమ గోదావరి | 640 | 3930 | 1210 | 450 | 770 | 2430 | 7200 | 1240 |
| కృష్ణా | 910 | 2630 | 1020 | 1880 | 200 | 3000 | 7430 | 1980 |
| గుంటూరు | 1490 | 2500 | 4230 | 1660 | 510 | 14120 | 2610 | 8750 |
| నెల్లూరు | 140 | 9550 | 410 | 250 | 330 | 3120 | 160 | 500 |
| కర్నూలు | 2700 | 5440 | 6130 | 500 | 230 | 5720 | 1270 | 880 |
| బళ్లారి | 3060 | 8440 | 6000 | 330 | 3280 | 3120 | 23000 | 1650 |
| అనంతపురం | 1630 | 22990 | 8600 | | 630 | 2600 | 4470 | 2600 |
| కడప | 380 | 3930 | 740 | 30 | 120 | 1580 | 910 | 2020 |
| చిత్తూరు | 10 | 4330 | 650 | 50 | 470 | 1620 | 31400 | 1740 |
| మొత్తం టన్నులు | 13060 | 81520 | 34240 | 13820 | 9630 | 52260 | 205950 | 23950 |
| మొత్తం వెల రూ | 783600 | 4891200 | 2054400 | 691000 | 481500 | 10452000 | 41190000 | 3592500 |
| టన్ను 1కి వెల రూ. | 60 | 60 | 60 | 50 | 50 | 200 | 200 | 150 |

## తినుబండారములు

| ధాన్యము | పండ్లు | కూరలు, ఆకులు |
| --- | --- | --- |
| వడ్లు, జొన్నలు మొక్క జొన్న, రాగి, గంటెలు సజ్జలు, చోళ్లు, పెసలు, ఉలవలు, కందులు, మినుములు, మిరపకాయలు, చెరకు, శెనగలు ధనియాలు, ఆవాలు, మెంతులు, గోధుమలు, కాఫీగింజలు | మామిడి పండ్లు, నారింజ పండ్లు, నిమ్మ, దబ్బ, అనాస, ముంతమామిడి పండ్లు, జామి, అరటి, కమలాఫలాలు, సపోటా, పంపరపనాస, సీతాఫలం, పనస, కర్బూజ, పుచ్చ, దోస, బొప్పాయి, బత్తాయి, ద్రాక్ష, ఈత, చింత పండు, నేరేడు, గులాబి జామ, రేగు, ఉసిరి వగైరాలు. | వంగ, బెండ, చిక్కుడు, దుంపలు, కంద, పెండలము, చేమ, బంగాళాదుంప, ఉల్లి, బీర, పొట్ల, కాకర, దొండ, గుమ్మడి, అరటి, అల్లం, ఆనబ వగైరాలు; తోటకూర, గోగుకూర, బచ్చలి, చుక్కకూర, కొత్తిమిర, మెంతికూర, పుదీనా, తమల పాకులు, కరివేపాకు, అరటి ఆకులు వగైరాలు. |

తిను బండారాల్లో పైవేగాక ఇంకా చేపలు, మాంసము గ్రుడ్లు కూడా చేరుతాయి.

## ఇతర దినుసులు, వస్తువులు.

| సుగంధద్రవ్యాలు | ఉపపైరులు | చమురుదినుసులు | నారపంటలు |
| --- | --- | --- | --- |
| అల్లం | పిల్లి పెసర | వేరుశనగ | ప్రత్తి |
| పసుపు | జనుము | జనుము | గోగునార |
| ఇంగువ | ఉల్లి | ఆముదాలు | జనపనార |
| మిరియాలు | నీరుల్లి | నువ్వులు | కిత్తనార |
| శొంఠి, యాలకులు | చామలు | కొబ్బరి | కొబ్బరినార |
| | కుసుమలు | కుసుమలు | ప్రాటిపీచు |
| లవంగాలు | | | |
| దాల్చిన చెక్క | | | |
| మంచిగంధము | | | |
| వగైరాలు. | | | |

| పశువులు | పక్షులు | చేపలు |
| --- | --- | --- |
| ఆవులు | కోడి | బొచ్చె |
| ఎడ్లు | బాతు | కొరమీను |
| గేదెలు | పావురము | వాలుగ |
| దున్నలు | చిలుక | గండిమీను |
| గుర్రములు | గోరింక | బొమ్మిడాలు |
| మేకలు | గద్ద | రొయ్య |
| గొర్రెలు | కాకి | మట్టగిడస |
| లేళ్లు | నెమలి | జల్ల |
| దుప్పులు | కోకిల | బెత్త |
| కుక్కలు | | తాబేలు |
| అడవిపందులు | | ఎండ్రకాయ |
| పందులు | | |
| ఎలుగొడ్లు | | |
| చిఱుతపులులు | | |
| పెద్దపులులు | | |
| అడవిపందులు | | |
| కుందేళ్లు | | |

పైని గనపరచిన సంఖ్యలవల్ల మన ఆంధ్ర దేశంలో ఏ కొద్ది రకాలలో తప్ప మిగిలినవన్నీ సర్వసమృద్ధిగా సరిపోతవని చెప్పవచ్చు. ఆంధ్ర దేశం ఇంకా కొంత పంట పై దేశాలకూ, ఇతర రాష్ట్రాలకు కూడా ఎగుమతి చేస్తున్నది. ఏయే సరుకు ఏయే రాష్ట్రాలకి ఎగుమతీ అవుతున్నదో ఎంత వెలగల సరుకు ఎగుమతీ అవుతున్నదో, మనకు లేని (గోధుమలు వగైరా) పదార్థాలు విదేశాల నుండిన్ని పరరాష్ట్రాల నుండిన్ని ఎంత దిగుమతి చేసుకుంటున్నదో మొదలైన విషయాలు "విడుదల సౌకర్యములు; వాణిజ్యము" అనే శీర్షిక క్రింద వివరించడ మైనది.

అంతే కాక, మన పంటలు ఇంకా ఏవిధంగా అభివృద్ధి చేసుకోవలెనో నీటి వసరులు, ఎరువులు అనే శీర్షికలలో తెలియ జేయడమైనది.

మొత్తం మీద, ఆంధ్రదేశం సస్య సమృద్ధిగల దేశమనే చెప్పవలెను. తిండికి ఇతరుల మీద ఆధారపడకుండా సర్వ సమృద్ధిగా వుండడము నిజముగా ఎంత అదృష్టము!

వ్యవసాయాన్ని గురించిన ఈ అధ్యాయము పూర్తిచేయక ముందు వ్యవసాయమునకు, వర్షాలకు, వ్యవసాయదారుల ఊడ్పు, కోత, నూర్పువగైరా పనులకు, వ్యవసాయ భూములకూ సంబంధించిన తెలుగు సామెతలు కొన్ని ఇక్కడ పొందుపరచడం ముఖ్యం. ఇవి మన దేశములో చాలా ఉన్నవిగాని మరచిపోయినాము. వ్యవసాయ డిపార్టుమెంటువారు ప్రోగుచేసి ప్రకటించి, మేలుచేసినారు. పశువులకు సంబంధించినవి ఆశీర్షిక క్రింద కనబరచినాము.



* శ్రీ పి. ఎచ్. రామిరెడ్డి; ఎమ్.ఏ., బి.ఎస్.సి., మద్రాసు ప్రభుత్వ వ్యవసాయ శాఖ డైరక్టరు.

## సామెతలు.

(అ) వ్యవసాయానికి సంబంధించినవి :—

1. కోటి విద్యలు కొండ్రకు లోపలే.
2. అడిగిన జీతంబియ్యని, మిడిమేలపు దొరనుగొలిచి మిడుగుటకంటెన్, వడిగల ఎద్దుల గట్టుక, మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ.
3. భూమి ఇచ్చినట్లు మనకు భూపులీగలరె?
4. దొరలు ఇచ్చిన పాలుకన్నా ధరణి ఇచ్చిన పాలు మేలు.
5. కృషితో నాస్తి దుర్భిక్షం, జపతో నాస్తి పాతకం.
6. కరువు మానుపపంట, మిడతల మానుపమంట.
7. బడిలేని చదువు వెంబడిలేని సేద్యము కూడదు.
8. ఎంచిన ఎరువేదిరా అంటే యజమాని పాదము.
9. తల్లిదేవలపక్షము ధరణిదేవలపక్షము.
10. అన్నీ పండించిన కాపువానికి అన్నం కరవు.
11. కర్రుమన్ను అయితే, కాపు బ్రతుకును.
12. ఎద్దులేని సేద్యం; చద్దిలేని పయనం.
13. చేతిలోగాని చేలోలేదు.
14. వడ్లూ గొడ్లూ ఉన్నవాడిదే వ్యవసాయం.
15. మడిదున్ని మహారాజైనవాడూ, చేనుదున్ని చెడినవాడు లేడు.
16. తొలకరిని చెరువు నిండినా, తొలిచూలిని కొడుకు పుట్టినా లాభం.
17. పెద్దయింటి బొట్టె అయినా కావాలి, పెద్ద చెరువు నీరయినా కావాలి.
18. చేనుకు గట్టూ, ఊరికి కట్టూ ఉండాలి.
19. ఒకనాటి అదును ఏడాది బ్రతుకు.
20. రెండూళ్ల వ్యవసాయం, ఇద్దరు భార్యలూ చెరుపు.

(ఆ) వానలకు, కార్తులకు సంబంధించినవి :—

1. వానతో కరువులేదు, పెనిమిటితో దారిద్ర్యం లేదు.
2. తొలకరి వానలు మొలకలకు తల్లి.
3. తులావృష్టి ర్ధరాసస్యా.
4. మబ్బు విడచిన ఎండ, మగడు విడచిన ముండ.
5. భరణి కురిస్తే ధరణి పండును.
6. మృగశిర చిందిస్తే ముసిలెద్దు రంకెవేస్తుంది.
7. ఆరుద్ర చిందిస్తే అరవై రోజులు వరుపు.
8. ఆరుద్ర కురిస్తే దారిద్ర్యం లేదు.
9. ఆరుద్రలో అడుగుకు ఒక చినుకు పడినా అడిగినన్ని వడ్లు పండును.
10. మఘ వురిమితే మదురుమీద కర్రఅయినా పండును.

---

* వీరికి ముందు, ధన్వాడ ఆనందరావుగారు ఈ పదవినందున్న ఆంధ్రులు.


ఆంధ్రభూమిని దున్ని అందరికీ ఆహారమునిచ్చురైతు.

11. మఘ పుబ్బలు వెర పిచ్చె; మహత్తైన క్షామం వచ్చె, ఉత్తర చూచి ఎత్తర గంప, హస్తమించిపోయె నా?

12. ఉత్తర ఉరుము దప్పినా, రాజు పాడి తప్పినా, చెదపురుగుకి రెక్కలు వచ్చినా కష్టము.

13. ఉత్తర చూచి ఎత్తర గంప, విశాఖ చూచి విడువరకొంప.

14. హస్తకు ఆది పంట, చిత్తకు చిరి పంట.

15. చిత్త జల్లు స్వాతి వాన.

16. స్వాతి కురిస్తే జొన్నలు చల్ల పిడతలోకైనా పండవు.

17. స్వాతి కురిస్తే మోతి (ముత్యాలు) పండును.

18. చిత్త చిత్తగించి, స్వాతి చల్లచేసి, విశాఖలో విసరకుంటే, అనూరాధలో అడిగినంత పండుతాను.

19. విశాఖాంతాని మేఘాని, ప్రసూతాంతాని యౌవనం; లలితాంతాని గీతాని, తక్రాంతాని చభోజనం.

20. అనూరాధ కార్తిలో అనాథ కర్రయినా యీనుతుంది.

21. మూల ముంచును, జ్యేష్ఠ తేల్చును.

22. పుష్య పూర్ణిమనాడు రాత్రి, పందిరమీద పెట్టిన దూది పింజ తెల్లవారి నలిపి నప్పుడు నీళ్లు కారితే, మరుసటి సంవత్సరంబాగా వర్షిస్తుంది.

23. మార్గశిరమాసంలో మంచుపడ్డ 190 వ నాడు మంచి వర్షం కురుస్తుంది.

24. ఇనశశి పరివేషంబులు, ఘన రహితములగుచు వాన కాలమునందున్; గనుపట్టిన గలలోనను, వినువానలు లేవు నిజము (వెంకట నృపతీ).

25. కోడి రెక్క ఆరవేస్తే గొప్పవర్షం కురుస్తుంది.

26. గొర్రెలు గుంపుగూడితే గొప్పవర్షం కురుస్తుంది.

27. వట్టి నేలలో కప్ప అరుస్తే వర్షం తప్పదు.

28. నల్ల చీమ గ్రుడ్లు మోసిన వాన తప్పదు.

(ఇ) భూసారాన్ని గురించినవి :—

1. దుక్కిలేని చేను, తాలింపు లేని కూర.

2. దుక్కిచాలని చేనికి ఎరువు ఎంత పెట్టినా వట్టిదే.

3. దుక్కికొద్దీ పంట, బుద్ధికొద్దీ సుఖము.

4. అరక అరిగితే, గరిసె విరుగును.

5. దుక్కి చలవే చలవ, తల్లి పాలే పాలు.

6. ఎరువు బెట్టిన చేను, ఏలు బడియైన కోడలు వ్యర్థం కాదు.

7. కలుపు తీస్తేనే బలుపు.

8. చేనికి ఎరువు, మడికి మంద.

9. గొల్లవాడా! గొల్లవాడా! ధాన్యం ఎక్కడున్నా యంటే గొర్రె ముడ్డిలో ఉన్నాయంటాడు.

10. పిండికొద్దీ రొట్టె, తిండికొద్దీ పసరం, పెంటకొద్దీ పంట.

11. క్షేత్రమెరిగి విత్తనం వెయ్యాలి; పాత్రమెరిగి దానం చెయ్యాలి.

12. పదను తప్పినా, అదను తప్పినా పన్నుదండుగ.

13. ఒత్తు వాములు కోరును; పలచన పాతర్లు కోరును.

14. మృగశిరలో వేసినపైరు, మాసాలురావడంతోపుట్టిన కొడుకు మేలుచేస్తారు.

15. చేలోది ముదురు; చేతిలోనిది లేత.

16. పొట్ట పైరుకు పుట్టెడు నీళ్లు.

17. మఖలో మానెడు చల్లేకంటె, ఆశ్లేషలో అడ్డెడు చల్లడం మంచిది.

18. క్షామాన్ని జొన్న, వర్షాన్ని వడ్లు పండును.

19. ప్రత్తికి పదిచాళ్లు, జొన్నకు ఏడుచాళ్లు.

20. ఆరికకు చిత్తగండము, ఆడదానికి పిల్లగండము.


"హర్షమొదవును జగతికి హాళికుండు."




" సుజలాం, సుఫలాం.... సస్యశ్యామలాం.... " 'తెలుగు మాతల్లికి కోటిదండాలు'.

# పండ్రెండవ అధ్యాయము

# పశుసంపద



విషయసంగ్రహము: పశువు యొక్క ప్రాముఖ్యము; పశువులు, ఎరువులు; తెలుగు జిల్లాలలో అన్ని ప్రదేశాలలోనూ ఒక కోటికి మించిన పశుజాలమున్నది; ఇందులో రెండువంతులు గోజాతి; ఒకవంతు మహిషజాతి; భారతదేశమునందు ప్రశస్తి గడించిన ఒంగోలు పశుజాతి; ఎద్లు వాటి ఉపయోగములు; కర్నూలు జిల్లాలలోని కపిలియర్ జాతి పశువులు; లంబాడీజాతి పశువులు; చిత్తూరు జిల్లాలోని పొట్టి పశువులు, వాటి ప్రత్యేకత; తెలుగునాట సుమారు 64 లక్షల గొర్రెలు; 23 లక్షల మేకలు గలవు. పశువులకు సంబంధించిన సామెతలు; గుఱ్ఱములను, కోళ్లను, పొట్టేళ్లను పందెములలో ఉపయోగింతురు; పక్షులు, వినోదమునకై పెంచు పావురాళ్లు, నెమళ్లు మొదలయినవి; ఆహారమునకు పనికి వచ్చునవి; ఆంధ్ర దేశములోని ముఖ్యములైన మత్స్యములు; బొచ్చె ముత్తసంగి, సలపజెల్ల మొదలైనవి; గొరామి చేపలను దక్షిణాఫ్రికా నుండి తెప్పించి మద్రాసు రాజధానిలో పెంచుట; ఫిషరీస్ డిపార్టుమెంటువారు షార్కు చేపలనుండి షార్కు లివర్ ఆయిల్ వంటితైలము తయారు చేయుదురు; పశుసంపదకు సంబంధించిన పట్టికలు.—

వ్యవసాయమునకు మూలాధారము పశువులు. అమెరికా ఇంగ్లండు, జపాను మొదలైన దేశములలో గుఱ్ఱములు, కంచర గాడిదలు ఎట్టి ప్రధాన స్థానము వహిస్తున్నవో, భారత దేశములో ఎద్లు అట్టి స్థానాన్ని ఆక్రమిస్తున్నవి. భారతదేశం వ్యవసాయముమీదనే ముఖ్యముగా ఆధారపడివుండినది గనక ఆ వ్యవసాయమునకు ఆవశ్యకమయిన పశువులను గురించి కూడా తెలుసుకొనుట చాలా ముఖ్యము. అందుచేత భారత దేశములో రైతుల స్థితి తెలుసుకొనుటకు ముందుగా పశువుల స్థితి తెలుసుకోవలెను.

పూర్వమునుండిన్ని భారతదేశములో గోవును కామధేనువుగాను, తల్లిగాను భావించి, పూజించుచుండెడివారు. పశువులు కేవలము భూమిని దున్నుటకేకాక, భూమికి చాలా బలము కలుగజేయుఎరువులు సైతము ఇస్తున్నవి. అందుచేత ఈ పశువులకు తగినంత వసతినిచ్చి, పుష్టిగల తిండి పెట్టి పోషించిన వ్యవసాయమునకు ఎక్కువగా సహాయపడుతవి. అందుచేతనే పెద్దలు "కసవు లేనిదే పశువు లేదు, పశువులేనిదే పెంటలేదు, పెంట లేనిదే పంట లేదు" అన్నారు.

ఆంధ్ర దేశంలో అడవి ప్రదేశము, బంజరు భూమి విస్తారముగా వుండుటచేత పశువుల అభివృద్ధికి చాలా అవకాశమున్నది. తెలుగు జిల్లాలలో అన్ని ప్రదేశాలలోనూ సుమారు ఒక కోటికి మించిన పశుజాల మున్నది. ఇందులో రెండువంతులు గోజాతి, ఒకవంతు మహిషజాతి. పశువుల సంఖ్యలో విశాఖపట్టణంజిల్లా అగ్రస్థానాన్ని ఆక్రమిస్తున్నది. తరువాత క్రమముగా గుంటూరు, నెల్లూరు, తూర్పు గోదావరి జిల్లాలు పేర్కొనదగినవి. (ఆంధ్ర జిల్లాలలోని పశుసంపదనుగూర్చి తెలిపే పట్టికను చూడుడు.)

మన తెలుగు దేశములోని ఒంగోలు పశువులు అఖిల భారత పశువులందు ప్రశస్తి గడించినవి. పాడికి, పనికీ కూడ ఇవి అగ్రస్థానాన్నే వహిస్తవి. ఇక్కడి ఆబోతులనూ, ఆవులనూకొని వివిధ ప్రదేశాములలో పశుజాతిని వృద్ధిచేసుకొను చున్నారు. దేశవాళీ పశువులలో కూడా ఈ జాతి రక్తము మిశ్రమమై వుంటున్నది. మహిష జాతిలో దేశవాళీవే హెచ్చు; కాని ఏజన్సీ ప్రాంతములలో గొడు దున్నలూ, గేదెలూకూడా ఉపయోగములో వున్నవి.

పశువులలో ముఖ్యముగా వ్యవసాయానికి పనికివచ్చే ఎద్దు జాతిని అభివృద్ధి పరచవలెనన్న, ఉత్తమ జాతి ఆబోతులను మంచి బలమైన ఆవులతో కలుపవలెను. ఇట్లు చేయడము వల్ల ఆ జాతులలో కొన్ని ప్రత్యేక లక్షణాలు క్రొత్తగా ఏర్పడుతవి. అందుకే పూర్వము మన పెద్దలు మంచి కోడె దూడను కొని, అచ్చువేసి ఆబోతుగా వదలెడివారు.

ఆబోతులుగా వదిలి వేయబడెడి కోడె దూడలకు తప్ప మిగతా కృషికి పనికివచ్చేవాటి కన్నింటికీ పిచ్చలు తీయించి వేయవలెను.

ఒంగోలుజాతి :—ఈ జాతి పశువులు యావద్భారత దేశములోనే కాక విదేశాలలోకూడా ప్రఖ్యాతి పొందినవి. ఈ పశువులను నెల్లూరు జిల్లాలో వ్యవసాయదారులేకాక ఇతరులుకూడా చాలా శ్రద్ధగా పెంచుచుండుటచేత ఈ సంతతియొక్క మంచి పశువు లిప్పటికీ విరివిగా దొరుకు చున్నవి. నెల్లూరు జిల్లాలో కారుమంచి, నిడమానూరు, పొందూరు, జయవరం, టంగుటూరు, కరవది, వెలపల పదను, నెన్నూరుపాడు, కందుకూరు మొదలైన గ్రామాల్లో ఈ సంతతి పశువులు దొరుకును. కోడెలను పసిపిల్లలకంటె



ఒంగోలు పశువు.

ఎద్లు కేవలం భూమిని దున్నుటకేగాక బండ్లు లాగుడానికికూడా ఉపచరిస్తున్నవి. ఏజన్సీలోనూ, కర్నూలు జిల్లాలో పర్వత ప్రదేశాలలోను, బండ్లు నడవ వీలులేని ప్రదేశాలలోనూ ఈ ఎద్ల పైనే సామానులెక్కించి ఒక చోటి నుండి ఇంకొక చోటికి తీసుకొనివెళ్లెదరు. ఇంతేకాక పూర్వ కాలములో యుద్ధములో సైనికుల సామగ్రి, ఆహారం మోయుటకు ఈ ఎద్లు చాలా సహాయ పడుతూ ఉండెడివి.

ఆంధ్ర దేశములో ఉత్తమమైనవిగా పరిగణింపబడే ఒంగోలు జాతి, కర్నూలు జిల్లా కంభం ప్రాంతాల్లోని కపిలియజ్ జాతి ముఖ్యమైనవి. వీటినిగురించి కొంచెము విరివిగా తెలుసుకొనుట చాలా ముఖ్యము.

ఎక్కువ గారాబముగా పెంచి, పుష్టికరమైన మేతమేపి, అవి ఎదిగిన తరువాత మంచి ఖరీదుల కమ్మేటే వృత్తిగా పెట్టుకున్నవాళ్లు అనేకులున్నారు. వీటిలో మంచి ఆవులు 11 మొదలు 14 సౌన్ల వరకు పాలనిస్తవి. చూచుటకు చాలా సుందరముగాను ఉంటవి.

ఎక్కువ వేగంగా నడవకపోయినా బరువు లాగుటలో ఈ పశువు లన్నిజాతులలోనూ అగ్రస్థానం వహిస్తున్నవి. 55 టన్నుల బరువు బండ్లనుకూడా ఇవి అవలీలగా లాగ గలవు. ఆ జిల్లాలో ఉండే ప్రశస్తమైన బీళ్లే వీటియొక్క అభివృద్ధికి కారణం. పూర్వం సాగుభూములలోకూడా నూటికి 30 వంతులు వీటి మేతకై ప్రత్యేకంగా విడిచిపెట్టే

వారు. ఇవి అనేక విదేశీ పశు ప్రదర్శనాలలోకూడా బహుమతుల నందుట మనమంతా గర్వించ దగ్గ విషయము.

కపిలియర్ జాతి :—కర్నూలు జిల్లా కంభంలో కపిలియర్ అనే ఒక జాతి కన్నడు లీపశువులను పెంచడము చేత వీటికీ పేరువచ్చినది. ఈ పశువులు చిన్నవిగాను, అతి చురుకుగాను ఉండును. వారీ జాతి పశువులను అతి పవిత్రముగా కాపాడి, చనిపోయిన పిమ్మటకూడ అతి భక్తితో సమాధిచేస్తారేకాని కసాయివాని కత్తికివ్వరు. ఒక్కొక్క మందకు ఒక పల్లడు పశువు అని పశురాజాన్ని ఏర్పాటుచేసి దాన్ని "నందగోపాలస్వామి" అనే పేరుతో పిలిచెదరు. ఈ పశువు చనిపోతే దీని స్థానంలో వేరొకదాన్ని ఎంచుకుంటారు. ఈ నందగోపాలస్వామిని శ్రద్ధగా చూడడానికి ఒక ప్రత్యేక నౌకరును ఎన్నుకుని వాని కీనాములిచ్చి పోషిస్తారు. ఈ కపిలియర్ జాతివారంతా చందాలు ప్రోగుచేసి 11 వేల రూపాయలతో రాతితో గదులుగదులు గానుండే ఒక పెద్ద భవనాన్ని కంభంలో ఈ పశువులకోసం కట్టించినారు.

మద్రాసులోను, అనంతపురం, బళ్లారి జిల్లాలలోనూ మైసూరు అమృతమహాల్ పశువులను, వీటి మిశ్రమ జాతులనుకూడా చాలామంది ఉపయోగించెదరు. ఇవి చాలా సుందరమైనముఖములు, సోగకండ్లు, సూటియైన కొమ్ములు కలిగి చాలా అందముగా వుండును. అతి చురుకుగా ఎంత దూరమైనా అలసటలేకుండా ప్రయాణం చేయును.

గోజాతులలో హానుమకొండ, మట్టివాడ జాతులను లంబాడీజాతులకలవు. ఇవి చాలా పౌరుషమైన జాతులు.

చిత్తూరు జిల్లా పుంగనూరు జాతి, అని ఒక జాతిపొట్టి పశువు లుండేవి.

మన దేశంలో ఇతర ప్రాంతాల్లో వుండే దేశవాళీ పశువులలోకూడ మేలు రకాలు చాలా ఉన్నవి.

మన ఆంధ్ర దేశంలో పర్లాకిమిడి దున్నలుకూడా చాలా ప్రసిద్ధి కెక్కినవి. నెమ్మదిగా నడిచినా; పొలాలు చెరకు తోటలు దున్నుటలోను, బరువులు లాగుటలోను ఎక్కువగా ఉపయోగిస్తవి. పర్లాకిమిడి జాతిలో "దేశి లేక మంద" "పెద్ద కిమిడి" "జిరంగి" అని మూడు రకాల దున్నలున్నవి. ఇవి ఎండవేడిమిని ఎక్కువగా భరించలేవుగాని ఎంత బరువు వేసినా నెమ్మదిగా మోయగలవు. ఏజన్సీ ప్రాంతములో గౌడు దున్నలు చాలా ప్రసిద్ధి కెక్కినవి. ఈ జాతి గేదెలుపాలు ఎక్కువగా ఇవ్వడానికి పేరుపడినవి. ఒంగోలుజాతి, లంబాడీ జాతి, వాకాడుజాతి పశువులు పని చేయుటలో ప్రసిద్ధి పొందినవి.

మన దేశంలోని ఇతర ప్రాంతాల్లోవుండే దేశవాళీ పశువులలోకూడా మేలురకాలు చాలా ప్రసిద్ధి కెక్కినవి.

దేశవాళీ దున్నలు, గేదెలు ఆంధ్ర జిల్లాలలో అన్ని ప్రాంతాలలోను దొరుకును. ఎడ్లకంటె ఇవి ఖరీదు తక్కువ. అంతేగాక ఎంత బరువు పనినైనా చేయగలవు. గనుక పేద రైతు లనేకులు ఎడ్లకంటె దున్నలనే ఎక్కువగా వాడుతారు. దున్నలు పేదరైతుపాలిటి పెన్నిధులు.

## గొర్రెలు.

తెలుగు జిల్లాలలో సుమారు 64 లక్షల గొర్రె లున్నవి. ఇవి ఎక్కువగా అనంతపురం, నెల్లూరు జిల్లాలలో గలవు. వీటి బొచ్చు బిరుసుగా ఉండి, మృదువైన ఉన్నియిచ్చే రకంకాదు. వీటి చర్మాలను విదేశాల కెగుమతిచేసి, మాంసమునుఆహారముగా ఉపయోగించెదరు. పొలాలకి మంచి సత్తువనిచ్చే ఎరువు కోసము వీటిని మందలు మందలుగా పొలాలలోకి తోలి, వాటి పెంటికలను, మూత్రాన్ని ఎరువుగా ఉపయోగిస్తారు. మంచిరకం ఉన్ని నిచ్చే గొర్రెలు బళ్లారి జిల్లాలో కలవు. చలి ఎక్కువగాలేని ప్రదేశాలలో మంచి గొర్రెలు పెరగవు.

ఆంధ్ర దేశంలో 23 లక్షల వరకూ మేకలున్నవి. చిత్తూరు, నెల్లూరు, అనంతపురం జిల్లాలలో ఇవి ఎక్కువ. వీటినికూడా పొలాలకు ఎరువు నిమిత్తం మందకట్టడానికుపయోగిస్తారు. కాని ఇవి ఎక్కువ నాణ్యమైనవి కావు. రోజూ ఒక తవ్వెడు పాలిచ్చే మేకలు బహు అరుదు.

## కుక్కలు.

ఆంధ్రదేశంలో దేశవాళీ మిశ్రమజాతులైన కుక్కలు ఎక్కువ—కొన్నికొన్ని ప్రాంతాలలో కొన్నికొన్ని ప్రత్యేక జాతులున్నవి; కాని, ఆంధ్రదేశంలో చెప్పుకోదగ్గ ప్రత్యేక జాతిలేదు. శ్రీ పిఠాపురం మహారాజావారు విదేశజాతులలో కొన్నింటిని ప్రత్యేక శ్రద్ధతో పెంచుచున్నారు.

మన పశువుల్ని గురించిన ఈ ప్రకరణం ముగింపబోయే ముందు పశువులకును పాడి పంటలకును సంబంధించిన కొన్ని ముఖ్యమైన తెలుగు సామెతలను ఇక్కడ పొందుపరచడం చాలా ముఖ్యము.

సామెతలు.

1. పశువుల విరివి పంటకు తేటు

2. ఎక్కువ వెలపెట్టి గిడ్డను, తక్కువ వెలపెట్టి గొడ్లను కొనరాదు.

12. తల్లిపాలు దూడ చేడుతుంది.

13. బర్రె చస్తే పాడి బయటపడుతుంది.

14. ఎద్దు ఎండకు, ఎనుబోతు నీడకు.

15. గొర్రె క్రొవ్వితే, గొల్లకి లాభం.

మన పశువులు బాగుపడవలెనంటే, వ్యవసాయదారులూ ప్రభుత్వముకూడా ఎక్కువ శ్రద్ధ వహించవలెను. ప్రతీ గ్రామానికీ ఒక్కొక్క బీడును ప్రత్యేకించి, దానిలో అందరి పశువులూ మేయడానికి వదలిపెట్టవలెను. ప్రతీ గ్రామానికీ



కిమిడి గేదె.

3. వంశమెరిగి వనితనూ వన్నెయెరిగి పశువును సంపాదించాలి.

4. అంటు బొడ్డు ఆవుతల యెద్దుకు; జారు బొడ్డు చనుకట్టు ఆవుకు ముఖ్య లక్షణాలు.

5. ఏడు కొరచలుచూచి ఎద్దును కొనమన్నారు.

6. చెప్పక పోయినా చప్పికొమ్ముల ఎద్దును కొనాలి.

7. పదిదుక్కులకు తరవాత దున్నేవాడు పాపాత్ముడు.

8. మనిషికి ఉన్నది పుష్టి; పసరానికి తిన్నది పుష్టి.

9. కదురూ కవ్వమూ ఆడితే కరువులేదు.

10. అరవైయారు పిండివంటలు ఆవుచంటిలో వున్నాయి.

11. పాడి పసరాన్ని, పసిబిడ్డనీ ఒకటిగా చూడాలి.

ఒక్కొక్క మంచిరకం ఆబోతునుకూడా పెట్టుకుని దానితో కలుపుతే మంచి పశుసంతతికలుగును. వ్యవసాయదారు లెక్కువగా వుండే ప్రతి ప్రదేశంలోనూ, పశువుల సంతవున్న ప్రతి ప్రదేశంలోనూ పశువుల వైద్యశాల లుండును. పశువులకు తెగుళ్లువచ్చే కాలంలో విధిగా ప్రతి పశువుకూ టీకాలు వేయించడం చాలా ముఖ్యం. అంతేకాక అడవులకు సమీపంలోవుండే ప్రదేశాలలోని పశువులను, తక్కువ పుల్లరిపై అడవులలో మేపుకువదలి పెట్టడానికి ప్రభుత్వము వారు అనుమతినివ్వవలెను. పాల సౌకర్యానికి అన్ని ముఖ్య పట్టణాలలోనూ పాలు సరఫరాచేయు సహకార సంఘాలు స్థాపించవలెను.

ఇంతేకాక ఆంధ్ర దేశములో గుర్రములు, కంచరగాడిదలు, గాడిదలుకూడా కొద్దికొద్దిగా గలవు.

గుర్రాను స్వారికీ, జట్కా బండ్లు లాగడానికీ ఉపయోగించెదరు. కాని కార్లు వచ్చినతర్వాత వీటియొక్క ప్రాముఖ్యం తగ్గిపోయినది. మేలురకముల కాశి, అరేబియా, సింధు స్వారి గుర్రాలు మన దేశంలో ఉన్నవి. ప్రతి శివరాత్రికి తూర్పుగోదావరి జిల్లా కోటిపల్లిలో జరిగే గుర్రాల సంతకు పై వివిధ దేశాలనుంచీ చాలా మేలు రకం గుర్రాలు వస్తవి.

కంచర గాడిదలను అడవిజాతులవారు ఏజన్సీలోను కొండలలోను బరువు మోయుటకు ఉపయోగించెదరు. గాడిదలను బట్టలు, బరువులు మోయడానికి దేశమంతటా చాకళ్లు ఉపయోగించెదరు.

ఇంతేకాక అన్ని జిల్లాలలోను కీళ్లు, దుప్పులు, కణుజులు కుందేళ్లు, జింకలూ విరివిగా ఉన్నవి. వీటి మాంసం ఆహారంగాను, వీటి చర్మం వివిధ పరిశ్రమలకున్ను ఉపయోగిస్తున్నారు.

మొత్తంమీద ఆంధ్రదేశపు పశుసంపద బాగానేవున్నదని చెప్పవచ్చును. గాని, వీటిని అభివృద్ధిచేయు విధి మనదీ ప్రభుత్వం వారిదీను.

అడవి మృగములలో, పెద్దపులి, చిరుత, సివంగి, ఎలుగుగొడ్డు, అడవిదున్న, అడవిపంది ముఖ్యమైనవి.

ఇవిగాక, విషజాతులలో పాములు, తేళ్లు, మండ్రగబ్బలు మొదలైనవి గలవు.

గుఱ్ఱములను, కోళ్లను, పొట్టేళ్లను, కణజులను పందెముల కుపయోగింతురు.

మనదేశంలోని వివిధ ప్రదేశాలలోని పశుసంపద, పశువుల సంతల స్థలములున్ను, వాటిలో వారానికిఅమ్ముడుపోయే పశువుల వెలయున్ను తెలిపేపట్టికలు ఈ క్రింద కనబర్చినాము:—

## పశు సంపద (వేలలో)

| | గోజాతి | | | | మహిషజాతి | | | గొర్రెలు, మేకలు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| జిల్లా పేరు | ఎడ్లు | ఆవులు | దూడలు | మొత్తం | దున్నలు | గేదెలు | మొత్తం | గొర్రెలు | మేకలు |
| విశాఖ పట్టణం | 411 | 316 | 222 | 949 | 267 | 241 | 508 | 603 | 363 |
| తూర్పు గోదావరి | 251 | 242 | 192 | 685 | 110 | 214 | 325 | 62 | 104 |
| పశ్చిమ గోదావరి | 166 | 139 | 112 | 416 | 95 | 188 | 282 | 68 | 80 |
| కృష్ణా | 163 | 146 | 100 | 409 | 116 | 354 | 471 | 203 | 192 |
| గుంటూరు | 196 | 130 | 104 | 430 | 183 | 559 | 742 | 557 | 166 |
| నెల్లూరు | 226 | 242 | 138 | 607 | 142 | 356 | 498 | 1081 | 471 |
| కర్నూలు | 190 | 100 | 75 | 365 | 56 | 269 | 325 | 577 | 278 |
| బళ్లారి | 200 | 114 | 103 | 417 | 31 | 130 | 161 | 350 | 238 |
| అనంతపురం | 243 | 153 | 135 | 531 | 50 | 135 | 185 | 1171 | 430 |
| కడప | 155 | 92 | 55 | 302 | 70 | 219 | 289 | 744 | 303 |
| చిత్తూరు | 353 | 344 | 320 | 917 | 46 | 133 | 179 | 962 | 549 |
| మొత్తం | 2254 | 2018 | 1456 | 6028 | 1166 | 2798 | 3965 | 6379 | 3174 |
| మొత్తం వెల రూ | 178780 | 100900 | 29120 | 308800 | 58300 | 83940 | 142240 | 25516 | 9522 |
| తల 1కి సరాసరి వెల రూ | 70 | 50 | 20 | 51 | 50 | 30 | 35 | 4 | 3 |

## ముఖ్యమైన పశువుల సంతల వివరములు.

(ప్రభుత్వ వ్యవసాయ శాఖ రిపోర్టు ననుసరించి)

| జిల్లా | స్థలము | అమ్మకమునకు వచ్చే పశువులు | వారమునకు అమ్మకం (రూపాయలు) |
|---|---|---|---|
| విశాఖ పట్నం | అంపూరం | ఆవులు ఎద్దులు గేదెలు | 4,000 |
| ,, | వడ్డాది | ,, | 2,000 |
| ,, | చింతాడ | ,, | 20,000 |
| ,, | గార | ,, | 5,000 |
| ,, | సెరదివల్ల | ,, | 20,000 |
| ,, | కొత్తవలస | ,, | 15,000 |
| ,, | కాశీపట్నం | ,, | 4,000 |
| ,, | బోడం | ,, | 5,000 |
| ,, | తాళ్లపాలెం | ,, | 5,000 |
| ,, | ఏటికొప్పాక | ,, | 2,000 |
| ,, | తిమిరం | ,, | 3,000 |
| ,, | మానాపురం | ,, | 10,000 |
| ,, | బలిజిపేట | ,, | 5,000 |
| ,, | కొండసంత | ,, | 3,000 |
| ,, | నరసీపట్నం | ,, | 3,000 |
| ,, | బుచ్చంపేట | ,, | 5,000 |
| ,, | ముత్తువారి | ,, | 15,000 |
| ,, | కొత్తకోట | ,, | 10,000 |
| ,, | అలమాడ | ,, | 10,000 |
| ,, | వెంగరాడు | ,, | 17,000 |
| ,, | నరగం | ,, | 6,000 |
| ,, | కొట్టివలస | ,, | 6,000 |
| ,, | రాజాం | ,, | 20,000 |
| ,, | విజయనగరం | ,, | 7,500 |
| ,, | మందరాడ | గొర్రెలు, మేకలు | 8,000 |
| తూర్పు గోదావరి | పిఠాపురం | ఆవులు, ఎద్దులు, గేదెలు. | 2,000 |
| ,, | ద్రాక్షారామ | ,, | 4,000 |
| ,, | ద్వారపూడి | ,, | 3,000 |
| పశ్చిమ గోదావరి | తాడేపల్లిగూడెం ఉండి, పెనుగొండ | ,, | 23,000 |
| చిత్తూరు | పాలమనేరు | ,, | 5,000 |
| కడప | పులివెందల | గొర్రెలు, మేకలు | 1,200 |
| ,, | సింహాద్రిపురం | ,, | 1,500 |

## మత్స్య మాంసములు, గ్రుడ్లు, పక్షులు

మన దేశంలో మాంసాహారులు చాలామంది ఉన్నారు. వీరు కేవలం భూమిపై పండేపంటలే కాక జంతువుల మాంసము, పక్షుల మాంసము, గ్రుడ్లు, మత్స్యములు మొదలైన వాటిపైన ఆధారపడెదరు. అందుచే వీరి భుక్తికి కావలసిన ఈ వస్తువుల విషయమై కూడా మనం కొద్దిగా తెలుసు కొనుట ముఖ్యము.

మాంసాహారులు సాధారణముగా-మేక, గొర్రె, లేడి జింక మొదలైన మృగాల మాంసాన్ని ఉపయోగిస్తారు. మేకలు, గొర్రెలు ఆంధ్ర దేశంలో అంతటా దొరుకును. లేళ్లు, జింకలు మొదలైనవి కూడా చిన్న చిన్న చిట్టడవులు గల అన్ని ప్రాంతాల్లోనూ దొరుకును. కొందరు చెవుల పిల్లి మాంసం కూడా తినెదరు. ఇది చాలా రుచ్యమైనదని ప్రతీతి. కొందరు తక్కువ కులస్థులు పందులను పెంచి, వాటి మాంసం ఆహారంగా ఉపయోగించెదరు. గొడ్డు మాంసం పూర్వము ఆదిమాంధ్రులు తినేవారు. కాని, ఇప్పుడు వారిలో కూడా చాలమంది మాని వేస్తున్నారు.

ఆంధ్ర దేశంలో పక్షులను కేవలం మాంసమునకే గాక వినోదానికి పెంచే అలవాటు కూడా ఉన్నది. పందెములకు పెంచే పక్షులలో ముఖ్యమైనవి కోడి, పావురము; విలాసముగా పెంచే పక్షులలో చిలకా, గోరింక, నెమల్లి, కౌజు పిట్టలు ముఖ్యములు.

కోళ్లను ప్రతి వ్యవసాయదారుడు పెంచును. ఇతరులు కూడా వీటిని పెంచుదురు. వీటి మాంసమే కాక, గ్రుడ్లు కూడా ఆహారంగా ఉపయోగిస్తారు. మంచి మేలు రకం కోడిపుంజులను బాగుగా మేపి, వాటికాలి ఆరెకు కత్తికట్టి పందెమునకు వదలెదరు. ఇట్లు పందెములకు పెంచు వానిలో పొట్టేళ్లు కూడా చాలా ముఖ్యమైనవి. ఆంధ్ర దేశంలో వుండే కోళ్లు సుమారు 75 లక్షలు. ఇందు ఐదవ వంతు విశాఖపట్నం జిల్లాలోనే వున్నవి. ఇటీవల గినీ కోడి, ఎర్రరోడ్, అయిర్లెండు, లెగ్హారను అనే విదేశ జాతి కోళ్లను కూడా కొంత మంది పెంచుతున్నారు. కాని ఈ విదేశ జాతులకు తెగుళ్లెక్కువ.

పావురాలనుగూడా పందెములకు ఉపయోగించెదరు. పూర్వకాలపు యుద్ధ సమయాలలో, వీటిచేత దూర దేశాలకి జాబుల్ని పంపించేవారు. వైర్ లెస్, రేడియో ప్రబలిన ఈ కాలంలో గూడా, ఈ పావురములట పద్ధతి యుద్ధ సమయాల్లో ఇంకా ఉపయోగింపబడుతూనే వున్నది. పచ్చ పావురపు మాంసం బహురుచ్యమని ప్రసిద్ధి. పావురాలను, ఊరబిచ్చుకలను వైద్యంలో గూడా ఉపయోగిస్తారు. నెముడు కాకి మాసం కూడా వైద్యాని కుపయోగిస్తారు. పావురం మాంసము పక్షవాతానికి మందుగా వాడుతారు.

చేపలు కూడా ముఖ్యమైన ఆహారంలో ఒకటి. వీటిలో ముఖ్యమైన జాతులు బొచ్చి, కొరమీను, వాలుగ, గండు మీను, బొమ్మడాలు, పులసరొయ్య, మట్టగిడస, చెత్తడెల్ల, మొదలైనవి.

ఆంధ్రి దేశంలోవుండే అనేక నదులు, చెరువులు కాలవలలో అనేక మంచినీటిచేపలు పెరగడాని కవకాశం వున్నది. గొరామి, బొచ్చె ముత్తసంగి, వాలుగ, పలపజెల్ల అనేవి ముఖ్యమైన మంచి నీటి చేపలు.

ఉప్పు నీటి చేపల్లో ముఖ్యమైనవి, మాగం, చందువ సొర, పంజరం, పీత, రొయ్య, మువాలు, కర్రిమీను.



బలిష్టమైన బండి ఎద్దు.

నెమలి అందానికి చాలా ప్రసిద్ధి. దీని తోకనుండే నెమలి కన్నులతో విసనకర్రలు, తురాయిలు, కుంచెలుచేసి అమ్ముతారు. రెక్కలనున్న ఈకలు కలములుగా ఉపయోగించెదరు. భృంగాజు, డేగ మొదలైన పక్షులను మచ్చికచేసి వేటకు ఉపయోగించెరు.

బాతులు, బాతుగ్రుడ్లు కూడా ఆహారాని కుపయోగించెదరు. పెంపుడు బాతులు, పెద్ద బాతులు, మందలు మందలుగా చెరువుల్లో ఈదుచున్న చూడడానికి చాలా మనోహరంగా వుండును. అడవి బాతులను కూడా మాంసమునకు వేటాడుట కలదు. కొల్లేటిలో బాతుల్ని వందలు వందలుగా పెంచి గ్రుడ్లు రంగూను కెగుమతి చేసేవారు.

వీటిలో బొచ్చె అనేది కృష్ణానది కుత్తరంగావున్న సరస్సుల్లోను, కృష్ణలోను, కడప-కర్నూలు కాలువలలోను ఉండును. నెల్లూరు జిల్లా సరస్సులలోనూ విస్తారంగా వుండును. బాగా పెరిగిన బొచ్చె చేప 5 అ॥ పొడవుండి 140 పౌన్లు తూగును. ఫిషరీస్ డిపార్టుమెంటువారీ చేపను గోదావరి నదిలోను; మోపాడు రిజర్వాయిరు, నెల్లూరు బావుల్లోను మెట్టూరు రిజర్వాయిరులోను బాగా పెంచుచున్నారు. ఇది కొద్దిగా చవకాలుగాఉన్న (కొద్దిఉప్పు) నీటిలో కూడా పెరుగును ; గాని అలాంటి చోట్ల ఏపుగా పెరక్క పొట్టిగావుండును. మంచి ఏపైన పూర్తి పొడవు పెరగాలన్న నత్తగుల్లలు, నాచువుండే మంచి నీళ్లల్లోనే వుండాలి. కాని

ఇది రెండడుగుల పొడవు పెరిగినప్పుడు ఎముకలు కొద్దిగా ఎక్కువ గావున్నా చాలా మృదువైన ఆహారంగా వుండును. అంతకంటె ఎక్కువ పొడవు పెరిగితే నిలవచేయడానికి తగినంత మృదువుగా వుండదు.

కర్రిమీను సముద్ర ప్రాంతాల్లో కాటుగా వుండే చవక నీటిలోనే సహజంగా నివసించినా, త్వరలోనే మంచి నీటికిగూడా అలవాటువును. ఇది నాచు, పురుగుల్ని తినును. ఇది అంతగా పొడుగుండక పోవడముచేత ఏడాది పొడుగునా నీళ్లుండే చోట్ల జాగ్రత్తగా పెంచవలెను. ఇది చాలా రుచికరమైనది. చేప పుట్టిన రెండు మూడేండ్లలో పూర్తి అయిన సైజు 2-3 అ॥ పెరిగి 3 పౌ॥ తూగును.

గౌరామి చేపను చాలా ఎక్కువ ఖరీదు పెట్టి. ఆఫ్రికాలోని మారిషస్, జావా మొదలైన ప్రదేశాలనుంచి తీసుకువచ్చి మద్రాసు రాజధానిలో పెంచుచున్నారు. దీనికుండే సున్నితమైన సువాసన, లావు, ఎముకలు ఎక్కువగా లేని కండపుష్టివల్ల ఇది చాలా నాణ్యమైనదిగా ఎన్నబడుతున్నది. ఇది ఏటా రెండుసార్లు ఈనును. నీటి అడుగున నాచుతో గూళ్లు కట్టి అందులో గ్రుడ్లను పొదుగును. ఇది పూర్తిగా మంచి నీళ్లలోనేగాని పెరగదు. ఇది శాఖాహారం మీదనే పెరుగును. నీటి మొక్కలు తినును. దీన్ని తెలకపిండి, వేరుశెనగ పిండివేసి పెంచుతారు. ఇది అడుగున్నర లేక రెండడుగులు పొడవుకన్న ఎక్కువగా పెరగదు, కాని 20 పౌన్లు తూగును.

ఫిషరీస్ డిపార్టుమెంటువారు మన రాజధానిలో పార్కు చేప (వాలుగ, పలపజెల్ల జాతి) నుండి నూనె తీసిదాన్ని శుద్ధిచేసిన వేరుశెనగనూనెతో కలిపి మంచి ఏ. విటమిన్లు కలిగిన కాడ్లివర్ ఆయిల్ కంటె రెట్టింపు శక్తికల నూనెను తయారు చేయుచున్నారు. 1940 సం॥లో మద్రాసు రాజధానిలోని చేపల డిపార్టుమెంటువారి ఫరమ్సులో 4460 గాలన్ల నూనెను తయారు చేసి శుద్ధిచేయడానికి కాలికట్ సోప్ కంపెనీవారికి పంపినారు. అందుచేత ముందు ముందు ఈపార్కుజాతి చేపలను హెచ్చుగా పెంచిన పారిశ్రామికముగా మన దేశములో ఎక్కువ ప్రాముఖ్యము వుండును.

అంతేకాక ఫిషరీస్ డిపార్టుమెంటువారు పలుచోట్ల అనేక ఫిష్‌యార్డులు ఏర్పరచి అందులో ఆయా ప్రదేశాల శీతోష్ణ స్థితికి, నీటికి అనువగు చేపల జాతులను పెంచుటకు పరిశోధనలు చేస్తున్నారు. కొన్నిచోట్ల పెంచుచున్నారు కూడాను. అంతేకాక సముద్ర తీరాలలో గూడా ఎక్కువగా చేపలు దొరికే ప్రదేశాలలో చేపలను పట్టి, వాటిని ఉప్పుతో ఎండవేసి, నిలవచేసి ఎగుమతీకి వీలుగా వుండేలాగున చేస్తున్నారు. మన దేశంలో ఈ చేపలను ఉప్పులో నిలవచేయడము కాకుండా, గాలిచొరని డబ్బాలలో బిగించి, ఎగుమతిచేసే పరిశ్రమ (Canning) కూడా ఇప్పుడు ఎక్కువగుతున్నది. దానికికూడా ఈ చేపలు అత్యధికంగా అవసరము.

చేపల పొట్టు ద్రాక్షతోటలకు చాలా పుష్టిని కలిగించే ఆహారము. ఈ చేపపొట్టు ఎరువువేసిన తోటలలో పెద్ద పెద్ద గుత్తులు అనేకముగా దిగి ద్రాక్షపంట వృద్ధిపొందుచున్నది.



గొర్రెలమంద, కాపరి.

ఇంకా మన తెలుగు జిల్లాలలో దొరికే వివిధ రకాల చేపల పేళ్లలో కొన్నిటిని 'వ్యవసాయమను' అధ్యాయములలో తెలియుపరచినాము.

ఆ చేపలరకాలన్నీగూడా గవర్నమెంటు ఫిషరీస్ డిపార్టుమెంటు వారివద్ద పెంచుకొనుటకు, చిన్నపిల్లలు వాటినిగురించి తీసుకోవలసిన జాగ్రత్త, వాటికి పెట్టే ఆహారము మొదలైన వివరములతో స్వల్ప ఖరీదులకే దొరకును. ఈ చేపల పెంపకము అభివృద్ధిఅయిన, మన దేశములోని మంచి రకాలను విదేశాలకుకూడా ఎగుమతిచేయుట కవకాశములు గలవు.

# పదమూడవ అధ్యాయము

# నీటివనరులు

"వారిం ద్రావని వారలు లేరు భువిని."

విషయ సంగ్రహము :—నీటి సదుపాయములను బట్టి దేశ సంపద, నాగరికత యుండును—నీటి వనరులు సరిగా లేకుండుటచే తరచు క్షామములు సంభవించును—ఆంధ్ర దేశము నందలి నీటి వనరులు—గోదావరి ఆనకట్ట, కట్టుబడి రు 190 వేలు అయినది—గోదావరి కాలువలపై సాలీనా 7 కోట్ల రూపాయల వ్యాపారము-దీని మొత్తం ఆయకట్టు 10 లక్షల ఎకరములు, పంట విలువ 5 కోట్ల రూపాయలు—కృష్ణా ఆనకట్ట(1898) మొత్తం ఆయకట్టు భూమి 968 వేల ఎకరములు-పెట్టుబడి రు 220 లక్షలు-మొత్తం వ్యాపారం 3½ కోట్ల రూపాయిలుపంట విలువ 4½ కోట్ల రూపాయలు పులిగడ్డ ఆనకట్ట, పెన్నారు కాలువ, కడప-కర్నూలు కాలువ, మొదలైన ఇతర నీటి సదుపాయములు—పోలవరం ప్రాజెక్టు, దానిని కట్టినయెడల లక్షయాభై వేల అడుగుల పరిమాణముగల నీరు నిలువ యగును—ఆనకట్టలు కట్టినను కృష్ణా, గోదావరి నదుల నీరు నూటికి 8 వంతులకన్న అధికముగా ఉపయోగపడుటలేదు—తుంగభద్రా ప్రాజెక్టు, దీని జలవ్యాప్తి 138 చ॥ మై॥. అంచనా వేయబడిన ఆయకట్టు 10,00,000 ఎకరములు. ఇతర ఇరిగేషను స్కీములు, ప్రాజెక్టులు వాని వివరణములు.

ప్రాచీనకాలమునుండిన్ని నీటివనరులు సమృద్ధిగా గల ప్రదేశములందే మానవసంఘములు నాగరికతపొంది విలసిల్లినవి. చీనాదేశమందలి యాంగిస్కియాంగ్ నదీ ప్రదేశములలోను, హిందూ దేశమందలి సింధు గంగా మైదానములలోను, ఆసియా మైనర్ దేశమందలి యూఫ్రటిస్, టైగ్రిస్ నదులతీరములలోను, ఈజిప్టు దేశమందలి నైలునదీ తీరములలోను, యూరప్ ఖండము నందలి రైన్ నదీ ప్రదేశములోను నాగరికతకు కేంద్ర స్థలములనదగిన నగరములు, పురములు, పట్టణములు వెలసియుండుట జగత్కథ చదివిన వారి కందరికిని తెలిసిన విషయమేకదా.

**నీటి సదుపాయములను బట్టి దేశ సంపద. నాగరికత.**

నీటి వనరులు ఏయే ప్రదేశములలో సమృద్ధిగా నుండునో ఆయా ప్రదేశములు పాడి పంటలతో సకలభాగ్య సంపన్నములై ఉండును; అక్కడి జనుల నాగరికతయున్ను అభివృద్ధిపొందును. గనుక అట్టి ప్రదేశములు మన ఆంధ్ర దేశములో ఎక్కడెక్కడ నున్నవో గుర్తించవలెను. అందుకు గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలు మొట్టమొదట పేర్కొనదగినవి. ఈ జిల్లాలలో గోదావరి, కృష్ణా నదులు గొప్ప జీవనదులై, సంవత్సరము పొడవునను ప్రవహించుచుండుటచేత ఈ నదీ తీర ప్రదేశములందలి భూములు ఫలవంతములైనవి. గాని ఆనకట్టలుకట్టి, కాలువలు త్రవ్వక పూర్వము నదీతీరములకు దూరముగానుండు ప్రదేశములకు నీరు చాలక, వానలులేని సంవత్సరములందు దుర్భిక్షములు తరుచుగా కలుగుచుండేవి. ఆనకట్టలవలన, నీరు వృథాగా సముద్రములోనికి పోనీయక నిలువచేసుకొని కాలువలద్వారా దూరదేశములకు సైతము పారించుకొనుటకు మార్గమేర్పడినది. నాటినుండిన్ని ఈ జిల్లాలలో కడుపునిండ తిండి దొరుకుచుండుటచేత, ఇక్కడి జనులు నాగరికులై, సంస్కృతికి తోడ్పడు సంస్థలన్నిటను పాల్గొన గలుగుతున్నారు. అందుచేతనే, డెల్టా జిల్లాలలోని సహాయ నిరాకరణోద్యమముగురించి ప్రసంగిస్తూ సర్ కె. వి. రెడ్డినాయుడుగారు "ఇందుకు ఆనకట్ట కట్టిన కాటన్ దొరగారు కారణము" అని చెప్పినారు.

బ్రిటిష్ ప్రభుత్వము మన దేశములో ఏర్పడక పూర్వము మన దేశమందు ఏళ్లు, పెద్ద చెరువులు గలచోట్లను మాత్రమే పంటలు మెండుగా పండుచుండేవి. తక్కిన ప్రదేశము

లందలి భూములు కేవలము వర్షాధారములై ఉండేవి; నూతులు, బావులు త్రవ్వించుకొని నీరు పారించుకొంటూ చాలా కష్టపడి రైతులు తమ పంటలు పండించుకొంటూ ఉండిరి. వర్షములు లేని సంవత్సరములందు కరువుల బాధవలన అనేకులు చనిపోతూ ఉండిరి. 1832-33 లో తెలుగుదేశమంతటా మహాకాటకం సంభవించినది. ఒకొక్క సంవత్సరము వర్షము లెక్కువై చెరువుల గట్లు తెగిపోయిగాని, ఏటివరదలు ఎక్కువయిగాని భూములు నీటిలోమునిగి, పంటలు పాడగుట

పూర్వకాలమందలి కరువుల బాధ

మయినది; గాని, ఆ చెరువులు నిండుగా నుండుటకును వర్షములే ఆధారము. అందుచేత, ఇప్పటికిని ఈ జిల్లాల లోను, కొంతవరకు గుంటూరు జిల్లాలోను కరువుబాధ అమితముగానే ఉంటున్నది. 1896 లోను 1900 లోను అనంతపురం, గుంటూరు జిల్లాలందును, 1921-1922 లో బళ్లారి కడప, కర్నూలు జిల్లాలందును కరువుబాధ తీవ్రముగనుండెను.

1830-1840 లో గోదావరి జిల్లాలో క్షామబాధ తరుచుగా కలుగుతూ ఉండడముచూచి, ప్రభుత్వమువారు క్షామ నివారణ ప్రయత్నాలు చేయడానికి పూనుకొన్నారు. అప్పుడు గోదావరి నదికి ఆనకట్ట కట్టించి, కాలువలు




కూడా జరుగుతూ ఉండేది. ఈ విధముగా అతి వృష్టి వల్లను, అనావృష్టివల్లను పంటలు పాడయి, కరువుబాధ అధికమగుచుండేది. పెద్దపెద్ద నదులు పొంగి పారలునప్పుడు పంటలు పోవుటయేకాక భూములు సైతము పాడగుతూ ఉండేవి; గ్రామాలు తుడుచుకు పోతూఉండేవి. దాని వల్ల ప్రభుత్వమునకు సైతము ఆదాయము తగ్గిపోతూ ఉండేది. రాయలసీమ జిల్లాలలో వర్షములు తక్కువగుట చేత, క్షామబాధ పూర్వకాలములో అత్యధికముగా నుండేది. కృష్ణదేవరాయలకాలములో పెద్దపెద్ద చెరువులు త్రవ్వించడ

తీయించి, నీటి పారుదల సదుపాయములు చేయించవలసినదని కాటన్ దొర ప్రభుత్వమువారికి సిఫార్సు చేసినాడు. అతని సిఫార్సు ప్రభుత్వమువారు ఆమోదించి, ఆనకట్ట కట్టుటకును, కాలువలు తీయించుటకును ప్రారంభించిరి. గోదావరినది, పడమటి కనుమలలో అరేబియా సముద్రానికి 50 మైళ్ల దూరాన పుట్టి, తూర్పు-దక్షిణంగా ప్రవహించి బంగాళాఖాతములో పడుతున్నది. దీని పొడవు 900 మైళ్లు. మంజీర, ప్రాణహిత,

గోదావరి ఆనకట్ట, కాలువలు: కాటన్‌దొర

ఇంద్రావతి, శబరి అనే ఉపనదులు దీనిలో పడుతున్నవి. శబరితో కలిసినపిమ్మట ఈ నది అతిసుందరములయిన పాపి కొండల నడుమగా ప్రవహించును. అప్పుడు దీని వెడల్పు తక్కువ; లోతు ఎక్కువ. పోలవరంవద్ద ఇది చాలా వెడల్పుగా నుండును. రాజమహేంద్రవరము దాటిన తర్వాత ధవళేశ్వరము వద్ద దీనికి 1877 లో ఆనకట్ట కట్టినారు. అక్కడనుండి ఈ నది గౌతమి, వశిష్ఠ




అనే రెండు పాయలుగా చీలి ప్రవహిస్తున్నది. ఈ రెండు పాయలకును నడుమనున్న అమలాపురం, రాజోలు తాలూకాలకు మధ్యడెల్టా అనిన్ని, గౌతమికి తూర్పునగల కాకినాడ, రామచంద్రపురం తాలూకాలకు తూర్పు డెల్టా అనిన్ని, వశిష్ఠకు పడమటను ఏలూరు వరకును గల భూమికి పడమటి డెల్టా అనిన్ని పేళ్లు. ధవళేశ్వరంవద్ద కట్టిన ఆనకట్టకు రూ 1,90,00,000 లు కర్చాయి నది. దీనిపై నూటికి 17 చొ॥ ఆదాయం గిట్టుబడి అవుతున్నది. ఇంత గిట్టుబడి మరి దేనికీ లేదని చెప్పవచ్చును. ఆనకట్ట నాలుగు భాగాలుగా ఉన్నది. ధవళేశ్వరభాగము 4839' (అడుగులు), ర్యాలి భాగము 2859', మద్దూరి భాగము 1550', విజ్జేశ్వరం భాగము 2550'. ఆనకట్టపైని 3 షట్టర్లు కలవు. నీటివల్ల గోదావరి ప్రవాహమందలి నీరు వృధా కాకుండా అదుపులో ఉంచుకోవచ్చును. తూర్పు డెల్టా 450 చ. మైళ్లు, (2,50,000) ఎకరాలు; మధ్యడెల్టా 500 చ. మైళ్లులు (1,75,500), ఎకరాలు; పడమటి డెల్టా 100 చ. మైళ్లు, 4,55,000 ఎకరాలు సాగులో ఉన్నది. ఈ ఆనకట్ట క్రింద సాగుబడి అవుతున్న భూమి మొత్తముమీద 8,80,500 ఎకరాలున్నది. ఇంతేకాక, రెండవపంటకు సాగుబడిలోగల భూమి 2,50,000 ఎకరాలు. తూర్పు డెల్టాలోని కాకినాడ-సామర్లకోట కాలువ పడమటి డెల్టాలోని ఏలూరు కాలువతో కలిసి పారును. మధ్య డెల్టాలో అందమైన కొబ్బరి తోటలు మెండుగా కలవు.

ఆనకట్టనుండి తీసిన కాలువలద్వారా ఏడాదికి 11 నెలలు నీరు పారుతూనే ఉండడంవల్ల పడవలపై సుమారు 7 కోట్ల రూపాయలు విలువగల వ్యాపారం సాగుతూ ఉన్నది. మొత్తం పంట ఆయకట్టు 10,00,000 ఎకరాలు ; పంట విలువ 5 కోట్ల రూపాయలు.

**కృష్ణా ఆనకట్ట. కాలువలు**

గోదావరి ఆనకట్టకట్టిన కొద్ది సంవత్సరములకే కృష్ణానది మీదను ఆనకట్ట కట్టినారు. దీనికి పెట్టుబడి రూ 1,32,00,000 లు. గోదావరి వలెనే కృష్ణానది సైతము పడమటి కనుమలలోనే మహాబలేశ్వరము వద్ద పుట్టి, బొంబాయి రాజధానిగుండా దక్షిణము వైపు ప్రవహించి, హైదరాబాదులో తూర్పు వైపు తిరిగినది. అక్కడ దక్షిణ దిక్కునుండి ఉత్తర దిక్కుగా ప్రవహిస్తూ పోయే తుంగభద్రానది దానిలో పడుతున్నది. కృష్ణా నదికి తుంగభద్ర, భీమ అనేవి ఉప నదులు. నల్లమలలనే కొండలగుండా తూర్పు కనుమలను దాటి, బెజవాడ సమీపమున మరల రెండు కొండలనడుమను ఆరుఫర్లాంగుల వెడల్పున ప్రవహిస్తూ వచ్చే ఈ కృష్ణానదికి ఆనకట్ట కట్టిరి. ఆనకట్ట పొడవు ఆరు ఫర్లాంగులు దానిపై ఆరు పట్టర్లు గలవు. కృష్ణానది నీరు సుమారు 95,000 చదరపు మైళ్ల మేర వ్యాపించియున్న భూముల కుపచరిస్తున్నది. బెజవాడనుండి 40 మైళ్లు పోయిన తర్వాత ఈ నది రెండుపాయలుగా చీలినది. ఆ రెంటికిని నడుమను దివి యను ద్వీపము ఏర్పడినది. ఈ నది పాయలగుటవల్ల రెండు పెద్ద డెల్టాలు సైతము ఏర్పడినవి. తూర్పు డెల్టా కొల్లేటివరకు 1060 చ. మైళ్లమేరను, పడమటి డెల్టా 950 చ. మైళ్ల మేరను వ్యాపించినవి. తూర్పు డెల్టాలో 5,80,000 ఎకరాల భూమిన్ని, పడమటి డెల్టాలో 3,88,000 ఎకరాల భూమిన్ని మొత్తము 9,68,000 ఎకరాల భూమి సాగవుతున్నది. బెజవాడనుండి పోయే కృష్ణ కాలువ, గోదావరినుండి వచ్చే పడమటి కాలువ ఏలూరివద్దను కలియును. గుంటూరునుండి మద్రాసు వరకున్ను పోయే బకింగ్ హామ్ కాలువను, గోదావరి కాలువను ఈ కృష్ణకాలువ కలుపుతున్నది. కృష్ణానది కాలువలలో ఏడాదికి 10 నెలలు పడవలు నడుస్తూఉంటవి ; 12 లక్షల రూ॥ విలువగల కలప వ్యాపారమున్ను, 3 కోట్ల, 40 లక్షల రూ॥ విలువగల ఇతర వ్యాపారమున్ను ప్రతి సంవత్సరం సాగుతూ ఉంటుంది. ఈ కృష్ణ ఆనకట్ట కట్టడానికి 2 కోట్ల 20 లక్షల రూ॥ కర్చు అయినది. ఈ పెట్టుబడికి సాలీనా 13% గిట్టుబడి అయే లాభము ప్రభుత్వమునకు వస్తున్నది.

దివి ద్వీపములోగల భూములకు 7 సంవత్సరముల క్రిందటి వరకున్ను ఎంజిన్లతో నీరు సరఫరా చేస్తు ఉండే

## కృష్ణకు తూర్పు గట్టుకాలువలు




వారు. ఇప్పుడు తూర్పు గట్టు కాలువ, 1935 లో పులిగడ్డ ఆనకట్ట కట్టిన తర్వాత త్రవ్వడమయినది. బందరు కాలువకు 4 మైళ్ల దూరంగా కృష్ణ ఒడ్డు నను సరించిపోయి, పులిగడ్డవద్ద కాంక్రీట్ ఆనకట్ట మీదుగాసాగి, దివి ద్వీపమున కంతటికిని ఈ కాలువ కావలసినంత నీటి సరఫరా చేస్తున్నది. దీనివలన 77000 ఎకరాల భూమి సాగవుతున్నది. హిందూ దేశమందలి కాంక్రీట్ ఆనకట్ట లన్నిటను ఇది చాలా పెద్దది. దీనిని కట్టడానికి 58 లక్షల రూ॥ కర్చు అయినది. ఈ పెట్టుబడి పై లాభము 7%.

**పులిగడ్డ ఆనకట్టు. తూర్పుగట్టు కాలువ**

ఈ కృష్ణా, గోదావరి నదులకు ఆనకట్టలు కట్టి, నీరు

అదుపులో పెట్టుకొని కాలువలద్వారా భూములకు నీరు పారిస్తున్నా, గోదావరి నీటిలో 6% పాలున్ను, కృష్ణా నీటిలో 7% పాలున్ను మాత్రమే సాగుబడికి ఉపయోగ మగుతున్నది.

ఆంధ్రదేశములో ఇంకనుగల నీటి పారుదల

మైనరు ప్రాజెక్టులు.

పెన్నారు కాలువ :—నెల్లూరు జిల్లాలో ప్రవహిస్తూఉన్న పెన్నకు సంగంవద్దను, నెల్లూరు వద్దను 1860 లో ఆనకట్టలు కట్టించిరి. సంగం ఆనకట్టునుండి దువ్వూరి చెరువుకును, కనిగిరి చెరువుకును కాలువలు గలవు. కనిగిరి చెరువు ఉత్తర సర్కారులలోని చెరువులన్నిటను పెద్దది. మరియొక కాలువవల్ల నెల్లూరు చెరువుకు నీరు సరఫరా అవుతున్నది. నెల్లూరు ఆనకట్ట దిగువను 20 మైళ్ల దూరములో ఇంకొక కాలువ సర్వేపల్లి మొదలయిన చెరువులకు నీటి సరఫరా చేస్తున్నది. సంగం ఆనకట్టకు రెండు అడుగుల షట్టర్లు గలవు. ఈ ఆనకట్ట దిగువను సుమారు 1,65,000 ఎకరాల భూమి సాగుబడి అవుతున్నది. దీనికయిన కర్చు 70 లక్షల రూ॥ ; ఆదాయ లాభము 6%. 1921 లో మోపాడు రిజర్వాయరు క్షామ నివారణ్కై కట్టబడినది. దీని క్రిందగల ఆయకట్టు 7000 ఎకరాలు. దీని కర్చు 23 లక్షల రూ॥ ; ఆదాయ లాభం సుమారు 10%. ఇది, తరుచుగా కరువులు వస్తూఉండిన స్థలములో కట్టడమువల్ల దీని ఉపయోగము ఎక్కువగా నున్నది.




కడప కర్నూలు కాలువ :— తుంగభద్రానదికి, కర్నూలుకు 15 మైళ్ల దూరాన సుంకేసులవద్ద ఆనకట్ట కట్టబడినది. అక్కడనుండి ఒక కాలువ తుంగభద్ర ప్రక్కనే 50 మైళ్లు వెళ్లి, కడపవైపు తిరిగి, కడప జిల్లాకు పారుచున్నది. త్రోవలో కలికుందు నదికలియును. ఇది కుందు, పెన్నారు నదులపై ఆనకట్టలమీదుగా ప్రవహిస్తున్నది. ఎత్తు పల్లాలుగావుండుటచేత పడవలపై వర్తకము సాగించుటకు వీలులేదు. ఈ కాలువను, ఇంగ్లాండులోని ఒక కంపెనీవారు 1875 లో త్రవ్వించి, ప్రభుత్వానికి 3 కోట్ల రూపాయలకు అమ్మిరి. కడప కర్నూలు జిల్లాలలో 80000 ఎకరాలు సాగుబడి అవుతున్నవి. వర్షములు మెండుగా వున్నప్పుడే కాలువ నీరు అక్కరలేదు. దీని పెట్టుబడిపైని నూటికి 9 అణాలవంతున లాభంవస్తున్నది. దీనికి ఖర్చు ఎక్కువ, ఆదాయము తక్కువ.

నాగావళి డెల్టా :—1909 లో విశాఖపట్టణం జిల్లాలో తోటపల్లివద్ద రెగ్యులేటరు కట్టబడినది. అక్కడనుండి 22 మైళ్ల పొడవు కాలువ త్రవ్వబడినది. దీని క్రింద ఆయకట్టు 28,000 ఎకరములు ; ఖర్చు రూ. 18,00,000 లు, ఆదాయం 3%.

భవానీ చెరువు :—గుంటూరు జిల్లాలో భవానీ నదికి అడ్డ

ముగా ప్రాజెక్టు కట్టబడినది. దీనివల్ల 556 ఎకరాలు సాగుబడి అవుతున్నది. దీని ఖర్చు 2½ లక్షలు, ఆదాయం 1%.

పోలవరం ప్రాజెక్టు :—సెంట్రల్ డెల్టాలో అన్నంపల్లె లాకువద్ద దీనికి కాలువ వున్నది. దీని క్రింద సాగు 13,200 ఎకరాలు. ఖర్చు 17,00,000, ఆదాయం 1%.

## పోలవరం లంకప్రాజెక్టు




శ్రీకాకుళం ప్రాజెక్టు :—ఈ ప్రాజెక్టు 1900 సం॥లో పూర్తి అయినది. దీని క్రింద, సాగుబడి 69,550 ఎకరాలు; ఖర్చు 2,89,000; ఆదాయం 1%.

కంభం చెరువు :—ఇది 1896 లో పూర్తిఅయినది. ఆయకట్టు 8,000 ఎకరాలు; ఖర్చు 86,000; ఆదాయం లాభముగానే వున్నది.

మార్కాపురం చెరువు :— ఈ చెరువు 1909 సం॥లో నిర్మింపబడినది. దీని క్రింద ఆయకట్టు 2,300 ఎకరాలు; దీన్ని కట్టడానికయిన ఖర్చు 1,29,000. నష్టము మీదనే సాగుతున్నది.

మునియేరు ఆనకట్ట :—ఈ ఆనకట్ట 1898 లో కట్టిరి. ఆయకట్టు 25,200 ఎకరాలు; ఖర్చులు 6,00,000; పెట్టుబడికి నష్టం కొద్దిగా కలుగుతున్నది.

బకింగుహాం కాలువ :—ఇది వ్యాపారానికి ప్రసిద్ధి తూర్పు తీరాన్ని మద్రాసునుంచి కాకినాడకు పోతూ చెంగల్పట్టు, నెల్లూరు, గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలను కలుపుతున్నది. మద్రాసునుండి రాజమహేంద్రవరమువరకు 361 మైళ్లున్నవి. దీనిపైని రూ. 90,00,000 ల వ్యాపారం జరుగుతున్నది. దీనికైన ఖర్చు రూ 91,00,000 లు; ఆదాయం 1.25%.

పైవన్నీ ప్రస్తుతం అమలులోవున్న ప్రాజెక్టులూ, నీటి వనరులూను. ఆంధ్రదేశంలో నీటి వనరులకు ఇంకా ఎన్నో సదుపాయాలు కావలసి ఉన్నవి. వాటిలో ముఖ్యమైనవి :—

విశాఖపట్టణం జిల్లా :—నాగావళి, రెగ్యులేటరు స్కీము నాగావళి రిజర్వాయరు.

తూర్పు గోదావరి జిల్లా :—కోరింగాలంకా ప్రాజెక్టు. శబరీ రిజర్వాయరు స్కీము. ఇది ప్రస్తుతం శాంక్షన్ చేయ బడినది

ప. గోదావరి :—(1) అనుమలంక ప్రాజెక్టు, (ఎర్ర కాలువ) (2) కానూరు స్కీము (3) కొల్లేరు లంక ప్రాజెక్టు.

కృష్ణా జిల్లా :—తమ్మిలేరు, బుడమేరు స్కీములు.

గుంటూరు :—కృష్ణా రిజర్వాయరు, గుండ్లకమ్మ ప్రాజెక్టు, ప్రత్తూరు పంపింగుస్కీము.

నెల్లూరు జిల్లా :— రాళ్లపాడుస్కీము, గుండిపాలెం రిజర్వాయరు; పులికొండ, వెంగలపురం రిజర్వాయరు.

కర్నూలు :— తొక్కపల్లి, జాక్కు, వెలిగోడె రిజర్వాయర్లు.

పోలవరంస్కీము :—మన గోదావరివంటి పెద్ద నదిలోని నీరు, నూటికి ఆరుపాళ్లే ఉపయోగపడుతున్నది. మిగిలిన 94 పాళ్ల నీరున్ను సముద్రములో పడి వృథా అగుతున్నది.

ఇట్లా నీరు వ్యయపడి పోకుండా నీటి స్కీములు ఆలోచిస్తున్నారు. "శబరి" వద్ద అడ్డకట్టకట్టి, నీటిని నిలువ చెయ్యడానికి ఆలోచనలు సాగుతున్నవి.

ఈ స్కీము లన్నిటికన్నా పెద్దది పోలవరం స్కీము. ధవళేశ్వరమునకు 26 మైళ్ల ఎగువను అడ్డకట్టకట్టుటకు అవకాశములున్నవి. 4,500 అడుగుల పొడవు, 120 అడుగుల ఎత్తుగల అడ్డకట్ట కట్టిన యెడల, ఇక్కడ లక్షా యాభైవేల అడుగుల పరిమాణము గల నీరు నిలువచేయవచ్చును. దీనికి తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలగుండా రెండు కాలువలు త్రవ్వినయెడల రెండు లక్షల యాభైవేల ఎకరముల భూమికి మొదటి పంటకున్ను, లక్ష ఎకరాలు పైబడిన భూమికి రెండో పంటకున్ను నీరు సప్లయి చేయవచ్చును. ఈ నీరు సంవత్సరం పొడుగునా వుండును. ఇంతే కాకుండా, ఇక్కడ విద్యుచ్ఛక్తికూడా తయారు చేయవచ్చును.

ఇరిగేషన్ డిపార్టుమెంటువారు ఈ స్కీముకు కావలసిన ప్రయత్నము చేయుచున్నారు. దీనికి 10 కోట్ల రూపాయలు ఖర్చు అవునని అంచనా వేసినారు. ఈ పదికోట్ల రూపాయల పెట్టుబడిమీదను 30 లక్షల రూపాయల ఆదాయం వచ్చును. అంటే, నూటికి అయిదు రూపాయలకుపైగా ఆదాయం వచ్చునన్నమాట!

ఇట్లే కృష్ణానదికికూడా పంటకాలువలు, కరకట్టలు కట్టినయెడల సాగుభూమి అధికమై, దేశం పాడిపంటలతో పచ్చగా వుండి, సుఖాస్పదంగాను, సుభిక్షంగానూ వుండును!

కడప :—పాపఘ్ని, పుల్లంపేట రిజర్వాయర్లు. ఇవిగాక బళ్లారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లా లన్నింటికి తుంగభద్ర ప్రాజక్టున్ను, కర్నూలు, కడప, నెల్లూరు జిల్లాలకు సంగమేశ్వర ప్రాజక్టున్ను ముఖ్యంగా అవసరము. అనంతపురం జిల్లాకు, పెన్నారు, కుముద్వతీ ప్రాజక్టులు అవసరం.

క్రొత్త ప్రాజెక్టులు :—

తుంగభద్రా ప్రాజక్టు :—శ్రీ బాగ్ ఒడంబడికలో ముఖ్య స్థానాన్ని వహించినది. రాయలసీమలో అందరున్ను తుంగభద్ర ప్రాజక్టుకై పలవరిస్తూ ఉన్నారు. దానిని గూర్చి కొంచెం వివరించి తెలుసుకోవలెను.

తుంగభద్రానదికి హాస్పేటపైని 3 మైళ్ల దూరంలో మలాపురంవద్ద ఆనకట్ట కట్టే స్థలము కలదు. దీని జల వ్యాప్తి 138 చ॥ మైళ్లు; అంచనా వేసిన ఆయకట్టు సుమారు 10,00,000 ఎకరాలు. ఎట్లనిన,

| | |
|---|---|
| బళ్లారి జిల్లాలో రాయదుర్గ, హాస్పేట, బళ్లారి, సిరిగుప్ప ఆలూరు, ఆదోని తాలూకాలు | 7,84,000 ఎ. |
| అనంతపురం జిల్లాలో గుత్తి తాలూకా | 1,28,000 ఎ. |
| కర్నూలు జిల్లాలో పత్తికొండ, కర్నూలు తాలూకాలు | 1,60,000 ఎ. |

దీని ఏర్పాటువల్ల రాయలసీమలో క్షామ బాధ చాల వరకు నివారణమగును. గత 80 సం॥ నుండి, దీన్ని గురించి విచారణ జరుగుచునేవున్నది. తుంగభద్ర నీరువల్ల నేలలకు నష్టమని ప్రజలలో ఒక అపోహవున్నది. కాని వ్యవసాయ శాఖవారు ఇట్టి అభిప్రాయము సరియైనది కాదని బుజువుచేసినారు.

పై ప్రాజక్టులే కాక, చిన్నచిన్న చెరువులు, నూతుల లోని జలాన్ని తోటలకూ, మెట్ట పైర్లకూ ఉపయోగించవచ్చును. మైసూరులో వలె రైతులకు చవకగా విద్యుచ్ఛక్తి సప్లైచేస్తే, పంపులతో వీటినుండి నీళ్లుతోడి వారు లాభసాటిగా వ్యవసాయము చేయవచ్చును.

ఆంధ్ర జిల్లాలలో వ్యవసాయాని కుపయోగించే నూతులు రెండు రకాలుగా పరిగణించవచ్చు; (1) రికగ్నైజు అయిన పల్లపు ఆయకట్లు గలవి; (2) ఇతర ఆయకట్లు గలవి.

తెలుగు జిల్లాలలో ఈ రెండు రకాల బావులు, వాటి క్రింద ఆయకట్టు ప్రదేశం ఈ ప్రక్క పట్టీలో వివరించినాము.

| జిల్లా పేరు | మొదటి రకంబావులు | ఆయకట్టు ఎకరాలు | రెండవ రకంబావులు | ఆయకట్టు ఎకరాలు |
|---|---|---|---|---|
| విశాఖపట్నం | 3451 | 5728 | 563 | 311 |
| తూ. గోదావరి | 41 | 519 | 11 | 100 |
| ప. గోదావరి | 1 | 33 | 810 | 1422 |
| కృష్ణా | | | 872 | 3410 |
| గుంటూరు | 1524 | 3680 | 7593 | 12990 |
| నెల్లూరు | 2901 | 4623 | 9455 | 29543 |
| కడప | 11448 | 16812 | 28524 | 85502 |
| అనంతపురం | 11294 | 12027 | 23416 | 56662 |
| బళ్లారి | 1437 | 2706 | 6993 | 12522 |
| కర్నూలు | 1040 | 42 | 11709 | 10674 |
| చిత్తూరు | 27222 | 26802 | 14043 | 20684 |
| ఆ. జి. మొత్తం | 60359 | 72972 | 103689 | 233620 |
| చెన్న రాజధాని | 255503 | | 524076 | |

## 1939-40 ఇరిగేషన్ రిపోర్టునుండి.

తెలుగు జిల్లాలలో మొత్తం విస్తీర్ణములో ఎంత సాగు చేయడానికి వీలవునో, అసలు సాగు అవుతున్నదెంతో, నీటి సదుపాయముగల భూమి ఎంత వున్నదో, సాలీనా నీటి సదుపాయం ఎంత భూమికి జరుగుతూన్నదో, అందులో మొదటిపంట పండేభూమి విస్తీర్ణ మెంతో, రెండోపంట పండేభూమి విస్తీర్ణమెంతో తెలిపే పట్టికకూడ ఈ దిగువ నివ్వడమయినది.

ఈ పట్టికయున్నూ, ప్రక్క పట్టికయున్నూ మద్రాసు ప్రభుత్వమువారి ఇరిగేషను రిపోర్టుయొక్క ఆధారముపై యివ్వబడినవి.

### సాగుబడి భూమి వివరములు; జిల్లాలవారీగా

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|
| నెం | జిల్లా పేరు | మొత్తం విస్తీర్ణం ఎకరాలు | సాగుకు వీలగు భూమి ఎకరాలు | సాగుచేయ బడిన భూమి ఎకరాలు | నీటి పారుదల సదుపాయము గల ఎకరాలు | నీటి పారుదల గల ఎకరాలు 1వ పంట | నీటి పారుదల గల ఎకరాలు 2వ పంట | మొత్తం 7, 8 ఎకరాలు |
| 1 | విశాఖపట్నం | 5168262 | 2763736 | 2107931 | 216956 | 200474 | 25603 | 226074 |
| 2 | తూ. గోదావరి | 3980698 | 1993239 | 1354799 | 509763 | 465794 | 149848 | 615642 |
| 3 | ప. గోదావరి | 1581869 | 1292535 | 975806 | 608129 | 499153 | 175136 | 674289 |
| 4 | కృష్ణా | 2222217 | 1666288 | 1230649 | 656927 | 519084 | 3433 | 522517 |
| 5 | గుంటూరు | 3683824 | 2710850 | 2414310 | 390982 | 373724 | 2299 | 376023 |
| 6 | నెల్లూరు | 4860658 | 2890032 | 2143986 | 380666 | 85127 | 16574 | 101701 |
| 7 | కడప | 3643891 | 3069264 | 2584224 | 55406 | 46390 | 7651 | 54041 |
| 8 | అనంతపురం | 4307053 | 3554878 | 2050936 | 154874 | 149683 | 68369 | 218052 |
| 9 | బళ్లారి | 3790752 | 2144837 | 1156451 | 167799 | 139124 | 25589 | 164713 |
| 10 | కర్నూలు | 5087200 | 3018094 | 1489402 | 349895 | 283282 | 4180 | 287462 |
| 11 | చిత్తూరు | 3778865 | 1809804 | 892812 | 113903 | 89738 | 27499 | 117237 |
| | ఆ. జి. మొత్తం | 42355288 | 26913357 | 18401306 | 3605410 | 2859570 | 756181 | 3357751 |
| | చెన్న రాజధాని మొత్తం | 73016183 | 47579441 | 33600357 | 7277199 | 5796270 | 1185910 | 6982180 |

# పదునాల్గవ అధ్యాయము

# అడవులు

విషయ సంగ్రహము:—అడవులు. ప్రాచీన రాజనీతి: అడవుల పోషణకు, సంరక్షణకు తగిన కట్టుదిట్టములు ఎట్లుండెనో ప్రాచీన గ్రంథములందు కౌటిల్యుని అర్థశాస్త్రము. శుక్రనీతి మొ॥నవి చదివి తెలుసుకొనవచ్చును.-అడవులు ఎక్కడ పెరుగును? ఎండవేడి వర్షములు ఎక్కువగానున్న ప్రదేశములు—ఆంధ్రదేశములో అడవులు చెన్నపురి రాజధానిలోని మొత్తం అడవులలో 40%. గాని ఆదాయము 3% మాత్రమే. మన ఆంధ్రదేశమందలి అడవులలో దొరికే పదార్థములు:—ఆహార పదార్థములకు. గృహ నిర్మాణమునకు. ఉపకరణములకు మొ॥ వాటికి పనికివచ్చే అడవి వస్తువులు—కఱ్ఱ, కలప; వాటి ఉపయోగాలు—మానవుని జీవితములో పుట్టినది మొదలు చనిపోయిన వరకును కావలసిన వస్తువులకు ఎట్లుపచరించునో—ఔషధములకు కావలసిన వనమూలికలు మొ॥ చేతి పరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు కావలసిన అడవి వస్తువులు—శ్రీ 'శొంఠి కామేశంగారు పరిశోధన చేసి, కఱ్ఱను ఇనుమువలె నిలువచేసుకొనే పద్ధతి కనిపెట్టిరి.—పట్టికలు—ఆంధ్ర జిల్లాలలోని అడవులు—అక్కడ దొరికే ముడి పదార్థాలు. వాటి ఉపయోగాలు. ఆంధ్రదేశమందలి రిజర్వు అడవులు—అడవి జంతువులు.

దేశముయొక్క ఆర్థిక సంపదకు అడవులు అనేక విధముల తోడ్పడు తున్నవి; గనుక, ఆంధ్ర దేశమందలి అడవులను గురించి కొన్ని ముఖ్య విషయములు తెలుకోవలెను.

**అడవులు-ప్రాచీన రాజనీతి**

ప్రాచీన కాలమునుండిన్ని అడవుల ఉపయోగము మన దేశమందలి రాజులు, ప్రజలు పొందుతూనే ఉన్నారు. భారతీయుని నాలుగు ఆశ్రమాలలోను వానప్రస్థ, సన్యాసాశ్రమములు అనే మూడవ నాల్గవ ఆశ్రమాలు రెండున్ను అడవులలో సాగించవలెనన్న నియమము ప్రాచీన కాలమందలి ఆర్య ధర్మము. రాజులు వేటకోసము అడవులను భద్రముగా కాపాడుకొను చుండిరి. యోగులు ఔషధములకై వన మూలికలను తెచ్చుకొనుటకు అడవులకు పోవుచుండిరి. అడవులలో నివసించు కిరాతులు మంచి యోధులై, అడవి దుర్గములను కాపాడుటలో రాజులకు ఎక్కువగా తోడ్పడుతూ ఉండిరి. ఇంకా అనేక విధముల అడవులు ఉపచరిస్తూఉన్నవని గుర్తించి, ప్రాచీనకాలమందలి రాజులు తమ ప్రభుత్వమందు అటవీ శాఖను ఏర్పరచి, ఉద్యోగులను ప్రత్యేకముగా నియమించి అడవులను పాలించుకొనుచుండిరి. కౌటిల్యుని అర్థ శాస్త్రము, శుక్రనీతి మొదలయిన ప్రాచీన రాజకీయ-ఆర్థిక-నీతి శాస్త్రములందు అడవులగురించి ప్రత్యేకముగా కొన్ని ప్రకరణములు గలవు.

**అడవులు ఎక్కడ పెరుగును?**

అడవులు దట్టముగా పెరుగుటకు సూర్యరశ్మి, వర్షములు మెండుగా నుండవలెను. ఈ రెండును ఎక్కువగాగల ఆఫ్రికాలోను, దక్షిణ-అమెరికాలోను, మన దేశమందలి అస్సాములోను, బర్మాలోను అడవులు ఎక్కువ దట్టముగా నున్నవి; అందలి వృక్షములు సైతము ఏపుగా పెరిగి యున్నవి. అడవులు దట్టముగా పెరిగిన కొలదిని వర్షములు అధికముగా కురియుచుండును; దానిని బట్టి శీతోష్ణస్థితి సైతము మార్చుచుండును. భూమట్టమునకు ఎత్తుగా ఉండే పర్వతములను బట్టి గూడా అడవుల అభివృద్ధి ఎక్కువగుచుండును. మన దేశమందు ఎక్కడెక్కడ కొండలు గలవో అక్కడక్కడ అడవులు దట్టముగా పెరిగియున్నవి. దండకారణ్య ప్రఖ్యాతి, రామాయణాది ప్రాచీన కావ్యాలలో కనబడు

తున్నదిగదా. ఈ దండకారణ్యము మన ఆంధ్ర దేశములో ఎక్కువగా వ్యాపించియున్నది.

అడవులు దట్టముగాగల కొండలు వానమేఘాలను ఆకర్షించి ఆవలకు పోనీయక నిలుపుకొనుటచేత, అక్కడ వర్షములు మెండుగా కురియుచుండును. అందుచేత, కొండలపైనున్న అడవులను పాడుచేయగూడదు. చీనా

**అడవులతో నిండి యున్న కొండలవలన వర్షాలు**

దేశములోని కరువు అక్కడి అడవులను మేకల మందలు పాడుచేయడమువల్లనే వస్తున్నదని అమెరికాలోని వ్యవసాయ శాస్త్రజ్ఞుడు చెప్పిన మాట అక్షరాల నిజము. అమెరికా దేశములోగూడా ఇట్టి దృష్టాంతాలు ఎన్నో ఉన్నవి. గంజాం, విశాఖపట్టణము జిల్లాల కొండలలో కొందరు ఆదిమనివాసులు కొండచరియలలోని చెట్లు పెల్లగించి, ఆకు అలమూ కాల్చి "పోడు" వ్యవసాయము చేసుకొంటున్నారు; దానివల్ల భూసారములేని బోడి కొండలు తయారవుతున్నవి. కొండ ఎత్తుగాఉన్నా చెట్లు లేనియెడల మేఘాలను ఆకర్షించలేవు. అట్టి కొండలవలన వర్షము కురియదు. అడవులు నశిస్తే వానలు అన్నిచోట్లను సరిగా పడక ఒకచోట, అతివృష్టివల్ల వరదలు వచ్చి పంటలు పెల్లగించుకొని పోవడమున్నూ, మరియొక అనావృష్టివల్ల పంటలు పండక పోవడమున్నూ సంభవిస్తూ ఉంటుంది. ఒరిస్సాలోని వరదలకు ఛోటా నాగపూరులోని అడవులు నశించడమే కారణము. ఆవిధంగానే రాంచి ప్రదేశంలోని అడవులు కొట్టివేయడంవల్లనే బీహారులోని నీటి వనరులు పాడైనవి. అడవులు దట్టంగా ఉండేచోట వర్షం మెండుగా పడడమేకాక వాననీటిని అడవులు పీల్చుకొని, నదులకు వరదలు రాకుండా నదులలోని నీరు సరిగా ప్రవహించేటట్లు చేయగలవు.

ఆంధ్ర దేశంలో విశాఖపట్టణము, గోదావరి జిల్లాలలోని ఏజెన్సీ ప్రాంతములందున్నూ, రాయలసీమలోని కడప కర్నూలు జిల్లాలందున్నూ, చిత్తూరు జిల్లాయందున్నూ మంచి

**అడవులుగల ప్రదేశములు**

రకం అడవులుగలవు. ఇందులో విశాఖపట్టణం, గోదావరి, కర్నూలు జిల్లాలలోని అడవులు చాలా పురాతనమైనవి. వీటిని గురించి మన రామాయణములోను, సముద్రగుప్తుని దండయాత్రల చరిత్రలోను వర్ణనలు గలవు. గాని ఆంధ్ర దేశమందలి అడవుల విలువ ఇప్పటికి అంతగాలేదు. మద్రాసు రాజధాని అంతటను అడవులనుండి వచ్చే రాబడిలో ఆంధ్ర జిల్లాల అడవులనుండివచ్చే ఆదాయము 3% మాత్రమే. అడవులు ఎక్కువగా లేకపోలేదు. మద్రాసు రాజధాని అంతటనుగల అడవుల మొత్తంలో ఆంధ్ర జిల్లాల అడవుల మొత్తం 40%; అయినా రాబడి విషయంలో రాజధానిలోగల అడవులన్నిటనుండి 50 లక్షల రూ॥ ఆదాయం వస్తూఉంటే,



డాక్టరు శొంఠి కామేశం, బి. ఇ. (మెచ్). ఎమ్. ఇ. (ఆనర్సు). ఆనర్సు డి. ఎస్. సి. (ఆంధ్ర), ఎమ్. ఐ. ఇ. (ఇండియా): ఫారెస్టు డిపార్టుమెంటులో ఉన్నత పదవిలో నుండిరి. కఱ్ఱకు చెదపట్టకుండని మందు కనిపెట్టి కీర్తి సంపాదించినారు.

ఆంధ్ర జిల్లాల అడవులనుండి రూ 1,60,000 మాత్రమే వస్తున్నది. అంటే, ఆంధ్ర జిల్లాల అడవులలో ఆర్థికముగా విలువగల ముడి పదార్థాల ఉత్పత్తి కావడము లేదన్నమాట.

మన ఆంధ్ర జిల్లాల అడవులందు ఆహార పదార్థములకు, ఔషధములకు, పరిశ్రమలకు కావలసిన ముడి పదార్థాలకు, ఇంకా ఇతర ఉపయోగములకు పనికివచ్చే వృక్ష సంపత్తి ఎట్లున్నదో పరిశీలింతము :—

(1) ఆహార పదార్థములకు పనికివచ్చేవి :—చింత, నేరేడి, మామిడి, వెలగ, పనస, ఉసిరి, జీడి, చారపప్పు,

కంది, చిక్కుడు, అల్లం, పసుపు, పాలగుండ, కంద, చేమ మొ॥ దుంపలు; తేనె మొదలయిన పానీయములకు—ఈత, జీలుగు, ఇప్ప మొ॥

(2) గృహ నిర్మాణమునకు, ఉపకరణములకు, వంట చెరుకుకు పనికివచ్చేవి :—టేకు, ఇరుగుడుచేవ, ఏగిస, గుగ్గిలము, వెదురు, చందనం మొ॥ ; చింత, తుమ్మ మొ॥ ; పేము, తుంగ, జాయబద్ద మొ॥

(3) తైల వర్గాలకు :—కాగు, ఇప్ప ;

(4) నారకు పనికివచ్చేవి :—అడ్డ, కిత్తల ;

(5) రంగులకు పనికివచ్చేవి :—కరక్కాయ, జాబరా, రెల్ల, లక్క ;

(6) జిగురు మొ॥ వాటికి పనికివచ్చేవి :—తుమ్మ ;

(7) ఔషధములకు పనికివచ్చేవి :—తంగేడు, ముషిడి, రెల్ల, గచ్చ, మూలికలు ; పులికొవ్వు, చీపురుపాలు ; వేప చెక్క.

(8) పశువులమేతకు పనికివచ్చేవి :— గడ్డి, ఆకు, అలము, తుమ్మ మొ॥ చెట్ల కాయలు, పండ్లు మొ॥ ;

(9) అడవి జంతువులనుండి సంపాదింపదగినవి :— ఏనుగు దంతము, దుప్పికొమ్ము, బైసన్ (అడవి పశువు), ఎనుము తా॥ కొమ్ము, చర్మములు;

(10) ఇతర వస్తువులు :— కుంకుడు, సీకాయ, బూరుగు, ప్రత్తి, మైనము, విస్తళ్లు వగైరా.

ముడివస్తువు లనేవి పైని పేర్కొన్నవాటిలో ఏవేవి పరిశ్రమల కుపయోగించునో అవి అన్నీ కావచ్చును. పరిశ్రమలకు పనికివచ్చు ముడి వస్తువులే ఆర్థిక సంపదకు ఎక్కువగా తోడ్పడును ; గనుక, వీటిలో ఇప్పుడు ఏవేవి పరిశ్రమలకు ఉపయోగిస్తున్నారో తెలుసుకోవలెను.

పరిశ్రమలకు పనికివచ్చే ముడివస్తువులలో ఎక్కువ ముఖ్యమైనది కర్ర, కలప. ఇది మానవజీవితంలో ఎంత వరకు ఉపయోగమగుతున్నదో ఆలోచిస్తే చాలా ఆశ్చర్యకరముగా ఉండును. మనుష్యుడు పుట్టినది మొదలుకొని చనిపోయిన వరకును కర్రా, కలపా ఉపచరిస్తూనేఉంటవి. పసిపిల్లవాడై ఉన్నప్పుడు ఉపయోగించే ఉయ్యాల మంచము, చిన్నబండి, లక్కపిడతలు, కొయ్య బొమ్మలు, వ్రాసుకొనే పలకకు చట్రము, చదివే పుస్తకాల కుపయోగించే కాగితము, కూర్చుండుటకు కావలసిన కుర్చీలు, బెంచీలు, పీటలు మొ॥ ; గృహనిర్మాణమునకు కావలసిన దూలాలు, వాసాలు, పెండెబద్ద, స్తంభాలు మొ॥ ; గృహోపకరణములకు కావలసిన కర్ర తిరుగలి, రోలు, రోకలి, కర్ర చిప్పలు, పెట్టెలు మొ॥ ; అలమరలు, బీరువాలు, మేజాలు, మంచాలు మొ॥ ; అగ్గిపెట్టెలు, పుల్లలు; బొత్తాలు, దువ్వెనలు, పెన్సిళ్లు, కలాలు, పనిముట్లు మొ॥ ; చందనపు బొమ్మలు, గంధపు చెక్క మొ॥; చనిపోయినప్పుడు దహన సంస్కారమునకు; ఇంకా ఎన్నో వస్తువులకు కర్రా, కలపా కావలెను. ఇందులో కొన్ని చేతి పరిశ్రమలకు, పల్లె పరిశ్రమలకు సంబంధించినవి ; కొన్ని కర్మాగారాలలో యంత్రములతో పనిచేయు పెద్ద పరిశ్రమలకు సంబంధించినవి.

**కర్ర, కలప వాటి ఉపయోగాలు**

ఔషధాలకు పనికివచ్చే ముడి పదార్థాలన్నీ మన దేశములోనే ఉంచుకొని, అందుకు తగిన పరిశ్రమలు స్థాపించి, వైద్య, చికిత్సాలయములకు కావలసిన అరకులు, మందులు విదేశములనుండి తెప్పించుకోవలసిన పనిలేక ఇక్కడనే తయారు చేసుకొన్నయెడల మన దేశముయొక్క ఆర్థిక సంపదకు అడవులు ఎక్కువగా తోడుపడునట్లు చేసినవారము కాగలము. ఇట్టి పని మైసూరు సంస్థానమువారు చేస్తున్నారు.

**ఔషధ ద్రవ్యాలు**

పైని చెప్పిన ఔషధాలకు పనికివచ్చే ముడి పదార్థాలే కాక తక్కిన ముడి పదార్థాలు సైతము మన దేశమందే ఉంచుకొని, అందుకు తగిన పరిశ్రమలన్నీ అభివృద్ధిచేసుకోవలసియున్నది. కర్రను ఇనుమువలెనే వందలకొలది సంవత్సరములు చెడిపోనీయకుండ సిలువ చేసుకొనే పద్ధతి తిరువాన్కూరు ప్రభుత్వపు డెవలప్‌మెంటు ఆఫీసరుగాను, అడవుల శాఖకు పెద్ద అధికారిగాను పనిచేసి, ఉపకారవేతనము పుచ్చుకొంటూఉన్న శ్రీ శొంఠి కామేశంగారు కనిపెట్టినారు. తత్ఫలముగా ఇనుము దుర్లభమైన దినాలలో గృహ నిర్మాణమునకు, వంతెనలు కట్టుటకు కర్ర ఉపయోగించవచ్చును. కుటీర పరిశ్రమలలో కాగితం, సబ్బులు, లక్కపిడతలు, పలకలు, చాపలు మొ॥

**డాక్టరు శొంఠి కామేశం గారి పరిశోధన ఫలము**

తయారుచేయుటకు కావలసిన ముడి పదార్థములన్నీ మన అడవులలో దొరుకును.

ఆంధ్ర జిల్లాలలోని అడవులు; అక్కడ దొరికే ముడి పదార్థాలు ; వాటి ఉపయోగాలు తెలిపే పట్టిక :—

కరక్కాయలు :—ఉత్తర సర్కార్లు, బళ్లారి, అనంతపురం, కర్నూలు, కడప—కాయలు, తోళ్లు పదును చేయడానికి.

ఎర్ర చందనం :—కర్నూలు, కడప, విశాఖపట్నం, గోదావరి, అనంతపురం, నెల్లూరు, చిత్తూరు, గుంటూరు—కర్ర రంగులకు.

దివి దివి (సిసల్పినాకోర్రైరా):—విశాఖపట్నం, గోదావరి, బళ్లారి, గుంటూరు, నెల్లూరు—కాయలు, రంగుకి.

ఎర్ర చెన్నంగి, జిజిఫస్గ్జలోఫైరా (కొట్టై ఎలందై):—ఉత్తర సర్కారులు, అనంతపురం, బళ్లారి, కడప-కాయలు, రంగుకి.

పవలమల్లి :—ఉత్తర సర్కారులు, అనంతపురం, బళ్లారి కడప—పువ్వులు, రంగుకి.

చంపక పుష్పములు :— ఉత్తర సర్కార్లు-పువ్వులు, రంగుకి.

వేప :—అంతటా దొరుకును-గింజలు, నూనెకు.

ముందిరి:—విశాఖపట్నం, గుంటూరు, కడప, నెల్లూరు-గింజలు, నూనెకు.

వెలంబూరి ;—సర్కార్లు, బళ్లారి, అనంతపురం, కడప —నార, గోనెలకు.

తుమికి :—సర్కార్లు, బళ్లారి, అనంతపురం, కడప-ఆకు, బీడీలకు.

గొడ్డుయేరి :—సర్కార్లు, కడప, కర్నూలు-జిగురు.

పరంగి సాంబ్రాణి :— సర్కార్లు, బళ్లారి, కడప, కర్నూలు, అనంతపురం—ఔషధంగా.

ట్కాలియా సెందనారు, స్టెయూరెన్సు :— సర్కార్లు, బళ్లారి, కడప, కర్నూలు, అనంతపురం—జిగురు.

కవిరి :— సర్కార్లు, బళ్లారి, కడప, కర్నూలు, అనంతపురం-జిగురు, మందుగా.

మిరియాలు :—విశాఖపట్నం-మందు, సుగంధ ద్రవ్యం.

ముషిణి, (ఎట్టికొట్టై) :—నెల్లూరు, కర్నూలు, కడప-గింజలు, మందుకు.

కరివేపాకు :—అంతటా-వంటకు.

చింతపండు :—అంతటా-తినుబడిని॥, వంటకు.

పేప బెత్తం :— నెల్లూరు-చేతి కర్రలు, బుట్ట వగైరా.

షీకాయి :—అంతటా—స్నానానికి.

కుంకుళ్లు :—అంతటా—స్నానానికి.

ఆంధ్ర దేశములోని రిజర్వు అడవులు :—

గోదావరి (ఎగువ):—నూగూరు, వెంకటాపురం, భద్రాచలం, దుమ్మగూడెం, రేకపల్లి.

విశాఖపట్నం :— రాజవొమ్మంగి, కృష్ణాదేవిపేట, కిన్నెర్ల, చింతలపల్లి.

గోదావరి (దిగువ) :—పెదదవోలు, కొప్పల్లి కొవ్వాడ, తిరుమలాయపాలెం, మల్లవరం, కుంకుడుమాను లంక, కంది కుప్ప.

అనంతపురం :—వెంగలమ్మ చెరువు, తిరుమల వెల్దుర్తి హార్స్లీకొండ, గుండ.

కర్నూలు (పశ్చిమ) :—మహానంది, బైరేణి, చెంచుగూడెం, దొరసామి భావి, పెచ్చెరువు, డోను, ఔకు.

కర్నూలు (తూర్పు) :—పెద్దచెమ్మ.

గుంటూరు :—చెడదిండి.

నెల్లూరు :—తంతి పండాలవద్ద కంబాక్కం అడవి, ఉదయగిరి, రాపూరు, సత్యవేదు, సిహారికోట.

కడప :—సిద్ధవటం, వెంపల్లి, శేషాచలం.

ఆంధ్ర జిల్లాలలోని అడవి జంతువులు :—

పెద్దపులి, చిరుతపులి, సివంగి, ఏనుగు, కారెనుము, ఎలుగు, దుమ్ముల గొండి ; బైసన్ అనే అడవిపశువు, అడవి పంది మొదలగునవి.

---

# పదునైదవ అధ్యాయము

# ఖనిజ సంపద

విషయ సంగ్రహము :—ఖనిజముల ఉపయోగము అంతకంత కెక్కువగుతున్నది ; అందు కొన్ని లేకున్నయెడల నిత్యజీవనమే సాగదు ; మనకు ఏఖనిజములున్నవో తెలిసికొను సర్వే లేదు ; ముడి వస్తువుల ఎగుమతి, తయారైన వస్తువుల దిగుమతి ; దీనివలన నష్టము—ఆంధ్రదేశంలో దొరికే ముఖ్య ఖనిజముల వివరణము :—మాంగనీసు, అభ్రకము, బైరైట్సు, స్టైటైటు, ఏస్‌బెస్టాసు, రాగి, గ్రాఫైటు, చలువరాళ్లు, వజ్రములు, బంగారము, ఇనుము, నేలబొగ్గు—ఇతర ఖనిజములు, దొరికే స్థలములు ; పట్టిక.

మన దేశమందలి ఆర్థిక సంపదకు ప్రధానమైన విషయములలో ఖనిజ సంపద సైతము పేర్కొన దగినది. ఇంత వరకును భూతలమునకు సంబంధించిన వ్యవసాయము, పశు సంపద, నీటివనరులు, అడవులు ఎట్లున్నవో పరిశీలించినాము. ఇకను భూగర్భమునగల ఖనిజసంపద ఎట్లున్నదో పరిశీలించ వలెను.

**ఖనిజముల ఉపయోగము ఎక్కువగుట**

ఖనిజ మనగా ఖనిలో పుట్టినది అని అర్థము. ఖని అనగా గని. భూగర్భమునగల గనులలో ఇనుము, బొగ్గు, అభ్రకము, కిరసన నూనె, బొగ్గు, బంగారము, వజ్రములు మొదలయిన కొన్ని పదార్థములు గలవు. ఇవి కలవన్న విషయము మానవునికి చాలాకాలము తెలియనేలేదు. ఈ ఖనిజముల అక్కర లేకుండానే మానవుడు పెక్కు శతాబ్దములు జీవనము గడుపుకో గలిగెను. గాని, వీటిని మానవుడు కని పెట్టిన తర్వాత, వీటి ఉపయోగమునకు అలవాటు పడిన మనము ఇప్పుడు వీటిని విడిచిపెట్టి సుఖముగా జీవనము సాగించలేని అవస్థలో నున్నాము. అందులోను ఇనుము, బొగ్గు, కిరసన నూనె, బంగారము లేనియెడల మన ప్రయాణము సాగదు ; వంటపనులు జరుగవు ; దీపాలుండవు ; వ్యవహారం సాగదు. యుద్ధ సమయాలలో ఈ పదార్థాలకు ఎంత విలువగలదో మన కిప్పుడు బోధపడుతున్నదిగదా ! ఖనిజసంపదయొక్క విలువ, దేశస్థుల నాగరికత ఒకదానిపై నొకటి ఆధారపడి యున్నవి ; గనుక మన దేశమందలి ఖనిజములగురించి తెలుసుకోవలెను.

ఇప్పుడు మన దేశములో దొరికే ఖనిజములు : బంగారము, ఇనుము, గనిబొగ్గు, కిరసననూనె, ముచ్చి బంగారము, మాంగనీసు మొదలయినవి. ఈ ఖనిజములవల్ల సంవత్సరమునకు 28 కోట్ల రూపాయలు విలువగల పదార్థములను మన దేశమువారు సంపాదిస్తూ ఉన్నారు. 2,51,000 మంది జనులు గనులకు సంబంధించిన పనులుచేసి జీవిస్తున్నారు.

**ఖనిజముల ఎగుమతి వలన నష్టము**

అయితే, గనులనుండి వచ్చే ముడి పదార్థములను శుద్ధిచేసి, పారిశ్రామిక వృత్తుల కుపయోగించుటకు మారుగా విదేశాలకు పంపి, అక్కడనుండి వాటితో తయారైన వస్తువులను తెప్పించుకొంటున్నాము. దీనివల్ల మన దేశమునకు ఎంత నష్టము కలుగుతున్నదో, గనులలో మనకు మన దేశములోనే లభ్యమగు ముడి వస్తువులను మనమే ఉపయోగించుకొన్నయెడల, మన దేశము ఆర్థికముగా ఎంత బాగుపడి యుండునో ఆలోచించుడు.

గనిబొగ్గునుండి తయారయే రంగులు, మందులు, రసాయన పదార్థాలు, సంవత్సరమునకు నాలుగు కోట్ల రూపా

యలు వెల గలవి, విదేశములనుండి దిగుమతి చేయుచు న్నాము. దానికి మారుగా ఈ వస్తువులను మనమే మన దేశంలో తయారు చేసుకోవచ్చును. మన దేశంలో బెంగాల్, బీహారు, అస్సాం, పంజాబ్ దేశాలలో గని బొగ్గు దొరుకుతున్నది. బీహార్, బెంగాల్‌లో గల ఇనుప గనులవంటి గనులు ప్రపంచంలో ఎక్కడా లేవు. ప్రపంచ మంతటను దొరికే ఇనుములో 9 వ పాలు ఇనుము మన దేశమందలి గనులలో ఉత్పన్నమగుతున్నది. అయినా, అనేకంగా ఇనుప వస్తువులు, తుదకు గుండుసూదిగూడా విదేశములనుండి తెప్పించుకొనే దుస్థితిలో మనమున్నాము. ఈ దిగుమతికి సంవత్సరమునకు సుమారు 14 కోట్ల రూపాయలు వెచ్చిస్తున్నాము.

ముడివస్తువుల ఎగుమతి, తయారైన వస్తువుల దిగుమతి

మన దేశములో దొరికే ముఖ్యమైన ఖనిజముల గురించి కొన్ని విశేషములు తెలియజేస్తున్నాము :—

1. మాంగనీసు :—ఇది నల్లగా మట్టి బెడ్డలవలె నుండు నొక విధమైన లోహము. ఇది ఇనుమును శుద్ధి చేయుట కున్ను, ఉక్కు తయారు చేయుటకున్ను, బ్యాటరీ సెల్స్, రసాయన ద్రవ్యాలు మొదలగునవి చేయుటకున్ను పనికి వచ్చును. ఇది ఎక్కువగా బళ్లారి జిల్లా తెలిగి కొండల లోను, సాందూరు సంస్థానములోను, విశాఖపట్టణము జిల్లా యందలి కోడూరు, చీపురుపల్లి ప్రదేశములలోను, కర్నూలు జిల్లాయందలి రుద్రవరము, బంగనపల్లి, నాగిరెడ్డిపల్లి మున్నగు చోట్లను దొరుకుతున్నది. ఒక్క విశాఖపట్టణమునుండి మాత్రమే 1938 లో 31,813 టన్నుల మాంగనీసు ఎగుమతి చేయబడెను. 1938 లో ఆంధ్ర జిల్లాలనుండి 2,56,540 టన్నుల మాంగనీసు విదేశములకు ఎగుమతి చేయబడెను. దీని విలువ 61.59 లక్షల రూపాయలుండును. విశాఖ పట్టణము జిల్లా గనులలో దొరకుతున్న మాంగనీసునకు మన భారతదేశములోనే కాక, ప్రపంచమంతటను మేలైన రకమని ప్రఖ్యాతి గలదు.

అభ్రకము (మైకా) :—విద్యుత్ శక్తి యంత్రములకు సంబంధించిన సామగ్రికి, గ్రామాఫోను, టెలిఫోను పరికరాలకు, కాగితాలు, కొన్ని మందులు, అలంకరణములు మొదలయినవి చేయడానికి అభ్రకము పనికివచ్చును. ఇది ఎక్కువగా నెల్లూరు జిల్లాలోని గూడూరువద్దను, విశాఖపట్టణము జిల్లాలో పెక్కు చోట్లను దొరుకును. 1930-1940 లో నెల్లూరు జిల్లా గనులనుండి 45 వేల క్వార్టర్ల అభ్రకము, సుమారు 24 లక్షల రూ॥ వెల కలది త్రవ్వి పైకి తీయడ మయినది. ప్రపంచమంతటను దొరుకుతూఉన్న అభ్రకములో 4 వ వంతు మన దేశము సరఫరా చేస్తున్నది. ఈ లోహమునకు విదేశాలలో గిరాకీ అమితముగా కలదు. దీనిని ఎక్కువగా మన దేశములోనే ఉంచుకొని దీని సాహాయ్యంతో మన పరిశ్రమలను వృద్ధి చేసుకొనే భాగ్యము ఎప్పుడు కలుగునోకదా !



విశాఖపట్టణం జిల్లాలో కోడూరువద్దనున్న మాంగనీసు గని.

బైరైట్సు :—దీనికే బేరియం సల్ఫేట్ అనికూడా పేరు. ఇది తెల్లగా పలుకులు కట్టియుండును ; నెల్లూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలో ఎక్కువగా దొరుకును. రంగులు, బట్టలు, కాగితాలు, పింగాణీ సామగ్రి, చీట్లపేక, మోటారు టైర్లు మొ॥ రబ్బరు సామగ్రి మొదలయిన వస్తువులు తయారు చేయుటకు ఉపచరించును. 1929-1933 లో కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలనుండి

రూ 2,24,207 లు వెలగల 19,946 టన్నుల ఖనిజము ఎగుమతి అయినది. తాడిపత్రి తాలూకా ముస్తకోటలో 75,000 టన్నుల బైరటిస్సు దొరుకునని అంచనా వేసినారు. ఈ ప్రదేశములలోనున్న బైరైటిస్సు గనులవంటి గనులు మన దేశంలో మరి యెక్కడాలేవు.

స్టెటైటు :—దీనికే సోప్‌స్టోన్ అని వ్యవహారములో పేరు. ఇది అనంతపురం, బళ్లారి, కర్నూలు, నెల్లూరు, విశాఖపట్టణం జిల్లాలలో దొరుకును. దీనితో బొమ్మలు, గిన్నెలు మొదలయిన వస్తువులు చేస్తున్నారు. అంతేకాక, దీని పొడుము బట్టలు, కాగితాలు, సబ్బులు, రబ్బరు మొదలయిన వస్తువుల పరిశ్రమలలో ఎక్కువగా ఉపచరిస్తున్నది.

ఏస్‌బెస్టాస్ :—దీనిని సాధారణముగా రాతినార అంటున్నారు. ఇది నారవలె మెత్తగానుండే ఖనిజము. ఇది కడపజిల్లా పులివెందల తాలూకా గనులలోను, కర్నూలు, అనంతపురం జిల్లాలలోను ఎక్కువగా దొరుకుతున్నది. 1924-1930 లో ఒక్క పులివెందల తాలూకా గనులనుండి రూ 27,954 లు వెలగల 200 టన్నుల రాతినార ఉత్పన్నమైనది. ఈ ఖనిజము మన దేశమందు ఇంకా అనేక ప్రదేశాలలో దొరికే సూచనలు గలవు. దీనితో చేసే వస్తువులకు అగ్ని ప్రమాదము ఉండదు. దీనిని సిమెంటుతో కలిపి పెంకులు, పలకలు, ఎంజిన్ బోయిలర్లు, గొట్టాలు మొదలయినవి తయారు చేస్తున్నారు.

రాగి :—ఇది నెల్లూరు జిల్లా కావలిలోను, బళ్లారికి సమీపముగానుండే రాగికొండ, సిద్ధప్పకొండ వద్దను, కడప జిల్లాలో జంగమ రాజపల్లిలోను, గుంటూరు జిల్లాలో అగ్ని గుండాల అనే గుంట్లపాలెం లోను, కర్నూలు జిల్లాలో గుమ్మనకొండ, సోమలపల్లిలోను, నెల్లూరు జిల్లా ఉదయగిరి తాలూకా నరసింహ పట్టణంలోను. కాళహస్తి జమీందారీలోను దొరుకును. దీని ఉపయోగం ప్రాచీనకాలమునుండిన్నీ మన దేశస్థులకు తెలుసును. రాగి కలసిన లోహపాత్రలు, వస్తువులు గట్టిగానుండును.

గ్రాఫైటు :—ఇది వజ్ర సబంధమైన రసాయన ద్రవ్యము; అమూల్యమైనది! గోదావరి జిల్లా భద్రాచలం, పోలవరం తాలూకాలలోను, విశాఖపట్టణం జిల్లాలోను, కృష్ణాజిల్లా బెజవాడ సమీపములోను దొరుకును. వేలకొలది డిగ్రీల వేడిని భరించగల మూసలు చేయడానికి, మోటార్లు, డైనమోలు, రంగులు, పెన్సిళ్లు తయారు చేయడానికి ఉపయోగిస్తున్నారు.

చలువరాళ్లు :—కృష్ణా, గుంటూరు జిల్లాలలో చాలా నాణ్యమైన రాయి దొరుకుతున్నది. సామాన్యముగా దొరికే రాతితో సిమెంటు పింగాణీ వస్తువులు చేస్తున్నారు. బెజవాడ, మంగళగిరి సిమెంటు కర్మాగారాలకు జగ్గయ్యపేట, పల్నాడు తాలూకాలనుండి కావలసినంత చలువ రాయి సరఫరా అగుతున్నది. మేజాబల్లలు, సమాధి శిలలు, కాగితపు బెత్తులు (పేపర్ వెయిట్సు) చేయడానికి నాణ్యమైన చలువరాయి ఉపయోగింతురు.

వజ్రములు :—ఆంధ్ర దేశములో దొరికిన కోహినూరు, పిట్టు, గ్రేట్ మొగల్ అనే వజ్రాలు చరిత్రలో ప్రసిద్ధికెక్కినవేకదా! అప్పుడప్పుడు వర్షము కురిసి వెలిసిన తర్వాత అనంతపురము, కడప జిల్లాలలోను, గోదావరిజిల్లా భద్రాచల ప్రాంతంలోను ఇప్పటికిని వజ్రాలు దొరుకుతునే ఉన్నవి. అమూల్యమైన వజ్రాలు ఆభరణములకున్ను; తక్కువ రకం వజ్రపు తునకలు, వజ్రపు పొడి అనేక పరిశ్రమలకున్ను, గాజు, రాళ్లుకోసే పరికరాలు తయారు చేయడానికిన్ని పనికివచ్చును. ఇట్టి రకం తునకలు కర్నూలు జిల్లా విద్యాపల్లివద్ద ఎక్కువగా దొరుకుతున్నవి.

బంగారము :—అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకాలోను, బళ్లారి జిల్లా హర్పనహల్లి తాలూకా జగ్గల్‌గుడాలోను, కృష్ణా గోదావరీ నదుల ప్రవాహములతో కొట్టుకొని వచ్చే ఇసుకలోను రేణువులుగా బంగారము దొరుకుతున్నది. ఈ నడుమ, చిత్తూరు జిల్లా కుప్పం తాలూకాలో బంగారు గనులున్నట్లు తెలిసినది. అనంతపురం జిల్లాలో ధర్మవరం గనులనుండి 1919-1923 లో 44,688 ఔన్సుల బంగారమున్ను, గుత్తి తాలూకా గనులనుండి 1926-1927 లో 1,36,739 ఔన్సుల బంగారమున్ను త్రవ్వి తీసిరి. ఈ ఖనిజం త్రవ్వి తీసే పరిశ్రమ ఇంకా బాగా అభివృద్ధి కావలసి ఉన్నది. ప్రపంచమంతటా ఎక్కువ బంగారము దొరికే కోలారు గనులు మైసూరు రాజ్యంలో గలవు.

ఇనుము :—బళ్లారి జిల్లాలోని సాందూరు కొండలలోను; కన్నవిహల్లి వద్దను; కడప జిల్లాలోని చింతకుంట వద్దను; గోదావరి జిల్లాలోని పోలవరము, తాళ్లరేవు వద్దను;

కర్నూలు జిల్లాలోని గునిగట్టు, నంద్యాల వద్దను; కడప కృష్ణా జిల్లాలలో అక్కడక్కడను; నెల్లూరు జిల్లాలోని సింగరాయకొండ, మణికేశవరం వద్దను ; విశాఖపట్నం జిల్లా లోని నారాయణపేట, మాడుగుల మొదలయిన పలు చోట్లను ఇనుము దొరుకుతున్నది. మన దేశములోగల "తాతా ఐరన్ కంపెనీ" ప్రపంచమందుగల 12 ఇనుప కంపెనీలలోను పేర్కొనదగినదిగా ఉన్నది. జనులందరి కిని, కడుపేదవానికి సైతం ఇనుప వస్తువులలో ఏవో కొన్ని నిత్యజీవనములో కావలసి యున్నవి. అందుచేత, ఇనుము లేకపోయిన యెడల ఇప్పుడు మానవుని జీవనమునకే ఇబ్బంది కలుగును.

నేలబొగ్గు :—ఆవిరి యంత్రాలు ఇంకా పనిచేస్తూ ఉన్నంత కాలము నేలబొగ్గు ఉండితీరాలి. అంతేకాక, నేలబొగ్గు వంట చెరుకుగా సైతము ఉపయోగ మవుతున్నది. ఇనుము కరగించి పరిశుభ్రపరచడానికి, గ్లిసరిన్, కోల్ తార్ మొదలయిన రసాయన పదార్థాలు తయారు చేయడానికి నేలబొగ్గు కావలెను. గోదావరి జిల్లా ఏజెన్సీలో భద్రా చలం తాలూకా తోటపల్లి, ఒడదసూరు, చింతలపూడి మొదలయిన ప్రదేశాలలో నేలబొగ్గు ఎక్కువగా దొరుకు తున్నది.

పైని చెప్పినవి కాక ఇతర ఖనిజములు ఏవో, ఎక్కడ దొరుకునో ఇక్కడ నొక పట్టికలో కనబర్చు చున్నాము :—

| ఖనిజము | దొరికే ప్రదేశము |
|---|---|
| ఆన్టిమొని | బళ్లారి, కడప, విశాఖపట్టణము జిల్లాలు |
| బాక్సైటు | విశాఖపట్టణము జి॥ |
| కోరండమ్ | అనంతపురం జి॥ |
| గ్రానైట్ | కృష్ణా, నెల్లూరు జి॥ |
| కార్డిరైట్ | విశాఖపట్నం జి॥ |
| జిప్సమ్ | నెల్లూరు జి॥ |
| కోవలిన్ | గోదావరి, విశాఖపట్టణం జి॥ |
| తగరము, వెండి | కడప, గుంటూరు, కర్నూలు జి॥ |
| జింక్ | కర్నూలు జి॥ |
| మొనజైట్ | విశాఖపట్నం జి॥ |
| ఒఛైర్ | బళ్లారి జి॥ |
| ఫాస్ఫేట్స్ | నెల్లూరు, విశాఖపట్నం జి॥ |
| మినరల్ వాటర్ | బళ్లారి, గోదావరి, కర్నూలు జి॥ |
| లిథోగ్రాఫిక్ రాయి | కర్నూలు, గుంటూరు, కృష్ణ జి॥ |
| కట్టడపు రాళ్లు | బళ్లారి, కడప, గోదావరి, గుంటూరు, కృష్ణ, కర్నూలు, నెల్లూరు, విశాఖ పట్టణం జి॥ |

ఈ అధ్యాయములో పేర్కొన్న ఖనిజముల నన్నింటిని త్రవ్వి తీసి, విదేశాలకు ఎగుమతిచేసి, లాభం పొందడానికి చూడక, మన తెలుగు దేశంలోనే పరిశ్రమలను స్థాపించి వీటిని వినియోగించవలెను. అట్లు చేసినప్పుడే మన దేశం గొప్పదేశము కాగలదు ; మనం ధన్యులము కాగలము.

---

చిత్రదీపాలు

" ఒకదీప మార్చిన నున్న దీపంబులు
 నప్పుడ తమకుఁ దామాఱుటయును,
నాల వృంతానిల చేలాంచ లాదిక
 వ్యాపారముల దీపమాఱుటయును,
నాఱినదీపంబు లప్రయత్నంబున
 మఱిచూడఁ జూడంగ మండుటయును,
-మండియాఱియు నాఱి మండిన దీపంబు
 వెలుగుఁజీకటియుఁ గావించుటయును
 ..............................."

శ్రీనాథ నైషధము—

# పదహారవ అధ్యాయము

# విద్యుచ్ఛక్తి

విషయసంగ్రహము :— ఈ నవీన యుగములో విద్యుచ్ఛక్తి యొక్క ప్రాముఖ్యము—రేడియో, టెలిఫోను, వైర్లెస్, రైళ్లు, ట్రాములు నడుపుటకు విద్యుచ్ఛక్తి నుపయోగించుట—శైలేరు, మత్స్యఖండ నదీ విద్యుత్ స్కీములు—1938 లో అమలులోనికి తేబడిన ధర్మల్ స్కీము—బెజవాడ, కాకినాడ, విశాఖ పట్నములలోని విద్యుత్ స్టేషనులు ; వాటి వివరణములు—ఇంకా పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి నుపయోగించుటవలన కలుగు లాభములు—ఆంధ్రదేశమున కొన్ని ప్రదేశములకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసెడు కె. వి. సుబ్బారావుగారి యాజమాన్యమున నడుపబడుచున్న మెక్లిక్ కంపెనీ; డి. యల్. యన్. రాజుగారిచే స్థాపింపబడిన ఆంధ్ర యింజనీరింగ్ కంపెనీలు—ఆంధ్ర దేశములోని ధర్మల్‌స్కీములు, వాటికయిన ఖర్చు వగైరా వివరణములు— ఆంధ్రదేశమున విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుచున్న పట్టణములు, పట్టికలు.

అనుక్షణమూ అభివృద్ధి, మార్పులు పొందుతున్న ఈ నవీన యుగములో విద్యుచ్ఛక్తి, మానవుని నిత్యావసరములలో ఒకటిగా పరిణమిస్తున్నది. ఎంతటి పెద్దపెద్ద పనులైనా విద్యుచ్ఛక్తివల్ల చురుకుగా జరుగుటకు వీలగుచున్నవి. దీపాలకు, యంత్రములకే గాకుండా బండ్లు నడిపించుటకు సైతము విద్యుచ్ఛక్తియే ప్రధాన శక్తి అగుతున్నది. ఎప్పటికప్పుడు సమస్త వార్తలను తెలుపు రేడియోలు, ఎలక్ట్రిక్ రైళ్లు, ట్రాములు ; చిన్న మిల్లులు వేగముగాను సుళువుగాను నడవడానికి విద్యుత్ ఉపయోగ పడుచున్నది. టెలిఫోన్‌లు, వైర్‌లెస్ మొదలైన నూత్న పద్ధతుల వ్యాపకమునకు విద్యుచ్ఛక్తియే ఆధారము !

ఇతర రాష్ట్రములతో పోల్చి చూచిన ఎడల, ఆంధ్రదేశములో విద్యుచ్ఛక్తి సరఫరా శైశవావస్థలోనే ఉన్నదని చెప్పవలెను. దీనికి ముఖ్య కారణము మన దేశముయొక్క పారిశ్రామికాభివృద్ధి తక్కువగుటయే ! అంతేగాక విద్యుచ్ఛక్తి తయారు చెయ్యడానికి కావలసిన జలపాతములు మొదలగునవి ఇక్కడ తక్కువగనే యున్నవి.

కృష్ణా, గోదావరి నదుల ఎగువ భాగములయందు, విద్యుచ్ఛక్తి నుద్భవింపజేయుటకు కొన్ని అవకాశములున్నవి. కానీ, ఇవి ఆర్థికముగా ఎక్కువ లాభదాయకములు గావు. గోదావరి కాలువలోని చిన్నచిన్న జలపాతములను విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయుటకై ఉపయోగించుటకు ఒక స్కీమును తయారు చేసిరి. సెట్టిపేటలో 1500 గుర్రముల శక్తిగల పవరు తయారు చేయుటకు తలపెట్టిరి. కొంత కాలమునకు ప్రస్తుతమున్న ధర్మల్ స్టేషనులకు తోడుగా, ఇచ్చట విద్యుత్ కార్యాలయములు పనిచేయగలవు.

శైలేరు, మత్స్యఖండ నదీ ప్రాంతములలో చాలా మంచి అభివృద్ధికి అవకాశములున్నవి. శైలేరుయొక్క ఎగువ భాగములోను, దిగువ భాగములోను, 4000 కిలో వాట్లుల విద్యుత్ తయారుచేయు వీల్లు గలవు. దీని దగ్గర "మోటు" అనే గ్రామములో 5000 కిలో వాట్లులు విద్యుత్ తయారు చేయుటకు వీల్లు గలవు. ఇంతకన్న అధికముగా విద్యుత్ నుద్భవింప జేయుటకు, మత్స్యఖండ నది దగ్గరవున్న "దుడుమ" అనే గ్రామము వద్ద అనేక అవకాశములున్నవి. ఇక్కడ సుమారు 40,000 కిలో వాట్లులు విద్యుచ్ఛక్తి ఉత్పత్తి యగునని అంచనా వేయబడినది. ప్రస్తుతం ఈ స్కీము విషయమై ప్రభుత్వము వారు ఆలోచనలు చేయుచున్నారు.

కానీ, పై ప్రదేశములు మద్రాసు, ఉత్కళ రాష్ట్రసరిహద్దులలో నుండుటచేత, ఈ విషయములో రెండు



శ్రీ కె వి. సుబ్బారావు, బి. ఎస్‌సి.,
గుడివాడ, శ్రీకాకుళము, ఉడిపి, మొదలగు ప్రదేశములలో ఎలక్ట్రిక్ కంపెనీల జయప్రదముగా సాగించుచు, మెట్రిక్ కంపెనీకి మానేజరుగానున్నారు.

రాష్ట్రములవారు ఒక సంతృప్తికరమైన ఒడంబడిక కుదుర్చుకొని పని ప్రారంభించుట శుభకరము!

నీటినుండి విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేయు పద్ధతి ఆంధ్రదేశమున ఏర్పరచుటకు అధికవ్యయమగునని తలచుటచేత, థర్మల్ స్టేషన్లవల్లనే విద్యుచ్ఛక్తి పుట్టించి సరఫరా చేయుటకు ప్రభుత్వమువారు నిశ్చయించిరి.

ఈ విధానమును 1938 సంవత్సరములో ప్రభుత్వమువారు తయారుచేసి, ఆ సంవత్సరముననే కొంత అమలులోనికి తెచ్చిరి. ఆ విధానము ననుసరించి మూడు థర్మల్ స్టేషనులు నిర్మింపబడెను.

(1) బెజవాడ :— ఇచ్చట 1500 కిలోవాట్లుల శక్తి నుత్పత్తిచేయు రెండు ఆవిరి టర్బోజనరేటరు సెట్లు పనిచేయుచున్నవి. 3000 కిలోవాట్లుల శక్తిగల ఇంకొక సెట్టునుగూడా తెప్పించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఈ స్టేషనునుండి విద్యుచ్ఛక్తి బెజవాడ, గుంటూరు, గుడివాడ, మచిలీపట్నం, ఏలూరు మొదలగు పట్టణములకు; గుంటూరు, కృష్ణా జిల్లాలలోని కొన్ని పల్లెలకు సరఫరాచేయబడుచున్నది. ఇక్కడ విద్యుచ్ఛక్తికి గిరాకీబాగా కలదు. కొంత విద్యుచ్ఛక్తి కృష్ణా సిమెంటు వర్క్సువారు సరఫరా చేస్తున్నారు.

(2) కాకినాడ :— ఈ స్టేషనులో విద్యుచ్ఛక్తి నూనె యంత్రములద్వారా ఉత్పత్తి చేయబడుచున్నది. ఇక్కడ 600 కిలోవాట్లుల శక్తి ఉత్పత్తియగును. కాకినాడ, రామచంద్రపురం, సామర్లకోట, పెద్దాపురం, పిఠాపురం, వానిపరిసరములలోని పల్లెలకూ విద్యుత్‌శక్తి ఇక్కడినుండి సరఫరా చేయబడుచున్నది. రాజమహేంద్రవరమున ముందు ఆవిరి టర్బోజనరేటరు స్టేషను నిర్మించి, ఎక్కువ ఖర్చు అగుచున్న కాకినాడ ఆయిల్-యింజెన్-ప్లాంటును మూసి వేయుటకు ఆలోచించుచున్నారు.

(3) విశాఖపట్నము :— పూర్వపు హార్బరు, ఆవిరి యంత్రములు ప్రభుత్వమువారు వశపరచుకొని, ఇక్కడ నవీనమైన యంత్ర నిర్మాణముచేసి, 1500; 700 కిలోవాట్లుల విద్యుత్‌శక్తి నుత్పత్తిచేయు రెండు టర్బోజనరేటర్లు నిర్మించిరి. ఇక్కడి విద్యుత్‌శక్తి విశాఖపట్నం, విజయనగరం, అనకాపల్లి, బొబ్బిలి, విశాఖపట్నం మాంగనీసు గనులకు, జిల్లాలోని ఇతర పల్లెలకు సరఫరా చేయబడుచున్నది. 2000 కిలోవాట్లుల నుత్పత్తిచేయు మరియొక యంత్రమును నిర్మింపనున్నారు. ఇక్కడ స్థాపించుచున్న నౌకా నిర్మాణ కేంద్రము మొదలైన పరిశ్రమల అభివృద్ధితో, ఈ విద్యుచ్ఛక్తి కేంద్రమునకు ఉత్తరోత్తర మంచి భవిష్యత్తు ఉండును.

పైన వ్రాసినప్రకారము మత్స్యఖండ హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు స్థాపించు ప్రయత్నములు జరుగుచున్నవి. గనుక, సాధ్యమయినంత త్వరలో ఈ స్కీము అమలులోనికి వచ్చునని ఊహించుట కవకాశము లున్నవి. అప్పుడు హైడ్రో ఎలక్ట్రిక్ పవరును, ఆంధ్రదేశంలో బెజవాడ, గుంటూరు వరకూ చౌకగా సరఫరా చేయవచ్చును.

అంతేగాక, విద్యుచ్ఛక్తివల్ల వ్యవసాయము అభివృద్ధి చేసుకోవచ్చునన్న సంగతి క్రొత్తగాదు. ఆంధ్ర జిల్లాలలో చాల భాగములందు నదులు ద్వారాగాని, కాలువల ద్వారాగాని నీరువచ్చే సదుపాయములు లేని ప్రాంతము లనేకము లున్నవి. ఈ రకపు ప్రదేశములలో చెరువులు, బావులు, మోటలు ద్వారా విస్తారము నీరు కట్టుకొనెదరు. దీనికి శ్రమ కూడా అధికముగా కావలెను.

ఈ పనికి విద్యుచ్ఛక్తి నుపయోగించినట్లయితే అతి చౌకగా చేసుకొనవచ్చును. మన రాజధానిలోని కోయంబత్తూరు, దక్షిణార్కాటు జిల్లాలలో విద్యుత్ సౌకర్యములు ఏర్పడిన తర్వాత, వ్యవసాయమునకుగూడా దాని నుపయోగించి, రైతులు ఫలసాయ మధికము చేసుకొనుచున్నారు. ఇక్కడ ప్రతి జిల్లాకును దరిదాపు వెయ్యి మరలు, నీరు కట్టుటకు విద్యుత్తుతో నడుపబడునవి ఉపయోగించబడుచున్నవి. ప్రతి వ్యవసాయదారు ఎలక్ట్రిక్ పంపులను సులభముగా, చౌకగా, మోట మొ॥ ఇతర సదుపాయములకన్న త్వరగా ఉపయోగించుకొనవచ్చునని గుర్తించినాడు.

పారిశ్రామిక దృక్పథమునుంచి చూచినప్పటికీ, పరిశ్రమలకు కావలసిన పెట్టుబడిని చాలావరకు విద్యుత్తు ఉపయోగించి, తగ్గించుకొనవచ్చునని చెప్పవచ్చును.

కాటన్ మిల్లులు, రైసు మిల్లులువంటి పెద్ద పెద్ద ఇంజనుల నుపయోగించు పారిశ్రామికులు తోలు పట్టాలు, గొలుసులు, గెయిర్లు అధికంగా ఉపయోగించే అవసరం లేకుండా, విద్యుత్తుతో సులభముగా వాటిని నడుపుకొనవచ్చును. కోయంబత్తూరు జిల్లాలో అనేక మిల్లులు విద్యుత్తు నుపయోగించుచున్నవి.

అనేక గృహపరిశ్రమలను, చిన్న చిన్న పరిశ్రమలను స్థాపించిన, వాటిని అభివృద్ధి చేయుటకు విద్యుత్తు ఉపకరిస్తుంది. తెలుగు నాట పెడన, పెద్దాపురం, ఉప్పాడ, శ్రీకాకుళం, పొందూరు, నరసన్నపేటలు చేనేతకు వాసికెక్కినవి. కాని, చేనేతవల్ల అధికంగాగాని, త్వరగాగాని కావలసినంత సరుకు నుత్పత్తి వారు చేయజాలకున్నారు. సేలం జిల్లా, బెంగుళూరులలోని పారిశ్రామికులు విద్యుత్తు నుపయోగించి, సరకు విడుదల నధికముగాను, త్వరగాను చేయుచున్నారు. పైగా, విద్యుచ్ఛక్తి నుపయోగించడంవల్ల అధికంగా ఏమిన్ని ఖర్చుగాదు; సరిగదా సగటున చవుక అవుతుంది. ఇట్లే, ఈపై పేర్కొనబడిన మన ప్రాంతీయ పారిశ్రామికులుగూడా విద్యుత్తు నుపయోగించి, లాభముల గడించుకొనవచ్చును. యింకా అనేకచోట్ల, ప్రాంతీయ పరిస్థితులనుబట్టి, లభ్యమయ్యే ముడిసరకులను బట్టి విద్యుచ్ఛక్తి నుపయోగించి, క్రొత్తక్రొత్త పరిశ్రమలు స్థాపించవచ్చును!

ఆంధ్ర దేశంలో విద్యుచ్ఛక్తికిన్నీ, విద్యుచ్ఛక్తి నుపయోగించే యితర పరిశ్రమలకుగూడా మంచి భావిదశ వున్నదన్న సంగతి విశదమవుతున్నది!

ఆంధ్రదేశములోని థర్మల్ స్టేషనులు, వాటికయిన ఖర్చులు వగైరా వివరణములు :—

| థర్మల్ స్కీము పేరు | సప్లైమొదలు పెట్టిన కాలము | పెట్టుబడి ఖరీదు 1940-41 సం॥ రు. |
|---|---|---|
| విశాఖపట్నం | 1939 ఏప్రిల్ నుండి | 21,07,928 |
| బెజవాడ | 1939 ఏప్రిల్ నుండి | 23,91,492 |
| కాకినాడ | 1940 ఏప్రిల్ నుండి | 5,60,136 |
| పశ్చిమగోదావరి జిల్లా | తయారులోనున్నది | అంచనా వేయబడిన ఖరీదు రు. 7.67 లక్షలు. |

పైన చెప్పిన ప్రభుత్వపు స్కీము ద్వారా సరఫరాచేయబడుచున్న విద్యుచ్ఛక్తి గాక, ఇతర కంపెనీల ద్వారా కొంత ఆంధ్ర దేశమున సప్లై చేయబడుతున్నది. ఆ కంపెనీలలో కె. వి. సుబ్బారావు బి. యస్. సి., (ఇంజనీరింగ్) ఎ. ఎమ్. ఐ. ఇ., గారు డైరెక్టరుగా పనిచేయుచున్న, "ది మెక్లిక్ ఇంజనీరింగ్ కంపెనీ లిమిటెడ్" యున్ను; కే. శే. డి. యల్. యన్. రాజు (మేనేజింగ్ డైరక్టరు) గారిచే స్థాపితమైన "ఆంధ్రా యింజనీరింగ్ కంపెనీ లిమిటెడ్" యున్ను చెప్పదగినవి.

మెక్లిక్ కంపెనీవారు గుడివాడ, శ్రీకాకుళం నరసన్నపేట, సాలూరు, పార్వతీపురం మొదలైన పట్టణములకున్ను, ఆంధ్రా యింజనీరింగ్ కంపెనీ లిమిటెడ్ వారు విశాఖపట్నం, అనకాపల్లి పట్నములకున్ను విద్యుత్తు సరఫరా చేయుచున్నారు.

ఆంధ్రదేశములోని విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుచున్న పట్టణాల పట్టిక. (విశాఖపట్నం, తూర్పు, పశ్చిమ గోదావరి కృష్ణా, గుంటూరు జిల్లాలు.)

1. బెజవాడ 2. కాకినాడ 3. బందరు 4. అనకాపల్లి 5. బొబ్బిలి 6. ఏలూరు 7. గుంటూరు 8. తెనాలి 9. గుడివాడ 10. విశాఖపట్నం 11. నూజవీడు 12. భీమునిపట్నం 13. విజయనగరం 14. రాజమండ్రి 15. ధవళేశ్వరం 16. నరసారావుపేట 17. ఒంగోలు 18. చికాకోల్ (శ్రీకాకుళం) 19. సాలూరు 20. వాల్తేరు 21. పార్వతీపురం.

పై ముఖ్యమైన పట్టణాల్లోనేగాక ఇంకను అనేక చిన్న పట్టణాలకు, ముఖ్య గ్రామాలకున్ను విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుచున్నది.

## పదునేడవ అధ్యాయము

# పరిశ్రమలు

"అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్ దేశి సరకుల నమ్మవలెనోయ్,
డబ్బుతేలేనట్టి నరులకు కీర్తి సంపద లబ్బవోయ్ !" —గురజాడ.

విషయ సంగ్రహము :—దేశముయొక్క ఆర్థికాభివృద్ధి, ఆ దేశపు పరిశ్రమలమీద ఆధారపడి యుండును. పరిశ్రమలు ప్రభుత్వ పోషణమున్నచో అభివృద్ధి చెందును—బ్రిటిష్ పాలనా కాలమున దేశీయ పరిశ్రమలు పతనోన్ముఖమగుట—పరిశ్రమలు, వానిలో పెద్ద, చిన్న, గ్రామ పరిశ్రమలు—స్వదేశీ ఉద్యమ ఫలితముగా దేశీయ పరిశ్రమల పునర్వి జృంభణము—ముడి సరకుల విదేశములకు పంపి, విదేశములనుండి తయారైన వస్తువులను తెప్పించుకొనుటవల్ల మన పరిశ్రమలకు కలుగు నష్టము—దూది, నార, చక్కెర మొదలైన భారత దేశపు పరిశ్రమలు—చెన్న రాజధానిలోని పరిశ్రమలు—ఆంధ్ర దేశపు పరిశ్రమలు-చేనేతలో ఆంధ్రుల ప్రత్యేకత - బెజవాడ, మంగళగిరుల లోని సిమెంటు పరిశ్రమ—వుయ్యూరు, బొబ్బిలి, సామర్లకోట, రాయగడ మొదలైన ప్రదేశములలోని చక్కెర ఉత్పత్తి—నెల్లిమర్ల, ఏలూరు, చిట్టివలసలలో గోనెసంచులు—పొగాకు పరిశ్రమ—తోళ్లను పదునుచేయుట మొదలగు పెద్ద పరిశ్రమలు—బందరు ఆంధ్రాసైంటిఫిక్ కంపెనీ—బెజవాడలో పండ్లు నిలువ జేయుట—రత్నం ఫౌంటెన్ కలములు—భారత దేశపు నౌకా నిర్మాణమునకు మన తెలుగు రేవు పట్నము, విశాఖపట్టణము కేంద్రమగుట—మన గృహ పరిశ్రమలు—యంత్రయుగమున గృహ పరిశ్రమల ఆవశ్యకత—ఏలూరు, బందరులలో తివాసీల నేత—అదవాని జంఖానాలు—బందరులో కలంకారీ అద్దకము—ధర్మాజీగూడెం, అనంతపురం, కానుమోలులలో కంబళ్ల నేత—కొండపల్లి, నక్కపల్లి బొమ్మలు—నర్సారావుపేట క్యాంపు ఫర్నిచర్ పరిశ్రమ—విశాఖపట్టణ దంతపు సామానులు—ఇతర పరిశ్రమలు—మన దేశ పరిశ్రమలలో ముఖ్యమైన సినీమా పరిశ్రమ—సినిమా పరిశ్రమ ఆంధ్ర దేశమున 1927 లో మోతే నారాయణరావుగారు స్థాపించుట—1931 లో మొదట ప్రహ్లాద వెలువడుట; యుద్ధమునకు పూర్వము ఒక చిత్రము తీయుటకు 50 మొదలు 75 వేల రూపాయలు వరకు ఖర్చగుచుండుట ; ఇప్పుడు ఒక లక్ష రూపాయలవరకు ఖర్చగుచుండుట; ఈ నాటికి తయారైన తెలుగు చిత్రములు 100కు పైగా—జి. రామబ్రహ్మం, బి యన్. రెడ్డి, హెచ్. యం. రెడ్డి, వై. వి. రావుగార్లు సుప్రసిద్ధ తెలుగు దర్శకులు; హిందూ దేశమున 50 ఫిల్ము స్టుడియోలు, 150 ఫిల్ము నిర్మాణ కేంద్రములు గలవు; వీనిపై 14 కోట్ల రూపాయలకు పైగా పెట్టుబడి గలదు ; 40 వేలకు పైగా ఈ పరిశ్రమపై ఆధారపడినవారున్నారు ; ఆంధ్రదేశమునందలి సినిమా ప్రదర్శనశాలల పట్టికలు మొ॥నవి, మన దేశపు పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడవలసినది ప్రజలే !

ఆర్థికాభివృద్ధి పరిశ్రమల మీద ఆధారపడియుండును. పరిశ్రమలు ప్రభుత్వపోషణయున్నచో అభివృద్ధి చెందును. వర్తకమునకై వచ్చి, గిడ్డంగులను దుర్గములుగా మార్చి, మనపై ప్రభుత్వము చేయు పరదేశీయులు, మన పరిశ్రమలను పైకిరానిత్తురా ? ఆంగ్లేయులు మన దేశమున పరిపాలన ప్రారంభించక పూర్వము మన పరిశ్రమ లెట్లున్నవో చూడండి !

ప్రాచీనకాలమునుండియు ఓడలు కట్టుచు, దక్షిణ అమెరికా, చైనా, జావాలలో మన భారతీయులు వర్తకము చేయుచుండెడివారు. ఇప్పటికి సుమారు మూడువేల సంవత్సరముల క్రిందట ఈజిప్టు దేశములో శవములకు కప్పిన బట్టలు, గ్రీసు రాణులు ధరించిన సున్నితమైన వలువలు మన దేశములో ఉత్పత్తి చేయబడి, మన రేవులనుండి మన పడవలలో ఎగుమతి చేయబడెను. 17 వ శతాబ్దమున హిందూ దేశములో

తప్ప మరి ఎచ్చటను పెద్ద ఓడలు నిర్మించియుండలేదు. పైగా ఆ ఓడలు 30 సంవత్సరముల వరకు చెడిపోయెడివి గావు. భారతీయులు 18-వ శతాబ్దమున ఇనుప ఓడలను గూడా నిర్మించినట్లు నిదర్శనములున్నవి.

ఢక్కా మజిలీను, బందరు కలంకారీ గుడ్డలు విదేశ ముల కెగుమతి యగుచుండెను. ఎల్లోరా, అజంతా రంగుల వాసి నేటికైనను తరిగినది కాదు. ఢిల్లీవద్దనున్న 1500 సంవత్సరముల నాటి ఉక్కు స్తంభము ఇప్పటికిని తుప్పు, చిలుము పట్టకుండా నిలిచియున్నది. దీనికి కారణము మన లోహ శాస్త్రజ్ఞుని బుద్ధి బలము, శిల్ప చాతురియే! కొండలలోను గుహలలోను, దేవాలయములలోను, రథ ములకున్నూ సంగీత స్వరముల ప్రతిధ్వనించు రాళ్లు చెక్క బడినవి! అప్పటి భారతీయుల అఖండమైన శాస్త్రజ్ఞానము కొనియాడ దగినది!

యిట్టి ప్రజ్ఞాసంపన్నులకు నెలవయిన భారతదేశమున ఏనాడు విదేశ వర్తకులకు వర్తకమునకు అనుమతు లిచ్చిరో, ఆనాడే మన దేశ పరిశ్రమలకు ముప్పువచ్చినది. ఆంగ్లే యులు మనకు పాలకులైన తరువాత మన సరకులు, మన ఓడలలో వెళ్లుట పార్లమెంటు నిషేధించెను. దీనితో క్రమముగా ఓడల కట్టడము, మన విదేశ వ్యాపారము క్షీణించినది. లాంక్‌షైరు వర్తకులు బాగుపడుటకు మన ఢక్కా నేతగాండ్ర వ్రేళ్లు నరుకవలసి వచ్చెను. వారి ఓడ వ్యాపారమునకు పై చెప్పినట్లు మన నౌకల నిషేధించ వలసి వచ్చెను! విదేశీయులైన మన పాలకులు ఆదినుండి దేశీయ వర్తకమును ఒక నిర్ణీత విధానము ననుసరించి క్షీణింప జేసిరి. అందుకు వారికి ముఖ్యముగా తోడ్పడినది-మన పారతంత్ర్యము, వారెక్కువ మనము తక్కువను హెచ్చు తగ్గుల ప్రచారము, న్యాయముగా నున్నట్లు నటించుచు చట్టరీత్యా మన వర్తకము వారు వశము చేసుకొనుట, నాల్గ వది క్రైస్తవ మత ప్రచారము. వీరి పాలనా కాలములో మన అనుదిన జీవితములో వచ్చిన మార్పులు, పాశ్చాత్య వ్యామోహము వలన ప్రొద్దున పొయ్యి రాజేసుకొను అగ్గి పెట్టె మొదలు దైవాలంకరణ వస్తువుల వరకు, విదేశ వస్తు వులనే ఉపయోగించుటగూడా మన దేశీయ వస్తు నిర్మాణ ములకు ఉపద్రవము కలిగించినవి.

1905 లో వచ్చిన వంగ రాష్ట్రోద్యమము, దాని తర్వాత విజృంభించిన స్వదేశీ ఉద్యమముల ఫలితముగా ప్రజలలో ఒక నూతన ఆవేశము ఉదయించి, సుషుప్తిలో నణగి యున్న జాతీయ శక్తులు వన్నెలు దిద్దుకొన్నవి. దేశీయ వస్తువులన్న ఆదరణ, అభిలాష ఏర్పడి అనేక క్రొత్త పరిశ్రమలు దేశమున స్థాపించ బడినవి. 1920 లో ఆరం భించిన గాంధీ యుగములో కలిగిన ఖద్దరు ఉద్యమము వలన అనేక పరిశ్రమలు పరోక్షముగా ఉద్ధరింప బడినవి. ఈ నాటికి విదేశీయుల వ్యాపార శక్తులను, విదేశ వస్తు వులను బహిష్కరించ గలిగిన ప్రబల శక్తి మనలో ఆవిర్భ వించినది. శుద్ధ స్వదేశీ పరిశ్రమలన్న మన కిప్పుడు ప్రాణము! కాంగ్రెసు ప్రభుత్వము దేశీయ ఉద్యమములకు ప్రోత్సాహమిచ్చెను. కాంగ్రెస్ పరిపాలనా కాలమున అనేక నూతన పరిశ్రమల స్థాపనకు పునాదులు వేయబడెను. ఇంతలో స్వాతి ముసురులట్లు ముంచుకొని వచ్చిన యుద్ధము వల్ల, కాంగ్రెస్ మంత్రుల రాజీనామాలవల్ల ఈ దేశీయో ద్యమ కార్యక్రమము నిరాటంకముగా సాగుటకు వీలులేక పోయినది. ఆర్థిక, పారిశ్రామిక పోరాటములు మన స్వరాజ్య పోరాటములోని అంతర్భాగములు. యుద్ధమువల్ల విదేశ వస్తువుల దిగుమతి ఆగిపోయి, దేశీయ వస్తు ప్రచా రము ప్రబలమగుట సహజముగదా! యిప్పుడు మన బట్టల మిల్లులు విరివిగా పనిచేయుచున్నవి! మన దేశమున ఓడలు, మందుగుండు సామానులు, విమానములు నిర్మించు కర్మాగార ములు నెలకొల్పబడుచున్నవి.

పరిశ్రమలు, వానిలోని వివిధ రకములు, మన దేశ మందలి పరిశ్రమలు, ఆ పరిశ్రమల అభివృద్ధికి కావలసిన పరిస్థితులు, పరికరములనుగూర్చి తెలుసుకొనవలసి యున్నది.

పరిశ్రమల అభివృద్ధికి ముఖ్యముగా కావలసినవి ముడి సరకు, విద్యుచ్ఛక్తి లేక బొగ్గు, మూడవది అమ్మకమునకు కేంద్రములు (మార్కెట్స్), ఇవికాక రాకపోకల సౌకర్య ములు. ముఖ్యముగా సరకుల విడుదల కుపకరించునవి రైలు మార్గములు. ఇప్పుడు రైల్వే కంపెనీలు మన అధీనములో లేకుండుటచేత, ప్రయాణీకులకే సౌకర్యములులేని స్థితిలో సర కులమాటఏమని చెప్పవలెను! ఇది గొప్ప ఆటంకము. కొన్ని రైల్వేకంపెనీలు సునకున్నప్పటికిన్నీ జాతీయాభ్యుదయమునకై తోడ్పడుట లేదు. ఇందుకు కారణము పరప్రభుత్వమే! ప్రభుత్వమువారి ఉదాసీనతయే! కృష్ణా జిల్లాలో సిమెంటు పరిశ్రమ స్థాపనకు ఎక్కువ అవకాశములున్నవి. రైల్వే సౌకర్యముల ననుసరించి ఆ పరిశ్రమకు మంగళగిరి

బెజవాడలు అనువయిన కేంద్రములు. బీహారు రాష్ట్రమున ఇనుము, బొగ్గు అధికముగా దొరకుటచేత తాతా కంపెనీని ఆ రాష్ట్రమున స్థాపించిరి. ముడి సరకులనుబట్టి, సరకుల విడుదల సౌకర్యములను బట్టి ఆయా పరిశ్రమలు పెంపొందును.

పై జెప్పినట్లు ఫ్యాక్టరీలను నడుపుటకు యినుము లేక బొగ్గు అత్యవసరము. బీహారులో బొగ్గు గనులకు చేరువగా తాతానగర మున్నది. కోయంబత్తూరులో విద్యుచ్ఛక్తి చౌక; గాన అక్కడ దూది మరలు, మిల్లులు పెట్టినారు. మైసూరులో చౌకగాను విస్తారముగాను విద్యుచ్ఛక్తి లభ్యపడుచుండుటచేత అక్కడ అనేక పరిశ్రమలు చిన్నవి, పెద్దవిగూడా పెంపొందుచున్నవి.

సింగరేణిలో తప్ప మనకు పెద్దపెద్ద బొగ్గు గనులు లేవు. అంతేగాక ఇంకా చౌకగాను, అధికముగాను యంత్ర సహాయమున విద్యుచ్ఛక్తి లభ్యపడుటలేదు. రాకపోకల సౌకర్యములుగూడా ఇంకా అభివృద్ధి కావలెను. రేవుకు, రైలుస్టేషనుకు రోడ్డు దగ్గరగా యుండవలెను. లేనిచో అధిక వ్యయమగును. జయపురమున బియ్యము చౌక. విజయనగరము వచ్చుటకే బండ్ల బాడుగలవల్ల ధర అధికముగా పెరిగిపోవును. వంగ దేశములోని నార మరలన్నియున్నూ హుగ్లీ నది ముఖద్వారమున నున్నవి. అందుచేత ఓడలలో సరాసరి సరకులు విడుదల చేయుటకు వీలగును. కాలువ సదుపాయములున్న, సరకులను చిన్న చిన్న పడవలలో చౌకగా తీసుక రావచ్చును. సరకుల ఉత్పత్తి అధికముగా నున్నప్పటికిన్నీ, అమ్మకము లేనియెడల ప్రయత్నము ఫలితశూన్యమగును. అందుచేత విడుదల కేంద్రములు ఎక్కువగా నుండవలెను. ఈ విడుదల కేంద్రములను ఏర్పరచుట ప్రభుత్వమువారి విధి.

యింక ఎగుమతి దిగుమతుల విషయములు గమనించిన మరికొన్ని అంశములు అవగతము కాగలవు.

## 1937-38 సం॥న మన దేశమునుండి ఎగుమతి చేయబడిన సరుకులు.

| ఎగుమతి చేయబడిన సరుకులు | | విలువ రూపాయలు, కోట్లు |
|---|---|---|
| మిల్లు గుడ్డలు మొదలైనవి | — | 54 |
| గోనె సంచులు | — | 24 |
| దూది | — | 34 |
| నార | — | 13 |
| విత్తనములు (వేరుశెనగ, ఆముదము మొదలైనవి) | | 15 |
| ఇతరములు | — | 41 |
| | | 181 |

## 1937-38 సం॥లో దిగుమతులు

| దిగుమతి చేయబడిన సరుకులు | | విలువ రూపాయలు, కోట్లు |
|---|---|---|
| బట్టలు వగైరాలు | — | 22 |
| మరలు, మరసామానులు | — | 19 |
| నూనెలు | — | 15 |
| పిండి | — | 13 |
| పొగాకు చుట్టలు, సిగరెట్లు | — | 1 |
| ఇతరములు | — | 104 |
| | | 174 |

పై పట్టికలను బట్టి మన దేశమునుండి ముడి సరుకు నుపయోగించుకొనుట తెలియక, ఎగుమతిచేసి, మనకుపకరించు సరకులుగా వానిని తయారు చేయించుకొని పరదేశముల దిగుమతి ఖర్చులు, ఓడకిరాయి మొదలైన ఖర్చులను గూడా భరించుచున్నాము. 34 కోట్ల రూపాయల దూది నెగుమతి చేసి 22 కోట్ల రూపాయల విలువగల మిల్లు బట్టలు తెప్పించుకొనుచుంటిమి. 1937-38 లో 84 లక్షల రూపాయల రబ్బరు మన దేశమునుండి ఎగుమతి చేసి 189 లక్షల రూపాయల రబ్బరు వస్తువుల కొంటిమి. రానురాను మనము 30-40-వ. నెంబరు. నూలుగూడా దిగుమతి చేసుకొను చున్నాము. మన దేశమున దట్టమైన అడవు లున్నవి; గొర్రె లున్నవి; నేయుటకు నేతగాండ్రున్నారు; అయినప్పటికీ మనము విదేశములనుండి $2\frac{1}{2}$ కోట్ల రూపాయలు విలువగల ఉన్ని వస్త్రములను దిగుమతి చేసుకొనుచున్నాము. మొత్తముమీద :—

| దిగుమతులు | నూటికి వంతులు |
|---|---|
| దూది వస్తువులు | 14 |
| నూనె ,, | 10 |
| మరసామానులు | 12 |

| ఎగుమతులు | నూటికి |
|---|---|
| దూది వస్తువులు | 15 |
| నార ,, | 16 |
| తేయాకు ,, | 14 |
| గింజలు | 9 |

వంతులు చొప్పున యున్నవి. విదేశములతో వ్యాపారము ఏయే దేశములతో ఎంతెంత జరుగుచున్నది చూచిన :—

| | | నూటికి |
|---|---|---|
| ఇంగ్లండు | — | 34 వంతులు |
| అమెరికా | — | 8 ,, |
| బర్మా | — | 5 ,, |
| జర్మనీ | — | 5 ,, |
| ఇతర దేశములు | — | ***** |

అని తెలియగలదు. ఇంగ్లండుకు మనకు ఉన్న ఈ పై చూపబడిన వర్తక సంబంధమే మన దేశదాస్య బంధము లలో ఒకపేట ముడి. మన యిష్టమువచ్చిన దేశములతో మన నౌకలలో, మనము వర్తకము చేసుకొనుట కింకను నోచుకొన లేదు.

మన ముడి సరకులు యితర దేశములకుపంపి, అది ఇత రులు మనకు ఉపయోగపడునట్లు చేసియిచ్చిన ఉపయోగించు కొనవలసిన దుర్గతి పట్టినది. ఈ దుర్గతికి కారణము మన సోమరితనము, బుద్ధిలోపము, ముఖ్యముగా పరితాపకరమైన బానిసత్వము. మన వ్యాపారసంబంధములు బ్రిటిష్‌వారితో అధికముగా నుండుటచేత వారు మన పరిస్థితులకు అనుగుణ్యముగా వర్తక వ్యాపారముల సాగించుకొనుట కనుమతించరు. ఇందుకుకూడా కారణము మన పరాధీనతయేయని వేరుగా చెప్ప నక్కరలేదు.

మన పరిశ్రమలను మూడు భాగములుగా విభజింప వచ్చును. (1) గ్రామ పరిశ్రమలు, లేక గృహ పరిశ్రమలు (2) చిన్న పరిశ్రమలు (3) పెద్ద పరిశ్రమలు.

(1) గృహ పరిశ్రమలు :—ఎవరి గృహములలో వారు, పెద్ద యంత్రముల సాయ మక్కర లేకుండా, చేసుకొను టకు వీలయిన పరిశ్రమలు. ఈ పరిశ్రమలకు సాధారణముగా పదిమందికన్న పనివారు అవసరముండరు. ఇట్టి పరిశ్రమ లలో కొన్ని, సంవత్సరమంతయు చేసుకొనుటకు వీలయినవి. అట్టివానిలో చేనేత ఖద్దరు, కంబళుల నేత, తివాసీల నేత, అద్దకము, విస్తళ్లు కుట్టుట, కంచరి పని మొదలైన పరి శ్రమలు. ఇవికాక, తరుణము ననుసరించి చేయవలసిన పట్టు పురుగు పరిశ్రమ, తేనె, బెల్లము తీయుట మొదలైన పరిశ్రమలు కలవు. ఇవన్నియు గృహ పరిశ్రమల శ్రేణికి చెందినవి!



కుమ్మరి

(2) చిన్న పరిశ్రమలు :—50 లేక 60 మందికి మించ కుండా పనివాండ్లుండవలెను. సుమారు 20, 30 వేల రూపాయలు పెట్టుబడి కావలెను. ఇది పెద్ద పరిశ్రమలకు, గ్రామ, గృహ పరిశ్రమలకు మధ్య స్థానము నాక్రమించు కొనును. కార్ఖానా పరిశ్రమ, అల్యూమినియము సామాను లు చేయుట, ఇటుకలు చేయు ఫ్యాక్టరీలు, సీకాయ సిగరెట్టు మరలు, బనీనులు, చిన్నచిన్న బట్టలు తయారు చేయు ఫ్యాక్టరీలు, మందులను రంగులను ఉత్పత్తిచేయు కేంద్రములు, ఈ రకపు పరిశ్రమలకు సంబంధించినవి.

(3) పెద్ద పరిశ్రమలు :— వేలకువేల పెట్టుబడితో స్థాపించి, నిరంతరము పనిచేయు యంత్రములతో, లక్షల లక్షల కూలీల కోలాహలముతో మిన్నంటు పొగ గొట్టములతో నిండియున్న పెద్దపెద్ద కర్మాగారముల కలిగి యుండిన పరిశ్రమలు. బట్టల మిల్లులు, సిమెంటు ఫ్యాక్టరీలు, బియ్యపు మరలు మొదలైనవి ఈ శ్రేణికి చెందిన పరిశ్రమలు.

## భారత దేశ పరిశ్రమలు

పేర్కొనదగిన భారతదేశపరిశ్రమలలో వస్త్ర పరిశ్రమ, నార పరిశ్రమ, లోహపరిశ్రమ, కాగితపు పరిశ్రమ,

సిమెంటు పరిశ్రమ, పంచదార పరిశ్రమ ; తేయాకు, ఉన్ని, సబ్బులు, రంగులు ఉత్పత్తిచేయు పరిశ్రమలను చెప్పవలసి యున్నది.

దూది లేక వస్త్ర పరిశ్రమ:—ఇది చాలా పెద్ద పరిశ్రమ. అమెరికా తరువాత మన దేశములోనే దూది ఉత్పత్తి ఎక్కువ. బొంబాయి, బేరారు, మధ్య రాష్ట్రములలో మన దేశపుపంటలో సగము పంటపండును. అందులోను బొంబాయి, బేరారులలోనే హెచ్చుగా దూది పండును. గత ఐరోపా యుద్ధానంతరము ఈ పరిశ్రమ అభివృద్ధి చెందినది. మొదట బట్టల మిల్లులు 1818 లో కలకత్తాలో కట్టబడెను. 1854 లో బొంబాయిలో కట్టిరి. యిప్పుడు ఈ బట్టల మిల్లులు దేశమంతటనూ అలము కొన్నవి. మొత్తము మన దేశమున 389 కి పైగా మిల్లులున్నవి. అందులో అహమ్మదాబాదులో 77 మిల్లులున్నవి. ఈదిగువ పట్టికలో మన భారత దేశములోని మిల్లుల సంఖ్య చూప బడినవి.

| స్థలం | మిల్లుల సంఖ్య | కదురుల సంఖ్య | మగ్గముల సంఖ్య |
|---|---|---|---|
| బొంబాయి, పరిసర ప్రదేశములు | 68 | 28,50,774 | 67,235 |
| అహమ్మదాబాదు | 77 | 19,01,872 | 46,853 |
| బొంబాయి రాష్ట్రము | 62 | 12,63,651 | 26,852 |
| | 207 | 60,16,297 | 1,40,490 |
| రాజపుత్ర స్థానము | 6 | 88,524 | 2,137 |
| బేరారు | 4 | 68,312 | 1,434 |
| మధ్య రాష్ట్రములు | 8 | 3,23,502 | 5,759 |
| బీహారు, ఉత్కళము | 2 | 27,500 | 269 |
| హైదరాబాదు | 6 | 1,24,140 | 2,157 |
| మధ్య హిందూస్థానము | 16 | 3,98,118 | 10,972 |
| వంగ రాష్ట్రము | 30 | 4,44,196 | 9,940 |
| పంజాబు | 8 | 1,11,264 | 2,647 |
| ఢిల్లీ రాష్ట్రము | 6 | 1,08,634 | 3,112 |
| సంయుక్త రాష్ట్రములు | 26 | 7,24,668 | 11532 |
| మద్రాసు, కొచ్చిన్ | 58 | 13,68,309 | 6,712 |
| తిరువాన్కూరు | 1 | 12,000 | 300 |
| మైసూరు | 8 | 1,65,062 | 2,607 |
| పుదుచ్చేరి | 3 | 87,824 | 1,946 |
| | 389. | 1,00,59,370. | 2,02,464 |

ఈ మిల్లులలో తయారైన వస్త్రములు సగము జపానుకు పోవును. కొన్ని రకముల దూదిని అమెరికా, ఈజిప్టుల నుండి కొనుచున్నాము. మన దేశమున కావలసిన 625 కోట్ల గజముల బట్టకు, మన మిల్లులలో 400 కోట్ల గజములబట్ట తయారగుచున్నది. 27 కోట్ల గజముల సున్నితమైన బట్టను మనము దిగుమతి చేయుచున్నాము. అహమ్మదాబాదులో పల్చనిబట్ట తయారగును. మనకు పోటీగా జపాన్ ఈ యుద్ధమునకు (1942) పూర్వము 40 వ. నెంబరు నూలుగుడ్డ పోటీగా పంపుచున్నది. బొంబాయి, షోలాపూర్, అహమ్మదాబాదు, నాగపూరు, కలకత్తా, కోయంబత్తూరు, మధురలు ఈ పరిశ్రమలకు ప్రధాన కేంద్రములుగా నున్నవి.

## నార, గోనెసంచుల పరిశ్రమ

బట్టల మిల్లుల తర్వాత జనపనారసంచులు తయారుచేయు జ్యూట్ మిల్లులు ప్రాముఖ్యము వహించును. ఈ పరిశ్రమ యిప్పుడిప్పుడే అభివృద్ధి చెందుచున్నది. నార వంగ రాష్ట్రమున విస్తారముగా ఉత్పత్తియగును. ఈనార మన దేశమున ఒక్క వంగ రాష్ట్రమునసేగాక బీహారు, అస్సాములలో కూడా దొరకుచున్నది. 1850-51 లలో విదేశములకు కలకత్తా రేవునుండి 21 లక్షల రూపాయల విలువగల నార ఎగుమతి చేయబడెను. మొట్ట మొదట నార 1791 లో తూర్పు యిండియా వర్తక సంఘము వారు హిందూ దేశము నుండి ఎగుమతి చేసిరి. 1859 లో బెంగాలులో మొదట మిల్లు కట్టిరి. వంగ దేశములో హుగ్లీనదీ ముఖద్వారమున అనేక నార మిల్లులున్నవి. నారతో గోనెసంచులు మొదలైనవి తయారు చేయుదురు. నారపట్టాలు దూది బేళ్లు మొదలైన వాటి కుపయోగింతురు. గతఐరోపా సంగ్రామ కాలములో ఈ పరిశ్రమ అభివృద్ధి చెందెను. మన దేశపు ఎగుమతులలో ఈ సంచుల ఎగుమతి ప్రధాన స్థానమాక్రమించు చున్నది. ఈ పరిశ్రమ చాలా భాగము విదేశీయుల హస్తగతమై యుండుటచే మనకు కావలసిన ఉపకృతి లభించుట లేదు.

ఈ ప్రక్క పట్టికలో 1939 లో మన దేశము నుండి విదేశముల కెగుమతి యైన నార, విలువలతో సైతము చూప బడినది.

| దేశము | 1938—39లో నార ఎగుమతి-టన్నులు | లక్షలలో రూపాయల విలువ |
|---|---|---|
| ఇంగ్లండు | 181,000 | 3,46 |
| జర్మనీ | 138,000 | 2,70 |
| బెల్జియము | 48,000 | 74 |
| ఫ్రాన్సు | 76,000 | 1,50 |
| ఇటలీ | 46,000 | 91 |
| అమెరికా | 31,000 | 67 |
| జపాను | 14,000 | 27 |

లోహపరిశ్రమ:— పెద్ద పరిశ్రమలలో మూడవది లోహ పరిశ్రమ 1907 లో ప్రారంభించు నంతవరకు ఏప్రాంత ములోను మన దేశీయులు స్థాపించిన లోహ పరిశ్రమ స్థానము లేదు. వంగ దేశములో ఆంగ్లేయులు స్థాపించిన కొన్ని కంపెనీలున్నవి. అన్ని పరిశ్రమలకున్నూ ఆధార భూత మైన ఈ లోహపరిశ్రమ అభివృద్ధి చెందక పోవుటయే మిగతా పరిశ్రమలు అభివృద్ధి చెందక పోవుటకు సైతము కారణమైనది. మన పరిశ్రమలకు కావలసిన పరికరములు, సామగ్రి విదేశమునుండి తెప్పించు కొన వలసియున్నది. అప్పుడు అసలు సామాను ఖరీదేగాక, ఇన్సూరెన్సు ఖర్చులు, రవానా ఖర్చులు, నూటికి 20 రూ॥లగు చున్నవి. దాని పైన మరమ్మతు ఖర్చులగును. బీహారులో అధికముగా యినుము లభ్యమగు ననియు, బొగ్గుగనులున్న వనియు, ఈ ఇనుము మన దేశమునకు వెయ్యి సంవత్సరముల వరకు సరిపోవు ననియు మీకు తెలియును! సాంచీ గ్రామమున, (బీహారులో) ఇప్పుడు జెమ్ షెడ్‌పూరని పిలువబడు నగర మున తాతా కంపెనీ యున్నది. ఇక్కడ ఈ పరిశ్రమ అత్యున్నత స్థితికివచ్చి, ప్రపంచములోని పెద్ద కర్మాగారము లలో ఒకటిగా వాసి కెక్కినది. ఈ కంపెనీవారి కర్మాగార ములలో 50 వేల మందికి పైగా పనిచేయు చున్నారు. ఇచ్చట రైలు పట్టాలు, గర్డరులు తీగెలు, మొదలయిన వివిధ వస్తువులు తయారగును. మైసూరులో భద్రావతివద్ద 1930 సం॥న పెద్ద కర్మాగార మొకటి స్థాపించబడినది. మొత్తము మీద మన దేశములో 4 పెద్ద కర్మాగారముల కన్న అధికముగా లేవు. చెన్న రాజధానిలో నాగపట్టణము లోను, బెజవాడలోను యిటీవల స్టీము-రోలింగు మిల్లులు స్థాపించ బడినవి.

తోళ్ల పరిశ్రమ :—మన దేశములో తోళ్లను పరిశుభ్రము చేసి, విదేశములకు ఎక్కువగా ఎగుమతి చేయు చున్నారు. ప్రతి సంవత్సరము విదేశములకు దరిదాపు 8 కోట్ల రూపాయలు విలువగల తోళ్లు ఎగుమతి యగును. బాటా అనువిదేశస్థుడు కలకత్తా వద్ద తన కంపెనీని స్థాపించి, హిందూ దేశమంతటా ఏజెన్సీల నేర్పరచి, తోలు వస్తువుల నమ్మకము చేయుచున్నాడు. ఇదేగాక, ఆగ్రాకు సమీపమునందున్న దయాల్బాగులోగూడా తోలుపెట్టెలు, చెప్పులు మొదలైనవి తయారు చేయబడుచున్నవి. విదేశములనుండి ఏటేటా సుమారు 22 లక్షల రూపాయల విలువగల సామగ్రి ఎగుమతి యగుచున్నది. ఈ పరిశ్రమకు కాన్పూరు కేంద్రము.



ఆంధ్రా సిమెంటు ప్యాక్టరీ, బెజవాడ.

సిమెంటు పరిశ్రమ :— ఇదివరలో సిమెంటు విదేశములనుండి దిగుమతి యగుచుండెను. 1904 లో మొట్ట మొదట సిమెంటు ఫ్యాక్టరీ స్థాపించ బడినది. భారతదేశములో ఈ కేంద్ర ములు అనేక చోట్ల నున్నవి. ఇప్పుడు

సిమెంటు కంపెనీల సంస్థ ఏర్పడి, పోటీల తగ్గించి, సిమెంటు పరిశ్రమకు ఎక్కువగా తోడ్పడుచున్నది. కరాచీ, కట్నీ, డాల్మియా, షాబాదు మొదలగు స్థలములలో ఫ్యాక్టరీలు గలవు. మన రాజధానిలో బెజవాడలోను, తిరుచునాపల్లి, కోయంబుత్తూరు జిల్లాలలోను సిమెంటు ఫ్యాక్టరీలున్నవి. మన హిందూ దేశమునకు కావలసిన సిమెంటు మన దేశములో తయారగుచున్నది !

కాగితపు పరిశ్రమ :—చాలా కాలము నుండియు భారత దేశమున కూడా కాగితము ఉపయోగింపబడుచున్నది. మొదట ఇది గృహ పరిశ్రమగా నుండెను. 1801 సం॥ వరకు, ఇంగ్లండులో కూడా కాగితములు చేతితో తయారు చేసెడివారు. మన దేశమున 1867 సం॥ న వంగ రాష్ట్రమున మొట్ట మొదట కాగితపు మిల్లును కట్టిరి.

మొదట చింకిగుడ్డలు, ప్రాత కాగితములతోటి కాగితమును తయారు చేయుటవల్ల పరిశుభ్రమైన కాగితము రాలేదు. వెదురు యొక్క ఉపయోగము కనిపెట్టిన తర్వాత వెదురు నుపయోగించి నాణ్యమైన కాగితము తయారు చేయు చున్నారు. ఈ వెదురే కాక, ముంజ, సబ్బ, గడ్డి, జమ్ముగడ్డిని ఉపయోగింతురు. గాంధీ మహాత్ముని గృహ పరిశ్రమల ఉద్యమములో, కాగితము గూడా గృహపరిశ్రమగా తలయెత్తినది ! మన దేశములో తయారగు కాగితము మనకు సరిపోకపోవుటచే విదేశములనుండి కొంత కాగితము సరఫరా యగు చున్నది. మైసూరులో కాగితము తయారు చేయు భద్రావతీ మిల్లులు గలవు. 1925 నాటికి భారతదేశపు కాగితపు పరిశ్రమ ఒకక్రమవిధానము క్రిందికి వచ్చెను. 1940 నాటికి మన దేశమున 11 మిల్లులు పనిచేయ నారంభించెను. ఇప్పుడిప్పుడీ పరిశ్రమ భారత దేశపు ప్రధాన పరిశ్రమలలో ఒకటిగా ప్రాముఖ్యము వహించుచున్నది.

పంచదార పరిశ్రమ :— ఈ పరిశ్రమకు మన భారత దేశము పుట్టినిల్లు. కానీ, ఈ పరిశ్రమ ప్రథమ ప్రపంచమహా సంగ్రామకాలము వరకూ అంతగా అభివృద్ధి పొందలేదు. 1920 లో పంచదార పరిశ్రమకు సంబంధించిన ఒక సంఘము భారత దేశమున ఏర్పడినది. 1929 లో ప్రభుత్వపు దృష్టిని కూడా ఈ పారిశ్రామికు లాకర్షించిరి. 1930-31 సం॥ము ఈ పరిశ్రమ చరిత్రలో ప్రాధాన్యము వహించినది. 1931-32 నాటికి పంచదార, పారిశ్రామిక కేంద్రములలో నొకటిగ పరిగణింపబడినది. కందసారి, కథియవారులలో ఎక్కువ చక్కెర తయారగును. ఇప్పుడు భారత దేశములో అనేక చోట్ల చక్కెర తయారు చేయు కర్మాగారము లున్నవి. భారత దేశములో వివిధ రాష్ట్రముల లోని మిల్లుల పట్టిక.

| రాష్ట్రము | మిల్లుల సంఖ్య |
|---|---|
| సం. పరగణాలు | 72 |
| బీహారు | 33 |
| పంజాబ్, సింధు | 3 |
| మద్రాసు, | 7 |
| బొంబాయి | 7 |
| బెంగాలు | 9 |
| ఒరిస్సా | 2 |
| సంస్థానములు | 11 |
| మొత్తము | 144 |

ఉన్ని పరిశ్రమ :— మన దేశములో అడవులు విశేషముగా నున్నవనియు, అందు మేయు గొర్రెలు మనకు కావలసినంత ఉన్ని నిచ్చుననియు, ఆ ఉన్ని నేయుట కనేకులు నేతగాండ్రు అసంఖ్యాకులుగా నున్నారనియు మీరెరిగినదే ! అయినను, పరదేశముల నుండి $2\frac{1}{2}$ కోట్లు విలువగల ఉన్ని వస్తువులను దిగుమతి చేసుకొనుచున్నాము. మన కాశ్మీర దేశపు ఉన్ని మరే ప్రాంతమున వెదకినను దొరకదు. కాశ్మీర వలువలు చూచిన వారికి ఈ విషయము గ్రాహ్యమే కదా ! ఇప్పుడు అమృతసర్, కాశ్మీరు, కాన్పూరు, బెంగుళూరులలోని మిల్లులలో ఉన్నిబట్ట తయారగు చున్నది. బికనీరు, జయపూరులలో ఈ పరిశ్రమ గలదు.

ఇతర పరిశ్రమలు :— ఇవిగాక నిప్పుపెట్టెల పరిశ్రమ, లాంతరులు, మందులు, సబ్బులు, పింగాణీ సామానులు, గాజు సామానులు, విద్యుత్ బల్బులు అనేక చోట్ల తయారు చేయ బడుచున్నవి. అగ్గిపెట్టెల పరిశ్రమ చాలా ప్రదేశములలో విదేశీయుల చేతిలో నున్నది. అగ్గిపెట్టెలు చేయుట కుటీర పరిశ్రమగా మద్రాసు రాజధానిలోని దక్షిణ జిల్లాలలో గలదు. మన వస్తువులను మనము తయారు చేసుకొనుట మనపైనను, మన ప్రభుత్వము పైనను గలదు.

## చెన్న రాజధానిలోని - పరిశ్రమలు

మన రాజధానిలో చేనేత, బట్టలు మిల్లులలో తయారు చేయుట, సబ్బులు చేయుట, పింగాణీ సామానులు తయారు చేయుట, పొగాకు పదును చేయుట, శాస్త్ర పరికరములు చేయుట మొదలైన పరిశ్రమలు ముఖ్యమైనవి.

రైసు మిల్లులు :— ఈ రాజధానిలో డెల్టా లేర్పడిన పిమ్మట వరిపంట వృద్ధి అయినది. దానితో పాటు ఎటు చూచినను రైసు మిల్లులు స్థాపించుట ప్రారంభమైనది. ముఖ్యముగా కృష్ణా, గోదావరి జిల్లాలలో రైసు మిల్లులు అధికముగా గలవు. బియ్యపు ఎగుమతి లాభసాటిగా నుండుటచేత మిల్లుల సంఖ్య ఎక్కువగు చున్నది. అందుచేత పోటీలు ఏర్పడి, కొన్ని మిల్లులు దివాలా తీసినవి. పూర్వము నీలిమందు కుండులవలె యిప్పుడు పాడుపడిన మిల్లుగోడలు, ఊడిన రేకులు కనిపించు చున్నవి!



వుయ్యూరు పంచదార ఫ్యాక్టరీ.

నేత పరిశ్రమ :— కృష్ణా, గుంటూరు, బళ్లారి, కోయంబుత్తూరు, తిరునల్వేలి, మధుర జిల్లాలలో దూది పండును. ఆంధ్ర దేశమున గాని, మన రాజధానిలో గాని చేనేత పరిశ్రమ లేని చోటులేదు. తూత్తుకుడి, మధుర, కోయంబుత్తూరు మదరాసులలో పెద్ద బట్టల మిల్లులున్నవి. మొత్తము 1937 లో 49 మిల్లు లుండెను. 860 లక్షల గజముల బట్ట తయారైనది. 71980 మంది పనిచేయుదురు. 30 లక్షల గజముల గుడ్డ మగ్గముల మీద తయారైనది. అయినను, మనము 1600 లక్షల రూపాయల విలువగల బట్ట కొనుచున్నాము. బొంబాయిలో నేత పరిశ్రమ, బీహారులో లోహపరిశ్రమలవలె, మద్రాసు రాష్ట్రమున పెరుగవలసిన పరిశ్రమలు లేవు. వివిధ రకముల పరిశ్రమలకు సంబంధించిన 1244 ఫ్యాక్టరీలున్నవి. మెట్టూరులో నేత నేసిన గుడ్డను తెలుపుచేయు పరికరములను తయారు చేయు మరలు ఏర్పాటు చేయబడినవి. ఆంధ్ర దేశమున ఏలూరు, గుంటూరులలో జ్యూట్, కాటన్ మిల్లులు పెట్టినారు. కానీ, బట్టలు తయారగుట లేదు. నార మాత్రము తీసెదరు. గోనెలు తయారగును. బెజవాడ దగ్గర తాడేపల్లిలో గూడూరు లక్ష్మణరావు, కుప్పుస్వామి చౌదరిగార్లు ఆంధ్ర కాటన్ మిల్సు స్థాపించి నారు. గానీ, మన దురదృష్ట వశమున అవి నడువలేదు. ఆంధ్ర దేశమున పెట్టుబడి పోయిన మిల్లులలో ఇది యొకటి. దూది దగ్గరనే దొరకును. కాని, నూలు తీయక బట్టలు నేయుటతో ప్రారంభించుట చేత ముప్పు వచ్చినది. ఇప్పుడు ఈ మిల్లు హైదరాబాదు మార్వాడీలవశమై, కోయంబత్తూరు నాయుళ్లచేతిలోనున్నది. రెండు మిల్లులు పందలిపాకలో పెట్టిరి. ఇంతవరకు బాగా పనిచేయుచున్నవి. బళ్లారి జిల్లా అంతయు దూదిమయము. అదవాని బొంబాయి వర్తకులతో నిండియుండును. తాడిపత్రి, బళ్లారులలో ప్రత్తితీయు మరలున్నవి గానీ, బట్టలు నేయునవి లేవు.

సబ్బులు :— దేశీయ ఉద్యమముల విజృంభణముతో 1905 లో అచ్చటచ్చట సబ్బులు తయారు చేయుట ప్రారంభించినారు. ఇప్పటికిన్నీ ఇది గృహ పరిశ్రమగానే యున్నది. మన రాజధానిలో క్యాలికట్టులో రెండు ఫ్యాక్టరీలు గలవు. కేరళా సబ్బులవారి కర్మాగార మొకటి చెప్ప దగినది. ఇది ప్రభుత్వము వారి సబ్బుల ఫ్యాక్టరీ.ఇతర ప్రాంతములనుండి దిగుమతి తగ్గినది. ఇప్పుడు దిగుమతి 4 లక్షల కన్న ఎక్కువగా లేదు. మన దేశములోనే ఇప్పుడు మంచి రకపు సబ్బులు తయారగు చున్నవి.

నిప్పు పెట్టెల పరిశ్రమ :— అసలు, ఈ నిప్పుపెట్టెల పరిశ్రమ ప్రపంచములో 1679 లో భాస్వరమును, బ్రాండు అనునాయన హంబర్గులో కనిపెట్టుటతో ప్రారంభమైనది. ఇప్పుడు మద్రాసులో, పెద్ద నిప్పు పెట్టెల ఫ్యాక్టరీ వెస్టరన్ ఇండియామాచ్ కంపెనీ ఒకటి కలదు. దక్షిణాదిని మలబారులో చిన్నచిన్న ఫ్యాక్టరీలున్నవి. భారత దేశమున సంవత్సరమునకు 1 కోటి 20 లక్షల రూపాయల అగ్గిపెట్టెలు ఖర్చగును. మన రాజధానిలో 5 లక్షల 26 వేల రూపాయిల అగ్గిపెట్టెలు ఖర్చగును. మొత్తము 72 ఫ్యాక్టరీలు

మన రాజధానిలో గలవు. చిన్నచిన్న కర్మాగారములు పూర్వము అనంతపురం, నెల్లూరులలో ఉండెడివి. అనకాపల్లి, రాజమండ్రిలో నిప్పు పెట్టెల పరిశ్రమ నారంభించిరి. కానీ, అది కొనసాగలేదు. మంగళగిరిలో ఒక చిన్న ఫ్యాక్టరీ గలదు.

పంచదార :—మన ఆంధ్రదేశమునను, రాజధానిలోను గల ముఖ్య పరిశ్రమలలో యిది యొకటి. ప్రారంభములో ఈ పరిశ్రమను బందరులో ప్రారంభించినారు. వి. రామకృష్ణ చౌదరిగారు, (పారిశ్రామిక డైరెక్టరు) యస్. వి. రామమూర్తిగారు (వ్యవసాయశాఖా డైరెక్టరుగానున్నప్పుడు) రైతులను ప్రోత్సహించి, సహకార పద్ధతులమీద కృష్ణాజిల్లా వుయ్యూరు, హాసుపేటలలో పంచదార మిల్లులు పెట్టుటకుతోడ్పడిరి. ఇవిగాక బొబ్బిలి, రాయగడ, తుంపాక, ఏటికొప్పాక, కిర్లంపూడి, సామర్లకోట ఫ్యాక్టరీలలో పంచదార మాత్రమేగాక, పిప్పరమెంట్లు మొదలైన తినుబడి పదార్థాలూ, సారాయి మొదలైన నిషాద్రవ్యములుగూడ తయారు చేయుచున్నారు. మన దేశపుపంచదార విదేశములనుండి వచ్చు జావా పంచదార కన్న ప్రశస్తమైనదే! బొబ్బిలిలోని పంచదార మిల్లులుగూడా బాగా పనిచేయుచున్నవి. సామర్లకోటలో బెల్లమునుంచి సారా పంచదార తయారు చేయుదురు.

మన రాజధానియందలి మిల్లులన్నియు రాజధానికి కావలసిన పంచదారలో సగమునకుపైగా మాత్రమే ఉత్పత్తి చేయుచున్నవి. మన రాజధానికి కావలసిన చక్కెర 20,000 టన్నులు. కొంత చక్కెర ఉత్తర హిందూస్థానమునుండి మన రాజధానికి వచ్చుచున్నది. మన ఆంధ్రదేశమునందలి వుయ్యూరులో 850 టన్నులు, హాస్పేటలో 450 టన్నులు, రాయగఢలో 250 టన్నులు, సీతానగరములో 250 టన్నులు, బొబ్బిలిలో 150 టన్నులు, కిర్లంపూడిలో 80 టన్నులు, తుంపాకలో 50 టన్నులు, కొప్పాకలో 50 టన్నులు ఉత్పత్తి యగుచున్నది.

కాగితపు పరిశ్రమ :—దక్షిణ దేశమునకెల్ల పెద్ద మిల్లు రాజమహేంద్రవరమున గలదు. 1922 లో దీనిని స్థాపించినారు. భద్రాచలం అడవులనుంచి కాగితమునకు కావలసిన కలప గోదావరి మీదుగావచ్చు అవకాశములుగూడా నున్నవి. ఈ పరిశ్రమకు ఆంధ్రదేశమున చాలా భవిష్యత్తు గలదని ఆశించినప్పటికీ విఫలమగుట దురదృష్టము. హిందూదేశమునకు 270 లక్షల రూపాయిల కాగితము దిగుమతియగును. మన రాజధానికి 44 లక్షల రూపాయిల కాగితము దిగుమతి యగుచున్నది. 40 లక్షల రూపాయల పెట్టుబడితో స్థాపించిన ఈ రాజమండ్రి మిల్లు పనిచేసిన యెడల, రోజుకు 10 టన్నుల కాగితము సరఫరా యగును. ఈ కాగితపు కరవు రోజులలో ఈ మిల్లు పనిచేయక పోవుట శోచనీయము!

లోహపరిశ్రమ :—బీహారు, మైసూరులలోవలె మన రాజధానిలో బొగ్గు, ఇనుము లేదు. చిన్నతనమున లక్ష్మణదాసుగారు చాటపఱ్ఱు గ్రామమున స్థాపించిన చిన్న కర్మాగారమును బందరుజాతీయ కళాశాలకు బహూకరించిరి. అది అభివృద్ధి చెందినది. అచ్చట మరలు పోత పోయుదురు. ఈ కర్మాగారములో విద్యార్థులకు శిక్షణ యిచ్చెదరు. ఇది యిప్పుడు పురపాలక సంఘమువారి ఆధీనములో నున్నది. బెజవాడలో స్టీము రోలింగు మిల్లులు పనిచేయుచున్నవి. మన రాజధానిలోని నాగపట్నములో నెలకు 1000 టన్నుల యినుము తయారు చేయు స్టీము రోలింగు మిల్లును స్థాపించిరి. కానీ, ఆర్థిక లోపమువల్ల ఇప్పుడు ఈ మిల్లు తాతా కంపెనీవారికి యిచ్చివేయబడినది. కోయంబత్తూరులో, తెలుగువారి పి. యస్. జి. కంపెనీ, జి. డి. నాయుడుగారి ఎలక్ట్రిక్ కంపెనీ మొదలైన కర్మాగారములలో ఎలక్ట్రిక్ పంపులు, రేడియో సామానులు, ఇనుప పనిముట్లు విరివిగా తయారు చేయబడుచున్నవి.

నార పరిశ్రమ :—గుంటూరు, ఏలూరులలో నార మరలున్నవి. కలకత్తానుంచి నార తెప్పించుకొని, మన మిల్లులలో సంచులను తయారు చేసెదరు. ఏలూరు మిల్లుల సంస్థాపనమునకు మోతేవారు కారకులు. నెల్లిమర, చిట్టివలసలలో విదేశీయ మరలున్నవి. ఈ మిల్లుల ఉత్పత్తిని సూచించు లెక్కలు దొరకలేదు. గుంటూరులోను, గోదావరి జిల్లా మెరక భూములలోను, ఈ మధ్య పొడవైన గోగునార వేస్తున్నారు. ఈ నార, కిత్తనార గోనెసంచులకు బాగుగా పనికివచ్చునని ఇండస్ట్రీస్ శాఖవారు యిటీవల కనిపెట్టిరి. ఈ పంట వృద్ధిచేసిన యెడల మన దేశమున ఇంకాకొన్ని మిల్లులు పెట్టవచ్చును.



ఆంధ్ర సైంటిఫిక్ ఇన్‌స్ట్రుమెంట్సు కంపెనీ, బందరు.

పట్టుబట్టలు :—మన దేశమునకు 30 కోట్ల రూపాయల విలువైన పట్టు బట్ట దిగుమతి యగును. 10 లక్షల రూపాయల సరుకు మన రాజధానికి దిగుమతి యగును. పెద్దాపురం ఈ పరిశ్రమకు కేంద్రము. భద్రాచలం అడవులలో పట్టు తయారగును. పట్టుపురుగులను పెంచి, జపాను వారివలె, ఖాదీపరిశ్రమవలె మన గృహములలో తయారు చేసుకొనవచ్చును. ఇది ఇప్పుడు అట్లు జరుగుట లేదు. చైనా వారు దేశముయొక్క మూలమూలకూ తిరిగి పట్టు నమ్ముచున్నారు. పెద్దాపురంలో నూలు తెప్పించి, (పవర్ బామ్) విద్యుత్ మగ్గములమీద నేసి, పట్టుగుడ్డ విరివిగా ఉత్పత్తి చేయుచున్నారు.

మందులు :—ఈ పరిశ్రమలో ఆంధ్రులది అందెవేసిన చెయ్యి! దేశమంతటా మన మందులు ప్రాకినవి. ఏ రైలు ప్లాటుఫారంమీద చూచినప్పటికిన్నీ మన మందుల ప్రకటనలు కనిపించును. దీనికి నిదర్శనము అమృతాంజనము. ఈ అమృతాంజనం ఉత్పత్తి నభివృద్ధి చేసి, మన నాగేశ్వరరావుగారు ఆంధ్రులకు పెట్టిన అమృత భిక్ష ఆంధ్ర పత్రిక. డాక్టరు కేసరిగారి లోధ్ర మొదలైన మందులు, పండిత డి. గోపాలాచార్యులుగారి విఖ్యాత జీవామృతం, జమ్మి వెంకటరమణయ్యగారి పిల్లల మందులు గూర్చి వేరే వ్రాయనక్కరలేదు. ఆంధ్రాయుర్వేద ఫార్మసీ పైకి రాకపోవుట పరితాపకరము. ఏలూరు కృష్ణా ఆయుర్వేద ఫార్మసీ మందులు రాజధానిలో వ్యాప్తిచెందినవి. మన రాజధానిలో వాడబడు మందులు ఆంధ్రులు తయారు చేసినవే! ఇట్లే అభివృద్ధిలోనున్న అనేక కంపెనీలు గలవు. బెజవాడలో ధన్వాడ రామచంద్రరావు, చాగంటి సూర్య నారాయణమూర్తి గార్లు కలసి ప్రారంభించిన ఆంధ్రా ఫార్మటికల్ వర్క్సు బాగుగా పని చేయుచున్నది. జయప్రదమైన సంస్థలలో ఇది యొకటి!

ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ :—1927 నుండి, ప్రైవేటు పార్టనర్‌షిప్ కంపెనీగా పనిచేయుచున్నది. వేమూరి విశ్వనాథశర్మగారి మిత్రులు, విద్యార్థులు స్థాపించిరి. దిన దినప్రవర్థమానమగుచున్న ఆంధ్ర సంస్థలలో ఇదియొకటి. విద్యా సంస్థలకు, వైద్య విద్యాలయములకు ఉపకరించు పనిముట్లను ఉత్పత్తి చేయుచున్నారు. ఈ సంస్థకు అనేక కార్యాలయములున్నవి. మన రాష్ట్రమేగాక, పరరాష్ట్రీయుల మెప్పునుగూడా పొందిన సంస్థ! 1937 లో దీనిని జాయింటు స్టాకు కంపెనీగా రిజిస్టరు చేసిరి. మద్రాసు, మైసూరు, ఆంధ్ర, తిరువాన్కూరు విశ్వవిద్యాలయములకు, పంచదార మిల్లులకు విరివిగా పరికరములను సరఫరా చేయుచున్నారు. గత సంవత్సరము 7% లాభాలను వాటాదారులకు పంచి పెట్టినారు. ఇంకనూ ఈ పరిశ్రమకు మంచి భవిష్యత్తు గలదని ఆశించవచ్చును!

పండ్లు, వానిని నిలువ జేయుట :— తెలుంగునాడులో మామిడి, నిమ్మ, నారింజ, అనాస పండ్లు సమృద్ధిగా లభ్యపడును. తగినట్టి తరుణములో ఇవి అతి చౌకగా దొరకును. అకాలమున దొరకవు. విదేశములనుంచి డబ్బాలలో పండ్లు నిలువచేసి మనకు దిగుమతి చేయుట మీరెరుగుదురు! ఆస్ట్రేలియా ఆఫ్రికా, అమెరికాల నుండి డబ్బాలలో పండ్లను పెట్టి నిలువచేసి, మన కెగుమతి చేయుచున్నారు. ఇట్టి సరకు దాదాపు $1\frac{1}{2}$ కోట్ల రూపాయల విలువకలది మనకు వచ్చును. మన రాజధానిలో

జెల్లీలకు 10 లక్షల రూపాయలు పెట్టుచున్నారు. ఈ పండ్లు నిలువజేయు పరిశ్రమను కాలిఫోర్నియాలో నాతో చదువుకొని, బొంబాయిలో అనుభవము పొందిన డి. సూజాగారి సహాయముతో పర్వతనేని రామకృష్ణయ్యగారు, మరికొందరు బెజవాడలో స్థాపించి పనిచేయుచున్నారు. పండ్ల రసములు, జాము, టొమేటో రసము, రొయ్యలు నిలువ జేసెదరు. మన రాజధానిలోను, హైదరాబాదు, బొంబాయిలలోను వీరు నిలువచేసిన సరకు ఖర్చగుచున్నది. కాంగ్రెస్ ప్రభుత్వము ఈ కంపెనీ వాటాలు కొన్ని కొని సహాయపడ నిశ్చయించినది. మన ప్రాంతముల ఇట్టి పరిశ్రమ మరియొకచోటలేదు. ఇది కర్నూలు జిల్లాలో గృహ పరిశ్రమగానున్నది. ముమ్ముందు వాల్తేరు నౌకా నిర్మాణ కేంద్రాభివృద్ధితో ఈ పరిశ్రమ అభివృద్ధి కాగలదు.

రంగులు :—మన గృహములకు, ఆఫీసులకు విదేశముల నుండి వచ్చును. కాశీవిశ్వవిద్యాలయములో శిక్షణ పొందిన ఒక యువకుడు, బ్రహ్మాండం నరిసింహ్వాంగారి తోడ్పాటుతో తెనాలిలో ఈ పరిశ్రమ స్థాపించెను. వీరు తయారు చేసిన రంగులు మద్రాసు పారిశ్రామిక కేంద్ర ప్రదర్శన శాలలో ప్రదర్శితమై యున్నవి. ఈ రంగులకు యింజనీరింగ్ శాఖవారు ప్రోత్సాహమిచ్చిరి. మద్రాసులో యిప్పుడు ఇట్టి పరిశ్రమ నెలకొల్పబడినది. అభివృద్ధికి రాదగిన పరిశ్రమలలో ఇది యొకటి.

సిరా :—తెనాలిలో సుప్రసిద్ధ నీల్ కాల్ సిరాను తయారుచేసి, అనేకచోట్ల అమ్ముచున్నారు. కృష్ణవేణి సిరా అను పేర ఆంధ్రులు తయారు చేయుచున్నారు. అయినను విదేశ సిరాల అమ్మకము మన ప్రాంతముల ఆగిపోలేదు! ఇంకను దిగుమతి యగుచున్నది.

పెన్సళ్లు :—ఈ పరిశ్రమను మద్రాసు ప్రభుత్వము ప్రారంభించి నష్టపడినది. మన ప్రభుత్వమువారి కర్మాగారమును హాబ్ అండు కో వారుకొని, మద్రాసు పెన్సిల్ ఫ్యాక్టరీ యను పేర నడపుచున్నారు. కాంగ్రెస్ ప్రభుత్వమువారు ఈ పరిశ్రమకు కూడా ప్రోత్సాహమిచ్చిరి. జిల్లా బోర్డులు మ్యునిసిపాలిటీలు మొదలైన సంస్థలు ఈ పెన్సళ్లనే ఉపయోగించునట్లు చేసిరి. మన దేశమునకు దిగుమతియగు 10 లక్షల రూపాయల విలువగల పెన్సళ్లలో మన రాజధానిలో 2 లక్షల రూపాయల పెన్సళ్లు ఖర్చగును. అనకాపల్లిలో కాసాల నారాయణరావుగారు (1904) పెన్సళ్లు తయారు చేయుట ప్రారంభించిరి. కాని సాగలేదు. మన దేశపు పెన్సళ్లు విరివిగా మనమే ఉపయోగించవలెను.

పింగాణీ పరిశ్రమ :—విశాఖపట్నంలోను, గుంటూరు జిల్లాలోను, రాజమహేంద్రవరములోను పింగాణీ పరిశ్రమకు కావలసిన ముడి పదార్థములు విరివిగా లభించును. ఈ ప్రదేశములలో ఈ పరిశ్రమను నెలకొల్పుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. మనకు పింగాణీ సామానులు ఆస్ట్రేలియా, చైనా, జపానులనుండి ఎగుమతి చేయబడుచున్నవి. ఆంధ్రులు, పురం ప్రకాశరావుగారు మదరాసులో



ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీలో విద్యాలయములకుపకరించు శాస్త్ర పరికరముల తయారుచేయుట.

# మద్రాస్ ఎనామెల్ వర్క్సు లిమిటెడ్

**65, సిడెన్‌హామ్స్ రోడ్, మద్రాస్.**

స్థాపితము 1934

## ఆంధ్ర పరిశ్రమ

మూలధనము రూ 2,00,000 లు



ఫ్యాక్టరీ దృశ్యము

మానేజింగ్ ఏజెంట్లు; డైరెక్టర్లు :

1. పురం ప్రకాశరావుగారు
2. కంచర్ల రామబ్రహ్మంగారు

ఇతర డైరెక్టర్లు :

3. ఎఫ్. కె. గుహ, సెరామిక్ ఎక్స్పర్ట్.
4. సి. ఆర్. శ్రీనివాసన్ గారు, రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా డైరెక్టరు.
5. డాక్టర్. కె. ఎన్. కేసరిగారు, కేసరికుటీరము, రాయపేట.
6. ధారా విశ్వేశ్వరరావుగారు, వర్తకులు, ఆంధ్రా బ్యాంకు డైరెక్టరు.
7. వంకాయల భాష్యకార్లుగారు, ,, ,,
8. ఎస్. బి. పి. పట్టాభి రామారావుగారు, కపిలేశ్వరపురము జమీందార్లు.
9. మాజేటి వెంకటనాగభూషణరావుగారు, ఆంధ్రా ఇన్సురెన్సు కంపెని డైరెక్టరు.



ఆఫీసు

భారతదేశ పరిశ్రమలలో ఈ మద్రాస్ ఎనామెల్ వర్కు పరిశ్రమ పెద్దపరిశ్రమ ఇక్కడ పలు విధములయిన పింగాణి గిన్నెలు, పళ్లెములు, పాత్రలు, సైన్ బోర్డులు అందముగా తయారగుచున్నవి.

ఇంత పెద్ద పింగాణి పరిశ్రమ దక్షిణ దేశమందు మరియెక్కడను లేదు.



ఫర్నెస్ శాఖ

ఈ ఫ్యాక్టరీలో తయారగు వస్తువులు భారత దేశమందే కాక బర్మా, సిలోన్, మలేయా, రాష్ట్రములందును విరివిగా అమ్మబడుచుండెను.

---

ఈ యుద్ధసమయములో దిగుమతులు రాని కాలములో ఈ పరిశ్రమ వల్లనే మిలిటరీవారి అవసరములకు ఎక్కువగా పింగాణి వస్తువుల సరఫరా జరుగుచున్నది. అందువల్ల మామూలు మార్కెట్ వ్యాపారము ప్రస్తుతము తక్కువచేయవలసి వచ్చినది; గాని, కొద్దికాలములో ప్రజలసేవ మరల మునుపటివలెనే చేయగలదు; ప్రజాదరణ సైతము మరల పొందగలదు.

220C

## దినదిన మభివృద్ధి పొందుచున్న పరిశ్రమ.

ప్రభుత్వమువారి అనుమతి పొందిన ఇండియన్ స్టోర్సు డిపార్ట్‌మెంట్ (కొనుకోలుశాఖ)వారి పట్టికలో ఈ పరిశ్రమ పేరు చేర్చబడినది. అట్లనే మైసూర్, కొచ్చిన్, తిరువాన్‌కూరు, మొ॥ రాజ్యములందును ప్రభుత్వ సమ్మతి బడసిన పరిశ్రమ.



మెషీనరీ శాఖ



సైన్ బోర్డుల శాఖ

మొట్టమొదట సైన్ బోర్డులనుమాత్రమే తయారు చేయుటకు ఏర్పడిన ఈ పరిశ్రమ శీఘ్రకాలములో వృద్ధి బొంది పింగాణీ గృహ పరికరముల పరిశ్రమగాకూడ పరిణమించి ప్రసిద్ధి పొందినది.

గృహోపకరణములు, ఆస్పత్రి పరికరములు విద్యుద్దీపాచ్ఛాదనములు, ఇంకను పలువిధములయిన పింగాణీ వస్తువులు తయారుచేయు ఉన్నత ఆంధ్ర పరిశ్రమ.



తయారైన పింగాణి సామానులు

# మానేజింగ్ ఏజెంట్లు



## పురం ప్రకాశరావుగారు

జననము 1902 సం॥ బందరు, కృష్ణాజిల్లా.

ఈ ఎనామెల్ వర్క్సు పరిశ్రమకు మానేజింగ్ ఏజెంటుగా మద్రాసులోనే ఉండి పరిశ్రమవ్యవహారములను నడుపుచున్నారు. సర్వకళాశాలలో ఉన్నతవిద్య నభ్యసించి ఆంగ్ల హిందీ భాషలనునేర్చి తమబుద్ధి కుశలతతో వాణిజ్య వ్యాపారములను చేయుటలో గొప్ప చతురత, సమర్థత పొందినవారు. కళాకోవిదులు, ఆంధ్రోద్యమమునకుసహాయులు. పెద్దపలుకుబడిగలవారు, శ్రీమంతులు.

## కంచర్ల రామబ్రహ్మంగారు

జననము 1898 సం॥ బందరు.

ఎంజినీరింగ్ కళాశాలలో విద్యనేర్చినవారు. అనేక పరిశ్రమలతో సంబంధము గలవారు. విశాఖపట్నం ఎలెక్ట్రిక్ సప్లై కార్పొరేషన్ డైరెక్టరు, ఆంధ్రా బ్యాంకు డైరెక్టరు. వైశ్య యువజన సంఘాధ్యక్షులు. హరిజనులకొరకు దేవాలయము కట్టించి గాంధి మహాత్ము నిచే ప్రతిష్ఠ చేయించిరి. దానధర్మములు చేయునుదారులు; శ్రీమంతులు.



'మద్రాసు ఎనామిల్ వర్క్సు' అను ఒక కంపెనీని స్థాపించిరి. ఈ కంపెనీని 1934 లో పురం ప్రకాశరావు, కంచెర్ల రామబ్రహ్మంగార్లు స్థాపించిరి. ప్రకటన బోర్డులు, రిఫ్లెక్టర్లు, ప్లేటు, కప్పులు మొదలైనవి తయారు చేయబడుచున్నవి. అభివృద్ధి నందుచున్న ఆంధ్ర సంస్థలలో ఇది యొకటి.

బంగాళా పెంకులు :—తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురం ప్రాంతములో మేలురకపు ఎఱ్ఱని జిగురుమట్టి దొరకును. ఈ మట్టి పెంకులు, బంగాళా పెంకులు చేయుటకుపయోగించును. ఇక్కడకు దగ్గరగానున్న సామర్లకోటలో రెండు మూడు బంగాళా పెంకులుచేయు ఫ్యాక్టరీలువున్నవి. బిళ్ల పెంకులు, మూల పెంకులు, చిమ్నీ పెంకులు కూడా తయారు చేయబడుచున్నవి.

ఫౌంటెన్ కలములు :—రాజమహేంద్రవరమున రత్నం బ్రదర్సువారు, రత్నం కలములను పేర, చక్కని కలములను తయారు చేయుచున్నారు. పాళీలు బాగా వ్రాయును. గాంధీగారుగూడ ఎక్కువ ప్రశంసించిరి. ఈ గ్రంథం ప్రారంభం, ఎక్కువ భాగము రత్నంకలముతో వ్రాయబడెను. వలయునన్ని సప్లయి చేయలేక పోతున్నారు. దీనిని పెద్ద సంస్థగా చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. కలకత్తాలో గుప్తా కంపెనీ, దయాల్బాగు సంస్థ తప్ప మన దేశములో ఈ కలముల పరిశ్రమ లేదు.

పలకలు :—కర్నూలు జిల్లా మార్కాపురములో పలకరాతి గనులున్నవి. రాజధాని కంతకు యిచ్చటనుండి పలకలు సప్లై చేయబడుచున్నవి. ఈ పరిశ్రమ మన ఆంధ్రుల ప్రధాన పరిశ్రమలలో నొకటి !

కుండలు, చైనా పాత్రలు :—పెంకులు, తూములు, గిన్నెలు, కప్పులు చేయుటకు కావలసిన వస్తుజాలము గోదావరి జిల్లాలో దొరకును, రాజమహేంద్రవరమున ఈ పరిశ్రమను ప్రారంభించిరి. గుంటూరు జిల్లా తాడేపల్లి దగ్గర పెంకు, పింగాణీ పరిశ్రమకు ప్రయత్నములు చేయుచున్నారు. రాజమహేంద్రవరమున ఆంధ్రఇంజనీరింగుకంపెనీవారు జపానువానితో ప్రారంభించిరిగాని సాగలేదు.

బొమికల పొడి :—ఎరువులకు పనికివచ్చును. సామర్లకోట, విశాఖ పట్నములలో ఎముకలపిండి తయారుచేయు కర్మాగారము లున్నవి.

రైల్వే కర్మాగారములు :—వాల్తేరు, గుంతకల్లు, బిట్రగుంటలలో పెద్ద పెద్ద రైల్వే కర్మాగారములున్నవి. కూలీలు అనేకులు పనిచేయుదురు. మరమ్మతు పనిముట్లు తయారగును. బెజవాడ, ధవళేశ్వరములలో యింజనీరింగ్ కర్మాగారము లున్నవి.

గాజు పరిశ్రమ :—ఆంధ్ర దేశములో గృహపరిశ్రమగా గాజులను తయారు చేయుట పూర్వము అన్ని జిల్లాలలోనూ ఉండెను. ఇప్పుడు విశాఖపట్నం జిల్లా పైడిసాల, గొంపలోను ; నెల్లూరు జిల్లా ఉదయగిరిలోను ; పశ్చిమ గోదావరి జిల్లా తడికలపూడి, చిక్కాల గ్రామాదులలోను ; చిత్తూరు జిల్లాలో సోమపాలెం, మద్దివేడులలోను ; అనంతపురం, గుంటూరుజిల్లాలలోను ; బళ్లారి జిల్లా ముచ్చిగేరి, నర్సన్నపురములలోను ; కర్నూలు జిల్లా ద్రోణాచలంలోను తయారు చేసెడివారు. కొన్ని ప్రదేశముల ఈ పరిశ్రమ సాగుచున్నది. తూ॥ గో॥జిల్లా రాగంపేటలో లింగబలిజ కుటుంబీకులు గాజు పాత్రలనుకూడా చేయుచున్నారు.

గాజు పరిశ్రమకు కావలసిన ముఖ్య పదార్థములు :—

| పదార్థము | పాళ్లు |
|---|---|
| ఇసుక (మేలురకం) | 23 |
| సోడా—ఏష్ | 67 |
| సున్నము లేక సున్నపు రాయి | 10 |
| | 100 |

పై పదార్థములన్నీ ఆంధ్ర దేశమున దొరకును. సోడా-ఏష్ విదేశములనుండి తెప్పించుకొనవచ్చును. ఈ గాజు సామానులు తయారుచేయు పరిశ్రమాగారం ఆంధ్రదేశమునకు ఎక్కువ అవసరము.

నూనె మరలు :—గుంటూరు, బెజవాడ, అనకాపల్లి, బందరులలో వేరుశెనగ నూనె తీయు మరలున్నవి.

సారాయి :—వాల్తేరు, తాడిపత్రులలో సారాయి తీయు మరలున్నవి. ఆంధ్ర జిల్లాలలో చెప్పుకొనదగిన పరిశ్రమలలో నివి కొన్ని.

పొగాకు :—గుంటూరు జిల్లాలో వర్జీనియా పొగాకు పెంచిరి. దీనిని కంపెనీ పొగాకు అందురు. అమెరికా, ఇంగ్లండు కంపెనీలు వర్తకము చేసుకొనుచు ఈ ప్రాంత

ములలో నున్నవి. చీరాల, మంగళగిరులలో పొగాకు ఫ్యాక్టరీలు కలవు. గుంటూరు, గోదావరి జిల్లాలలో పొగాకు బారన్సు విస్తారముగాకన పడును. తూ॥ గో॥ జిల్లా అనపర్తివద్ద పెద్ద ఫ్యాక్టరీ గట్టుచున్నారు. పొగాకు పదునుచేయు పరిశ్రమకు అధికమైన పెట్టుబడి, యంత్ర సహాయము కావలెను. ఈ పరిశ్రమ ఎక్కువగా ఐ. యల్. టి. డి., బ్రిటిష్ ఇండియా టొబాకో కంపెనీలగు విదేశీయుల చేతులలో నున్నది. రైతులకు ధరవారా నిర్ణయింతురు. గుంటూరు మున్నగు చోట్లనుండి, జపాను ఇంగ్లాండు దేశములకు ఏకా మున్నగువారు వెళ్లి, వర్తకము ప్రారంభించి జయప్రదముగా సాగించుచున్నారు.

ఆంధ్ర దేశమున మొత్తము మీద $1\frac{1}{2}$ కోట్ల రూపాయల విలువగల ఈ కంపెనీ పొగాకు వర్తకము ప్రతి సంవత్సరమున్నూ సాగుచున్నది. ఇందు దాదాపు 80 లక్షల రూపాయల విలువ గల వ్యాపారము విదేశీయుల చేతిలో నున్నది. ఆంధ్ర దేశమంతటనూ ఈ పొగాకు పరిశ్రమ వ్యాపకములోనున్నది. ఇందు పనిచేయు కూలీలు రమారమి 10 వేలుందురు.



బాబు రాజేంద్ర ప్రసాదుగారు విశాఖపట్టణ నౌకానిర్మాణకేంద్రమునకు శంకుస్థాపనము చేయుట.

నౌకా పరిశ్రమ :—పూర్వ మొకప్పుడు ఆంధ్ర నౌకలు శ్రీకాకుళంనుండి జావా, సుమత్రా ద్వీపములకున్ను; సింహళము, అరేబియా, రోము, గ్రీసు, దేశములకున్ను వెళ్లి వర్తకముచేసినట్లు మీకు తెలియును. ఆంధ్రదేశములో మోటుపల్లి, కోరంగి, తాళ్లరేవు, వాడరేవు, మొదలైన రేవులు వెలసినవి. ఇక్కడ ఓడలు కట్టెడివారు. బ్రిటిష్ పాలనా కాలమున ఈ పరిశ్రమ మన దేశమున అడుగంటినది.

ఒక్క, వాల్చంద్ హీరాచందుగారి సింధియా స్టీము నావిగేషన్ కంపెనీకి మాత్రము రంగూనుకు, ఇతర దేశములకు జనులను, సామానులను కొని పోవుటకు ఏర్పాట్లు చేసిరి. ప్రస్తుత యుద్ధపరిస్థితుల ననుసరించి, హిందూ దేశమున నౌకా నిర్మాణమునకు ఏర్పాటులు చేయుచున్నారు. అందులోనూ, ఆంధ్రదేశమే దీనికి ప్రధాన రంగము కావలసి వచ్చినది! విశాఖపట్టణమే ఉత్తమ నౌకా నిర్మాణ కేంద్రముగా, నౌకా నిర్మాణమునకు కావలసిన నీరు, భూమి, కూలీ, అన్నీ అచట యుండుటచే, నిశ్చయింపబడినది. ఇచ్చట 1941 లో, నౌకా నిర్మాణ కేంద్రమునకు బాబూ రాజేంద్రప్రసాదుగారు శంఖుస్థాపనము చేసిరి. ఇది ఆంధ్ర పారిశ్రామిక, వ్యాపార చరిత్రకు ముఖ్య అధ్యాయము. అనేక భారతీయ నాయకులు ప్రముఖులు ఈ పరిశ్రమాలయమునకు విచ్చేసి ఆశీర్వదించిరి. గాంధీ గ్రామం అని పేరుపెట్టబడిన ఈ నౌకా నిర్మాణ కేంద్రం శీఘ్రముగానే అనేక స్టీమర్లను తయారుచేసి, భారత దేశ విఖ్యాతికి దోహదం కాగలదని ఆశించవచ్చును! 1941 సం॥లో అచ్చట డాక్‌యార్డులు కట్టుట పూర్తి అయినది. ఈ పరిశ్రమలో 70 వేల మంది నియోగింపబడతారనిన్నీ, మొదటి ఆరుమాసములలోనున్నూ 8 స్టీమరులు, అటుపిమ్మట

సాలు 1-కి 18 స్టీమర్ల చొప్పున తయారుచేయుట కవకాశము లున్నవనిన్నీ హీరాచందుగారు అంచనా వేసిరి. ఈ పరిశ్రమ అభ్యున్నతితో ఆంధ్రనౌకలు మరల దివ్యవిహారము చేయ గలవు. రంగూను మొదలగు రేవు పట్టణముల మన కూలీ లకు పనులు పోయిన పిమ్మట ఈ పరిశ్రమ ఆంధ్రదేశమునకు వచ్చుట ఆంధ్రుల అదృష్టమే!

విశాఖపట్నం హార్బరు :—ఈ సందర్భంలో భారత దేశాని కంతటికీ ప్రఖ్యాతిగాంచిన విశాఖపట్నం హార్బరును గురించి, పట్నమును గురించి ప్రస్తావించవలసి యున్నది. విశాఖపట్నమునకు దక్షిణముగా సముద్రములోనికి చొచ్చు కొని ఒక కొండయున్నది. ఇక్కడ సముద్రము లోతు ఎక్కువ. పర్వతం ప్రక్కనే, విశాఖపట్టణాన్ని వేరు పరచే ఒకచిన్న ఏటిని లోతు చేసి, విశాఖ పట్నానికి పశ్చిమంగా ఆరు మైళ్లు విస్తీర్ణంగల లోతైన సరోవరం త్రవ్వి, ఆ సరోవరాన్ని ఏటిగుండా సముద్రములో గలిపిరి. ప్రపంచములోని అన్ని దేశముల స్టీమర్లు ఈ ఏటిగుండా హార్బరులోనికి వచ్చి లంగర్లు వేయును. మధ్య పరగణాల లోని రాయపూర్‌తో ఈ విశాఖపట్టణాన్ని కలపడము వల్ల, (బి. యన్. రైల్వేద్వారా) ఈ రేవు ప్రాముఖ్యత అధిక మైనది.

విశాఖపట్టణమునుంచి ఎగుమతి అయ్యే ముఖ్య పదార్థ ములలో మాంగనీసు, కరక్కాయలు, ఆవాలు, గానుగ పిండి ముఖ్యములైనవి.

గృహ పరిశ్రమలు :—మన గృహ పరిశ్రమలు, వాటి పూర్వ చరిత్ర, పతనము, ప్రస్తుత పరిస్థితులనుగురించి ఈ ఖండమున ముచ్చటింతము. ఈ గృహ పరిశ్రమలనే కుటీర పరిశ్రమలందురు. ఇదివరలో చెప్పినట్లు విశేషమంది ఈ పరిశ్రమలలో పాల్గొన నవసరములేదు. ఈ చిన్న పరిశ్రమలను పట్టణములలోను, పల్లెలలోను స్థాపించవచ్చును. పట్టణములలో ఈ పరిశ్రమలపై ఆధారపడియుండువారికిన్నీ,



మద్రాసు ఇండస్ట్రియల్ మ్యూజియమ్‌లో మాజీ మంత్రులు టి. ప్రకాశం పంతులు. వి. ఐ. మునిస్వామి పిళ్లగార్లకు కార్యదర్శి మా. బాపినీడుగారు కంబళ్లను చూపించుట.

గ్రామములలో యీ పరిశ్రమలపై ఆధారపడియుండు వారికిన్నీ భేదము గలదు. గ్రామీణులకు సాధారణముగా ఇది ఉపవృత్తిగా నుండును. వారికి వ్యవసాయము జీవాధారము. పెట్టుబడి అంతగా అవసరములేదు గాబట్టి పరిశ్రమలు నష్టకరముగాజాలవు. ఈ యంత్రయుగమున చిన్నచిన్న పరిశ్రమల ప్రయోజన మేమని ప్రశ్నింపవచ్చును. అదేగాక, కొంద రసలీ విషయమును అవగాహనము చేసికొనక, గాంధీ—ఖద్దరు ఉద్యమమును ఆక్షేపింతురు. హిందూ దేశములో నూటికి 90.7 గురు గ్రామస్థులు. నూటికి 9.3 గురు పట్నవాసులు. మన రాజధానిలో నూటికి 88 పల్లెలు, 12 బస్తీలు గలవు. అందుచేత వ్యవసాయముతోపాటు, నూటికి 90 మందికి పైగా పరిశ్రమ ఉపవృత్తిగా నుండవలెను. కొన్ని పెద్దపెద్ద మిల్లులున్ననూ, జనసంఖ్య పెరుగకున్ననూ మన మిల్లులు నూటికి 6 గురినిగూడా పోషించు పరిస్థితిలోలేవు. పారిశ్రామిక అభివృద్ధిపొందిన జపాను, జర్మనీలలో గృహపరిశ్రమలు ఎట్లున్నవో గమనించుట ఉచితము. జపానులో పింగాణీ వస్తువులు, గుండీలు, పెన్సల్లు మొదలగు నవన్నియు గృహములలో స్త్రీలు, బాలురు పాల్గొని తయారు చేయుదురు. అక్కడ కుటీరములలోను పల్లెలలోను సగము సరుకు తయారగును. ఒక్కొక్క కేంద్రమునకు 500 మంది కూలీలుగల పారిశ్రామిక ప్రదేశములలో నూటికి 30 వంతులు సరకు తయారగును. 50 మందికి తక్కువ కూలీల గలిగియుండు కర్మాగారములలో సగము సరకు తయారగుచున్నది. జర్మనీలో 8 వ వంతు ప్రజలు యీ గృహ పరిశ్రమలపై ఆధారపడియున్నారు. మన దేశమున కమ్మరి, కుమ్మరులవలె సంప్రదాయముగా కుల వృత్తుల ననుసరించువారు అనేకులు గలరు.

మన దేశమునకు వ్యవసాయము తరువాత చేనేత పరిశ్రమ ముఖ్యమైనది. ఇది ఉపవృత్తిగా అనేకులు బ్రతుకుచున్నారు. మనకు కావలసిన 625 కోట్ల గజముల బట్టకు, మన మిల్లులు 400 కోట్ల గజములు మాత్రమే తయారు చేయును. 75 కోట్ల గజములు విదేశములు దిగుమతి చేయును. మిగిలినది మన మగ్గములమీద తయారగుచున్నది. ఈ ఉద్యమముతో రానురాను విదేశ వ్యాపారము వెనుకబడుచున్నది. మన గ్రామ పరిశ్రమలవల్ల పెట్టుబడిదారుని నిరంకుశత్వముగానీ, దాని దుష్టఫలితములుగానీ వ్యాప్తి చెందవు. కూలీలకు స్వేచ్ఛ, అనురాగము ఉండుటకు గృహపరిశ్రమలు తోడ్పడును. మిల్లు యజమానులు, అధికారులు తమ అధికారముల ఎట్లు పెంచుకొనుచున్నారో చూడండి! మనకు 480 మిల్లులు పలుకుబడిగల కంపెనీల యాజమాన్యము క్రింద నున్నవి. నార తీయుట, బొగ్గు, పంచదార మొ॥ పరిశ్రమలకు సంబంధించిన కర్మాగారములు 54 కంపెనీల ఆధీనములో నున్నవి. యీ కంపెనీలకు 1780 మంది డైరక్టరు లున్నారు. 75 మంది, వీరిలో 1000 డైరెక్టరు పదవుల స్వీకరించిరి. కాలము మారినది. ప్రభుత్వములు ప్రజాయత్తము కావలసిన ఇట్టి తరుణములలో అధికార ప్రాబల్యము పోవలెనన్న, గ్రామ పరిశ్రమలు అభివృద్ధి చెందవలెను. పెద్దపెద్ద మరలకు, విదేశపు ఓడలకు, కూలీలకు, ఇన్స్యూరెన్సు ఖర్చులు మున్నగునవి చెల్లించవలెనన్న విషయము విస్మరింపరాదు!



ఏలూరు దగ్గిరి పూళ్లలో గృహపరిశ్రమయగు తాటిక్రతో చేసిన చేతిక్రను మాజీ గవర్నరు ఎరిస్కిన్‌గారికి స్వదేశీవస్తు ప్రదర్శనశాలలో కార్యదర్శి బహూకరించుట. ఇవి చాల ప్రదర్శనములలో బహుమతులంది చాలమందికి జీవనాధారముగ నున్నది.

గ్రామ పరిశ్రమలు ఎట్లు నిలువగలవు? :—పరిశ్రమలు అవసరమైనను అవి నిలుచుట ఎట్లు? అవి మరల పోటీకి ఆగుట ఎట్లు? అసలు, మన దేశ పరిస్థితులనుబట్టి పేదలు, తరతరముల నుండియు కుటుంబ సంప్రదాయానుసారముగా కులవృత్తుల జేసుకొని, జీవనము చేయుచున్నారు. బొమ్మలు చేయుట, దంతము చెక్కడములు, తివాసీల నేత మొదలైన కళావస్తునిర్మాణము యంత్రముల పనిగాదు. దీనికి శిల్పి హస్తమే సిద్ధ హస్తము! నైపుణ్యము, ప్రాణముగల చైతన్య శక్తి గావలెను. అమెరికాలోవలె పాలు పిదుకుటకు, దుంపలు కోయుటకు, బట్టలుదుకుటకు మన కిప్పుడు మరలు లేవు. అందుచేత మన దేశపు ప్రస్తుత ఆర్థిక పరిస్థితులనుబట్టి యీ గ్రామ పరిశ్రమలు నిలువగలవు. కొన్ని కొన్ని పరిశ్రమలు ప్రభుత్వ పోషణ లేక, మిల్లుల పోటీకి ఆగలేక జీర్ణించిన మాట వాస్తవము. మిల్లుల పోటీలో పడిపోకుండ వీనిని నిలుపుకొనుట మన అధీనములోనే ఉన్నది. మన గృహములలో తయారగు వస్తువులను మనము ఉపయోగించకపోవుట విచారకరమగును! యీ గృహ పరిశ్రమల అభివృద్ధి మన స్వయంపోషకశక్తికి రూపు దిద్దగలదు.

చేనేత పరిశ్రమ :—భారత దేశము చాలా కాలము నుండియు యీ చేనేత పరిశ్రమకు వాసికెక్కినది. ఎన్నో చారిత్రక కారణములవల్ల ఈ పరిశ్రమకు నష్టములు వాటిల్లి నప్పటికిన్నీ, అంతర్గతంగా మన దేశములో ఈ ప్రావీణ్యము నేటికిన్ని నిలిచియున్నది. గాంధీగారి ఖద్దరుఉద్యమ ప్రబోధము ఈ పరిశ్రమకు ప్రాణము పోసినది. చీరాలలో కారెంపూడి రమాకాంతం, పేరాలలో పెండెం కేశవులుగార్లు, అనేక శ్లోకములను, రామాయణ భారత కథా చిత్రములను బట్టలపైని, చీరలపైని నేసి అఖిల భారత ప్రశస్తి పొందిరి. భట్టిప్రోలులో అందె సుబ్బారాయుడుగారు కుట్టు లేకుండా నేతతో కోట్లు మొదలైన దుస్తులు నేసి, శిల్పాచార్య లనుబిరుదు పొందిరి. కడప జిల్లా మాధవరంలో మేలు వెంకయ్యగారు రామాయణ కథాది చిత్రములు వస్త్రములపై నేసిరి. పొందూరులో అల్లం సెట్టి అప్పయ్యకవిగారు ఈ నేతలో పేరుపొందిరి. పొందూరు పట్టుశాలీలని పేరుపొందిన నేతగాండ్రు అతి సన్నని నూలుతో పంచెలను, చీరలను నేసి, అగ్గిపెట్టెయంతటి చిన్న పెట్టెలో పట్టునట్లు చేసెడివారు. ఇది గర్వించదగిన విషయము! ఇప్పటి భారత దేశమంతటికిన్ని ఆంధ్రదేశమే యీ పరిశ్రమకు పట్టుగొమ్మయై యున్నది. ఉత్పత్తిని పట్టి చూచినను ఆంధ్రులకే అగ్రతాంబూలము. అందుచేతనే మన దేశమునకు వచ్చిన బర్నియల్, ఫాహియాన్. హ్యూన్‌త్సాంగ్ మొ॥ గు విదేశయాత్రికులు మన నేత నైపుణ్యమును స్తుతించిరి. ఇచ్చట తయారైన వలువలను ఆంగ్లేయులు అనేకవిధముల ప్రస్తుతించిరి.

మన చెన్న రాష్ట్రమున 3 లక్షల చేతి మగ్గములు గలవు. అందులో ఆంధ్ర దేశమున 1,40,000 లు గలవు. వివరణములు దిగువ పట్టికలో నుదహరింపబడినవి.

| జిల్లా | మగ్గముల సంఖ్య |
|---|---|
| విశాఖపట్టణం | 16,000 |
| తూర్పు గోదావరి | 5,000 |
| పశ్చిమ గోదావరి | 13,000 |
| కృష్ణా | 6,000 |
| గుంటూరు | 2[illegible],000 |
| నెల్లూరు | 10,000 |
| కడప | 11,000 |
| బళ్లారి | 13,000 |
| అనంతపురం | 11,000 |
| చిత్తూరు | 8,000 |
| కర్నూలు | 12,000 |
| మద్రాసు | 2,000 |

ఈ మగ్గాలపై కేవలం నూలుగాక; నెల్లూరు అనంతపురం జిల్లాలలో నారబట్టలున్నూ, గుంటూరు జిల్లాలో మాయ పట్టుబట్టలున్ను, కడప కర్నూలు జిల్లాలలో పట్టున్ను, అనంతపురం జిల్లాలో ఉన్నిన్ని కూడా నేస్తున్నారు. ఈ వృత్తిలో అనేకులు, 22 కులములకు సంబంధించినవారు జీవిస్తున్నారు. ఈ పరిశ్రమాభివృద్ధికి ఇంకా ముందు ముందు అవకాశములు ఏర్పడవలసి యున్నది.

కలంకారీ అద్దకము :—ఆంధ్రులు, కళాకాశలాన్ని దేశదేశాల చాటిన పరిశ్రమల్లో ఇది ఒకటి. క్రీ. శ. 135 సం॥ నుండీకూడా యీ పరిశ్రమకు మచిలీపట్నం ప్రసిద్ధి చెందినది. ఆంధ్ర దేశమున నెల్లూరు జిల్లాలోని ఆర్మోగాన్,

నిజాంపట్నం, కాళహస్తి, జమ్మలమడుగు, పమిడి, నర్సాపురం, పొన్నేరి, కాకినాడ, శాంథోమ్ మొదలైన ప్రదేశములలో అద్దకం పరిశ్రమ వుండెను. కాని బ్రిటిష్ పరిపాలనాకాలమున ఈ పరిశ్రమ క్షీణించినది. ఇప్పుడు గొల్లపాలెం, తుని మొదలైన ప్రదేశములలో తిరిగి యీ పరిశ్రమ ఆరంభింపబడినది. మచిలీపట్నం యిప్పటికీ యీ పరిశ్రమకు ఆయువు పట్టుగనే యున్నది. ఈ రంగులు ఎంతకాలము గడచినను చెడిపోవు. ఇది వీని ప్రత్యేకత. ఖాదీ ఉద్యమం దీనికి ఊత యిచ్చినది. నెల్లూరు, పిఠాపురం, కందుకూరులలో ఈ పరిశ్రమ అభివృద్ధి చెందుతున్నది. జాతీయ ఉద్యమములన్న అధ్యాయములో ఖద్దరును గురించి విశేషముగా వ్రాయబడినది.



బందరు అఖిలభారతచరఖా సంఘము వారిచే తయారుచేయబడుచున్న కలంకారీ అద్దకపు దుప్పట్లు.

తివాసీలు :—ఏలూరు, బందరు కేంద్రములలో ఉన్ని బట్ట నేత గలదు. మంచి రంగులువేసి లతా పుష్ప చిత్రములతో రకరకములుగా తయారు చేయుదురు. ఇంత చక్కని తివాసీలు మన దేశములో తయారగుచున్నను విదేశసరుకు వాడుక తగ్గకపోవుట విచిత్రము.

ఏలూరు, బందరు పరిసరములలో ఈ పరిశ్రమ పూర్వమునుండియుగలదు. 'ఏలూరు పైల్ కార్పెట్ వీవర్సు కోఆపరేటివ్ పర్చేజ్ అండ్ సేల్ సొసైటీ లిమిటెడ్ ' 1937లో 28 మంది సభ్యులతో ఏర్పడినది. వీరి అధీనములో 70 మగ్గములు గలవు. 2500 చ॥ గ॥ తివాసీలు ప్రతినెలా తయారు చేయుచున్నారు.

కంబళ్లు :—పశ్చిమ గోదావరి జిల్లా ధర్మాజీగూడెం లోను, అనంతపురం, కర్నూలు, బళ్లారి జిల్లాలలోను కంబళ్లు నేయుదురు. కృష్ణా, (కానుకోలు) గోదావరి జిల్లాలలో చాకరకం కంబళ్లు తయారగును. బళ్లారి, అనంతపురం జిల్లాలలో శ్రేష్ఠమైన కంబళ్లు నేయుదురు. కర్నూలు జిల్లాలోని కంబళ్లు నల్లగా మాపు కాగి, మనుబడి ఎక్కువగా నుండును.

జమ్ఖానాలు:—అన్ని రకముల అందమైన జమ్ఖానాలను అదోనిలో తయారు చేయుదురు. మిల్లు నూలుతో తయారు చేయు చున్నారు. గుంతకల్లులో గూడా ఈ పరిశ్రమ కలదు. సిల్కు జమ్ఖానాలు పెద్దాపురంలో తయారు చేయు చున్నారు.

తోళ్ల పరిశ్రమ :—ఏలూరు, రాజమండ్రి, బెజవాడలలో తోళ్ల పరిశ్రమ కలదు. తోళ్ల సామానులు చేయుటలో ఈ పారిశ్రామికులు ప్రవీణులు. ఏలూరు దగ్గర తమ్మిలేటినీరు తోళ్ల పదునుకు అనువుగా నుండును. మన రాజధానిలో ఈ పరిశ్రమ విస్తారముగా గలదు. మద్రాసుకు సమీపమున క్రోముపురము ఈ పరిశ్రమకు కేంద్రము. లబ్బీలు మదరాసున

టానరీలు పెట్టి, తోళ్లను వంగదేశ మునుండి తెప్పించి పదును పెట్టుదురు.

బొమ్మలు :—విశాఖపట్నం జిల్లాలో ఏటి కొప్పాకలో చింతలపాటి నర్సింహరాజుగారి కుటుంబపు ప్రోత్సాహముతో, రంగులరంగుల నక్కపల్లి బొమ్మలు తయారు చేయు చున్నారు. తుని, రాజమండ్రి, అనకాపల్లి స్టేషనులలో ఈ బొమ్మలను చూతుము. కొండపల్లి, శృంగవరపు కోట, లక్కవరపు కోట ప్రాంతములలో అంకుడు, నేరేడు, తొగర కర్రలు, బంకమన్ను, పేడలతోను బొమ్మలు చేయుదురు. ఈ పరిశ్రమ సర్వతో ముఖకృషికి పాటుపడి ఆంధ్రి కళాభిమానులు, మన కళావైభవమును సుప్రతిష్ఠితము చేయవలెను. బెజవాడ దగ్గరి కొండపల్లి, ఈ బొమ్మల పరిశ్రమలో స్వర్ణ తాంబూలమందు కొన్నది.

దంతపు పనులు :— విశాఖపట్టణం దంతపు పనులకు వాసి కెక్కినది. విశాఖపట్నము సముద్రతీరమున దంతపు బొమ్మలు నేత్రపర్వముగా బారులు తీర్చియుండును. అందమైన పెట్టెలు, బొమ్మలు, పెండ్లిండ్లలో బహుమతులకు ఉపయోగించు సామానులు, చిత్ర విచిత్రముగా నిచ్చట చేయుదురు. పాత్ర సామానులు స్థానికముగా అనేక చోట్ల చేయు చున్నారు. పరిశ్రమ యున్నది; కాని పోషకులు లేరు.

క్యాంపు కాట్లు, కలప సామానులు :—గుంటూరు జిల్లా నర్సారావుపేటలో ఈ పరిశ్రమ చాలా కాలమునుంచి జరుగు చున్నది. ఈ వస్తువులు రాష్ట్రమంతటా వ్యాపించినవి. ఇప్పుడు దీనికి పోటీగా క్యాలికట్టులో మరలపై ఫర్నిచరు తయారు చేయుచున్నారు. కుర్చీలు, బెంచీలు, మడత మంచములు యిచ్చట తయారగును.

కొయ్య వస్తువులు, గరిటెలు :—కొయ్యగరిటెలు నెల్లూరు జిల్లా ఉదయగిరిలో తయారగును. ఉదయగిరిలో అందమైన సామానులు చందనపు చెక్కతో తయారు చేయుదురు.



తివాశీ నేత.

లేసు :—నర్సాపురం క్రైస్తవ మిషనరీలు ఈ పరిశ్రమ నారంభించిరి. ఇది గృహ పరిశ్రమగా నున్నది. ఇంటి వద్ద స్త్రీలకిది ఉపవృత్తి. లక్షల లక్షల రూపాయల విలువైన లేసు తయారు చేయు చున్నారు. రామచంద్రపురం ప్రాంతములలో లేసే కాక, అల్యూమినియమ్, నవారు నేత, విస్తళ్లు, కత్తులు, గుండీలు, గాజులు, గోగునారసంచులు చేయుదురు. బెస్తలవలసలో కొయ్య దువ్వెనలు, కొమ్ము దువ్వెనలు, సబ్బులు, సిరాలు, బుట్టలు మొదలైనవి చేయుదురు. నవారు పరిశ్రమ వీరవల్లి తాలూకాలో గలదు. సంగంటి దొరపాలెంలో జర్మన్ సిల్వర్ తయారు చేయుదురు.

బెల్లం :—బెల్లము చేయు పరిశ్రమ రాజమండ్రి, రామ

చంద్రపురం, పెద్దాపురం, పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లి గూడెములలో గలదు. సాధారణముగా చెరకునుంచి బెల్లము, పంచదార చేయుట మన మెరిగినదే! తాటి కల్లుతో గూడా బెల్లము చేయుదురు. తాటిబెల్లపు పరిశ్రమకు పశ్చిమ గోదావరి జిల్లా ఆటపట్టు. ఈ జిల్లాలలో దీనికి నిడదవోలు, భీమవరం, ఏలూరు, తాడేపల్లిగూడెం, తణుకు, నర్సాపురం తాలూకాలు కేంద్రములు. ప॥ గో॥ జిల్లాలో 8 లక్షల రూపాయల విలువైన బెల్లము సాలీనా తయారగును.

తాటి పీచు :—కాకినాడలో, పెద్దాపురంలో, నిడదవోలు తాలూకాలో దొరకును.

లక్క పరిశ్రమ :—రంగులకు, వార్నీసులకు ఈ లక్క ఉపయోగించును. ఎలెక్ట్రిక్ సామానులు, ఫౌంటెన్ కలములు, సెల్యులాయిడ్ సామానులు మొదలైనవి లక్కతో తయారు చేయుదురు. లక్క బీహారులోని రాంచీలో విశేషముగా ఉత్పత్తి యగును. నిద్రగన్నేరు చెట్టుకు లక్క పురుగు విస్తారముగా పట్టును. ముందుముందు అభివృద్ధిచెంద దగిన పరిశ్రమలలో ఇది యొకటి!

## సినిమా పరిశ్రమ

మన దేశంలోని సినిమా పరిశ్రమ

మన దేశంలో అన్ని పరిశ్రమలలోకి అగ్ర స్థానం వహిస్తున్నడి పరిశ్రమ సినిమా పరిశ్రమ. యుద్ధంవల్ల అన్ని వస్తువులకు ధరలు యిబ్బడి కిబ్బడిగా పెరిగి పోవడంవల్ల, ఎగుమతి దిగుమతులు, ధారాళంగా సాగడానికి ఆటంకం ఏర్పడడంవల్ల, ఈ పరిశ్రమకు ప్రతిబంధకాలు అధికంగా ఏర్పడినవి. అయినప్పటికీ, నీలాంబరంలో నల్లటిమేఘాలచుట్టూ మెరపుతీగ మెరిసినట్లు, ఇట్లాంటి పరిస్థితిలోనూ చిత్రాలు యుద్ధ ప్రచారానికీ, జ్ఞాన ప్రచారానికీ సాధనంగా ఉపయోగించ బడటంవల్ల వాటికి ఉచిత స్థానం, ప్రాధాన్యము వస్తున్నది.

హిందూదేశంలో 50 ఫిల్ముస్టుడియోలు, 150 ఫిల్ము నిర్మాణ కేంద్రాలు పని చేస్తున్నవి. వీటిమీద సుమారు 14 కోట్ల రూపాయల పెట్టుబడి వున్నది. ఈ పరిశ్రమ దాదాపు 40 వేలమంది నిరుద్యోగులకు మనదేశంలో పని కల్పించినది. అన్ని ఫిల్ము కంపెనీలవారుసగటున 15 లక్షల రూపాయలు, ఫిల్ములను ఒకచోటు నుంచి ఇంకొక




చక్కని వివిధ రకముల తివాసీలు ఉత్పత్తిచేయు నేతగాండ్రకు సహాయముచేయు ఏలూరు సహకార సంఘమువారు.



జాతీయ జీవన ఆశాలతకు కలకలలాడే కాపురరంగం పట్టుగొమ్మ.

మగనిపట్ల భార్య, భార్యపట్ల మగడు

తన ధర్మాన్ని నిర్వర్తించకపోతే కాపురం కడగండ్లపాలవుతుంది.

ఆమె తన సతీత్వధర్మాన్ని నిలబెట్టుకొంది ;

ఆయన తన ధర్మాన్ని నెరవేర్చలేక పతితుడయ్యాడు.

కాపురరంగంలోని ఈ ఇద్దరు జీవుల మానసికతత్వాన్ని

ఉజ్వలసన్నివేశాలద్వారా చూపెట్టే చిత్రమే

శ్రీ రాజ రాజేశ్వరీ వారి

# సుమతి

DIRECTED BY K. NAGABHUSHANAM

మొట్టమొదటి 'షాట్'
నుండి ఆఖరు 'ఫేడ్ అవుట్'
వరకు కథావాహిని
కమనీయభంగిమలతో
పరుగెడ్తుంది.

✳

సంయుక్త దర్శకుడు :
జి. ఆర్. రావు

●

మాటలు :
మొ. నరసింహశాస్త్రి

●

గానము :
పద్మనాభశాస్త్రి
దినకరరావు

●

ఛాయాగ్రహణము :
కమల్ ఘోష్

●

శబ్దము :
పి. రంగారావు

●

స్టూడియో :
జమినీ

✳

—తారాగణము :—

కన్నాంబ
సి. ఎస్. ఆర్
బళ్ళారి లలిత
రామకృష్ణశాస్త్రి
ఆరణి
పద్మావతిదేవి





జగదీశ్ ఫిల్మ్సు డైరెక్టరు, నటకులు శ్రీ వై. వి. రావు.

చోటుకు పంపడానికి రైళ్లకున్నూ; ఆదాయములో 25 వ వంతు వినోదపుపన్ను మొదలైన పన్నుల క్రింద ప్రభుత్వమునకున్నూ చెల్లిస్తున్నారు, మొదటి టాకీలు 'జాజ్ సింగర్' 'సింగింగ్ ఫూల్' అనేవి వార్నర్ బ్రదర్సువారు 1925 లో తయారుచేసిరి. 1931 వ సంవత్సరములో, శ్రీ ఎచ్. యం. రెడ్డిగారి ప్రహ్లాద మొదటి విడుదలైన తెలుగు చిత్రము!

**తెలుగు సినిమా పరిశ్రమ**

ఆంధ్ర దేశములో ఈ సినిమా పరిశ్రమ ప్రారంభింపబడ్డది స్థూలముగా 1927 వ సంవత్సరములోనే అని చెప్పవచ్చును. శ్రీ సీతారామాంజనేయ నాటక సభ వ్యవస్థాపకులు, మోతే నారాయణరావుగారు ఆ రోజులలో, మద్రాసులో 'గ్యారంటీ ఫిల్మ్స' అను కంపెనీని స్థాపించి, ఆర్. ఎస్. ప్రకాశ్ గారికి చిత్ర నిర్మాణాధ్వర్యం యిచ్చిరి.

టాకీయుగం ఆరభించిన తర్వాత గూడా తెలుగు సినిమా కంపెనీలు పనిచేస్తూనే వున్నవి. అప్పటినుంచీ తయారైన తెలుగు చిత్రాల సంఖ్య ఈ క్రింది పథకం చూపిస్తున్నది.

| సంవత్సరం | నిర్మింపబడ్డ చిత్రాలు. |
|---|---|
| 1931 | 1 |
| 1932 | 2 |
| 1933 | 6 |
| 1934 | 3 |
| 1935 | 7 |
| 1936 | 11 |
| 1937 | 9 |
| 1938 | 11 |
| 1939 | 12 |
| 1940 | 12 |
| 1941 | 16 |
| 1942 | 15 |

1940 వ సంవత్సరంలో: మైరావణ, భోజ కాళిదాసు, మాలతీ మాధవం, చండిక, సుమంగళి, కాలచక్రం, బ్యారిష్టరు పార్వతీశం, బోండాం పెళ్లి, చదువుకున్న భార్య, ఇల్లాలు, జీవనజ్యోతి, విశ్వమోహిని, మీరాబాయి, భూకైలాస్ అను చిత్రాలు విడుదలైనవి.

1939 వ సంవత్సరం వరకూ, ఒక చిత్రం తయారు చేయడానికి సుమారు 50 మొదలు 75 వేలదాకా ఖర్చయ్యేది. పైని ఉదహరించినట్లు, యుద్ధంవల్ల ముడిసరుకు ధర పెరిగి, ఒక్క చిత్ర నిర్మాణానికి లక్ష రూపాయలదాకా ఖర్చవుతున్నది. ఇప్పటికి 50, 60 లక్షల రూపాయల



రోహిణీ పిక్చర్సు డైరెక్టరు శ్రీ ఎచ్. ఎం. రెడ్డి.



వాహినీ పిక్చర్సు డైరెక్టరు శ్రీ బి. ఎన్. రెడ్డి.

పెట్టుబడి తెలుగు సినిమా పరిశ్రమలో వున్నది. ఆంధ్రుల డబ్బు, ఆంధ్రులలో నిరుద్యోగం పోగొట్టడానికి అభివృద్ధి దాయకంగా వినియోగింపబడుతున్నది ఈ పరిశ్రమలోనే. కానీ, అనుభవం లేనివారు కొందరు, లాభాలు గడించుటకై ఈ పరిశ్రమలో ప్రవేశించి, అనేక కంపెనీలు స్థాపించి, నడప లేక నష్టపడటం, కొందరు ప్రజలను నష్టపరచడం గూడా జరుగుచున్నది. 12 కంపెనీలు, ఏటేటా తెలుగు చిత్రాలు తయారు చేసేవి ఇప్పుడున్నవి.

1938—39 సంవత్సరములో రెండు పెద్ద ఆంధ్రా స్టుడియోలు ఒకటి విశాఖపట్నంలోను, వేరొకటి రాజమహేంద్రవరంలోను పని చేస్తుండేవి. వ్యాపారనిర్వహణ లోపంవల్ల వీటిని యిప్పుడు మూసివేయవలసి వచ్చినది. విశాఖపట్నంలోని ఆంధ్రా సినీటోన్, తూర్పు కోస్తాలోని వాటన్నిటిలోకి చాలా పెద్దది. ఇది పోవడము ఆంధ్రుల దురదృష్టం!

ఇంక, చిత్ర నిర్మాతలే కాకుండా, పన్నెండుకు పైగా చిత్రాలు విడుదలచేసే (డిస్ట్రిబ్యూటింగ్) కంపెనీలు స్థిరంగా నెలకొని వున్నవి. ఈ కంపెనీలకు ఎక్కువగా బెజవాడ ఉనికి.

చిత్రాలన్నీ చాలా వరకు మద్రాసులోనే ఉత్పత్తి అగును. వాటిలో కొన్నిటిని మాత్రం కలకత్తా, బొంబాయి, కోయంబుత్తూరు, కొల్హాపూర్ స్టుడియోలలో తయారు చేస్తున్నారు.

దక్షిణ దేశంలో తీయబడే దాక్షిణాత్య చిత్రాలన్నింటిలోకి తెలుగు చిత్రాలు ఉత్తమ శ్రేణికి చెందినవి. తమిళ మొదలైన ఆంధ్రేతర చిత్రాలవలె కాకుండా మన చిత్రాల విజయానికి మూల సూత్రం ఒక టేమిటంటే, మన దర్శకులు జి. రామబ్రహ్మం, బి. ఎన్. రెడ్డి, ఎచ్. ఎం. రెడ్డి, సి. పుల్లయ్య, వై. వి. రావు గార్ల వంటివారు వాఙ్మయంతో పరిచితివున్న వైజ్ఞానికులు. ఇంకో విశేషం. మన రామబ్రహ్మం, వై. వి. రావు, ఎచ్. ఎం. రెడ్డిగార్లను తమిళ చిత్రాల దర్శకత్వం వహించడానికి తీసుకోవడం అభినందనీయమైనది.



సారథి పిక్చర్సు డైరెక్టరు శ్రీ గూడవల్లి రామబ్రహ్మం.

84 థియేటర్లు స్థావరంగా తెలుగునాడులో వున్నవి. సంచారం చేస్తూవుండేవి 50 కి పైగా ఉన్నవి.

| జిల్లా | పెర్మనెంటు థియేటర్లు | టూరింగ్ సినీమాలు. |
|---|---|---|
| విశాఖపట్నం | 11 | 6 |
| తూర్పు గోదావరి | 15 | — |
| పశ్చిమ గోదావరి | 8 | 7 |
| కృష్ణా | 12 | 6 |
| గుంటూరు | 14 | 6 |

| | | |
|---|---|---|
| నెల్లూరు | 4 | 2 |
| బళ్లారి | 8 | 3 |
| అనంతపురం | 4 | 7 |
| కడప | 3 | 6 |
| కర్నూలు | 1 | 5 |
| చిత్తూరు | 7 | 2 |
| | — | — |
| | 84 | 50 |

మద్రాసు 'ఫిల్ము బ్యాలట్' (1939-40) ఆరవ సంవత్స రపు ఫలితాల ననుసరించి, విజయం పొందిన చిత్రాలు, నటీ నటులు :—

చిత్రములు :—వందే మాతరం, వర విక్రయము, రైతు బిడ్డ.

నటులు :—నాగయ్య, బలిజేపల్లి, రాఘవాచారిగార్లు.

తారలు :—కాంచనమాల, పుష్పవల్లి, సూర్య కుమారి.

ఆంధ్రపత్రికవారి, ఫిల్ము బ్యాలట్ ననుసరించి విజయు లైన దర్శకులు, చిత్రాలు, నటీ నటులు:—

దర్శకులు :—జి. రామబ్రహ్మం.

నటుడు :—వి. నాగయ్య.

తార :—కాంచనమాల.

తమిళ చిత్రాలలో పాల్గొని, ప్రజాదరణకు పాత్రులైన ఆంధ్ర నటీ నటులు అనేకులున్నారు. వారిలో ముఖ్యులైనవారు, శ్రీమతి. పి. కన్నాంబ, వి. నాగయ్య, వై. వి. రావుగార్లు. సురభి కమలాబాయి, లలితా దేవిగార్లు హిందీ చిత్రాలలో భూమికలను ధరించిరి!

ఇప్పటికి తయారు చేయబడిన మొత్తం చిత్రాలు 105 లో.

| | |
|---|---|
| పౌరాణికం | 75 |
| చారిత్రకం | 3 |
| సాంఘికం | 20 |
| డాక్యుమెంటరీ | 2 |
| ఇతరములు | 5 |
| | — |
| | 105 |

1940 లో తీసిన చిత్రములకు పెట్టుబడి సరిగా రాలేదు. 41 లో యుద్ధపరిస్థితులున్ననూ కొంత చిత్రపరిశ్రమ సాగినది. 1942 లోమరీ విషమవాతావరణమువల్ల ఈ పరిశ్రమ స్థిరత్వము లేక యున్నది.

మనదేశ పారిశ్రామికాభివృద్ధి పైని మనదేశ భావి భాగ్యోదయ మాధారపడి యున్నదను మాట విస్మరింప రాదు!



మేలికిన్నెర - మేళవించీ
రాలుకరగని - రాగమెత్తీ
పాలతీయని - బాలభారత
పదము పాడవె చెల్లెలా!

—రాయప్రోలు.

# పదునెనిమిదవ అధ్యాయము

# సరకుల విడుదల

విషయ సంగ్రహము :— మన దేశమునందు ఉత్పత్తియగు వ్యవసాయపు పంటలు, పారిశ్రామిక వస్తువులు. ముడి పదార్థములు—ఒక ప్రదేశము నుండి మరియొక ప్రదేశమునకు పంపుట కనువయిన సరకు రవాణామార్గములు—తెలుగు నాడులో సరుకుల విడుదల రైళ్లు, రోడ్లు, కాలువలు, సముద్రము ద్వారా—వాని సౌకర్యములబట్టి విలువ—ఆంధ్ర దేశమున మొత్తము మీద 2 వేల మైళ్ల పొడవైన రైలు మార్గము. తెలుగు దేశములోని వివిధ ముఖ్య ప్రదేశములకు రైలు మీదుగా నుండు దూరములు—ఆంధ్రదేశములోని మొత్తమురోడ్లపొడవు 13,194 మైళ్లు—వానిపై ప్రయాణము చేయు బస్సులు, లారీలు 3821—1182 మైళ్ల పొడవు గల కాలువల ద్వారా కొంత సరకు విడుదల—2,01,148 పడవలు ఆ కాలువలలో ప్రయాణము చేయును—తెలుగు దేశమున ఒక ప్రదేశము నుండి మరియొక ప్రదేశమునకు ఎగుమతులు, దిగుమతులు ఎట్లు జరుగు చున్నవో చూపు పట్టిక—మన సంతలు—వాటి వివరణములు—తెలుగు రేవులలో ఎంత వ్యాపారము జరిగినది ?—విశాఖపట్నము రేవు భావి భాగ్యోదయము—.

మన దేశమునందు ఉత్పత్తియగు వ్యవసాయపు పంటలు, పారిశ్రామిక వస్తువులు, ముడి పదార్థములు రాష్ట్రములో ఒక చోటునుండి ఇంకొక ప్రదేశమునకున్ను, పర రాష్ట్రములకున్ను పంపుటకు విడుదల సౌకర్యములుండవలెను. మన ఆంధ్రదేశమునకు గల రవాణా సౌకర్యములు ; ఇతర ప్రదేశములతో ఎగుమతులు, దిగుమతులు ఎట్లు జరుగుచున్నవో తెలుసు కొనుట అవసరము.

ముఖ్యముగా సరకుల రవాణా, ఇనుపదారుల ద్వారాను, రోడ్ల పై కారులు, లారీలు నాటు బళ్లమీదను, కాలువలలో పడవలమీదను, విదేశములకు స్టీమర్ల మీదను మన దేశములో జరుగు చున్నది.

ఆంధ్ర జిల్లాలలో మొత్తము మీద 2 వేల మైళ్లు పొడవున రైలు మార్గము వున్నది. అందులో మద్రాసు దక్షిణ మహారాష్ట్ర రైల్వే కంపెనీవారిదే ఎక్కువ. ఉత్తరమున విశాఖపట్నమునుండి సాలూరు, బొబ్బిలి, విజయనగరం, ఇచ్ఛాపురం ప్రాంతములకు పోవు బెంగాల్ నాగపూర్ రైల్వే యున్నూ, పశ్చిమమున ద్రోణాచలము నుండి కర్నూలుకు పోవు నైజాము స్టేటు రైల్వే యున్నూ తెలుగు జిల్లాల గుండా పోవు చున్నవి !

మన తెలుగు దేశములోని వివిధ ముఖ్య ప్రదేశములకు రైల్వే మీదుగా నుండు దూరము ఈ క్రింద తెలుప బడినది.

| | | | మైళ్లు. |
|---|---|---|---|
| మద్రాసు | నుండి | రాయచూరు | 350 |
| వాల్తేరు | ,, | ఇచ్ఛాపురం | 157 |
| మద్రాసు | ,, | బెజవాడ | 268 |
| ,, | ,, | వాల్తేరు | 485 |
| బళ్లారి | ,, | మచిలీపట్నం | 360 |
| గుంతకల్లు | ,, | హిందూపురం | 113 |
| కాట్పాడి | ,, | గూడూరు | 123 |
| పాకాల | ,, | హిందూపురం | 142 |
| నిడదవోలు | ,, | నర్సాపురం | 42 |
| గుంటూరు | ,, | రేపల్లె | 37 |
| డోను | ,, | కర్నూలు | 34 |
| భీమవరం | ,, | గుడివాడ | 41 |
| మాచెర్ల | ,, | గుంటూరు | 80 |
| సామర్లకోట | ,, | కాకినాడ | 10 |

సరకుల విడుదల మార్గములు

రైలుమార్గము 2,000 మైళ్లు

కాలువలు 1255 మైళ్లు

ట్రంకు రోడ్లు 13194 మైళ్లు

ఓడమార్గము 548 మైళ్లు

ఆంధ్ర దేశంలోని ముఖ్య రైల్వే స్టేషన్లనుండి భారత దేశంలోని కొన్ని ముఖ్య నగరములకు గల దూరము.

| | | | మైళ్లు. |
|---|---|---|---|
| బెజవాడ | — | బొంబాయి | 714 |
| ,, | | కలకత్తా | 764 |
| ,, | | ఢిల్లీ | 1093 |
| ,, | | కరాచి | 1518 |
| ,, | | మద్రాసు | 268 |
| ,, | | వార్ధా, | |
| ,, | | నాగపూరు. | 1066 |
| ,, | | కాశీ | |
| బెజవాడ | | మార్మగోవా | 581 |
| ,, | | హైదరాబాదు | 223 |
| వాల్తేరు | — | బొంబాయి | 921 |
| ,, | | కలకత్తా | 547 |
| ,, | | కరాచి | 1735 |
| ,, | | మద్రాసు | 485 |
| ,, | | తాతానగరం | 558 |
| గుంటకల్లు | — | బొంబాయి | 519 |
| ,, | | బెంగుళూరు | 176 |
| ,, | | మద్రాసు | 276 |
| ,, | | హైదరాబాదు | 223 |

ఆంధ్రదేశపు విశాఖపట్నం, గుంటకల్లు, బెజవాడ కేంద్రములనుండి హిందూదేశమునందలి ముఖ్య పట్నముల దూరము.

ఆంధ్ర దేశమునందలి ట్రంకు రోడ్ల పొడవు 1585 మైళ్లు. మొత్తము రోడ్ల పొడవు 13,194 మైళ్లు. వీటిపై ప్రయాణము చేయు బస్సులు, లారీల యొక్క సంఖ్య 3821.

ఈ పై మార్గముల ద్వారానే కాకుండా ఆంధ్రదేశమున కొంత వ్యాపారము, కృష్ణా, గోదావరి; బకింగ్‌హామ్, కడప-కర్నూలు కాలువల ద్వారా జరుగుచున్నది. ఈ కాలువల మొత్తము పొడవు 1182 మైళ్లు. వీటిలో కడప-కర్నూలు కాలువ మాత్రము పడవలు నడుచుట కుపచరించదు. మొత్తముమీద 2,01,148 పడవలు ఈ కాలువలలో ప్రయాణము చేయుచున్నవి. వీటిమీద సాలీనా రవాణా అగు సరకుల విలువ 12 కోట్ల రూపాయలకు మించి వుండును. రాజమహేంద్రవరమునుంచి గోదావరి నది మీదుగా మధ్య పరగణాలకు కూడా ప్రయాణము చేయవచ్చును. ఈ దూరము 188 మైళ్లు.

ఇంతేకాక తూర్పు తీరమున, సముద్రముమీద కోస్తా వ్యాపారము గూడా జరుగుచున్నది. ఆంధ్ర దేశములోని ముఖ్యమైన రేవు పట్టణములు : మద్రాసు, మచిలీపట్నం, కాకినాడ, విశాఖపట్నం, భీమునిపట్నం, కళింగపట్నము. కాకినాడనుండి, రంగూనుకు దూరము 867 మైళ్లున్ను, కలకత్తాకు 529 మైళ్లున్నూ వున్నది. విశాఖపట్నమునుంచి రంగూనుకు 828 మైళ్లున్నూ, కలకత్తాకు 462 మైళ్లున్నూ దూరము గలదు.

కాలువలమీద జరుగుచున్న వ్యాపారము, దాని లెక్కలు, 1939-40 ఇరిగేషను రిపోర్టు లెక్కలను బట్టి తయారు చేయబడిన ఈ ప్రక్క పట్టికలో పొందుపరచడమయినది.

| కాలువ పేరు | పొడవు మైళ్లు | పడవలు సరకులు తో | ప్రయాణీకులతో | జరిగేవ్యాపారం. రూ॥ |
|---|---|---|---|---|
| గోదావరి | 493 | 123506 | 52281 | 72891633 |
| కృష్ణా | 384 | 10061 | 2025 | 33187264 |
| కృష్ణా తూర్పుఒడ్డు | 35½ | 237 | 19 | 667975 |
| బకింగ్ హామ్ కాలువ | 268 | 5339 | 7568 | 8999510 |
| దుమ్ముగూడెం | 2 | 110 | 2 | 5041894 |
| కడప కర్నూలు కాలువ | 75 | పడవలు లేవు | | |
| మొత్తం | 1182½ | | 201148 | 120788276 |

మన దేశములో ప్రతి ముఖ్యపట్టణములోను, ప్రతి వారము సంత జరుగును. ఆ సంతకు చుట్టుపట్ల గ్రామాదుల నుండి అపరాలు, ధాన్యం, మన్యపు సరుకు, బెల్లం వగైరాలు అమ్మకమునకు వచ్చును. ఈ సరుకును మారుబేరపు వర్తకులు కొని, ఇతర ప్రదేశములకు తీసుకపోయి అమ్ముదురు. దూర దేశములకు వెళ్లే సరుకులు కొనుగోలు దారులుగాని, వారి తాలూకు ఏజెంట్లుగానీ రవాణా చేసుకుంటారు. మన తెలుగు జిల్లాలలోని ముఖ్యమైన పెద్ద సంతలయొక్క పట్టిక వివరముగా ఈ క్రింద గలదు.

(ముఖ్య పశువుల సంతలకు పశు సంపద ప్రకరణములో చూడుడు).

| సంతజరిగే స్థలము | అమ్మబడే సరకులు. |
|---|---|
| **విశాఖపట్నం జిల్లా** | |
| ఝూడుపూడి | పండ్లు, కూరగాయలు, కొబ్బరికాయలు, పొగాకు. |
| చింతాడ | ధాన్యాదులు, పొగాకు, కొబ్బరికాయలు, పశువులు. |
| నేరడివలస | ధాన్యాదులు, పశువులు, పొగాకు, పండ్లు-కాయలు, ఎండు చేపలు. |
| శ్రీకాకుళం | ధాన్యాదులు, పండ్లు-కాయలు, ఎండుచేపలు. |
| మకరపాలెం | ధాన్యాదులు. |
| నాతవరం | ధాన్యాదులు. |
| మానాపురం | పండ్లు-కాయలు, పశువులు, ధాన్యాదులు. |
| బలిజపేట | పండ్లు-కాయలు, చింతపండు, పశువులు. |
| కొండసంత | పండ్లు-కాయలు, ధాన్యాదులు, పశువులు. |
| సాలూరు | చింతపండు, ధాన్యాదులు, పశువులు, ఆవాలు. |
| విజయనగరం | కాయలు-పండ్లు, పొగాకు, ధాన్యాదులు, నూనెవిత్తులు. |
| అనకాపల్లి | పండ్లు, బెల్లము, ఏజెన్సీ సరుకులు ముఖ్యములు. |
| **తూర్పు గోదావరి జిల్లా** | |
| తుని | పండ్లు-కాయలు, కొబ్బరికాయలు, నూనె దినుసులు. |
| పిఠాపురం | పండ్లు-కాయలు, ధాన్యాదులు, పొగాకు, పశువులు. |
| చందుర్తి | పండ్లు-కాయలు, ధాన్యాదులు, పొగాకు, |
| మల్లికాపురం | పండ్లు-కాయలు. |
| ఏలేశ్వరం | పండ్లు-కాయలు, చింతపండు. |
| కాకినాడ | పండ్లు-కాయలు, ధాన్యాదులు, పొగాకు, కొబ్బరికాయలు, నూనె దినుసులు. |
| గోకవరం | పండ్లు-కాయలు (పనస, నారింజ, అరటి) చింతపండు, మిర్చి, పశువులు. |
| ద్వారపూడి | పండ్లు-కాయలు, నూనె దినుసులు, ధాన్యాదులు, పశువులు. |
| **పశ్చిమ గోదావరి జిల్లా** | |
| పాలకొల్లు | పండ్లు-కాయలు, ధాన్యాదులు. కొబ్బరి కాయలు, పశువులు. |
| తాడేపల్లి గూడెం | పండ్లు-కాయలు, ధాన్యాదులు, కొబ్బరి కాయలు, పశువులు, నూనె దినుసులు. |
| పాలకొల్లు | పండ్లు-కాయలు, ధాన్యాదులు, బట్టలు, నూలు, నూనె దినుసులు, పశువులు. |
| పెనుగొండ | పండ్లు-కాయలు, కొబ్బరికాయలు, నూనె దినుసులు. |
| ఉండి | పశువులు, ధాన్యాదులు, వగైరా. |
| **చిత్తూరు జిల్లా** | |
| పల్లిపట్టు | పండ్లు-కాయలు, ధాన్యాదులు. |
| నగరి | పొగాకు, పండ్లు-కాయలు, ధాన్యాదులు, కొబ్బరికాయలు. |
| **అనంతపురం జిల్లా** | |
| తాడిపత్రి | కాయలు-పండ్లు, ధాన్యాదులు. |
| మడకసిర | ధాన్యాదులు, నెయ్యి. |
| **కడప జిల్లా** | |
| పులివెందల | పండ్లు-కాయలు, ధాన్యాదులు, నెయ్యి, పొగాకు, కొబ్బరికాయలు, నూనె దినుసులు, గొర్రెలు, మేకలు. |

వేంపల్లి  పండ్లు-కాయలు, ధాన్యాదులు, నెయ్యి, పొగాకు, కొబ్బరికాయలు, నూనెదినుసులు, గొర్రెలు, మేకలు.

కర్నూలు జిల్లా

ఆళ్లగడ్డ  పండ్లు-కాయలు, ధాన్యాదులు, పొగాకు.

నంద్యాల  పండ్లు-కాయలు, ధాన్యాదులు.

దేవన్నకొండ  ధాన్యాదులు.

(మార్కెటింగు ఆఫీసరు లెక్కలనుండి).

మన జిల్లాలలోని ఎగుమతులు, దిగుమతులు ఒక ప్రదేశము నుండి ఇంకొక ప్రదేశమునకు ఏ విధముగా జరుగుచున్నవో, వ్యవసాయ శాఖవారి పట్టికల ననుసరించి తయారు చేయ బడిన ఈ క్రింది పట్టిక చూపును.

| | ఎగుమతి | | సరాసరి మొత్తం | దిగుమతి | | సరాసరి మొత్తం |
|---|---|---|---|---|---|---|
| సరకు | ప్రదేశంనుంచి | ప్రదేశానికి | టన్నులు | ప్రదేశంనుంచి | ప్రదేశానికి | టన్నులు |
| బియ్యము | ప. గోదావరి, తూ. గోదావరి, కృష్ణా, నెల్లూరు. | మైసూరు, నిజాంరాజ్యము, బొంబాయి, మలబారు, కోయంబత్తూరు. | 150,000 | మధ్యపరగణాలు, గంజా | విశాఖపట్టణం | 20,000 |
| శనగలు | చాలా తక్కువ మొత్తం | ... | ... | పంజాబు, సంయుక్త పరగణాలు | బళ్లారి, విశాఖపట్టణం, గుంటూరు, తూ. గో॥వగైరా | 50,000 |
| మిరపకాయలు | తూ. గోదావరి, గుంటూరు | బెంగాలు | తెలియదు | బెంగాలు | గుంటూరు. | తెలియదు |
| మామిడిపండ్లు | చిత్తూరు, తూ. గో., ప. గో., విశాఖపట్నం, కర్నూలు. | బొంబాయి, బెంగాలు, ఢిల్లీ | 26,000 | ... | ... | స్వల్పము |
| అరటిపండ్లు | తూ. గోదావరి, ప. గోదావరి. | పంజాబు, ఢిల్లీ సం. పరగణాలు వగైరా | 8,000 | ... | ... | ,, |
| నారింజ | దేశములోపలనే వ్యాపారము | దక్షిణ జిల్లాలకి | 500 | మధ్యపరగణాలు | గుంటూరుకృష్ణా, విశాఖపట్నం. | 400 |
| నిమ్మకాయలు | ప. గోదావరి, గుంటూరు, నెల్లూరు. | ముఖ్యంగా బెంగాల్ బొంబాయి, | 4,000 | ... | ... | స్వల్పము |
| కొబ్బరికాయలు | తూ॥, ప॥ గోదావరి, కృష్ణా. | బెంగాలు, మధ్య పరగణాలు. | 270 లక్షలు కురిడీ 230 లక్షలు నీటి (కాయలు) | | | |
| పొగాకు ఎక్కువగా వర్జీనియా రకం | తూ॥, ప॥ గోదావరి, గుంటూరు, నెల్లూరు | బ్రిటిష్ దీవులు, చైనా, బెంగాలు, మైసూరు, మధ్య పరగనాలు, నైజాము | 30,000 | | | |
| వేరుశనగ (పొట్టుతో) | కాకినాడ, భీమునిపట్నం, బందరు, విశాఖపట్నం | ఫ్రాన్సు, బ్రిటిష్ దీవులు. | 2,15,000 | ... | ... | ,, |
| వేరుశనగ (పొట్టుతీసినది) | కాకినాడ, భీమునిపట్నం బందరు, విశాఖపట్నం వగైరా. | ఫ్రాన్సు, బ్రిటన్, నెదర్లండు. | యుద్ధానికి పూర్వపు 3 సం॥లలో 315100 | | | |

మన సరుకులలో ముఖ్యముగా విదేశములకు వేరుశెనగ, పొగాకు, ప్రత్తి, కొబ్బరి, తాటినార, ఎముకలపొడి, ఆముదాలు మొదలైనవి ఎగుమతి యగును. ఇవన్నీ కాకినాడ, విశాఖపట్నం, భీమునిపట్నం, మచిలీపట్నం మొదలైన తెలుగు రేవులనుండి విదేశ సరకుల ఓడలపై రవాణా అగుచున్నవి.

రేవులు :—మన కోస్తా వ్యాపారము పెంపొందించుకొనుటచేత అన్యరాష్ట్రములలో మనకు వ్యాపారము జరుగుటయేకాక, ఆ రాష్ట్రీయులతో అన్యోన్య సంబంధము కలుగును. 1939-40 లో ఆంధ్ర జిల్లాలలోని రేవు పట్టణములలో జరిగిన వ్యాపారమునుబట్టి వాటి స్థితి నూహింపవచ్చును. మద్రాసునుండి ఉత్తరముగా సముద్రమువైపు చూచినయెడల ఆంధ్రదేశముయొక్క 540 మైళ్లు పొడవుగల సముద్రతీరము కనుపించును. కాని, మనకు అయిదారు రేవులకన్న అధికముగా లేవు. ఇంతకన్న తక్కువ సముద్రతీరముగల తమిళ జిల్లాలలో, మద్రాసునకు దక్షిణముగా 17 రేవులున్నవి. పూర్వము ఉన్నత స్థితిలో నుండిన మన ఆంధ్రదేశపు రేవులు కొన్ని పునరుద్ధరింప





* శ్రీ సి రామస్వామి నాయుడు,
మదరాసురాజధాని సరకులవిడుదలకొరకు నియోజితులైన
రాజధాని మార్కెటింగు ఆఫీసరు,
టెన్నిస్, క్రికెట్ ఆటలలో పేరెన్నికగనిరి.

బడవలెను. ఈ పని ప్రభుత్వమువారి చేతులలో నున్నది. కానీ, ప్రజలీవిషయమున శ్రద్ధవహించి అందోళన చేయవలెను.

మన రేవులలో ఒకదానికి ఇంకొకదానికిగల దూరము ఈ క్రిందగాంచుడు.

| సముద్రము మీదుగా దూరం | | మైళ్లు |
|---|---|---|
| మద్రాసునుంచి | కాకినాడ | 370 |
| ,, | మచిలీపట్నం | 270 |
| మచిలీపట్నంనుంచి | కాకినాడ | 100 |
| కాకినాడనుంచి | విశాఖపట్టణం | 74 |
| విశాఖపట్టణంనుంచి | భీమునిపట్నం | 30 |
| భీమునిపట్నంనుంచి | కళింగపట్నం | 40 |
| కళింగపట్నంనుంచి | బారువా | 30 |

* వీరికిముందు కీ. శే. కే. గోపాలకృష్ణ రాజుగారు ఈ పదవి యందున్న ఆంధ్రులు.

మొత్తం రాజధాని వ్యాపారంలో పై రేవులమీదుగా జరుగు వ్యాపారము నూటికి 8½ వంతులు.

1939-40 లెక్కలబట్టి ఈ రేవులలో జరిగిన వ్యాపారము.

| | రేవు | వ్యాపారం విలువ రూపాయలు | రాష్ట్రపు వాణిజ్యంలో నూటికి |
|---|---|---|---|
| 1. | కళింగపట్నం | 18 లక్షలు | .23 |
| 2. | భీమునిపట్నం | 41 ,, | .52 |
| 3. | విశాఖపట్నం | 236 ,, | 2.89 |
| 4. | కాకినాడ | 252 ,, | 3.09 |
| 5. | మచిలీపట్నం | 133 ,, | 1.63 |
| 6. | మద్రాసు | 3252 ,, | 39.87 |

పై పట్టికనుబట్టి మద్రాసులో తప్ప మిగిలిన ఆంధ్ర నౌకాస్థలములలో వ్యాపారమెట్లుండెనో తెలియగలదు. ఒకప్పుడు "నానా విదేశనౌకానీక విపులాశ్రయంబైన రేవు"లతో అలరారిన ఆంధ్ర తీరము, తీర వర్తకము ప్రస్తుత మీస్థితికి వచ్చుట పరితాపకరము !

యావద్భారత నౌకా నిర్మాణ పరిశ్రమకు మన తెలుగు రేవుపట్నమైన విశాఖపట్నము కేంద్రమగుటచేత ముమ్ముందు మరల తెలుగు కోస్తాలో ఒకసారి ఓడల జండాలు దివ్య విహారము చేయగలవు !



తుంగభద్రా— భంగములతో
పొంగిపొంగిపి— పాడిచిత్రుల్లో
భంగపడసి— తెనుంగునాధుల
పాటపాడవె— చెల్లెలా !

—రాయప్రోలు.

## పంథొమ్మిదవ అధ్యాయము

# ఆస్తి, బ్యాంకులు కంపెనీలు

విషయ సంగ్రహము :— దేశసంపద—దేశసంపదను నిర్ణయించుటెట్లు ? —ఆంధ్రదేశ సంపద, కొన్ని వివరణములు —రాష్ట్రమునందలి వివిధ జిల్లాలలోని మోటారులు బస్సులు మొదలైనవి—మన ఆంధ్ర దేశపు వ్యవసాయిక సంపద—ఒక్కొక్క వ్యవసాయదారుని ఆదాయము మన చెన్నరాజధానిలో సగటున సాలీనా రు. 12-12-0లు—క్షామములు—వానివల్ల మన రాష్ట్ర వ్యవసాయమునకు ముఖ్యముగా రాయలసీమప్రజలకు కలుగుచున్నబాధలు- రైతులు, అప్పులు —సత్యనాథన్ కమిటీ రిపోర్టు ప్రకారము రైతు ఋణగ్రస్థత చెన్నరాజధానిలో 150 కోట్లరూపాయలు—మన పారిశ్రామిక సంపద—పరిశ్రమల అభివృద్ధికి కారణమైన ఆంధ్రా యింజనీరింగ్, ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ, ఆంధ్రా చేంబర్ ఆఫ్ కామర్సు మొదలైన కంపెనీలు—దేశపు ఆర్థిక సంపదకు ఆటపట్టులైన బ్యాంకులు—ఆంధ్రులచే స్థాపింపబడిన ఆంధ్రా బ్యాంకు, భారత లక్ష్మి బ్యాంకు మొదలైనవి—జాతీయ వికాసమునకు తోడ్పడు సహకారోద్యమము—సహకార సంఘములు—సహకార సంఘములలో ఆంధ్రుల నాయకత్వము, అఖిలభారత ఖ్యాతి—కీ. శే. దివాన్ బహదూర్, సర్ మోచర్ల రామచంద్రరావు, శ్రీ వేమవరపు రామదాసు పంతులు, శ్రీ నర్సింహదేవర సత్యనారాయణ మొదలైన నాయకులు—రైతులకు సహకారసంఘపు ఉపకృతి—పట్టికలు—వివరణములు.

ఒక దేశముయొక్క ఆర్థికసంపదనుగూర్చి చర్చించుటకు ముందు ఆ దేశమునకు సంబంధించిన అనేక విషయములను అవలోకించవలెను. ఆ దేశమునందలి ప్రజల జీవితము, నిత్యజీవితములోని వారి ఆదాయవ్యయములు, దేశమునందలి ఖనిజ సంపద, పరిశ్రమలు, దేశపు వ్యవసాయిక స్థితి, వస్తు ఉత్పత్తివినిమయములు మొదలైన ఈ అంశములన్నియు ఆచర్చలోని అంతర్భాగములే. పాశ్చాత్య దేశములలో ఈ విషయము లన్నింటిలోను పరిశోధనము చేసి లెక్కలు తయారు చేయుదురు. అందుచేత ఆదేశముల వివరణములు తెలుసుకొనుట సులభము. ముఖ్యముగా మన

విషయ పరిచయము

భారత దేశమునకే యిట్టి లెక్కలు తక్కువ. అందులో ఆంధ్ర దేశమునకు ఈ అంచనా లసలే లేవు. మన భారత దేశమున ఒక్కొక్కనికి సంవత్సరాదాయము 20-రూ॥ లుండునని దాదాభాయి నౌరోజీగారు 1870 లో అంచనా వేసిరి. షా, కాంభట్టు గార్లు అంచనావేసి, భారత దేశమున ఒక్కొక్కని సాలురాబడి రు. 67-0-6 లుండునని నిర్ణయించిరి (1921-22). ఈ విధముగా వివిధ ఆర్థికశాస్త్రవేత్తలు సూచించి యున్నారు.

అసలు ఆర్థిక సంపదను గూర్చి తెలుసుకొనుట ఎట్లు? ఒక మనుష్యుని వేషము, బాహ్య ప్రవర్తనము చూచి అతని ఆర్థికస్థితిని తెలుసుకొనుటకు వీలయినట్లే, విమానమునెక్కి దేశమును చుట్టి వచ్చిన దేశమునందలి పంటలు, పారిశ్రామిక కేంద్రములు, పల్లెలు, పట్నములు చూచి దేశపు ఆర్థిక స్వరూపము యొక్క బాహ్య చిత్రమును చిత్రించు

కొనవచ్చును. ఇవిగాక ఆ దేశమునందలి కర్మాగారములు, పారిశ్రామిక కేంద్రములు, పాడి పంటలు, ఖనిజసంపద, ఆ దేశములో వివిధ ప్రదేశములనుండి ప్రభుత్వము నకు వచ్చు ఆదాయవ్యయములు, అక్కడి రైతుల పరిస్థితి, క్షామ ములు, కంపెనీలు, బ్యాంకులు మొదలైన విషయముల పరిశీలించి కొంత తెలుసుకొన వచ్చును. ఆ దేశస్థులకు ఇతరప్రదేశములతోను, ఇతరప్రదేశములలోను గల వ్యాపార సంబంధములు, ఆ ప్రదేశములోనున్న మోటారులు, లారీలు మొదలగునవి గూడా అక్కడి ప్రజల స్థితిని సూచించును. ఇట్లే రైలు మార్గములో నున్న పారిశ్రామిక కేంద్రములు, పెద్ద రైల్వేజంక్షనులు మొదలగు వాటిని గూడా ఈ సందర్భమున పరిశీలించ వలెను.

దేశము యొక్క ఆర్థిక సంపద తెలుసు కొనుట ఎట్లు ?

మద్రాసునుండి బరంపురమునకు ప్రయాణము చేయు చున్నప్పుడు నెల్లూరు జిల్లాలో కొంత భాగము ; గుంటూరు బెజవాడల మధ్య కొంత భాగము ; ఏలూరు రాజమహేంద్రవరముల మధ్య కొంత భాగము ; సామర్లకోట తుని అనకాపల్లుల మధ్య కొంత భాగము సస్యశ్యామలమై, కంటి కింపుగా కనుపించును. అక్కడక్కడ పెద్ద కర్మాగార ములు కనపడును. మద్రాసు నుండి కోయంబుత్తూరునకు ప్రయాణము చేయు చున్నప్పుడు నల్లనేల, అనేక కర్మాగార ములు కనపడును. మద్రాసు నుండి రామేశ్వరము ప్రయాణము చేయు చున్నప్పుడు విల్లుపురం, తిరుచునాపల్లి, మధుర, మొదలైన పెద్దపెద్ద రైల్వే జంక్షనులు, ఫలవంత మైన భూములు, క్రిక్కిరిసిన పట్టణములు కనపడును. దీనిని బట్టి దక్షిణాది ఎక్కువ సంపద గల దేశమని ఊహించ వచ్చును. మనకు కృష్ణా, గోదావరి మొదలగు పెద్ద పెద్ద నదులు, ఆనకట్టలు ఉన్నప్పటికిన్నీ మన నదులలోని నీరు ఇప్పుడు మనకు నూటికి 8 వంతుల కన్న ఎక్కువ ఉప యోగ పడుట లేదు. గుంటూరు మొదలైన ప్రదేశములు ఎక్కువ క్షామబాధకు గురియై క్షైణ్యము పొందు చున్నవి. మన ప్రాంతీయులు రంగూన్, బర్మా మొదలైన ప్రదేశముల కిప్పుడు కూలి నాలికై పోవుచున్నారే కాని, వర్తక వాణిజ్యములకై పోవుట లేదు. దక్షిణాది వర్తకులు అనేక ప్రదేశములకు పోయి వర్తకము చేయు చున్నారు. మన దేశ సంపద ఎట్లున్నను మన గ్రామములు చూచుట కెంతయో సంపన్నములుగా కనిపించును. ఇతర రాష్ట్రములలో, కొన్ని పల్లెటూళ్లలో చూచుటకొక పెంకుటిల్లైనను కనిపించదు. మన ఆంధ్రరాష్ట్రమున మధ్య రకపు జనసామాన్యపు సంఖ్య ఎక్కువ. మన ఆంధ్రదేశపు పాటకపుజనులు సైతము

ఆంధ్ర దేశపు సంపద- కొన్ని వివరణములు



గౌ॥ శ్రీ వేమవరపు రామదాసు పంతులు బి.ఏ., బి.ఎల్., స్టేటు కౌన్సిలు కాంగ్రెసు పార్టీ లీడరు, సహకారోద్యమములో అఖిల భారత నాయకత్వము సంపాదించిరి. రాష్ట్ర సహకార బ్యాంకు అధ్యక్షులుగా నుండిరి. అఖిల భారత సహకార పత్రికాధిపతులు.

తమిళనాడు మొదలైన ఇతర దాక్షిణాత్య ప్రదేశముల వారి కన్న వేషము, దుస్తులను ధరించుటలో కొంచెము ఉన్నత విధముగా నుందురు. మన ప్రదేశములనుండి ప్రభుత్వము నకు వచ్చు ఆదాయమును బట్టి ఏజిల్లా ఎంత సంపన్న మైనది తెలుసుకొనవచ్చును. మన తెలుగు జిల్లాలన్నింటి లోను భూమి పన్ను, గుంటూరు జిల్లా నుండి రు. 683196 లున్నూ, డిస్ట్రిక్టుబోర్డు ఆదాయము రు. 1263604 లున్నూ

ప్రభుత్వమునకు వచ్చు చున్నది. తూర్పు గోదావరి జిల్లా నుండి రు. 6490635లు భూమి పన్ను మీదను, రు. 129365 లు జిల్లాబోర్డు నుండిన్ని ప్రభుత్వమునకు వచ్చును. ఇట్లే 16 వ పుటలో చూపిన పట్టిక ననుసరించి అన్ని జిల్లాల విషయములు తెలుసు కొన వచ్చును.

వ్యవసాయికస్థితిగతులు, ఖనిజసంపద మొదలైన విపులాంశముల గురించి చర్చింపబోవుటకు ముందు, మన దేశమునందలి మోటారులు, బస్సులు, లారీలు కూడా మన ఆర్థిక పరిస్థితిని తెలియజేయునుగాన వాటిని గురించి తెలుసు కొనవలసి యున్నది.

| జిల్లా పేరు | మోటారు సైకిళ్లు | లారీలు | టాక్సీలు | బస్సులు | కార్లు | వెరశి |
|---|---|---|---|---|---|---|
| విశాఖపట్టణం | 43 | 52 | 19 | 151 | 412 | 677 |
| తూ. గోదావరి | 54 | 11 | — | 128 | 308 | 500 |
| ప. గోదావరి | 17 | 4 | 2 | 114 | 140 | 277 |
| కృష్ణా | 19 | 43 | 9 | 174 | 237 | 482 |
| గుంటూరు | 37 | 33 | 14 | 155 | 230 | 469 |
| నెల్లూరు | 4 | 5 | 3 | 121 | 151 | 284 |
| కడప | 8 | 11 | — | 68 | 66 | 153 |
| కర్నూలు | 8 | 19 | — | 83 | 55 | 165 |
| బళ్లారి | 24 | 18 | — | 89 | 130 | 270 |
| అనంతపూరు | 7 | 10 | — | 68 | 72 | 157 |
| చిత్తూరు | 22 | 16 | 4 | 113 | 118 | 273 |
| చంగల్పట్టు | 28 | 28 | 2 | 45 | 220 | 323 |
| ఉత్తరార్కాడు | 24 | 8 | 11 | 209 | 185 | 437 |
| దక్షిణార్కాడు | 23 | 16 | 2 | 99 | 174 | 314 |
| తంజావూరు | 18 | 14 | 5 | 197 | 432 | 666 |
| తిరుచునాపల్లి | 51 | 47 | 16 | 175 | 500 | 789 |
| మధుర | 88 | 94 | 34 | 279 | 618 | 1113 |
| రామనాథపురం | 22 | 15 | 12 | 130 | 651 | 830 |
| తిరునల్వేలి | 57 | 42 | 20 | 192 | 357 | 668 |
| కోయంబుత్తూరు | 149 | 115 | 29 | 280 | 879 | 1452 |
| నీలగిరి | 82 | 149 | 40 | 60 | 758 | 1089 |
| సేలం | 73 | 42 | 3 | 197 | 318 | 633 |
| దక్షిణ కెనరా | 37 | 74 | 13 | 106 | 223 | 453 |
| మలబారు | 43 | 167 | 9 | 206 | 612 | 1037 |
| మదరాసు | 451 | 382 | 110 | 369 | 4436 | 5748 |
| | 1388 | 1415 | 357 | 3808 | 12291 | 19259 |

ఈ మోటారు డీలర్సు అసోసియేషన్‌వారి లెక్కలను బట్టి చూచినప్పటికిన్ని మన రాజధానిలో తెలుగు జిల్లాలకన్న దక్షిణ జిల్లాలలో ఎక్కువ బస్సులు మోటారులు మొదలైనవి ఉన్నట్లు ఊహించుటకు కవకాశము కలదు.

ఇందుకు మన వర్తకము పారిశ్రామిక పరిస్థితి చాలా వరకు కారణము. తెలుగు జిల్లాలలోని వ్యవసాయికస్థితి, ఖనిజసంపద, పారిశ్రామికస్థితి, రైతు ఋణము, బ్యాంకులు, సహకారోద్యమమునుగురించి తెలుసుకొనవలసి యున్నది. వ్యవసాయము, పరిశ్రమలు, ఖనిజసంపద మొదలైన విషయములకు సంబంధించిన వివరణములు ఆయా శీర్షికలుగల భాగములలో విపులముగా వివరించితిమి.

వ్యవసాయిక సంపద

ఇప్పటి మన ఆంధ్రదేశ జనసంఖ్యలో నూటికి 90 మంది వ్యవసాయిక పరిశ్రమతో సంబంధము కలిగియున్నారు. దేశములో 3/4 వంతు జనులకు జీవాధారము వ్యవసాయమే. మన మద్రాసు రాష్ట్రములో వ్యవసాయముమీద ఆధారపడి యుండువారిలో ఒక్కొక్కనికి సాలీనా సుమారు రు. 12-12-0 లకంటె ఎక్కువ ఆదాయము వచ్చుటలేదు. మన ఆంధ్రరాష్ట్రమును ఇతర రాష్ట్రముల కొన్నింటితో పోల్చిచూచిన చాలా పేదదేశ మనిపించును. తెలుగు జిల్లాలలో చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి జిల్లాలున్నూ; నెల్లూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్నం జిల్లాలలోని మెట్ట ప్రాంతాలలోను వ్యవసాయమునకు వర్షముమీద ఆధారపడవలసియుండును. వర్షములు లేక ఈ ప్రాంతములలో అనేక పర్యాయములు క్షామములు సంభవించుచుండును. మన ఆంధ్రదేశమున వచ్చు, క్షామములు, మన ప్రజలకు ఆర్థికముగా హాని కలిగించుచున్నవి. అందుచేత వ్యవసాయమునకు ప్రజలకు అవి ఎట్లు హానికరములుగా నున్నవో తెలుసుకొనవలసి యున్నది. ఆంధ్రదేశమునందు పండు పంటలు, వాని విలువలు వ్యవసాయమన్న శీర్షిక క్రిందగల భాగములో ప్రత్యేకముగా పట్టికలతో 177-178 పుటలలో చెప్పబడినవి. వాటినిబట్టి మన వ్యవసాయిక సంపద తెలుసుకొనవచ్చును.

తెలుగు జిల్లాలలో ఒక రూపాయికి తక్కువ శిస్తు చెల్లించు పట్టాదారుల సంఖ్య, ఒక రూపాయి మొదలు 10 రూపాయిలలోపు శిస్తు చెల్లించు పట్టాదారుల సంఖ్య,

వెయ్యి రూపాయిలు శిస్తు చెల్లించు పట్టాదారుల సంఖ్యలు మాత్రము ఈ క్రింద పట్టికలో చూపబడినవి.

| జిల్లా | ఒక రూపాయికి తక్కువ శిస్తు చెల్లించు పట్టాదారుల సంఖ్య | ఒక రూపాయి మొదలు 10-1 రూ. వరకు శిస్తు చెల్లించు పట్టాదారుల సంఖ్య | వెయ్యి రూపాయిలు శిస్తు చెల్లించు పట్టాదారుల సంఖ్య |
|---|---|---|---|
| విశాఖపట్నం | 9,738 | 21,010 | 1 |
| తూర్పు గోదావరి | 11,382 | 39,781 | 15 |
| పశ్చిమ గోదావరి | 12,907 | 34,531 | 19 |
| కృష్ణా | 11,721 | 35,465 | 9 |
| గుంటూరు | 32,507 | 105,842 | 3 |
| నెల్లూరు | 10,512 | 43,366 | 6 |
| కడప | 33,721 | 78,648 | |
| అనంతపురం | 26,147 | 68,710 | 1 |
| బళ్లారి | 13,876 | 79,900 | 8 |
| కర్నూలు | 17,300 | 68,246 | |
| చిత్తూరు | 20,241 | 56,710 | 1 |

పై పట్టికనుబట్టి వెయ్యి రూపాయిలు శిస్తు చెల్లించు పట్టాదారుల సంఖ్య అతి స్వల్పమని తెలియుచున్నదిగదా! దీనినిబట్టి ఆంధ్రదేశమున ధనాఢ్యులైన రైతులు అధికముగా లేరని తెలియును. చాలామంది వ్యవసాయపు కూలీలున్నారు. ఒక రూపాయికి తక్కువ శిస్తు చెల్లించు పట్టాదారు, ఎంత తక్కువ విస్తీర్ణము గల భూమికి అధిపతియైనది ఊహించుకొనవచ్చును. ఇంక క్షామముల విషయము పరిశీలింతము.

**క్షామములు - వాటివల్ల వ్యవసాయమునకు, ప్రజలకు కలుగు బాధ**

1896-97 లో ఆంధ్రదేశమున పెద్ద క్షామము వచ్చెను. 1900 లలో మరల క్షామమువచ్చి నర్సారావుపేట, వినుకొండ తాలూకాలు నష్టపడినవి. అనంతపురం జిల్లాలోని తాడిపత్రి, కదిరి తాలూకాలు; బళ్లారి జిల్లాలోని అదోని తాలూకా యున్నూ; కర్నూలు జిల్లాలోని మార్కాపురం, నంద్యాల, కోయిలకుంట్ల, పత్తికొండ, కంభం మొదలైన ప్రదేశములున్నూ; కడప, నెల్లూరు జిల్లాలలో కొన్ని భాగములున్నూ 1900 సంవత్సరమున కొంతవరకు నష్టపడినవి. 1901 వ సంవత్సరమున మరల కరువు వచ్చి కడప, అనంతపురం, చిత్తూరు మొదలైన ప్రదేశములలో కష్టములు అధికమయ్యెను. 1919 లో కృష్ణా జిల్లాలోని నందిగామ తాలూకా, మునగాల పరగణాలలో క్షామము సంభవించినది.

1920 సం॥లో ప్రతి సంవత్సరము సగటున కురియు వర్షములలో సగమైనను కురియక బళ్లారి, అనంతపురం, కర్నూలు జిల్లాలలో కరువు వచ్చెను. బళ్లారి, అనంతపురం జిల్లాలలో మరల క్షామదేవత యినుప గజ్జెలతో 1924 లో తాండవమాడినది. ఆ సంవత్సరం క్షామనివారణమునకై రు 2,21,545 వెచ్చించి పనులు చేయించిరి. 1926 లో కోయంబత్తూరు జిల్లాలోని ధర్మపురం తాలూకాలో వానలు సకాలమున లేక కొంచెము కరవు బాధ కలిగెను. బళ్లారి జిల్లాలోని బళ్లారి, ఆలూరు తాలూకాలు 1931-32 లో క్షామమునకు గురియయ్యెను. 1932 లో కురిసిన వర్షములతో ఇక్కడ అప్పటి క్షామబాధ తగ్గెను. 1934-35 లో బళ్లారి, అనంతపురం జిల్లాలలో గొప్పక్షామము మరల వచ్చినది. దీనికి కారణము 1933 నుండి 1935 వరకు ఆ ప్రదేశములలో గల అనావృష్టియే. అప్పుడు క్షామనివారణమునకై రు 17,23,452లు ఖర్చుపెట్టబడెను. అనంతపురం, కర్నూలు జిల్లాలలోని కొన్ని భాగములలో వర్షములు లేక 1937-38 లలో కరువులు వచ్చినవి.

మొత్తముమీద ఈ ప్రదేశములు అధికముగా క్షామములకు లోనగుచున్నవిగదా! ఇక్కడ వర్షము లేక పోయినను సరియైన నీటివసరులు ఏర్పరచక పోవుట శోచనీయము. ఈ ప్రదేశములలో నిజమునకు చాలావరకు బావులు, చెరువులు లేవని చెప్పవచ్చును. హగేరినది, సిరిగుప్ప దగ్గర తుంగభద్రపాయ కొంచెము వ్యవసాయమునకు ఉపయోగపడుచున్నవి. ఇక్కడ వర్షములు సరిగా లేకుండుటచే భూముల విలువ పెరగదు. పైగా తక్కువ. సగటున ఇచ్చట నల్లభూమి ఖరీదు ఎకరము రు 110 లనిన్నీ; ఎర్రభూమి ఎకరము రు 60 లనిన్నీ అంచనా వేయబడినది. తుంగభద్రాప్రాజెక్టు వీరికి చాలావరకు తోడ్పడ గలదు. ఈ ప్రదేశమున వ్యవసాయమునకు ఇంగ్లండు, అమెరికా మొదలైన దేశములలో ఉపయోగింప బడుచున్నట్టి "వర్షపు

మరలు" (Rain Makers) ఉపయోగించుటకు వీలయిన, ఉపయోగపరచుట మంచిది. ఈ ప్రదేశములలో ప్రత్తి, వేరుశనగ సాగుబడి అధికము. ప్రత్తి 10 లక్షల ఎకరముల లోను, వేరుశనగ 12 లక్షల ఎకరములలోను సాగుబడి చేయబడుచున్నది. వ్యవసాయము ముఖ్యముగా మన దేశీయుల జీవాధార మైనప్పటికిన్నీ మన దేశమున వ్యవసాయము అభివృద్ధిపరచుకొనుటకు, యంత్రములు ఇతర నీటి సదుపాయములను ఉపయోగించుకొనుటకు ప్రయత్నములు జరుగుటలేదు. అందుచేత అభివృద్ధి లేకున్నది. ఈ విషయములు విపులముగా భావి ఆంధ్రదేశాభివృద్ధి అను శీర్షిక క్రింద చర్చించబడును. ఇట్టి కారణములవల్ల క్రమముగా రైతులు బీదస్థితికి వచ్చుచున్నారు. చాలా వరకు ఋణగ్రస్తులైపోయిరి. వ్యవసాయముచేసి, కష్టించి పండించు రైతునకు కష్టములు తప్పుటలేదు. ఋతువు ఋతువునకూ తెగుచున్న బ్రతుకులంకెల నతుకుకొనుటయే మన రైతుకు మిగులుచున్నది. ఒక సుప్రసిద్ధ ఆర్థికశాస్త్రవేత్త వ్రాసినట్లు మన రైతు "He may slave all his life, but he can never free himself from the grip of the money lender. The result is "the Indian peasant is born in debt, lives in debt, dies in debt, and bequeaths debt" (జీవితకాలమంతయు కష్టించి నప్పటికీ అప్పులవాని దారుణ దంష్ట్రలనుండి బయట పడలేకున్నాడు. దీని ఫలితముగా రైతు అప్పులలో పుట్టి, అప్పులలో పెరిగి, అప్పులలో మృతినందు చున్నాడు. అప్పు అతని బ్రతుకునకు లిఖించిన మరణ శాసనమై పోయినది).

రైతు ఋణగ్రస్థత, రైతుల అప్పు దేశముయొక్క అప్పు!

భూమి తనఖా బ్యాంకులు మొదలైనవి రైతాంగము యొక్క అభివృద్ధికై పాటుపడుచు, రైతున కార్థికోపకృతి తరుణమున చేయుచున్నప్పటికిన్నీ రైతు, తన భూమిని తాకట్టుపెటుటవల్ల సంఘమున తనకు పరపతి తగ్గునన్న సిగ్గుచే ఇబ్బడి కిబ్బడి వసూలు వడ్డీ పేరట చేసుకొను వడ్డీ వ్యాపారస్తులవద్దనే ప్రామిసరీనోటు పద్ధతిపై అప్పులు తెచ్చుకొని నష్టపడి పోవుచున్నాడు. దేశములో రైతు ఋణగ్రస్తతకు అనేక కారణములు చెప్పబడినవి. వానిలో ముఖ్యమైన వాటిని చర్చింతము.

(1) ప్రస్తుతము అమరకములో నున్న భూమి చిన్నచిన్న చెక్కలుగా అనేక అమరకపుదారుల చేతిక్రిందనుండుట; అందుచేత ఆచిన్న భూభాగములపై వచ్చు ఆదాయము రైతునకు చాలక, అతడు నిత్య జీవనము గడుపుకొనుటకే శక్తిచాలక అప్పులు తెచ్చుకొనుచున్నాడు.

(2) పూర్వపు మన పరిశ్రమలు గ్రామ జీవితములలో మార్పులు వచ్చి, విచ్ఛిన్నమై పోవుటచేత రైతు కుటుంబ ములయొక్క ఉపాధి తగ్గి, వారు అప్పుల పాలగుచున్నారు.

(3) మన వ్యవసాయము, "నడుమ పర్జన్యు డనుగ్రహించ పనినాడేమిసేతు ?" వను భారతవాక్యము ప్రకారము రైతు కేవలము వర్షముపైననే ఆధారపడి యుండుటచే అనావృష్టి, అతివృష్టివల్ల నష్టపడిపోయి, అప్పులకు చేయి చాచవలసి వచ్చుచున్నది.

(4) మన వ్యవసాయదారుడు, అతని పశువులు రోగములవల్ల అధికముగా మరణించుచుండుట వల్ల, అనేక పర్యాయములు ప్రతి సంవత్సరమున్నూ నష్టపడు చున్నాడు. దీనికి మన ప్రదేశములలో, పశువులారోగ్యమునకు సంబంధించిన నిర్లక్ష్యముగూడా కొంతవరకు కారణమని చెప్పవచ్చును.

(5) ఇవిగాక మన రైతులు అధికముగా వ్యవహార పరిష్కారములకు కోర్టులకు పోయి అనేక వ్యయములకు లోనగుట, వివాహాది సమయములలో సంఘమున గౌరవ ప్రతిష్ఠ లధికమగునన్న భావముతో శక్తికి మించిన ధన వ్యయముచేసి నష్టపడుట.

ఈపై కారణములే కాక రైతుల నిరక్షరాస్యతను ఆధారము చేసుకొని వర్తకులు, వడ్డీ వ్యాపారస్థులు అధిక లాభములు తీయుచుండుటచేత రైతు ఋణభారము పెరిగి పోవుచున్నది.

మొత్తముమీద రైతు వ్యవసాయమునకు, పాడి పంటలకు ప్రత్యేకించి తెచ్చుకొను అప్పుచాలా తక్కువ అని చెప్పవచ్చును. ముఖ్యముగా పూర్వపు వ్యవసాయిక పరిస్థితుల నభివృద్ధిపరచకపోవుట రైతుల ఆర్థిక పతనమునకు చాలావరకు కారణము.

మన మద్రాసు రాష్ట్రమున 150 కోట్ల రూపాయలు రైతు ఋణముండునని (1935) డబుల్యూ.ఆర్ సత్యనాథన్, ఐ. సి. యస్. గారి రిపోర్టునుబట్టి తెలియుచున్నది. చాలా

కాలము క్రిందట, రైతు ఋణము మద్రాసు రాష్ట్రమున 45 కోట్ల రూపాయలుండునని అంచనావేసిరి. మన భారతదేశపు, మొత్తపు రైతుఋణములో మన చెన్నరాష్ట్ర రైతు ఋణము ఆరవ వంతుండును.

**రైతు ఋణ విమోచనము చట్టము**

రైతుల ఋణ విముక్తుల జేయుటకు మన చరిత్రనుబట్టి క్రీ. పూ. 5 వ శతాబ్దము నాటినుండియు ప్రయత్నములు జరుగుచున్నవని చెప్పవచ్చును. నూటికి ఆరు రూపాయిల కన్న వడ్డీని అధికముగా తీసుకొనుట పూర్వము నిషేధింపబడినది. ఎట్టి పరిస్థితులలోను వడ్డీ అసలుకు రెట్టింపు మించరాదు. మహమ్మదీయు ప్రభుత్వకాలములో ప్రభుత్వమువారి ఉన్నతోద్యోగులకు, రాజకుటుంబీకులకు "ప్రభుత్వపు అప్పు" (State loan) ల నిచ్చెడివారు. కరువులు, జబ్బులు, అనావృష్టి మొదలైన కష్టకాలములలో రైతులకుకూడా అప్పుల నిచ్చెడివారు. 1793 నుండి బ్రిటిష్ ప్రభుత్వకాలములో అనేక కరువులు, కష్టములు వచ్చుటచేత ప్రభుత్వమువారు ఈ విషయమున జోక్యము కల్పించుకొని చట్టముల చేయుటకు ఆరంభించిరి. చెన్నరాష్ట్రమున "కోర్టు ఆఫ్ వార్డ్సు" చట్టము కొంతవరకు ఋణ భారము నరికట్టినది. "1874 డక్కన్ ఎగ్రికల్చరిస్ట్స్ ఆక్టు", "1886 ఎమెండ్ మెంటు ఆక్టు", "1884 ఎగ్రికల్చరిస్టు లోను ఆక్టు", "1904 కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ ఆక్టు "1934 మద్రాసు డెటర్సు ప్రొటెక్షన్ ఆక్టు", "1938 ఋణ నివారణ చట్టము" మొదలైనవి పెరుగుచున్న రైతు ఋణగ్రస్తతను అరికట్టుటకే ఉద్దేశించి చేయబడినవి. కాంగ్రెస్ ప్రభుత్వమువారు అమలుపరిచిన 1938 చట్టము రైతాంగమునకు ఎక్కువగా తోడ్పడినది. 1918 నాటి "అన్యాయపు వడ్డీ అప్పుల చట్టము" (Usurious Loan Act) కూడా ఈ ఉద్దేశ్యమును చాలావరకు నెరవేర్చినది. మన భారతదేశపు రైతులు 1931—1935 ల మధ్యకాలములలో 544,230 ఎకరముల భూమి పోగొట్టుకొని, 41,315 ఎకరముల భూమిని సంపాదించినట్లు అంచనా వేయబడినది. కావున మన భారతదేశ రైతాంగమునకు వచ్చిన నష్టము 502,915 ఎకరములు అని తెలియుచున్నది. ఈ రైతు ఋణగ్రస్తతను తగ్గించుటకు ఒక్క ఋణవిమోచన చట్టము చేసినచాలదు. ఈ కృషి బహుముఖము కావలెను. రైతునకు వ్యవసాయికాభివృద్ధికి మార్గములు చూపించవలెను. పన్నుల భారము, నజరానాల భారము, వ్యవహారముల ఖర్చులు మొదలగునవి తగ్గునట్లు చూడవలెను. అసలు ప్రభుత్వము ప్రజల ఉన్నతికి సంబంధించిన అన్ని విషయములలోను శ్రద్ధ వహించవలెను. దేశమునకు వెన్నెముక వంటి రైతు విషయము అశ్రద్ధవహించుటయన్న దేశము విషయములో అశ్రద్ధ వహించుటయే !

మన ఆంధ్ర దేశమున చాలావరకు రైతులు అప్పులను వ్యక్తి పలుకుబడిమీదనే తెచ్చుకొనుచున్నారు. ఈ వ్యక్తుల కప్పునిచ్చు పద్ధతి లైసెన్సు పద్ధతిపై నుండుట మంచిది! ఇంతకుముందు చర్చించిన క్షామములు రైతుల స్థితిని చాలావరకు క్రుంగదీసిన విషయము గమనింపదగినది.

**మనదేశ పారిశ్రామిక సంపద**

పైన వ్యవసాయిక స్థితిగతులు, రైతు ఋణగ్రస్తత మొదలైన వాటిని సూచించియుంటిమి. యింక పారిశ్రామిక సంపదనుగురించి చెప్పవలెను. కానీ, వస్తూత్పత్తి విచారణమునకు కావలసినంతవరకు యిచ్చట చర్చింతము. మన ఆంధ్రదేశములో సంప్రదాయానుసారముగా కుండలు చేసుకొనుట, కమ్మరి, వడ్రంగము పనులు చేసుకొనుట మొదలైన కులవృత్తులు కలిగినవారనేకు లున్నారు. కానీ, యిట్టివారు చేసుకొను పనులన్నియున్నా పెద్ద పరిశ్రమల క్రింద చెప్పుటకు వీలులేదు. అవి పరిశ్రమలకు తోడుగానుండునవి. ఎక్కువ వస్తువుల నుత్పత్తి చేయుటకు ఏర్పడిన పెద్ద సంస్థలనే పరిశ్రమలందురు. ఫ్యాక్టరీ నివేదికలను పరిశీలించినచో చెన్నరాజధానియందు ఇట్టి పరిశ్రమ లెన్ని యున్నవో, ఆంధ్ర జిల్లాలలో ఎన్ని యున్నవో విశదమగును. సాధారణముగా 15 మంది పనివారికి తక్కువగాకుండా కలసి పనిచేయుచుండు ప్రతి పరిశ్రమగూడా ఫ్యాక్టరీ చట్టముక్రింద చేర్చబడును. మొత్తము మన రాజధానిలో 1940 లో 1891 ఫ్యాక్టరీ లున్నవి. వానిలో 528 ఫ్యాక్టరీలు సంవత్సరమంతయు పనిచేయవు. కారణము ఇవి ఋతువుల ననుసరించి యుండు పరిశ్రమ లగుటచేతనే ! సంవత్సరమంతయూ పనిచేయు ఫ్యాక్టరీలు 1363 వున్నవి. మన పారిశ్రామిక

సంపద కాటపట్టులయిన ఈ ఫ్యాక్టరీలు తెలుగు జిల్లాలలో ఎచ్చట ఎన్నియున్నదీ ఈ క్రింది పట్టికవల్ల తెలుసుకొనవచ్చును.

| జిల్లా పేరు | సం॥ మంతయు పని చేయు ఫ్యాక్టరీలు | సం॥ములో ఋతవులనను సరించి పని చేయునవి |
|---|---|---|
| విశాఖపట్నం | 98 | 9 |
| తూర్పు గోదావరి | 69 | 5 |
| పశ్చిమ గోదావరి | 86 | 0 |
| కృష్ణా | 97 | 21 |
| గుంటూరు | 87 | 35 |
| నెల్లూరు | 25 | 2 |
| కడప | 14 | 23 |
| అనంతపురం | 19 | 48 |
| బళ్లారి | 23 | 89 |
| కర్నూలు | 27 | 40 |
| చిత్తూరు | 20 | 4 |
| మొత్తం | 565 | 276 |

ఈ తెలుగుజిల్లాలలోని ఫ్యాక్టరీలలో సంవత్సరముపొడుగునా పనిచేయువాటిలో ప్రతిదినము సగటున 36,820 మందిని, కొన్నాళ్లు పనిచేయు ఫ్యాక్టరీలలో 14,410 మందిని పని చేయుదురు. పైగా, ఈ సంఖ్యలను బట్టి మరికొన్ని విషయములు తెలియుచున్నవి. రాష్ట్రమునందలి ఫ్యాక్టరీలలోసగము భాగముకంటె అధికముగా ఆంధ్రప్రాంతములయందేయున్నవి. కానీ వీటిలో పనిచేయుచున్న పనివారి సంఖ్యమాత్రము, రాష్ట్రమునందలి ఫ్యాక్టరీ కార్మికుల సంఖ్యయందు అయిదవ వంతు మాత్రమే! దీనిని బట్టి తెలుగు జిల్లాలలో అనేక మంది కార్మికుల నియోగించి పనిచేయు పెద్దపెద్ద పారిశ్రామిక కేంద్రముల సంఖ్య తక్కువనిన్నీ, అట్టి పరిశ్రమలు ఇతర జిల్లాలలో ఎక్కువగా నున్నవనిన్నీ చెప్పవచ్చును. తిరుపతిలోను మదనపల్లిలోను గ్రామ పరిశ్రమలున్నవి. ఈ పరిశ్రమలలో మొత్తము 15 వందల మందికి పైగా పనిచేయుచున్నారు. ఇందు పెట్టుబడి మొత్తము 17 వందల రూపాయలకు పై బడియుండును. వీటికికూడా మన సహకార సంఘములు తోడ్పడుచున్నవి. మన పారిశ్రామిక స్థితిని మనము ఇంకా అభివృద్ధి నొందించుకొనవలెను. మన పరిశ్రమలయొక్క అభివృద్ధికి ఆధార భూతములయిన కొన్ని సంస్థలను గురించి చెప్పవలసి యున్నది.

### ముఖ్యమైన కొన్ని పరిశ్రామిక సంస్థలు

ఆంధ్రా చేంబర్ ఆఫ్ కామర్సు :— ఆంధ్ర దేశము యొక్క ఆర్థిక వాణిజ్య పారిశ్రామిక హక్కులను, ప్రయోజనములను సంరక్షించి అభివృద్ధి నొందించు నుద్దేశ్యముతో 1927 వ. సం॥మున దివాన్ బహదూర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడు, శ్రీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, సి. రంగనాయకులు చెట్టి, వావిళ్ల వెంకటేశ్వర శాస్త్రులు, నారాయణ దాస్ గిరిధరదాస్ మొదలైన ప్రముఖులచే ఇది స్థాపింపబడినది. ఆంధ్ర దేశమునందలి అన్ని జిల్లాలలోని వర్తకులు ఈ సంఘమున సభ్యత్వము వహించిరి. ఇది అఖిలభారతవాణిజ్యసమ్మేళనము (Fedaration of Indian Chamber of Commerce) తో అనుబంధింపబడినది. ఈ సంఘము తెలుగు జిల్లాలలోని వాణిజ్య సంస్థలకును, బ్యాంకింగ్ సంస్థలకును ప్రతినిధిగా భారతప్రభుత్వము వారిచేత అంగీకరించబడెను. మద్రాసు కార్పరేషన్ ఎక్సైజు లైసెన్సింగ్ బోర్డు, మద్రాసు ఇండస్ట్రీస్ బోర్డు, గవర్నమెంటు హాస్పిటలు సలహా సంఘము, బోర్డు ఆఫ్ కమ్యూనికేషన్సు, ప్రావిన్షియల్ కాటన్ కమిటీ, ప్రావిన్షియల్ ఎడ్వైజర్ కమిటీ ఆఫ్‌వార్ సప్లైస్, ఎక్స్‌పోర్టు అడ్వయిజరీ కౌన్సిలువారి మద్రాసు పోర్టు కమిటీ, మద్రాసు పోర్టుట్రస్టు బోర్డు, రైల్వే రేట్సు అడ్వైజర్‌కమిటీ మొదలైన సంస్థలలో ఈ సంఘమునకు ప్రాతినిధ్యము గలదు.

ఈ సంఘాధ్యక్షులు నారాయణదాసు గిరిధరదాసు గారు ఉపాధ్యక్షులు కె. సూర్యనారాయణరావుగారు; గౌరవ కార్యదర్శి వి. వెంకటేశ్వర శాస్త్రులుగారు.

### ఆంధ్రా ఎంజినీరింగ్ కంపెనీ లిమిటెడ్

ఈ సంస్థను, (విశాఖ-బెజవాడ) మొదట డి. ఎల్. నర్సింహారాజుగారున్నూ, మరికొందరు భాగ స్వాములున్నూ కలసి వర్తక సంఘముగ స్థాపించిరి. 1929 వ సం॥న ఇది 3 లక్షల రూపాయల పెట్టుబడితో ప్రైవేటు లిమిటెడ్ కంపెనీగా మార్చబడెను. పిమ్మట నర్సింహారాజుగారు ఆంధ్ర



కీ. శే. శ్రీ దంతులూరి లక్ష్మీనర్సింహరాజు, బి.ఏ., బి.ఎస్‌సి., ఎమ్. ఎస్‌సి., ఎమ్.ఎల్.ఏ. విశాఖపట్నంలో ఆంధ్రా ఇంజినీరింగ్ కంపెనీ స్థాపించి మానేజింగ్ డైరెక్టరుగా నుండిరి. ఆంధ్రా సిమెంటు, విశాఖపట్నం పంచదార ఫాక్టరీల స్థాపకులు.

దేశమున ముడిపదార్థ సంపదను గురించి సమగ్రముగా పరిశోధనలుసల్పి, అనేక పరిశ్రమల నెలకొల్ప వచ్చునని కనుగొనిరి. అందుకుగాను విశాఖపట్టణమునందు విద్యున్నిర్మాణశాల నేర్పరచుట అవసరమని తలచి, లైసెన్సు కొరకు దరఖాస్తు చేసిరి. అధికారు లిచ్చటి అవకాశములను ఆలోచించి విశాఖపట్నం, బెజవాడలలో థర్మల్ స్టేషనుల నిర్మించిరి. కానీ, నర్సింహరాజుగారికి అనకాపల్లి, విశాఖపట్నం ప్రాంతములలో విద్యుచ్ఛక్తిని సృష్టి చేయుటకు అనుమతి నొసగిరి. ఇందుకుగాను రు 6 లక్షల పెట్టుబడితో, విశాఖపట్నం ఎలక్ట్రిక్ సృష్టి కార్పరేషన్; అనకాపల్లి ఎలక్ట్రిక్ సృష్టి కార్పొరేషన్ అను రెండు లిమిటెడ్ సంఘములు ఏర్పరచ బడెను. ఈ పై రెండుగాక, 3 లక్షల రూపాయల పెట్టుబడితో 'విశాఖపట్నం సుగర్ అండ్ రిఫైనరీస్' అనుపేర మరియొక పారిశ్రామిక సంస్థ నెలకొల్పబడెను. ఈ పెట్టుబడి, తర్వాత రు 6 లక్షలకు అధికము చేయబడెను. అనకాపల్లి దగ్గర తుంపాలలో నున్న ఈ కంపెనీవారి పంచదార ఫ్యాక్టరీ రోజుకి 200 టన్నుల చెరకును ఆడగలదు.

ఆంధ్రా సిమెంటు కంపెనీ లిమిటెడ్ :— నర్సింహరాజుగారు స్థాపించిన పరిశ్రమలన్నిటి యందును ఇది పెద్దది. లక్షల పెట్టుబడితో ఇది ప్రారంభింప బడినది. ఈ కంపెనీ వారు తమ బెజవాడ ఫ్యాక్టరీలో అత్యుత్తమమైన సిమెంటు తయారు చేయుచున్నారు. భారత ప్రభుత్వము వారును, మద్రాసు ప్రభుత్వము వారును ఈ కంపెనీవారి సిమెంటు విరివిగా వాడుక చేయుచున్నారు.

ఈస్టుకోస్టు సిరెమిక్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ :— దీనిని 1938 లో 10 లక్షల రూపాయిల పెట్టుబడితో నర్సింహరాజు గారు నెలకొల్ప ప్రయత్నముల చేసిరి. కాని నెరవేరలేదు.

ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ లిమిటెడ్ :— ఈ సంస్థ, 1927 లో మచిలీపట్నమున స్థాపించబడెను. 1939-40 సంవత్సరములో ఈ కంపెనీవారి పెట్టుబడి రు 2,44,976లు 1939-40 సంllలో వీరు 8% డివిడెండు పంచిరి. ఇది భారతదేశమున ప్రఖ్యాతిగడించిన సంస్థలలో నొకటి. దీనికి సంబంధించిన వివరణములు పరిశ్రమలను అధ్యాయమున చూడుడు. ఇవిగాక ఈ పారిశ్రామికాభివృద్ధికి దోహదకారులైయున్న కంపెనీలలో చెప్పవలసినవి ; బెజవాడ ఆంధ్రా ఫార్మస్యూటికల్ వర్క్సు, మద్రాసు ఎనామిల్ వర్క్సు. యివి రెండున్ను, ఆంధ్రులు స్థాపించి జయప్రదముగా నడుపుచున్న సంస్థలు. పరిశ్రమలన్న అధ్యాయములో వీటికి సంబంధించిన వివరణము లున్నవి.

ఆంధ్రా ఇన్సూరెన్సు కంపెనీ :—భారత దేశము నందలంటను ప్రఖ్యాతి గాంచిన నాయకులు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య, డాక్టరు కోకా అహోబలరావు మొదలైన ప్రముఖులచే 1925 సంవత్సరములో మచిలీపట్నమున స్థాపింపబడెను. యర్రమిల్లి మంగయ్యగారు ప్రారంభము నుండి దీనికి కార్యదర్శిగా నుండిరి. ఇది ఆంధ్రులచే నెలకొల్పబడి జయప్రదముగా నిర్వహించబడిన ప్రథమ భీమా సంస్థ. ఈ కంపెనీ సత్వరాభివృద్ధి ఆంధ్రుల కార్యదీక్షను సర్వతోముఖముగా చాటుచున్నది. భారత దేశపు ప్రధాన సంస్థలలో ఇది యొకటి. ఇందుకు దీని ఈ ప్రక్క లెక్కలే నిదర్శనములు.

| సంవత్సరము | అమలులో నున్న పాలసీల సంఖ్య | భీమా మొత్తం రూపాయలు | జీవిత భీమా ని॥ రూపాయలు |
|---|---|---|---|
| 1926 | 341 | 5,21,500 | 4761 |
| 1930 | 2,483 | 36,38,000 | 2,15,121 |
| 1935 | 8,098 | 98,00,700 | 11,15,387 |
| 1940 | 14,805 | 176,03,057 | 31,33,863 |

| సంవత్సరము | ఆస్థుల మొత్తం. రూపాయలు. | ప్రీమియలు. రూపాయలు. | చెల్లించిన క్లెయిములు. |
|---|---|---|---|
| 1926 | 42,460 | 23,402 | 1000 |
| 1929-30 | 2,88,110 | 1,92,975 | 22,000 |
| 1935 | 13,06,542 | 4,60,888 | 60,650 |
| 1940 | 34,34,825 | 8,53,505 | 109,746 |

ఈ కంపెనీ వారు మొదటి వాల్యుఏషన్‌లో వెయ్యికి 10 రూ॥ లు; 2 వ వాల్యుఏషన్‌లో 1000 కి—15 రూ॥ లు బోనసు పంచిపెట్టిరి. ఈ కంపెనీ యొక్క ధనము దేశీయ పరిశ్రమలలోను, రైతుల కుపయోగించు భూమి తనఖా బ్యాంకులలోను నిల్వ చేయబడుచున్నది. దీని శాఖోపశాఖలు భారత దేశమంతయు వ్యాపించి పనిచేయు చున్నవి.

ఇవిగాక, డక్కన్ ఇన్సురెన్సు కంపెనీ, హిందూస్థాన్ మ్యూచుయల్ ఇన్సురెన్సు కంపెనీ, విజయలక్ష్మి ఇన్సురెన్సు కంపెనీలు ఆంధ్రదేశమున స్థాపింపబడి పనిచేయుచున్నవి.

ఈ కంపెనీలు ఇంకా అభివృద్ధి చెందక పోవుట శోచనీయము ఇక మన దేశసంపద కాలవాలములైన బ్యాంకులను గురించి తెలుసు కొనవలెను.

ఆంధ్రదేశమున ప్రజలకు గావలసిన పరపతి సౌకర్యముల నిచ్చు వడ్డీ వ్యాపారము అధికముగా ఇంకను సాహుకారుల చేతిలో నున్నది. ప్రస్తుతము ఈ ప్రాంతమున వడ్డీ వ్యాపారము చేయుచున్న జాయింటు స్టాకు బ్యాంకులలో ముఖ్యమైనవి. (1) ఇంపీరియల్ బ్యాంకు (2) ఆంధ్రా బ్యాంకు (3) భారత లక్ష్మీ బ్యాంకు (4) ఇండో కమ్మెర్షియల్ బ్యాంకు (5) ఇండియన్ బ్యాంకు (6) హిందుస్థాన్ బ్యాంకులు. వీనిలో ఆంధ్ర భారత లక్ష్మీ బ్యాంకులు రెండునూ ఆంధ్ర ప్రముఖులచే నెలకొల్ప బడినవి.

**మన బ్యాంకులు- ఆంధ్రా బ్యాంకు భారత లక్ష్మీ బ్యాంకు**

ఆంధ్రా బ్యాంకు లిమిటెడ్ :— ఈ సంస్థ 1923 లో డాక్టరు పట్టాభి సీతారామయ్య మొదలగువారిచే మచిలీపట్నమున స్థాపింప బడినది. ఫిక్సెడు డిపాజిట్లకు 100 కు సం॥మునకు 3¼% చొ॥న వడ్డీ నిత్తురు. వీరు అన్ని ప్రాంతములలోను హుండీలు చాలా స్వల్పమైన కమీషనుతో వసూలుచేయు చున్నారు. విజయనగరం, కాకినాడ, సామర్లకోట, రాజమండ్రి, ఏలూరు, బెజవాడ, గుంటూరు, నర్సారావుపేట ఒంగోలు, నెల్లూరులలో దీని శాఖలు పని చేయుచున్నవి.

భారత లక్ష్మీ బ్యాంకు లిమిటెడ్ :— దీనిని మచిలీపట్నమున 1929 సం॥ మున డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు స్థాపించిరి. దీని పెట్టుబడి ఒక లక్ష రూపాయిలు. వసూలు చేసిన మూలధనం రు 39,950 లు. బ్యాంకు రిజర్వుఫండు 5646 రూపాయిలు. కంటింజెంటు రిజర్వు క్రింద రు 1892 లు కలవు. 2 లక్షల రూపాయిలకు పైగా డిపాజిట్లు గలవు. ఈ బ్యాంకు క్రమేణా అభివృద్ధి పొందు చున్నది. 1941 సంవత్సరము జూన్ నెలాఖరు అర్ధ సంవత్సరమున నూటికి రు 6 లు చొ॥న డివిడెండు ప్రకటింప బడెను.

## సహకారోద్యమము.

బ్యాంకులనుగూర్చి చెప్పిన తర్వాత అన్ని పరిశ్రమలకూ, జాతీయ వికాసమునకూ అభ్యుదయకరమైన తోడ్పాటు నిచ్చు సహకారోద్యమమును గూర్చి చర్చించవలెను. దేశమునకు వెన్నెముకవంటి వ్యవసాయదారులకు, పారిశ్రామికులకు ఆర్థిక క్లిష్టపరిస్థితు లేర్పడినప్పుడు వారికి తోడ్పడుట, మన స్వయంపోషక శక్తి నభివృద్ధి పరచుట ఈ ఉద్యమపు ఉన్నతాశయములు. మద్రాసు ప్రభుత్వమువారు సహకారోద్యమమును చట్టబద్ధమును చేయుచు, 1932 లో మద్రాసు సహకార సంఘ చట్టము (చట్టము 6)ను చేసిరి.

**సహకారోద్యమము- ఆంధ్రుల నాయకత్వము**

ఇతర రాష్ట్రములలోవలె చెన్నరాజధానిలో 1904 వ సంవత్సరములోనే ఈ ఉద్యమము ఆరంభించబడినది. 1938 సంవత్సరములో 13,138 సంఘములు చెన్నరాజధానిలో

రిజిస్టరు చేయబడెను. అందులో వ్యవసాయిక సంఘములు 11,184. వ్యవసాయిక సంఘములు గాకుండా ఉన్న సంస్థలు 1653. తక్కినవి సెంట్రలు బ్యాంకులు. వ్యవసాయిక సంస్థలు చాలా భాగము మన పల్లెలలో గ్రామీణులకు తోడ్పడుచు పని చేయుచున్నవి. 1938 నాటికి ఈ సంస్థ లన్నింటిలోను 934,400 మంది సభ్యులుండిరి. అనగా ఒక్కొక పరపతి సంఘము సగటున 71 మంది సభ్యులకు తక్కువ లేకుండా యున్నదన్నమాట! 1941 నాటికి పెట్టుబడి ధనము 25 కోట్ల రూపాయలు పైగానుండును.

సహకారోద్యమాభివృద్ధి పట్టిక.
(ప్రతి పది సంవత్సరములకు)

| సంవత్సరము | అన్ని సొసైటీల సంఖ్య. | సభ్యుల సంఖ్య | సంఘములలో పెట్టుబడి. లక్షల రూపాయలు. |
|---|---|---|---|
| 1905-6 | 27 | 2,733 | 1.07 |
| 1915-16 | 1,800 | 137,498 | 168.88 |
| 1925-26 | 11,979 | 748,783 | 1132.80 |
| 1935-36 | 13,330 | 903,870 | 1763.80 |
| 1940-41 | 14,547 | 11,96,543 | 2,509.97 |

(కో-ఆపరేటివ్ ఇయర్ బుక్ నుండి)

ఈ సహకారసంస్థల క్రిందనే భూమి తనఖా బ్యాంకులు, పంటపై అప్పులనిచ్చు సంస్థలు (Crop loan Societies) చెప్పవలసియున్నది. 1938 (జూన్-30 వ తేదీ) నాటికి 18 సెంట్రలు కో ఆపరేటివ్ బ్యాంకులు తెలుగు జిల్లాలలో నున్నవి. 1938 నాటికి మన రాజధానిలో ప్రధాన భూమి తనఖా బ్యాంకులు (Primary Land Mortagage Banks) 119 కలవు.

తెలుగు జిల్లాలలోని భూమి తనఖా బ్యాంకులు

| | సంఖ్య | | సంఖ్య |
|---|---|---|---|
| విశాఖపట్నం | 9 | కడప | 3 |
| తూర్పు గోదావరి | 7 | కర్నూలు | 2 |
| పశ్చిమ గోదావరి | 6 | బళ్లారి | 1 |
| కృష్ణా | 7 | అనంతపురం | 1 |
| గుంటూరు | 6 | చిత్తూరు | 3 |
| నెల్లూరు | 5 | ఇతర జిల్లాలు | 69 |
| | | వెరశి | 119 |


కీ. శే. దివాన్‌బహదూర్ సర్ మోచర్ల రామచంద్రరావు.

మన ఆంధ్ర రాష్ట్రములో సహకారోద్యమము ఇతర ఉద్యమములవలె చక్కగా నెలకొనినది. తూ॥ గో॥ జిల్లాలో సహకారోద్యమములు బాగుగా పనిచేయుచున్నవి. ఈ ఉద్యమాభివృద్ధికి ఆంధ్రుల నాయకత్వము ఎంతయో కారణ భూతమైనందుకు గర్వింపవలసియున్నది. కీ॥ శే॥ దివాన్ బహదూర్ సర్ మోచర్ల రామచంద్రరావుగారు మొట్టమొదట మద్రాసు రాజధానిలో రాష్ట్ర భూమితనఖా బ్యాంకు ఉద్యమమును స్థాపించి, దానికి ప్రథమమున వారే అధ్యక్షత వహించిరి. తర్వాత వేమవరపు రామదాసుపంతులు గారు ముఖ్యముగా ప్రశంసింపదగినవారు. వీరు దీనికి సంబంధించిన గ్రంథములు, పత్రికా రచనముచేసి అనేక పరపతి సంఘముల నెలకొల్పి, అఖిల భారత కో-ఆపరేటివ్ ఇన్‌స్టిట్యూట్స్ అసోసియేషన్‌కు, ఇండియన్ ప్రొవిన్షియల్ కో-ఆపరేటివ్ బ్యాంకుల అసోసియేషన్‌కు అధ్యక్షులై, అఖిలభారతదేశములోను ఈ ఉద్యమనిర్వాహకులుగా ఖ్యాతి కెక్కిరి.

మద్రాసు రాష్ట్ర కో-ఆపరేటివ్ యూనియన్‌కు అధ్యక్షులుగా నున్నవారి పట్టిక, మన రాజధానిలోని సహకారసంస్థలు, అవి ప్రైవేటు సొసైటీలకు 1940-41 సం॥లో ఇచ్చిన అప్పుల పట్టిక క్రింద ఇవ్వబడినవి.

| కాలము | అధ్యక్షులు. |
|---|---|
| 1914—16 | శ్రీ ఎమ్. ఆదినారాయణయ్య |
| 1916—20 | ,, కె. బి. రామనాథ అయ్యర్ |
| 1920—21 | ,, టి. ఆర్. వెంకట్రామ శాస్త్రి |
| 1922—24 | ,, రావుబహదూర్ ఎ. వేదాచలయ్యర్ |
| 1924—26 | ,, సర్ కె. వి. రెడ్డి |
| 1926—40 | ,, వేమవరపు రామదాసుపంతులు |
| 1940—.. | ,, టి. ఏ. రామలింగ చెట్టియార్ |

| సంఖ్య. | రాజధానిలోని సహకార బ్యాంకి పేరు. | దీర్ఘవాయిదా. రూపాయలు | స్వల్పవాయిదా. రూపాయలు |
|---|---|---|---|
| 1. | చికాకోల్ కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 7,342 | 137,517 |
| 2. | కో-ఆపరేటిన్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, విజయనగరం. | 1,000 | 10,28,094 |
| 3. | డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్, కాకినాడ. | 972 | 15,60,698 |
| 4. | రాజమండ్రి కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 49,454 | 4,02,616 |
| 5. | రామచంద్రపురం కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 1,90,221 | 19,44,623 |
| 6. | కోనసీమ కో-ఆరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, అమలాపురం. | 54,890 | 18,81,084 |
| 7. | పశ్చిమ గోదావరి డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, ఏలూరు. | 47,924 | 30,20,820 |
| 8. | కృష్ణా కో-ఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్, మచిలీపట్నం. | 960 | 48,31,022 |
| 9. | విజయవాడ కో-ఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్, బెజవాడ. | 29,125 | 22,25,006 |
| 10. | గుంటూరు డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్, తెనాలి | 106,455 | 36,39,841 |
| 11. | నెల్లూరు డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్. | 16,591 | 12,04,256 |
| 12. | కడప డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 50,302 | 7,52,798 |
| 13. | కర్నూలు డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 28,607 | 1,30,223 |
| 14. | హాస్పేట కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 8,010 | 1,77,915 |
| 15. | అనంతపూర్ డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 46,510 | 3,93,530 |
| 16. | చిత్తూరు డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 24,089 | 2,36,053 |
| 17. | మద్రాసు డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 3,44,637 | 22,18,826 |
| 18. | మద్రాసు ప్రోవిన్షియల్ కో-ఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్. | 5,28,880 | 131,05,998 |
| 19. | కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, వేలూరు. | 2,55,355 | 8,56,854 |
| 20. | సౌత్ ఆర్కాట్ డిస్ట్రిక్టు కో-ఆపరేటిన్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, కడలూరు. | 4,052 | 1,73,167 |
| 21. | కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, కంజీవరం. | 44,990 | 5,61,981 |
| 22. | కోయంబుత్తూరు డిస్ట్రిక్టు అర్బన్ బ్యాంకు లిమిటెడ్. | 7,58,624 | 21,24,957 |
| 23. | మధుర-రామనాడ్ సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్, మధుర. | 1,31,094 | 17,66,290 |
| 24. | శ్రీవిల్లిపుత్తూర్ కో-ఆపరేటివ్ బ్యాంకు యూనియన్ లిమిటెడ్. | 4,016 | 1,39,289 |
| 25. | సేలం డిస్ట్రిక్టు అర్బన్ బ్యాంకు లిమిటెడ్, సేలం. | 6,73,097 | 30,14,269 |
| 26. | కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, కుంభకోణం. | 90,225 | 4,47,256 |
| 27. | కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, తంజావూరు. | 29,398 | 3,97,262 |
| 28. | తిన్నవెల్లి డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, తిన్నవెల్లి. | 88,595 | 16,29,480 |
| 29. | తిరుచునాపల్లి డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్. | 5,93,360 | 8,00,670 |
| 30. | సౌత్ కనరా సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్, మంగుళూరు. | 47,931 | 19,83,821 |
| 31. | మలబార్ డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, కాలికట్టు. | 1,83,880 | 5,75,655 |

తర్వాత చెప్పదగిన వారు నర్సింహాదేవర సత్య నారాయణగారు. వీరు యీఉద్యమమునకు సంబంధించిన కరపత్రములు, గ్రంథములు వ్రాసియు, ఉపన్యాసముల నిచ్చియు అధిక ప్రచారముచేసి తోడ్పడిరి.

భూమి తనఖా బ్యాంకులలోను, పరపతి సంఘముల లోను రైతులకు అప్పులు తక్కువ వడ్డీపై నిత్తురు. స్వల్ప కాలపు ఋణములనీ, దీర్ఘకాలపు ఋణములనీ ఇందు నిర్ణయ మున్నది. పంటలపై అప్పులనిచ్చు సంస్థలలో చాలా భాగము గ్రామీణులకు చేరువగా పనిచేయుచు, అధిక ప్రయోజనకరములుగానున్నవి. ఇది భారతదేశ ఉద్య మములలో ఇంకా అభివృద్ధి చెందదగియున్నది. రైతులు ఇతర చోట్ల వ్యక్తులవద్ద కాక, ఈ పరపతి సంఘములలో అప్పు తెచ్చుకొని వ్యయప్రయాసలకు లోనుగాకుండా ఆర్థికపరిస్థితులను చక్కపెట్టుకొనవచ్చును.

1940-41 సంవత్సరములో యీ సహకారోద్యమము ఇంకా అభివృద్ధిచెందినట్లు ప్రభుత్వము వారి రిపోర్టులనుబట్టి తెలియుచున్నది. 1941 లో జరిగిన ఆంధ్రా ప్రొవిన్షల్ కో-ఆపరేటివ్ కాన్ఫరెన్సు ఇందలి ప్రధాన ఘట్టములలో నొకటి. 1940-41 సంవత్సరములో పంటపై తాకట్టు పెట్టుకొని 14,2,56 లక్షల రూపాయలు చెన్నరాజధానిలో మొత్తముమీద అప్పునిచ్చిరి. దీనిపై నిఖరాదాయము 67 వేల రూపాయలున్నూ, 20 వేల రూపాయలు నష్టమున్నూ ఈ సంస్థలకు వచ్చినది. ముఖ్యముగా ఈ సంస్థలు మన రాజధానిలో అనేక చిన్నచిన్న కుటీర పరి శ్రమలను పోషించుచున్నవి. దీనికి నిదర్శనముగా నెల్లూరు స్త్రీకుటీర పరిశ్రమల సంఘము, గూడూరు స్త్రీకుటీర పరిశ్రమల సంఘము, కొండపల్లి బొమ్మల తయారుచేయు సంఘము, విశాఖపట్టణ స్త్రీకుటీర పరిశ్రమల సంఘము, పిఠాపురంలోని తేనె, మైనము తయారు చేయు పారిశ్రామిక సంఘము, కండేవరం నేతగాంధ్రేడ సంఘము, రామచంద్ర పురం స్త్రీ పారిశ్రామిక సంఘము, పెరవలిలోని బెల్లము తీయు సంస్థ, ఏలూరు స్త్రీకుటీర పారిశ్రామిక సంఘము, బళ్లారి స్త్రీకుటీర పారిశ్రామిక సంఘము, జమ్మలమడుగు స్త్రీకుటీర పారిశ్రామిక సంఘము, ప్రొద్దుటూరు స్త్రీకుటీర పారిశ్రామిక సంఘము, కడప-బళ్లారి పారిశ్రామిక స్త్రీ సంస్థ, కేశవపురం బెల్లము తీయు వారి సంస్థ, గుంటూరు శిల్ప పారిశ్రామిక సంస్థ, కాపూరు వినయాశ్రమ నేతగాంధ్రేడ సంస్థ, గూడూరు నేతగాంధ్రేడ సంఘము, మద్దికెర స్త్రీ పారిశ్రామిక సంస్థ, పట్టికొండ నేతగాంధ్రేడ సంస్థ, కర్నూలు తివాశీ నేత సంఘము మరియు బుట్టల పనివారి సంఘము, తిరుపతిలోని పూసలుబొమ్మలు చేయువారి సంఘము, తిరుపతి స్త్రీ కుటీర పారిశ్రామిక సంఘము మొదలైన వాటిని చెప్పవచ్చును.

**సహకారోద్యమము కుటీర పరిశ్రమలకు. పెద్ద పరిశ్రమలకు చేయు తోడ్పాటు**

పెద్దపరిశ్రమలలో వుయ్యూరు పంచదార ఫ్యాక్టరీ మొదలైన వాటిని చెప్పవచ్చును. ఇట్లు ఈ ఉద్యమము పరిశ్రమలకు, తోడ్పడుచున్నది. ఈ రాష్ట్రమున 1940-41 సంవత్సరాంతమున 14,251 సహకార సంఘములు గలవు. వీటిలో పై చెప్పినవిగాక ఎరువుల సంఘములు, పాలసప్లై సంఘములు, ఇరిగేషన్ సంఘములు, చెరుకు సాగుదార్ల సంఘములు, నెయ్యి కిల్లీసంఘములు గలవు. మన రాష్ట్రమునందలి రైతు ఋణగ్రస్తతను తగ్గించుట కనల్పముగా కృషిచేయు చున్నది. వ్యవసాయదారులకు ఈ భూమితనఖా బ్యాంకులు ఎంతయో తోడ్పాటును చూపుచున్న విషయము దీని ఆదర్శమును, కార్యక్రమమును గమనించినచో నేరుగా చెప్పుట యనవసరము.

---

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయ్!
ఒకరి మేల్ తనమే లనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయ్!

—గురజాడ.

యుద్ధ




భయము

**భయపడ నేల?** ఇండియన్ మ్యూచుయల్ లైఫ్ అసోసియేషను లిమిటెడ్, నెం 10. మౌంటురోడ్డు మద్రాసునందు పట్టాదారు (మెంబర్లు) అయి యున్నవారికిని, కానున్న వారికి నెల్లరకును తమ పట్టాలు (జారీచేయబడినవి లేక జారీచేయబడనున్నవి) యుద్ధకాలమునకూడ పూర్తిమొత్తములకు హామీ నిచ్చునని యు, విమానదాడివలన గాని మరేవిధమగు శత్రుచర్య మూలమునగాని మరణము సంభవించెడి సందర్భమున పూర్తి మొత్తములకు క్లెయిములు చెల్లించబడుననియు, ప్రకటింప సంతసించుచున్నాము. ఏ. ఆర్. పి. సర్వీసులలోనున్న వారు సివిలియనులుగనే పరిగణింపబడెదరు. విమానదాడిసహా ఏవిధమగు శత్రుచర్యచే మరణము సంభవించినను వీరి పట్టాలుకూడ పూర్తి మొత్తమునకు రక్షణనిచ్చును. మీ సమీపముననున్న మా ఏజంటునొకరిని పిలిపించి వెంటనే భీమాచేయుడు. అప్పుడే మీరు వివేకముతో వ్యవహరించినవా రగుదురు.

*Business in force* OVER **ONE CRORE,**
**LIFE FUND OVER Rs. 13 LAKHS.**

*Chairman*
**Sir Vepa Ramesam, kt.**

---

# మద్రాసు కో-ఆపరేటివు సెంట్రల్ ల్యాండ్ మార్టుగేజ్ బ్యాంకు లిమిటెడ్

## మైలాపూరు :: మద్రాసు

అధ్యక్షులు: శ్రీ టి. ఏ. రామలింగం చెట్టియార్, బి.ఏ., బి.ఎల్., ఎమ్.ఎల్.సి.

మద్రాసు రాజధానియంతటికీ, దీర్ఘవాయిదాలపై వ్యవసాయిక ఋణములను ఇచ్చుచున్న, కో-ఆపరేటివ్ సంస్థలకు శిఖరము!

ఈ కార్యమునకై మద్రాసు ప్రభుత్వమువారిచే అసలీ ఫాయిదాలకు జామీనీయబడిన డిబంచర్లను ఈ సంస్థ జారీ చేయుచున్నది.

మిగిలిన వివరములకు:—

**ఎన్. ఎస్. కోనేటిరావు,** బి.ఏ., బి.ఎల్.,
కార్యదర్శి.



# ఆరవ భాగము-ఆరోగ్యము, ఆటలు

## ఇరువదవ అధ్యాయము

# వైద్యము

విషయ సంగ్రహము :—ఆంధ్ర దేశమున ప్రచారములోనున్న వైద్య విధానములు ; ఆయుర్వేదము, యునానీ, అలోపతి, ప్రకృతి వైద్యము, హోమియోపతి—ఆయుర్వేదము, ఆంధ్రుల ప్రావీణ్యము— నాగార్జునుడు, బసవరాజు, పేరనార్యుడు, గోపాలాచార్యులు, లక్ష్మీపతి మొదలైన సుప్రసిద్ధాంధ్ర వైద్యులు—ఆయుర్వేదమున అఖిలభారత నాయకత్వము వహించిన దాంధ్రులే— వైద్య సమ్మేళనములు, పత్రికలు, ప్రచారము, కళాశాలలు—అమృతాంజనము, జీవామృతము, లోధ్ర, లివర్ క్యూర్, టాన్సినాల్ మొదలైన సుప్రసిద్ధ ఆంధ్ర ఔషధములు—యునానీవైద్యము—అలోపతి వైద్యము-ఆంధ్ర దేశమున వాటివ్యాపకము—1611 లో ఆంధ్ర దేశమునకు మొదటి అలోపతి వైద్యుని ఆగమనము—విశాఖపట్నము వైద్య కళాశాల —రూరల్ ఆస్పత్రులు—విదేశములలో ఉన్నత పరీక్షలలో కృతార్థులయిన లెఫ్టినెంటుకర్నల్ రమణరావు, తిరుమలరావు, కెప్టెను సుంకవల్లి మొదలైన వారు—స్త్రీలలో డాక్టరు లాజరస్, అచ్చమాంబ మొదలైనవారు—ఆంధ్రులు చేసిన శాస్త్ర పరిశోధనలు—వైద్య శాస్త్ర శిక్షణాలయములు—ఉన్నత పదవులలోనున్న ఆంధ్రులలో లెఫ్టినెంటు కర్నల్ శంకరశాస్త్రి, డాక్టరు లాజరస్ మొదలైనవారు—ఆంధ్ర మెడికల్ అసోసియేషన—17 వ. అఖిలభారత మెడికల్ అసోసియేషన సమావేశము 1940లో విశాఖపట్నములో జరుగుట-ప్రకృతి వైద్యము-ప్రకృతి పత్రిక ప్రచారము—హోమియోపతి వైద్యము, ఆంధ్రుల స్థానము—పశువైద్యము, డాక్టరు ఏజెండ్ల శ్రీరాములుగారి ప్రచారము—పురోభివృద్ధి—ఆంధ్ర దేశమునందలి వైద్యాలయములు, జబ్బులను చూపు పట్టికలు.

ఆర్యవిద్యలు అధోగతికి రానప్పుడు, భారత దేశం పరాధీనతకు బలికానప్పుడు, ఈ దేశం సకల కళాసంభరితమై, సర్వశాస్త్రనిష్ణాతలకు, విద్యాసంపన్నులకు సన్నిలయమై వుండెను. సర్వశాస్త్రములతోటి వైద్యవిద్య ఆనాడే పరిణిత దశ నందినది. భారతదేశమునకు రోము, గ్రీసు, దేశస్థులు వచ్చి పరిశ్రమజేసి, ఈ శాస్త్రములను నేర్చుకొని పోయిరి. నేటికి మనము పాశ్చాత్యులపైని, వారి వైద్యరీతులపైని ఆధారపడవలసి వచ్చినది. తర్వాత తర్వాత అరబ్బులు వచ్చి, మన శాస్త్రము అభ్యసించి వారి యునానీ

శాస్త్రము సృష్టించుకొన్నారు. పాశ్చాత్య సంపర్కము మనలో అనేక మార్పులు తెచ్చినది. వైద్యములోగూడా వారి అలోపతి విధానం ప్రాబల్యానికి వచ్చినది. ఇప్పుడు మన ప్రాంతాలలో అనాదినుంచీ వున్న ఆయుర్వేదముగాక, అలోపతీ హూమియోపతి విదేశ విధానాలు, ప్రకృతివైద్యము ప్రచారములో వున్నవి. పాశ్చాత్య సంపర్కం అంతగా లేనిచోట్ల ఆయుర్వేదానికి ఆదరణ హెచ్చు. ఈ ఆయుర్వేదములో ఆంధ్రులు అనాదినుంచీ భాగస్వాములు!

పాశ్చాత్య ప్రసూతి వైద్యతంత్రాలు ఎక్కువగా కనిపించి నప్పటికీ, 'కాయ చికిత్సయందు' పాశ్చాత్య చికిత్సకుడు ఆయుర్వేద వైద్యునికి వెనుక పడుతున్నాడు. అందుచేత ప్రజలకు ఆయుర్వేదమంటే నమ్మక మేర్పడుతున్నది. అసలు ఈశాస్త్రమున పూర్వమునుంచీ ఆంధ్రులు సిద్ధహస్తులు. పూర్వము కృష్ణామండలమున ఒక ప్రముఖవైద్యుడు సర్పపుటంగుటిలోని ముల్లుతీసి పరహితాచార్యుడను అన్వర్థ నామమును పొందెను. ఆంధ్రులు తమ రాజుల మన్ననలు పొంది, పరహితకారులై దేశమున కొల్లలుగ వైద్యశాలలు స్థాపించిరి. ఉపజ్ఞాబలముతో నవీన పరిశోధనలు చేసిరి. ఈ శ్రేణిలో నాగార్జునుడు, బసవరాజు అద్వితీయులు. నాగార్జునుడు అమరావతిలో క్రీ. శ. 3 వ శతాబ్దమున నివసించి, శ్రీశైలాటవీ ప్రాంతముల ధాతువాదపరిశోధనల జరిపెను. ఈయన రసవాద ప్రక్రియ ప్రారంభించిన తర్వాత, రసాయన ప్రక్రియలయందు ఆంధ్రదేశము వాసికెక్కినది. కఠిన వ్యాధులు కుదర్చుటకు రసౌషధములకన్న రాజౌషధములు లేవు. నాగార్జునుని తర్వాత శ్రీశైలమున నవనాథసిద్ధు డను వైద్య భిక్షువు నివసించి, వైద్యశాస్త్రమునందు అపారమైన పరిశ్రమజేసి నవనాథసిద్ధీయమను రసాయన తంత్రమును రచించెను. దాదాపు అయిదు వందల ఏండ్ల క్రిందట ఇంద్రగంటి వల్లభాచార్యులను భిషగ్వరుడు ఆంధ్ర వైద్య చింతామణిని సవ్యాఖ్యానముగా వివరించెను. వల్లభాచార్యుని యనంతరము మహాప్రౌఢుడయిన వైద్యుడు బసవరాజు. ఈయన పూర్వగ్రంథములలో లేని అనేక నవీనరోగములను, యోగములను పరిశోధించి, వాటిని గూర్చి బసవరాజీయమను తన గ్రంథమున వ్రాసెను. పిమ్మట పేర్కొన దగినవాడు రాయసము పేరనార్యుడు. ఈయన వైద్య వంశములోనివాడు. వీరి ముత్తాత, గజపతి రాజుచేత, కృష్ణరాయలచేత సత్కరింపబడిన ధీశాలి. సంస్కృతసారమను వైద్యగ్రంథమును, "సంస్కృతమున నొకడైన చదువలేడు" గాన తెనిగించి, అశేషప్రజకు అభిమాని యయ్యెను. ఉత్తమజ్ఞానముగల మహామహులు ఈ కోవలోనివారే! కాలక్రమమున ఈ ఆయుర్వేద వైద్యము దేవాలయములలోని పూజారుల చేత; శస్త్ర చికిత్సలు కుమ్మరి, మంగలులచేత బడి క్షీణించినవి. పైన చెప్పినట్లు పాశ్చాత్యులు, వారి అనుయాయులు దీనికి చూపిన నిరాదరణ కొంత వేరుపురుగైనది.

ఆంధ్రులు ఆయుర్వేదము

ఈ క్షీణస్థితిలో శాస్త్రజ్ఞులు పండితులు కవులు తమ శాస్త్రపునరుద్ధరణము కోసము, దేశీయ సంచలనము వలన ప్రబోధితులై అఖండ కృషి సల్పి, విచ్ఛిత్తిలోనున్న వాటికి జీవము పోసిరి. ఇదేకాక "కాంగ్రెస్ సంస్థ మూలము



వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు



విశాల భారత దేశమంతటను, ఆధునిక భారతదేశంలో
ఆయుర్వేదశాస్త్రాభ్యున్నతిని చేకూర్చిన
మూలపురుషులుగా, చిరస్మరణీయులు అగు
పండిత డి. గోపాలాచార్లువారి

# ఆయుర్వేదాశ్రమము

(స్థాపితము 1898)

అత్యుత్తమ ఆయుర్వేదౌషధములను
పరిశోధనాగారమగు ఈ నిలయమందు, పండితునిచే
కనిపెట్టబడి తయారయి, మిక్కిలి
వ్యాప్తిలోనికి తేబడినవి.

నలుబదిమూడు సంవత్సరముల అనుభవముతో,
ఆధునికావసరములకు అనుగుణమగు ఔషధములు
ప్రత్యేక శ్రద్ధతో తయారుచేయుచు,
జయప్రదముగా నిర్వహింపబడుచున్నది.

మా ఔషధములన్నియు, అనుభవజ్ఞులగు నిపుణుల
పర్యవేక్షణక్రింద అతిజాగ్రత్తగా తయారగుచున్నవి.
మా ఔషధములు నిశ్చయముగా మీకు క్షేమము
ఒనగూర్చగలవు - - -

ఈ సంస్థలో తయారైన కొన్ని
ప్రసిద్ధౌషధములు

## జీవామృతము

ఆరోగ్యమునకు, బలమునకు దివ్యౌషధము

## అరుణ

స్త్రీల ఋతుసంబంధమైన వ్యాధులను
నివారించి
శాశ్వతమైన ఆరోగ్యమును చేకూర్చును

## బాలప్రాస

శిశువుల ఆరోగ్యమునకు ఉల్లాసకరమైన
బలవర్ధక ఔషధము

**79, గోపతినారాయణస్వామి రోడ్,**
త్యాగరాజనగర్, **మద్రాసు.**

టెలిగ్రాములు 'పండిట్'

ననే జాతీయ వికాసమునకు సంబంధించిన అనేక ఉద్యమములు వ్యాప్తిలోనికి వచ్చినవి." ఇట్లే ఆయుర్వేద వైద్యులు, ఆయుర్వేద సమ్మేళనములు, పాఠశాలలు, ఔషధాలయములు, పత్రికలు స్థాపించి, వైద్యవిద్యాప్రచారము జేసి ప్రబోధము గలిగించిరి. దీనితో సవతితల్లి ప్రాపకమువలెనే నా దేశీయ వైద్యమునకు ప్రభుత్వము స్థానమిచ్చినది. ఆయుర్వేద వైద్యులకు ప్రభుత్వములో స్థానము లభించినది. ఆయుర్వేదము నేటికి ఉన్నత స్థితికి రావడమునకు అనల్పమైన కృషి సలిపిన మహామహులు పండిత డి. గోపాలాచార్యుల వారు, ఆచంట లక్ష్మీపతిగారు.



ఆయుర్వేదమార్తాండ, వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్యులు, ఆయుర్వేద కళాశాలా స్థాపకులు.

**పండిత గోపాలాచార్యుల వారు**

గోపాలాచార్యులు గారిది బందరు. భారతీయ ఆయుర్వేద వైద్య సమ్మేళనము పుట్టక పూర్వమే వీరు ఆయుర్వేద వైద్యము మదరాసులో ప్రారంభించిరి. అవి, ఆయుర్వేద మనిన ప్రభుత్వమునకు మంటగా ఉన్న రోజులు. ఆయుర్వేద వైద్యులను బజారు వైద్యులని పరిహసించేవారు. అయినను వీరు ప్రభుత్వముతో పోరి ఆయుర్వేదమును ఔననిపించిరి. 1901లో వీరు ఆయుర్వేదకళాశాల ప్రారంభించి, ఈ ఉద్యమానికి ఆర్థిక, శారీరక, మానసికములయిన సర్వశక్తులూ వినియోగించి పనిచేసి, పరమపదించిరి.

**డాక్టరు లక్ష్మీపతిగారు**

ఆచార్యులవారి తర్వాత అంతవారు లక్ష్మీపతిగారు. వీరు ఇంగ్లీషు వైద్యములో నిపుణులై, ఆయుర్వేదాన్ని అభ్యసించి, ఆయుర్వేదపు ఔత్కృష్ట్యము గమనించి, దేశాభిమానులై ఆయుర్వేదోద్యమాన్ని నడపడానికి కంకణము కట్టుకొన్నారు. 1918 మెడికల్ రిజిస్ట్రేషన్ ఆక్టువల్ల ఆయుర్వేదానికి జరిగిన అపకారానికి కించపడి, తమ పేరు మెడికల్ లిస్టులోనుంచి తొలగించుకొన్నారు. ఆచార్యులవారి మృతితో ఈ ఉద్యమ భారము వీరిమీద పడ్డది. వీరు ఒక కళాశాల, ఫార్మసీ, విజ్ఞాన చంద్రిక గ్రంథమండలి, ఆరోగ్య ఆశ్రమము మొదలైనవాటిని నడిపిరి. అప్పటినుంచీ వీరు ఆయుర్వేదానికి అఖండసేవ చేస్తున్నారు. వీరి కార్యక్రమము గమనించి, మహాత్ముడు వీరిని



భిషగ్రత్న, ప్రాణాచార్య,
**డాక్టర్ ఆచంట లక్ష్మీపతి బి. ఏ., ఎం. బి., సి. ఎం.,**
**అఖిలభారత ఖ్యాతి గాంచిన ఆయుర్వేద ప్రచారకులు.**

సేవాగ్రామమునకు రప్పించి, వీరితో దేశీయ వైద్య పునరుద్ధరణపు సంప్రతింపులు ప్రారంభించిరి. లక్ష్మీపతిగారి అచంచలమైన కార్యదీక్ష, వయస్సునకులొంగని ఉత్సాహము, ఉన్నతమైన బుద్ధిసంపద ఈ ప్రవాహమును తెలుగునాడు దాటించి సేతుశీతనగపర్యంతము తీసుకపోయెను. ఈ యిద్దరు పూయించిన పూవులు, ఫలములే ఈ నాడు ఆయుర్వేదమున పూచిన తొలిపూత !

**ఆయుర్వేదమునందు అఖిల భారత నాయకత్వము ఆంధ్రులదే !**

అఖిలభారతఆయుర్వేదోద్యమములో ఆంధ్రనాయకులది అగ్రస్థానము. అఖిలభారతఉద్యమమును 1907 లో నాసిక పట్టణమున శంకరదాజీ శాస్త్రి పధేగారు నెలకొల్పిరి. అంతకుముందే 1901 నుంచీ ఆచార్యులవారు, వారి శిష్యబృందము ఈ ఉద్యమమును ఆంధ్రదేశమున నడుపుచుండిరి. 1920 సంవత్సరము వరకు అఖిలభారతఆయుర్వేదవిద్యాపీఠం మద్రాసులోనే వున్నది. అఖిలభారత వైద్యసమ్మేళనమునకు మన గోపాలాచార్యులవారే అధ్యక్షులు. 1933 లో బికనీరులో జరిగిన సమ్మేళనమునకు డాక్టరు లక్ష్మీపతిగారు అధ్యక్షతవహించిరి. ప్రసిద్ధులైన ఈ అగదంకారులు, రామలక్ష్మణులవలె మన కాయుర్వేదమున అఖిలభారతఖ్యాతి గడించిపెట్టిరి. ఇల్లుదాటి పరరాష్ట్రములలో వీరికిగల గౌరవమే వీరి ప్రతిభకు చిహ్నము !

1917వ సం॥రమున ఆంధ్రరాష్ట్రీయ ఆయుర్వేద వైద్య సమ్మేళనము ప్రారంభించబడి, ప్రథమ సమావేశము, తెలుగ నాటి బొడ్డురాయి బెజవాడలో జరిగినది.

**ప్రథమ ఆంధ్ర వైద్య సమ్మేళనము**

ఇప్పటికి ఈ సభవారు 19 సమావేశముల జరిపిరి. ఈ సంస్థకు ప్రధానముగా పనిచేయు ప్రముఖులు లక్ష్మీపతిగారు, నోరివారు, కృష్ణమాచార్యులుగారు మొ॥వారు. ఈ వైద్య సమ్మేళ

నపు 19 వ సమావేశము లక్ష్మీపతిగారి అధ్య క్షతక్రింద ఏలూరులో జరిగెను.

ఉద్యమ ప్రచారానికి 1892వసం॥మున ఆయుర్వేద గ్రంథము లనేకము పువ్వాడవారు అచ్చు వేసిరి. ఎఱ్ఱావారు

నవీన గ్రంథరచన-

వస్తుగుణదీపికను ఆరోజుల ఆయుర్వేద ప్రచారం లోనే అచ్చువేసిరి. విజయ నగరం మహారాజుగారి వైదిక శబ్దసింధు, సింహారావు గజపతిగారి మహా యోగానందామృతకల్పవల్లి, కార్వేటినగరం శాస్త్రిగారి చరకసూత్రపు ఆంధ్రీకరణము ప్రకటితము లైనవి. పిమ్మట పుయ్యూరు రాజా వారి ప్రాపున చివుకులవారు, మద్రాసు ఆయు ర్వేదాశ్రమంవారు, ఆంధ్రా ఆయుర్వేద ఫార్మ సీవారు చక్రదత్త, రసరత్న మొదలైన ఉద్గ్రంథ ములను ప్రకటించిరి. ఇటీవలి ప్రకటనలలో శ్రీపాదవారి చరకం, ముక్కామలవారి భావ ప్రకాశ, వేటూరివారి యోగరత్నాకరం, చావలి వారి సూత్రభాగం, వేటూరి వారి వస్తుగుణ దీపికలు ప్రశంసాపాత్రములైనవి. శ్రీమార్గ సామవేదం కృష్ణమాచార్యులవారు ఆయుర్వేద సంపుటం ప్రకటించిరి. వల్లూరివారి బాలతంత్రం, మల్లాది రామమూర్తి శాస్త్రిగారి ఆహార విజ్ఞానం, ప్రతివాది భయంకర కృష్ణమాచార్యు లవారు రచించిన శారీరం పాండిత్యానికి ఒరపిడి రాళ్లవంటివి!

ఆంధ్ర వైద్య సమ్మేళన పత్రిక, ధన్వంతరి, సుధ, కుమారమిత్ర, ఆయుర్వేదకళ, ఆయుర్వేద దీపిక, ఆయుర్వేద ప్రభాతం

పత్రికలు-
వైద్య సేవ

మొ॥ఆయుర్వేద ప్రచారము నకు ఆధారభూతములగు చున్నవి. ఇంక ఈ ఉద్యమ



డాక్టరు పెద్దాడ వెంకట కృష్ణరావు, బి.ఏ., ఎమ్.బి., సి.ఎమ్., ఇండియన్ మెడికల్ స్కూలు ప్రిన్సిపాలు.

ప్రచారమునకు శిక్షణకు ఆయుర్వేద కళాశాలల నేర్పరచిరి. 1901 లో గోపాలాచార్యులుగారు చెన్నపట్నమున స్థాపించిన కళాశాలను లక్ష్మీ పతిగారు 1927 వరకు నిర్విఘ్నముగా నడిపిరి. తర్వాత పానగల్లు రాజావారి

ఆయుర్వేద కళాశాలల కృషివల్ల, మదరాసులో స్థాపకు లెవరు ?

దేశీయ వైద్యపాఠశాలను గవర్నమెంటువారు ఏర్పర చిరి. మదరాసులోని ఈ ఆయుర్వేద కళాశాల సుశిక్షితులనేకుల తయారు చేయుచున్నది. ఈ పాఠశాలకు లక్ష్మీపతిగారు తోడ్పడు చున్నారు. బెజవాడలో నోరి రామశాస్త్రిలుగారు ఆయు ర్వేద కళాశాల స్థాపించిరి. బోడపాటి వెంకట ప్పయ్య గారిచే స్థాపితమైన రామమోహన కళా శాల గుంటూరులో రంగాచార్యులుగారు నడుపు చున్నారు. అఖిలభారత విద్యా పీఠమువారి పరీ క్షలను ఆంధ్ర దేశమున నోరి రామశాస్త్రిలు

గారు జరిపి ఆయుర్వేద విశారద, బిషగ్ మొదలైన పట్టప్రదానముల చేయుచున్నారు.

ఆయుర్వేద ఔషధములు తయారు చేసి అమ్మకటలో మన ఆంధ్రులు అద్వితీయులు. అసలు ఆంధ్రులకు ఔషధ విక్రయ వ్యాపార సరళిని నేర్పినది రెంటాలవారి విక్టోరియా డిపో, దేశోద్ధారకుని అమృతాంజనము. తర్వాత శాస్త్రీయ ఔషధ విక్రేతలలో మదరాసులో కేసరి కుటీరంవారు, జమ్మివారు ప్రసిద్ధులు. వీరుకాక కోరంగిలో పొన్నాడవారు; చింతలూరులో ద్విభాష్యంవారు; బెజవాడలో శ్రీపాద, నోరివారు; ఏలూరులో శ్రీ కృష్ణా ఆయుర్వేద ఫార్మసీ; భీమవరంలో సంజీవని; ముక్త్యాలలో ఆర్య రసాయనశాల శాస్త్రీయ ఔషధములనుఅపారముగా తయారు చేయుచున్నారు. ఆంధ్రాయుర్వేద ఫార్మసీ జాయింటుస్టాకు కంపెనీగా వచ్చిన తర్వాత దాని ప్రయోగములు వైద్య విద్యార్థులకు కర్మపథము చూపించినవి.

ఔషధ విక్రయ శాలలలో పెద్దవి మనవే!

తలనొప్పికి అమృతాంజనము; పిల్లల బల్లకాలేయములకు జమ్మివారి 'లివర్ క్యూర్'; బలహీనతకు జీవామృతము, స్త్రీల వ్యాధులకులోధ్ర, అర్క, అమృత మొదలైన కేసరివారి మందులు; టాన్సిల్సు (గొంతులో మాంసపు కండలు) కు అప్పారావుగారి టాన్సినాల్; కుష్టుకు లక్ష్మి అండ్ కో వారి కుష్టురోగ నివారిణి మొదలైన మందులు ప్రసిద్ధి కెక్కినవి. ఆలమూరులో పిచ్చి, వెర్రి - మొదలైన మానసికరోగములకు చికిత్స జరుగుచున్నది. బెజవాడలో క్రొత్తగా స్థాపించబడిన ఆంధ్రా ఫార్మస్యూటికల్ వర్కుసువారు క్రొత్త క్రొత్త మందుల నేకములు ఉత్పత్తి చేయుచున్నారు. ఈ మధ్య వెనుకబడిన ఆయుర్వేదము పైజెప్పిన ఉద్యమముల వల్ల అంతకంతకు ఎక్కువగా అభివృద్ధి పొంది తొల్లిటికంటె ఎక్కువగా ప్రసిద్ధి పొందగలదని ఆశించుట కవకాశమున్నది.

మన సుప్రసిద్ధ ఔషధములు

### యునానీ వైద్యము.

గోల్కొండ నవాబులు ఆంధ్రదేశమునందు తమ పరిపాలనము ఏర్పరచిన కాలములో వారి ప్రాపు సంపాదించుకొని, అనేకమంది యునానీ వైద్యులుండిరి. మహమ్మదీయుల వైద్యవిధానమునకు 'యునానీపద్ధతి' అని పేరు. ఈ శాస్త్రము హిందూదేశమున మొగలాయి రాజుల ప్రాభవకాలమున అత్యుత్తమ స్థితిలో నుండెను. రాయలసీమలోను, గుంటూరుజిల్లా కొండవీడులోను, బెజవాడలోను ఈ వైద్యము చేయు ప్రసిద్ధ వైద్యులున్నారు. ఆంధ్రదేశమున కొన్ని ప్రదేశములలో యునానీ వైద్యశాలలున్నవి. ఈ వైద్యపద్ధతిని తయారుచేయబడు ఔషధములు, తలనూనెలు ప్రశస్తముగా పనిచేయును. చాలా కాలముబట్టి వాడుకలోనున్న వైద్యవిధానములలో యునానీ వైద్యవిధానమొకటి.

### అలోపతి వైద్యము.

ఆంగ్లేయుల పరిపాలనలో వారి వైద్య విధానములు మనదేశములో వ్యాపకమునకు వచ్చినవి. రెవిన్యూశాఖ, విద్యాశాఖ మొదలైన ప్రభుత్వపు వివిధ శాఖలవలెనే వైద్యశాఖలను స్థాపించి, వైద్యాలయములను అన్ని

జిల్లాలలోను నెలకొల్పి, పాశ్చాత్య పద్ధతులపై వైద్యసేవ చేయుచున్నారు.

అసలు పాశ్చాత్యులు, వారిలో తూర్పు ఇండియా వర్తక సంఘమువారు మన దేశమునకు రాగానే వారి వైద్యవిధానములు మన దేశమున వాడుకకు వచ్చెను. తూ. ఇం. వ. సంఘము వారు తమ ఉద్యోగులకు వైద్య సహాయము అపారముగా చేయుచుండెడివారు.

**అలోపతి వైద్యము- ఆంధ్రదేశమున దాని క్రమ పరిణామము**

వారు తూర్పు కోస్తాలో ప్రప్రథమమున మచిలీపట్నం రేవును స్వాధీన పరచుకొన్నారు (క్రీ. త. 1611). ఈ ప్రాంతమున వైద్యసేవ చెయ్యడానికి, 1621 లో వైద్యుని నియమించినట్లు చరిత్ర ఆధారమువల్ల తెలుస్తున్నది. 1630 లో కోరమాండల్ తీరమున వైద్యసేవ చెయ్యడానికి, ఆర్మెగాన్ దుర్గమున (నెల్లూరు జిల్లాలోనిది) జాన్ క్లార్కును నియమించిరి. కొంతకాలము ఆయన మచిలీపట్నంలోగూడా వుండివుండవచ్చును. సైంటు్సబరీకి వ్రాయబడిన ఒక లేఖ 1632 లో మచిలీపట్నంలో ఒక వైద్యుడున్నట్లు తెలుపుచున్నది. మరికొన్ని నిదర్శనములు 1635 లో మచిలీపట్నమున జాన్ క్లార్కు, ఎడ్వర్డ్ ఎల్ క్లాక్ (Edward L Clock) అనే వారు పనిచేస్తున్నట్లు తెలియజేయుచున్నవి. 17 వ శతాబ్దారంభములో పులికాట్టునుండి, భీమునిపట్నం వరకుగల ఆంధ్రకోస్తా అంతటా అనేకమంది యూరోపియనుల నివాసస్థానము లుండెను. వీటి కన్నింటికీ మచిలీపట్నము వాసికెక్కిన రేవు. తూ.ఇం. వ. సంఘపు వైద్యులుగాకుండా డచ్చి, ఫ్రెంచి వైద్యులుకూడా వర్తకులకు, దేశీయులకు వైద్యసేవ చేయుచుండిరి. 18 వ శతాబ్దపు చివరిభాగంలో ఉత్తరసర్కారులు ఇంగ్లీషు వారి అధికారంలోనికి వచ్చినవి. మద్రాసు జనరల్ అస్పత్రిగాక యితర చోట్ల నెలకొల్పబడిన 3 ఆస్పత్రులలో ఒకటి మచిలీపట్నమున నెలకొల్పబడినది. ఆ యాసుపత్రికి ఆర్థర్ సింక్లరు అధికారిగా నియమింపబడెను. అతని అనారోగ్యమువల్ల తిరిగి విలియమ్ ఫఫిన్‌ను నియమించిరి. అతనికి సహాయముగా జాన్ కాఫర్డు వచ్చెను. 18 వ శతాబ్దమున ఆంధ్రదేశమునందలి విఖ్యాత వైద్యులలో చెప్పదగినవాడు విలియమ్ రాక్స్‌బర్గు (1751-1815). ఇతని జీవితములో చాలాభాగము సామర్లకోటలో గడిచెను. మద్రాసు వైద్యులలోకల్లా అప్పటిలో అనుభవశాలి ఈయనే! వృక్షశాస్త్రంలో ప్రతిభ గలవాడు. "కోరమాండల్ వృక్ష సంతతి" అనే సుప్రసిద్ధ గ్రంథం సామర్లకోటలో ఉండగా రచించెను. 19 వ శతాబ్దము వరకూ మచిలీపట్నం ఒక సుప్రసిద్ధ వైద్య స్థానముగా ఉండెను. 1812 నుంచి హిందువులు ఈ వైద్యాలయాల్లో పని చేయడమువల్ల ఈ విద్యలో తరిఫీదు పొందిరి. అప్పుడు ఆంధ్ర దేశమున తెరువబడిన ప్రభుత్వ ఆస్పత్రులు ఈ క్రింది పథకములో చూపబడినవి.

| సంవత్సరము | - ప్రదేశము | సంవత్సరము | - ప్రదేశము |
|---|---|---|---|
| 1801 | అడ్డతీగల | 1848 | గుంటూరు |
| 1819 | ఉరవకొండ | 1850 | నెల్లూరు |
| 1822 | బెజవాడ | 1850 | శ్రీకాకుళం |
| 1822 | కైకలూరు | 1854 | రాజమండ్రి |
| 1842 | బళ్లారి | 1856 | అల్లూరు |
| 1842 | కడప | 1858 | అమలాపురం |
| 1845 | కర్నూలు | 1864 | పర్లాకిమిడి |

1867 అదోని
1874 చీరాల
1875 అస్కా
1878 నర్సాపురం
1879 బొబ్బిలి
1880 ఏలూరు
1869 పాలకొండ

మునుపు పెద్దపెద్ద జబ్బులకు చాలామంది మద్రాసు జనరల్ ఆస్పత్రికి వచ్చెడివారు. విశాఖపట్నమున మెడికల్ కాలేజిని, ఆస్పత్రిని సముద్రపు టొడ్డున కొండపై ఏర్పరచిన తర్వాత, అక్కడ నైపుణ్యంగల వైద్యులు శాస్త్రజ్ఞులు ఉండడముచేత, ఆంధ్రులకు అనువైన ప్రాంతము గనుక చాలామంది యిప్పుడు విశాఖపట్నం పోవుచున్నారు. స్త్రీల జబ్బులు కుదర్చడములో డాక్టరు కుగ్లర్ గారిది పెట్టిన పేరు. వారు గుంటూరులో ఎంతోమంది రోగులను చేరదీసి వైద్య సేవ చేసిరి. కొంతకాలము గవర్నమెంటు ఆస్పత్రిలో పనిచేసిరి. ఇప్పుడు ఆంధ్ర దేశమున వైద్య సహాయము ఆసుపత్రులలోనేకాక, ప్రైవేటు ప్రాక్టీషనరులద్వారా జరుగుచున్నది.

ముఖ్యముగా గ్రామములకు 1920-30 సంవత్సరముల మధ్య రూరల్ డిస్పెన్సరీలు ఏర్పరచబడినవి. వీనిని నిర్వహించుటారంభము కాగానే మద్రాసు, విశాఖపట్నములలోని శిక్షితులైన వైద్యులు వీటికి వైద్యులుగా వెళ్ల మొదలిడిరి. ఈ వైద్యాలయములు పానగల్లు రాజా రామారాయణింగారు ప్రధానిగా నున్నప్పుడు "సబ్సిడైజ్డు రూరల్ మెడికల్ ప్రాక్టీస్" పద్ధతి ప్రవేశ పెట్టబడి, దాని ననుసరించి ఏర్పరచబడినవి. గ్రామీణులకు కూడా వైద్యాలయములు అందుబాటులో నుండుటవల్ల,

రూరల్ డిస్పెన్సరీలు- పానగల్లు రాజా రామారాయణింగారు



కీ. శే. డాక్టరు కోకా అహోబలరావు ఎమ్.బి., సి.ఎచ్.బి., (ఎడిన్‌బరో) సుప్రసిద్ధ వైద్యులు. నారింజకాయ చికిత్సను వ్యాప్తిలోనికి తెచ్చినవారు.

యువకులు గ్రామములకు వైద్యసేవకులుగా వచ్చుటవల్ల, దేశమునకు గ్రామీణులకుగూడా ఇది మహోపకృతి అయినది.

కొందరు వైద్య విద్యార్థులు పాశ్చాత్య దేశములకు దూర ప్రాంతములకు వెళ్లి అక్కడ శిక్షణపొంది, ప్రజాసేవలో నిమగ్నులై వైద్య సహాయముచేయు చుండిరి. ఇట్టి వారిలో ప్రముఖులు : బందరులో డాక్టరు అహోబలరావు గారు. అహోబలరావుగారు పేదవారికి ఉచితముగా మందు లిచ్చుటేకాక, నారింజకాయలతోను పాలతోను రోగాలు కుదర్చుట. వారి ప్రత్యేకత

నారింజకాయ వైద్యమును ప్రచారముచేసిన ఉపస్థాపితులు. వీరుగాక, విశాఖపట్నములో కీ. శే. డాక్టరు మల్లిక్ గారు, బెజవాడలో ధన్వాడ రామచంద్రరావుగారు వైద్య సేవ చేసిరి. వంగ రాష్ట్ర వందేమాతరం ఉద్యమమువల్ల ఉద్బోధితులై అనేకమంది యువకులు, స్వాతంత్ర్య కాంక్ష ప్రజాసేవాపిపాసగలవారు కలకత్తా నేషనల్ కాలేజిలో వైద్యవిద్య సాంగముగా చదివి, ప్రజాహిత జీవనములో పాల్గొని దేశాభివృద్ధికి తోడ్పడిరి. అట్టి వారిలో డాక్టరు వేదాంతం వెంకట కృష్ణయ్యగారు కాకినాడ ; డాక్టరు రామారావు, డాక్టరు సుబ్రహ్మణ్యంగార్లు రాజమండ్రి ; డాక్టరు ఘంటసాల సీతారామశర్మ, డాక్టరు గోవిందరాజులునాయుడుగార్లు బెజవాడ మున్నగువారు ముఖ్యులు.

డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు ఆవడిలో ఆరోగ్యాశ్రమము స్థాపించి, జీర్ణించిన రోగములను నశింపజేయుటలో వాసికెక్కిరి. బందరులో డాక్టరు పట్టాభిగారు వైద్యులుగాను, రోగసిర్ణాయకులుగాను ప్రశస్తిగాంచిరి.

విశాఖపట్నం మెడికల్ కాలేజి పెట్టిన పిమ్మట అక్కడ శిక్షణ పొందిన విద్యార్థులు అనేకులు పాశ్చాత్య దేశములకు వెళ్లి ఉన్నత విద్య నభ్యసించి వచ్చిరి. మద్రాసు మెడికల్ కాలేజిలోకూడా పెద్దపెద్ద పరీక్షలలో ఆంధ్రులుత్తీర్ణులైరి. ఆంధ్రులలో ఐ.ఎమ్.ఎస్., లుగా నున్నవారు చాలా కొద్దిమంది. మేజర్ సత్యనారాయణరాజు, మేజర్ రామమోహన రావు నాయుడు మొదలగువారు. వీరుగాక కెప్టెన్ డాక్టరు కె. నర్సింహారావు, కెప్టెన్ అద్దంకి శేషగిరిరావు ఎ. ఎమ్. ఎస్., సీతారామారావు, యామర్తి హనుమంతరావు, ఎమ్. ఎస్. కృష్ణమూర్తి గార్లు. కెప్టెన్ శుంకవల్లి, డాక్టరు సత్తిరాజు (సింగపూరు), డాక్టరు వెంకట్రాయుడు (తెనాలి), కెప్టెన్ రమణరావు (కాకినాడ) గార్లు కొంత కాలము ఐ. ఎమ్. ఎస్. ఉద్యోగులుగా నుండిరి.

**విదేశములలో ఉన్నత పరీక్షలలో కృతార్థులైన ఆంధ్రులు**

విదేశములలో కృతార్థులుగా ఉన్నత పరీక్షలలో వచ్చినవారిలో పశ్చిమ గోదావరి జిల్లా వాసి కెప్టెన్ శుంకవల్లి గారొక్కరే ఎఫ్. ఆర్. సి. యస్., (లండన్) పరీక్షలో ఉత్తీర్ణులయిరి. డాక్టరు తిరుమలరావు గారు, ఎమ్. రమణమూర్తిగారు ఎఫ్. ఆర్. సి. యస్., (ఎడింబరో) లోను ; డాక్టరు సత్యనారాయణ రాజుగారు ఎమ్.ఆర్.సి.పి.; (లండన్) పరీక్షలోను నెగ్గిరి. డాక్టరు పి. కుంటుంబయ్యగారు ఎమ్. డి. (ఎడింబరో) డిగ్రీపొందిరి. డాక్టరు మల్లిక్ గారు గ్రేటుబ్రిటనులో ఎల్. ఆర్. సి. పి., పట్టముపొంది నేత్రవైద్యములో విశేషప్రజ్ఞ గడించిరి. డాక్టరు పి. రామచంద్రరావుగారు, డాక్టరు వెంట్రాయుడుగార్లు (తెనాలి) ఎడింబరో పరీక్షలో ఉత్తీర్ణులైరి. ఎమ్. డి., (మద్రాసు) లో డాక్టరు ఎమ్. ఎస్. కృష్ణమూర్తిగారు, డాక్టరు నరసింహారావుగారు, డాక్టరు కె. నారాయణమూర్తిగారు విజయులైరి.

డాక్టరు కె. నారాయణమూర్తిగారు మద్రాసుఆసుపత్రిలో ఆంధ్రులలో మొదటి గౌరవోద్యోగిగా నియోజితులైరి.

స్త్రీలలో వైద్యమందు పెద్దపెద్ద పరీక్షలిచ్చినవారు డాక్టరు కమలాకర్ ఎమ్. డి., డాక్టరు



డాక్టరు (మిస్) ఎచ్.ఎమ్. లాజరస్, బి.ఏ., ఎమ్.బి.బి.ఎస్., ఎఫ్.ఆర్.సి.ఎస్., డబుల్యూ. ఎమ్.ఎస్.ఐ.

**వైద్యములో పెద్దపెద్ద పరీక్షలిచ్చిన స్త్రీలు**

లాజరస్, డాక్టరు లక్ష్మీపతిగారి కుమార్తె లక్ష్మీదేవి, డాక్టరు కొమ ర్రాజు అచ్చమాంబగార్లు. డాక్టరు లాజరస్‌గారు విదేశములకు వెళ్లి, పెద్దపెద్ద పరీక్షలిచ్చి, ఘోషా ఆస్పత్రిలో సూపరిండెంటుగాను, గవర్నమెంటు స్త్రీలవైద్య కళాశాలకు ప్రధానోపాధ్యాయనిగాను కొంత కాలము పనిచేసి, ఇప్పుడు ఢిల్లీలో స్త్రీల మెడికల్ కాలేజి ప్రిన్సిపాలుగానున్నారు. హైందవులలో మొదట కళాశాల ప్రధానాధ్యాపకత్వం వహించినది వీరే!

**అలోపతి వైద్యము-మన పరిశోధకులు**

ఆంగ్లేయ వైద్యములో ఆంధ్రులు శాస్త్రి పరిశోధనలు చేసి, పాండిత్యమును గణించిరి. వీరిలో డాక్టరు వై. సుబ్బారావుగారు "ఫిజియాలజీ అఫ్ మస్క్యులర్ ఆక్టివిటీ" లోను, పి. కుటుంబయ్యగారు అనేక క్లినికల్ పరిశోధనలను, డాక్టరు బి. టి. కృష్ణగారు అనేక ఫిజియాలజీ పరిశోధనలను, డాక్టరు కె. నారాయణమూర్తిగారు "స్ప్రూ అండ్ యిన్‌ఫెన్‌టైల్ లివర్ డిసీజెస్" లోను పరిశోధనలు సలిపిరి. డాక్టరు చి. నారాయణరావుగారు, ఎమ్. వి. రాధాకృష్ణగారు వివిధ వైద్యశాలలలో ముఖ్య పరిశోధన లొనర్చిరి. ఇవన్నియు ఆంధ్రులకు అలోపతి వైద్య విధానములో గూడా అగ్రస్థాన మున్నదనుటకు నిదర్శనములు.

**వైద్యశాస్త్ర శిక్షణ—కేంద్రములు**

మద్రాసులో 1835-36 లో మెడికల్ కాలేజి స్థాపించబడి 1850 నాటికి అభివృద్ధికి వచ్చెను. 1875 నుండి ఆకళాశాలలో స్త్రీలకు శిక్షణనిచ్చుట కేర్పాటుచేయబడెను. ఇక్కడ అనేకులు వైద్యశాస్త్రి మభ్యసించిరి. 1876-78 లలో మద్రాసు రాజధానిలో వచ్చిన పెద్ద కరువులవలన 1876 లో నెల్లూరులో వైద్యవిద్య బోధించుటకు ఒక పాఠశాల నేర్పరచిరి. 1897 లో ఆ పాఠశాల మూయబడినది. కాని అక్కడ దాదాపు 150 మందికి పైగా శిక్షణపొంది ఆంధ్రదేశమంతటా విరివిగా వైద్యసేవ చేసిరి. 1902 వ సం॥న విశాఖపట్నమున వైద్య పాఠశాల స్థాపించిరి, 1924 లో పానగల్లురాజా రామారాయణింగారి ప్రోత్సాహమున కళాశాలగా మార్చబడినది. అనేకమంది ఆంధ్రవిద్యార్థులు అప్పటినుండి ఇప్పటివరకు సుశిక్షితులై ప్రశంసనీయమైన సేవచేస్తున్నారు. రూరల్ డిస్పెన్సరీ వైద్యులలో చాలా మంది ఇక్కడ శిక్షితులైనవారు.




సంకోచములేకుండ "ఆంధ్రా" పాలిసీతో మీరు నిశ్చయముగా ఆర్థికరక్షణము కల్గియుందురు.

ఈ కంపెనీ యొక్క సరసమయిన ప్రీమియం, కనీసపుఖర్చుల దామాషా, సులభమయిన పాలిసీ నిబంధనలు, మీ కుటుంబము యొక్కయు, మీయొక్కయు భవిష్యత్తును రక్షించుటకు సమకూడుచున్నవి.

సబ్ ఆఫీసులు, చీఫ్ ఏజన్సీలు, ఏజన్సీలు ఇండియాలో అంతటను కలవు.

## రక్షణకు స్థిరత్వమే ముఖ్యము.

# ఆంధ్ర ఇన్సూరెన్సు :: కంపెనీ లిమిటెడ్,

హెడ్డాఫీసు: మచిలీపట్నము.

బ్రాంచీలు: మద్రాసు, నాగపూరు, కలకత్తా, యెర్నాకులం, అనంతపూర్, బరంపురం, లాహోర్.

మద్రాసు బ్రాంచి: ఆంధ్ర ఇన్సూరెన్సు భవనములు, తంబుచెట్టి వీథి.

ఈ గ్రామవైద్యశాలాధికారికి సం॥కు 500 రూపాయలు స్థావరము, మందులు ఇవ్వబడును. ఒక కంపౌండరు, మంత్రసాని యుందురు. వీరు పేదలకు ఉచితముగా వైద్య సహాయము చేయుచుండవలెను.

ఆంధ్ర దేశములోని వైద్యశాలలు

వైద్యశాఖ వారి రిపోర్టు ననుసరించి

| జిల్లా పేరు | ఆయుర్వేద, యునానీ వైద్యశాలలు | ప్రభుత్వ వైద్యశాలలు | ప్రత్యేకముగా స్త్రీలకు పిల్లలకు |
|---|---|---|---|
| విశాఖపట్టణం | 28 | 54 | 2 |
| తూ. గోదావరి | 18 | 41 | 3 |
| ప. గోదావరి | 22♦ | 15 | — |
| కృష్ణా | 40 | 19 | 3 |
| గుంటూరు | 41♦♦ | 24 | 1 |
| నెల్లూరు | 31 | 25 | 1 |
| కర్నూలు | 9♦ | 28 | — |
| కడప | 13♦ | 12 | — |
| బళ్లారి | 18 | 17 | 2 |
| అనంతపురం | 7 | 15 | — |
| చిత్తూరు | 5 | 16 | — |
| మద్రాసు | 7♦♦♦♦ | 33 | 5 |
| మొత్తము | 239 | 299 | 17 |

♦ దేశీయ వైద్య శాలలలో యునానీ వైద్య శాలలను సూచించును.

మన ఆంధ్రా మెడికల్ కాలేజిలో మూడు వందల మందికిపైగా విద్యార్థులకు శిక్షణ యివ్వబడెను.

డాక్టరు జి. వి. దేశముఖ్ గారి అధ్వర్యమున 1928 లో ఏర్పరచబడిన అఖిలభారత వైద్య సమ్మేళనము, 1930 లో

**అలోపతివైద్య సమ్మేళనములు- ఆంధ్రా మెడికల్ అసోసిఏషన్, 17 వ అఖిలభారత మెడికల్ అసోసిఏషన్ విశాఖ పట్టణ సమావేశము (1940)**

ఇండియన్ మెడికల్ అసోసిఏషన్" అయ్యెను. ఈసమితి ప్రోత్సాహమున రాజమహేంద్రవరమున "ఆంధ్ర వైద్య సమ్మేళము" డాక్టరు యు. రామారావుగారి అధ్యక్షత క్రింద మొదటి సమావేశము జరిగెను. రెండవది 1929 సం॥న డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి అధ్యక్షతను ఏలూరులో జరిగెను. 1940 సం॥న "ఆంధ్రా మెడికల్ అసోసిఏషన్" అను సమితి ఏర్పడినది. డాక్టరు టి. శంకరశాస్త్రి, ఐ. ఎమ్. ఎస్., గారు అధ్యక్షులు. డాక్టరు పి. గురుమూర్తి, బి. తిరుమలరావు, జి. రామయ్యగార్లు ఉపాధ్యక్షులు. ఇవి కాక నేషనల్ ట్యూబర్క్యులోసిస్ అసోసిఏషన్, క్లినికల్ అసోసిఏషన్లు పనిచేయుచున్నవి. 17 వ అఖిలభారత మెడికల్ అసోసిఏషన్ విశాఖపట్నమున 1940 లో డాక్టరు కె. ఎఫ్. రేగారి అధ్యక్షతను జరిగెను. డాక్టరు పి. గురుమూర్తిగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు!

విశాఖపట్నములో "పిచ్చి ఆస్పత్రి", క్షయ రోగ నివారణచేయు వైద్యశాల; కింగ్‌జార్జి (5) ఆస్పత్రి ప్రధానమైనవి. మదనపల్లిలో క్షయ వ్యాధి కుదర్చు కేంద్రిమున్నది. విశాఖపట్నమున జీర్ణరోగములును పెద్దపెద్ద జబ్బులును కుదర్చబడును.

విశాఖపట్నం కళాశాలలో శిక్షితులైన

విద్యార్థులలో 50 మందికిపైగా, "ఎమర్జన్సీ మెడికల్ కమీషన్" లోను, నలభైమంది మదరాసు ప్రభుత్వ వైద్య శాఖలలోను, మిగతా విద్యార్థులు గౌరవ వైద్య శాఖాధికారులుగాను, ప్రయివేటు ప్రాక్టీషనరులుగాను పనిచేయుచున్నారు.

ఆంధ్రుల ఉన్నత పదవులు

వైద్య కళాశాలలో డాక్టరు శ్రీనివాసులు నాయుడుగారు ప్రొఫెసర్ ఆఫ్ మెడికల్ జూరిస్ ప్రూడెన్సులోను, డాక్టరు వి. సుందరేశన్‌గారు ప్రొఫెసర్ అఫ్ పేథాలజీ గను, డాక్టరు డి. గోవిందరెడ్డిగారు మద్రాసు మెడికల్ కాలేజి పేథాలజీ ఆచార్యులుగను పనిచేయుచున్నారు, వీరుకాక కళాశాలలో అధ్యాపకులుగా డాక్టరు తిరుమలరావు, బి. టి. కృష్ణన్, డాక్టరు డి. నారాయణరావు గార్లు పనిచేయుచున్నారు.

డాక్టరు తిరుమలరావు గారు ఆంధ్ర విశ్వ విద్యాలయము తరఫున సభ్యులుగా ఇండియన్ మెడికల్ కౌన్సిలునకును, డాక్టరు యమ్. రామ కృష్ణరావుగారు ఆంధ్రవిశ్వవిద్యాలయముచే మద్రాసు మెడికల్ కౌన్సిలునకును, డాక్టరు పి. గురుమూర్తి, డాక్టరు కె. నారాయణమూర్తి గార్లు ఆంధ్రులతరఫున మద్రాసు మెడికల్ కౌన్సిలునకును ఎన్నుకొనబడి ఆ స్థానముల నలంకరించిరి.

అన్ని శాఖలలోవలెనే ఆంధ్రులు ఇందులో గూడ తమ స్వసామర్థ్యమువల్ల ప్రధాన స్థానము వహించి, ముందంజ వేయుచున్నారు.

ప్రకృతి వైద్యము.

మన దేశమునకు ప్రకృతి వైద్యము క్రొత్త గాదు. తీర్థోపవాసములు, సంక్రమణమునందలి ఏకభుక్తములు, పర్వములయందలి ఫలహార ములు, వ్రతాదులయందలి అధిశయన బ్రహ్మ చర్య వ్రతములు; శ్రీశైలము, భద్రాద్రి, వేదాద్రి మొదలైన పర్వత ప్రాంతములకు యాత్రార్థమై పోవుట, పండుగ రోజులలో హంసలదీవి, అంతర్వేది, మొదలైన నదీసాగర సంగమములలో స్నానములుచేయుట, కార్తీక మాఘస్నానములు, ఏకాదశీ ఉపోష్యములు, కార్తీక సోమవారములు, మాఘపాదివారములు, కార్తీకనక్తాలు చెయ్యడమునేర్చిన తెలుగు నాటప్రకృతివైద్యము క్రొత్తయనుట అసంభవము. ఈ వైద్యవిధానమునకు ఇటీవల విస్మృతిమాత్రమే కలిగినది.

ప్రకృతి వైద్యమున ఆంధ్రుల చరిత్ర.

పండిత ద్రోణంరాజు వెంకటాచలపతి శర్మ గారు అభినవవైద్యశాస్త్రము, ముఖవైఖరీ విద్య, రోగారోగ్య వివేకము అను పేర్లతో, జర్మనీదేశ ప్రకృతివైద్యశాస్త్రవేత్త కూనేగారిచే రచింపబడిన గ్రంథముల ననువదించి ఆంధ్రమున ప్రచురించిరి. ఆధునిక తెలుగు ప్రకృతివైద్య గ్రంథములలో ఇవే ఆదిరచనలు. అంతకు పూర్వము ఈ వైద్యము అంత ప్రచారమున లేదు. ఇంగ్లీషుగ్రంథముల చదివి దువ్వూరి వీరభద్రయ్యగారు మాత్రము ఈ వైద్యము చేసెడివారు.

తెలుగుపుస్తకములు వాడుకలోనికి వచ్చిన తర్వాత ఈ వైద్యము వ్యాపకమునకు వచ్చినది. ఈ వైద్యవ్యాప్తికి పాటుబడిన కీ. శే. ఆద్దా బాలముకుంద దాసుగారు, గంధం వెంకట కృష్ణారావుగారు, బొల్లాప్రగడ సుందరగోపాల

రావుగారు, బొడ్డుపల్లి నరసింహంగారు, రావుల గోపాలకృష్ణయ్యగారు, దూర్వాసుల పార్థసారథి శర్మగారు, యోగి సిద్ధప్పగారు మొదలైన ప్రముఖులు ఆంధ్ర దేశములో వివిధభాగములలో ప్రకృతి వైద్యమును ప్రచారమునకు తెచ్చిరి. వీరిలో బొల్లా ప్రగడ సుందర గోపాలరావుగారు, గుంటూరులో భాను ప్రసాదరావు నాయుడు గారిచే స్థాపించబడిన చికిత్సాలయమును కొంతకాలము నిర్వహించిరి. వీరు అపక్వాహార ద్వైతసిద్ధాంత మనుగ్రంథమును వ్రాసి, అపక్వాహారమును వ్యాప్తికి దెచ్చిరి. వీరు జల సూర్య కిరణ చికిత్సకులు. వీటికి సంబంధించిన గ్రంథములు అనేకము వ్రాసినారు.

గంధం వెంకటకృష్ణా రావుగారు మదరాసు బొంబాయిలను కార్యస్థానములుగా పెట్టుకొని, పత్రికలు, కరపత్రములద్వారా ప్రకృతివైద్య ప్రచారము చేసిరి. 1914 వ సంవత్సరపు ఐరోపా మహాసంగ్రామ సమయమున జర్మనీకి ప్రకృతివైద్యాభ్యాసమునకై పోయిరి. జర్మనీలో కూనే చికిత్సాలయము, లాహిమన్ చికిత్సాలయము దర్శించి, ఇంగ్లాండు, అమెరికా దేశములకు పోయి ప్రకృతివైద్యమును నేర్చుకొని వచ్చిరి. వీరు ఇప్పుడు ప్రకృతివైద్యప్రచారము చేయుచున్నారు.

హిందూపురపు యోగి సిద్ధప్పగారు ప్రకృతి వైద్యులలో విఖ్యాతపురుషులు. వీరు రోగముల కుదుర్చుటలో వన్నె కెక్కిరి. గుంటూరులో మధ్వశ్రీ కృష్ణమాచార్యులుగారు, బాపట్లలో స్థానం పార్థసారథిగారు, వేమూరిలో రావుల గోపాలకృష్ణయ్యగారు ఉండి ఈ విధానవ్యాప్తికి పూనికతో పనిచేయుచున్నారు.

**ప్రకృతి పత్రిక స్థాపన.**

కీ. శే. నారిశెట్టి హనుమయ్యా నాయుడు గారు 1919 వ సం॥ ఆగష్టు నెలలో 'ప్రకృతి' ప్రథమసంచికను ప్రకటించిరి. సహజజీవనము, ప్రకృతివైద్య ప్రచారము చేయుట ఈ పత్రిక సంకల్పము. 1932 వ సం॥ వరకు వారే పత్రికను నడిపి, తర్వాత "ప్రకృతికార్యాలయ ట్రస్టు" వశము చేసిరి.

1922 వ సంవత్సరములోనే నారిశెట్టి హనుమయ్యా నాయుడుగారు ఈ సంస్థను స్థాపించిరి.

**ప్రకృతి కార్యాలయ ట్రస్టు.**

తమ మృతివరకు సంస్థకార్యముల నిపుణతతో నిర్వహించిరి. వారి అనంతరము సంస్థ కొందరు ట్రస్టీల ఆధిపత్యము లోకి వచ్చినది. పుచ్చా వెంకట్రామయ్యగారు దీనికి అధ్యక్షులు; అయ్యంకి వెంకటరమణయ్యగారు కార్యదర్శి. 'ప్రకృతి' పత్రికను ఇప్పటికిని ఈ సంస్థవారే వెలువరించుచున్నారు.

**నవీన ప్రకృతివైద్య గ్రంథ ప్రచురణ.**

సునిశిత వైద్యము, తొట్టి వైద్యము, ప్రకృతి గృహ వైద్యము, యోగుల స్వీయచరిత్ర, ఆరోగ్యతత్త్వము, నిర్విచార భావిజీవనము అను ఉద్గ్రంథములును; సూర్యకిరణచికిత్స, జలచికిత్స గ్రంథములును; ఆహార నియమావళి, ఆరోగ్యవిషయములకు సంబంధించిన వివిధ కరపత్రములును ఈ సంస్థ యాజమాన్యమున ప్రకటింపబడెను.

ఆంధ్ర ప్రకృతి ధర్మపరిషత్తు, ది క్రోమోపతిక్ ఇన్స్టిట్యూట్‌లు బెజవాడలో నెలకొని ప్రకృతివైద్యాభివృద్ధికి కృషి సలుపుచు ప్రకృతి

వైద్యుల కార్యకలాపముల నేకోన్ముఖ మొనర్చు చున్నవి.

**ప్రకృతివైద్య చికిత్సాలయములు.**

బెజవాడకు తూర్పుగానున్న పడమటి లంకలో సీతారామావధూతగారిచే నడుపబడు చున్న సాధనాశ్రమ ప్రకృతి చికిత్సాలయము, పశ్చిమ గోదావరి జిల్లా కేశవరములో వేగిరాజు కృష్ణంరాజుగారి చికిత్సాలయము, గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా మోర్తోట గ్రామములో రాఘవేంద్ర యోగిగారి చికిత్సాలయములు ఉన్నవి. వీరుకాక అనేకమంది ప్రకృతి చికిత్సకులు పలుప్రాంతముల నీ వైద్యము చేయుచున్నారు. ఈ ప్రకృతి చికిత్సకుల సంఖ్య 43 రికి పైబడియున్నది. పైనుదహరించినవారుగాక వీరిలో ప్రముఖులు: గొల్లకోట సత్యరాజులుగారు, గోలేటి జోగిరాజుగారు, తాతినేని శివకాంతమ్మగారు, నైషధం సీతారామమ్మగారు, మునిసుబ్రహ్మణ్యంగారు, ఒరంగల్లు అవధానిగారు, ఉమ్మెత్తాల గోపాల రావుగారు, అయ్యంకి వెంకటరత్నం ఎమ్. ఎస్సి., గార్లు.

### హోమియోపతి వైద్యము.

**హోమియోపతి వైద్యము - ఆంధ్రుల స్థానము.**

ఆంధ్రదేశమున హోమియోపతి వైద్య విధానము వ్యాపించి ముప్పైసంవత్సరములైనది. 1923 వ సంవత్సరములో కాకినాడలో పెద్దిభొట్ల సీతారామయ్యగారు "ఆంధ్రా హోమియోపతిక్ మెడికల్ కాలేజీ" ని స్థాపించి ఈ విధానమున విద్యార్థులకు శిక్షణ నిచ్చిరి. లంకా రామారావుగారు వీరితో కలిసి కృషిచేయ నారంభించిరి. వీరు అమెరికానుంచి కావలసిన మందులను తెప్పించి, ఒక హోమియోపతి ఔషధ విక్రయశాలను స్థాపించిరి. రెండుసంవత్సరములు గడచిన తర్వాత సీతారామయ్యగారు కళాశాల, ఔషధ విక్రయశాల మొదలైనవన్నియు రామారావుగారి అధ్వర్యముక్రింద వదలి ఆగ్రాకు పోయిరి. ఆనాటినుండియు రామారావుగారు కార్యనిర్వహణ భారము వహించి కృషిచేయుచున్నారు. ఆ కళాశాలలో దాదాపు రెండువందలకు పైగా విద్యార్థులను ఉచితముగా శిక్షణ నిచ్చి తయారుచేసిరి. వీరు ఈ వైద్యము ననుసరించి వివిధప్రాంతములలో వైద్యసేవ చేయుచున్నారు.

హోమియోపతి వైద్యవిధానము విస్తారముగా తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణాజిల్లాలలో వ్యాపకములో నున్నది. విశాఖపట్నం, గుంటూరు, కర్నూలు, అనంతపూరు, బళ్లారి, నెల్లూరు, గంజాం జిల్లాలలో ఈ వైద్యపు కేంద్రము లున్నవి. కొందరు ఆయుర్వేద వైద్యులు, విద్యాధికులైన అలోపతీ వైద్యులు ఈ మందుల నుపయోగించుచున్నారు. క్రమముగా ఇది వర్ధమానమగుచు పట్నములకు పల్లెలకు ప్రాకుచున్నది.

రామారావుగారి ప్రప్రథమ ప్రియశిష్యులు వై. సుబ్రహ్మణ్యముగారు తూర్పుగోదావరి జిల్లా కోటిపల్లిలో నెలకొల్పబడిన "హోమియో డిస్పెన్సరీ"కి అధికారిగా నియోజితులైరి. ఆంధ్రదేశములో ఇది ఒక్కటే హోమియో వైద్యశాల! జీర్ణించిన రోగములను, తదితర వైద్యచికిత్సలకు లొంగనివాటిని ఈ వైద్యశాలలో కుదుర్తురు. ఇటీవల రామారావుగారు

హోమియో ఔషధములు తయారుచేయు ఫార్మసీని మద్రాసుప్రభుత్వమువారి అనుమతి పొంది కాకినాడలో స్థాపించిరి.

రామారావుగారు హోమియోపతి వైద్య శాస్త్రమునకు సంబంధించిన గ్రంథములను తెలుగులో రచించిరి. ప్రథమమున వీరి గ్రంథములే పాఠ్యగ్రంథములు. వీరితర్వాత

హోమియోపతి వైద్యము - తెలుగువారి గ్రంథరచన

ఎన్. కామేశ్వరరావుగారు (ఆలమూరు), టి. కామేశ్వర రావుగారు (వుంగుటూరు), వై. గణపతి రావుగారు, ఎమ్. ఎస్. మాధవరావుగారు (పిఠాపురం), బి.ఎల్. నారాయణరావుగారు, వల్లూరి హనుమంతరావు మొ॥ వారు ఈ వైద్యశాస్త్రమునకు సంబంధించిన గ్రంథములను వ్రాసిరి.

కాకినాడలో రామారావు, కీ. శే. పెద్దిభొట్ల సుబ్బారాయుడుగార్ల ధనసహాయముతో ఈ శాస్త్రమునకు సంబంధించిన గ్రంథముల సంతరించి ఒక పుస్తకాలయము నెలకొల్పబడెను. అంతర్వేది, చోళంగి, కోటప్పకొండ ఉత్సవములలోను, తిరునాళ్లలోను ఉచితముగా ఈ వైద్యసంఘమువారు వైద్యసహాయము చేయుదురు. ప్రకటనలను, ప్రచురణలను చేసి వైద్యప్రచారము చేయుచున్నారు. పిఠాపురవాసి ఎమ్. ఎస్. మాధవ రావుగారు, "ది ఆంధ్రా హోమియో జర్నల్" అను పత్రికను గూడా వైద్యసంఘముతరఫున స్థాపించిరి.

గ్రంథాలయము, హోమియో వైద్యప్రచారము, పత్రిక

"ఆంధ్రరాష్ట్ర హోమియోపతి వైద్య సమితి" 1932 వ సంవత్సరమున అంకురార్పణ చేయబడినది. ఈ వైద్య సంఘపు మొదటి సమావేశము డాక్టరు రామారావుగారి అధ్యక్షతను మండపేటలో జరిగినది. ఆంధ్రదేశములోని వివిధజిల్లాలలో ఏటేట ఈ సమావేశములు జరుగును.

ఆంధ్రా హోమియో వైద్యసమితి ప్రథమ సమావేశము

కాకినాడలో పొన్నాడ వెంకట్రావుగారు, రాజమహేంద్రవరమున సోమిన కామేశ్వరరావు గారు, తణుకులో పి. శ్రీరామారావుగారు, బాపట్లలో ఎమ్. కాళిదాసుగారు, బళ్లారిలో ఆర్. సభాపతిరావుగారు, నర్సారావుపేటలో టి. వి. ఎల్. నరసింహారావు బి. ఏ., ఎల్. టి., గారు ఈ వైద్యమును అభ్యసించి పరోపకృతికి వైద్య సేవ చేయుచున్నారు. వీరుకాక అనేకులు న్యాయవాదులు, అధ్యాపకులు దీనిని అభ్యసించిరి.

ఈ వైద్యవిధానమున విద్యార్థులకు శాస్త్రపద్ధతులపై శిక్షణనిచ్చు కళాశాల కాకినాడలోనిది మాత్రమే! విద్యార్థులకు 1925 నుంచి ఇక్కడ ఉచితముగా శిక్షణ నిస్తున్నారు. విశాఖపట్నంజిల్లా కోటపాడులో బి. ఎల్. నారాయణరావుగారి పాఠశాల, కర్నూలులో ఎన్. రాఘవాచార్యులుగారి పాఠశాల ఈ శాస్త్రశిక్షణ నిచ్చు చిన్నచిన్న కేంద్రములు.

పశువులుమనకు పూజనీయములైనవి. మనుష్యులకు వలెనే పశువులకు వచ్చురోగములను నివారించి వాటిని కాపాడు కొనవలెను.

పశు వైద్యము

"శ్లో॥ గావః పవిత్రమంగళ్యా దేవానామపి దేవతా ।
యస్తాః శుశ్రూషతే భక్త్యా స పాపేభ్యః ప్రముచ్యతే ॥

(పవిత్రములైన, మంగళప్రదములైన గోవులు దేవతలకు గూడా దేవతల వంటివి. కావున లక్ష్మీప్రదమైన గోసేవ సర్వపాపములను అణచును).

శ్లో॥ రక్షోఘ్నం మేతన్మాంగళ్యంకలి దుఃస్వప్న నాశనం ।
రోచనాచతథాధన్యా రక్షోగద గరాపహా ॥

(మంగళప్రదమైన గోవుయొక్క మహిమ సర్వకలుషములను, రాక్షసులను నాశనము చేయును. అట్లే గోరోజనము గూడా ప్రధానమైనది. రోగ విష వికారములను పోగొట్టును.)

ఈపై ఉదాహరణములను బట్టి గోవుయొక్క ప్రాధాన్య మవగతమైనది కదా! ఇట్లే యితర పశువులు కూడా ముఖ్యమైనవే. పల్లెటూళ్లలో పశువులకు అనుభవము మీద ఆకుమందుల తోను, పసరులతోను వైద్యముచేసి రోగ చికిత్స చేయు ఆచారము కలదు.

పల్లెటూళ్లలోను, జిల్లా ముఖ్య కేంద్రముల లోను పశు వైద్య శాలలను ప్రభుత్వమువారు ఏర్పరచి పశురోగ చికిత్సచేయు చున్నారు. ఈ ప్రభుత్వమువారి వైద్యపద్ధతి పాశ్చాత్య వైద్య విధానమగుటచేత, ఆ విధానము అక్కడ పశువులు, వాటి నైజము మొదలగు వాటిపై నెక్కువగా ఆధార పడి యుండుటచేత, కొన్ని కొన్ని మనపశు వ్యాధులకు ఆ వైద్యరీతులు అనువుగా

ఆంధ్రి దేశమున పశువైద్యము

లేవు. అందుచేత దేశీయ, పాశ్చాత్య పశు వైద్య విధానముల సమ్మిళితముచేసి పశు వైద్యము చేయు యువకులు ఆంధ్రి దేశములో అనేకులు బయలుదేరిరి. ఇట్టి వారిలో ఏజండ్ల శ్రీరాములుగారు ముఖ్యులు. వీరు అంగలూరు లో ఆంధ్రి జాతీయ పశువైద్య కళాశాల స్థాపించి, పశువైద్యమున విద్యార్థులకు తరిఫీదు నిచ్చి, అనేక జిల్లాలలో పశువైద్య ప్రచారము చేసిరి. వీరు ఈ వైద్యమునకు సంబంధించిన, అనుభవ వైద్య చింతామణి, ద్రివ్యజ్ఞానము, అంటువ్యాధులు, నేత్రచికిత్స, ప్రసవ చికిత్స మొదలైన గ్రంథములు దాదాపు 20 కి పైగా వ్రాసినారు. పశువుయొక్క ఆరోగ్యమును జాగ్రత్తగా కాపాడుట మనధర్మము. ఈ పశువైద్యము ఇంకా అభివృద్ధి చెందవలసి యున్నది, మద్రాసు కోయంబుత్తూరులలో ప్రభుత్వము వారు ఏర్పర చిన వెటర్నరీ కళాశాలలున్నవి.

పైన చెప్పిన హోమియోపతి, ఆయుర్వేద, అలోపతి, ప్రకృతి, యునానీ మొదలైన వైద్య విధానములకు చెందిన వైద్యులు ఆంధ్రిదేశ మున తృప్తికరముగానే పనిచేయుచున్నారు. పశువైద్యమునకు చికిత్సాలయములు మొత్తము మీద ఎక్కువగానున్న వనియే చెప్పవలెను. పశు వైద్యము, పశువులరోగముల విషయమై ప్రజలు ప్రభుత్వము అత్యంత శ్రద్ధ వహించవలెను.

"ఔషధము కాని దేదియు అవసిలేదు" అని శేషకల్పములో చెప్పబడినది. సర్వద్రివ్య ములను పరిశోధించి, ఇంకను ఈ వైద్య శాస్త్రి ములను, విధానములను అభివృద్ధి చేయవలెను.

---

# 21వ అధ్యాయము

# ఆరోగ్యము, ఆటలు

ఈసురో మని మనుషు లుంటే
దేశ మేగతి బాగుపడు నోయ్?

—గురజాడ.

విషయ సంగ్రహము : ఆరోగ్యమే మహాభాగ్యము - మన దేహము, దానియొక్క ప్రాముఖ్యత—నిత్యజీవితములో కార్లు, సినిమాలు, ప్రయాణములు మొదలగువాటివల్ల కలుగుచున్న దైహిక మార్పులు—దేహారోగ్యమును కాపాడుకొనుటకు ఎట్టి ఆహారమును భుజింపవలెను—వార్ధా ఆహార నియమములు—విద్యార్థులకు ఆరోగ్యపరీక్ష—దేశమునకు జాతికి ఆటలు గీటురాళ్లు—ఆంధ్ర దేశపు ఆటలు—ఆంధ్ర దేశములో ప్రచారములో నున్న విదేశీయ ఆటలు—విదేశీయ ఆటలలోను వ్యాయామములోను ప్రఖ్యాతికెక్కిన ఆంధ్రులు—టెన్నిసు ఆటలో రామస్వామి నాయుడు, క్రికెటు ఆటకాడు సి. కె. నాయుడు, జయరామ్ మున్నగు ప్రసిద్ధాంధ్రులు—ఆంధ్ర దేశమున కసరత్తులు, బలప్రదర్శనములు. కుస్తీలు—ప్రపంచవిఖ్యాతి కెక్కిన ఇండియన్ హెరిక్యూలిస్ కలియుగభీమ కోడి రామమూర్తి—కుస్తీలలో గెలుపొందిన వస్తాదులు పాపోలు వీరవెంకయ్య, కి. శే. అల్లం, రంగయ్య. ఖాదుగార్లు—ధనుర్విద్యలో కలియుగార్జున అప్పారావు గారు—ఆయుక్షీణము—ప్రాణాయామము—యోగ మహిమ—శేషభట్టరు వీరరాఘవాచార్యులవారి గాలి యాత—ఆరోగ్యమునకు మించిన సంపద అవని లేదు.

"ఆరోగ్యమే మహాభాగ్యమన్న" లోకోక్తి మనము పరిపాటిగా వినుచున్నదే! శరీరవ్యాయామము, ఆరోగ్యరక్షణ ప్రతిమానవునికీ ముఖ్యావసరములు. దీర్ఘాయువు, ఆరోగ్యం గల శరీరం వున్ననేగాని మోక్షసాధనము కుదురదని మన

ఆరోగ్యమే మహాభాగ్యము!

ధర్మశాస్త్రం ఉద్ఘోషిస్తున్నప్పటికీ అడవి గాచిన వెన్నెల లాగ వున్నది. ఆత్మశుద్ధికి దేహశుద్ధి ఆలంబన. ఆత్మ భగవంతుడనే నమ్మకంవున్న అతనిని ప్రతిష్ఠించుకొను ఆలయమైన శరీరాన్ని గూడ రక్షించుకోవలసి వుండును. ఆదిలో మానవుడు బలిష్ఠుడై, పశుపక్ష్యాదులను వేటాడి, శరీరదార్ఢ్యం కలిగి వుండెడివాడు. తన రాజ్యరక్షణకు, తనకాలకు ప్రతియొక్కడు వ్యాయామక్రీడలు అభ్యసించి, శరీరపోషణము క్రమముగ చేసుకొనెడివాడు. మన రాజ్యపీఠం పరదేశీయులపాలయ్యేటప్పటికి, మనలను మనం రక్షించుకొనవలసిన బాధ్యత పోయినది. తర్వాత ఈ యంత్రయుగములో మానవబలప్రాతినిధ్యం కొంత తగ్గి కత్తి, కర్రలు మూలపడినవి. మన దైనందిన జీవితములో రైళ్ళు, కార్లు, ప్రయాణములు ముఖ్యములై కొంత దేహపటుత్వం, ఆరోగ్యం క్షీణింపజేసినవి. పట్నవాసాలు, మురికినీళ్లు, క్రిక్కిరిసిన జననివాసాలు, కాఫీహోటళ్ళు, సినీమాలు మొ॥ వాటి కలయికవల్ల అనేక అంటువ్యాధులు, క్షయ, ఉపద్రవకరములైన కలరా, మశూచి మొదలైనవి అభివృద్ధి చెందుచున్నవి. అడవులలోనే ఉండుననుకున్న మలేరియా జ్వరం ఊళ్లలోనికి వ్యాపించినది! వేళకాని వేళల ఫలహారాలు చెయ్యడం, తినుబండారాలు "దుంగనక దుట్రనక తిన్నదిరా కడుపు" అన్నట్లు, ఏ చెత్తపడిన ఆ చెత్త తిని సంతృప్తిపడటం, సరియైన ఆహారం లేకపోవడంవల్ల మన ఆరోగ్యానికి భంగ

కరంగా వున్నది. బలమునిచ్చు (వార్ధా పద్ధతుల మీద) దంపుడు బియ్యం, ఆకుకూరలు, పాలు, పెరుగు, పండ్లు, ఏకాలమున ఆకాలపు పండ్లు భుజించవలెను. ప్రత్యేకముగా పండ్లు భోజనముతో పాటు తీసుకొను అలవాటు చేసుకోవడము శ్రేయస్కరము. ఉత్తర హిందూదేశస్థుల ఆహారం పుష్టికరమైనది. దాక్షిణాత్యుల ఆహార నియమాలు, ఔత్తరాహుల పదార్థాలు సమ్మిళితం చేసిన క్రొత్త ఆహార విధులను అనుసరించడం ఉత్తమం. వేళకు ఆహారం లేకపోవడం ప్రమాదకరం. ఆంధ్రదేశంలో మెట్టదేశపు మనుష్యులను చూసిన ఒడ్డూ, పొడుగూ, విశాల ఫాలం, బలమైన ఎముకలు, కండతిరిగిన కాయముతో ఆకర్షవంతంగా వుండేవారు. ఇప్పుడు రానురాను యువకులలో విశాల వక్షస్థలం, దండతిరిగిన దార్ఢ్యం కలవారు అరుదుగా వున్నారు. దీనికి కారణం సరియైన ఆహారనియమాలు అనుష్టించకపోవుటయే !

యువకులు బలకరంగా ఉండకపోవడానికి కారణం పాఠశాల జీవితంలో తగిన శిక్షణ లేకపోవడమే! నాగరక దేశాలన్నింటిలోను పాఠశాలలయందు నిపుణులైన వైద్యులచే పరీక్షింపజేసి, చికిత్సాసౌకర్యములను వారికి కల్పింతురు.

**విద్యార్థులకు వైద్యపరీక్ష**

1908 లో ఇంగ్లాండులో విద్యార్థులను వైద్యులు పరీక్షించి చికిత్స చేయు ప్రణాళిక ఏర్పాటుచేయబడి, అక్కడి విద్యార్థులకు అనుక్షణం వైద్యసహాయం లభించునట్లు చేసిరి. వారికి ఆరోగ్య పారిశుద్ధ్య సూత్రములయందు శిక్షణ నిచ్చెదరు. పుష్టికరమైన ఆహారము వారికి లభించునట్లు ప్రభుత్వము ప్రధానముగా చూచును. ప్రజల సగటు జీవిత పరిమాణము 25 ఏండ్లు మించని ఈ దేశమున ఇట్టి వసతులు ఇంకా ఏర్పరచకపోవుట విచారకరము. చెన్న రాష్ట్రములో ఒకప్పుడు వైద్యపరీక్షా విధానము లాంఛనప్రాయముగా పెట్టిరి. ఇప్పటికైనా అది క్రమముగా అమలునకు రాలేదు. నేటికైనా విద్యార్థులకు వైద్యపరీక్షలు ఏర్పరచి, చికిత్సాసౌకర్యములు కలిగించుటవసరము. ఇటీవల పాఠశాలలలో జరిగిన పరీక్షలలో నూటికి 20-25 మందియొక్క అనారోగ్యమునకు పుష్టికరమైన ఆహారము లేకపోవుటయే కారణమని వెల్లడియైనది. విద్యార్థులకు ఈ లోటును తీర్చుటకు పాఠశాలలలో సౌకర్యములు కలిగించవలెను. దేశస్థితి ననుసరించి పది గంటలకు బడిపెట్టుట మనకు వర్జనీయము. అది మన పరిస్థితికి పడదు. ప్రాతఃకాలము చదువుకొనుటకు ఆరోగ్యకరమైన, అనువైన సమయము. ప్రజారోగ్య మభివృద్ధి పొందించవలెనని పాఠశాలలలో ఈ సంస్కరణ అవసరము.



శరీర వ్యాయామ విద్యలో కృషిసల్పిన ఆంధ్ర యువకుడు.

**ఆహారములో పుష్టికరమైన దేది?**

దేహపోషణార్థము పనికివచ్చు కొన్ని విషయములు మనము పట్టించుకొనుట లేదు. శరీరపోషణకు సరియైన ఆహార ముండవలెనుగదా! రైలు నడచుటకు బొగ్గు, నీరు కావలెనుకదా! ఇదిగాక మన ఆహా



శ్రీ దొడ్ల రంగారెడ్డి. బుచ్చిరెడ్డి పాలెం. విమాన శాఖలో పైలట్ ఆఫీసరుగా వున్నారు.

రమునకు ఒక విచిత్రమైన అందం కావలెనని, "అన్నం మల్లెపువ్వుల లాగా వుండాలి" అని బియ్యం, పొట్టు, చిట్టు మొదలైన బలవర్ధకాలను కడిగి, ఊకవండి ఒడ్డించుక తింటారు. కొందరు "మావాడు నిమ్మకాయంత అన్నం, ఉసిరికాయంత పచ్చడీ నంజుతా" డంటారు? అది ఒక మర్యాద, నాజూకై పోతున్నది. కూరగాయల నుడికించి, నీరు పారపోసి తాళింపు వేయుదురు. ఇవి తెలియకచేసే పనులు. ఆహారవిషయముల ప్రాముఖ్యము ఇక్కడ వివరించిన మంచిచెడ్డలు తెలియగలవు. శరీరగృహమును దిట్టపరచు ఆహారమే పుష్టికరమైనది.

ఈ ఆహారము అయిదువిధములు (1) మాంసకృత్తులు: గ్రుడ్లు, పాలు, పెరుగు, మినుములు, మాంసము మొదలగునవి. (2) కర్బనోద జనితములు: పిండి, తేనె, బెల్లము, చక్కెర మొదలగునవి. తేనె అమిత విలువైనఆహారం. మనకు తేనె వాడకం అనాదిసిద్ధమైనది. కానీ పంచదార తక్కువఖరీదులో రావడంచేత ఈ వాడం తగ్గిపోయినది. గత శతాబ్దంలో మానవుడు ఏడాదికి ఎనిమిదిపౌనుల పంచదార ఉపయోగించేవాడనీ, ఇప్పుడు ఏటేటా 112 పౌనుల పంచదారను ఉపయోగిస్తున్నాడనీ పాశ్చాత్య శాస్త్రవేత్తలు లెక్కవేశారు. నేడు మానవుడు ఏడాదికి $1\frac{1}{2}$ పౌనుల తేనె నుపయోగిస్తున్నాడు. సూర్యకాంతిలో పువ్వులనుంచి తేనెటీగలు కూర్చిన తేనె, తేనెపట్టులో కొన్ని మార్పులు పొందుతుంది. అందులో ఎంజిమీన్ అని పిలువబడే రసాయనిక పదార్థం చేరుతుంది. లావులోజ్, డెక్ట్రోజు అనే మధురపదార్థాలు తేనెలో చేరివున్నవి. ఇవి శ్రమ లేకుండా సులభంగా జీర్ణమై, జీర్ణకోశానికి పుష్టినిస్తాయి. బలహీనమైన గుండెకు తేనె బలం ఇస్తుంది. న్యుమోనియా జ్వరం కట్టుతుంది. విరివిగా తేనె ఉపయోగించడం వేయింటికి మేలు!

(3) చమురులు: నూనె, నెయ్యి, క్రొవ్వు మొదలైనవి. (4) ఖనిజద్రవ్యములు. (5) జలము. ఈ పైన చెప్పిన పంచపదార్థాలూ ప్రతి వస్తువులోనూ ఉండవు. అందుచేతనే వివిధ ఆహారపదార్థాలతో మిశ్రభోజనం చెయ్యాలి. ఇవిగాక శాస్త్రజ్ఞులు ఇటీవల దేహపోషణకు ముఖ్యమైన కొన్ని పదార్థములను నిరూపిం



శ్రీ రామచంద్ర చౌదరి (ఒంగోలు). విమాన శాఖలో పైలట్ ఆఫీసరుగా కరాచీయందున్నారు.



ఆంధ్రదేశమునందలి మల్లులు.

చారు. అవి విటమినులు. మనము గోధుమ, జొన్నలు, మొక్కజొన్నలు, యవలు, చామలు, బియ్యం మొదలైన రెండుమూడు రకములు మిశ్రమము జేసి భుజిస్తాము. వీటిలో కొన్ని దంపుట, విసరుట, సంస్కారము మొ॥నవి లేకుండా ఉపయోగించవచ్చును. ప్రతి ధాన్యము యొక్క ఊకకు క్రిందపొర ఉండును. బీజస్థానము నందును మంచి పుష్టిగల పదార్థమున్నది. దానిని పోకుండా దంచిన చేబియ్యం వంటకు మంచిది. మరబియ్యము ఉపయోగించిన ఈ పదార్థము లేమియు లభ్యముకావు. పచ్చికూరలు ఆకు కూరలు, పప్పుదినుసులు భుజించవలెను. కూర గాయలు భుజించని వారికి దంతరక్త స్రావము అధికము. నికృష్టాహారము భుజించు స్త్రీలకు గర్భిణీవ్యాధులు అధికముగా నుండును. ఎనామిల్ పాత్రలు వంటకు ఉపయోగిస్తే పేగులు చెడిపోవును. మట్టిపాత్రలు ఆరోగ్యానికి మంచివి. పై మూత పెట్టకుండా ఉడికించిన పదార్థములలో జీవశక్తి పోవును. ఆయురారోగ్యముల అభివృద్ధి పొందించుటకు ఉత్తమమైన ఆహారము భుజించవలెను.

**ఆటలు-పాటలు**

దేశానికీ, ఆజాతి ప్రాణానికీ ఆటలు ముఖ్యములు. ఆటలు పుష్టినీ, సౌష్ఠవాన్నీ శరీరానికి సమకూర్చును. మనస్సుకు విలాసాన్నీ, సంఘానికి ఐక్యతనూ ఇచ్చేవి ఇవే! ప్రతిదేశస్థులకూ, జాతికీ వారివారి ఆటలు గీటురాళ్లుగావుంటవి. పాశ్చాత్య దేశములలో యువకులు, పిన్నలు పెద్దలు, స్త్రీలు, యుద్ధములలో పాల్గొనుటకు కారణం వారికి నేర్పిన ఆటలు, సైనిక శిక్షణలే. మనకూ పూర్వం నుంచీ వచ్చే ఆటలు ఉన్నవి. అందులో చరిత్ర ప్రసిద్ధమైనవి కొన్నివున్నవి: బొంగరం-అంటే పల్నాటి వీరుడు బాలచంద్రుడు జ్ఞాపకం వస్తాడు. మన ఆటలు: చెడుగుడు, ఉప్పాట, ఆకుఆట, కోతి కొమ్మంచి, ఈత, పరుగు, గోలీలు, బంతి, బొంగరము, గాలిపడగ మొదలైనవి. పెద్దలూ పిల్లలూ ఆడుకొనేవి. వ్యయంకూడా వీటికి తక్కువ. విదేశీయుల ఆటలవలె బంతులకు, బ్యాట్లకూ, టెన్నిసుకోర్టులకు వందలవందలు వెచ్చించనక్కర్లేదు. డబ్బుపోయకుండా సమిష్టిమీద అందరూ ఆడుకోవచ్చును! ఇంకఇండ్లలో స్త్రీ పురుషులు, పిల్లలు



క్రికెట్ ఆటలో జగద్విఖ్యాతి పొందిన మేజర్ సి. కె. నాయుడు.

కలిసి ఆడుకొనేవి దశావతారాలు, చదరంగం, సోపానపటం మొదలైనవి. ఆడపిల్లలకు తొక్కుడు బిళ్ల, గొబ్బి ఆట, దాగుడుమూత, బొమ్మల పెళ్లి వున్నవి.

వీనిలో కొన్ని ఇప్పుడు పోయి, విదేశస్థులు ఆడు ఆటలు, డ్రిల్లు ప్రచారంలోకి వచ్చినవి. ఈ ఆటలలో ముఖ్యమైనవి ఫుట్‌బాల్, బ్యాట్‌మింటన్, టెన్నిస్, క్రికెట్, హాకీ, పోలో; ఇవికాక స్పోర్ట్సు కొన్ని. మొత్తము మీద ఈ ఆటలు అన్ని గ్రామములకూ అల్లుకుంటున్నవి. ఇవి వ్యయప్రయాసలతో కూడిన ఆటలు. అయినను ఈ ఆటలు పట్నవాసులు ఎక్కువగా ఆడెదరు. పాఠశాల, కళాశాల విద్యార్థులు తరచు ఆడుచుందురు.

**విదేశపు ఆటలయందు విదేశములలో కీర్తిగడించిన ఆంధ్రులు**

విదేశపుఆటలలో గూడా ఆంధ్రులు వన్నెకెక్కిరి. క్రికెట్ ఆటలో మేజర్ సి. కె. నాయుడు గారు ఇంగ్లాండు మొదలైన పాశ్చాత్య దేశములలో అశేషమైన కీర్తిని సంపాదించిరి. మొదటి రోజులలో ప్రశస్తమైన క్రికెట్ ఆటగాడు 'జయరామ్.' 1911లో హిందూదేశపు ఆటగాళ్లు మొదటి పర్యాయం ఇంగ్లాండు పోయినప్పుడు జయరామ్ వారిలో ఒకడుగా ఎన్నుకొనబడెను. సి. రామస్వామిగారు ఇంకొకగొప్ప క్రికెట్ ఆటగాడు. 1936 లో విజయనగరం మహారాజకుమార్ సర్ విజయగారు, హిందూదేశపు ఆటగాళ్లను ఇంగ్లాండు పోటీలకు తీసుకుని పోయిరి. పోలోఆటలో బొబ్బిలిరాజాగారు, ఐ. వి. రామారావుగారు ఘటికులు.

ఈ కసరత్తులలో వ్యాయామాలలో అనన్యమైన కృషిజేసి పరమపదించి, ఆకాశంలో ఆంధ్రులకు వేగుచుక్కలాగ వున్నవారు అకలంక బలసంపన్నులైన కోడిరామమూర్తిగారు. దౌర్బల్యం, నిర్వీర్యం, నిస్తేజం నాశనంచేసి, నలభై



కలియుగ భీమ, ఇండియన్ హెర్‌క్యులిస్ కీ. శే. శ్రీ కోడి రామమూర్తి.



ఆజానుబాహుడైన వస్తాదు శ్రీ కోడేటి రాజు.

రెండు అంగుళాలఛాతీ, చెక్కిదిద్దిన శిలాప్రతిమ వంటి కండపుష్టితో కన్నుల పండుగచేసినట్లు నిండుగా వుండేవారు. కోడిరామమూర్తి అంటే (ఇండియన్ హెర్క్యులిస్) అని విదేశస్థులు తమ నిఘంటువులలో వ్రాసుకుంటారు. ఆంధ్రులలో గర్వించదగ్గవ్యక్తి. ఏనుగులు, పెద్ద బరువులు మోయడం, మోటారుకారు ఆపడం, మొదలైన అసమానమైన, అనన్యమైన ప్రజ్ఞలు వీరికి అలవడి నవి. వీరి సర్కసు పేరు ఆబాలగోపాలము

**కసరత్తులు, బలప్రదర్శనములు, కుస్తీలు**

విన్నారు. వీరిశిష్యులు ప్రొఫెసర్ బులుసు రామజోగారావుగారు మద్రాసులో వ్యాయామ విద్యాలయము స్థాపించి, ఎక్కువ కృషి జేయుచు ప్రఖ్యాతి నొందిరి. ఇంకొక శిష్యులు పిల్లారిశెట్టి నారాయణరావుగారు బందరులో సర్కసు పెట్టిరి. వీరికిదేశ మంతటా శిష్యబృందమువున్నది. అనేక మందియువకులను, శాండోలను బయలుదేరదీసినారు. గామా కు ఇంగ్లాండు త్రోవచూపినది రామమూర్తిగారు. వీరి అంకితార్పణతో అనేకచోట్లబాహుబలప్రదర్శనాలూ, తాలింఖానాలు వెలసినవి. ఆరోజులలో బాహుబల ప్రదర్శకులలో ప్రముఖులు వైశ్యులలో కంభంపాటి కన్నయ్యగారు (ఏలూరు), కమ్మవారిలో మాగంటి చిన సుబ్రహ్మణ్యంగారు చాటపర్రు, క్షత్రియులలో కోడేటి రాజుగారు బయలుదేరిరి. గుంటూరులో ఇంకాఇతరత్రా చాలామంది యువకులు, ఈ పంథాలో పరిశ్రమ చేసినవారున్నారు. కుస్తీలలో కూడా వస్తాదులను కోడి రామమూర్తిగారు తయారుచేసిరి. తాలింఖానాలు, లేక అఖాడాలు అనేక చోట్ల ఏర్పడినవి, వ్యాయామసంఘములు చిగురించినవి. కుస్తీలు గుంటూరు, బందరు, కడప, ఏలూరు, రాజమహేంద్రవరములలో ఎక్కువగా జరుగుచుండును. ఆంధ్రదేశములో అనేక చోట్ల కుస్తీల గెలిచి విఖ్యాతి పొందిన గౌరవ కుటుంబీకులు, ఏలూరు వాసి పాపోలు వీర వెంకయ్యగారు. వీరికి అనేక మంది శిష్యులుగలరు. ఏలూరులో కొన్నాళ్లు వ్యాయామ సంఘంవారు కుస్తీలు, వ్యాయామ పోటీలు బహుమతులుపెట్టి జరుపుచుండిరి. ఆంధ్రదేశపు ఫహిల్వానులలో కొందరు: పశ్చిమ గోదావరిజిల్లా వీర వెంకయ్య, రమణయ్య, కోడేటి వెంకట్రాజుగార్లు; బందరులో రంగయ్య, పీరాస్వామి, ఖాదు, సోమయ్యగార్లు ; పాలకొల్లులోకొమ్మూరి సత్యంగారు ; రాజమండ్రిలో పోతులూరి వీరాస్వామి, చిన స్వామిగార్లు; గుంటూరులో అల్లం, కత్తుల భావన్నానారాయణ గార్లు ; కడపలో నాగయ్యగారు ; వీరు కాక అనేక మంది అనేక చోట్ల కుస్తీలు



శ్రీ పాపోలు వీర వెంకయ్య, ఆంధ్రదేశ ప్రఖ్యాత వస్తాదు, మల్ల విద్యా ప్రవీణులు, ఏలూరు.

గెలిచిన వారు అనేక వర్ణములలో నున్నారు. కొంత మంది ఇప్పుడు బెంగుళూరులో ఇంగ్లీషు శాండో పద్ధతిని కుస్తీ నేర్చుకొనుచున్నారు.

ఆంధ్ర దేశము, అదిదాటి యావత్ భారతదేశము విలువిద్యలో తన ప్రతిభ చాటిన గుండవరపు అప్పారావుగారు, ముప్పాళ్ల గ్రామవాసి, కలియుగార్జునుడని పేరు కెక్కిరి. రాజుగారు కూడా విలువిద్యా పారంగతులే!

కత్తి, కర్రత్రిప్పుట మొదలైన పనులు చేయువారు అనేకులున్నారు. ప్రతిగ్రామములోను పాఠశాల, గ్రంథాలయముతో పాటు వ్యాయామము చేసికొను తాలింఖానా కూడ ఉండుట అవసరము.

సాధారణముగా యోగులు ప్రాణాయామము చేసి, వేలకొలది సంవత్సరములు బ్రతికియున్నట్లు మనము విన్నాము. ప్రాణాయామము చేసి శ్వాసను నిగ్రహించుటచే ఆయుర్వృద్ధియగును. మనము మనోనిగ్రహముచే శ్వాసమును వృథాచేయకున్న చాలును. సాధారణముగా మాట్లాడునప్పుడు 8 అం. శ్వాసములోన ప్రవేశించి, 12 అం, శ్వాసము బయటకు వచ్చుచున్నది. పరుగెత్తుట యందు 27 అం. శ్వాసములోన ప్రవేశించి, 54 అం. శ్వాసము బయటకు పోవును. నిద్రలో 18 అం. శ్వాసమునష్టము. సంభోగ కాలమందు 64 అం. శ్వాసము బయటకువచ్చి 24 అం. శ్వాసములోపలికి ప్రవేశించును. ఈ విధముగా ఆయుఃక్షీణముకలుగుచున్నది. శ్వాసముబంధించుటకు యోగాసనములుపకరించును. వస్తికర్మ (ఎనీమా వంటిప్రక్రియ) నభ్యసించుటవల్ల క్రిందకడుపుకు మంచిబలము కలిగి, ప్రేగులు శుభ్రపడును. యోగవిద్యవల్ల దీర్ఘవ్యాధులు కూడా కుదురును. ఇటీవల ఆసన ప్రకరణముల విస్తరించి 'గాలియాత' (నీటిలోవలె గాలిలో ఈదుట) అను ఉత్కృష్ట గ్రంథమును ఒంగోలువాసి శేషభట్టరు వీరరాఘవాచారిగారు వ్రాసినారు. ఇవన్నియు యోగశాస్త్రమున చెప్పబడినవే! ప్రాణాయామము చేసి, ఆయుర్వృద్ధి పెంపొందించుకొనవచ్చును. అన్ని సంపదలకన్న ఆరోగ్యమును మించిన సంపద అవనిలోలేదు!

ప్రాణాయామము- ఆయుఃక్షీణము- యోగమహిమ- గాలియాత



శ్రీ నాయుడు వెంకటనారాయణ, యువకులలో గొప్ప వస్తాదు, ఏలూరు.

# దుర్గా బ్రాండు పోర్ట్ లేండ్
# ఆంధ్రా సిమెంటు

గవర్నమెంటు జిల్లా బోర్డులు, మ్యునిసిపాల్టీల చే అన్ని విధముల కట్టడములకు విరివిగా వాడబడుచున్నది.




ఆంధ్ర దేశములో ఆంధ్రులచే స్థాపించబడి, ఆంధ్రులచే తయారుకాబడిన ఈ సిమెంటు అన్ని పట్టణముల యందును దొరుకును.

వాడి, ఈ ఘనమైన ఆంధ్ర పరిశ్రమకు తోడ్పడెదరు గాక!

## ది ఆంధ్రా సిమెంటు కంపెనీ లిమిటెడ్.

ఫ్యాక్టరీ ఆఫీసు: బెజవాడ. హెడ్ ఆఫీసు: విశాఖపట్టణము.



# ఏడవ భాగము - తెలుగుభాష

## 22 వ అధ్యాయము

మొదటి ప్రకరణము

# ఆంధ్రవాఙ్మయచరిత్ర

(స్థూల రూపము)


శ్రీ పింగళి లక్ష్మీకాంతం ఎం. ఏ., (ఆంధ్ర విశ్వకళాపరిషత్)


విషయ సంగ్రహము :—ఆంధ్రి - తెలుగు - తెనుగు శబ్ద విచారము ; భాషోత్పత్తి విచారము ; సంస్కృత భవమా ? ద్రావిడ భాషయా ? సంస్కృత శిక్షలో పెరిగిన ద్రావిడ భాష యని బహుపండిత సమ్మతమైన సిద్ధాంతము ; ఆంధ్రి కవిత ప్రాచీన కాలమందే పుట్టినను స్థిరమైన కవితారూపమును కల్పించిన ఆదికవి నన్నయభట్టు ; నన్నయయుగము—11 వ శతాబ్ది, వైదికయుగము; నన్నయ భారతరచన సంస్కృత భారతమునకు యథోచితానుసరణమేకాని యథామాతృకము కాదు ; 12 వ శతాబ్ది, శైవయుగము ; నన్నెచోడుడు, పండితారాధ్యుడు, సోమనాథుడు ; నన్నెచోడుడు కవిరాజ శిఖామణి, అతని కుమార సంభవము ఉత్తమ కావ్యము ; పండితారాధ్యుని కావ్యములలో శివతత్త్వసారమొక్కటే దక్కినది ; పాల్కురికి సోమనాథుని కావ్యములందు కావ్యాంగములన్నియు దేశీయములే; ద్విపద కావ్యమునకు గౌరవము తెచ్చిన మహనీయుడు ; తిక్కన యుగము-13 వ శతాబ్ది ; ఇందు మొదటి గ్రంథము కోన బుద్ధారెడ్డి రచించిన రంగనాథరామాయణము ; చరిత్రయందును, వాఙ్మయమందును ప్రసిద్ధపురుషుడు తిక్కన సోమయాజి ; ఇతని మొదటి కృతి నిర్వచనోత్తర రామాయణము ; రెండవది భారతము ; అచ్చ తెలుగునకు ప్రతిష్ఠసంపాదించినవాడు ; ఇతనికి పరోక్షముగా కేతనయు, ప్రత్యక్షముగా మారనయు శిష్యులు ; కేతన దశకుమార చరిత్రము కవితానైపుణ్యము గలది ; మారన మార్కండేయపురాణము తర్వాతి మనుచరిత్రాది ప్రబంధములకు మూలప్రకృతి ; ఎఱ్ఱనయుగము (1300—1350) ; నన్నయ విడిచిన అరణ్యపర్వము పూర్తిచేసి భారతమునకు అనుబంధముగా హరివంశము రచించి సంస్కృతమునకును, అచ్చ తెలుగునకును మధ్యస్థమైనశైలిని సమకూర్చుకొని నృసింహ పురాణము రచించి, ప్రబంధ రచనకు మార్గదర్శి యగుటచే, ప్రబంధకవిత్వ స్థాపనాచార్యు డనుబిరుదు పొందెను ; ఇతని సమకాలికులు భాస్కరుడు, నాచన సోముడు ; శ్రీనాథుని యుగము (1350—1500) ; తిక్కన తర్వాత పేర్కొనదగిన విద్వత్కవి శ్రీనాథుడు ; కవి సార్వభౌముడు, భీమఖండములో తన దేశవర్ణనలను పొందుపరచెను ; అతని క్రీడాభిరామము ఆంధ్రిసారస్యత మందలి మొదటి హేళన కావ్యము ; ప్రబంధరచనకును శ్రీనాథుడే మార్గదర్శకుడు ; పోతనామాత్యుడు ఆంధ్రి కవి ప్రవక్తలలో ద్వితీయుడు ; శ్రీకృష్ణుని తత్త్వమును గానము చేసి, ఆంధ్రుల మనోలోకమున పరివర్తనము గావించిన భాగవతకర్త ; వెనుకబడిన ద్విపదరచనను పునరుద్ధరించినవాడు గౌరన ; ప్రబంధ మహానాటకమునకు శ్రీనాథుడు నాందీశ్లోకమును పఠింపగా పిల్లలమఱ్ఱి పినవీరన శృంగారశాకుంతల రూపమున ప్రస్తావన కావించెను, చారిత్రాత్మకములైన చిత్ర కథాకావ్యములను రచించినవారు జక్కన, అనంతామాత్యులు ; సంస్కృత నాటకములను ప్రబంధ

ములుగా అనువదించినవారు నంది మల్లయ, ఘంటసింగన; వీరిలో పురాణేతిహాసోచితమైన సాధుత్వము తగ్గి ఆలంకారిక శైలి ఏర్పడినది; కృష్ణరాయలయుగము (1500—1600); ప్రబంధలత పుష్పించి ఫలించినది; కృష్ణదేవరాయలు రాజు, పండితుడు, కవి, విద్యాపోషకుడు; ఆస్థానకవులు అష్ట దిగ్గజములు; ఆంధ్రకవితాపితామహుడు అల్లసాని పెద్దన; అతని మనుచరిత్రము శాంతశృంగారములు సంగమించిన తీర్థము; ఆస్థానమందే కాక అంతఃపురమందును చనవులందిన నంది తిమ్మన పారిజాతాపహరణము నాయకరాజుల కాలములో వెలసిన విప్రలంభ శృంగార కావ్యములకు మార్గదర్శకమయినది; అయ్యలరాజు రామభద్రుడు, మాదయగారి మల్లన కొంతవిశిష్టతగల కవులే; ధూర్జటి కాళహస్తి మహాత్మ్యము అతని లోకవృత్తిపరిజ్ఞానమునకు నిదర్శనము; అతని కాళహస్తీశ్వర శతకము అతని కీర్తి అజరామరము చేయగలదు; ఈ యుగమందలి కవివర్గమనెడి మణిహారమునకు మేరుపూస శ్రీకృష్ణరాయలు; అతని ఆముక్తమాల్యద అతని సాహిత్యకీర్తికి ధ్వజప్రాయమైన కావ్యము; సంకుసాల నృసింహకవి అష్టదిగ్గజములలో చేరవలసినవాడు; రాధామాధవకవి చింతలపూడి ఎల్లనార్యుడును, శృంగారమల్హణమును రచించిన ఎడపాటి ఎఱ్ఱనయు గొప్పకవులే; పింగళి సూరన; శ్లేషకవిత్వమునకు పరిణామరూపము అతని రాఘవపాండవీయము; తర్వాతి ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యములకు మార్గదర్శకము; అతని కళా పూర్ణోదయము నూతన శిల్పనైపుణ్యము కలది. నాయికాప్రధానమైనకావ్యము; ఆంధ్ర కవుల వస్తునిర్మాణ శక్తికి ధ్వజప్రాయమైనది అతని ప్రభావతీ ప్రద్యుమ్నము; రామరాజభూషణుడు రచించిన వసుచరిత్ర ఆంధ్రకావ్యము



తిక్కన లేఖిని ఒరవన్నిటను ప్రౌఢసాహిత్యము ఎక్కువగా గల మహాకావ్యము; తెనాలి రామకృష్ణకవి కావ్యములందు పాండురంగ మాహాత్మ్యమే అతని యశమునకు నిధానమైనది. సారంగు తమ్మయ, చదలవాడ మల్లయ శృంగార హాస్యప్రధానములుగా పరమభక్తుడగు విప్రనారాయణ చరిత్రము రచించిన సాధురచయితలు; కందుకూరి రుద్రయ సాంఘికేతివృత్తమును ప్రబంధించిన స్వతంత్రుడు; అతని సుగ్రీవపట్టాభిషేకము యక్షగానము, ఇదియే యక్షగానరచనకు ప్రారంభము కాబోలు; పొన్నగంటి తెలగన్నకు గల ప్రత్యేకత అచ్చతెలుగు కావ్యరచన—దక్షిణాంధ్రయుగము (1600—1775) మూలపురుషుడు రఘునాథరాయలు కవి, పండితుడు, కవిపండిత పోషకుడు, వాల్మీకి చరిత్రను ప్రబంధించిన కవి; తంజావూరు ముఖ్యసాహిత్యకేంద్ర మయినది; ఈ యుగలక్షణములు; నీతి బోధకు సంబంధములేనికళాసౌందర్యము, విలాసతత్పరత, శృంగారప్రియత్వము, హాస్యచతురత; చేమకూరకవి విజయవిలాసము తంజావూరు తెలుగులోని లాలిత్య మెట్టిదో చూపును; రఘునాథుని ఆస్థానమునలంకరించిన కవయిత్రులలో మధురవాణి, రామభద్రాంబ ముఖ్యలు; రఘునాథుని కుమారుడు విజయరాఘవుడు పెక్కు యక్షగానముల కర్త; ఇతని కొలువుకూటమున వన్నెపెట్టిన కవయిత్రి రంగాజమ్మ; క్షేత్రయ ఇతని మిత్రుడు. విజయరాఘవుని కుమారుడు మన్నారుదాసుకూడ యక్షగానకర్తయే; ఇతనితర్వాతి మహారాష్ట్రరాజులును ఆంధ్రకవిపోషకులే; వారి కాలమున యక్షగాన రచన ఎక్కువయినది; ముద్దుపళని రాధికాసాంత్వనము శృంగారప్రబంధములలో మిన్న; విప్రలంభశృంగారమును వర్ణించినది; మధురలో తిరుమలనాయని పోషణలో ఆంధ్రకావ్యరచన ప్రారంభించినది, అతనికిని అతని కుమారునికిని ఆస్థానకవియైన లింగనమఖి శ్రీరామేశ్వరకవి సత్యభామాసాంత్వనమును, వెలిదండల వేంకటపతి శృంగారరాధామాధవమును రచించిరి; పాండ్యరాజకవి విజయరంగ చొక్కనాథుడును కవి, విద్యాపోషకుడు; అతని సేనాపతి సముఖము వేంకటకృష్ణప్ప ఖండకావ్యమనదగు రాధామాధవసంవాదము రచించెను; కృష్ణప్పనాయని మిత్రుడు శేషము వేంకటపతి తారాశశాంకమను కేవల శృంగార ప్రబంధమును రచించెను; మధుర వచనరచనలకు ప్రసిద్ధికెక్కెను; ప్రౌఢరచనలతోపాటు ప్రజాసామాన్యమునకు సులభమైన రచనలును గల వచనకావ్యములు పుట్టినవి; పుదుకోట రఘునాథతొండమాన్ రాజకవి, పార్వతీపరిణయ కర్త; సుదుపాటి కవివంశమునకు ఆశ్రయమిచ్చెను; త్యాగరాజు అపరపోతన; సారస్వతాలయమునకు సువర్ణశిఖరము; అతని కీర్తనలు ఆంధ్రులకే కాక అరవలకును ఆదరణీయములు. క్షీణయుగము (1775-1875) రాజ్యక్షీణలక్షణము కవిత్వమునకును పట్టినది; కవులలో భావదాస్యము, అనుకరణేచ్ఛ ఎక్కువయినవి; వారిలో ఏమాత్రమేని గుణముగలవారు కంకంటి పాపరాజు మొదలయిన కొలది కవులు; పాపరాజు రచించిన ఉత్తరరామాయణము వస్తుతత్త్వమును బట్టి పురాణమే అయినను శైలినిబట్టి ప్రబంధ మనవలెను; పుష్పగిరి తిమ్మన ఈ గ్రంథరచనలో సాయముచేసినవాడే కాని ఈ గ్రంథమును రచించినవాడు కాడు; అతని సమీర కుమారవిజయమందలి శైలి వేరు; కూచిమంచి తిమ్మకవి శ్రీనాథునితర్వాత రెండవ కవిసార్వభౌముడు; అచ్చతెనుగు రచనలను పునరుద్ధరించినవాడు; ఇతని తమ్ముడు జగ్గకవి రచించిన చంద్రరేఖావిలాపము హేళనకావ్యమను పేరికి తగని మోటుగ్రంథము; వక్కలంక వీరభద్రకవి రచించిన వాసవదత్తాపరిణయము కొంత కవితానైపుణ్యము గలది; అడిదము సూరకవి రచించిన కవిజన

రంజనము ఇంకొక పిల్లవసుచరిత్ర; చిత్రకవి సింగనార్యుని బిల్హణీయము మొదలయిన కొన్ని కావ్యములు దక్షిణాంధ్రకావ్యముల ఛాయలు గలవి; శ్లేషకావ్యములు, రెండు, మూడు, నాలుగర్థములు గల కావ్యములు ఎక్కువయినవి; అందు పింగళిపోలు లక్ష్మణ కవి రచించిన రావణదమ్మీయము పేరుపొందినది. ఈ యుగాంత మున ఖ్యాతికెక్కిన కవి మండపాక పార్వతీశ్వర శాస్త్రి; అందరి కంటెను ఎక్కువశతకములు రచించిన కవి:—శతకరచన విచారము; వేమనయోగి శతకములు; ఆధునికయుగము (1875-....) ఇందు ప్రాచీనలక్షణము గలసాహిత్యము కొంత, నవీనలక్షణము గల సాహిత్యము కొంత; గోపినాథుని వేంకటకవి ప్రాచీనపక్కిని యథామూలముగా వాల్మీకి రామాయణమును ఆంధ్రీకరించెను. ఇతనివలెనే దాసు శ్రీరాములు, తిరుపతి వేంకటేశ్వరులు, త్రిపురాన తమ్మయదొర, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, వావిలకొలను సుబ్బారావు, జనమంచి శేషాద్రిశర్మగార్లు పురాణములే కాక ప్రబంధములును ప్రాచీనలక్షణమును అనుసరించి రచించిరి. పూర్వపక్కిని రచించియు తమ కృతులకు నూతనత్వమును ఆపాదించినవారు తిరుపతి వేంకటేశ్వరులు; వీరి వాక్కు ప్రాచీనసరళికి భరతవాక్యము, నవీనసరళికి నాందీవాక్యము; క్రొత్తపోకడలలో వచనము, నాటకము, భావకవిత్వము పేర్కొనదగినవి; వచనమునకు చిన్నయసూరి భగీరథునివంటివాడు; కందుకూరి వీరేశలింగముగారు మార్గదర్శకులయిరి. వారి రాజశేఖరచరిత్రము తెలుగులో మొదటి నవల; అనుయాయులైన చిలకమర్తి లక్ష్మీనరసింహముగారుకొన్ని సాంఘిక చారిత్రక నవలలను రచించిరి. ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి సాంఘికనవలలలో ప్రసిద్ధిపొందినది; ఇంకను మరికొన్ని నవలలు, కవుల చరిత్రలు, విమర్శలు మొ॥; నాటకములు దార్వాడ కంపెనీవారి రాకతో పుట్టినవి-నాటకకర్తలు ; భావకవిత్వములో కొంత పురస్కారార్హమైనది లేకపోలేదు. నేటి సారస్వతము బహుముఖముల వృద్ధిపొందుచున్నది ; ఇందేదినిలచునో భావికాలమున నిర్ణయమగును————.

"దేశభాషలందు తెలుగు లెస్స" అని శ్రీనాథాదులైన మన పూర్వులచేతను, "Italian of the East" అని పాశ్చాత్య శబ్దవేత్తలచేతను ముక్తకంఠమున ప్రశంసింపబడిన మన యీ భాషకు ఆంధ్రమనియు తెలుగనియు తెనుగనియు మూడు పర్యాయపదములు కలవు. వీని వ్యుత్పత్తులనుగూర్చి పెక్కు మీమాంసలు జరిగెనుగాని అవన్నియు నిశ్చిత జ్ఞానదాయకములు కాకపోవుటచే యుక్తి సంపన్నములైన ఊహలుగా మాత్రమే పరిగణింపబడుచున్నవి. ఆ చర్చల నన్నింటిని పునరుద్ధరించి మఱికొంత ప్రసంగము పెంచుట అనావశ్యక మగుటయేకాక అపేక్షితముకూడ కాదు. కాని ఒక సంగతి—ఈ మూడు పదములలో తెనుగు తెలుగు అనునవి రూపాంతరములే అనియు, ఆ పక్షమున మన భాషకు రెండే పర్యాయ పదములుండుననియు నా ఊహ. ఈ రెంటిలో ఆంధ్రమనునది మొదట రాజపరముగా, పిమ్మట దేశపరముగా, ఆపై దేశభాషాపరముగా ప్రయోగింపబడగా, తెనుగనునది మొదట దేశపరముగా, పిమ్మట ప్రజాపరముగా, ఆపై వారి భాషాపరముగా వాడబడెనని అనుమానించుట కొంతేని సమంజసముగా తోచుచున్నది.

ఇక పేరువలెనే మనభాష పుట్టుకయు వివాదగ్రస్తముగానే యున్నది. పూర్వ పండితులును, తన్మతానుయాయులైన కొందఱు ఆధునిక పండితులును మనభాష సంస్కృతభవమైన ఒక ప్రాకృత విశేషమని నిరూపింపగా కాల్డ్వెల్ పండితుడును ఆతని అనుయాయులైన మఱి కొందఱు ఆధునిక పండితులును ఇది ద్రావిడ భాషాకుటుంబములోనిదే యని వాదించుచున్నారు. ఈ రెండు మతముల వారికిని తమకు తమకు తగినంత యుక్తిసంపదయు కలదు. వారైనను కేవల వివాదము కొఱకుకాక సత్యాన్వేషణ తత్పరత చేతనే తమ సిద్ధాంతముల నిలబెట్టుకొనుటకు చూచుచున్నారు. ఎంత పాటుపడినను భాషల యుత్పత్తిస్థానమును కనిపట్టుట ఏరులు పుట్టుచోటును గుర్తించుటవలె దుర్ఘట కార్యమే యగునుగాని, నిశ్చయాత్మకమైన నిరూప



శ్రీ పింగళి లక్ష్మీకాంతం ఎం.ఏ.

ణము కాజాలదు. అయినను కంటికి చూపానినంతవఱకు తరుముకొని పోయిపోయి, స్థూలారుంధతీ న్యాయమున ఏదేని ఒక నిర్దేశము చేయనిచో ఆ పరిశోధనలన్నియు నిష్ఫలారంభములేయగును. మన భాషా పరిశోధకులు సైతము అభూతకల్పన కాకుండుటకును, నిర్దేశములు స్థూలములైనను శాస్త్రీయములగుటకును చాల కృషిసల్పిరి; ఇంకను సల్పుచున్నారు. ఇప్పటికి బహుపండితసమ్మతమైన సిద్ధాంతము, తెలుగు ద్రావిడభాషా వర్గములోనిదని. ఆర్యభాషా స్వభావమునకు భిన్నములును, ద్రావిడ భాషలకు సాధారణములును అగు లక్షణములు మన భాషలో చాల కలవు. పుట్టుకనుగూర్చి ఈ రహస్యము అంగీకరింపక తప్పదు. పోషణలో మాత్రము తెలుగునకు సంస్కృతమువలని ఉపకారమే ఎక్కువ కలిగినది. మన భాష సర్వసంపన్నమగుట సంస్కృత శిక్షలో పెరుగుటవలననే. సహజముగా ద్రావిడ లక్షణమునుబట్టి సరళమును సుకుమారమును అయిన తెలుగువాణి కాలక్రమమున గాంభీర్య పటుత్వములను అలవఱచుకొని తల్లికిని అక్క సెల్లెండ్రకునులేని క్రొత్త సొగసుదనమును కైవసము చేసికొన్నది. పరస్పర భిన్నములైన ఆర్యద్రావిడ భాషలను రెంటిని ఒక్కచో సమ్మేళనమొనర్చి సమరసభావము సాధించినది కావుననే, తెలుగు పలుకు ఆ రెంటికినిలేని గుణాతిశయమున విలసిల్లుచున్నది. కావున్న "దేశభాషలందు తెలుగు లెస్స"యగుట యెట్లు?

ఇట్టి ఆర్యద్రావిడ సామరస్యము మన భాషలోనేకాక మన సభ్యతలో, మన మనోధర్మములలోగూడ విశదమగుచున్నది. ఈ పొత్తు ఏ యితర రాష్ట్రమునందును కలుగలేదని చెప్పుట అతిశయోక్తిగాదు. ఆర్యులైన ఔత్తరాహులకును, ద్రావిడులైన దాక్షిణాత్యులకును కొంత మధ్యగానున్న భూభాగము మనకు ఉనికిపట్టగుటచే మన మాయిరువురి సంప్రదాయములను చేపట్టి పదను చెడకుండ పాకముచేసి ఆంధ్రత్వమనెడి అమృతమును సిద్ధముచేసితిమేమో అనిపించును. అందుచే గంగా యమునా మధ్య

తిరుపతి వేంకటకవులు, శతావధానులు



కీ. శే. శ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రి (ఎడమప్రక్క).
కళాప్రపూర్ణ శ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి (కుడిప్రక్క).



కీ. శే. మహోపాధ్యాయ
శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రి
ప్రసిద్ధాంధ్ర పండితులు,
అధ్యాపకులు, కవులు.

ప్రదేశమైన ఆర్యావర్తము వైదికవిజ్ఞానమునకు కూటస్థలముగా పరిగణింపబడినట్లు ఆర్యద్రావిడ విజ్ఞానమునకాంధ్రభూమి పవిత్ర కూటస్థలమైనది.

ఇట్టి పవిత్రక్షేత్రమున పూర్వోపాహృతములైన ఆ భాషా సభ్యతలకు స్థిరమైన కవితా రూపమును కల్పించిన ఆదికవి నన్నయభట్టు. ఆయన భారతమే నేను పైని పేర్కొన్న ఆంధ్రభాషా స్వభావమునకును ఆంధ్ర సభ్యతా స్వరూపమునకును శాశ్వత నిదర్శనము. సుపరిష్కృతమైన అట్టిభాషలో సుప్రతిష్ఠిత సభ్యతామయమైన ఆ భారతేతిహాసము ప్రారంభించుటచేతనే నన్నయ ఆదికవియయ్యెను. కాని, అంతవారు కాకున్నను కేవలము కవులనిపించుకొనదగినవారు మన దేశములో నన్నయ నాటికే చూపున కందరానంత ప్రాచీన కాలమునుండియు నుండి యుందురు. అసలు ఏ దేశమునందైనను ఏ భాషయందైనను కవిత్వావిర్భావము ఏ పరిశోధనలకును అందని అతి దూరకాలముననే జరుగును. అది రాజ్యములయొక్కయు సభ్యతలయొక్కయు పుట్టుకలకుముందే పుట్టును. చిత్ర విచిత్ర కమనీయమైన ప్రకృతి దేవతోత్సంగమున ఓలలాడు ప్రాక్తన మానవుడు తద్దర్శన స్పర్శనాది జన్యమైన సుఖదుఃఖములను మనసున పట్టలేక అవశుడై వచ్చియు రాని భాషలో ఏనాడు నోట పాటగా వ్యక్తముచేసెనో ఆనాడే కవిత్వము పుట్టినది. ఆ పాట గాలిలో పుట్టి గాలిలో అడగిపోవు ఆశుకవిత్వమే కాని భావికాలమునకు అక్కఱకు రాదగిన స్థిరరూపము కలది కాదు. లిపిసాధనములేనిది ఆ స్థిరత్వము కలుగదు. కావున భాషకు తత్కవిత్వమునకు అక్షర రహితమైన దశ యొకటియు అక్షరబద్ధమైన దశ యొకటియు రెండు విధిగా ఏర్పడును. అక్షరములు—లిపి—ఏర్పడిన పిమ్మటగూడ వెంటనే అది కావ్యరచనకు అక్కఱకురాదు. కొంతకాలము రాజకీయాది లోక వ్యవహారములకు మాత్రమే వినియోగపడి పిమ్మట సారస్వత సాధనముగా పరిణమించును. ఈ ధర్మము లోకములోని అన్ని భాషలకును సామాన్యమే. కావున నన్నయభట్టు భారతము ప్రారంభించు నాటికే మన భాషకు ఈ దశలన్నియు గడచి సుస్థిరమైన రూపమేర్పడినది.

ఇప్పటికి లభించిన శాసనముల ఆధారములనుబట్టి చూడగా, ఈ భాషను తొలుత 7 వ శతాబ్దిలో రాజభాషగా స్వీకరించినవారు చాళుక్యరాజులనియు, అప్పటికి తెలుగు ప్రాకృతబహుళముగా నుండెననియు, పిమ్మట మూడు శతాబ్దుల కాలములో ఆ రాజుల పరిపోషణవలననే క్రమపరిణతిబొంది స్వతంత్రమై పద్యరూపమును గూడ తాల్చెననియు విదితమగుచున్నది. శాసనములలో కాన వచ్చు పద్యములనుబట్టి అదే కాలమున అట్టి దేశియచ్ఛందములలో చిన్నచిన్న కావ్యములు పెక్కులు పుట్టియుండవచ్చుననియు, అవన్నియు ప్రౌఢ సాహిత్యముగా గాక పద కవిత్వముగా ఎల్లెడల వ్యాపించియుండెననియు ఊహించుటకు పెక్కు గ్రంథస్థలములైన ఆధారములు కలవు. ప్రాఙ్నన్నయ యుగమునందలి ఆంధ్ర సారస్వతస్థితి యింతమాత్రమే. ఆనాటి ఆ పదకవితా వాఙ్మయమంతయు భారతముముందు నిలువలేక తనంత అంతరించియుండును. ఆనాటి కవిత్వము కేవలము పద కవిత్వమే అగుటచేతను, ప్రజలట్టి దానిని భద్రపఱచుటలో అంత శ్రద్ధవహింపక పోవుటచేతను ప్రజలు పాటగా పాడినంత కాలము నిలచియుండి కాలక్రమమున నశించిపోయి యుండును.

## నన్నయ యుగము 11వ శతాబ్ది.

గడచిన మూడు శతాబ్దులలో జరిగిన కృషివల్ల భాష ఎక్కువగా విస్తరించినను తత్సమ తద్భవాది శబ్ద నిష్పత్తితో ఇంకను నిష్కర్షమైన నియతి యేర్పడలేదు. శాస్త్ర సమ్మతమైన సంస్కార పూర్వకముగా అట్టి పదముల కన్నిటికి సురూపత ఏర్పఱచుటకై రాజాశ్రయమున ఈ శతాబ్దిలో కొన్ని పండిత పరిషత్తులు వెలసియుండవచ్చును. ఆస్థాన



కళాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ
శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.



కళాప్రపూర్ణ కీ. శే. శ్రీ జయంతి రామయ్యపంతులు, ఆంధ్ర సాహిత్య పరిషత్ అధ్యక్షులు, శ్రీ సూర్య రాయాంధ్ర నిఘంటు సంపాదకులు.

పండిత కవి గనుక నన్నయ ఆ పరిషత్తులకు అధ్యక్షుడును అయియుండవచ్చును. ఆయనకు వాగనుశాసనుడను బిరుదు వచ్చుటకీ పదవియే హేతువైయుండును. కావుననే ఆంధ్రమున ప్రథమ మహాకావ్యము రచించుటేకాక, ఈ భాషను అనుశాసింపవలసిన బాధ్యతనుగూడ వహింపవలసి వచ్చెను.

ఆంధ్ర భారతము సంస్కృత భారతమునకు అనువాదమే అయ్యును, అది మూలకథా మాత్ర ప్రధానముగా నడచిన స్వతంత్ర రచనయే కాని సంస్కృత శ్లోకములకు కేవలము ప్రతిబింబములైన తెలుగు పద్యముల కూర్పు మాత్రముకాదు. ఆ కథా ప్రధానతయు కొన్నిచోట్ల యథార్థముగా పాటింపబడలేదు. మూలమునుసంక్షేపించిన పట్లు కొన్ని, విసర్జించినవి మఱి కొన్నియు అందు కలవు. అనగా తెలుగు భారతము యథోచితానుసరణమేకాని యథామాత్రృకము కాదనుట. పురాణేతిహాసములను తెలిగించిన ఆంధ్ర కవులందఱును నన్నయ తీసిన ఈ దారినే నడచి తమ రచనలను అనువాదములయ్యు స్వతంత్రములుగానే చేయగలిగిరి. నన్నయ ఉత్తమ జాతి కథకుడు. కథాగమనమునకు వక్రతగాని, సంకుచితత్వముగాని, అతి విస్తృతిగాని రానీక సూటిగా, ప్రసన్నముగా కథను నడపగల దక్షుడు. ఈయన కవిత్వములో ముప్పాతిక వంతు సంస్కృత పదములే ఉండునని లోకమనుట నిజమే. ఈయనకు మార్గదర్శకము కాదగిన పూర్వాంధ్ర సాహిత్యము లేమింజేసియు, ఈయన చేసిన విద్యావ్యాసంగమంతయు సంస్కృత సంబంధిరమే అగుటంజేసియు అట్టి సంస్కృత పదావలంబము తప్పని సరియయ్యెను. ఎంత సంస్కృత భూయిష్ఠమైనను రచనమాత్రము కఠినముగా పరుషముగానుండదు. సంస్కృత పద ఘటితములైన దీర్ఘసమాసములు సైతము సుబోధముగా కర్ణపేయముగా చేయునేర్పులో నన్నయకు నన్నయయేసాటి.

ఈ సంస్కృత పద బాహుళ్యముచేతను సమాసగాంభీర్యముచేతను ఆయనశైలికి ఉదాత్తతయు, ఠీవియు లభించినవి. ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయను భద్రకుంజరముతో పోల్చుట ఆయన పద్యపు నడకనుబట్టియే. ఈ సంస్కృత పద జటిలత సైతము మొదటి రెండు పర్వములకంటె మూడవ దానిలో చాల తగ్గిపోయినది. గ్రంథము సాగినకొలది ఆయనశైలికి క్రొత్తవన్నెయు వచ్చినది. ఒక శైలిలోనే కాదు, కథనములో సైతము అరణ్యపర్వమే తక్కిన రెంటిని మించియుండును. ఈ కవి సాంగవేద పరిజ్ఞానసంపన్నమైన పరిశుద్ధాంతర బాహిరమూర్తి కలవాడు. భారతీయ చరిత్రమున వైదికయుగమనియు, ఐతిహాసికయుగమనియు చెప్పబడు రెండు యుగవిభాగములలో మొదటి దానిని భావనచేసి చెప్పుటలో నన్నయ అందెవేసినచేయి.

నన్నయకు సమకాలికులుగా చెప్పబడు కవులలో గ్రంథకర్తలుగా కానబడు వారెవ్వరునులేరు. నారాయణభట్టు మహాకవియేకాని ఆయన తన శక్తి అంతయు నిష్కామముగా నన్నయకే వినియోగించెను. భారత రచనలో నన్నయకు నారాయణుడు చేసిన సాయము మిక్కిలి కలదు. ఆ ప్రసంగములకు ఇది అదనుకాదు. మార్గ కవిత్వమను పేర ఆంధ్రులకు సంస్కృత కవిత్వమే శరణ్యమైయున్న రోజులలో, దేశికవిత పుట్టింపవలెనని



కీ. శే. శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రి. ఉభయభాషా కోవిదులు, కవి.



మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రి.
సంస్కృత పండితులు. సుప్రసిద్ధ వైయాకరణి.

సంకల్పించిన చాళుక్యరాజుల తపస్సిద్ధి నన్నయ భారత రూపమున ఫలించి, ఆంధ్రవాఙ్మయ ప్రపంచమునకు మూల స్తంభముగా నిలచెను.

## 12 వ శతాబ్ది.

ఈ శతాబ్దిని ప్రత్యేకముగా శైవయుగమని పిలువ వచ్చును. ఈ కాలమునందు ప్రసిద్ధులైన మువ్వురు కవులును-నన్నెచోడుడు, పండితారాధ్యుడు, సోమనాథుడు-శివ పారమ్యమునే ఉద్బోధించు గ్రంథములు వ్రాయుటచేతను, వారిలో ఇరువురు (పండితుడు, సోమనాథుడు) పరమ శైవాచారనిష్ఠాపరులగుటే కాక ఆ మతమువారిచే అవతార పురుషులుగా మన్నింపబడిన ఆచార్యులగుట చేతను, మరల ఈ యిరువురిలో సోమనాథుడు వీరశైవప్రచారమునకే తన జీవితమును కవిత్వమును అంకితమొనర్చి దేహయాత్ర నడపిన వాడగుటచేతను, ఈ శతాబ్దిలోపుట్టి ప్రసిద్ధికి వచ్చిన శైవే తరుల రచనలేవియు లేకుండుటచేతను ఈ యుగ ప్రాధా న్యము శైవవర్గమునకే చెంద దగినది. వీరికి మతమున శైవము పరమ లక్ష్యమైనట్లే సారస్వతమున దేశి రచనయే పరమ లక్ష్యమని చెప్పవచ్చును. చెప్పవచ్చునననేల? లక్ష్యమును సాధించినను లేకున్నను ఆ మాటను వారే చెప్పుకొనిరి. ప్రతిజ్ఞాపూర్వకముగా వీరు దేశి రచనను చేపట్టుటకు రెండు ముఖ్యహేతువులు కలవు. ఒకటి, చాళుక్యులు దేశికవితను పుట్టించి తెనుగును నిల్పి నను, మార్గకవితనే కొనియాడుచు తెలుగును నిరసించు పండి తులు పెక్కురుండుట. వారిని నన్నెచోడుడు తిరస్కార పూర్వకముగా ఖండించినట్లు "కుమార సంభవము"న ఒక పద్యము కలదు. రెండవది, సుబోధమైన దేశిభాషలో పాటగా పాడుకొనుటకు వీలైన ద్విపద మతప్రచారమునకు ఎక్కువ అక్కఱకు వచ్చునను తలంపు. సోమనాథుని ద్విపద ప్రబంధములు రెండును ఈ ఉద్దేశముతో వ్రాయ బడినవే. మఱి ఈ శతాబ్దిలో బసవేశ్వరుడు ప్రతిపాదించి నట్టియో పునరుద్ధరించినట్టియో వీరశైవము ఈ శైవకవితా విజృంభణమునకు హేతువై తత్సాహాయ్యమున తానును విజృంభింపజొచ్చెను. ఆ మతావేశము వీరి సహజకవితా వేశమునకు అగ్నికి వాయువువలె తోడైనది.

### నన్నెచోడుడు :—

ఈ కవికి "కవిరాజ శిఖామణి"యని బిరుదు కలదు. ఈ బిరుదులో ఈయన రాజభావము కొంత స్ఫురించు చున్నను, కవితాగుణమునుబట్టి కూడ దానికి కొంత సార్థక తయేయున్నది. ఈ రాజకవి ఆంధ్రకవులయందు ఉత్తము లలో లెక్కింపదగినవాడేగాని సామాన్యుడు కాడు. కుమార సంభవమున ఏ పద్యము చూచినను మిక్కిలి స్వతంత్రమును రమణీయమును అయిన భావముండుట, ఆ భావము అపేలవ మును మధురమును అయిన పదములలో వ్యక్తమగుట, ఆ పదములలో ఎక్కువపాలు జానుదెనుగనిపించుకొను దేశ్య పదజాలమే అగుట స్పష్టమగుచుండును. కొన్నిచోటుల పూర్వకవుల భావములు తచ్ఛాయలు అనుకరించినను వానిని తన సొమ్ముగా చేసికొని ప్రపంచించుకొను నేర్పు ఈ కవికి చాల కలదు.



కవిశేఖర, సూక్తి సుధానిధి.
కీ. శే. శ్రీ వడ్డాది సుబ్బరాయకవి.

వస్త్వైక్యమున కొంత లోపమున్నను ఈ కుమార సంభవమే యథార్థముగా మన



శ్రీ వఝ్ఝల చినసీతారామ శాస్త్రి,
ఆంధ్ర వైయాకరణి.

ప్రథమ ప్రబంధము. ఈ కవికి వర్ణనాభిలాష చాల యెక్కువ. కొన్ని వర్ణనలు మితిమీఱి విసువు గొల్పునవిగా నుండును. మఱికొన్ని సందర్భోచితిని గోలుపోయి, విరసములై యేవము గొల్పును. మొత్తముమీద చూచినచో ఈ కావ్యము రెండు విరుద్ధాంశములకు సంగమస్థానమేమో అనిపించును. ఒక వంక కాళిదాసు, తిక్కన మొదలగు ఉత్తమ సంస్కృతాంధ్ర కవుల శిల్ప లక్షణములును, ఇంకొకవంక క్షీణయుగము లోని క్షుద్రప్రబంధముల లక్షణములును ఈ కావ్యములో రాశీభూతమై యున్నవి.

పండితారాధ్యుడు మంచికవిత్వము చెప్పగలవాడే కాని వ్రాసిన కావ్యము మాత్రము లేదు. పెక్కు గ్రంథములు వ్రాసినట్లు సోమన యుదాహరించినాడు. అవన్నియు పోయియుండ వచ్చును. పోయినవి పోగా మిగిలినది శివతత్త్వసారమొక్కటియే. ఇందు కవితా వస్తువు చాల తక్కువ. అందుచే దీనిని శైవస్మృతి యనవలయునుగాని కావ్య మనలేము. పండితునకు ఆంధ్రవాఙ్మయమునందు కంటె శైవ మతమునందు ఎక్కువ ప్రాధాన్యము కలదు. ఈ రెండిటియందు అంతకంటెను ఎక్కువ ప్రాధాన్యము కలవాడు,

### పాలకుర్కి సోమనాథుడు :—

ఈయన గ్రంథములు శైవ మత ప్రచారమునకే పుట్టినను కావ్యత్వ సంశోభితములుకూడ నగుటచే ఉభయతారకము లైనవి. మఱి, సోమనాథుడే దేశికవితా వ్యపదేశమును చాలవఱకు సార్థకము చేసినకవి. ఈయన గ్రంథములలో భాష, ఇతివృత్తము, ఛందస్సు అను మూడుకావ్యాంగములును దేశీయములే. అదిగాక, భారతమువంటి మహాశిష్ట కావ్యపథము తీర్చిన గౌరవము నన్నయకు దక్కినట్లే, ద్విపదకావ్య పథము తీర్చిన ఖ్యాతి సోమనకు దక్కినది.

పండిత కవులచే అనాదరింపబడి పామర కవుల పాలై, ప్రౌఢ సారస్వతమున స్థానము లభింపక భారతాదుల ధాటికి తాళలేక తూలిపోవుచున్న ద్విపదపేరిటి గేయ కవిత్వమునకు సారస్వత ప్రతిష్ఠ సంపాదించిపెట్టిన పరమోపకారి సోమనాథుడు. కవిత్వమున ఈయన ఎంత ప్రజ్ఞాశాలియో పాండిత్యమున అంత ఉద్దండుడు. వీరశైవ మతమునకు ఈయనయే విజ్ఞానపీఠము (The Brain of the Veerasaiva Cult). ఈ మతము అవలంబించిన పెక్కురు పరమ భక్తులేకాని, పరమతనిరసనమును స్వమత స్థాపనయును చేయగల పండితులు కారు. శ్రుతి స్మృతి పారగుడైన సోమనాథుడు ఆ మతమునజేరి భాష్య రచనాదులుచేసి, వీరశైవ మతమనగా కేవల భక్త్యావేశము మాత్రమే అనెడి నిందను తొలగించెను. మతము ప్రవర్తింప జేసినవాడు బసవేశ్వరుడుకాగా, దాని ప్రతిష్ఠకు ఆధారభూతుడైనవాడు సోమన. ఈయనయే మన సోదర దేశీయులైన కర్ణాటకులచే గురుపూజలందిన మొదటి తెలుగు కవి. కవితకు జీవగఱ్ఱ అయిన భావావేశము ఈయన కవిత్వమునకు ప్రాణము. మతమున భక్త్యావిష్టుడు గనుక, ఈ కవితావేశ మతావేశములు పరస్పర పోషకములైనవి. అందుచే ఏ కథ చెప్పినను, ఏ శైవాంశము వర్ణించినను శివసురలు గొన్నవానివలె పరవశుడై తాండవించునేగాని



శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం,
సంఘ సంస్కర్త, ప్రఖ్యాత రచయిత.

నిదానముగా నిలిచి అడుగువేయఁడు. ప్రయత్నించియు పరుగును నిలుపుకొనలేడు. ఇంత అవశమైన రచన కనుక నే కొన్నిచోట్ల అనావశ్యకములు, అనుచితములు అనిపించెడి శబ్దములు, వాక్యములు, వర్ణనలు ఉండును. ఆవేశము బుద్ధివినీతమైనపుడే కవిత్వము ఔచితీ శోభితమగునుగాని లేనిచో, అనౌచిత్య కళంకితమే అగును. ఈ దోసగు సోమనకును తప్పలేదు.



కళాప్రపూర్ణ, శతావధాని శ్రీ జనమంచి శేషాద్రి శర్మ.

## తిక్కన యుగము 13వ శతాబ్ది.

ఈ యుగమున పుట్టిన గ్రంథములలో మొదటిది రంగనాథ రామాయణము. దీని కర్తయైన గోన బుద్ధారెడ్డి పూర్వ వయస్సున సోమనాథునకును ఉత్తర వయస్సున తిక్కనకును ఇంచుమించు సమకాలికుడై యుండును. బుద్ధరాజు ఈ రామాయణ రచన చేయుటలో, విద్యాస్పర్థచే సోమనాథుని అతిశయించవలెననెడి కుతూహలము కలవానివలె కన్పట్టును. సోమన బసవ పురాణము సర్వజనాదర పాత్రము కాకపోవుటకు రెండు మూడు హేతువులు కలవు. ఒకటి—వర్ణవ్యవస్థాది నియమములుగల ఆర్యమతమునకు విరుద్ధమైన వీరశైవ కథ; రెండు-అశైవులు లౌకికునిగానే భావించు బసవేశ్వరుని అవతార పురుషునిగా నిరూపించుట; మూడు—కవిచేసిన ఛంధోవ్యాకరణాది నియమోల్లంఘనము. ఈ లోపములను ఎత్తి చూపిన వాడువోలె బుద్ధారెడ్డి సనాతన ధర్మ సమ్మతమై విష్ణ్వంశ సంభూతుడగు మహాపురుషుని చరిత్రమును ఛందోవ్యాకరణాది నియమ పరిపాలనముతో ద్విపద కావ్యముగానే వ్రాసి, సార్వజనీనమైన ఖ్యాతిని ఆర్జింప దలచెను. మరియు సోమన, తన వీరశైవ దీక్ష బాగుగా నిరూఢమైన కాలమునందు వ్రాసిన కావ్యములో తన శరీర దాతలగు తల్లిదండ్రుల పేరైనను ఉచ్చరింపక వారికి పెంపుడు కొడుకునని చెప్పుకొన్న అధర్మము నకై ఉపాలంభించు వాడువోలె బుద్ధారెడ్డి తన కావ్యమును తండ్రిపేరనే వెలయించి, పితృస్థానము యొక్క పూజ్య భావమును సమర్థించెను. కవివహించిన యీ ప్రతిభటత్వము సార్థకమేయైనదిగాని ఊరక పోలేదు. ద్విపద కావ్యములలో మొదట పుట్టినది బసవ పురాణమే అయ్యు, ప్రథమ గౌరవము రంగనాథ రామాయణమునకే దక్కినది.



కీ. శే. శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావు.

ఈ శతాబ్ది మన దేశ చరిత్రలో సువర్ణ యుగమని చెప్పదగిన కాలము. ఆనాడు మన జాతిని మన జాతి ధర్మమును సుప్రతిష్ఠితము చేయవలయునని మహా పురుషులు పలువురు పలు విధముల యత్నించిరి. వారిలో రాజులు మంత్రులు కవులు మతాచార్యులు కలరు. వారి కృషికి పరమలక్ష్యము ఆంధ్రత్వమునకు సుస్వరూపమును కల్పించుట. మరియు ఐహికాముష్మిక ధర్మసామరస్యము వారి ఆదర్శములలో ఇంకొక భాగము. ఆముష్మిక వ్యాజమున ఐహికమును నిస్తేజము, నిర్వీర్యము, దరిద్రము ఒనర్చుకొనుట గాని, ఐహిక భోగలాలసులై పరము మిథ్య యనుకొనుట గాని వారు నిర్మింపదలచుకొన్న జాతీయతలో ఉండరానివి. ఈ అద్వైతభావమునే వారు మతమునగూడ ఆసించిరి. మతము పేర తత్పూర్వ శతాబ్దిలో ఎక్కువ అలజడి కలిగినది. వీర శైవమువలె వీర వైష్ణవమును విజృంభించి అంతః కలహములకు యుద్ధములకు హేతువైనది. పల్నాటి యుద్ధహేతువులలో ముఖ్యమైనది బ్రహ్మనాయుడు స్వీక



కీ. శే. శ్రీ చెలుమళ్ళ రాజగోపాలరావు, భాషా పరిశోధకులు.

రించిన వీరవైష్ణవమే. ఆ యుద్ధము నెపమున మూర్తీభవించిన తారుణ్యమనదగిన దేశవీరులెందఱో నశించిపోయిరి. అంతకు కొంచెము పూర్వమే ఉత్తర భారతదేశము పరదేశీయు లాక్రమించిరి. ఆ వెల్లువ దక్షిణాపథమునుగూడ ముంచు జాడలు కన్పట్టుచుండెను. ఈ చరిత్రనంతను సింహావలోకనముచేసి చూసిన పదమూడవ శతాబ్దియందలి ఆంధ్రమహాపురుషులు స్వకీయ పరకీయ దేశీయోపద్రవమునుండి జాతిని రక్షింపగల ధర్మబోధను నానావిధముల చేసిరి. ఆనాడు పుట్టిన గ్రంథములన్నిటిలో ఈ చరిత్ర కొంతకు కొంత లీలగా గోచరించుచుండును. ఆ వాఙ్మయ నిర్మాతలకు తిక్కన మూల పురుషుడు. ఆ చరిత్రయొక్క సంపూర్ణ ప్రతిఫలనదర్శనమునకు మనము తిక్కన జీవితచరిత్రను తద్రచితభారతమును ఆశ్రయింపవలెను.

కవిబ్రహ్మ మన వాఙ్మయమునందు ఎంత ప్రసిద్ధపురుషుడో, మన చరిత్రయందును అంతే ప్రసిద్ధపురుషుడు. ఆయన గృహము ఒక విద్యాసంస్థ. భారతధర్మప్రతిష్ఠాపన నిమిత్తము తరువాతి శతాబ్దిలో విద్యారణ్యస్వామి ఎట్టి దీక్షవహించెనో అట్టి దీక్షనే ఈ శతాబ్దిలో తిక్కనయు వహించెను. మఱియు మహోదాత్తమైన ఆయన జీవిత చరిత్ర కొన్ని పోలికలచే భారతకథాసంవాదియై యుండుటం బట్టి, తన ఆత్మచిత్రణమునకు అనువైన ఇతివృత్తముగల భారతమును చేపట్టెను. అదిగాక మతసంబంధమైనట్టియు భాషాసంబంధమైనట్టియు వివాదములతో నిండి, దేశము బహునాయకమై జాతి శక్తి నానాముఖముల నిష్కారణముగా విచ్ఛిన్నమై పోవుచుండగా, వివాదముల నన్నింటిని అణచివేసి ధర్మాద్వైతమును బోధింప సమర్థమైన ఇతి వృత్తము భారతమున దక్క ఇంకొకటలేదని ఆయనకు గోచరించి యుండును. మహాయోధులయు మహా మంత్రులయు వంశమున జన్మించి తాత తండ్రులవలె తానును యోధాగ్రేసరుడును మంత్రిమాణిక్యమును అయి విజ్ఞానపూర్వకమైన తన లౌకికానుభవమును ఆధ్యాత్మికసాధనతో మేళగించి దేశోపకారార్థము ఉపదేశపూర్వకముగా మహాకావ్యరూపమున ఆంధ్రావళికి ప్రసాదించిన కవిబ్రహ్మతో సాటి రాదగిన కవులు ప్రపంచమున ఎందఱో ఉండరు. లోకమున ఎల్ల దేశములలోను కార్యదక్షులైన మహామంత్రులు, ఖడ్గ నిపుణులైన మహాశూరులు, కావ్యనిర్మాతలైన మహా కవులు, ధర్మోపదేష్టలైన మహాగురువులు నుండిరి. కాని ఇన్ని శక్తులు ఒక్కచోటనే రాశీభూతమై ఆవిర్భవించిన మహా వ్యక్తు లెందఱుందురు?

తిక్కనమంత్రి మొదటికృతి నిర్వచనోత్తరరామాయణము. బుద్ధారెడ్డి తన రామాయణమును యుద్ధకాండముతోనే ముగించెను. ఆ పరిశిష్టభాగమును పూర్తిచేసినచో ఆంధ్రులకు సంపూర్ణరామాయణము లభించునను ఉద్దేశముతో తిక్కన ఈ కాండ రచించియుండును. ఈ యాంధ్రీకరణములో ఆయనచూపిన స్వతంత్రత మిక్కిలి ప్రశంసార్హము. అనుబంధరూపమైన ఈ కాండము స్వయం సంపూర్ణమైన కావ్యముగా తీర్చుటేకాక, ఆధునిక విమర్శకులు ఆకాండములో ఏవేవి ప్రక్షిప్త ప్రకరణములని శంకించుచున్నారో, వానిని ఆనాడే ఆయన శంకించి తెలిగింపక విసర్జించెను. మఱియు ఆంధ్రులు భారతమున చేయనున్న కావ్యామృతాస్వాదనయొక్క రుచినంతను ఈ ప్రథమ కావ్యముననే కలిగించి ఆంధ్రుల రామాయణమును పూర్తి చేసియే భారతపూర్తికి దొరకొనెను.

భారతమునకు పునాదివేసిన ఆదికవి నన్నయ. ఆ సౌధనిర్మాణమునంతను పూర్తిచేసిన మహాశిల్పి తిక్కన. ఈ ఆంధ్రీకరణ పద్ధతిని, ఇందు సోమయాజి ప్రదర్శించిన శిల్పచాతురిని ఎంతయేని ప్రశంసింపవచ్చునుగాని ఆ ప్రసంగమునకిచ్చుట చోటు లేదు. కాని సూత్రప్రాయముగా ఒకటి రెండు మాటలు చెప్పె



కీ. శే. శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య బి.ఏ., బి.ఎల్., ఆంధ్ర సాహిత్య విమర్శాగ్రేసరులు.



శ్రీ చర్ల భాష్యకార శాస్త్రి
సంస్కృత పండితులు.

దను. అసలు భారత రచనాధికారము ఆంధ్రకవులలో తిక్కనకువలె ఇంకొక కవికి కలదనుట సందేహాస్పదము. వ్యాసభారతము ఆయనకు ధర్మాద్వైతమూర్తిగా సాక్షాత్కరించినది. దానికా బిరుదమిచ్చినవాడునుఆయనయే. భిన్నభిన్నముగా కానవచ్చు భారతీయ ధర్మముల కన్నిటికి వ్యాసభారతము అద్వైతభావము సాధించినట్లే కవిబ్రహ్మయు భారతకావ్యశరీరబంధమున ఈ అద్వైతభావమునే సాధించెను. భారతమంతయు నొక ప్రబంధమండలిగా, అందు ఒక్కొక్కపర్వము ఒక్కొక్క ప్రబంధముగా, పర్వాంతర్గతములగు ఉపాఖ్యానములు అవయవములైన ఖండకావ్యములుగా ఊహించి, ఏ భాగమునకును ప్రాధాన్యము చెడకుండ, అవయవముల కన్నిటికి అవయవితో పొత్తు చెడకుండ, సర్వాంగ సౌష్ఠవమును ఆద్యంత సుందరమును రమణీయ భయానకమును అయిన ఈ భారతమూర్తిని శ్రీ కృష్ణుని విశ్వరూపమువలె తీర్చి దిద్దెను.

పాత్ర చిత్రణాది కావ్యకళాధర్మములు నాటకాదుల యందువలె పురాణేతిహాసములయందు అంతగా పాటింపరానివి. పురాణేతిహాసములను సైతము నాటకీయముగా కథాసంధాన పాత్రనిర్మాణాదిచతురతతో రచించిన కవులున్నచో, వారు అనన్య ప్రతిభాశాలులన్నమాట. అట్టివాడు తెలుగులో కవిబ్రహ్మ ఒక్కడే.

మహాకావ్యయోగ్యమైన ఆంధ్రభాష లేని దినములలో శిష్టమైనభాషను నిర్మించుకొని రచనను నిర్వహించిన సిద్ధసంకల్పుడు నన్నయ. అది ప్రథమప్రయత్నము గనుక ఆయన చేతిలో తత్సమశబ్దజాలమువలె శుద్ధాంధ్రము వృద్ధి నొందలేదు. అచ్చతెలుగునకు ఆ ప్రతిష్ఠ సంపాదించినవాడు తిక్కన. ఒక భాషయొక్క శక్తియు సంపన్నతయు అది వ్యక్తముచేయు భావములయు అర్థములయు గంభీరతనుబట్టి తెలియును. అచ్చతెలుగు సూక్ష్మాతిసూక్ష్మములైన మనోభావములను వ్యక్తము చేయుటకును అతి గంభీరములైన ఆధ్యాత్మికార్థములను నిష్కర్షగా వివరించుటకును సమర్థమే అని తన ప్రయోగముచే లోకమునకు చూపినవాడు కవిబ్రహ్మ. ఈ భాషమంతయు ఆయన సృష్టించుకొన్నదే. ఆ సృష్టిలో ఆనాటి వాడుక పదములు చాలవఱకు ఆయనకు బీజములుగా అక్కఱకువచ్చియుండును. ఆ పదములకే క్రొత్త ప్రాణముపోసి భారతమున సుప్రతిష్ఠితము చేసెను.

ఆలంకారికులు పేర్కొన్న కావ్యగుణములను పరామర్శించి చూచితిమేని అవన్నియు ముఖ్యముగా మూడు వర్గములుగా ఏర్పడును. ఒక వర్గము భావస్ఫోరకము; ఇంకొకటి బుద్ధిగమ్యము. మఱి యింకొకటి కర్ణపేయము. ఈ మూటిలో తిక్కన మొదటి రెంటినే ఎక్కువగా ఆదరించెను. జీవితములో ఎట్టి మేధావంతుడో శైలిలో కూడ అట్టి మేధావితనే చూపెను. ఆ శైలి అనుకరణసాధ్యమైనదికాదు. అనుకరింప జూచినకవులు కొంతవఱకు దేశ్యపదప్రయోగము వఱకే అనుకరింప గలిగిరి. కాని తక్కిన విశేషములను స్పృశింపలేక పోయిరి. అందుచేతనే తిక్కనశైలియు, తిక్కన మూర్తియు తిక్కన భారతమును అన్యదుర్లభములుగా నిరుపమానములుగా ఎప్పటికిని వెలుగొందుచుండును.

కవిబ్రహ్మకు కేతన పరోక్షముగాను, మారన ప్రత్యక్షముగాను శిష్యులు. కేతన దశకుమారచరిత్రము ఆంధ్రుల ఆదరాభిమానములకు పరమపాత్రమగు యోగ్యతగలది. దాని అవతారికలోను మహోదారమైన కవిబ్రహ్మమూర్తి, శబ్దచిత్రితమై తన వర్ణచిత్రము లేనిలోటు కొంతవఱకు తీర్చుకొన్నది. మారన మార్కండేయపురాణము ఉత్తరకాలమున బుట్టిన రెండు మూడు ప్రబంధములకు మూలప్రకృతియై ఆ గ్రంథకర్తల నమస్కారములనందుకొన్నది.

## ఎఱ్ఱన యుగము (1300-1350)

కవిబ్రహ్మ అస్తమయము, ప్రబంధపరమేశ్వరుని ఉదయము అయిదారు సంవత్సరముల వ్యత్యాసములో జరిగియుండును. ఆరణ్యపర్వపూర్తికి దగిన అధికారిని ఆంధ్రలోకమున పుట్టించియే, పరమేశ్వరుడు కవిబ్రహ్మను తన

లోకమునకు గొంపోయియుండును. ఎఱ్ఱనకుగల ప్రాముఖ్యము భారత పరిశిష్టభాగమును పూర్తిచేయుటయు, ఖిలపురాణమును పేర ఆ మహేతిహాసమునకు అనుబంధమైన హరివంశమును రచించుటయు మాత్రము చేతనేకాదు. సాంస్కృతికమగు నన్నయశైలిని, దేశ్యమగు తిక్కనశైలిని ఎఱ్ఱన ఏకముచేసి తనపేర ఒక క్రొత్త శైలిని వెలయించెను. నాటినుండియే ఆంధ్రభాషకు ప్రాతదనము పోయి ఆధునికత ప్రాప్తమయ్యెను. అదియుగాక, పురాణ రచనలో సైతము వర్ణనాప్రాధాన్యము నెలకొల్పిన మొదటి కవియు ఈయనయే. వర్ణనాత్మకమును, ఆధునికమును అగు ఆ శైలిలో, నృసింహపురాణమనెడి ఒక ప్రబంధమునే రచించి రాబోవు ప్రబంధమహావృక్షమునకు బీజము నాటిన యుగకర్తయు ఈయనయే. ఈ విధముగా ప్రబంధకవిత్వస్థాపనాచార్యుడు గనుకనే ప్రబంధ పరమేశ్వరుడను సార్థక నామము దాల్చెను.

రెడ్డిరాజుల మొదటి యాస్థాన కవియైన ఎఱ్ఱన రచించిన ప్రథమ గ్రంథము—రామాయణము—నశించిపోవుట మన దురదృష్టము. దాని తరువాత హరివంశమును తన ఏలికకు అంకితమిచ్చి, ఆపై నిష్కామముగా నన్నయపేరనే భారతమును పూర్తిచేసి, తుదిని పరమేశ్వరాంకితముగా నృసింహపురాణమును రచించి తన సారస్వతసేవ ఆద్యంతముల ఐహికాముష్మికసుఖప్రాప్తికి సాధనగా చరితార్థము గావించుకొనెను.

ఎఱ్ఱన సమకాలికులైన పెద్ద కవులిరువురును (భాస్కరుడు, నాచన సోముడు) దైవికముగా మరల ఎఱ్ఱన కృతులగు రామాయణ హరివంశములనే రచించుటచేత ఆ సమకాలికత్వము ప్రతిభటత్వముగా పరిణమించెను. అందు సోముని ప్రతిభటత్వమును పురస్కరించుకొని నేటికిని వాగ్యుద్ధములు జరుగుచునే యున్నవి.

నాచన సోముడు హరివంశము సంపూర్ణముగా రచించినట్లు కన్పట్టదు. ఆ పురాణములో కవిత్వమునకు అక్కఱరాని సందర్భముల నన్నింటిని వదలివైచి రస భావ బీజములుగల ఘట్టములనే స్వీకరించి తన నేర్పు కలిమి వానిని రసమయములుగా నిర్వహించి ఉత్తర హరివంశమని పేరిడెను. ఈ ఇతివృత్తమంతయు ఎఱ్ఱన హరివంశములోని ఉత్తర భాగములోనిదే యగుటచేత దీనికి ఉత్తర హరివంశమని పేరిడెనేమో అని నాతలంపు. సోమనను తెలుగు కవులలో ఉత్తమోత్తమవర్గమునందు ఒకనిగా పేర్కొను విమర్శకులు చాలమంది కలరు. అందును తిక్కనతో సాటి రాగల కవి ఈయన ఒక్కడే అని చాలమంది అభిప్రాయము. వారి యూహ సహేతుకమేమో అని భ్రమింపజేయు లక్షణములుగూడ ఈ కవితలో చాలగలవు. అది భ్రమ మాత్రమే. సోమన కవితలో తిక్కన పోలికలు కొన్ని యున్నను వారిరువురకు సాటిమాత్రము లేదు. పరమార్థమును విచారించినచో ఇతనికి ఎఱ్ఱనతోడి సాటియు లేదు. ఈ తారతమ్యనిర్ణయము చేయుటలో వారివారి పద్యములను పోల్చి చూచుట చాలదు. ఒకయెడ ఒకరి పద్యములు ఇంకొకయెడ ఇంకొకరి పద్యములు మేల్తరములుగా నుండును. కావున ఆ ప్రమాణమే పనికిరాదు. కవితాసృష్టికి ఆదిభూతమగు కర్తృమనోధర్మము, సంస్కారము, దృష్టియు లోనగు ప్రమాణముల పురస్కరించుకొని విమర్శించినచో సారభూతమైన నిర్ణయము తేలును.

కవితాకళ సత్త్వరజస్సుల లీల. జగత్సృష్టికి రజోగుణమును దాని మర్యాదా రక్షణమునకు సత్త్వగుణమును కారణములైనట్లే, కవితా సృష్టికి రజస్సును, దాని మర్యాదా పరిపాలనకు సత్త్వమును కారణములగుచున్నవి. ఈ రెంటిలో రజోగుణము కవిత్వమునకు ప్రాణతుల్యము. కాని దాని రాజ్యము ప్రాణమయకోశము మాత్రమే. కవితయందలి ఆవేశము, తీక్ష్ణత ఔజ్జ్వల్యము మొదలగు గుణములన్నియు రజస్సంపాదితములై విజృంభించుచుండగా వాని మాలిన్యమును క్షాళన మొనర్చి సాత్త్వికములుగా జేసి సముచిత స్థానమును విడార నీయకుండ ప్రశాంతముగ ఆనందమయ కోశము వఱకు నడపు భారము సత్త్వము వహించుచున్నది. ఎవని కవిత్వమున ఈ సత్త్వాధికారము న్యూనమగునో, వానిని ఎంత యుజ్జ్వల రచనయైనను



శ్రీ వేదుల రామశాస్త్రి.

అనౌచిత్యమునకు వశమగుచునే యుండును. ఈ ధర్మమును బట్టి చూచినచో ఎఱ్ఱన కవితలోగల సత్త్వశుద్ధి సోముని కవితలో లేదు. సోమన భావావేశము విశృంఖల విహారము చేయుచుండగా ఎఱ్ఱన భావము సత్త్వసంయమితమై గంభీర మందగమనము చేయును.

సూర్యకిరణస్పర్శచే తామరసకోరకము చలించి వికసించి మకరందమును గురియునట్లుగా, కవి వాక్కిరణస్పర్శచే భావుక హృదయము క్రమముగా స్పందించి, విప్పారి, కరిగిపోవును. ఈ తుది యవస్థలోనే కావ్యరసామృతాస్వాదనములోని యమృతసిద్ధి వడయుదుము. సోమన తన వక్రోక్తి వలనను చమత్కారార్థముల వలనను సాధింపగలిగినది ఇందలి రెండవ యవస్థ మాత్రమే. ప్రశాంతమైన రససిద్ధి గలిగించి తన్మయుల జేయుశక్తి ఆతని కవిత్వమున లేదు. ఆతడు కలిగించు హృదయవిస్తృతినిబట్టి "ఓహో!" యని ఆశ్చర్యచకితుల మగుదుమేకాని "ఆహా!" అనెడి పరవశభావమును పొందము. మనమాతని మెచ్చుకొందుమే కాని ఆతనిలో లీనము కాలేము. ఆ పరమానుభూతి ఎఱ్ఱన సుకరముగా గల్గించును. కాని ఎఱ్ఱన కవిత్వమున గల్గు పారవశ్యము ఎడనెడ కొన్నికొన్ని ఘట్టములలోనే జరుగుచుండగా సోమన కలిగించు నాశ్చర్యము ప్రతిపద వ్యక్తమగుచుండును. దీనికి ఇతివృత్తముకూడ కొంతకారణమైయుండును.

శృంగారరసాధిదేవత ఎఱ్ఱనకువలె సోమనకు స్వచ్ఛమూర్తిలో కానరాలేదు. దాంపత్యమును పరమపవిత్రముగ నొనర్చు ప్రణయ వాత్సల్య దాస్య సాహచర్యాది మధుర కోమల భావములు శృంగార కవులందఱు నెఱుంగరు. కాళిదాస భవభూతులవంటి జగదేకకవులకే ఆ పవిత్రమూర్తి గోచరించెను. తక్కిన లోక సామాన్య కవులకు శృంగారమనగా దంపతుల శరీర సంయోగమేకాని వేఱుకాదు. ఎఱ్ఱన ఆ ఉత్తమ జాతి వర్గమున జేరగా, సోమన యీ రెండవ వర్గములో చేరును. ఎఱ్ఱన శృంగారమునకు ప్రేమబీజము. సోమన దానికి కామము బీజమని సాహసించి చెప్పవచ్చును.

సోమన నాగర జన మర్యాద లెఱిగినమేటి. ఆయన వర్ణించు వనవిహారములు ద్యూతక్రీడలు లోనగునవన్నియు ఇందుకు ప్రబల నిదర్శనములు. ఎఱ్ఱన సమగ్రముగా నెఱిగినది పల్లీజన జీవితము. గోకులము మిషగా గైకొని ఎఱ్ఱన చిత్రించిన నిరాడంబర జానపద జీవితము పోతన చిత్రమును గూడ మించి పోయినది. యుద్ధాదులను వర్ణించునప్పుడును సోమనదే పైచేయి. మొత్తముమీద సందర్భోచితమును, ప్రసన్నమును, సాత్త్వికభావ జనకమును రసస్యందియుగా కథనడపునేర్పు సోమన కెన్నడునురాదు. ఆ భాషకూడ కంటకశిలా ప్రదేశములలో ప్రవహించు ఝరీవేగమున పరుగిడును గాని ప్రసన్న గంభీరముగా నడవదు. ఈ సోమన భారతమును వ్రాయవలసివచ్చుచో యుద్ధ పంచకమున కొన్ని ఘట్టములు వ్రాయగలడేమో కాని తిక్కనవలె తుది పర్వములను గాని ఎఱ్ఱాప్రెగ్గడవలె ఆరణ్య పర్వమును గాని వ్రాయలేడు. ఆ రచన కావశ్యకమైన నిగ్రహమే ఆ చిత్తమునకులేదు. సంస్కృతమున వ్యాస వాల్మీకి కాళిదాసాది మహాకవులకును, నైషధాది కావ్యకర్తలకును ఏవాసియుండునో ఆవాసియే తెలుగులో కవిత్రయము వారికిని ఇతర ప్రబంధ కర్తలకును కలదు. అదియే ఈ యిరువురకును ఉన్న వాసి.

భాస్కరరామాయణము ఏకకాలముననే బహుకర్తృకమగుటకు హేతువు, ఎఱ్ఱన రామాయణమునకు అది సమకాలికమగుటచే దానికంటెముందు పూర్తికావలెననెడి కృతిపతి కోరిక కావచ్చును. ఆ కవులు నలువురిలో హుళక్కి భాస్కరుడు ఉత్తమజాతి కవి. గ్రంథమును పూర్తిచేసిన అయ్యలార్యుడు ఇంచుమించు అంతవాడే. వీరిరువురును భారతకవుల మర్యాదలను నేర్చి అనుకరించిన సమర్థులు.

మల్లికార్జునభట్టు తండ్రి యంతటివాడుకాడు. ఈతని రచన గుణదోషసమ్మిశ్రితమై ఇతనిని మధ్యమజాతి కవిగా విశదీకరించును.

రుద్రదేవునిది అప్పుడప్పుడే బాల్యదశవదలిన కవిత్వము.

## శ్రీనాథుని యుగము (1350-1500)

ఆంధ్రకవులలో తిక్కన తరువాత ఇంతటి విద్వత్కవి ఇంకొకడులేడు. కవిబ్రహ్మవలె కవిసార్వభౌముడును తన కాలమున సాహితీగురుపీఠ మలంకరించిన మహామూర్తి. ఆయనవలెనే ఈయనయు రాజాస్థానములలో అధికారము నెఱపి రాజభోగముల నన్నిటిని అనుభవించిన పుణ్యశాలి. ఆయనవలెనే తనపేర ఒకశైలిని వెలయించి అర్వాచీనులకు

భిక్ష పెట్టిన ఒకగురువు. సర్వవిద్యాపరిశ్రమచేసిన పండితాఖండలుడయ్యు 'బిస్నారి పొస్నారి చిఱుతకూకటివా'డే కావ్యములను రచించిన ఆ గర్భకవి. భీమఖండమును మిషగా చేసికొని గోదావరీమండలమునందలి నదులను పర్వతములను గుళ్లను గోపురములను వనములను ఆరామములను క్షేత్రములను తీర్థములను పద్యకుసుమములతో పూజించిన దేశభక్తుడు. అఖండ పాండితీస్ఫోరకమగు ప్రౌఢసాహిత్య నిర్మాతయయ్యు ఆ ఉన్నత పదమునుండి దిగివచ్చి పామర జనమునకు చెలిమికాడై పిచ్చుకుంటులకును, ఎఱ్ఱగొల్లలకును పదములను సుద్దులను వ్రాసిపెట్టి పాడించిన అచ్చపు దేశికవి. భీమఖండములోని ఆ దేశభక్తియే ఈ పదములకును ప్రేరకము. ఇదియే కాదు, ఆయన చాటువులలో పెక్కులు ఆంధ్రతాస్తోత్రములే. జీవిత పరిస్థితులనుబట్టి ఆయన చేయవలసివచ్చిన దేశసంచారములు, సహజముగా నున్న సౌందర్యదిదృక్ష, పరిహాసరసికత ఈ చాటువుల కన్నిటికిని ముఖ్యకారణములు. క్రీడాభిరామ రచనకు ఈ పరిహాస రసికతయే మూలము.

మన భాషలోపుట్టిన మొదటి హేళన కావ్యమిదియే. ఇదియే లక్షణయుక్తమైన ప్రథమరూపకము కూడ. ఇటీవల చంద్రరేఖావిలాపాది కొన్ని హేళన కావ్యములు పుట్టినవిగాని అవి వ్యక్తిగత దూషణలతో నిండియున్న బూతుల బుంగలు. క్రీడాభిరామమునకు అట్టి కళంకము లేదు. సంఘమందలి లోపములను, మనోదౌర్బల్యముకలవారి ధర్మవ్యతిక్రమమును కవి పరిహాసపూర్వకముగా ఎత్తిచూపి ఎగతాళిచేసి మందముగ మందలించునేకాని కఠినముగా శపించి శిక్షింపడు. అదిగాక దీనివంటి సాంఘిక కావ్యము మనలో ఇంకొకటి లేనేలేదు. ఎన్నడో నశించిపోయిన ఓరుగల్లు పట్టణ స్వరూపమంతయు ఈ యద్దమున ప్రతిబింబించుచుండును. కావున ఆంధ్రదేశ పరములైన శ్రీనాథుని కృతులలో ఇది యింకొకటి.

సంస్కృత వాఙ్మయము ఆంధ్రమునకు అవతరించిన దశలలో శ్రీనాథుని ఆంధ్రీకరణపద్ధతి రెండవది. మొదటిది కవిత్రయమువారుచేసిన భారతాంధ్రీకరణ పద్ధతి. వారి అనువాదమును భాషాంతరీకరణమనియే పిలువరాదు. అది మూలము నిమిత్తమాత్రముగానే గైకొని సాగించిన స్వతంత్ర రచన. ఇక, శ్రీనాథుడు మొదలిడినది ప్రబంధానువాదము గనుక వస్తుతః దానికిని దీనికిని భేదముండకతీరదు. భారతమువలెకాక నైషధమున ప్రతి శ్లోకమును గణనీయముగానే యుండును. అచ్చటవలె ఇచ్చట కథామాత్ర ప్రాధాన్యము పనికిరాదు. మఱి, పరిగణనీయము గదా అని ప్రతి శ్లోకమును ఆంధ్రీకరించుచో కావ్యముయొక్క సొంపు చెడును. ఈ సంకటమునుండి తొలగుటకు శ్రీనాథుడొక మధ్యమార్గము నవలంబించెను. మూలము ననుసరించినట్లే కనిపించునుగాని దానికి దాస్యముచేసినట్లు మాత్రము కనపడదు. మూలశ్లోకముచే తన నోటిని తన చేతిని బంధించుకొనక ఆ శ్లోకార్థమునే తన పద్యగర్భమున ఇముడునట్లు చేయును. అనావశ్యకమని తోచినచో ఎంత గొప్ప శ్లోకమైనను త్యజించుటకు వెనుదీయడు. ఆవశ్యకమని తోచినచో శ్లోకమునంతను యథాతథముగా యథాక్షరముగా అనువదించుటకు జంకడు. ఒక నైషధముననే కాక ఇతర గ్రంథములందు సైతము ఆయన సంస్కృతానువాదము ఈ ఫక్కినే నడచినది. పాషాణములవంటి మయూరుని మహాస్రగ్ధరలు శ్రీనాథుని సీసపద్యపు టచ్చులో మైనమువలె కరిగి, ఆయన కిచ్చవచ్చిన రూపము దాల్చినవి. ఆ యుగములోని పినవీరభద్రుడు, నంది మల్లయ, ఘంటసింగయ మున్నగు కవులందఱు ఈయన అడుగుజాడలనే నడచిరి. అనువాదసరణికివలె ప్రబంధ రచనకును శ్రీనాథుడే మార్గదర్శకుడయ్యెను. పురాణేతిహాసములనుండి ఆంధ్రరసికులదృష్టిని ప్రబంధముల దెసకు మఱల్చినది ఈయన నైషధమే. ఆ ప్రబంధములకు అనువైన శయ్యాసౌభాగ్యమును ఒసగిన గురువు శ్రీనాథుడే. మఱి, ఆంధ్రమున అక్షరరమ్యత సాధించిన కవివర్గ మొకటియు, అర్థగౌరవముపాటించిన కవివర్గమింకొకటియు రెండు విధములనుండగా, ఆ రెండు గుణములను సమ్మేళనమొనర్చి శబ్దార్థముల రెంటికిని సమప్రాధాన్యము నొసంగిన శిల్పియు శ్రీనాథుడే. ఈ విధముగా నానాముఖవ్యాప్తమైన సారస్వత ఖ్యాతిని, చారిత్రక ప్రసిద్ధిని ఆర్జించిన ఈ కవిసార్వభౌమునిగూర్చి కీర్తిశేషులైన చిలుకూరి వీరభద్రరావుగారు ఒక యథార్థమైన వాక్యమును పలికిరి. "శ్రీనాథుని జీవితచరిత్ర వ్రాయుటయనగా పదునైదవ శతాబ్దియందలి ఆంధ్రదేశచరిత్ర వ్రాయుట" అని. ఆ కాలమున ఉచ్చస్థితిలోనున్న ఆంధ్ర కర్ణాటరాజులతో ఆయనకుగల సంబంధము, నానా మంత్రులతోడి మైత్రి,



శ్రీ రాళపల్లి అనంతకృష్ణశర్మ, మైసూరు విశ్వవిద్యాలయ తెలుఁగు పండితులు.

వివిధదిశల నొనర్చిన సంచారము శ్రీనాథుని ఆంధ్రలోకైక కవినిగా చేసినవి. కొండ వీటి చరిత్ర వ్రాయు ఐతిహాసికుడు శ్రీనాథునకు ఒక ప్రకరణమేనియు అంకిత మీయక తప్పదు. శ్రీనాథుని జీవితము వ్రాయు చరిత్రకారుడు రెడ్డిరాజ్యచరిత్రముతో కలిపిగాని వ్రాయలేడు. కనకాభిషేకమును వర్ణించు కవి కన్నడ రాజ్యలక్ష్మిని గురించి వర్ణింపక తప్పదు. రాచకొండలోని విద్యా ప్రదర్శనమును ఉగ్గడించునప్పుడు వెలమరాజులకును రెడ్డి రాజులకును గల వైరమును వివరింపక మానలేము. ఈ విధముగా ఆ మహామహుని జీవితమంతయు ఆనాటి రాజులయు, మంత్రులయు, రాజబంధువులయు జీవితములతో పడుగుపేకగా అల్లుకొని యుండుటచేత ఈ మహాకవికి అట్టి చారిత్రక ప్రసిద్ధి లభించినది.

శ్రీనాథుని సమకాలికులలో ప్రథముడును, ఆంధ్రకవి ప్రవక్తలలో ద్వితీయుడును అయిన పోతనామాత్యుని భాగవతము ఏల ఉత్సన్నమై, బహుకర్తృతకు పాల్పడినదో చెప్పలేము. ఈ భక్తుడు చైతన్యస్వామికంటె నలుబదియైదు సంవత్సరములు పూర్వుడు. ఆ భక్తశిఖామణి వంగదేశమున రాధా ప్రణయాత్మకమైన కృష్ణతత్త్వమును ప్రబోధింపక పూర్వమే ఈ భక్తశిఖామణి ఆంధ్రదేశమున నవరసమూర్తియగు శ్రీ కృష్ణతత్త్వమును గానముచేసి ఆంధ్రుల మనోలోకమున ఒక పరివర్తనము గలిగించెను.

తెలుగునగల పురాణేతిహాసములలో భాగవతమువలె సర్వజనసమ్మతమైన గ్రంథ మింకొకటిలేదు. శిల్పమున భారతము దీనికంటె మిన్నయైనను దీనివలె సార్వజనీనమైన అనురంజకత్వమును పొందలేకపోయెను. ఇందుకు రెండు మూడు కారణములు కలవు.

1. భారతమునందలి పరమార్థము— సంసారతరణోపాయముగా అది నిర్దేశించిన నిష్కామ కర్మయోగము— తిక్కనాదులైన పరిపూర్ణులకుతప్ప అందఱకును అవలంబనీయముకాదు. అది ఎంత ఉత్తమ మార్గమైనను లోకము దాని ననుగమింపజాలదు. ఇక భాగవతమో, సర్వజంతుతారకమగు భక్తియోగమును స్ఫుటముగా ఆదేశించెను. సంసారఖిన్నమైన లోకము ఎట్టి జ్ఞాన విజ్ఞానములతోను సంబంధము లేకుండ, పూలు పఱచినట్లు మెత్తనైన ఈ మార్గమున నడచి దరిజేరవలయునని ఆశించుటలో వింతలేదు. సాధారణ లోకముయొక్క మనఃస్థితికి సంస్కారమునకు, అనురూపమును ప్రియమును అయిన ఈ ఆలంబనము ప్రసాదించిన గ్రంథరాజమగుటచేతనే, లోకము భాగవతము నెడ భక్తిబద్ధమైనది. ఆపద్వేళల గజేంద్రమోక్షమును సంజీవనీ మంత్రముగా ఉపాసించు ఆంధ్రులును, గోపికా గీతలను భగవద్గీతవలె అధ్యయనముచేయు ఆంధ్రులును నేటికిని అనేకులు కలరు.

2. భారతమునందలి శిల్పచాతురి సర్వకళా వేత్తృతగల ప్రౌఢ రసికులకేగాని ఇతరులకు గోచరముకాదు. తిక్కన సోమయాజి-భారత విరాణ్మూర్తి-నిర్మాణములో ఏ పద్యమున కెంత ప్రాధాన్యముండునో అంతమాత్రమే యిచ్చి అన్నిటి కలయికచే సిద్ధిని పొందిన మూర్తిసౌష్ఠవము నెడ దృష్టి నిల్పెనుగాని, పద్యముల సొగసుకోసమే ఎచ్చటను పద్యములు వ్రాయలేదు. అందుచేతనే సందర్భమునుండి విడదీసి విడిగా, అలవోకగా పాడుకొని సంతోషింపదగిన పద్యములు భారతమున మచ్చునకైనను ఉండవు. ఇక, పోతన కృతములైన భాగవత పద్యములో, మధురాతి మధురములై భజన కీర్తనలవలె, పెండ్లి పాటలవలె, ఏల పదములవలె ఎల్లరును ఎల్లవేళల పాడుకొనుటకు అనువై సర్వత్ర వ్యాపించినవి. వానిలోని శ్రుతి లయలు ఉచ్చారణ మాత్రముననే మనస్సును లోగొనును. ఉత్తమ మధుర కవిత్వమునకు ఒక లక్షణమైన గీతి (Music in lyrical Poetry) భాగవత పద్యములందు నిండారి యుండుటచే వానికింత వ్యాప్తి వచ్చినది.

3. కవి అనుభవించిన దారిద్ర్యము, అకాళరాత్రి నెదుర్కొని పోరిన ఆయన ధీరత్వము, ఆశ్చర్యజనకములై లోకమునకు ఆయనయెడ నిరతిశయ పూజ్య భావమును కలిగించినవి. ఇవిగాక ఇంకేమేని కారణములుండవచ్చును.

స్వభావముచేత పోతన భావకవి (Lyrical Poet.) అందును భక్తి శృంగార భావములు వర్ణించు పట్టున అతి మాత్రమునకు పాల్పడు భావలోలుడు. ఆ ఘట్టములలో ప్రత్యక్షరమునను ఆయన ఆత్మభావమే ప్రతిఫలించుచుండును. తెలుగులో ఇట్టివాడు పాల్కురికి సోమనాథు డొకడే. పురాణ కర్తలలో ఇంత శృంగార ప్రియుడైన కవి ఇంకొకడు లేడు. ఆ శృంగారము ప్రబంధ శృంగారము వంటిదిగాక ఆధ్యాత్మిక కోశమును ముట్టినదియగుటచే ఆ రసమునకు ఇతర కవు లెవ్వరును సాధింపజాలని పవిత్రతను పోతన సాధించెను.

ఆంధ్రకవులలో తిక్కన సూర్యునివంటి వాడనియు, పోతన చంద్రునివంటి వాడనియు ఒకచోట ప్రసంగవశమున పూజ్యులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారనిరి. అనగా ఆంధ్రలోకమునకు వీరిరువురును రెండు వెలుగులన్న మాట. ఇరువురును తమతమ కాలములలో తెలుగుజాతికి తెలుగు వేదములనదగిన మహాగ్రంథముల ప్రసాదించిన గురుమూర్తులు, ప్రవక్తలు అని చెప్పదగిన మహాకవులు.

పోతన జీవితము తిక్కన జీవితమువలె పరిపూర్ణమైనది కాదు. ఆయన నిస్పృహాత్వము కతన ఐహిక సుఖాను భవము దూరమైనది. తిక్కన లోక ప్రవృత్తియందువలెనే కవిత్వమునందును వ్యక్తావ్యక్త స్వరూపుడుగా పట్టువడియు పట్టువడక సంచరించును. ప్రతివాక్యమునందును ఆయన మూర్తి స్ఫురించుచునే యుండును; మఱల కాదనిపించుచుండును. ఇక పోతనయో సంసారమున పట్టువడక పోయినను కవిత్వమున తడవినంతనే చేతి కందును. ఇది సాధారణముగా నాటకకవులకును భావకవులకును గల తారతమ్యములలో నొకటి. ఛందోనిబద్ధమగు శబ్దము, కళాధర్మములైన శ్రుతి లయలను ఎంతవఱకు సాధింపగలుగునో పోతనవలె దృష్టాంతపూర్వకముగా చూపిన పూర్వ కవి యింకొకడు లేడు. ఆయన శబ్దాలంకార ప్రియత్వము దీనికి మతికొంత వన్నె పెట్టినది. సముచిత ప్రయుక్తమైనచోట్ల ఆయన అనుప్రాసాలంకారము భాగవత కవితా గానమునకు మృదంగ వ్యాపారము నిర్వహించుచున్నట్లుండును. కవి స్వేచ్ఛగా పాడుకొను భక్తిగానము, ఆ గానమున కనురూపమైన మధురాతి మధుర శబ్దము, ఆ శబ్దముల కూర్పునకు మకుటాయమానమైన అంత్యప్రాసము కారణములుగా భాగవత పఠనము తాళము మద్దెల సహా కారులుగా ప్రవర్తిల్లు గానసభ కాక మఱేమగును!

ఈ యుగమున ప్రసిద్ధులైన ఇతర కవులు చాలామంది కలరు; గౌరన, జక్కన, అనంతామాత్యుడు, పినవీరన, దుగ్గన, నందిమల్లయ, ఘంటసింగయ మొదలైనవారు.

చిరకాలము క్రిందనే వెనుకబడిపోయిన ద్విపద రచనను పునరుద్ధరించినవాడు గౌరన. శ్రీనాథుడు నాందీశ్లోకమును పఠించిన ప్రబంధ మహానాటకమునకు శృంగార శాకుంతల రూపమున ప్రస్తావన జరిపిన సూత్రధారుడు పిల్లలమఱ్ఱి పినవీరన. పురాణ కథలను కాక, కొంతవరకు చారిత్రాత్మకములైన చిత్రకథా కావ్యములను వ్రాసినవారు జక్కన అనంతామాత్యులు. సంస్కృతనాటకమును తెలుగు ప్రబంధముగా అవతరింప జేసినవారు నంది మల్లయ, ఘంట సింగయ. మొత్తముమీద వీరందఱి యత్నములును ప్రబంధ రచనోన్ముఖములుగానే పరిణమించినవి. ఆ శాఖకు తగిన దోహదమంతయు ఇయ్యెడనే యేర్పడెను. ఈ కాలమున బుట్టిన పురాణములయందు సైతము పురాణేతిహాసోచితమైన సాధుత్వము తగ్గి ఆలంకారికశైలి (Ornate Style) యేర్పడుటచే ఈ కాలమును పురాణ ప్రబంధముల సంగమ స్థానముగా చెప్పుకొనవచ్చును. ఎఱ్ఱనలో బీజముగను, సోమనలో అంకురముగను పొడసూపిన ప్రబంధలత ఈ కాలమున కొనలుసాగి చిగిర్చి మాఱాకు వేసినది. ఇది పుష్పఫల సమన్వితమగుట రాయలకాలమున. మఱియు ఈ శక ప్రారంభదశలో కొండవీడును, మధ్యకాలమున రాజమహేంద్రవరమును, తుదకు విజయనగరమును సాహిత్య పీఠములుగా ఏర్పడినవి. రాబోవు యుగమున అచ్చటనే రాజసింహాసనముప్రక్క కవిరాజుసింహాసనమును నెలకొల్పబడినది.

## కృష్ణరాయలయుగము (1500-1600)

మూడు శతాబ్దులనుండి ఆంధ్రులుచేసిన తపస్సు ఫలించినదేమో అనునట్లు సమగ్ర దక్షిణభారత వ్యాప్తమైన ఆంధ్ర మహాసామ్రాజ్యమేర్పడి ప్రజలు వైభవోత్సాహయుతులైరి. ఆ సామ్రాజ్యస్థితికి హేతుభూతుడైన శ్రీకృష్ణరాయలు సరస్వతీసేవాసక్తతగల సహృదయుడగుటచేత, సామంత రాజులకంటె ముందు కవిరాజులకే అగ్రపూజలు జరిగినవి. ఆ పూజ లందుకొనవలెనని, ఆ మహారాజు ప్రాపు పొంద

వలెనని ఉత్కంఠతో, కవులొకరిని మించి యొకరు కావ్య రచనలకు దొరకొనిరి. భోజరాజాస్థానమును గురించి విన్న కథలు కట్టు కథలుగను, రాయల ఆస్థానసాహితీగోష్ఠి యథార్థమును అయ్యెను. ఈ మహాస్థానములో చేరిన యితర దేశభాషాకవిపండితసమక్షమున విద్యా ప్రసంగములలో, కవితా పరీక్షలలో "దేశ భాషలందు తెలుగు లెస్స" అనెడి సిద్ధాంతము అపవాదముగాని, పూర్వపక్షముగాని లేకుండ నిరూఢమయ్యెను.

నూత్న తేజముతో వెలుగొందు ఈ సామ్రాజ్య వైభవముతోపాటు నవనవోన్మేషమైన స్వతంత్ర సారస్వతరూపము కూడ వెలసినది. అదియే మన నవ్యకవితోద్యమములలో మొదటిది. (The First Romantic movemet) అదియే ప్రబంధావిర్భావము. ఈ ప్రబంధమే ఆంధ్రులు తమ ప్రత్యేక కావ్యసిద్ధిగా కొనియాడుకొనదగిన ప్రక్రియ. అన్ని కావ్య భేదములును రాశీభూతమై ఒక్కచోటనే కానవచ్చు క్షేత్రమును ఇదియే. పురాణ మహారణ్య సంచారమును వదలి ఆంధ్ర సరస్వతి విహరించిన ఉద్యానవనమును ఇదియే. రాయల ఆదేశమున, ఈ ఉద్యానపాలకతా భారమును మొదట వహించిన మహా పురుషుడు——

ఆంధ్రకవితాపితామహుడు, అల్లసాని పెద్దన.

మనుచరిత్రము శాంత శృంగారములు సంగమించిన తీర్థము. సహజ శృంగారప్రియుడైనకవి శాంతోన్ముఖుడైనపుడు రచింపబడిన గ్రంథమని అందలి ప్రతి ప్రకరణమును చెప్పకచెప్పును. ఈ ఉభయరస సంఘర్షణమే ఆ కావ్యములోని శిల్పరచనకు మూలప్రకృతి. ఆ సంఘర్షణము తాల్చిన మొదటిరూపమే వరూధినీ ప్రవరాఖ్యులనెడి జంట. కావ్యపూర్వార్థమున తాండవించు ఈ రెండు పాత్రలు పెద్దనగారి పాత్రనిర్మాణసిద్ధికి, సంభాషణ చాతుర్యమునకు, బుద్ధి విన్యాసమునకు, అంగాంగి రసముల సముచిత పరిపోషణకు లక్ష్యభూతములుగా నున్నవి. ఎంత ఆత్మిక శక్తితో (Intellectual Energy) సృష్టించిన పాత్రలు కావుననే వరూధినీ ప్రవరాఖ్యులు నేటికిని సజీవులైయున్నట్లే భావుకుల మనోనయనములకు గోచరించుచున్నారు. మనుచరిత్ర పుట్టినదాదిగా వలపు ప్రయోగమునకు రంభను, జితేంద్రియత్వమునకు శుకమహర్షిని పేర్కొనుట మఱచి ఆంధ్రులు వరూధినీ ప్రవరులను చెప్పుకొనుచున్నారు. ఆ పాత్రల సజీవతకు ఆంధ్రుల మనః ప్రపంచమున అవి కలిగించిన పరివర్తనమునకు ఇదియే తార్కాణము. తిక్కనగారు సృష్టించిన భారత పురుషులకు పిమ్మట పాఠకలోకముతో ఇంత సన్నిహితత్వముగల పాత్రలు, భారతమునకును మను చరిత్రమునకును నడుమ వెలసిన వాఙ్మయములో ఇంకొకచోట లేవు. ఈ రెండు పాత్రలను దిద్దుటలో కవి వహించిన నాటకీయ తటస్థ పద్ధతి (Dramatic Obejectivity) శ్రవ్యకావ్య కర్తల కందఱకును సాధ్యమైనది కాదు. మనుచరిత్రమును చదివిన రసికులెవ్వరును, వేశ్య అనిగాని, శ్రోత్రియునకు వ్రతభంగముచేయ నెంచిన వలపుకత్తె అనికాని వరూధినిని గర్హింపరు. మీదు మిక్కిలి ఆమె అనురాగము అస్థానపతితమైనదని చింతిల్లు సహృదయులును ఉందురు. ఆమెవలలో పడక ధీరుడై తప్పించుకొన్న ప్రవరుని దలచి భక్తిపూర్వకముగా మగలవారే జోహారులొనరింతురు.

శైలిలో శ్రీనాథుడు పెట్టిన ఒరవడిని పెద్దనగారు చక్కగా అనుకరించి, ఆయనకు పరోక్షశిష్యుడయ్యెను. అట్లయ్యు ఇరువురకును కొంతవాసియు కలదు. ప్రాయికముగా శ్రీనాథుని వాగ్గాంభీర్యము దుందుభిధ్వానము వంటిది. పెద్దనగారి వాక్కు అపేలవముగా, మంద్రముగా వినవచ్చు మృదంగ నాదమువంటిది.

అల్లసాని పెద్దన రాయల ఆస్థానమున అగ్రపూజలందగా, ఆస్థానమునగాక, అంతఃపురమునను చనవులందినవాడు నందితిమ్మన. ఆ చనవు బలిమినే ఈ కవితల్లజుడు తన కృతికన్యను (పారిజాతాపహరణము) అడుగకయే రాయలకిచ్చెను. మను చరిత్రకు పూర్వభాగమువలె ఈ పారిజాతాపహరణమునకు ప్రథమాశ్వాసము ప్రాణతుల్యము. వర్ణనాబాహుళ్యమును, కథావిస్తృతియు లేని ఆ చిన్న ప్రబంధము దక్షిణాంధ్రకవులలో పెక్కురకు మార్గదర్శకమయ్యెను. నాయకరాజులకాలములో వెలసిన సత్యభామా సాంత్వనము, రాధామాధవసంవాదము మొదలైన విప్రలంభశృంగారకావ్యములన్నియు తిమ్మనగారి పారిజాతమునకు సాక్షాదనుకృతులే.

అయ్యలరాజు రామభద్రుడును, మాదయగారి మల్లనయు ఇంతవారు కాకున్నను, ఏదో కొంత విశిష్టతయుండుటచేతనే అష్టదిగ్గజములలో చేరగలిగిరి. ఈ వర్గములోచేరిన ఇంకొక మేటికవి ధూర్జటి. శ్రీ కాళహస్తి

మాహాత్మ్యము కేవలప్రబంధము కాకపోయినను, కొంత వఱకు ఆ లక్షణములు కలది. అందులోని కొన్ని ప్రకరణములు, ధూర్జటి లోకవృత్త పరిజ్ఞానమునకు నిదర్శనములుగా నున్నవి. ఆయనకీర్తిని అజరామరము చేయుటకు ఒక్క కాళహస్తీశ్వరశతకమే చాలు. మన వాఙ్మయములోని ఉత్తమోత్తమశతకములలో ఇది యొకటి. జగద్వంచనయు, ఆత్మవంచనయు చేయక పొంగి పొరలెడి హృదయావేదన నంతయు ధూర్జటి ఈ శతకమున నిర్భయముగా చాటుకొనెను. రోసీ రోయని కామము; ఉపేక్షించీ ఉపేక్షించని శత్రుత్వము; తిరస్కరించీ తిరస్కరించని రాజద్వారములు మొదలగు బంధముల చిక్కి వానిని త్రెంపుకొనలేక ఆంతరయుద్ధమునుచేయు ధూర్జటి మకరికి చిక్కిన గజేంద్రమును తలపించుచుండును. ప్రవృత్తినుండి నివృత్తికి, భోగమునుండి త్యాగమునకు మరలీమరలని తన చిత్తమునకు శక్తి చాలదని గుర్తించి ఆ శక్తి ననుగ్రహింపుమని అశ్రువర్షముతో ఈశ్వరుని ప్రార్థించెను. ఇంత అంతశ్శుద్ధిగల కవిత్వము సర్వత్ర లభించుట దుర్లభము. ఈ కవివర్గమనెడి మణిహారమునకు మేరుపూస

## శ్రీ కృష్ణరాయలు :—

ఆముక్తమాల్యద ఈ రాజకవికృతమే. పెద్దన కృతము కాదు. రాయల సాహిత్య కీర్తికి ధ్వజప్రాయమైన ఈ కావ్యము, సామ్రాజ్యము సర్వదా సంపన్నమై నిరుపద్రవమైన దినములలో వ్రాయబడినది. గోదాదేవి విష్ణుచిత్తుల భక్తిప్రపత్తులే గ్రంథ పూర్వాపరభాగముల నాశ్రయించియున్నవి. గోదాదేవి యువతి గనుక ఆమెభక్తి శృంగారరూపమును దాల్చినది. ప్రధానప్రతిపాద్యమగు విష్ణుభక్తికి పోషకములుగా నక్కఱకువచ్చునను ఊహతో రాయలు కొన్ని ప్రాసంగికములకు స్థానము కల్పించి అతికెను. ఆ యతుగుదలయే కావ్యబంధమునకు వెల్తిదెచ్చినది. మొత్తముమీద అద్వితీయమైన వైష్ణవతేజము సర్వత్ర తానయై వెలుగుచు అధికారితారమ్యమునుబట్టి భిన్నభిన్నరూపముల బొందుచు, ఎల్లయెడల ధ్వాంతనాశనము చేయుచున్న రహస్యము అనేకవిధముల ఈ కావ్యము ప్రదర్శించుచున్నది. అతి తీక్ష్ణమైన భావనలో రాయలు ఒక్కొక వేళ తిక్కనను తలపించుచుండును. కాని దురదృష్టవశమున బహుభాగముల ఆ శక్తి మఱుగుపడిపోయి భావనకు ఆభాసమైన ఊహ విజృంభించినది. పద్యరచనలోకూడ

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు



ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలా స్థాపకులు; వీరిలో ఎడమప్రక్కన శ్రీ బాలాంత్రపు వెంకట్రావు, కుడిప్రక్కన శ్రీ ఓలేటి పార్వతీశం.

ఇట్టి గుణదోషమిశ్రభావమే కలదు. ఒక్కొక్కయెడ ముక్కుతిమ్మనవలె ఎంతో ముద్దుగా వ్రాయనేర్చినకవి, మఱొక్కయెడ ముదురు నారికేళ పాకమునకు మఱియుచుండును. అట్టిచోట్ల, భావవ్యక్తి కుదరక పెనగులాడు వానివలె కన్పట్టును. సహజముగా సంస్కృతకవియై యుండి కాలక్రమమున తెలుగుకవిత్వము నభ్యసించినాడేమో అనుటకు అట్టి పద్యములే నిదర్శనములు. నన్నెచోడుని తరువాత ఇంత వర్ణనాకుతూహలము గలకవి ఇంకొకడులేడు. ఒక్కపెట్టున మూడు ఋతువులను వర్ణించిన మేటితనము ఆయనకే చెల్లినది. రాయలనాటి ఆచార వ్యవహారము లెఱుంగవలె నన్నచో, ఈ గ్రంథమువలె ఇంకే గ్రంథమును అక్కఱకురాదు. ఇతర గ్రంథములలో నామమాత్రమునకైనను పేర్కొనబడని పేదసాదులయు, సంపన్నగృహస్థులయు సాంసారిక స్థితిగతులను ఎన్నిటినో వర్ణించి, తన ఏలుబడిలోని ప్రజల జీవితమును అద్దమునందువలె గోచరించునట్లు లోకమున కనుగ్రహించెను. ఆ ఘట్టమున వ్యక్తమగు రాయల ప్రకృతిపరిశీలకత, లోకవృత్త పరిజ్ఞానము అన్యకవిరాజదుర్లభములు. ఈ ప్రజ్ఞకుతోడు ఆయనచూపిన పాతంజలాది బహుశాస్త్ర పరిజ్ఞానముకూడద అన్యరాజదుర్లభమే.

సంకుసాల నృసింహకవికి ఆస్థాన ప్రవేశము దొరకలేదు గాని అష్టదిగ్గజములలో చేరవలసినవాడే. యతిని విటునిగాజేయు శృంగారమును, విటుని యతిగాజేయు వైరాగ్యమును వర్ణించుట ఈయనకే చెల్లినది. ఈ కవిత్వములో పూర్వకవుల అర్థసౌలభ్యమును, ప్రబంధకవుల శబ్దజటిలతయు ఎడములేక హత్తుకొని యుండును.

రాధామాధవ ప్రబంధము వ్రాసి, రాయల మెప్పించి 'రాధా మాధవకవి'యనెడి బిరుద నామమును పొందిన చింతలపూడి ఎల్లనార్యుడును, తన శృంగార మల్హాణమును రాయలకే కృతి యీయదలచి ప్రతికూల కాలవశమున మనోరథ పూర్తికాక ఇతరులకిచ్చిన ఎడపాటి ఎఱ్ఱనయు రాయల దర్శనభాగ్య మనుభవించిన సమకాలిక కవులే. పింగళి సూరనాదులకు ఆ భాగ్యము లేకపోయినది. వారు ఆ ఆస్థానవైభవమును స్మరించుకొని మాత్రమే తనివి చెందిరి.

ఆంధ్ర కవులలో నిరుపమానప్రతిభా సాకల్యముగల తిక్కన సోమయాజికి ధర్మాచార్యకత్వమున పోతనామాత్యుడువలె, శిల్పాచార్యకత్వమున పింగళి సూరన సాటి. కళా పూర్ణోదయము స్వతంత్రసృష్టి యగుటయు భారతము అనువాదమగుటయు కారణములుగా తిక్కనకంటె సూరనకు నూత్న నిర్మాణకౌశలాది శిల్పప్రదర్శనమునకు ఎక్కువ సదవకాశము చిక్కినది.

మన సారస్వతములో అచ్చటచ్చట మొదటినుండియు సకృత్తుగా పొడసూపుచువచ్చిన శ్లేష కవిత్వ రచనకు సూరన రాఘవపాండవీయము పరిణామరూపము. తరువాత వెలసిన ద్వ్యర్థి త్ర్యర్థికావ్యము లన్నియు ఈ మాతృస్తన్యమును గ్రోలిన శిశువులే.

కళాపూర్ణోదయము అప్పటి కవిపండితలోకమున ఒక మహా సంచలనము కల్గించియుండును. కృత్రిమ రత్నమని కొందఱు, వేశ్యానాయికమని కొందఱు, వంకర కథయని కొందఱు, ఇంకేమో అని మఱికొందఱు ఆ కావ్యరత్నమును ఆక్షేపించియుందురు. విశ్వలీలకు ఆదికారణమగు శృంగార భావము, ఆలంబనతారతమ్యమును బట్టి ఎన్నివిధముల వర్తించుచుండునో, ఎట్టి రూపాంతరముల బొందుచుండునో ధ్యానించి సాక్షాత్కరింపజేసికొని, ఆదర్శమునకు రూపకల్పన మొసంగుట బ్రహ్మసంకల్పమున కర్థము చెప్పుట. ఈ కావ్యమున ప్రతిపాదింపబడిన ధర్మరహస్యమిది. కళాపూర్ణోదయమనగా ప్రణయదేవతా విశ్వరూప ప్రదర్శనము. ఈ రహస్యము వ్యక్తీకరించుటకు, పురాణేతిహాసములలో ఏ ఉపాఖ్యానములును సూరనకు అక్కఱకురావు. కావుననే తన ప్రపంచమును తానే సృష్టించుకొనెను. అది బ్రహ్మసృష్టియని తెల్పుటకే కథాబీజము బ్రహ్మమానస క్షేత్రమున నాటెను. మఱియు, ఆంధ్ర ప్రబంధకవులలో ఇంత మనోవిజ్ఞానముగల కవి ఇంకొకడుండెనా అను ప్రశ్నకు వెంటనే సమాధానము చెప్పుటయు కష్టమే. కావ్యపాత్రలకు ప్రాణప్రతిష్ఠచేయునది కవిలోని ఈ మనోవిజ్ఞానమే. కళా పూర్ణోదయమున ప్రతి పాత్రయు నామమాత్ర స్మరణమున మనకు ప్రత్యక్షమగుటకు హేతువు ఈ కవితా శక్తియే. చూడచూడ, ఈయన స్త్రీ పాత్రములు పురుషపాత్రములకంటె మేల్తరములుగా గోచరించును. అట్లనుటచే ఆ పురుషచిత్రముల రేఖలుగాని రంగులుగాని, భావముగాని చెడినవని తలంపరాదు. మఱేమన లోకములో ప్రణయ రహస్యమందు పురుషులకంటె స్త్రీలు ఎట్లు గంభీర వర్తనలుగా నుందురో అట్లే సూరన సృష్టించిన శృంగార ప్రపంచమునందును స్త్రీ పాత్రలే గంభీరములుగా నుండును. మన ప్రబంధములలో పెక్కు నాయకప్రధానములుగానే వెలువడినవి. నాయికా ప్రధానములయినవి చాల తక్కువ. ఆ ఉన్నవానిలో కళా పూర్ణోదయము ఉత్తమోత్తమము. శృంగారభావమును విషాదరేఖాశబలితము చేయుట ఈయన శిల్పధర్మములలో నింకొకటి. ఆ విషాదము కేవలము దుఃఖాత్మకమే కాదు, అద్భుతావహముకూడ. అట్లయిననేకాని అది పుష్టినొందదనియు, ప్రీతిగొల్పదనియు ఆయన మతమో, లేక అనురాగమునకు త్యాగమునకుగల సన్నిహితత్వమును ఎఱుక పఱచుటకో పెక్కుచోట్ల ఆ సంకలనము చేయును. శృంగారానుభూతి ఇన్ని క్లేశములు తరించిన పిమ్మట లభింపవలసినదేగాని మాటమాత్రమున చూపుమాత్రమున అందదగినదికాదని ఈకవి సిద్ధాంతము. ఈ స్త్రీ పాత్రలలో ప్రేమమూర్తులు కొన్ని, ప్రజ్ఞామూర్తులు కొన్ని. (Characters of Love and Characters of Intellect) ఆ ప్రజ్ఞామూర్తులలో శుచిముఖివంటి బుద్ధిశాలిని ఏలోకమునను ఏవాఙ్మయమునను గూడలేదు. ఆ రాజహంసి సృష్టికొఱకే సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమును ఊహించియుండు ననిపించును. శుచిముఖి ఆలోచనా నిమగ్నలును, ఇతికర్తవ్యతామూఢులును అయియున్న ఇంద్రోపేంద్రులకు

కర్తవ్య ముపదేశించిన గురువు; కార్యమును నిర్వహించిన మంత్రి. అన్ని పురాణగాథలవలెనే హరివంశమునందలి ఈ కథయు అసంగతములు, అసందర్భములునగు అంశములతోనిండి జల్లికూర్పువలె నున్నది. సూరనార్యుడు ఆ కథను సర్వవిధముల పరిష్కరించి పురాణగాథలను ప్రబంధీకరించు ఆంధ్రకవుల వస్తునిర్మాణశక్తికి ధ్వజప్రాయమైన ప్రభావతీ ప్రద్యుమ్నమును వెలకొల్పెను. "ఏ యర్థమును దగుల్కొనదివియక వెలివోనిచ్చునె బుధుడూహించి చేయు సుకవిత్వంబుల్ అచ్చపుబుద్ధికి లేవగమ్యముల్" అని సందర్భవశమున సూరన చెప్పిన ప్రజ్ఞా విశేషములు రెండును ఆయనవే. ఈ రెండు కావ్యములును ఏతత్ప్రజ్ఞా మహితములే.

సూరనవలె రామరాజభూషణుడును కథను నాటకీయముగా నడపగల సమర్థుడే. అయినను వస్తుసన్నివేశములను నాటకీయముగా పొందింపగలిగెనేగాని నాటకత్వమునకు ఆయువుపట్టయిన సజీవపాత్రసృష్టి చేయలేకపోయెను. వరూథినీ ప్రవరులవలె, కలభాషిణీ మణికంధరులవలె, గిరికా వసురాజులు స్మరణమాత్రమున సాక్షాత్కరింపరు. అయిననేమాయె, వసుచరిత్రకు మన వాఙ్మయమున మహాప్రభావము కలదు. ఆంధ్రకావ్యములలో అంత ప్రౌఢసాహిత్యము గల కావ్యము ఇంకొకటిలేదని బహు పండితుల అభిప్రాయము. అదియునుగాక లయయు గమకమునుగలిగి కీర్తనవలె పాడదగిన పద్యము, కమ్మచ్చు తీసినగతి జవరగా సాగి వచ్చు పద్యపాదములు, అప్రయత్నసిద్ధములైన వ్యంగ్య శ్లేషాదులు, నానాశాస్త్ర నిష్ణాతమైన కవి బుద్ధిసంపద కారణములుగా ఈ గ్రంథమునకు రావలసిన మహాఖ్యాతి వచ్చినది. ప్రౌఢ కవులనిపించుకొనదలచినవా రెల్లరును దీని ననుకరింప మొదలిడి, ఎన్నియో పిల్లవసుచరిత్రలను వ్రాసిరి. అవియన్నియు నామమాత్రానుకరణములే. వారిలో అద్దంకి గంగాధరకవి తప్ప తక్కినవారందఱు క్షీణయుగములోనివారు. వారి అనుకరణాభిలాషయే ఆ యుగమునకు క్షీణత నాపాదించినది. కథ భరించలేని వర్ణనల కఱియుటయందును, శ్లేషాది చిత్ర కవిత్వమునందును రామరాజభూషణునకు అంత రక్తియుండుట శోచనీయము. సందర్భోచితముగా సహజముగానున్న శ్లేషలన్నియు పర్వత నిరోధఘట్టమున నున్నవి. శ్లేషపోషణమునందే కాక, కథన సంవాదములయందును ఈ ఘట్టమే ఎక్కువ చమత్కారాపాదిగానున్నది. అనగా ఆధికారిక వృత్తము కంటె ప్రాసంగికమే మేల్తరమనుట.

వీరితో సమ ప్రాధాన్యముకలవాడే తెనాలి రామకృష్ణ కవి. ఈయన రాయలకు సమకాలికుడును అర్వాచీనుడును అగును. సమకాలికుడయ్యు దిగ్గజము మాత్రము కాడు. ఉద్భటారాధ్యచరిత్ర, పాండురంగ మాహాత్మ్యము, ఘటికాచల మాహాత్మ్యము అను మూడు కృతులలో ఈయన యశమునకు నిధానమైనది పాండురంగ మాహాత్మ్యము మాత్రమే. వీనిలో మొదటి రెండిటికిని ఏకోదరత్వమును సంబర్థించు పోలికలు చాల గలవు. ఈ రెంటి పుట్టుకకును నడుమ చాల కాలవ్యవధియు నున్నది. ప్రథమ రచనలో భాష ఎంతమృదువుగ నున్నదో భావము అంత ప్రసన్నముగా నున్నది. రెండవదానిలో క్వాచిత్కముగా అప్రసన్నత కలదు. అయినను స్వతంత్రములును గంభీరములును అయిన భావములకు, ఆ భావములను వ్యక్తము చేసిన విశిష్టపదగుంఫనకు ఆకరమైన ఈ గ్రంథము, రామకృష్ణుని భావగతికిని, భాషాగతికినిగల ప్రత్యేకతకు నిధానమై వెలసినది.

వీరి తరువాత పేర్కొనతగినవారు సారంగు తమ్మయ్య, చదలవాడ మల్లయ్య, కందుకూరి రుద్రయ్య, పొన్నగంటి తెలగన్న, అద్దంకి గంగాధరకవి. వీరిలో మొదటి ఇరువురును శృంగార హాస్య ప్రధానములుగా పరమభక్తుడగు విప్రనారాయణచరిత్రము వ్రాసిన సాధురచయితలు. కందుకూరి రుద్రయ్య ఒక విధమైన సాంఘికేతివృత్తమును ప్రబంధించిన స్వతంత్రుడు. కాశీఖండములోని గుణనిధియు, రామకృష్ణుని మదాలస నిగమశర్మలును రుద్రకవి నిరంకుశుని సహాధ్యాయులే. కాని ఈ నిరంకుశుడు వారివలె ఏ క్షేత్ర మాహాత్మ్యమువల్లనో, ఏ శివరాత్రి జాగరమువల్లనో అకస్మాత్తుగా మోక్షమును జెందజూచినవాడుకాడు. ఆ క్షేత్ర మాహాత్మ్యములును, ఆ కథలలోని పరిణామ కృత్రిమత్వమును రుచింపకకాబోలు, రుద్రయ్య గ్రంథమున ఒక నూత్న సిద్ధాంతమును ప్రతిపాదింపనెంచెను. కాని దానిని సహజముగా సాగనీయక తుది భాగమున తానును ఒక కృత్రిమకల్పనమేచేసెను. అందుచే, ఈయన కల్పించు కొన్న సమస్య సమ్యక్పరిష్కృతము కాలేదు. రుద్రయ కీర్తిని చిరస్థాయిగా నిలుపుటకు నిరంకుశోపాఖ్యానమే

అక్కఱలేదు, జనార్దనాష్టకమే చాలును. మేఘసందేశమందు కాళిదాసు వరించిన మందాక్రాంతమువలె రుద్రయ భావానుగుణమగు వృత్తము నేటికొని వృత్తగతమైన గీతికి అనురూపమైన భాష నేటికొని క్షేత్రయ పదములవంటి సొగసుదనపు కుప్పలైన ఎనిమిది జనార్దనాంకిత పుష్పమంజరులను—ఎన్నటికిని వాడని వానిని—ఆంధ్రలోకమున కర్పించిపోయెను. పూర్వ ప్రబంధకర్తలలో మొదటియక్షగాన కర్తయు రుద్రయగానే కానవచ్చుచున్నాడు. అదే సుగ్రీవ పట్టాభిషేకము.

పొన్నగంటి తెలగన్నకు గలప్రత్యేకత అచ్చతెలుగు కావ్యరచన. పూర్వగ్రంథములలో క్వాచిత్కముగానున్న శ్లేష పద్యములనుచూచి ప్రత్యేక శ్లేష ప్రబంధముచేసిన పింగళి సూరనవలె, తెలగన్నయు, పూర్వులలో అచ్చటచ్చట గాననగు అచ్చతెలుగుపద్యములను చూచి ప్రత్యేకముగా అచ్చతెలుగు ప్రబంధము వ్రాయబూనెను. ఆయనవలె ఈయనయు తన చిత్రమార్గములో ప్రథముడగుటయేగాక ప్రముఖుడుకూడ. ఆ గ్రంథముపేరు యయాతిచరిత్ర. తరువాత అచ్చతెలుగురచనను సాగించినవారిలో ఏమాత్రమో కూచిమంచి తిమ్మనకు తప్ప తక్కినవారికి తెలగన్న సరళత అబ్బలేదు. ఈ అచ్చ తెనుగురచనలు శుద్ధ కృత్రిమములని నాతలంపు. వానిలో అచ్చతెనుగు లేదు సరికదా, తత్సమ తద్భవ దేశ్యాత్మకమైన ఆంధ్రభాషలో, తత్సమము పరిహరింపబడుటచే భాషా సౌష్ఠవముకూడ లేకపోయినది. ఈ తెలగన్నయు ఈయన సమకాలికుడు అద్దంకి గంగాధరకవియు తురక ప్రభువులచే ఆదరింపబడిన తెలుగు కవులు. గంగాధరకవి 'తపతీ సంవరణోపాఖ్యానము' మొదటి పిల్లకసుచరిత్ర.

ఈ శతాబ్దిని పేర్కొనబడవలసిన కవులు లెక్కకు మిక్కిలిగానుందురు. ఈ స్థూలచరిత్రలో వారి కందఱకును తావులేదు.

## దక్షిణాంధ్రయుగము (1600-1775)

ఈ యుగమునకు మూలపురుషుడు విజయవిలాసకృతిపతి అచ్యుతేంద్ర రఘునాథరాయలు. ఈయన తంజావూరు నాయకరాజులలో మూడవవాడు. విజయనగరరాజ్యము, ప్రాభవమునందువలె సారస్వతమునందును క్షీణదశనొంది, ఆ రాజవంశీయులలో పునరుద్ధరింపగల సమర్థులెవ్వరునులేని స్థితిలో కవియు, పండితుడు, కవిపండితపోషకుడు అగు రఘునాథుడు తంజావూరులో తలయెత్తి ఆంధ్రవాణి కాశ్రయములేని లోటును సవరించెను.

ఈ శతాబ్దికి ప్రారంభమునను, రఘునాథరాయల అభ్యుదయమునకు కొంచెము ముందుగాను కువలయాశ్వచరిత్ర, బహుళాశ్వచరిత్ర మొదలగు కొన్ని ప్రబంధములు పుట్టినవి. వాని నన్నిటిని ఈ యుగమునకు పూర్వరంగముగా భావింపవచ్చును.

కృష్ణరాయల కీర్తిప్రతాపములకు తొలుప్రొల్త ఉదయగిరి జయము ఎట్లు హేతుభూతమయ్యెనో రఘునాథుని కీర్తిప్రతాపములకును తొలుదొల్త తొప్పూరు విజయము అట్లే హేతుభూతమయ్యెను. ఇందేకాదు, ఈ రాజులకిరువురకును పెక్కింట సామ్యముకలదు. ఇరువురును మహావీరులు. ఇరువురును ప్రజారంజకులు. ఇరువురును సహృదయులు. ఇరువురును కవులు, గ్రంథకర్తలు. ఇరువురును లక్ష్మీకంటె సరస్వతికే ప్రథమ పూజచేసిన భక్తులు. తుదకిరువురును నడివయస్సుననే మృత్యుగోచరులైనవారు. కృష్ణరాయలకు నలుబదియారేండ్లకును, రఘునాథునకు నలుబదియేండ్లకును నూరేండ్లు నిండినవి. ఈ మహాపురుషులిరువురే పూర్ణపురుషాయుషజీవులైనచో ఎన్ని మనుచరిత్రలు, ఎన్ని విజయవిలాసములు పుట్టెడివో దేవునికెఱుక.

ఈ రాజకవి మూలముననే దక్షిణాంధ్రమున తంజావూరు ముఖ్యసాహిత్యకేంద్ర మయ్యెను. ప్రాధాన్యమును బట్టి రెండవకేంద్రము మధుర. మూడవది పుదుకోట.

ఈ యుగమునకు విలక్షణతను ప్రాధాన్యమును సంపాదించిన అంశములలో మొదటిది కావ్యస్వరూపవైవిధ్యము. సృష్టించిన సాహిత్యములో సంప్రదాయసిద్ధములైన పూర్వప్రబంధములవంటి ప్రబంధములును కలవు. తెనుగున కొంగ్రొత్తగా కేవలవచన కావ్య సృష్టికావించినవారునువారే. గేయ కవిత్వమునకు ప్రబంధకవిత్వముతో సమానగౌరవము లభించినది ఆనాడే. పల్లెలలో ప్రాకులాడు యక్షగానములను ఆస్థానకవులు చేపట్టి రాజాస్థానమునుచేర్చిన శుభకాలమును అదియే. మనకు సాంఘిక కావ్యములులేవనెడి లోటు తీర్చినది వీరే. కావ్యములందు అనావశ్యక వేదాంతబోధను పరిహరించుటయేకాక కళాసౌందర్యమునకును నీతిబోధకును

పరమభాగవతోత్తముడు—బమ్మెర పోతన



భాగవతాది గ్రంథకర్త. (పోతన వేషధారి శ్రీ చిత్తూరి నాగయ్య).

సంబంధములేదనెడి ఒక నూత్న సిద్ధాంతమునకు బీజము నాటినవారును వారే. రచనాసౌలభ్యమునకై ఔచిత్యమునుబట్టి కొన్ని వ్యాకరణ నియమములను ఉల్లంఘించిన స్వతంత్రులునువారే. కవులతోపాటు కవయిత్రులును వర్ధిల్లుట ఆనాడే.

ఈ దాక్షిణాత్య కవులకందఱకు విలాసతత్పరత, శృంగారప్రియత్వము, హాస్యచతురత ముఖ్యలక్షణములు. వీరు రాజదత్తములైన భోగములను భగవద్దత్తమైన శరీరపటుత్వముతో తనివితీర అనుభవించిరేకాని జీవితమునెడ ఔదాసీన్యమును, ప్రపంచమునెడ వైరాగ్యమును వహించినవారు కారు. పరముమాట అటుండగ, వారు 'రేపు' అనెడి మాటనే యెఱుగరు. వెల్లివిరియు ఉత్సాహముతో పాడినపాటలకు, వ్రాసిన పద్యములకు రసోద్దీప్తినే ఆశించిరిగాని వేఱు ప్రయోజనమపేక్షించలేదు. అయినను, వీరికి నైతికనిష్ఠ లేకపోవుటచే ఆ కావ్యములలో పెక్కింటికి ధర్మసౌందర్యలోపము వాటిల్లినది. మఱికొన్నిటియందు కథానిర్మాణమున బిగువులేక కూర్పుసొంపు చెడినది. తంజావూరు కవులలో అగ్రగణ్యుడు చేమకూరి వెంకటపతి. తెలుగు మార్దవమననేమో, తంజావూరు తెలుగులోని లాలిత్యమెట్టిదో లోకమునకు చూపిన గ్రంథము విజయవిలాసము. ఈ చరిత్రభాగమునకు నాయకుడును, విజయవిలాసకృతికి పతియునగు అచ్యుతేంద్ర రఘునాథనాయకుడును ఇంచుమించు వేంకటపతి అంతటి కవియే. వాల్మీకి చరిత్ర ఆయన ప్రజ్ఞామహితత్వమునకు పరమనిదర్శనము. ఆయన ఆస్థానమునకు అలంకారప్రాయలైన కవయిత్రులు మధురవాణి, రామభద్రాంబ అను ఇరువురు.

రఘునాథుని కుమారుడు విజయరాఘవుడు బహు యక్షగానములకర్త. ఈయన ఆస్థానము కీర్తనలు పండిన సుక్షేత్రము. ఈ రాజు ప్రియురాలు రంగాజమ్మ, ఈయన కొలువుకూటమునకు వన్నెపెట్టిన ఒక కవయిత్రి. ఆంధ్రజయదేవుడని పిలువదగిన, మువ్వగోపాలపదకర్త క్షేత్రయ ఈ విజయరాఘవుని పరమమిత్రుడు. విజయరాఘవుని కుమారుడు మన్నారుదాసుకూడ యక్షగాన కవియే. వీరి తరువాత ఆ సింహాసనమెక్కిన మహారాష్ట్రరాజులలోకూడ చాలమంది కవులును కవిపోషకులును కలరు. వారి రోజులలో యక్షగాన నాటకము మఱింత తామరతంపరగా

పెరిగినది. ప్రబంధము లంతగా వెలసినట్లులేవు. ముద్దుపళని రాధికాసాంత్వన మొకటి మాత్రము కానవచ్చుచున్నది. ముద్దుపళని ప్రతాపసింహుని ప్రియురాలు. రాధామాధవ ప్రణయాత్మకములైన శృంగార ప్రబంధములలో దీనిని పోల దగినది ఇంకొకటిలేదు. నందితిమ్మనతో పందెముచఱచినది వలె ముద్దుపళని, రాధికావిప్రలంభశృంగారమును అతి వృష్టిగా కురియించినది. పుట్టుకచే వేశ్యయు, సంస్కారముచే సరసురాలునుయయిన ఈమె తానే స్వయముగా కావ్యనాయికయై, తన హృదయమునే వ్యక్తముచేసినదా అనునట్లుండును. ఆనాటి ప్రబంధములు కొన్నిటిలో దుస్సహ మనిపించు కామపరశృంగారము ఏదికలదో అది ఈ కావ్యమున దుస్సహతరమైనది.

మధురలో తిరుమలనాయని రాజ్యపాలనముతోనే కావ్యరచనారంభమును అయినదని ఊహింపవచ్చును. తిరుమలునకును తరువాత అతని కుమారునకును ఆస్థానకవియైన లింగనమఖి శ్రీరామేశ్వరకవి సత్యభామాసాంత్వనమునకు కర్త. ఈతని రెండవగ్రంథము ధేనుమహాత్మ్య మనెడి వచన కావ్యము. శృంగారరాధామాధవకర్తయైన వెలిదండల వేంకటపతి ఈ కాలమువాడే. రాధామాధవగాథను పరకీయ శృంగారముగా చిత్రించిన మొదటి తెలుగు ప్రబంధమిదియే. స్వేచ్ఛాప్రణయవిహారసిద్ధాంతమును వాచ్యముగా ప్రతిపాదించిన సాహసుడును ఈతడే.

తంజావూరురాజులతో సాటికిని, పోటికిని నిల్వగల పాండ్యరాజకవి విజయరంగచొక్కనాథుడు. వారివలెనే విజయరంగడును స్వయము గ్రంథకర్త. ఇతని ఆస్థాన కవులేకాక కొందఱు రాజోద్యోగులును కావ్యకర్తలే. వారిలో చొక్కనాథుని సేనాపతియైన సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు రెండు పద్యకావ్యములకును, రెండు గద్యకావ్యములకును కర్త. పద్యకావ్యముల రెంటిలో రాధామాధవ సంవాదము కేవల ఖండకావ్యమని చెప్పదగిన ఏకాశ్వాసప్రబంధము. తారాశశాంక కృతికర్త శేషము వేంకటపతి, కృష్ణప్పనాయని ఆశ్రితుడేకాక మిత్రుడుకూడ.

తంజావూరు యక్షగానములకువలె మధుర వచనరచనలకు ప్రసిద్ధికెక్కెను. ఆ వచనములలో పెక్కు ఇంచుమించు పూర్వ ప్రబంధములకును పురాణగాథలకును యథామాత్రకములైన దండాన్వయములు. శైలిలో అవి యెంత ప్రౌఢములో ఇవియు అంతే ప్రౌఢములు. నూతన కథాకల్పనలుగాని, జనసామాన్యమునకు అక్కఱకు రాదగిన సౌలభ్యముగాని ఆ వచనములలోలేవు. అయినను మనకు ప్రత్యేక వచనములులేనిలోటును తీర్చినవివియే. చారిత్రకముగా వీని ప్రాధాన్యమును మఱచుటకు ఎంతమాత్రమును వీలులేదు. ఇవికాక కర్తృత్వము తెలియరాని పంచతంత్రము, విక్రమార్కుని కథలు, భేతాళ పంచవింశతి మొదలైన చిత్రాఖ్యానములు ఆ కాలమునందు కొన్ని పుట్టినవి. ఇవి అంత ప్రౌఢములుకాక ప్రజాసామాన్యమునకు అక్కఱకు వచ్చునట్లుండును. పుదుకోట రాజధానిగా, తొండమండలమును ఏలిన తెలుగు రాజులలో రఘునాథ తొండమాన్ అను ఇంకొకరాజకవి నుదురుపాటి కవివంశమునకు ఆశ్రయమిచ్చి, వారిచే పెక్కు రచనలను



కవి సార్వభౌమ శ్రీనాథుడు; శృంగార నైషధాది గ్రంథకర్త.
(శ్రీనాథ వేషధారి శ్రీ జంధ్యాల గౌరీనాథ శాస్త్రి.)

చేయించుటేకాక తానును పార్వతీ పరిణయమును ప్రబంధముగా సంతరించెను.

అపరపోతన త్యాగరాజు దక్షిణాంధ్రకవులలో కాలమును బట్టి చివరివాడగుటయేకాక మహత్త్వమునుబట్టి శిరోభూషణమనదగినవాడు. ఆ సారస్వతాలయమునకు ఈ మహాభక్తుడే సువర్ణశిఖరము. దాని వెలుగు వెల్లువలో మనతోపాటు అరవ సోదరులును మున్కలువేసి పవిత్రులగుచున్నారు.

## క్షీణయుగము (1775—1875)

చోళ పాండ్యరాజ్యముల పతనముతో సామ్రాజ్యస్థాపకులైన ఆంధ్రులకు సామంతరాష్ట్రములైనను లేకుండ పోయినవి. స్వాతంత్ర్య రహితములు, ప్రాచీనైశ్వర్య శూన్యములు అయిన జమీలు మిగిలినవి. జాతి ముఖకళ క్షీణించినది. ఆక్షీణలక్షణమే కవిత్వమునకు పట్టినది. జాతియొక్క దారిద్ర్య పరాధీనతలే కవితలోని భావదాస్యపరాధీనతలకు కారణమైనది. మహోన్నతస్థితిలో ఉన్నపుడు జాతికి పరమ లక్ష్యములుగా వెలుగొందిన ఉన్నతాశయములు నశించి క్షుద్రభావములు పొడసూపినట్లే కవులలోను ఉదారాశయములు అడుగంటిపోయి క్షుద్రత తలసూపెను. పూర్వ సామ్రాజ్యయుగములలో ఐహికాముష్మికముల రెండింటిని కైవసము చేసికొను సంకల్పబలముగల మహావీరులు జన్మించినట్లే, ఆ ధర్మములనే ప్రబోధించు ఆత్మబలముగల కవులును జన్మించిరి. వారువైచిన పునాదులమీదనే విజయనగరసామ్రాజ్య నిర్మాణము జరిగినది. దాని మహాభ్యుదయమే సారస్వతాభ్యుదయమునకు హేతువైనది. ప్రజలు ఆ వైశ్వర్య ప్రమత్తతలో పూర్వులుపదేశించిన ధర్మనిష్ఠను కొంతవఱకు మఱచిపోయిరి. మఱి సామంతరాజుల కాలమునాటికి రాజులకును కవులకును ఐహికమే ప్రధానమై, ఒడలు తెలియని భోగలాలసతయే పరమపురుషార్థముగా పరిణమించినది. ఈ ధర్మభ్రంశము కలిగిన రోజులలోనే దేశము పరులపాలయ్యెను. ఆంధ్రులు జీవచ్ఛవములైరి. ఆనాటి వారి ప్రబంధములును జీవచ్ఛవములేయయ్యెను. జాతిని పునరుద్ధరించి పూర్వ ప్రతిష్ఠను నెలకొల్పగల వీరుడు లేనట్లే, నిస్తేజమైన సారస్వతమును పునరుద్ధరించి క్రొత్త మార్గమున నడపగల మహాకవి—యుగ పురుషుడు కాదగినవాడు—లేకపోయెను. అందఱును అస్వతంత్రులే. అందఱును అనుకరణశీలులే. ఏ కవిలోను నూత్నత్వములేదు. జీవములేదు. ఇదియే ఈ యుగమునకు క్షీణయుగమని పేరు తెచ్చిన ప్రబలహేతువు. గ్రుడ్డిలో మెల్లగా వారిలో ఏ మాత్రమేని గుణముకలవారు కంకంటి పాపరాజు మొదలైనవారు.

వస్తుతత్త్వమునుబట్టి ఉత్తరరామాయణము పురాణవర్గములో చేరదగినది. దానిని పురాణముగానే ఉంచి ప్రబంధశైలిలో వ్రాసినవాడు పాపరాజు. ప్రబంధ యుగములో పుట్టిన పురాణములు ప్రబంధ శైలితోను, పురాణయుగములో పుట్టిన ప్రబంధములు పురాణ శైలితోను ఉండుట కాలప్రభావమును బట్టియే. పురాణ శైలి ప్రసన్న గంభీరమైన శరన్నది, ప్రబంధశైలి తరంగ ఘోషతో దరు లొరసికొనుచు పరుగెత్తు వర్షాకాలనది. ఈతని మిత్రుడు పుష్పగిరి తిమ్మన్న గ్రంథరచనలో కొంత సాయము చేసినట్లు పీఠికలో ఉండుటచే ఇది తిమ్మనకృతమే యనువారును కొందఱు కలరు. కాని తిమ్మనకృతమైన సమీరకుమారవిజయముతో దీనిని పోల్చిచూచినచో రెండింటి కర్తలును వేర్వేఱని తెలియకపోదు.

మన రెండవ కవిసార్వభౌముడు కూచిమంచి తిమ్మకవి. ఈయన బహు గ్రంథకర్త. అచ్చతెలుగు రచనలను పునరుద్ధరించిన వాడీయనయే. తిమ్మకవి తమ్ముడు జగ్గకవి రచించినదే పేరెన్నికగన్న చంద్రరేఖావిలాపము. ఇది హేళన కావ్యమను పేరునకు తగని మోటుగ్రంథము. వీరి కిర్వురకు బంధువును స్నేహితుడును అగు వక్కలంక వీరభద్రకవి వాసవదత్తాపరిణయకర్త. అడిదము సూరకవి కవిజనరంజనము—ఇంకొక పిల్లవసు చరిత్ర—ఈ కాలము నాటిదే. ఈయన చాటు పద్యములు ఆంధ్రమున్నంతవఱకు ఉండునవి. చిత్రకవి సింగనార్యుని బిల్హణీయము, కృష్ణదాసుని రాధా కృష్ణవిలాసము, సంగమేశ్వరుని అహల్యాసంక్రందనము, చెళ్లపిళ్ల నరసకవి యామినీ పూర్ణతిలకా విలాసము మొదలగు ఈ యుగములోని కొన్ని ప్రబంధములు దక్షిణాంధ్ర కావ్యముల ఛాయలుకలవి.

ఈకాలపు కవుల అనుకరణపరాయణత శ్లేషకావ్య రచనలో ఎక్కువ కాన్పించెను. తత్పూర్వము ఎనిమిది శతాబ్దుల కాలములో రెండుమూడుకంటె ఎక్కువలేని శ్లేషకావ్యములు ఈ శతాబ్దిలో ఒక్కపెట్టున ఇరువదివఱకు



కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఎమ్.ఏ., బెజవాడ పుయ్యూరురాజ కళాశాల ఆంధ్రాధ్యాపకులుకు గుడివాడ పౌరులు గజారోహణోత్సవము జరిపి, కవిసన్మానము చేసిరి.

పెరిగినవి. వానిలో రెండర్థములేకాక మూడర్థములు కలవి కూడ కొన్నిఉన్నవి. తాళపత్ర గ్రంథ పరిశోధనలవల్ల నాలుగర్థములు గలవికూడ ఎప్పుడైన దొరకునేమో. ఈ జాతిదేఅయ్యు కొంతపేరు గడించినకావ్యము పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయము. ఇందలి ఇతివృత్తము ఆత్మవిషయమగుటచే దీనికొక క్రొత్తదనము వచ్చినది. శత్రుకృతాపకారమువలన కలిగిన క్రోధదుఃఖమును స్ఫురింపజేయుచు రెండర్థములు సాధించిన లక్ష్మణకవి చమత్కారము మెచ్చదగియుండును. ఈయుగాంతముననున్న కవివర్గములో ఖ్యాతికెక్కినకవి మండపాక పార్వతీశ్వరశాస్త్రి. ఈయన వ్రాసినన్ని శతకములు తెలుగులో మఱియేకవియు వ్రాయలేదు.

మన తెలుగు శతకములనుగుఱించి చెప్పవలెనన్నచో అదొక ప్రత్యేక వ్యాసమగును. అట్టిది వీలులేదుగనుక యథాస్థానముగా ఆ చరిత్ర కొంత సంగ్రహపఱచి చెప్పెదను. మొదటినుండియు ప్రబంధ కవిత్వముతోపాటు శతకకవిత్వముకూడ కుడియెడమలుగా వర్ధిల్లుచునే వచ్చినది. ఏ ప్రబంధకవియు ప్రారంభదశలో కొంతచాటు కవిత్వము చెప్పకయే అకస్మాత్తుగా ప్రబంధరచనకు దూకుననుట తత్త్వవిరుద్ధమైనమాట. ఆచాటు కవిత్వమువంటిదే శతక కవిత్వము కూడ. ఇందు పరిపాలింపబడవలసిన మకుటాది నియమములు కవికి భాషా రచనాది విషయమున మంచి యభ్యాసము నొసగును. ఈ యభ్యాసవశమున చేయి చక్కగా తిరిగినపిమ్మటనే పెద్ద గ్రంథముల రచించుటకు మార్గమేర్పడును. ఈ ధర్మమునుబట్టి చూచినచో ఇప్పుడు మనకు లభించిన వాఙ్మయముకంటె ఎక్కువ పరిమాణముగల చాటు శతక కవితావాఙ్మయము నశించిపోయియుండవచ్చునని చెప్పవచ్చును. దీనితోపాటు, ఇంతకంటె ఎక్కువ పరిమాణముగల పదకవిత్వముకూడ నశించిపోయినది. ఆ గొడవ కంతకును ఇది అదనుకాదు. పోయినవిపోగామిగిలిన శతకములలో ఉత్తమోత్తమములైనవి, ఉత్తమ ప్రబంధములతోను ఉత్తమ భావ కవిత్వముతోను సర్వథా సాటి రాగలవి, భక్తి శతకములుకొన్ని, శృంగారశతకములు కొన్ని, కథా శతకములుకొన్ని, హేళన శతకములుకొన్ని, నీతి శతకములు కొన్నియు ఉన్నట్లు స్థూలముగా వర్గీకరింపవచ్చును. సూక్ష్మవిచారణమీద మఱికొన్ని వర్గములును తేలవచ్చును. శతకమునకు యథార్థముగా సంఖ్యానియమము ఉండదగియున్నను, ఆ నియమమును ఉల్లంఘించియు శతకములనిపించుకొన్న పద్య సంపుటములును కొన్నికలవు. వేమన పద్యములట్టివి. దక్షిణాంధ్రమున కుప్పతిప్పలుగా కావ్యములు వెలయు రోజులలో ఉత్తరాంధ్రము కేవలము బీడువడిపోయెనా అను సందేహమును నివృత్తి చేసినవాడు వేమనయోగి. ఈ మహాపురుషుడు శతక కవులలో చేరదగినవాడు. శాస్త్రాభ్యాసము, ఉపనిషత్ శ్రవణము మొదలగు సాంప్రదాయక సాధనము లేకుండగనే స్వయంకృషివలనను, గురూపదేశముచేతను యోగసిద్ధిబొందిన ప్రతిభాశాలి. శాస్త్రజ్ఞానరహితమైన ఆత్మజ్ఞానమెట్లు సంపాదించెనో, పాండిత్య రహితమైన పద్యరచనాశక్తిని అట్లే సంపాదించెను. ఆ రెండుశక్తులు ఆ ప్రకృతికి నిసర్గములు. ఈ పద్యములలో ప్రతిపంక్తియందును అమోఘమైన అంతఃకరణశుద్ధి జీవనాడివలె స్పందించుచుండును. తన ఆశయములను నిర్భయముగా, నిర్దయముగా వెలిబుచ్చుటలో ఈ యోగి ఈశ్వరునకును వెఱవలేదు. లోకము తన్ను కవిగా అంగీకరింపవలెనని ఎన్నడును అపేక్షింపలేదు. కాని వ్రాసిన పద్యసమూహమంతయు లోకముకొఱకే, లోకభాషలోనే. ఆ శబ్దములన్నియు ప్రతికుటీరములోను వాడుకలోనున్నవే కాని గ్రంథములనుండి కొనితెచ్చినవికావు. ఏ శతకకర్తయు

ఇంత చక్కని వాడుక భాషలో ఇంత లక్ష్యశుద్ధికలుగునట్లు నీత్యుపదేశము చేసినవాడు లేడు. మఱి తిక్కనకు కంద పద్యమువలె, శ్రీనాథునకు సీసమువలె వేమనకు ఆటవెలది కైంకర్యముచేసినది. నా ఉద్దేశములో ఆ పద్యసంపుటిని వేమన కవిత్వమనుటకంటె వేమన సుభాషితములనుటమేలు.

నేను ఉత్తమోత్తమములుగా భావించిన ఇతర శతకములలో ముఖ్యమైనవి ఇవి :—వృషాధిపశతకము, సర్వేశ్వర శతకము, నారాయణ శతకము, ధాశరథి శతకము, శ్రీ కాళహస్తీశ్వర శతకము, ఆంధ్రనాయక శతకము, ఇందు శతకము, సింహాద్రి నారసింహ శతకము.

## ఆధునికయుగము 1875.

పూర్వయుగముల యందువలెనే, ఈయుగమునందును, ప్రాచీన లక్షణముగల సాహిత్యము కొంతయు, కేవలనవీన లక్షణములుగల సాహిత్యము కొంతయుకలదు. కాని మొత్తమువిూద చూచినచో, పూర్వరూపముననున్న దానికంటె నవ్యరూపముననున్న వాఙ్మయమే ఎక్కువని చెప్ప వలయును. ఇందుచే కాలమునుబట్టి దీనిని ఆధునిక యుగమన్నను గుణమునుబట్టి నవ్యయుగమన జెల్లును. ఈ యుగమున పూర్వమార్గము ననుసరించినవారిలో ఆద్యుడు గోపినాథుని వేంకటకవి. తొల్లింటి రామాయణములన్నియు యథామూలములు కావని ఈ కవి మరల వాల్మీకి రామాయణమును మూలవిధేయముగా తెలిగించెను. ఈయనవలెనే మఱికొన్ని పురాణేతిహాసములను ఇటీవల తెలిగించిన మహాకవులు మఱికొందఱుకలరు. వారిలో దాసు శ్రీరాములు పంతులుగారు, తిరుపతివేంకటేశ్వరులు, త్రిపురానన తమ్మయ దొర, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, వావిలకొలను సుబ్బారావుగారు, జనమంచి శేషాద్రి శర్మగారు ముఖ్యులు. ఈ పురాణములతోపాటు ప్రాచీనధోరణిని మఱికొన్ని ప్రబంధములు వ్రాసినవారును కలరు. వారిలో చాలా మంది, క్షీణయుగ ప్రబంధములకు పుత్త్రికలనో పుత్త్రికాపుత్త్రికలనో అవతరింపచేసినవారే. స్వతంత్రసృష్టి చేసినవారు తక్కువ. పూర్వపక్కిని ప్రబంధములు వ్రాసియు వానికి నూతనత్వము నాపాదించిన కవులు తిరుపతి వేంకటేశ్వరులు. వీరిదయవలన ప్రబంధభారతికి నిగళబంధములుతొలగి స్వేచ్ఛాసంచారము లభించినది. అందుచేతనే ఈ మహాకవుల వాక్కు ప్రాచీన సరణికి భరతవాక్యము నవీనసరణికి నాందీ వాక్యము అని పూర్వమొకప్పుడు నేనంటిని.

క్రొత్త పోకడలలో పేర్కొనదగిన ప్రక్రియలు ముఖ్యముగా మూడున్నవి. ఒకటి వచనము, రెండు నాటకము, మూడు భావకవిత్వము. నవీనవచన గంగావతరణమునకు చిన్నయసూరి భగీరథునివంటివాడు. దాని నానాముఖప్రతిహతప్రవాహగతికి హేతుభూతుడు వీరేశలింగము పంతులుగారు. ఒక్క కథానికతప్ప తక్కిన అన్నివచనమార్గములను వీరేశలింగముగారే నిర్దేశించిరి. నవల, విమర్శము, జీవితచరిత్రము, వ్యాసము, ప్రహసనము—ఇది యది అననేల వచనవాఙ్మయమున ఎన్నిభేదములుండునో అన్నిటిని సృష్టించి, దానిని సర్వభోగ్యమైన సంపదగా పంతులుగారు వెదజల్లిరి. తెలుగులో మొదటినవలయగు వీరి రాజశేఖర చరిత్రము ఆంగ్లమున అనువదింపబడి ఇంగ్లీషువారిచే మిక్కిలి కొనియాడబడినది. ఆంధ్రులకిది గర్వపదము కాదా! గురువు తీసినదారినే మఱికొన్ని సాంఘికనవలలు వ్రాసినకవి చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. వీరి శైలిలో వీరేశలింగముగారి శైలిలోగల సారళ్యముతోపాటు దానికి లేని సౌకుమార్యముకూడ నున్నది. మృదుల హాస్యము ఆ రెండిటికి వన్నెపెట్టినది. ఆ తరువాత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి చేతిలో సాంఘిక నవల సిద్ధిపొందినది. మాలపల్లి లోని అర్థగాంభీర్యము, భాషా స్వాభావికత, నూత్నధర్మప్రతిపాదనము మఱి యేతెలుగునవల యందును లేవు. చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు చారిత్రక నవలకు గురువులు. హేమలత వారి ప్రథమచారిత్రకనవల. దాని ఇతివృత్తము రాజపుత్త్రస్థాన సంబంధి. ఆంధ్రచరిత్రపరముగ వీరు ఒక నవలనైనను వ్రాయకపోవుట శోచనీయము. కేతవరపు వేంకటశాస్త్రిగారి రాయచూరు ముట్టడి, దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారి విజయనగర సామ్రాజ్యము, వేంకటపార్వతీశ్వరకవుల ప్రమదావనము మొదలైనవి కొన్ని దేశీయచరిత్రపరమైనవి కలవు. వేంకటపార్వతీశ్వరకవుల శైలి కావ్యశైలివలె ఆలంకారికమై, నవలకు ‘తేలికరచన’ అనెడి నిందను తొలగించినది.

విమర్శమనెడి పేరువిూద ఈ కాలమున మొట్టమొదట కొంత శాబ్దికచర్చ జరిగినది. అప్పుడప్పుడే ముద్రితములగుచున్న పూర్వగ్రంథములయు నూత్న గ్రంథములయు పఠనము విరివిగా సాగుటవలన, పండితులాగ్రంథములలోని శబ్దములయొక్క సాధుత్వాసాధుత్వములను చర్చించుచు, పత్రికలలో వ్రాతలు సాగించిరి. అప్పుడప్పుడే వెలువడు

టకు మొదలిడిన పత్రికలు ఆ చర్చలకు కొంతదోహద మొసగినవి. ఆ పండితులలో కొందఱు సత్యాన్వేషణ తత్పరులును, కొందఱు దోషైకదృక్కులును గలరు. ఉభయులచర్చలును శాబ్దికములే. ఆ వాగ్యుద్ధమున పాల్గొన్న యోధులలో వీరేశలింగముగారు ఒకరు. కాని వారిదృష్టి, ఆ చర్చలకంటె వేఱొకట నిల్చియుండుటచే, ఆవాదముల కంతప్రాధాన్యమీయక వేఱువిషయములనుగూర్చి పరిశోధనలుచేసిరి. కవులచరిత్ర ఆ పరిశోధనల ఫలము. ఆ గ్రంథమే మనచారిత్రక విమర్శనకు మూలభూతమైనది. కాని దానిప్రాధాన్యమంతయు కాలనిర్ణయాత్మకము మాత్రమే యగుటచే కేవలవిమర్శగ్రంథము కాలేకపోయినది. గ్రంథములగూర్చిన విమర్శ వాక్యములు ఎడనెడ ఒకటి రెండున్నను అవి ప్రసంగవశమున చెప్పినవి మాత్రమే. ఇటీవల బయలుదేరిన వాఙ్మయ చరిత్రలకును, శృంగార శ్రీనాథాది ప్రత్యేకకవి చరిత్రలకును వీరేశలింగముగారి కవులచరిత్రయే ఒరవడిపెట్టినది. పూర్వగ్రంథము లచ్చుపడుట కారంభించినదాదిగ, ఆయాగ్రంథముల పీఠికల రూపమున, ఏదోకొంత విమర్శవాఙ్మయము వృద్ధిపొందుచునే వచ్చినది. మనకు పాశ్చాత్యులపద్ధతి ననుసరించి బహిరాధారములనుబట్టి కాక, వస్తుతత్వమునుబట్టి, సహృదయ విమర్శనము ప్రారంభించినవారు కట్టమంచి రామలింగారెడ్డిగారు. కళాపూర్ణోదయమును నిమిత్తమాత్రముగ చేసికొని, కవిత్వతత్త్వవిచారములోవారు సాహిత్య మూలధర్మములను పెక్కింటిని ప్రతిపాదించిరి. వీరేశలింగముగారు దారి చూపనిది, కేవల నవ్యకవులు ప్రారంభించినది 'కథానిక'. నవ్యకవులలో పెక్కురు వీనిని వ్రాయగలసమర్థులే. నానాముఖముల వెలువడుచున్న, దిన—వార—పక్ష—మాస పత్రికలు ఈ కథలకును, ఈ కథలు ఆ పత్రికలకును పరస్పర పోషకములుగా నున్నవి. ఈ పత్రికలే నానావిధ వ్యాసముల ప్రకటించి, ప్రజలలో కలిగిన విద్యాతృష్ణనుతీర్చి, వారిని విజ్ఞానవంతులుగ చేయుచున్నవి. నేటి ఆంధ్రాభ్యుదయమునకు ఈ పత్రిక లొసగినతోడ్పాటు ఇంతింత కాదు. పత్రికాసంపాదకులలో కృష్ణాపత్రికాధిపతి ముట్నూరి కృష్ణారావుగారి వ్యాసరచనాపటిమ అనన్యసామాన్యము.

ధార్వాడ కంపెనీ ఈ దేశమునకు రాకపూర్వము, మనకు యక్షగానములేకాని మార్గనాటకములున్నట్లు కానరాదు. నాటినుండియే అట్టివి వ్రాయవలయు ననుతలంపు కవులకును, ఆడవలెనను తలంపు నటులకును కలిగినదట. ఆ ఉత్సాహములో మొదట కేవలగద్యనాటకములే వెలసినవి. పిమ్మట క్రమముగా స్వతంత్రములు, అనువాదములు, అనుసరణములు అవతరించి, నాటకవాఙ్మయశాఖకు చాల పెంపు కలిగించినవి. ఈ పెంపునకు కారకులైన వారిలో ముఖ్యులు—వీరేశలింగముగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, పానుగంటి లక్ష్మీనరసింహముగారు, ధర్మవరం కృష్ణమాచార్యులుగారు, కోలాచల శ్రీనివాసరావుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, తిరుపతి వేంకటేశ్వరులు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, 'గురజాడ అప్పారావుగారు. ఈ కవులువ్రాసిన నాటకములు అన్నిగాని, కొన్నిగాని రంగమునరాణించి, సారస్వతమున స్థానము దక్కించుకొన్నవి.

ఈరీతిని నవ్యసాహిత్యము శాఖోపశాఖలై పలువిధముల నలుదెసల విస్తరిల్లుచుండగా, ఆ పేరు ఉచ్చరించినంతనే కొందఱకు భావకవిత్వమనియే మనస్సునస్ఫురించుట కేమి హేతువో నాకర్థముకాలేదు. ఈ విషయమై లేనిపోని వివాదము లిదివరకే చాల పెఱిగినవి. వివాదములదారిని వివాదములు పోవుచుండగా, భావకవిత్వము దారిని భావ



కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి, సూతపురాణకర్త. గుడివాడలో గజారోహణోత్సవము, కవి సన్మానము పొందిరి.

కవిత్వము పుట్టుచునేయున్నది. సాధువో అసాధువో ఈ శబ్దము రూఢమును అయినది. దీనిలో ఏ గుణవిశేష మునులేకున్న ఇంతమంది వ్రాయుటయు ఇంతమంది ఆమోదించుటయు జరుగనేజరుగదుకదా! ఆంధ్ర సాహిత్య పరిషత్తువంటి మహాసంస్థలు ప్రాచీన సాహిత్య రక్షణార్థమై పాటుపడుచున్నట్లే, నవ్యసాహిత్యపరిషత్తు మొదలైన సంస్థలు ఈ నవీన కవిత్వరక్షణార్థము పాటుపడుచున్నవి. ఏ పేరున పిల్చిననేమి; ఇంతనిరూఢమైన వస్తువునకు ఈ యుగములో అర్హస్థానమీయకతప్పదు. ఈజాతి కవిత్వ మంతయు గుణవంతమే అని నేననను. తిరస్కారార్హ మైనది చాలకలదు. పురస్కారార్హమైనదియు కొంతకలదు. ఈ విభేదము అన్ని యుగముల సాహిత్యమునందును ఉండును. ఆయాకాలములలో తేజోహీనములై నరచనలు అర్థాయుష్యములై అస్తమించిపోగా, ప్రాణవంతములై నిలిచినవే ప్రాచీనకవిత్వ మనుపేర మనకు పఠనీయములై నెగడుచున్నవి. ఈ కవిత్వములోను జీవముగలది మాత్రమే నిలిచి, భావికాలమువారికి ప్రాచీనకవిత్వముగా పూజార్హ మగుననుటకు సందియములేదు. ఇక దీనినిగూర్చి ఎంత తక్కువచెప్పిన అంతమేలు.

కాలప్రభావముచేత నైననేమి, పాశ్చాత్య సభ్యతా సంపర్కము చేత నైననేమి మనజాతికి కలిగిన జాతీయతా ప్రబోధమున కనుగుణముగా ఆంధ్రభాషావిహారభూమియు నానాటికి విశాలమగుచున్నది. చరిత్ర సంబంధములు, ప్రకృతి శాస్త్ర విజ్ఞానాత్మకములు, ఆర్థిక రాజకీయ సాంఘి కాది సూత్రప్రతిపాదకములు, మఱి యితరములు అయిన రచనలు వ్యాసములుగా గ్రంథములుగా అనుదినము పుట్టుచు, ప్రజాబాహుళ్యమునకు చక్కని చిత్తసంస్కారమును కలిగించుచున్నవి. ఈ భాగమంతయు సాహిత్యము కాక పోయినను లోకమునకు కవిత్వముకంటె ఎక్కువ ఉపకృతినే చేయుచున్నవి. ఆ రచయితలు కవులుకాకున్నను, ప్రజలకు కవులకంటె ఎక్కువ గురుత్వమునే చేయుచున్నారు. వారి కృషివలన తెలుగుభాష కవిత్వమునకు దక్క ఇంకెందుకును అక్కఱరాదన్న నింద తొలగిపోవుచున్నది. వారి తపము ఫలించి, ఈ భాష సమస్తజ్ఞానవిజ్ఞానాభివ్యక్తికి పరమ ద్రవ్యముగా పరిణమింపగల శుభముహూర్తము వచ్చుచున్నది. వేచియుండుడు!



మహిమన్ వాగనుశాసనుండు సృజియింపం, గుండలీంద్రుండు దన్
మహనీయస్థితిమూలమై నిలువ, శ్రీనాథుండు ప్రోవన్, మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించునీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్

—రామరాజభూషణుడు.

రెండవ ప్రకరణము

# సాహిత్యానుబంధములు 1–6

డాక్టరు గిడుగు వేంకట సీతాపతి, బి.ఎ.,ఎల్.టి.

## 1. నవ్యసాహిత్యము

విషయ సంగ్రహము :— ఆధునిక వాఙ్మయమందలి ఒక విశిష్టమైన శాఖ; నవ్యసాహిత్య లక్షణములు; పద్య రచనకు కవితాకళ ప్రధానమైనది; ఖండకావ్యమందాదరము; ప్రాచీన కావ్యలక్షణములు సంప్రదాయము, యథోచితాను సరణములు; వ్యావహారికభాషగద్యకు తప్పకుండాను, పద్యరచనకు యథాసాధ్యంగాను; గిడుగు రామమూర్తిగారి కృషిఫలము; సాహితీసమితి; నవ్య సాహిత్య పరిషత్తు; గురజాడ అప్పారావు గారు నవ్యసాహిత్య పితామహులు; రాయప్రోలు సుబ్బారావు గారు అభినవ కవితామండలి స్థాపకులు; వేంకట పార్వతీశ్వర కవులు నవీనయుగ సంధిలోని జంట కవులు; తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారు నవ్య కవిత్వయుగ స్థాపకులు; విశ్వనాథ సత్యనారాయణగారు నవ్యసాహిత్యసౌధ గోపురనిర్మాతలు; బసవరాజు అప్పారావుగారు; దువ్వూరి రామిరెడ్డిగారు; దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు; నండూరి వెంకటసుబ్బారావుగారు; వేదుల సత్యనారాయణశాస్త్రిగారు; నాయని సుబ్బారావుగారు; అడవి బాపిరాజుగారు; రామచంద్ర అప్పారావుగారు; పింగళి లక్ష్మీకాంతంగారు; కాటూరి వేంకటేశ్వరరావుగారు; అబ్బూరి రామకృష్ణారావుగారు; మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు; వేటూరి ప్రభాకర శాస్త్రిగారు; కవికొండల వేంకటరావుగారు; పెనుమర్తి వెంకటరత్నంగారు; కొడాలి ఆంజనేయులుగారు; నోరి నరసింహశాస్త్రిగారు; శ్రీరంగం శ్రీనివాసరావుగారు; మల్లవరపు విశ్వేశ్వరరావుగారు; ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు; భోగరాజు నారాయణమూర్తిగారు; మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు; కొడవటిగంటి వేంకటసుబ్బయ్యగారు; బొడ్డు బాపిరాజుగారు; చింతాదీక్షితులుగారు; చిలుకూరి నారాయణరావుగారు; యనమండ్ర నారాయణమూర్తిగారు; శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు; అక్కిరాజు ఉమాకాన్తముగారు మొ॥వారు; అతివాస్తవిక కవిత: పిఠాపురం యువరాజాగారు; శ్రీ రంగం నారాయణబాబుగారు; జానపదగీతాలు రచించినవారు: ఉన్నవ లక్ష్మీనారాయణగారు. గరిమెళ్ల సత్యనారాయణగారు, కొండపల్లి జగన్నాథదాసుగారు మొ॥వారు, ఇతరులనేకులు—

ఆధునిక వాఙ్మయమందు నవ్యసాహిత్యమొక విశిష్టమైన శాఖ. దీని లక్షణము సూత్రప్రాయంగా నిర్వచింపలేము గాని, దీని ప్రత్యేకతకు సంబంధించిన విషయములు దిఙ్మాత్రసూచనగా చెప్పగలము.

నవ్యసాహిత్యములో పద్యరచనలూ, చిన్నచిన్న కథలు, పెద్దపెద్ద నవలలు, లేఖలు, వ్యాసములు, జీవిత చరిత్రలు, దేశచరిత్రలు మొదలయిన గద్య రచనలూ ఉన్నవి. పద్య రచనలలో పద్యములు, పాటలు, గేయములు కలవు. అయితే ఇందున్న విశిష్టలక్షణమేమనగా ప్రాచీన సాహిత్యములో కవితా చతురత, కవిత్వకళా సౌందర్యములేని విషయములు సైతము పద్యములో చెప్పడ మాచారముగా ఉండేది. అట్టి విషయముల కీనవ్యసాహిత్యమందు గద్యరచనలలోనే కాని పద్య రచనలలో అవకాశములేదు. అందుచేత, అనేకముగా పద్యములుగల భారతము, స్కంధములుగల భాగవతము, ఆశ్వాసములుగల పురాణములు, ప్రబంధములువంటి పెద్ద కావ్యములు ఈ నవ్యసాహిత్యములో కనబడవు. ఇందు చాటువులవంటి పద్యములకు, ఖండకావ్యములకు ప్రవేశము కలదు. ఖండకావ్యరచన నూతన సృష్టికాదు. భారత మందలి నలచరిత్ర, సావిత్రికథ, కృష్ణరాయబారము మొదలయిన ఉపాఖ్యానములు, భాగములు, ఇంకా ఇతర కావ్యములలోగల ఇటువంటి కథలు మొదలయిన భాగములు ఖండ కావ్యములే అనవచ్చును. వాటివలెనే ఏదైనా ఒక కథగాని, ఒక విషయముగాని, ఒక భావముగాని ఎత్తుకొని మొదటనుండి కొనవరకు కవిత్వకళను పోషిస్తూ ఖండ కావ్యము రచించడమే నవ్యసాహిత్యపరుల ఆశయము. ఆంగ్లసారస్వత పరిచయముగల యువకులు కొలదిపాటి

నవ్యసాహిత్య లక్షణము

పద్యసంఖ్యగల చిన్నచిన్న కావ్యములను ఆంగ్లపద్యావళి పద్ధతిని రచిస్తున్నారు. ఇవి ఋగ్వేదమందలి సూక్తిరచనల వంటివి. కథావస్తు విషయములోను, నాయికా నాయకాది పాత్రనిర్ణయములోను, ఇతర కావ్యలక్షణములలోను ప్రాచీన లాక్షణికులు, ఆలంకారికులు చెప్పిన లక్షణములు యథోచితముగానే కాని విధిగా ననుసరించవలెనన్న నిర్బంధము నవ్యసాహిత్యపరులకు లేదు. అష్టాదశవర్ణనలు, చతుర్విధనాయకులు, అష్టవిధనాయికలు, నఖశిఖపర్యంతముగల స్త్రీ సౌందర్యవర్ణన, అసభ్య శృంగారభావములు, బంధకవిత్వము మొదలయిన గారడీవిద్యలుగల కవిత్వము నవ్యసాహిత్యపరుల కనిష్టములు. అయితే, నవ్యసాహిత్య కావ్యములలో స్వేచ్ఛాప్రణయ సిద్ధాంతభావములు, అసభ్యమనదగిన విప్రలంభ శృంగారవర్ణనలు కనబడుతున్నవి. గాని, వీటినిగురించి విమర్శలు జరుగుతున్నవి; కొంత సంస్కరణము కూడా కలుగుతున్నది. కావ్యరచనలో కవికి ముఖ్యధర్మము కావ్యకళా సౌందర్యమును పోషించడమేకాని నీతిని బోధించడము కాదు; గనుక కవి నీతినీ బోధించడు, అవి నీతినీ బోధించదు. నీతిని బోధించుటకే ఉద్దిష్టమైన గ్రంథములు వేరే ఉండవచ్చునే కాని కావ్యకళా ప్రధానములైన రచనలలో నీతి విషయము పాటించరాదని నేటి నవ్యసాహిత్యపరులందురు. తమ ప్రత్యేకవ్యక్తి జీవితమందున్ను, తమ సంఘ జీవితమందున్ను, తమ దేశ పరిస్థితులందున్నుగల వివిధ సమస్యలకున్ను సంబంధించిన ఆవేశము, అభిమానము, ఆదర్శములు, ఆశయములు, సుఖదుఃఖములుగల అనుభవములు తమ్మెట్లు చలింపజేస్తున్నదో కథలలోను, నాటకాలలోను, పద్యాలలోను, చిన్నచిన్న కావ్యాలలోను నేటి నవ్యసాహిత్య రచయితలు తమ కళానైపుణ్యము చూపిస్తూ వ్యక్తపరుస్తున్నారు.

భాష విషయములో గద్యరచనంతా నేటివాడుక భాషలోనే సాగవలెనన్న ఆశయము నవ్యసాహిత్యపరులందరికీ కలదు. పద్య రచనలలో మాత్రము ప్రాచీనకావ్యభాషే ఎక్కువగా వాడుచున్నారు. అందుకు ముఖ్యమైన కారణము వాడుకభాషలో కవితసాగించే అభ్యాసము ఇంకా పూర్తిగా కుదరకపోవడమనే చెప్పవలెను. ఇప్పుడిప్పుడు గేయాలు పూర్తిగానో, ఎక్కువగానో వాడుకభాషలోనే సాగుతున్నవి. ప్రాచీన కావ్యభాషలో రచనసాగించుటకు అలవాటుపడియున్న కవులు నవ్యసాహిత్యపరులే అయినా భాషా విషయములోమాత్రము ప్రాచీన సంప్రదాయానుసారులుగానే ఉన్నారు. నవ్యసాహిత్య పరిషత్ పత్రికయైన 'ప్రతిభ' ప్రకటించడానికి ప్రారంభించినప్పుడు మొట్టమొదటి సంచికలో సంపాదకీయవిజ్ఞాపనము లందుగల వాక్యములు కొన్ని ఈ దిగువ నుదాహరిస్తున్నాను. వాటిని బట్టి భాషా విషయములో నవ్యసాహిత్యము వారికిగల ఆశయములు తెలియగలవు. "...వచన వాఙ్మయమూ, సాధ్యమయినంతవరకు పద్య వాఙ్మయమున్ను ప్రజలకు సుపరిచితమయిన వ్యావహారికభాషలో నిర్మించి అందు మూలముగా ప్రజలలో విజ్ఞానము వ్యాపింపజేయడమూ — ఇవి సదుద్దేశములు.

**వ్యావహారికాంధ్రభాషాశయము**

ఈ పత్రికకు వ్యాసములు వ్రాసే వారికి ఒకసూచన చేయదలచుకొన్నాము. భాష, ఏయే మండలాలలో ఏయే భేదములతో వాడుకలో ఉన్నదో తెలుసుకొనడము అభినవాంధ్ర భాషా పాండిత్యలక్షణములలో ఒకటిగదా! ఈ జ్ఞానము ప్రాచీన భాషాపాండిత్యానికి, ఆ కాలములోని మాండలిక భేదాలను నిరూపించడానికికూడా కొంతవరకు తోడ్పడుతుంది. అందువల్ల రచయితలు తమ మండలములలో వ్యవహారములో ఉన్న రూపములు, వ్యక్తిగతమయిన ఉచ్చారణకు సంబంధించినవిగాక, సమిష్టిమీద ప్రజల వ్యవహారములో ఉన్నవి తమ వ్యాసములలో ప్రయోగించవలెనని కోరుతున్నాము. ఈ విషయము గమనించవలసినదని రాయలసీమవారికీ ముల్కినాటివారికీ ప్రత్యేకముగా మనవి చేస్తున్నాము. వారి వ్యావహారికభాష సర్కారులవారు నేర్చుకొనడము విధి అయి ఉన్నది. తెలుగు వాఙ్మయములో మూడువంతులు రాయలసీమలో ఉత్పన్నమయినదే కదా! గ్రంథములలో మనను చదివేభాష రాయలసీమ భాషే కనుక, ఆ గ్రాంధికభాషా పరిణామము నేటిభాషలో ఎట్లున్నదో తెలుసుకోవలెనంటే రాయలసీమలోని వాడుక భాష నేర్చుకోవలెను. నేటిభాషా విషయములో వారికీ మనకూ సన్నిహితత్వము కలిగేటట్లు చేసుకొంటే, భాష ద్వారా ఇతర విషయములలో వారికీ మనకూ భిన్నత్వముంటే అది తొలగిపోయి పొత్తు కుదురుతుంది.

ఈ పరిషత్తు నవ్యవాఙ్మయప్రియులకూ, నవ్యసాహిత్య రచయితలకూ—అందులో అన్ని సమాజముల వారికీ, సమితులవారికీ—చెందిన కేంద్రసంస్థ. భిన్నత్వ

ములో ఏకత్వము సమకూర్చడము ఇది నిర్వహించవలసిన పని. భాషాసేవ, దాని మూలముగా దేశసేవ దీని ఉద్దేశములు. అందువల్ల ఈ పత్రికా, ఈ పరిషత్తూ భాషాభిమానుల కందరికీ ఆదరపాత్రము అగునుగాక" అని పత్రికా సంపాదకులైన శ్రీ తెలికిచెర్ల వేంకటరత్నంగారు వ్రాసినారు.

**కీ. శే. గిడుగు వెంకట రామమూర్తి పంతులు గారి కృషి ఫలము**

ఈ నవ్యసాహిత్యము వికసించుటకు కీ. శే. గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి అనన్యసామాన్యమైన ఆంధ్రభాషాకృషి, వ్యావహారికభాషా ప్రయోజన నిరూపణము ప్రధానకారణములయినవి. వ్యవహారభ్రష్టమైన ప్రాచీనభాషకన్న వ్యవహారసిద్ధమైయున్న నేటి తెలుగు భాషలో గ్రంథరచన సాగించవలెనని వీరు కావించిన వాదము 1908—1909 లో మొదట బయలుదేరినది. ఆరంభములో వీరివాదన నంగీకరించినవారు పట్టుమని పదిమందియైనాలేరు. 1912 వ సం॥ నాటికి విద్యావంతులలో ఏబదిమందిచేరినారు. 1915 లో రామమూర్తి పంతులుగారు తమ వాదము నుగురించి రాజమహేంద్రవరమందు ఒక బహిరంగసభలో ఉపన్యసించినప్పుడు ఆ సభ్యులలో అయిదుగురు తప్ప తక్కినవారందరును వారి వాదమునకు వ్యతిరిక్తులుగానే ఉండిరి. కొందరు వారిని అవమానించడానికికూడా పూనుకొన్నారు. 1916 లో కొవ్వూరిలో జరిగిన ఆంధ్రమహాసభయందు వీరి వాదము సభాసమ్మతమైనది. అప్పుడు వీరి ఉపన్యాసమును విన్న వీరేశలింగముగారు 1919 నాటికి వీరికితోడై, రాజమహేంద్రవరములో స్థాపించిన వ్యావహారికభాషా ప్రవర్తక సమాజమునకు అధ్యక్షులై నేటి వ్యవహారమందున్న ఆంధ్రభాషకు వ్యాకరణము రచించుటకు సంకల్పించిరిగాని, ఆపని వారు ప్రారంభించుటకు పూర్వమే పరమపదించిరి. ఆ పని సాగించుటకు రామమూర్తి పంతులుగారు అన్ని విధములా సమర్థులయినా, ప్రాచీన సంప్రదాయముల ననుసరించి పండితులై ఉన్నవారిచేతనే ఈ పని సాగించవలెనన్న సంకల్పముతో నుండుటచేత, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆ పనికి పూనుకొని, ప్రాచీనాంధ్ర వ్యాకరణసూత్రములకు విరుద్ధములయినా శిష్టజన వ్యవహారసిద్ధమైన భాషను గ్రహించిన మహాకవుల ప్రయోగముల నెత్తుకొని ఆంధ్రభాషానుశాసనమును రచించినారు. అందుకు కావలసిన ప్రయోగసామగ్రి శాస్త్రిగారికి పంతులుగారు అందజేసినారు. 1920 నాటికి పంతులుగారివాదము దేశమందంతటను వ్యాపించినది. వాడుకభాషలో అన్ని విధములయిన గద్యరచనా సాగుటకు ప్రారంభించినది. వీరి వాదము ఫలోన్ముఖమునకు రావడానికి కాంగ్రెస్ జాతీయోద్యమము ఎక్కువగా తోడుపడినది. జాతీయగీతాలు ప్రచారములోనికివచ్చి ఫలముపొందడానికి వాడుకభాషే ఉపచరిస్తుంది గనుక జాతీయగీతాలు, జానపదగీతాలు మొదలయినవన్నీ వాడుకభాషలో సాగినవి. వాటిలో శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారు రచించిన "మాకొద్దు ఈ తెల్ల దొరతనము" అనేపాట ఆంధ్రదేశమంతా అల్లుకొనిపోయినది. కవితాశక్తి కలిగిన్నీ ప్రాచీనభాషాలక్షణము తెలియక పోవుటవల్ల రచన సాగించలేక ఆవేశపూరితులై ఆందోళనపడుతున్న యువకులకు పంతులుగారివాదము అమితమైన ఉత్సాహము, ధైర్యము, నూతనశక్తి కలిగించినవి. అదివర కప్పుడే ప్రారంభమైన నవ్యసాహిత్యరచన కవితా ఫక్కిలోనేకాక భాషా విషయములో సైతము నూతన మార్గములను త్రొక్కుటకు ప్రారంభించినది.

నవ్యసాహిత్య పితామహులు.



కీ. శే. శ్రీ గురజాడ అప్పారావు, బి.ఏ.

ఆ రోజులలోనే తెనాలిలో సాహితీ సమితి ఏర్పడినది. సమితివారు సాహితీపత్రిక సైతము నెలకొల్పి నవ్యసాహిత్య రచనలకు తగినంత అవకాశము, ప్రోత్సాహము కలుగజేసినారు.

పిమ్మట నవ్యసాహిత్య పరిషత్తు గుంటూరులో ఏర్పడినది. దీనికి శ్రీ తెలికిచెర్ల వేంకటరత్నముగారు కార్యదర్శులే కాదు, ప్రాణమే అని చెప్పవలెను. స్వార్థపరతలేక అనేక నష్టకష్టములకోర్చి కేవలము నవ్యసాహిత్యాభివృద్ధి కోసము ఈ పరిషత్తును, పరిషత్తుకు అనుబంధముగా ప్రతిభ అనే పత్రికను నడపుతూవస్తున్నారు. 1933 లో ఈ పరిషత్తు వారు రాజమహేంద్రవరమున వ్యావహారికాంధ్రభాషా ప్రవర్తకాగ్రేసరులయిన గిడుగు వేంకటరామమూర్తి పంతులు గారి సప్తతితమ మహోత్సవము జరిపి, పంతులుగారి రచనలలో వ్యాసావళి, బాలకవిశరణ్యము, పండితభిషక్కుల భాషాభేషజము, ఆంధ్రగద్య చింతామణి అనే గ్రంథము లున్ను, వారికి కానుకగా పండితులు, విద్వాంసులు సమర్పించిన వ్యాసములుగల వ్యాససంగ్రహమున్ను పరిషత్తువారి దక్షతను ప్రకటించినారు. ఇందు బాలకవిశరణ్యరచనలో తండ్రిగారికి తోడుపడిన శ్రీ సీతాపతిగారు బాలకవి శరణ్యమందలి ప్రధాన విషయములను, ప్రయోగములను ఎత్తుకొని రచించిన భారతీశతకమును సైతము ప్రకటించినారు. ఈ నవ్యసాహిత్యపరిషత్తువారి ప్రకటనలు నేటికి సుమారు నూరున్నవి. పరిషత్తుతో సంబంధముగలవారు వేయికి పైగాగలరు. ఆమోదకులు ఆంధ్రదేశమందంతటను వ్యాపించియున్నారు. నవ్యసాహిత్య రచనలుసాగిస్తూఉన్న వారు దేశములో వేలకొలదిగా ఉన్నారు. అందులో ముఖ్యమైనవారి విషయము సంగ్రహించి తెలియజేస్తున్నాము. ఈ దిగువ వివరించినవారి పేర్లవరస రచన విషయములో వారి తారతమ్యములను నిర్ణయించి చేసినది కాదు. ఏదో విషయక్రమమును, ప్రక్రమ సౌలభ్యమును మాత్రమేపాటించి చేసినదని పాఠకులు గ్రహింతురుగాక !

కీ. శే. గురజాడ అప్పారావుగారు :— నవ్యసాహిత్యపితామహులే ; కాని వీరు తమ గేయములను రచించుటకు పూర్వమే నవ్యసాహిత్యకళ కొద్దిగా ఉదయమైనదన వచ్చును. అప్పారావుగారి కన్యాశుల్క నాటకము మొదటికూర్పు 1900సం॥కు పూర్వమే ప్రకటితమైనా అంతగా వ్యాప్తిలోనికి రాలేదు. గంజాం, విశాఖపట్టణము జిల్లాలలో మాత్రమే ప్రచారములోనికి వచ్చి పెక్కండ్ర ఆదరమును పొందినది. దీని ప్రతులు ఇప్పుడు దొరుకుటలేదు. ఆనందవాణిలో ఇటీవల తునకలుగా ముద్రించిరిగాని పుస్తకరూపకముగా ప్రకటించలేదు. 1909 లో ఈ నాటకం రెండవకూర్పు—ఇప్పుడు ప్రచారములో ఉన్నది—ప్రకటితమైనది. ఇది ఆంధ్రదేశమందంతటను వ్యాప్తిలోనికివచ్చి ఆంధ్రుల కాదరపాత్రమైనది. ఇటీవల కన్నడభాషలోనికి సైతము పరివర్తనము పొందినది. నవ్యసాహిత్యమందలి సాంఘిక నాటక రచనలకు మార్గదర్శకమైనది. కొందరు దీనిని అనుకరించి నాటకములను రచించినారుగాని ఈ విషయంలో ఎవరును అప్పారావుగారిని మించలేదు సరిగదా, సమానులైనను కాలేదని చెప్పవచ్చును. 1910 నుండిన్ని అప్పారావుగారి పద్యరచనలు త్రిలింగ మొదలయిన పత్రికలలో ప్రకటితములగుతూ వచ్చినవి. అదివరకప్పడే కొందరు ఖండకావ్యములను నూతనాశయములతో నవీన ఫక్కిని ప్రకటిస్తూ ఉండిరి. కీ. శే. ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు 'చందమామ' మొదలయిన ఖండకావ్యాలు తమ కల్పలతలో (1903-9) ప్రకటిస్తూ ఉండిరి. ఈ విధముగానే పోలవరం జమీందారులు కీ. శే. కొచ్చెర్లకోట కృష్ణారావు బహద్దరుగారు సంపాదకులుగా ప్రకటించిన సరస్వతీపత్రికలో (1903-9) సైతము నవ్యసాహిత్యరీతులుగల ఖండ కావ్యములు కనబడినవి. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు 1901 లో రచించి ప్రకటించిన 'ముసలమ్మమరణము'—విద్యార్థిదశలో రచించినది, కళాశాల బహుమానము పొందినది—నవ్య సాహిత్యములో చేరదగిన ఖండకావ్యమే. ఈ విధముగా ఇంకాకొన్ని కావ్యములు అప్పారావుగారి పద్యరచనలకుపూర్వమే రచితములయినా అప్పారావుగారి ముత్యాలసరముల వలె తక్కిన వేవీ నవయువకవులకు మార్గదర్శకములు కాలేదు. అంతేకాక, విజయనగరములో కీ. శే. గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి ప్రోత్సాహమున 1911 లో ఆంధ్రసాహిత్యసంఘము ఏర్పడినప్పుడే నవ్యసాహిత్యయుగము వికసించుట కారంభమైనదనవలెను. అందుచేత, అప్పారావుగారి ముత్యాలసరాలు, నీలగిరిపాటలు నవ్యసాహిత్యపు తొలి కృతులనుట కవకాశములేకపోలేదు.

1913 లో 'అభినవ కవితామండలి' అనే పేరితో

## వ్యావహారిక ఆంధ్రభాషా ప్రవక్తకులు



కళాప్రపూర్ణ, మహోపాధ్యాయ, రావుసాహేబ్.
కీ. శే. శ్రీ గిడుగు వేంకట రామమూర్తి పంతులు, బి.ఏ.

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు తమ చిన్న కావ్యాలు ప్రకటించారు. రచనలో ప్రాచీనఫక్కి, భావాలలో నవీనాశయములు, కవితా సంప్రదాయములలో అందరినీ మెప్పింపగలనేర్పు సుబ్బారావుగారికిగల దొడ్డ ప్రజ్ఞావిశేషము. ప్రాచీనాంధ్రౌన్నత్యమును, భావశోభను రెంటిని సమానముగా కనబరచగల ప్రౌఢకవి. వీరు అనువదించిన మధుశాల స్వతంత్ర కావ్యమువలెనే కనబడుతుంది. వీరి తృణకంకణము, కవితాంజలి, జడకుచ్చులు, ఆంధ్రావళి, తెనుగుతోట, రమ్యాలోకము మొ॥ రచనలలో ఏదిచూచినా సుబ్బారావుగారి ప్రత్యేకత, విశిష్టత గోచరిస్తవి. కథావస్తువులోను, ఆశయములలోను, కల్పనలోను నవ్యత దీపిస్తూ ఉంటుంది.

వేంకట పార్వతీశ్వరకవులు:— (బాలాంత్రపు వేంకటరావుగారు+ఓలేటి పార్వతీశంగారు) ఇరువురును ప్రాచీన నవీన యుగసంధిలోని జంటకవులు. నవ్యసాహిత్య కవులలో అనేకులకు ప్రత్యక్షంగానో పరోక్షంగానో గురువులు, మార్గదర్శకులు. వీరి 'ఏకాంతసేవ', దానికి ఉపోద్ఘాతంగా దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రచించిన పీఠిక ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు మొదలయిన నవ్యసాహిత్య యువకవులనుదయింపజేసినవి. వైష్ణవ గీతములలోని ప్రేమోన్మాదము, భక్త్యావేశము ఈ జంటకవుల కవిత నుద్దీపింపజేసినవి. వీరి కావ్యకుసుమావళి (2 భాగములు) హృద్యములైన పద్యములతో నిండియున్నవి. వీరి 'రత్నహారము' నవ్యసాహితి కర్పింపదగిన కానుక.

తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు :— నవ్యకవిత్వ యుగస్థాపకులు; నేటి యువకవులలో పెక్కండ్రకు ప్రత్యక్షం

గానో పరోక్షంగానో గురువులు, ప్రోత్సాహకులు. పాండిత్యంలో పెద్దలతోను, కవిత్వంలో యువకులతోను మైత్రి కుదుర్చుకోగల బహుభాషావిశారదులు, కవులు. ఒక ప్రియురాలికి ఒకగీతం, తాను మనసార ప్రేమించిన హృదయేశ్వరిపై తనవితీర నొక కావ్యం రచించి, తన ఆవేదనకు శాంతి కలుగజేసుకొనుటకు యత్నించిన లలితహృదయుడు. వీరి వకుళమాలిక, హృదయేశ్వరి, ఆవేదన మొదలయిన గేయములు; నీలకంఠం కథలు; దీక్షితదుహిత, సహజయానపంథీ మొదలయిన పెక్కు గీతినాటికలు వీరి కవితాధారను, వ్యుత్పన్నతను తెలియజేయగలవు.

విశ్వనాథ సత్యనారాయణగారు:-నవ్యసాహిత్య సౌధమునకు గోపురము నిర్మించిన మహాకవులు, పండితులు; అభినవ శ్రీనాథుడు మొ॥గు బిరుదములు పొందినవారు. వీరి కవితా సామర్థ్య మద్భుతమైనది. "ఛందోమయ సరస్వతీ మార్గాన్ని శతశః హృదయంతో విశ్వసించేవాడ"నని వీరు తమగురించి చెప్పినమాట సత్యము. ఆత్మ ప్రత్యయము, రచనలోను కల్పనలోను స్వతంత్రత, ఆంధ్రాభిమానము, ఆంధ్రీత్వములో గర్వము భాషలోను, భావాలలోను ప్రత్యక్షములు. వీరి ప్రయోగాలలో కొన్ని "నిరంకుశాః కవయః" అనే లక్షణానికి నిదర్శనములు. "గోదావరీ పావనోదారవాఃపూర"మని ఆంధ్ర పౌరుషమును గురించి రచించిన పద్యము, వేగిక్షేత్ర పద్యములు ఆంధ్ర యువకులకు ధ్యాన శ్లోకములవంటివి. ఎంత చిన్న విషయమైనా ప్రౌఢ కవిత్వమునకు తగిన వస్తువు కాగలదనుటకు వీరి మాగ నోము, అంధ భిక్షువు మొదలయినవి తార్కాణములు. వీరి రచన లనేకముగా కలవు. అందులో ఆంధ్ర ప్రశస్తి, కిన్నెరసానిపాటలు-కోకిలమ్మ పెళ్లి, గిరికుమారుని ప్రేమగీతాలు, వేయిపడగలు, చెలియలికట్ట అనే నవలలు ముఖ్యమైనవి.

కీ. శే. బసవరాజు అప్పారావుగారు :— నవ్య సాహిత్య కవులలో ఎక్కువగా ఆంధ్రుల హృదయములను ఆకర్షించిన కవి. 1914 నాటికే వీరున్ను, వీరి మిత్రులు అబ్బూరి రామకృష్ణా రావుగారున్ను తమ నవ్య కవితలను ప్రకటించుకొన్నారు. అప్పారావుగారి గేయాలన్నీ ఆవేశంతో పైకుబికినట్లుంటవి. ఆ ఆవేశం అవి చదివినవారికి విన్నవారికి కూడా కలిగించేటట్లుంటుంది వారి రచన. కొన్నింట ఎత్తుబడిలోనే గేయమంతటనుగల సొగసు కనబడుతుంది.

దువ్వూరి రామిరెడ్డిగారు :— పద్యరచనలో ప్రాచీన మార్గాన్నే అనుసరించినా ఆధునిక ఆంధ్ర జాతీయకు, ఆంధ్ర జీవితమునకు అనుగుణములయిన పోకడలు కల్పించి ఖండకావ్యములను రచించిన నవ్యసాహిత్య కవికోకిల. వీరి కృషీవలుడు, జలదాంగన, వనకుమారి, మధుశాల మొదలగు కావ్యములలో వీరి కవితాప్రతిభ కనబడుతుంది. వీరు వాస్తవముగా కవి కోకిల.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు :— కవిత్వమే పురుషార్థముగాను జీవిత పరమావధిగాను పెట్టుకొని, స్వేచ్ఛకై పరుగులెత్తు హృదయముతో ప్రేమగీతాలు, విరహగీతాలు, ఆనంద గీతాలు, దుఃఖగీతాలు పాడి, విన్నవారికి తమ మనోభావాలను పంచిపెట్టగల కవి చతురులు. వీరి కవితా ప్రాభవము నేటి యువకవులలో అనేకుల కవితయందు కనబడుతున్నది. ఏదో ఒక అపూర్వమైన భావము, ఒక చమత్కారము, ఒక మనోహరమైన వర్ణన వీరి గేయములలో ప్రతిగేయమందున్ను కనబడుతుంది. వీరి కృష్ణపక్షం, ప్రవాసము-ఊర్వశి, కన్నీరు, శ్రావణి, కార్తికి, మహతి ఆంధ్రుల ఆదరమును ఎక్కువగాపొందిన రచనలు.

నండూరి సుబ్బారావుగారు: —వీరి పేరు యెంకి పాటలతో ఆంధ్రలోకమందంతటా మారుమ్రోగుతూ ఉంటుంది. భావము, గంభీరమైనదేకానీ సున్నితమైనదేకానీ పామరవాక్కులో సూటిగా వ్యక్తపరచగల నిపుణులు. వాడుక భాషలోగల తీయందనము, నుడికారము వీరి రచనలో గోచరిస్తూ ఉంటుంది. వీరు తమ పాటలనుపాడి వినిపిస్తూ ఉంటే వీరిచూపు, వీరి అభినయము పాటకు వ్యాఖ్యానములుగా దీపిస్తూఉంటవి.

వేదుల సత్యనారాయణశాస్త్రిగారు :— భావమునకు తగిన భాషను అలవరచుకొని ఎంతక్లిష్టమైన భావాన్నైనా సులువుగా వృత్తాలలో పొందుపరచి, ప్రాచీన కవితా శిల్పానికి ఆధునిక జీవకళ కల్పించి మధురమైన గేయాలు రచించిన కవి. జీవితంలో ఆవేదనకల్గినప్పుడు, పద్యాలు రచించి శాంతినిపొందే కవితా కళాపోషకుడు. వీరి పూర్ణిమ, దీపావళినాడు మొ॥గునవి వీరి కవితను పూర్తిగా నిరూపించగలవు.

నాయని సుబ్బారావుగారు :—రచించిన పద్యాలలో ఏది చూచినా కవిత వీరిని వరించినట్లుంటుంది. ప్రణయమేకానీ, విరహమేకానీ, వేదనేకానీ, ఆనందమేకానీ, దుఃఖమేకానీ

దేనినివర్ణించినా వీరి పద్యములు వీరి నిండు హృదయములో నుండి పొరలివచ్చినట్లువచ్చి, విన్నవారి గుండెలలోనికి సూటిగా చీల్చుకొనిపోయి ప్రతి ఫలిస్తూఉంటవి. వీరి కృతులలో ముఖ్యమైనవి: సౌభద్రుని ప్రణయయాత్ర, ఫల శ్రుతి, మాతృగీతములు ముఖ్యమైనవి.

అడవి బాపిరాజుగారు :—వీరి కళోపాసన సర్వతోముఖ మయినది. చిత్రలేఖనమలవడినంత ఎక్కువగా కవిత్వ మల వడినదని చెప్పలేముగాని రెంటను జీవకళ తాండవిస్తూ ఉంటుంది. వీరి కవిత్వము చిత్రించినట్లుంటుంది; చిత్రములు కవిత కూర్చినట్లుంటవి. జానపదగీతాలయందు వీరికి మక్కు వెక్కువ. వీరి రచనలు యువకులకు ఎక్కువ ఉత్సాహ మును కలిగిస్తూఉంటవి. వీరు రచించిన గంగిరెద్దుపాట ఎన్నిసారులువిన్నా విసువుపుట్టదు. వీరి కృతులలో ముఖ్యమైనవి : తొలకరి, శిల్పబాల, నారాయణరావు ఆ నేనవల ప్రౌఢ మైన రచనలో సాగినవి.

రామచంద్ర అప్పారావుగారు :— బాలకవిగా నున్నప్పుడే శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి మెప్పునుబడసిన తరణము అనే కావ్యమును రచింపగలిగిన కవి. భావములో ప్రాచీన లక్షణములనే అనుసరించినా లాక్షణిక శృంఖలములను తగిలించుకోలేదు. భావములలోను, ఆదర్శాలలోను నవ్య సాహిత్య కళోపాసకులు. వీరి సౌందర్యోపాసన అనే కావ్యములోని తీవ్రత నేటి నూతన కవిత్వానికికూడా నూతనమే! వీరు రచించిన నీతి రత్నాలు, వసంతగీత మొదలగునవి మెచ్చుకోదగినవి.

పింగళి లక్ష్మీకాంతముగారు :—(ఆంధ్రవిశ్వకళాపరిషత్—ఆంధ్ర సాహిత్య ప్రధానాచార్యులు) కాటూరి వేంకటేశ్వర రావుగారితో కలిసి కొంతకాలము ఖండకావ్యరచనము సాగించిరి. ఈ జంటకవులు రచించిన ఖండకావ్యము తొలకరి, అంతకంటెను ఎక్కువగా, సౌందరనందనము వీరి కవితాకౌశలమును, భావగాంభీర్యమును, పదలాలిత్యమును తెలియజేయగలవు. లక్ష్మీకాంతముగారు నవ్యసాహిత్య పరిషత్తువారి ఆశయములతో పూర్తిగా ఏకీభవించకపోయినా వారి రచనలుమాత్రము నవ్య సాహిత్యమువారి రచనలలో మిన్నయైన రచనలవలెనే ఉంటవి. సర్ సి. రామలింగా రెడ్డిగారు వీరి తొలకరి—తొలిపలుకులలో పలికినట్లు "వీరి కవిత్వమున నిక్కంపు మంచినీలములున్నవి. తళుకు



శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు.

బెళుకు తాళ్లులేవు. అయినను రత్న పరీక్షయందు సమర్థు లగువారికిఁగాని సామాన్యులకు వాని గుణము నెఱుంగ నలవికాదు."

కాటూరి వేంకటేశ్వరరావుగారు :— నవ్య సాహిత్య పరిషత్తు కార్య నిర్వాహక వర్గములో సభ్యులుగానున్నారు. వీరు పైనిచెప్పిన సుగుణముల పాల్గొన్నవారు.

అబ్బూరి రామకృష్ణారావుగారు :—వీరి పద్యాలలోని ఉన్నతభావాలు, పదలాలిత్యము, మృదుమధురశైలి చూచిన వారికి వీరిటీవల కవిత్వమంతగా సాగించకపోవడము వింతగా కనబడుతుంది. కవితావేశము కలగలేదా, కలిగినదానిని ప్రయత్నపూర్వకంగా నిరోధించుకొన్నారా అనిపిస్తుంది. వీరు దొడ్డ సంస్కృతి, కవితాభిమానం, పాండిత్యంగలవారు. వీరి రచనలలో ఊహాగానము-అపూర్వప్రేమ, మల్లికాంబ, నదీసుందరి మొదలయినవి వీరికి నవ్యసాహిత్య కవికూట ములో ప్రథమ శ్రేణిలో స్థానమీయగలవు. "...కలవు తిక్కనపలుకు తెలుంగుపలుకులకు" అని తిక్కన సోమయాజి గురించి వీరు రచించిన పద్యాలలో వీరి కవితామాధుర్యము చవిచూడవచ్చును. ఇదేకాదు, వీరు రచించిన పద్యమేది చూచినా వీరి కవితాశక్తి కనబడుతుంది.

కీ. శే. మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు :— ఆంధ్ర సంస్కృతసాహిత్యమందు మంచి పాండిత్యముగల కవులు.

వీరు కవితలో కొంతవరకు ప్రాచీన సంప్రదాయములను అనుసరించినవారే అయినా, భాషలోను, భావాలలోను, రచనలోను, కల్పనలోను నవ్యసాహిత్య లక్షణములను అనుసరించినవారు. వీరి గేయములు భారతి మొదలయిన పత్రికలలో ప్రకటితములైనవి. వీరి రచనలలో సుజనామోదిని, కృష్ణాభ్యుదయము, రాధాకృష్ణసంవాదము, సావిత్రీ సత్యవంతము, ప్రేమ వీరి కవితా సామర్థ్యమును తెలియజేయును.

వేటూరి ప్రభాకర శాస్త్రిగారు :—వ్యావహారిక భాషావాదమునకు దొడ్డసహాయులైనవారు. వీరు, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో చాలాకాలము పనిచేసిన ఆంధ్రసంస్కృత ప్రాకృత భాషాపండితులు. ప్రాచీన గద్యరచన వ్యావహారిక భాషలోనే సాగినదని రామమూర్తి పంతులుగారు నిరూపించి, అప్పకవి మొదలయిన లాక్షణికుల లక్షణగ్రంథములలోని వచనములు కథలు, వ్యాసములు, పురాణేతిహాస సంబంధముగల రచనలు మొదలయినవి-వాడుక భాషలో నున్నవి- సంగ్రహించి, గద్య చింతామణి సంప్రతించుటలో శాస్త్రిగారు ఎక్కువగా తోడుపడిరి. శాస్త్రిగారు ఆంధ్రశబ్దముల స్వరూపము అర్థము నిర్ణయించుటలోను, ప్రాచీనకావ్యములను సంప్రతించుటలోను గొప్ప ప్రతిభగలవారు. వీరు కేవలపండితులేకాక మృదుమధుర భాషను కావ్యరచన సాగింపగల కవులు. వీరి ఖండకావ్యములలో కొన్ని భారతిలో ప్రకటితములైనవి. అందులో మూణ్ణాళ్ల ముచ్చట, విశ్వాసము, కడుపు తీపు, కపోతకథ మొదలయినవి వీరి భాషా సౌష్ఠవమును, రచనలోను కల్పనలోనుగల నేర్పు, పద్యాల నడకలోగల పొందిక మొదలగు కవితా లక్షణములను స్పష్టముగా కనబరుస్తూ ఉంటవి.

కవికొండల వేంకటరావుగారు :— భాషలోను, భావములోను, ఊహలోను, కల్పనలోను సర్వస్వతంత్రుడు. ప్రకృతిలోగల ప్రతివస్తువు వీరి కవితకు విషయముకాగలదు. వీరికి ప్రాచీన సంప్రదాయములతోగాని, ప్రాచీనఛందస్సుతోగాని పనిలేదు. భావమున కనువైనభాష, భాషకనువైన ఛందస్సు వీరికి కావలసినది. వీరి పద్యముల నడకలో వీరి ఉత్సాహము, వీరి ఆవేశము కనబడుతూ ఉంటవి. వీరు రచించిన కృతులలో ముఖ్యమైనవి నెలబాలుడు, ప్రకృతి చందము, మాతృదేశ సంకీర్తన, జనపదములు, విలాసినీవైన వేయము మొదలగునవి.

కీ. శే. పెనుమర్తి వెంకటరత్నంగారు:—వీరి జీవితము పిన్న వయస్సులో 23 ఏండ్లు నిండినంతనే ముగిసిపోయినదిగాని, లేకున్న నవ్యసాహిత్యకవులలో ఎక్కువ ప్రఖ్యాతిపొందగల కవులు. "నా హృదయసౌరభముల గంధవహరాజు, తాను గొనిపోవు దశదిశాంతములదాక ; నా యెడదలోని శాంత శృంగారగీతి స్వరములనుదాటి మ్రోగు నిశ్శబ్దరీతి" యని వీరు తమ "అడవిపూవు" అనే గేయములో చెప్పినట్లు, వీరి పద్యములు వీరికిగల కవితానైపుణ్యమును ప్రకటిస్తూ ఉంటవి. వీరు ఈ పిన్నవయస్సులో రచించిన పద్యాలు అనేకము పత్రికలలో ప్రకటితములైనవి. నీతిసుధ, రత్నాపణము ముఖ్యమైనవి.

కొడాలి ఆంజనేయులుగారు :—ముద్దుముద్దుగా పద్యరచన సాగించగల నిపుణులు. "నీకు వైరాగ్య వృత్తియేల ?" అని సన్యాసిని సంబోధిస్తూ రచించిన పద్యాలలో కొన్ని సన్యాసిని మరల గృహస్థాశ్రమమునకు రప్పింపగలిగినట్లున్నవి. వీరి 'పెండ్లికూతురు'లోని భావములు నలుగురికీ తెలిసినవే అయినా క్రొత్తఅందము సమకూరుస్తూ ఉన్నవి. 'జైలులో చందమామ'నుగూర్చి వీరు రచించిన పద్యాలలో "క్షితిని నీ కెట్టిమూర్ధాభిషిక్తుడైన నూలుపోగొక్కటిచ్చి సంతుష్టి జెందు ; హర్షముక్తాశ్రుల సువర్ణహారములను గూర్చి నేనిప్పు డర్పించుకొంటి" అని చెప్పినట్లు సువర్ణహారముల గూర్పదగిన పద్యాలు నవ్యసాహిత్యానికి అర్పించారు.

నోరి నరసింహశాస్త్రిగారు :— అనేక ఖండకావ్యాలు రచించినవారేకాని ఏవో కొన్నింటినిమాత్రమే ప్రకాశింపజేసుకొన్నారు. ప్రకృతికాంత నిత్యమూ వారి ఆత్మలో వెలుగుతూ, వారిచేత "తామగ్నివర్ణాం తపసాజ్వలంతీం" ఇత్యాదికంగా ధ్యానము చేయించుకొంటూ ఉన్నదట. "ఆమెనవ్వు నా హృదయములో ప్రతిధ్వనించినప్పుడే కాని ఇప్పుడు కావ్యము చెప్పలేను" అంటారు శాస్త్రిగారు. గాని వీరి నవనీతము, భాగవతరణము, సోమనాథ విజయము మొదలయిన రచనలు వీరికి నవ్యసాహిత్య రచయితలలో మంచిస్థానమును ఈయక తప్పవు.

శ్రీరంగం శ్రీనివాసరావుగారు (శ్రీశ్రీ):— వ్యక్తి చైతన్యం సంఘ చైతన్యంగా మారుతూవున్నదన్న భావనతో కష్టజీవులతోనిండిన సంఘమునుగురించి, అందులోను కార్మికులను గురించి గేయాలు, విన్నవారి గుండెలు అదరించేటట్లు రచన

సాగిస్తున్నారు. వీరి 'ఒకరాత్రి'లో ఊహాతీతములైన భావాలకు వీరు పరుగులెత్తే ఆశయము కనబడుతుంది. 'కావాలోయ్ నవకవనానికి' అని నవకవిత అనే గేయములో వీరు పేర్కొన్న విషయాలు ఆదర్శంగా పెట్టుకొన్నవి. అంతకంతకు వీరు అతివాస్తవిక కవితకు భగీరథునివంటి వారయినారు.

మల్లవరపు విశ్వేశ్వరరావుగారు:—తమ "జీవితమంతా కేవలం సూర్యోదయాలలోను, చంద్రజ్యోత్స్నలలోను, నూత్నకిసలయాలలోను నిభృతమైనట్లు" భావించి, "పచ్చని పైరులఉయ్యాలలో—ముచ్చటనూగుచు మురియుదమోయీ —రావోయీ, ఓనా ప్రియుడా, రావోయీ" అని తమ తొలిగేయము రచించిననాటనుండి నేటివరకున్న ఛందశ్శాస్త్రాలుగాని, లక్షణ గ్రంథాలుగాని ముట్టుకొని ఎరగని" భావకవి. "ఆ తొలినాటి నా బాలగీతం, నా ప్రేమగీతం అంతర్వాహినిగా నాలో అణగిమణగి ప్రవహిస్తూనే ఉంటుంది. అది మరపొందిననాడు నా కవిత్వవాణి అంతరిస్తుందని అంతరాత్మ హెచ్చరిస్తుంది "అని వీరంటారు. వీరి రచనలలో శాంతినికేతనమందు వీరు సంపాదించిన సంస్కృతి గోచరిస్తుంది. 'ఏనాడు?' గంభీరమైన భావము, చిన్నమాటలతో చిత్రితము. చైత్రము-వాసంతవిలాసము కన్నులకు కట్టినట్లుంటుంది.



శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి (ఎడమప్రక్క)
శ్రీ నండూరి సుబ్బారావు (కుడిప్రక్క)

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు :— మొదట కొంత సంస్కృత పరిజ్ఞానం సంపాదించుకొన్న తర్వాత ఆంధ్ర భాషాభిమానము పొంది తెలుగు కవిత్వం ప్రారంభించారు. భావకవిత్వం అంటే ఏమిటో వారు తమ గురువుగారి సలహాచొప్పున ఏకాంతసేవ, దాని పీఠికా చదివి తెలుసుకొన్నారు. దాని ఫలితంగా 'ఒకనాటిగీతి' రచించి భారతిలో ప్రకటించారు; పిమ్మట ఆంధ్ర ప్రశస్తి పద్యాలు కొన్ని రచించారు. ఆపైని ప్రేయసీగీతాలు, విరహగీతాలు పెక్కు రచించారు. తెలుగునుడి సూటిగా పలకాలంటే వృత్తాలు ఉపకరించవని పాల్కురికి సోమనాథుని ద్విపదరచన ప్రోద్బలం హెచ్చుకాగా, "జాను తెనుంగు" గేయములను తెనుగువీణ పాటలను రచించడానికి ప్రారంభించారు. "ఏపువ్వు పూసినా, ఏపాటపాడినా ఎందుకో ఈహృదయ మింత కళవళపడును!" అనే పద్యంతో ప్రారంభమయినది వీరి తెనుగువీణ. పాండిత్యంతో కూడుకొన్న కవిత; రసవంతగా ఉంటుంది. వీరి మెత్తని హృదయానికి తగినట్లుగా వీరి రచన మృదువుగా సాగినది.

కర్రా చంద్రశేఖర శాస్త్రిగారు :— సంస్కృతాంధ్ర భాషా పండితులయ్యు ప్రాచీన లాక్షణిక సంప్రదాయములకే బద్ధులుకాక, స్వేచ్ఛరీతుల నవ్య కవిత్వరచనలు సాగించి అనేక గేయములు, పద్యములు, కథానికలు రచించి వివిధ పత్రికలలో ప్రకటించినారు. వీరి రచనలలో సామాజిక సంస్కరణాభిలాష ఎక్కువగా స్ఫురిస్తూంటుంది. సాంఘిక దౌష్ట్యములకు గురియయిన కష్టజీవుల చరిత్ర విషయములు హృదయ విదారకముగ వర్ణించగల నేర్పరులు. అందుకు వీరి "ఎడా-పెడా; భిక్షుకబాలుడు" మొదలగు రచనలు నిదర్శనములు.

వీరు, పైని చెప్పిన ఇం. హ. శాస్త్రిగారు, కనకదండి గోపాలకృష్ణ శాస్త్రిగారు మొదలగువారు సహాధ్యాయులు, ఒక 'తరగతి' లోని వారని చెప్పదగ్గవారు.

కీ. శే. భోగరాజు నారాయణమూర్తిగారు :— విజయనగర సంస్థానమునందలి ఆస్థానకవులు. చాలాకాలము వీరిని బాలకవిగారు అనేవారు. వీరు రచించిన ఖండకావ్యాలలో 'పండుగకట్నము' భాషావిషయములోను, భావాలలోను, సాంఘిక కథ నెత్తుకొని కావ్యరచనకు తగినట్లుగా ఒప్పించడములోను, కళానైపుణ్యముగల కావ్యము. వీరి కంకణము

ప్రాఢరచనలో సాగినది. వీరి విమలాదేవి అనే నవల వీరి పేరు ఆంధ్రదేశమందు వ్యాపింపజేసినది. ఇంకా అనేక చిన్న కావ్యములను, చాటువులను రచించి ప్రఖ్యాతి పొందినవారు.

మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు :—నవ్యసాహిత్య సభలకు విద్యుద్దీపము. వీరు తాము రచించిన చాటు పద్యములు, పంచవటి మొదలయిన కృతులలోని పద్యములు పాడి వినిపిస్తూఉంటే, సభాకార్యాలు జరుగుతున్న వాలేదా అన్న విచారము సభాసదులకూ ఉండదు, కార్య నిర్వాహకులకూ ఉండదు. అర్థం విప్పిచెప్పకుండానే విన్నవారికి అవగాహన మవుతూ ఉంటుంది. చమత్కృతిలేని పద్యమొకటీ ఉండదు. చక్కనిధార, తియ్యని పలుకు, రసంతమైన భావము ప్రతి పద్యములోను కనబడుతూఉంటుంది. పద్య రచన ప్రాచీన లక్షణ సంప్రదాయాలను అనుసరించినా భావాలు, వర్ణనలు మొదలయిన లక్షణాలన్నీ నవ్య సాహిత్యమునకు సంబంధించినవే.

కొడవటిగంటి వేంకటసుబ్బయ్యగారు :— సాహితీసమితి ప్రారంభించిన తొలిదినములలో పెద్దపేరుగల నవ్యసాహిత్య కవి. వీరి అతిథ్యము, భిక్షువు, సెలయేరు చూచినవారికి వీరు దొడ్డకవులు కాగలవారన్న నమ్మకము కలుగకపోదు. గాని ఆధ్యాత్మికవిద్యాజిజ్ఞాసువులై కుటుంబాన్ని సంఘాన్ని విడచి ఎచ్చటికోపోయినారు. వీరిజాడ తెలియదు. వీరి కృతులలో ముఖ్యమైనది సంధ్యారాగము.

బొడ్డు బాపిరాజుగారు :—అనేకంగా పద్యాలు, గేయాలు రచించి ఆంధ్రలోకానికి సుపరిచితులయినవారు. వీరి తొలి కావ్యము "విపంచి" ప్రబంధరచనలో సాగినది. 'కాత్యాయని' నవ్య సాహిత్య రచనలో వికసించినది. వెన్నెల, చందమామ మొదలయిన గేయాలు రసవంతములు. ఉత్తమ కావ్యమనదగిన కాత్యాయనిలో కొన్నికొన్ని భాగములు కడు చక్కని రచనలో ముద్దులు మూటకడుతూ ఉంటవి. వీరి రచనలు మొత్తమువిూద అన్నీ మృదుమధురములు. కడుసున్నితమైన భావాలతో ఇంపుగా ఉంటవి.

చింతా దీక్షితులుగారు:—ఈ నవ్యసాహిత్య యుగంలో కథకచక్రవర్తు లనదగినవారు. శిష్టజన వ్యవహారసిద్ధమైన తమ వాడుకభాషలో బాలహృదయములను ఆకర్షిస్తూ కథలు రచించగల నేర్పు వీరికలవడినంతమట్టుకు మరియెవ్వరికిని అలవడలేదనుట అతిశయోక్తికాదు. ఈ విషయము బాల సారస్వతములో తెలియజేసినాను. ఇక్కడ వారికి నవ్య సాహిత్య కవులలోగల స్థానము నిరూపిస్తున్నాను. వీరును కవితాహృదయముగలవారే ; కవితాధర్మము లెరిగినవారే ; కవిత్వము సాగించినవారే; కాని వీరి పద్యాలలో సైతం ఏవి బాలహృదయముల నాకర్షిస్తవో అవే 'నెమలికన్ను' వంటివి చక్కగా సాగినవి. 'వ్యర్థయత్నములు' అనే గేయములో వీరు 'ఎందుకో యీ వ్యర్థయత్నము లెందుకో' అన్నట్లు ప్రశ్నించుకొని, కొంత తడవు "మౌన ముద్రనుదాల్చి కూర్చుంటిక" అన్నట్లుండి, "ఎందుకో యీ మౌనమూనుట-ఎందుకో యీ మాంద్యమంతా, పోయి సాంఘికసేవచేస్తే పుణ్యముండునుగా" అన్నట్లు తోచి, తమ జీవితమింక బాలసాహిత్యంకోసం వినియోగిస్తున్నట్లు కనబడుతుంది.

దీక్షితులుగారు నవ్యసాహిత్యమునకు చేస్తూఉన్న సేవ అపారమైనది. కవుల నేకులు గలరుగాని, వీరివలె కథలు చెప్పగలవారుగాని, చిన్నపిల్లలభాషలో వ్రాయగలవారు గాని ఎక్కువగాలేరు. వీరి రచనలలో ముఖ్యమైనవి: ఏకాదశి, శబరి, లక్కపిడతలు మొదలయినవి.

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు:—వీరు సైతము నవ్య సాహిత్య కవిత కొద్దిగాసాగించినవారేకాని వీరి ప్రతిభ భాషాపాండిత్య విషయంలో ఎక్కువగా పరిణమించినది. అంబ లేక మొండి శిఖండి, అశ్వత్థామ, అచ్చి లేక కాపువలపు, పెండ్లి మొదలయిన గ్రంథములు రచించి నవ్యసాహిత్యమున కర్పించినారు.

కీ. శే. యనమండ్ర నారాయణమూర్తిగారు :— మంచి సంస్కృతి, ఆంగ్లసారస్వత విజ్ఞానము, ఆంధ్రభాషా పాండిత్యముగల రచయితలు. వీరు ఎక్కువగా కావ్యములను రచించినవారు కారుగాని, రచించిన అడవిమల్లెలు, రూపలి అనే కావ్యములనుబట్టి వీరు మరికొంతకాలము సజీవులై ఉన్నయెడల ఇంకా ఎక్కువగా నవ్యసాహిత్యమునకు ఖండకావ్యములను రచించి అర్పించియుందురని తోచకమానదు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు :—కవులు కారుగాని కవులకంటెను నవ్యసాహిత్యాభివృద్ధికి ఎక్కువగా కృషిచేస్తున్నారని చెప్పవచ్చును. వీరిభాష సాంకర్యములేని శుద్ధ గోదా

వరీతీర శిష్టజన వ్యవహారసిద్ధమైనభాష; అందులో జీవకళ, శక్తి ఎంతవరకుగలవో చూడవలెనంటే వీరి కథలు, వ్యాసములు చదివి తెలుసుకోవచ్చును. వాడుకభాషలో వీరి వలె కళాకాశలముచూపి రచనసాగించగలవారు ఎందరో లేరు. ఆంధ్రభాషాభిమానము సైతము వీరికి మెండుగా గలదు. వీరి చిన్న కథలు నాలుగుభాగాలు నవ్యసాహిత్య పరిషత్తువారు ప్రకటించినారు.

కీ. శే. అక్కిరాజు ఉమాకాన్తముగారు :—ప్రాచీన సంప్రదాయానుసారముగా ఆంధ్రసంస్కృత పాండిత్యము ఎక్కువగా సంపాదించుకొన్న పండితులు. ఇట్టి పండితుల ఆదరమువల్ల వ్యావహారికాంధ్రభాషా ప్రయోజనము ఆంధ్రులలో చాలామందికి నచ్చినది. శ్రీనాథుని పలనాటి వీర చరిత్ర వీరు సంప్రతించి, దానికి వీరు రచించిన ఉపోద్ఘాతము ఎన్నదగిన విమర్శక గ్రంథము. తేట తెలుగు మాటలలో తేనె లొలుకునట్లు రచించినారు. వీరి పల్నాటి వీరుల కథలు, త్రిలింగ చిన్నకథలు కథారచనలోగల వీరి కళానైపుణ్యమును తెలియజేయగలవు.

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు :— నవ్యసాహిత్యానికి ఆచార్యపీఠము నలంకరింపదగినవారు. ప్రాచీన సంప్రదాయానుసారంగా ఆంధ్ర సంస్కృతప్రాకృత పాండిత్యమలవరచుకొని, ప్రాచీనాంధ్ర భాషాలక్షణము గుర్తెరిగి, వ్యావహారిక భాషావాదమును మనసార సమ్మతించి, నవ్యసాహిత్యాశయముల నంగీకరించి, ఈ నూతనోద్యమముల రెంటిని వ్యాపింపజేయడానికి ఎక్కువగా కృషిచేసినవారు. నవ్యసాహిత్యపరిషత్తువారి వార్షికోత్సవములు విజయవంతముగా సాగుటకు కార్యదీక్షవహించేవారిలో వీరు పేర్కొనదగినవారు. యెంకి పాటలలోగల కవితావిశేషములను, కళానైపుణ్యమును ఎక్కువగా ఉగ్గడిస్తూ వీరు రచించిన వ్యాసము చదువదగినది. వాత్స్యాయన కామసూత్రములను తేట తెలుగులో అనువదించిరి; చక్కని తెలుగువ్యాఖ్యానము రచించిరి.

వీరి వ్యాసములు భారతి, ప్రతిభ మొదలయిన పత్రికలందనేకములుగా గలవు. ప్రతిభ మొదటి సంపుటి మొదటి సంచికలో ప్రకటితమైన వీరి వ్యాసములో నవ్యసాహిత్య వికాసమును గురించి చక్కని విషయములుగలవు.

జి. జాషువాగారు :—కవితావిశారద, కవికోకిల బిరుదాంకితులు. పదలాలిత్యము, భావగాంభీర్యము వీరి రచన లన్నిటను కనబడుతూ ఉంటవి. వీరి కృతులలో ఫిరదౌసి మెచ్చుకోదగిన చిన్నకావ్యము. గబ్బిలములో అనేక నూతనభావాలు కలవు. ఇవిగాక స్వప్నకథ, ఖండకావ్యములు 2 భాగములు, పద్యములు మొదలగునవికూడా వీరి సామర్థ్యమును తెలియజేయగలవు.


శ్రీ జమ్ములమడక మాధవరాయ శర్మ, సంస్కృత పండితులు.

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు :— వీరికి దేశాభిమానము, ఆంధ్రాభిమానము మెండు. అది వీరిరచనలన్నిటను కనబడుతున్నది. గాంధీజీ ఆత్మకథనాధారముగా ఎత్తుకొని రచించిన కావ్యము, దేశచరిత్ర, ఆంధ్రుల చరిత్ర, ఆంధ్రవీరులు మొదలగు విషయములకు సంబంధించిన పద్యములు చక్కని శైలిలో రచితములయినవి. అందలి భావములు ఆవేశపూరితములు; విన్నవారికి సైతము ఆవేశము కలిగింపగలవు. వీరి రాష్ట్రగానము ఆంధ్రుల హృదయములను వికసింపజేయగలదు.

నవ్యసాహిత్య నవజీవనముకంటెను నవ్యమైన 'అతివాస్తవిక కవిత' అనేపేర నవ్యసాహితీ ప్రవాహమందు చేరగల ఒక పాయ బయలుదేరినది. దీనికి భగీరథునివంటి వారయినారు శ్రీరంగం శ్రీనివాసరావుగారు. ఆ పాయలోమునిగి ఓలలాడుతున్న కవులలో ప్రఖ్యాతిపొందినవారు పిఠాపురం యువరాజా శ్రీ రావు వేంకటమహీపతి గంగాధర రామారావుగారు. వీరు రచించిన తరంగములు, చినుకులచిందులు, తీరనికోరిక- తరువాత మొదలయిన గేయములు వీరి కవిత్వసామర్థ్యమును తెలియజేస్తవి. '—' (నామరహిత)మనే రచన అపూర్వమైనది; అతివాస్తవిక కవితకు చెందిన గ్రంథము. అందులో "పద్యం, గద్యంకాకుండా, వింతయైన సంగీతంతో క్రొత్తభావాలు పెంచి, మూడుమాటల్లో ముప్పది తళుకులూ, మూడువందల

శ్రీ పిఠాపురం యువరాజావారు

హృద్భావాలూ చూపించాలని యత్నించాను. కాని తృప్తికలుగలేదు"అని వీరు వ్రాసుకొన్నారు. నిజము కావచ్చునుగాని, ఇందుకొన్నికావ్యాలలో కొందరితోపాటు తమకున్నకలిగిన ఆవేదన, సంఘజీవితమందుగల సమస్యలు, కళానైపుణ్యము చూపిస్తూ చిత్రించారు. వీరు రచించిన నాటకములు ఆలోకమునుండి ఆహ్వానము, స్వార్థత్యాగము కూడా ఆధునిక సంఘజీవితమునకు సంబంధించినవే. అవి నీతిని బోధించనీ, అవినీతినిబోధించనీ; ఆ విచారముతో పనిలేక కళాపోషణయే ముఖ్యధర్మముగా పెట్టుకొని రచించిన నాటకములు. పాఠకలోకము మెచ్చుకొంటున్నదా లేదా అన్న చింతయైనాలేకుండా కావ్యరచన సాగించగల ధీరులు, స్వతంత్రులు, సాహసులు ఈ రాజకవులు. "పాడినానొకపాట ఆడినానొకయాట; ఆటకు పాటకు అర్థమే లేదంచు, ఎవరెవరో ఏమేమె ఎగిరిపడ్డారు; ఎందుకా కోపము? ఎందుకా తాపము? ఆటకేనా ఇంత అలజడైపోయింది, పాటకేనా ఇంతమండిపోయారు?" అంటారు. తనకృతి లోకంలో నిలుస్తుందా లేదా అన్నచింతతో నిరుత్సాహము పొందరు. "మంచిది నిలుస్తుంది, చెడ్డది నశిస్తుంది, కాలమేచేస్తుంది ఆ పని" అని, "కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ" అనిభవభూతి పలికినట్లు, పలికి ధైర్యం పొందుతారు. శ్రీ యువరాజావారు రసజ్ఞులుగాను, సహృదయులుగాను మాత్రమేకాక తమ రచనలవల్ల కవితానైపుణ్యము, సంస్కృతిగలవారుగా సైతము ఆంధ్ర కవి పండిత లోకానికి సుపరిచితులు.

శ్రీరంగం నారాయణబాబుగారు:— అతివాస్తవిక కవితాధర్మమును పాటించిన కవివర్గములోనివారే అనవలెను. వీరు రచించిన రుధిరజ్యోతిగేయాలలో వీరి స్వతంత్రకల్పన, తారాజువ్వలవలె మనోవేగంతో మీదికి ఎగిరిపోయేభావాలు, ఏ కట్టుబాట్లకుసూ లొంగని పద్యరచన, భాషాప్రయోగాలు కనబడతవి. ఆ రుధిరజ్యోతిలో సామిధేని అనేగేయమందు "సూరన అడిదాన్ని, తిక్కనఖడ్గాన్ని, పేలిన బిజాపూరు, ఫిరంగిగుండు, నా గుండె!" అన్నారు నారాయణబాబుగారు.

ఉన్నవ లక్ష్మినారాయణగారు. గరిమెళ్ల సత్యనారాయణగారు, కొండపల్లి జగన్నాథదాసుగారు, నేదునూరి గంగాధరంగారు మొదలగువారు జానపదగీతాలు, స్వరాజ్యగీతాలు, సాంఘిక పురాణేతిహాసికగీతాలు పండితపామర జనరంజకముగా రచించి ప్రఖ్యాతిపొందినవారు.

గుడిపాటి వేంకటాచలంగారు :— భాషలోను భావంలోను సర్వస్వతంత్రులు; స్వేచ్ఛానురాగవిహారసిద్ధాంతామోదకులు. వీరి రచనలోను శైలిలోనుగల వీరి ప్రత్యేకత, విశిష్టత వీరి గ్రంథములందు గోచరిస్తూ ఉంటవి. క్రొత్తఫక్కిని వీరు చిత్రాంగి, సావిత్రి మొదలగు నాటకములను, స్త్రీ మొదలగు విమర్శకగ్రంథములను, అనేకకథల పుస్తకములను తమ సొంతవాడుకభాషలో కళానైపుణ్యము ప్రదర్శిస్తూ రచించారు.

మల్లాది విశ్వనాథశర్మగారు :— ఆంధ్ర సంస్కృతపండితులు; ఆంగ్లభాషాపరిచయము, ఆంగ్ల వాఙ్మయపఠనము ఎక్కువగాగలవారు; ఇంటర్మీడియేట్ చదువుతూ ఉండిన విద్యార్థిదశలోనే వ్యావహారిక భాషావాదముతో పరిచయము కలుగజేసుకొని, అందు కనుకూలముగా పద్యాలు, కథలు మొదలగు రచనలు సాగించినారు. వీరి ప్రతిభ ఏకాంక నాటకరచనలో ఎక్కువగా పరిణమించినది. 80 నాటకములవరకు రచించినారు. అందు కొన్ని మాత్రమే ప్రకటితములైనవి.

మల్లాది అవధానిగారు :— విశ్వనాథశర్మగారి పుత్రులు; బాల్యమునుండిన్ని తండ్రిగారితోకలిసి సహాయరచయితలుగా రచనానైపుణ్యమలవడజేసుకొని ఇప్పుడు స్వతంత్ర రచనలు ఎక్కువగా సాగిస్తున్నారు.

డాక్టర్ బుర్రా శేషగిరిరావుగారు:— వీరు వ్యావహారిక భాషావాదమును సాగించిన రామమూర్తి పంతులుగారికి ప్రధాన సహాయులు; అనేక విమర్శన, వ్యాసములు ప్రకటించి, విమర్శకాగ్రేసరులన్న ప్రఖ్యాతిపొందిన విద్యాధికులు. రాజరాజ నరేంద్రుడు, బొబ్బిలికథ అభిషేకరూపము మొ॥ నాటకములు, గేయములు రచించినారు.

## కథలు

నాటక రచనకు ప్రఖ్యాతిబడసిన కీ. శే. పానుగంటి లక్ష్మినరసింహముగారు సువర్ణరేఖా కథావళిని, మాడపాటి హనుమంత రావుగారు మల్లికాగుచ్ఛమను కథలను, కీ. శే. అక్కిరాజు ఉమాకాన్తముగారు త్రిలింగకథలను, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు పూలదండ అనుపేరను కొన్ని కథలను, నందిరాజు చలపతిరావుగారు నూరు వినోదకథలు,

తెనాలి రామలింగని హాస్యకథలు, మర్యాదరామన్న కథలు, భోగరాజు నారాయణమూర్తిగారు అక్బరు కథలు, ఇంకా అనేకులు ఇట్టికథలు రచించి ప్రకటించిరి. గాని,నూతన ఫక్కిని కథానికలను కళాకౌశలముచూపిస్తూ రచించిన వారిలో సిద్ధహస్తులు చింతాదీక్షితులుగారు, మునిమాణిక్యం నరసింహారావుగారు, మల్లాది రామకృష్ణశాస్త్రిగారు, కొడవటిగంటి కుటుంబరావుగారు మొదలగువారు.

## నవలలు

వంగదేశమందు గత 19 వ శతాబ్దాంతమునుండిన్ని జాతీయతావేశము ఎక్కువయినది ; వంగదేశ విభజనముతో (1905) అది మరింత చెలరేగినది. అప్పుడు ఆంధ్రయువకుల నేకులు కలకత్తాలో విద్యార్థులుగా ఉండి అక్కడి విశ్వకళా పరీక్షలను చదువుకొనుచుండిరి. పిమ్మట కొందరు రవీంద్రుని విశ్వభారతిని సేవిస్తూ శాంతినికేతన మందు ఉన్నత విద్య నభ్యసించినారు. అప్పటికి రమేశచంద్రదత్, బంకిమ్ చంద్రఛట్టోపాధ్యాయ, విద్యాసాగరాది రచయితల నవలలు ప్రఖ్యాతిపొందియుండెను ; ఆంధ్రవాఙ్మయమందు ప్రాచీన కావ్య లక్షణముల ననుసరించి రచితములైన పద్యకావ్యములే కాని గద్యరచనలు తక్కువ ; అందులోను నవలలు కడు కొద్దిగానుండెను. కీ.శే.కందుకూరి వీరేశలింగముగారి రాజశేఖర చరిత్రయే కాబోలు మొదటి తెలుగునవల. అదియైనా, తెలుగు సంఘ జీవనమును ఎత్తుకొని రచించినా, కొంతవరకు ఆంగ్ల భాషలో గోల్డ్‌స్మిత్ రచించిన 'వికర్ ఆఫ్ వేక్ ఫీల్డ్' అనే నవలకు అనుకరణము. పిమ్మట వారి అనుయాయులైన చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు వంగ రచయితయైన దత్తుగారి 'లేక్ ఆఫ్ పామ్జ్' నవలను అనువదించిరి ; తరువాత రామచంద్రవిజయము మొదలయిన నవలలను తెలుగునాటి సాంఘిక జీవనమును ప్రధానవిషయముగా ఎత్తుకొని రచించిరి. పిమ్మట నవలారచన క్రమక్రమముగా అధికమగుతూ వచ్చినది. గాని రచయితలు తమ నవలలను అచ్చువేయించుకొనుట కష్టమైనది.

ఈ 20 వ శతాబ్దపు నవ్యసాహిత్యయుగములో ప్రకాశక వర్గములవారు బయలుదేరి గద్యరచనలకు కావలసినంత ప్రోత్సాహమిచ్చి పెద్దల జీవితములు, వివిధశాస్త్రముల సంగ్రహములు, నవలలు మొదలయిన గద్యగ్రంథములను ప్రకటిస్తూ వచ్చిరి.

వాటిలో మొదటిది విజ్ఞానచంద్రికా గ్రంథమాల. ఇందు ప్రాచీనకవుల శతకములు, నవలలు, మహాపురుషుల జీవితములు, భౌతికరసాయనశారీరారోగ్యాది శాస్త్రములకు సంబంధించిన గ్రంథములు ప్రకటితములయినవి. నవలలలో వేలాల సుబ్బారావుగారు రచించిన రాణిసంయుక్త, భోగరాజు నారాయణమూర్తిగారు రచించిన విమలాదేవి మొ॥నవి.

నవలారచనకు ఎక్కువగా ఉపచరించిన ప్రకాశకవర్గములు: ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము, సరస్వతీ గ్రంథమాల. మొదటిది నిడదవోలులో పుట్టి పిఠాపురములో విజృంభించినది. రెండవది రాజమహేంద్రవరములోపుట్టి వృద్ధిలోనికి వచ్చినది. మొదటిదానిని ఎక్కువగా వృద్ధిలోనికి తెచ్చినవారు వేంకటపార్వతీశ్వర కవులు ; రెండవదానిని లేవనెత్తి పోషిస్తూఉన్నవారు అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారు. రెంటను వంగనవలల అనువాదములు అనుకరణములు ఎక్కువగా బయలుదేరినవి. వీటి ప్రసక్తి స్థలాంతరమునగలదు.

ఇదివరకు స్వతంత్రించి ఆంధ్ర సంఘమునుండి కథావస్తువు నెత్తుకొని ఆంధ్రసాంఘిక జీవనమును ప్రతిబింబింపజేస్తూ రచించిన నవలలు అత్యల్పముగా ఉన్నవనియే చెప్పవలెను. మ రాఘవరావుగారు రచించిన అపరిచిత అనే నవల స్వతంత్రించి రచించినదే కాని అందులోని కథావస్తువు ఆంధ్రసంఘ జీవనమునకు ఆంధ్రుల ఆచార వ్యవహారములకు సరిపోయినది కాదు. సాంఘిక నవలలను రచించినవారిలో సిద్ధహస్తులయినవారు ఉన్నవ లక్ష్మీనారాయణగారు. వీరి మాలపల్లి తెలుగువారి జీవితము, అందులోను పేద కుటుంబముల వారిజీవితము పాత్రోచితమైన వాడుక భాషలో రచితమయిన స్వతంత్ర రచన. అడవి బాపిరాజుగారి నారాయణరావు అనే నవల, విశ్వనాథ సత్యనారాయణగారి వేయిపడగలు, చెలియలికట్ట నవలలు, కళాకౌశలమును ఎక్కువగా ప్రదర్శించిన రచనలు. మొక్కపాటి నరసింహశాస్త్రిగారు రచించిన బారిష్టరు పార్వతీశ మనేనవల హాస్యరస ప్రధానమైనది ; చక్కని రచన.

భమిడిపాటి కామేశ్వరరావుగారు :—హాస్యరస ప్రధానమైన రచనలకు పెద్ద పేరు పొందినవారు. వీరి రచనలు అన్నియు హాస్యరస పూరితములుగానే యుండును. జయపురం మహారాజులుంగారిచే 'హాస్యబ్రహ్మ' అను బిరుదు నందిరి.

వీరు రచించి, భారతి మొదలగు పత్రికలలో ప్రకటించిన వ్యాసములలో అవును, నిజం, అప్పుడు, ఇప్పుడు మొదలగు పుస్తకములను, హాస్య నాటకములయిన బాగు బాగు, కచటతపలు మొ॥వాటిని ప్రకటించిరి. వీరి నాటకములు నాటక సమాజములవారు, ముఖ్యముగా వార్షికోత్సవ సమయములందును ఎక్కువ ప్రదర్శింపబడి ప్రశిద్ధి పొందినవి. గోదావరి జిల్లా తెలుగు నుడికారము వీరి గ్రంథములు చదివి ఎక్కువగా తెలిసికొనవచ్చును. కల్పనలోను, రసవంతములయిన సన్నివేశముల నేర్పరచుటలోను, సాంఘిక జీవనమును ప్రతిబింబింపజేయుటలోను వీరు చక్కని కళాభిజ్ఞత కలవారు.

కొవ్వలి లక్ష్మీనరశింహారావుగారు :— ఈ రోజులలో ఒక్క ఆంధ్రదేశమందే కాదు, ఆంధ్రులు ఎక్కడనున్న అక్కడ ప్రత్యక్షములయిన వీరి నవలలు 150కి పైగాగలవు. కొందరి దృష్టిలో 'రైల్వే సారస్వత' మయినా ఇంతటి ప్రచారముపొందిన నవలలు మరిలేవనియే చెప్పవచ్చును.

పైని పేర్కొన్న రచయితలేకాక హృదయ విహంగము, ప్రతీక్ష, వనలక్ష్మి మొదలయిన గేయములను రచించిన రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రిగారు ; ఆంధ్రహర్షచరిత్ర, కుసుమాంజలి మొదలయిన గ్రంథములను రచించిన కొమాండూరి కృష్ణమాచార్యులుగారు ; విరహి రచించిన మొక్కపాటి కృష్ణమూర్తిగారు ; కలువలు, జానకిప్రేమ పాల పిట్ట, మిణుగురు పురుగు, వెలుగు మొదలగు గ్రంథములను రచించిన చేకుమళ్ళ కామేశ్వరరావుగారు; గళ్లచీర మొ॥నవి రచించిన పురాణం కుమార రాఘవశాస్త్రిగారు; బాలగీతావళి, పరిషత్ కన్యక, భారతీశతకం మొదలగునవి రచించిన గిడుగు వేంకట సీతాపతిగారు ; రామప్రియ, వేంబు మొదలగు కథానికలు రచించిన తాతా కృష్ణమూర్తిగారు ; కదంబము రచించిన కవిమిత్రులు ; ఆధారములు రచించిన అంచె నారాయణస్వామి గారు ; గేయగుచ్ఛము రచించిన సబ్నవీసు గురునాధరావుగారు ; కొంతకాలము క్రిందట 'ఛాయ' అను పత్రికకు సంపాదకులుగానుండిన, అనేక గేయములను, కథానికలను రచించిన ఏల్చూరి సుబ్రహ్మణ్యంగారు; 'మాతృవాణి' పత్రికకు సంపాదకులుగానుండిన, భిక్షుకహృదయము, వీరధర్మం, అంధగాయకుడు, మొదలగు కథలను, నాటికలను, గేయములను రచించిన కర్రా ప్రభాకరరావుగారు; రైతుబిడ్డ నాటకమును రచించిన సబ్నవీసు రామారావుగారు ; అశ్రుగీతి, నీకోసము మొదలయిన అనేక గేయములను కథలను రచించిన పన్యాల వేంకటరంగనాథరావుగారు ; అంజలి, ఆరాధనము మొదలయిన అనేక గేయములను రచించిన జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు ; ప్రాతఃకాలము—సంధ్య మొదలయిన కావ్యము గేయములను రచించిన దేవరకొండ బాల గంగాధరతిలక్కుగారు ; నిరాశే, మహాయజ్ఞం మొదలయిన పద్యాలు గేయాలు రచించిన వావిలాల సోమయాజులుగారు ; సంక్రాంతికల, గాన మాధురి, దేవా ! మొదలగు గేయములను గీతికలను రచించిన కొనకళ్ల వేంకటరత్నంగారు ; అనేకంగా గీతాలు, గేయాలు, చండీదాసు అనే గేయనాటిక రచించిన బాలాంత్రపు రజనీకాంతరావుగారు ; ప్రేమ, ఆశాగానము, మబ్బుల్లారా మొదలగు గేయములుగల ప్రేమరాగము రచించిన పెనుమర్తి కామేశ్వరరావుగారు ; అనేక గేయములను, నాటికలను రచించిన తల్లావఝ్ఝల కృత్తివాసతీర్థులుగారు; ఇంకా అనేకులు నవ్యసాహిత్యాభివృద్ధికి తోడుపడినవారు కలరు. ఇక్కడ అవకాశము చాలనందునవారి పేర్లు, వారు రచించిన గ్రంథముల పేర్లు తెలియజేయలేకపోయినందుకు చింతిస్తున్నాము.

---

## 2. శతక వాఙ్మయము

విషయ సంగ్రహము :— శతక రచనకు పునాది ఋగ్వేదము : ఆంధ్రశతక ప్రారంభము ; దశకము, వింశతి, శతకము మొదలగు విభాగములు ; ఏదో ఒకే విషయమునకు సంబంధించిన పద్యావళి; దేవతాస్తుతి, నీతి, శృంగార, వైరాగ్యము మొదలగు విషయములు ; వంగూరి సుబ్బారావుగారి శతకకవుల చరిత్రలో ఆరువందల శతకముల పరిశీలనము ; మొదటి తెలుగుశతకము ; ప్రతి కవిన్ని సాధారణముగా శతక రచనతో కవిత ప్రారంభించినట్లు కనబడుతుంది ; శతకరచనమునకు గౌరవము తక్కువ ; శతకములు సాధారణులకు ఆదరణీయములు.

శతకమనగా నూరు పద్యములుగల కావ్యమని యర్థము. ఏ పద్యమునకాపద్యము ఇతర పద్యముల అపేక్షలేక ఏదో ఒక విషయము, ఒక భావము పూర్తిగా కలిగి ఉంటుంది.

అన్ని పద్యములున్ను ఒకే మకుటముకలిగి గానీ, లేకగానీ, ఏదో ఒక పెద్ద విషయమునకు సంబంధించి వుంటవి. ఒకే మకుటముగల ఋక్కులున్ను, ఒకే దేవతకు సంబంధించిన ఋక్కులున్ను ఋగ్వేదములో అనేకముగా గలవు. కనుక శతకరచనకు తొలి బీజము ఋగ్వేదములోనే కనబడుతుంది.

**శతక రచనకు పునాది ఋగ్వేదము**

ప్రాకృతములో పదేసి పద్యాలు చొప్పున పదిదశకాలుగల శతకాలున్నవి. ఒక్కొక్క దశకములోని పద్యములు ఒక్కొక్క విషయమునుగూర్చి రచితములై వుంటవి. శతకములేకాక పెక్కువందల పద్యములుగల కావ్యములు గూడా ప్రాకృతములో కలవనుటకు హాలుని సప్తశతి నిదర్శనము.

ఈ సంప్రదాయము ననుసరించియే ఆంధ్ర సారస్వతములో సైతము శతకరచన వెలసినది. ప్రారంభములో శతకములు దేవుని స్తుతించుటకే ఉద్దేశించినట్లు కనబడును. ప్రతి పద్యమందున్ను కేశవాది నామములు స్తోత్రములలో ఉన్నట్లు కనబడుతూ వుంటవి. ప్రాకృతములో చేసిన దశక విభాగము, మన్నారు 'కృష్ణ శతకము' మొదలైన శతకములలో కనబడుతున్నది. కొందరు దశకమునకు మారుగా వింశతి నియమము పాటించినారు. దశకముగాని, వింశతిగాని ఏదో ఒక ఉద్దిష్టమైన విషయమునకు సంబంధించి వుంటుంది. ఇట్లే పెక్కువందలుగల పద్యావళికి సైతము తెలుగులో శతకమే అంటున్నాము. అందుకు వేమన శతకమే నిదర్శనము. వేమన శతకములో 700 పద్యములు కలవు. రానురాను శతకమంటే సరిగా నూరు పద్యములే ఉండవలెనన్న నియమము పోయి, నూరుకంటె ఎన్నైనను ఎక్కువ పద్యములు ఉండవచ్చునను నియమ మేర్పడినది. క్రమక్రమముగా ఆంధ్ర శతకములు ప్రత్యేకవ్యక్తిత్వము కలిగి, లోకుల ఆదరణమును పొందినవి.

**ఆంధ్రశతక రచనప్రారంభము**

పండిత వంగూరి సుబ్బారావుగారు రచించిన శతక కవుల చరిత్రము చదువదగిన గ్రంథము. వారు ఆరువందల శతకములను పరిశీలించినారు. కాని వెయ్యి శతకములు అయినను ఉండి ఉండును. 12 వ శతాబ్దమునాటి పాల్కురికి సోమనాథ విరచితమైన వృషాధిపశతకము మనకు తెలిసినంతవరకు ఆంధ్ర సారస్వతములో ప్రాచీనతమమైన శతకము. పాల్కురికి సోమనాథునివలెనే సాధారణముగా మన ఆంధ్రకవులందరున్ను తమ కవితారంభదశలో కనీసము ఒక శతకమైనా రచించినట్టు కనబడుతుంది. ప్రతికవిన్నీ ఉత్తమ కావ్యము రచించుటకు పూర్వము కొన్ని చాటు పద్యములు, శతకములు అభ్యాసముకొరకు రచించి ఉండవలెనని ఊహించవచ్చును.

**ప్రతికవిన్నీ శతక రచనతో కవిత ప్రారంభించెను.**

ఆంధ్రలాక్షణికులు మాత్రము ప్రబంధముల కిచ్చినంత గౌరవము శతకముల కిచ్చినట్లు కనబడదు. విన్నకోట పెద్దన్న శతకములను క్షుద్రకావ్యములలో చేర్చినాడు. అప్పకవి మాత్రము కొన్ని శతకములను ప్రమాణ గ్రంథములుగా పరిగ్రహించి అందలి ప్రయోగములు లక్షణములుగా చూపించినాడు.

**శతకమునకు గౌరవము తక్కువ**

శతకరచన సాధారణముగా సులభశైలిని ఉంటుంది గనుకను, అందులోని విషయములు భక్తిరస ప్రధానములుగాను, సాంఘికములుగాను ఉంటవి గనుకను శతకములు సాధారణముగా లోకులందరికినీ ఆదరణీయములుగా వుంటవి. అందులో భక్తిరస ప్రధానమైనవి దాశరథీశతకము, కృష్ణశతకము, భక్త చింతామణి శతకము మొదలైనవి. నిత్యము పారాయణగా వర్ణించుకొనేవారు వేలకొలది గలరు. వేమన శతకము, సుమతీ శతకము పిల్లలకుకూడా బోధపడే శైలిలో ఉన్నందున నేటికినీ ఆవే ఎక్కువగా బడులలో వ్యాప్తిచెంది యున్నవి.

**శతకములు సాధారణులకు ఆదరణీయములు**

ఒక పట్టికలో కొన్ని ముఖ్యమయిన శతకములను 'పట్టికలు' అను 7వ అనుబంధములో పేర్కొంటున్నాము.

# 3. ప్రజావాఙ్మయము

విషయ సంగ్రహము :—వీరశైవులు, మతప్రచారముకోసము జనసామాన్యమునకు బోధపడే జానుతెలుగున పద్యాలూ, పాటలూ రచించుటకు ప్రారంభించినారు. పద్య రచనకు పూర్వము పాట పుట్టినది; తెలుగు పాటలు ప్రజాదరణము పొందినవి; నవ్యసాహిత్యమందు ప్రజావాఙ్మయ మొక ముఖ్యమైన శాఖ; ఇందు పదవాఙ్మయం గురుజాడ అప్పారావుగారు పునరుద్ధరించిరి; బసవరాజు అప్పారావుగారు సిద్ధహస్తులు; వున్నవ లక్ష్మీనారాయణ, నేదునూరి గంగాధరం గార్ల జానపద గీతాల సేకరణ కృషి; ఆధునిక పదాలు రాజకీయ సంఘ సమస్యలకు సంబంధించినవి, రైతుభజనావళి, క్రాంతి గీతాలు, గేయ గుచ్ఛములు మొదలగునవి; నేటి పెక్కురు ఆంధ్రకవులు, రచయితలు.

మతప్రచారంకోసం వీరశైవులు

జానుతెలుగు పద్యాలూ, పాటలూ అనేకము మన కున్నవి. అసలు ఈ జానపదవాఙ్మయమును సృష్టించినది, విదములూ పాటలూ రచించినదీ ఆరంభములో ప్రజలలో పజ్ఞానోదయం కోసం, మతప్రచారం కోసం—వీర శైవులు. వీర శైవపు ఉద్ధృతం తగ్గగానే అదిమూలపడి, రానురాను పురాణ ప్రబంధములకే ప్రాబల్యము అధికమైనది. అయినప్పటికిన్నీ జనసామాన్యము హృద్యముగాను, చెవికింపుగాను ఉన్న జానుతెనుగు కీర్తనలూ, పదాలూ, పాటలూ, రగడలూ ఆదరిస్తూనే వచ్చినది. అది గమనించి ప్రజానురంజకం కోసం, అంతేకాక, అవి రమణీయముగా ఉండటంచేత రగడలను మధ్య మధ్య తమ కావ్యములలో ప్రబంధ కర్తలు చేర్చుకున్నారు.



శ్రీ నేదునూరి గంగాధరం
తెలుగులోని జానపదగీతములు 4000ల వరకు సేకరించిన భాషాభిమాని.

పాట పుట్టక.

"పద్యముకంట పదమే ముందుపుట్టిందని సాహిత్యమీమాంసకుల ఆశయము. నాగరకత ప్రారంభములో నాట్యము పుట్టింది. మనుషులు పగలంతో కష్టపడి, రాత్రి నలుగురూ ఉల్లాసముగా కాలము గడిపేటప్పుడు నాట్యము ప్రారంభ మవుతుంది. క్రమేణా కూని రాగము బయలుదేరుతుంది. ఆ తర్వాత మనస్సులో మాట బయటకు అనేటప్పుడు లయ యేర్పడుతుంది. ఆ శబ్దజాలమే పాట అవుతుంది."

తెలుగు పాటలు ప్రజాదరణము.

ప్రపంచములోకల్లా అతి ప్రాచీనమైన వేదసంహితలు వివిధ ఛందస్సులలో ఉన్న పాటలు. జానపద సాహిత్యమనే జాతీయవాఙ్మయములో ఊర్మిళనిద్ర, కుశలవకుచ్చల కథ, దేశింగుమహారాజుకథ, బొబ్బిలిపాట, పెద కామమ్మకథ, బాలనాగమ్మ కథ, బాలచంద్రుని వీరగాథ మొదలైన వెన్నో ఉన్నవి. ఇవన్నీ ఉద్రేక పూరితంగా ఉంటవి. తర్వాత, సంగీత పాఠకులుకూడా స్తుతించి పాడుకుంటూఉండే త్యాగయ్య కీర్తనలూ, క్షేత్రయ్య, సారంగపాణి పదాలూ మొదలైనవి ప్రజాదరణ పొందగలిగినవి. ఈ పదకర్తలందరిలోనూ జాతీయత చిత్రచిత్ర రూపాలలో ప్రతిబింబిత మవుతున్నది. పండితాదరణము లేకపోయినప్పటికిన్నీ దొరలు ఇచ్చిన పాలకన్నా అడుగడుగునా నిక్షేపంగల ధరణి ఇచ్చినపాలు మేలన్నట్లు ప్రజాదరణమువల్లనే ఈ పదవాఙ్మయము వికసించినది.

పదవాఙ్మయం గురుజాడ అప్పారావుగారు పునరుద్ధరించిరి.

ఆధునిక నవ్యసాహిత్యంలో పదవాఙ్మయమునకు ప్రాపై నిల్చినది కీర్తిశేషులయిన గురజాడ అప్పారావుగారు. వీరు దేశాభిమానము వర్ధిల్లి, దేశము ఔన్నత్యము పొందాలంటే తప్పకుండా కవిత కోకిలములు జాత్యభిమానము పురికొల్పేటట్టు,

"ఆకులందున అణగిమణిగీ
కవిత కోకిల పలుకవలెనోయి,
పలుకులనువిని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయి."

అనిన్నీ ; పదవాఙ్మయముమీద శీతుకన్ను వేసి అపహసించే పండితుల నుద్దేశించి

"కొయ్యబొమ్మలు మెచ్చుకళ్లకు
కోమలులు సౌకెక్కు—నా." అనిన్నీ చెప్పి
ఈ వాఙ్మయానికి ఒక విశిష్టత, జిగీ సమకూర్చారు.

వీరి పుంతలలోనే పోయి అనేకపదాలు రచించినది కీ. శే. బసవరాజు అప్పారావుగారు. అసలు భారత జాతికి కీర్తి స్తంభములాగ నిలచిన గాంధి మహాత్మునిమీద 'కొల్లాయి గట్టితేనేమి—మా గాంధి కోమటై పుట్టితేనేమి అనీ;' 'నల్లవాడే-గొల్ల పిల్లవాడే' మొ॥గు మకుటములతో ఆయన వ్రాసిన పాటలు, ఆబాల గోపాలమూ పాడుకుంటూనే ఉన్నారు. ఇదే, ఈ కవి ప్రతిభకు నిదర్శనము, ఇంక,

సిద్ధహస్తులు బసవరాజు అప్పారావుగారు

పదాలు వ్రాసినవారిలో చెప్పవలసిన ప్రసిద్ధులలో ఉన్నవ లక్ష్మీనారాయణగారు, కవి కొండల వెంకట్రావుగారు నేదునూరి గంగాధరంగారు మొదలైనవారు.

దేశములో రాజకీయ సంచలనముతో స్వాతంత్ర్యపిపాస చెలరేగుతున్నది. గరిమెళ్ల సత్యనారాయణగారి 'మాకొద్దు తెల్ల దొరతనము' అనేపాట ఆంధ్రదేశమంతా అల్లుకొని పోయి కలవరము పుట్టించినది. కోరుగింజలు కొంగులోకి తెచ్చుకొని అన్నీ పండించే కాపే అన్నానికి కరువున పడి పోతున్న ఈ కాలంలో కర్షకుల కష్టాలు పోవాలనీ, కార్మికుల కష్టాలు పోవాలనీ ఏ కొద్దిమంది వ్యక్తులకో ధన దాహము తీర్చు ఇప్పటి దౌర్భాగ్యపు ధనధాన్య విభజన పద్ధతి నశించాలనీ ఉన్నత ఆశయములు ప్రజాహృదయాలలో నాటుక పోయినవి. కష్ట నివారణమునకో, ఉల్లాసమునకో ఉదయించే కవిత్వములోను, నేటి కవి జీవితములోను క్రొత్తక్రొత్త భావములు ఉదయించి, నూత్నాదేశమును సృష్టించి భావములే చిత్రచిత్రములైన రసాకృత్తులతో ఆ కవుల కావ్యములలో సుమియిస్తున్నవి.

ఆధునికపదాలు సంఘసమస్యకు సంబంధించినవి.

రైతుల కష్టాలను చూపించి, వాటి నిర్మూలనకు మార్గమును సూచిస్తూ వ్రాయబడిన పదాలను సేకరించి ఆచార్య రంగాగారు "రైతు భజనావళి" అనే సంపుటిని ప్రకటించారు. ఇట్టి పద సంగ్రహములే 'క్రాంతిగీతాలు', 'గేయగుచ్ఛము' మొదలైన గ్రంథములు.

పై పేర్కొనినవారుగాక తుమ్మల వెంకట్రామయ్య, నార్ల వెంకటేశ్వరరావు, శెట్టిపల్లి వెంకటరత్నం, చిరుమామిళ్ల విజయపార్థసారథి, దువ్వూరి రామిరెడ్డి, ప్రయాగ కోదండ రామశాస్త్రి, అల్లూరి అప్పారావు, చదలవాడ పిచ్చయ్యగార్లు ఆకలిమంటలు, అభ్యాగభీరత, కూలీలరాజ్యం, ఆవేదనాగ్ని అనే వివిధ శీర్షికల క్రింద అనేక పదములను ప్రకటించారు. వీరి రచనలన్నింటిలోను ఆవేశము, సృజనాశక్తి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ప్రయాగ నరసింహశాస్త్రిగారి పాటలు రేడియోద్వారా తరుచుగా ప్రజల నాకర్షిస్తున్నవి.

నేటి ఆంధ్ర పదకవులు

మొత్తముమీద మన సారస్వతములో పదాలదొక ప్రత్యేకత, వెలుగూను.

## 4. స్త్రీలవాఙ్మయము

చదువన్నేర్తురు పూరుషుల్ బలెనె
శాస్త్రంబుల్ పఠింపించుచో,
నదుమన్నేర్తురు శత్రుసేనల ధనుర్వ్యాపార
ముల్ నేర్పుచో,
నుదితోత్సాహముతోడ నేలగల రీయుర్విన్
బ్రతిష్ఠించుచో
ముదితల్ నేరగరాని విద్యగలదే
ముద్దార నేర్పించినన్.

—శ్రీ చిలకమర్తి కవీంద్రుడు.

విషయ సంగ్రహము :— మొదటిప్రకరణము—స్త్రీవిరచితములు-ఆదికాలమునుండిన్ని ఆంధ్ర స్త్రీలలో విద్యావతులు గలరు. సాతవాహనుని భార్య; నారాయణభట్టు కూతురు కుప్పమ్మ, కోన బుద్ధరాజు కూతురు ఆంధ్రకావ్య రచయిత్రులు; కృష్ణదేవరాయని కూతురు మోహనాంగి మరీచి పరిణయమును, మొల్ల రామాయణమును రచించిరి; రఘునాథనాయకుని వారాంగనలు; రామభద్రమ్మ గొప్ప పండితురాలు, కవయిత్రి; రంగాజమ్మ రచించిన ప్రబంధములు; మధురవాణి, సౌందరీదేవి రచించినవి; ముద్దుపళని రచించిన రాధికా సాంత్వనము, మదన

సుభద్రమ్మ శతకము, దండకములు; తరికొండ వేంకమాంబ రచనలు: బండిబావమ, రత్నాంబ, అమ్మణిఅమ్మాళ్, వేమూరి శారదాంబ, అలివేల మంగమ్మ, రాణి చెల్లాయమ్మారావు రచించినవి; 20 వ శతాబ్దమందలి రచయిత్రులు; బండారు అచ్చమాంబ, గుండు అచ్చమాంబ మొదలగు 200 కు పైగా స్త్రీలు, 400 కుపైగా వారిగ్రంథములు; కవయిత్రులు: కొటికలపూడి సీతమ్మ మొదలగువారు కావ్యములను, గేయములను; మాణిక్యాంబ, జూలూరు కలశమ్మ మొదలగువారు నాటకములను రచించిరి; నవ్యసాహిత్యగీతాది గ్రంథ రచయిత్రులలో చావలి బంగారమ్మ, తల్లాప్రగడ విశ్వసుందరమ్మ మొదలగువారు; కథలు, నవలలు రచించిన స్త్రీలు ఎక్కువగా ఉన్నారు; జయంతి సూరమ్మగారి సుదక్షిణాచరిత్ర స్త్రీలనవలలలో మొదటిది కాబోలు:—స్త్రీల పత్రికలు హిందూసుందరి గృహలక్ష్మి మొదలగునవి ఎక్కువగా ప్రచారములో నున్నవి.

రెండవ ప్రకరణము—స్త్రీలకై విరచితములైన గ్రంథములు; చింతాదీక్షితులుగారి వ్యాసము; స్త్రీల పాటలలో మునుపటివి లాలిపాటలు, జోలపాటలు, గుమ్మడిపాట, పురాణకథల పాటలు మొదలగునవి పోయినవిపోగా, నిల్చియున్నవి నందిరాజు చలపతిరావుగారు మొదలగువారు ప్రకటించినవి. ఆ పాటలలోని లక్షణము.

ఆంధ్రుల చరిత్రలో ఆదికాలమునుండిన్ని విద్యావంతులయినస్త్రీలు కలరని చెప్పవచ్చును. బృహత్కథామంజరి గుణాఢ్యునివద్దనుండి అందుకొని సంపాదించిన ఆంధ్రరాజు సాతవాహనుడు మొట్టమొదట సంస్కృతభాష బాగుగా తెలియనివాడై ఉండెననిన్నీ, అతనిభార్య సంస్కృత పాండిత్యముగల విద్యావతియనిన్ని తెలియజేసే కథ యొకటి కలదు. ఆ ఇరువురు భార్యాభర్తలున్ను జలక్రీడ లాడుకొను సమయమున రాజు తనపైకి జలములను చిమ్ముతూ ఉండగా ఆమె "మోదకైస్తాడయ" అని పలికినది. ఉదకైః=ఉదకములతో, మా తాడయ=కొట్టవద్దు; అని ఆమె అన్నది. మోదకైః=కుడుములతో, తాడయ=కొట్టుము; అని రాజు అర్థము చేసుకొని వెంటనే మోదకములను తెప్పించి హాస్యాస్పదుడయ్యెనని కథలో ఉన్నది.

సాతవాహనుడు.

నన్నయభట్టుకు సహాయముగానుండిన నారాయణభట్టు కూతురు కుప్పమ్మ దొడ్డ కవీశ్వరురాలట. గాని ఆమె రచించినదేదీ మనకు లభ్యముకాలేదు. - ద్విపద రామాయణము రచించిన రంగనాథునికి సహకారిగానుండిన కోనబుద్ధి రాజు కూతురు (క్రీ. శ. 1230-1240 నాటిది) బాల్యమందే విధవరాలై తన దుస్థితికి అనుగుణముగా రచించిన కరుణరసప్రధాన పద్యములు కొన్ని 16 వ శతాబ్దమున కృష్ణదేవరాయల అష్టదిగ్గజములలో నొకడైన అయ్యలరాజు రామభద్రకవి తాను రచించిన సకలకథాసారసంగ్రహమందు చేర్చుకొనెనట!

నారాయణభట్టు-కోన బుద్ధిరాజు కూతుళ్లు

కృష్ణదేవరాయని కూతురు మోహనాంగి మరీచిపరిణయమను శృంగార ప్రబంధమును రచించి రాయల ఆస్థాన పండితుల సభలో చదివించి పండితులమెప్పును బడసినది. 1509-30 లో వెలసిన కుమ్మర మొల్ల కావ్యశైలిని రామాయణమును ప్రబంధముగా రచించినది. ఆంధ్ర రామాయణము లన్నిటను మొల్లరామాయణము మృదుమధురశైలిని సామాన్యులకు సైతము సుబోధకమగునట్లు రచితమగుటచేత దేశములో ఎక్కువగా వ్యాప్తిచెందియున్నది.

మోహనాంగి - మొల్ల

తంజావూరి నాయకులలో 1630-1640 నాటి రఘునాథనాయని పోషణలో ఉండిన వారాంగనలందు కొందరు పండితురాండ్రును కవయిత్రులును గలరు. అందులో రామభద్రమ్మ రఘునాథనాయని వీరవిక్రమములను, విద్యావినోదములను కీర్తిస్తూ రఘునాథాభ్యుదయ మనే కావ్యమును సంస్కృతభాషలో రచించెను. ఆమె శతలేఖినీ విద్య యందును సమయలేఖినీవిద్య యందును చతురురాలు. సంస్కృతమేకాక, ఆరుప్రాకృతములను, ఆంధ్రభాషను చక్కగా నభ్యసించిన విద్యావతి. ఈ ఎనిమిది భాషలందును కవిత్వము చెప్పగల ప్రజ్ఞావతి. అందుచేత ఆమె సాహిత్య సామ్రాజ్యమం దగ్రపీఠము నలంకరించి యుండెను. ఆమె రచించిన రఘునాథాభ్యుదయమును బట్టి రఘునాథుని ఆస్థానమునగల విదుషీమణులు సాహిత్యమందేకాక సంగీతమందు సైతము గొప్ప నైపుణ్యముగలవారనిన్ని, వీణ, రావణహస్తము మొదలయిన యంత్రములు వాయిస్తూ మధురముగా గానాలాపముచేసే వారనిన్ని

రామభద్రమ్మ.
రంగాజమ్మ.
మధురవాణి.
సౌందరీదేవి.



శ్రీమతి బండారు అచ్చమాంబ, కీ. శే. లక్ష్మణరావు పంతులుగారి సోదరి, అబలా సచ్చరిత్ర రత్నమాల గ్రంథకర్త్రి, కీ. శే. రాలు.

వారిని రఘునాథుడు ఎక్కువగా ఆదరించి వారికి కనకాభిషేకము చేస్తూ ఉండేవాడని న్ని తెలియవచ్చినది. వారిలో రంగాజమ్మ మన్నారు దాస విలాసము, ఉషా పరిణయము అనే రెండు ప్రబంధములు రచించినది. వీటి వ్రాతప్రతులు తంజావూరి సరస్వతీ పుస్తక భాండాగారములో కలవు. మధురవాణి సంస్కృతమున రామాయణమున్ను, తెలుగున నైషధము, కుమార సంభవమున్ను రచించెను. సౌందరీదేవి, అల్లాడభూపతి సింహనరేంద్రవిలాసమనే ప్రబంధమును రచించెను. ఇది చెన్నపుర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమందున్నది.

**ముద్దుపళిని, మదిన సుభద్ర, తరికొండ వేంకమ, బండి బాపమ మొ॥**

తంజావూరి రాజులలోనే 1765 నాటి ప్రతాపసింహుని వేశ్య అయిన ముద్దుపళిని రాధికాసాంత్వన మను శృంగార ప్రబంధమును రచించినది. గ్రంథమంతా మృదుమధుర శైలిలో ముద్దు లొలుకుతూ మనోహరంగా ఉన్నది. అందలి శృంగారరసప్రధానమైన పద్యాలుకొన్ని నేటి విద్యాధికులకు అసభ్యములుగా కనబడవచ్చును గాని, ఆ దేశమం దప్పటివారి అభిరుచుల కనుగుణముగా నుండెనని చెప్పగలము. సుమారు 1810 లో మదిన సుభద్రాయమ్మ కొన్ని శతకములు, దండకములు రచించెను. అందులో కేశవశతకము, కృష్ణశతకము ముఖ్యమయినవి. ఈమె గోడే నారాయణగజపతిరాయణింగారి మేనత్త. సుమారు 1840 లో వెలసిన తరికొండ వేంకమాంబ ద్విపదలలో భాగవతము, రాజయోగసారము, వాసిష్ఠ రామాయణమున్ను వేంకటాచల మాహాత్మ్యమను ప్రబంధమున్ను రచించెను. 1850 లో బండి బాపమ మీనాక్షీ శతకమున్ను 1870 లో రత్నాంబ వేంకటరమణ శతకమున్ను 1891 లో అమ్మణి అమ్మాళ్ కృష్ణశతకమున్ను, 1891లోనే వేమూరి శారదాంబ మాధవ శతకము నాగ్నజితీ పరిణయమనే ప్రబంధమున్ను 1892 లో పి. అలివేలమంగమ్మ పద్మినీ హంసునిగానవినోద మనే గేయమున్ను 1900 లో చెలికాని రాణి చెల్లాయమ్మరావు పార్థసారథి శతకమున్ను రచించినారు.

**20 వ శతాబ్దమందలి రచయిత్రులు**

ఈ 20 వ శతాబ్దము ప్రారంభించినసరికి అబలాసచ్చరిత్ర రత్నమాల, బీదకుటుంబము వచనరూపమున రచించిన బండారు అచ్చమాంబ; శమంతకమణి, రామేశ్వర యాత్ర చరిత్ర, సత్కథామంజరి మొదలయిన వచనగ్రంథములను రచించిన గుండు అచ్చమాంబ; మహిళా కళాబోధిని, పాతివ్రత్యము మంగళహారతులు రచించిన పులుగుర్త లక్ష్మీనరసమ్మ; భగవత్కీర్తనలు రచించిన నందూరి శ్రీలక్ష్మమ్మ; బాలబోధ వ్యాకరణము రచించిన శ్రీ రంగమ్మవిదుషి మొదలయిన విద్యావతులు కొంతవరకు నవీన విజ్ఞానమును గ్రహించి నూతన రచనలకు త్రోవ చూపిరి. ఈ 20 వ శతాబ్దములో చదువెరిగిన స్త్రీల సంఖ్య నూటికి నాలుగుకంటె అధికము కాకపోయినా వీరిలో గ్రంథములు రచియించినవారి సంఖ్య మాత్రము ఉత్సాహకరముగానే ఉన్నది. ఈ నూతన యుగములో క్రొత్తగా వెలసిన గద్యరచన స్త్రీలను ఎక్కువగానే ఆకర్షించినది. కథలు, నవలలు, వ్యాసములు మొదలయిన గద్యరచనలున్ను, శతకములు, ఖండకావ్యములు, ప్రబంధములు, పాటలు, పదాలు మొదలయిన పద్యరచనలున్ను రచించిన స్త్రీలసంఖ్య 200 కు పైగా ఉండవచ్చును. వీరి గ్రంథములన్నీ మొత్తముమీద 400 కు పైగా నుండునని చెప్పగలము.

**కవయిత్రులు**

పద్యకావ్యములలో శతకములు రచించినవారు కొందరు కలరు. కొటికలపూడి సీతమ్మ 1908 లో సాధురక్షణ శతకము రచించెను. అంతేకాక లేడీజేన్‌గ్రే అను ఆంగ్ల కావ్యము ననుసరించి 1915 లో ఆంధ్రకావ్యమున్ను అహల్యాబాయి ఉపన్యాసమాలిక, ఉన్నతస్త్రీవిద్య, కందుకూరి వీరేశలింగం చరిత్ర మొదలయిన నవీన గ్రంథములున్ను రచించెను. కాకాణి వేంకట నరసమ్మ కృష్ణ కందార్థములు (1913), కళ్లేపల్లి వెంకట నరసమ్మ

వరలక్ష్మీ శతకము (1914), కే. లక్ష్మమ్మ ఆదివిష్ణు శతకము (1915), కొటికెల పెద్దతులశమ్మ కందార్థ నక్షత్రమాల (1916), కాంచనపల్లి కనకమ్మ రంగశతకము (1916), ఎస్. శేషమాంబ పాండురంగ శతకము (1918) మొదవరపు లక్ష్మీనరసమాంబ భద్రాచలధీశ్వర శతకము (1919) రచించిరి. వీరిలో కాంచనపల్లి కనకమ్మగారు ఎక్కువగా విద్యా వ్యాసంగముచేసి విద్వాన్ పరీక్షలో ఉత్తీర్ణురాలై, చెన్నపురి క్వీన్ మేరీజ్ సర్వకళాశాలలో ఆంధ్రభాషాధ్యాపకురాలుగా నున్నారు. వీరు అమృతవల్లి, గౌతమబుద్ధ చరిత్ర, ఆంధ్ర శాకుంతలము, జీవయాత్రాంతర్గత పద్యముక్తావళి మొద లయిన గ్రంథములు రచించిరి. యం. రంగనాయకమ్మ తులసీదళ శతకమును, కాదాటి నరసమ్మ వరదరాజశతకమును, కొండేపూడి సుందరమ్మ పుండరీకరామ శతకమును, జొహరా పురము కమలమ్మ రామశతకమును, పి. వేంకట సీతమ్మ శ్రీపార్థసారథి శతకమును ఇటీవల రచించిరి. పాటలు (పెండ్లి పాటలు, మంగళహారతులు, లాలిపాటలు, భక్తి పాటలు మొదలయినవి) రచించిన స్త్రీలు ఎక్కువగా నున్నారు. వారిలో నరసమ్మాళ్ రచించిన కల్యాణ పాటలు (1909), జూలూరు కలశమ్మ రచించిన యశోదాకృష్ణ సంవాదము (1911), తెలికపల్లి నరసమాంబ రచించిన స్త్రీల పూజ పాటలు (1913), రుద్రభట్ల లోకమాంబ రచించిన భగవత్ప్రార్థనలపాటలు (1915), కర్లపల్లి వేంకటరమణమ్మ రచించిన మహాలక్ష్మీ పూజపాటలు, వంగల వేంకమాంబ రచించిన భజన కీర్తనలు, గుణుపూడి ఇందుమతీదేవి రచించిన లక్షణా పరిణయము మొ॥నవి, కనుపర్తి వరలక్ష్మమ్మ రచించిన సత్యా ద్రౌపదీ సంవాదగేయము ప్రచారములో నున్నవి. 1911లో మామిడన్న సుభద్రమ్మ ద్విపదలో రచించిన అధ్యాత్మ రామాయణకావ్యములో చక్కని శైలి, కవితా చమత్కృతి కనబడును. ఆకాలమందే బుర్రా సూరమాంబ రచించిన సావిత్రీ విజయమను కావ్యము పేరుపొందినది. అమలాపురపు సీతారామమ్మ 1926లో రచించిన సతీ సావిత్రియను ఖండకావ్యము సైతము మెచ్చుకోదగినదే.

**నాటకములు రచించిన స్త్రీలు**

నాటకములు రచించిన స్త్రీలు కొందరున్నారు. 1899 లోనే అనగా ఆంధ్ర సారస్వతంలో నాటక రచన ప్రారంభమైన కొద్ది సంవత్సరములకే బు.మాణిక్యం రావణసంహారమను నాటకమున్నూ, జూలూరు కలశమ్మ 1909 లో పుష్ప లీలావతి, గులేబకావళి అనే నాటకములను, 1912 లో గుడిపాటి లక్ష్మీనరసమ్మ స్వయంవరమనే నాటకమును, 1914 లో నీరము సుభద్రయాంబ సురుచీ విజయమనే నాటకమును, 1917లో విస్సంరాజు సీతమాంబ సావిత్రీ నాటకమును, ఎమ్. ఏ. మందతాయారమ్మ సుల్తానీ కల్యాణమనే నాటకమును, 1918 లో కందాళ చూడమ్మ కమలాపరిణయ మనే నాటకమును రచించిరి; గాని, ఈ నాటకములలో ఏదిన్నీ ప్రదర్శనార్హముకాలేదు. అందుచేత నేకాబోలు స్త్రీలలో ఎవరున్ను ఇటీవల నాటకములు రచిస్తూ ఉన్నట్లు కనబడదు.

ముద్దుకృష్ణగారు సంకలితముచేసి ప్రకటించిన వైతాళికు లలో చావలి బంగారమ్మ, తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, సౌదామిని (బసవరాజు రాజ్యలక్ష్మమ్మ) గార్ల పేర్లు నవ్యసాహిత్య యుగమందలి కవయిత్రులలో ప్రధానమైనవిగా కనబడుతున్నవి. "తెనుగు కడుపున పుట్టి చేవదేరిన నుడికారము ఈమె భాష. పోకడలలోనూ, తాటాకుబొమ్మలకు ప్రాణము పోసి కన్నబిడ్డగా చంకను ఎత్తగలిగిన పసినాటి తెలుగు భావన ఈమె ఊహా వీధిలోనూ... ఊహా ప్రపంచాన ఎంత గారడీ ఉన్నదో ఆనందించవలెనంటే 'ఆ కొండ' లోని చోద్యమునుబట్టి గ్రహించవచ్చును"; అని బంగారమ్మ గారి గురించి ముద్దు కృష్ణగారు వ్రాసినారు. ఆమె రచించిన ఇతర గీతములలో పేర్కొదగినవి. కప్పతల్లి పెళ్లి, కార్తిక పూర్ణిమ, తమస్సు.

**నవ్య సాహిత్య గీతాది రచయిత్రులు**

తల్లాప్రగడ విశ్వసుందరమ్మ "అందరాని ఊహలకు ఆసించే వ్యక్తి". ఈమె రచించిన "ప్రతిగీతంలోనూ అవ్యక్తంగానైనా ఒక వేదన, గుండె చుఱుక్కుమన్న కోయిల కేకవలె ధ్వనిస్తుంది." ఈమె గీతములలో ప్రియుడా! : స్నేహరుచి, కుపితవిధి, అంధకారము ముఖ్యమైనవి. సౌదామిని రచించిన గీతములలో ప్రియ నిరీక్షణము, చలిగడగడ, ఆకాశమున మబ్బు, ప్రణయినీ గీతము, దురదృష్టము, "చాలా ప్రశస్తమైనవి". కడుసున్నితము, మహాగభీరము; ఈయమపలుకు; హృదయము... ఒక్కొక్క గీతం ఒక్కొక్క హృదయస్పందనం" అని ముద్దుకృష్ణగారి ప్రశంస.

నవలలు రచించిన స్త్రీలు ఎక్కువగా ఉన్నారు. వీరిలో జయంతి సూరమ్మగారి సుదక్షిణా చరిత్రముతో స్త్రీల నవలా

రచన1906 లో మొదలుపెట్టినట్లు కనబడుతుంది. 1914 లో మల్లవరపు సుబ్బమ్మ కళావతి చరిత్ర, కృపాబాయి సత్యనాథమ్ కమలాంబ, ఎస్. స్వర్ణమ్మ ఇందిర 1916లో వి. శ్రీనివాసమ్మ ప్రియాన్వేషణము, సేతుపిండారి, గోపిసెట్టి లక్ష్మీనరసమాంబ సుకేశి, సుగుణావళి, 1919-21 లో మాగంటి అన్నపూర్ణా దేవి సీతారామము, నవవర్ష స్వప్నము అనే నవలలు రచించినారు. ఇటీవల ఓలేటి సూర్య ప్రభాదేవి ఇందుమతి, దేశిరాజు లక్ష్మీనరసమాంబ కమలావతి, పులవర్తి కమలావతీదేవి కుముద్వతి, రాధికాచంద్రావళులు, మల్లాది బుచ్చమ్మ లంకాపతి, కనుపర్తి వరలక్ష్మమ్మ వసుమతి, ఏ. పి. పిరాట్టమ్మ శోభావతి, ఆచంట సత్యవతీదేవి సునందిని, కూచి రామలక్ష్మమ్మ అమల, పి. రాజలక్ష్మమ్మ మదవతి, డి. సత్యనాథన్‌సతి లలిత, సీరము సుభద్రయాంబ జాగిలము, పులుగుర్త లక్ష్మీనరసమాంబ యోగీశ్వరి, చిల్లరిగె రమణమ్మ రామాశ్రమము, అట్లూరి వేంకటసీతమ్మ రూపవతి అనేనవలలు రచించినారు.

నవలలు రచించిన స్త్రీలు

పైని పేర్కొబడిన వారుకాక ఇంకా చాలామంది స్త్రీలు గద్యపద్య కావ్యములను రచించినవారు గలరు. కేవలము తెలుగు సాహిత్య ప్రచారముకోసము వెలువడిన మాసపత్రికలు :—హిందూసుందరి, సావిత్రి, జనానామేగజీను, వివేకవతి, గృహలక్ష్మి స్త్రీల విద్యాభివృద్ధికి ఎక్కువగా తోడుపడి గ్రంథరచన మొ॥నవి సాగించవలెనన్న ఉత్సాహము స్త్రీలకు అధికముగా కలిగించినవి.

స్త్రీలు-పత్రికలు

## 2

మొదటి భాగములో చెప్పినదంతా స్త్రీలు అందరికోసము చెప్పిన గ్రంథములకు సంబంధించినది. ఈ భాగములో కేవలము స్త్రీలకోసము, పిల్లలకోసము రచితములైన పాటలు, పదాలుగురించి తెలిజేస్తున్నాము. ఈ విషయము ఎక్కువగా కృషిచేసినవారు చింతా దీక్షితులుగారు. కీ. శే. గిడుగు వేంకట రామమూర్తిపంతులుగారికి వారి సప్తతితమ జన్మ దినోత్సవమునకు విద్వాంసులు సమర్పించిన వ్యాససంగ్రహములో దీక్షితులుగారి స్త్రీలసారస్వతమ నే వ్యాసము చదవదగినది.

చింతాదీక్షితులుగారి వ్యాసము

స్త్రీల పాటలు చాలాకాలమునుండి దేశములో వ్యాప్తి చెందియున్నవి. ఇందులో కొన్ని ఎవరు ఎప్పుడు రచించినారో తెలియదు. ఏవి, తెలుగుదేశమంతటనుగాని ఎక్కువ మేరగాని వ్యాపించియున్నవో, అవి చాలాకాలమునాటివని చెప్పవలెను. "ఏడవకు నాతండ్రి ఏడవకు నాతండ్రి ఏడిస్తే నిన్నెవ్వ రెత్తుకుంటారు"; "లాలనుచు పాడరమ్మా, ఈబిడ్డ లక్ష్మివిలాసుడమ్మా"; "లాలిబంగురుబొమ్మ లాలిమాయమ్మ, లాలిముద్దులగుమ్మ లాలి సీతమ్మ" మొదలయిన లాలిపాటలు; "సువ్వి సువ్వి రామచంద్ర, సువ్విసువ్వి కీర్తిసాంద్ర, సువ్వి సీతమ్మ మాకు శుభములిమ్మా" అనే సువ్విపాట; "నీకిస్తి పాలలో ముంచెత్త వమ్మ పాలనే ముంచెత్తు నేత ముంచెత్తు" మొదలయిన అప్పగింతలపాటలు, కృష్ణాష్టమినాడుపాడే "కస్తూరి రంగ రంగా నాయన్న కావేటి రంగరంగా" అనేపాట, "గుమ్మడేడే గోపిదేవి, గుమ్మడేడే కన్నతల్లి గుమ్మడిని పోడ చూపగదవే అమ్మ గోపమ్మా—అమ్మా గుమ్మడేడే" అనే గుమ్మడిపాట ; భాగవతం, భారతం, రామాయణం మొదలయిన పురాణగ్రంథములందలి కథలకు సంబంధించిన పాటలు చాలా కాలమయి అనుశ్రుతంగా వచ్చి దేశమంతటా వ్యాపించి ఉన్నవి.

స్త్రీలపాటలలో ముసుపటివి

ఆంగ్లేయప్రభుత్వమువారు బాలికాపాఠశాలలు పెట్టిన తర్వాత ఈ పాటలయెడల ఆదరము చాలామంది బాలికలకు అంతరించినది. మన నాయనమ్మలకు, అమ్మమ్మలకు వచ్చిన పాటలలో సగము మన తల్లులనాటికి, మన తల్లులకు వచ్చిన పాటలలో మూడువంతులు మన సోదరుల నాటికి అంతరించి పోయినవి. ఏలూరిలో నందిరాజు చలపతి



కీ. శే. శ్రీమతి జూలూరి కలశమ్మ ప్రఖ్యాత కవయిత్రి.

రావుగారు, కాకినాడలో మంగు వేంకట రంగరాథరావు గారు, రాజమండ్రిలో నేదునూరి గంగాధరంగారు ఇంకా అక్కడక్కడ కొందరు కొన్ని పాటలు సేకరించి ప్రకటించినారు. ఇంకా బ్రతికియున్న ముసలమ్మల నోటను, బిచ్చగాళ్ల నోటను కొన్ని పాటలు ఆడుతూఉన్నవి. వీటియెడల పండితులకు ఎన్నడూ ఆదరములేక పోయినది. అయినా స్త్రీలు వీటిని కాపాడుకొంటూ వచ్చినారు.

పోయినవిపోగా మిల్చియున్నవి కొన్ని

ప్రాచీన వ్యాకరణ నిబంధనల ననుసరింపలేదని ఈ పాటలను పండితులు నిరసించినా వీటిలోని భావ జీవద్భావ కావడంచేత వీటిలోని భావాలు సూటిగా హృదయాన నాటుకొంటవి. కావ్య భావలో రచితములైన అనేక కావ్యముల కంటె ఈ పాటలలో కవిత్వధర్మము ఎక్కువగానే ఉన్నదని చెప్పగలము. ఈ పాటలలోని ఛందస్సు కేవలము దేశీయము. పెక్కుపాటలు ద్విపదలలో ఉన్నవి. కొన్ని సీసములను పోలియుంటవి. మొత్తమువిూద మాత్రలసంఖ్యావిూద ఆధారపడినవి. కొన్ని మూడు మాత్రలకు కొన్ని నాలుగు మాత్రలకు కొన్ని అయిదుమాత్రలకు కొన్ని ఏడు (3+4) మాత్రలకు విరుగుతూ త్రిస్ర, చతురస్ర, ఖండ, మిశ్రగతులలో ఉంటవి.

ఆ పాటల లక్షణము

## 5. బాలవాఙ్మయము

విషయ సంగ్రహము :— బాలవాఙ్మయం నవ్య సాహిత్య యుగంలో ప్రారంభము ; అంతకుపూర్వం జోల, లాలి పాటలు, చిన్న శతకాలు మొదలగునవి బాలబుద్ధికి అందని గ్రాంధిక భాషలో రచితములు ; బాలభాషలో రచితములగుటకు ప్రారంభము ఇటీవలనే ; బాలసారస్వత రచయితలు ; సిద్ధహస్తులు చింతా దీక్షితులుగారు; బాలవాఙ్మయమునకు అవకాశమిచ్చిన పత్రికలు గృహలక్ష్మి, భారతి మొదలగునవి ; బాలవాఙ్మయమింకా అల్పం ; ఇతర భాషలలో ఎక్కువ; హెచ్చరిక.

బాలసారస్వతము నవ్యసాహిత్యయుగంలోనే ప్రారంభమయినది. స్త్రీల సారస్వతము రెండవభాగములో పిల్లలను ఉయ్యాలలో పడుకోబెట్టి లాలిపాటలు, జోలపాటలుతల్లులు పాడుతూ ఉంటారని చెప్పినాము. ఆ పాటలు పాడుతూ ఉన్నప్పుడు పిల్లల చెవులకు హాయిగా వినబడుతూ వారిని జోగొట్టి నిద్రపుచ్చునే కాని వారికి బోధపడి వారి హృదయములను వికసింపజేయవు. అవి పిల్లలభాషలో రచితములయినవి కావు. “చందమామ రావె జాబిల్లి రావె” మొదలయిన పాటలు, పిల్లలపాట లనదగినవి కొద్దిగా ఉన్నవి. అందులో సైతము పిల్లలకు అర్థముకాని పదములు, భావములు ఉండడంవల్ల పూర్తిగా తృప్తికరమయినవి కావు. పెద్ద బాలశిక్ష, వేమన శతకము, సుమతీ శతకము, కృష్ణ శతకము, కుమార శతకము, కుమారీ శతకము మొదలయిన కొన్ని శతకములు తప్ప బాల సారస్వతములో చేర్చదగిన వాఙ్మయమేదీ ఎక్కువగా ప్రకటితము కాలేదు. పాతకాలలలోని వాచకములు, పిల్లల తరగతులనుబట్టి రచించినవి, మాత్రమే కనబడుతున్నవి. సంవత్సరమున కొక వాచకము, దినమునకొక సగముపాఠముచొప్పున పిల్లలు పాఠశాలలో చదువుకొనుటకు ఉద్దేశించి రచించిన ఈ బడి పుస్తకములు మాత్రమే బాల సారస్వతమని చెప్పవలెను. తమంత తాము సరదాగా గురువుల సాయమక్కరలేకుండ సులువుగా బోధపరచుకొంటూ చదువదగిన పుస్తకాలు మొత్తమువిూద లేనేలేవని చెప్పవలెను.

జోల, లాలిపాటలు, చిన్న శతకములు మాత్రమే ఉండేవి

ఇటీవల వేంకట పార్వతీశ్వరకవులు, ఓరుమళ్ల కామేశ్వరరావుగారు మొదలయినవారు కొందరు బాల గీతావళి పుస్తకములు పిల్లల తరగతుల ననుసరించి రచించినారు; గాని అవి పిల్లల భాషలోలేవు. ప్రాచీన భాషలోకాక వ్యావహారికభాషలో అందులో ఇప్పటి పిల్లలభాషలో కథలు, పాటలు, పద్యాలు, చిన్నచిన్న వ్యాసములు రచించవలెనన్న విద్యావిధాన మేర్పడినవరకు బాల సారస్వతము అభివృద్ధి పొందదు. ఈ విషయముగ్రహించి కొందరు కథలు, పాటలు, పద్యాలు పిల్లలభాషలో రచించి బాలసారస్వత మిటీవల పత్రికలలో ప్రకటిస్తూ ఉన్నారు. గిడుగు వేంకట సీతాపతిగారు రచించిన రైలుబండి, చిలుకమ్మ పెండ్లి, ఎలుకా-పిల్లి, ఈగ-సాలెపురుగు, చిలుకా-బాలిక మొదలయిన పాటలు వివేకవతి, భారతి మొదలయిన పత్రి

ప్రారంభించినవారు

కలలో ప్రకటితములయినవి. ఇందులో కొన్ని వాచకములలోనికి వచ్చినవి.

ఈ బాలరచనలో సిద్ధహస్తులయినవారు చింతాదీక్షితులుగారు. వీరు కథలు, పాటలు అనేకముగా రచించి పత్రికలలోను, విడిగా పుస్తకరూపముగాను బాలానందమనే మకుటతముతో ప్రకటించినారు. శ్రీరామమూర్తి

**సిద్ధహస్తులు చింతాదీక్షితులుగారు**

పంతులుగారికి వారి సప్తతితమ జన్మదినోత్సవసందర్భమున విద్వాంసులు సమర్పించిన వ్యాససంగ్రహములో దీక్షితులుగారు రచించిన లీలాసుందరి అనే ఒక పెద్దకథ ప్రకటితమైనది. వీరి లక్కపిడతలు మొదలయిన బాల వినోద కథలు పాటలు అనేకంగా కలవు.

పత్రికలలో బాలవిజ్ఞానమునకు అవకాశమేర్పరచిన వారిలో మొదటివారు నందిరాజు చలపతిరావుగారు. వారి గృహలక్ష్మిలో కొన్నిపుటలు బాల విజ్ఞానమునకు ప్రత్యేకించి, కొన్నికథలు, పద్యములు మొదలయినరచనలు ప్రకటిస్తూ ఉండేవారు. భారతిలో బాలానందభాగంలో అనిసెట్టి వెంకటసుబ్బారావుగారు మొ॥వారి రచనలు ప్రకటిస్తూ ఉన్నారు. ఇప్పుడు కేసరి

**పత్రికలలో బాలానందభాగము**

గారి గృహలక్ష్మి బాలవాఙ్మయమునకు కొంత అవకాశమిచ్చినది. ఉన్నంత వరకు సంతోషించ వలసినదేకాని బాల వాఙ్మయము మన తెలుగుభాషలో ఇంకా అత్యల్పకముగా నున్నందుకు శోచిస్తున్నాము.

ఇతర భాషలలో బాలవాఙ్మయమెట్లు అభివృద్ధి పొందుతూ ఉన్నదో చూడండి. అరవములో ఆనంద వికటన్ అనే పత్రికయందు బాలవిజ్ఞానమున కొక భాగము ప్రత్యేకించి ఏర్పరిచినారు. అనేక పుస్తకములు-కథలు, పద్యాలు, పాటలు, వినోదములు గలవు. కన్నడభాషలో అంతకన్న ఎక్కువగా బాల

**ఇతరభాషా బాలసారస్వ ప్రపంచము వృద్ధి పొందినది**

విజ్ఞాన వాఙ్మయము కలదు. 'బాల ప్రపంచ' మూడు పెద్ద సంపుటములుగా వందలకొలది చిత్రములతో ప్రకటితమయినది. వంగభాషలోను, మరాఠీ గుజరాత్ భాషలలోను అంతకంటెను ఎక్కువగా హిందీ భాషలోను బాల వాఙ్మయము ఎక్కువగా అభివృద్ధిపొందియున్నది. ఆంగ్లభాషలోగల బాలవాఙ్మయము అమితముగా పెరిగియున్నది. వందలకొలది పుస్తకములు రంగురంగుల చిత్రములతో ప్రకటితములయినవి. మూడేండ్ల పిల్లలు మొదలుకొని పంద్రెండేండ్ల పిల్లలవరకును ఈడుకు తగినట్లుగా పుస్తకములను విభజించి ప్రకటించినారు. వేలకొలది కథలు, పద్యాలు, పాటలు, విజ్ఞానము కలిగించు రచనలు ఉన్నవి. ప్రతి సంవత్సరము పిల్లలకు బహుమతిగా నీయదగిన సంపుటములు గలవు. ఈ గ్రంథములు ఎక్కువగా ప్రకటించేవారు బ్లాకీ అండ్ సన్జ్, లాంగ్‌మన్‌జ్, మాక్మిలన్ మొదలయిన ప్రకాశకులు.

దేశ నాగరికతయొక్క అధిక్యమును కొలచుటకు స్త్రీల విద్య, బాలవాఙ్మయము కొలత బద్దలవంటివి. ఇవి హీనదశలో ఉన్నంతకాలము నేటి మన ఆంధ్రుల నాగరికత కొఱతపడి ఉండు ననుటకు సందేహములేదు; గనుక ఈ విషయమై కవులు, పండితులు, పత్రికలు, విద్యార్థులు ఎక్కువ శ్రద్ధవహించవలసి యున్నది.

---

# 6. లిపి, భాషా పరిణామములు

విషయ సంగ్రహము :—లిపి పరిణామము : భారత దేశమున లిపి ఏర్పడినది మౌర్యులకాలమున—మొహెంజదారో, హరప్ప మొ॥ స్థలములలో దొరికిన వస్తువులలోని చిత్రలిపి ముద్రికలు—ఖరోష్ఠి లిపి ; మనదేశములోని బ్రాహ్మిలిపులు —ఆదిని అన్ని భాషలకు ఒకటే లిపి ; రానురాను మాండలిక భేదములు—మౌర్య లిపినుండి నాగరి, కర్నాట, తెలుగు లిపుల పుట్టుక—తమిళ భాషకు యితర భాషలకుగల లిపి, ఉచ్చారణ భేదములు—8 వ శతాబ్దమునాటి అహదనకర శాసనము యొక్క లిపి, వివరణములు—భాషా పరిణామము : ఆదిని తెలుగు భాషకుగల ద్రావిడబాషా స్వరూపము—నన్నయనాటి ప్రాచీనాంధ్రము, కొన్ని యుదాహరణలు—అచ్చ తెలుగు భాష, ఉదాహరణలు, దానిక్షీణత—రాష్ట్రేతరాంధ్రుల తెలుగుభాష ; దానిలో కామాఠీ, దాసరీ, బేరడీ భాషా స్వరూపములు, అట్లగుటకు కారణములు—వివిధ ఆంధ్రజిల్లాలలోగల ఉచ్చారణ, భాషా భేదములు—స్వచ్ఛమైన వాడుక భాషా ప్రచారమునకు పత్రికలు చేసిన ఉపకారము—తెలుగుదైవులు, దైవమిషనులు—.

## (అ) లిపి పరిణామము

మన భారత దేశమందలి లిపి ఎప్పుడు ఏర్పడినదో సరిగా శతాబ్దమైనను గుర్తించి చెప్పడానికి ఆధారమేదీలేదు. అశోకుని శాసనములనుబట్టి మౌర్యుల కాలమునాటికే లిపి ఏర్పడియున్నట్లు నిరూపించగలము. అంతకు పూర్వ కాలమందలి వ్రాతఏదీ కనబడలేదు. మొహెంజదారో హరప్ప మొదలగు స్థలములలో ఇప్పుడు క్రొత్తగా దొరికిన చిత్రలిపి ముద్రికలలోగల గీతలు, బొమ్మలు ఎంతవరకు లిపియన వచ్చునో చెప్పలేము. వాటిని అర్థము చేసుకొనుటకు అనేక విద్వాంసులు ప్రయత్నిస్తున్నారుగాని ఎవరును ఇంతవరకు కృతార్థులు కాలేదు. భావమునకే చిహ్నములుగానున్న లేఖనము (హియరోగ్లిఫిక్స్) ఈజిప్టు దేశములో ఉండేది. అట్టిదే కొంతవరకు ఇక్కడిది కావచ్చునేమో అని కొందరి అభిప్రాయము. లిపికూడా కావచ్చునని కొందరంటున్నారు.

లిపి అనేది ఉచ్చరించే శబ్దముల చిహ్నము. అట్టి లిపి మనకు తెలిసినంతవరకు మన దేశములో రెండువిధము లయినవి వెలసినది. కుడివైపునుండి ఎడమవైపునకు వ్రాసుకొంటూ పోయేది—ఖరోష్ఠి లిపి; రెండవది ఎడమవైపునుండి కుడివైపునకు వ్రాసుకొంటూ పోయేది—బ్రాహ్మిలిపి. రెండవదే మన దేశంలో వ్యాపించి వృద్ధిలోనికి వచ్చినది.

ఆదిని మన దేశమందు అన్ని భాషలకును ఒకటే లిపి. అదే రానురాను ఒక్కొక్క మండలమున ఒక్కొక్కతీరుగా పరిణమించి అనేకవిధములుగా వేరయినది. వేరయిన లిపులుకూడా కొద్దికొద్దిగా మారుతూ వచ్చినవి. ఒక్క తల్లినుండే పుట్టి వేరైన బిడ్డలవలె దేశమందలి లిపులు పరిణమించినవన్నందుకు క గ ట ప మ ర ల మొ. అక్షరముల తీరు నాగరి, వంగ, ఉత్కళం మొదలయిన ఉత్తర దేశ భాషా లిపులలోను, ఆంధ్ర, తమిళం, కన్నడ, మలయాళ మొదలయిన దక్షిణదేశభాషా లిపులలోను పరిశీలించి చూస్తే బోధపడుతుంది. ఇక్కడ ప్రదర్శించిన లిపి పరిణామమనే పట్టిక (బ్లాకు) పరిశీలించినయెడల మౌర్య లిపి నుండే కర్ణాట–తెలుగు లిపిన్ని, నాగర లిపిన్ని ఎట్లు పుట్టి, పరిణమించినవో తెలియగలదు.

### లిపి పరిణామము

| | | |
|---|---|---|
| 1 | మౌర్యలిపి క్రీ.పూ. 6నుండి క్రీ.పూ 2వ శతాబ్దము వరకు | [illegible] |
| 2 | శకలిపి క్రీ.పూ 1 నుండి క్రీ.శ.1 వ శతాబ్దము వరకు | [illegible] |
| 3 | బ్రాహ్మీ లిపి | [illegible] |
| 4 | వేంగి లిపి క్రీ.శ 4.వ శతాబ్దము | [illegible] |
| 5 | సువర్ణ వర్షుని లిపి క్రీ.శ. 933 | [illegible] |
| 6 | పూర్వ చాళుక్య లిపి క్రీ.శ. 945 | [illegible] |
| 7 | పూర్వ చాళుక్య లిపి క్రీ.శ. 1134 | [illegible] |
| 8 | కోనేరదేవుని తామ్రశాసనలిపి క్రీ.శ. 1254 | [illegible] |
| 9 | ఇప్పటి దేవనాగరి లిపి | अ इ ए क ख ग ज ट ठ ड त थ द न प म य र ल श स |
| 10 | ఇప్పటి తెలుగు లిపి | అ ఇ ఎ క ఖ గ జ ట ఠ డ త థ ద న ప మ య ర ల శ స |

తెలుగు కన్నడ లిపులు ఇంచుమించు ఒకమాదిరిగా ఉంటవి. తమిళ లిపిలో అల్పప్రాణ, మహాప్రాణ; పరుష సరళ భేదములు కనబడవు. ద్రావిడ భాషలలో ఖ ఘ ఛ ఝ మొదలగు మహాప్రాణ వర్ణములు లేనేలేవు. తత్సమ శబ్దములలో ఉన్నవి గనుక తెలుగువారు ఆ వర్ణములకు మౌర్యలిపినుండి పరిణమించిన లిపులు చేర్చుకొన్నారు. ఆ విధముగానే కన్నడులున్నూ, మళయాళీలున్నూ చేర్చుకున్నారు. తమిళులు ఈ వర్ణములుగల శబ్దములు, శూర్పణఖ, రాఘవ, దశరథ, కుంభకర్ణ మొదలగునవి ఉచ్చరించినప్పుడు ఒత్తులు పలుకరు; చూర్పణక, రాగవ, దచరత, కుంబకర్ణ అని పలుకుదురు. ఇటీవల జ, స, ష, క్ష వర్ణములకు కావలసిన లిపులు గ్రంథాక్షరములనుండి తమిళులు తెచ్చుకొని, వాడుకొంటున్నారు.

శ్రీనాథునినాటివరకును శాసనములలోగల మన తెలుగక్షరములు చూస్తే సాధారణులకు చక్కగా బోధపడవు. అక్కడనుండి వెనుకటికాలమునకు పోయినకొలదీ శాసనములలోని లిపి వింతగానే కనబడుతుంది. అందుకు దృష్టాంతముగా ఇక్కడ ఒక శాసనమునందలి పంక్తులు కొన్ని ప్రదర్శిస్తున్నాము.

ఇది క్రీ. శ. 8 వ శతాబ్దమునాటి అహదనకర శాసనమునందలి మూడవరేకు—మొదటిప్రక్క. ఇక్కడ రెండవ పంక్తిలోని 17 వ అక్షరమునుండిన్ని ఆంధ్రభాగము కలదు; గనుక దానిని పంక్తులవరుస ననుసరించి నేటి తెలుగు లిపిలో ఈ దిగువను కనబర్చుతున్నాము :—

వక్రంబు లేదు వచ్చినవారుగళరెని ఊరి స్తితి | దప్పినవారు దినికి వక్రంబు వచ్చిన గచ్చురు రెణ్డువడల ఎలెమువరులెముల చె | సినదియు చన్ను విరిపయి నాడువరు గళ్లిన ఎళెముళ చెసిన సెయుడుసను.

అసలే భాషాస్వరూపము చాలా ప్రాచీన మయినది. అందులో శాసనము చెక్కినవాని తప్పులుకూడా ఉన్నవి. అందుచేత, ఇది సాధారణులకు అర్థమేకాదు గనుక, తప్పులు తొలగించి నిర్దుష్టమైన పాఠము మొదట కనబరచి, అర్థము తెలియజేస్తున్నాము.

స్వస్తి పృథివీ పల్లవ పట్టణంబున ఊరి | వారు కరిగళ్ల వడవరికి ఊరిస్వాముళ్ ఇచ్చిన స్థితి రెణ్డువాడల పట్టనాపురకు | అరియు, డగు, తెఱయు; సిద్ధాయంబు, దణ్డు, దశాపరాధంబును సర్వ బాధాప | రియారువు ఊరుదాయ సేసి ఇచ్చి (రి). దీనికి వక్రంబులేదు. వచ్చినవారు గలరేని ఊరిస్థితి | దప్పినవారు. దీనికి వక్రంబు వచ్చిన గచ్చురు. రెణ్డువాడల ఎలమువరు (ఎ) లెముల చే | సినదియు చన్ను; వీరిపయి నాడువారు గల్గిన, ఎలెములచేసిన సేయుడు సను.

అర్థము :—తెలుగుభాగము స్వస్తితో ప్రారంభమైనది. పృథివీపల్లవ పట్టణమున ఊరివారు (గ్రామంలో వెలసియున్న) కరిగళ్ల వడవరు అనే దేవునికి ఊరిస్వాములు అనగా గ్రామపాలకులు ఇచ్చినట్టి స్థితి అనగా వృత్తి. రెండువాడల పట్టణమువారికిని అరిన్ని (పన్నును) ఉడగున్ను (తరగున్ను) తెఱయున్ను (కట్టుబడిన్ని) సిద్ధాయమనే పన్నున్ను, దండుఅనే పన్నున్ను, దశాపరాధమనే పన్నున్ను

స్వస్త్రప్రిథివి పల్లవ పట్టనంబున ఊరి | వారు కరిగళ్ల వడవరికి ఊరిస్వాముళ్ ఇచ్చిన స్తితి రెణ్డువాడల పట్టనాపురకు | అరియుడగు తెఱయు సిద్ధాయంబుదణ్డు దసపరాధంబును సర్వ్వా బాద ప | రి యారువు ఊరుదాయ సెసి ఇచ్చిదినికి

సర్వబాధాపరిహారముగా, అనగా ఏపన్ను చెల్లించవలసిన బాధ లేకుండా ఊరు దాయసేసి అనగా పంచుకోదగినదిగా చేసి ఇచ్చిరి. దీనికి వక్రము లేదు అనగా ఏ అడ్డా యాటంకమూ లేదు. వచ్చినవారు కలరేని అనగా అడ్డు చెప్పిన

వారున్నయెడల వారు ఊరిస్థితిని అనగా పైనిచ్చిన గ్రామ వృత్తిని తప్పినవారు అనగా పోగొట్టుకొన్నవారగుదురు. దీనికి అడ్డువచ్చినవారు ఎదిరి పక్షమువారగుదురు. రెండువాడల ఎలెమవారు అనగా సాక్షులున్ను సాక్ష్యములుచేసినదిన్ని చెల్లుబడియగును. వీరిపై నాడు వారు అనగా తెలుసుకో గోరేవారు కలిగినయెడల సాక్ష్యములచేసినట్టివారు చేసినచేత చెల్లుబడి అగును.

ఈ శాసనములో ఇతరభాగములందు ఇంకా ప్రాచీన రూపము లెన్నోకలవు. వాటినిబట్టి వెనుకకు పోయిన కొలదీ మన తెలుగుభాషకు ద్రావిడభాషా స్వరూపము ఎక్కువగా కనబడుతూ ఉంటుంది.

## (ఆ) భాషా పరిణామము

లిపిలోనేకాక భాషలో సైతము ప్రాచీనత ఎట్లు కన బడుతున్నదో పై శాసనములోని భాషలనుబట్టి తెలియ గలదు. నన్నయ నాటి భాష తత్సమశబ్దములతో మిళితమై యుండబట్టికాని లేకున్నయెడల, అదియైనా నేటి తెలుగు వారికి సాధారణముగా బోధపడదు. అందుకు నిదర్శనముగా నన్నయనాటి ప్రాచీన శుద్ధాంధ్రరూపములను వాడుతూ కీ. శే. గిడుగు వెంకటరామమూర్తిగారు రచించిన "ప్రాఁదెనుఁగుఁగమ్మ" లోని వాక్యములుకొన్ని ఇక్కడ ఉదాహరిస్తున్నాము చూడండి.

"ప్రాతాలఁజెక్కిన యక్కరా లిపుడు
సక్కంగఁగాదువో చదువంగ నేని
వానిన నేఁడునున్ గివ్వఁబూనుదురె?
తొంటి బిరుదులు నేఁడు వలతురె దొరలు?
బంట్రౌతు లని వారిఁ గొనియాడఁ దగునె?
జగనొబ్బగండఁ డన నేఁడు గులుకు?
నెవఁ డిప్పు డోయంచుఁ బల్కు సుంకరి యన?
దళవాయి యనఁగను, జంగలి యనఁగ ను,
శెట్టురె మొగమునఁ జప్పటు లటుసీరఁ?
దొంటి యట్లిప్పుడు సానియందురె తల్లిఁ?"

*    *    *    *

"ఒకయూరి గామిడికిఁ గమ్మొందు గిచ్చి
కమ్మపైఁ బ్రానుడియ వ్రాసియంపుదురె?
యంచి పుత్తురె దాని నంచెల వారు?
లెంక నొక్కనిఁజీరి ప్రాఁబేరు సెప్పి
యొక యూరి కేగంగఁ బనుచుడు వాఁడు
నే నెఱుఁగ నదియేటి దేడనున్నదఁడె?
క్రొన్నుడి ముతకని నేఁటి పేర్వ్యాలుక
మీనాల్క యీ కొనమి మొదలమేల్ నుడియ
పల్కి వెంబడి మీను పని సక్క నెఱవేఱఁ
గ్రొన్నుడి యుఁ దెల్లముగ వ్రాకువ్వవలయుఁ"

*    *    *    *

సంస్కృతభాషా ప్రాభవము అంతకంతకు మన తెలుగు భాషలో ఎక్కువగుతూరావడంచేత అచ్చతెలుగు శబ్దములు వాడుకనుండి తొలగిపోతూఉన్నవి. అందుచేత మన పూర్వులు వాడుకొన్న అచ్చతెలుగు శబ్దములు మనకిప్పుడు సులువుగా బోధపడవు. సంస్కృతముతో మిళితమైన మన తెలుగుభాషలోనే నన్నయాది కవులందరును గ్రంథ రచన సాగించారు. ఇందులో సంస్కృతభాష ఎక్కువగా ప్రయోగించినా, సంస్కృతభాష ఏమీ రానీయకుండా కేవలము అచ్చతెలుగు పదములనే గ్రంథము రచించినా సాధారణులకు బోధపడదు. ప్రాఁదెనుఁగుఁ గమ్మ కేవలము అచ్చ తెలుగులో, అందులోను ప్రాచీన రూపములతో ఉన్నది. అదిగాక ఇటీవలి అచ్చతెలుగు ప్రబంధములలోని భాషయైనా సరిగా బోధపడదనడానికి మచ్చువాక్యాలు కొన్ని ఉదాహరిస్తున్నాము :—

పొన్నగంటి తెలగనార్యుని యయాతి చరిత్రము—4 వ ఆశ్వాసమందలి యొక వచనము (పు. 47):—

మఱియు విరితేనియలాని పూని మత్తిలి తత్తఱంబునం దిరుగుతేఁటి మొత్తంబుల యెఱకల సన్నం గరువలిగట్టువ నటువ గఱప నామని రాఁ జని కడనాఁడు తీవపాతరుల ముందఱఁ గ్రందుగానెత్తిన మవ్వంపు దుప్ప టంబుల తెరల మరువులనం గ్రుమ్మపూఁదమ్మల ముమ్మరంబు లం గొమ్మలం గానక త్రిమ్మరు కలికి రా చిలుకల పలుకుల రొదల నెదలు గలంగ మెలంగు తెరువరుల నేయ బాసటంబు చిలికిన మరుని చిలుకులు వోని తుమ్మెద దిమ్మల నలరు నలరులం గాంచి వలజనికాని పనికిఁ గినుకం గనుంగొను తోఁట కలిమి చెలియ చూపుల సొంపునం గెంపు వోసనంబులగు దాసనంబు లును దాసనంబులు చీఁకటి మ్రాఁకు మ్రాఁకల

లోన నిరులు దొరలు తమశాయయగు వేఁడి వెలుంగు నింగికి వెఱచి పఱచిన ”

*　　　*　　　*

అచ్చ తెలుగు ప్రబంధాలు రచించిన కవులు ఇంకా కొందరున్నారు; కూచిమంచి తిమ్మకవి మొదలయినవారు. గత శతాబ్దములో మచ్చ వేంకటకవిగారు శుద్ధాంధ్ర నిర్వ చన నిరోష్ఠ్యకుశలవ చరిత్ర రచించారు. ఈ శతాబ్దములో శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు శ్రీ పోతాప్రగడ కృష్ణ మూర్తిగారు అచ్చ తెలుగు కావ్యాలు రచించారు. అందులో నారాయణదాసుగారు ఉమార్ ఖయ్యాం తెలి గిస్తూ తద్భవరూపాలు సైతం (అవి అచ్చ తెలుగుకాదని) పరిత్యజించి, కేవలం దేశ్యాలతోనే రచనసాగించారు. ‘మొగము’—ముఖ శబ్దమునకు తద్భవమని, మూతి అనే ప్రాచీనాంధ్ర ప్రయోగం—నేటికిని అరవభాషలో ఉన్నది-ప్రయోగించారు; పూర్ణచంద్రముఖీ అనే అర్థంలో ‘నిండు నెల మూతిదాన’ అన్నారు. దేశ్యమంటూ, తెలుగుదేశ శబ్దములేకాక రుమాల మొదలయిన అన్యదేశ్యాలు సైతం ప్రయోగించారు. ఈ అచ్చ తెలుగు కావ్యరచన అంతా వ్యర్థ ప్రయత్నము; నిఘంటు సాహాయ్యంలేకపోతే ఈ అచ్చ తెలుగు రచనలు పండితులకైనా బోధపడవు.

## అచ్చ తెలుగు

అచ్చ తెలుగుగురించి మతభేదమున్నది. సంస్కృత సమము, ప్రాకృతసమము, సంస్కృతభవము, ప్రాకృత భవము, దేశ్యము—వీటిలో సంస్కృతసమములు కాక తక్కిన వన్నీ అచ్చ తెలుగవుతవని ఒక మతము; దేశ్యములు మాత్రమే అచ్చతెలుగు కాగలదని ఒక మతము. తద్భవ ములు తెలుగులోనికి ఎట్లు వచ్చినవో తెలియజేయుటకు సంస్కృతమునుండిన్ని, ఆరు ప్రాకృతములనుండిన్ని వచ్చిన తెలుగు మాటలకు ఉదాహరణములు ఈ దిగువను కనబరు స్తున్నాము ”

(1) సంస్కృతమునుండి :—

కుడ్యమ్ - గోడ

పంక్తి - బంతి

కర్పూరమ్ - కప్పురము, క్రము

(2) మహారాష్ట్రి ప్రాకృతమునుండి :—

| సంస్కృతం | ప్రాకృతం | తెలుగు |
|---|---|---|
| బ్రహ్మ | బమ్హా | బమ్మ |
| కాంస్యమ్ | కాంసో | కంచు |

(3) శౌరసేనీ ప్రాకృతమునుండి :—

| సం॥ | ప్రా॥ | తె॥ |
|---|---|---|
| యజ్ఞోపవీతమ్ | జన్నోవీదమ్ | జన్నిదము |
| ప్రతిజ్ఞాతమ్ | పదిన్నాదమ్ | పన్నిదము |

(4) మాగధీ ప్రాకృతమునుండి :—

| సం॥ | ప్రా॥ | తె॥ |
|---|---|---|
| నేదిష్ఠమ్ | నేదిస్తమ్ | నేస్తము |
| రామా | లామ | లేమ |

(5) పైశాచీ ప్రాకృతము (పాండ్య, కేకయ) నుండి:—

| సం॥ | ప్రా॥ | తె॥ |
|---|---|---|
| స్వర్ణమ్ | సన్నమ్ | సొన్న |
| నిశ్రేణీ | నీశన | నిచ్చెన |

(6) చూలికాపైశాచీ ప్రాకృతము (గాంధార, నేపాల. కుంతల) నుండి:—

| సం॥ | ప్రా॥ | తె॥ |
|---|---|---|
| స్వర్ణమ్ | పన్నో | పొన్న |
| మృగః | మిాకో | మెకము |

(7) అభీర ప్రాకృతము (పశ్చిమ సముద్రతీరము)నుండి:—

| సం॥ | ప్రా॥ | తె॥ |
|---|---|---|
| బ్రాహ్మణః | బాంహ్హణ | బాపఁడు |
| స్తనమ్ | తను | చన్ను |

## రాష్ట్రేతరాంధ్రుల భాష

చెన్నపురి రాష్ట్రమందలి ఉత్తర సర్కార్ల జిల్లాలలోని తెలుగుభాషయున్ను నెల్లూరు, చిత్తూరు జిల్లాలలోని తెలుగుభాషయున్ను రాయలసీమ జిల్లాలలోని తెలుగు భాషయున్ను చెన్నపురిఆంధ్రుల తెలుగు భాషయున్ను మాటలలోను, తిఙంత సుబంతాది రూపములలోను, ఉచ్చా రణ స్వరాదులలోను కొంతకొంత భేదమున్నదిగాని, ఒకరితో నొకరు కలసి మాటలాడుకొన్నప్పుడు ఒకరి భాష ఒకరికి సులువుగా బోధపడకపోదు. గంజాం జిల్లావారి (అందు లోను అసికా, బరంపురం, ఛత్రపురంవారి) భాషలో

కొద్దిగా ఓఢ్రభాషా పదములు, ఉచ్చారణ కనబడుతుంది. గుంటూరు జిల్లాలో పడమటి భాగమందున్నవారి భాషలో కొద్దిగా ఉరుదూ మాటలు చేరియున్నవి. రాయలసీమవారి భాషలో కన్నడమువారి మాటలు, ఉరుదూ మాటలు కలుస్తూఉంటవి. నెల్లూరు చిత్తూరులు, అంతకంటె ఎక్కువగా చెన్నపురివారి భాషలోను అరవపల్కులు చేరుతూ ఉంటవి.

రాష్ట్రేతరాంధ్రులలో ఎవరేదేశమునకు పోయి నివాసము లేర్పరుచుకొన్నారో వారు ఆ దేశమందలి భాషా ప్రాభవమునకు లోబడి, తమ తెలుగుభాషలో ఆ భాషా పదములను, సంప్రదాయములను చేర్చుకొన్నారు. అదిగాక వారాదేశములకు పోవకమునుపు, తెలుగు దేశములో ఏభాగమందున్నారో ఏ జాతికి చెందినవారో ఆభాగమందున్న ఆ జాతిలోను పరిణమించియుండిన భాషతో వలసపోయిన వారు గనుక, ఆ భాషకే ఈ క్రొత్తమార్పులు కలుగుట సహజము. అందుచేత రాష్ట్రేతరమైన ఒక్క భాగమందే ఉన్న వివిధ జాతులవారి భాషలలో సైతము కొన్ని భేదములు కనబడతవి.

భాషాప్రవాహములో శబ్దరూపములు, అర్థం కావడానికి బాధలేనంత వరకు, అగిపోతూఉంటవి. నన్నయ నాటికే "పూజించితివేనిన్" అనే రూపము "పూజించితే" అయినది. అప్పటికింకా అది మధ్యమ పురుషైకవచనంతో అన్వయిస్తూ ఉండేది. ఆరూప మిప్పుడు 'పూజిస్తే' అయినది; మూడు పురుషల రెండు వచన రూపముల తోను అన్వయిస్తుంది. ఇట్టి భాషా పరిణామము మాటల లోను, రూపములలోను కలుగుతూ ఉంటుంది. ఈ అరుగుదల ఇతరభాషాసంపర్క మేమీలేని కృష్ణా, గోదావరీ జిల్లాలలో ఎక్కువ. వరదలు వచ్చినప్పుడు ఏటికిరువైపులను దూరంగా నీరుపారి, మడుగులు కట్టి నిల్చిఉంటుంది. మరల ఎన్ని సంవత్సరాలకో వరదలు వచ్చినవరకు ఆ ప్రాత నీరే ఆ మడుగులలో ఉంటుంది. గాని, నదీగర్భంలోని నీరు ఆ మరుసటి సంవత్సరానికే మారిపోతుంది. క్రొత్త నీరురాగానే పాతనీరు పోతుంది. ఆ విధముగానే గంజాం జిల్లాలోను. రాయలసీమ జిల్లాలలోను ప్రాత మాటలు ఇంకా నిలిచిఉన్నవి. ఈఁగ, కాఁపు, కాఁగు మొదలయిన మాటలలోని అర్ధానుస్వారమింకా గంజాం జిల్లాలోని తెలుగువారు పల్కుతున్నారు. ఆ జిల్లాలోని మంగలి కుఱు మాపుగడ్డము గీయడం కష్టమంటాడు; అల్పార్థమందు కుఱు శబ్దప్రయోగం ఆ జిల్లాలోఉన్నది. ప్రాచీనాంధ్రములో వచ్చినవాఁడను, వచ్చినదానను అనే క్రియావిశేషణ రూపములున్ను, వచ్చితిని అనే క్రియా వాచక రూపములున్నూ ఉండేవి. రానురాను సర్కారు జిల్లాలలో వచ్చితిని మొదలయిన క్రియావాచక రూపములు వాడుకలో అంతరించినవి. వచ్చినాడను, వచ్చినాను, వచ్చాను; వచ్చినదానను, వచ్చినాను, వచ్చాను—ఈవిధంగా—వచ్చాను, చేశాను అనే రూపాలు స్త్రీ పురుష లింగభేదం లేకుండా వాడుకలో ఉన్నవి. రాయలసీమ జిల్లాలలో వచ్చితిని వస్తిని అయినది. మీరు వస్తిరి, వారు వచ్చిరి అనే రూపాలు రాయలసీమ జిల్లాలలో అందరూ నిత్యం వాడుకొంటారు. ఇవి సర్కార్ జిల్లాలలో లేవు గనుక ఈ జిల్లాలలోని పండితులు సైతము గ్రాంథికభాషలో వ్రాయబోయినప్పుడు "మీరు వచ్చిరి" వంటి ప్రయోగాలు చేశారు. ఈ తప్పు రాయలసీమలోని పామరుడైనా చేయడు. "ఈలాగున" (ఈ విధముగా అనే అర్థములో) గంజాం, విశాఖపట్నం జిల్లాలవారు ప్రయోగిస్తారు. కృష్ణా, గోదావరీ జిల్లాలవారు "ఇలా" అంటారు; అదే సాధురూపమనుకొని లాగేమిటి ఇజారా? అని ఆక్షేపిస్తారు; 'బాలేందు రేఖదోచిన లాలితమగు నపర దిక్కులాగున' అని పోతనామాత్యుని ప్రయోగం మరచి పోతారు. చెన్నపురినుండి కలకత్తావెళ్లి మరి నాలుగు దినాలకు చెన్నపురి వెళి పోచ్చేశాడు (వెడలి+పోయి+వచ్చి వేశాడు)' అంటారు గంజాం విశాఖ పట్నం జిల్లాలవారు. గోదావరి (స్టేషను) లో దిగడతానంటారు గోదావరి జిల్లావారు. దేవుడల్లే (దేవుడివలెనే), చివరల్లే, నేలపనసల్లే మొదలగు రూపాలు కృష్ణా, గోదావరి జిల్లాలవారు వాడుతారు. 'ఏందిరా నీవనేమాట' మొదలగు రూపాలు గుంటూరు నెల్లూరులలోవినబడతవి. వస్తవి అనడానికి వస్తాయి అని గంజాం విశాఖపట్నం జిల్లాలవారున్ను, వస్తై, వస్తయ్ అని కృష్ణా గోదావరీ గుంటూరు జిల్లాలవారున్ను అంటారు. నేరుగా పూడ్చాడు అని చెన్నపురి తెలుగువారంటారు. నాకు కాబట్టదు అనే ప్రయోగం రాయలసీమవారు చేస్తారు. ఈ విధముగా మాండలిక భేదాలు వేలకొలది చూపించవచ్చును. ఇన్ని భేదాలున్నా ఒకరిభాష ఒకరికి సులు

వుగా బోధపడుతున్నది. రైళ్ల ప్రయాణాలద్వారా, వార్తా పత్రికలు, కథలు, నవలలు మొదలయిన రచనల ద్వారా వాడుకభాషాప్రయోగాలు ఒక మండలంవారివి మరియొక మండలంవారికి తెలుస్తున్నవి. ఈ వాడుక భాషలలో అందరికీ సామాన్యమై, రచనలకు పనికివచ్చే ఆదర్శ ప్రాయమైన భాష పరిణమిస్తూఉన్నది. అది దానంతటది పరిణమించవలసినదేకాని, బలవంతంగా నియమాలేర్పరచి లాక్షణికులు నిర్దేశించవలసినది కాదు.

మాండలిక భేదాలకంటెను ఎక్కువ భిన్నంగా ఉంటవి రాష్ట్రేతరాంధ్రులమాటలు. అందుకు నిదర్శనంగా కొన్ని వాక్యాలు సర్ జార్జ్ గ్రిఅర్సనుగారి దేశభాషల సర్వే గ్రంథమునుండి ఎత్తుకొని ప్రకటిస్తున్నాము.

## కోంటావుభాష (చందాజిల్లా)

ఒక మనిషికి యిద్దఱు పిల్లగాండ్లు వుండిరి. వాండ్లో చిన్నవాడు తండ్రితో అంటాడు; "తండ్రీ, యేదో మాలమతది నాకు వచ్చవలది అది యివ్వు". వెనక వాడు పిల్లనికి ధనము పంచి ఇచ్చిండు. వెనక కొన్ని దెవసాలకు చిన్నపిల్లడు అంతసొమ్ము జమాజేషి దూరదేశానకు పోయినాడు. యింక అక్కడా అవిచారముతోనడ్చి తన సంపత్తు పాడుగొట్టినాడు.

## కామాఠీభాష (బొంబాయి)

వక్క మనశికి ఇద్దరు కొడకులు ఉండుండ్రి. చిన్నోడు తండ్రికి అంటడు; "అయ్యా, నా అంతుకు యేమి జిందగి అస్తది అది నాకు ఇయ్యానా" మరి తాను అది ఇద్దడ్కి పంచి ఇచ్చిండు. తోడ్యందినాల్లు కాలే, ఇంతట్లా చిన్న కొడుకు తనది అంత హిస్స జమాచేసి దూరందేశంకు యెల్లి పోఇండు. అడ అంతముల్య మజాలా యగరకొట్టిండు.

## దాసరీభాష (బెల్గాంజిల్లా)

ఒక్కోడొక్కోడ్ మనిశికె ఇద్దర్ మగపిలగాళు ఉండ్లి. వాళ్ళోన చిన్నా పిలగడు తన తండ్రికి అనె; "తండ్రీ నీ బదకలోన్న నాకె వచ్చ్యట్టి పాల నాకె ఈ.". తండ్రి వాళ్ళోన తన బదకపంచి ఇచ్చె, చిన్నా పిలగడు తనపాల తిస్కోని దూరము నాట్కపొయ్యి శినావద్దల్ ఆవలేదు, అంతట్లోన వాడు శనఖర్చ్శేశి తన బదకంతా పాడశేసె.

## బేరడీభాష 1 (బెల్గాంజిల్లా)

ఒకనికొకనికి గిరస్తనక్ ఉద్రుపటి బిడ్ల్ ఉండ్రి. వర్దా నాన్సణ్ణ్ కొడుక్ తన్ ఐకె అండె, "అయ్యా, నీ జిందిగి నాన్ నాకివసన్ పాల్ ఈయి" అంటండె అయ్యి వర్దా నాన్ తన్ బదక్ పంచిశిదె. సణ్ణ్ కొడక్ తన్పాల్ చికోని దూర్ రాజనక్పోయి బాళ్ నాడ్ల్ అగ్గల్యా.

## బేరడీ 2 (బెల్గాంజిల్లా)

రంగంత్ హుడిగేడ్ గోవిందనక్ శెపతాడ్! "గోవిందా, రేవు ఆవక్కె ఉసల్ బైల్నాన్ చందుకోలాట్— ఆడగ్ బాళం హుడిగేల్ పోడార్. నాను ఆ కడెగ పోతాను నివ్వువస్తావు కాద్?"

గోవింద్ :—"హోంద్, అగితేన్ నూయవ్వ గుడ సాన్ లేదు. దాన్ అపణి ల్యాక్ హెళ్ళ్యబత్తు? అది గుడసక్ వశిన్ బళక్ నాను అడిగిబస్తాన్. అవ్వ ఎలికె పోనావడ్, "గుడస్ తడిసి ఎక్కడూ పోవద్ద్" అంట్ నాకె అపణికేసడాయి".

## తెలుగు అచ్చుటైపులు

తెలుగు గ్రంథముల అచ్చువేయుపద్ధతి ప్రారంభములో ఎట్లుండెడిదో సూచనగా గ్రంథాలయములు, పత్రికలు అను అధ్యాయములలో తెలియపరచినాము. దానినిగురించి ఇంకను కొంచము తెలుసుకొనవలసి యున్నది. ప్రాచీన కాలపు వ్రాతప్రతులమాట అటుంచి, పాశ్చాత్య నాగరికతా ప్రభావమువలన అచ్చువేయు పరిశ్రమ ప్రారంభమయిన చాలకాలమునకు తెలుగులోకూడ అట్టి పరిశ్రమ తల చూపినది. ఆదిని, చాల తెలుగుటైపులు లేకుండెను. కొంతకాలమునకు మద్రాసునందు నెల్సన్ అండ్ కంపెనీ వారు, స్వదేశీటైప్ఫౌండ్రీవారు, వావిళ్ల రామసామిశాస్త్రులు అండ్ సన్సు మొ॥ వారు, ఈ మధ్యను బెజవాడలో దాసు ప్రద్యుమ్ననారాయణరావు గారు ఇంకను అనేక చోట్లను తెలుగు టైపు ఫౌండరీలు ప్రారంభమైనవి. ఇట్టి టైపులలో వివిధ సంస్థలవారు తయారుచేసిన వివిధ రకముల హెడ్డింగు, బుక్ టైపులు సుమారు 20 వరకు గలవు. ఒక్కొక్కరకమును బాడీయనిగాని పాయింటు అనిగాని యందురు. కనిష్ఠము 10వ పాయింటునుంచి గరిష్ఠము 108

పాయింట్లవరకు అన్ని సైజుల టైపులు కలవు. ఈ పాయింట్లు కంటెను భిన్నమయిన విధమున బాడీ టైపులు, రోమను టైపులు, ఆంటిక్ టైపులు మొదలగు వివిధ రకములు తయారై సత్వర ముద్రణాభివృద్ధికి ఎంతయో తోడ్పడినవి. ఈ క్రిందను కొద్ది రకముల టైపులను నమూనాకు చూపించుచున్నాము. ఈ పాయింటులనుబట్టి మిగిలిన పాయింటుల టైపుల సైజులు ఎట్లుండునో మీరు సులభముగ నూహించుకొనవచ్చును.

---

2 లైనుల ఇంగ్లీషు బాడీ టైపు.

దేశ భాష లందు తెలుగు లెస్స; ప్రాచ్యఖండపు ఇటలీ భాషయని మెప్పువడసిన భాష.

---

గ్రేట్ ప్రైమరు హెడ్డింగ్ టైపు.

భారత దేశ భాషలలో మూడవ స్థాన మాక్రమించు కొన్న తెలుగు భాషనుగలిగిన ఆంధ్రులు మిగిలిన ఏ విషయములందును వెనుకబడకూడదు.

---

గ్రేట్ ప్రైమరు టైపు

'తేట తేసియలొలుకు.... తెల్గు పలుకు'ల నాలపించిన నాదబ్రహ్మ త్యాగరాజు యొక్క కీర్తనలే కర్నాటక సంగీతమునకు వన్నె బెట్టి, తమిళులకు సంగీతభిక్షనొసగెను. తన ఉచ్చారణ మాధుర్యముతో విశ్వకవి రవీంద్రుని సహితము ఆశ్చర్య చకితుసి చేసిన సొంపుగల మన భాషను మనము పోషించుకొనవలెను.

---

14 వ పాయింటు టైపు.

రానున్న నూతన ప్రపంచవ్యవస్థలో ప్రత్యేకాంధ్ర రాష్ట్రనిర్మాణమునకై ఆంధ్రులు వలయు త్యాగమును చేయుటకు సంసిద్ధులై యుండవలెను. రాయలసీమ ఆంధ్రులు, రాష్ట్రేతరాంధ్రులు అను భేదముల విడనాడి, ఐకమత్యముతో రాష్ట్ర సంపాదనకు బద్ధకంకణులగుట ఆంధ్రుల పరమ ధర్మము.

---

12 వ పాయింటు టైపు.

ఆంధ్రుల సర్వతోముఖ ప్రశస్తిని వాడవాడల చాటి, ఈ భూతలమున పుట్టి పెరిగిన ప్రతియాంధ్రుని తన జాతీయత నిలబెట్టుకొనుటకు ప్రోత్సహించి, 'విశాలాంధ్ర' జాతిని ఏ కోన్ముఖము చేయుటకై సర్వవిధములయిన ప్రచారము చేయ సంకల్పించుకున్న మా 'విశాలాంధ్ర' ప్రచారిణీ పుత్రికను పెంచి పోషించు భారము వహింప ఆంధ్రులెల్లరు ప్రార్థితులు

---

హిందీ, ఇంగ్లీషు టైపులలో వివిధ రకములు, వివిధ సంస్థలవారు తయారుచేసియున్నారు. అవి ఇన్ని అని చెప్పుటకుకూడ వీలులేదు. అయినను హెడ్డింగ్ టైపులు మొదలుకొని పుస్తకము టైపులవరకు 100 కి పైగా యుండవచ్చును. తమిళమునందును తెలుగు టైపులకంటె ఎక్కువగా టైపులుకలవు. కన్నడమందు తెలుగునందున్నన్ని టైపులు లేకపోయినను సగమునకు పైగా నయినను వుండవచ్చును. మలయాళ భాషలోకూడ 10 కి లోపు టైపుల రకములు కలవు.

## తెలుగు టైపు రైటరు

అచ్చువేయు పద్ధతియేకాక, టైపురైటింగ్ మెషీనుల సంగతి కొంత చర్చింతము. ఇట్టి టైపు రైటర్లు భారత

దేశమందలి ప్రధానభాష లన్నింటియందు గలవు. అన్ని భాషలకంటెను ఇంగ్లీషుభాషయొక్క టైపు రైటరు భారత దేశములో మూరు మూలలకు వ్యాపించియుండు టకు అది రాజభాషయగుటయు, అక్షరములు చాల తక్కువ యగుటచే టైపు చేయుటకు మిగుల సులభ ముగానుండుటయు కారణములు. మిగిలిన దేశీయ భాషలలో అక్షరములు ఎక్కువగనుండుటయు, ఆ భాష ఒక ప్రాంతముదాటి మరొక ప్రాంతమునందు చెల్లకపోవు టయు కారణములుగా దేశభాషా టైపు రైటరులు ఆంగ్ల భాషా టైపు రైటరులంత వ్యాప్తిలోనికి రాలేదు. తరువాతి స్థానము హిందీ టైపు రైటరుకు యివ్వవచ్చును. అందుకు కారణము. ఆంగ్లము తర్వాత దేశమందంతటను చలామణీయగు భాష హిందీయగుటయే. అంతేకాక కొన్ని ప్రాంతీయభాషల లిపులు హిందీభాషాలిపియైన నాగరి లిపియందుండుటయే.




ఇక దక్షిణభాషలగు తెలుగు, తమిళము, మలయాళ ములలోకూడ టైపు రైటరులు ఏర్పడినవి.

తెలుగు భాషా టైపు రైటరు లేనికొఱత చాలకాలము నుండి యుండెను. కొంతమంది ఈ ప్రయత్నమునకు తల పెట్టి విఘ్నముల కోర్చికొనలేక విరమించియుండిరి. కాని కొద్ది కాలము క్రిందట శ్రీ పీఠికాపుర కుమారరాజావారైన శ్రీ రాజా రావు వేంకట మహీపతి సూర్యారావు బహద్దరు వారిచే, 4 సం॥రముల కృషిఫలితముగా కనిపెట్టబడినది. ఈ యంత్రముపేరు 'చిన్నమాంబాంధ్ర ముద్రాలేఖిని'. ఈ యంత్రము అమెరికాలో ప్రసిద్ధిచెందిన 'రాయలు' టైపు రైటరు కంపెనీవారిచే నవీనమగు 'విక్టరీ' మోడలున తయారుచేయబడినది. ఈ యంత్రముపై మిగుల సులభ పరిశ్రమతో తెలుగులోని అన్ని విధములయిన వాఙ్మయము లను మిక్కిలి శీఘ్రముగా టైపు చేయవచ్చును. దీని వెల రమారమి రు 500/–లు ఉండును. దీనిని ప్రోత్సహించు టకై ప్రభుత్వమువారేర్పరచిన ఉన్నత అధమ తరగతి పరీక్ష లందు ఏటేట పెక్కురు విద్యార్థులు ఉత్తీర్ణులగుచున్నారు. ఆంధ్ర దేశమందలి అనేక సంస్థలవారు దీనినుపయోగించుచున్నారు. ఆంధ్ర మహాజనులందరును దీనిని ప్రోత్సహించవలయును. ఈ యంత్రము యొక్క బాహ్య రూపమును ఈ పైన ప్రదర్శించుచున్నాము.

ఇవిగాక ఇతర భాషలకువలెనే తెలుగుభాషకును షార్టు హాండ్ లేఖనము, 'సైక్లొస్టయిలు మెషీను' వలని ఉప యోగములు కలవు.

మొత్తముమీద తెలుగు లిపిలోని యక్షరములను ఇంకను సంక్షిప్తపరచి తెలుగులిపి టైపులు, టైపు రైటురు, తెలుగు షార్టుహాండ్ లేఖనము ఎక్కువ సులభమైన పద్ధతిని నడచే టట్లు ఆంధ్రులందరు కృషిచేయవలసియున్నది.



# సాహిత్యానుబంధములు—7. పట్టికలు

## ప్రసిద్ధాంధ్ర కవులు-కాలము - కృతులు

### ఆదియుగము

| కవి | కాలము | కృతులు |
|---|---|---|
| నన్నయ | 1022-1063 | మహాభారతము (ఆది-సభా-ఆరణ్య పర్వ భాగములు) |
| నన్నెచోడుడు | 1151-1170 | కుమార సంభవము |
| పాల్కురికిసోమ నాథుడు | 1170-1220 | పండితారాధ్య చరిత్రము |
| | | బసవపురాణము |
| రంగనాథుడు | 1200-1276 | రంగనాథ రామాయణము (ద్విపద) |
| తిక్కన | 1230-1300 | మహాభారతము |
| | | నిర్వచనోత్తర రామాయణము |
| కేతన | 1250-1270 | దశకుమార చరిత్రము |
| | | విజ్ఞానేశ్వరీయం |
| బద్దెనకవి | 1260-1300 | నీతి శాస్త్రముక్తావళి |
| అథర్వణాచార్యులు | 1240-1300 | అథర్వణ కారికలు |
| మారన | 1250-1300 | మార్కండేయపురాణం |
| ఎఱ్ఱాప్రెగ్గడ | 1280-1350 | అరణ్య పర్వశేషము |
| | | నృసింహ పురాణము |
| | | హరివంశము |
| హుళక్కి భాస్కరుడు | 1295-1360 | భాస్కరరామాయణం |
| మంచెన | 1300- | కేయూరబాహు చరిత్రము |
| విన్నకోట పెద్దన | 1300- | కావ్యాలంకార చూడామణి |
| చిమ్మపూడి అమరేశ్వరుడు | 1300- | విక్రమసేనము |
| నాచన సోముడు | 1360- | ఉత్తర హరివంశము |
| | | వసంత విలాసము |
| రావిపాటితిప్పన | 1380- | చంద్ర తారావళి, మదనవిజయం. |
| వేములవాడ భీమకవి | 1400- | కవిజనాశ్రయము |
| శ్రీనాథుడు | 1400- | క్రీడాభిరామము |
| | | కాశీఖండము |
| | | భీమఖండము |
| | | శృంగారనైషధము |
| | | పల్నాటివీర చరిత్ర |
| | | హరివిలాసము |
| చిమ్మెర పోతన | 1405-1470 | భాగవతము |
| | | వీరభద్ర విజయము |
| | | భోగినీ దండకము |
| | | నారాయణశతకము |
| జక్కయకవి | 1406-1422 | విక్రమార్క చరిత్రము |
| మడికి సింగన | 1420- | వాసిష్ఠ రామాయణము |
| | | పద్మ పురాణము |
| | | భాగవతదశమస్కంధము |
| వల్లభరాయుడు | 1420- | అంబికాశతకము |
| అనంతామాత్యుడు | 1430- | భోజరాజీయము |
| | | రసాభరణము |
| | | అనంతుని ఛందస్సు |
| నిశ్శంక కొమ్మన్న | 1430-1470 | శివలీలా విలాసము |
| గౌరనమంత్రి | 1440- | హరిశ్చంద్రోపాఖ్యానం |
| | | నవనాథ చరిత్రము |
| పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు | 1450-1480 | జైమినీభారత అశ్వమేధ పర్వము |
| | | శృంగార శాకుంతలము |
| దగ్గుపల్లి దుగ్గన | 1480- | నాచికేతూపాఖ్యానం |
| | | కాంచీపురమహాత్మ్యం |
| దూబగుంట నారాయణకవి | 1480- | పంచ తంత్రము |
| వెన్నెలకంటి సూరన్న | 1480- | విష్ణుపురాణం |
| నందిమల్లయ్య-ఘంట సింగయ్య | 1480- | ప్రబోధచంద్రోదయం |
| | | వరాహపురాణం |
| కేతనమంత్రి | | కాదంబరి |
| ఫణిభట్టు | | పరతత్త్వసారము |

| | | |
|---|---|---|
| మనుమంచిభట్టు | | హయలక్షణసారము |
| కవిభల్లటుడు | | విక్రమార్క చరిత్రము |
| | | లక్షణ గ్రంథము |
| | | నిఘంటువు |
| కవిరాక్షసుడు | | ఆదినారాయణ చరిత్ర |

## మధ్యయుగము

| | | |
|---|---|---|
| పిడుపర్తి సోమనాథుడు | 1510- | బసవపురాణము |
| శ్రీ కృష్ణదేవరాయలు | 1510-1530 | ఆముక్తమాల్యద |
| అల్లసాని పెద్దన | 1510-1535 | స్వారోచిషమను చరిత్రము |
| నందితిమ్మన | 1510-1526 | పారిజాతాపహరణము |
| నాదెండ్ల గోపన్న | 1517-1526 | కృష్ణార్జున సంవాదము |
| మాదయగారి మల్లన | 1517-1526 | రాజశేఖర చరిత్రము |
| పిడుపర్తి బసవకవి | 1520- | ప్రభులింగలీలలు |
| ధూర్జటికవి | 1520-1530 | కాళహస్తి మాహాత్మ్యము |
| చింతలపూడి యెల్లకవి (రాధామాధవ కవి) | 1520-1540 | రాధామాధవము, తారకబ్రహ్మ రాజీయము |
| సంకుసాలనృసింహకవి | 1525 | కవికర్ణ రసాయనము |
| తెనాలి రామలింగకవి | 1525-1560 | ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగ మహాత్మ్యము |
| ఆతుకూరికుమ్మరిమొల్ల | 1526- | రామాయణము |
| అయ్యలరాజు రామభద్రుడు | 1530-1570 | సకల కథాసార సంగ్రహము, రామాభ్యుదయము |
| దోనూరి కోనేరికవి | 1547-1515 | బాలభాగవతం |
| అద్దంకి గంగాధర కవి | 1550-1580 | తపతీ సంవరణము |
| పొన్నగంటి తెలగన్న | 1550-1580 | యయాతి చరిత్ర |
| శంకరకవి | 1550-1581 | హరిశ్చంద్రోపాఖ్యానం |
| మల్లారెడ్డి | 1550-1600 | షట్చక్రవర్తి చరిత్ర |
| పింగళిసూరన | 1560- | కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము, రాఘవపాండవీయము |
| రామరాజ భూషణుడు | 1560- | వసు చరిత్ర |
| తెనాలి అన్నయ్య | 1565- | సులక్షణాపరిణయము |
| మట్లు అనంత భూపాలుడు | 1570-1610 | కకుత్స్థ విజయము |
| సారంగుతమ్మయ్య | 1590-1620 | వైజయంతీ విలాసము, సారంగధర చరిత్ర |
| పింగళి ఎల్లనార్యుడు | 1602- | తోభ్యచరిత్రము |
| చేమకూర వేంకటకవి | 1630- | విజయ విలాసము |
| ఎలకూచి బాలసరస్వతి | 1630- | రంగకౌముది |
| హరిభట్టు | 1650- | వరాహ, మత్స్యపురాణములు |
| కాకమాని మూర్తి | ,, | పాంచాలీ పరిణయం, రాజవాహన విజయం, బహులాశ్వచరిత్ర |
| నూతన కవి సూరన | 1680- | ధనాభిరామం, విష్ణుమాయావిలాసం |
| వెలగపూడి కృష్ణకవి | 1690-1717 | వేదాంతసార సంగ్రహము, మలినీమాధ వీయము |
| కందుర్తి వేంకటాచల కవి | 1690-1717 | మిత్రవిందా పరిణయము |
| సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు | 1690-1717 | అహల్యాసంక్రందనము, రాధికాసాంత్వనము, సారంగధర, జైమినీ భారతము |
| పైడిమఱ్ఱి వేంకటపతి | 1710- | చంద్రాంగద చరిత్ర |
| కూచిమంచి తిమ్మన | 1715- | రుక్మిణీ పరిణయము, నీలాసుందరీ పరిణయము, రాజశేఖర విలాసము, భర్గ్లానీ చరిత్ర |
| వక్కలంక వీరభద్రకవి | 1720- | వాసవదత్తాపరిణయము, గౌరీ కళ్యాణము |
| ఏనుగు లక్ష్మణ కవి | 1730- | రామ విలాసము, భర్తృహరిసుభాషితము |
| కస్తూరి రంగకవి | 1736-61 | ఆనంద రంగరాట్ ఛందస్సు |
| కూచిమంచి జగ్గకవి | 1740- | చంద్ర రేఖా విలాసము |

| | | |
|---|---|---|
| అడిదము సూరకవి | 1750-80 | కవిజనరంజనము, ఆంధ్రచంద్రాలోకం, ఆంధ్ర నామశేషము, కవిసంశయ విచ్ఛేదము |
| మంగళగిరి ఆనందకవి | 1760- | వేదాంత రసాయనము |
| ఆదూరు కుప్పకవి | 1765-88 | ఇందుమతీ పరిణయము, ఆచార్య విజయము, పరమభాగవత చరిత్ర, రామాయణ భాగవతములు |
| కనుపర్తి అబ్బయ | 1770- | అనిరుద్ధ చరిత్ర |
| దిట్టకవి నారాయణ | 1780-90 | రంగరాయ చరిత్ర |
| ముద్దుపళని | 1790- | రాధికా సాంత్వనము |
| తరికొండ వేంకమాంబ | 1840- | ద్విపద భాగవతము, రాజయోగ సారము, వేంకటాచల మాహాత్మ్యము |
| పిండిప్రోలు లక్ష్మణకవి | 1840- | రావణ దమ్మీయము (లంకాదహనము) |
| శిష్టుకృష్ణమూర్తి | 1840- | సర్వకామదా పరిణయము |
| మాడభూషి వేంకటాచార్యులు | 1840- | భారతాభ్యుదయము |
| గోపీనాథ వేంకటకవి | 1860- | వాల్మీకి రామాయణము (గోపీనాథరామాయణం) శిశుపాలవధ భగవద్గీత |
| సాంఠి భద్రాద్రి రామ కృష్ణశాస్త్రి | 1860- | చిత్ర సీమ |
| మండపాక పార్వతీశ్వరశాస్త్రి | 1870- | అనేక శతకములు, మాలికలు |
| మచ్చవేంకట కవి | 1880- | శుద్ధాంధ్రనిర్వచనని రోష్ఠ్యకుశలవ చరిత్ర |

## శతకముల పట్టిక

| కవి పేరు | కాలము | శతకముల పేర్లు |
|---|---|---|
| బద్దెన | 1070? | సుమతి శతకము |
| పండితారాధ్యులు | 1170 | శివతత్త్వసారము |
| పాల్కురికి సోమనాథుడు | 1180 | వృషాధిప శతకము |
| యథావాక్కుల అన్నమయ్య | 1240 | సర్వేశ్వర శ |
| శివదేవమంత్రి | 1290 | శివదేవ శ |
| రావిపాటి త్రిపురాంతకుడు | 1380 | అంబికా శ |
| వెన్నెలకంటి జన్నయ | 1450 | దేవకీ నందన శ |
| వేమన | ,, | వేమన శ |
| అయ్యలరాజు త్రిపురాంతకుడు | 1460 | రఘువీర శ |
| బమ్మెర పోతనామాత్యుడు | 1480 | నారాయణ శ |
| ధూర్జటి | 1530 | శ్రీకాళహస్తీశ్వర శ |
| తాళ్లపాక అన్నమయ్య | ,, | వేంకటేశ్వర శ |
| తాళ్లపాక చిన్నన్న | 1545 | ,, |
| కంసాలి రుద్రకవి | 1565 | బలవదరి శ |
| కవి చౌడప్ప | ,, | కవి చౌడప్ప శ |
| పరమానందయతి | 1590 | సంపగిమన్న, పరమానంద, దత్తాత్రేయ శ॥లు |
| మారవికవి | 1600? | భాస్కర శ |
| బొడ్డపాటి పేరయ | 1600 | మల్లికార్జున, సూర్య శ॥లు |
| ,, కొండయ | 1600 | తిరుకాళహస్తి, లింగ శ॥లు |
| తెళ్లపూడి కసవరాజు | ,, | కళావతీ శ |
| పట్టాభిరామ కవి | ,, | వజ్రపంజర, మరున్నందన, గువ్వలచెన్న శ॥లు |
| గణపవరపు వేంకట కవి | ,, | యమక శ |
| నిమ్మల లక్ష్మణాచార్యుడు | ,, | ఏకామ్రలింగ శ |
| ఎలకూచి బాలసరస్వతి | 1620 | భర్తృహరి శ |
| పైడిపాటి వేంకటనృసింహ కవి | 1660 | రామచంద్ర, కృష్ణశ॥లు |
| అయ్యలరాజు నారాయణ కవి | ,, | ఆంజనేయ శ |

| | | |
|---|---|---|
| కంచర్ల గోపన్న | 1670 | దాశరథి శ. |
| పుసులూరి సోమరాజ కవి | 1700 | ఇందు, బాలగోపాల, నందనందన శ॥లు |
| శ్రీపతి భాస్కర కవి | ,, | చిత్త శ. |
| వైదర్భ అప్పయ కవి | 1710 | బళిరకటి వేల్పు, ఉపమాక వేంకటేశ్వర శ॥లు |
| కూచిమంచి తిమ్మ కవి | 1715 | కుక్కుటేశ్వర శ. |
| గోగులపాటి కూర్మనాథ కవి | 1724 | సింహాద్రి నారసింహ శ. |
| ఏనుగు లక్ష్మణ కవి | 1725 | భర్తృహరి శ. |
| రావూరి సంజీవ కవి | 1730 | వీరనారాయణ శ. |
| అడిదము సూరకవి | 1750 | రామలింగేశ శ. |
| మతిగంటి సింగరాచార్యులు | ,, | సీతాపతి శ. |
| ఆణివెల్ల సీతారాముడు | ,, | జానకీపతి శ. |
| శేషప్ప కవి | ,, | నృసింహ శ. |
| పావులూరి మల్లన | ,, | భద్రాద్రిరామ శ. |
| పత్రిరమణప్ప | ,, | విష్ణు సర్వోత్తమ శ. |
| శంకర శంకరకవి | ,, | రాచబిడ్డ శ. |
| పుష్పగిరి తిమ్మకవి | ,, | భర్తృహరి శ. |
| గంగాధర కవి | ,, | చెన్న మల్లేశ్వర శ. |
| సిద్ధరామ కవి (చెన్నయ) | ,, | సిద్ధరామ శ. |
| సోమేశ్వరారాధ్యులు | ,, | సోమనాథలింగ శ. |
| చెన్నాప్రగడ నాగరాజు | ,, | గౌణసౌజన్యాఖ్యాన శ. |
| ఉన్నవ యోగానందుడు | ,, | రాజగోపాల శ. |
| నృసింహ కవి | 1760 | కృష్ణ శ. |
| కర్ర పాలెము సింగనామాత్యుడు | ,, | నరసింహ శ. |
| చాట్రాతి లక్ష్మీనరసు | ,, | కోదండరామ శ. |
| పోచిరాజు వీరన్న | 1790 | భర్తృహరి ఆనందలహరి, సౌందర్యలహరి శ॥లు |
| దేవగుప్తాపు రామభద్ర కవి | ,, | భవానీధవ శ. |
| బాణాల వీరశరభేంద్రుడు | ,, | సాంబశివ శ. |
| తాడేపల్లి పానకాలరాయడు | ,, | మానసబోధ, చిత్తబోధ, శ్రీరుక్మిణీపతి, మంగళగిరి, పార్థసారథి శ॥లు |
| వరాహగిరి కొండ్రాజు | ,, | జగన్నాయక శ. |
| కొమరగిరి సంజీవ కవి | ,, | శశాంకశేఖర శ. |
| పరశురామపంతుల రామమూర్తి | ,, | పరశురామ, మనోహర, ఈదులవాయి పురాధినాయక (రామస్వామి) శ॥లు |
| శేషప్ప కవి | ,, | నృసింహ శ. |
| మల్లన యోగి | ,, | మల్లన యోగి శ. |
| రాచవేటి కవి | ,, | గణికాగుణ ప్రవర్తన తారావళి |
| సదానంద వరద రాజయోగి | ,, | సదానంద వరదరాజ యోగి శ. |
| రాయభట్టు వీరరాఘవ కవి | ,, | కస్తూరి రంగ శ. |
| వాడ్రేవు కామరాజు | ,, | ,, |
| రామభద్ర కవి | ,, | జానకీపతి శ. |
| తిరుక్కడయూరి కృష్ణదాసు | ,, | కృష్ణ శ. |
| కాండూరి వేంకటదాసు | ,, | దీనచింతామణి శ. |
| కాసుల పురుషోత్తమ కవి | ,, | ఆంధ్రనాయక, హంసలదీవి, గోపాల, మానసబోధ, భక్తకల్పద్రుమ శ॥లు |
| వంగూరి నరసకవి | 1810 | ప్రసన్న రాఘవ శ. |
| ఎఱ్ఱమిల్లి సూర్యప్రకాశకవి | ,, | హనుమచ్ఛతకము |
| వంకాయలపాటి వేంకటకవి | ,, | మదనగోపాల శ. |
| జూలూరి అప్పయ్య | ,, | యదువంశభూషణ శ. |
| సన్నిధిరాజు జగ్గకవి | ,, | రాజలింగ శ. |
| కానుకొలను నాయనప్ప | 1816 | చింతగుంటపాలెపు రామ శ. |
| అడిదము బుచ్చి వేంకట్రాయుడు | 1820 | శంకర శ. |
| బుద్ధిరాజు కనకరాజు | ,, | శివ శ. |
| అమలాపురపు సన్యాసికవి | 1830 | పంచముఖేశ, ముఖలింగ, శివ విశ్వనాథాది శ॥లు |
| మదిన సుభద్రయ్యమ్మ | ,, | రఘునాయక, కేశవ, కృష్ణరాఘవ, రామశ॥లు |

| | | |
|---|---|---|
| తరిగొండ వెంకమ్మ | 1840 | కృష్ణ శ. (ద్విపద) |
| మత్తూరి అప్పావు మొదిలి | ,, | మాత్స్య శ. |
| పోరనంది సర్వేశ్వరశాస్త్రి | ,, | బ్రహ్మపురివేంకటేశ్వర శ. |
| ఫక్కి వేంకట నరసయ్య | ,, | కుమారీ శ. |
| మంత్రిప్రగడ సూర్యప్రకాశ కవి | ,, | భీమలింగ శ. |
| బండి బాపమ్మ | ,, | మీనాక్షీ శ. |
| తోట విజయరాఘవకవి | ,, | పార్థసారథి శ. |
| వేల్పూరి వేంకటకవి | ,, | జానకీరామ శ. |
| మంచెళ్ల కృష్ణకవి | ,, | వేంకటనగాధిపతి శ. |
| ఘటికాద్రికవి | ,, | శనైశ్వర శ. |
| చీదెళ్ల రామకవి | 1845 | కృష్ణగురు శ. |
| బహుజనపల్లిసీతారామాచారి | 1847 | సుందరరాజ, వెనకయ్య శ॥లు |
| శాంతానందయోగి | 1850 | శాంతానందయోగి రామ శ. |
| ఝంఝామారుతము వేంకట సుబ్బకవి | ,, | సూర్యనారాయణ శ. |
| సాహెబురాణ రామన్న | ,, | సీతాపతి శ. |
| ఉండుమూడి సూరపరాజు | ,, | శ్రీపతి శ. |
| పాటూరి లక్ష్మీనృసింహకవి | ,, | లక్ష్మీనృసింహ శ. |
| బాలకృష్ణకవి | ,, | వరదరాజ శ. |
| కొమ్రరాజు రామలింగకవి | ,, | శ్రీగిరిమల్లేశ, వీరభద్ర శ॥లు |
| తిరువాయిపాటి రామానుజయ్య | ,, | చూడికుడుత (రంగనాయక) శ. |
| మేకా బాపన్న | ,, | ఆచంట రామేశ్వర శ. |
| మిక్కిలి మల్లికార్జునకవి | ,, | రాఘవ శ. |
| పూసపాటి వీరపరాజు | ,, | చిరుతవజీరు శ. |
| కోటీశ్వర దీక్షితుడు | ,, | విట్ఠలేశ్వర శ. |
| గురురాజకవి | ,, | భర్తృహరి శ. |
| తటవర్తి వేంకటమంత్రి | ,, | రమామనోహర శ. |
| మీసరగండ మునిస్వామి | ,, | రఘురామ శ. |
| కొండిగంటము గురునాథము | 1854 | సరస్వతీ శ. |
| చేకూరి సిద్ధయ్య | 1858 | వేణుగోపాల శ. |
| శ్రీనివాసకవి | 1860 | త్రిపుర సుందరీ శ. |
| మోదుకూరి శంకరకవి | ,, | ధీరధీ శ. |
| కూచిమంచి సోమసుందరుడు | ,, | కొప్పులింగేశ్వర, భక్త చింతామణి శ లు. |
| అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | ,, | సింహాద్రిరామ, పాపయ మంత్రి, కృష్ణభూపతి, లలామాది శ॥లు. |
| పరిమి వేంకటాచల కవి | ,, | సంగమేశ్వర శ. |
| శిష్టుసర్వశాస్త్రి | ,, | జ్ఞానప్రకాసూనాంబికా శ |
| ఇంద్రకంటి వేంకటకవి | 1862 | వేంకటాచల రమణ శ. |
| చిలకమర్తి నారాయణాచార్యులు | 1865 | వేణుగోపాలబాల శ. |
| పల్లి పార్వతీశము | ,, | రామరాఘవ శ. |
| దూపాటి తిరుమలాచారి | 1870 | ముకుంద శ. |
| చామర్తి శేషగిరిరాయకవి | ,, | నమశ్శివాయ శ. |
| విజయనగరపు చెంగల్వరాయ కవి | ,, | మదన గోపాల శ. |
| మద్దాలి సుబ్బయ్య | ,, | శ్రీ హరి శ. |
| బృందావనము లక్ష్మణదేశి కుడు | ,, | రఘురామ శ. |
| చిత్రావఝ్ఝల సూర్యప్రకాశకవి | ,, | దీన చింతామణి శ. |
| మండపాక పార్వతీశ్వర కవి | ,, | గోపాలకృష్ణ, సీతారామాది శ॥లు. |
| తటవర్తి కొండయ | ,, | రామ, మల్లేశ్వర శ॥లు. |
| సందడి నాగదాసు | ,, | శ్రీపతి, లక్ష్మీనారాయణ శ॥లు. |
| రేమల రామదాసు | ,, | మహీజామనోహర శ. |
| తాతరాజు వేంకటసుబ్బ దాసు | ,, | చక్రపాణి శ. |
| కొల్లం సీతారామకవి | 1880 | శ్రీరమాకాంతరంగ శ. |
| పాలెపు వేంకట సూర్య గోపాల కవి | ,, | శౌరీ, వల్లూరి గోపబాల శ॥లు. |
| పేకేటి కాశిరాజు | ,, | కేశవ శ. - |
| కొమత్రాజు వేంకటశివుడు | ,, | రేపాల రాజలింగ శ. |
| రఘుపతుల రామమూర్తి | ,, | భావబోధ రసాయన శ. |
| గుట్టుంకొండ భక్తవత్సలుడు | 1885 | సుబుద్ధి శ. |
| వంగిపురపు నృసింహాచారి | ,, | ఆంజనేయ శ. |
| పిట్టల రామయ | ,, | సనాథనాయక శ. |
| కావూరి వేంకటరామ కవి | ,, | శ్రీనిమిషాంబికామణి శ. |

| | | |
|---|---|---|
| మందపాటి రామకృష్ణ కవి | ,, | శ్రీరామ శ. |
| బొడ్డు లక్ష్మీనారాయణ | ,, | హేలాపురి శ. |
| ఫక్కి అప్పలనరసు | ,, | కుమార శ. |
| దామరాజు లక్ష్మణదాసు | ,, | సీతారామ శ. |
| మద్దాల గురుస్వామి | ,, | నరసింహ శ. |
| తిమ్మరాజు పేరకవి | ,, | శ్రీ రఘురామ, ఆత్మారామ శ॥లు. |
| ముడుంబై వేంకటరామ నృసింహాచారి | ,, | రంగేశ కృష్ణ శ. |
| జయంతి కామేశ్వర కవి | 1890 | జానకీవర శ. |
| ముదిగొండ శంకరారాధ్యులు | 1900 | భావలింగ శ. |
| నూతులపాటి సుబ్బ కవి | ,, | భద్రాద్రిరామ శ. |
| చెలికాని చెల్లయమ్మ | ,, | పార్థసారథి, జానకీ శ॥లు. |
| దేవాదుల పెద్దన్న | ,, | ఉమామహేశ్వర శ. |
| అద్దంకి వేంకటాచార్యుడు | ,, | నీరజాక్ష శ. |
| రాచూరి లక్ష్మీరామదాసు | ,, | శ్యామలాంబా శ. |
| దబ్బీరు సరసుకవి | ,, | కలువాయి శ. |

## గ్రంథ ప్రచురణములు

(రిజిస్ట్రారు ఆఫ్ బుక్స్ వారి లెక్కలనుండి)

| సంవత్సరం | ఇంగ్లీషు | తమిళం | తెలుగు |
|---|---|---|---|
| 1910 | 521 | 671 | 486 |
| 1920 | 451 | 775 | 486 |
| 1930 | 717 | 1189 | 779 |
| 1940 | 418 | 1068 | 530 |
| | 2107 | 3703 | 2281 |

ప్రక్కను కనుపరచిన అణా కాసు బొమ్మ, ప్రభుత్వ నాణెములలో ఆంధ్ర భాషకు గల స్థానమే కాక ఇతర దేశభాషలకన్న ప్రాముఖ్యము తెలియబరచును.




## దేశీయ భాషలలో తెలుఁగునకు గల స్థానము

| వరుస సంఖ్య | భాషపేరు | మాట్లాడువారు | వంతు |
|---|---|---|---|
| 1. | హిందూస్థానీ | 71,547,000 | 25.3 |
| 2. | బెంగాలీ | 53,469,000 | 18.9 |
| 3. | తెలుఁగు | 26,374,000 | 9.3 |

(1931 సం॥ జనాభా లెక్కల ననుసరించి)

---




అటుకొండ యిటుకొండ ఆరెంటినడుమ
నాగుల్లకొండలో నాట్యమాడేటి
దివ్యసుందరనాగ! దేహీ యన్నాము,
కనిపెట్టి మమ్మెపుడు కాపాడవోయి!

—బసవరాజు.

సాహిత్యానుబంధములు—8.

# తెలుగునాట వంగసాహిత్య ప్రాభవం

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎమ్. ఏ., బి. ఎల్.

విషయ సంగ్రహము:—సాహిత్యాంగణమున ఆంధ్ర వంగమాతలకు పరిచయము—ప్రఖ్యాత వంగనవలాకారులు—వేంకటపార్వతీశ్వరకవుల ఆంధ్రీకరణాలు, ఆంధ్రి ప్రచారిణీ గ్రంథనిలయ ప్రచారం—సరస్వతీ గ్రంథమండలి, అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారి కృషి—ఇందు జొన్నలగడ్డ సత్యనారాయణగారి కార్య నిర్వహణ, అనేక ఉద్గ్రంథములను అనువదించుట-విశ్వభారతి, వంగ విశ్వ కళాపరిషత్తుల ప్రశస్తి-విదేశ విశ్వ విద్యాలయములలో వంగ భాషాబోధనము—వంగ హిందీ సాహిత్యముల సన్నిహితత్వము—గిడుగు రామమూర్తి గారు ఆంధ్రివంగభాషల చెలికారమునకు చేసిన సేవ—మాగంటి అన్నపూర్ణాదేవిగారి వంగభాషా పరిచయము, నవలానువాదములు-గోపాలరెడ్డి, డాక్టరు కాకర్ల శకుంతలాదేవి, శివశంకరశాస్త్రి, చక్రపాణి ప్రభృతుల వంగభాషా సంస్కృతి—వైకుంఠరావు, శోభనాదేవిగార్ల రవీంద్రుని వంగనవలల యాంధ్రీకరణ—రవీంద్రుని క్రొత్త పోకడలు—చిత్తరంజనుని సారస్వతసేవ-ఆంధ్రిలు గమనించవలసిన విషయములు—.

సాహిత్యాంగణమున ఆంధ్రవంగమాతలకు పరిచయము ముప్పదేండ్లకుమున్ను ఆరంభమాయెనని తెలుపవచ్చును. బంకిమ్‌చంద్రుని రచనలాకాలమున వంగసీమయందు మిగుల ప్రశస్తినందినవి. అతని నవలలు మొట్టమొదట హిందీ కర్ణాటకాదిభాషలలోనికి అనువదింపబడినవి. వానిని కర్ణాటకమునుండి ఆంధ్రీకరింప గడంగిన

**ఆంధ్ర ప్రచారిణీ గ్రంథ నిలయం- వేంకట పార్వతీశ్వర కవులు**

వారు శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు. 1912 లో ఆంధ్రభారతిని తమ "యాంధ్రపచారిణీ గ్రంథ నిలయ" పీటస్థానమున అధివసింపజేసి, వీరు తమ సారస్వతారాధనము నారంభించిరి. కాలక్రమమున వీరు వంగవాఙ్మయమున ప్రవేశము నందిరి; 'పాంచకడీదే' రచించిన అపరాధ పరిశోధక అను నవలను, రవీంద్రుడు రచించిన గోరా అను నవలను ఆంధ్రీకరించిరి. పిమ్మట రాజమహేంద్రవరమున శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారు సరస్వతీగ్రంథ మండలిని స్థాపించిరి. వంగవాఙ్మయ మహత్త్వమును గ్రహించిన ధీశాలికావున, వంగసాహితీ సందేశమును ఆంధ్రభూమియందు వినిపింపవలెనని వీరు నిశ్చయించిరి. "ఆంధ్రప్రచారిణీ గ్రంథ నిలయ"మందును, "సరస్వతీ గ్రంథమండలి" యందును వంగశారద ఆత్మప్రతిబింబము నవలోకించినది. ఆంధ్ర వంగమాతలీ మహాసంస్థలందు ఒండొంటినెఱిగి ఎంతో చెలువమున, ఎంతో చెలికారమున వఱలినవి.

ఈ గ్రంథ నిలయములతో బాల్యమందే సంపర్కము నొందు భాగ్యము నాకు కలిగెను. నాడే సాహితీ జీవితము నారంభించితిని. నే నాంధ్రీకరించిన వంగసారస్వత గ్రంథములను ఆంధ్ర దేశమునందు వ్యాపింపజేయగోరి ఈ గ్రంథనిలయములవారు నా బాల్యప్రయత్నముల కుత్సాహ ప్రోత్సాహములు ప్రసాదించిరి.

**జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి వంగభాషా కృషిఫలము**

బహువర్షములు సరస్వతీగ్రంథ మండలియందు ప్రధాన గ్రంథకర్తనై అనేక నవలలను, నాటకములను, కథలను సరస్వతీదేవికి కానుకలుగా సమర్పించితిని.

బంకిమ్‌చంద్ర, ద్విజేంద్ర, రవీంద్ర, శరచ్చంద్రుల రచనలు ప్రపంచ ప్రఖ్యాతినిబడసినవి. వంగ రచయితలదెస సమస్త సీమలును గౌరవదృష్టిని సారించినవి. వంగవాఙ్మయము విదేశ విశ్వవిద్యాలయములందు బోధింపబడుచు వచ్చెను. పాశ్చాత్యులు కొందఱు విశ్వభారతి

**వంగ సారస్వత విఖ్యాతి ఇతర సీమలందును వ్యాపించినది**

యందును, వంగవిశ్వకళాపరిషత్తులందును వంగము నభ్యసించి మాతృకలందలి గంభీరభావములను హృదయంగమము గావించుకొన దొడగిరి. ఆంధ్ర పండితులలో అనేకులకు వంగభాషయందు పరిచయము నందవలెనను మక్కువ కలిగెను. కాని, వంగ సంఘమందు వీరు మసలకపోవుటవలనను, వంగభాషాభ్యాసమునకు వలసిన వ్యవస్థలు తెలుగుసీమలో లేకుండుటవలనను వ్యావహారిక వంగవాఙ్మయమును వీరెఱుగజాలరైరి. కాని

కీ. శే. గురుదేవుడు



విశ్వకవి రవీంద్రనాథ టాగూరు.

వీరి యుత్సాహమును, జిజ్ఞాసయును ప్రశంసనీయములు. వంగ హిందీభాషలకు సన్నిహితసఖ్య ముండుటచే, ప్రధాన వంగ గ్రంథములు తొలుత హిందీలోనికి పరివర్తనమగు చుండును. వంగ హిందీ గ్రంథములను సమ్ముఖమున నిడి కొని ఆంధ్రసోదరులు కొందఱు వీని నాంధ్రీకరించుచు వచ్చిరి. వీరి యాంధ్రీకరణమును విమర్శించుట నా ప్రస్తుతాశయము కాదు.

**గిడుగు రామమూర్తి సేవ**

ప్రపంచమందు ప్రశస్తినందిన వాఙ్మయముల పోకడల నెఱుగక ఆంధ్ర వాఙ్మయము తొంటిపుంత ననుసరించి పోవుట గాంచి, ప్రస్తుత యుగధర్మము వాంఛించిన చలనము దానికి కలుగజేయ గృతనిశ్చయుడైన ఆంధ్ర మహా పండితుడు శ్రీ గిడుగు వేంకట రామమూర్తి తన కర్తవ్యమునకు అక్కఱైన పరిచయమును వంగభాషయందును బడసి, సునీతకుమార ప్రభృతుల సఖ్యము నంది, వారివలె విశేషభాషా పరిశోధనము సలిపి, వంగవాణికిని ఆంధ్రశారదకును సముచిత చెలికారమును చేకూర్చుటకై విశేషయత్నము నొనరించెను.

వంగదేశమున కొంతకాలముండి నిజేశునివలె వంగవాఙ్మయమున చక్కని పరిజ్ఞానమునంది, అరవిందఘోష్ తన అర్ధాంగికి లిఖించిన లేఖలను, సరళాదేవి నవవర్ష స్వప్నం, ఇవిగాక వివాహమంగళం మొదలైన గ్రంథములు ఆంధ్రీకరించి భారతాంబను సేవించినట్లే ఆంధ్రభారతిని సైతము సేవించి, యశస్తిలకయైన సీమంతినీ చూడామణి శ్రీ మాగంటి అన్నపూర్ణాదేవి.

**మాగంటి అన్నపూర్ణాదేవి సేవ**

ఆంధ్రమాత గళసీమయందు శమంతకమణియై తేజరిల్లిన ఈ సోదరి అకాలమున దివంగతయగుట ఆంధ్రుల దురదృష్టము. భారత వియత్తలమునుండి తటాలునరాలిన ఈ నక్షత్రము మరల తెలుగుతల్లి కడుపునబుట్టి, ధర్మక్షేత్రమున తన కర్తవ్యమును తాను నిర్వహించును గాక!

**శకుంతలాదేవి, గోపాలరెడ్డిగార్ల సేవ**

తెలుగుతల్లి బిడ్డ డాక్టరు కాకర్ల శకుంతలాదేవి—స్త్రీ కళాశాల ప్రిన్సిపాలు—వంగజనయిత్రి పెంపుడు బాలికయై, విదుషీమణియై వర్ధిల్లుచున్నది. ఇరువురు తల్లుల కీమె భావికాలమున నెంతేని సేవచేయ జాలునని ఆశపడుచున్నాము. శ్రీ గోపాలరెడ్డి సోదరుడు మొదలయిన వారు వంగసీమయందు కొంత కాలమువసించి వంగభాష నభ్యసించి, వంగమహిమను బహుభంగుల తమ సీమయందు వ్యక్తీకరించుచుండుట ముదావహము. కారుమూరి వైకుంఠరావుగారు శోభనాదేవి గారితో కలిసి రవీంద్రనాథుని 'ఇంటా-బయటా' మొదలయిన గ్రంథములు సులభమైన వాడుకభాషలో ఆంధ్రీకరించినారు.

**వంగ గ్రంథానువాదకులు**

వేంకట పార్వతీశ్వరకవులే కాక, తమ అనువాదముల వలన ఆంధ్రుల మన్ననందిన ఆంధ్రమనీషులు శ్రీపాద కామేశ్వరరావు, తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి, ఎలమంచిలి శ్రీరాములు, గారపాటి ఆంజనేయచౌదరి, కౌతా శ్రీరామశాస్త్రి, చక్రపాణి ప్రభృతులు. కీ. శే. అక్కిరాజు ఉమాకాంత పండితులు తర్కసాహిత్య వ్యాకరణ పండితులు; వీరు శాంతి నికేతన మందలవరచుకొన్న సంస్కృతి, వీరు పల్నాటి చరిత్ర సంప్రతించి దానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో కనబడుతుంది.

రవీంద్రుడు సంచలమెఱుగని సంప్రదాయమున కెన్నడును అంజలి ఘటింపలేదు. అన్యభాషాసంపర్కమువలన క్రొత్త పోకడల నెఱిగి మాతృభాష ఘనతరశక్తినందునని

అతడెఱుగును. ఆంగ్లసాహితినుండి అపూర్వాంశముల నాతడు గ్రహించినాడు. శుద్ధశ్రోత్రియులైన వంగపండితులు తనను దూషించినను అతడు పాటింపక తన సాహితికి క్రొత్తవన్నె తెచ్చుకొనుచుండెను. కావుననే అతనివలన వంగశారద ఎనలేని హొయలును వెలయజొచ్చినది. ఆంగ్లమందలి బ్లాంక్ వెర్సును వంగ రచయితలు పలువురు అనుకరించి విజయులైరి. ఆధునికాంధ్ర కవులు కొందఱు వీరి దృష్టాంతముపై చూపునిలుపుట సంతోషకరము.

రవీంద్రుని క్రొత్త పోకడలు

సాహితి ప్రవంతినిబోలినది. పోయిన కొలదిని క్రొత్త నీరు చేరుటచే శైవలిని విశాలమగుచుండును. నూతన శబ్ద సంపర్కము వలనను, నవ్యభావ బాంధవ్యమువలనను వాఙ్మయము ఘనతర దార్ఢ్యమును, సౌష్ఠవమును బడయును. నవ్యశక్తికి అనుకూలమైన నడకను భాష కాంక్షించును; నూతన నియమావళిని అవలంబించును. ప్రపంచ భాషా చరిత్రములను పరీక్షించినపుడు ఈ విషయము స్పష్టముగా మానసగోచరమగును. ఆంధ్ర యువకు లీవిషయమును గుర్తించుట సంతోషకరము. సహస్రాబ్దములకు మున్ను సృష్టియైన క్లిష్ట ఛందోనియమములనే అన్నివేళలందును నేడు పాటింప నక్కరలేదని వీరు గ్రహించిరి. కాని క్రొత్త తెరువును త్రొక్కినను రవీంద్రాదులవలె నూతన నియమావళిని అవలంబించుట ముఖ్యమని వీరిలో కొందఱు గుర్తింపరైరి. నీతి నియమములు లేనిమాట పిచ్చికూతయని వీరెఱుగరైరి. పరిజ్ఞాన రహితమైన అనుకరణముగాని, అనుసరణముగాని, అనువాదముగాని అంధ క్రియయని వీరు గ్రహించియుండవసినది.

ప్రాత నియమములను విడిచినను క్రొత్తవి పాటించవలెను.

చిత్తరంజనునకు ఆంధ్రులు రాజకీయాంగణమందు అనుచరులైనట్లు సారస్వత కేదారమున కాలేదు. వంగరాజకీయవేత్తలు సాహిత్యోపాసకులును అయిరి. చిత్తరంజనునకు కవులందుకూడ ఉన్నతస్థానము కలదు. ఈతని "సాగర సంగీత్" గంభీర భావబంధురమైనది. మన యువకవు లీతని రచనలను పరిశీలించుట పాడి.

చిత్తరంజనుడు.

---



నీచపు దాస్యవృత్తి మననేరని శూరత
మాతృదేశ సేవాచరణమ్మునం
దసువు లర్పణ సేసినవారి పార్థివశ్రీ
చెలువారు చోట, ............
............... రాలి పోవగ వలెం
దదుదాత్త సమాధి మృత్తికన్.

—వేదుల.

# తెలుగునాట హిందీభాషా ప్రాభవం

శ్రీ మోటూరి సత్యనారాయణ,
దక్షిణ భారత హిందీ ప్రచార సభ ప్రధానమంత్రి.

విషయ సంగ్రహము :—హిందీ తెలుగు భాషల పురాతన సంబంధము-నైజాం పరిపాలనలోను, విశేషయాత్రికుల కారణముగాను తెలుగులో అరబ్బీ, పార్సీ, ఉర్దూ, మరాఠీ మొ॥లగు భాషా శబ్దముల కలయిక—ఇట్టి పదములు 5000 లకుపైగా—వీటికుదాహరణముగ ఆపదములుతో కలిసిన వచనము—హిందూస్థానీ ద్వారా, పార్సీ మట్టులను పేరుతో వచ్చిన సంగీతము, భజనలు—తెలుగునాట హిందూస్థానీ నాటక కంపెనీలు—రామదాసు, ప్రతాపరుద్రీయచరిత్రలలోని హిందూస్థానీ పదములు—ఏకైక జాతీయ భాషకై హిందీభాషా ప్రచారం—హిందీ భాషాభివృద్ధి—హిందీ తెలుగు అనువాదములు—తెలుగువారి హిందీ రచనలు—దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి కృషి—ఆంధ్రులైన సుప్రసిద్ధ హిందీ కవులు : మోహనలాల్, పద్మాకరుడు, వల్లభాచార్యులు, కృష్ణరావు మొదలగువారు,

హిందూస్థానీకి తెలుగుగల సంబంధం చాల పురాతనమైనది. వందలకొలది సంవత్సరములనుంచి కాశీ, ప్రయాగ మొదలైన యాత్రా స్థలాలకు వెళ్ళి వచ్చేవారి ద్వారాను, నిరంతరం దేశాటనంచేసే బైరాగుల మూలంగాను, తరతరాలనుంచి యుద్ధాలకోసం ఒక ప్రాంతమునుంచి మరొకప్రాంతమునకు తిరిగిన సైనికుల మూలంగాను హిందీ లేక హిందూస్థానీ శబ్దాలు తెలుగులోకి వచ్చినవి. నిజాం రాజ్యంతో తెలుగుదేశానికిఉన్న పురాతన సంబంధమువల్ల హిందూస్థానీలో వాడబడే పార్సీ, అరబ్బీమాటలుకూడా తెలుగుభాషకు అతుక్కొని పోయినాయి. ‘గల్లా’ అనే శబ్దము అరబ్బీమాటంటే ఎవరూ నమ్మరు. రోజూ మనం వాడుకునే ‘రైతు’ ‘రోజు’ పార్సీ శబ్దాలంటే చాల విచిత్రంగా వుంటుంది. మన పొరుగుననున్న నిజాం రాజ్యంలో ‘ఉర్దూ’ యే (అంటే పార్సీ లిపిలో వ్రాయబడిన హిందూస్థానీ) రాజభాష కావడంవల్లను, ఆంధ్రదేశం నిజాం ప్రభువుల పాలనలో ఎంతోకాలం వున్నందువల్లను మన కచ్చేరీలలోనూ అంగళ్ళలోనూ వందలకొలది శబ్దాలు తమ స్వరూపాన్ని, జాతినీకూడా విడిచిపెట్టి తెలుగు భాషశబ్దాల్లో కలిసిపోయినాయి. ఉత్తరదేశమునుండి ఆంధ్రదేశమునకు వలసవచ్చిన అనేక మహమ్మదీయ కుటుంబాలు, హిందువులలో బుందేలీ, రాజపుత్ర కుటుంబాలుకూడా హిందూస్థానీ భాషా సంపర్కాన్ని పెంచి పోషించినవని చెప్పవచ్చు. మహారాష్ట్రుల సంపర్కంకూడా మనకుకొంత హిందూస్థానీ శబ్దాలను తీసుకొని వచ్చినది. మధ్య పరగణాలకు సంయుక్త పరగణాలకు ఉత్తర సర్కారులనుంచి వెళ్ళుతూ వస్తూవున్న తెలుగు కుటుంబాలుకూడా ఈ హిందూస్థానీ సంపర్కాన్ని పోషించినాయి.

తెలుగుభాషలో 5,000 కు పైగా హిందూస్థానీలో చెల్లిపోయే మాటలున్నవని అంచనావేయబడినది. ఈ మాటలు తెలుగులో వాడితే ఇవి పరభాషా శబ్దాలని తెలియడమే కష్టం. ఇది రుజువుచేయడానికి ఈ క్రింద వ్రాసినది నమూనాగా తీసుకోవచ్చును.

“ ‘రైతు’ కు భూమియే ఆధారం ‘రైతే’ భూమికి ‘కామందు’ ఏ ‘ఆసామీ’ యైనా ‘జమీందారీ’ లో వున్నా ‘సర్కారీ’ లోవున్నా, అతడు ‘జరీబు’ దున్నినా ‘తరీ’ సాగుచేసినా ‘ఇజారా’ పాడుకున్నా ‘మక్తా’ కు ఒప్పుకున్నా అతడికి ‘రోజూ’ ‘మున్సబు’ తోటీ, ‘తహసీలుదారు’ తోటీ, ‘అమల్దారు’ తోటీ, ఎంతో పని వుంటుంది. ‘కవుళ్ళు’ ‘కత్తులు’ లేకుండా పని జరుగదు. ‘కైఫియతు’ లు ఇచ్చితీరాలి. ‘దర్ఖాస్తులు’ ‘అర్జీలు’ తప్పవు. ‘ఆసామి’ ‘మోతుబరి’ అయి ‘ఖుద్దు’న ‘హోజ’ రైతే ‘బనా’ యించిన ఎన్ని ‘దావా’ లైనా, అతను ‘నిశానుదారు’ డైనప్పటికీ, ‘ఇశారా’ మీద ‘బర్తరఫు’ కావచ్చు. ‘మున్సబు’ వాయిదాలు ఎన్నివేసినా ‘ఆఖర’ కు ‘ఆసామి’ మీద ‘హంగామా’ ఏమీలేకుండా విడిచిపెట్టవచ్చు. ‘హాల్కా’ ‘ఆసామి’ కి అన్నీ తంటాలే. అతడు ఎంత ‘హుషారు’గా వున్నా అన్నిటికీ ‘పర్వా’ చెయ్యాలి. ‘పరాకు’ గా వుంటే ‘తకరారు’. ‘నిఖార్సు’ ‘రైతు’ ఐనా ‘ఖరారు’ గా మాట్లాడలేడు. ప్రతిదానికి ‘ఆదుర్దా’ పడాలి. ‘ఆదర

బాదర ' చెయ్యకపోతే అంతా ' ఆఫత్తే '. ' ఆసామి ' కి ' హమేషా ' ఏదో ' హడావిడే. ' ' అలగా ' జనాన్ని గురించి చెప్పనే అక్కరలేదు. ' అలగా " మనిషినిచూస్తే ' అడేజావ్ బడేజావ్ ' అని ' జగడం ' చేస్తారు. ' అమీనా ' సామానంతా ' జబర్దస్తీ ' గా ' జప్తు ' చేయిస్తాడు. ' జామీ ' నిస్తానన్నా ' దబా ' యించి ' జులుం ' చేస్తాడు. ' జాస్తి దబా ' యిస్తే ' ఝాడించి ' ' ఝూటాఖోరని ', ' దగల్ బాజి ' అని తిడ్తాడు. అతడు పడే ' జంజాటం ' చెప్పనక్కరలేదు. అతని ' అవాల్తీ ' లు చెల్లవు. అతనికి అన్నీ ' తంటా ' లు, ' తకరార్లే '. హక్కుకోసం పోట్లాడితే అన్నీ ' ధక్కామెక్కీలే '. అతడేమాట మాట్లాడినా 'దఫావతే '. ' అమానతు ' గాకూడ ' పైసా ' పుట్టదు. ' తఫరీకు ' కూడ ఇచ్చుకోలేని ' బిక్కాపకీరు '. అతనికి ఎవడూ ' తరఫుదారీ ' చేయడు; ' కుమ్మక్కు ' రాడు. పేద ' రైతు ' మీద ' హుకుము ' చలాయించడానికి అంతా ' కామందు ' లే; ప్రతివాడు ' ఫత్వా ' ఇచ్చేవాడే. అతడే ' అమీరు ' ఐతే, అతడికి ' మహళ్ళు ' ' హవేళీ ' లు వుంటే అందరు ' సలాములు ' చేసేవారే. అందరూ అతని 'తాలూకా ' ' ఇలాకా 'లవారే. ' ఈనాము 'ల కోసం అతని ' కిల్లా ' చుట్టూ ' గస్తీ ' తిరిగేవారే. ఆయన ' కోఠీ ' మీద ' జండా 'కు వంగి వంగి ' సలాము ' లు చేయడానికీ, ఆయనమీద ' గూడుపుఠానీ ' చేసేవాడికి శాస్తి చెప్పడానికీ 'తయ్యారు' అయ్యేవాళ్ళే. 'కామ్' కావాలని ' ఖుషామదు ' చేసేవాళ్ళే. ' సర్కారీ గుమాస్తా ' లు అతడికి ' తాబేదార్లు '. ' ఘంట ఘంట ' కు వచ్చి ' జోహుకుము ' అంటారు. ' కళ్ళం ' లోని ' గల్లా ' నుంచి ' కాటా ' వేసిన ' బస్తా ' ఒకటి తోలితేచాలు; అతడు ' నఫా నుకసాను ' లను తెలియని వాడైనా ' ఫకీరు ' దగ్గరనుంచి ' పాదుషా ' వరకు మాట చెలామణిఅయి తీరుతుంది.

ఇదంతా ' ఎతబారీ ' మీద నడిచే ' హంగామా '. అతను ఎంతమందికి 'బాకీదారు'డో ఎన్ని 'తనఖా' ' దస్తావేజు 'లు వ్రాశాడో, ' చిఠాలు ', ' అవర్జాలు ', ' ఖాతా ' ల్లో 'లెక్కలు' ఎట్లా వున్నాయో, అతని 'కిస్తీ' 'ఇరసాలు' అయిందోలేదో, అతను ' పాయతుదారో ', ' ఖర్చుదారో ', ఎవడికికావాలి. మామూలుగా పై ' బడాయి ' ని బట్టి, ' డాబు ' ను బట్టి కథ నడుస్తూ వుంటుంది. అతను 'ఈమాన్దారా', 'గోల్మాలు' చేసేవాడా అనే గొడవ ఎవడికీ వుండదు.

' ఎతబారీ 'గా పోయే ' ఆసామి ' మీద అందరికీ ' భరోసా 'యే. అతడు ఎక్కడికి వెళ్ళినా ' చలా'యించుకోగలడు. అతను ' బజారు 'లో బయలుదేరితే ' ఆజూబాజూ ' అనేకమంది ' నౌకర్లు '. ' మిఠాయి ' దుకాణానికి వెళ్ళితే ఏ ' మిఠాయి ' అయినా ' లడ్డూ, హల్వా, జిలేబీ, పకోడీ, బూందీ, కోవా, రోటీ, పూరీ, చపాతీ, పరోటా ' ఏదైనా ' ఇశారాచేస్తే ' చాలు ' దుకానుదారు ' డు ఇంటికి పంపేస్తాడు. ' దర్జీ ' దుకాణానికి కబురు ' పంపిస్తే ' చాలు. ' కమీజు, కుర్తినీ, పాయిజామా, లంగా, జుబ్బా ' వస్త్రాలు ఏ 'దుస్తు' ఐనా ' చమకీలు ' వేయమన్నా వేసి తయారుచేసి పంపిస్తాడు. ' కంసాలీ కార్ఖానా ' లో ఏ నగైనా ' మూజువాణీ ' ఆర్డరు ఇచ్చినా చాలు. 'పాంజేబు, బేడీ, బాజూబందు, కమరుబందు, పట్కా, జూకా, సత్తు, బుళాకీ, కంఠి; జిగినీ'లు, కిమ్మతు ఎంతైనా సరే ' పరవా ' లేకుండా పంపిస్తాడు. 'కిరానా' 'పచారీ' కొట్లలో 'కిస్మిస్, ఖర్జూరం, ఆలుబుఖారా, గుల్ కంద్', దాల్చీనచెక్క, ఏ 'మసాలా' సామానులైనా 'కిఫాయత్తు'గా వచ్చి పడతయి. ఇదంతా ' దర్గా ' మీద జరిగే సమాచారం."

హిందీ సాహిత్యం తెలుగువలెనే చాల ఆధునికమైన సాహిత్యం. ప్రాచీనతమ సాహిత్యంలో హిందూస్తానీ సంగీతం ద్వారావచ్చిన భజనలు, తుమ్రీలు తప్పితే ఎక్కువ తెలుగులోనికి రాలేదనే చెప్పవచ్చు. కాని హిందూస్తానీ పాటలు ఫార్సీమట్టులనేపేరుతో ఎన్నో ఆంధ్రదేశంలో ప్రచారములోనికి వచ్చినాయి. ధారవాడ్ కంపెనీ అనే పేరుతోనూ, ఫార్సీ కంపెనీ అనే నామంతోనూ 40, 50 సంవత్సరములక్రిందట ఎన్నో కంపెనీలు తెలుగుదేశంలో నాటకాలువేస్తూ ఉండేవారు. వీరి ప్రదర్శనాలవల్ల తెలుగుదేశపు పాటలు, సాహిత్యం బహుభాగం హిందూస్తానీ పలుకుబడికి లోబడిపోయిందని ఒప్పుకోవాలి. రామదాసులో పాడబడే గవాయిపాటలు, ప్రతాపరుద్రీయం మొదలైనటువంటి నాటకాల్లో ఉండే హిందుస్తానీ సంభాషణలు ఆంధ్రదేశంలోని జనసముదాయం విని, ఎంతో హర్షిస్తునే వుంటుంది.

గత 25 సంవత్సరములనుంచి భారత భూమినందంతటికి జాతీయభాషఒకటి కావలెనను ఉద్దేశంతో హిందీ భాషా ప్రచారం జరుగుతూవుంది. వాడుకకు కావలిసినభాషయే కాక, హిందీ పరీక్షలుద్వారా మంచి హిందీ సారస్వతం కూడా తెలుగు దేశంలో వ్యాపకానికి వస్తూంది. వందల కొలది యువకులు హిందీలో మంచి పాండిత్యం సంపాదించి తెలుగుభాషకుకూడా సేవచేస్తున్నారు. గత 20 సంవత్సరాలనుండి హిందీభాషలో కథాసమ్రాట్‌ని చెప్పదగిన ప్రేమ్‌చందుని కథలు, నవలలు ఎన్నో తెలుగులోనికి అనువదింపబడినవి. ప్రతిరోజూ హిందీలోవచ్చే రాజకీయ, ఆర్థిక, ధార్మిక విషయాలనుగురించిన వ్యాసాలు విశ్వవాణి, విశాలభారత్, సరస్వతి మొదలగు పత్రికలనుండి తెలుగు పత్రికలలో తర్జుమా అవుతున్నాయి. హిందీలోని ప్రసిద్ధ ధార్మిక గ్రంథం తులసీ రామాయణంకూడా తెలుగులోనికి తర్జుమా అయింది.

హిందీలోనుండి తెలుగులోనికి అనువాదం చేయడమే కాకుండా ఎంతోమంది తెలుగు యువకులు హిందీభాషలో కూడా తెలుగు సారస్వతాన్ని అనువదిస్తున్నారు. హిందీ మాధ్యమంతో ఆంధ్రప్రశస్తిని ఔత్తరాహులకు తెలియపరచడం వీరి ఉద్దేశం. తెలుగులోని ఉత్తమ సారస్వతాన్ని క్రమక్రమంగా హిందీలోనికి అనువదించి ప్రచురించడం కోసం దక్షిణభారత హిందీప్రచారసభ వారు ఒక ప్రణాళికను తయారుచేసినట్లు తెలుస్తున్నది. వీరి కృషివల్ల ఎన్నో తెలుగు గ్రంథాలు హిందీలోనికి రావచ్చు.

ఉత్తర హిందూదేశం వలసి పోయి అక్కడనే స్థావరమేర్పరచుకొని హిందీభాషను సేవించిన మహామహులెంతోమందున్నారు. అందులో, ప్రసిద్ధకవియగు మోహన్‌లాల్ భట్, పద్మాకరుడు, గదాధర్‌భట్, గోరీలాల్ మొదలైన వారిపేర్లు చెప్పతగినవి. సి. వై. చింతామణిగారి కొడుకు కృష్ణరావు (ఐ.సి.ఎస్.) హిందీలో ఎన్నదగిన కవి. ఆంధ్రోత్తములైన వల్లభాచార్యులువారి సంప్రదాయానికి కుటుంబానికి సంబంధించిన వేలకొలదిమంది హిందీకి అపారమైన సేవచేశారు.

---

కరుణానిధి యౌ
పరమేశుడుంటే
క్రౌర్యము జగతిని
ఏలగ నేలా ?
శాంతముఘూళిని
దొర్లగనేలా ?

నార్ల వెంకటేశ్వరరావు.



# 23వ అధ్యాయము

# గ్రంథాలయములు

## 1



సప్తసంతానములలోఁ బ్రశస్తి గాంచి
ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియకాన
కృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య.

—శ్రీ కృష్ణదేవరాయలు.

విషయ సంగ్రహము :-ఉద్యమములన్నింటికీ జీవదాయకమైనది గ్రంథాలయోద్యమము—పూర్వపు మన గ్రంథాలయములు—1886 సం॥ లో విశాఖపట్నమున మొదటి సార్వజనీన గ్రంథాలయ స్థాపన—మన గ్రంథాలయోద్యమము—అయ్యంకి వెంకటరమణయ్య, సూరి నరశింహశాస్త్రి, గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగార్లు మొదలైన ఉద్యమనాయకులు—గ్రంథాలయములు—గోడలపై వార్తలు వ్రాయుట—ఆంధ్ర గ్రంథాలయసంఘము 1924 లో రిజిష్టరుచేయబడుట—గ్రంథాలయోద్యమమున ఆంధ్రుల అఖిలభారత నాయకత్వము—వయోజన విద్య—గ్రంథాలయ యాత్రలు, ప్రచారము—గ్రంథాలయములు ఆంధ్రుల అభివృద్ధికి చేసిన సేవ—అముద్రిత గ్రంథములు—పట్టికలు—ఇతర వివరణములు.

పరిచయము

ఉద్యమములన్నింటికీ జీవదాయకమైనది, జ్ఞానదాయకమైనది గ్రంథాలయోద్యమము. గ్రంథాలయములు మహాపురుషులబోధలను చిరస్థాయిగా చేయు సాధనములు. గ్రంథాలయములను భారతీయ భాండాగారములని ప్రాచీనాచార్యులు వ్యవహరించుచుండిరి. ఉత్కృష్టములైన వైజ్ఞానికప్రాంతములని ప్రసిద్ధిచెందిన ప్రాచీన దేశములన్నింటిలోను గ్రంథాలయములు విలసిల్లెను. టైగ్రెసు నదీతీరమువలె గంగాతీరము జ్ఞానకూలంకషము. నైలునదీ నాగరికతవలె గంగానదీ నాగరికత ఆకులుదొడిగి పూలుపూసినది. గ్రంథసంపత్తి గలిగి విజ్ఞానతేజస్సు, సంస్కృతిచంద్రికలు వెదజల్లినది. అమరావతి, తక్షశిల, నాలంద, కాశీలలోని గ్రంథాలయములకు చీనా జపాను దేశములనుండి జ్ఞానార్థులు వేలకువేలు వచ్చెడివారు. మొగలాయి పాదుషాల కాలములో ప్రాచీన పార్సీ, అరబ్బీ గ్రంథములు వేలకువేలు వారిచే సంతరించబడెను. అక్బరుచక్రవర్తి తన గ్రంథాలయములో 25000 (ఖిల్మీ) వ్రాతపుస్తకములను, లక్షలాది ధనము వ్యయముచేసి సేకరించెను. ఢిల్లీ పాదుషాలు నిర్మించిన గ్రంథనిలయములు ఢిల్లీ సామ్రాజ్య విచ్ఛిత్తితో ఔధ్ నవాబుల పరమయ్యెను. 1857 నాటిమహా విప్లవమున వీటిలో



కొన్ని గ్రంథములు నశించినవి. కాలరాక్షసి కాహుతైనవి పోగా, నాదర్షా-ఫిరోజ్‌ల దండయాత్రలలో కొన్ని నశించిపోయెను. శేషించినవి తర్వాత ఇంగ్లండు జర్మనీదేశములకు కొనిపోబడెను. మొత్తముమీద ఒకనాడు అత్యున్నతస్థితిలో నున్న భారతదేశము పారతంత్ర్యమునకు బలియగుటచే దాని పవిత్రసంస్థలన్నియు క్షీణించి పోయినవి.

ఆంధ్రదేశమున ఆంధ్రవాఙ్మయాభివృద్ధి నొందినప్పటినుండియు గ్రంథాలయములు పోషింపబడుచుండెను. ఆర్యావర్తములో బౌద్ధయుగమునాటి గొప్ప సంఘారామములలో, మన ఆంధ్రదేశములో పేరెన్నికగన్నది శ్రీపర్వత సంఘారామము. ఈ సంఘారామము నందు నాగార్జునాచార్యులను సుప్రసిద్ధపండితుడు బౌద్ధమతమునకు సంబంధించిన గ్రంథములు చేకూర్చెనని యు, ఈ పర్వతసంఘారామము గొప్ప పుస్తకభాండాగారముతో విలసిల్లిన విద్యాపీఠమనియు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'అమరావతీ స్థూపములు' అను తమ గ్రంథమున వ్రాసిరి.

**ఆంధ్రదేశమున గ్రంథాలయములు**

ప్రాచీన జైనులు ఆంధ్ర చోళరాజ్యములలో అనేక జైనబస్తీలను, మఠములను స్థాపించి, అందు అనేక గ్రంథనిలయములు నెలకొల్పిరి. శ్రీకృష్ణదేవరాయలు కాలమున పలుప్రాంతములలో గ్రంథాలయము లున్నట్లు, పెద్దన "భరమై తోచు కుటుంబరక్షణకుగా..." అన్న పద్యభాగములో 'తాళీదళ సంపుటప్రకర కాంతారంబు' లనుటవల్ల, తెలియుచున్నది. క్రీ. శ. 16 వ శ॥న ఆంధ్రనాయకుల ఏలుబడిలో ఆంధ్రలిపితో వ్రాయబడిన సంస్కృతాంధ్రగ్రంథములు తంజావూరున సేకరింపబడెను. తెనాలిరామకృష్ణుని కాలమున అనేక బ్రాహ్మణగృహములలో గ్రంథాలయము లుండినట్లు, పాండురంగ మహాత్మ్యములో నిగమశర్మ "పుస్తకభాండాగారంబు నిజభర్తృ హస్తాంతరంబున...." అని చెప్పిన గ్రంథాలయ వర్ణనవల్ల, నూహింపనగును. పూర్వము మతకర్తలు గ్రంథాలయము లకు ప్రాపు.

కాని సుమారు 1750 నుండి 1780 వరకును శ్రీరామపురం (సెరంపూర్) మిషనరీలు, తమ మత వ్యాపకత్వము కొరకు ప్రకటించిన పుస్తక



శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య.
ఆంధ్ర గ్రంథాలయోద్యమ నాయకులు.
అంధ్రదేశ దివ్యజ్ఞానోద్యమ నాయకులు.
బెజవాడ.

ములు కొన్ని ఇప్పటి బ్రిటిషు మ్యూజియములో నున్నవి. వ్రాతప్రతియే ఆధారముగా పెట్టుకొని పుస్తకమంతా బ్లాకు చేయించి అచ్చువేయించిరి. దీనినిబట్టి మనకు ముద్రణాగ్రంథములు 18 వ శతాబ్దినుండి యున్నవనవచ్చును. నవీన యుగమున తెలుగుభాషకు అచ్చుఅక్షరములు 1806 వ సంవత్సరమున తయారుచేయబడినవి.

**నేటి మన గ్రంథాలయములు వాటి స్థాపన**

దీనితో ఆంధ్రగ్రంథములు అచ్చు పడుటకు ప్రారంభమైనవి. చరిత్ర పరిశోధనలవలన, ఆంధ్రదేశమున ఈయుగమున నెలకొల్పబడిన మొదటి గ్రంథాలయము, 1886 వ సంవత్సరమున విశాఖపట్నమున స్థాపితమైన 'సరస్వతీనిలయ' మను సార్వజనీన గ్రంథాలయము. దీని స్థాపకుడు ఒక వృద్ధ ఉపాధ్యాయుడు. ఈతనికి మన గ్రంథాలయ చరిత్రలో సుస్థిరమైన స్వర్ణాసనమున్నది. పిమ్మట కడపజిల్లా పులివెందులలో సరస్వతీ గ్రంథాలయము బయలుదేరినది. 1890 వ సంవత్సరమున గుంటూరు జిల్లా ఒంగోలులో సి. వి. ఎన్. గ్రంథాలయము ఏర్పడెను. 18 వ శతాబ్దమున ఆరంభించిన ఈ ఉద్యమము విశాఖపట్నము, కడప, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలకు ప్రాకిపోయెను. 1900 సంవత్సరమున గుంటూరునందు సాహితీసంఘము, రాజమహేంద్రవరమున వీరేశలింగ పుస్తక భాండాగారము ఉదయించినవి. నైజాము రాష్ట్రమున 'కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము' స్థాపించబడినది. అదేసమయమున రాష్ట్రాందోళన, దేశీయ వందేమాతరోద్యమముల ఫలితముగా నూతనతేజము రాష్ట్రమున వికసింపసాగినది. దీనితో గ్రంథాలయములు పఠనమందిరములు వెల్లివిరిసినవి.

గ్రంథాలయ యాత్రలు, ఉత్సవములు, ఉపన్యాసములు, ప్రచారకప్రదర్శనములు, భజనలు, వయోజనవిద్యావ్యాపకముద్వారా ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము "గాంధీయుగము"న ప్రతి యువకుని ఆకర్షించెను.

**మన గ్రంథాలయములు జాతీయోద్యమములకు చేయూత**

జాతీయత రేకెత్తించి, జ్ఞాన కాంక్ష రగిల్చి, నిరుత్సాహులకు ప్రోత్సాహమిచ్చి, ఈ ఉద్యమనాయకులు దీనిని దేశములో ప్రముఖభూమిక ధరించునట్లు చేసిరి. ఆంధ్రులు నిర్వహించిన ఉద్యమములలో జీవించి వికసించి, దేశమునకంతకును మార్గదర్శకమైనది గ్రంథాలయోద్యమమే ! దీని కీర్తివంతమయిన పరిణామమునకు కారణభూతులైన అయ్యంకి వెంకటరమణయ్యగారు ప్రశంసార్హులు. వీరి కృషికి సూరి నరసింహశాస్త్రి, దివాన్ బహదూర్ సర్ మోచర్ల రామచంద్రరావు, దేశోద్ధారక, ఆంధ్రరత్న మొ॥ నాయకశిఖామణుల, జయపురం, పానగల్లు, పోలవరం మొ॥ జమీందార్ల కృషి దోహదమయ్యెను. వీరేకాదు దేశములో ప్రముఖులు దీనిని దశదిశలా ప్రచారము చేసిరి. ఇప్పటికీ మారేపల్లి రామచంద్రశాస్త్రి, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి, శరణు రామస్వామి చౌదరి, తేతలి సత్యనారాయణగార్ల వంటి త్యాగుల జీవితములు ఈ ఉద్యమమున కంకితము చేయబడినవి. పూర్వపు దేవాలయములు, గ్రామసంఘములవలె ఇప్పుడు గ్రామములు ధర్మగ్రంథాలయములు ఈ రెండు ప్రాచీన ప్రతిష్ఠాపనలయొక్క స్థానము లాక్రమించినవి. మన గ్రంథాలయముల నాధారము చేసుకొని సంఘసేవ, మానవసేవ చేయుట ఆచారమైనది.

స్వార్థమునశింపచేసి, పరో పకారబుద్ధి నభివృద్ధిచేసి, జాతీయత కివి మన సమీా పమున గీటు రాళ్లవలె నున్నవి. ఉద్రేకపూరితు లైన దేశసేవా దురంధరు లకు, కాంగ్రెస్‌వారికి సా ధారణముగా అవి ఉప న్యాసవేదికలు. నూత్న సృష్టికి అవి బీజముల నా టును. సంఘమునకు గ్రం థాలయము కేంద్రముగా నున్నది. ఇప్పుడు మన గ్రంథాలయములు పత్రి కాపఠనమునకు, రాజ కీయ చర్చలకు సమిష్టిగా నిలయములైనవి. జాతీయ జీవితమును ప్రతిబింబించు చున్నవి. అసలు అవి గ్రామములకు విద్యాపీఠ ములు !



గ్రంథాలయము దేవాలయములో స్థాపించవచ్చుననుటకు ఇదియొక నిదర్శనము.

వీరేశలింగముగారి పు స్తక భాండాగారము స్త్రీ విద్యకై వారు చేసిన కృషి ఈనాటి నవీన యుగ మునకు పునాది వేసినవి. వీరి సంస్కరణాభి లాష దేశములో నూతన వికాసము కల్గించెను. వీరి రచనలు ఇంటింటవెలసి,చదు వరులను తయారు చేసెను. ఆ జ్ఞానతృష్ణ గ్రంథాలయ ములకు మరింత బల మిచ్చెను. స్త్రీలు వీరి రచ నలు ఎక్కువగా చదివిరి. పంతులుగారి సిద్ధహస్త ము స్త్రీలను సంఘసేవకురాండ్రుగా మార్చినది. దీనితో స్త్రీ ఉద్యమము విజృంభించెను. చిలక మర్తివారు ప్రజాసాహిత్యము సృష్టించిరి. ఈ మార్పు గ్రంథాలయములకు స్త్రీలకు సంబంధము

గ్రంథాలయములు, స్త్రీలు, నారీఉద్యమములు



హైదరాబాదు (దక్కను) లోని రెడ్డి గ్రంథాలయము.

కలిగించెను. కొన్ని గ్రంథాలయములు ప్రత్యేకముగా స్త్రీల ఉపయోగమునకై స్త్రీలచే స్థాపించబడినవి. కొన్నింట స్త్రీపురుషులు సామాజికులు. ప్రజాసారస్వతము, స్త్రీసారస్వతము ఏకముఖమున అభివృద్ధి చెందసాగినవి. స్త్రీలలో శ్రీమతి విద్వాన్ బత్తుల కామాక్షమ్మ, అట్లూరి వెంకటసీతమ్మ, కాంచనపల్లి కనకమ్మ, రావూరి వెంకటసుబ్బమ్మగార్లవంటి, పండితురాండ్రును, కవయిత్రులును, కళాధ్యాపకురాండ్రును మొదలయిన మేధాసంపన్నలు వెలసిరి. నిరక్షరాస్యులగుటచే చదువుకొనజాలనట్టి జనుల ఉపయోగమునకై పురాణపఠనము, జంగముకథలు, భాగవతములు మొదలగు పూర్వసంప్రదాయసిద్ధములయిన మార్గముల ననుసరించి, కొందరు స్త్రీలు జ్ఞానవ్యాప్తిని చేయుచున్నారు.

**గ్రంథాలయములు - గోడలపై వార్తలు వ్రాయుట - వయోజనవిద్య - సంచార గ్రంథాలయ పేటికలు**

గ్రామపారిశుద్ధ్య ప్రయత్నములు, బహుమతి పరీక్షలు, గ్రంథముల ప్రచురణాది ప్రయత్నములు జరిపిరి. ముఖ్యమైన వయోజన విద్యావ్యాపకమునకై కొన్ని గ్రంథాలయములను రాత్రి పాఠశాలను నడిపిరి. నెల్లూరులో గోడలపై రంగురంగుల సున్నముతో వార్తలు క్లుప్తముగా వ్రాసి, కూడలిలో ప్రజలు చదువుకొనునట్లు చేయుచున్నారు. ఈ పద్ధతి చాలా బాగుగా పనిచేయుచున్నది. చాలామంది వార్తలు తెలుసుకొనుట కుపకరణము. ఈ జ్ఞానవ్యాపక కార్యక్రమభాగముగా, ఆంధ్రదేశమున కొన్ని గ్రంథాలయముల యొక్క ఆదరణక్రింద 'సంచార గ్రంథాలయ పేటికలు', గ్రంథాలయములు లేని చుట్టుప్రక్కల ప్రాంతములకు పంపబడుచున్నవి. ప్రత్యేకముగా గ్రంథాలయముల నిర్వహింపలేనట్టి, నిర్వహింప వాంఛలేనట్టి గ్రామములకు సంచారగ్రంథాలయ పేటికలు మిక్కిలి ఉపయోగకరములు. కుప్పంలో భారతీసంచార గ్రంథాలయము, పెడసనగల్లులో శ్రీరామప్రసాదు గ్రంథాలయము గడప గడపకు పుస్తకముల గొనిపోయి గ్రంథప్రచారము బహుళముగా చేయుచున్నవి. ప్రతి ఆంధ్ర దేశ గ్రంథాలయమునకు, ఆప్రాంతమునకే గాక చుట్టుప్రక్కల గ్రామములతో సంబంధముండుట సర్వసాధారణము. పెదపాలెం సేవాశ్రమమువారు పడవలలో ప్రయాణీకుల సౌకర్యార్థము పుస్తకనిలయ మేర్పరిచినారు. ప్రభుత్వసహాయమున్న బరోడా గ్రంథాలయములతర్వాత, స్వయంపోషకమైన ఆంధ్రదేశ గ్రంథాలయములే ఈ దేశమున ప్రధానస్థానము వహించును.

**గ్రంథాలయములలో గ్రంథవర్గీకరణము**

గ్రంథాలయములకు భవనములవలెనే గ్రంథవర్గీకరణమునూ ప్రధానమైన అంగము. ఇంగ్లాండు అమెరికా దేశములందు, ప్రత్యేకించి పుస్తకములను విభజించుటకు ముఖ్యముగా రెండువిధముల విభాగపుపద్ధతి వాడుకయందున్నది. అవి సర్వజనామోదమును పొందినవి. మొదటిది డాక్టర్ డలాయీ అనునాతని డెసిమల్ లేక దశాంశపద్ధతి; రెండవది కట్టర్ అనునాతని విస్తరణశీలపద్ధతి. ఇవి

గాక బ్రౌన్, మెరీల్ పద్ధతులు గలవు. అమెరికాదేశపు గ్రంథభాండాధికారి బోర్డను అనునాయన పై రెండుపద్ధతులను మిళితముచేసి ఒక నవీనపద్ధతి నేర్పరచెను. దానిని బరోడా గ్రంథాయమువారు అమలులోపెట్టిరి. ఈ పద్ధతి నాంధ్ర గ్రంథముల కనువైన మార్పులతో బెజవాడ రామమోహన గ్రంథాలయమున 17 సంవత్సరములకు పూర్వమే అమలులో పెట్టిరి. మిక్కిలి ప్రయోజనదాయకముగా అనుభవములో నున్న ఈ పద్ధతిని ఆంధ్రదేశ గ్రంథాలయము లనుసరించుచున్నవి.

తాలూకా గ్రంథాలయములును, మాండలిక కేంద్రగ్రంథాలయములును పల్లెటూళ్ల,గ్రామగ్రంథాలయములపని సమీకరణము చేయుచున్నవి.

**ఆంధ్ర గ్రంథాలయ సంఘమువారి కృషిఫలితములు- భారతదేశనాయకత్వము**

ఈ ఉద్యమమునకు ప్రాతిపదిక 1914 వ సంవత్సరమున. బెజవాడయందున్న రామమోహన ధర్మగ్రంథాలయమువారు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి అధ్యక్షతక్రింద ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధులమహాసభ జరిపి, ఆంధ్రదేశగ్రంథాలయసంఘ మనుపేర నొక శాశ్వతసంఘమును స్థాపించిరి. 1860 వ సం॥ 12 నెం. ఆక్టుక్రింద ఈ సంస్థ 1924 వ సంవత్సరమున రిజిష్టరు చేయబడినది. ఈ సంఘమువారు గ్రంథాలయ ప్రచారకులను తయారుచేయుటకు, పల్లెటూరి సమస్యలలోను గ్రంథాలయ పాలనలలోను తరిఫీదు నిచ్చుటకు విద్యాలయమును 1926



గుంటూరు జిల్లాలో బ్యాంకు కాలువమీద పడవలోని సంచార గ్రంథాలయము.



హిందూయువజనసంఘ గ్రంథాలయము, ఏలూరు. భవనదాత శ్రీ మోతే గంగరాజు జమీందారు.

లోనడిపిరి. ఈ సంఘపక్షమున గ్రంథాలయ సర్వస్వమను పత్రికను, ప్రచురణలను వెలువరించుచున్నారు. వీరు, 1914వ సంవత్సరమునకు పూర్వపు పరిపాలనా విధులలోకి గ్రంథాలయము రాదను ప్రభుత్వవైఖరిని, ఆందోళన జేసి మార్చివేసిరి. తెలుగుదేశమున అనేక పురపాలక సంస్థలు, పంచాయతీబోర్డులు, గ్రంథాలయములను నడుపుచున్నవి. 1914 వ సంవత్సరమున 163 గ్రంథాలయములున్న ఆంధ్రదేశమున ఇప్పుడు 1000 కి పైబడి గ్రంథభాండాగారము లున్నవి. ఆంధ్రదేశగ్రంథాలయ సంఘముయొక్క ప్రోత్సాహమున ప్రథమ అఖిలభారత గ్రంథాలయసభ కూర్చబడినది. దానికికూడా ఆం. దే. గ్రం. సం. కార్యదర్శి అయ్యంకి వెంకటరమణయ్యగారి కార్యదర్శిత్వమే! మన సంస్థ నాయకత్వము, ప్రోత్సాహముక్రింద అఖిలభారత గ్రంథాలయ సమావేశములు బెల్గాం, కలకత్తాలలో జరిగెను. మహారాష్ట్రము, పంజాబు, వంగరాష్ట్రముల వేళ్ళు పాతుకపోయిన గ్రంథాలయములకు విత్తనములు నాటినది మన తెలుగువారు. రాష్ట్రీయోద్యమముల సమీకరణము చేసి దేశీయోద్యము నడుపు వజ్రసంకల్పముతో అఖిలభారత గ్రంథాలయ పత్రికాప్రచురణ ప్రారంభించి ఈ ఉద్యమమునకు ఆంధ్రులు అభిగాములైరి! అలయిక లేని ఆంధ్రదేశసేవకుల కృషి మన ఉద్యమ ప్రాశస్త్యమునకు దారితీసి, అమెరికా లైబ్రరీ జర్నల్, హిందూ మొదలయిన పత్రికల అభినందనములకు ప్రశంసలకు పాత్రమైనది. ఇటీవల ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమునకు స్వంతభవన మేర్పరచవలెనను భావముదయించగనే పటమటలంక వాస్తవ్యులు కొమ్మా సీతారామయ్యగారు వేయిరూప్యములు విరాళమిచ్చిరి. ఆ ధనముతో పటమటలంకలో 1 యకరము భూమి కొనబడినది. అందు భవనము నిర్మించుటకై ప్రయత్నముచేయబడుచున్నదని తెలుసుకొని సంతోషించుచుంటిమి.

గ్రంథాలయములకు నిర్మాణశక్తి ముఖ్యవిశేషము. కార్మికులకు, వ్యవసాయికజనులకు అనుకూలమగు గ్రంథాలయములు మనదేశమున ఇంకావ్యాప్తిలోనికిరావలెను. గ్రంథాలయములు, ఇవి గ్రామాదుల గ్రాహకత నిర్మాణ కార్యక్రమము, కనుకూలముగా నుండవలెను. జ్ఞానోదయము వీటికి ప్రభుత్వము తమ ఆరోగ్య వ్యవసాయక శాఖా ప్రచురణలను ఉచితముగా పంపి ప్రోత్సహింపవలెను. నేటిపిల్లలపై రేపటి దేశభవిష్యత్తు

ఆధారపడియుండును. అందుచే గ్రంథాలయము లు పిల్లలవిషయమై ప్రత్యేకశ్రద్ధ తీసుకొనవలె ను. ఇందుకు చిత్రపటములు, బొమ్మల పుస్తక ములు, ఆకర్షవంతమైన రచనలు ఉపకరించును. గ్రంథాలయములు విజ్ఞానకోశములుగా, సమగ్ర ముగానుండవలెనని వేరుగాచెప్పుట అనవసరము. వయోజనవిద్యావ్యాపకము ఎంతో అవసర మున్న మనదేశమున గ్రంథాలయములు మ్యాజిక్ లాంతరుల ద్వారా, ఉపన్యాసముల ద్వారా, ఇంకను బొమ్మలతో కంటెని పాటలతో మనస్సు ను అరికట్టి, అజ్ఞానులకు జ్ఞానోదయము కలిగించ వలెను. గ్రంథాలయము స్థాపించుటతోడనే పని పూర్తిఅయినట్లుగా భావించగూడదు. గ్రంథాల యములోని పుస్తకాలు అక్కడివారు ఎక్కు వగా చదివేటట్లు చేయవలసియున్నది. అందుకు సాధ్యమైన ఉపాయమేమనగా ప్రతిగ్రంథాలయ మునకు అనుబంధముగా ఒక సమితి ఏర్పరచి, ఆ సమితి సమావేశములందు గ్రంథాలయముల లోని పుస్తకములను ఆధారముగా చేసుకొని చదివినవారిచే ఉపన్యాసము లిప్పించవలెను. వయోజనవిద్యా వ్యాపకము, గ్రంథాలయోద్య మములను—గాంధీమహాత్ముడు దేశీయోద్యమము లుగా పరిగణించిన నేతపనివాంధ్ర సంఘము, హరిజన సేవాసంఘములవలె—మూలమూలలకు వ్యాప్తినొందించవలెను. కాలపరివర్తనతో దేశ పరిస్థితులుకూడ మారును. నవీనపద్ధతుల నను సరించి మన కార్యము నెరవేర్చుకొనవలెను. విజ్ఞానవిలసనమునకై జ్ఞానజ్యోతిని ప్రజ్వలి తము జేయవలెను. పదిసంవత్సరములలో నూటికి ఒక వంతు విద్యావిషయికాభివృద్ధి చూపిన మన ప్రభుత్వము వారు చేసినపనికి, కార్యదీక్ష గల గ్రంథాలయసేవకులు పదిరెట్లు, క్షణములో సులభముగా చేయవచ్చును. ప్రపంచములో మూ డవవంతు నిరక్షరాస్యుల గలిగి, అయిదవవంతు విస్తీర్ణము గలిగిన మన భారతదేశమున వయో జనవిద్యాప్రచారపు టవసరము వర్ణించుటకు భాషాపరిమితి చాలదు. ఈ నవోదయవేళలో ఏకైక జాతీయోద్యమముగా గ్రంథాలయోద్య మమును పునరుజ్జీవింపజేయవలెను.

తెలుగు జిల్లాలలోని గ్రంథాలయముల పట్టిక.

| జిల్లా లేక ప్రాంతము. | గ్రంథాలయముల సంఖ్య. |
|---|---|
| విశాఖపట్నము | 23 |
| తూర్పుగోదావరి | 91 |
| పశ్చిమగోదావరి | 137 |
| కృష్ణా | 104 |
| గుంటూరు | 209 |
| నెల్లూరు | 35 |
| కడప | 11 |
| కర్నూలు | 29 |
| బళ్లారి | 6 |
| అనంతపురం | 27 |
| చిత్తూరు | 9 |
| నిజాంమండలము | 51 |
| ఇతర ప్రాంతములు | 16 |
| మొత్తము గ్రంథాలయముల సంఖ్య | 781 |

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారిచే 1939 లో ప్రకటితమైన పట్టిక ననుసరించి.

# 2. గ్రంథ సంచయము

## ముద్రితాముద్రిత గ్రంథములు

విజ్ఞాన వ్యాప్తికి మూలాధారము సద్గ్రంథములు. సద్గ్రంథములను సేకరించుట సత్కార్యములలో నొకటి. గ్రంథసేకరణ ఆంధ్రులలో పూర్వము నుండియు గలదు.

పూర్వము మనవారు తాటియాకులమీద సన్నని ఇనుపగంటములతో అక్షరములను చెక్కెడివారు. ఈ చెక్కడము క్రమేణా ఒక కళగా పరిణితి నొందినది. ఆలేఖనమునకే 'వ్రాయుట' అని వాడుకలోనికి వచ్చినది. గ్రంథములను వ్రాయువారు 'వ్రాయసకాండ్ర' యిరి. అచ్చు గ్రంథములు రాక పూర్వము, తాటితో కట్టబడు తాళపత్ర గ్రంథములు వ్యాప్తిలోనున్న రోజులలో వాడబడు "చదువు కట్టిపెట్టు" అన్న మాటలు ఇంకను వ్యవహరింపబడుచున్నవి. పూర్వము ఉత్తరములను గూడ తాటికమ్మలమీద వ్రాసెడివారు. ఈ 'కమ్మ' వ్యవహారములో లేఖ అనే అర్థము నిచ్చుటకై ఇప్పటికీ ఉపయోగించబడు చున్నది.

కర్ర మీదగాని లోహము మీదగాని చెక్కిన చిత్తరువులను తడిమట్టి మీదనో లక్కపలక మీదనో ఒత్తిన అది అంటును. ఆరిన తర్వాత స్పష్టముగా నుండును. దానిని 'అచ్చు' అనెడివారు. మనము వినాయక చవితి పండుగ నాడు ఉపయోగించు మట్టిప్రతిమ ఇట్టి అచ్చుతో చేసినదే. దీనికి సంస్కృతమున 'ముద్రణ' మందురు. కానీ ముద్రణ ఆరోజులలో గ్రంథములకు ఉపయోగింప కుండిరి. ఇప్పటి అచ్చువేయు పద్ధతికి మూలసూత్రము అదే.

మనవారు పూర్వము వేదములు, అమరము, కావ్యములు సంత చెప్పుకొని వల్లించెడివారు. వేదములు ఇప్పటికీ సంత చెప్పుకొని వల్లింతురు. స్వర ప్రధానమైనవగుటచే సంప్రదాయము చెడకుండా వానినట్లే వల్లించవలెను. అనేకులు సంత చెప్పుకొన్నవారు లక్షలాది పాటలను, పద్యములను వల్లించగలరు. కానీ, వాఙ్మయము, పురాణాది గ్రంథములు, శాస్త్రములు విస్తరిల్లిన కొలది విరివిగా గ్రంథ ప్రచారము అవసరమై, దానితో వ్రాతయున్నూ గ్రంథ సంచయమున్నూ ప్రధాన స్థానము వహించినవి.

ఆదికవి వాల్మీకి రామాయణము రచించి ఫలశ్రుతిలో, పఠించిన వారికిన్ని విన్నవారికిన్నీ శుభప్రాప్తి కలుగునని చెప్పి, దానిని లిఖించు వారిని గూర్చి "యే లిఖంతీహచ నరాస్తేషాం వాస స్త్రివిష్టపే" అని చెప్పి

ఫలశ్రుతి యున్నాడు.

"ఆరూఢమతి మల్లికార్జున పండితారాధ్య చరిత మాద్యంతంబు వినినఁ జదివిన, వ్రాసిన.... .... నరుదొంత వారల కభిమతార్థములు, కరుణించు శివుడు మంగళ మహాశ్రీలు" అని పండితారాధ్య చరిత్రలో గూడా చెప్పబడి యున్నది. ఇదే విధముగా అనేక గ్రంథములలో గ్రంథలేఖనమును గూర్చి ప్రశంసింపబడియున్నది.

ధనవంతు అనేకులు రామాయణాది గ్రంథముల వ్రాయించియు, రాజులు కవుల పోషించియు స్థిరయశస్సు నార్జించినవారు అనేకులున్నారు. కొందరు గ్రంథములచివర 'శ్రీరామార్పణం'

అని స్వంత ఉపయోగార్థము రచించు కొన్నట్లు వ్రాసినారు.

ఒక వ్రాతప్రతిలో వ్రాసినది ఉదహరించెదము. నన్నెచోడ కుమారసంభవము ప్రతి యందు ఆతడు "శ్రీమద్రాజాధిరాజ మహారాజ సహజ రాజభూపాలక సార్వభౌమస్య యిష్టార్థః (ర్థాః) భవానీ శంకరకృపయా సఫలాః సంత్తు 'ఉమామహేశ్వరౌ రక్షతు' శివాయనమ". అని వ్రాసినాడు.

వ్రాతలో శాశ్వతముగా నుండవలసిన వాటిని రాగి రేకుల మీదను, రాతిపైనను వ్రాయించెడి వారు. రాగి రేకుల మీద చెక్కించిన వాటిలో తిరుపతిలోని తాళ్లపాక వారి గ్రంథములు. మన గ్రంథములు సేకరించుట పూర్వము నుండి ఉన్న ఆచారము. ఆంధ్ర దేశమునందలి ధాన్యకటకము, కాంచీపురము, అమరావతి విశ్వవిద్యాలయములలో పెద్దపెద్ద గ్రంథ భాండాగారములుండెడివి. సంపన్నులు గ్రంథములను సేకరించి విద్యార్థుల ఉపయోగార్థమిచ్చుచుండెడివారు. నవీన యుగమున గ్రంథాలయములు ఆపనిని చేయుచున్నవి. సి. పి. బ్రౌన్ దొరగారు మన గ్రంథములన్నిటినీ సేకరించి, ఆదిలో మనకు మహోప



శ్రీ రేబాల లక్ష్మీనరసింహారెడ్డి పురమందిరము, నెల్లూరు. రు. 60,000 ల ఖర్చుతో 1912 సం॥లో నిర్మించబడినది.

ఆంధ్రదేశములో విశాఖపట్టణమున బొబ్బిలి రాజావారు, కాకినాడలో పైడా వెంకటాచలపతిగారు, రాజమంద్రిలో కందుకూరి వీరేశలింగంపంతులుగార్ల చేతను, ఇట్లే తణుకు, బందరు, గుంటూరు, అనంతపురం మున్నగు పట్నములలో ప్రజల ధన సహాయముతోను పురమందిరములు నిర్మింపబడినవి.

కారము చేసిన విషయము చాలమందికి క్రొత్త గాదు. వారు లండనులోని ఇండియా హౌస్ గ్రంథాలయములోను, బోడ్లే గ్రంథాలయము లోను గల తెలుగు, కన్నడ గ్రంథములను తెప్పించి, వారు సేకరించిన భారతముల ప్రతులు ఇతర గ్రంథముల ప్రతులు మద్రాసు కళాశాలా భాండాగారమునకు ఇచ్చిరి. ఇవన్నియు గలిసి ఇప్పుడు మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగార ముగా ఏర్పడినది.

16 శతాబ్దములోనే మన తంజావూరి నాయకరాజులు పెద్దపెద్ద భాండాగారముల నెలకొల్పిరి. ఆభాండాగారమే తంజావూరు మహారాజా సర్ఫోజీ సరస్వతీ భాండాగారమని పేరెన్నికగన్న ప్రస్తుత భాండాగారము. ఈ ప్రాచీన గ్రంథాలయమునుగూర్చి డాక్టరు బర్నెల్ గారు "....బహుశః అతిముఖ్యము, మిక్కిలి విశాలమైనదై యుండవచ్చును" అని వ్రాసినారు.

మన గ్రంథముల ముద్రణకు ఆదిలో తోడ్పడినవారు పరవస్తు రంగాచార్యులుగారు, వావిళ్ల రామస్వామి శాస్త్రులుగారు, వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారు, బహూరు త్యాగరాయ శాస్త్రిగారు మొదలైన వారు. వేదం వెంకటరాయశాస్త్రిగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు మొదలైన వారున్ను గ్రంథ విషయములలో అత్యంత శ్రమచేసినారు. శ్రీ పిఠాపురం మహారాజుగారు, శ్రీ వుయ్యూరు, విజయనగరం జమీందారులు ముద్రితగ్రంథ వ్యాప్తికి అనేక విధముల తోడ్పడిరి.

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు అసలు ఆంధ్ర గ్రంథ ప్రపంచమున ఒక ప్రత్యేక పీఠము నిర్మించు కొన్నవారు. వీరు ఆంధ్ర గ్రంథ వ్యాప్తికి చేసిన కృషి ఆబాల గోపాల మూ ఎరిగినదే! విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి స్థాపకులు కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు, ఆనంద ముద్రణాలయమువారు మొదలైన ప్రముఖులు అనేకులు ఈ రంగమున వెలుగు చుక్కలు !

ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారున్ను ముఖ్యముగా జయంతి రామయ్య పంతులుగారు, అక్కిరాజు ఉమాకాంతంగారు మొదలైన ప్రముఖులు అనేక ఉత్తమ గ్రంథముల పరిష్కరించిరి.

తంజావూరి సరస్వతీ మహల్, చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, హైదరాబాదు ప్రాచ్యలిఖిత గ్రంథాలయము, ఆంధ్ర సాహిత్య పరిషత్ పుస్తక భాండాగారము ఆంధ్ర విశ్వకళా పరిషత్ గ్రంథాలయము మొ॥ వాటిలో అనేక అముద్రిత ఆంధ్ర గ్రంథములున్నవి. *

ఇట్లే ఆంధ్ర దేశమున శారదానికేతనము (గుంటూరు), రామమోహన గ్రంథాలయము (బెజవాడ) మొదలైన చోట్ల, పండితులవద్ద అనేక ఉద్గ్రంథము లున్నవి. ముద్రణ సౌకర్యములున్న ఈ రోజులలో ఇంకా ఈఉద్గ్రంథములను ప్రకటింప జేయుట ఉత్తమము.

---

* చూ॥ 1. ఆంధ్ర వాఙ్మయ సూచిక (కా. నాగేశ్వర రావుగారు).

2. A Descriptive catalogue of the Telugu Manuscripts in the Tanjore Maharaja Sarfoji's Saraswathi Mahal Library. (Andhra University Publication Series No. 11)

# 24 వ అధ్యాయము

# విద్య

విషయ సంగ్రహము:—ప్రాచీనకాలమునుండి బ్రిటిష్ యుగారంభము వరకును దేశమందుండిన విద్యాసంస్థలు ; వేద కాలమందలి విద్యా పరిషత్తులు ; బౌద్ధయుగమున అందరును విద్య నభ్యసించుట కవకాశము ; తక్షశిల, నాలంద, ధాన్యకటకము; కాంచీపురములలో బౌద్ధ బ్రాహ్మణ మత విద్యలు రెండున్ను ; బౌద్ధయుగానంతరము విద్యాసంస్థలునాలుగువిధములయినవి :—1 ఘటికా స్థానములు 2 అగ్రహారములు 3 దేవాలయములు 4 మఠ ములు ; మొదటివి అసనపురము, కాంచీపురముమొ॥ స్థలము లందు; ప్రతి అగ్రహారమున్ను ఒక విద్యా సంస్థ ; ప్రోలునాటను వేదవేదాంగములు, వైద్యము, శాస్త్రములు మొ॥ విద్యలు; గురువు లకు అగ్రహారములలో వృత్తులు ; దేవాలయములలో మత విద్యా సంస్థలు; మఠములలో మత విద్యతోపాటు తక్కిన విద్యలు; జైన బస్తీలు; శైవ, వైష్ణవ విద్యా సంస్థలు, గ్రంథాలయములు, ఆంధ్ర దేశమందలి మఠములు, విద్యా సంస్థలు; విజయనగరం, అమలా పురం, తిరుపతి మొ॥ స్థలములందు అమరము, ఆంధ్రము, పెద్ద బాలశిక్ష, బాల రామాయణము, శతకములు, గణితము మొ॥ చిన్నపిల్లలకు నేర్పేవారు; పిమ్మట సంస్కృతము నేర్చు కొనేవారి విద్యా విధానము వేరు; బ్రిటిష్ యుగము ప్రారం భించిన తర్వాత ఆంగ్లబడులు 1805 నుండి 1830 వరకును కొద్దిగా ; 1832 లో ఆంగ్లభాషద్వారా పాశ్చాత్య పద్ధతుల ననుసరించి పాశ్చాత్య విజ్ఞానము బోధించే ఏర్పాటు ; 1858 విశ్వ విద్యాలయములు, సర్వ కళాశాలలు, ఉన్నత విద్యాలయ ములు, చిన్న పాఠశాలలు పూర్తిగా ఏర్పడినవి ; ప్రాథమిక విద్యా పరిణామము ; ప్రైమరీ పరీక్ష, మిడిల్ స్కూలు పరీక్ష బడుల విధానము ; మెట్రిక్యులేషన్‌పరీక్ష, హైస్కూళ్లు, కాలే జీలు; ఉపాధ్యాయులు కాగోరువారికి ట్రెయినింగు పాఠశాలలు, కాలేజీలు ; 1880 స్థానిక పరిపాలనము; విద్యా పోషణము; 30 సంవత్సరముల క్రిందటివరకున్ను మొదటి ఫారం నుండిన్ని ఆంగ్ల భాషద్వారా విద్యాబోధసాగినది ; దానివలని నష్టములు; మాతృ భాషద్వారా విద్య నేర్పవలెనన్న పద్ధతి ఇప్పటికి హై స్కూల్ ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షల వరకే ; కాలేజీలలో నైతము పెట్టుటకు ప్రయత్నములు; ఏయే శ్రేణులలో బడుల సంఖ్య, విద్యా వ్యాప్తి ఎట్లున్నదో చూపు పట్టికలు.

1926 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు బెజవాడలో ఏర్పడుట; 1931 లో కేంద్ర స్థానము వాల్తేరుకు మారుట ; ఆంధ్ర విశ్వ కళా పరిషత్ చరిత్ర ; జయపురం మహారాజావారి భూరి విరాళ ములు ; సైన్స్ అండ్ టెక్నాలజీ వృత్తి విద్యలు ; వైద్య కళా శాల డిగ్రీలకు సమాన గౌరవము ; విజ్ఞాన వ్యాపకోపన్యాసముల పద్ధతి ; ఈ సంస్థకు అనుబంధముగానున్న కళాశాలలో నేర్పు విద్యలు ; నైజాం సంస్థానాధీశులు, తిరువాన్కూరు మహారాజా, తిక్కవరపు రామిరెడ్డిగారు, జిల్లా బోర్డులు, మ్యునిసిపాలిటీలు, సర్ అల్లాడి కృష్ణస్వామి, సర్ సి. ఆర్. రెడ్డి మొ॥ ఉదారుల విరాళములు ; ఈ సంస్థలో చేరిన సర్వ కళాశాలలు 14 ; ఆంధ్ర గీర్వాణ కళాశాలలు 9; వైద్య కళాశాల 1; ఈ సంస్థలో విద్య నభ్యసించి గొప్ప ప్రఖ్యాతి పొందిన విద్యాధికులు ; ఆంధ్ర సంస్కృతములను బోధించే సర్వ కళాశాలలు, విద్యాలయ ములు, వేద పాఠశాలలు ; జాతీయ విద్యాలయములు; 1910 నుండిన్ని మచిలీపట్టణమందలి జాతీయ విద్యా సంస్థ కోపల్లె హనుమంతరావుగారి కృషిఫలము; డాక్టరు పట్టాభి సీతారామయ్య గారి దక్షత ; ఇక్కడ నేర్పే సంస్కృతి విద్యలు, వృత్తి విద్యలు ; తక్కిన జాతీయ సంస్థలు రాజమహేంద్రవరము, ఏలూరు, గుంటూరు నెల్లూరు, మొ॥ స్థలములందు ; గుంటూరు శారదా నికేతనము; స్త్రీ విద్య ; వేదకాలమునుండిన్ని హిందూ మహాయుగమందు స్త్రీ విద్య అధికము; పిమ్మట మహమ్మదీయ యుగమందును, బ్రిటిష్‌యుగములో గొంతకాలమున్ను స్త్రీ విద్య అడుగంటినది ; స్త్రీ విద్యకై పునఃప్రయత్నములు ; మిషనరీలే ముందంజ వేసినవారు ; 1820-30 బ్రహ్మసమాజమతాభివృద్ధితో స్త్రీ విద్యకు సరియైనమార్గము ; ఆంధ్ర దేశములో కందుకూరి వీరేశలింగంగారి కృషి; వంగ దేశములో ఉన్నత విద్య నభ్యసిం చిన డాక్టర్ శకుంతలదేవి, కీ. శే. అన్నపూర్ణాదేవిగార్లు ; ఇంగ్లం డులో ఎమ్. ఎస్ సి అయిన వసుంధరాదేవిగారు ; ఇప్పటికింకా ప్రాథమిక విద్య అయినా తెలుగు దేశమంతటా వ్యాపింపలేదు; స్త్రీల ఉన్నత విద్యకు కావలసిన హైస్కూళ్లసంఖ్య అత్య ల్పము ; స్త్రీలకు ప్రత్యేకించి సర్వ కళాశాల ఒకటైనా ఆంధ్ర జిల్లాలలో లేదు; వృత్తి విద్య నేర్పే కళాశాల లేవీలేవు; చదువుట గాని వ్రాయుటగాని రాని నిరక్షరకుక్షులు తెలుగుజిల్లాలలో నూటికి 86 మొ॥ 94 వరకును; ఆంధ్రుల ప్రతిభ ఆంధ్రదేశముకంటె పై దేశములందే ఎక్కువగుచూ ఉన్నందుకు తార్కాణముగా సర్ రాధాకృష్ణ, డాక్టర్ బి. వి. నాథ్ మొ॥వారు.

మన దేశములో విద్యావ్యాప్తికి అనుకూలమైన విద్యాసంస్థలు వేదకాలము నుండియు ఉన్నవి. ఆంగ్లేయప్రభుత్వము మన దేశములో వ్యాపించిన తర్వాత ఏర్పడ్డ విద్యాపద్ధతి పాశ్చాత్య విద్యా పద్ధతి ననుసరించి పరిణమించినది. ఇప్పటివారికి ఈ పద్ధతితోడనే పరిచయ మెక్కువగా నుండుట చేత, తత్పూర్వముండిన విద్యాపద్ధతి మనలో చాలామందికి తెలియనే తెలియదు. విద్యాసంస్థలు దేశమందు ఎక్కువగా వ్యాపించి యుండె నన్న విషయమైనను కొందరికి తెలియదు. గనుక ప్రాచీనకాలమునుండి బ్రిటిషు యుగమువరకును మన దేశమందలి విద్యాసంస్థలు, కొన్ని ముఖ్య విషయములు ఎట్లుండెడివో చూతము.

వేదకాలమందే విద్యాపరిషత్తు లుండేవి. వేదవేదాంగవేత్తలయిన గురువులు శిష్యులకు వాగ్రూపమున విద్య నేర్పేవారు. శిష్యులు తాము నేర్చుకొన్నదెల్ల కంఠస్థము చేస్తూఉండే వారు. ఆ కాలమందు విద్యాసంస్థలలో నేర్పే విద్య అంతా వేదవిద్యే కనుక దానిని నేర్చుకొనుటకు అర్హత గలవారు ద్విజులే కాని ఇతరులు కారు.


ప్రొ॥ మామిడిపూడి వెంకట రంగయ్య, ఆర్థిక శాస్త్రోపాధ్యాయులు, ఆంధ్ర విశ్వ కళా పరిషత్.

బౌద్ధయుగములో విద్యాప్రచార విషయమున గొప్ప మార్పు కలిగినది. బౌద్ధమతము స్వీకరించి ఉత్తమ పదవిని పొందుటకు అందరికిని అవకాశము న్నట్లే, బౌద్ధవిద్యాపీఠములలో చేరుటకున్ను అందరికిన్ని అవకాశ ముండేది. కేవలము భారతీయులే కాక పై దేశములవారు సైతము ఆ సంస్థలలో విద్య నభ్యసిస్తూ ఉండేవారు. ఉత్తర హిందూస్థానములో తక్షశిల, నాలంద, ఓదంతపురి మొదలయిన స్థలములలో గొప్ప విద్యా సంస్థ లుండేవి.

దక్షిణదేశములో అజంతా గుహాలలోని చిత్రములు, అమరావతి, జగ్గయపేట, నాగార్జునుని కొండ లందలి స్థూపములు మొదలయినవి ఆంధ్రుల కళానైపుణ్యమును తెలియజేయును. ఈ కళలను నేర్పెడి సంస్థలతోపాటు ధాన్యకటకము, వేంగి, కాంచీపురము (కంచి), శ్రీశైలము మొదలయిన స్థలములందు ఆంధ్రుల విద్యాపీఠము లుండేవి. రెండవ బుద్ధుడనుపేరుపొందిన నాగార్జునుని కాలమున ధాన్యకటక విద్యాపీఠము చాలా ప్రసిద్ధిపొందియుండెను. వేంగీ విద్యాపీఠమునకు శ్రీ దిఙ్నాగాచార్యులవారు అధ్యక్షులుగా నుండిరి. ధాన్యకటకములోను కాంచీపురమందును గల విద్యాపీఠములలో బౌద్ధవిద్యలతోపాటు బ్రాహ్మణవిద్యలు సైతము నేర్పుచుండేవారు. అందుచేతనే కాంచీపురములో బౌద్ధమతము క్షీణించిన తర్వాత కూడా బ్రాహ్మణవిద్యలు నేర్పు విద్యాపీఠము పేరుపొంది యుండెను. శ్రీశైలములో నాగార్జునుడు బౌద్ధగ్రంథము లనేకముగా సంగ్రహించి అక్కడి విద్యాపీఠమున పుస్తకభాండాగారమును సైతము నెలకొల్పెను. బౌద్ధయుగము కడచినతర్వాత ఇక్కడ కదంబ రాజులు బ్రాహ్మణవిద్యల నెక్కువగా పోషించిరి.

బౌద్ధయుగము గుప్తచక్రవర్తులనాటికి కొంత వరకును, హర్షవర్ధనునినాటికి పూర్తిగను గడచి

పోయినది. నాటనుండి మరల బ్రాహ్మణవిద్యాపీఠములు వృద్ధిలోనికి వచ్చినవి; బౌద్ధుల విద్యాపీఠములందుండిన సంస్థల పద్ధతులను అనుకరించి వేదవేదాంగములనే కాక దర్శనములను, పురాణములను, ధర్మశాస్త్రములను-ఇవి యవి అననేల-సకల శాస్త్రములను, కళలను నేర్పుటకు అనుకూలమయిన విద్యాసంస్థలు అనేకముగా వెలసినవి. ఇవి నాలుగువిధములుగా నుండెను.

1. ఘటికాస్థానములు 2. అగ్రహారములు 3. దేవాలయములు 4. మఠములు.

1. ఘటికాస్థానములు :—వేంగీ చాళుక్య జయసింహవల్లభుని (క్రీ. శ. 633-666) నిడమఱ్ఱు శాసనములో అసనపురమందొక ఘటికాస్థానము ఉండెననియు, ఆ విద్యాపీఠమందు ఘటికాసామాన్యుడయిన (అనగా అధ్యాపకుడుగానో సభ్యుడుగానో ఉన్న) మందశర్మ మనుమడు కాటిశర్మ, జయసింహవల్లభ మహారాజునుండి నిడమఱ్ఱు గ్రామమును దానముగ ప్రతిగ్రహించెననియు ఉన్నది. కాంచీపురమందు సైతము ఘటికాస్థానముండెను. ఇట్లే మరికొన్నిచోట్లను సైతము ఘటికాస్థానములుండేవి. ఇవి ఇంచుమించుగా బౌద్ధయుగమునాటి విద్యాసంస్థల పద్ధతినే నడచినవి.

2. అగ్రహారములు :—గురువులును పండితులును అయిన బ్రాహ్మణులకు రాజులు అగ్రహారములను ఇచ్చే సంప్రదాయము మొన్నమొన్నటి వరకును సాగుతూవచ్చినది. ప్రతి అగ్రహారమును విద్యాసంస్థగా ఉండవలెనన్న ఉద్దేశముతోడనే రాజులు అగ్రహారములను ఏర్పరస్తూ ఉండిరి. అగ్రహారమునకు మంగల మనిసైతము పేరుండేది. ప్రోలునాటను, అనగా పిఠాపురం-కాకినాడ ప్రాంతమందు, వీరచోడచతుర్వేది మంగలముండేది. వేదవేదాంగ వేదాంతములను నేర్పే వారికే కాక పురాణము చదివేవారికి, వైద్యులకున్ను, జ్యోతిష్కులకున్ను, వ్రణవైద్యముచేసే మంగళ్లకున్ను అగ్రహారములో వృత్తులుండేవి. వృత్తి అనగా భూమిలో ఒక భాగము. అంతే కాదు, విద్యాసంస్థలలో ఉండే గురువులకుగాని శిష్యులకుగాని కావలసిన పరిచర్యలకును, వారి నివాసములకు భోజనములకు కావలసిన పదార్థములను సేకరించుటకును ఏయే వృత్తులవారు అవసరమో వారందరికిని అగ్రహారములో వృత్తులుండేవి. గురువులు తమ వంతుకు వచ్చిన భూములను పెట్టుకొని జీవిస్తూ ఉండేవారు. శిష్యులు గురువుల నాశ్రయించి గురుకులమున మాధుకరవృత్తిని జీవిస్తూ ఉండేవారు. రాజులు అగ్రహారపు భూములపై శిస్తులు, పన్నులు విధించేవారు కారు.

3. దేవాలయములు :—మత ధర్మములను బోధించు విద్యా పీఠములు. మత గురువులు ఇక్కడ ఉపన్యాసములనిచ్చుచుండే వారు; పౌరాణికులు పురాణములు చదువుతూ ఉండేవారు; భాగవతులు హరికథా కాలక్షేపములు చేస్తూ ఉండేవారు. రాజులు, తక్కిన ధనవంతులు దేవస్థానములకుచేసే దాన

డా॥ ఏచూరి లక్ష్మీనారాయణ, ఎమ్ ఏ., డి. ఎస్. సి., ఎఫ్. ఆర్. ఎ. ఎస్., నక్షత్ర పరిశోధనశాలకు డైరెక్టరు. హైందవులలో ఇట్టి గౌరవము పొందినవారు వీరే.

ములలో కొన్ని విద్యాదానమునకు సైతము ఉద్దేశించి చేసేవారు. ఈ దేవాలయములకు అనుబంధములుగా వైద్యశాలలు సైతము ఉండేవి.

4. మఠములు :—జైనుల బస్తీలు, జనాలయములు, శైవ వైష్ణవ మఠములు ఆయామతముల వ్యాప్తికే కాక విద్యావ్యాప్తికి సైతము ఎక్కువగా తోడ్పడుచు విద్యా సంస్థలవలెనే ఉండేవి. కృష్ణా జిల్లాలోని బెజవాడ, గుంటూరు జిల్లాలోని ధర్మవరము, విశాఖపట్టణము జిల్లాలోని రామతీర్థము, ఓరుగల్లు జిల్లాలోని అనుమకొండ, కడప జిల్లాలోని దానవుల పాడు మొదలయిన స్థలములందు ప్రసిద్ధమైన జైన పీఠములుండేవి. జైనబస్తీ బ్రాహ్మణ-అగ్రహారము వంటిది. జైన యోగులకు యోగినులకు వేరువేరు మఠములుగలవు. ఇట్టి మఠములలో జైన గ్రంథములు అనేకముగా దొరికినవి. గనుక అక్కడ గ్రంథాలయములు సైతము ఉండెనని చెప్పవచ్చును. ఆంధ్ర దేశములో కాకతీయులనాడును, అటుపిమ్మట శ్రీశైలము, కాళేశ్వరము, భీమేశ్వరము మొదలయిన శైవ క్షేత్రములందును శైవ మఠములున్ను; కడప జిల్లాలో పుష్పగిరియందున్ను, కర్నూలు జిల్లాలో త్రిపురాంతకమందున్ను గుంటూరు జిల్లాలో మందడమందున్ను శైవగోళకీ మఠశాఖలున్ను ఉండెను. మందడమందలి విశ్వేశ్వరగోళకి చాలా ప్రసిద్ధి పొందినది. దానిని నెలకొల్పిన శివాచార్యుడు కాకతీయ గణపతికి చిన్మయదీక్ష నొసగినవాడు. ఇక్కడ వేదములు, శాస్త్రములు, సాహిత్యము నేర్పు పండితులుండేవారు. ఈ గోళకిలో కేవలము విద్యాలయములే కాక ప్రసూత్యారోగ్యశాల సైతము నెలకొల్పిరి. కృష్ణదేవరాయలు, సదాశివరాయలు మొదలయిన విజయ నగరరాజుల ఆదరమున 16, 17 వ శతాబ్దములందు వైష్ణవ మఠములలో విశిష్టాద్వైతమునకు సంబంధించిన విద్యతోపాటు ప్రాచీన విద్యలు సైతము బోధించు సంస్థలు ఉండేవి.

పైని చెప్పిన సంప్రదాయముల ననుసరించి సుమారు నూరేండ్ల క్రిందటి వరకును విశాఖపట్టణము జిల్లాలోని విజయనగర మందున్ను, తూర్పు గోదావరి జిల్లా లోని అమలాపుర మందున్ను, పశ్చిమ గోదావరి జిల్లాలోని కాకర్ల మూడి గ్రామ మందున్ను, కృష్ణా జిల్లాలోని ఆకురపల్లి గ్రామ మందున్ను, తిరుపతిలోను ఇట్లే మరికొన్ని స్థలములందున్ను ప్రాచీన పద్ధతులను, భారత దేశ జ్ఞానవిజ్ఞానములను వ్యాపింపజేసే విద్యాస్థానములు సాగుతూ వచ్చినవి. విజయనగరము, తిరుపతి మొదలయిన స్థలములలో నేటికిని భారతదేశీయ విద్యనొసగు విద్యా సంస్థలు గలవుగాని, అవి నవీన పద్ధతులను అనుసరించి యున్నవి. తంజావూరులో విజయనగరాజులకాలమునుండి స్థాపితమైన గ్రంథాలయము మహారాష్ట్ర నాయకుల పాలనమందు వృద్ధి పొంది నేటికిని నిల్చియున్నది. అందులో ఆంధ్ర సారస్వతమునకు సంబంధించిన గ్రంథములు వందలకొలది గలవు. వాటిలో అనేకము ఇంకా అచ్చు పడలేదు.

బ్రిటిష్ ప్రభుత్వము దేశములో వ్యాపించిన సరికి పైని చెప్పిన విద్యా సంస్థలే కాక ప్రతి నగరమందును, పట్టణమందును, పల్లెయందును చిన్న పిల్లల కోసము వీధిబడు లుండేవి. ఒకొక్క ఊరిలో ఒకొక్క వీధి కొకొక్క బడి



ప్రొఫెసర్ సూరి భగవంతం, ఎమ్. ఎస్ సి., డి. ఎస్ సి., ఎఫ్. ఏ. ఎస్ సి., ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాల ప్రిన్సిపాల్.

చొప్పున, అన్ని చోట్ల రెండు మూడు వీధుల కొకబడి చొప్పున ఉండేవి. అందు అమరము, ఆంధ్రము, పెద్ద బాలశిక్ష, బాలరామాయణము, కృష్ణ శతకము, నరసింహ శతకము, వేమన శతకము, సుమతీ శతకము, చిన్న గణితము మొదలయినవి పిల్లలు నేర్చుకొంటూ ఉండేవారు. ప్రతి దినము కొన్ని ప్రార్థన శ్లోకాలు, పద్యాలు, సంవత్సరముల పేర్లు, తిథులు, వారములు, మాసములు, నక్షత్రములు మొదలైన వాటిపేర్లు ఒకరు చెప్తూ ఉంటే తక్కిన పిల్లలందరున్ను వెనుక పాటవలె పాడుతూ వల్లెవేస్తూ ఉండేవారు. సంస్కృత మభ్యసించే బాలవిద్యార్థులు అమరము, శబ్దాలు వల్లించి క్రమక్రమముగా రఘువంశం, కుమార సంభవం, మేఘసందేశం, భారవి, మాఘం అనే పంచ కావ్యాలలోను కొన్ని సర్గలు, దినమునకు రెండుమూడు శ్లోకాలు చొప్పున, శ్లోకములతోపాటువ్యాఖ్యానము సైతము వల్లె వేస్తూ ఉండేవారు. పైని చెప్పిన ప్రారంభవిద్యపూర్తి కాగానే విద్యార్థులు వారివారి ఉత్సాహము, తెలివి తేటలు, అభిరుచి మొదలయిన వాటిని బట్టి అభిమాన శాస్త్రములను అభ్యసించేవారు. వేదాధ్యయనము మొట్టమొదట ద్విజులయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య బాలకులందరును చేస్తూ ఉండినా రానురాను వైశ్యులలో చాల అరుదుగాను, క్షత్రియులలో కొద్దిగాను, బ్రాహ్మణులలో ఒక్క వైదిక కుంటుబాలలో అధికముగాను జరుగుతూ వచ్చినది.

ఆంగ్లేయుల ప్రభుత్వం దేశములో ప్రారంభమైన కొంతకాలము వరకును, అనగా 19 వ శతాబ్దము ప్రారంభించిన వరకును, పైని చెప్పిన విద్యాసంస్థలు, విద్యా పద్ధతులు సాగుతూ వచ్చినవి. 1804-5 లో వెల్లస్లి ప్రభువు రాజప్రతినిధిగా ఉన్నప్పుడు మన దేశములో ఉన్న ఆంగ్లేయుల పిల్లల కోసమున్ను, కంపెనీవారి కొలువులో పనిచేయవలసిన హిందూ దేశస్థుల కోసమున్ను కొన్ని పాఠశాలలు స్థాపించుటకు ప్రభుత్వము వారు మొదలుపెట్టినారు. కంపెనీ గుమస్తా పనులకు కావలసిన విద్య మాత్రమే ఆ పాఠశాలలలో మన దేశస్థులకు చెప్పించేవారు. అయితే అంతకు పూర్వమే జోన్సు, విల్సను మొదలయిన ఆంగ్ల విద్వాంసులు భారతీయ విజ్ఞానము తెలుసుకొని, సంప్రదాయ సిద్ధమై ఉన్న దేశీయ విద్యావిధానమును ఆమో

దించి అభినందిస్తూ ఉండేవారు. 1832-3 నాటికి విద్యా విధానమునకు సంబంధించిన పెద్ద సమస్య చర్చకు వచ్చినది. ప్రభుత్వమువారు స్థాపించే బడులలో బోధించే విషయములు ఎంతవరకు దేశీయ విజ్ఞానము ననుసరించి యుండవలెను? ఎంతవరకు పాశ్చాత్య విజ్ఞానమును అనుసరించి యుండవలెను? బోధించే విషయములు దేశభాషల ద్వారా బోధించవలెనా, లేక ఆంగ్లేయ భాష ద్వారా బోధించవలెనా? అనే విషయములు తీవ్రముగా చర్చింపబడినది. మెకాలే దొరగారు పాశ్చాత్య విజ్ఞానమే ఎక్కువగా బోధించ వలెననిన్నీ బోధించే విషయములు ఆంగ్లేయ భాషద్వారానే బోధించ వలెననిన్ని నొక్కి చెప్పినారు. రాజా రామమోహన రాయలవారు అందుకు అనుకూలముగా తమ అభిప్రాయము వెల్లడించినారు.

మెకాలేగారి సలహానే అనుసరించి మిషనరీ సంస్థలవారున్ను ప్రభుత్వమువారున్ను ప్రతిజిల్లాలోను కొన్ని నగరములందున్ను, కొన్ని గ్రామములందున్ను పాఠశాలలు నెలకొల్పినారు. 1858 లో చెన్నపురి రాష్ట్రమునకు చెన్నపురిలోను, బొంబాయి రాష్ట్రమునకు బొంబాయిలోను, బెంగాల్ రాష్ట్రమునకు కలకత్తాలోను విశ్వ విద్యాలయములు (యూనివెర్సిటీలు) స్థాపింపబడినవి. నాటనుండిన్ని విద్యాసంస్థలు మూడు శ్రేణులను అనుసరించి ఏర్పడినవి; ప్రాథమిక విద్యాలయములు (ఎలిమెంటరీ స్కూళ్లు), ఉన్నత విద్యాలయములు (సెకండరీ స్కూళ్లు), సర్వ కళాశాలలు (కాలేజీలు).

### ప్రాథమిక విద్యా పరిణామము

చాలాకాలము, ప్రభుత్వముతో సంబంధము లేనివారే తమ ఇండ్లలోనో, ఇండ్ల వెలుపలనున్న అరుగుల మీదనో బడులుపెట్టి ప్రాథమిక విద్య నేర్పుతూ ఉండేవారు. బోధించే విషయములు, పద్ధతులు సంప్రదాయానుసారముగానే ఉండేవి. చదువుట, వ్రాయుట, గణితము ఇవే ముఖ్యమయిన విషయములు, ప్రత్యేక నిలయములందు బడులు పెట్టుటకు ప్రారంభించినవారు క్రైస్తవ మిషనరీలు. కొన్నికొన్ని చోట్ల మిషనరీ బడులు 18 వ శతాబ్దములోనే ప్రారంభమైనట్లు కనబడుతున్నది. ప్రభుత్వమువారు ఈ బడులనన్నిటిని మన్నించి, అవి యథాక్రమముగా పనిచేయుటకు ధన సాహాయ్యము చేయుటకు మొదలు పెట్టినారు. అప్పట నుండిన్ని ఆ బడులపైని ప్రభుత్వము వారికి కొంత అధికారము ఏర్పడినది. విద్యార్థులలో తరగతు లేర్పడినవి. తరగతుల ననుసరించి పాఠ్య గ్రంథములు వచ్చినవి. విద్యా ప్రణాళికలు పుట్టినవి. రాష్ట్రమందలి బడులన్నీ ఇంచుమించుగా ఒకే విధానమును అనుసరించి పనిచేసే పద్ధతి వచ్చినది.

ప్రభుత్వము పెట్టిన ప్రైమరీపరీక్షలకు పిల్లలను తయారు చేయ నిశ్చయించిరి బడుల పని సరిచూచి ఏబడికి ఎంతధనము ప్రభుత్వము వారు సాహాయ్యముగా నీయవచ్చునో నిర్ణయించుటకు ఉద్యోగస్థులను ప్రభుత్వమువారు నియమించుటకు మొదలు పెట్టిరి. ప్రైమరీపరీక్షలతో పాటు మిడిల్ స్కూలు (మరికొన్నాళ్లకు లోవర్ సెకండరీ), మెట్రిక్యులేషన్ (ఇటీవల స్కూల్ఫైనల్) పరీక్షలు ప్రభుత్వమువారున్ను, ఎఫ్. ఏ., బి. ఏ. మొదలయిన డిగ్రీ పరీక్షలు విశ్వవిద్యాలయము వారున్ను నెలకొల్పిన తర్వాత, ప్రాథమిక విద్యాలయములలో ఉపాధ్యాయులుగా పనిచేసేవారు ప్రైమరీ, మిడిల్ స్కూలు (లేక లోవర్ సెకండరీ) పరీక్షలలో

నైనా ఉత్తీర్ణులయి ఉండవలెనన్న నియమమేర్పడినది. పిమ్మట, ఈ పరీక్షలలో ఉత్తీర్ణులయినా వీరు పిల్లలకు విద్య బోధించే నేర్పు అలవడచేసుకోవలెనని ట్రెయినింగు బడులు పెట్టించి, అందులో ట్రెయినింగు అయి ట్రెయినింగ్ పరీక్షలో నెగ్గినవారే ఉపాధ్యాయ పదవికి అర్హులన్న నియమము ప్రభుత్వము వారేర్పరచిరి.

1880 లో స్థానిక ప్రభుత్వమేర్పడి మ్యూనిసిపాలిటీలు, తాలూకా బోర్డులు, జిల్లా బోర్డులు వచ్చిన తర్వాత మ్యూనిసిపాలిటీ గల పురములలోని ప్రాథమిక విద్య మ్యూనిసిపాలిటీల వారున్ను తక్కిన స్థలములలోనున్న ప్రాథమిక విద్య బోర్డులవారున్ను నిర్వహించ వలసినదన్న పద్ధతి ఏర్పడినది. ప్రతి మ్యూనిసిపాలిటీ పురమందున్ను ప్రాథమిక పాఠశాలలు కలవు. జిల్లాలలో 2000 కు మించిన జనసంఖ్యగల ప్రతి గ్రామ మందున్ను (ఎక్కడో కొద్ది గ్రామాలలో తప్ప) ప్రాథమిక పాఠశాలలు గలవు. 2000 కు తక్కువ జనసంఖ్యగల గ్రామాలలో మాత్రము కొన్ని గ్రామాలలో ఒక్కబడి యైనా లేదు. ప్రతి జిల్లాలలోను ప్రాథమిక పాఠశాలలకు పోయే పిల్లలు మగవారిలో నూటికెందరు పిల్లలు, ఆడవారిలో నూటికెందరు పిల్లలు గలరో ఈ క్రింది పట్టిక తెలియజేయును.

| జిల్లా | మగవారిలోనూటికి | ఆడవారిలోనూటికి |
|---|---|---|
| విశాఖపట్టణం | 8.0 | 3.4 |
| తూర్పు గోదావరి | 9.8 | 6.9 |
| పశ్చిమ గోదావరి | 9.7 | 7.0 |
| కృష్ణా | 9.5 | 7.4 |
| గుంటూరు | 10.2 | 6.2 |
| నెల్లూరు | 7.6 | 4.2 |
| కడప | 8.3 | 3.4 |
| కర్నూలు | 9.2 | 4.1 |
| బళ్లారి | 6.8 | 2.7 |
| అనంతపురం | 7.0 | 2.9 |
| చిత్తూరు | 6.8 | 3.0 |

ప్రభుత్వ విద్యాశాఖానివేదిక (1940-41) ననుసరించి.

**ఉన్నత విద్యా పరిణామము**

ఉన్నత విద్య (అనగా సెకండరీ విద్య) ఆంగ్లేయ ప్రభుత్వము దేశములో వ్యాపించిన తర్వాతనే ప్రారంభించినది. మిషనరీలు, జమీందారులు, భాగ్యవంతులు, మ్యూనిసిపాలిటీలు, జిల్లా బోర్డులు, ప్రభుత్వమువారు ఉన్నత విద్యాలయములను నెలకొల్పినవారు. ఇవి అంతకంతకు ప్రతి జిల్లాలోను అధికమగుతూ ఉన్నవి. సుమారు 30 సంవత్సరముల క్రిందటి వరకు



శ్రీ డి. సదాశివరెడ్డి, ఎమ్. ఏ., (ఆక్సన్) ఎమ్. బి. ఐ., మదరాసు ప్రభుత్వ విద్యాశాఖ డిప్యూటీ డైరక్టరు.

మొదటి ఫారమ్ నుండి సెకండరీ స్కూళ్లలో నేర్పే విషయములన్నీ, ఒక్క మాతృభాషకాక తక్కిన వన్నీ, ఆంగ్లభాషలోనే నేర్పుతూ వచ్చిరి. అట్లు చేయుటవల్ల ఆంగ్లభాషా జ్ఞానము అలవడుటకు సాధన మేర్పడినదేకాని విషయము గ్రహించుటకు పరభాష ఎక్కువగా ప్రతికూలమయినది. అదిగాక మాతృభాషా జ్ఞానము తగ్గిపోయినది. నేర్చుకొన్న కొద్దిపాటు విషయమైనా విద్యార్థులు తమ మాతృభాషలో చెప్పలేక పోయిరి. ఆంగ్లభాషలో నైనను నిర్దుష్టముగా చెప్పలేక పోయిరి. మాతృభాషలో బోధించిన యెడల ఎక్కువ విషయములు తక్కువ కాలములో విద్యార్థులు గ్రహింప గలుగుదురనిన్ని, గ్రహించినది తమ సొంత భాషలలో స్పష్టముగా తెలియజేయ గలుగుదురనిన్ని గ్రహించి మాతృభాష ద్వారా సెంకడరీ బడులలోని విద్య సాగవలెనన్న నియమము విద్యార్థికుల ప్రోత్సాహమున ప్రభుత్వము వారేర్పరచిరి. ఈ నియమము మొదట మూడు ఫారముల వరకు విధిగాను, 4, 5, 6 వ ఫారములలో ఐచ్ఛికముగాను సాగుతున్నది. కాలేజీ తరగతులలో ఇది ఇంకా ప్రవేశింపకుండుటచేత స్కూల్ ఫైనల్ దాటిన విద్యార్థి ఆంగ్లభాషలో విషయములు చదివి యుండని యెడల ఒక్కసారిగా కాలేజీలో నేర్చు కోవలసిన విషయములు ఆంగ్లభాషలో నేర్చుకొనలేడని ఇంకా కొందరు 4, 5, 6 వ ఫారములలో ఆంగ్లభాషలోనే విషయములు బోధిస్తున్నారు. ప్రాథమిక విద్యాలయములలోని 6, 7, 8 స్టాండర్డులలో చెప్పే చదువున్ను సెంకడరీ విద్యాలయములలోని మొదట మూడు ఫారములలో చెప్పే చదువున్ను ఇంచుమించుగా ఒకటే; గాని మొదటి వాటిలోని విద్యార్థులు ఆంగ్లభాష ఐచ్ఛికముగాను, రెండవ వాటిలోని విద్యార్థులు నిర్బంధముగాను ఆంగ్లభాష నేర్చుకొందురు. కొంత కాలము క్రిందటి వరకున్ను మిడిల్ స్కూల్ పరీక్ష అను పేరను కొన్నాళ్లు, లోవర్ సెకండరీ పరీక్ష అను పేరను కొన్నాళ్లు ప్రభుత్వమువారు సాగిస్తూ వచ్చిరి. కొన్నికొన్ని విషయములు ఎక్కడివారు అక్కడి పరిస్థితులను బట్టి నేర్చుకోవలసి ఉంటవని గ్రహించి, ఆ పరీక్షలు జేసి ఫలితములు చెప్పే అధికారము ప్రాథమిక విద్యాలయ విషయములో స్కూళ్లు తనిఖీచేసే అధికారులకే విడిచి పెట్టినారు. సెకండరీ స్కూళ్లలో ఈ పరీక్షలు ప్రధానోపాధ్యాయులే చేస్తూఉందురు. ఆపని వారు సరిగా చేస్తున్నారో లేదో జిల్లా విద్యాధికారులు తెలుసుకొంటూఉందురు.

సెకండరీ స్కూళ్ల విద్య మన తెలుగు జిల్లాలలో ఎట్లున్నదో ఈ క్రిందనున్న పట్టికను చూచి తెలుసుకో వచ్చును.

సెకండరీ తరగతి విద్య

| జిల్లా | మగవారిలో పదివేల మందికి | ఆడువారిలో పదివేల మందికి |
|---|---|---|
| విశాఖ పట్టణం | 61 | 4 |
| తూర్పు గోదావరి | 150 | 18 |
| పశ్చిమ గోదావరి | 118 | 10.5 |
| కృష్ణా | 138 | 17 |
| గుంటూరు | 95 | 10.8 |
| నెల్లూరు | 66 | 11 |
| కడప | 47 | 7 |
| కర్నూలు | 72 | 8 |
| బళ్లారి | 80 | 7 |
| అనంతపురం | 53 | 6 |
| చిత్తూరు | 57 | 9 |

ప్రభుత్వ విద్యాశాఖానివేదిక (1940-41 ననుసరించి)



డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య, ఎమ్. ఏ., పి. ఎచ్. డి., మద్రాసు విశ్వవిద్యాలయ చారిత్రకాధ్యాపకులు.

స్కూల్ ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణులయిన విద్యార్థులలో చాలామంది చదువు చాలించి ఉద్యోగములు చూచు కుంటున్నారు ; కొందరు ప్రత్యేక వృత్తివిద్యల నభ్యసిస్తున్నారు. కడు కొద్దిమంది మాత్రమే సర్వకళాశాలలలో (అనగా కాలేజీలలో) ప్రవేశించి ఆంధ్ర విశ్వ కళాపరిషత్తువారి పరీక్షలకు చదువుతున్నారు.

### ఆంధ్ర విశ్వ కళాపరిషత్

ఆంధ్ర రాష్ట్రముతోపాటు ఆంధ్రవిద్యార్థుల కోసము ప్రత్యేక మొక విశ్వ విద్యాలయము కావలెనన్న అలజడి ఆంధ్రులలో పుట్టి ఆంధ్ర నాయకులకృషిఫలితముగా-ఆంధ్ర రాష్ట్రమింకా ఏర్పడకపోయినా-విశ్వవిద్యాలయము మాత్రము 1926 లో వచ్చినది. దీనికే ఆంధ్ర విశ్వ కళా పరిషత్తని పేరు. దీని కార్యాలయము మొదట బెజవాడలో ఏర్పరచిరి. శీతోష్ణపరిస్థితు లాలోచించి విశాఖపట్టణముజిల్లాలో సముద్రతీరమున వాల్తేరుకు 1930 లో దీని నిలయము మార్చి, దీనికి సంబంధించిన సర్వకళాశాలలు సైతము అక్కడనే నిర్మించిరి. ఈ విశ్వ విద్యాలయ మేర్పడినా తెలుగు జిల్లాలలోని ఆంధ్రయువకులు కొందరు చెన్నపురి సర్వ కళాశాలలలో చదివి చెన్నపురి విశ్వ విద్యాలయ పరీక్షలకు వెళ్ళుచున్నారు.

1926 లో ఈ విశ్వ కళాపరిషత్తు స్థాపింపబడినప్పుడు చెన్నపురి రాజధాని గవర్నరు గోస్చెన్ ప్రభువు చాన్సలరుగాను, సి. ఆర్. రెడ్డిగారు వైస్ చాన్సలరుగాను, సి. డి. చెట్టిగారు రెజిస్ట్రారుగాను నియమితులయిరి. చెన్నపురి రాష్ట్ర మందలి విశ్వ విద్యాలయము లన్నిటికి గవర్నరుగా ఉన్న వారే చాన్సలరు పదవి నుండవలెనన్న నియమము ననుసరించి గోస్చెన్ ప్రభువు తర్వాత, సర్ జార్జ్ స్టాన్లి, పిమ్మట ఎర్ స్కైన్ ప్రభువు, తర్వాత ఇప్పుడు సర్ ఆర్థర్ హోప్‌గార్లు ఈ సంస్థకు చాన్సలర్లు. 1931 లో సి. ఆర్. రెడ్డిగారు రాజీనామా ఇచ్చిన తర్వాత సర్ ఎస్. రాధాకృష్ణగారున్ను, 1936 లో వారు రాజీనామా ఇచ్చిన తర్వాత మరల సి. ఆర్. రెడ్డిగారున్ను వైస్ చాన్సలర్లయినారు. వీరినే ఇప్పుడు మరల ఆపదవిలో నుంచడమయినది. సి. డి. చెట్టిగారి తర్వాత కృష్ణగారు 1936 లో రెజిస్ట్రారుగా నియమితులయిరి. ఇప్పుడు కూర్మా గోపాలస్వామి నాయుడుగారు రెజిస్ట్రారయినారు. ఈ సంస్థ ప్రారంభించినప్పుడు బొబ్బిలి రాజావారు ప్రోచాన్సలరుగా ఉండేవారు. పిమ్మట నుండిన్ని జయపుర మహారాజావారినే ప్రోచాన్సలరుగా నియమిస్తూ ఉన్నారు. ప్రారంభములో ప్రతిభ లేక ఏదోపేరికి మాత్రమే ప్రత్యేక సంస్థగాఉన్న ఈ ఆంధ్ర విశ్వ కళాపరిషత్తుకు శోభ, తేజస్సు, ప్రతిభ, ప్రతిష్ఠ జయపుర మహారాజుగారి



డాక్టర్ సర్ సర్వేపల్లి రాధాకృష్ణ, కాశీ హిందూ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్ వెనుకటి ఉపాధ్యక్షులు, సుప్రసిద్ధ తత్త్వవేత్త.

సంస్థగా వెలసినది. అందుకు సర్ జార్జ్ స్టాన్లీగారు చాన్సలరుగా ఉన్నప్పుడు 27 లక్షలు ఒక్కసారిగా సంస్థ కర్చుల నిమిత్తమున్ను, భవనముల నిర్మాణము కోసము 7½ లక్షలున్ను, ప్రతి సంవత్సరము కర్చుల నిమిత్తము 1½ లక్షలున్ను ప్రభుత్వమువారి విరాళము గావచ్చెను. జయపుర మహారాజావారు సంవత్సరమునకు లక్ష రూపాయల విరాళము గాని ఒక్కసారిగా 15 లక్షల రూపాయలుగాని ఇచ్చుటకు వాగ్దానము చేసిరి. దాని ప్రకారమైన భూరిదానముతో కలిగెనని చెప్పవలెను. మునుపటివలె కేవలము పరీక్షలు చేసే సంస్థ మాత్రమే కాక ఈ సంస్థ సర్వకళా విద్యాలయముపనిసైతము పూనుకొని ప్రాచీనకాలపు గురుశిష్య సన్నివేశ సంప్రదాయములను, గురుకుల సంస్థల సంప్రదాయమున్ను నూతన పరిస్థితుల కనుకూలమగునట్లు పునరుద్ధరింపజేసే



డాక్టరు సర్ కూర్మా వెంకట రెడ్డి నాయుడు, అన్నామలై విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు.

# విశ్వవిద్యాలయోపాధ్యక్షులు

........................................

శ్రీ భవానీశంకరనియోగి అనువారు నాగపూర్ విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగనున్న ఆంధ్రులు.



కీ. శే. డాక్టరు సర్ రఘుపతి వెంకటరత్నంనాయుడు, మద్రాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగాను కాకినాడ పి. ఆర్. కాలేజి ప్రిన్సిపాల్‌గాను పనిచేసిన ప్రముఖ విద్యావేత్తలు.



డాక్టరు సర్ కట్టమంచి రామలింగారెడ్డి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ ఉపాధ్యక్షులు.

రము ఇన్ని సంవత్సరముల నుండిన్ని మహారాజావారు ఇచ్చుచున్న విరాళములు ఈ సంస్థ కెంతో ఉపచరిస్తూ ఉన్నవి. వృత్తి విద్యలు (సైన్స అండ్ టెక్నాలజీ) విద్యలు బోధించుటకుగాను ప్రత్యేక శాఖలు ఈ సంస్థలో నిర్మించి పనిచేయుటకు ప్రభుత్వము వారున్ను జయపుర మహారాజావారున్ను ఎక్కువగా తోడుపడిరి. ప్రాక్పాశ్చాత్య విజ్ఞాన నిధులయిన రెడ్డిగారి యాజమాన్యమున పది సంవత్సరములును, (1926-31, 36-42) ఆధ్యాత్మిక విద్యా ప్రవీణులని పాశ్చాత్య దేశములందునూ

విఖ్యాతిపొందిన సర్ సర్వేపల్లి రాధాకృష్ణగారి యాజమాన్యమున అయిదు సంవత్సరములున్ను (1931-36) పనిచేసి ఈ సంస్థ అనేక విషయములలో వృద్ధి పొందినది. విశాఖపట్టణమున 1926 లో స్థాపించబడిన వైద్య కళాశాల (మెడికల్ కాలేజి) ఈ సంస్థలోచేరి ఆంధ్ర వైద్య కళాశాలగా మారుట గొప్ప విషయము. ఈ కళాశాలలో ఉత్తీర్ణులయినవారి పదవులు(డిగ్రీలు) ఇతర విశ్వ విద్యాలయములవారున్ను, ప్రభుత్వములవారున్ను కొంతకాలము సరిగా మన్నింపకుండిరి. అందుకు ఆంధ్ర నాయకులున్ను ఈ సంస్థవారున్ను తీవ్రముగా అలజడి కలిగించి పనిచేసి కృతార్థులయిరి.

ఇంకా ఈ సంస్థ శాఖోపశాఖలుగా పెరిగి ఆంధ్ర దేశమందలి జనసామాన్యమునకు సైతము ఉపచరించునట్లు చేయవలెనని రెడ్డిగారు ప్రయత్నించి, అందుకు తగిన ప్రణాళిక తయారు చేయవలెనని కోరినప్పుడు, బాపినీడుగారు ఒక ప్రణాళికను ప్రదర్శించినారు. దాని ననుసరించి విజ్ఞాన వ్యాపకోపన్యాసములు (ఎక్స్టెన్షన్ లెక్చర్లు) వివిధ స్థలములలో విద్యాధికులచేత ఇప్పించే పద్ధతి అమలులోనికి వచ్చినది. సర్వకళాశాలలలో సైతము విద్య ఆంధ్రభాషనే బోధించవలెనన్న ఆదర్శము ననుసరించి ప్రారంభములో ఇంటర్మీడియేట్ పరీక్షలకు సంబంధించిన పాఠ్య గ్రంథములు విశ్వ కళా పరిషత్తువారు వ్రాయించవలెనన్న సలహా సైతము బాపినీడుగారు చేసిరి. దాని ననుసరించి పరిషత్తువారు కొన్ని ఉపసంఘములను ఏర్పరచిరి. ఎవరెవరి చేతను ఏయే విషయములకు సంబంధించిన గ్రంథములు వ్రాయించవలెనో నిర్ణయించడము సైతము జరిగినది. గాని కొద్ది కాలములోనే ఈ ఉద్యమము కొన్ని కారణములవల్ల విరమించుకో వలసివచ్చినది.

ఈ విశ్వ కళా పరిషత్తువారు గత ఆరుసంవత్సరములలోను గావించిన పని చాలా ప్రశంసనీయమయినది. జయపుర మహారాజావారి భూరి విరాళ సాహాయ్యమున స్థాపించిన నూతన సర్వ కళాశాల శాస్త్రవిద్యలకును వృత్తి కళలకును సంబంధించినది. దాని పేరు మహారాజావారి పేరుతో జోడించి, జయపుర విక్రమదేవ శాస్త్ర వృత్తివిద్యా కళాశాల (జయపూర్ విక్రమదేవ కాలేజ్ ఆఫ్ సయన్సు అండ్ టెక్నాలజీ) అని పెట్టిరి. ఈ కళాశాల భవనమునకు ఎదురుగా వారి శిలా విగ్రహము 1938 లో నిల బెట్టినారు. ఈ పరిషత్తువారి సర్వకళాశాలలలో గణితము, ఆధ్యాత్మిక విద్య, చరిత్ర, అర్థశాస్త్రము, తెలుగు, వాణిజ్యము అను విషయములకు సంబంధించిన విద్య అత్యుత్తమ (ఆనర్సు) శ్రేణి వరకును గలదు. ఉత్తమ శ్రేణి విద్య అనగా బి. ఏ. శ్రేణి విద్య, వాణిజ్యము, గణితము, ఆధ్యాత్మిక విద్య, చరిత్ర, అర్థ శాస్త్రము అను విషయములకు సంబంధించి యున్నది. ఇదిగాక జయపుర మహారాజావారి పేరనున్న సర్వ కళాశాలలో అత్యుత్తమ విద్య పదార్థవిజ్ఞాన శాస్త్రమందును, రసాయన శాస్త్రమందును; చక్కెర పరిశ్రమకు, వృత్తి విద్యకు, వైద్యమునకున్ను సంబంధముగల రసాయన శాస్త్ర పరిశోధనలును బోధించి, శాస్త్ర వేత్తలను ఉదయింపజేస్తున్నారు. పింగాణీ, గ్లాసు పరిశ్రమలకు సంబంధించిన పరిశోధనలు జరుగుచున్నవి. ఇవి ఆంధ్రుల ఆర్థికాభివృద్ధికి ఎక్కువగా తోడుపడును.



డాక్టరు కె. లక్ష్మణరావు, ఎమ్.ఎస్‌సి., పిహెచ్.డి., గిండీ ఇంజనీరింగ్ కాలేజీలో అధ్యాపకులుగా నుండిరి. సిమెంటు కాంక్రీటు భవనములు కట్టుటలో నిపుణులు. ప్రస్తుతము బర్మింగ్‌హామ్ విశ్వవిద్యాలయములో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా నున్నారు.

వీరి భార్య శ్రీమతి కె. వరలక్ష్మి, లండన్‌లో సోషల్ సర్వీసు డిప్లమా పొందిరి.

ప్రకృతి-జీవ శాస్త్రములు సైతము నేర్పించవలెనన్న ఉద్దేశముతో ఎర్‌స్కైన్ ప్రభువు ప్రోత్సహింపగా, అందుకుగాను 1939 లో ప్రభుత్వ విరాళము ప్రత్యేకముగా ఏర్పడినది. దానితో ఎర్‌స్కైన్ ప్రభువు పేరు జోడించి ప్రకృతి శాస్త్ర కళాశాల (ఎర్‌స్కైన్ కాలేజ్ ఆఫ్ నాచురల్ సయన్సు) 1941 లో స్థాపించబడినది.

రెడ్డిగారి ప్రయత్నములవల్లనే నైజాం సంస్థానాధీశులున్ను, తిరువాన్కూరు మహారాణిగారున్ను చెరియొక లక్షరూపాయల విరాళమున్ను ఇచ్చిరి. నెల్లూరి నివాసులును ధనవంతులును అయిన తిక్కవరపు రామిరెడ్డి గారున్ను, వారి కుమార్తె లిరువురును సభామందిర నిర్మాణమునకు రూ 25,000 లిచ్చిరి. వారి పేరను ఆ సభా నిర్మాణము జరిగినది. జిల్లా బోర్డులు, మ్యూనిసిపాలిటీలు, సర్ అల్లాడి కృష్ణస్వామి, సర్ సి. ఆర్. రెడ్డి మొదలయిన ఉదారులు ఈ సంస్థకు విరాళముల నిచ్చుచుండుటచేత అనేక పనులు జరుగుచున్నవి. విద్యార్థికులు పరిశోధనలు చేస్తున్నారు.

ఈ సంస్థతో చేరిన సర్వ కళాశాలలు :—

అ. ఆంగ్లవిద్య కళాశాలలు.

(1) బరంపురం కల్లికోట కాలేజి
(2) పర్లాకిమిడి మహారాజావారి కాలేజి
(3) విజయనగరము మహారాజావారి కాలేజి
(4) విశాఖపట్టణము మిసెస్. ఏ. వి. ఎన్. కాలేజి
(5) కాకినాడ పిఠాపురంరాజావారి కాలేజి
(6) రాజమహేంద్రవరం గవర్నమెంటు కాలేజి
(7) ,, ట్రయినింగు కాలేజి
(8) బెజవాడ శ్రీరాజా రంగయప్పారావు కాలేజి
(9) బందరు హిందూ కాలేజి

(10) గుంటూరు హిందూ కాలేజి

(11) ,, ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి

(12) నెల్లూరు వేంకటగిరి రాజావారి కాలేజి

(13) అనంతపురం గవర్నమెంటు కాలేజి: ఇది మొదట కొన్నాళ్లు ఈ సంస్థలో ఉండి చెన్నపురి విశ్వ విద్యాలయమున చేరినది.

(14) మదనపల్లి దివ్యజ్ఞాన కళాశాల

ఆ. ఆంధ్ర గీర్వాణ కళాశాలలు.

(1) పర్లాకిమిడి మహారాజావారి సంస్కృత కళాశాల

(2) విజయనగరం మహారాజావారి సంస్కృత కళాశాల

(3) రాజమహేంద్రవరం వైశ్య సేవాసదనం

(4) జె. వెం. స్వామి సంస్కృతోన్నత పాఠశాల, రాజమహేంద్రవరం

(5) కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠం

(6) చిట్టిగూడెము సంస్కృత కళాశాల

(7) తెనాలి ,, ,,

(8) అమృతలూరు ,, ,,

(9) నెల్లూరు సంస్కృత పాఠశాల

ఇ. ఇతర కళాశాలలు.

ఆంధ్ర వైద్య కళాశాల (మెడికల్ కాలేజి) విశాఖపట్టణము.

ఇంకా న్యాయము (లా), వ్యవసాయము (అగ్రికల్చర్), శిల్పము (ఇంజనీరింగ్) విషయములకు సంబంధించిన సర్వ కళాశాలలు స్థాపించలేదు. అందుకు తగిన ప్రయత్నములు జరుగుచున్నవి.

ఈ విశ్వ కళాపరిషత్తులో చక్కని గ్రంథాలయము కలదు. పరిషత్తువారు కొన్ని గ్రంథములను విద్యాధికులచేత వ్రాయించి ప్రకటించినారు. ఆంధ్రుల చరిత్ర వ్రాయించుటకు సరియైన ప్రయత్నములు జరుగలేదు. ఆంధ్ర నిఘంటు నిర్మాణము కావలసియున్నది. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము—శ్రీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు మొదలు పెట్టినది—పూర్తి చేయవలసియున్నది.

ఈ సంస్థలో విద్య నభ్యసించి, శాస్త్ర పరిశోధకులుగా పనిచేసి ఇతర స్థలములందున్న ప్రఖ్యాతి వహించినవారు, డాక్టరు రంగధామ రామకృష్ణారావు గారు, గోపాలరావు గారు, వేంకటగిరి రావుగారు మొదలయినవారు గలరు. సర్ సి. వి. రామన్‌గారి శిష్యులును, గొప్ప శాస్త్ర పరిశోధకులును అయిన ప్రొఫెసర్ సూరి భగవంతంగారు పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్తలయి జగద్విఖ్యాతి పొందిరి. వీరిప్పుడు ఈ సంస్థలోగల సర్వకళాశాలకు ప్రిన్సిపాల్‌గా నున్నారు.

* ముద్రాకల్పనాసాంకేతికార్థము

"సూర్యుడు విశ్వకళాపరిషత్తు. సూర్యకిరణము లేడు బంధములుగా ఏర్పడి వెలువడు చున్నవి. ఏడు పవిత్రమైన సంఖ్య. పద్మముదయిస్తూ ఉన్న సరోవరము ఆంధ్రదేశము. అందు నైజాంపరగణాలలోని తెలింగానదేశము సైతము చేరియున్నది. సూర్యోదయముతో పద్మము వికసిస్తున్నది. సూర్యకిరణములను దాటుతూ స్వస్తిక ప్రకాశిస్తున్నది; ఆర్య సంతతికి ప్రాచీనతమమైన సకలమాంగళిక




ఆంధ్ర విశ్వ కళా పరిషన్ముకుట ముద్రిక

* విశ్వకళాపరిషత్తువారి నిర్వచన మనుసరించి.


డాక్టరు కొలిచర్ల సీతారామయ్య, వుయ్యూరు వాస్తవ్యులు, ప్రస్తుతము రష్యాలో ప్రముఖ శాస్త్రజ్ఞ పదవియం దున్నారు.

చిహ్నము. వీటికి వెలువల పద్మ దళముల వలయ మొకటి ఉన్నది. ముద్రాకల్పనలో పద్మమునకు ప్రయోజన మున్నది. 64 దళములున్న 64 (చతుష్షష్టి) కళలను సూచించును. సంస్కృత వాఙ్మయమందు గల విజ్ఞాన మంతా ఈ 64 కళలందును నిక్షిప్తమై యున్నట్లు వర్గీకరణము చేసి యున్నారు.

సకలమాంగళిక చిహ్నమైన స్వస్తిక గుండా ప్రసరిస్తూ ఉన్న తేజస్సు, మనకు ఆదర్శవాక్యమై యున్న "తేజస్వి నావధితమస్తు" అనే వేద వాక్యముపై బడుతున్నది. "మా అధ్యయన విషయములపై వెలుగు పడుగాక" అని దీనికి అర్థము. ఈ ప్రార్థన మనఒక్క మతమునకు మాత్రమే విశిష్టమైనది కాదు; అన్ని మతముల వారున్న చేయదగినది.

దీని దిగువను నెలవంక గలదు. ఈ నెల వంకకు సంస్కృతములో చంద్రకళ అందురు. కళ అనగా శాస్త్రము; అంతకంటె ఎక్కువగా, శాస్త్రజ్ఞానమును వినియోగిస్తూ నిపుణతతో జేసే పని. ఈ విద్యాసంస్థకు ఆంధ్ర విశ్వకళా పరిషత్తు అనిపేరు.

ముకుటమున్న, చంద్రుడున్న ఈ సంస్థలో ముసల్మానులకుగల అభిమానమును సైతము సూచించును.

పద్మదళములను ఆస్వాదిస్తూ రెండు సర్పములు కలవు. సర్పమునకు సంస్కృతభాషలో నాగమని సైతము అందురు గదా! ఆధునిక పరిశోధనలను బట్టి సంస్కృత వాఙ్మయమందు పేర్కొనబడిన ప్రాచీన నాగ వంశమువారు ఆంధ్రులే అని తేలినది. మన పూర్వుల నెందుకు నాగు లనిరో స్పష్టముగా తెలియదు. మన పూర్వులు నాగులను పూజించు చుండుటచేతనో, నాగమును యుద్ధమందు కేతనముగా పెట్టుకొనుటచేతనో ఈ పేరు వచ్చియుండును. మహాభారతమందు నాగుల ప్రసక్తి కలదు."

### సంస్కృత విద్యాలయములు, సర్వ కళాశాలలు

ప్రాచీన సంప్రదాయముల ననుసరించి సంస్కృత విద్యను బోధించే విద్యాలయములున్న సర్వ కళాశాలలున్న మన దేశములో ఇంకను కొన్ని చోట్ల గలవు. ప్రభుత్వమువారి సహాయము పొందినవి ప్రభుత్వమువారి నిబంధనలను అనుసరించిన్ని, విశ్వ విద్యాలయమువారి దత్తతను పొందినవి విశ్వవిద్యాలయము వారు విధించిన ప్రణాళికను అనుసరించిన్ని పని చేస్తూన్నవి.

### తిరుపతి దేవస్థానమువారి ఆంధ్ర గీర్వాణ విద్యాలయము

ఇది చెన్నపురి విశ్వ విద్యాలయములో చేరి యున్నా, తిరుపతి చిత్తూరు జిల్లాలో ఉన్నది గనుక, మన ఆంధ్రదేశమందలి విద్యాలయముగా పేర్కొన దగినది. ఈ విద్యాలయమునకు శ్రీ వేంకటేశ్వర సంస్కృత సర్వకళాశాల (కాలేజి) యనిన్ని, వేదపాఠశాల అనిన్ని పేళ్లు. కళాశాలలో విద్యార్థులచేత పరీక్షలకు చదివిం

చుకొకాక పరిశోధనలు చేయించి అపూర్వమైన వ్యాసములు వ్రాయించుచున్నారు.

సంస్కృత విద్యాలయములు మన తెలుగు దేశములో ఏజిల్లాలో ఎన్నిగలవో అందలి బాల బాలికల సంఖ్య ఎంతగలదో ఈ పట్టికలో తెలియజేస్తున్నాము.

| జిల్లా | విద్యాలయముల సంఖ్య | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|
| విశాఖ పట్టణం | 7 | 281 |
| తూర్పు గోదావరి | 6* | 314 |
| పశ్చిమ గోదావరి | 1 | 18 |
| కృష్ణా | 2 | 51 |
| గుంటూరు | 3§ | 123 |
| నెల్లూరు | 1 | 57 |
| కడప | — | — |
| కర్నూలు | — | — |
| బళ్లారి | 1 | 23 |
| అనంతపురం | — | — |
| చిత్తూరు | 2 | 149 |

ప్రభుత్వ విద్యాశాఖానివేదిక 1940-41 పు. 72

*ఇందులో 2 బాలికల బడులు; అందు 207 బాలికలు

§ఇందులో 1 బాలికలబడి; అందు 50 బాలికలు.

మలబారు, దక్షిణ కన్నడ జిల్లాలలో 17; 15 విద్యాలయములున్ను 1496; 1137 బాలబాలికలున్ను గలరు. ఇంత ఎక్కువగా రాష్ట్రములో మరి ఎక్కడను కనబడదు.

### జాతీయ విద్యాలయములు

1905 లో వందేమాతర మనుపేర నుదయించిన అలజడి వంగ దేశములో పుట్టి దేశమంతటను వ్యాపించినప్పుడు మన ఆంధ్రులు సైతము ఉద్రేకపూరితులయి ఆంగ్లేయ ప్రభుత్వమువారు స్థాపించిన విద్యాలయములలోని విద్య, దేశాభిమానమునకున్ను జాతీయ వికాసమునకున్ను దేశాభివృద్ధికిన్ని ప్రతికూలముగా నున్నదని గ్రహించి, జాతీయకళలను జాతీయ విద్యలను పోషింపదగిన విద్యాలయములను నెలకొల్పుటకై ప్రయత్నించిరి. ఆ విద్యాలయములలో నేర్పే విద్యలు తెలుగు భాషనే నేర్పవలెనన్న ఆశయము సైతము ఆనాడే పుట్టినది. అప్పుడు వెలసిన జాతీయ విద్యా సంస్థలలో, మచిలీపట్టణమందు 1910 లో స్థాపించిన ఆంధ్ర జాతీయ కళాశాల నేటికిని చెక్కుచెదరక ఎప్పటికప్పుడు నూతన జీవన వికాసములతో విలసిల్లుతూ నిలిచి యున్నది. కీ. శే. కోపల్లె హనుమంతరావు గారు తమ జీవితము ఈ సంస్థాభివృద్ధికి కైంకర్యము చేసినారు. వారున్ను, వారి మిత్రులు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు మొదలయినవారున్ను చేసిన కృషివల్ల ద్రవ్య సహాయం, ఆదరము, హెచ్చరిక దేశములో నలుదెసలనుండిన్ని వస్తూఉండేది. ఒక పెద్ద ఆవరణలో కళాశాలకు కావలసిన భవనములు, పెద్ద యంత్రాగారము, గురు శిష్యులకు కావలసిన వసతి గృహములు నిర్మించిరి. వేలకొలది గ్రంథములు సేకరించి పెద్ద గ్రంథాలయము సైతము నిలిపిరి. మచిలీపట్టణమునకు వచ్చిన యాత్రికులకు ఇది యొక చూడదగిన సంస్థగా నుండెను. దేశచరిత్ర, దేశవిద్యలు, లలితకళలు నేర్పుటకు మొదలు పెట్టిరి. జాత్యున్నతికి యంత్రము ముఖ్యమని యెంచే ఆ దినములలో ఈ కళాశాలలో యంత్రములు పెట్టించి యంత్ర విద్యతోపాటు వడ్రంగము, పేమునేత మొదలయిన చేతిపనులున్ను, కలంకారీ తివాసీల పరిశ్రమలున్ను సాగించిరి.

1920 లో దేశమందలి రాజకీయ వాతావరణమందు గాంధీజీ ఉదయింపగానే జాతీయ విద్యావిధానము కొత్త రూపమును దాల్చినది. యంత్రాగారముల కంటె గృహ పరిశ్రమలే దేశాభ్యున్నతికి ఎక్కువమేలయిన సాధనములని కాంగ్రెస్

ఆదేశించినది. అప్పటి నుండిన్ని ఈ కళాశాల రాట్నమునకున్ను, ఖద్దరునకున్ను అగ్రస్థాన మిచ్చినది. జాతీయైక్యతకు ఎక్కువగా తోడు పడగల భాష అనే ఆశయముతో హిందీ భాష నేర్పుటకు మొదలు పెట్టినది. సాహిత్యశాఖ, ఐతిహాసికశాఖ, చిత్రకళాశాఖ మొదలగు విద్యా శాఖలు నూతనాదర్శములతో పనిచేయుటకు ప్రారంభించినవి. ఈ కళాశాలలో గురుకుల వాసంచేసిన వారికి క్రొత్త దృష్టి, క్రొత్త వికాసం, క్రొత్త బలము, ఓజస్సు కలిగినవని చెప్పుటకు సందియము లేదు.

1930 నుండిన్ని ఈ కళాశాలకు క్రొత్త దశ ప్రారంభించినది. ఆనాటికి నూతనాశయములు దేశమంతటను వ్యాపించినవి. దేశస్వాతంత్ర్యము కోసము, ఆంధ్రరాష్ట్ర నిర్మాణము కోసము, దేశ పరిశ్రమల అభ్యున్నతి కోసము, హరిజనుల ఉద్ధరణ కోసము దేశస్థులు నడుము బిగించి కార్య రంగములోనికి దిగుతూఉన్న ఆ దినము లలో, యంత్రాలయమును ఇంజనీరింగు శాఖను నడుపుభారము బందరు మ్యూనిసిపాలిటీ భుజము లపై మోపి, గ్రామ సీమలను పునరుద్ధరింప వలెనన్న సంకల్పముతో ఈ కళాశాల, 1932 నుండి 5 ఏండ్లు గ్రామ సేవకులుగా పనిచేయు టకు కావలసిన శిక్షణగఱపినది. వినయ వివేక ములు, సేవాతత్పరత, త్యాగశీలముగల యువ కులు గృహ పరిశ్రమలు, దేశ విద్యలు, నూతన విజ్ఞానము ఈ కళాశాలలో నేర్చుకొని గ్రామ, సీమలకు ఆచార్యులుగాను సేవకులుగాను పనిచేయుటకు పోవుచుండిరి.

1937లో రాష్ట్ర ప్రభుత్వము కాంగ్రెస్ వారి చేతికి రాగానే గాంధిజీ వార్ధాలో నూతన



డాక్టరు బి. వి. నారాయణస్వామి నాయుడు. మద్రాసు పచ్చయప్ప కాలేజి ప్రిన్సిపాల్.

విద్యా విధానమును నిర్మించి పనిచేయుట ప్రారంభమైనది. అట్టిపని అదివరకే సాగిస్తూ ఉన్న ఈకళాశాల ఇనుమడించిన ఉత్సాహముతో వార్ధా విద్యా విధానమును అవలంబించి కృషి చేస్తున్నది. అదివరకు ప్రతికూలముగా నుండిన ప్రభుత్వము ఆదరించి ఈ సంస్థకు సాహాయ్యము చేయుటకు సైతము ప్రారంభించినది. గాని 1940 లో కాంగ్రెస్‌వారు ప్రభుత్వరథమునుండి దిగి పోవుటవల్ల ఈ సాహాయ్యము తప్పిపోయినది. స్థానిక సంస్థలు సైతము దీని యెడల తమకుండిన ఆదరమును పోనిచ్చుటయేకాక అనాదరమును సైతము ప్రకటించిరి. అయినను ఆత్మ ప్రత్యయ మున్ను, ధైర్యోత్సాహములున్ను పోగొట్టుకొనక ఈ సంస్థ దేశసేవ చేస్తూన్నది. సంవత్సరము నకు ఆరువేలకుపైగా ఆదాయం రాదగిన భూవ సతితో సర్వ లక్షణ సంపన్నమైయున్న ఈ సంస్థకు దేశాభిమాను లందరును తోడపడగ

లరసిన్ని, శుభదినములు రాగలవసిన్ని ఆశీస్తున్నాము.

ఈ ఆంధ్ర జాతీయ కళాశాల పుట్టిన కొద్ది కాలమునకే రాజమహేంద్రవరములో ఒక జాతీయ పాఠశాల వెలసినది. కొద్ది కాలము మాత్రమే చక్కగా పనిచేసి కొంతకాలము ఆగిపోయినది. 1920 లో రాజకీయ వాతావరణమందు గాంధీశకము ప్రారంభించినతోడనే ఈ పాఠశాల మరల వృద్ధిలోనికి వచ్చి, వృత్తి విద్యలు నేర్పు జాతీయ కళాశాలగా నున్నది. ఇవేకాక, ఇంకా కొన్ని జాతీయ కళాశాలలు పుట్టి పనిచేయుచున్నవి.

వర్తకులు కొందరు కావూరిలో తిలక్ ఆంధ్ర జాతీయ విద్యాలయం స్థాపించినారు. ఇది జాతీయ సభలకును,స్వదేశ వస్తు ప్రదర్శనములను కాంగ్రెస్ ఉద్యమమునకు కేంద్ర స్థలముగానున్నది. ఆయుర్వేదం, చిత్రలేఖనం, ప్రాథమికవిద్య సైతము ఇక్కడ నేర్పుతున్నారు. ఏలూరిలో కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవిగారిపేర, కలగర పిచ్చమ్మగారు, అన్నపూర్ణాదేవి పాఠశాలను స్థాపించినారు. నెల్లూరిలో పొణకా కనకమ్మగారు కస్తూరీదేవి పాఠశాల స్థాపించి కొంత కాలము నడిపినారు.



డాక్టరు కాకర్ల శకుంతలాదేవి పిహెచ్. డి., కలకత్తాలో స్త్రీల కళాశాలకు ప్రిన్సిపాలుగా నున్నారు.

గుంటూరిలో ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు స్థాపించిన శారదానికేతనము దినదినాభి వృద్ధిపొంగి, శాఖోప శాఖలుగా పెరిగి, సకలజనాదరణీయమైన పని సాగిస్తూ ఉన్నది. ఇందలి బాలికలు మెట్రిక్యులేషన్, విద్వాన్ పరీక్షలకు సైతము వెళ్ళుచున్నారు.

## స్త్రీ విద్య

ఋగ్వేదమందలి సూక్తములు కొన్ని రచించిన దేవహూతి, లోపాముద్ర మొదలయినవారు ; గార్గి, మైత్రేయి వంటి బ్రహ్మవాదినులు; శబరి, కాళిందివంటి తపస్వినులు ; శాండిలి, స్వయం ప్రభ వంటి యోగినులు ; వేదావతివంటి భవిష్యవాదినులు ; మీరాబాయి, సక్కుబాయి వంటి భక్తురాండ్రు ; రుద్రాంబవంటి పరిపాలకురాండ్రు; రాణీ సంయుక్త, తారాబాయి వంటి వీరవనితలు; యమునాబాయి, లక్ష్మీబాయివంటియోధురాండ్రు ; చిత్రలేఖ, పద్మావతి వంటి కళానిపుణలు ; వరాహుని కోడలును మిహిరుని భార్యయునైన ఖన్నవంటి విదుషీమణులు ; భాస్కరాచార్యుని కూతురైన లీలావతి వంటి గణితశాస్త్రధురీణలు ; శశిరేఖ వంటి రసాయనశాస్త్ర ప్రవీణలు ; భోజుని భార్యయైన భానుమతి వంటి ఇంద్రజాలికలు మొదలయిన విద్యాశారదలు వెలసిన మన భారత దేశములో, మహమ్మదీయ యుగములోను బ్రిటిష్ యుగము ప్రారంభించిన తర్వాతను స్త్రీ విద్య అడుగంటి యుండుట మన

దేశ దౌర్భాగ్యమునకు ప్రధానమైన నిదర్శనము. తక్కిన ప్రదేశములతోపాటు మన ఆంధ్ర దేశమందు సైతము స్త్రీలకు విద్య యెందుకన్న మాఢ్యము ప్రబలియుండెను. అందుచేత బ్రిటిష్ యుగము ప్రారంభించిన నాటికి దేశమందుగల విద్యా సంస్థలందును, ఆ తర్వాత వెలసిన విద్యా సంస్థలందును స్త్రీలకు ప్రత్యేక విద్యాలయములు లేక పోవుటయేకాక, ఉన్న విద్యాలయములందైనను తగిన అవకాశములుగాని ప్రోత్సాహముగాని లేక పోయినది. బాలికా పాఠశాలలు స్థాపించుటలో సైతము మిషనరీ వారే ముందంజ వేసినవారు. వంగ దేశమందు **1820-30** లో రాజా రామమోహనరాయి స్థాపించిన బ్రాహ్మసమాజమతము, మరి నలువది సంవత్సరములకు కేశవచంద్రసేనుని ప్రోత్సాహమున నూతన వికాసమును పొందినప్పుడు, స్త్రీ విద్యకు సరియైన మార్గ మేర్పడినది. మిషనరీ వారు మన తెలుగు జిల్లాలలో నెలకొల్పిన బాలికా పాఠశాలలు ప్రాథమిక విద్యను మాత్రమే బోధించినా స్త్రీ విద్యకు తగిన ప్రోత్సాహమును కలిగించినవి. కమలాసత్యనాథన్, మిసెస్ శ్రీనివాసం, డాక్టర్ లాజరస్ మొదలయిన స్త్రీలు—ఉత్తమకులములో పుట్టినవారే—క్రీస్తుమతమును స్వీకరించి, ఉత్తమ విద్యల నభ్యసించి గొప్ప పదవులను అలంకరించిరి. విదేశమతముల నవలంబించినగాని స్త్రీ విద్య వృద్ధిలోనికిరాదన్న దురభిప్రాయము పోగొట్టవలెనన్న పట్టుదలతో బ్రాహ్మసమాజమువారు బాలికా పాఠశాలలకై కృషిచేసిరి. అందులో కీ. శే. కందుకూరి వీరేశలింగముగారు స్త్రీ విద్య కొంతవరకు పోషించిరి. అయితే, మొన్న మొన్నటి వరకు ఉన్నత విద్య నభ్యసించుటకు



డాక్టరు కొమర్రాజు అచ్చమాంబ,
ఇంగ్లండునందు వైద్యవిద్య నభ్యసించి
గొప్ప పట్టము పొందినవారు.

తగిన సౌకర్యములు మన దేశములో లేనందున డాక్టరు అచ్చమాంబ, డా॥ లక్ష్మిదేవిగార్లు విదేశములకు; డా॥ శకుంతలాదేవి కీ. శే. అన్నపూర్ణాదేవి మొదలయిన స్త్రీలు వంగదేశమునకుపోయి ఉన్నత విద్యావతులైరి. వసుంధరాదేవి గారు ఇంగ్లండు దేశమునకుపోయి, విశ్వ విద్యాలయములో రసాయన శాస్త్రమందు ఎమ్. ఎస్ సి. పరీక్షలో ఉత్తీర్ణురాలై ఇప్పుడు చెన్నపురి క్వీన్ మేరీ సర్వకళాశాలలో అధ్యాపకురాలుగానున్నారు. బాలికా పాఠశాలలు క్రమక్రమముగా ఎక్కువగుతూ ఉన్నవిగాని ఇంకా తగిన్ని లేవనియే చెప్పవలెను.

ప్రాథమిక విద్యనయినా బాలికలకు అందజేయలేని గ్రామములు మన తెలుగు జిల్లాలలో ఇంకా వేలకొలది యున్నవి. మన ఆంధ్ర దేశమందు ఒకొక్క జిల్లాలో బాలురకుగల ప్రాథమిక పాఠశాలలే తక్కువగానున్నవి ; బాలికా

పాఠశాలలు ఇంకా తక్కువగానున్నవి. ఈ విషయము ఈ క్రిందనున్న పట్టికలో స్పష్టముగా కనబడును.

| జిల్లా | బాలుర పాఠశాలలు | అందు బాలుర సంఖ్య | బాలికా పాఠశాలలు | అందు బాలికల సంఖ్య |
|---|---|---|---|---|
| విశాఖపట్నం | 873 | 45,999 | 119 | 19,112 |
| తూ. గోదావరి | 794 | 44,159 | 146 | 28,441 |
| ప. గోదావరి | 545 | 28,626 | 129 | 21,908 |
| కృష్ణా | 591 | 23,977 | 134 | 19,388 |
| గుంటూరు | 674 | 32,400 | 141 | 19,908 |
| నెల్లూరు | 508 | 27,175 | 67 | 14,702 |
| కడప | 390 | 15,140 | 73 | 6,141 |
| కర్నూలు | 490 | 24,906 | 25 | 8,543 |
| బళ్లారి | 288 | 14,507 | 74 | 6,827 |
| అనంతపురం | 476 | 23,466 | 73 | 8,276 |
| చిత్తూరు | 471 | 28,069 | 19 | 12,387 |
| మొత్తం | 6100 | 308,424 | 1000 | 165,633 |

ఈ పట్టికలోనివి 1939-40 నాటి ప్రభుత్వ లేఖలు.

బాలుర బడులలోనున్న బాలికల సంఖ్యను బాలికల బడులలోని బాలురను విడదీసి చేర్చిన సంఖ్యలు.

మ్యూనిసిపాలిటీలలో బాలబాలికల విద్యాభివృద్ధికి ప్రాథమిక పాఠశాలలయినా తగినన్ని పెట్టితీరవలసినది. ప్రాథమిక పాఠశాలలకు పోయే బాలబాలికలలో నూటికి ఎంతమందికి మ్యూనిసిపాలిటీలు పెట్టిన బడులలో స్థలము చాలకున్నదో ఈ క్రింది పట్టికవలన తెలుసుకోవచ్చును.

| మ్యూనిసిపాలిటీ | అవకాశం లేని బాలురు నూటికి | అవకాశం లేని బాలికలు నూటికి |
|---|---|---|
| శ్రీకాకుళం | 34.5 | 52.5 |
| విజయనగరం | 28.0 | 37.6 |
| భీమునిపట్టణం | 46.4 | 54.5 |
| విశాఖపట్టణం | 15.0 | 36.8 |
| అనకాపల్లి | 43.1 | 62.6 |
| కాకినాడ | 42.9 | 28.6 |
| పెద్దాపురం | 38.7 | 46.5 |
| రాజమహేంద్రవరం | 9.0 | 14.4 |
| ఏలూరు | 3.9 | 32.2 |
| పాలకొల్లు | 5.2 | 43.2 |
| బెజవాడ | 33.5 | 34.9 |
| గుడివాడ | 60.5 | 76.5 |
| మచిలీపట్టణం | 5.3 | 32.3 |
| గుంటూరు | 19.8 | 62.7 |
| నరసారావుపేట | 45.2 | 3.6 |
| తెనాలి | 51.8 | 55.1 |
| ఒంగోలు | 15.3 | 27.7 |
| నెల్లూరు | 19.3 | 4.0 |
| కడప | — | 34.7 |
| ప్రొద్దుటూరు | 32.7 | 58.1 |
| కర్నూలు | 3.1 | 40.9 |
| నంద్యాల | 13.1 | 41.3 |
| అనంతపురం | — | 33.2 |
| తాడిపత్రి | 22.9 | 62.6 |
| హిందూపురం | 2.2 | 27.4 |
| హొస్పేట | 16.4 | 75.9 |
| బళ్లారి | 39.7 | 73.4 |
| అదోని | 37.9 | 65.9 |
| చిత్తూరు | 14.8 | 42.3 |
| తిరుపతి | 30.7 | 44.1 |

1930-40 సం॥ నాటి ప్రభుత్వ లెఖలననుసరించి.

30 మ్యూనిసిపాలిటీలలో బాలుర విషయంలో 50 కు మించినవి రెండే; బాలికల విషయంలో 50 కు మించినవి 11. బాలికల విషయంలో గుడివాడ, హొస్పేట, బళ్ళారి, గుంటూరు, తాడిపత్రి, అనకాపల్లి ఎంతవెనకపడి ఉన్నవో!

స్త్రీవిద్య ప్రాథమిక శ్రేణిలోనే వెనుకబడి



డాక్టరు లాజరస్, తెలుగు కన్య :
ఢిల్లీలోని లేడి హార్డింజ్ కళాశాల ప్రిన్సిపాల్.

యున్నప్పుడు ఉన్నత శ్రేణిలో ఎంత తక్కువగా నుండునో చెప్పనక్కర లేదు. ఈ క్రింది పట్టిక చూస్తేచాలును.

1940 లో సెకండరీ స్కూళ్లలో చదువుచున్న

| జిల్లా | బాలురసంఖ్య | బాలికల సంఖ్య |
|---|---|---|
| విశాఖపట్టణం | 9,523 | 746 |
| తూర్పు గోదావరి | 11,347 | 1,689 |
| పశ్చిమ గోదావరి | 7,088 | 654 |
| కృష్ణా | 8,756 | 1,026 |
| గుంటూరు | 9,725 | 1,198 |
| నెల్లూరు | 4,915 | 806 |
| కడప | 2,271 | 287 |
| కర్నూలు | 3,755 | 431 |
| బళ్లారి | 3,942 | 371 |
| అనంతపురం | 2,854 | 349 |
| చిత్తూరు | 4,242 | 639 |
| మొత్తం | 68,418 | 8,196 |

ప్రభుత్వ విద్యాశాఖానివేదిక 1940-41, రెండవ వాల్యూము, మొదటి భాగము పుటలు 33, 52.

ఇక సర్వకళాశాలలలో విశ్వకళా పరిషత్తు పరీక్షలలో ఉత్తీర్ణులగుతున్నవారి సంఖ్య అత్యల్పమనుటకు వింతపడ నక్కరలేదు. స్త్రీలకు ప్రత్యేకించి సర్వకళాశాల ఒకటైనా ఆంధ్ర జిల్లాలలో లేదు. వాల్తేరులోనో రాజమహేంద్రవరములోనో ఒకటేర్పర్చుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. అందుచేత ఆంధ్రయువతులు చెన్నపురిలోనున్న క్వీన్ మేరీజ్ కాలేజిలోనో ఉమెన్సు క్రిస్టియన్ కాలేజిలోనో చదువుకొంటున్నారు. పై రాష్ట్రములలోని సర్వకళాశాలలందున్న ఆంధ్రయువతులు కొందరు ఉన్నత విద్యనభ్యసిస్తున్నారు.

పెద్ద పరీక్షలలో ఉత్తీర్ణలయి ప్రఖ్యాతి పొందిన కొందరు :—

శ్రీమతి బి. కామేశ్వరమ్మగారు, బి.ఏ. ఈమె ఆంధ్ర విశ్వకళాపరిషత్తు సెనేటు సభ్యురాలుగానున్నారు.

శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మమ్మ, బి. ఏ., ఎల్. ఎల్. బి.

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మ ఎమ్. ఏ., బి. ఎల్.

ఇట్లే చాలమంది కలరు.

## వృత్తి విద్య

ఆంధ్ర జిల్లాలలో వ్యవసాయము, పశుశాస్త్రము, శిల్పము నేర్పే కళాశాలలెక్కడా లేక పోవుట పెద్ద లోపముగానున్నది. వృత్తి పరిశ్రమలకు సంబంధించిన పాఠశాలలు మాత్రము కొద్దిగా కలవు.

## చదువుటగాని వ్రాయుటగాని రానివారు

మన ఆంధ్ర దేశములో గల విద్యావ్యాప్తి గురించి ఇంత ఎక్కువగా వ్రాసినామేకాని

విద్యా విహీనుల సంఖ్య తలచుకొన్నప్పుడు ఎంతో దుఃఖము కలుగును. చదువుటగాని వ్రాయుటగాని తెలియనివారు మన ఆంధ్ర దేశములో నూటికి ఎంతమందిగలరో చూడండి :—

| జిల్లా | నిరక్షరాస్యులు నూటికి |
|---|---|
| విశాఖపట్టణం | 94 |
| తూర్పు గోదావరి | 89 |
| పశ్చిమ గోదావరి | 86 |
| కృష్ణ | 87 |
| గుంటూరు | 87 |
| నెల్లూరు | 92 |
| కడప | 91 |
| కర్నూలు | 92 |
| బళ్ళారి | 92 |
| అనంతపురము | 92 |
| చిత్తూరు | 92 |



విద్వాన్ బత్తుల కామాక్షమ్మ
రాజమండ్రిలోని వైశ్య సేవాసదనమునకు ప్రిన్సిపాల్

ఆంధ్రులలో ప్రతిభావంతులు ఎందరో ఉదయించినారు. అయినను, అదియేమోకాని వారి ప్రతిభ మన దేశములో వారు పనిచేస్తూ ఉన్నప్పటి కంటె పై ప్రదేశములందు పని చేస్తూ ఉన్నప్పుడే అధికమగుతూ వచ్చినది. 17 వ శతాబ్దములో, మన ఆంధ్ర దేశములో గోదావరిజిల్లా ముంగండ అగ్రహారములో పుట్టి పెరిగిన ఉపద్రష్ట జగన్నాథపండితరాయలు, మన ఆంధ్ర దేశములో ఉన్నంతకాలము వారి ప్రతిభ ఎవరికిని తెలియకుండెను. ఢిల్లీకి పోయిన తర్వాత వారి ప్రతిభ భారత దేశమందంతటను వ్యాపించినది. అంతకుముందు అక్బరు చక్రవర్తి కొలువున గొప్పపదవిని పొందిన వీర బలుడు (బీర్ బల్) ను ఆంధ్ర దేశములో పుట్టి పెరిగి, ఢిల్లీకి పోయి అఖండ విఖ్యాతిని బడిసియుండెను. ఇట్టి వారు పూర్వకాలనుందు ఇంకా కొందరు గలరు. మన కాలములో సైతము ఇట్టి ప్రతిభావంతులు పై ప్రదేశములకుపోయి ఎక్కువ కీర్తిపొందియున్నారు. ఆంధ్రరాష్ట్ర మేర్పడి యుండిన యెడల వీరిలో కొందరు మన దేశములోనే ఉండి తమ ప్రతిభ పూర్తిగా రాణింప జేసికొని యుందురు గదా! వీరి జీవిత చరిత్ర వేరొకస్థలమున సంగ్రహముగా చెప్పి యున్నాము. ఇక్కడ సూచనగా మాత్రము, కొందరి ప్రఖ్యాతి పై స్థలములో ఎట్లు విలసిల్లినదో తెలియ చేస్తున్నాము.

**సర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు** :— వీరు కలకత్తా సర్వ కళాశాలయందు ఫిలాసఫీప్రొఫెసరుగానున్నప్పుడే వీరిప్రఖ్యాతి అధికమయినది.

**డాక్టర్ భాగవతుల విశ్వనాథము** :—(బి.వి. నాథ్) వీరు ఆంధ్ర దేశములో పనిచేస్తున్నప్పుడు

వీరి ప్రతిభ కనబడలేదు. కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలలో పనిచేసి అనేక పరిశోధనల నుచేసి ప్రఖ్యాతి గడించి, ఇప్పుడు ఢిల్లీలో వ్యవసాయిక పరిశోధకాలయమునకు ప్రధానాధికారులుగా నున్నారు. ఈ పదవి ఇంతవరకు భారతీయులెవరును పొందియుండ లేదు. వీరే మొదటివారు.

**డాక్టరు ఎ. ఎల్. నారాయణగారు :—** వీరు విజయనగరము సర్వ కళాశాలలో అధ్యాపకులుగా ఉండి పరిశోధనలు చేసి పేరు పొందిన వారేకాని వీరి ప్రతిభ డైకనాల్ అబ్జర్వేటరీలో పనిచేస్తూ ఉన్నప్పుడు బాగాపైకి వచ్చినది.

**రాయప్రోలు సుబ్బారావుగారు:—** హైదరాబాద్ ఉస్మానియా విశ్వ విద్యాలయములో ఆంధ్రభాషాధ్యాపకులుగా వెళ్లిన తర్వాత వీరి ప్రతిభ ఎక్కువయినది.

**తనికెళ్ల వీరభద్రుడుగారు :—** విజయనగరము వారు. ఆంధ్రదేశములో వీరు సామాన్యమైన అధ్యాపకులుగా, విజయనగర సర్వకళాశాలలో పనిచేస్తున్నంత కాలము వీరి ప్రతిభ కనబడ లేదు. ఉస్మానియా విశ్వ విద్యాలయములో ఆంగ్ల భాషాధ్యాపకులుగా చేరిన తర్వాత వీరి ప్రఖ్యాతి ఎక్కువయినది.

**కీ. శే. బసవను రామచంద్రరావుగారు :—** వీరికి ఆంధ్ర దేశములో తగిన పదవి దొరకక పోయినది. కలకత్తా విశ్వ విద్యాలయములో అర్థశాస్త్రములో మంచి పరిశోధనలు చేసి గ్రంథములు రచించి పెద్ద పేరు పొందిరి.



శ్రీ భాగవతుల విశ్వనాథ్.
ఢిల్లీలోని భారత కేంద్ర వ్యవసాయిక పరిశోధన శాఖ డైరక్టరుగా నున్న గొప్ప రసాయనిక శాస్త్రజ్ఞులు; హైందవులలో యిట్టి గౌరవము పొందిన మొదటివారు వీరే.

ప్రతాపరిగి రామమూర్తిగారు. కాకర్ల కృష్ణమూర్తిగారు. డాక్టర్ వి. ఎస్. రామ్‌గారు మొదలగువారు ఇంకను చాలమంది కలరు.

---

ఉ॥ విద్య నిగూఢగుప్తమగు విత్తము, రూపము పూరుషాళికిన్,
విద్య యశస్సు భోగకరి, విద్యగురుండు విదేశబంధుఁడున్,
విద్య విశిష్టదైవతము, విద్యకు సాటిధనంబు లేదిలన్,
విద్య నృపాలపూజితము, విద్యనెఱుంగనివాఁడు మర్త్యుఁడే.
—ఏనుగు లక్ష్మణకవి.

# 25వ అధ్యాయము




వార్తయందు జగము వర్ధిల్లుచున్నది
యదియు లేనినాఁడ యఖిలజనులు
నంధకార మగ్ను లగుదురు గావున
వార్త నిర్వహింప వలయుఁబతికి

—భారతం.

విషయ సంగ్రహము :—పత్రికలు, వాటి ప్రాముఖ్యము—పూర్వకాలపు పత్రికల స్థితి—80 సం॥ల క్రిందట తెలుగు పత్రికా ప్రకటన ప్రారంభం—టైపులు లేనందున విషయములను బ్లాకులుగా చేయించి అచ్చు వేయించుట—క్రైస్తవ మిషనరీలు ఆంధ్రదేశమున మొదట పత్రికా ప్రచారము ప్రారంభించుట—వీరేశలింగం పంతులుగారు తెలుగువారిలో మొదట తమ "వివేకవర్ధని" పత్రిక ప్రారంభించిరి—మొదటి తెలుగు దిన పత్రిక "శశిలేఖ" ప్రకటన—స్త్రీలకొఱకు ప్రత్యేక పత్రికలు—ఈ శతాబ్దిలో పుట్టి ఆగిపోయిన పత్రికలు—సమదర్శిని పత్రిక, బ్రాహ్మణేతరోద్యమము—"కాంగ్రెస్" పత్రిక ప్రచారము—గిడుగు రామమూర్తి పంతులుగారి "తెలుగు" పత్రిక—ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ఉదయిని పత్రికలు—కాసీ పత్రికలు: గాండీవము, దేవదత్తము మొదలగునవి—ప్రస్తుతము సాగుచున్న పత్రికలు—ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ, జనవాణి, కృష్ణా పత్రికలు, వాటి సంపాదకుల ప్రతిభ—ముఖ్యమైన వార పత్రికలు: వాటి సంపాదకులు—పక్ష పత్రికలు, చిత్రగుప్త మొదలగునవి—మాస పత్రికలు ప్రారంభం; భారతి, ప్రతిభ మాస పత్రికల ప్రాముఖ్యము—సినీమాకళకు సంబంధించిన పత్రికలు, వాటి ప్రచారము—రాష్ట్రేతరాంధ్ర పత్రికలు: సురవరం ప్రతాపరెడ్డి, సాధు వరదరాజంపంతులుగార్ల రాష్ట్రేతరాంధ్ర సేవ—ప్రత్యేక మత, కుల, శాస్త్ర పత్రికలు—మన పత్రికలు ఆంధ్రదేశమునకు చేసిన సేవ—జాతీయ జీవనమునకు స్వరూపమేర్పరచి, రాజకీయ పరిజ్ఞానమును కల్పించుట; ఆంధ్రరాష్ట్రోద్యమ ప్రచారమునకు తోడ్పాటునిచ్చుట—కార్మిక, కర్షకోద్యమములకు సంబంధించిన పత్రికలు: నవశక్తి, ప్రజాబంధు మొదలగునవి—ఆంధ్రనాటక కళా పరిషత్తు, నాట్యకళ పత్రికా ప్రకటన—.

ఆంగ్ల పత్రికా ప్రపంచమున ఆంధ్రుల ప్రతిభా విశేషములు—"హిందూ" ఆంగ్ల దిన పత్రికను శ్రీ న్యాపతి సుబ్బారావు మొదలగువారు స్థాపించుట—సర్ సి. వై. చింతామణిగారి భారతదేశ ఖ్యాతి, పత్రికా నిర్వహణ సామర్థ్యము—ప్రకాశంపంతులుగారి "స్వరాజ్య" ఆంగ్ల దినపత్రిక ప్రచురణ, ఆ కార్యాలయమున ఉత్పత్తియైన ప్రఖ్యాత పత్రికా సంపాదకులగు ఆంధ్రులు—ఇతరరాష్ట్రములలో ఆంగ్ల పత్రికా సంపాదకులుగా నున్న ఆంధ్ర ప్రముఖులు—ఖాసా సుబ్బారావుగారి ప్రతిభ—ఆంధ్రులకు ఆంగ్ల దిన పత్రిక లేకపోవుటవలని కొరతలు, దానిని స్థాపించవలసిన ఆవశ్యకత—ఆంధ్రదేశ పత్రికా రచయితల సంఘము, ఆంధ్రదేశ పత్రికాసంపాదకుల సంఘముల నిర్మాణములు; వాటి కృషి—పత్రికలపై ప్రభుత్వము వారి నిబంధనలు—అఖిల భారత పత్రికా సంపాదకుల సంఘము, ప్రభుత్వముతో రాజీ—ఆ సంఘమందు ఆంధ్రులకు గల స్థానము—ప్రపంచయుద్ధకారణముగా పత్రికలకు వచ్చిన యిక్కట్లు-ఆంధ్రుల కర్తవ్యము—గతశతాబ్దినాటివి, ఇప్పటివియగు పత్రికల పట్టికలు.

**పత్రికల ప్రాముఖ్యము**

జనుల జీవితమును ప్రతిబింబింపజేసి, వారి విజ్ఞానమును వికసింపజేసి, వారి నాగరికతను సంస్కృతిని విజృంభింపజేయుటకు ఈ కాలమున ఎక్కువగా తోడ్పడగలవి వార్తా వైజ్ఞానిక పత్రికలు. అందుచేతనే పత్రికల ప్రాముఖ్యమంతకంతకు అధికమగుచున్నది. ఈ పత్రికలలో కొన్ని కేవల వార్తా పత్రికలు; కొన్ని సాహిత్య పత్రికలు; కొన్ని నానావిధ వైజ్ఞానిక పత్రికలు. కొన్ని జన సామాన్యమునకు, కొన్ని విద్యార్థులకు, విద్యాధికులకు, కొన్ని పిల్లలకు, కొన్ని స్త్రీలకు



కీ. శే. శ్రీ చల్లా శేషగిరిరావు, బి.ఏ.,బి.ఎల్.,
ఆంధ్ర పత్రికకు సంపాదకులుగా నుండిరి.

ఉద్దిష్టములయినవి. ఈ పత్రికలద్వారా కలిగే మనోవికాసము, విజ్ఞానం, సంస్కృతి మనస్సుకు శ్రమలేకుండా సులువుగాను ఉత్సాహసహితంగాను కలుగుతూ ఉండును.

పూర్వము మన దేశములో వార్తా పత్రికలు లేవుగాని, రాజులు చారులవలన ఇతర ప్రదేశములవార్తలను, తమ దేశ

**పూర్వ కాలపు స్థితి**

మందలివార్తలను తెప్పించుకొనుచూ ఉండేవారు. అశోకుని శాసనములవలె రాజశాసనములు రాజ్యమందలి పలుతావులందు ప్రకటిస్తూ ఉండేవారు. వార్తా గ్రహణము ప్రధాన రాజనీతిగా నుండె ననుటకు, కౌటిల్యుని అర్థశాస్త్రము మొదలయిన గ్రంథములందు దీని ప్రసక్తికలదు. ఈ అధ్యాయము మొదట కనబరచిన భారతపద్యము కూడా ఈ విషయమును సూచిస్తున్నది.

మన దేశములో వార్తా పత్రికల ప్రకటనము ప్రారంభించి సుమారు 80 సంవత్సరములయినది. ప్రారంభించినవారు క్రైస్తవ మిషనరీలు. ఆరోజులలో అక్షరముద్రికలు (టైప్స్) లేవు. గ్రంథమంతా ఏపుటకాపుట ఒకే ముద్రికగా (బ్లాకుగా) తయారుచేసి అచ్చుకొట్టించేవారు. వారి మొదటి పత్రిక "హితవాది". తెలుగువారిలో పత్రికా ప్రకటనోద్యమము ప్రారంభించినవారు కీ. శే. కందుకూరి వీరేశలింగము పంతులుగారు. ముద్ర

**మొదటి తెలుగు వార్తా పత్రికలు**

ణాలయమొకటి నెలకొలిపి, తెలుగు పుస్తకములను, "వివేకవర్ధని" అనే వారపత్రికను ప్రకటించినారు. ఈ పత్రికలో కొద్దిగా వార్తలున్ను, వైజ్ఞానిక విషయములున్ను, దేశమందలి సాంఘిక మత విషయములలోగల దురాచారవిషయ ఖండనమున్ను, సంఘసంస్కార విషయములున్ను ప్రకటిస్తూ ఉండేవారు. ఆ కాలమున బందరులో




శ్రీ ముట్నూరి కృష్ణారావు,
కృష్ణా పత్రికా సంపాదకులు.

"పురుషార్థప్రదాయిని" అనే పత్రిక సైతము వెలువడుతూ ఉండేది. మత, సాంఘిక విషయములలో ఈ రెండు పత్రికలకున్ను వాద ప్రతివాదములు జరుగుతూ ఉండేవి.

ఆకాలమందే వున్నవ బుచ్చయ్యపంతులుగారు "హిందూ జన సంస్కారిణి" అనే పత్రిక నెలకొల్పి, అందులో ఉప నిషత్తులు (ఒకొక్క భాగము చొప్పున) మూలము అర్థము, తెలుగు అనువాదములతో ప్రకటిస్తూ, సనాతన వైజ్ఞానికాభి వృద్ధికి మహోపకారము చేసినవారైరి. మరికొద్దికాలము నకే, కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు "ఆంధ్రభాషా సంజీవిని" అనే పత్రిక నెలకొల్పి సాహిత్య, మత, సాంఘిక విషయములు ప్రకటిస్తూ ఉండిరి.

మరికొద్దికాలమునకు చెన్నపురిలో ఏ. పి. పార్థసారధి నాయుడు గారు "ఆంధ్ర ప్రకాశిక" అనే వార పత్రికను నెలకొల్పి, దానికి సంపాదకులుగానుండి చాలాకాలము నిర్విఘ్నముగా సాగించినారు. అందులో వారు రాజకీయ విషయములకు, వార్తలకు ఎక్కువ స్థానమిచ్చి ప్రభుత్వ రీతులను నిర్భయముగా విమర్శిస్తూ ఉండేవారు. వారు కాంగ్రెస్‌పక్షాభిమానులు గనుక వారి పత్రిక ప్రజాదరము నకు విశేషముగా పాత్రమైనది. 25 సంవత్సరములు వార పత్రికగానుండి పిమ్మట ద్వైవార పత్రికయినది. గాని కొద్దికాలమునకే మరల వారపత్రికగా మారినది.



శ్రీ చల్లా జగన్నాథం, ఎమ్.ఏ., బి.ఎల్., (ఆంధ్రపత్రిక).

పిమ్మట, గట్టుపల్లి శేషాచార్యులు గారు "శశిలేఖ" అనే వార పత్రికను చెన్నపురిలోనే స్థాపించినారు. అది ద్వైవార పత్రికగాను, దైనిక పత్రికగాను కొద్దికాలము పని చేసినది. ఆ పత్రిక ఆంధ్రోద్యమ వ్యాప్తికి ఎక్కువగా తోడ్పడిన పత్రికలలో మొదటిదనవలెను. ఆ కాలమందే రాజమహేంద్రవర మందు



శ్రీ న్యాయపతి నారాయణమూర్తి, బి.ఏ., వాహిని, ప్రభాతము, ఆంధ్రప్రభ, సంపాదకులుగా నుండిరి.

నెలకొన్న "గోదావరి", "ఆంధ్రకేసరి" అనే వార్తా పత్రికలు సైతము ఆంధ్రోద్యమమును ఎక్కువగా వ్యాపింప జేసినవి. నెల్లూరిలో "పీపిల్స్‌ఫ్రంట్," గుంటూరిలో "ధర్మ సాధని," చెన్నపురిలో "వృత్తాంతమంజరి" అనే వార పత్రికలు ప్రత్యేకాశయములతో కొంతకాలము పనిచేసి, తెలుగువారిలో పత్రికాపఠనాసక్తిని పెంపొందజేసినవి.

ఆ దినములలోనే, ఏలూరిలో సత్తిరాజు సీతారామయ్య పంతులుగారి సంపాదకత్వమున కొంతకాలమున్ను, చిలుకూరి వీరభద్రరావుగారి సంపాదకత్వమున కొంతకాలమున్ను ప్రకటితమైన "దేశోపకారి" అనే ఆంధ్రపత్రిక కృష్ణా గోదావరీ మండలమందు ఎక్కువగా ప్రచారములో ఉండేది. కాకినాడలో కెనేడియన్ బాప్టిస్ట్ మిషను వారి "రవి" అనే వారపత్రిక, మతప్రబోధమే ప్రధానాశయముగా ప్రారంభించినా, లోక వృత్తాంతములను సైతము ప్రకటిస్తూవచ్చినది.

పిమ్మట "దేశాభిమాని" అనే పత్రికను దేవగుప్తం శేషాచలపతిరావుగారు నెలకొల్పినారు. మొట్టమొదట బెజవాడలో "కృష్ణా వృత్తాంతిని", "కృష్ణా న్యూజ్" అనేపేళ్లతో ప్రారంభించి, ఇది "దేశాభిమాని" అనేపేరు దాల్చినది. ఇది పక్ష, వార, ద్వైవారపత్రికా దశలు దాటి దినపత్రికగా సైతము కొంతకాలము సాగినది.

వార్తా పత్రికలేకాక సాహిత్య విజ్ఞానాభివృద్ధి కొరకు మాస పత్రికలు సైతము వృద్ధిలోనికి వచ్చినవి. నెల్లూరిలో పూండ్ల రామకృష్ణయ్యగారి "అముద్రిత గ్రంథ చింతామణి" ఆంధ్రభాషాభిమానులందరికిని ఆదర్శపాత్రమైనది. పండితుల వాదపత్రివాదములు, కావ్య విమర్శలు, అముద్రిత గ్రంథముల ముద్రణము ఇందెక్కువగానుండెను. మూలపడి పురుగుపట్టిన తాళపత్ర గ్రంథములు పైకితీసి, ముద్రింపంచదగిన గ్రంథములను, ఈ మాసపత్రిక ప్రకటిస్తూ వచ్చినది. ఆ కాలమందే, వీరేశలింగం పంతులుగారు "చింతామణి" అనే మాసపత్రిక నెలకొల్పి, అముద్రిత గ్రంథములను, తమ కవుల చరిత్ర ఇతర రచనలను, ఇతరుల వ్యాసములను ప్రకటిస్తూ ఉండిరి. పిమ్మట, శ్రీ రాజా భుజంగరావుగారి సాహాయ్యముతో నందిరాజు చలపతిరావుగారు "మంజువాణి" మాస పత్రికను ప్రారంభించి తమకు దొరికిన ప్రాచీన గ్రంథములను ప్రకటిస్తూఉండిరి. వీటివలెనే కొచ్చెర్లకోట రాజాబహద్దరు కృష్ణారావుగారి "సరస్వతి", ఆచంట వేంకటరాయసాంఖ్యాయన శర్మగారి "కల్పలత", చిలకమర్తి లక్ష్మీనృసింహముగారి "మనోరమ", కోపల్లి వేంకటరమణా

**మొదటి తెలుగు మాస పత్రికలు**



శ్రీ నార్ల వెంకటేశ్వరారావు, బి. ఏ., ఆంధ్ర ప్రభ సంపాదకులు; ఇదివరకు సమదర్శిని, వాహిని, వినోదిని, ఆంధ్రజ్యోతి మొదలగు పత్రికా సంపాదక వర్గములలో పనిచేసిరి; యుద్ధము, అంతర్జాతీయ రాజకీయ విషయములలో దిట్ట.



శ్రీ తాపీ ధర్మరావు నాయుడు, బి.ఏ., సమదర్శిని, జనవాణి, కొరడా మొ॥ వాటికి సంపాదకులుగా నుండిరి.

రావుగారి "కల్పవల్లి", పనప్పాకం ఆనందాచార్యులవారి "వైజయంతి" ఆచంట సూర్యనారాయణ రాజుగారి "శారద" మొదలగు మాస పత్రికలు బయలుదేరినవి.(చూ. గతశతాబ్దము నాటి ఆంధ్రపత్రికలపట్టిక). ఇవిగాక స్త్రీలకొరకు స్త్రీల పత్రికలు సైతము వెల్వడినవి. వీటిని స్త్రీల సారస్వతము అనే అధ్యాయములో పేర్కొన్నాము.

ఈ శతాబ్దిలో పత్రికల సంఖ్య కొద్దిగా అధికమయినది. అందు కొంతకాలముండి నిలిచిపోయిన పత్రికల విషయము ముందుగా తెలియజేసి నేటికిని, నిలిచియున్న పత్రికల విషయము తెలియజేస్తున్నాము.

**ఈ శతాబ్దములో పుట్టి ఆగిపోయిన పత్రికలు**

జస్టిస్ పార్టీవారి పోషణలో పింజల సుబ్రహ్మణ్యం చెట్టిగారి సంపాదకత్వమున "సమదర్శిని" అనే పత్రిక కొంతకాలము దైనిక పత్రికగా సైతము పనిచేసి బ్రాహ్మణేతరోద్యమమునకు తోడ్పడి, సంపాదకులతో ఇది సైతము కాలధర్మమొందినది. "కాంగ్రెస్" పత్రిక రాజమహేంద్రవరమందు మద్దూరి అన్నపూర్ణయ్యగారి సంపాదకత్వమున నడచి తీవ్రమైన జాతీయ వాదమునకు సహాయముగాను ప్రోత్సాహకరముగాను ఉండెను. గ్రాంథిక వ్యావహారిక భాషావాదముల సందర్భమున గ్రాంథిక పక్షమును అవలంబించిన "ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక", 1911 నుండిన్ని కొంతకాలము ఎక్కువ శ్రద్ధతో పనిచేసి, ఇప్పటికిని ఏదో ఒక విధముగా సాగుతూఉన్నది. గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి "తెలుగు" పత్రిక-వ్యవహారిక భాషావాదమునకు ప్రధానమైనది-ఒక్క సంవత్సరము(1919-1920) మాత్రము పనిచేసి ఆగిపోయినది. వారి వాదమును ఖండించే ఉద్దేశముతో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు "వజ్రాయుధము"ను కొంతకాలము సాగించినారు. ఉభయ



కీ. శే. సర్ సి. వై. చింతామణి.
అలహాబాదు 'లీడర్' పత్రికా సంపాదకులు.

పక్షములవారి రచనలకును అవకాశమిస్తూ కాతా శ్రీరామ శాస్త్రిగారు "శారద" అనే మాసపత్రిక నెలకొల్పి కొన్ని అమూల్యములయిన వ్యాసములను ప్రకటించినారు. విశ్వనాథ సత్యనారాయణ, కోలవెన్ను రామకోటీశ్వరరావు గార్లు "జయంతి" అనేమాసపత్రిక స్థాపించి, నవ్యసాహిత్య రచనలకు ఆశ్రయమిచ్చినారు. కీ. శే. కొంపెల్ల జనార్దన రావుగారు "ఉదయిని" అనే మాసపత్రికను-నవ్యసాహిత్య రచనలకు ముఖ్యమైన పత్రికగా-కొంతకాలము సాగించిరి. కుందుర్తి నరసింహారావుగారి "విశ్వకళ" సైతము సాహిత్య సేవచేసిన పత్రిక.

ఇవిగాక, ఆంధ్రదేశములో ఏలూరినుండి కీ. శే. మున్నంగి లక్ష్మీ నరశింహాశర్మగారి సంపాదకత్వమున వెలువడుచుండిన కానీ పత్రికలు: "గాండీవము," "దేవదత్తము" అనునవి, పశ్చిమగోదావరి జిల్లాలోనేకాక ఆంధ్రదేశమంతటను గూడ సంచలనము గలిగించినవి. శర్మగారి వ్రాతలు నిశితములై, హాస్య వ్యంగ్యరసపూరితములై ఉత్తేజకరములుగా నుండేవి. వీరి అకాలమృతివల్ల ఆంధ్రదేశము అత్యుత్తమ శ్రేణికిచెందిన ఒక పత్రికారచయితను గోల్పోయినదని చెప్ప వచ్చును. మద్రాసునుంచి ఎస్. గణేశన్‌గారి సంపాదకత్వమున 1932 వ సం॥ర ప్రాంతములో "జన్మభూమి" యను కానీ పత్రిక వారమునకు మూడుసార్లు ప్రకటింపబడుతూ వుండేది. ఈ పత్రిక తీవ్ర జాతీయవాదమును సమర్థిస్తూ, అచిరకాలములోనే ఆంధ్రుల ఆదరాభిమానములకు పాత్రమయ్యెను; గాని తరువాత నిలిచిపోయినది.

**ప్రస్తుతమున్న పత్రికలు**

పైని తెలుపబడిన పత్రికలుగాక, 1902 వ సం॥మున దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, దాసు నారాయణరావు గార్లచే స్థాపింపబడి, ప్రస్తుతము ముట్నూరి కృష్ణారావుగారి ఆధ్వర్యము క్రింద నడుపబడుచున్న కృష్ణాపత్రికను ముందు పేర్కొనవలసి యున్నది. సునిశితమై, పండిత పామరుల సైతము ఆకర్షింపగల సులభమైన వ్యావహారిక శైలిలో, వ్యాసములు—ముఖ్యముగా సంపాదకీయములు—ప్రకటించుచు నూతనాదర్శములతో సాగుచు, యావదాంధ్ర దేశమునందును ఒక ప్రత్యేకత నేర్పరచుకొన్నది.

ఆంధ్రపత్రిక:—ఈ పత్రికను కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 1908 సం॥రములో బొంబాయి నుంచి వారపత్రికగా ప్రారంభించి, 1914 లో కార్యస్థానమును మద్రాసునకు మార్చి, కొంతకాలమువరకు వార పత్రికగానే నడుపుచు, తరువాత దినపత్రికగా మార్చిరి. చిరకాలము అనగా ఇటీవల 5 సం॥ల క్రితంవరకును ఇది యొక్కటియే స్థిరముగానడచిన తెలుగు దినపత్రిక. కీ. శే. చల్లా శేషగిరిరావుగారు ఈ పత్రికకు విశేషకాలము సంపాదకులుగానుండి దీనికి స్థిరత్వము, పలుకుబడిని కలుగజేసిరి. వారి మరణానంతరము నాగేశ్వరరావు పంతులుగారే దీని సంపాదకత్వ భారముగూడ వహించి, ఈ పత్రికను అఖిలాంధ్ర ప్రజావాణిగా నొనరించిరి. ఆంధ్రుల సర్వతోముఖ పరిజ్ఞానమును, ఒక్క ఆంధ్రదేశముననేకాక యావద్భారతదేశమునను చాటి, ఆంధ్రుల సాంఘిక రాజకీయ సాహిత్యాభివృద్ధుల గలుగజేసినదీ పత్రికయే. ఈ పత్రిక దినపత్రికయైనప్పటికిన్నీ, తోడ్తోడ వారపత్రికనుగూడ ప్రచురించుచునేయుండిరి. ఇది ఇప్పటికిని నిర్విఘ్నముగా సాగుచు వారపత్రికలలో ప్రముఖస్థాన మాక్రమించుకొన్నది. కొంతకాలమునకు "భారతి" అను సచిత్రమాస పత్రికనుగూడ ప్రచురింప ప్రారంభించిరి. ఇది ఈనాటివరకును మాసపత్రికల తల మానికమై వెలుగుచున్నది.

ఈ మూడు పత్రికలవలన ఆంధ్రులన్ని విధముల అభివృద్ధిచెంది ఆంధ్రరాష్ట్రోద్యమము మొ॥ అన్ని విధములయిన ఉద్యమము లకు చేయూత పొందిరి. ప్రస్తుతము ఈ పత్రికల కన్నింటికి శివలెంక శంభుప్రసాద్ గారు సంపాదకులుగానుండి మంచి వ్యాపారదక్షతతో నిర్వహించుచున్నారు.

దినపత్రికలలో, వెనుక "ఆంధ్రభారతి", "ఆంధ్ర వార్త", "ఆంధ్రప్రజ" "శశిరేఖ" మొదలైనవి గలవు గాని, అవి ఎక్కువ కాలము నిలువలేదు. తిరిగి 1936 లో శ్రీ పీఠికాపురాధీశ్వరుల అండతో "జనవాణి" అను దిన పత్రిక తాపీ ధర్మారావు నాయుడుగారి సంపాదకత్వమున మద్రాసునుంచి ప్రారంభింపబడి, రెండవ ప్రపంచయుద్ధ ప్రారంభకాలములో నిలిచిపోయినది. ఈ స్వల్పకాలము లోనే ఈ పత్రిక, వార్తా ప్రకటనలలోను సంపాదకీయ వ్యాఖ్యలు, తదితర ప్రత్యేకశీర్షికా సముదాయములోను నూతన పోకడలతో వెలువడి, ఆంధ్రుల ఆదరాభిమానములను ఎక్కువగా చూరగొనినది. ఇట్టి పత్రిక నిలచిపోవుట నిజముగా ఆంధ్రుల దురదృష్టమే.

1939 సం॥రములో "ఆంధ్రప్రభ" అను వేరొక దిన పత్రిక మద్రాసునుంచి ఖాసా సుబ్బారావుగారి సంపాదకత్వమున ప్రారంభింపబడి అనతికాలములోనే ఆంధ్రుల ఆదరము పొందినది. కొంతకాలమునకు తర్వాత, దీనికి న్యాయపతి నారాయణమూర్తిగారు సంపాదకులుగానుండి దీని యభివృద్ధికి ఎక్కువగా పాటుపడిరి. పత్రికా ప్రకటనలో కొన్ని నూతన విధానముల ప్రవేశబెట్టి ఆంధ్ర దేశపు మారుమూలల సైతము దీనిని వ్యాపింపజేసి, స్థిరత్వము నిలిపి పోయిరి. వీరి తర్వాత ప్రస్తుతము రాజకీయపరిజ్ఞాతలయిన నార్ల వెంకటేశ్వరరావుగారు దీని సంపాదకులుగానుండి, దీనికి యితోధికాభివృద్ధిని చేకూర్చిరి.

ఇక వారపత్రికలలో "ప్రజామిత్ర, ప్రజాబంధు, ఆనందవాణి, ఆంధ్రజ్యోతి, వాహిని, కాగడా మొదలగు పత్రికలు, వరుసగ గూడవల్లి రామబ్రహ్మం, ఎస్.జి. ఆచార్య, ఉప్పలూరి కాళిదాసు, బి. ఎన్. గుప్త, పి. నాగేశ్వరరావు, తాపీ ధర్మారావు నాయుడు మొదలగువార్ల సంపాదకత్వమున ఆంధ్ర దేశమున మిక్కిలి ప్రచారమునొందినవి. అందుకొన్ని పత్రికలు కొన్ని విషయములలో ప్రత్యేకత సంపాదించుకుని, దేశక్షేమమునకు, ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి పాటుబడుచున్నవి. ఈ పత్రికలన్నియు తమ కార్యస్థానములను మద్రాసునందే పెట్టుకున్నవి. ఇవిగాక ఇంకను చాల పత్రికలు ఆంధ్ర దేశములోని ముఖ్య కేంద్రముల నుండి ప్రకటింపబడుతూ ఉన్నవి. వాటిలో జమీన్ రైతు, యుగంధర, సుధర్మ, శ్రమజీవి, దేశసేవ మొదలగు పత్రికలు గలవు.



శ్రీ ఖాసా సుబ్బారావు, బి.ఏ., బి.ఎల్., 'ఫ్రీ ప్రెస్' ఆంగ్లదినపత్రికా సంపాదకులు.

పక్ష పత్రికలు :—వీనిలో ముఖ్యముగా పేర్కొనదగినది ఎస్. జి. ఆచార్య గారి సంపాదకత్వమున వెలువడుచున్న చిత్రగుప్త. ఇది తీవ్ర సంస్కారణలతోను, వ్యంగ్య రచనలతోను, అనువాద కథలలోను వెలు



డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య, బి.ఏ., ఎమ్.బి., సి.ఎమ్., మహాత్ముని సిద్ధాంతములకు భాష్యకారులు, ప్రసిద్ధ పత్రికా సంపాదకులు.

వడుచు ఆంధ్రదేశమున విశేషప్రచారముతో, నిర్విఘ్నముగా వెలువడుచున్నది. ప్రస్తుతము మాస పత్రికగానున్న రూపవాణి కొంతకాలము సినీమాపక్షపత్రికగా గూడ వెలువడి, తిర్గి మాస పత్రిక అయినది. మిగిలిన తెలుగు పక్ష పత్రికలు, పత్రికలు పట్టికలలో పేర్కొనబడినవి.

తరువాత చెప్పదగినవి మాస పత్రికలు. ముందు చెప్పినరీతి మొదట పేర్కొనదగినది భారతి. ఈ పత్రిక ఆంధ్ర దేశమున నేటికిని సారస్వతమునకు ఒరపిడిరాయిగా పరిగణింపబడుచున్నదనిన అతిశయోక్తిగాదు. సుప్రసిద్ధ రచయితలకు, కవులకు, పండితులకు, చిత్రకారులకు, కళావేత్తలకు, వైజ్ఞానిక శాస్త్రజ్ఞులకు ప్రోత్సాహమిచ్చి ఆయాకళల యభివృద్ధికి పాటుబడినది. ప్రాచీనార్వాచీన సాహిత్య భేదముల పరిగణింపక అందరికీ సమముగా అవకాశమిచ్చుచున్నది.

ఇవిగాక ఆంధ్రసారస్వతసేవ చేయుచున్న పత్రికలలో, నవ్యసాహిత్యపరిషత్తు ముఖపత్రమై, తెలికిచర్ల వెంకటరత్నం గారి సంపాదకత్వమున వెలువడుచున్న 'ప్రతిభ'; గ్రాంథిక భాషా వాదులకు, ఆంధ్ర సాహిత్య పరిషత్తుకు ముఖ్యాంగమైన 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక'; కేవలము స్త్రీల యావద్విషయముల చర్చించుచు, వారి యభివృద్ధికి విశేష కృషిజేస్తూ, డాక్టరు కె. ఎస్. కేసరిగారి సంపాదకత్వమున వెలువడుచున్న 'గృహలక్ష్మి'; కేవల వినోదకథలకై ప్రత్యేకత పొందిన వినోదిని; ఆంధ్రుల సర్వ విషయములగూర్చి ఎక్కువ అభిమానముతో వ్యాసముల అనేకము ప్రకటించుచు ఆంధ్ర శేషగిరిరావుగారి సంపాదకత్వమున వెలు వడుచున్న 'ఆంధ్రభూమి'; ఆంధ్రదేశములో హిందీభాషా ప్రచారము ఎక్కువగా ప్రతిఘటించుచు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి సంపాదకత్వమున తేటతెల్లమైన వ్యావహారిక భాషలో అతి తీవ్రమగుసాహిత్య రాజకీయ, ఆంధ్ర రాష్ట్రీయ సమస్యలపై వ్యాఖ్యలు విమర్శలు ప్రకటించుచు, వెలువడుచుండి, ప్రస్తుతము తాత్కాలికముగా నిలుపబడినటువంటి 'ప్రబుద్ధాంధ్ర'; ఇంకను ఢంకా, కథాంజలి, కథావీధి మొదలగు కథల పత్రికలు ఆంధ్రదేశమందు ఎక్కువ ప్రచారములో నున్నవి.

ఇక సినీమాకళకు సంబంధించిన పత్రికలలో: తెలుగు సినీమా, రూపవాణి, పెంకిపిల్ల, కొరడా, ఫిలింస్టార్ మొదలైన పత్రికలు సినీమాకు సంబంధించిన యావత్తు విషయములను తెలుగుభాషలో ప్రకటించుచు, తెలుగు చిత్రములు, సంస్థలు మొదలగువాటిపై విమర్శలు చేసి వాటి యభివృద్ధికి పాటుబడుచు, ఆంధ్రదేశములో బాగుగా పేరుకెక్కియున్నవి. సినీమా విషయములో ఒక్క ఈ మాస పత్రికలేగాక, ప్రతి దిన వారపత్రికలయందును వారమునకు కొన్ని పుటలు ప్రత్యేకించి, దీనికి సంబంధించిన వ్యాసములతో ప్రకటింపబడుచున్నవి. ఈ కాలములో ప్రపంచమునందలి ఇంచుమించు ప్రతిభాషలోని పత్రికలలోను చర్చింపబడుచున్న విషయములలో ఈ సినిమా పరిశ్రమ కూడ ముఖ్యస్థానము వహించియున్నదనవచ్చును.

ఇంతవరకు ఉదహరించిన పత్రికలు మద్రాసు రాజధాని యందు ప్రచురింపబడుచువచ్చిన పత్రికలు. ఇక ఆంధ్రులు నివశించుచున్న ఇతర రాష్ట్రముల నుంచి ప్రచురింపబడుచున్న పత్రికలనుగురించి కొంత చెప్పవలయును.

**రాష్ట్రేతరాంధ్ర పత్రికలు**

వీటిలో హైదరాబాదునుంచి సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వమున ప్రచురింపబడుచున్న

"గోల్కొండ పత్రిక" పేర్కొనదగినది. ప్రతాపరెడ్డి గారు ఈ పత్రికద్వారా నిజాం సంస్థానాంధ్రులకు ఎక్కువ సేవచేయుచు, సంస్థాన విషయములనుగూడ చర్చించుచు, తమ నిశిత విమర్శలచే దీనికి ఎక్కువ ప్రఖ్యాతిని కలుగ జేసిరి. వీరు ఒక్క పత్రికద్వారానేకాక అణాగ్రంథ మండలి మొదలగు కొన్ని గ్రంథమాలల ద్వారాకూడా ఆ సంస్థానాంధ్రులకు ఎక్కువసేవ జేయుచున్నారు. తరువాత "ఆంధ్రవాణి" అను వార పత్రికకూడ ప్రచురింపబడుచు తీవ్ర రాజకీయవిమర్శలకు పేరుపొంది ప్రస్తుతము నిలిచి పోయినది. ఇవిగాక శికింద్రాబాదునుంచి మాడపాటి హనుమంతరావుగారి "ఆంధ్ర కేసరి" రాచమల్ల సత్యవతీదేవిగారి "తెలుగుతల్లి" అను మాసపత్రికలుగూడ ప్రచురింపబడు చుండెను.

దక్షిణాదిని సాధు వరదరాజంపంతులు గారు "దక్షిణాంధ్ర పత్రిక" అను తమమాసపత్రికద్వారా అచ్చటి ఆంధ్రుల అభివృద్ధికి ఎక్కువ కృషిజేయుచు, ఎంతయు శ్రమించి ఈ పత్రికను నిర్వహించుచున్నారు. తరువాత ఈ మధ్యనే బరంపురంనుండి దేవరాజు వెంకటకృష్ణారావు గారు "విశాలాంధ్రవాణి" అను వార పత్రికను తెలుగు, ఇంగ్లీషు భాషలలో నడుపుచున్నారు. ఇది ఆంధ్ర మహా సభయొక్క రాష్ట్రేతరాంధ్ర శాఖకు ముఖపత్రము వంటిది. ఇవిగాక బర్మా రాష్ట్రములోని యాంధ్రుల అభివృద్ధికై రంగూనునుంచి కొన్ని తెలుగు పత్రికలు వెలువడినవి.

**కుల పత్రికలు**

ప్రత్యేకముగా ఏకులమువా రాకులముయొక్క అభివృద్ధికి పాటుబడుటకై కొన్ని కుల పత్రికలున్నూ బయలుదేరినవి. వాటిలో భారతీయ వైశ్య, పెరికకుల ప్రకాశిక, మేరు జ్యోతి, ఆదిఆంధ్ర, నవజీవన్, శికింద్రాబాదు నందలి దక్కన్ వైశ్య, మద్రాసులోని వాసవి, రంగూనునుండి వెలువడు సెట్టి బలిజ; ఇంకను కమ్మ, రెడ్డి మహాజన సభల తరపున కొన్ని పత్రికలు గలవు. క్రైస్తవ మత ప్రచారము నకై ఆంధ్రదేశములోని క్రైస్తవ మిషనరీలు చాల వార మాసిక పత్రికలను నడపుచున్నారు. వీటిలో: రవి, ఆంధ్రిలూధరన్, క్రైస్తవ నిరీక్షణ, బైబిల్ రీడింగ్ పత్రిక, క్రైస్తు వర్తమానం మొదలగు పత్రికలు గలవు.

ప్రత్యేక శాస్త్రవిద్యలను ప్రచారము చేయుటకై వైద్యము, న్యాయము, వేదాంతము మొదలగు ప్రత్యేక విషయములకు సంబంధించిన పత్రికలును గలవు. వైద్య కళ, ఆయుర్వేద చంద్రిక

ఉత్తర హిందూస్థానమందలి ప్రఖ్యాత ఆంగ్ల పత్రికా సంపాదకులగు ఆంధ్రులు.



ఎడమప్రక్కనుంచి

1. శ్రీ జి. వి. కృపానిధి, ఎమ్.ఏ., బి.ఎల్., ఢిల్లీలో ప్రముఖ పత్రికా విలేఖరి.
2. ,, చలపతిరావు, ఎమ్.ఏ., బొంబాయిలో ,, ,,
3. ,, చావలి వెంకట హనుమంతరావు, ఎమ్.ఏ., ఇండియన్ నేషన్ పత్రికా సంపాదకులు.
4. ,, కుందూరి ఈశ్వరదత్తు బి.ఏ., ట్వంటియత్ సెంచరీ పత్రికా సంపాదకులు.

వీరిని గురించిన వివరములు ఈ వ్యాసములో చదువండి.

మొదలగు వైద్య పత్రికలు; ఆంధ్ర

**శాస్త్ర విద్యలపత్రికలు**

లా జర్నల్, కింగ్స్ లా వర్తమాని మొదలగు న్యాయస్థాన పత్రికలు; 'లోకల్ బోర్డ్సు', జిల్లా గెజెట్లు మొదలగు స్థానిక సంస్థల విషయములకు సంబంధించిన పత్రికలు; ఇంకను విజ్ఞానం, నాచురోపతి, ప్రకృతి వైద్యము మొదలగు వివిధ పత్రికలు గలవు.

ప్రథమమున, కందుకూరి వీరేశలింగంపంతులుగారు తమ సంస్కరణోద్యమమునకు పత్రికలనూ తమ గ్రంథములనూ ఉపకరణములుగా జేసుకొని, తమ

**మన పత్రికలు ఆంధ్ర దేశమునకు చేసిన సేవ**

ఉద్యమములను ఎంతయో విజయవంతముగ నిర్వహించుకొని యుండుట అందరకు తెలిసినదే. ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికలు ఆంధ్ర జాతీయ జీవనమునకు ఒక స్వరూపము నేర్పరచి, అనల్పమైన రాజకీయ పరిజ్ఞానమును కల్పించినవి. ఆంధ్రప్రభ కొంతకాలము క్రిందటనే ప్రారంభింపబడినను ఆంధ్రులకు అమోఘమైన సేవ జేసినది.

వారపత్రికలలో ప్రజాబంధు, వాహిని, జమీన్ రైతు, కాగడా పత్రికలు కార్మిక కర్షకోద్యమములకు అతివాద ప్రచారమునకూ, సామ్యవాద వ్యాపకమునకూ ఎక్కువగా తోడ్పడినవి. నవశక్తి పత్రిక మద్దూరి అన్నపూర్ణయ్యగారి సంపాదకత్వమున తరువాత మరికొందరి సంపాదకత్వమునను మొదటి రాజమండ్రినుంచిన్నీ తరువాత బెజవాడనుంచిన్నీ ప్రచురింపబడి, తీవ్రమైన రాజకీయ సంస్కరణల ప్రచారముచేసి, కార్మిక కర్షకోద్యమములకు వారి యభివృద్ధికి ఎక్కువ తోడ్పాటు నిచ్చినది. కార్మిక బులిటెన్ అను పత్రిక కూడా ఈ విషయము లందు ఎక్కువ కృషి జేయుచున్నది.


శ్రీ చావలి వేంకటహనుమంతరావు, ఎమ్. ఏ., పాట్నాలో 'ఇండియన్ నేషన్' ఆంగ్ల దినపత్రికా సంపాదకులు.

మిగిలిన సినీమా పత్రికలు, బాలపత్రికలు,


శ్రీ కుందూరి ఈశ్వరదత్తు, బి.ఏ., అలహాబాద్‌లో 'ట్వంటియత్ సెంచరీ' మాసపత్రికా సంపాదకులు, మద్రాసులో 'పీపిల్సువాయిస్' అను ఆంగ్ల దినపత్రికా సంపాదకులుగా నుండిరి.

ప్రత్యేక శాస్త్రములకు సంబంధించిన పత్రికలు ఆయా విషయములలో అపారమైన సేవను జేయుచున్నవి.

ప్రత్యేకముగా నాట్యకళా పునరుద్ధరణకు పాటుపడుచు, ఆంధ్రనాటక కళాపరిషత్తు యొక్క ముఖపత్రముగా 'నాట్యకళ' యను మాసపత్రిక ప్రచురింపబడుచుండెడిది. దీనికి నీలంరాజు వెంకటశేషయ్య, కొత్తపల్లి లక్ష్మయ్య, డాక్టరు గిడుగు వేంకట సీతాపతి, కొమ్మూరి పద్మావతిగార్లు కొంతకొంత కాలము చొ॥ సంపాదకత్వమును వహించిరి.

ఆంధ్రులు ఒక్క తెలుగు పత్రికా నిర్వహణమునందే కాక ఆంగ్ల పత్రికా నిర్వహణము నందును ప్రత్యేక స్థానమును ఆర్జించుకొన్నారు. మద్రాసునందలి నేటి 'హిందూ' పత్రికను మొదట స్థాపించుటకు పఖ్యాత ఆంధ్ర పురుషులు, దివంగతులైన న్యాపతి సుబ్బారావు పంతులుగారు మరికొందరు ముఖ్యులు కారణము. అప్పటి

**ఆంగ్లపత్రికా ప్రపంచమున ఆంధ్రుల ప్రతిభ**

కాంగ్రెసు ఉద్యమమునకు, రాజకీయ సంస్కరణలకు ఈ పత్రిక ఎక్కువ ప్రచారము చేసి ప్రశస్తి గాంచి యుండెను. ఒక్క మద్రాసు రాష్ట్రమునందే



శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావు, బి.ఏ., బి.ఎల్.,
త్రివేణి పత్రికా సంపాదకులు.

కాక భారత దేశములోని ఇతర రాష్ట్రములందుకూడ ఆంగ్ల పత్రికలలో ప్రధాన సంపాదకులుగాను, సహాయ సంపాదకులుగాను, విలేఖరులుగాను ప్రసిద్ధికెక్కిన ఆంధ్రులు చాలమంది కలరు. వారిలో కొందరినిగురించి వివరించెదము.

కీ. శే. సర్ చిర్రావూరి యజ్ఞేశ్వరచింతామణి :— వీరు ప్రారంభములో విజయనగరంలోని "తెలుగుహార్ప" పిమ్మట విశాఖపట్టణములోని "వైజాగ్ స్పెక్టేటర్" తిర్గి విజయనగరములోని "ఇండియన్ హెరాల్డ్" అను పత్రికలయందు కొంతకాలము సంపాదకత్వపు భారమువహించిరి. తర్వాత మద్రాసునకువచ్చి "మద్రాసు స్టాండర్డ్" అను పత్రికా సంపాదకవర్గమునందు కొంతకాలము ఉండి, తమ ప్రతిభవలన అలహాబాదులోని "ఇండియన్ పీపుల్" అను పత్రికా సంపాదకులుగా వెడలిరి. తదుపరి 1909 సం॥రంలో మాలవ్యా ప్రభృతులచే స్థాపింపబడిన "లీడర్" పత్రికకు సంపాదకులుగానుండి తమ అనన్య రాజకీయ ప్రజ్ఞా ధురంధరత్వముచే దానికి భారతదేశమంతటను గొప్పపేరు ప్రతిష్ఠలు సంపాదించి పెట్టిరి. 1911-16 సం॥వరకు దానికి సంపాదకులుగానుండి విరమించి, సంయుక్తరాష్ట్ర రాజకీయములందును, రౌండ్ టేబిల్ సమావేశమునందును పాల్గొని, క్రమముగా మంత్రిపదవి, సర్ బిరుదముల నందుకొని, భారతదేశపు ప్రసిద్ధ రాజకీయవేత్తగా పేరొందిరి. మరల 1927-36 కాలమువరకు లీడరు పత్రికా సంపాదకత్వమువహించి పనిచేయుచు 1941 సం॥జూలై 1 వ తేదిని తమ 62వ యేట సర్వస్థులైరి. ఆంధ్రుల ప్రతిభ రాజకీయ పరిజ్ఞానమును భారత దేశమంతటను చాటిన శేముషీనిపుణుడు. ప్రఖ్యాత రాజకీయనాయకుడు సర్ తేజబహదూర్ సప్రూగారనినట్లు, చింతామణిగారు ఆంధ్రదేశమునపుట్టి సంయుక్త రాష్ట్రములకు దత్తతనీయబడిన ఆంధ్రపుత్రులు!

టంగుటూరి ప్రకాశంపంతులుగారు :— వీరు వేనవేలు నార్జించు తమ బారిష్టరుపదవిని కాలద్రోసి, కాంగ్రెసు ఉద్యమమున దుమికి "స్వరాజ్య" అను ఆంగ్ల దినపత్రికను మద్రాసునుంచి ప్రారంభించిరి. ఈ పత్రిక అప్పటి సమయములో తీవ్ర రాజకీయసంచలనము కలుగచేసి, నిర్భయమైన సంపాదకీయ విమర్శలకు, వ్యాఖ్యలకు పేరుపొంది, నేటి ఆంగ్లపత్రికలకు సంపాదకులుగానున్న ఆంధ్రులలో ఎక్కువ మందిని తయారుచేసినది. అట్టివారిలో ఖాసా సుబ్బారావు, కృపానిధి, కుందూరి ఈశ్వరదత్తు, కోలవెన్ను రామకోటీశ్వరరావు మొ॥వారు కలరు.

ఖాసా సుబ్బారావుగారు :—వీరు మొదట బొంబాయిలోని "ఫ్రీప్రెస్ జర్నల్" కు సంపాదకులుగాను తర్వాత



శ్రీ ముందుముల నర్సింగరావు,
'రయత్' అను ఉర్దూ దినపత్రికా సంపాదకులు.



శ్రీ బి. ఎన్. గుప్త, ఆంధ్ర జ్యోతి, ప్రజామాత మొ॥ పత్రికా సంపాదకులు.

కలకత్తాలోని 'ఇండియన్ ఫైనాన్స్', మద్రాసునందలి "ఇండియన్ ఎక్స్ ప్రెస్" పత్రికలకు సంపాదకులుగా నుండి పనిచేసి, ప్రస్తుతము "ఫ్రీ ప్రెస్" ఆంగ్ల దినపత్రికా సంపాదకులుగా నున్నారు. వీరి తీవ్రమయిన సంపాదకీయ వ్యాసములు, నిర్భయమైన "సైడ్ లైట్స్" విమర్శలు యావ ద్భారతదేశమందును వీరికి ఖ్యాతి తెచ్చిపెట్టినవి.

కుందూరి ఈశ్వరదత్తుగారు :— స్వరాజ్య పత్రిక ఆగి పోయినతర్వాత కొంతకాలము మద్రాసులోని "పీపుల్స్ వాయిస్" అను దినపత్రికకు సంపాదకులుగానుండి, ప్రస్తు తము లక్నోలోని "ట్వంటియత్ సెంచరి" అను సుప్రసిద్ధ ఆంగ్ల మాసపత్రికకు సంపాదకులుగా నున్నారు.

కోటంరాజు పున్నయ్యగారు ;— కొంతకాలము ఆంధ్ర వారపత్రికకును తర్వాత "హ్యూమానిటీ" అను ఆంగ్ల పక్ష పత్రికకును సంపాదకులుగానుండి ప్రస్తుతము కరాచీలోని "సింధు అబ్జర్వరు" అను ఆంగ్ల దినపత్రికా సంపాదకు లుగా సింధురాష్ట్రమున గొప్పపేరు పొందిరి.

కోటంరాజు రామారావుగారు :—పున్నయ్యగారి సోదరులు. మంచి రాజకీయ పరిజ్ఞానముకలవారు. లక్నోలో, పండిత జవహరలాల్ నెహ్రూ ప్రభృతులచే స్థాపించబడి, కాంగ్రెసుసంస్థకు ముఖపత్రిమ అనదగినటువంటి ప్రఖ్యాత ఆంగ్ల దినపత్రిక "నేషనల్ హెరాల్డ్"కు సంపాదకు లుగా నున్నారు. వీరి సంపాదకత్వమున ఈ పత్రిక తీవ్ర మయిన రాజకీయ ప్రచారముచేసి, ప్రభుత్వమునకు ప్రబల ప్రత్యర్థియై, అనేకమారులు ప్రభుత్వ ఆగ్రహమునకు గురియగుచు, ప్రజల మన్ననలబొంది నిర్విఘ్నముగా సాగు చున్నది. ఈ పత్రికా కార్యాలయములోనే చలపతిరావు గారను ఆంధ్రులు సహాయ సంపాదకులుగానుండి జాతీయ, అంతర్జాతీయ రాజకీయ వ్యాఖ్యానములలో పేరుపొందిరి.

డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు :— వీరు "జన్మభూమి" యన ఆంగ్ల పత్రికనునడపి దేశము నందలి రాజకీయాభివృద్ధికి ఎక్కువ తోడ్పాటునిచ్చిరి. గాంధీ మహాత్ముని భాష్యకారులనదగిన వీరి వ్రాతలు ఎక్కువ ప్రఖ్యాతి పొందినవి. అఖిలభారత సంస్థానప్రజామహా సభయొక్క ముఖపత్రమైన "స్టేట్స్‌పీపుల్" అను ఆంగ్ల వారపత్రిక వీరి సంపాదకత్వము క్రిందనే నిర్వహింపబడు చున్నది.

చావలి వెంకట హనుమంతరావుగారు :— వీరు ఉత్తర హిందూస్థానమున మంచి పేరుపొంది పాట్నాలోని ప్రముఖ జాతీయఆంగ్లదినపత్రికయైన "ఇండియన్ నేషన్"కు సంపాదకులుగా నున్నారు.

జి. వి. కృపానిధి :—వీరు ఢిల్లీలో యునైటెడ్ ప్రెస్, హిందూస్థాన్ టైమ్సు, ఆంధ్ర పత్రికల ప్రధాన విలేఖరిగా



శ్రీ గూడవల్లి రామబ్రహ్మం, ప్రజామిత్ర సంపాదకులు.


శ్రీ సురవరం ప్రతాపరెడ్డి.
గోల్కొండ పత్రిక సంపాదకులు.
హైదరాబాదు.

నుండి పనిచేయుచున్నారు. జాతీయ అంతర్జాతీయ రాజకీయములపై చక్కని వ్యాఖ్యానములను చేయుటలో నిపుణులు.

బొంబాయిలోని "టైమ్స్ ఆఫ్ ఇండియా" పత్రికా ప్రధాన విలేఖరియగు హనుమంత రావుగారు కూడ ఆంధ్రులే.

కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు :—1925 సంవత్సరములో తమ న్యాయవాద వృత్తినుండి విరమించి "త్రివేణి" అను త్రైమాస పత్రికను ఆంగ్లమున మద్రాసు నుండి నిర్వహించుచు ప్రఖ్యాతిపొందిరి. ఇందు, ఇతర భాషలలోని ఉన్నత సారస్వతములోను, ఆంధ్ర సారస్వతములోను, పేరుపొందిన ప్రజ్ఞావంతులయొక్క రచనలు ప్రచురింపబడుచుండును. కళకూ, చరిత్రకూ, సారస్వతమునకూ, మతమునకూ, సాంఘిక రాజకీయములకు త్రివేణీ వ్యాసములు ఎంతయో తోడ్పడినవి. ఇది ఉత్తమశ్రేణికి చెందిన ఆంగ్ల పత్రికగా పరిగణింపబడుచు విదేశముల యందుగూడా పేరుకెక్కినది. ఇది ఇప్పటికిని నిర్విఘ్నముగా సాగుచున్నది.

వైద్యుల రమణారావుగారు :—వీరు ఆంధ్రదేశ పత్రికా రచయితల సంఘ కార్యదర్శిగా పనిచేయుచు స్వయముగ "ఇండియన్ జర్నలిస్టు" అను ఒక ఆంగ్లమాస పత్రికను కొంతకాలము నిర్వహించిరి.

పెక్కురు ఆంధ్రులు ఆంగ్ల పత్రికలలో పనిచేయుచు తమ స్వీయ ప్రతిభను అభివృద్ధి చేసుకొనుచున్నారు. కాని ఆంధ్ర రాష్ట్రమునకు సంబంధించిన విషయములు, ఉద్యమములు, అవసరములు మొదలగువానిని రాష్ట్రేతరులకుగాని, ప్రభుత్వమునకుగాని, ఇంగ్లండునందలి సామ్రాజ్యాధికారులకుగాని తెలియునట్లు ఆంగ్ల పత్రికలద్వారా తెలియపరచుటను వీలులేకున్నది. దీనికి ముఖ్యకారణము, పై ఎల్లరికి తెలియుటకు వీలగు ఆంగ్ల దిన పత్రిక-ఆంధ్రుల పెట్టుబడి, ఆధిపత్యములతో నిర్వహింపబడుచున్నది-ఒకటియును లేకపోవుటయే. కనీసము అట్టి వారపత్రికగూడ ఒకటియును మనకు లేకపోవుట మన దురదృష్టము. ఈ విషయమై పలువురు పెద్దలు ఉపన్యాస వేదికలపైనుండియు, వ్యాసముల ద్వారాను, సభా తీర్మానములద్వారాను దేశమునకు తెలియపరచిరి. కాని కార్య సఫలత కాలేదు. ఆంధ్రమహాసభాధ్యక్షపీఠమును చాలమంది జమీందారులు అలంకరించి, ఈ విషయముయొక్క అవసరమును గుర్తించియు ఒక ఆంగ్ల దిన పత్రికను స్థాపించుటకు ఎక్కువ కృషిజేయకపోవుట విచారకరము. గాన, ఇకముందయినను, ఆంధ్రదేశములోని ప్రముఖులెల్లరు సమావేశమై, లిమిటెడ్ పద్ధతిపైనయైనను ఒక ఆంగ్ల దిన పత్రికను నిర్వహించుటకు తగు మూలధనమును, వలయు పరికరములను సేకరించి కార్యసాఫల్యతకై పని చేయునట్లు ఆంధ్రులు కృషిచేయవలసియున్నది.

**ఆంధ్రులకు ఆంగ్ల దినపత్రికావశ్యకత**

హైదరాబాదునందలి "రయత్" అను ఉర్దూ దిన పత్రికకు సంపాదకులుగా ముందుముల నరశింగరావుగారు పేరు పొందిరి. వీరు ఉర్దూ భాషలో వ్రాయునంతటి నేర్పుగా ఇతర మహమ్మదీయులుగూడ వ్రాయజాలరను ప్రఖ్యాతి పొందిన ప్రసిద్ధ రచయితలు.

ఇంకను చాలమంది ఆంధ్రులు భారతదేశమునందంతటను పత్రికా సంపాదక, సహాయక సంపాదక పదవుల


శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య.
కాంగ్రెసు, నవశక్తి పత్రికల సంపాదకులు.



శ్రీ మిడుతూరి వరదయ్యా శర్మ. ఎమ్. ఏ., న్యూ ఒరిస్సాయను ఇంగ్లీషు దినపత్రికకు (కటక్) సంపాదకులుగా నుండి, ప్రస్తుతం ఆంధ్ర పత్రిక సంపాదకవర్గములో నున్నారు.

యందును, పత్రికా విలేఖరులుగాను పనిచేయుచు ఆంధ్రుల పత్రికా నిర్వహణ సామర్థ్యమును ఎల్లెడలచాటుచు ఆంధ్రులకు కీర్తిని దెచ్చుచున్నారు.

**ఆంధ్ర దేశ పత్రికా రచయితల సంఘము**

ఆంధ్ర దేశమందలి పత్రికారచయితల నందరిని ఏకోన్ముఖమునకు దీసికొని వచ్చుటకై ఆంధ్రదేశ పత్రికారచయితల సంఘము, 1932 లో కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారి యధ్యక్షతను ఏర్పరచబడెను. గాని 1939 సం॥ వరకూ ఈ సంఘము కృషిజేసినట్లు కనపడదు. తరువాత ఈ సంఘపు వార్షిక సమావేశమొకటి గుంటూరిలో, కలకత్తా "అమృత బజార్" పత్రికాధిపతులు తుషారకాంతి ఘోష్ గారి అధ్యక్షతను జరిగెను. మరుసటి సంవత్సరము "ఇండియన్ ఎక్స్ప్రెస్" పత్రికా సంపాదకులు పోతన్ జోసఫ్‌గారి యధ్యక్షత క్రింద ఏలూరిలో, ఆంధ్రదేశ పత్రికార చయితల సంఘము వార్షిక సమావేశము జరిగెను. ఈ సంఘములో ఆంధ్రదేశమందలి సుప్రసిద్ధ పత్రికారచయితలు సభ్యులుగా జేరి వున్నారు. గాని అనుకొనినంత కృషి జరుగలేదు. ఈ సంఘమువారి కృషి ఫలితముగా ఆంధ్ర, తమిళ రాష్ట్రముల పత్రికా రచయితల సంఘ కార్యనిర్వాహకవర్గముల సంయుక్త సమావేశములు జరిపి, దక్షిణభారత పత్రికారచయితలను సమావేశపరచుటకొక సంఘమును ఏర్పాటు చేయవలయునని తలంచిరి గాని ఇంతవరకు కొనసాగలేదు. అప్పుడే, పై సంయుక్త సమావేశములవారు మద్రాసులోని ప్రెస్స్ అడ్వైజరీ కమిటీ వారిని దర్శించి, తమకష్టనిష్ఠురముల దెల్పుకొనిరి. దాని ఫలితముగానేడు, జిల్లాలయందు జిల్లా యధికారులు అప్పుడప్పుడు పత్రికారచయితలను సమావేశపరిచి, వారికి వార్తలు మొ॥నవి లభ్యమగునట్లు చూచుచు, వలయు సమాచారములను ఇచ్చుచు సహాయపడుచున్నారు. ఈ రాష్ట్ర సంఘమున కనుబంధములుగా పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు మొ॥ జిల్లాలలో పత్రికారచయితల సంఘము లేర్పడి పనిచేయుచున్నవి.

చాలకాలమునుంచి, ఆంధ్ర దేశమందలి పత్రికా సంపాదకులనందరిని ఒక సంఘముగా చేర్పరచి ఆంధ్ర పత్రికల నిర్వహణములో అభివృద్ధి కలుగుజేయవలయునను తలంపు పలువురకు గలదు. గాని అది సఫలీకృతము కాలేదు. తరువాత బెజవాడ వాస్తవ్యులు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య మొ॥ వారు తీవ్రకృషిచేసి ఎట్టకేలకు 1940 సం॥ మార్చి నెలలో బెజవాడయందు ఆంధ్రదేశ పత్రికా సంపాదకుల ప్రథమ సమావేశము రామమోహన గ్రంథాలయ భవనము



శ్రీ ఎస్. జి. ఆచార్య: చిత్రగుప్త, చిత్రాంగి, ప్రజాబంధు పత్రికలకు సంపాదకులు.



శ్రీ నెల్లూరి వెంకట్రామానాయుడు,
'జమీన్ రైతు' పత్రికా సంపాదకులు.

నందు జరిపించిరి. ఈ సంఘపు కార్య నిర్వాహకవర్గమునకు తాపీ ధర్మారావుగారు అధ్యక్షులు గాను, అయ్యంకి వేంకటరమణయ్యగారు కార్యదర్శిగాను ఎన్నుకొనబడి, సంఘ కార్యాలయము మద్రాసులో

**ఆంధ్రదేశ పత్రికా సంపాదకుల సంఘము**

స్థాపించిరి. మరుసటి సంవత్సరపు సమావేశ తిరుపతిలో జరుపుటకు ఏర్పాటుచేసిరి; కాని కొనసాగలేదు. ఇంతలో ఈ ప్రపంచయుద్ధపు హడావిడి మూలముగా పత్రికా ప్రపంచమునకే చాల ఇక్కట్లు సంభవించి, ఈ సంఘపు వ్యవహారములు ప్రస్తుతము అంతగా సాగుటలేదు.

ఈ రెండవ ప్రపంచయుద్ధము ప్రారంభమయిన తర్వాత పత్రికా నిర్వాహణమునకు ప్రభుత్వమువారు తరచు కఠిన నిబంధనలను జారీచేయుచు వచ్చిరి. వీటినన్నిటిని చక్కబరచుటకు కొంతకాలము క్రిందట ఢిల్లీలో భారతదేశ పత్రికా సంపాదకుల సంఘము ఏర్పడినది.

**అఖిల భారత పత్రికా సంపాదక మహాసభ**

ప్రభుత్వముతో ఒక ఒడంబడిక కుదర్చుకునిరి; ఆ విషయములలో వ్యవహరించుటకొరకై ఒకస్థాయి సంఘము నెన్నుకొనిరి. ఆంధ్రులగు శివలెంక శంభుప్రసాదు, ఖాసా సుబ్బారావు, కోటంరాజు రామారావు, చావలి వెంకటహనుమంతరావు మొ॥వారు ఆస్థాయిసంఘములో సభ్యులుగానున్నారు.

ఈ క్రింద నివ్వబడివి పట్టిక ప్రకారము చూచిన మనఆంధ్రదేశమునందు కంటెను తమిళ దేశమున పత్రికా ప్రచారము ఎక్కువ అభివృద్ధి లోనున్నట్లు తెలియుచున్నది. గాన ఆంధ్రులెల్లరు తమ పత్రికలను, వాటి స్థిరనిర్వహణకు ఆర్థికముగా ఎక్కువ సహాయపడుచు వాటి నుంచిసాంఘికరాజకీయ సాహిత్యాదిసమస్త విషయములందును అమితముగా ఉపకారము పొందుచు, ఆంధ్రుల ప్రతిభకు దోహద మిచ్చెదరుగాక!



శ్రీ పప్పూరి రామాచార్యులు.
'సాధన' పత్రికా సంపాదకులు.

మద్రాసు రాజధాని యందలి పత్రికలు.

| కాలము | ఇంగ్లీషు | | | | | తమిళము | | | | | తెలుగు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | దినపత్రికలు | వారపత్రికలు | మాసపత్రికలు | ఇతరములు | మొత్తం | దినపత్రికలు | వారపత్రికలు | మాసపత్రికలు | ఇతరములు | మొత్తం | దినపత్రికలు | వారపత్రికలు | మాసపత్రికలు | ఇతరములు | మొత్తం |
| 1920 | 7 | 22 | 29 | 17 | 75 | 3 | 19 | 30 | 4 | 56 | 1 | 11 | 20 | 6 | 38 |
| 1930 | 5 | 19 | 21 | 13 | 58 | 3 | 35 | 52 | 11 | 101 | 2 | 20 | 18 | 7 | 47 |
| 1940 | 5 | 24 | 92 | 132 | 253 | 3 | 46 | 74 | 87 | 210 | 2 | 35 | 88 | 59 | 184 |

(మద్రాసు ప్రభుత్వ పబ్లిక్ (ఎలక్షన్సు) డిపార్టుమెంటువారి పట్టికనుండి.)

ఈ దిగువను ఆంధ్ర దేశములోని గతశతాబ్దమునాటివి, ఇప్పుడు జరుగుచున్నవి—పత్రికల పట్టికలు ఇవ్వబడినవి.

## గత శతాబ్దమునాటి పత్రికలు

| సంచిక | సంపాదకులు | ఊరు | కాలము |
|---|---|---|---|
| సుజనమనోల్లాసిని | ఏడుసూతుల ముత్తయ్యగారు | చెన్నపురి | 1885 |
| హిందూజనసంస్కారిణి | మన్నవ బుచ్చయ్యపంతులుగారు | ,, | ,, |
| ఆంధ్రప్రకాశిక | ఏ. సి. పార్థసారథినాయడుగారు | ,, | 1886 |
| ఇతిహాసమంజరి | నోరి గురులింగశాస్త్రిగారు | ,, | 1887 |
| వైజయంతి | పసప్పాకము అనంతాచార్యులుగారు | ,, | 1894 |
| ఆంధ్రభాషాసంజీవని | కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు | ,, | ,, |
| హాస్యసంజీవని | ,, | ,, | ,, |
| శశిలేఖ | నేలటూరి పార్థసారథి అయ్యంగారు | ,, | ,, |
| ధీమణి | పుల్లెల శ్రీరామశాస్త్రిగారు | ,, | 1895 |
| యథార్థవాది | గరడా సూర్యయ్యగారు | విశాఖపట్టణము | 1885 |
| వివేకవర్ధని | కం. వీరేశలింగముపంతులుగారు | రాజమహేంద్రవరం | ,, |
| హాస్యవర్ధని | ,, | ,, | ,, |
| మనోరమ | చిలకమర్తి లక్ష్మీనృసింహముగారు | ,, | 1899 |
| చింతామణి | వీరేశలింగము పంతులుగారు | ,, | ,, |
| కలావతి | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు | ,, | ,, |
| సరస్వతి | కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట కృష్ణారావుగారు | కాకినాడ | ,, |
| మందారమంజరి | ...... | ,, | ... |
| ప్రబంధకల్పవల్లి | ...... | ,, | ... |
| రాజయోగి | ...... | ,, | ... |
| మంజువాణి | మంత్రిప్రెగడ భుజంగరావుగారు | ఏలూరు | 1889 |
| సుజనవినోదిని | గోసుగుంట కోటయ్యశాస్త్రిగారు | బందరు | 1394 |
| రత్నాకరము | మల్లంపల్లి భైరవమూర్తిగారు | ,, | ,, |
| బుద్ధిప్రదాయిని | నందగిరి వెంకటప్పారావుగారు | గుడివాడ | ,, |
| కవిత | రామకృష్ణకవులు | పిఠాపురము | — |
| సన్మార్గదర్శిని | — | ,, | 1887 |
| సకలార్థదాయిని | కొణకంచి వెంకటాచలముగారు | తుని | 1895 |
| దేశాభిమాని | శేషాచలముగారు | గుంటూరు | 1886 |
| రసికోల్లాసిని | పాలగుడుగు పానకాలరావుగారు | ,, | ,, |
| కల్పవల్లి | కోపల్లి వేంకటరమణరావుగారు | ఒంగోలు | 1894 |
| అముద్రితగ్రంథచింతామణి | పూండ్ల రామకృష్ణయ్యగారు | నెల్లూరు | 1885 |
| వార్తాదర్శిని | — | ,, | 1894 |
| శారద | ఆచంట సూర్యనారాయణరాజుగారు | బుచ్చిరెడ్డిపాలెము | 1895 |

# ఈ శతాబ్దపునాటి పత్రికలు

## దిన పత్రికలు

| పేరు | సంపాదకుడు | ప్రదేశము |
|---|---|---|
| ఆంధ్ర పత్రిక | ఎస్. శంభుప్రసాదు | మద్రాసు |
| ఆంధ్ర ప్రభ | నార్ల వెంకటేశ్వరరావు | ,, |

## వార పత్రికలు

| పేరు | సంపాదకుడు | ప్రదేశము |
|---|---|---|
| ఆంధ్ర వారపత్రిక | ఎస్. శంభుప్రసాదు | మద్రాసు |
| ఆంధ్రప్రజ | డాక్టరు. ఎమ్. ఎస్. ముత్తు | నెల్లూరు |
| ఆంధ్రరైతు | పోతాబత్తుల సూర్యనారాయణ | కాకినాడ |
| భాగవతసేవ | భక్త సుబ్రహ్మణ్యం | బెజవాడ |
| భారతీయ వైశ్య | అన్నవరపు సుబ్బారావు | ,, |
| దీపిక | చే. శ్రీరామమూర్తి | కొవ్వూరు |
| దేశాభిమాని | పి. వి. కృష్ణయ్యచౌదరి | గుంటూరు |
| గోభూమి | పి. నాగేశ్వరరావు | మద్రాసు |
| కాగడా | తాపీ ధర్మారావు | ,, |
| కేసరి | పి. వి. సుబ్బారావు | నెల్లూరు |
| కింగ్స్‌లావర్తమానము | వి. సూర్యనారాయణ | విశాఖపట్నం |
| కృష్ణా పత్రిక | కోట సుబ్బారావు | మచిలీపట్నం |
| మంజువాణి | ఎణ్. చలపతిరావు | ఏలూరు |
| ప్రభాత్ | టి. సూర్యప్రకాశరావు | బందరు |
| ప్రజాబంధు | ఎస్. జి. ఆచార్య | మద్రాసు |
| ప్రకాశ్ | డి. బసవరాజు | ,, |
| ప్రజామిత్ర | జి. రామబ్రహ్మం | ,, |
| ప్రజాసేవ | జి. సుబ్బరామయ్య | నెల్లూరు |
| ప్రజావాణి | పి. ఎస్. ఆచార్య | చికాకోల్ |
| రాయలసీమ | కె. సుబ్రహ్మణ్యం | తిరుపతి |
| రెడ్డి పత్రిక | ఎమ్. అప్పలస్వామి రెడ్డి | విశాఖపట్నం |
| సోంపేట కబుర్లు | ఎస్. సుమతీదేవి | సోంపేట |
| శ్రమజీవి | చిలకమర్తి సత్యనారాయణాచార్య | రామచంద్రపురం |
| సాధన పత్రిక | పి. రామాచార్యులు | అనంతపురం |
| సుబోధిని | ఎమ్. రామకృష్ణరావు | నెల్లూరు |
| స్వరాజ్యగీత | వేదాంతం పూర్ణానందం | బెజవాడ |
| స్వతంత్ర | వి. ఆంజనేయులు | నెల్లూరు |
| త్రిలిజ్గ | వి. వెంకటేశ్వరశాస్త్రులు | మద్రాసు |
| వేదభూమి | జె. నర్సింహాశాస్త్రి | బెజవాడ |
| వాహిని | పి. నాగేశ్వరరావు | మద్రాసు |
| వెన్నెల | ఆర్. వెంకన్న | అమలాపురం |
| యుగంధర | ఎణ్. సుబ్బరాయుడు | ఏలూరు |
| యుగవాణి | ఎస్. గోవర్ధనరావు | బెజవాడ |
| జమీన్‌రైతు | ఎణ్. వి. రామానాయుడు | నెల్లూరు. |
| ఆంధ్రజ్యోతి | బి. ఎణ్. గుప్త | మద్రాసు |
| విజయవాణి | ఎమ్. శ్రీరాములు | అనంతపురం |
| ఆనందవాణి | వి. కాళిదాసు | మద్రాసు |
| ములుకోల (నెలకు మూడుసార్లు) | బి. బుచ్చయ్య చౌదరి | బెజవాడ |

## పక్ష పత్రికలు

| పేరు | సంపాదకుడు | ప్రదేశము |
|---|---|---|
| ఆంధ్రామోమియో పతిక్ | —— | —— |
| తెలుగు జర్నల్ | ఎమ్. ఎస్. మాధవరావు | పిఠాపురం |
| చిత్రగుప్త | ఎన్. మునుస్వామి మొదలియార్ | మద్రాసు |
| దర్బార్ | పి. రామమూర్తి | గుంటూరు |
| హారతి | పి. బుచ్చిరావు | మద్రాసు |
| జయభేరి | కె. ధర్మన్న కవి | రాజమండ్రి |
| జయభారతి | బి. వి. సుబ్బారావు | గుంటూరు |
| కల్పవల్లి | పి. రామకృష్ణయ్య | నర్సరావుపేట |
| కల్యాణి | జి. కృష్ణమాచార్యులు | గుడివాడ |
| లా జర్నల్ | బి. కనకరాజు | ,, |
| లా రిపోర్టర్ | పి. వెంకటసుబ్రహ్మణ్యం | గుంటూరు |
| మారుతి కళ | కె. మధుసూధనరావు | బాపట్ల |
| మాతృసేవ | పి. సుబ్బారావు | విజయనగరం |
| మోహిని | వై. రామారావు | రాజమండ్రి |
| పదసమస్యా సుధానిధి | శ్రీపతి పండితారాధ్యుల నందయ్య | గుంటూరు |
| రెడ్డి | బి. సుబ్బారెడ్డి | కడప |

| | | |
|---|---|---|
| రేనాడు | జి. కృష్ణమూర్తి, | |
| | కె. రామయ్య | ప్రొద్దుటూరు |
| సుదర్శని | డి. నర్సింహరాజు, | రాజోలు |
| తెలుగు దయాల్బాగ్ | పి. యగ్గన్న | కాకినాడ |
| తెలుగు తల్లి | ఎన్. ఆర్. శర్మ | విజయనగరం |
| తీర్పుల పత్రిక | ఎన్. సుబ్బారాయుడు | నెల్లూరు |
| టాంటాం | ఎల్. రామస్వామి నాయుడు | మద్రాసు |
| వాణి | ఎమ్. విశ్వనాథం | ,, |
| వాసవి | జె. నమ్మాళ్వార్ | ,, |

## మాస పత్రికలు

| | | |
|---|---|---|
| అభినవ సరస్వతి | జానపాటి పట్టాభిరామ శాస్త్రి | గుంటూరు |
| ఆది ఆంధ్ర | ఎన్. లక్ష్మణస్వామి | కాకినాడ |
| ఆదిశైవ పత్రిక | సి. పురుషోత్తం | తెనాలి |
| ఆది వెలమ | యస్. రంగారావు | గుంటూరు |
| ఆంధ్రభూమి | ఆండ్ర శేషగిరిరావు | మద్రాసు |
| ఆంధ్రబూధరన్ | కె.రాజరత్నం, పీటర్ బి.సి. | గుంటూరు |
| ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య | ఎమ్. వెంకట్రామయ్య | ఏలూరు |
| ఆంధ్రమాత | పి. సీతారామయ్య | మద్రాసు |
| ఆంధ్రవిద్యా సమ్మేళన పత్రిక | ఎమ్. వెంకటశాస్త్రి | రాజోలు |
| ఆంధ్రి | ఎమ్. సత్యనారాయణ శాస్త్రి | పిఠాపురం |
| ఆయుర్వేద చంద్రిక | డి. రామకృష్ణయ్య | పెరిదేపి |
| బాలకేసరి | మేడిచెర్ల ఆంజనేయ మూర్తి | బెజవాడ |
| భక్తి ప్రబోధిని | అ. హనుమయ్య | గుంటూరు |
| భారతమాత | కామడు వెంకటరెడ్డి | కాకినాడ |
| భారతి | ఎస్. శంభుప్రసాద్ | మద్రాసు |
| భాషామణి | సి. వెంకట్రామయ్య | రాజమండ్రి |
| బైబిల్ రీడింగ్ పత్రిక | రెవ. ఎస్. ఎస్. సుబ్బయ్య | మద్రాసు |
| బ్రహ్మవిద్య | బ్రహ్మానందగిరిస్వామి | రేపల్లె |
| బాలమిత్ర | ఎల్. ఏ. బెయిన్ | మద్రాసు |
| చిత్రాంగి | ఎస్. జి. ఆచార్య | ,, |
| ఢంకా | బి. టి. నర్సింహాచారి | ,, |
| ధర్మసాధని | జె. వి. అప్పయ్యశాస్త్రి | గుంటూరు |
| ధర్మజ్యోతి | కామరాజు హనుమంతరావు | రాజమండ్రి |
| గాంధి | కందికొండ వీరభద్రయ్య | బెజవాడ |
| జ్ఞానప్రియ | తత్త్వానందస్వామి | కొల్లూరు |
| గాస్పెల్ ఇల్యూమినేటర్ | పాస్టర్. పి. సామ్యూల్ | బెజవాడ |
| గౌడ పత్రిక | ఆరేపల్లి పోతరాజు | నిడదవోలు |
| గ్రామసేవ | టి. వి. ఎల్. రామారావు | కాకినాడ |
| గ్రామ గురూపదేశిని | ఎమ్. దేవసహాయం | గుంటూరు |
| గ్రామోద్ధరణ | రావుసాహెబ్ జి. జోగిరాజుపంతులు- | రాజమండ్రి |
| గ్రామోద్యోగి | బుద్ధిరాజు లక్ష్మీహనుమంతరావు | కొండపల్లి |
| గురుపత్రిక | బళ్ల సీతారామరాజు | రాయవరం |
| హరిజన్ | ఉండ్రు సుబ్బారావు | రాజోలు |
| హిందూసుందరి | బాలాంత్రపు శేషమ్మ | కాకినాడ |
| అంతర్జాతీయవార్తలు | రెవ. ఎల్. వాట్స్ | కూనూరు |
| జీవనప్రభ | సి. వెంకటరత్నం | రాయవరం |
| కాంతి | పి. టి. జగన్నాథరావు | తిరుపతి |
| కార్మికబులిటిన్ | టి. వెంకటేశ్వర్రావు | బెజవాడ |
| కథాంజలి | ఎ. యన్. రాఘవాచారి | మద్రాసు |
| కళాజ్యోతి | వి. ఆదిశేషయ్య | గుంటూరు |
| కొరడా | పి. వి. రామమూర్తి | మద్రాసు |
| కులాలు | దేవగుప్త సత్యలింగం ఉడయార్ | నట్టరామేశ్వరం |
| కుమారమిత్ర | పి. బ. కృష్ణమాచార్యులు | బెజవాడ |
| లోకల్ బోర్డ్సు | సి. శేషయ్య | కపిలేశ్వరపురం |
| మాణిక్యప్రభపత్రిక | పి. రామచంద్రశర్మ | శంకరగిరి |
| మాతృవాణి | కర్రా ప్రభాకరరావు, ఎల్. సూర్యనారాయణ | బెజవాడ |
| సత్యరాయబారం | ఎమ్. జె. ప్రకాశం | మద్రాసు |
| క్రైస్తవ వర్తమానం | రెవ. జాన్. ఎలెర్ | నెల్లూరు |
| మోక్షసాధని | కందుర్తి వెంకటనర్సయ్య | గుంటూరు |

| | | |
|---|---|---|
| నవజీవన్ | బి. ఎస్. మూర్తి | మద్రాసు |
| నిరుద్యోగి | ఎల్. సుందరరాజయ్యంగారు | కుప్పం |
| నిత్యానంద | భక్త సుబ్రహ్మణ్యం | మైలవరం |
| ఉడయార్ ప్రతిక | పి. సూర్యనారాయణ | మొయ్యేరు |
| పెంకిపిల్ల | ఎ. కోటీశ్వరరావు | మద్రాసు |
| పూర్ణిమ | ఎమ్. వి. శర్మ | చికాకోల్ |
| ప్రబుద్ధాంధ్ర | ఎస్. సుబ్రహ్మణ్య శాస్త్రి | రాజమండ్రి |
| ప్రకృతి | పి. వెంకట్రామయ్య | బెజవాడ |
| ప్రారంభ విద్య | ఎమ్. మార్కండేయులు | ఏలూరు |
| రవి | జి. బర్సట్ | కాకినాడ |
| రెడ్డిప్రభ | బి. గోవిందరెడ్డి | మొయ్యేరు |
| రెడ్డిరాణి | మల్లిడి సత్తిరెడ్డి | రాయవరం |
| రూపవాణి | పి. సీతారామయ్య | మద్రాసు |
| శంకరం | ఎస్. సత్యనారాయణ | రాజమండ్రి |
| శాంతి | స్వామి ఓంకార్ | తోటపల్లికొండలు |
| సెట్టిబలిజ | పి. వెంకన్న | నాథరామేశ్వరం |
| సెట్టిబలిజ సుందరి | ,, | ,, |
| సేవ | ఎస్. యల్లమందయ్య | మార్కాపురం |
| శిల్ప సమ్రాట్ | కె. వి. రామమూర్తి | విజయనగరం |
| హరనాథమురళి | సేవక్ భగీరథ్ | తెనాలి |
| శ్రీవైష్ణవ పత్రిక | వి. రాఘవాచార్యులు | పెంటపాడు |
| శ్రీరామానుజ పత్రిక | ఎమ్. పార్థసారథి నాయుడు | మద్రాసు |
| సుదర్శనం | బి. రామావతారం | విజయనగరం |
| సుధ | ఎస్. కృష్ణమూర్తి శాస్త్రి | రాజమండ్రి |
| సండే స్కూల్ లెసన్సు | — | — |
| యేసు | ఎమ్. జె. ప్రకాశం | గుంటూరు |
| సూర్య ప్రభ | డి. అప్పారావు | మద్రాసు |
| శ్యామల | సి. జి. మురుగేశ మొదలియార్ | ,, |
| తెలుగు బాప్టిస్టు | ఎమ్. జె. ప్రకాశం | గుంటూరు |
| తెలుగు సినిమా | సి. వెంకట్రామయ్య | మద్రాసు |
| ఉదయకాంతి | ఎమ్. ఆర్. సైమన్ | నర్సాపురం |
| వైద్యప్రదీపిక | డి. రంగాచార్యులు | గుంటూరు |
| విభూతి | వీరభద్రశర్మ | బెజవాడ |
| వినోదిని | ఆర్. రంగనాయకమ్మ | మద్రాసు |
| విశ్వజ్ఞాని | ఎన్. యామినీపూర్ణ తిలకం | ,, |
| విశ్వదాత | పి. చిరంజీవిఆచారి | అత్తిలి |
| వివేకవతి | మిస్ ఎమ్. శ్రీనివాసన్. | మద్రాసు |
| వ్యాయామ కళ | జి. వీరరాఘవులు | గుంటూరు |
| యుద్ధధ్వని | ఎడ్వర్డ్ వాకర్ | మద్రాసు |
| యువకళ | పి. వి. భాస్కరరావు | విశాఖపట్నం |

### వారమునకు రెండుసార్లు ప్రకటింపబడు పత్రికలు

| | | |
|---|---|---|
| యశోద | టి. కె. యశోదాదేవి | రాజమండ్రి |
| తెలుగు | జి. సూర్యనారాయణ శర్మ | ,, |

### ద్వైమాస పత్రికలు

| | | |
|---|---|---|
| ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక | కె. రాఘవాచార్యులు | కాకినాడ |
| క్రైస్తవ నిరీక్షణ | ఎస్. ఫాక్సు | మద్రాసు |
| దక్కన్ వైశ్య | జవ్వాజి సుబ్బరాయగుప్త | నెల్లూరు |
| నాట్యకళ | సి. పద్మారతి దేవి | మద్రాసు |
| విజ్ఞానము | కాళీపట్నపు కొండయ్య | రాజమండ్రి |

### త్రైమాస పత్రికలు

| | | |
|---|---|---|
| ప్రతిభ | తెలికిచెర్ల వెంకటరత్నం | గుంటూరు |
| ఉదయభారతి | పాటిబండ మాధవరాయ శర్మ | అంపాపురం |

### ఆరు నెలల కొకసారి ప్రకటింపబడు పత్రికలు

| | | |
|---|---|---|
| విజ్ఞాన ప్రపంచం | జి. వి. పంతులు | రాజమండ్రి |

[మద్రాసు ప్రభుత్వమువారు పట్టికల ననుసరించి. (ఇందులో కొన్ని నిలిచిపోయినవి గలవు.)]



# ఎనిమిదవ భాగము-కళ

శ్రీ అడవి బాపిరాజు, బి.ఏ., బి.ఎల్.

## 26వ అధ్యాయము

## శిల్పము – చిత్రలేఖనము

విషయ సంగ్రహము :— పూర్వకాలంనుండి ఆంధ్రులన్నికళలందున్న పేరు పొందినవారు ; ప్రాచీనాంధ్ర కళలు వెలసిన తావులు ; భారతీయ కళాశయ నిరూపణవాక్యములు ; పాశ్చాత్య కళాశయ నిరూపణవాక్యములు ; శిల్పము—శాతవాహన శిల్పము ; మూడు యుగముల విశేషములు ; ఇక్ష్వాకాది ఆంధ్రుల శిల్పము ; పల్లవశిల్పము ; కళింగ్రాంధ్రుల శిల్పము ; ఆంధ్ర చాళుక్య శిల్పము ; కులోత్తుంగచోడదేవునివల్ల ఆంధ్రకళా ప్రతిభ దక్షిణ దేశమందును వ్యాప్తిగనుట ; రెండవ కళింగ గాంగుల శిల్పము ; ఆంధ్రవలసరాజ్యముల శిల్పప్రతిభ ; కాకతీయ శిల్పము ; శ్రీకృష్ణ దేవరాయల నాటి శిల్పనైపుణ్యము ; నాయకరాజుల శిల్పము ; మధురమీనాక్షిగోపురములు—.

చిత్రలేఖనము :— చిత్రలేఖన లక్షణము ; శాతవాహన చిత్రలేఖనము ; పల్లవ చిత్రలేఖనము ; ఎల్లోరా చిత్రలేఖనము ; శాతవాహన రాయలయుగ చిత్రలేఖనము ; నేటి వరకును గల అభివృద్ధి—.

గృహ నిర్మాణము :— భారత దేశమందలి ఆలయ నిర్మాణ విధానములు ; పూర్వపు దివ్యహర్మ్యములు. గుహలు. విహారములు. చైత్యములు విహార నిర్మాణ విశేషములు ; స్తూపాలచుట్టునుగల నిర్మాణము ; చాళుక్య. కాకతీయాది ఆంధ్రుల నిర్మాణ కౌశలము ; గోపురముల విశేషములు—.

ఉపక్రమణిక

పూర్వకాలమునుంచీ ఆంధ్రులు లలిత కళలన్నిటిలోను మహోన్నతస్థానము వహించి, ఇతర దేశాలవారికి మార్గదర్శకులై వుండేవారు. కవిత్వంలో, శిల్పంలో, చిత్రలేఖనంలో, సంగీతంలో, నాట్యంలో, ఆలయ నిర్మాణంలో, ఇతర కళావస్తు నిర్మాణ పరిశ్రమలోను—పురాతనాంధ్రచరిత్ర కాలంనుంచీ మొన్నమొన్నటి వరకు—తమ ప్రత్యేకత, ప్రతిభ, ప్రజ్ఞ, వ్యుత్పన్నత ప్రదర్శించినారు.

ఆంధ్రులు మహా సామ్రాజ్యాలను నిర్మించారు. పరిసర రాజ్యాలపై ఛత్రాధిపత్యము వహించారు. పూర్వ పశ్చిమ సముద్రతరంగాలలో వీరి జయభేరీలు మ్రోగినవి. శాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, చాళుక్యులు, కాకతీయులు, విద్యానగరేంద్రులు ఒకరితర్వాత ఒకరు శ్వేతాంధ్రచ్ఛత్రాన్ని ముడవకుండా, దాని అలంకార రత్నకాంతులను దశ దిశలకు వ్యాపింపజేశారు. ఆ సామ్రాజ్యాల కాలాలలో శిల్పాది లలితకళలు మహోన్నత శిఖరాలపై కుబికిపోయినవి.

మన శిల్పములుగల స్థలములు, పరిచయము

పూర్వాంధ్ర శిల్పుల ఈ శిల్ప చిత్రలేఖన ప్రతిభ కన్నులార దర్శించి, వెనకటి మన ఔన్నత్యానికి ఉప్పొంగి, ముందు రాబోవు మన శిల్పకృషికి ఉత్సాహవంతులై నూత్న దీక్షోన్ముఖులు కావాలంటే ప్రతి ఆంధ్రుడు అజంతా, ఎల్లోరా, నాసిక, కార్లేకన్హేరీ గుహలు, కోనూరు, కొలనిపాక, ఒరంగల్లు, పాలంపేట, విజయవాడ, అల్లూరు, గరికపాడు, ఘంటశాల, అమరావతి, నాగార్జునకొండ, మాచెర్ల, చేజెర్ల,



శ్రీ అడివి బాపిరాజు బి ఏ., బి.ఎల్.,

చేబ్రోలు, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, గోలి, రామిరెడ్డిపాలెం, వేంగి, ఆరుగోలను, గుంటపల్లి, రాజమహేంద్రవరం, భీమవరము, ద్రాక్షారామము, శాలిహుండము, రామతీర్థము, సంఘారామము, విజయనగరము, సింహాచలము, ముఖలింగము, పూరి, కోణార్క, జగన్నాథము, బాపట్ల, కొండవీడు, నెల్లూరు, కాళహస్తి, తిరుపతి కొండ, చెన్నపట్టణము, తాడిపత్రి, గుత్తి, హంపి, పెనుగొండ, లేపాక్షి, కంచి, మహాబలిపురము, పక్షితీర్థము, తంజావూరు, తిరుచునాపల్లి, మధుర, రామేశ్వరము మొదలగు ప్రదేశాలకు వెళ్లవలెను.

**కళ-మన దృష్టి**

కళాతత్త్వ విచారణ పాశ్చాత్యులు ఒక రకంగాను, మనవారు ఒక రకంగాను చేసియున్నారు. జర్మను పండితులు మొట్ట మొదటగా పాశ్చాత్యభావాలలో భారతీయ భావాలను జొనిపి, సౌందర్యతత్త్వ, కళాతత్త్వ విచారణలో క్రొత్త పంథాలు త్రొక్కారు. క్షణమాత్రం వాటి అన్నింటిమీద దృష్టిని త్రిప్పుదాము. శుక్రాచార్యులు వారు,

"ధ్యాన యోగస్య సంసిద్ధే ప్రతిమా లక్షణం స్మృతమ్
ప్రతిమా కారకో మర్త్యో యథాధ్యాన రతోభవేత్,
తథా నాన్యేణ మార్గేణ ప్రత్యక్షేణాపివా ఖలు
దేవానాం ప్రతిబింబాని కుర్యాచ్ఛ్రేయస్కరాణి చ,
స్వర్గ్యాణి మనవాదీనా మస్వర్గ్యాణ్యా శుభానిచ
అపిశ్రేయస్కరం నృణాం దేవలంబినులక్షణం
సలక్షణం మర్త్యబింబం నహి శ్రేయస్కరం సదా."

అని భారతీయ శిల్పంయొక్క ఆశయం అగ్ని పురాణంలో చెప్పారు.

"ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కళాసుచ"
అని చెప్పియున్నారు.

"చిన్మయ స్యాద్వితీయస్య నిష్కలస్యాశరీరిణః
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"

అనిన్నీ ;

"సాధకానాం హితార్థాయా బ్రహ్మణోరూపకల్పనా"

అనిన్నీ కులార్ణవతంత్రమందు చెప్పియున్నారు. ఏ శిల్పకారుడైనా కళ—భగవదన్వేషణార్థం, ధర్మార్థ కామమోక్షాది చతుర్విధ పురుషార్థం అని, స్పష్టంగా చెప్పాడు.

భగవంతుడే సత్యం, శివం, సుందరం అయినట్టివాడు. కాబట్టి ఆ సత్యాన్ని, ఆ శివస్వరూపాన్ని, ఆ సౌందర్యతత్త్వాన్ని భావించడం, రూపించడం కళాలక్షణం, శిల్పలక్షణం.

ఈ కళాస్వరూపాలు సంగీతము, కవిత్వము చిత్రలేఖనము, శిల్పము, నృత్యము, ఆలయ నిర్మాణము కదా! ఈ విద్యలు పూర్వకర్మ సముపార్జిత శక్తివల్ల జనించినవి. అందరికి భగవంతుని ఛాయయైన ప్రకృతినిచూసి ఆనందించే లక్షణం ఉంది. ఆ ప్రకృతి భౌతిక రూపంగా,

మనోమయ రూపంగా, బుద్ధిరూపంగా ప్రత్యక్షమవుతూ ఉంటుంది. అలాంటిఅప్పుడు, ఆ ప్రకృతిలో తన మనస్సుకిగాని, హృదయానికిగాని, బుద్ధికిగాని, ఆత్మకుగానీ ఆనందం కలిగించే ఒక దృశ్యం, ఒక రూపం, ఒక జీవితం, ఒక భావము కళాశక్తి గలిగిన రసజ్ఞునికి గోచరించినపుడు అతనిలోవుండే కళాశక్తి పైకి ఒక స్వరూపంగా జన్మించాలని ఆవేదన పొందడంచేత, కళాస్వరూపం ఉద్భవిస్తూన్నది. ఆ కళాస్వరూపంలో ఉన్న ముఖ్యలక్షణం ఆనందం. ఆ సృష్టి భాషాస్వరూపమైతే కవిత్వము, వర్ణస్వరూపమైతే చిత్రలేఖనము, మూర్తి స్వరూపమైతే శిల్పము, అంగవిక్షేపస్వరూపమైతే నృత్యము, భవన స్వరూపమైతే ఆలయము అగును.

కళాతత్త్వ విచారణచేస్తూ పాశ్చాత్యులు రెండు మార్గాలు త్రొక్కారు. ఒకటి గ్రీకు పంథా, రెండవది జర్మను పంథా. సోక్రటీస్, ప్లాటో, అరిస్టాటిల్, ప్లాటినస్ మొదలైనవార్లంతా నీతివాదమార్గాన్నే వెళ్ళారు. చాలా కాలంవరకు ఆ నీతివాదమే కళాతత్త్వజ్ఞులు ప్రకటించారు. కానీ కళాస్రష్టలు మాత్రం, ఈతత్త్వ విచారణతో అవసరం లేకుండా భౌతికము, మనోమయము అయిన సౌందర్యాన్ని గ్రీకు, ఇటలీ దేశములలో సృష్టించి, లోకమున కనుగ్రహించారు. ఫ్రెంచి దేశస్థుడైన మోకెట్ శిల్పి, జపాను చిత్రలేఖన సౌందర్యం దర్శించి "అనుభావ చిత్రలేఖన సంప్రదాయం (Impressionism) సృష్టించేవరకు పాశ్చాత్య శిల్పులందరూ గ్రీకు శిల్పులనే అనుగమించారు" అన్నాడు.

భారతీయ సంప్రదాయ ప్రపంచమును సందర్శించి ఆనందించిన జర్మను పండితులు కళాతత్త్వ విచారణలో రెండవమార్గం త్రొక్కినారు. అది భారతీయవాదానికి దూరపుబిడ్డ. ఈవాదంలో ముఖ్యుడైన హెగెల్ చెప్పిన మాటలు మనవి చేసుకొంటాను.

"Art is that in which the absolute is immediately present to sensuous perception........The beautiful is the shining of the idea through a sensuous medium... The form of the beautiful is the unity of the manifold........The beauty of nature is the immediate unity of notion and reality, but in art it is that where there is the highest revelation of the beautiful."

"అనంతతత్త్వము యొక్క భౌతికమూర్తి సందర్శనమే కళ..............జ్ఞానేంద్రియముల ద్వారాభాసించు భావమే సౌందర్యము......... అనేకత్త్వము యొక్క ఏకదేశిత్వమే సౌందర్య స్వరూపము. సత్స్వరూపము యొక్క మనోమయావతారమే ప్రకృతి సౌందర్యము; కళయందే సౌందర్యము యొక్క పరమ సందర్శనము కలుగుచున్నది."

భారతీయ శిల్పాన్ని సందర్శించి, ఆ ఆశయము శిల్పము యొక్క పరమోద్దేశములని లోకానికి వెల్లడించి చెప్పిన పాశ్చాత్య సౌందర్య తత్త్వజ్ఞుల మాటలను స్మరించటం నావిధియైయున్నది.

ఎరిక్ జీవ్ గారు "In all Indian art there is a recognition of the fact that art is primarily prophecy—that is a translation into material form of the inspiration man receives from God." అన్నారు.

"కళ యొక్క మూలసూత్రం ప్రవచన స్వరూపమన్న సత్యమునే ఆదర్శముగా ఉంచు

కొనినట్లు భారతీయ శిల్పమునందు మనకు ద్యోతకమగుతున్నది. భగవంతునినుండి మనుష్యుడు పొందు ఆవేశము యొక్క భౌతికానువాదమే కళ. ”

ప్రఖ్యాత ఫ్రెంచిశిల్పకారుడైన రోడిన్, నటరాజ మూర్తిని దర్శించినప్పుడు :

“ Full blown in life, the river of life, the air, the sun, the sensibility to be in an overflow—that is how it appears to us—the art of India ”.



అజంతా పదియవ గుహ: డాక్టర్ బర్జెస్‌గారి చిత్రము ననుసరించి.

“ జీవిత మహాప్రవాహంలో జన్మించి, కాంతిలో విలసిల్లి, దెసలవ్యాపించి, జీవితాన్ని అధిగమించిన శక్తిని అలవరించి-ప్రఫుల్లమైనది భారతీయ శిల్పం ” అన్నాడు.

“గ్రీకు శిల్పము, మనుష్యునియొక్క ఉచ్ఛస్థితియే భగవంతునిగా సంభావించినది. కానీ, హైందవభావనము దీనికి విపరీతముగా నడిచినది. అది, భగవంతుని మనుష్యుని యొక్క పరిపూర్ణత్వముగా భావించలేదు; కాని పరిపూర్ణముగాని భగవంతునిగ మనుష్యుని ఎంచినది. అనగా నియమితుడైన భగవంతుడని తాత్పర్యము. ”

**శాతవాహన శిల్పము**

శాతవాహనుల కాలమునకు ముందు ఉండే శిల్పము ఎక్కువగ దొరకలేదు. చంద్రగుప్తుడు రాజ్యం చేసేనాటికే ఆంధ్రులు అత్యున్నతమయిన స్థితిలో ఉన్నారని మెగస్తనీసు వ్రాసినాడుగదా! అప్పటికే ఆంధ్రుల శిల్ప చమత్కృతి విజృంభించి ఉండవలెను. లేనియెడల, హఠాత్తుగా శాతవాహనుల శిల్పము అంత స్వల్పకాలములో వృద్ధిపొందియుండదు.

శాతవాహన శిల్పము నానాటికీ విజృంభించి, ఆంధ్రులు బౌద్ధమతము స్వీకరించే టప్పటికి, మంచి ఉన్నత స్థితిలోనికి వచ్చినది.

కొందరు-శాతవాహన చక్రవర్తులు గాంధార దేశములో రాజ్య మేర్పరచుకొన్న యవన రాజుల శిల్పుల్ని తీసుకొనివచ్చి, వారిచేత శిల్పం చెక్కించిన్నీ, వారి పాదాలవ్రాోల ఆంధ్ర శిల్పులకు శిక్షణ కల్పించిన్నీ, ఆంధ్ర శిల్పమంతా అల్లించారని వాదిస్తారు. ఈ వాదన పరిశీలనా శక్తిలేనివాళ్లకు రుచించవచ్చునేమో!

గాంధార శిల్పానికిన్నీ ఆంధ్ర శిల్పానికిన్నీ సంబంధము ఏమి ఉన్నది? గాంధార శిల్పం వృద్ధిపొందిన రోజుల్లోనే, సమకాలికంగా ఉత్తర హిందూస్థానములో ప్రఫుల్లమైయున్న భారతీయ శిల్ప విన్యాసము గాంధార విన్యాసమునకు సంపూర్ణముగా దూరమైయున్నది. మూర్తి విన్యాసములో, అలంకార శిల్ప రచనలో, శిల్ప

మనోమయ రూపంగా, బుద్ధిరూపంగా ప్రత్యక్ష సందర్శించి ఆనందించిన జర్మన్ పండితులు కళా

ఆంధ్రసర్వస్వము

సమయ గాంభీర్యతలో, గాంధార శిల్పము భారతీయ శిల్పమును ఏమాత్రము చేరలేదు.

గాంధార శిల్పమునకు చాలాకాలము పూర్వమున నేడున్న శిల్పమును తెలియజేసే ఒక నటియొక్క విగ్రహము పాటలీపుత్రములో త్రవ్వినప్పుడు దొరికినది. దీనిని గురించి డాక్టరు స్పూనరీగారు: "పాట్నా మ్యూజియములోని ముఖ్యమైననిధి" అన్నారు. ఈ శిల్పము పోలికలే అన్నిట గలిగినది శాతవాహన శిల్పము. గాంధార శిల్పము భారతీయ శిల్పమునకేమీ సహాయము చేయలేదు గానీ, భారతీయ శిల్పమునుండి గాంధార శిల్పము ఎన్నియో శిల్పరీతుల నలవరచుకొన్నది. దీనిని గురించే నివేదితాదేవి 1910 సం॥ లో 'మాడరన్ రివ్యూ'లో చాలా వ్యాసముల రచించినది. అందులో ఒక వాక్యమును మాత్రము ఉదహరిస్తాను.

"While Gandhara Art made no contribution whatever to the Indian Ideal of Buddha hood,it captured Buddha. Magadha has produced symbols whose dignity Gandhara was never able to approach."

"గాంధార శిల్పము బుద్ధత్వ ఆశయమునకు ఏమీ నివేదించలేకపోయినా, బుద్ధుని మాత్రము సంగ్రహించినది. మగధ సంప్రదాయాలలో జనించిన శిల్ప సమయాలను గాంధార శిల్పమెన్నటికిని గ్రాహ్యము చేసికొనలేక పోయినది."

పలనాడులో దొరుకు పాలరాతివంటి ఒక విధమైన తెల్లని రాతితో ఈ శిల్ప సంపద మూర్తీభవించినది. మూర్తివిన్యాస లాలిత్యము జీవితాన్ని శిల్పరూపంగా సర్వరసపూరితమై ఒప్పేటట్టు చేసే ఓజస్సు, సంయుక్త శిల్పాలను గూర్చే నేర్పు ఆంధ్రదేశమందంతటను వర్షము కురిపించినారు.

అమరావతిలో అశోక చక్రవర్తి కాలంలో నిర్మింపబడిన స్తూపం నానాటికీ వృద్ధిపొంది, వాసిష్ఠీపుత్ర పులుమావి శాతవాహనుని కాలం నాటికి ఉత్తమస్థితికి వచ్చింది.

శాతవాహనుల బౌద్ధశిల్ప చరిత్ర రెండు భాగములుగా విభజించవలసి ఉంటుంది. ప్రథమచరిత్ర, క్రీస్తుకు పూర్వకాలం నాటిది. ద్వితీయ యుగము, క్రీస్తువెనుక రెండవ శతాబ్దం వరకు విజృంభించినది. రూపకల్పనలో, శిల్ప విన్యాసంలో, ఈ రెండుకాలాల శిల్ప విన్యాసమునకు తేడాలు కన్పిస్తవి.

ఈ మొదటియుగమందలి శిల్పము అమరావతి, జగ్గయ్యపేట, కార్లీ, నాసిక మొదలగు స్థలములలో కనబడుతుంది. ఈ కాలమందలి శిల్పంలో ఆభరణములు తక్కువ; ఆడంబరము లేదు.

రెండవయుగమైన క్రీస్తుతర్వాత శకముల నాటిస్థితి, మనకు జగ్గయ్యపేట, కార్లీ, నాసిక, గుంటుపల్లి మొదలయిన శిల్పాలలో కనపడుతుంది. ఈ శిల్పంలో మొదటి యుగంలోని శక్తి యున్నది. అప్పుడప్పుడే విగ్రహాలకు సౌకుమార్యత ఏర్పడుతున్నది. విగ్రహాలు పెద్దవి. ఏకతల శిల్పము, ఆ శిల్పంలో లోతు తక్కువతో చెక్కడము. ఈ శిల్పము అజంతా ప్రథమ చిత్రలేఖనమువలెనే ఉంటుంది. ఆభరణాలు, శిల్ప భంగులు, తలకట్టులు ఎన్నో పోలిక లున్నవి.

పిమ్మట కొంతకాలమునకు, శాతవాహన శిల్పం, అమరావతి నాసికలలో సువ్యక్తమై

యున్నది. ఈ యుగము, క్రీస్తు యుగపు ద్వితీయ శతాబ్దమునాటిది. ఈ శిల్పములో నాగార్జునాచార్యుల మహాశక్తి గోచరిస్తూ ఉంటుంది. పందొమ్మిదవ శతాబ్దాంతాన త్రవ్వితే దొరికినవి. అమరావతీ మహాచైత్యంలోని శిల్పం కొంచెం ఇంచుమించుగా ఈ కాలంనాటిది. ఈ శిల్పంలో బుద్ధదేవుని జాతక గాథలన్ని శిల్పించినారు. ఈ కాలపు శిల్పము, విన్యాసలాలిత్యము, విన్నాణము, గంభీరశక్తి పూర్ణముగా విదజల్లింది.



అయిదవ శతాబ్దమునాటి బరోబదూరు శిల్పము.

ఏ మతవిషయిక భావమైనా సర్వ జీవిత సంబంధమైనదని, ఆంధ్రులు తమ శిల్పమందు చూపినారు. శాంతభూయిష్ఠమైన యోగభావముగాని, చలనభూయిష్ఠమైన సాధారణజీవిత భావముగాని, ఆంధ్రులు అత్యంత నిపుణతతో మూర్తీభవింపజేసినారు. బాహ్యప్రకృత్యనుకరణవాదులు లోపమెంచజాలని బాహ్య స్వరూపసౌందర్యముచే, ఆశయ స్వరూపమైన శిల్పసత్యమునకు పరిచర్య చేయించినారు. జంతువులను శిల్పించడములోనేమి, మానవజీవితములోని రసవత్తర ఘట్టములను శిల్పించడములోనేమి ఆంధ్రశిల్పులు తమ చాతుర్యాన్ని విరజిమ్మినారు. ఆనంద కుమారస్వామిగారు ఈ సందర్భములో " The memory picture or rather a synthetic image based on past experience is from first to last the essential foundation of Indian Art; we cannot recognise here any such innate striving towards realism as that which becomes apparent soon after the primitive developments in Greek and Christian Art. The Indian method is always one of visualisation, unconscious in primitive, systematised in the Nature art. Indian art is always a language employing symbols valid only by tradition and convention " అన్నారు.

" స్మృతి చిత్రము, అనగా జీవితమును పరిశీలించిన పూర్వజ్ఞానము ననుసరించి మూర్తికల్పన జేసుకొనుట, అనాదినుండియు భారతీయ శిల్పమునకు ముఖ్య సూత్రమైన పునాది. భారతీయ శిల్పములో బాహ్యప్రకృత్యనుకరణానికి ప్రయత్నము లేదు. అట్టి ప్రయత్నము గ్రీకు పాశ్చాత్య క్రైస్తవ శిల్పములలో నున్నది. భారత శిల్పము ఎప్పుడును సర్వానుభూతి సంగ్రహదృష్టిస్వరూపము. ఈ దృష్టి ప్రథమంలో ఉద్భవించి, సహజంగా రానురాను అత్యంత సమగ్రమైన శాస్త్రస్వరూపము దాల్చినది. భారత శిల్పముయొక్క ముఖ్య పరిభాష శిల్పసమయమే "

ఈ విషయము దేనికి చెప్పవలసి వచ్చినదంటే, పాశ్చాత్యులలో చాలామందిన్నీ, ఆంగ్లమానస పుత్రత్వము సంపాదించుకొన్న మనలో కొందరున్నూ, ఆంధ్రశాతవాహనశిల్పము-Realistic-అనగా బాహ్యప్రకృత్యనుకరణ భూయిష్ఠమై ఉండేదనిన్ని, నానాటికి ఆంధ్ర శిల్పులు ఇతర భారత శిల్పులతోపాటు మతావేశములోపడి శిల్పసత్యాన్ని కూలద్రోసి, శిల్పమును సమయ భూయిష్ఠము చేసినారనిన్నీ అంటూఉంటారు. వారికి భారత శిల్పసత్యము గోచరింపలేదని మాత్రం మనవి చేస్తున్నాను. భారత శిల్పసత్యమైన శిల్పసమయప్రజ్ఞకు దూరమును, అపశ్రుతియుగాని బాహ్యసౌందర్యమును ఆంధ్ర శిల్పులు మూర్తీభవింప జేసినారు, అంతే. ఆంధ్రదేశములో బౌద్ధమతము విజృంభింపని కాలములోగాని నిండివున్న కాలములోగాని, మరల పౌరాణికయుగము పునర్జన్మ పొందిన కాలములోగాని, ఆంధ్ర శిల్పులు ఈ సంప్రదాయమును ఎప్పుడున్నూ మరచిపోలేదు.

సాంచీస్తూపము, స్తూపముచుట్టూ ఉన్న ద్వారములు ఆంధ్రశిల్పులు నిర్మించినవే. నాసికలోని గుహలు, అజంతాలోని మొదటి గుహలు, ఔరంగాబాదులోని గుహలు పూర్వ శాతవాహనులు నిర్మించినవే. ఆదిదినాలలో వారు బుద్ధుని జీవితము ఏ ఛత్రరూపంగానో, చక్రరూపంగానో, పాదచిహ్నరూపంగానో చిత్రించేవారు. తరువాత తరువాత,బుద్ధునియొక్క మూర్తిని విన్యాసముచేయ ప్రారంభించినారు. స్తూపముచుట్టూ రాతికంచెలు, ద్వారములు ముద్దులు మూటకట్టునట్లు సృష్టించినారు. ఈ రాతికంచెలలోని ఫలకములలోను, స్తంభములలోను బౌద్ధగాథలు, సాధారణ మానవ జీవిత సంబంధమైన దృశ్యములు, శిల్ప నృత్యమైన (Decorative Art) అలంకార శిల్పము, గుజ్జు బాలురు, యక్షులు, నాగములు, రెక్కలున్న గుఱ్ఱములు, జానపద జీవిత దృశ్యములు, రాజ సభలు, వనవిహారాలు మొదలగు అద్భుత శిల్పవిషయాలను అల్లివేశారు. పోయిన శిల్పములుపోగా, మిగిలిన ఆంధ్రశాతవాహన శిల్పములు లండను, బెర్లిను, మదరాసు, కలకత్తా, బోస్టన్ మొదలగు మ్యూజియముల నలంకరించుచున్నవి.

ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యము విచ్ఛిన్నమైనతరువాత, నాగార్జున కొండలో శ్రీ పర్వత విజయపురము రాజధానిగా ఏలిన ఇక్ష్వాకులు సామ్రాట్టులైనారు. నాగార్జునకొండ అనగానే ఆంధ్ర చరిత్రలో మహాద్భుత పురుషుడైన నాగార్జునుడు మన కళ్లఎదుట మూర్తీభవిస్తాడు.

ఇక్ష్వాకులు మొదలగువారి శిల్పము

ఇతడు బుద్ధుని తర్వాత బుద్ధునియంత జ్ఞాని. నాడు ప్రపంచమున వెలిగిన పరంజ్యోతి. ఇతడు స్థాపించిన సంఘారామ మహావిద్యాపరిషత్తు సర్వకళలను దేశములకు వెదజల్లినది. ఈతడు నిర్మాణం చేయించిన శిల్పములు విదేశముల లోను వన్నెకెక్కినవి. నేటి నాగార్జునకొండలో ఇటీవల బయల్వెడలిన శిల్పము శాతవాహన శిల్పానికి అనుగు బిడ్డ. వీరిశిల్పము విన్యాసము లో, లాలిత్యములో, గంభీరతలో శాతవాహన శిల్పానికి వన్నెలు తీర్చినది. స్తూపము చుట్టూ అతికించిన తెల్లని పాలరాతిమీద చెక్కిన ఈ శిల్పము, బౌద్ధ జాతక గాథలను ప్రత్యక్షం

చేస్తూఉన్నది. సంఘజీవితములో అలంకార శిల్పము, నాట్యశిల్పము దివ్యప్రపంచమై భాసించినవి.

ఇక్ష్వాకుల రాజ్యమైన వెనుక, వేంగీలోని సాలంకాయనులు, బృహత్పాలాయనులు, కృష్ణా జిల్లాలోని విష్ణుకుండినులు ఒకరితర్వాత నొకరు మహారాజులైనారు. వీరి కాలంనాటి శిల్పము ఇంకా బయల్పడలేదు.

పల్లవులు ఆంధ్రులన్న విషయము ఎవరూ అనుమానించదగినదిగాదు. పలనాడు లేక పల్లవనాడుకు చెందినవారు. తమ రాజ్యమును విస్తరింపజేసుకొని నెల్లూరు, కాంచీపురముల దాటి—శాతవాహనరాజ్యం క్షీణించినప్పుడు - కాంచీపురములో స్వతంత్రులై చక్రవర్తులైరి. క్రీ. వె. నాలుగయిదు శతాబ్దములలోనే వీరు, ఆంధ్ర శాతవాహన శిల్పానికి ప్రేమపుత్రికయైన శిల్పాన్ని, మహాబలిపురంలో మూర్తీభవింప జేసినారు.

పల్లవ శిల్పము

త్రిలోచనపల్లవుడు ప్రథమ పల్లవ రాజులలో ఒకడు. పల్లవబొగ్గ, క్రీ. శ. 100 సంllన వీరికి ఒక ప్రధానస్థలముగా ఉన్నట్లు మహావంశములో చెప్పబడియున్నది. వీరి సామ్రాజ్యము ఒంగోలునుంచి కాంచీపురము వరకు, కాంచీపురమునుండి పుదుక్కోట వరకూ విస్తరించియున్నది.

నాడు :—కాకుల కలకలము. తూర్పున ఉషాకన్య చిరునవ్వుల కాంతులు ప్రసరిస్తున్నది. మందమలయానిలాలు, సముద్రఘోష. వెనుక ప్రక్కనే పక్షితీర్థపు కొండలు. "బలి యిక్కడ పరిపాలించాడా ? నిశాంభాసురుని ఓడించిన ఆంధ్ర విష్ణు సార్వభౌముడు బలి భక్తిని సంపాదించుకొన్నాడా ? సామంతుడై, స్వామిభక్తి యున్నప్పటికీ, ఏనాటికైనా తన సామ్రాజ్యానికి ముప్పుతీసుకొస్తాడని దూరానఉన్న బలిద్వీపాలకు తరిమేశాడా, ఆంధ్ర విష్ణువు?" అని ఊహించుకుంటూ నేను బలేశ్వరమునకు వెళ్లేటప్పటికి భళ్లున తెల్లవారింది. శిథిలాలయాలు, జీర్ణ శిల్ప సంపద, పాడుపడిన గోపురాలు సందర్శించి



శిల్ప సుందరి

నప్పుడు, యెవ్వడో రాక్షసుడు తన కర్కశహస్తముతో జీవితాన్ని పిండివేసినట్టుగా వుంటుంది. దీనిలోని చక్కని దేవాలయము-సగము సముద్రములో స్నానముచేస్తూ క్షణంలో మాయమై పోవుటకు సిద్ధంగా వుండినట్లు-జూచి ఒక నిట్టూర్పు విడిచి, అలాగే ఉండిపోయాను !

ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యముయొక్క చిట్టచివరలో, ఆంధ్రశాతవాహనశిల్పం తన

తేజాన్ని చాలావరకు కోల్పోయింది. అలాంటి సమయంలో మహాబలిపురములో పల్లవులు నూత్నశక్తిని ఉద్దీపన మొనర్చి, ఆంధ్ర శిల్పంలో ఒక నూతనశకము ప్రారంభించారు. మహాబలిపుర శిల్పాన్ని గురించి ఆనందకుమారస్వామి గారు ఇట్లు వచించారు.

"సంచలనశక్తివంతమై, స్వేచ్ఛాపూర్వకమైన విన్యాసము కలిగియున్నది. వీరపురుషుని సింహ మధ్యము, విశాల భుజస్కంధము, స్త్రీమూర్తుల ఘనకుచాలతో ఈ శిల్పము లాలిత్య భూయిష్ఠమై, విచిత్రమైన సున్నితాన్ని కలిగియున్నది."

ఆంధ్ర శిల్పులు నాశికగుహల నిర్మించిన శక్తితో మహాబలిపుర ప్రాంతాల గుహలను దొలిచినారు. ఆ గుహలలో శిల్పము సంకల్పించినారు. ఒకేరాతిని రథస్వరూపమైన దేవాలయముక్రింద చెక్కినారు. కొండ ప్రక్కన రాతిపైన శిల్ప సంపదను వెదజల్లినారు. కోతులు, గొడుగు పట్టుకొని వెళ్ళు పురోహితుడు, వృద్ధ తపస్వి మొదలైన వెన్నియో శిల్పించినారు. రానురాను సముద్రతీరమున కనపడిన గుడివంటి గుళ్ళను నిర్మించినారు. అవి కట్టడపు గుళ్ళు!

మొదటి మహేంద్రవర్మ; మొదటి, రెండవ నరసింహవర్మల కాలములలో మహాబలిపురశిల్పము రూపము తాల్చినది. ఇవిరాతి రథములు, పూర్వకాలపు చైత్యాలు, విహారాలలోనుంచి ఉద్భవించిన దేవాలయ స్వరూపాలు.

విష్ణుకుండినుల కాలంలోనే తూర్పుతీరంలో నేటి గోదావరి, విశాఖపట్నం, గంజాం జిల్లాలు కళింగరాజ్యమని పేరు పొందినవి. ఆకళింగ దేశమును గాంగవంశజులు, సాలంకాయన విష్ణుకుండినులతో సమకాలికులై స్థాపించినారు.

**గాంగ శిల్పము**

శాతవాహనుల కాలంలోనే ఖారవేలాది కళింగరాజులు ప్రసిద్ధికెక్కిరి గదా! ఈ కళింగదేశ శిల్పులే రానురాను ముఖలింగం దగ్గరను, శాలిహుండాం దగ్గరను, రామతీర్థములోను శిల్ప నిర్మాణము కావించిరి. ఈ ప్రథమ గాంగశిల్పము ఇప్పటికిన్నీ శక్తి సమన్వితమై కనిపించుచున్నది.

చాళుక్యులు ఘూర్జర దేశాన్నుంచి వచ్చిన క్షత్రియులమని చెప్పుకొంటారు. వారుప్రథమంలో వాతాపీనగరంలో రాజ్యస్థాపనం జేసారు.

**ఆంధ్ర చాళుక్య శిల్పము**

శాతవాహనులలో కొందరు పడమటి తీరంలో చాలా కాలము విజృంభించే యుండిరి. ఈ ఆంధ్ర శాతవాహనుల పశ్చిమ రాజ్యాలలో అజంతా, ఎల్లోరా మొదలైన ప్రదేశాలు ఇమిడి ఉండేవి. పూర్వకాలపు ఓజస్సు కోల్పోయినా, ఈ రాజ్యాలలోని శిల్పులు ఎల్లోరా పర్వతములోని పెద్ద గుహలను నిర్మించారు; అజంతా గుహలను నిర్మించారు. బలహీనులైన ఈ శాతవాహనుల నోడించి, ఉత్తరాన్నుంచి వచ్చిన చాళుక్యులు రాజ్యము స్థాపిం



కీ. శే. శ్రీ నూతలపాటి నర్సింహం, శతశిల్పి.

చారు. వీరు వచ్చి, విజృంభించుచున్న తమ నూత్న శక్తితో, వాతాపి నగర గుహల్లో శిల్ప సంపదను వెదజల్లింప జేసినారు.



చిత్తూరుజిల్లా సోంపల్లిలో శ్రీ చెన్న కేశ్వరస్వామి ఆలయం ఎదుటగల ఏకశిలా స్తంభం; ఎత్తు 60 అడుగులు; కొన్నివందల సంవత్సరాలక్రిందట చెక్కబడినది.

ఈ చాళుక్యుల ఉధృతము నానాటికి అధికమై దక్షిణాసికి హాని సిరాకుండా చేసినది. వీరు తమ రాజ్యాన్ని విస్తరించుకొని తూర్పుతీర రాజ్యాన్ని నెగ్గి, వేంగీపల్లవుల నాక్రమించారు. (పశ్చిమ చాళుక్యుల వేంగిరాజ ప్రతినిధి కుబ్జవిష్ణువర్ధనుడు) వీరు స్వతంత్రించి తూర్పు చాళుక్యులై, సంపూర్ణాంధ్రత్వములో స్నాతులై ఆంధ్ర చాళుక్యులైనారు. వీరు నానాటికీ విజృంభించి పల్లవ రాజ్యము సంపూర్ణముగా ఆక్రమించుకొని, పల్లవ రాజులను నాశనం చేశారు. చోళులతో వియ్యాలంది, తమ చక్రవర్తినే (రాజరాజ కులోత్తుంగచోళుని) అచట చక్రవర్తిగా చేసారు.

కులోత్తుంగచోళదేవుని మూలంగా చాళుక్య చోళరాజ్యములు రెండున్నూ ఏకమయినట్లే, ఈ రెండు రాజ్యములందలి నాగరికత, సంస్కృతి, కళ కొంతవరకు ఏకమయినవి. కుంభకోణము, చిదంబరము, తిరువన్నామలై మొదలగు స్థలములందలి శిల్పములలో ఆంధ్రశిల్ప ప్రభావము కనబడుతున్నది.

ఈ చాళుక్యులు ప్రథమంలో జైన మతావలంబకులై, తరువాత శైవమతదీక్ష వహించారు. కాబట్టి ఆంధ్రదేశంలో మొదట జైన శిల్పం తీసుకొని వచ్చినవారు వీరే. బసవేశ్వరుని శకమైనవెనుక చాళుక్యులందరు జైన మతావలంబదీక్షులు. అక్కడనుంచి రాజమహేంద్రవరం, ద్రాక్షారామము, సింహాచలం, భీమవరం, సామర్లకోట ఇంకా అనేక గ్రామాలలో వీరు శైవమతావేశులై శిల్పం వెదజల్లినారు. సముద్రతీరాలలో అనేక చిన్న గుళ్ళు చాళుక్యుల కాలములో వెలసినవే. ఒక్క ప్రదేశంలోను చాళుక్యుల శిల్ప సంపద పిండు కట్టలేదు. కొంత మహాబలిపురములోనున్న శక్తియు, కొంత లాలిత్యమును సమ్మిళితము జేసి-అప్పుడే ఉద్భవించిన అనేక శిల్ప గ్రంథాల ననుసరించి-చాళుక్య శిల్పము వెలిసింది. ఈ నాటికిని ఈ తూర్పుతీర జిల్లాలలోని హీనస్థితికి వెళ్లిన చాళుక్య సంప్రదాయములోని ఆంధ్ర శిల్పులు, మూర్తి కల్పనచేస్తున్నారు. రాజమహేంద్రవరం మ్యూజియములోను, మార్కండేయస్వామి గుడిలోను, బిక్కవోలు, సింహాచలము గుళ్ళలోను, భీమవరపు భీమేశ్వరస్వామి,

కోవెలలోను, ఆంధ్ర జాతీయ కళాశాలలోను, బెజవాడ, మద్రాసు మ్యూజియములలోను, ఆంధ్ర చాళుక్య శిల్పముయొక్క ఉచ్ఛస్థితిలో రూపము పొందిన విగ్రహాలు కనపడుతవి.

ముఖలింగం రాజధానిగా రాజ్యమేలిన తరువాత గాంగులు, చాళుక్యులతోపాటు తమ శిల్ప చమత్కృతిని జగన్నాథంలోను, కొనారకాలోను, ముఖలింగంలోను పరమాద్భుతమైన స్వరూపాలతో ప్రత్యక్షంచేసినారు. కొనారకాలో సూర్యదేవాలయము నిర్మించిన ఆంధ్ర శిల్పులు, మహాబలిపురంలోని శిల్పులకు సంపూర్ణంగా ఆత్మపుత్రులే! దేవాలయము అంతా ఒక మహారథం క్రింద చిత్రింపబడివున్నది. రథంలాగే గుర్రాలు జవము, తేజస్సు గలిగినటువంటి మూర్తులు. కొనారక సూర్యరథ దేవాలయాన్ని నిర్మించినది నరసింహగాంగుడు. భువనేశ్వరములో ఈ గాంగవంశమువారు నిర్మించిన దేవాలయములు పరమలాలిత్యాన్ని చేకూర్చుచున్నవి.

రెండవ కళింగ గాంగులు-వారి శిల్పము

బర్మాకు, బలిద్వీపానికీ, జవద్వీపానికీ, కాంభోజదేశానికీ ఆంధ్రులు వలసపోయి రాజ్యాలు ఏర్పరచినట్లు, చరిత్రవల్ల స్ఫుటమౌతున్నది. జావాలోని బరోబదూరులో కలిసిన శిల్పము, అమరావతిలోని ఆంధ్ర శాతవాహన శిల్పాన్ని అన్ని విధాలా పోలివున్నది. శ్రీకాకుళాన్నుంచి, మోటూపల్లినుంచి ఆంధ్రుల నావలు శ్వేత హంసలలా తెరచాప లెత్తుకొని-ఆంధ్ర శాతవాహనులనాటి నుంచి-రోమక, పారశీక, అయిగుప్తాది దేశాలతోను; సువర్ణ, బలి, జావా మొదలైన ద్వీపాలకు వర్తకముకై వెళ్లేవి. ఈతూర్పుద్వీపాలలో వలసరాజ్యాలు ఏర్పరచారు. బరోబదూరులోని జ్ఞానబుద్ధుడు, ప్రజ్ఞాపరిమితాదేవి, అలంకార శిల్పము, సాంఘిక శిల్పము అన్నీ ధాన్యకటక నగరంలోని నాగార్జునకొండ శిల్పాన్ని పోలివున్నవి. చివరకు బలిద్వీపము, జవద్వీపముల లోని ఆచార వ్యవహారాదులు, శిల్పము, నృత్యము చాళుక్యుల, కాకతీయుల కాలంనాటివి.

ఆంధ్ర వలసరాజ్యముల శిల్పప్రతిభ

కాంబోడియా దేశంలో, ఆంధ్ర బ్రాహ్మణుడు ఆదేశపు రాజకుమార్తెను వివాహమాడి, అక్కడి రాజ్యవంశానికి ప్రధానపురుషుడైనాడు. ఆంధ్ర శిల్పులున్నూ, వారి శిష్యులైన ఆదేశవాసులున్ను, అంగకరు వాటులో ప్రత్యక్షమవుతూవున్న ఆదేశశిల్పాన్ని జీవింపచేశారు.

పాలంపేట, హనుమకొండలలోని శిల్పము రసప్రవాహంలో ముంచెత్తుతుంది. నాట్యము, నృత్యము, తాండవము, లాస్యము, ఉదయసంధ్యా నృత్యము, సాయంసంధ్యా నృత్యము, మూడు జగాల పథాలలో ఒక అడుగు అటు ఒక అడుగు ఇటుగా సర్వకళా జనకుడియైన పరమేశ్వరుడు, భ్రామ్యాచార-ఆకాశాచార సర్వతాళములు, సర్వకరణాంగ విక్షేపణాలు, అభినయ విలాసాలు, చిదానందలయములను ఆత్మపంథాలలో మూర్తింపగలిగిన మాయా శిల్పాన్ని కల్గించగల్గారంటే, కాకతీయుల శిల్పశక్తి వర్ణింపలేము! పాలంపేటలోని నృత్యమూర్తులు, ఓరుగల్లులోని నృత్యమూర్తులు, ఉన్నత శిల్పాలు—రాజపుత్ర చిత్రలేఖనసూక్ష్మాన్ని సంపూర్ణంగా మరపించే సూక్ష్మ శిల్పము. విశ్వమంతా నృత్య గాంధర్వమై సాక్షాత్కరిస్తుంది. నందులు, ఏనుగులు, హంసలు,

కాకతీయ శిల్పము

మృదంగవాద్యములు ఆ చుట్టుపట్ల ప్రత్యక్షములై ఉన్నవి. కాకతీయ శిల్పచమత్కృతి అంతా లాలిత్యభూయిష్ఠమై కైశికీవృత్తి స్వరూపమై వున్నది. కాకతీయ దేవాలయ స్వరూపాలు ఆ కైశికీ వృత్తినే పుణికి పుచ్చుకొన్నవి. వృత్తరూపమయిన అలంకార శిల్పము ఈ గుళ్ళలోని గర్భాలయ ద్వారాలలో నిర్మితములైనవి. స్తంభాలున్నూ, చాళుక్య స్థంభాలకన్న శేముషీత్వము సంపాదించుకొన్నవి. కాకతి చక్రవర్తుల శిల్పవైభవము కాకతిదేశమంతా పంటలు పండినది !

**రాయలయుగ శిల్ప విన్నాణము**

రసజ్ఞులగు మీరందరూ, హంపిని ఒక మాటు సందర్శించవలసినదని వినయపూర్వకంగా వేడుకొంటున్నాను. ఆ తుంగభద్రాతీరాన మను చరిత్రను, ఆముక్తమాల్యదను సంస్మరింప జేసేటట్టి-ఒరనుండి పెరికిన ఖడ్గపు తళతళలు, శత్రురాజులు తమ



మాచెర్ల శిల్పము.

కిరీటాలుతీసి రాయలసార్వభౌముని పాదాల సమర్పించునట్టి దృశ్యము, కళ్ల యెదుట నాట్యమాడింపజేసేటట్టి ఉత్కృష్ట శిల్పసంపద విరిగి శకలాలై, కొన్ని యోజనాల స్థలమున పడివున్నదంటే యెరసజ్ఞుని ఆత్మ, హృదయము, దేహము, గడ్డకట్టి ఆ నల్లరాళ్లతోపాటు రాయియై పడి పోదు !

ఓ విజయనగర సామ్రాజ్యమా ! నీతోపాటు రాయల ఔన్నత్యముయొక్క ఆఖరి వెలుగు ఆరిపోయినది. ఉత్తమ శిల్పము భూగర్భమున ఒలికిపోయినది. ఆంధ్ర మహోదారహృదయము దివ్యమైన ఒక్క హారతి కర్పూరపు వెలుగు వెలిగి, ఆత్మార్పణ చేసికొన్నది !

ఎల్లోరాను మరపించే గంభీరత, ఒరంగల్లు శిల్పాన్ని మరపించే లాలిత్యము, శాతవాహన కళావైభవాన్ని మరపించే కళాచమత్కృతి, రాయలశకవైశాల్యములో తాండవించి పోయినవి. మహాబలిపురములో ఉన్న ఏకశిలా దేవాలయ సృష్టి విరూపాక్షుని రథమందు వెలుగై, తళుకై వెలిగింది. హనుమకొండలో ఉన్న సహస్రమండపము హంపిలో ఎక్కువ తేజస్సుతో పునర్జన్మ మెత్తినది. ఆ స్తంభములు గాన మొనరిస్తవట!

అదే ఆ కృష్ణదేవుడు తులాభారము తూగినట్టి తులాస్తంభ నిర్మాణము ! ఆ మహారాజులు జలక్రీడలాడు స్నాన కమలాకరం ! అదే, సార్వభౌముల మహాభవనము ! ఇక్కడ ఏనుగులశాల రాళ్ళుపరచియుండి, నేటికిని చెక్కుచెదరదు. విజయనగరరాజవీథిని నడచి గణేశుని గుడి, పంపాపతిగుడి దర్శించితీరవలె. హజార రాముని గుడిలో చక్రవర్తుల సింహాసన శిలావేదికపైన ప్రత్యక్షమయ్యే శిల్పసంపదను ఎంత వర్ణించినా తీరదు. ఈ సందర్భములో ఆ శిల్పమునుగురించి వ్రాసిన మేజర్ ఎస్. డబుల్యూ. వాక్‌స్టాఫ్ మాటలు జ్ఞప్తికి వస్తున్నవి.

“నిధులు కట్టినశిల్ప సంపద............వస్తు విన్యాసరచనలో, ఆత్మ విశ్వాసములో, శిల్ప సామర్థ్యములో విజయనగర శిల్పమునకు జోడైన శిల్పము లేదని మనము చెప్పవచ్చును.”

శ్రీ కృష్ణరాయ సార్వభౌములు తన సేనానాయకులైన తెలుగు నాయకులను రాజప్రతినిధులుగా చాలాచోట్ల ఉంచినాడు. తంజావూరిలో, మధురలో, కేరళములో ఈ నాయకులు రాజ్యభారాలు వహించి, తమ పాలనలో ఉన్న దేశాన్ని అభ్యుదయస్థితికి తీసుకొనివచ్చి, పరిపాలన చేసేవారు.

ఆ రోజుల్లోను, తర్వాత విజయనగర సామ్రాజ్యం విచ్ఛిన్నమై చక్రవర్తులు నామ మాత్రులై ఉన్న రోజుల్లోను ఈ

**నాయక రాజుల శిల్పము- మధుర మీనాక్షి గోపురములు**

నాయక రాజులే, మహమ్మదీయులు శిథిలం చేసిన మధుర, తంజావూరు, శ్రీరంగం, రామేశ్వరం, మొదలయిన పుణ్యక్షేత్రాలలోని పవిత్ర దేవాలయాలను పునరుద్ధరణ చేయడంలో చోళ, పాండ్య శిల్పాలకు వన్నెగూర్చే అద్భుత శిల్పం, అల్లించివేశారు. విమానాలు, మండపాలు, గోపురాలు, విగ్రహాలు, తోరణాలు క్రొత్తవి అనేకం, వివిధమూర్తి స్వరూపుడైన భగవంతునికి అర్పించారు.

విజయనగర సామ్రాజ్యము విజృంభించక ముందు, కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన

వెనుక, ఆంధ్ర దేశమంతా రెడ్డి రాజ్యాలు ఏర్పడినవి. చాళుక్య స్వామ్రాజ్యము

ఉపసంహారము

విచ్ఛిన్నమైన వెనుక ఆంధ్ర దేశమంతటా ఏర్పడిన రెడ్డి రాజ్యములు, చాళుక్య కాకతీయ స్వామ్రాజ్యాల మధ్యకాలంలో విజృంభించిన చిన్నచిన్న రాజ్యములు అన్నియు కాకతీయ స్వామ్రాజ్య శిల్ప విధానాన్ననుసరించి అనేక శిల్పాలను దేవాలయములలో ప్రతిష్ఠింప జేసినారు.

ఆంధ్ర జాతీయ చిత్రకళా స్థాపకుడు



కీ. శే. శ్రీ దామెర్ల రామారావు.

కాకతీయుల శిల్పము మైసూరు రాజ్యమునందు ప్రవేశించి హాలిబేడు మొదలయిన ప్రదేశములలోని శిల్ప లాలిత్యముగా వెలసి, పుష్కలముగా విజృంభించినది.

ఆంధ్రదేశములో శిల్పము నానాటికీ క్షీణించి పోయినది. ఈనాడు శిలాశిల్పముగానీ దారుశిల్పముగానీ, లోహ శిల్పముగానీ మచ్చునకైనా కనిపించుట లేదు. చేబ్రోలులో ఒక మహమ్మదీయ శిల్పి ఉన్నాడు. అతడు ఆంధ్ర శిల్పుల వంశీకుడు. చేబ్రోలులో ఒక మండపమున్నూ, మండపము అడుగు భాగమున చుట్టూ ఎర్రరాతి మీద జంతు శిల్పములున్నూ విన్యాసం చేసినాడు. శిల్ప దీక్షవహించినవారిలో, ఆంధ్రులలో నారాయణరావుగారు మొదలగు ఒక రిద్దరు మాత్రమే ఉన్నారు. కానీ, ఈ శిల్పకళను పునరుద్ధరించవలసిన విధి ఆంధ్ర మహాజనులపైన లేదా?

## చిత్రలేఖనము

శిల్పము వలెనే ఆంధ్ర దేశములో చిత్రలేఖనము మహోన్నతదశకు వెళ్ళినదనే నిదర్శనములు అనేకములున్నవి. కవిత్వమునకు చిత్రలేఖనకు సాదృశ్యము అధికముగానున్నది. రామచరిత్రము రామాయణము చదివి తెలుసుకొన్నట్లే చదువుకొన్నవారికి చదువుకోని వారికి ఆహ్లాదం ఇచ్చేటట్టు రామకథ మన దేవాలయ కుడ్యములమీద చిత్రించేశారు. శిలతో, దారువుతో, లోహంతో శిల్ప విన్యాసం చెయ్యడం కష్టం; గానీ ఫలకాలపై, కుడ్యాలపై చిత్రరచన

చిత్రలేఖనము

చెయ్యడం అంత కష్టంగాదు. పూర్వం రాకుమారులు, రాకుమార్తెలు చిత్రరచన చేస్తూవున్నట్టు పురాణాలు గాథలు స్పష్టంగా చెప్పుచున్నవి. వాత్స్యాయన కామసూత్రాలలోను, విష్ణుధర్మోత్తరములోను

చిత్రలేఖనకళను గురించీ, రంగులను గురించీ, కుంచెలను గురించీ స్పష్టంగా వర్ణించినారు. శిల్పము వలెనే చిత్రలేఖనము శాశ్వతముకాదు. కాబట్టి, ఈ నాడు ఆంధ్ర చిత్రకళా చరిత్ర వ్రాయడం సుగమం కాదు.

తక్కిన హిందూ దేశములోని దేవాలయములతో పాటు, ఆంధ్ర దేశములో చిత్రలేఖనము వృద్ధిపొందిన మాట నిజము. వాత్స్యాయన కామసూత్రములలో చిత్రలేఖనకు షడంగాలను వాత్స్యాయనుడు బోధించినాడు. ఆదిసూత్రకర్త నారాయణుడు, విశ్వకర్మకు చిత్ర సూత్రములను ఉపదేశించెను. చూ:—

కం|| ఆ విశ్వకర్మ నిర్మిత
దేవ విమానుండు నిఖిల దివ్యాభరణ
శ్రీవిరచన పరితోషిత
దేవుడు శిల్ప ప్రజాపతియునై నెగడెన్.

"రూపభేద ప్రమాణాని భావ లావణ్యయోగజనమ్, సాదృశం వర్ణికాభంగ మితి చిత్రం షడంగకమ్|| అని, చెప్పబడియున్నది. కొంచెము వివరించిన, ఈ భావము రూపముయొక్క బాలమూర్తి, కుమారమూర్తి, నరమూర్తి, క్రూరమూర్తి, అసురమూర్తి, మొదలయిన తారతమ్యములను తెలియజేసేదనీ; ప్రమాణము—ఏమూర్తి కొలత ఏంతో నిర్ణయించేదనీ; భావము—బహిరంతర స్వరూపములుగలిగి నవరస ప్రపుష్టమై వ్యక్తీకరణము తెలియజేసేదనీ; లావణ్యయోజనము—వివిధ విగ్రహాలయొక్క వర్ణాలను కర్కశాలుగా చిత్రించాలో,లలితంగా రంగులు పూయాలో నిర్ణయించేదనీ; సాదృశ్యమనగా—సంప్రదాయపారంపర్యా మనకు సంక్రమించిన విధానాన్ని సాదృశ్యంగా తీసుకొని ఆ ప్రకారం మూర్తి విన్యాసం చేయుటనీ; (ఉదాహరణగా ఇందుముఖి అన్నప్పుడు చంద్రుడు, ఆ సాదృశ్యాన్ని అనుసరించి ముఖంవ్రాయాలి,) సాదృశ్యం శిల్ప సమయమనిన్నీ; వర్ణికాభంగము అంటే ఆకాశానికి ఏవర్ణమో, ఏమూర్తికి ఎట్టిరంగులు ఇవ్వాలో నిర్ణయించేదనీ— తెలుస్తుంది. చిత్రాల్లో గూడా కవిత్వంలోలాగే గర్భ చిత్రాలు, బంధ చిత్రాలు అనేక రకాలున్నవి.

క్రీ. పూ. రెండవ శతాబ్దమందలి జోగిరామ గుహాలయందలి చిత్రములు; అమరావతి, ఉండవల్లి, భట్టిప్రోలు, ఘంటసాల, జగ్గయ్యపేట, చినగంజాము మొదలైన ప్రదేశములలోని బౌద్ధ స్తూపాలలోని శిల్పములు; అజంతా, కార్లీ, ఎలిఫెంటా, ఎల్లోరా గుహాలందలి చిత్ర శిల్పములు; మన దేవాలయ, గోపుర ప్రాకారములందలి దక్షిణ ద్రావిడ చిత్రములు—ఇవన్నియు మన చిత్ర సంపదలోని ముత్యాలరాసులు!

శాతవాహన చిత్రలేఖనము

ఆంధ్ర శాతవాహన కాలంలో చిత్రలేఖనము హిమాలయపు గౌరీశంకరశృంగస్థానము వరకు వెళ్లినది. ఆంధ్ర శాతవాహనులు అంతరించేవరకు, అజంతాగుహాలు నిర్మించి, చిత్రించినది ఆంధ్రులే! అజంతాలో పదియవ గుహాలో, ప్రాచీన ఆంధ్ర శాతవాహనుల సభాశిల్పి ఆగుహానిర్మించి, శిల్పించినట్లు శాసనమున్నది.

అజంతా చిత్రలేఖనము- కూర్జ్రీగారి ప్రశంస

నా గురువుగారును, రాజమండ్రిఆర్ట్సు కాలేజి పూర్వపు ప్రిన్సిపాలు నగు కూర్డ్రే దొరగారు అజంతా చిత్రలేఖనముల గురించి వ్రాసిన వాక్యములు జ్ఞాపకము

నకు వచ్చుచున్నవి. "The colour scheme at once temperate, rich and bold, conveys the notion of dewy freshness in a hot and somber field." "వర్ణికాభంగము మితమై, శోభావంతమై, శక్తిపూర్ణమై, ఉష్ణభూమిక పైని తుషారార్ద్రకోమలతానుభూతి నిచ్చుచున్నది".



శ్రీ చామకూర సత్యనారాయణ,
సుప్రసిద్ధ చిత్రకారులు.

"The olden painting, therefore, at Ajanta, represents no primitive beginning but an art of some maturity, not the first efforts of individuals groping in the darkness of inexperience but the finished work of a school of artists trained in a high art manifesting great and ancient traditions."—అనగా :

"అజంతాలోని తొలి చిత్రలేఖనము భారతీయ శిల్పముయొక్క ప్రాథమిక దశ కాదు; ఆ శిల్పపు పరిణితదశే. అది, అనుభవాంధకారములో ప్రాకులాడు వ్యక్తుల ప్రాథమిక ప్రయత్నము కాదు; మహోత్కృష్టమైనటువంటి పురాతన సంప్రదాయసిద్ధమైన ఉత్తమకళానిష్ణాతులగు శిల్పుల పరిపూర్ణ శిల్పరచన." అని అన్నారు పెర్సి బ్రౌనుగారు.

బొంబాయిలో శిల్పాచార్యులుగా ఉండి అజంతాశిల్పాలన్నిటికి ప్రతిరూపములు తీసి, అజంతాను గురించి యుద్గ్రంథము రచించిన గ్రిఫిత్ గారిలా అన్నారు.

"The artists, who painted there were giants in execution."

పల్లవరాజైన మొదటి మహేంద్రవర్మ కాలములో చిత్రలేఖనము ఉచ్చస్థితికి వచ్చినది. ఆ చిత్రలేఖన నాటిగుళ్లనిండా యుండేది. కాలగర్భమున జీర్ణమైన భాగములు పోను, శితన్నవాసాల గుహలలోను, పుదుక్కోట సంస్థానములోను, పల్లవ చిత్రలేఖన కీర్తి చిహ్నములుగా నిలిచిన భాగములు చూడవచ్చును. శితన్నవాసాలలోని చిత్ర లేఖనము, అజంతాచిత్రలేఖన సంప్రదాయాన్ని పోలివుంటుంది. ఇవి జైన గుహాలు. ఈ చిత్రలేఖనము కొన్ని నూతనమైన లాలిత్యాలను గూడా స్వీకరించుకొన్నది.

పల్లవ చిత్రలేఖనం-క్రొత్తరీతి

ఎల్లోరా శిల్పులు, అజంతా శిల్పులకు చిత్రలేఖనంలో కొంచెమైనా తగ్గిపోరు. కైలాసాలయము అంతా చిత్రలేఖనంతో నిండివుండేది. ఇది వరదాకా వెల్లక్రింద అణిగివున్న ఈ చిత్రలేఖనము, నైజాము ప్రభుత్వపు పురాతన శిల్పశాఖాధ్యక్షుడయిన

ఎల్లోరా చిత్రలేఖనము

జనాబ్ యాజ్డా గారి కృషివలన, (మిగిలిన ఏకొంచెమో) బయలు పడింది. ఆ చిత్ర కల్పనను నైజాము ప్రభుత్వమువారు గ్రంథరూపముగా ప్రకటించారు.

కాకతిచక్రవర్తుల చిత్రలేఖనకళ క్రీడాభిరామము మొదలైన గ్రంథాలలో అభివర్ణితమైనది గాని ప్రత్యక్షముగా లేదు. నశించిపోయినది.

రాయల కాలమునాటికి చిత్రలేఖనము విరివిగా యుండెనని గ్రంథములు చెప్పుచున్నవి. లేపాక్షి నగరమందలి దేవాలయ కుడ్యములమీద, అజంతా చిత్రలేఖనా సంప్రదాయ జనితమైన

రాయల యుగ చిత్రలేఖనము

చిత్రలేఖనా పద్ధతి కొంత తక్కువ స్థితికి వచ్చినను, సౌందర్య స్వరూపమును ఏమాత్రమును గోల్పోకుండ ఉన్నది. ఆ బొమ్మలు ఎక్కువగా ప్రకటనగా లేదు. శ్రీ కల్లూరి సుబ్బారావుగారిని ఆ చిత్రసంపుటి ప్రకటించ గోరుతున్నాను.

ఇప్పుడు అవనీంద్రనాథ్ సంప్రదాయము అనుసరించిన్నీ, బొంబాయిలోని సాల్మన్ గారి సంప్రదాయము అనుసరించిన్నీ, ఆంధ్ర దేశంలో నవీన చిత్రకారులు, చిత్రాధిదేవతకు నతులొనర్చడానికి సంసిద్ధులయ్యారు.

ముగింపు

దామెర్ల రామారావు చిత్రలేఖనలో నూత్న శకారంభము చేయ దీక్షవహించాడు గానీ, మాయగా, అకాల మృత్యువు అతన్ని మాయం చేసింది. ప్రమోదకుమార చటోపాధ్యాయుని కడ, ఆంధ్ర జాతీయ కళాశాలలో ఒక సంప్రదాయము ప్రారంభమైనది. ఆయన పాదాలకడ కొతా రామమోహన శాస్త్రి, ఆనంద మోహన శాస్త్రి, గుఱ్ఱం మల్లయ్య, తేజోమూర్తుల కేశవరావు, నేను* దీక్ష వహించాము. నాశిష్యులు కొందరు సెలవుపుచ్చుకొని, ఆయాస్థలాల్లో చిత్రలేఖనం వెదజల్లుతున్నారు. మద్రాసు ప్రభుత్వ కళాశాలలో ఎస్. వి. ఎస్. రామారావు, సుబ్బారావు, నారాయణరావు, దుర్గారావు, గోఖలే మొదలైన యువకులు, అన్నపూర్ణాదేవి, లక్ష్మీదేవి మొదలగు యువతులు దేవీప్రసాదరాయునికడ విద్య నారంభించి, వృద్ధి చెంది పేరు ప్రతిష్టలు సంపాదించుకొంటున్నారు. దామెర్ల రామారాయని శిష్యుడును, స్నేహితుడును అయిన వరదా వెంకటరత్నం గారును, రామారాయని సహోదరి శ్రీమతి బుచ్చి కృష్ణమ్మగారును, రామారాయని సంప్రదాయము వృద్ధిపొందిస్తున్నారు. పెనుగొండలో సి.ఎస్. వెంకట్రావుగారున్ను, భీమవరంలో అంకాల సుబ్బారావుగారున్ను, ఏలూరులో మొక్కపాటి కృష్ణమూర్తి, పిలకా నరసింహమూర్తి, సీతాదేవి గార్లున్ను కళాదేవిని పూజిస్తున్నారు. శాంతినికేతనమువెళ్లి, నందలాలు కడ మోకరించి కళ నభ్యసించి, శ్రీమతులు కృష్ణాబాయి, కమలాబాయి, సరోజిని మొ॥వారు చిత్రలేఖనంలో ప్రఖ్యాతి వహించియున్నారు.

### గృహనిర్మాణము

ఆంధ్రదేశంలో గృహనిర్మాణము పూర్వము ఏయే పంథాలు అనుసరించిందో విస్పష్టంగా చిత్రించడానికి ఆధారములు బహుళంగా లేవు.

*నేటి చిత్రలేఖన కళోపాసకులలో శ్రీ అడవి బాపిరాజు గారు తామిందు తెలియజేసుకొన్న దానికంటె ఎక్కువ ఉన్నతమయిన స్థానమును అలంకరింప నర్హులని ఆంధ్రలోకము గుర్తిస్తున్నది—సంపాదకుడు.



నీళ్లరేవు —శ్రీ చేమకూర సత్యనారాయణ

ప్రతి యుగంలోను ఆలయ నిర్మాణము, స్తంభ నిర్మాణము ఏయే విధాలుగా మార్పు చెందుతూ వచ్చినదో ఆ పరిణామాన్ని దర్శించడానికి మిగిలినవి—కొన్ని ఆలయములు, వాటిలోని స్తంభ నిర్మాణమే!

**మన ఆలయ నిర్మాణ విధానములు-పూర్వపు దివ్య హర్మ్యములు.**

మన పూర్వుల దివ్యహర్మ్యములు, రాజప్రాసాదములు పురాణ, బ్రాహ్మణ, ఐతిహాసిక గాథలలో వర్ణింపబడి వున్నవి. రామాయణములోని రావణాసురుని అంతఃపుర వర్ణననుబట్టి ఊహించినచో, ఆ నాటి ప్రాసాదాలకు నేటి మన భవననిర్మాణము సరిపోలదని చెప్పవచ్చును. మోహెంజొదారో, హరప్పా, సింధునదీ ప్రాంతములో బయల్పడిన పట్టణాలను పరిశీలిస్తే మన భారతదేశములోని నిర్మాణము, వైభవము మనకు గోచరిస్తుంది!

శాతవాహనులు వారి యాజమాన్యం క్రింద, కార్లేగుహలను క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దమున నిర్మాణము చేసిరి. కార్లేగుహల తర్వాత, బాజ్ గుహలు, నాసికగుహలు, కన్హేరిగుహలు, ఔరంగాబాద్, అజంతా గుహలు నిర్మాణము కాబడినవి.

**గుహలు, విహారములు, చైత్యములు.**

ఈగుహలలో చైత్యములనీ, విహారములనీ రెండురకములు. చైత్యములు దేవాలయముల వంటివి; విహారములు బౌద్ధ క్షపణకులు నివసించే గుహలు. చైత్యము శిఖర సంయుతమైన అర్ధానుస్వారంలాగు వుంటుంది. లోపలకు వెళ్లగానే గజపృష్ఠాకారాంతర్భాగం కనిపిస్తుంది. ముఖద్వారానికి ఎదురుగాను, గుహ అవతల చివరను, బుద్ధధర్మచిహ్నమైన స్తూపశిల్పము చేయబడి వుంటుంది. క్రమేపి ఈ రచనా విధానం అంతటా అల్లుకుపోయింది!

ఈ చైత్యగుహాలే, ఇటికలతో రాళ్లతో నిర్మించిన చైత్యాలుగా మారినవి. అమరావతి, నాగార్జున కొండ, భట్టిప్రోలు, జగ్గయ్య పేట మొదలైన ప్రదేశాలలోని చైత్యములలో పూజా స్వరూపమైన స్తూపమున్నూ, రానురాను బుద్ధ విగ్రహములున్నూ గలిగి పూజనీయము లైనవి. దానితో విగ్రహపూజ ఏర్పడినది. ప్రథమాన్ని నిర్మించిన ఈ చైత్యబౌద్ధదేవాలయాన్ని, తర్వాత వచ్చిన బ్రాహ్మణ మతావలంబులు ఆ విగ్రహాన్ని తీసివేసిగాని, ఆ విగ్రహాలకే వైష్ణవ, శైవ, స్వరూపాలిచ్చిగాని, స్తూపాలకు లింగ స్వరూపాలిచ్చిగాని వీటిని హిందూదేవాలయములుగా మార్చినారు. అట్టి దేవాలయమొకటి చేజెర్లలో నున్నది.

విహారములు పెద్దవి. అవి మూడు నాలుగు వందల మంది జనులుపట్టు సభామందిరములు. ఇవి సింహద్వారములుకలిగి, కుడ్యోపరిభాగములు లతావితానచిత్రసంయుతాలై వున్నవి. విహారములముందు మొగసాలయున్ను, లోపలి సింహద్వారమున కెదురుగా గర్భగుహాయున్నూవుండును. ఆదిలో, గర్భగుహాలో బుద్ధమూర్తి చిహ్నములుగాని, రానురాను విగ్రములనుగాని ప్రతిష్ఠించేవారు. సభకుచుట్టున్ను సన్యాసులు నివసించడానికి గదులు చెక్కివున్నారు. వెలుగువచ్చు ఆధారమేమీ లేకుండి, చీకటి కోణములై యున్నవి. ఒక పెడ శయనించడానికి శిలావేదికలు చెక్కబడినవి.

విహారములు-
నిర్మాణము

ఈ విహార స్వరూపాలలో హిందువులు, ప్రథమ దేవాలయములను రాతిలో చెక్కినారు. హిందూ విహారములలో బౌద్ధ విహారములలో వలె భిక్షుకులుండు గదులు లేవు. బౌద్ధ మతమువల్ల ఆంధ్ర దేశములో మొదట ఉద్భవించిన కట్టడము స్తూపము. అశోకుడు కళింగదేశములోను, శాతవాహన ముఖ్యపట్నమైన ధాన్యకటకములోను, భట్టిప్రోలులోను స్తూపముల నిర్మించెను. జగ్గయ్యపేట స్తూపమున్నూ, గుంటపల్లి స్తూపమున్నూ క్రీ. పూ. రెండవ శతాబ్దము నాటివి. అప్పుడే తెలివాహానది గట్టున, రామతీర్థములోను చిన్న చిన్న స్తూపముల నిర్మించిరి. ఇవి రానురాను పెద్దవి చేయబడి, ఛత్రశిఖరాలు గలిగి, వివిధ శిల్పములచే అలంకరింపబడి, పూర్వ సౌందర్యమును ప్రతిబింబింప చేయుచున్నవి. ఉత్తరహిందూస్థానంలోని సాంచీ మొదలైన ప్రదేశములలో స్తూపము లున్నవి. మన ఘంటసాల, గుడివాడలలో ఉన్న స్తూపములు రెండవ శతాబ్దము నాటివే!



శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ,
ప్రఖ్యాత చిత్రకారిణి.

అమరావతి, నాగార్జునకొండ, గుమ్మడిదుర్రు స్తూపశిల్పాలు, ఆయాప్రదేశాలలో ప్రకాశించిన స్తూప స్వరూపాలలో శిల్పము చేయబడి యున్నవి. స్తూపము కోడిగ్రుడ్డు అడుగు భాగము కొట్టివేసి బోర్లించి నట్లుండును. ఇవన్నీ పల్నాటి తెల్లపాలరాయితో కట్టిరి. స్తూపానికి నాలుగు ప్రక్కలా నాలుగు అరుగు లున్నవి. ఆనాటి శిల్పులు గుహా, చైత్య శిల్పాలను సమ్మిళితం జేసి, ఉద్భవింప జేసినారు,

ఆంధ్ర చిత్రకారులు



ఎడమనుంచి శ్రీ పిలకా నరసింహమూర్తి.
,, కొత్తపల్లి సుబ్రహ్మణ్యం.
,, ముడింబి నర్సింహాచార్యులు.
,, మొక్కపాటి కృష్ణమూర్తి.

**స్తూపాలన్నిటి చుట్టు కర్ర, పాలరాతితో చేసిన కంచెలు**

స్తూపాలన్నిటి చుట్టూ, ముఖ్యంగా ఆంధ్రి స్తూపాలన్నిటి చుట్టూ, మొదట కర్రతో నిర్మించి నట్టిన్నీ తరువాత నల్ల రాతితో నిర్మించినట్టిన్నీ, ఆ తరువాత తరువాత పాల రాతితో నిర్మించి నట్టిన్నీ కంచెలు కట్టుచుండెడి వారు. పొడుగునా నిలువుదూలాలు, మూడు అడ్డదూలాలతో ఈ కంచెలు నిర్మించి నారు. ఈ తెల్లరాతి కంచెలుమీద అద్భుత మైన శిల్పము, ప్రతిభాపూరితమై ఉండేది!

సాంచీలోని మహాస్తూపంచుట్టున్నూ నాలుగు పాణిద్వారాలున్నవి. ఈ నాలుగు శిల్పద్వారా లున్నూ ప్రపంచాద్భుతమైన శిల్ప సౌందర్యాన్ని పుణికి పుచ్చుకొన్నవి. ఈ ద్వారముల నిండా మహావిన్యాసమైన శిల్పకల్పన వున్నది. ప్రథ మంలో స్తంభములన్నీ దారు

**పాణిద్వారములు, ఆంధ్రిలు-స్తంభములు**

శిల్ప స్వరూపాలు. పూర్వ కాలంనుంచీ కీర్తి స్తంభాలు, జయ స్తంభాలు, సహగమన స్తంభాలు, శాసన స్తంభాలు, దీప స్తంభాలు మొ॥నవి భారతదేశమంతటా నిండివుండేవని కావ్యాది గ్రంథాలు చెప్పుతున్నవి. అయినా నేటి వరకు నిలిచివున్నవి మన దేశములో అశోక స్తంభాలే! ప్రథమంలో అశోకచక్రవర్తి, శిలా స్తంభాలేకాకుండా లోహ స్తంభాలు గూడా చెక్కించినాడు. ఒక లోహతుల్య స్తంభమును పాశ్చాత్తులు బర్మింగ్‌హామ్‌కు తీసుకొని పోయి, అచ్చటి వారి మ్యూజియములో పెట్టుకొనినారు. ఇప్పుడు ఢిల్లీలో ఒక అశోకుని స్తంభము, కుతుబ్ మీనారులోనున్నది. మన ఆంధ్రి దేశ ములోని స్తూపాలు చుట్టున్న ఆయకస్తంభాలు, ధర్మ చక్ర స్తంభాలు మొదలైనివి గలవు.

క్రీ. శ. 3 వ శతాబ్దిలోనే, శాతవాహన శిల్పమునుంచి ఉద్భవించిన పల్లవ శిల్పము కాంచి, మహాబలిపురములలోను, నెల్లూరి జిల్లా తెరవకోనలోను ఆలయశిల్పమై పరఢవిల్లినది. మహాబలిపురంలో ఉన్న రథస్వరూపాలు కొన్ని చైత్యములలాగు, కొన్ని విహారాకృతి కలిగి యున్నవి. పశ్చిమ చాళుక్యులు కట్టించిన బాదా మినగరమును, అజంతా, కార్లే, నాసిక మొద లైన గుహాలనుజూచి, హైందవ సంప్రదాయంతో నిర్మించారు. పల్లవాలయ శిల్పనిర్మాణము, చాళుక్య ఆలయ నిర్మాణము గమనించి రాష్ట్రి కూటులు ఎల్లోరాలో పరమాద్భుతమైన గుహ లను నిర్మించారు. ఈ ఎల్లోరా గుహాలోని ఆలయ ములు, స్తంభాలు, యాంత్రిక మందిరములు మొద

మండపము, కళ్యాణమండపము మొదలైన నిర్మాణములతో విశ్వకర్మదేవుని నిర్మాణములాగు, వికసించినవి. పాలంపేటలోని బార్హాట్ గుహాలు ఉన్నత కళాసంపద గలిగినవి.

కాకతీయుల వెనుక, రాయలయుగ శిల్పులు కాకతీయ శిల్పానికి వన్నెలు దిద్దే ఆలయ నిర్మాణాన్ని హంపీ, తాడిపర్తి, పెనుగొండ, లేపాక్షి, స్తూపాలదగ్గర వున్నట్టి స్తంభనిర్మాణములోను పల్లవులు, చాళుక్యులు, కాకతీయులు, రాష్ట్రకూటులు, గాంగులు, తెలుగు చోళులు, విజయనగరం శిల్పులు-ఒకరికన్నా ఒకరు అందమైన శిల్పములను వెలయించారు. ఏక స్తంభ స్వరూపాలు కాకతీయులలోను, వివిధ స్తంభగర్భిత ఏక స్తంభములు విజయనగరశిల్పుల పనితనంలోను, రూపుగొన్నవి. విజయనగరంలోని సప్తస్వర స్తంభాలు జగత్తులోని రసజ్ఞు లందరకున్ను అద్భుత రసాన్ని నివేదిస్తున్నవి! హంపిలోని పద్మ ప్రాసాదము, ఏనుగులశాల, మహాసభావేదిక, వాని సోపాదినిర్మాణములు హైందవరాజుల రసజ్ఞతను చాటుచున్నవి. విజయనగర విజయ ద్వారాలు, గోపురద్వారాలు ఇప్పటికీ విచిత్రమైయున్నవి!



రాజమండ్రి కళాశాల ప్రిన్సిపాలుగానుండిన కూల్డ్రేగారు రచించిన చిత్రము.

సింహాచలం మొదలగు అనేక చోట్ల చేయించినారు. రాయల సామంతపాలకులైన నాయకులు మధుర, తంజనగరములలో కట్టించిన ఆలయములు, తిరుమలనాయకుడు చేయించిన మధురవిమానం, రాజమందిరములు, ద్వారములు అద్భుతము కొలుపుతూఉంటవి. ఈయన రాజమందిరము, ఒక్క మేకుగాని కఱ్ఱగాని ఉపయోగించని మహాభవనము. స్తంభాలు చిన్న చిన్న గోపురాలంత ఉన్నవి. ఆంధ్ర గాంగ శిల్పులు ముఖలింగం, కోణార్క, భువనేశ్వరం, జగన్నాథపురం ప్రదేశములలో, చాళుక్యాది ఆలయనిర్మాణానికి సరిపోని వేరొకశిల్ప స్వరూపమైన ఆలయ నిర్మాణం నిర్మించినారు.

అజంతా బౌద్ధ గుహలలోను, అమరావతీలైనవన్నిటిని ఒక్కరాయైన పైనుండి తీసుకొని రాకుండా నిర్మింపజేసిరి. బెజవాడ, రాజమహేంద్రవరములలో చాళుక్యులు నిర్మించిన సుందరమైన దేవాలయములు వెలసినవి.

చాళుక్యుల తరువాత కాకతీయ ఆలయ నిర్మాణము ఇంకాపుష్టిని చేకూర్చుకొని, మూలవిరాట్టున్న విమానములు, అర్థమండపము, ముఖ

దేవాలయముల ముందర ముఖ్య, విమానం కన్నా గోపురాలను ప్రథమంలో నిర్మించినది కుళోత్తుంగచోళుడు. దీన్ని అనుసరించి నాయక రాజులున్నూ దక్షిణమున గోపుర నిర్మాణం చేయించిరి. చిదంబర గోపురం కుళోత్తుంగుడే నిర్మింపజేసినాడట! పాలకొల్లు, మంగళగిరి, తిరుపతి, నెల్లూరులలోని ఆలయములు ఎత్తై, ఆశ్చర్యము గొలుపుతూఉంటవి. గాంగ శిల్పులు నిర్మించిన విమానములు అంబరచుంబితాలై యున్నవి. తరువాత మన దేశమున వర్ధిల్లినది మహమ్మదీయ నిర్మాణము.

**గోపురములు**

గోలుకొండ, బీదరు, అహమ్మద్ నగరము, హైదరాబాదు, ఓరుగల్లు, చెన్నగరములలో బహమనీ రాజులయొక్కయు, నైజాము, కర్నాటక నవాబుల యొక్కయు మశీదుల, మీనారుల సౌందర్యం లోచనగోచర మవుతుంది.

ఆంధ్రులు వలసపోయిన బర్మా, జావా, బోర్నియో మొదలైన ప్రదేశములలోగూడా ఆంధ్రకళానైపుణ్యం ఆ పరిసరముల కనువైన స్వరూపం దాల్చి-ప్రతిభావంతంగా భాసిస్తున్నది!



చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిఁబుట్ట జంత్రగాత్రముల రాల్గరగించు విమలగాంధర్వంబు విద్యమాకు
ననవిల్తు శాస్త్రంపు మినుకులావర్తించు పనివెన్నతోఁడఁ బెట్టినది మాకు
హయమేధ రాజసూయములనఁ బేర్పడ్డ సవనతంత్రంబు లుగ్గుపాలు మాకుఁ
గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠభర్గసభలు సాముగరడీలు మాకు గోత్రామరేంద్ర.

—అల్లసాని పెద్దన.

# 27వ అధ్యాయము

# సంగీతము, నాట్యము, ఉపకళలు

విషయ సంగ్రహము:— వేదమందు సంగీత ప్రసక్తి: ప్రాచీన తమిళ గ్రంథములందున్ను, భరతనాట్య శాస్త్రమందున్ను సంగీతమును గురించి చెప్పిన విషయములు; శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరము; కర్ణాట సంప్రదాయము శాతవాహన కర్ణాట సంప్రదాయమే; 1650 నాటి రామయామాత్యుడు ముఖ్యాచార్యుడు; అహోబల పండితుడు, 24 శ్రుతులు, 12 స్వరములతోనే మేళకర్తరాగముల నిర్మాణము; సోమనార్యుడు, రాజమహేంద్రనివాసి—1609 రాగవిబోధరచించినవాడు, జనక జన్యరాగములు నిర్ణయించినవాడు; ఆంధ్రుడైన దీక్షితుని వంశము దక్షిణ దేశములో పేరు పొందినది; వేంకటమఖి 72 మేళకర్తల నిర్మాత, క్షేత్రయ, త్యాగరాజు, రామదాసు, తాళ్లపాకవారు; ఈ నాటి సంగీత విద్యాంసులలో ప్రఖ్యాతి పొందిన ఆంధ్రులు—.

నాట్యము:—భారతీయ నాట్య కళాభివృద్ధికి ఆంధ్రులు మొదటి నుండిన్ని తోడుపడినవారు; నందికేశ్వరుని అభినయ దర్పణము తెలుగువారిది. దక్షిణ దేశమందు భరతనాట్యకోవిదలయిన దేవదాసీలందరును ఆంధ్రులే; నాట్య లక్షణము—.

ఉపకళలు:—తోలుబొమ్మల నాటకములు; నాటకములు; యక్షగానాలు, తెలుగు నాటకాలు ప్రారంభము; నేటి నాటక కళాభివృద్ధి; అలంకార-వస్తు నిర్మాణము.

సినిమా కళ:—నవీనకళ, అన్ని కళలయొక్క సంగ్రహమైన కళావిశేషము; ఇందు భాగస్వాములయిన కళాదక్షులు; చిత్రకళాదర్శకుని ప్రాధాన్యము; సినిమా నటులు; తారలు; కథా ప్రాముఖ్యము; చిత్రగ్రాహకత్వము; శబ్దగ్రాహకత్వము; కథలను గురించిన విషయములు; పౌరాణిక, చారిత్రక, సాంఘిక చిత్రములు: తక్కిన భాగస్వాములు, వారి కళాదక్షత; నేటి ఆంధ్ర సినిమా కళోపాసకులలో విఖ్యాతి పొందినవారు—.

భారతీయ నాగరికతా ప్రారంభస్థితినుంచిన్నీ అన్ని కళలు వృద్ధిపొందుచున్నవని మనము ఇదివరకే గమనించియున్నాము. వేదములందు సంగీతమునుగురించిన్నీ, సంగీత వాద్య విశేషములను గురించిన్నీ సూక్తములున్నవి. సామవేదకాలమునాటికి సంగీతము పూర్తిగా వృద్ధిపొందినది. ఋగ్వేదములో దుందుభి, ఆడంబరము, భూమి దుందుభి, వనస్పతి, ఆఘాటి మొదలైన మద్దెల విశేషాలున్ను, కాండవీణ, కర్కరి, బాకుర మొదలైన ముఖవాద్యములున్నూ చెప్పియున్నారు. యజుర్వేదకాలములో సంగీతశాస్త్రము వృద్ధిపొంది సామగానము చేయు విధానము, రాగములు, శ్రుతులు, తాళములు మొదలైనవి చర్చించబడినవి. బౌద్ధ పిటకములలోను, జాతక కథలలోను, పురాణములలోను, గాథలలోను సంగీతమునుగురించి సంపూర్ణముగా ప్రస్తావింపబడినది. క్రీ. పూ. 400 సంవత్సరములో రచింపబడిన ఋక్ ప్రాతిశాఖ్య అనే గ్రంథమునందు సప్తస్వరములు, మందర, మధ్యమ, తార స్థాయి భేదములున్ను చర్చించబడినవి. రామాయణములో జతులు, రాగములు, వీణాది వాద్య విశేషములు-భేరి, దుందుభి మొదలైనవీ, మహాభారతములో సప్తస్వరములు గాంధార గ్రామము వర్ణింపబడియున్నవి.

పరిపాదల్ అనే తమిళ గ్రంథంలో కొన్ని స్వరాలను గురించిన్నీ "యాల్" అనే వాద్య విశేషాన్ని గురించిన్నీ చెప్పబడియున్నది. శిలప్పదికారంలో వీణ, యాల్, వేణు, మృదంగము చెప్పబడినది. అందులో సంగీతశాస్త్రమును గురించి చెప్తూ, సప్తస్వరములు రాగములు, ఆ స్వరములకు పేర్లు చెప్పబడియున్నవి. దివాకరం అనే జైన గ్రంథంలో పూర్వ తమిళసంగీతాన్ని గురించి చర్చించబడియున్నది. సముద్రగుప్తుని నాణెముపై వీణ చెక్కబడియున్నది. పూర్వము మన భరతఖండమున అభివృద్ధిచెందిన కళలలో సంగీత మొకటన్న విషయము మళ్లీ చెప్పనక్కర లేదుగదా!

ఆంధ్రదేశములో పురాతన గ్రంథాలైన హాలసప్తశతి, బృహత్కథ మొదలైనవానిలో సంగీతము, వాద్య విశేషములు మొదలైనవానినిగురించి వర్ణింపబడియున్నది. ఆంధ్ర శిల్పులు రచించిన అజంతా చిత్రలేఖనాలలోను, అమరావతి,

నాగార్జునకొండ, గోలి మొదలైన స్థూపశిల్పాలలోను వీణ, కిన్నెర, వేణు, మృదంగము మొదలైనవి రచింపబడివున్నవి.

క్రీస్తు శకారంభ కాలమునాటికి, ఈ పైని చెప్పిన ఉదాహరణలవల్ల, సేతుహిమాచల పర్యంతము పూర్వ పశ్చిమ సముద్రతీరాలవరకున్ను ఈ కళ, కొంచెము తేడాలతో శాస్త్ర స్వరూపాలను పొంది విజృంభించివున్నదని మనము గ్రహింప గలుగుచున్నాము. ఆదిలో ఈ కళను శాస్త్రము క్రింద చర్చించిన గ్రంథము భరతనాట్య శాస్త్రము. ఈ నాట్య శాస్త్రములోని 28వ అధ్యాయములో సంగీత శాస్త్రమునుగురించి విపులముగా చర్చించబడియున్నది. స్వరములు, శ్రుతులు, గ్రామములు, మూర్ఛనలు, జతులు వీటినిగురించి చెప్పుచూ వీటి విధానములగురించికూడా చర్చించివున్నాడు.

ఆంధ్ర పల్లవరాజు-పుదుక్కోట సంస్థానములోని కుడిమియామలై పర్వతాలలో-ఒక రాతిపైని సంగీతశాస్త్రమును గురించి ఒక శాసనమును చెక్కించెను. అందులో సప్త స్వరములు, శ్రుతులు, కాకలి, నిషాదము మొదలైన అంతర స్వరాలకు సంబంధించిన ప్రస్తావన ఉన్నది. ఇది దక్షిణాపథ సంగీతములోవుండే వైచిత్ర్యము.

భరతనాట్య శాస్త్రము తర్వాత, దేవగిరిలో 12 వ శతాబ్దిలో నివసించిన శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరమను మహోత్కృష్ట గ్రంథాన్ని రచించినాడు. ఈయన, ఆనాడు భారత దేశమున వికసించిన సంగీత విధానాల స్థితి గమనించి, పరిశోధించి తన గ్రంథమును వ్రాసినాడు. ఆ రోజులలో సర్వ దక్షిణాపథానికి మహారాజాధిరాజై, తన దివ్యఛత్రంతో దశదిశలకూ నీడనచ్చిన కాకతిగణపతి సార్వభౌముని కొలువు కూటములో ఈ శార్ఙ్గదేవుడు ఉండేవాడని తెలియవస్తున్నది. గణపతిరుద్రుని సేనాధిపతులలో ఒకడైన కాటయరుద్రుడు పాలంపేటలో రామప్ప దేవాలయము నిర్మించివున్నాడు. ఆ యాలయములో మహానటుని తాండవ విధానాలు, అప్సర అంగనానృత్య స్వరూపాలు, వీణ మృదంగాది వాద్య విశేషాలు, హంగుచేసేవారి చిత్రాలు చిత్రింపబడినవి. వారి శాసనాలలో-84 నియోగాలలో-ఈ కళాభిజ్ఞు లందరూ అభివర్ణింపబడి యున్నారు. శార్ఙ్గదేవుడు అత్యంత పురాతన కాలంనుండి వస్తున్న సంప్రదాయ జనితములైన సంగీత సిద్ధాంతములన్నిటి గురించిన్నీ చర్చించివున్నాడు. అయినా, అతడు దక్షిణోత్తర సంప్రదాయములు రెంటినీ సమన్వయము చెయ్యాలనికూడా ప్రయత్నము చేశాడు.

"తనగీతి యరవజాతిని పాటకులనుగా దిద్ది వర్ధిల్లిన" నాదబ్రహ్మ



శ్రీ త్యాగరాజు

కర్నాటక సంప్రదాయమంటే ఏమిటి? ఆంధ్రశాతవాహనుల కాలంలో ఔత్తరాహ సంప్రదాయానికి కొంచెం తేడాగావుండిన దాక్షిణాత్య విధానానికి శాత కర్నాట

సంప్రదాయము లేక కర్నాటక సంప్రదాయము అని పేరు వచ్చినది.

ఈ కర్నాటక సంప్రదాయానికి రామామాత్యుడు ముఖ్యాచార్యుడని మనము చెప్ప వచ్చును. ఈయన 1650 ప్రాంతమున విద్యా నగరేంద్రుల కొలువుకూటమున పూజింపబడినవాడు. ఆరువేలని యోగి బ్రాహ్మణుడు. తోడర్మల్ వంశజుడు. తిమ్మామాత్యుని పుత్రుడు. అభినవ భరతాచార్యుడనే బిరుదుగలదు. స్వరమేళ కళానిధి అనే సంస్కృతగ్రంథాన్ని రచించి షడ్జము స్వరకల్పనకు ప్రథమ స్వరమని నిర్ణయించి, దక్షిణ దేశమునందలి రాగములను శుద్ధముచేసి, రాగలక్షణము లిచ్చి, కర్నాటక సంగీతానికి మూలములైన రాగములను తీర్చిదిద్దినాడు. ఒకే స్వరము శ్రుతిగా జేసుకొని రాగములు సృష్టింపబడుటచే కర్నాటక సంప్రదాయము నందును, రామామాత్యుని కాలము నాటికే, వీణాది వాద్యస్వరూపము నేటి స్థితిలోనికి వచ్చినదని నిశ్చయింప వచ్చును.



గానకళావిశారద, ప్రొఫెసర్ ద్వారం వెంకటస్వామి నాయుడు.
విజయనగర మహారాజ గానకళాశాల ప్రిన్సిపాలు

మన తెలుగు గ్రామమైన అహోబలమున పుట్టినవాడే నేను చెప్పబోవు ఈ అహోబలపండితుడు. ఈ పండితుడు సంగీత పారిజాతమను గ్రంథాన్ని ఔత్తరాహ సంప్రదాయానికి మూలగ్రంథంగా రచించినాడు. అహోబలుని మతంలో 24 శ్రుతులున్నవి. కాని తన రాగాలలో 12 శ్రుతులకన్న ఎక్కువ ప్రస్తావించలేదు. ఈయన వీణమెట్ల ననుసరించి స్వరకల్పన చేసినాడు.

రామామాత్యుని శిష్యుడైన పుండరీకవిఠలుడు, కర్నాటక సంప్రదాయ మహాలహరిలో కలసిన రెండవ నది. ఔత్తరాహ సంప్రదాయంలో స్థానికమైన సంప్రదాయములనున్ను పరదేశ జనితములైన మొగల్, పారశీక రీతులనున్ను

# ఆంధ్రదేశమందలి సంగీత వాద్యములు




1. వీణ
2. మృదంగము
3. తంబుర
4. డోలు
5. సనాయి
6. తాళంచిప్పలు
7. కంజిర
8. హార్మోనియము
9. తబల
10. పిల్లనగ్రోవి

కలగలపుగలిగి, అందులో వివిధమార్గాలవారికిన్ని చాలా కలహములు సంభవించినప్పుడు, మహామేధాసంపన్నుడని పేరుపొందిన పుండరీకవిఠలుని అక్బరు తన ఢిల్లీ నగరానికి సగౌరవముగా తీసుకవెళ్లి ఈ వివిధమార్గములు సమన్వయము చేయుమని అతనినివేడెను.

కర్నాటక సంప్రదాయానికి ఇంకొక మహాగోపురము సోమనార్యుడు; రాజమహేంద్రవర వాసి; 1609 లో రాగవిబోధి అనే గ్రంథాన్ని రచించెను. ప్రపంచ ప్రఖ్యాతిగన్న సంగీత పాఠకుడు. తన గ్రంథాన్ని-ఆర్యా ఛందస్సులో, గంభీరమైన మృదుమధురశైలిలో—స్వరములు, వాద్య విశేషములు మున్నగు వాటిని చర్చిస్తూ వ్రాసెను. జనకరాగములనీ, జన్యరాగములనీ నిర్ణయించిన దితడే!

| స | రి | గ | మ | ప | ధ | ని | (స) |
|---|---|---|---|---|---|---|---|
| 3 శ్రు | 2 ,, | 4 ,, | 4 ,, | 3 ,, | 2 ,, | 4 ,, | |

ఇది అహోబలుడు మొదలైన వాగ్గేయుల మతము ననుసరించిన శుద్ధ స్వరావళి.

## ఆంధ్రదేశమందలి సంగీత వాద్యములు

వేణు
మోర్సింగ్
బాకా
బూరా
జలతరంగిణి
ఫిడేల్
సనాయి
డమారము



కవినాథుడనే నియోగి బ్రాహ్మణుడు రామామాత్యుని అన్నయైన లక్ష్మణామాత్యుని కుమారుడు. ఇతనికి అభినవ భరతాచార్యుడనే బిరుదుకలదు. శార్‌ఙ్గదేవుని రచనకు వ్యాఖ్యానము చేసినాడు. ఇమ్మడిదేవుని ఆస్థాన పండితుడు.

దక్షిణాదికి వెళ్లిన తెలుగు వంశీయులలో దీక్షిత వంశము ప్రసిద్ధికెక్కినది. ఆ వంశపువాడైన గోవిందదీక్షితుడు చెవ్వప్పనాయని కాలంలోవుండి అతని పుత్రుడైన అచ్యుతప్పనాయనికి కూడా మంత్రిగా పనిచేసెను. గోవిందదీక్షితుడు సంగీత సుధానిధి అనే లక్షణ గ్రంథము వ్రాసినట్లు చెప్పుదురు గానీ ఆరచన లభ్యపడుటలేదు. వేంకటమఖి ఈయన చివర కుమారుడు.

### గాన కళా పోషకులు



దివాన్ బహదూర్ కొమ్మరెడ్డి సూర్యనారాయణ మూర్తి నాయుడు.

వేంకటమఖి కర్ణాటక సంప్రదాయానికి ఇంకొక మహా గోపురము నిర్మించినవాడు. చతుర్దండి ప్రకాశిక అనే మహాగ్రంథ కర్త. 72 మేళ కర్త రాగాలను నిర్మించి, దానిలోనుండి జనకజన్య రాగాలను నిర్మించినాడు.

కర్ణాటక సంప్రదాయ దివ్యదేవాలయానికి వేరొక్క మహాగోపురమును నిర్మించినది క్షేత్రజ్ఞుడు. ఈయన విజయ రాఘవనాయని కొలువుకూటములోనుండి ఉత్కృష్టములైన మువ్వగోపాలపదములను అనేకము రచించెను. భాషా మాధుర్యంలో, రాగకల్పనలలో, తాళగతులలో క్షేత్రయ్య పదాలు దివ్యలోకాల విహరించునుగాని వేరొకటిగాదు. క్షేత్రయ్య త్యాగరాజునకు గురువువంటివాడు.

క్షేత్రయ్య తరువాత కర్ణాటక సంప్రదాయానికి నాల్గవ మహాగోపురము కట్టిన పరమభాగవతోత్తముడు శ్రీ త్యాగరాజు. ఇతడు శొంఠి వెంకట్రామయ్యగారివద్ద సంగీతమును అభ్యసించెను. గురువుదగ్గర తారకనామోపదేశం పొంది, ఆయన ఆజ్ఞచేత ఒకలక్ష ఇరవైయైదువేల రామనామము వ్రాసినాడు. గాయక శిఖామణియై రామనామాంకితాలైన కృతులనేకము రచించినాడు.



మృదంగ వాద్య ప్రవీణ శ్రీ కి. శే. అశ్వధాటి రామమూర్తి.

పైనచెప్పబడిన వాగ్గేయకారులేకాక, పరమ భాగవతోత్తముడైన రామదాసు, వెంకటాచలపతి భక్తుడైన తాళ్లపాక చిన్న



మార్దంగికాగ్రేసర
శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యా చౌదరి.

య్య, మీనాక్షి ఉపాసకుడైన శ్రీనివాసుడు, ప్రసన్న రాఘవము రచించిన జయదేవుడు, సీనయ్యా, కోసల ముద్రతో కావ్యాలు రచించిన శేషయ్యా, వీరభద్రయ్యా, పారిజాతాపహరణం రచించిన మాతృ భూతయ్యా, వీణ కాళహస్తయ్యా, పెరుమాళ్లయ్యా, బాలాజీపేట వెంకట్రామయ్యా, అయ్యభాగవతారు, కుప్పుసామయ్యా, చౌకం సీనయ్యా, దొరసామయ్యా, శేషాచల భాగవతారు, నారాయణతీర్థులు, స్వయంప్రకాశయతీంద్రులు, సారంగపాణి, వెంకట్రామశాస్త్రులు మొదలైన తెలుగు వాగ్గేయకారులు -జగత్ప్రసిద్ధి గన్నవారు- అనేకులుగలరు.



శ్రీ జి. పైడిస్వామి సోదరులు.

కులశేఖర పెరుమాళ్లు, ముద్దు సోమయ్యా, చినసోమయ్య దీక్షితులు, సాహజీమహరాజు, శ్యామశాస్త్రులు మొదలగువారు తెలుగువారి శిష్యులే. తెలుగుభాష నభ్యసించి, కర్నాటకసాహిత్యానికి క్రొత్తవెలుగు దిద్దిన పెద్దలు.

తెలుగుదేశం సృజనాశక్తిగలిగిన భూమి. తమిళదేశము, తెలుగువారు సృష్టించినదానిని దాచుకొను 'మ్యూజియము వంటిది. ఇప్పుడు తెలుగుమాగాణి సృజనాశక్తి తగ్గి తెలతెల పోవుచున్నది!

మహాభాగులైన శ్రీ నారాయణదాసు, వెంకటస్వామి నాయుడు, సంగమేశ్వరుడు, హరి నాగభూషణం, పారుపల్లి రామకృష్ణయ్య మొదలగువారు, లోకోత్తరపురుషులైన మన పూర్వుల ప్రతిభకు, దిద్దిన వన్నెలు!



కీ. శే. శ్రీ తుమరాడ సంగమేశ్వర శాస్త్రి.
వీణాచార్యులు, పిఠాపుర సంస్థాన గాయకులు.

చిత్తూరు సుబ్రహ్మణ్యంపిళ్ల, నండూరి సింహాద్ర్యప్పలాచార్లు, క్రోవి సత్యనారాయణ, వారణాసి బలరామయ్యా, సుబ్రహ్మణ్యదేవర, పర్వతనేని వీరయ్యాచౌదరి, పినాకపాణి, పొట్లూరి వీరరాఘవయ్య చౌదరి, సుసర్ల నాగేశ్వరశాస్త్రి, సుబ్బయ్యాగుప్త, వెంకటేశ్వరులు, నోరి నాగభూషణం, శిష్టు కుమారస్వామి, వాల్మీకి శ్రీహరి, ద్వారం నరసింహారావు, గున్నయ్యా, చల్లపల్లి పంచనాదేశ్వరశాస్త్రి, అచ్యుతరామశాస్త్రి, సుసర్ల గంగాధరశాస్త్రి, పోతులూరి వీర

రాఘవయ్య, అశ్వధాటి రామమూర్తి, కోలంక వెంకట రాజు, శర్మసోదరులు, వారణాసి ఘంటయ్య, కూచిభొట్ల వెంకటేశ్వర్లు, అట్లూరి వెంకటేశ్వర్లు, రంగాచారి, పిచ్చిహరి, పీరు సోదరులు, గుంటూరి నాగులు, పైడిస్వామి సోదరులు, ముదనూరి వెంకట్రావు, డోక్కా శ్రీరామమూర్తి, చెర్ల సూర్యనారాయణ, వరదాచార్యులు, పసుమర్తి కృష్ణమూర్తి మొదలైన ప్రజ్ఞావంతులు మన ఆంధ్రదేశమున వున్నారు.

విజయనగరంలోని మహారాజావారి సంగీత కళాశాలలో అజ్జాడవారివద్ద, బెజవాడలో పారుపల్లి రామకృష్ణయ్యగారి వద్ద, బందరులో హరి నాగభూషణముగారివద్ద, మద్రాసులో ఈమని బ్రహ్మయ్యగారివద్ద సంగీతము నభ్యసించువారు అనేకులున్నారు. రాయలసీమలోనూ పెద్దపెద్ద సంగీతశాస్త్ర పారంగతులు విద్యార్థులకు శిక్షణనిచ్చుచున్నారు. సాధారణముగా ఆంధ్రదేశమంతటా సంగీతము చెప్పు ఆచార్యులున్నారు.

"రాల్గరంగించు విమలగాంధర్వ" విద్యను నూతనమార్గాలు పట్టించి, ఆంధ్రకళాయోషకు నూత్నాలంకారాలు సృష్టించి సమర్పించవలసియున్నది!

# నాట్యము

మానవదేహ సౌందర్యము, సౌష్ఠవము, సర్వాంగ సంచలన సౌకుమార్యము నాట్యమునందే వ్యక్తమవుతుంది. సంగీతానికి కవిత్వానికి మనుష్యుడు గొంతుక నుపయోగిస్తే, నాట్యానికి యావచ్ఛరీరాన్ని ఉపయోగిస్తున్నాడు. అద్భుతమైన మానవశరీరముయొక్క కదలిక, లాలిత్యము చెట్ల కొమ్మల కదలికకు, సెలయేటి వంకలకు, తెలిమబ్బుల నడకకు సరిపోతుంది. గంభీరమైన కదలిక నయాగరా జలపాతానికి, ఉత్తుంగతరంగాలకు, దావాగ్నికి సరిపోతుంది. మనుష్యుడు, తనలో వుండే ఉత్తమత్వం తన దేహముయొక్క కదలికమాత్రాన ప్రదర్శించగలడంటే, అది మహా విచిత్రసృష్టి యనిమాత్రము చెప్పవలసి యున్నది. నాట్యకళకు చిత్రలేఖనము, సంగీతము, కవిత్వము, వాస్తు ముఖ్యాంగములైనవి. సంగీతములోని రాగముల ప్రసారమును శరీరము, అంగముల కదలికలలో ద్యోతకం చేస్తాడు. గానశాస్త్రములోని తాళము నాట్యములోని పాదగతులలో కనపడుతుంది. నాట్యముద్వారా వ్యక్తము చేసే భావము కవిత్వము; నాట్యమునకై వేయవలసిన వేషధారణ శిల్పము; చిత్రలేఖనము, నాట్యము చేయు రంగస్థల నిర్మాణము వాస్తు శాస్త్ర పూరితము.

ఈలాగు, నాట్యము సర్వకళలనూ ముఖ్యాంగముల క్రింద చేసుకొన్నది కాబట్టే విష్ణుధర్మోత్తర కారుడు, ఒక కళకూ వేరొక కళకూ అద్భుతమైన మైత్రి వున్నదని వ్యక్తపరచినాడు. శిల్పము నేర్చుకొనువారు నాట్యము నేర్చుకొనవలెను. శిల్పానికిగాని, చిత్రానికిగాని ముఖ్యము మానవ ఆకృతి. మనుష్యుడు నాట్యం చేసేటప్పుడు, ఆనందంతో

కూచిపూడి భరతనాట్య బృందము



శ్రీ వేదాంతం రాఘవయ్య మొ॥వారు.

కదిలే టప్పుడు అతని దేహశోభ సంపూర్ణంగా గోచరిస్తుంది. నాట్యానికి ముఖ్యప్రాణము సంగీతము. సంగీతమునకు ముఖ్య ప్రాణము కవిత్వము. కవిత్వానికి ముఖ్య ప్రాణము శిల్పము. ఇదే పైచెప్పబడిన ఒక లలితకళకూ, మరియొక లలితకళకూగల సంబంధము. జగత్తుయొక్క కదలికే, జగత్తులోని వర్ణసౌందర్యమే, సృష్టిలోని మూర్తి స్వరూపమే, విశ్వంలోని పరమాద్భుతభావమే ఒక మహానాట్యమని మహర్షులు సెలవిచ్చియున్నారు. ఆ మహానాట్యమును సంధ్యానటేశ్వరునిగా భావించ గలిగినారు.

నాట్యమునందు ఆంధ్రులు అతి పురాతనకాలంనుంచిన్నీ ప్రసిద్ధికెక్కిన వారని మన శిల్పాలలో స్పష్టంగా గోచరిస్తుంది. భారతదేశములో ప్రసిద్ధికెక్కిన ఈ కళకు, దాని ఔన్నత్యమునకు ఆంధ్రులు భాగస్వాములు.

నందికేశ్వర విరచితమైన నాట్యశాస్త్రము భరతశాస్త్రమునకు పూర్వపుదని కొందరు పండితులు వాదిస్తారు. భరతాచార్యుడు ఆర్యుడని కొందరు ఔత్తరాహపండితులు వాదిస్తున్నారు. అజంతా చిత్ర లేఖనములో అనేక నాట్య చిత్రము లున్నవి. అమరావతి, భట్టిప్రోలు, గోలి, నాగార్జునకొండ, ఘంటసాల మొదలైన ప్రదేశాలలో దొరికిన దేహభంగిమలు నాట్యశాస్త్రము తెలియనివారికి వ్యక్తము కావు. నాట్యశాస్త్రము వేదకాలంనుంచీ ఉన్నదనుట కుదాహరణలున్నవి. తమిళ గ్రంథమైన శిలప్పదికారములో నాట్యశాస్త్రము వర్ణింపబడి యున్నది. శిలప్పదికారములోని నాయికా నాయకులు ఔత్తరాహ నామములు గలవారు: గోపాలుడు, కణ్ణకి, సంగీతమునందు ఆరితేరిన మాధురి. భరత శాస్త్రములో చెప్పబడిన



ఆంధ్ర బాలికల భరతనాట్య ప్రదర్శనము.

రంగస్థల నిర్మాణమువంటిదే శిలప్పదికారములోని రంగస్థల నిర్మాణము. ఈ రంగస్థల నిర్మాణవర్ణన అథర్వ వేదమునందు గూడా వర్ణింపబడి యున్నది. నాట్యశాస్త్రనిర్మాణమున నిపుణులైన ఆంధ్రులు, దాక్షిణాత్యులకు ఈ శాస్త్రము నేర్పిరనుటకు మనము ఏమియు సందేహింప నవసరము లేదు.

నందికేశ్వర విరచితమైన అభినయదర్పణము పూర్తిగా తెలుగు వారి సొమ్ము. ఇంతవరకును అభినయదర్పణము

తెలుగులిపిలో తప్ప ఇంక నేలిపిలోను దొరకలేదు. దొరికిన గ్రంథాలన్నియు ఆంధ్రదేశములోనివే. ఆంధ్ర దేశములో నాట్యశాస్త్ర ప్రసిద్ధులైన పండితులందరూ ఈ శాస్త్రమును ఆమూలాగ్రంగా వప్పజెప్పగలరు.

మధ్యయుగమున ఆంధ్రులు దక్షిణాది వారికి ఈ శాస్త్రము నేర్పిరనుటకు అనేక నిదర్శనము లున్నవి. మన కూచిపూడి లాంటిదే వారి ఊతుకూడి. వారు నాట్యము చేసే నాటకాలన్నీ తెలుగునాటకాలు. దక్షిణదేశంలో దేవుడికి నాట్యంచేసే దేవదాసీ లందరూ తెలుగు పదాలనే నాట్యం చేస్తారు. అభినయముద్రలు, గతులు, ముక్తాయింపులు మొదలైనవి తెలుగురీతులే. 7 వ శ. నుండి 11 వ శ. వరకూ వలస వెళ్లిన తెలుగు బ్రాహ్మణులే నంబూదరీలు. ఈ నంబూదరీలు, మళయాళీలకు తెలుగునాట ప్రసిద్ధి కెక్కిన నాట్యాన్ని నేర్పినారు. ఆ నాట్యము ఆ దేశ కాల పాత్రముల ననుసరించి కొన్ని కొన్ని క్రొత్త మార్పులను పొందినది. దానినే కథకళి సంప్రదాయ మంటారు. ఆంధ్రులు నవద్వీపము, బలిద్వీపము, సువర్ణ ద్వీపము, అమరావతీ ద్వీపము మొదలైన ప్రాంతముల నున్నప్పుడు ఆ ప్రాంతములలో తమ కళను పెంపొందించిరి.

భావ రాగ తాళ యుక్తములను భారతము అంటారు. నాట్యము నృత్యమనిన్నీ, నృత్తమనిన్నీ రెండు రకాలు. భావాన్ని వ్యక్తపరచడానికి నృత్యము; భావ రహితమై, అలంకార దేశమాత్ర స్వరూపమైనది నృత్తము. ఈ నృత్తమున్నూ రెండు విధాలు: తాండవము, లాస్యము. ఉద్ధృతమైన భావాలను తెలియ చేసేది తాండవము; ఒక కావ్యాన్ని అభినయించేది నాట్యము. అభినయించే భావాలు నాలుగు విధాలు. (1) ఆంగికము (2) వాచ్యము (3) ఆహార్యము (4) సాత్త్వికము. ముఖ్యాంగములైన చేతులు, తల; ఉపాంగాలైన కళ్లు, పెదవులు, గ్రీవము; ప్రత్యేకాంగాలైన దేహము, వ్రేళ్లు, పాదములు మొదలగు వానియొక్క కదలిక అంగాభినయము. 'రా' అని పిలచుట తలనూపుటతో, చేతుల కదలికతో, కళ్లు కదపుటతో, హస్తతలాలతో తెలియజేయవచ్చును. కొన్ని సమయాల నేర్పరచుకొని అసంయుత, సంయుత హస్తాలను, అభినయమునకు ముఖ్యాంగాలను ఏర్పాటు చేశారు. మాటలో, మాటకిచ్చిన ఉదాత్తానుదాత్తాలలో, మాట నుచ్చరించే విధానంలో, వాచ్యాభినయమున ఒక్క 'రా' అనే పదాన్నిభక్తితో భయంతో అనేకరకాలుగా ఉచ్చరింప వచ్చును.

నటకుని యొక్క భావము తానుధరించే వస్త్రములోను, ఆభరణాలలోను చూపించడం ఆహార్యాభినయ మంటారు. దీనికిన్నీ శిల్పసమయ మేర్పరుపబడినది. ఎర్రగుడ్డ కోపాన్ని, నల్లగుడ్డ దుఃఖాన్ని, తెలుపుగుడ్డ స్వచ్ఛతను తెలియజేస్తవి. వంగపండుఛాయ నివేదనను తెలియజేస్తుంది. విలాసం కోసం ఒక విధమైన నగలు ధరిస్తాము. ఉద్యోగ్యం కోసం వెళ్లుతూ ఒక రకపునగలు ధరిస్తాము. ఇంట్లో ఒక రకపు వేషం. ఈ తేడాలే ఆహార్యాభినయములలోనున్నవి. కళ్లు, వ్రేళ్ల కదిలికలు సాత్త్వికాభినయము. ఒక సంపూర్ణ భావాన్ని తెలియజేసే దేహభంగిమ, హస్త ముద్రలు, పాదగతి కర్ణమని వ్యవహరిస్తారు. ఇలాంటి కర్ణములు 108 ఉన్నవి. కొన్ని కర్ణములుకలసి అంగహారమవుతుంది. నేటికాలంలో ఆంధ్రదేశములో నాట్యశాస్త్రము అడుగంటిపోయినది. కంకంటి పాపరాజు తన ఉత్తరరామాయణములో తనకాలము నాటికి ఆంధ్ర దేశముననున్న నృత్య విశేషములను ఇట్లు వర్ణించెను.

"...............................

అభినయంబుల కోపు లరుదైన తీరుపుల్
వెలయగా 'పదచాళి' విధ మొకర్తు
లాగు మైసిరియు, పల్లటియు 'కత్రియు' బెక్కు
విలసిల్లు 'జక్కిణి' విధ మొకర్తు
అలరి వినిపింపఁ బతిమెచ్చనంత నేడ్వు
రిరువు రెనమండ్రు బదియాఱుగురును ముప్ప
దిద్ద రిరువది నలువురు హెచ్చుగాఁగ
బంతులై వంతులాని యయ్యింతులెల్ల."

ఈయన 18 వ శతాబ్దము నాటివాడు. అప్పుడు ఆంధ్ర దేశమున సంగీత నాట్య కళలు విజృంభించినవి. మళ్లీ ఆంధ్రు లీకళాపునరుద్ధరణానికి ప్రయత్నం చేస్తున్నారు. భారతదేశములో ఈ కళను తేజరిల్ల జేయడానికి పాటు పడుచున్న వారిలో ఉదయ శంకరుడు ప్రథముడు!

ఆంధ్ర దేశమున ఆంధ్రనాటకకళాపరిపత్తువారు, చింతా వెంకట్రామయ్య, వేదాంతం లక్ష్మీనారాయణ, వేదాంతం రాఘవయ్య, వెంపటి సత్యనారాయణ,



కుమారి నాళం అమృతం.

జగన్నాథశర్మగార్లు ప్రశంసనీయమైన కృషి చేయుచున్నారు. తాండవకృష్ణ, బి. వి. నరసింహారావు సువానం సత్యనారాయణ, రాజ్యలక్ష్మి, హైమవతి, సిద్దాబత్తుని రాఘవయ్యగార్లు మొదలగు కళార్థులు, రసపిపాసువులు ఈ శాస్త్ర వికసనానికై చేయుచున్న కృషి, వారి ప్రజ్ఞాపాండిత్యాలవల్ల ఫలించ గలదు.

ఔత్తరాహకమైన కథకళి, మణిపుర సంప్రదాయాలను దాక్షిణాత్యమైన కూచిపూడి, ఊతుకూడి, తంజావూరి కథకళి సంప్రదాయాలను పరిశీలించి—అసలు భారతశాస్త్రములో నిర్వచించబడిన ఈ కళయొక్క ఉత్కృష్టస్థితిని అవగతం చేసుకొని—నూత్నసృష్టి చేయవలసిన విధి ఆంధ్రకళాస్రష్టల పైని వున్నది!

ఇప్పుడు, చలనచిత్రకళా ప్రదర్శనాలలో భరతనాట్యమునకు అవకాశము కలిగిస్తూ కొందరు చిత్రదర్శకులు మొదలైనవారు, ఈ కళను ఆదరించి ఈ కళలో ప్రవేశముగలవారికి తగిన ప్రోత్సాహము కలుగజేస్తున్నారు. ఈ విధముగా కొంతవరకు వెనుకబడిన ఈ కళ అభివృద్ధి పొందుచున్నది.

# ఉపకళలు

లలిత కళలకు అనుంగుబిడ్డలై, లలిత కళలను సర్వతోముఖంగా ఉపయోగించు కొన్న—తోలుబొమ్మలు, నాటకములు, అలంకారవస్తు నిర్మాణము, క్రీడా ప్రతిమ నిర్మాణము, హరి కథలు, పురాణపఠనము, పగటి వేషాలు, కలంకారీ అద్దకము, రత్న కంబళుల నేత, ఇంద్రజాలము, దొమ్మరి విద్యలు, భిక్షుక వృత్తులు మొదలైనవి మన దేశమునం దెన్నో ఉన్నవి.

చిత్రలేఖనము, నాట్యము, సంగీతము, కవిత్వము, ఈ నాల్గింటినీ తోలుబొమ్మల నాటకము తనలో ఇముడ్చుకొన్నది. ఈ తోలుబొమ్మల నాటకములు మన తెలుగు

**తోలుబొమ్మల నాటకములు**

దేశంలో నేకాకుండా మహారాష్ట్ర, వంగ, మలయాళ, తమిళ దేశములలో గూడా వ్యాప్తిలోనున్నవి. వీటి ప్రారంభ దశ ఎలాంటిదో మనకు తెలియదుగాని, ఇవి చాలా పూర్వకాలమునుండీ ప్రదర్శింపబడుచుండెడివని చెప్పవచ్చును. సాధారణముగా ఈ బొమ్మల నాటకములలో ఉపయోగించు తోలుబొమ్మలు తంజావూరి మహారాష్ట్ర రాజుల కాలంనాటి వస్త్రధారణా, అలంకారములు కలిగివున్నవి. దీనినిబట్టి ఈ కళ తంజావూరి మహారాష్ట్రరాజుల కాలంలో బాగా అభివృద్ధి పొందిందని చెప్పవచ్చును!

అప్పటికే ఉచ్చస్థితికివచ్చిన ఈ కళ, అంతకన్నా ప్రాచీనమైనదే కదా! ఇప్పటికీ తెలుగుదేశంలోను, తమిళదేశంలోను, మలయాళ దేశంలోను ఈ నాటకాలు విశేషంగా ప్రదర్శిస్తున్నారు. వీటిని ప్రదర్శించేవారు ఆరికాపు లనబడే మహారాష్ట్రజాతి వారవడంచేత తోలుబొమ్మలు మహారాష్ట్ర దేశంనుంచి వచ్చినవేమోనని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు అనుమానిస్తున్నారు. కాని గోదావరి జిల్లా ప్రాంతపు ప్రదేశంలో తెలుగుగొల్ల, జంగం, వంశాలవారిలో తోలుబొమ్మలు ఆడించేవారున్నారు. మా తాతగారు—తల్లాప్రగడ గంగరాజుగారు—తోలుబొమ్మలు తయారుచేయడంలో సిద్ధహస్తులుగా వుండేవారు. ఆయన, తోలుబొమ్మలవారికి అనేక యక్షగానాలు రచించారు. ఈ విద్య నేర్చుకొన్న ఈ తోలుబొమ్మల వంశాలవారు తణుకు తాలూకా పడమట విప్పర్రు చుట్టుప్రక్కల గ్రామాలలో ఉన్నారు. వీరందరున్నూ తెలుగువారే!

సాధారణముగా తోలుబొమ్మలు మేక, గొర్రె, జింక, తోళ్లతో చేయబడును. చిన్నచిన్న పాత్రల చిత్రాలు గొర్రె తోళ్లతోను, శ్రీరాముడు మొదలైన ఉత్తమ నాయకుల చిత్రాలు జింక, దుప్పి చర్మములతోను నిర్మించబడుచున్నవి. తోలును బాగా శుద్ధముచేసి వాటిపైని బొగ్గుతో బొమ్మను వ్రాస్తారు. ఆ గీతలనుబట్టి ఆ తోలును కత్తిరిస్తారు. వజ్ర వైడూర్యాది రత్నాలున్నూ, బంగారపు పువ్వులు మొదలైన అలంకారాలున్నూ—సున్నితమైన చిన్న కత్తితో మధ్యమధ్య చిన్నచిన్న రంధ్రాలుగా కత్తిరించి—రచిస్తారు. ఇలా తయారైన బొమ్మపైని ఒకవైపున మాత్రమే, ఓషధులతోను రసాయన ప్రక్రియలతోను తయారుచేసిన రంగులను చిత్రిస్తారు. దీనికిగూడా శిల్పులు శిల్పసమయాలను అనుసరిస్తారు. ఉత్తమ పురుషలక్షణాలు, మధ్యమ పురుష, అధమ పురుష లక్షణాలు పాత్రానుగుణముగా వుంటవి. ఒక్కొక్క పాత్రకు నాలుగైదు (సమయానుకూలంగా ప్రదర్శించుటకు) బొమ్మలు వుంటవి. రాజ్యారూఢుడైన రాముడు, అడవులలో సంచరించే రాముడు, వాలితో యుద్ధంచేసే రాముడు ఈ విధంగా తయారుచేస్తారు. వీనిలో కొన్ని ఎక్కువ పనితనముగల బొమ్మలు వుంటవి. ప్రేక్షకుల రసజ్ఞతను బట్టి వానిని ప్రదర్శిస్తారు. బొమ్మలపై చిత్రకారుల పేరు కూడా కత్తిరించబడివుంటుంది.

బొమ్మ అభినయించవలసి వుంటుందిగదా! అభినయ సౌఖ్యంకోసం, నాట్యసౌఖ్యం కోసం చేతులు, కాళ్లు, శిరస్సుల కదలికలు చూపించవలెను. అందుకనే ఈ బొమ్మల భుజం దగ్గర, మోచేయిదగ్గిరా కదిలేటట్లు అతుకులు పెడతారు. తెరమీద బొమ్మలుపెట్టి దాని వెనుక అఖండ దీపాలు వెలిగిస్తే చీకటిలోవున్న ప్రేక్షకులకు ఈ బొమ్మలు సజీవాలై, వ్యక్తిత్వపూర్ణాలై తేజరిల్లుతాయి. తోలు బొమ్మలు ప్రదర్శించడంలోమాత్రం వీరు విశేషాలు చేస్తారు. వాద్యాలచప్పుడు, బల్లలచప్పుడు అధికమవుతూ వుంటే తెరమీదికి ఛాయలలాగువచ్చి సంపూర్ణ రూపంపొందుతాయి చిత్రాలు. వేగగతి, మధ్యమగతి చూపిస్తూ ప్రేక్షకులకు ఆనందం కలిగేటట్టు చేస్తారు. స్త్రీపాత్ర వెనుక స్త్రీ, పురుషపాత్ర వెనుక పురుషుడువుండి తమ కంఠధ్వనిని పాత్రకు ఆవిర్భవింపజేసి బొమ్మలను అభినయింప చేస్తారు.

తోలుబొమ్మల జట్టువారు సాహిత్యపరులూ, సంగీత విద్వాంసులుగా వుండాలి. సాధారణప్రజకు వీరి నాటకం ద్వారా విద్య అలవడుతుంది.

వాల్ట్ డిస్నీ చిత్రాలలోని విచిత్రతను వీరు అతిపురాతన కాలంనుంచీ మన ఆంధ్రదేశంలో ప్రదర్శిస్తున్నారు. రాత్రి భోజనంచేసి కూర్చుంటే తెల్లవారేవరకు సర్వరసాలను ఒప్పిస్తూ నాటకమాడుతారు. వారికి యక్షగాన రామాయణము, భారతము, కీర్తనలు కంఠస్థములే!

పల్లవ, కాకతీయరాజుల కాలంలో-వారు యవద్వీపాదులను జయించినప్పుడు-అక్కడకు తమ నాట్యముతో పాటు తోలుబొమ్మలనుగూడా తీసుకపోయిరి. జావాలోని తోలుబొమ్మల నాటకపద్ధతులు మన నాటకపద్ధతుల పునాదిపైనే ఉన్నవి.

ప్రజాదరణ లేక ఈ నాటకాలు పడిపోయినవి. సరియైన శిల్పశాస్త్రానుసారంగా తోలుబొమ్మలను రచించి, ఈ కాలానికి అనుగుణములైన నాటకాలను రచింపజేసి, జావా "గామేళ" పద్ధతిని సంగీతపు హంగులు ఏర్పాటుచేసి నూత్న స్వరూపంతో ఈ కళను ప్రదర్శిస్తే, కళా ప్రపంచమునకు ఎక్కువ సేవచేయగలమని నమ్ముచున్నాను. ముఖ్యముగా ఇది ప్రజలలో విజ్ఞాన వ్యాప్తికి సుగమముగా తోడ్పడగలదు; రసజ్ఞులకు ఆనందము సమకూర్చగలదు.

## నాటకములు

మన ప్రాచీనకవులు 'కావ్యేషు నాటకం రమ్యం' అనీ; 'నాటకాంతం కవిత్వం' అనీ; 'నాటకాంతంహి సాహిత్యం' అనీ పరిపరివిధాల నాటకప్రాశస్త్యమును వర్ణించారు. నాటకాలను దృశ్యకావ్యములనీ, శ్రవ్యకావ్యములనీ రెండు రకాలుగా విభజిస్తారు. రసప్రపుష్టములై, ప్రత్యక్షానందము నిచ్చునవికాబట్టి శ్రవ్యకావ్యాలకంటె దృశ్యకావ్యాలే అన్నివిధాల

ఆంధ్ర నాటక రంగోద్ధారక,



శ్రీ వనారస గోవిందరావు
నాట్యకళా పరిషత్ స్థాపకులు.

నాట్యకళా ప్రపూర్ణ



రావుబహద్దూర్ బళ్ళారి రాఘవాచారి, బి.ఏ., బి.ఎల్.,

ఆనందమునిచ్చేవనీ, వినోదదాయకములనీ, విజ్ఞాన ప్రబోధకములనీ చెప్పవచ్చును ! భావనాశక్తిగల కవిహృదయంలో పరిణామంపొంది కావ్యం ఉద్భవించినట్లు, భావనాశక్తిగల నటునిలో అభినయము నాట్యపరిణామాన్ని పొందుతుంది. భరతాచార్యులు నాట్యశబ్దమును సంక్షిప్తంగా "నానాభావోపసంపన్నం, నానావస్థాంతరాత్మకం, లోకవృత్తానుకరణం, నాట్యమ్ తన్మయాకృతమ్ ; యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖ సమన్వితః, సోఽఙ్గాదభినయైర్యుక్తో నాట్యమిత్యభిధీయతే" అని వివరించియున్నాడు. ఇంక నాటకాలకు సంబంధించిన చర్చ యక్కరలేదు.

తెలుగునాట నాటకాలాడే విధానం, తెలుగు నాటి నాటకాలనుగురించే చెప్పుకోవలసి యున్నది. ఈ రోజున తెలుగు దేశమంతటా ప్రదర్శింపబడుచున్న నాటకాలసంగతి మనము బాగా ఎరుగుదుము.

ఈ నాటకాల ప్రదర్శనాలకోసం మహాకవులు అనేక నాటకాలను వ్రాసిరి. సంస్కృతంలో భాసుడు, కాళిదాసు, శూద్రకుడు, భవభూతి మొదలైనవారు నాటకాలు వ్రాసినవారిలో అగ్రగణ్యులు. వారి—ప్రతిమ, శాకుంతలము, మృచ్ఛకటిక, ఉత్తరరామచరిత్ర మొదలైన నాటకాలున్నూ ప్రశస్తములైనవే. కానీ మన తెలుగులో పూర్వకాలంలో ఆంధ్రకవులు రచించిన నాటకాలేమిన్నీ లేవు. వీధి భాగవతాలు, యక్షగానాలు, తోలుబొమ్మలాటలు—ఇట్లాటివి ఉండేవి. ఈనాటికి మనకున్నూ అనేక నాటకములు, ఉత్తమంగా రచితములై వచ్చుచున్నవి. పాండవ విజయాది భారత నాటకాలను తిరుపతి వేంకటేశ్వరకవులు రచించారు. ప్రసన్నయాదవము, గయోపాఖ్యానం మొదలైన నాటకాలను చిలకమర్తివారు రచించారు. చిత్రనళీయము మొదలైన నాటకాలను ధర్మవరము కృష్ణమాచార్యులుగారు రచించారు. బొబ్బిలి నాటకాన్ని కవిసార్వభౌమ కృష్ణమూర్తి శాస్త్రులుగారు హరిశ్చంద్రను బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు, వేణీ సంహారాన్ని వడ్డాది సుబ్బారాయకవిగారు రచించిరి. ఇంకా అనేక నాటకాలను అనేక మహాకవులు రచించివున్నారు. వీటిని ఆంధ్రదేశమంతటా ప్రదర్శిస్తున్నారు ; ప్రదర్శించారు.

ఇంగ్లీషు నాటకకంపెనీలవారు, మనదేశములో కాపురంవున్న ఇంగ్లీషువారికోసం బొంబాయి కలకత్తాలలో ప్రదర్శించేవారు. వాటినిచూచి ఆ పద్ధతుల ననుకరిస్తూ పారసీక కంపెనీలు కొన్ని తయారై, పారశీక నాటకాలను ఆడటం ప్రారంభించారు. వీరు మన ప్రాంతాలకుకూడా వచ్చి నాటకాలు ఆడేవారు. పార్సీమట్లతో వారి పాటలు, చిత్రవర్ణపు తెరలు, రంగవస్తు పరికరాలు, నటకుల విలువగల దుస్తులు, తబల, హార్మోనియం వాద్యాలు పెట్టి వాటికి ఒక క్రొత్త స్వరూపాన్ని, సౌందర్యాన్ని కల్పించి, మన దృష్టిని ఆకర్షింపజేశారు. అదే పద్ధతులలో మనవారున్నూ నాటకాలు ఆడటం ప్రారంభించారు. ఈ కృషిలో చెప్పదగినవారు ధర్మవరము కృష్ణమాచార్యులుగారు. వీరిని ఆంధ్రనాటక పితామహులనడం సముచితం. విజయనగరం ఆనంద గజపతి మహారాజుగారి కొలువుకూటములో సంస్కృత నాటకములు ఆడేవారట ! కందుకూరి వీరేశలింగం పంతులుగారి శాకుంతలం కాళిదాసు నాటకమునకు ఆంధ్రీకరణమే అయి



శ్రీ కొత్తపల్లి లక్ష్మయ్య,
నాట్యకళా పరిషత్ స్థాపకులు.

నప్పటికీ నాటక రంగంలో పేరు తెచ్చుకొన్నది. చెన్నపట్నంలో రసికజన మనోరంజనీ సభయున్నూ, చెన్నాప్రగడ రామమూర్తి, అడివి కృష్ణయ్యగార్లు భీమవరములో స్థాపించిన నాటకకంపెనీ యున్నూ, లక్ష్మణరావుగారు బందరు

నటకావతంస



శ్రీ స్థానం నరసింహారావు.

లో పెట్టిన బుట్టయ్యపేట సమాజమూ, ఏలూరులో సీతారామాంజనేయ సమాజం, తెనాలిలో రామవిలాస సభ మొదలైనవి బయలుదేరినవి. సురభి కంపెనీవారు దేశమంతటా ప్రఖ్యాతి బొందిరి.

ఈ ప్రదర్శనాలలో పేరు సంపాదించుకొని పైకివచ్చిన వారు ఎందరో కలరు. పురుషులలో బళ్లారి రాఘవాచార్యులుగారు, హరిప్రసాదరావుగారు, లక్ష్మణరావుగారు, బందరు నాయుడుగారు, వెదురుమూడి శేషగిరిరావు, ముంజులూరి కృష్ణారావుగారు, బుర్రా రాఘవాచార్యులుగారు, బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు, నెల్లూరి నాగరాజారావుగారు, యడవల్లి సూర్యనారాయణరావుగారు, దామోజీవరపు నరసింహారావుగారు, దొమ్మేటి సూర్యనారాయణగారు, కపిలవాయి రామనాథశాస్త్రిగారు, ఘంటసాల రాధాకృష్ణయ్యగారు, గోవిందరాజుల వెంకటసుబ్బారావుగారు, పెద్దిబోట్ల చలపతిరావుగారు, పిల్లలమర్రి ఆంజనేయులుగారు, మాధవపెద్ది వెంకట్రామయ్యగారు, డి. వి. సుబ్బారావుగారు, బ్రహ్మజ్యోస్యుల సుబ్బారావుగారు, నిడిముక్కల సుబ్బారావుగారు, పులిపాటి వెంకటేశ్వర్లుగార్లు, యనమండ్ర సత్యనారాయణగారు, అద్దంకి శ్రీరామమూర్తిగారు, బెల్లకొండ సుబ్బారావుగారు, కస్తూరి నరసింహారావుగారు, బందా కనకలింగేశ్వరరావుగారు, సి. యస్. ఆర్. ఆంజనేయులుగారు, జొన్నవిత్తుల శేషగిరిరావుగారు, పారుపల్లి సత్యనారాయణగారు, చోరగుడి దాశరథీరావుగారు మొదలైనవారు. ఆడవేషములలో ప్రథమాన్ని పేరుపొందినవారు కందాళై శ్రీనివాసన్‌గారు. తరువాత పారుపల్లి సుబ్బారావుగారు, ఉప్పులూరి సంజీవరావుగారు, స్థానం నరసింహారావుగారు సిద్ధులైరి. చినలక్ష్మీకాంతం, తోట వెంకటేశ్వర్రావు, బి. వెంకటేశ్వర్లుగార్లుకూడా స్త్రీభూమికల ధరించిరి. కొమ్మూరి పద్మావతిదేవి, అన్నపూర్ణ, సురభి కమలాబాయి, కన్నాంబ, రామతిలకం, కోటిరత్నం, శ్రీరంజని గార్లు స్త్రీలలో పేరుపొందినవారు.

ఇప్పటి నాటకరంగస్థితిని చూస్తే రసజ్ఞుడైన ప్రేక్షకుని హృదయము ద్రవించి పోవలసివస్తుంది. ఏ విషయంలోకూడా నాటకరంగాలవారు శ్రద్ధ వహించటంలేదు. కళాదృష్టి పాటించటంలేదు. నాటకరంగంలో ఉపయోగించే తెరలు మొదలైన పరికారల్లోనూ, ఆహార్యాభినయాల్లోను శ్రద్ధ లేనేలేదు. కేయూరాదిహారాలు, కిరీటాలు, కంకణాలకు బదులు వెర్రిమొర్రి పూసలపేర్లు వేసుకొని, నక్కి పెట్టిన మొఖమల్ పట్టీలు తగిలించుకొని, కోర తల పాగాతో పురుషవేషధారి ప్రవేశిస్తే, పాదర్ల పట్టీలతో అతి నవీనంగా వున్నట్టువుండే స్త్రీవేషం ప్రవేశిసుంది. పాత్రౌచితి పరిగణించడంకూడా కొన్నిపట్టుల పోతున్నది. నాటకానికి ప్రాణమైన నటుడు-నాయకమణిలాంటివాడు. నటన ఉత్కృష్టతను గమనించకపోవడం శోచనీయముగా ఉన్నది. మొత్తముపై ఇట్టి స్థితిలో సినీమాలు ప్రతిబంధకాలై నాటకాలు తగ్గిపోయినవి. ఆదర్శ నాట్య



డాక్టరు గోవిందరాజుల వెంకటసుబ్బారావు.

రంగాలు, నాట్య కళాశాలలు ఉద్భవించి కంట్రాక్టు నాటకాలుపోతే ఈకళ భాసిస్తుంది. దీని ఉన్నతికై ఆంధ్రదేశమున ఆంధ్రనాటకకళాపరిషత్తు కృషిచేయుచున్నది.

స్థలాభావంవల్ల నటకుల లక్షణాలు, మన నాటకాల లోపాలు వివరించడానికి అవకాశంలేదు. కానీ ఈనాట్యకళ, ఉద్ధరించవలసిన ఉత్తమకళయన్నమాట మరవకూడదు. లలిత కళలంటే అభిరతి వుంటేనేకదా జాతికి సభ్యత!

## హరి కథలు—పురాణములు

హరికథలు పురాణపఠనము మొదలైనవాటిలో ఆంధ్రులది అగ్రతాంబూలము! ప్రజా విజ్ఞానమును పెంపొందింపజేసే కళలలో హరికథలు చెప్పడం, పురాణం చెప్పడం ఒక కళ. ఇవి మనకు అనుశ్రుతంగా వస్తున్నవి. వీనిలోనూ సంగీతము, పారమార్థికచింత, నాట్యము, కవిత్వము లీనమై లాస్యం చేయును. ఆంధ్రదేశమున హరికథలకు అగ్రేసరుడు శ్రీ అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు.

## అలంకారవస్తు నిర్మాణము

మనుష్యుడు ఆనందంకోసం దైనందిన చర్యకు సంబంధించిన ప్రతివస్తువునూ శిల్ప స్వరూపంగా చేసుకుంటున్నాడు. ఉదయం లేవగానే స్నానాదికములకు ఉపయోగించే పాత్రలు, ధరించేదుస్తులు, ఆభరణాలు, కాళ్లకు ముచ్చెలు, కూర్చునే ఆసనములు, గదులలో గోడలకు తగిలించే బొమ్మలు, వ్రేలాడగట్టు తెరలు, తివాసీలు, చాందినీలు, గ్రామోఫోనులు, పండుకొను మంచములు, బిడ్డలాడుకొను దుప్పట్లు మొదలైన సమస్త వస్తుజాలమున్నూ కళాస్వరూపంగా చేసుకొని, లలితకళలద్వారానే గాకుండా వీటి ద్వారాగూడా ఆనందం సంపాదించుకుంటున్నాడు. మన పూర్వీకులు ఈ విషయాలలో ఎక్కువ శ్రద్ధ తీసుకొనేవారు.

ఈరోజులలో రానురాను మనుష్యుని హృదయములో పొడితనము, అనుమానము, హేతువాదము ఉద్భవించి, అతని జీవితంలోని కళను దూరదూరంగా తరిమివేస్తున్నవి.

కానీ భారత జాతీయోద్యమము బయలుదేరినప్పట్నుంచీ తిరిగి కళలన్నిటినీ పునరుద్ధరించుకోవడంలో ఆంధ్రులు శ్రద్ధ వహిస్తున్నారు.

కొండపల్లి బొమ్మలు, దశావతారీ ఆటలు, పెద్దాపురం లోహప్రతిమలు, మచిలీపట్టణం కలంకారీ అద్దకాలు, తిరుపతి చందనపుబొమ్మలు, విశాఖపట్నం దంతశిల్పాలు, పర్లాకిమిడి కొమ్ము పరిశ్రమలు, నక్కపల్లి బొమ్మలు, ఏలూరు తివాసీలు తిరిగి తలలెత్తినవి. చెంబులు, అగరువత్తుల చెట్లు, కంచాలు అలంకారస్వరూపాలై, కళా కాంతులతో విలసిల్లుతున్నవి. అజంతా, ధాన్యకటకాల కాలంనాటి అలంకారాకృతులు నేడు పునరుజ్జీవితమగు చున్నవి.

ఆంధ్ర వనితామణులు కట్టుకున్న చీరలయంచులు, ఫలపుష్పాదులతో భారతీయ తేజస్సును తిరిగి ఉదయింపజేస్తున్నవి.

ఈ కళావాహిని వెడల్పై, లోతై ఆంధ్రదేశపు అన్ని దిక్కులందూ ప్రసరించే సువర్ణయుగము వచ్చినది! తూర్యారావములు గానము చేస్తున్నది!



హరికథాగ్రేసర, శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు, పంచభాషా కోవిదులు.

మన జీవితం సౌందర్యవంతం చేసుకొని సర్వాపశ్రుతులను లయం చేసుకొని ఆనందంలోమునిగి వెన్నెలరజను, సముద్రపు కెరటాల అంచుల చిరురేకలు, పూవులలోని మార్దవము, పంటలలోని పసిమి, ఫలములలోని మధురరుచులు, తుమ్మెద ఝుంకారము, సుడిగుండాల గంభీరత ఈలాంటి దివ్య సౌందర్యనిధులు ప్రోవుజేసి, లలిత కళానంద యోగములో లయమైపోదాము !

——::——

# సినీమా కళ

సినీమాకళను చలన చిత్రకళ అని అంటున్నారు; గాని సినీమా అన్న పేరు ఎక్కువగా వ్యాప్తిలోనికి వచ్చినది. ఆబాలగోపాలం అందరికీ తెలుసును. విదేశీయమైన ఈ కళతోపాటు విదేశీయమైన ఈ పేరు సైతము ప్రచారములోనికి రావడం సహజమే.

సినీమాకళ ఒక నవీన కళా విశేషము. ఇందులో అనేక కళలు చేరియున్నవి; ఛాయాగ్రాహకత్వము (ఫోటోగ్రఫి), శబ్దగ్రాహకత్వము (ఆడియోగ్రఫి), సంగీతము, కథారచన, నాట్యకళ, శిల్పము, చిత్రలేఖనము మొదలయినవి. ఈ కళల కూడికవలన ఏర్పడ్డ కళే అయినా, సినీమాకళలో ఒక విచిత్రమైన నూతనత్వము, విశిష్టత ఉన్నవి. ఈ వివిధ కళలలోను ఏది ఎక్కడ ఎంతవరకు ఏవిధముగా చేరవలెనో నిర్ణయించుకొంటూ ఈ చలన చిత్రాన్ని నడపే కళోపాసకుడు చిత్రదర్శకుడు (డైరక్టరు); సూత్రధారివంటి కళాదక్షుడు. ఏకళ మట్టుకు ఆకళ ప్రత్యేకించి చూచినప్పుడు చక్కగా సాగినా, వాటిని కళాదక్షుడు కేంద్రీకరించి సంప్రతించినప్పుడు ఏ మాత్రము లోపము కలిగినా చలన చిత్రము చెడిపోవుట తప్పదు. గనుక, ఏదైనా ఒక చలన చిత్రము మెచ్చుకోదగినదయితే, ఆ మెప్పుకు కారకులు పైని వివరించిన వివిధ కళాదక్షులే కాక, అంతకంటె ఎక్కువగా అన్నిటిని సంప్రతించి, చిత్రమును నడపిన చలన చిత్ర దర్శకుడు సైతము ప్రధానకారకుడనవలెను. గనుక, ఈ కళాదక్షుని కుండవలసిన లక్షణములను, ఇతడు చేయవలసిన కార్యములను ముందుగా పరిశీలించవలెను.

చిత్రదర్శకుడు (డైరక్టరు) కొంత పరిజ్ఞానము, సంస్కృతి కలవాడై ఉండవలెను; పైని పేర్కొన్న వివిధ కళలతోను కొంత పరిచయము కలవాడై ఉండవలెను; అంతేకాక అతనికి లోకజ్ఞానము, భాషాజ్ఞానము, ఉచ్చారణ సౌష్ఠవము, కార్యదీక్ష, పెద్దలతోను పిన్నలతోను వ్యవహరించుటకు కావలసిన సౌభ్రాత్రము, ఓర్మి, నేర్పు, సౌశీల్యము మొదలయిన సద్గుణము లుండవలెను; డబ్బు మదుపుపెట్టి చలన చిత్రము తీయించే ప్రొడ్యూసర్లకు లాభసాటిగాను, ఆ చలన చిత్రము తయారగుటకు తోడుపడే నటీనటులు మొదలయినవారికి సదుపాయములకు లోపము రాకుండాను పని చేయగల నేర్పు, హృదయము ఉండవలెను.

చలనచిత్రము విజయవంతమగుటకు అన్నిటికంటెను ఎక్కువ ముఖ్యమయినది కథ. కథలో ఉండవలసిన కల్పన, చమత్కారము, బింకము మొదలయిన కళానైపుణ్య విశేషములు ఏవి కొరతపడినా కథ చెడుతుంది. కథ చెడిన తర్వాత, పైని పేర్కొన్న ఇతర కళాభాగములు అన్నీ ఉండవలసినట్లున్నా ప్రయోజనములేదు; గనుక కథ. ముఖ్యమయినది. తర్వాత కొన్ని ముఖ్యవిషయములు తెలియజేస్తున్నాము.

కథ తర్వాత నటీనటుల పని ముఖ్యమైనది. ఏయే పాత్ర కేయే స్త్రీ పురుషులు తగిఉందురో ఎంచుకోవలసిన బాధ్యత డైరక్టరే వహించవలెను. నటులు తమ పాత్ర లక్షణమెట్టిదో పూర్తిగా గ్రహించుకోగలవారు కాకపోతే వారిపట్ల డైరెక్టరు ఎంతో శ్రమపడవలసివస్తుంది. కొందరు నటులు తాము ధరించే పాత్రకు అన్నివిధములా సహజముగా అమరి ఉంటారు. అట్టివారి విషయములో డైరెక్టరు పని సులభమవుతుంది. ఆకారములోను, స్వరూపములోను కొందరికి కొన్ని లోపాలుండవచ్చును. అవి వేష రచన (మేక్ అప్) వల్ల తీర్చి దిద్దుకోవచ్చును. ఈ వేష రచన సైతము సినీమాకళా సంగ్రహములో ఒక ముఖ్యమైన కళా విశేషము. ఇందులో తగిన శిక్షపొందినవాడు మేక్ అప్ చేయవలెను. పెద్ద పెద్ద సినీమా సంస్థలలో ఈ కళయందు ఆరితేరినవాళిని పెద్ద వేతనములిచ్చి పెట్టుకొంటారు. మన దేశములో, అందులోను మన తెలుగు సినీమా సంస్థలలో—తమిళ సంస్థలంత అన్యాయంగా కాకపోయినా—ఈ కళతో కొద్దిగా పరిచయము గలవారితోనే



**శ్రీమతి పసుపులేటి కన్నాంబ**

తెలుగుదేశంలోని సుప్రసిద్ధ సినిమాతార. నాటకరంగం మీదకూడ పేరు సంపాదించిన విదుషీమణి. ‘హరిశ్చంద్ర’, ‘ద్రౌపదీ వస్త్రాపహరణం,’ ‘భోజ కాళిదాస,’ ‘చండిక,’ ‘తల్లిప్రేమ,’ ‘సుమతి’—మొదలగు తెలుగు చిత్రాలలో ఈమె నటించినారు. ‘కృష్ణ తూతు,’ ‘అశోకకుమార్,’ ‘కన్నగి’ మున్నగు తమిళ చిత్రాలలోగూడా నటించి అరవ ప్రేక్షకుల హర్షధ్వనుల నందుకొన్నారు.

కాలక్షేపము చేస్తూఉండడంవల్ల వేషరచనలో లోపాలు ఎక్కువగా కనబడుతూఉన్నవి. మనదేశ పరిస్థితులనుబట్టి నటులలో స్త్రీలవేషరచనకు స్త్రీలున్ను, పురుషుల వేషరచనకు పురుషులున్ను నియుక్తులయి ఉండడము మంచిది. తగిన వేషరచనాభిజ్ఞు లున్నయెడల, నటులు కొద్దిపాటి లోపములవల్ల తమ పాత్రకు సహజసిద్ధముగా అమరినవారు కాకపోయినా వేషరచన వల్ల తగినవారు కావచ్చును; గనుక, ఇతర విషయములలో సమర్థులయినవారైతే వారిని డైరక్టరులు ఎంచుకోవచ్చును. వాక్శుద్ధి ఉచ్చారణ సైతము నటీనటులకు పాత్రోచితముగా ఉండవలెను. అది కొందరికి సహజసిద్ధమై ఉంటుంది; కొందరికి సులువుగా అలవడుతుంది; కొందరికి కొంత తర్ఫీదు అవసరము. కొందరి కంఠధ్వని సహజముగా బొంగురుపడి మందరస్థాయిలో ఉంటుంది; గాని భీకరముగా వెలువడవచ్చును. కొందరి కంఠధ్వని కీచుగా ఉన్నత స్థాయిలో ఉంటుంది. గాని, చెవులు బద్దలైపోవునట్లు వెలువడవచ్చును. గనుక కంఠస్వరమునుబట్టికూడా ఏ పాత్ర కెవరు తగిఉందురో డైరెక్టరు నిర్ణయించుకోవలెను. కంఠధ్వని ఎట్లున్నా శబ్దగ్రాహియంత్రము నడపే కళాభిజ్ఞుడు కొంతవరకు దానిని సరిపెట్టుకొనుటకు అవకాశమున్నది. ఈ విషయములో శబ్దగ్రాహియంత్రము నడపేవారికి, నటులు ఉచ్చరించే వాక్యములు పూర్తిగా అర్థము చేసుకొనే భాషాజ్ఞాన ముండవలెను.

తెలుగు చిత్రాలుతీసే కళామందిరములలో తెలుగురాని తమిళులు, బెంగాలీలు మొదలయినవారు ఈ యంత్రములను నడపుతున్నారు. అందుచేత శబ్దగ్రాహకత్వము, ఆడియోగ్రఫి కొన్ని చిత్రాలలో చెడిపోతూఉన్నది. నటుల అభినయ విషయములోను, సార్థకముగా వాక్యముచ్చరించుటలోను, నవరసములను కనబరచుటలోను ముఖ్యముగా గుర్తించవలసిన విషయమేమంటే—ఉద్దిష్టభావమును ప్రకటించుటలో నటులు ఆభావమును తాత్కాలికముగా అనుభవించి, అది లోపలినుండి పుట్టుకొని వచ్చినట్లు భినయించవలెను. అట్లుగాక, కేవలము డైరక్టరు చెప్పినట్లు మాత్రమే చేయుటవల్ల భావప్రకటనము కృత్రిమముగా తెచ్చిపెట్టుకొన్నట్లే ఉంటుందిగాని సహజముగా కనబడదు. ఈ విషయములో డైరెక్టర్ల తోడుపాటు నటులకున్ను, నటుల తోడుపాటు డైరెక్టర్లకున్ను కావలసి ఉన్నది. ఈ విషయమందు సమర్థతలో లోపమున్న నటులు డైరెక్టర్లు చెప్పినట్లు చేయడమే మంచిది. సమర్థత బాగా ఉన్న నటుల విషయములో, సాధ్యమయినంతవరకు వారికి డైరెక్టర్లు స్వేచ్ఛ ఇవ్వడమే మంచిది. ఇప్పుడు జరుగుతున్నదేమంటే, నేర్పుగల డైరెక్టర్లు సమర్థత తక్కువయిన నటులను చక్కగా రాణించునట్లు చేయగలుగుతున్నారు; నేర్పులేని డైరెక్టర్లవల్ల సమర్థత బాగా ఉన్న నటులు చిత్రంలో చెడిపోతున్నారు.

నటులతర్వాత ముఖ్యమైనది ఛాయాగ్రాహకత్వము (ఫోటోగ్రఫి). విని అనందించవలసిన మాటలు, పాటలు మూడు గంటల చిత్రములోను పూర్తిగా ఒక గంటసేపయినా వెలువడవుగాని చూచి ఆనందించవలసిన దృశ్యమంతా మొదటనుండి కొసవరకు చిత్రము పొడవునా వ్యాపించి ఉంటుంది. గనుక చిత్రమంతా ఛాయాగ్రాహకత్వము మీదనే ఆధారపడి ఉంటుంది. ఏయే సన్నివేశములలో



శ్రీ చిత్తూరి నాగయ్య.
ప్రఖ్యాత సినీమా నటులు

ఏయే స్థలములందు ఎప్పుడు ఎంత వెలుగు ఉండవలెనో ఛాయాగ్రాహి యంత్రమును నడపేవాడు పూర్తిగా తెలుసుకోవలెను. అందుకు కావలసిన విషయములన్నీ డైరక్టరు అతనికి ముందుగా చెప్పిఉండవలెను. ఈ విషయములో ఒకరి తోడ్పాటు ఒకరికి పూర్తిగా ఉండవలెను. లేని యెడల చిత్రము పాడవుతుంది.

ఛాయాగ్రాహకత్వము తర్వాత ముఖ్యమైనది శబ్దగ్రాహకత్వము. దీని విషయము, నటుల కంఠధ్వని ఉచ్చారణము గురించి చెప్పినప్పుడు కొంత చర్చించినాము.

శబ్దగ్రాహకత్వము తర్వాత ముఖ్యమైనది సంగీతము. కేవల వచన రచనగల చిత్రమైనా విజయవంతము కాగలదు గనుక సంగీతమున కెక్కువ ప్రాముఖ్య మీయలేదుగాని, దేశములో అందును మన తెలుగువారికి సైతము, తమిళుల కున్నంత లేకపోయినా—చిత్రంలో పాటలు ఎక్కువగా వినబడవలెనన్న కోరిక ఎక్కువగా ఉండడంవల్ల చలన చిత్రంలో సంగీతమునకు ముఖ్యమైన స్థానమునే ఈయవలసి ఉన్నది. అయితే సంగీతమెంత విరివిగా చిత్రములో వ్యాపించిఉండవలెను? సంగీతపుకత్తు పాటలవరస ఎట్లుండవలెను? పాటలో ప్రాముఖ్యము భావాల కెక్కువగా నుండవలెనా? రాగాల కెక్కువగా నుండవలెనా? ఇట్టి ప్రశ్నలకు సమాధానము ఎవరి అభిరుచులనుబట్టి వారు చెప్తున్నారు.

ఆంధ్ర కర్ణాటక సంగీతములో—మొత్తముమీద దక్షిణదేశ సంగీతమంతటిలోను—సంగీతశాస్త్రమార్గ మెక్కువ జిలుగులుతోను, బింకముతోను, సమయ ధర్మములతోను పరిణమించినది. ఉత్తర దేశ సంగీతములో శాస్త్రసమయ పరిశ్రమ తక్కువ; గాని హాయి ఎక్కువ. పాటలలో వారికి భావముమీదను దృష్టి ఎక్కువ; శాస్త్రముమీదను పట్టుదలలేదు. అందుచేతను శ్రుతిరంజకముగా ఉండే హిందీ పాటలు సర్వసాధారణముగా అందరికీ ఇష్టమే; కాని, దక్షిణదేశ సంగీతాభిమానము గలవారు మాత్రము హిందీపాటల సంగీతము పామరజనరంజకమేకాని పండితులు మెచ్చుకోదగినది కాదంటారు. హిందీపాటల సంగీతము మెచ్చుకొనేవారిలోసైతము చాలామంది ఆంధ్రులు వాటి ననుసరించుటకు సమ్మతించరు. "ఆ సంగీతము మంచిదే. గాని అట్టి దేశీయగానము మన తెలుగు జాన పదాలలోను, పల్లె పాటలలోను లేకపోలేదు; గనుక, దానిని ఉద్ధరించి సంస్కరించరాదా? అనుకరణ దుస్థితికి పాల్పడనేల?" అంటున్నారు.

చాలమందిహిందూస్థానీ పాటవరస (మట్టు) ఇచ్చి, పాటలు వ్రాయించు కొంటున్నారు. హిందూస్థానీ పాట వరసలకు హిందూస్థానీ భాష అమరినట్లు తెలుగుభాష అమరదు. అందుచేత, ఈ అనుకరణపద్ధతి అవలంబించినంతకాలము ఈ తెలుగు పాటలు, ఎందుకూ పొందని పాటలగుతున్నవి. ఏవో రెండు మూడు పాటలు—'లేలో లేలో' అనే పాటనుబట్టి రచించిన 'పూలో పూలో' అనే పాటవంటివి ఇంపుగా ఉన్నవి; గాని సాధారణముగా హిందీ వరసపాటలు అందము చెడియున్నవనే చెప్పవలెను. ఆబాలగోపాలం అందరికీ ఇంపుగా ఉండి, విన్నవెంటనే వీధులలో పిల్లలూ పెద్దలూ పాడుకొంటూ ఆనందించే పాటలేవో చూస్తే, ఏ పాటలు తెలుగుభాషకు అన్ని విధములా అమరిఉంటవో బోధపడుతుంది. "నల్లవాడే గొల్ల పిల్లవాడే" అనేపాట, "వస్తాడే మాబావ" అనేపాట, యెంకి నాయుడుబావ పాటలు అందరూ మెచ్చుకొనే పాటలు. చెన్నపరెడ్డి మొదయిన జానపద గీతాలు సైతము ఆకర్షణీయములుగా ఉన్నవి. వీటినిబట్టి చూడగా మన తెలుగుపదాలు ద్విప

# శ్రీ రేణుకా ఫిల్మ్సు

వారు

## ఈ నూతన సంవత్సరమునకు

స్వాగతమొసగి

దక్షిణ భారత దేశమందు అసంఖ్యాకులయిన చలన చిత్రద్రష్టలకు ప్రణతి పూర్వకముగా సమర్పించిన

## కానుక చిత్రము

శ్రీ రేణుకావారి

# భాగ్యలక్ష్మి

డైరెక్టరు — P. పుల్లయ్య. B.A

తారాగణము :— నాగయ్య, మాలతి, దొరస్వామి, టి. సూర్యకుమారి,
గిరి, ఉమామహేశ్వర రావు, కమల,
ఎన్. ఎస్. కృష్ణన్, టి. ఏ. మధురం.

THE SOUTH INDIA PICTURES S.I.P. RELEASE

ఉత్కృష్టమైన కథ * ప్రసిద్ధమైన భూమికా సంవిభాగము * సుకృతదాయకమైన చిత్రము

త్వరలోనే విడుదల. ప్రదర్శనమునకై నిరీక్షింపుడు.

## సౌత్ ఇండియన్ పిక్చర్సు

డిష్ట్రిబ్యూటర్సు :

కారైకుడి, బెజవాడ, బెంగళూరు నగరము.

దలు, రగడలు మొదలయిన జాతీయ ఛందస్సులలో, సూర్యేంద్రగణములతోనో నియమిత మాత్రాగణములతోనో నడచే గేయాలుగా ఉంటున్నవి. ఈ విషయము గ్రహించి సంగీత దర్శకులు చిత్రములందలి పాటలు పాడిస్తే మంచిది. సంగీతమెంత ఉండవలెనన్న విషయం నాటకం విషయములోను చిత్రం విషయములోను పెద్ద ప్రశ్నగానే ఉన్నది. నాటక చిత్ర ప్రదర్శనాలు రెండూ కేవలము వేడుకకోసమే అనే పక్షంలో సంగీతం ఎంతఎక్కువగా ఉంటే అంతమంచిది అనవచ్చును. అట్లుగాక ఇవి కళాధర్మమును పోషించవలెను అంటే, లోకంలో సహజముగా ఎట్టి సమయములందు సంగీతమునకు అవకాశముంటుందో అట్టి సన్నివేశములు కథలో ఉన్నప్పుడే సంగీతముండవలెను. సంగీత మెక్కువ చేయుటకు అట్టి సన్నివేశాలను సహజవిరుద్ధంగా చేస్తే కథా రచనలోని కళాధర్మము చెడుతుంది.

ఇక కథ, చిత్ర ప్రదర్శనమున కనుకూలముగా ఆ కథాభాగములను ప్రదర్శించే రీతి, నటీనటుల సంభాషణ ప్రత్యేకముగా పరిశీలించవలెను. కథలు మూడు విధములుగా ఉన్నవి—పౌరాణికములు, చారిత్రకములు, సాంఘికములు. మొదటి రెండు విధములయిన కథలలోను కథావస్తుకల్పన, కళావిశేషాలకు అవకాశము లేదు; ఉన్నా అత్యల్పము. సిద్ధముగా ఉన్న కథను తెరమీది కెక్కించడమే పని; గాని, ఆ పని ప్రాజ్ఞుల మెప్పును పొందేటట్టు జరుగవలెనంటే చాల కష్టమైన పని. కథ ఏనాటిదో ఆనాటి పరిస్థితులు, వేషభాషాది విషయములు, నాగరికత అంతా పూర్తిగా తెలుసుకొని చిత్రదర్శకుడు తన పని నెరవేర్చుకోవలసి ఉంటుంది. ప్రదర్శించే కథా భాగాలలోగానీ, నటుల సంభాషణలలోగానీ, రంగస్థల రచనలోగానీ, కథ ఏనాటిదో ఆనాటికి సహజముకాని విషయములేవీ రానీయకూడదు. శకుంతలకు రవికతొడగినా, అర్జునునకు రిస్టువాచీ పెట్టినా, భీమునికి కండ్లజోడు పెట్టినా, రామునికి బూట్సుతొడిగినా, సావిత్రికి లోలకులు పెట్టినా, పురాణకథలలో రంగస్థలముపై పి. ఆర్ అన్డ్ సన్‌జు వారి గడియారమో, రివాల్వింగ్ కుర్చీయో, విద్యుద్దీపమో అమర్చినా, సంభాషణలలో ఇంగ్లీషు మాటలో హిందీ మాటలో దొర్లించినా చిత్రము హాస్యాస్పదమవుతుంది. ఇట్టి విషయాలలో లోపాలేవీ రాకుండా చేయడము చాలా కష్టమైన పని. ఏమాత్రము లోపమున్నా విమర్శకులు ఆక్షేపణ చేస్తారు. జనసామాన్యానికి ఈ లోపాలు అంతగా కనబడవు.

ఈ జనసామాన్యము వల్లనే చిత్రానికి డబ్బు ఎక్కువగా వస్తుందిగనుక—జనసామాన్యానికి నచ్చితేచాలు, లోపాలను విమర్శకులు ఆక్షేపిస్తేనేమి—అని చిత్ర నిర్వాహకులు కొందరు పౌరాణిక కథలు తెరమీదికి ఎక్కించారు. దేశంలో మూఢభక్తి ఎక్కువగా ఉండడముచేత వేంకటేశ్వరమాహాత్మ్యము వంటి చిత్రాలకు డబ్బు ఎక్కువగా రావడంలో ఆశ్చర్యం లేదు. అందులో కళాదర్శకత్వప్రతిభ అట్టే లేదు. చారిత్రక కథలు తెరమీదికి ఎక్కించడము మరీకష్టము. గుర్రాలు, ఏనుగులు, సైన్యాలు, దుర్గాలు, యుద్ధాలు మొ॥ చూపించాలంటే ధనం ఎక్కువగా వ్యయమవుతుంది. కథ ఏనాటిదో ఆనాటి చరిత్రవిషయాలు కష్టపడి నేర్చుకొని ఆనాటి వేషాలు, దుస్తులు, అలంకారాలు సమకూర్చుకోవాలి. ఇందులోగల కష్టముగాని, లోపాలుగాని, మెరుగులుగాని జన సామాన్యానికి బోధపడవు. జన సామాన్యానికి కావలసి



శ్రీ తాండవకృష్ణ, ఎమ్.ఏ.
భరతనాట్య శాస్త్రప్రవీణులు

నదంతా వేడుక, వినోదం, హాస్యశృంగారాది రసములుగల సన్నివేశముల ప్రదర్శనం, పాట ఇవి తీసే చారిత్రక చిత్రానికి ఎంతవరకు అనుకూలించి ఉంటవో అంతవరకే పెట్టు కుంటే విజ్ఞులు హర్షిస్తారుగాని జన సామాన్యానికి చాలదు. చరిత్రకు అనుకూలింపక పోయినా ఈ విషయాలు ఎక్కువగా దూర్చితే జనసామాన్యానికి నచ్చుతుంది; డబ్బు ఎక్కువగా రావచ్చును; గాని విజ్ఞులు కఠినంగా విమర్శించకమానరు. చిత్రదర్శకులు సైతము విజ్ఞులే కనుక వారిహృదయానికి నచ్చదు. సాంఘిక చిత్రాలు తీయడంలో పైని చెప్పిన కష్టాలుండవుగాని ఇతర కష్టాలు అనేకంగా కనబడతవి. కథా వస్తువులోను, కల్పనలోను, చిత్రానికి అనుకూలమైన సన్నివేశాలలోను, రచనలోను, చిత్రం తీయడానికి తగినట్లు విభజించే రీతిలోను కళానైపుణ్యం ఎక్కువగా ఉండాలి. వీటి అన్నిటిలోను కథకుడు, దర్శకుడు స్వతంత్రించడానికి పూర్తిగా అవకాశాల్నువి గనుక సులువుగల పనే అన్నట్లు కనబడుతుందిగాని ఎంత కష్టపడిచేసినా లోపాలు అందరికీ కనబడుతూనే ఉంటవి. పౌరాణిక, చారిత్రక కథల విషయములో విమర్శించుటకు శక్తిచాలని జనసామాన్యము సైతం సాంఘిక చిత్రాల విషయంలో కథా వస్తుకల్పనాదులన్నీ విమర్శించడానికి సిద్ధపడుతుంది. ఎవరికండ్లు కప్పడానికీ వీలుండదు. మొత్తం మీద సాంఘిక చిత్రాలలోనే చిత్రకళానైపుణ్యం ప్రదర్శించడానికి ఎక్కువ అవకాశమున్నది. గనుక కళోసాసకులైనవారు సాంఘిక చిత్రాలను తీయడమే ఆశయంగా పెట్టుకొంటున్నారు. డబ్బు కోసం ప్రయత్నించేవారు పౌరాణిక చిత్రాలు తీస్తున్నారు.

సాంఘిక చిత్రాల విషయములో ఎట్టి కథలు ప్రదర్శించవలెనన్న ప్రశ్న కూడా బాధిస్తున్నది. వేడుకకు అనుకూలమైన కథలు ప్రదర్శిస్తే డబ్బువస్తుందిగాని కళాధర్మము చెడిపోతుంది. జనులకు విజ్ఞాన దాయకముగాను, ప్రబోధకముగాను ఉండవలెనంటే, ఈ ఆశయము జనులకు సైతము నచ్చ కలిగినదాకా చిత్ర నిర్వాహకులు ధనలాభం అట్టే చూచుకో కూడదు; నష్టానికైనా ఓర్చుకోవాలి. ఈ ఆశయానికి భంగం రాకుండానే, వేడుకకు తగినంత అవకాశమిస్తూ క్రమకమముగా జనసామాన్యం ఆదర్శప్రాయమైన సాంఘిక కథలుగల చిత్రాలను ఆమోదించేటట్లుచేయడం కష్టమైన పనేకాని అసాధ్యమైన పనికాదు. అట్టి చిత్రాలు రాగలవన్న ఆశ లేకపోలేదు.


శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి.

ఇంతవరకును తీసిన తెలుగు చిత్రాలలో పౌరాణిక చిత్రాలు 75, చారిత్రక చిత్రాలు 3, సాంఘిక చిత్రాలు 20, డాక్యుమెంటరీ చిత్రాలు 2 చిల్లర చిత్రాలు 5; వెరసి 105 ఈ చిత్రాల సంఖ్యలు పైని వివరించిన విషయాలకు నిదర్శనములుగానే ఉన్నవి. చారిత్రక చిత్రాలలో 'పృథ్వీ పుత్ర'గాని 'చండిక' గాని వాస్తవంగా చారిత్రకచిత్రాలుకావు. యథార్థముగా చారిత్రక చిత్రమని చెప్పతగ్గది ఒక 'పత్ని' మాత్రమే. అయితే అది తమిళ చరిత్రకు సంబంధించినదే కాని ఆంధ్ర చరిత్రకు సంబంధించినది కాదు.

సాంఘిక చిత్రాలలో రైతుబిడ్డ ఎక్కువగా ఆర్థిక రాజకీయాందోళనకు సంబంధించిన దైనది. సాంఘిక చిత్రాలలో మొత్తము అన్ని విధములా (అనగా పెట్టుబడిధనం రావడంలోను, ప్రేక్షకులలో పండిత పామరులందరి మెప్పును బడయడంలోను) విజయవంతము లయినవి—గృహలక్ష్మి, మాలపిల్ల, వందేమాతరం, మళ్లీ పెళ్లి, సుమంగళి, ఇల్లాలు, తల్లిప్రేమ మొదలయిన వేవో కొద్దిగా మాత్రమే ఉన్నవి.

చిత్ర దర్శకులలో దర్శకత్వం ప్రారంభించినది మొదలు నేటివరకును పేరుపొంది నిలిచి ఉన్నవారిలో ముఖ్యులు—హెచ్. ఎమ్. రెడ్డిగారు, గూడవల్లి రామబ్రహ్మంగారు, బి. ఎన్. రెడ్డిగారు, వై. వి. రావుగారు, సి. పుల్లయ్యగారు, పి. పుల్లయ్యగారు, చిత్రపు నారాయణమూర్తిగారు, చిత్రపు నరసింహారావుగారు, ఆర్, ఎస్. ప్రకాష్ గారు, ఎచ్. వి. బాబుగారు, ఘంటసాల-బలరామయ్యగారు, కడారు నాగభూషణం గారు మొ॥వారు. వీరిని గురించి శ్రీ ఇంటూరి వేంకటేశ్వర రావుగారు, 'తెలుగు సినిమా వెలుగులు' అనే పుస్తకములో చెప్పిన వాక్యాలు—అందులో ఈచిత్రదర్శకుల విశిష్టతను తెలియజేసేవి—సంగ్రహ మాత్రముగా ఎత్తుకొని తెలియజేస్తున్నాము.

ఎచ్. ఎమ్. రెడ్డిగారు:—" తెలుగు గడ్డమీదికి, తెలుగు

చిత్రాన్ని 1930 సంవత్సరములో తీసుకొచ్చి, భావి దర్శక సంతతికి వరవళ్లు దిద్దబెట్టినవాడు రెడ్డని నిస్సందేహంగా చెప్పాల సుంటుంది.” రామబ్రహ్మంగారు :—“సాంఘిక సమస్యలను పరిష్కారంచేసే కథావస్తువుల్ని తెనుగు తెరమీదికి దిగుమతి చేయడంలో రామబ్రహ్మన్ని ముందరచెప్పి, తక్కిన వాళ్లను తరవాత చెప్పాలి, ‘మాల పిల్ల’ లో సనాతనుల మీదకత్తిని ఝుళిపించాడు. ‘రైతు బిడ్డ’ లో రాజుల్ని రచ్చకీడ్చాడు. ‘ఇల్లాలు’ లో ఇల్లాండ్ర లక్షణ లక్ష్యాలను నిర్దేశించాడు.” బి. ఎన్. రెడ్డి గారు :— “...అన్ని చిత్రనిర్మాణ సంస్థలొ కెత్తు ; ‘వాహిని’ ఒక్కటే ఒకెత్తు ;...వందేమాతరం, సుమంగళి, దేవత – యీ మూడేచాలు కళాకన్యకకు భూషణాలుగా పరిణమించడానికి...టీంస్పిరిట్ మూర్తీ భవించిన పురుషుడు రెడ్డి”. వై. వి. రావుగారు :— “ఆంధ్ర గడ్డమీదపుట్టి, స్వయం కృషిచేత, అరవభూముల్లో హారతులందు కొన్న గడుసు యువకుడు...మళ్లీపెళ్లిలో మనవాడు మనకు దక్కాడు. కథావస్తు కల్పనలో ఆయన చమత్కారం వెల్లి విరుస్తుంటుంది...స్ఫురద్రూపి ; నటుడుగాను, దర్శకుడుగాను...రాణించడానికి ఎల్లాంటి అడ్డంకులు లేవు.”

సి. పుల్లయ్యగారు :— “సినీమా పరిశ్రమా ప్రవాహం యొక్క వడి, లోతుపాతులు క్షుణ్ణంగా గ్రహించినవాడు. ఇప్పుడు తెలుగు తారామండలంలో వేడివేడి రొట్టెల్లాగా చెలామణీ అవుతున్న ప్రముఖతార లందరూ ఆయన అపూర్వ సృష్టి విశేషాలు. అందుకనే ఆయన్ని ‘స్టార్ బ్రహ్మ’ అని సంబోధించాలి. సావిత్రి, కుశలవ, సతీ అనసూయ–ధ్రువ విజయం, చల్ మోహనరంగ, కాసులపేరు, సత్యనారాయణ వ్రతం, మోహినీ భస్మాసుర, మాలతీమాధవం, వరవిక్రయం—యివన్నీ ఆయన చిత్రనిర్మాణ ప్రతిభకు నిదర్శనాలు” పి. పుల్లయ్యగారు :— “...పట్టినపట్టు విడవకుండా కళాకన్యకకు శుశ్రూషచేసిన విద్యాధికులలో...అగ్రగణ్యుడు. హరిశ్చంద్ర, సారంగధర, వేంకటేశ్వర మాహాత్మ్యం, ధర్మపత్ని—యివీ పుల్లయ్యతీసిన చిత్రాలు”. చిత్రపు నారాయణమూర్తిగారు — “గండాలు గడచి గమ్యస్థానాన్ని జేరుకొని, తెలుగు సినీమా గడ్డమీద ఎల్లాగో జీవయాత్ర సాగిస్తున్న విద్యాధిక దర్శకులలో నారాయణమూర్తిని చెప్పాలి. ...ఆయన తీసిన మార్కండేయ, మైరావణ, దక్షయజ్ఞం, ప్రహ్లాద చిత్రాలలో అక్కడక్కడ మెరుపులు లేకపోలేదు. పౌరాణిక చిత్రాలకు ఆధునిక పోకడలను కొంతవరకు అలంకించగల సమర్థుడు” చిత్రపు నరసింహారావుగారు :— “కృష్ణలీలలో...ముందడుగు వేశాడు ; సతీతులసిలో సాన దేరాడు ; జరాసంధలో తప్పుదారి బట్టాడు ; జయప్రదలో నిర్జీవప్రతిమలాగా తయ్యారయాడు”. ఆర్. ఎస్. ప్రకాష్ గారు :— “1926 సం॥ లో హాలీవుడ్ వెళ్లి సినిమా సాంకేతిక పరిజ్ఞానాన్ని సాకల్యంగా గ్రహించిన ప్రథమ ఆంధ్ర పుత్రుడు....1929...లో జనరల్ పిక్చర్సు కార్పొరేషన్ అనే సంస్థను దక్షిణ హిందూదేశంలో స్థాపించి, మద్రాసు గడ్డమీద స్టూడియోను లేవదీసి; ఆంధ్రులకు, అరవలకు యింత కళాభిక్ష పెట్టినవాడు...చాలా చిత్రాలలో ఛాయాగ్రాహకుడు, దర్శకుడు...అజ్ఞాతవాసంలో అక్కడక్కడ తిరిగి ‘చండిక’ ద్వారా ఆంధ్ర ప్రజానీకానికి అగపడ్డాడు. చండిక చిత్రం కాస్తోకూస్తో దెబ్బతిన్నా, ఆయన తీసిన పాటులఅపారనైపుణ్యం సాంకేతికశాస్త్రప్రవీణులను ఆశ్చర్యచకితులుగా చేసింది...సి. పుల్లయ్యలు, వై. వి. రావులు ఎందరో ఆయన భిక్షువల్ల ప్రస్తుతం కన్పడుతున్నారు.”

ఎచ్. వి. బాబుగారు :— “చిత్రనిర్మాణం యొక్క వివిధశాఖల సత్తా ఆయనకు బాగా తెలుసు...కనకతార, కాళిదాసు—ఇవే బాబు దర్శకప్రజ్ఞకు కన్పడే నిదర్శనాలు...ఎడిటింగుశోభ ఆయనకు పూర్తిగా తెలుసు. పాత్రల చిత్తప్రవృత్తులను ఆద్యంతం కథావస్తువులలో పొంకంగా కన్పరచడంలో ఆయనకు ప్రత్యేక ప్రతిభఉంది.” ఘంటసాల బలరామయ్యగారు :— “సంస్థల్ని లేపి, వాటికి మంచి ఊపు యివ్వడంలో బలరామయ్యబలం చెప్పకోదగ్గది. ఆయనది కండదేరిన కళాబలం, ‘పార్వతికి’ ఆయన దర్శకుడు.” కడారు నాగభూషణంగారు:— “చండికకు, తల్లిప్రేమకు ఆయన ప్రొడక్షను మేనేజరు... ఇప్పుడాయన శ్రీరాజరాజేశ్వరీ వారి ‘సుమతికి’ దర్శకుడు... నటీనటుల్లో ఎల్లాంటివాళ్లనో పాళ్ళి చిటికెలో చూపెట్టాడు... ఆయన నడకలో టెంపో, ఆయన చూపులో ‘టెంపో’ ఆయన కార్యక్రమంలో ‘టెంపో’ రొప్పుతూ రొజుతూ కన్పడుతుంది.”

కాళ్లకూరి సదాశివరావుగారు :—1923 లోనే సినిమా రంగంలో ప్రవేశించి చింతామణి, భక్తకుచేల మొదయిన చిత్రాలు, అయిదారు తీశారు. ఇవి ఆర్థికముగా విజయవంతములయినవని చెప్పవలెను.

ద్రోణంరాజు చిన కామేశ్వరరావుగారు :- విద్యాధికులు. 'కచ-దేవయాని' లోను 'జీవనజ్యోతి' లోను ఆయనలో అణగున్న శక్తికొంతవరకు బయటపడ్డది'' కీ. శే. కొచ్చెర్ల కోట రంగారావుగారు :—"నాటకరంగంలో నటుడుగా పేరుపొంది, సినీమారంగంలోనికిదిగి కొన్ని చిత్రాలు తీశారు. నరనారాయణ కొంతవరకుఆయన్ని దర్శకుడనిపించింది. పాపం, హరవిలాసం ఆయన్ని పొట్టను బెట్టుకొంది."

ఆమంచర్ల గోపాలరావుగా :- "విద్యాధికుడైన యువకుడు. ఉన్నతాశయాలు ఆయన దృష్టిసమక్షాన విహరిస్తుంటాయి. నిజంగా గోపాలరావు, పైకెగబ్రాకి అంతరిక్షాన్ని అందుకుందామన్న యువక దర్శకులలో అగ్రతాంబూలాని కర్హుడు."

నటులలోప్రఖ్యాతి పొందినవారు :—బళ్లారి రాఘవాచారిగారు నాట్యరంగవిషయంలో యావద్భారతదేశ విఖ్యాతి పొందినవారు; సినీమారంగంలో అంతప్రఖ్యాతి పొందక పోయినా అభినయములోను భావప్రకటనము లోను ఏరంగమందైనా వారిని మించిన వారరుదు. చిత్తూరి నాగయ్య, సి. ఎస్. ఆర్. ఆంజనేయులు, డాక్టరు గోవిందరాజుల సుబ్బారావు, టి. రామకృష్ణశాస్త్రి, మాధవపెద్ది వెంట్రామయ్య, వేమూరి గగ్గయ్య, అద్దంకి రామమూర్తి, ఎమ్.సి. రాఘవన్, దొరస్వామి, పారుపల్లి సత్యనారాయణ, సుబ్బారావు, దైతాగోపాలం, ఎమ్. రామానుజాచారి, ఆరణి సత్యనారాయణ, పులిపాటి వేంకటేశ్వరులు, బందా కనకలింగేశ్వరరావు, డాక్టరు వేంకటచలం, నారాయణరావు, లంక సత్యం, డా॥ గిడుగు వెంకటసీతాపతి, భీమవరపు నరసింహారావు, మాచిరాజు రామచంద్రమూర్తి, ఉమామహేశ్వరరావు, ఎమ్. లింగమూర్తి, అవసరాల శేషగిరిరావు, మాస్టర్ విశ్వం మొదలయినవారు.

తారలలో శ్రీమతి కన్నాంబ, కాంచనమాల, లక్ష్మీరాజ్యం, సూర్యకుమారి, భానుమతి, పుష్పవల్లి, కృష్ణవేణి, మాలతి, కుమారి, పార్వతీబాయి, రాజరత్నం, బళ్లారి లలిత, బాలసరస్వతి, హేమలత, శాంతకుమారి, శేషమాంబ, ఋష్యేంద్రమణి, సురభి కమలబాయి మొదలయినవారు మంచి పేరు పొందినవారు.

ఎడిటింగ్ పనిచేస్తూ పేరు పొందిన ఆంధ్రులలో వేణు గోపాలరావుగా రొక్కరే కనబడుతున్నారు.

సంగీత దర్శకత్వములో ప్రఖ్యాతులు శ్రీభీమవరపు నరసింహారావు, చిత్తూరి నాగయ్య, రాజేశ్వరరావు, కొప్పరపు సుబ్బారావు, ఎచ్. ఆర్. పద్మనాభశాస్త్రి, గాలిపెంచల నరసింహారావుగార్లు మొ॥ వారు.

మాటలు, పాటలు రచించిన కవులలో సముద్రాల రాఘవాచారి, తాపీ ధర్మారావు, బలిజేపల్లి లక్ష్మీకాంతం, వారణాసి సీతారామశాస్త్రి, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి గార్లు మొదలయినవారు విఖ్యాతులు.

శిల్పదర్శకులలో అడవి బాపిరాజు, టి. వి. ఎస్. శర్మ, ఎస్. వి. ఎస్. రామారావు, అంకాల వెంకట సుబ్బారావు, కే. నాగేశ్వరావు, బసవయ్యగార్లు మొదలయినవారు పేరు పొందినవారు.

ఛాయాగ్రాహకత్వమునకు డాక్టర్లు పి. వి. పతిగారు దేశ ప్రఖ్యాతిని పొందిన ఆంధ్రులు; పారిస్ నగరమున శిక్షణ పొందినవారు. ఆర్. ఎస్. ప్రకాష్‌గారు ఛాయాగ్రాకత్వములో చాలామందికి గురువులు.

శబ్దగ్రాహత్వమునకు విఖ్యాతులు పి. రంగరావు, ఎస్. ఎల్. రంగయ్యగార్లు.

స్టూడియో పరిజ్ఞానము, అనుభవము ఎక్కువగా సంపాదించిన ఆంధ్రులలో చెప్పదగినవారు ఎమ్. గోపాలయ్యగారు.

ఆంధ్ర దేశమందుగాని ఆంధ్రుల పెట్టుబడితోగాని మూడు నాలుగు స్టూడియోలు మాత్రమే వెలసినవి. అందులో విశాఖపట్టణమందలి ఆంధ్రసినిటోను, రాజమహేంద్రవరమందలి దుర్గాసినిటోను కొంతకాలం చక్కగావే పనిచేసి ఆంధ్రుల దురదృష్టంవల్ల ఆగిపోయినవి. మీర్జాపూరంరాజావారి స్టూడియో ఒక్కటే ప్రస్తుతం ఆంధ్రుల స్టూడియో అని చెప్పదగ్గిది. కీ. శే. పి. వి. దాస్‌గారు వేల్ పిక్చర్సు స్థాపించుటలో ఎక్కువగా పనిచేసిన ఆంధ్రులు.

ఆంధ్ర సినిమా పరిశ్రమకు ఆర్థికంగా గొప్ప సహాయులుగా ఉండి చిత్రవ్యాపకత్వమును సాగిస్తూఉండిన పి. వి. శేషయ్యగారి అకాలమరణమువలన గొప్పలోపము వాటిల్లినదని చెప్పవలెను.

ఆంధ్ర చిత్ర కళాభివృద్ధి అనుకొన్నంత చురుకుగా సాగడంలేదు. ఛాయాగ్రాహకత్వం,శబ్దగ్రాహకత్వము, సంప్రతింపు (ఎడిటింగ్) పని ఇంకా ఆంధ్రేతరుల చేతులలోనే ఎక్కువగా ఉన్నది. స్టూడియోలు ఆంధ్రులవి ఎక్కువగా కావలెను. విద్యాధికులు, కులస్త్రీలు గూడ ఈ కళోద్ధరణకు ఎక్కువ కృషి జేయవలెను.




# తొమ్మిదవ భాగం-జాతీయోద్యమములు

## 28వ అధ్యాయము

## 1. కాంగ్రెసు ఉద్యమము

శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య, బి.ఏ., ఎమ్.బి., సి.ఎమ్.

విషయ సంగ్రహము :—1885 లో కాంగ్రెస్ పుట్టెను; 1911 వరకు కాంగ్రెసులో ఆంధ్రదేశమునకు ప్రత్యేక వ్యక్తిత్వము లేదు; 1908 ఆంధ్రమహాసభ; నాగేశ్వరరావుగారి ఆంధ్ర పత్రిక, జొన్నవిత్తుల గురునాథంగారి ఆంధ్రోద్యమమునకు ప్రారంభము; 1917 లో ఆంధ్రరాష్ట్రము కోసము ఉద్యమ ప్రారంభము; 1918 ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘస్థాపనము; వారి సేవ; ఆనందాచార్లుగారి కాంగ్రెస్ అధ్యక్షపదవి; ప్రారంభములో పేరుపొందిన నాయకులలో ముఖ్యులు—న్యాయపతి సుబ్బారావు కేశవపిళ్ల మొదలగువారు, వారిసేవ; కాంగ్రెస్ ప్రముఖులుగా ఉండి, ప్రభుత్వోద్యోగులైన ఆంధ్రులలో ముఖ్యులు, సర్ బి. ఎన్. శర్మగారు.

1918లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ మేర్పడ్డతర్వాత, ప్రముఖులు కొండా వేంకటప్పయ్య, ప్రకాశం, నాగేశ్వరరావు, సాంబమూర్తి, పట్టాభి మొ॥గువారి ఉద్యమప్రచారం; అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ అధ్యక్ష కార్యదర్శులుగా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగార్ల సేవ; బెజవాడలో అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశము; కాంగ్రెసు నిధికి గొప్ప తోడ్పాటు నిచ్చుట; ఆంధ్ర ఖద్దరు ప్రాశస్త్యము; అస్పృశ్యతా నివారణోద్యమము—వీరేశలింగం, వెంకటరత్నం నాయుడుగార్ల హరిజనసేవ; ఆంధ్రరాష్ట్ర హరిజనసేవాసంఘ స్థాపన-నాగేశ్వర రావు, బాపినీడుగార్ల కృషి; జాతీయ విద్యాలయములు, బందరు ఆంధ్ర జాతీయ కళాశాల ప్రాముఖ్యము; పట్టాభిగారి పరిపాలనా దక్షత; ఆంధ్రదేశములో సత్యాగ్రహ సంచలనములు, ఆంధ్రుల ముందంజ; వేలకొలదిమంది జైళ్ల నలంకరించుట—.

తెలుగుస్త్రీలు గూడ సత్యాగ్రహోద్యమములో ఉత్తమమైన పాత్ర నిర్వహించుట; 1921 సంవత్సరోద్యమములో ఆంధ్ర దేశమున స్త్రీలతరపున తీవ్రసంచలనము కలుగజేసి ఉద్యమము జయప్రదముగ నడపిన మాగంటి అన్నపూర్ణాదేవి; ఆమె మృతి, 1940 సంవత్సరంనుంచి అట్టి ప్రచారమునే గావించిన గుమ్మిడిదల దుర్గాబాయమ్మ; ఆమె ధైర్య శూరత్వములు, కార్యదీక్ష; ఆంధ్రుల మానసిక తత్త్వ విచారము; బహు నాయకత్వ ప్రాబల్యం; వారు పట్టుదల కార్యదీక్ష అలవరచుకొనవలసిన ఆవశ్యకత; ఎట్టి ఉద్యమమునకైనను వెనుదీయని వారి త్యాగసంపత్తి; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ అధ్యక్ష, కార్యదర్శుల పట్టిక—.

ఆంధ్రదేశమునకును కాంగ్రెసునకును గల సంబంధము మొదటినుండియు సన్నిహితమైనది, గాఢమైనది. కాని కాంగ్రెసు పుట్టినప్పుడు, అనగా 55 ఏండ్ల క్రిందట, ఆంధ్రదేశమునకు ప్రత్యేక వ్యక్తిత్వము ఏర్పడివుండి వుండలేదు. 1911 సంవత్సరము వరకు, ప్రత్యేకవ్యక్తిత్వము వుండవలెనన్న కోరిక ఆంధ్రులకు ఉదయించినట్లే కనిపించదు. కానీ, తత్పూర్వము బొంబాయినుంచి, 1908 సం॥లో కీ. శే. నాగేశ్వరరావు పంతులుగారు 'ఆంధ్రపత్రిక' అను పేర వారపత్రికను స్థాపించుటయు, దానికి కొద్దికాలమునకు పూర్వము బందరులో రాజకీయేతర విషయములకు సంబంధించిన 'ఆంధ్రమహాసభ' 1908 సం॥ ఏప్రెలులో జరుగుటయు, ఆ ప్రాంతములోనే గుంటూరులో 'ఆంధ్ర' అను పత్రిక, కీ. శే. జొన్నవిత్తుల గురునాథంగారి యాజమాన్యమున జరుపబడియుండుటయు మున్నగు విషయములనుబట్టి చూడగా, లోలోన ఈవిత్తనము మొలకెత్తి



కీ. శే. శ్రీ పి. ఆనందాచార్యులు.
(1891) నాగపూరు కాంగ్రెస్ అధ్యక్షులు,
ఆంధ్రులలో ఇంతవరకు యిట్టి గౌరవము పొందినవారు వీరే!

యున్నదనియే చెప్పవచ్చును. అయితే, కొబ్బరి విత్తనపు కాయ కొన్నాళ్లు నూతిలో తడిసి నాని, కొన్నిమాసములు భూమిలో క్రుళ్ళిన పిమ్మటనే మొక్క మొలిచినట్లు, 'ఆంధ్రోద్యమ' బీజముగూడా 1908 మొదలు 1911 వరకు లోలోన పక్వమై క్రమముగా వృద్ధిపొందినది. 1911 వ సంవత్సరము డిసెంబరు మాసములో హార్డింజ్ ప్రభువు బెంగాలు విభజనమును రద్దుచేసి, బీహారు రాష్ట్రమును భాషా ప్రయుక్తరాష్ట్ర సిద్ధాంతముమీద విడదీసి, రాజధాని స్వాతంత్ర్య నూతన శకము నొక దానిని స్థాపించెను. 1917 సం॥ ఆగస్టు మాసమున ఈ సంగతులను పొందుపరచుచు కలకత్తాలో వ్రాసిన ప్రకటన ప్రకటించినమీదటనే, ఆంధ్రుల మనమున తమకు ప్రత్యేకరాష్ట్రము కావలెనను గాఢమయిన కోరిక ఉదయించెను. 1913 సం॥లో మొదటి ఆంధ్ర మహా సభ జరిగినది. 1916 సం॥లో కాకినాడలో జరిగిన నాల్గవ ఆంధ్రమహా సభలో గావింపబడిన తీర్మానానుసరణ ముగా, ఆంధ్రులకు మున్ముందుగా ప్రత్యేక కాంగ్రెస్ రాష్ట్రము కావలసినదనే కోరిక ననుసరించి, 1917 సం॥ డిసెంబరులో బిసెంటమ్మగారి అధ్యక్షత క్రింద కలకత్తాలో జరిగిన కాంగ్రెసునందు, ఆంధ్రులను దాక్షిణాత్యులనుండి విడదీసి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమనే సంస్థను వేరుచేసిరి. అప్పటినుండి ఆంధ్రుల వ్యక్తిత్వము కాంగ్రెస్‌లో బయటపడెను. అంతవరకు మనలను, దక్షిణాదివారిని, మళయాళీలను, కన్నడులను కలపి మద్రాసీ లని కాంగ్రెస్‌లో పిలవటము వాడుక. ఇప్పటికీ ఆవాడుక కొంత నిలచియే యున్నది. కావున ఆంధ్రులు కాంగ్రెస్ కార్యములలో ఎంత జోక్యము కలిగించుకొని యుండినది వ్యక్తి రూపముగా కొన్ని పేళ్లకుమాత్రమే ప్రాముఖ్యము నిచ్చుచు చెప్పగలమేకాని, ఆంధ్రదేశమునంతకును ఇట్టి సంబంధము వుండెనని చెప్పుటకు వీలులేదు.



కీ. శే. శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, ఎమ్.ఏ.
కొంతకాలము అఖిల భారత కాంగ్రెస్ సంఘ కార్యదర్శి,
చీరాలపేరాల వీరుడు రామదండునాయకుడు.

## 1913 సం॥ నెల్లూరిలో జరిగిన రాష్ట్రీయ రాజకీయ మహాసభ సందర్భమున మొదటిసారి మహాత్ముడు ఆంధ్రదేశమునకు వచ్చుట.



కూర్చున్నవారు (ఎడమనుంచి):—1. రైటానరబుల్ వి. ఎస్. శ్రీనివాసశాస్త్రి 2. గాంధీ మహాత్ముడు 3. శ్రీ రేబాల లక్ష్మీనరసింహారెడ్డి 4. కీ. శే. శ్రీ ఎస్. శ్రీనివాసయ్యంగారు

నిలుచున్నవారు (ఎడమనుంచి):—1. శ్రీ వెంకటరంగం నాయుడు 2. శ్రీ జి. ఏ. నటేశన్ 3. కీ.శే. శ్రీ కస్తూరి రంగయ్యంగారు

కాంగ్రెస్ సంస్థ స్థాపించబడిన తర్వాత 1885 సం॥లో జరిగిన కాంగ్రెస్‌లో గౌరవవార్హులైన పి. రంగయ్యనాయుడు గారు ఒక ప్రతినిధిగా వుండివుండుట మన మెరుగుదుము. అప్పటి సమావేశమునగల 72 గురిలో ఒకడైనా ఆంధ్రుడు ఉండెనని వినుటకు ఎంతయు సంతోషముగా ఉన్నది. పిమ్మట అదివరకే రాజకీయవ్యవహారములలో పాల్గొనుచు పనిచేయుచున్న కీ. శే. న్యాపతి సుబ్బారావు పంతులుగారు 'హిందూ' పత్రిక స్థాపకులైన నల్గురు ఆదిపురుషులలో ఒకరై వుండి, కాంగ్రెసునందు ఉత్సాహముగా పనిచేయుచు, రానురాను ఇటుప్రక్క చెన్నపురి శాసనసభలోను అప్పుడు కలకత్తాలోవున్న కేంద్ర శాసనసభలోను సభ్యులుగావుండి, మిక్కుటముగ దేశసేవను గావించియుండిరి. వారికి పూర్వులు ఆనందాచార్యులుగారు. వారు పట్టణములో హైకోర్టు వకీలుగావుండి పేరు ప్రతిష్ఠలు, సిరి సంపదలు సంపాదించి, ప్రథమ కాంగ్రెస్ సభయందు బొంబాయిలో హాజరయిరి. 1891 వ సంవత్సరమున నాగపూరులో జరిగిన ఏడవ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షులై గంభీరోపన్యాసము ఒసగి, ఆంధ్రదేశమునకును దక్షిణ భారతమునకును శాశ్వత గౌరవాన్ని కలుగజేసిరి. వీరు, ఇరవై సంవత్సరములు రాజకీయ ప్రపంచములో దక్షిణ దిశయందు ప్రకాశవంతముగా మెరసిన నక్షత్రము! సైనిక వాలంటీర్లను గూర్చి ముచ్చటించుచు నాగపూరు కాంగ్రెస్‌లో వీరు ఈ విధముగా

ఆంధ్రకేసరి



శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు,
బ్యారిష్టరు పదవిని కాలదన్ని మద్రాసు రాజధానియంతట ఉద్యమ ప్రచారముచేసిన వీరులు.

నుడివిరి. "మనలను సైనికులనుండి (Recruitment) తగ్గించారు. ఇతర స్థానములనుండి పిలిపించుచున్న అంగ్లేయులు, నీగ్రోలు, ఆర్మనియనులు, పశ్చిమాఫ్రికా మ్యూలటోలు, నామరూపములులేని ఇతరులు, కలకత్తా మురికికాలవలలో నివసించే జనులు-వీరందరు వాలంటీర్లుగ వుండుటకు అర్హులు. వారు మన యోధులు. వారు మన యిండ్లను, సంసారములను, రక్షించు భటులు. ఇట్టి విభేదములు గావించుట ఎంతయు హేయము! మనము జరుపు శాస్త్రీయమైన సంక్షోభమువలన ఇవన్నియు తొలగిపోవలెను. బ్రిటిష్ శాసనమునకిది విరుద్ధము. అన్ని శాసనములకంటె ఉన్నతమైన శాసనము-ప్రకృతి శాసనమునకు-విరుద్ధము."

ఇంక న్యాపతి సుబ్బారావుగారిని గురించి రెండు ముక్కలు చెప్పవలసియున్నది. సుబ్బారావుగారు, మన దేశ శాసన సభలలో ఎన్నిక సభ్యులను చేర్చుట ప్రారంభించిన 1893 సం॥ నాటినుంచి, ఉత్తర జిల్లాలనుండి మూడు సారులు అనగా ఆరు సంవత్సరములు, ఆంధ్రుల తరఫున ఉభయ సభలలో సభ్యులుగా వుంటూవుండి, అటుపిమ్మట కేంద్రశాసనసభలో సభ్యులైరి. 1888 సం॥లో అలహాబాదులో జరిగిన నాల్గవ కాంగ్రెస్ మహాసభకు హాజరై, కాంగ్రెస్ వాదిగా వుండి, గంభీరోపన్యాసముల నొసగి, ఉప్పుపన్ను, జూడిషియల్-ఎక్జిక్యూటివుల విభజన, ఇండియనులను కార్య నిర్వాహక సభలలో సభ్యులుగా చేర్చుట, జూరీవలన విచారణ,రక్కల్లయొక్క హక్కులు మొ॥వాటినిగూర్చి కాంగ్రెస్ వేదికనుండి ఉపన్యసించుచుండిరి. కేంద్రశాసన సభలో ఉన్నప్పుడు పబ్లిక్ సర్వీస్‌నుగురించి తీర్మానముప పాదించి, ఏతత్ ఫలితముగ ఒక కమీషన్‌ను నియమింపజేసిరి.



కీ. శే. శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి,
ఆంధ్ర వీర నారీమణి, గ్రంథకర్త్రి.



కే. శే. శ్రీ బారు రాజారావు,
అఖిల భారత కాంగ్రెస్ సంఘ సహాయ
కార్యదర్శులుగా చాలాకాలము
పనిచేసిన ఆంధ్రులు.

బాంకిపూర్ కాంగ్రెస్‌నందు, ఇట్టి రాయల్ కమిషన్‌ను నియమించినందుకు వందనము లొసగుచు వా్రసిచ్చిరి. వారు ఎట్టి బిరుదములను స్వీకరింప నంగీకరించలేదు. 1898 సం॥మున చెన్నపురిలో జరిగిన కాంగ్రెస్ మహాసభకు, ఆహ్వాన సంఘాధ్యక్షులుగ ఎన్నుకోబడిరి. 1914లో కాంగ్రెస్ జనరలు కార్యదర్శిగా నియమించబడి, 1915, 1916, 1917 సం॥లలో స్వంత ఖర్చుమీద యావత్ భారతమును సంచారముచేసి ప్రబోధము చేసిరి. చివరకు, 1917 డిసెంబరు మాసమున కలకత్తాలో జరిగిన సభలో వారిని తిర్గి జనరలు శెక్రెటరీగ ఎన్నుకొనసరికి, దానిని గౌరవముగా తిరస్కరించిరి.

కాంగ్రెస్‌యొక్క ఆదిపురుషులుగ చెప్పదగినవారిలో మరొకరు దివాన్‌బహదూర్ కేశవపిళ్ళెగారు. వారున్ను సుబ్బారావుపంతులుగారితోపాటు, కాంగ్రెస్ జనరలు శెక్రెటరీగవుండి, 1918 సం॥ములో తమ పదవికి రాజీనామా యివ్వడము, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమును విడదీయబడు తీర్మానము గావింపబడడము—1917సం॥లో డిసెంబరు నెలలో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్‌లో—ఏక కాలమునందు సంభవించినవి. అప్పటివరకు మన ఆంధ్రులనుండి పంతులుగారున్ను, మోచర్ల రామచంద్రరావు పంతులుగారున్ను, శ్రీ బి. యన్. శర్మగారు తప్ప, అఖిల భారత కాంగ్రెస్ సంఘ సభ్యులుగాఉన్నవారు తక్కువ. బందరువాసి శ్రీ లింగరాజు వెంకటసుబ్బారాయుడుగారు—మరణించిన పెద్దలలో నొకరని—మూడవ కాంగ్రెస్ మద్రాసులో జరిగినప్పుడు, తమ అధ్యక్ష ప్రసంగములో శ్రీ త్యాయబ్జీగారు చెప్పిరి.

ఇంక ఆంధ్రులయొక్క సంబంధముగూర్చి తిరిగి చెప్పెదము. అంతవరకును గాఢముగా పనిచేసినటువంటివారు కాంగ్రెస్‌లో మరి ఇతరులునుగలరు. శ్రీ కె. వి. రెడ్డి నాయుడుగారు, సర్ ఏ. పి. పాత్రోగార్లు. బిసెంటమ్మగారు "హోమురూలు" ఉద్యమము సాగించిన మీదట, మొదట నాయుడుగారు పిమ్మట పాత్రోగారు విడిపోయి "సౌత్ఇండియన్ లిబరల్ ఫెడరేషన్" అనే పేరుగల జస్టిస్‌పార్టీలో చేరిరి. రామచంద్రరావుగారు లిబరల్ పార్టీలో చేరిరి. వీరేకాక ఆకాలమునందు పనిచేసినవారు ఇంకను అనేకులు కలరు. గంజాం వేంకటరత్నంపంతులు గారు, సోమంచి భీమశంకరంగారు, కె. శ్రీనివాసరావు గారు, జంబులింగం మొదలియారుగారు మున్నగువారందరు తమతమ కాలములలో, తమతమ శక్తికొలది కాంగ్రెస్ సేవ చేయుచుండిరి. ముఖ్యముగా ఎన్నుకొనతగిన వారు నెమలికంటి సుబ్బారావుగారనే మహావ్యక్తి ఉండెనని చెప్పెదరు.

పూర్వము కాంగ్రెస్‌లో బాగా పనిచేయుచున్నటువంటి వారిని రాజకీయ పాలనయందు గొప్ప ఉద్యోగులుగా నియమించు ఆచార ముండెడిది. ఈప్రకారము కొందరు



శ్రీ కళా వెంకట్రావు, ఎమ్. ఎల్. ఏ,
ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శి.

దక్షిణాది నాయకమణుల దీర్ఘాలోచన



మహర్షి బులుసు సాంబమూర్తి, మాజీ అసెంబ్లీ స్పీకరు (ఎడమ)
శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి, మాజీ ప్రధానమంత్రి (కుడి)

హైకోర్టు జడ్జీలు అయిరి. చంద్రావర్కారు, అవతోష చౌదరి మొదలైనవారు ఇందులకు ఉదాహరణములు. చెన్నపట్నములో జస్టిస్ సుబ్రహ్మణ్యాఅయ్యరుగారు కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన పిమ్మట, ఆపదవి న లంకరించకముందే హైకోర్టుజడ్జీగ నియమింపబడిరి. 1909లో కృష్ణసామయ్యరుగారు హైకోర్టు జడ్జిఅయి ఆ పదవినుండి, బొబ్బిలిరాజాగారు ఖాళీచేసిన ఎగ్జిక్యూటివ్ కవున్సిలు సభ్యత్వ మునకు, 1910 సంIIలో నియమించబడిరి. వీరు ఎగ్జిక్యూటివ్ సభ్యులైనప్పుడు సుందరయ్యాగారు జడ్జీ పదవి పొందిరి. వీరందరు కాంగ్రెస్‌వాదులే! ఇట్టి పారితోషికము ఆంధ్రు లలో శర్మగారికి లభించినది. ఆ రోజులలో అనగా 1916, 1917 ప్రాంతములలో కాకినాడలో జరిగిన నాల్గవ ఆంధ్రి మహాసభ అయినతరువాత, కేంద్రశాసన సభకు యిద్దరు సభ్యులను ఎన్నుకొనవలసియుండెను. అప్పటిలో ఎన్నికలు కాంగ్రెస్‌పేరను జరుపబడక పోయినప్పటికీ, కాంగ్రెస్‌లో పనిచేసినటువంటివారికి ఎక్కువ ప్రశస్తి, అవకాశము వుండి వుండెను. తరువాత 1917 లో కేంద్రశాసనసభకు శ్రీని వాస శాస్త్రిలుగారు, బి. ఎన్. శర్మగారు ఎన్నుకొనబడిరి. 1920 సంIIలో గవర్నమెంటు ఆఫ్ ఇండియాలో ఎగ్జిక్యూటివ్ కౌన్సిలరు పదవి ఖాళీ వచ్చినప్పుడు శర్మగారు నియమించ బడిరి. వీరి నియామకమునకుగల చరిత్ర ఆకర్షణవంతమైనది. మొదట షెమ్స్‌ఫర్డు ప్రభువు బర్ద్వాన్‌ను నియమించి అతని పేరు శెక్రెటరీ ఆఫ్‌స్టేట్సు అయిన మాంటేగ్యూవద్దకు పంపగా, ఆయన ఆపేరును తిరస్కరించి, శాసనసభా సభ్యులలో అనుభవము గలవారి నెవరినైనా నియమించవల సినదనియు, తనను సూచించమనిన శాస్త్రిగారిపేరు చెప్పె దననియు వ్రాసియుండిరి. షెమ్స్‌ఫర్డు ప్రభువుకు శ్రీనివాస శాస్త్రిగారిపేరు నచ్చలేదు. ఎందుచేతననగా 1919 సంII ములో అమృతసరులో జరిగిన కాంగ్రెసునందు, షెమ్స ఫర్డును వైస్రాయి పదవినుండి తొలగింపవలసినదను తీర్మాన

మును శ్రీనివాసశాస్త్రిగారిని ఉపపాదింపవలసినదిగ కోరిరి. కాని వారందుకు అంగీకరింపకపోయినా ప్రతిఘటించుటకు నిలవక ఆ సమయమున అమృతసరునుండి కలకత్తాలో జరుగుచున్న లిబరల్ ఫెడరేషన్ అనే నూతన సంస్థా సమావేశమునకు వెళ్లియుండిరి. అప్పుడు శర్మగారు ఈ తీర్మానమును అమృతసరునందు ప్రతిఘటించిరి. మాంటేగ్యు గారి ఉత్తరము వచ్చినపిమ్మట షెమ్స్‌ఫర్డు, శ్రీనివాసశాస్త్రి గారిపేరు ఆక్షేపణీయమనియు, సకాలములో తమకు సహాయము చేయలేదనియు, అట్లు సహాయముచేసినవారు శర్మగారనియు, వారికి శాసనసభయొక్క అనుభవము చిరకాలమునుంచి



పండిత జవహర్‌లాల్ నెహ్రూ,
భారతజాతి భావినాయకుడు.

గలదనియు, వారిని నియమించవలసినదనియు వ్రాసినారు. మాంటేగ్యువారిపేరును అంగీకరించి, శర్మగారిని గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఎగ్జిక్యూటివ్ మెంబరుగా ఏర్పాటుచేసిరి.

1918 వ సం॥లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము ప్రారంభించబడినపిమ్మట, దేశభక్త కొండా వెంకటప్పయ్య గారు—అందుకు మూడు సంవత్సరముల పూర్వమే తమ ప్లీడరీపనిని మానుకొని—ఆంధ్రోద్యములో నడుముకట్టి పని చేయుచుండి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ-అధ్యక్షులుగా ఉండి చిరకాలము ఈసభను జయప్రదముగా నడపి, ఈ రోజువరకు కాంగ్రెస్ భక్తి పరులుగను, గాంధీమతావలంబకులై అహింసాతత్వ ప్రబోధకులుగాను పని చేయుచున్నారు. వారికి కుడి భుజముగా వున్న గొల్లపూడి సీతారామశాస్త్రి గారు 1921 వ సంవత్సరము నుండి, కాంగ్రెస్‌లో కార్యదర్శిగవుండి, నిర్మాణ కార్యక్రమ రచనయందు అత్యంత ఉ



మౌలానా అబుల్ కలామ్ అజాద్
కాంగ్రెసు అధ్యక్షులు.

త్సాహపూరితులుగా పనిచేయుచు, శాసనసభలపై దృష్టి మరల్పక "వినయాశ్రమము" ను స్థాపించి, ఉపనిషద్వ్యాపకము కొరకు, రచనాత్మక కార్యక్రమవ్యాపకమునకు, గ్రామోద్యోగ పరిశ్రమల వ్యాపకముకొరకు తమ జీవితమును వినియోగించుచున్నారు. అటుపిమ్మట ఈ ఇరవై సంవత్సరముల లోను కీ. శే. కా. నాగేశ్వరరావు పంతులుగారు, శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు, శ్రీ బులుసు సాంబమూర్తిగారు, డా॥ పట్టాభిగారు గంపలగూడెం రాజావారు, అధ్యక్షులుగా వుండి రాష్ట్రీయ కాంగ్రెసు సంఘమును నడపించుచువచ్చిరి. వీరికి కార్యదర్శులుగా వున్నవారిలో జొన్నవిత్తుల గురునాథరావుగారు, విష్ణుభొట్ల సూర్యనారాయణరావుగారు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, తెన్నేటి విశ్వనాథంగారు, వి. వి. గిరిగారు, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, బెజవాడ గోపాలరెడ్డిగారు, మంతెన వెంకటరాజుగారు, చింతమనేని భావయ్యగారు, శరణు రామస్వామి చౌదరి గారు, కల్లూరి సుబ్బారావుగారు, నడింపల్లి వేంకట లక్ష్మీనరసింహారావుగారు, నీలం సంజీవరెడ్డిగారు, దండు నారాయణ రాజుగారు, కళా వెంకటరావుగారు గలరు.



సర్దార్ వల్లభాయి పటేల్

బలాత్కార-త్రియ ఉద్యమమున అనేకులు లాయర్లు, విద్యార్థులు, శాసన సభల పదవులకు రాజీనామాయిచ్చి దేశసేవలో నిమగ్నులైరి. శాసనసభలనుండి వెంకటప్పయ్య పంతులు మొ॥వారు రాజీనామా నిచ్చిరి.

ఇంక అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీలో 20 సంవత్సరములనుంచి ఆంధ్రులు-కొంత హెచ్చు తగ్గు-అవిచ్ఛిన్నముగ సభ్యులుగావుండి పనిచేయుచుండిరి. ప్రప్రథమున శ్రీ కొండవెంకటప్పయ్య పంతులుగారు సభ్యుడుగా వుండిరి. పిమ్మట వారు కొంతకాలము వర్కింగు కమిటీ అధ్యక్షులుగను, కీ. శే. శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు కార్యదర్శిగను వుండిరి. పిమ్మట ప్రకాశంపంతులుగారు, డా॥ పట్టాభిగారు సాంబమూర్తిగారుకూడ సభ్యులుగా వుండిరి. ఈ 22 సంవత్సరములనుండియు ఆంధ్రులు తమ కర్తవ్యమును తక్కిన రాజధానులతో పాటుగాని, అంతకంటె ముందంజవేసిగాని నెరవేర్చి, తమ భాషా ప్రాంతమున కెంతయు కీర్తి తెచ్చిరనుటకు సందేహములేదు. 1921 సం॥మున 31 వ మార్చి, 1 వ ఏప్రెలు తేదీలలో బెజవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘమునందే, ఇప్పటి కాంగ్రెసుకు పునాదియని చెప్పదగిన ప్రణాళిక ఏర్పరుపబడ్డది. తదనుసరణముగ ఆంధ్రులు, కోటి రూపాయల నిధికి, మూడు లక్షల రూపాయలు వసూలు చేసి ఇవ్వగలిగిరి. ఇక ఖద్దరు విషయములో ఆంధ్రులకిది క్రొత్తవిద్యకాదు. శ్రీకాకుళములో అవిచ్ఛిన్నముగ పూర్వమునుండి జరుగుతూనే వచ్చినది. తక్కిన ఖద్దరు యావత్తు పునర్నిర్మితమై—భారత దేశమునందుయే ఇతర ప్రాంతమునకు వెళ్ళినను—ఆంధ్ర ఖద్దరునే కొనవలెనను కోరికను గలుగజేసినది.



అఖిల భారత సంస్థాన ప్రజల సంఘ పక్షమున డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు, బ్రిటిష్ మంత్రిమండలి రాయబారి సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌గారితో సంప్రతించుట.

అస్పృశ్యతా నివారణయందు ఆంధ్రులు వెనుకంజ వేయలేదు. ఈ విషయమై కీ. శే. వీరేశలింగం పంతులుగారు, ఆర్. వెంకటరత్నం నాయుడుగారు చేసినసేవ నిదర్శనము. అస్పృశ్యులను స్పృశ్యులుగ నెంచుకొను సంస్థ చిరకాలము క్రిందట ఏర్పడినది.

జాతీయ విద్యగురించి చెప్పనక్కరలేదు. 1907 సం॥ములో స్థాపింపబడిన జాతీయ కళాశాల ఈనాటికిని జాతీయ విద్యకు పునాదిగా నిలిచివున్నది. 1907 లో సూరత్ కాంగ్రెసులో, జాతీయ సంస్థలను దేశమంతటా నెలకొల్ప

వలెనని తీర్మానింపబడి యుండుటచే, బంగాళా దేశములోను ఇండియాలో ఇతర ప్రాంతములలోను అట్టివి స్థాపించబడు చుండెను.*

హరిజనోద్యమమునందు ఎక్కువగా పనిచేయుచున్న వారిలో శ్రీ బాపినీడుగారి పేరు చెప్ప దగియున్నది. రామదాసు పంతులుగారు ఈ సభకు అధ్యక్షులుగా వున్నారు. మొదటిలో కీ. శే. కా. నాగేశ్వరరావు పంతులుగారు ఈ సభకు అధ్యక్షులుగా ఉండిరి.



శ్రీమతి విజయలక్ష్మి పండిట్,
సం. రా. స్థానిక స్వపరిపాలనా
శాఖ మాజీ మంత్రిణి.

ఆంధ్ర దేశమునందు, కాంగ్రెసు ఉద్యమమునందలి నూతన శకములో దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు ఆదిపురుషులు. వారికిప్పడు 70 సంవత్సరములు నిండినను, ఎక్కువ ఉత్సాహముతోను, శ్రమకు ఓర్చియు తమ కర్తవ్యమును నెరవేర్చుచున్నారు. 1921, 31, 32, 40 సంవత్సరములలోని సత్యాగ్రహములందును ఆంధ్రులు తమ కర్తవ్యమును సంపూర్ణముగా నెరవేర్చిరని అందరును చెప్పుకొన్న విషయము. ముఖ్యముగా 1941 సంవత్సరము సత్యాగ్రహమునందు వారియొక్క చర్యలు, కార్యములు ఎక్కువ ప్రశంసింపబడినవి.

ఇక ముగించకముందు ఒక మాట చెప్పవలసియున్నది. ఆంధ్రులలో ఉత్సాహము మెండు. నూతన భావములను తొందరగా స్వీకరించుశక్తి వారికి విశేషము. బ్రహ్మసమాజము అనండి, ఆర్యసమాజము అనండి, భజనమందిరములనండి, సంఘసంస్కరణ మనండి, విధవావివాహము లనండి, యువతీ వివాహము లనండి, మద్యపాననిషేధ మనండి, సత్యాగ్రహ మనండి, శాసనసభాబహిష్కార మనండి—ఏ క్రొత్త ఉద్యమమువచ్చినను ఆంధ్రులు ముందంజవేసి పురోభివృద్ధికి తోడ్పడుచున్నారు. కాని వారియందు కొంతలోపము కనిపించుచున్నది. ఇతరులవలె ఆంధ్రులకు ఒక నాయకుని అనుసరించి వెళ్లే స్వభావము లేదు. ఇది ఆక్షేపణీయమైనది కాదు; ఏలయన అనేకమంది, దామాషా ప్రకారము గల్గిన త్యాగబుద్ధి, కార్యదీక్ష కల్గినవారు. అందుచేత ఆంధ్రవనము ఒక పెద్ద తాళవృక్షవనము; తక్కిన పొట్టి మొక్కలతోనిండియున్న వనముగాదు. ఇది అరణ్యములోవలె దట్టముగా అలముకొనియున్న వృక్షజాలము. ఇందులోని నిమ్నోన్నతములు గుర్తించుట కష్టము. తక్కిన రాజధానులలో అట్లుగాదు. అందుచేత ఈ తారతమ్యము కనిపించుచున్నది. ఈ కారణముచేతనే ఆంధ్రులలో ప్రతి రూపాయను 16 అణాల క్రింద పంచవలెననియు



డాక్టరు బాబు రాజేంద్రప్రసాద్

* మచిలీపట్నములో మేధావంతులును, త్యాగమూర్తియునగు శ్రీ కోపల్లె హనుమంతరావు ఎమ్.ఏ., బి.యల్. గారు తమ ప్రభుత్వోద్యోగమును, తర్వాత ప్లీడరీవృత్తినిగూడా వదలుకొని, ఆంధ్రజాతీయ కళాశాలను స్థాపించి, ధనమునకై దేశాటనముచేయ మొదలిడిరి. ఆయనకు కుడిచేయిగా వారి ప్రాణమిత్రులు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, ముట్నూరి కృష్ణరావుగారు, వల్లూరి సూర్యనారాయణరావుగారు దాని అభివృద్ధికై పాటుబడిరి. ఆంధ్రులకేకాక, భారత జాతీయతకే ఈ కళాశాల వన్నె పెట్టినది.

పాలనాచక్రం త్రిప్పుటకు తగిన సామర్థ్యం పొందిన సీతారామయ్యగారు, హనుమంతరావుగారి తర్వాత ఆ భారము తమపై వేసుకొని, జయప్రదముగా దీనిని నిర్వహించుచున్నారు. హనుమంతరావుగారి తర్వాత సీతారామయ్యగారొక్కరు ఈ సంస్థకు 40 వేల రూపాయలు సంపాదించి సిరాస్థికొనిరి! రాజమహేంద్రవరములోని జాతీయ పాఠశాల, ఏలూరులోని జాతీయ కళాశాల, గుంటూరులోని శారదా నికేతనము మొదలైనవి, ఇంకను ఇతర ఆశ్రమములు నేటివరకు జాతీయ విద్యకు నిలయములుగ నున్నవి.—సంపాదకుడు.



కీ. శే. శ్రీ జమ్నాలాల్ బజాజ్.

ప్రతి అణాను 12 పైసల క్రింద పంచవలెననియు కోరిక పొటమరించినది. దానిని మూలధనముగా పెట్టి, దానివలని ప్రయోజనమును బాహుళ్యమున కందజేయ వలెనను కోరిక ఇతర ప్రాంతములలో విశేషముగా వున్నది. ఇందాక చెప్పినటువంటి విషయము, ఈ విషయము రెండూ కూడ ఒక్కటే. ఆంధ్రులు ఎంత త్వరగా క్రొత్త భావాలను స్వీకరింతురో అంత త్వరగా భావ విసర్జన చేయగలరు. బహిష్కారోద్యమమునందు వెంటనే రాజీనామాలు యిస్తారు. అందుకు సందేహము పొడచూపినదో, వెంటనే బహిష్కారము మానుకుంటారు. వీరి స్వభావము గడ్డివామి వంటిది. భగ్గున మండి చట్టున చల్లారుతుంది. సత్యాగ్రహమున ప్రవేశించుటయందుకూడ ఇట్టి స్వభావమునే చూపియున్నారు. వెళ్లదలచుకున్నవారంతా ఒక్కపట్టున వెళ్లడము ; తరువాత దేశము గొడ్డుపోయినట్లు ఎవరూ లేక పోవడము ఇంతవరకూ సంభవించిన విషయమే ! కానీ, 1941 సం॥లో అట్లుగాక కొంత క్రమబుద్ధిని కనబరచినారు. అట్లే సమాజవాదము ప్రవేశించగానే యువకులు ఆ వాదము నందుచేరి, అచ్చటనుండి కమ్యూనిజములోచేరి, ప్రజాహితైక జీవనమును భీభత్సము గావించినారు. అహింసా తత్వమును ఎంతత్వరగా అవలంబించెదరో అంత త్వరగా విసర్జించుటకు గూడా సంసిద్ధులుగా వుందురు.

ఇంక ఆంధ్రదేశములో కాంగ్రెస్ ఉద్యమములోను, ఉప్పు సత్యాగ్రహము, సహాయ నిరాకరణోద్యమము మొద లైన అభివృద్ధికరమైన ప్రజాహితైక కార్య నిర్వహణముల లోను స్త్రీలు ప్రశంసార్హమైన పాత్ర ధరించిరి.

1930 సంవత్సరములో మూడువేలమంది ఆంధ్రులు కారా గృహవాసము స్వీకరించిరి. 1932 వ సంవత్సరములో అంత కన్న బహుళముగా జైళ్లకు వెళ్ళిరి. 1941 వ సంవత్సరోద్యమములో దరిదాపు రెండువేలమందికి పైగా సత్యాగ్రహముచేయ సన్నద్ధులైరి. వారిలో ఒక వెయ్యిమంది నిర్బంధింపబడి, రక రకముల శిక్షలకు గురియైరి.

తెలుగు స్త్రీలు, తమ ఉత్తరదేశ సోదరీమణులవలె ప్రతి బంధకములతో, అడ్డంకులతో నిండియుండని పథములోనే పోవుచున్నారు. పర్దాపద్ధతి వీరికిలేదు. సంఘజీవనములోను దేశ విషయములలోను సత్వరముగా పాల్గొనెదరు. 1921, 30, 32 స్వాతంత్ర్యోద్యమములలోను, ఇటీవలి 1941 సత్యాగ్రహోద్యమములోను, పైన చెప్పినట్లు ఆంధ్ర స్త్రీలు ప్రముఖ భూమికల ధరించిరి.

ఆదిలో రాజకీయములలో—1921 వ సంవత్సరములో మహాత్ముడు సహాయ నిరాకరణోద్యమము, 'నోవోటు కాంపైక్' ల నారంభించగానే ఆంధ్రదేశపు స్త్రీలలో —అప్పుడు అమెరికలో వ్యవసాయిక విద్య నభ్యసించుచున్న శ్రీ మాగంటి బాపినీడుగారి సతీతిలకము—శ్రీమతి అన్నపూర్ణాదేవి ముదంజవేసి ఆ ఉద్యమములో పాల్గొన్నది. ఆమె తనజీవితాన్ని సర్వస్వమును జాతీయోద్యమమున కంకితమొనర్చిన పవిత్రమూర్తి. మూడువేల రూపాయల విలువైన తన ఆభరణములను మహాత్మునికి అర్పించినది. ఆనాటి నుండి, అశేష ప్రజకు దుఃఖకారణమైన ఆమె మృతిచెందిన తుదిక్షణమువరకు, సరియైన ఉనికి, నిద్రాహారముల లక్ష్యము చెయ్యక నిరంతరము దేశసేవ చేయుటలో



శ్రీ ఆచార్య కృపలాని,
కాంగ్రెస్ కార్యదర్శి.



శ్రీ భూలాభాయి దేశాయి.

నిమగ్నురాలై, ఉత్సాహము అభిలాష కలిగియుండెను. ఆయా దర్మజీవి నేనాటికిని ఆంధ్రదేశపు స్త్రీలు, పురుషులు మరువరు. ఆమె జ్ఞాపకచిహ్నముగా ప్రతిసంవత్సరము సాంవత్సరీకముల జరిపి, ఉచితరీతిని సత్కరించుచుందురు.

1930 సంవత్సరములో ఇంకొక సోదరి రాజకీయరంగంలో అగ్రస్థానం అలంకరించినది; ఆమెయే దుర్గాబాయి! ఆమె ఝాన్సీరాణి లక్ష్మీబాయిలాగు, ఫ్రెంచి విజేత దేవీజోక్‌లాగు అనేకులు వెనుకడుగు వేస్తున్నప్పుడు, నాయకులను నిర్బంధించినప్పుడు, మద్రాసు నగరమున ఉద్యమ నిర్వాహకురాలై ఉద్యమమునకు ఉజ్జీవనము, ఉత్సాహము కల్పించి, అనల్పమైన కృషి చేసినది. ఆమె ధైర్యము, కార్యశూరత్వము అప్పటి మద్రాసు పోలీసుకమీషనరును నఖశిఖ పర్యంతము కంపింప జేసినవి. ఈ కోటిలో అనేకులు చెప్పదగిన వారున్నప్పటికీ అందరినీ పేర్కొనుట కవకాశము లేదు.



శ్రీ జయంతిపురం రాజా, ఎమ్.ఎల్.ఏ., సంస్కృతాంధ్ర పండితులు, సత్యాగ్రహి

ఆంధ్రులకు కావలసినది ఎక్కువ పట్టుదల, తదేకనిష్ఠ, సువిచారమగు ఆలోచన, అవిచ్ఛిన్నమగు యత్నము, కార్యాంతము వరకు పాటుబడుట. ఈ గుణములు ఆంధ్రులు సంపాందిప గలిగినట్లయితే, భారత దేశమునందు ప్రథమ స్థానము వారే నిర్వహింతురని చెప్పుటకు సందేహములేదు!

## ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీ

| సం॥ము | అధ్యక్షులు | కార్యదర్శి |
|---|---|---|
| 1918 | కొండా వెంకటప్పయ్య | జొన్నవిత్తుల గురునాథం |
| 1919 | ,, | విష్ణుభొట్ల సూర్యనారాయణ |
| 1920 | ,, | ,, |
| 1921 | ,, | గొ. సీతారామ శాస్త్రి |
| 1922 | ,, | ,, |
| 1923 | ,, | అ. కాశీశ్వరరావు |
| 1923 | టం. ప్రకాశం | ,, |
| 1924 | కా. నాగేశ్వరరావు | ,, |
| 1925 | టం. ప్రకాశం | ,, |
| 1926 | ,, | ,, |
| 1927 | ,, | కా. నాగేశ్వరరావు |
| | బు. సాంబమూర్తి (4 నెలలు) | మం. రంగయ్య నాయుడు |
| 1929 | కె. నాగేశ్వరరావు | గ. రంగయ్య నాయుడు |
| 1930 | ,, | అ. కాశీశ్వరరావు |
| 1931 | గంపలగూడెం కుమార రాజా (3 నెలలు) రాజీనామా నిచ్చిరి. సెప్టెంబరు మాసము నుండి అధ్యక్షులు లేరు. | ,, |
| 1932 | అధ్యక్షులు లేరు | ,, |
| 1933 | ,, | ,, |
| 1934 | కా. నాగేశ్వరరావు (జూలై నుండి) | ,, |
| 1935 | టం. ప్రకాశం | బు. సాంబమూర్తి |
| 1936 | ,, | ,, |
| 1937 | ,, | ,, |
| 1937 | భో. పట్టాభి (ఆగస్టు 17 నుండి) | గొ. బ్రహ్మయ్య |
| 1938 | ,, | ,, |
| 1939 | ,, | ,, |
| 1940 | టం. ప్రకాశం | కళా వెంకట్రావు |
| 1941 | ,, | ,, |
| 1942 | ,, | ,, |



# 2. ఆంధ్రోద్యమము

శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు.

విషయ సంగ్రహము:— సామ్రాజ్య సౌభాగ్య మనుభవించిన ఆంధ్రులు. ఇప్పుడు చెన్నరాజధానిలో ఒక భాగమం దణగిమణగి యుండవలసిన అవస్థకు పాల్పడుట; 1885-1905 వరకును ఆంధ్ర రాష్ట్రము కావలెనన్న అభిలాష అంతర్గతముగా మాత్రమే ఆంధ్రులలో ఉండుట; 1905 నుండిన్ని బెంగాల్ విభజనవల్ల కలిగిన అలజడి దేశమందంతటను ప్రాకి ఆంధ్రులను ఆంధ్రరాష్ట్రోద్యమమునకు పురికొల్పుట; 1912 నిడదవోలు మహాసభకు ఆంధ్ర నాయకులు విచ్చేసి ఆంధ్ర మహాసభలకై ఏర్పాటుచేయుట; ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకై ఉద్యమము; ప్రతి సంవత్సరము ఆంధ్ర మహాసభా సమావేశములు జరుగుట; ఆంధ్రరాష్ట్రసిద్ధికి తీర్మానములు; వీటితోపాటు 1921 మాంటెగ్యు-చెమ్స్‌ఫర్డ్‌గార్లవద్దకు ఆంధ్ర నాయకుల రాయబారము, భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సూత్రము ప్రభుత్వమువా రంగీకరించుట; రాయలసీమలో కొంత ప్రతికూల వాతావరణ మేర్పడుట; 1937 లో శ్రీబాగ్ సమాఖ్య; సర్ రాధాకృష్ణగారి యాజమాన్యమున జరిగిన సభలో తీవ్రమైన ఆందోళన-తీర్మానములు; 1941 లో సర్ విజయానంద గజపతిగారి అధ్యక్షతను జరిగిన తీర్మానములు; ఇంకను ఆంధ్ర రాష్ట్రము సిద్ధింపకుండుటకు ఆంధ్రులు పరితపించుట; ఆంధ్ర మహాసభాధ్యక్షుల పట్టిక—.

ఐతరేయ బ్రాహ్మణములనుండియు విఖ్యాత చరిత్ర గలిగి వర్ధిల్లి, శతాబ్దముల కొలది సామ్రాజ్యాధికారము వహించి స్వాతంత్ర్యము ననుభవించి, బలపరాక్రమము లందును, రాజ్యపాలనా విధానమునందును, విద్యా విశేషము లందును, కళానైపుణ్యము నందును దక్షులై ప్రసిద్ధిగాంచిన ఆంధ్రు లిప్పుడు, స్వాతంత్ర్యము గోల్పోవుటయేకాక విడగొట్టబడి చెల్లాచెదరై—"కుంజర యూథంబు దోమకుత్తుక జొచ్చె" నో యనునట్లు—చెన్నరాజధానిలో అణగిమణగి, సరియైన ఆలన పాలనలేని అంతర్భాగముగా నుండవలసి వచ్చుటయు సంభవించినది.

రమారమి 1880 ప్రాంతమునుండి ఇట్లుండ, కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములును, వారిచే ప్రకటింపబడుచుండిన వివేకవర్ధని పత్రికయు, వారు సాగించిన సాంఘిక సంస్కరణప్రయత్నములును, బ్రహ్మసమాజము, దివ్యజ్ఞాన సమాజము మొదలగు మత సంబంధములైన సంస్థలును ప్రజల మనస్సులలో నూతన భావముల నంకురింపజేసినవి. మరియు కాంగ్రెసు మహాసభా ప్రచారములును, జిల్లాసంఘ సభలును, రాజకీయ సమస్యలను గూర్చి సంచలనము కల్పించినవి. కృష్ణాజిల్లా కాంగ్రెస్ మహాసభ ప్రప్రథమమున 1874 వ సంIIలో గుంటూరులో సమావేశమైనది. ఇదియే, జిల్లా మహాసభలలో భారత దేశమంతటికిని మొదట జరిగిన సభయని చెప్పవచ్చును. ఇట్లు ఆంధ్ర దేశమున జనులలో ప్రబోధము పలువిధముల రూపమెత్తుచుండ, 1905 సంIIమున బంగాళాదేశ విభాగము అచ్చటి ప్రజలలో తీవ్రమగు సంచలనము గావించినది. ఒక్కజాతి, ఒక్కభాష, ఒక్క చరిత్ర గలిగి, విద్యావ్యాప్తి చేతను నూతనోద్యమముల ప్రబోధము చేతను ఐక్యభావమును, కార్య దీక్షయును బడసి, భారత దేశమున కంతకును మార్గదర్శకమై, సాంఘిక రాజకీయములందు మేల్బంతులను దిద్దిపెట్టుచున్న వంగదేశీయుల జాతీయ ఐక్యతకును, పురోభివృద్ధికిని భంగకరమైన రాష్ట్రవిభాగము ఆ ప్రజలలో మహత్తరమగు ఆందోళనకు కారణమయ్యెను. అందుకు ప్రతిహతముగ విదేశవస్తు బహిష్కారమును, స్వదేశోద్యమమును సాగించి, వాటిని ఆసేతు హిమాచలమువరకు వ్యాపింపజేసి, కాంగ్రెసు మహాసభా మూలకముగా భారత దేశమంతటా తీవ్రసంచలన ముద్భవింపజేసిరి. చేసిన విభాగమును మార్పు చేయుట లేదని ఆడంబరముగ ప్రకటించి పట్టుబట్టిన ప్రభుత్వమువారు, ఆ తీవ్రమహోద్యమము చేత తమ పట్టునువదలి ప్రజల కనుకూలమగు మార్పు గావించిరి! ఆతరుణమున నడచిన ప్రసంగముల వలనను, రాజప్రతినిధి మొదలగువారి రాజకీయ లేఖలవలనను, భాషా సామ్యము, జాత్యైక్యత ప్రత్యేక రాష్ట్ర నిర్మాణమునకు ముఖ్య కారణములని స్పష్టీకరించబడినది. అప్పుడు రాజప్రతినిధిగానున్న హార్డింజ్ ప్రభువు

దేశభక్త — ఆంధ్రనాయకమణులు — ఆంధ్ర భీష్మ



శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు — కీ. శే. శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులు

బంగాళారాజ్యవిభాగమును గూర్చిన వివాదమును ప్రజాసమ్మతముగా పరిష్కరించుట యుక్తమని యోచించి, ప్రత్యేక రాష్ట్ర విభాగమున కావశ్యకమగు మూడు విధానములను నిరూపించెను. అందు—పరిపాలనాయోగ్యములగు స్థానము లుండవలయుననియును, అవి సమంజసములగు ప్రజల ఆశయముల సంతుష్టిపరచవలెననియును, విశాలమగు రాజనైతిక పాలక సంబంధములగు హేతువులు అందుకు కారణములై యుండవలెనియును సూచించెను.

పైని వివరించిన మూడు పరిస్థితుల ననుసరించి, వంగభాష మాట్లాడు అయిదు జిల్లాలను ఒక్క రాజధానిగా నేర్పరచవలెనని వక్కాణించెను. మరియును అప్పటికి బంగాళారాజ్యములో చేరిన బీహారీలను గురించి ఇట్లు వివరించెను. "ఇంతవరకు బంగాళారాష్ట్రములో చేర్చబడినట్టియు హిందీ భాష మాట్లాడుచున్నట్టియు బీహారీలను విడదీసి, ప్రత్యేకపాలనలోనుంచుట అత్యంతావశ్యకమని నాకు స్పష్టమగుచున్నది. ఇంతవరకును వీరు జోడుసరిపోవని బంగాళీయులతో ఒక్కకాడిన కట్టివేయబడి యుండుటచేత వారి అభివృద్ధికి తగిన అవకాశములు లేకపోయినవి. మరియును గడచిన కొలది సంవత్సరములనుంచి, బీహారీయులలో విస్పష్టమగు తీవ్రమైన సంచలనము కలిగినది. బంగాళీయులలోనుండి విడిపోయిననేగాని, తాము అభివృద్ధికి రాజాలమను గాఢమగు విశ్వాసము వారిలో ప్రబలినది. వారికోర్కెను తీర్చుట కావశ్యకములేనియెడల, కొలది కాలములో ఆందోళనకు కారణమగును; కాబట్టి అందు కిదియే యుక్తమగు సమయము."

ఇట్టి వ్రాతలలోని ఉత్తమాశయములు, అప్పటికే ఆంధ్ర యువకుల రక్తనాళములలో జొచ్చి, హృదయసంచలనము గావించుచున్న జాతీయోద్యమముతోపాటు, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము గావించుట అత్యావశ్యకమను ఆశయమును ప్రబోధించినవి.

1912 వ సంవత్సరమున కృష్ణాజిల్లా కాంగ్రెస్ మహాసభ, విశాలహృదయుడగు కీ. శే. శ్రీ కోపూరి చంద్రారెడ్డి

గారిచే ఆహ్వానింపబడి నిడదవోలులో సమావేశమైనది. అందుచేత ఆంధ్ర దేశమునందలి ప్రముఖులగువారు ఒక్కచోట సమావేశమగుట సంభవించినది. అత్యంత వైభవము తోడను, ఉత్సాహముతోడను నడచిన ఆ సమావేశములు, వారి హృదయసీమలయందు అన్యోన్యత పురికొల్పుటకు కారణభూతములైనవి. ఆంధ్రుల ఐక్యతకును, వారి పురోభివృద్ధికిని ఒక్కొక్కతరి వారెల్ల రొక్కచోట సమావేశమగుటకు గొప్పసాధనముగ గన్పడినది. జిల్లా సభలవలననే ఆంధ్రదేశ మంతటికిని ప్రతి సంవత్సరమును ఒక్కొక్కచోట, ఆంధ్ర మహాసభలు జరిపించుట యుక్తమని తోచినది. ఆంధ్ర మహాసభా సమావేశము ఆంధ్రవ్యక్తిత్వమును దృఢపరచి, సర్వతోముఖముగా ఆంధ్రజాతి నుద్ధరింపజేయుటయే ముఖ్యోద్దేశమగుటచే, ఒక్క భాష, ఒక్క చారిత్రము, ఒక్క సంస్కృతి గలిగిన ఆంధ్రులెల్లరను ఒక్క రాష్ట్రములో ప్రత్యేకింపబడుట అత్యంతావశ్యక మనుభావము తోడ్తోడన ఆంధ్రయువకుల హృదయములలో మొలకెత్తినది. అట్టి యువకులలో కీ. శే. జొన్నవిత్తుల గురునాథము, కీ. శే. చల్లా శేషగిరిరావు పేర్కొనదగినవారు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమును గూర్చిన తీర్మానము, పైన జెప్పినట్లు నిడదవోలులో జరిగిన కృష్ణాజిల్లా మహాసభలోనే ప్రవేశపెట్టబడినదిగానీ, సకాలములో తేబడనందున సభాధ్యక్షులు దానిని సభలో విచారణకు పెట్టకయే నిరాకరించిరి.

పిమ్మట ఆ యువకులును, శ్రీ వింజమూరి భావనాచార్యులుగారు, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు మొదలగు పెద్దలును జేరి ఆంధ్రరాష్ట్రనిర్మాణ విషయమును చర్చించి, దాని ఆవశ్యకతను గుర్తించి, సర్వతోముఖమగు అభివృద్ధికై ఆంధ్రులలో ప్రబోధము గలగించుటకు ఆంధ్రోద్యమమును సాగించిరి.

ఈ ప్రయత్నమునకు ప్రథమ ఫలితముగా బాపట్లలో 1913 సం॥న ప్రథమ ఆంధ్ర మహాసభ సమావేశము జరుపబడినది. అప్పుడు చెన్నరాష్ట్ర శాసనసభలో సభ్యులుగానుండి ఘనతగాంచిన కీ. శే. బయ్యా నరసింహేశ్వరశర్మగారు అధ్యక్షత వహించిరి. ఆంధ్రులలో ప్రముఖులగు వారనేకులు ఆసభకు విచ్చేసిరి. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము గురించి తీవ్రమగు చర్చ జరిగిన పిమ్మట, సెటిల్‌మెంటు ఆఫీసరుగానున్న దివాన్ బహదూర్ మట్నూరి ఆదినారాయణయ్య గారిచేత ఈదిగువ నుదహరించిన తీర్మానము ప్రతిపాదింపబడి మహాసభవారిచేత అంగీకరింపబడినది.

"పరిపాలనా సౌష్ఠవము కొరకును, ప్రజాశ్రేయోభివృద్ధి నిమిత్తమును భాషలను అనుసరించి రాష్ట్ర విభాగము చేయుట ఎప్పటికైనను అవసరమనియును, కాంగ్రెస్ మహాసభవారు కోరుచున్న అధినివేశస్వపరిపాలనకును, రాష్ట్రీయస్వపరిపాలనమును సహజముగను ధృఢముగను నెలకొల్పుటకును భాషాప్రయుక్తరాష్ట్ర విభాగము అవసరమనియును, ఆంధ్రులలో కొందరు అభిప్రాయపడుచున్నారు. కావున ఈ రాజధానిలో తెనుగు జిల్లాల నొక ప్రత్యేక రాష్ట్రముగా జేయుటకు ప్రభుత్వము వారిని గోరవచ్చునో యను విషయమును గూర్చి, ఆంధ్రమహాసభాంగవిధానమును గూర్చి విమర్శించుట కేర్పడిన సంఘమువారు ప్రజల అభిప్రాయములను నిర్ధారణజేసి, రాబోవు ఆంధ్ర మహాసభవారికి నివేదించునటుల ఈ సభవారు తీర్మానించుచున్నారు."

ఈ తీరుమానము ననుసరించి, ఆంధ్ర మండలము నందంతటను ముఖ్యముగా రాయలసీమలోను నిండుగ ప్రచారము చేయబడినది. రెండవ ఆంధ్ర మహాసభ బెజవాడలో 1914 సం॥న, చాలాకాలము చెన్నరాష్ట్ర శాసనసభలోను సామ్రాజ్య శాసనసభలోను సభ్యులుగానుండి, ఆంధ్ర భీష్మ యనుపేరు పొందిన కీ. శే. శ్రీ న్యాపతి సుబ్బారావు గారి అధ్యక్షతను అత్యుత్సాహముతో నడిచినది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమును గూర్చి ప్రజలలో తీవ్రమగువాంఛ పొడమినందున ఈ దిగువ నుదహరించిన తీర్మానము సభవారిచేత అత్యుల్లాసముతో అంగీకరింపబడినది.

తీర్మానము : (అ) పరిపాలనా సౌకర్యమునకును, ప్రజల పురోభివృద్ధికిని భారతదేశమును భాషలనుబట్టి రాష్ట్రములుగా విభజించుట అవసరమనియు ; (ఆ) కాంగ్రెసు మహాసభవారు వ్యక్తీకరించిన స్వపరిపాలనా విధానమును, ఇండియా గవర్నమెంటువారు రాజకీయలేఖలో సూచించిన స్థానిక స్వాతంత్ర్య విధానమును సిద్ధించుటకు భాషా ప్రయుక్త రాష్ట్రములే అనుకూలములనియును; (ఇ) ఈ రాజధానిలోని తెలుగు జిల్లాలను ప్రత్యేక రాష్ట్రముగ చేయుట వాంఛనీయమనియును ; (ఈ) సమితులను స్థాపించుట మొదలగు మార్గములచే, ఈచర్చ విషయమున జనాభిప్రాయమును ఏకో



. కీ. శే. సర్ బయ్యా నరశింహేశ్వర శర్మ,
ప్రథమాంధ్ర మహాసభాధ్యక్షులు,
వైస్రాయి ఎగ్జెక్యూటివ్ కౌన్సిలులో సభ్యులుగానుండిరి.

న్ముఖముగావించుట యావశ్యకమనియును—ఈ సభవారు తీర్మానించుచున్నారు.

ప్రచారము చక్కగా నడుపుటకును, ఉద్యమము దేశ మందంతటను వ్యాపింప జేయుటకును, ప్రభుత్వము వారితో మహా సభవారిచేత అప్పటప్పటికి చేయుబడుచున్న ఆంధ్ర రాష్ట్ర తీర్మానమును గూర్చియు, విద్యావ్యాపకము, ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనము మొదలగు వానిని గూర్చిన ఇతర తీర్మానములను గూర్చియు ప్రభుత్వమువారికి నివేదించి ఉత్తరప్రత్యుత్తరముల జరుపుటకును ఒక స్థాయి సంఘ మేర్పరుపబడెను. ఈ సంఘము అప్పుడప్పుడు ఆంధ్ర జిల్లాలలోని ముఖ్యస్థానములలో సమావేశమగుచుండెను.

మూడవ ఆంధ్ర మహాసభ విశాఖపట్టణములో 1915 సం॥న కీ. శే. పానగల్ రాజా శ్రీ రామారాయణింగారి ఆధిపత్యమున జయప్రదముగ నడిచినది. వీరుకొంత కాలము సామ్రాజ్య శాసన సభ్యులుగా నుండుటయేగాక, పిమ్మట చెన్నరాష్ట్ర శాసనసభలో సభ్యులై, ప్రభుత్వ కార్య నిర్వాహక సభలో ప్రధానతను బడసిరి. 1916 సం॥న నాల్గవ ఆంధ్ర మహాసభ కాకినాడలో కీ. శే. దివాన్ బహదూర్ సర్ మోచర్ల రామచంద్రరావు పంతులుగారి అధ్యక్షతక్రింద మహోత్సాహముతో జరిగినది. మొత్తమున 1913 సం॥ మొదలు ఇంతవరకును 23 మహాసభలు ఆంధ్ర దేశమున ముఖ్యస్థానములలో సమావేశపరుపబడినవి. ఆయాసభల అధ్యక్షుల పేళ్లను, అవి సమావేశములు కాబడిన పట్టణముల పేళ్లను చివర జతపరచిన పట్టికయందు వివరింపబడినవి.

1938 సం॥ చెన్నపురిలో సమావేశమైన ఆంధ్ర మహాసభకు, హిందూ విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన ఎస్. రాధాకృష్ణగారు అధ్యక్షత వహించిరి. చెన్నపురి ప్రధాన న్యాయ స్థానమునందు న్యాయమూర్తిగా నుండిన ముత్తా వెంకట సుబ్బారావుగారు ప్రారంభకులుగా నుండిరి.

విశాఖపట్టణమున జరిగిన మూడవ ఆంధ్ర మహాసభ తక్కిన సభలన్నింటిలోను పూర్వమువలె ఆంధ్ర రాష్ట్రము వాంఛనీయమనుటతో సరిపుచ్చక, ఆంధ్రరాష్ట్ర నిర్మాణము అవశ్యముగాన ప్రభుత్వము వారు త్వరితముగా రాష్ట్ర నిర్మాణము గావింపవలసినదనియే కోరుచు, తీర్మానములు గావింపబడుచు వచ్చినవి.

1941 సం॥లో మరల విశాఖపట్టణములో సర్ విజయానంద గజపతిగారి అధ్యక్షత క్రిందనడచిన 23 వ ఆంధ్ర మహాసభలో—ఇంతకాలము ఆంధ్రులు తీవ్రముగా ఆందోళన గావించుటకు మహాభలు జరిపి, అనేక ప్రయత్నములు చేసినను ప్రభుత్వమువారు అంగీకరింపక పెడచెవిని పెట్టుచుండుటవలన, మరల శాసన సభా కార్యములు సాగినప్పుడు అందలి ఆంధ్ర శాసనసభ్యులు రాష్ట్ర నిర్మాణమునకు వలయు కృషికి ఎట్టి ఆటంకములు వచ్చినను వానిని తొలగించవలెననియు, అప్పటికిని సాధ్యముగాని యెడల ఆంధ్ర శాసన సభ్యులును తక్కిన ఆంధ్ర ప్రజలును గూడ అన్ని విధముల త్యాగముగావించి రాష్ట్రనిర్మాణము సిద్ధింపజేయవలెననియు—చేయబడిన తీర్మానము సర్వజనాంగీకారము బడసినది.

ఇట్లు 1913 సం॥ నుంచీ, ఇంతవరకును ఆంధ్రమహాసభలు సమావేశమగుచుండుటయేగాక, 1921 సం॥ములో భారతదేశ రాజ్యాంగ విధానమునందు మార్పులు జేయ సందర్భమున ఇండియాదేశ కార్యదర్శి మాంటేంగ్యుగారును, చెమ్స్‌ఫర్డ్ ప్రభువుగారును చెన్నపట్టణమువచ్చినప్పుడు, భారతదేశమున భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణము యొక్కయు, ఆంధ్రరాష్ట్ర నిర్మాణముయొక్కయు ఆవశ్యకత నివేదించుటకు కీ. శే. శ్రీ న్యాపతి సుబ్బారావుగారి అధ్యక్షత క్రింద కొందరు ఆంధ్రప్రముఖులతో గూర్పబడిన నొక రాయబారము నడపింపబడినది. దాని ఫలితముగా ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము గావింపబడకపోయినను—ఆయా రాజధానుల లోని శాసనసభలలో అధికసంఖ్యాకులగు సభ్యులచేత ప్రత్యేక రాష్ట్ర నిర్మాణము అంగీకరించుచు తీరుమానములు చేయబడినయెడల, ప్రభుత్వమువారు అంగీకరింపవచ్చు—నను నియమము, 1916 సం॥మున గావింపబడిన ఇండియాదేశ రాజ్యాంగ విధాన చట్టమునందు చేర్చబడినది.

ఈ అవకాశమునుబట్టి, చెన్నపురి శాసనసభలో నాలుగు సారులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయము చర్చకు వేయబడి, బహుసంఖ్యాకులవలన అంగీకరింపబడెను. కాంగ్రెసువారు ప్రభుత్వాధికారమును చేబట్టిన రోజులలో అట్టి తీర్మానము ప్రవేశపెట్టబడి సభాంగీకారము బడయుటయు, మద్రాసు గవర్నరుగారు గూడా సుముఖులై చెన్నపురమునందే ఆంధ్రరాష్ట్రమునకును, తమిళ రాష్ట్రమునకునుగూడా ప్రత్యేక రాజ్యస్థానములేర్పరచి, రెంటికినీ గవర్నరుగానుండ వచ్చునను అనుకూలాభిప్రాయమును వెల్లడించిరి. ఆవార్త అంతటను వ్యాపించుటయు ప్రజలలో ఆంధ్రరాష్ట్రము తప్పక సిద్ధించునను ఆశ గొప్పగా కలుగుటయు నేర్పడినది. ఇండియా కార్యదర్శిగారు దానిని అంగీకరించకపోవుటతో ప్రజలయాశ నిరాశయయ్యెను.

ఇండియా కార్యదర్శిగారి ఉత్తరువు ప్రకటితముగాక పూర్వమే చెన్నపట్టణములో సమావేశమైన ఆంధ్రమహాసభకు, మద్రాసు హైకోర్టులో న్యాయమూర్తిగానుండి సుప్రసిద్ధులైన శ్రీ ముత్తా సుబ్బారావుగారు ప్రారంభకులుగా నుండిరి. తత్త్వశాస్త్ర పండితులుగా ఖ్యాతిగాంచి, దేశాంతరములందు సహితము గౌరవము బడసిన సర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు అధ్యక్షతవహించిరి. (ఈ విషయముపైన తెలిపియే యుంటిమి) ఇట్టి ప్రముఖుల తోడ్పాటు గలిగియు ఆంధ్రరాష్ట్రము సిద్ధించక పోవుట శోచనీయమే!

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు రాయలసీమ ప్రముఖులలో కొందరి విముఖతను నివారించి, వారి సంశయములు నివర్తించుటకు 16-7-37 తేదీన చెన్నపట్టణములో తూర్పుతీర వాసులగు ఆంధ్రులపక్షమున, రాయలసీమయొక్క ఆర్థికాభివృద్ధికై తగిన అవకాశములు ముందు కల్పించుటకును, రాజధానికి తగిన స్థానమును నిర్ణయించు విషయమునను కొన్ని షరతులతో నొక సమాఖ్య—"శ్రీబాగ్ సమాఖ్య" అను పేరుతో—ప్రకటించిరి.

మరియును ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను ఇండియా కార్యదర్శిగారికి "రౌండు టేబుల్ కాన్ఫరెన్సు"లో నివేదించుటకు 1931–34 సంవత్సరములో జరిగిన ప్రత్యేక ఆంధ్ర మహాసభలో కీ. శే. వి. వి. జోగయ్య పంతులుగారిని రాయబారిగా నియమించిరి. మరియొకసారి శ్రీ దేశపాండ్య సుబ్బారావుగారిని గూడా అందునిమిత్తమే పంపియుండిరి. ఇంత ప్రయత్నము గావించబడినను ప్రభుత్వమువారు రాష్ట్ర నిర్మాణము అంగీకరించకపోవుటకు కారణము దురూహ్యముగా నున్నది.

ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్ర నిర్మాణముకై గావించుచున్న ఆందోళన సమంజసము, సహేతుకమనుటకు, పై నుడివిన రాజప్రతినిధి హార్డింజ్ ప్రభువు వ్రాసిన రాజకీయలేఖలోని యంశములు ప్రమాణవాక్యములుగా గమనించదగినవి. అది కాక, 1930 సం॥లో భారతదేశ నూతన రాజ్యాంగ నిర్మాణమునుగూర్చి విమర్శించుటకేర్పడిన సైమన్ కమిషన్‌వారు తమ నివేదికలో ఆంధ్రరాష్ట్రమునుగూర్చి ఈ విధమున వ్రాసియున్నారు :—

"భారతదేశములోని వివిధరాష్ట్రములలో భాషా భేదములవలన విడిపోవలెనను అభిలాష ప్రజలలో పుట్టుటచేత కొలది సంవత్సరములనుండి ఈ భాషా భేదములు ముఖ్యమగు నొక రాజకీయసమస్యగా పరిణమించినవి... పదునేడు సంవత్సరముల క్రిందట తెలుగు మాటలాడు జిల్లాలవారు గావించిన మహాసభలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము కావలెనని కోరబడినకోర్కె ఇన్ని సంవత్సరములనుండి ఎడతెగక కోరబడుచునేయుండి, ఇప్పుడు ఒక ప్రాముఖ్యమైన రాజకీయ సమస్యగా తేలినది. కొలది సంవత్సరముల క్రిందట రెండు

సారులు మదరాసు శాసనసభలో క్రమముగా చర్చించబడి, బహుసంఖ్యాకులగు సభ్యులచేత అంగీకరింపబడినది.

మరియు ఈ రాష్ట్రములోని పరివర్తనములు, భాషా సమస్యవలెనే ప్రాధాన్యతవహించి, రాజకీయములలో ప్రవేశించి, ప్రత్యేకరాజకీయ పక్షములు ఏర్పడుటకు కారణములైనవి."

ఇంకను, సైమన్ కమీషన్‌వారు తమ నివేదికలో మరియొకచోట ప్రత్యేకరాష్ట్ర నిర్మాణమునకు ఆవశ్యకమైన పరిస్థితుల ఈ క్రిందివిధముగా వివరించినారు.

"ఏకభాషను మాట్లాడు ప్రజలు నివసించు దేశభాగము ప్రత్యేక రాష్ట్రముగా చేయబడినప్పుడు, ఆరాష్ట్ర పరిపాలనా భారమును నిర్వహించుటకు తగిన ఆధారములును అవకాశములును కలిగి, స్వయంపోషక సామర్థ్యము కలిగియుండిన యెడల, భాషాసామ్యము ప్రత్యేక రాష్ట్ర నిర్మాణమునకు తగిన కారణమే కాని, అది యొక్కటియే చాలదు. జాతి మత సామ్యము, ఆర్థిక విషయములందు ఐక్యత, దేశమంతయు కలసి ఏకఖండముగానుండుట, పట్టణములకు తగినట్లు పల్లెలు, సముద్రతీరమునకు తగినట్లు లోపల మెరక భాగములు కలిగియుండుట, అమలులో పెట్టుటకు అన్నిటికంటె ముఖ్యముగా నుండు విషయమేమనగా ఏ భాగము నూతనముగా ప్రత్యేక రాష్ట్రము చేయబడుచున్నదో ఆ వైపు నుండియును, ఎందుండి ఈ నూతన రాష్ట్రము విడిపోవుచున్నదో ఆ వైపునుండియును సాధ్యమయినంతవరకు అత్యధికమగు అనుకూలాభిప్రాయము సమకూడుట." ఈ షరతులను నిష్పక్షపాతబుద్ధితో యోచించినయెడల, ఆంధ్రదేశమును ప్రత్యేక రాష్ట్రముగా జేయుటకు ఎట్టి ఆటంకములు లేవనియు, ఆ షరతులన్నియు ఆంధ్రదేశమున పూర్ణముగా సిద్ధించినవనియు అంగీకరింపక తప్పదు.

ప్రత్యేక రాష్ట్రముగా నిర్మించవలెనని కోరబడు దేశము 75050 చ. మై. వైశాల్యము కలది. అందు (17000000) ఒకకోటి డెబ్బదిలక్షల జనము రాకపోకలకు తగిన రాజమార్గములును చెన్నపట్టణమునుండి గోపాలపురము వరకును దాదాపు ఆరువందల మైళ్ల పొడవున సముద్రతీరమును, రేవు పట్టణములును గలవు. పట్టణములకును, పల్లెలకును కొదువలేదు. మదరాసు ప్రభుత్వమువారి వార్షిక మొత్తపు ఆదాయములో సగభాగము తెలుగు జిల్లాలనుండి



విజయనగర మహారాజకుమార్ సర్ పూసపాటి విజయానంద గజపతి రాజబహద్దూర్, ఆంధ్ర మహాసభాధ్యక్షులు, ఎమ్.ఎల్.ఏ., సంయుక్త రాష్ట్ర మాజీ మంత్రి.

వసూలగుచున్నది. 1938 సం॥లో శాసనసభలో అడుగబడిన ప్రశ్నకు, ప్రభుత్వమువారిచ్చిన లెక్కలను బట్టి, ప్రతి సంవత్సరము తెలుగు జిల్లాలనుండి వచ్చెడి ఆదాయము మొత్తము, ఆ జిల్లాలకై చేయబడు వ్యయములకంటె ఒక కోటి రూపాయలు అధికముగా నున్నట్లు తేలినది. మరియు, తెలుగు జిల్లాలు మొత్తమున ఎక్కువ ఫలవంతమైన దేశము. వీని ఆదాయమును హెచ్చుచేయుటకు పలువిధములగు మార్గములు గలవు. నూతన వ్యవసాయ శాస్త్ర పద్ధతులవలన భూములను ఎక్కువ ఫలప్రదము గావింపనగును. మెట్ట ప్రదేశములలో చెరువులను, బావులను ఏర్పరచి తోటలను పెంచవచ్చును. దేశము ఖనిజసమృద్ధి కలదగుటచేత పరిశ్రమలను సాగించవచ్చును. ఇట్లు దేశమునకు సంపత్తి సమకూర్చి, విద్య వ్యాపింపజేసి, వృత్తులను పోషించి, ప్రజలకు సౌఖ్య మొనగూర్చుటకు మార్గములను ఏర్పరచుచో, తక్కిన రాష్ట్రములతోపాటుగ, భారతదేశ స్వాతంత్ర్య సౌభాగ్యముల నొడగూర్చి పోషించుటకు తగిన బలిష్ఠ రాష్ట్రముగా జేసి, తగినంత పలుకుబడియు గౌరవమును సంపాదింపవచ్చును.

ఆంధ్రరాష్ట్రము ఏర్పడినప్పుడుగాని, ఆంధ్ర వ్యక్తిత్వము పూర్ణముగా వికసించుటకు తగిన అవకాశములేదు.

ఆంధ్ర జిల్లాలతో పోల్చినయెడల, మిక్కిలి చిన్న వైశాల్యముగలిగి, కొలది జనసంఖ్యగలిగి, ఆర్థిక సంపత్తిలో

మిక్కిలి వెనుకబడియున్న సింధు, ఉత్కళరాష్ట్రములను నిర్మాణముచేసిన ప్రభుత్వమువారు ఆంధ్రుల ఆశయములు నెరవేర్చక ఉపేక్షజేయుట అసమంజసము, అన్యాయమని వక్కాణింపక తప్పదు.

కాంగ్రెసు మహాసభ మహాత్మాగాంధీగారి యాజమాన్యమున నడిపింపబడుకాలము ఆరంభమగుటతోడనే, భారత దేశమందలి రాష్ట్రములన్నియు భాషాప్రయుక్తములుగ విభజింపబడినవి. అంతకు ఇంచుక ముందుగ కాంగ్రెసు, ఫిర్కాలుగ ప్రత్యేకింపబడి యుండుటచేత అవియును కాంగ్రెస్ వ్యవహారముల నిమిత్తము ప్రత్యేకరాష్ట్రముగ నేర్పరుపబడినవి.
కాబట్టి మనకు ఆంధ్రరాష్ట్రము సిద్ధించుటకు, భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణ సూత్రమును అంగీకరించి అమలులో పెట్టి వ్యవహరించుచున్న కాంగ్రెసు సహాయము మిక్కిలి ఆవశ్యకము. భారత దేశములోని రాష్ట్రము లన్నిటిలో ప్రాధాన్యతవహించి, మార్గదర్శకముగా ఉండిన బంగాళా రాష్ట్రమువారు అత్యంత తీవ్రమగు ఆందోళన గావించి, కాంగ్రెస్ మహాసభా మూలకముగా ఆసేతు హిమాచలమువరకు దానిని వ్యాపింపజేసి, రాష్ట్ర విభాగమును అనుకూలముగ మార్పించుకొనగలిగిన విషయమును గమనించి, కాంగ్రెసు మూలకముగనే కార్యసిద్ధి బడయుటకు మనము ప్రయత్నింపవలెను. అన్యథాగావించిన ప్రయత్నము సిద్ధించిన సంతోషమేగాని, అట్టి కృషికి తావు లేదనియే చెప్పవచ్చును. ప్రజలు సామాన్యముగా కాంగ్రెసు ప్రజలే యగుటచేత కాంగ్రెసు కార్యములనే బలపరచి, కాంగ్రెసువారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యనుగూడ వారి బాధ్యతలలో నొకటిగా అంగీకరింపజేయుట కర్తవ్యము, ముఖ్యమార్గమునుగా నున్నది.

అట్లు జేయుటవలన కాంగ్రెసు మూలకముగా భారత దేశమునకు స్వరాజ్యము సిద్ధించినను, లేక స్వరాజ్యము విషయమై ప్రభుత్వమువారితో ఏదియైన ఒక సమాఖ్య సమకూడినను, దానితోపాటు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సిద్ధించును; ఆంధ్రుల ఆశయములు సఫలీకృతములగును.

## ఆంధ్రమహాసభ సమావేశములు

| సం॥ము | ప్రదేశము | అధ్యక్షులు |
|---|---|---|
| 1913 | బాపట్ల | గా॥ బి. ఎన్. శర్మ |
| 1914 | బెజవాడ | న్యాపతి సుబ్బారావుపంతులు |
| 1915 | విశాఖపట్నము | పానగల్లు రాజావారు |
| 1916 | కాకినాడ | మోచర్ల రామచంద్రరావు |
| 1917 | నెల్లూరు | కొండా వెంకటప్పయ్యపంతులు |
| 1918 | గుంటూరు (ప్ర. స.) | కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు |
| 1918 | కడప | నెమిలి పట్టాభి రామారావు |
| 1919 | అనంతపురం | గాడిచెర్ల హరిసర్వోత్తమరావు |
| 1920 | మహానంది | ఎ. రంగనాథ మొదలియారు |
| 1921 | బరంపురం | రాజా కోటగిరి వెంకటకృష్ణారావు జమీందారు, గంపలగూడెం |
| 1922 | చిత్తూరు | వేదం వెంకటరాయశాస్త్రి |
| 1924 | మద్రాసు | కట్టమంచి రామలింగారెడ్డి |
| 1925 | మచిలీపట్నం | సామి వెంకటాచలంశెట్టి |
| 1926 | ఏలూరు | రాజాబహదూర్ వెంకటాద్రి అప్పారావు జమీందారు, వుయ్యూరు |
| 1927 | అనంతపురం | వా. లక్ష్మణస్వామిరావు |
| 1928 | నంద్యాల | సర్వేపల్లి రాధాకృష్ణయ్య |
| 1929 | బెజవాడ | కె. కోటిరెడ్డి |
| 1931 | గుంటూరు | వి. వి. జోగయ్య |
| 1931 | మద్రాసు | (ప్ర. స.) కె. కోటిరెడ్డి |
| 1932 | బెజవాడ | కె. వి. రెడ్డినాయుడు |
| 1934 | విశాఖపట్నం | (ప్ర. స.) దేశపాండ్య సుబ్బారావు |
| 1936 | కాకినాడ | వేమవరపు రామదాసుపంతులు |
| 1937 | బెజవాడ | కె. కోటిరెడ్డి (రజతోత్సవ సమావేశము) |
| 1938 | మద్రాసు | సర్వేపల్లి రాధాకృష్ణయ్య |
| 1939 | గుంటూరు | ఎమ్. అనంతశయనం |
| 1941 | విశాఖపట్నము | విజయానందగజపతి |

# 3. స్త్రీ ఉద్యమము

"యత్ర నార్యస్తు పూజ్యంతే నందంతే తత్ర దేవతాః
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రా ఫలాః క్రియాః"
—మనుస్మృతి.

విషయ సంగ్రహము :—భారత దేశమున స్త్రీల స్థానము ; ప్రాచీన కాలమందు పురుషులతో సమానముగాను, కొన్ని విషయములలో అధికముగాను ఉన్నందుకు నిదర్శనములు ; ఆంధ్ర దేశమందలి చారిత్రక ప్రసిద్ధలైన నారీమణులు ; ఆంధ్ర మహిళా-ఉద్యమ ప్రశస్తి ; 1939, బేగం అమిరుద్దీన్ సతీమణిగారి వాక్యములు ; నారీ-ఉద్యమాశయములు ; స్త్రీ విద్య, బాలికా విద్య, వయోజన స్త్రీ విద్య ; సంఘ దురాచారములందలి స్త్రీలను బాధించేవాటిని తొలగించుకొనుటకు స్త్రీ ఉద్యమములు ; వారసత్వపు హక్కుకు సంబంధించిన కృషి ; వివాహముల విషయంలో శారదాచట్టము, అది ఇంకా బలపడవలెనన్న కోరిక ; శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్‌గారి బిల్లు జయము పొందవలెనన్న కోరిక ; డా॥ కేసరిగారి సేవ ; నేటి ఆంధ్ర నారీమణులలో స్త్రీ ఉద్యమమును సాగిస్తున్నవారు ; స్త్రీలలో జాతీయోద్యమములో పాల్గొని జైళ్లకు వెళ్లిన వీరాంగనలు ; ఉన్నత విద్యను నేర్చిన విదుషీమణులు ; విదేశములందున్నత విద్య నభ్యసించి పెద్ద పరీక్షలలో ఉత్తీర్ణలైనవారు ; హిందీ నేర్చిన స్త్రీలు ; స్త్రీ స్వాతంత్ర్యము ; సంఘౌన్నత్యము—.

"ఎచ్చట స్త్రీలు పూజింపబడుదురో అచ్చట దేవతలు క్రీడింతురు. ఎచ్చట పూజింపబడరో అచ్చట అన్నిక్రియలు ఫలశూన్యము లగుచున్నవి." అని మనువు నిర్వచించినాడు. మనువు

**భారత దేశమున స్త్రీల స్థానము**

నిర్వచనము నిజమే! కానీ భారతీయుడు స్త్రీని దేవిగా విస్మరించి చాలాకాలమైనది. సంఘమున స్త్రీకి సంకుచిత స్థానము ఇవ్వడముతోనే ఉద్గమనశీలమగు బుద్ధి, ఉన్నతదృక్పథము పతనోన్ముఖమై, భారతమాత నుదుటి తిలకదీధితి మాసి, దైన్యము నింపెడి కన్నులతో అధోముఖియైనది. ఒకప్పుడు స్త్రీని ఈ గడ్డమీద 'ఊష'తో సమముగా భావించిరి. అందుకే ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరుల నుండి, మన జీవితాలకు ఒరిపిడిరాళ్లైన పౌరాణిక దంపతులు-సీతారామచంద్రులు, ప్రజా కుటుంబ జీవితానికి పట్టుగొమ్మైన పతివ్రత సావిత్రి, చారిత్రక గోళంలో వెలుగుచుక్కలలాగు వెలుగుతున్న ఝూన్సీ, చాంద్‌బీబీలు వెలసిరి. అందుకనే భవభూతి మహాకవి "ప్రియ గృహిణీం, గృహస్యశోభాం" అనిన్నీ, స్త్రీయే సంసారానికి "మూలకందం, ముకుందం" అనిన్నీ ధ్రువపరచినాడు. "ప్రకృతిః కర్త్రీ పురుషస్తు పుష్కర పలాసవ న్నిర్లేపః"



శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మ. ఎమ్.ఏ., బి.ఎల్., చెన్నపురి ఆంధ్ర మహిళా సభ స్థాపకురాలు.



కీ. శే. శ్రీమతి వేదాంతం కమలాదేవి.



శ్రీమతి బి. కామేశ్వరమ్మ బి.ఏ., సెనెటు మెంబరు, మైసూరు మ్యునిసిపల్ కౌన్సిలర్.

అను సాంఖ్య మత సూక్తి, ప్రకృత్యంశ మగు స్త్రీ ఉన్నత దశను వేనోళ్ల చాటుచున్నది!

మన తెలుగు పొలములో గూడా, "ఆంధ్రుల చరిత్రమున కెల్ల ననుపమాన దీప్తిగూర్చిన" రుద్రమదేవిరాజ్ఞి, కాకతి గణపతి పుత్రిక ; పల్నాటి బ్రహ్మనాయని మూడుచెరువుల నీరు త్రాగించిన ప్రజ్ఞాధురీణురాలు నాగమ్మ ; పదునారేండ్ల ప్రాయమున, కౌగిటిలోని

**ఆంధ్రదేశము చారిత్రక ప్రసిద్ధలు**

పతికి కరవాలమిచ్చి, 'రతిరాజ సౌందర్య — రణరంగధీర, శాత్రవవిజయంబు-సమకూరు నీకు' అనిచెప్పి కదనరంగమున కంపిన ధీరచిత్త మాంచాల ; "విరిగివచ్చిన ప్రాణవిభునకు, పసుపిచ్చి వేడినీళ్లను తోడు కోడలూకతె" అని కీర్తిగాంచిన ఖడ్గతిక్కన ధర్మపత్ని; సారస్వత వీథిలో సన్నుతికెక్కిన మొల్ల, తరిగొండ వెంకమ, ముద్దుపళని మొదలైన మంచిపుష్పాలు పూచినవి ! 'ఇంటింట దేశసాహిత్య దీపాలతో' ఆంధ్రి తేజస్సు ఆనాడు రాపాడినది !

పతనోన్ముఖమైన తమ సముజ్జ్వల శక్తులను కూడదీసుకొని, ఆంధ్రిరమణులు తమ ఉద్యమమునకు పునరుజ్జీవనము కలిగించి, తమ ఉద్యమ ప్రాశస్త్యము పెంపొందించుచున్నారు. 1939

**ఆంధ్రమహిళా-ఉద్యమ ప్రశస్తి**

సం|| డిసెంబరు నెల 16, 17 తేదీలలో కడపలో జరిగిన 14 వ ఆంధ్రిరాష్ట్రి మహిళా సభకు అధ్యక్షత వహించుచు, శ్రీ బేగం అమిరుద్దీన్ సతీమణిగారు: "12 సంవత్సరముల క్రిందట ఉత్సాహపూరితులగు గోదావరీమండల మహిళామణులు కొందరితో కలసి కృషిచేయు భాగ్యము నాకు కలిగియుండెను. దాని ఫలితముగనే అప్పుడు రాజమండ్రిలో ప్రథమ గోదావరీ మహిళా సభను, కాకినాడలో ప్రథమ ఆంధ్రి మహిళాసభను జరిపియుంటిమి. అదిమొదలుగా ఆంధ్రిదేశ మహిళామణులు తమ సహజోత్సాహములతో, ప్రతి సంవత్సరము ఈ మహాసభను విజయవంతముగా జరుపుచుండుట చాలా ముదావహము. అఖిలభారత మహిళాసభయొక్క—



శ్రీమతి గంధం అమ్మన్నరాజా, బి.ఏ., ఎల్.టి., ఎమ్.ఎల్.ఏ., సెనెట్ మెంబరు.

ప్రాంతీయ సమావేశములను జరుపుటలో అన్ని ప్రాంతములవారికంటె, ఆంధ్ర మహిళామణులే పైచేయిగా నున్నారు. భారత దేశములోని అనేక ప్రాంతములకన్నను, ఆంధ్రదేశ స్త్రీ జనమందు ఎక్కువ ప్రబోధము కలిగిన దనుట నిశ్చయము; దీని నెవ్వరు కాదనజాలరు. భారత భూమికి, స్త్రీ జనోద్యమమునకు సేవ జేయుటలో వీరితో దీటు రాగలవారెందరో యుండరు. నేను ఆంధ్ర దేశములో ఆరేండ్లు నివసించి, అనుభవ



శ్రీమతి చుండూరు రత్తమ్మ, జమీందారిణి, ఏలూరు పురపాలక సంఘాధ్యక్షురాలుగా కొంతకాలము పనిచేసిరి.

ముతో చెప్పుచున్న మాట లివి. భారతదేశ భావి భాగ్యోదయమునకు ఆంధ్రమహిళలు ప్రశస్తముగా తోడ్పడి, తమ బాధ్యత నెరవేర్చుకొందురనుట నిస్సంశయము." అని ఆంధ్రమహిళా ఉద్యమముపై, వారి అభిప్రాయమును వ్యక్తపరచినారు.

"తెలుసుకోవాలన్న కోరిక, సందేహించడానికి వలసిన ఓపిక, ఆలోచించడానికి కుతూ



శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ.

హలం, స్వనిశ్చయం ప్రకటించడంలో నిదానం, పునరాలోచనకు సంసిద్ధత-ఇవి విజ్ఞాన దృష్టికి లక్షణములు." విద్య లేకున్న విజ్ఞాన చక్షువు లేదు. స్త్రీకి జ్ఞాన మనివార్యము. తల్లికి తెలియనిది తనయునికి తెలి

**నారీఉద్యమము-ఆశయములు**



దేశబాంధవి, దువ్వూరి సుబ్బమ్మగారు, రాజమండ్రిలో శ్రీ సనాతన విద్యాలయ స్థాపకురాలు.

యదు. భవిష్యద్భారతజాతికి తల్లియగు ప్రకృత స్త్రీకి విద్యలేకపోయిన భారత జాతికి భవిష్యత్తు సున్న. నిర్బంధ విద్యావిధానము స్త్రీలకవసరము. బాలుర విద్యావిషయిక వ్యయమునకు, బాలికల విద్యావిషయక వ్యయమునకు గల తేడా మన దేశమున చూచిన యెడల స్త్రీల విషయములో గల



శ్రీమతి గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ.



శ్రీమతి కడప రామసుబ్బమ్మ, కడప జిల్లాబోర్డు అధ్యక్షురాలు. స్త్రీలలో ఈ పదవి పొందినవారు వీరే; ఇదివరకు జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిల్ అధ్యక్షురాలుగా కొంత కాలముండిరి.

అశ్రద్ధ తెలియగలదు. ఉన్నత పాఠశాలలలో బాలికల విద్యయన్న అశ్రద్ధ. స్త్రీ విద్య దీనికై పాఠశాలాసంరక్షణ సంఘము లేర్పచవలెను. సభ్యురాండ్రు పిల్లల బాగోగుల గమనించుచు, వారి విద్యా విషయములో తలిదండ్రుల సహ

కారము సంపాదించుచుండవలెను. బాలికల విషయములో ఇట్టి సంఘాలు తోడ్పడగలవు. వయోజన స్త్రీవిద్యా కేంద్రములను గూడా ఏర్పరచి, విద్యావ్యాప్తి చేయవలెను. ఈ స్త్రీ విద్య నభివృద్ధిపరచు ఆశయముతో, దేశములో



శ్రీమతి మూల్పూరి చుక్కమ్మ.
పశ్చిమ గోదావరి జిల్లా బోర్డు మెంబరు.



శ్రీమతి జాస్తి సీతామహలక్ష్మమ్మ, బి.ఏ., ఎల్.ఎల్.బి., అఖిల భారత మహిళా సంఘ కార్య నిర్వాహక వర్గమున ఆంధ్రదేశ పక్షమున సభ్యురాలు.

అనేక ప్రాంతముల స్త్రీ విద్యాభివర్ధనీ సంఘములు నెలకొల్పబడ్డవి.

బాల్య వివాహములు, వ్యభిచారము, దేవదాసీవృత్తి, కట్నములు, దారిద్ర్యము మున్నగునవన్నీ సంఘానర్థదాయకములని నారీ ఉద్యమములు వాటిని ప్రతిఘటించుచున్నవి. విధవా వివాహములు, స్త్రీ విద్య మొదలైన సంస్కరణలకు స్త్రీలు విశేషముగా తోడ్పడుచున్నారు.

సంఘ దురాచారములు, వారసత్వపు హక్కు, స్త్రీ ఉద్యమముల కృషి.

హిందూ సుందరి, గృహలక్ష్మి, తెలుగు తల్లి మొదలైన స్త్రీలపత్రికల ప్రచారము ద్వారాను, గ్రంథరచన ద్వారాను ఇప్పుడిప్పుడు స్త్రీ ఉద్యమములు ముందంజ వేయుచున్నవి. ప్రసవ సమయములలో మరణించు చున్నవారి అధిక సంఖ్య తగ్గించుటకు, గర్భిణుల సహాయమునకు, శిశురక్షణార్థము తగిన ధనముతో ప్రతి గ్రామంలోను రక్షణ శాలలను నిర్మించుట ఈ సంఘముల విహితమై యున్నది. ఈ సంచలనము వల్ల అనేక మంది ఉన్నత విద్యల నభ్యసించి, పెద్దపెద్ద పరీక్షలలో ఉత్తీర్ణలగు చున్నారు. ఆంధ్రి జిల్లాలలో స్త్రీల క్లబ్బులు-సంఘసేవ జేయుటకు వేరే సంస్థ లేనిచోట్ల-తోటివారి అభివృద్ధికై పాటుపడుచున్నవి.

వారసత్వపు హక్కు మానవజాతి హక్కులలో సర్వసాధారణమైనది. హైందవ స్త్రీ జాతి నేడు ఈ ప్రాథమిక హక్కునే కోరుచున్నది. ఆర్థికవ్యవస్థలో హిందూ స్త్రీకి న్యాయము జరుగలేదు. కోల్ దంపతులన్నట్లు. " అనేక మంది తినడానికి తిండి, ఉండటానికి కొంప, కట్టడానికి గుడ్డ లేక బాధపడుతూ, అజ్ఞానములో



శ్రీమతి ముత్తా అండాళ్లమ్మ, సర్ ముత్తా వెంకట సుబ్బారావు గారి సతీమణి, మద్రాసులో స్త్రీ సేవాసదనము స్థాపించి స్త్రీ జనాభ్యుదయానికి పాటుబడుచున్నవారు.


శ్రీమతి కలగర పిచ్చమ్మ,
మాగంటి అన్నపూర్ణాదేవిగారి తల్లి.

మునిగి బ్రతుకుతూ ఉండడమూ, అందుకు వారు స్వయంగా చేసుకున్న అపరాధమేమీ లేక పోవడమూ పరిశీలిస్తే, ఆ పరిస్థితికి అవకాశమిచ్చే సంఘ వ్యవస్థను విమర్శించకతీరదు.” స్త్రీల ధనమునకు ఇప్పుడు స్త్రీ ఎస్టేటు అను పేరు పెట్టారు. ఈ ఆస్తిని విక్రయించుటకుగాని, ఇతర ఆస్తిలోనుండి వేరు చేయుటకుగాని హిందూ స్త్రీకి హక్కులేదు. దానిపై వచ్చు ఫలసాయము మాత్రము అనుభవించవచ్చును. చట్టరీత్యా హిందూ స్త్రీల అధికారమును గురించి విచారణ చేయుటకు ప్రభుత్వము వారు ఒక ఉపసంఘమును ఏర్పాటు చేసిరి. ఈ సంఘము స్త్రీ పోషణ, వసతులు మొదలైన సౌకర్యములను గురించి ఆలోచించునేకాని ప్రధాన విషయము చర్చించదు. దేశముఖ్‌గారు స్త్రీ హక్కుల విషయములో కొంత కృషి జేసిరి. స్త్రీకి పురుషునితో సమమైన హక్కులుగావలెనని వీరి వాదము.

బాల్య వివాహములు పూర్తిగా తొలగించడానికి శారదా చట్టము బలపడవలెను. స్త్రీ వారసత్వపు హక్కులు కేవలం అసంతృప్తికరములుగా నున్నవని, బహుపత్నీత్వమువల్ల స్త్రీలకు కలుగుచున్న పరితాపభూయిష్ఠమైన కష్టనష్టములు తొలంగించుటకై ఉపపాదింపబడిన రాధాబాయి సుబ్బరాయన్‌గారి బిల్లువంటిది, సర్వజనామోదమును పొందవలెను. దేవదృష్టియందు స్త్రీ పురుషులు సమానులుగాన స్త్రీలు పురుషులతో పాటు సరియైన అవకాశములగలిగి, భావిమహోదయములో వారున్ను భాగములు పొందువారు కావడానికే అభిలషిస్తున్నారు.

ముఖ్యంగా స్త్రీల అభివృద్ధికి శ్రేయస్సుకూ చేయూతనిస్తూ, గృహలక్ష్మి ద్వారా అనిర్వచనీయమైన సేవ చేస్తున్నందుకు డా॥ కె. ఎస్. కేసరిగారు ప్రశంసాపాత్రులు.

నేడు ఆంధ్రదేశమున రాజకీయములలో, సాహిత్యములో, సంఘ సేవలో, స్వదేశ విదేశ విద్య


శ్రీమతి పొణకా కనకమ్మ.

లలో, కళలలో ఆంధ్రి రమణులు అప్రతిహతమైన స్థానము సముపార్జించుకొన్నారు. ఇందుకు తార్కాణములు:—శకుంతలాకన్య, డా॥ లాజరస్, డా॥ అచ్చమాంబ మొదలైనవారు. సాహిత్యములోను సంఘసేవలోను ఆరితేరినవారు కాంచనపల్లి కనకాంబ, పులవర్తి కమలావతీదేవి, కనపర్తి వరలక్ష్మమ్మ, బాలాంత్రపు శేషమ్మ, జూలూరి కలశమ్మ, దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ, కొమ్మూరి పద్మావతీదేవి, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, కుముదం భోగగిరి, వి. సౌందరమ్మ, గంధం అమ్మన్నరాజా, బి. కామేశ్వరమ్మ గార్ల నేకులున్నారు.

నేటి ఆంధ్రి నారీమణులు


శ్రీమతి డా. లక్ష్మీదేవి బళ్లారి యమ్.యల్.ఏ

ఆదిని రాజకీయాల్లో ఆంధ్రి దేశపు స్త్రీలలో తొలుదొల్త పాల్గొని, దేశానికీ స్త్రీ లోకానికీ నిరంతర కృషిచేసి ఖ్యాతి నార్జించి కీర్తిశేషురాలైన మాగంటి అన్నపూర్ణాదేవి, ఆంధ్ర దేవిజోన్ అనిపించుకున్న దుర్గాబాయమ్మ, జయంతి సూరమ్మ, కీ. శే. వేదాంతం కమలాదేవి, భారతీదేవి రంగా, కె. రామసుబ్బమ్మగార్ల వంటివారు గలరు.

స్త్రీలు జాతీయ ఉద్యమములలో ధారాళముగా పాల్గొని అఖండసేవ చేసిరి. ఆరోజులలో అనేకులు కారాగారములకు వెళ్లిరి. ఉప్పు సత్యాగ్రహము చేసిరి. జాతీయ ఉద్యమములలో జైళ్లకు వెళ్లినవారిలో చెప్పదగినవారు దువ్వూరి సుబ్బమ్మగారు, జయంతి సూరమ్మగారు, వేదాంతం కమలాదేవిగారు, మాలుప్పారి చుక్కమ్మగారు, గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు, పెద్దాడ కామేశ్వరమ్మగారు, కోటమర్తి కనకమ్మగారు, వంగల పిచ్చమ్మగారు, చుండూరి రత్తమ్మగారు, జవ్వాజి రత్తమ్మగారు, సత్తిరాజు శ్యామలాంబగారు, ముడుంబి వెంకటరత్నమ్మగారు, నల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు, గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మగారు, పాదర్తి సుందరమ్మగారు, దరిశి సుభద్రమ్మగారు, ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు, కొల్లా కనకవల్లి తాయారమ్మగారు, వాసిరెడ్డి హనుమాయమ్మగారు, పోణకా కనకమ్మగారు, బెజవాడ గోపాలరెడ్డిగారి పత్ని లక్ష్మీకాంతమ్మగారు మొదలైన ఆంధ్రి వీరాంగనలు; మూడు సంవత్సరములైన దాటని పిల్లలు-ముడుంబి నర్సింహాచార్యులగారి కుమారుడు, మాగంటి బాపినీడుగారి కుమార్తె మొ॥ వారు.

స్త్రీలలో జాతీయ ఉద్యమములలో పాల్గొని, జైళ్లకు వెళ్లిన వీరాంగనలు


శ్రీమతి బెజవాడ లక్ష్మీకాంతమ్మ
(గోపాలరెడ్డిగారి సతీమణి.)

కొందరు బి.ఏ., ఎమ్.ఏ., పరీక్షలలో ఉత్తీర్ణులైరి పై చెప్పినట్లు విదేశములకు కూడా వెళ్లి విద్య

నభ్యసించిన ఆంధ్ర రమణీమణులుగలరు. కోకా కృష్ణవేణమ్మగారు ఎడ్యుకేషనల్ కౌన్సిలునకు అధ్యక్షులుగా నుండిరి. చుండూరి రత్తమ్మగారు ఛైర్మన్‌గా బహుకాలము పనిచేసిరి. కె. రామ్మ సుబ్బమగారు జిల్లా (కడప) బోర్డు అధ్యక్షురాలు. వీరు పరిపాలనా నిర్వహణములోనూ, వైజ్ఞానిక విషయములోను ఆరితేరిన మహిళలు!



శ్రీమతి రత్నాల సరోజిని నాయుడు, ఎమ్.ఏ., ఎల్.టి., ఢిల్లీలో ఇంద్రప్రస్థ బాలికల విద్యాలయమునకు ప్రిన్సిపాలుగానుండి, ఇప్పుడు మద్రాసులో అవ్వాయి హోమ్ సూపర్నెంటుగానున్నారు.

స్త్రీ సంఘములకు సంఘీభావ మున్నది. స్త్రీలకు స్వాతంత్ర్యముండినగాని, ఏదేశము అత్యున్నత పదవి నందజాలదు. స్త్రీ స్వాతంత్ర్యము మూలముననే కదా చైనా, జపాను, టర్కీ మొదలైన దేశాలు అభివృద్ధికరమైన స్థితిలో నున్నవి!

**స్త్రీస్వాతంత్ర్యము-సంఘౌన్నత్యము**

భారతదేశ నారీమణుల ప్రధానధర్మము భారతదేశ దాస్యశృంఖల విచ్ఛేదనము. దీనికి ఐక్యత మార్గమువంటిది. ఐక్యతకు, శాంతికి కుటుంబము పాదు. గృహము ప్రథమ రంగస్థలము. గృహములోని శాంతి, ఐక్యత దేశమునకు, దేశమునుండి ప్రపంచమునకు వెదజల్లవలెను. ఇట్టి ఉన్నతాశయములతో, ఉదాత్తతతో సాగుచున్న ఈ ఉద్యమము సఫలీకృతమై, కార్యవ్యగ్రహృదయుల చేయగలదు!



# 4. రైతు ఉద్యమము



ఏటి లంకల మేతమేసీ—పూతగిల్లిన జోడుగిత్తల
పైడి నాగటి కఱ్ఱులో జీ—వాల జీవితముండె నొరా
దున్నరా ఈ తెలుగుభూమిని—తొలుకరించిన పుణ్యభూమిని
కఱువులేనీ స్వర్గరాజ్యపు—దొరవు నీవయ్యెదవురా !

—తురగా వెంకట్రామయ్య.

విషయ సంగ్రహము :—18, 19 వ శతాబ్దము లందు దుర్భరమైన రైతు సమస్యలు, రైతులలో సంచలనము ఉండేవి; 1820-30 లో సర్ టామస్‌మన్రో రాయలసీమలో రైతుల బాధలు తగ్గించి రైతువారీ పద్ధతి ఏర్పరచెను; ఇది రైతు విజయమునకు ప్రారంభము; క్షామనివారణము ప్రభుత్వము వారు కొద్దిగా సాగించిరి; 20 వ శతాబ్దిలో జాతీయోద్యమ ముతోపాటు రైతు ఉద్యమము బయలుదేరినది; 1923 ఆచార్య రంగాగారు రైతు-కార్మిక సంఘములను నెలకొల్పుట; రైతు ఉద్యమము—పరిణామదశ; సెంట్రల్ రిసెల్‌మెంటు కమిటి నిర్బంధములు; కీ. శే. కానూరి వేంటాచలపతిగారు, మాగంటి సీతయ్యగారు మొ॥ వారి సేవ; జిల్లా రైతు సంఘములు; గోదావరి కృష్ణ జిల్లాల రిసెటిల్‌మెంటు వచ్చినప్పుడు దండు నారాయణరాజుగారు ఏర్పరుపజేసిన కమిటీకి కార్యదర్శులు రంగాగారు, సెంట్రల్ రీసెటిల్‌మెంటు కమిటీకి బాపినీడుగారు కార్యదర్శులై పనిచేయుట; 1928 మొదటి ఆంధ్రరాష్ట్ర రైతు సంఘమును, పిమ్మట ఆంధ్రరాష్ట్ర రైతు రక్షణ సంఘమును రంగాగారు స్థాపించుట; పిమ్మట అఖిలభారత కిసాన్ ఉద్య మముగా రైతు ఉద్యమము పరిణమించుట. ఆంధ్ర రాష్ట్ర కిసాన్ సంఘము-భారతదేశ నాయకత్వము-రంగాగారి సేవ;

జమీన్ రైతు సంఘముల ప్రాముఖ్యము; శ్రీ రె. మందేశ్వర శర్మగారు మొదలయినవారి కృషి; జిల్లా సంఘము, రాష్ట్ర సంఘములు; ఏలూరిలో జరిగిన మహాసభ రైతుల కనీసపు కోర్కెల ప్రణాళిక తయారుచేసినది (27-8-1933); పిమ్మట 1934 లో సంఘ నిబంధనావళి, 1936 లో పట్నాయక్ శిస్తు రెమిషన్ సవరణ నిరసనము మొ॥ పనులు సాగించినది; 1921-36 సరికి సర్వతోముఖమైన ఉద్యమమయినది; 1930లో స్థాపించిన జమీన్ రైతు పత్రిక; 1937లో ప్రకాశంగారి జమీం దారీ విచారణ సంఘము; 1938లో విజయనగరమందలి రైతుసభ తీర్మానము. మాడుగల కొండజాతుల సంఘము, వారి కష్టముల నివారించే తీర్మానములు; చోడవరములో సంఘ కార్యాలయము; కొన్నిచోట్ల దురంతములైన సంఘటనలు; రైతు సంఘాల ప్రస్తుత దశ—.

ప్రారంభములో రైతు ఉద్యమములు ఇప్పటి వలె ఒక స్వరూపమును పొందియుండకపోయి నను, ఈనాటివలెనే అప్పుడున్నూ రైతులను బాధించు సమస్యలు లేకపోలేదు. వారిలోను విపరీతమైన సంచలనము కలుగకపోలేదు. కాని,

**రైతులలో సంచలనము—19 వ శతాబ్దము—ప్రారంభదశ**

ఆ సంచలనమునకు, సంఘ సంయుక్త శక్తికీ తగినంత ప్రబోధము వారిలో లేకపోయెను. కర్షకులలో వారిచైతన్యమును రగుల్కొల్పిన నాయకుడునూ లేకపోయెను. ఈ రైతు సమస్యలు రానురాను ఒక స్వరూపమునుదాల్చి నేటిరైతు ఉద్యమమునకు కారణములయినవి. ఈ రైతు సమస్యలకు కారణములయిన కొన్ని సంఘటన లను స్మరించవలెను.

ఇప్పుడు దత్తమండలములని వ్యవహరింపబడు చున్న కడప, కర్నూలు బళ్లారి, అనంతపురం జిల్లాలపై నైజాము తన అధికారము వదలుకొని

ఆంగ్లేయుల హస్తంగతముచేసినమాట మీరు చరిత్రలో చదివియున్నారుగదా! ఆ రోజులలో నైజాము, రైతులపై దుర్భరమయిన పన్నులు విధించి వసూలు చేయుచుండెను. పన్నుల భారము అధికమై, రైతులు అధిక కష్టములకు లోనగుచుండిరి. కొన్ని క్లిష్టసమయములలో తమ కష్టములను ప్రభుత్వమునకు నివేదించుకొనుచుండిరి. బ్రిటిష్‌వారు పన్నుల నధికము చేయుటయేకాని, రైతుల మొర వారికి చెవిటి వానికి శంఖ మూదినట్లుండెను!

కలెక్టర్లు, ఆదాయము అధికము చేసుకొను నిమిత్తమై ప్రతిరైతును కొంత భూమి సాగుచేసుకొనవలసినదని బలవంతపరచి, ఆ సాగుబడి భూమికి-రైతు సాగుచేసుకొన్ననూ లేకున్ననూ, అతనికి ఇష్టమైననూ లేకున్ననూ-అధికముగా పన్నులు వసూలు చేయుచుండిరి. ఈ ఒత్తిడికి తట్టుకొనలేక ఆ జిల్లాలనుండి భీతావహులైన రైతులు ఇండ్లు-వాకిళ్లు, పొలమూ, పుట్ర, గింజా, గిట్రా వదలుకొని సామీప్యముననున్న మైసూరు అడవులకు వలసపోవ నారంభించిరి. అప్పుడు ప్రభుత్వమువారు, భూమి సాగుచేసుకొనువారు లేకపోవుటచే నష్టమువచ్చి, రైతుల కష్ట విషయములపై దృష్టి మరల్చిరి.

దానితో రైతుల సమస్యల పరిష్కరించుటకున్నూ, భూమిపన్ను నిర్ణయముల చేయుటకున్నూ సర్ టామస్ మన్రోను, రాయలసీమకు ప్రభుత్వమువారు పంపిరి. 1820-30 లలో ఆయన భూమి పన్నుల తగ్గింపుకు క్రొత్త విధానమును ఏర్పరచెను. దీనిని, ప్రభుత్వమునకు తమ కష్టముల ప్రకటించి రైతులు పొందిన ప్రథమ విజయముగా పరిగణించుట ఉచితము. ఇదే 19 వ శతాబ్దములోని ప్రప్రథమ రైతు విజయమూ, రైతుల చరిత్రలో సుప్రభాతమూను!

1770-1897 వరకున్నూ హిందూదేశమంతటా కరవులు కాటకములు అధికమై, దరిద్రదేవత ఇనుప పాదాలతో చిందులు త్రొక్కుతున్నట్లుండెను. ఇంక రాయలసీమ మాట ఏమిటి? 1770-1894-1897 కరువులలో లక్షలాదిజనులు తిన తిండిలేక మృత్యువునకు అసువుల నర్పించిరి. దీనికితోడు పాటకపు జనులలో కలరా, మశూచి మొదలైన అంటువ్యాధులు వ్యాప్తమై అనేకులు పిల్లలనూ, పెద్దలనూ తమ పొట్టన పెట్టుకొన్నవి. ఈ సంక్షోభమూ అలజడీ అంతగా ఉన్నప్పటికిన్నీ వాటిని ఎదుర్కొనే సంఘము లేదు; సమిష్టి పోరాటములను సాగించిన నాయకుడూ లేడు!

కొందరు-ప్రాణములకు తెగించిన సాహసులు-దోచుకొని, ఆకలి మంటలకు ఆహుతిగాకుండా మృత్యువునే భయపెట్టుచూ-మృత్యువునేగాదు, భూస్వాములనూ ధనికులనూ కంపింపజేయుచూ-భయంకరమైన జీవితమును గడుపజొచ్చిరి. తోటి అధికారులు, ధనికులున్నూ ఈ బాధ తప్పించుకొనుటకు పేదలకు తోడ్పడవలెనన్న కోర్కెతో ప్రభుత్వమునకు విన్నపములనంపి, క్షామ నివారణ కార్యక్రమమును అమలుపరుపజేసిరి. ఈ కరువుబాధానివారణ సంఘమువారున్నూ కూలీలకు పనిపాటలు చూపిరేకాని,- పనికితగిన దానిలో పదియవవంతైనను వేతనముల నివ్వక పోవుటచేత, బాధితులకు అవి అంతగా సాయపడలేదు. అవి మాత్రము ఆకలి మంటలనూ, రైతుల ఉద్ధృతమునూ కొంత చల్లార్చినవేకాని, అంతకన్న మరేమియు పరిష్కరించలేదు.



శ్రీ ఆచార్య గోగినేని రంగనాయకులు, ఎమ్.ఎల్.ఏ., అఖిల భారత కిసాన్ ఉద్యమనాయకులు.

తర్వాత 20 వ శతాబ్దములో బెంగాలు కర్షక పోరాటములు, చంపరన్ సంఘటనములూ, మహాత్ముని అసహాయోద్యమనూ రైతులలో ఉజ్వలితములగుచున్న జ్వాలలను, బాధలను వారు గుర్తెరుగునట్లు చేసినవి. మరిన్నీ 'నోటాక్సు కాంపైన్' వల్ల రైతులు త్వరలో తమకు స్వాతంత్ర్యము రానున్నదనిన్నీ, పన్నుల బాధలు నివృత్తిగానున్నవనీ ధైర్యము చేసుకొనిరి. అది వారిలో స్వాతంత్ర్యభావముల పెనబెట్టినది.

తర్వాతవచ్చిన మాప్లా విప్లవము, అల్లూరి సీతారామరాజు పోరాటమున్నూ రైతులకు, పాటకపు ప్రజకూ అనేక క్రొత్త పాఠముల నేర్పి వారికి ఒక క్రొత్త వెలుగునిచ్చినవి.

రైతులలో చైతన్యము, వారి సమస్యలవల్ల ప్రబోధము కలుగుచుండెను. ఇంతలో 1923 లో ఇంగ్లండునుంచి వచ్చిన ఆచార్య రంగాగారు రైతుల అవస్థనూ, వారి ఆర్థిక పరిస్థితులనూ సాంగముగా అవలోకించి, రైతు సంఘములు కార్మిక సంఘములు నెలకొల్పి రైతుల పురోభివృద్ధికి పునాదులు కట్ట నారంభించిరి. దత్త

రైతు ఉద్యమము-పరిణామదశ; సెంట్రల్ రిసెటిల్మెంటు కమిటీ నిర్బంధములు

మండలములలోవలెనే కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలలోగూడా రైతులు ఇబ్బందులు వచ్చినప్పుడు సమ్మెలు కట్టినట్లు మన పెద్దలు చెప్పుచుండగా వినియుంటిమి. రైతులలో భావపరిణామము కల్పించి, రైతుల ఆందోళన కొరకు స్వరూపమును కల్పించిన నాయకులలో కీ. శే. కానూరి వెంకటచలపతిగారు, మాగంటి సీతయ్యగారు, పాతూరి అప్పయ్యగారు, కలిదిండి నరిశింహంగారు, చెరుకూరి శివరామరాజుగారు, పెనుమాక బాపిరాజుగారు మొదటివారు. పిమ్మట దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు, శనగపల్లి రామస్వామి గుప్తగారు కృషిచేసినవారిలో చెప్పదగినవారు.

కానూరి వెంకటచలపతిగారు రైతు సమస్యలలో ఆరితేరిన వీరులు. ఆంధ్రదేశమునందు ఏ సభలు వచ్చిననూ, ప్రభుత్వమువారికి నివేదనలు ఇవ్వవలసివచ్చినప్పుడున్నూ అగ్రస్థానమువహించి రైతులకు ఈ పెద్దలందరూ నాయకత్వము వహించుచుండెడివారు. ఆ రోజులలో జిల్లా సంఘములు రైతులకై ఎక్కువగా పనిచేయుచుండెడివి. ఇప్పటికిన్నీ తూర్పు గోదావరి జిల్లాలో జిల్లా సంఘము పనిచేయుచున్నది. దానిని, రైతు సమస్యలలో అనుభవముగల దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు నడుపుచున్నారు. ఏ జిల్లా సభలు ఆ జిల్లా పరిస్థితులకు అనుగుణముగా, ఒక పద్ధతిమీద జరుగుచుండెడివి. కాని ఇప్పటివలె రాష్ట్రమునంతటికిన్నీ సంబంధించినవిలేవు. కాంగ్రెసు వాదులున్నూ రైతుల వ్యవహారములలో కొంత పనిచేయుచుండెడివారు.

ప్రభుత్వమువారివద్దకు రైతుల ఇక్కట్టులకు సంబంధించిన రాయబారములనూ గ్రంథాలయ యాత్రలను సాగించినటుల-రైతు యాత్రలనూ సాగించుటలో ఆంధ్రులు ముందంజ వేసిరి.

ఉభయగోదావరి, కృష్ణా జిల్లాల రిసెటిల్‌మెంటు వచ్చినప్పుడు దండు నారాయణరాజుగారు శాసనసభలోఉండి, ఒక కమిటీని ఏర్పాటు చేసిరి. దానికి రంగాగారు కార్యదర్శి. తర్వాత మూడు జిల్లాలకున్నూ సమిష్టిగా ఏర్పాటు చేయబడిన సెంట్రల్ రిసెటిల్‌మెంటు కమిటీకి మాగంటి బాపినీడుగారు కార్యదర్శి. వీరు రైతుల కధ్వర్యమువహించి, కార్యక్రమమును కొనసాగించుచుండగా, ఆ ఉద్యమ నాయకులైన బాపినీడు, రంగా, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, మొసలికంటి తిరుమలరావుగార్లను ప్రభుత్వము వారు నిర్బంధించిరి. ఇది రైతు ఉద్యమ పరిణామదశలో ఒక చారిత్రక ఘట్టము. తరువాత రైతు ఉద్యమములపట్ల ప్రబోధము అధికముగా జరుగ మొదలిడెను.

కాంగ్రెసులో రైతు సంఘములపట్ల కొంత విముఖతగూడా యుండెను. దీనిని గమనించి అమెరికాలో విద్యాభ్యాసము చేసివచ్చి, అమెరికాలో రైతు సంఘములను వాటి కార్యక్రమమునూ గమనించి, మన రైతు ఉద్యమములతో సంబంధముకలిగి, కర్షక విద్య నభ్యసించిన మాగంటి బాపినీడుగారు 'రైతు సంఘములు ఎందుకు ?' అనే శీర్షిక క్రింద కర పత్రములు అచ్చువేయించిన్నీ, మ్యాజిక్ లాంతరు ఉపన్యాసముల ద్వారానూ రైతులలో

**ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘమును రంగా గారు స్థాపించుట-(1928)**

తీవ్రమైన ప్రచారముచేసిరి. వీటి ఫలితముగాను, వికసించిన రైతుల దృక్పథము అనుకూలముగా నుండుటచేతను, ఆచార్య రంగాగారు మొదటి ఆంధ్రరాష్ట్ర రైతు సంఘమును (1928)-బి. వి. రత్నం ఎం. ఎల్. సి. గారు అధ్యక్షులుగను, మాగంటిబాపినీడుగారుకార్యదర్శిగను-స్థాపించిరి. రంగాగారు స్థాపించిన రాష్ట్ర రైతు సంఘ విజయమునకు తోడ్పడినప్రముఖులు, దండు నారాయణ రాజుగారు, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, కీ. శే. కొమ్మారెడ్డి సత్యనారాయణగారు, నెల్లూరి వెంకట్రామానాయుడుగారు.

రంగాగారు రాష్ట్ర సంఘమునేకాక, ఆంధ్ర రాష్ట్ర రైతురక్షణ సంఘమనే పేర మరియొక సంస్థ నెలకొల్పి పనిచేసిరి. అటుపిమ్మట ఈ రైతు ఉద్యమము రంగాగారి నాయకత్వము క్రిందికి వచ్చినది. కొమ్మారెడ్డి సత్యనారాయణగారు ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ అధ్యక్షులుగా నుండి, రాష్ట్రమంతటనూ రైతుసమస్యా ప్రచారము గావించిరి. జిల్లా రైతు సంఘములు, రాష్ట్ర రైతు సంఘములు స్థాపించబడినవి.

సామ్యవాద దృక్పథము ఏర్పడిన తర్వాత ఈ రైతు ఉద్యమమును అఖిల భారత కిసాన్ ఉద్యమముగామార్చి, ఆచార్య రంగాగారు మూల పురుషులైరి.

వీరు పట్టించిన ఎర్ర జండాలు పేద రైతుల విజయముద్రలలాగు దేశములో ఎగుర జొచ్చినవి. కిసాన్ సంఘము అనేక సమావేశములను జరుపుచు, రైతు సమస్యలకు సంబంధించిన అనేక పత్రములను ప్రకటించెను. మద్రాసు రాజ

**ఆంధ్రరాష్ట్ర కిసాన్ సంఘము-భారతదేశ నాయకత్వము**

ధాని ప్రధాని దగ్గరకు ఋణ విమోచనము మొదలైన విషయములలోను (1937-38), జమీందారీ సెలెక్ట్ ఇన్‌క్వైరీ కమిటీ వద్దకు సాక్ష్యముల తీసుకొని వెళ్ళుటలోను రాయబారముల నడిపిరి. అనేక రైతు రక్షణ యాత్రలు సాగించి, ఆంధ్ర దేశమున 9 జిల్లాలను 130 దినములలో-1500 మైళ్ళు కాలినడకమీద నున్నూ, 525 మైళ్ళు బస్సులమీదనున్నూ ప్రయాణము చేసిరి. ఆంధ్రదేశపు కిసాన్ నాయ లగు రంగాగారు, భారతదేశ నాయకత్వము వహించి, ఆంధ్రావనికిన్నీ, అఖండ భారతమున కున్నూ అనల్పమైన సేవ చేయుచున్న ఆదర్శ వంతులు! కిసాన్ సంఘ సభ్యత్వము 70,000 మందికి దాటిపోయినది. 1936 లో ఈ సంఘము రిజిస్టరు చేయబడినది.

ఆంధ్రదేశమున రైతు, ఉద్యమములు జయ ప్రదముగా సాగుచున్నవి. ఆం. రా. రైతు



శ్రీమతి గోగినేని భారతీదేవిరంగా,
అఖిల భారత కిసాన్ సంఘ కార్యదర్శినిగా పనిచేసియుండిరి.

సంఘమునకు, జిల్లాలలో శాఖలుండి పనిచేయు చున్నవి. ఈ రైతు ఉద్యమములలో జమీం దారీ రైతుల దొక ప్రముఖ శీర్షిక.

ఇందు "జమీందారులు" అనే శీర్షిక గల అధ్యాయములో చెప్పబడిన రైతులు, జమీన్ రైతులు, జమీన్ రైతుల బాధలు, ఏయే ప్రాంతముల జమీన్ రైతులున్నారు మొదలగు విషయములు మీకు సుపరిచితములే.

ఆ జమీందారీ రైతుల బాధల నివృత్తిచేసి, వారిలో ఐక్యతనూ, సంయుక్తశక్తినీ కూడదీసి, వారి హక్కులను కాపాడుటకై ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ మేర్పడినది. ఈ సంఘాభ్యుదమునకు పాటుబడుచున్నవారు : శ్రీ రె. మందేశ్వరశర్మ గారు, నెల్లూరు వెంకట్రామానాయుడుగారు, వెంటకోట శ్రీరాములు నాయుడుగారు. ఆంధ్ర

**జమీన్ రైతు సంఘ ముల ప్రాముఖ్యము**

రాష్ట్రజమీన్ రైతుసంఘపు పూర్వ చరిత్ర తెలుసు కొనుటకు, ఆంధ్ర రాష్ట్ర జమీన్ రైతు సంఘమువారు ప్రకటించిన "ఆ. రా. జ. రై. సం. చరిత్ర-కార్యక్రమ నివేదిక" అనే కరపత్రములోని కొన్ని భాగ ములను ఉద్ధరించుచున్నాము.

"అవి, కృష్ణా జిల్లాల రిసెటిల్‌మెంటు శిస్తు రేట్లను రైతులు భరింపజాలరని మంచి ఆందో ళన జరిపే రోజులు. ధర్మవరం జమీందారీ విధిం చిన శిస్తు జకొలను గురించి జిల్లా కోర్టులో అ పీళ్లు దాఖలుచేస్తున్న రోజులు. అంతకు పూర్వము నుంచీ జమీన్ రైతుల హక్కులకై శాసన సభలలో జాగిలములాగు పట్టు పడుతూవుండే శ్రీ విశ్వనాథదాసు, రామానాయుడు, శర్మ గార్లు, ఆంధ్ర శాసనసభకు వెళ్ళేటప్పుడు వచ్చే

టప్పుడు జమీన్ రైతుల కష్టనివారణనుగూర్చి ఒక రూపంలో అందోళన లేవదీసిన భాగుండు నని అనుకోవటం కలదు. కానీ ఆ మననమువలన, అంకురాలు తెలియకుండగనే పుట్టుచుండెను. అప్పటికే గంజాం జిల్లా రైతు సంఘము పనిచేస్తూ ఉండేది. ఆ వివరాలు ఇక్కడ అవసరంలేదు.

ఆంధ్రరాష్ట్ర జమీన్‌రైతు సంఘ స్థాపనము

గానీ 14 ఆగస్టు 1929 సం॥న ఆంధ్రరాష్ట్ర జమీన్‌రైతు ఉద్యమ స్థాపననుగూర్చి ఒక సమావేశము ఏలూరులో శ్రీ విశ్వనాథదాసుగారి అధ్యక్షతను జరుపబడి, ఆ సభలోనే ఆంధ్ర రాష్ట్ర జమీన్‌రైతు సంఘము తొలుదొల్త స్థాపించబడినది. దీని పిలుపు నందుకొని వెంకటగిరి జమీన్‌రైతు సంఘము, నెల్లూరి జిల్లా రైతు సంఘము అప్పుడే ఏర్పడినవని జ్ఞాపకము. వీరు, రాష్ట్ర సంఘానికి తమ ప్రాతినిధ్యము పంపించిరి. తిరుత్తని జమీన్‌రైతు సంఘముగూడా అప్పటికే పనిచేస్తున్నది. వెంటనే జమీన్‌రైతు సంఘము తరఫున జిల్లాలవారీ సభలు, ఎస్టేటు సభలు జరిగాయి. జమీన్ రైతులు వందల కొలది సంవత్సరాలనుంచీ అనుభవించుచున్న దుర్భరకష్టాలు వెల్లడించుకొనుటకు ఒకమార్గము ఏర్పడినది. అందుపై సంఘాలుకూడా కొన్ని ఏర్పడినవి.

ఈ బాధలు నివారించుటకుగాను ఎస్టేటు ల్యాండు చట్టమూ, తదితర చట్టములూ ఎలా సవరణ కావాలో రాష్ట్ర సంఘం యోచించుటకు ప్రారంభించినది. ది. 3-11-29 వ తేదీని విశాఖపట్నంలో జరిగిన జిల్లా జమీన్‌రైతు సంఘ సభలో చేసినతీర్మానములు చాలా ప్రసిద్ధమైనవి. ఆ సమావేశములలోనే, ఆక్షేత్ర మునసే ముందు పెరుగనున్న మహా అశ్వత్థ వృక్షమగు జమీన్ రైతు ఉద్యమముయొక్క బీజములు చల్లబడినవి. జమీందారీ విధానమునే రద్దుచేయుట ఈ సంఘముయొక్క లక్ష్యములుగా స్పష్టపరచబడినది. పిమ్మట జరిగిన ఏలూరు మహాసభ జమీన్ రైతుల కనీసపు కోర్కెల ప్రణాళిక తయారు చేసినది. (27-8-1933).

ఆ సభలోనే రంగాగారి అధ్యక్షతను, ఒక విచారణ సంఘం ఏర్పడి, జమీందారీలలోని రైతుల కష్టములు, పరిస్థితులు ప్రప్రథమమున గ్రంథస్థము చేసినది.

అటుపిమ్మట 29-12-34 తేదీన జరిగిన విశాఖపట్నము మహాసభలో సంఘపు నిబంధనావళి సంస్కరించబడినది. ఇందు ప్రస్తుతపు రష్యా రాజ్యాంగ విధానములోని సూత్రాలు కూడా అనుసరించబడినవి. అటుపిమ్మట 1936 మార్చి ఆఖరువారంలో శ్రీకాకుళములో జరిగిన మహాసభలో, అప్పటిలో శాసన సభవారు గావించిన పట్నాయక్ శిస్తు రెమిషన్ సవరణను సిరశిస్తూ, తీర్మానములు చేయబడినవి. ఈ విధంగా 1921 మొదలు 1936 లోపుగా పర్లాకిమిడి మొదలు కుప్పం వరకూ జమీన్ రైతు సంఘాలు, సభలు, యాత్రలు జరుపబడి, రాష్ట్ర జమీన్‌రైతు ఉద్యమము-సర్వతోముఖమైనది. 1930 సం॥లో స్థాపించబడిన జమీన్ రైతు పత్రిక—క్షీరసాగరంమథనంలో చంద్రునివలె బయలుదేరి—అఖండ సేవ చేస్తున్నది. ఈ సంఘుపక్షమున వీరు అన్ని కాంగ్రెసు సంఘములవారికీ, ప్రభుత్వమునకూ నివేదికలను పంపిరి.

దేశము, ప్రభుత్వము, కాంగ్రెసు నాయకుల యొక్క దృష్టిని జమీన్ రైతు సంఘం ఆకర్షింపగలిగినది. రామానాయుడు, అప్పారావు, జగన్నాథదాసు, రంగాచారి, శెట్టిపల్లి మున్నగు వారు రైతు గీతాలు రచించినారు. రైతు సభలు, రైతు హరికథలు బయలుదేరినవి. వారి సహాయంతో ఈ ఉద్యమం నేడిట్టి అభివృద్ధికి రాగలిగినది. ఇట్టి దశలోనే, 1937 సం॥ లో కాంగ్రెసు మంత్రివర్గము వచ్చినది. శ్రీ ప్రకాశంగారి అధ్యక్షతను ప్రభుత్వము జమీందారీ విచారణ సంఘ మొకటి ఏర్పరచినది. ఆ సంఘమునకు, కాంగ్రెస్ ఉపసంఘు పక్షమున 200 మంది జమీన్ రైతులు, 200 పైన ఎస్టేటు రైతులువచ్చి ఆయా కేంద్రములలో ఘనమైన సాక్ష్య మిచ్చిరి. 4000 దస్తావేజులను దాఖలు చేసారు. వారి ఎస్టేటులలోని కడగండ్లు, దుష్పరిపాలనను ఉదాహరణలతో, సాక్ష్యబలంతో రైతులు వెల్లడిస్తూవుంటే దుఃఖ కరుణ రసాలు పొంగిపొర్లుతూ వుండేవి. జమీన్ రైతు ఉద్యమముయొక్క ధర్మతత్త్వం, ఈ విచారణవల్ల లోకానికి అద్భుతముగా వెల్లడి అయిన దనుటకు సంశయము లేదు.




ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ పక్షమున కీ. శే. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారి ఆధ్వర్యమున జరిగిన ఆంధ్రదేశ రైతు రక్షణ యాత్ర.
పలువురు రైతు సేవకులు ఇందుగలరు.

జమీందారీ కమటీ రిపోర్టుకు తమ ఆమోదము తెలియజేయుచు, 4-1-1938 తేదీని, విజయనగరములో జరిగిన సమావేశములో—ప్రస్తుతమున్న జమీందారీ విధానం ఆర్థికంగానూ, రాజకీయంగానూ రైతులను పీడించడమే

గాకుండా జాతియొక్క ఆర్థిక రాజకీయ వైజ్ఞానిక అభివృద్ధికి హానికరముగా నున్నందున దానిని వెంటనే రద్దుచేసే పద్ధతికి, ప్రస్తుత జమీన్దారీ కమిటీవారు చేసే సూచనలను తాత్కాలిక పరిహారంగా ఆమోదించిరి. రైతు సభవారు, తమ కోర్కె సఫలీకృతమగుటకు అత్యంతమైన కృషి, 1938-39 సం॥లో చేసిరి.

విశాఖపట్నం, మాడుగుల, చోడవరం, గూడెం మొ॥ ప్రదేశములకు చెందిన కొండజాతి వారు సుమారు 20 వేల మంది వుందురు. వీరిలో ప్రతిముఠాకు ఒక ముఠాదారుడు వుండును. ఈ ముఠాదారులు ఒక వంక జమీందారుల ప్రతినిధులుగాను, వేరొక వంక ప్రభుత్వమునకు కరణము, మునసబులగానూ పనిచేయుదురు. అందుచేత వీరి ఆధిపత్యము కొండజాతులలో హెచ్చు. ఆం. రా. జ. రైతు సంఘము వారు ఈ జాతివారితో 1937 లో సంబంధము కలుగజేసుకొని, వారిలో ఒక సంఘమును, ఆం. రా. జ. రైతు సంఘపు అనుబంధముగా ఏర్పాటు చేసిరి. వారి బాధలు నివారించు కృషితో సంతృప్తి పడక నిర్మాణ కార్యక్రమమును ఏర్పరచియు, అనేకవిధముల వారిపూర్ణాభివృద్ధి కోసముపాటు బడుచున్నారు. కొండ జాతులవారి విషయములలో కృషి చేయుటకు, ఆం. రా. జ. రై. సం. శాఖాకార్యాలయము చోడవరమునుండి స్థానిక మిత్రుల సహాయముతో నడుప బడుచున్నది.

**మాడుగల కొండ జాతులు- వారి కష్టనివారణ**

జమీన్ రైతు సంఘ చరిత్రలో కాళీపట్నం, మునగాల, మందాసా సంఘటనలు ముఖ్యమైనవి. ఈ రైతు సంఘ సేవకులలో కీర్తిశేషులైన కొమ్మారెడ్డి సత్యనారాయణగారు, పుల్లెల శ్యామసుందరరావుగారు మొ॥ వారు స్మరణీయులు. వీరు వివిధ కార్మిక ప్రచారకుల సమావేశముల నేర్పరచి, రైతు ఉద్యమ ఆదర్శము, దేశీయ పరిస్థితులు, సభ్యత పరిశీలిస్తూ ప్రస్తుతకాలానుసారంగాను, ఆర్థికసమస్యాపరంగాను తమ కార్యక్రమమును నిర్ణయించుకొనుచు, నిర్మాణాత్మకమైన కార్యక్రమమును ఏర్పరుచుకొని నడువవలయుననే ధృక్పథముగలిగి—సంపూర్ణ స్వరాజ్యసిద్ధి, ఆర్థిక సమత్వ సూత్ర మందుండి ఎంత మాత్రము చీలకుండా గట్టిపరచుకుంటూ, ఈ రైతు సంఘాల ద్వారా భారతదేశ భావి కల్యాణమునకు కృషి జేయుచున్నారు.



ఆగునా జీవాలు
సాగునా లోకాలు
రాజుగా మనమెంచి
రైతు జూడకపోతె
దేశాలు తలలెత్తునా
దాస్యపున్
పాశాలు తా వీడునా ?

—శె. వెంకటరత్నం, గి. రామారావు.

# 5. కార్మికోద్యమము

విషయ సంగ్రహము :—కార్మికోద్యమము ఇంకా ప్రారంభదశలో ఉన్నది; అందుకు కారణం దేశమందు పారిశ్రామికాభివృద్ధి లేకపోవడం ; కార్మిక వర్గాలు రెండు : కార్మికులు (కర్మాగారాలలో పనిచేసేవారు; వ్యవసాయ కూలీలు.) ఆంధ్రదేశమందు పెద్ద నగరాలు తక్కువ; బెజవాడ, విజయనగరం పరిశ్రమల కునికిపట్లు కాదగినవి; జనపనార పరిశ్రమ కేంద్రాలలో కార్మిక సంఘములు ; అన్నీ ట్రేడ్‌యూనియన్ నాయకత్వమున పనిచేస్తున్నవి; సమ్మెలు ; చిట్టివలసలో సమ్మెల విజయము ; ఆడకూలీలుకూడా సంఘాలలో చేరుతున్నారు—

పెద్ద పరిశ్రమల శ్రేణికి చెందినవాటిలో చీరాల పొగాకుపరిశ్రమ ఒకటి ; ఇక్కడి కార్మికసంఘం, సమ్మెలు, తగవులు; రైల్వే స్టేషన్లలో పనివాండ్ర సంఘములు ; ఇండియన్ లేబర్ యూనియన్ ; ఎమ్. ఎస్. ఎమ్. రైల్వే ఎంప్లాయీజ్ యూనియన్లు; కార్మిక నాయకుడు వి. వి. గిరి ; ఈ సంఘముల శాఖలు అనేక స్థలములలోగలవు ; కార్మిక బులెటిన్ బెజవాడలో ప్రకటితము; విశాఖపట్టణం హార్బర్, నౌకా నిర్మాణ కార్మికుల సంఘం, సామర్లకోటలో చక్కెర మిల్లు పనివాళ్ల సంఘం, కాకినాడలో పీచుపనివాళ్ల సంఘం మొదలగునవి; గుంటూరు, బెజవాడ ముఠాపనివాళ్ల సంఘాలు, బెజవాడలో అల్యూమినియమ్ పనివాళ్ల సంఘం మొదలయినవి ; ఆంధ్రరాష్ట్ర మ్యూనిసిపల్ బండు లోకల్‌బోర్డ్స్ పనివారల సంఘం , వ్యవసాయ కూలీ సంఘాలు ; వీటి ప్రాముఖ్యము ; కార్మికోద్యమమున పాటుపడుచున్న నాయకులపేళ్లు—.

హిందూ దేశములో కార్మికోద్యమము ఆరంభదశలోనే ఇంకా ఉన్నది. ఇందుకు కారణం దేశానికి విస్తారంగా పారిశ్రామికాభివృద్ధి లేక పోవడమే! గత ఐరోపా సంగ్రామ కాలంలో, పెద్దపెద్ద క్రొత్త దేశీయపరిశ్రమలు స్థాపించారు ; కాబట్టి మన కార్మికోద్యమచరిత్ర ప్రారంభమైనది ఇరవయ్యో శతాబ్దపు చివరి భాగంలోనే. అఖిల భారత కార్మిక సంఘాల ప్రోత్సాహం, పలుకుబడి వాటి ఆదర్శంతో అనుబంధంగా కార్మిక సంఘాలు ఆంధ్ర దేశములో ఏర్పడి, పనిచేస్తున్నవి. ఈనాటికి గూడా ఆంధ్ర దేశంలో పెద్దపెద్ద పరిశ్రమలు, చెప్పదగ్గవి ఏర్పరచబడలేదు.

పారిశ్రామిక కేంద్రాలలో పనిచేసే కూలీలనే కార్మిక వర్గంక్రింద పరిగణిస్తూ, ఈ దేశపు ఆర్థిక సంపదకు ముఖ్యులైన వ్యవసాయకూలీలను మరువకూడదు. కూలీలందరినీ-కార్మికులు, అనగా కర్మాగారాల్లో పనిచేసేవారనీ, వ్యవసాయ కూలీలనీ రెండు వర్గములుగా విభజించుట ఉచితము.



శ్రీ వరహగిరి వెంకటగిరి.
అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ సంఘాధ్యక్షులు ;
కార్మికుల విషయములలో విదేశములకు భారతదేశ
ప్రతినిధిగా చాలసార్లు వెళ్లియుండిరి.

ఆంధ్ర రాష్ట్రములో కార్మికోద్యమం శైశవావస్థలో నున్నదని చెప్పకతప్పదు. కార్మికోద్యమాభివృద్ధి పారిశ్రామికాభివృద్ధిపై ఆధారపడి వుంటుంది. పారిశ్రామికాభివృద్ధి భారత దేశములోనే తక్కువయినప్పుడు, ఆంధ్ర దేశంలో లేక పోవడం ఆశ్చర్యం కలిగించదు. పారిశ్రామికంగా భారతదేశంలో వెనుకబడివున్న రాష్ట్రాలలో ఆంధ్ర దేశము ఒకటి. ఈ వెనుకపాటుకు ప్రభుత్వ నిర్లక్ష్యమే ప్రధాన కారణం. పెట్టుబడి పెట్టగలిగిన వారికి కూడా పారిశ్రామిక సంస్థలందు ఆసక్తి లేకుండుట శోచనీయమైన రెండవ కారణము. ఇవియే, మన ప్రాంతాలలో బొంబాయి, షోలాపూరు, మధుర, కోయంబత్తూరులవంటి పారిశ్రామిక నగరాలు లేక పోవడానికి కారణములు. మనకు బెజవాడ, విజయనగరము తప్పితే మరిరెండు అట్లాంటి నగరాలైనా లేవు. అసలు, మన ప్రాంతముల క్రొత్త పద్ధతులమీద రైతు ఉద్యమాలు, కార్మిక సంఘాలు ఏర్పరచి, "రైతుల కనీసపు కోర్కెలు, కష్టాలు, ఆకలిమంటలు" మొ॥న విషయములను ప్రచారం చేసినవారు, ఇంగ్లాండు నుంచి విద్యాభ్యాసానంతరం వచ్చిన మన ఆచార్యరంగాగారు. అప్పట్లో వారి యత్నాలు నిష్ఫలితాలైనాయి. ఆ బీజాలే ఇప్పుడు మొలకలెత్తినవి. వీరి తర్వాత అతివాదులు, కాంగ్రెసు నాయకులు, కమ్యూనిష్టులు వీటికి దోహదకారులై చేయూతనిచ్చారు. పాటకపుజనంలో వున్న అజ్ఞానం, మూఢనమ్మకాలు గూడా కొంత ఈ ఉద్యమాభివృద్ధికి అడ్డుగావున్నవి.

ఆంధ్ర రాష్ట్రములో ముఖ్యంగా జనపనార పరిశ్రమ కొంతవరకు అభివృద్ధి గాంచినదనే చెప్పవచ్చును. జనపనార పరిశ్రమ కేంద్రములు

**కూలీ సంఘములు**

చిట్టవలస, నెల్లిమర్ల, ఏలూరు, గుంటూరు పట్నాల్లో వున్నవి. ఈ కేంద్రాలన్నిటియందు ఆ పరిశ్రమకు సంబంధించిన కార్మిక సంఘములు ఏర్పడి పనిచేయు చున్నవి. మద్రాసు కార్మిక సంఘంవారి యాజమాన్యము క్రింద నెల్లిమర్ల జనపనార మిల్లుకూలీల సంఘము నెలకొలుపబడెను. చిట్టివలస కూలీలు మొదట 1928 వ సంవత్సరంలో, డి. వి. రామస్వామిగారి అధ్యక్షతక్రింద సంఘంస్థాపించి, దానిని గుర్తించుమని అధికారులను కోరిరి. మరియు వారికోర్కెనెరవేరడానికి సమ్మెచేశారు. కూలీని హెచ్చించుమని కూడ అప్పుడే కోరారు. కానీ తర్వాత ఆ సంఘం కొంతకాలమాగిపోయి మరల కరుణాకరంసుబ్బారావు ఎమ్.ఎల్.ఏ. గారి అధ్వర్యం క్రింద ముందుకు వచ్చింది. 1937 లో మరల ఒక సమ్మె జరిగింది. పోలీసులు - సమ్మెదార్లను కాల్చారు. చిట్టివలసలో పనివారి సంఖ్య 3000. సంఘ సభ్యత్వము 2000 వరకు ఉన్నది. నెల్లిమర్ల సంఘం 1000 మంది సభ్యులను కలిగి ఉన్నది; ఇచ్చటి పనివారి సంఖ్య 1500. ఏలూరు సంఘంలో అయిదారువందలకన్న ఎక్కువ సభ్యులు లేరు; పనివారి సంఖ్య 1000. గుంటూరు జనపనార పనివారల సంఘం ఏర్పడి నాల్గు సంవత్సరాలయినది. మొత్తం పనివాళ్ల సంఖ్య 800 ; సభ్యుల సంఖ్య 400. ఈ సంఘాలన్నీ కూడా ట్రేడ్. యూనియన్ కాంగ్రెసు నాయకత్వము క్రిందనే పనిచేయుచున్నవి. అన్ని కేంద్రాలలోను, కార్మికులు తమ వేతనాలు అధికం చేసుకొనేందుకు తీవ్రంగా ఆందోళన చేస్తున్నారు. చిట్టివలసలో సమ్మెలు జరగడము,

ఆధునిక రష్యన్‌జాతి నిర్మాత 'లెనిన్'



రష్యాదేశములో కార్మిక కర్షక ప్రభుత్వమును స్థాపించి, ప్రపంచ కార్మికోద్యమమునకు మూలపురుషు డైనాడు.

కూలీల కోర్కెలు ఈడేరుటయు జరిగింది. సమ్మెలు, సంచలనంవల్ల వీరిలో చైతన్యం వృద్ధిచెందు తున్నది. ఆడకూలీలు గూడా పురుషులతో గలిసి సమ్మెల్లో పాల్గొంటున్నారు. ఇదిపురోగమనానికి మార్గదర్శక మౌతుంది!

ఏలూరు జనపనార కార్మిక సంఘము అనేక సంఘటనలు దాటుతూవస్తున్నది. ఇటీవల మిల్లు యజమానులు, లాభములు లేవన్న మిషతో మిల్లు మూసివేసిరి. కార్మికులు తిరిగి మిల్లుల తెరుచుటకై ఆందోళన చేసిరి. తర్వాత మిల్లులు పనిచేయడం మొదలుపెట్టాయి. సౌకర్యాల లోపము, స్వల్ప వేతనాలు, అధిక శ్రమవల్ల కూలీలు సమ్మెచేశారు. సమ్మెవల్ల ప్రభుత్వం నాయకులను కఠిన శిక్షవిధించి, జైళ్లకు పంపించింది. నెల్లిమర్ల, గుంటూరు సంఘాలు కూడా తమ హక్కుల రక్షణకు పోరాడుచున్నవి. ఇంత సంచలనం వున్నప్పటికీ, కార్మికుల కనీసపు కోర్కెలు అనుకోదగినంతగా ఈడేరలేదు. యజమానుల దౌర్జన్యం ఇంకా అప్రతిహతంగా సాగుతున్నది. కండలు కరుగునట్లు పని చేయుచు కూటికి గుడ్డకు చాలని స్వల్పవేతనముతో కూలీలు అసంతృప్తి జీవనమును సాగిస్తున్నారు. రగిలే ఆకలి మంటలలో చైతన్య జ్వాలలు, ఐక్యత నిరంతరంగా ప్రజ్వరిల్లుతునే వున్నవి. ఈ సంఘములలో పనిచేసే తీవ్రవాదులు కొందరు కార్మికుల ఆశయాలను దృష్టిపథంలో పెట్టుకొని స్వార్థం త్యజించి, సర్వ మర్పించి పాటుపడుచున్నారు.

ఆంధ్రా సిమెంటు కంపెనీ కార్మిక సంఘం, కృష్ణా సిమెంటు కంపెనీ కార్మిక సంఘము రెండున్నూ నాల్గు సంవత్సరముల క్రిందట ఏర్పడి, 350 మంది సభ్యులను గలిగి వున్నవి. ఈ సిమెంటు పనివార్ల మొత్తం సంఖ్య 575. దైనందినహక్కులను కాపాడుకోవడం, వీరు ప్రధానంగా అమలు పెట్టుచున్న కార్యక్రమం.

ఆంధ్ర రాష్ట్రములో పెద్ద పరిశ్రమల శ్రేణికి చెందిన వాటిలో చీరాల పొగాకు పరిశ్రమ ఒకటి. ఇది ఐ. ఎల్. టి. డి. కంపెనీ వారిది. పొగాకు రోజులలో 6000 మంది వరకు కార్మికులు పనిచేయుదురు. తక్కిన రోజు

లలో రోజుకు 1000 కి పైబడి పనిచేయుదురు. చీరాల పొగాకు కార్మిక సంఘం ఏర్పడి అయిదు సంవత్సరాలయినది. ఇక్కడ అప్పుడు కూలీలకు నాయకుడు యజ్ఞన్నారాయణగారు. 1938 సంవత్సరంలో సమ్మెలు, ప్రచండమైన పెద్ద కాల్పులు జరిగినవి. తమ వేతనాల నెక్కువ చేయుమని కార్మికులు కోరగా, సమ్మెనాయకులను ప్రభుత్వం నిర్బంధించినది.

ఆంధ్ర రాష్ట్రంలో అన్ని పెద్ద రైల్వేస్టేషనులలోను రైల్వే పనివారి సంఘములు పనిచేయుచున్నవి. వీరందరిలోను గాఢమైన ఐక్యత వున్నది. ఈ సంఘములు ట్రేడు యూనియన్ల ద్వారా, బి. ఎన్. ఆర్. రైల్వే సంఘములతో సంబంధాలు గలిగివున్నవి. ఇండియన్ లేబరు యూనియన్, ఎమ్. ఎస్. ఎమ్. రైల్వే ఎంప్లాయీజ్ యూనియన్లు, 1919-1920 సంవత్సరములో నిర్మాణము చేయబడినవి. ఆంధ్ర రాష్ట్ర రైల్వే పనివారి సంఘము ఐదు వేలు మొ॥ ఆరు వేలదాకా సభ్యత్వము కలిగివున్నది. మన కార్మిక నాయకులు, మాజీపార్శ్రామిక మంత్రి వి. వి. గారు ఈ సంఘ విజయానికి పాటుపడిరి. వీరే ఆంధ్ర దేశంలో ఎన్నో సమ్మెలను గూడా పరిష్కరించారు. ఎమ్. ఎస్. ఎమ్. రైల్వే పనివారల కేంద్రసంఘ శాఖలు బెజవాడ, హుబ్లి, గుంటకల్లు, దోనకొండ, గుత్తి, నిడదవోలు, రాజమండ్రి, విశాఖపట్నము, గుంటూరు, తెనాలి, చీరాల, నెల్లూరు, బిట్రగుంట, గూడూరు మొదలైన పట్టణాలలో వున్నవి. మొత్తము రాష్ట్రమంతటా అయిదు వేలమంది సభ్యులున్నారు. వీరందరు, సంఘటితమైన కార్మిక పోరాటములు సాగిస్తున్నారు. వీరి కోరికలు :— వేతనములు ఎక్కువ చేయుట, యుద్ధపు అలవెన్సులు బోనసు ఇచ్చుట, సక్రమమైన శెలవులు, వెట్టిచాకిరి చేయించకుండుట, గౌరవంగా సమానప్రతిపత్తితో చూచుట మొదలైనవి. వీరు తమ కష్టాలు తెలియ బరచుటకై ప్రచారమునకు "కార్మిక బులిటెన్" అను పత్రికను బెజవాడనుండి నడుపుచున్నారు.

విశాఖపట్టణంలో హార్బరు పనివారల సంఘము, నౌకా నిర్మాణ కార్మికుల సంఘం కూడా పనిచేయు చున్నవి. మొదటిది స్థాపించి ఏడు సంవత్సరాలయినది ; రెండవది స్థాపించి రెండు సంవత్సరాలయినది. సామర్లకోటలో చక్కెరమిల్లు పనివాళ్ల సంఘములు 'షుగర్ మిల్లు వర్కర్సు ఫెడరేషను' ఉన్నది.

కాకినాడ పీచు పనివాళ్ల సంఘం ఏర్పడి అయిదు సంవత్సరాలయినది. ఆంధ్ర రాష్ట్ర అచ్చు పనివారి సంఘం ఏర్పడి దాదాపు ఆరు సంవత్సరాలయినది. దీని శాఖలు దాదాపు అన్ని పట్టణాలలోనూ వున్నవి. ఈ నాయకులది కమ్యూనిస్టు దృక్పథం. మొత్తము సభ్యుల సంఖ్య 6000 మంది. ముఖ్యముగా తెనాలి, గుంటూరు, బెజవాడ, కాకినాడ మొదలైన పట్టణాలలో కార్మికులు తమ హక్కుల కోసం, అభివృద్ధి కోసం అలజడిచేశారు. వీరి నాయకులు, సమ్మె చేసినందుకు ప్రభుత్వ కారాగారాల్లో ఉండవలసివచ్చింది.

గుంటూరు, బెజవాడలలోని ముఠా పనివాళ్లు, 1 సం॥ క్రిందట సంఘములు ఏర్పరచుకొని పనిచేయుచున్నారు. వీరు మొత్తం 5000కన్న ఎక్కువ లేరు. సభ్యుల సంఖ్య 1, 2 వేలుదాకా ఉన్నది. సంఘం స్థాపించినది ఈ మధ్యనే అయినప్పటికీ



శ్రీ కరుణాకరం సుబ్బారావు, కార్మికుల పక్షమున మద్రాసు శాసనసభా సభ్యులు.

వీరిలో సంచలనం, కొంచము అభివృద్ధి కనిపించును. ఇప్పుడు యజమానులు వీరిని తిట్టడం, నీచంగా చూడటం కొంత తగ్గింది. సంఘటిత శక్తి అభివృద్ధిదాయకము గదా! బెజవాడలో అల్యూమినం పనివాళ్ళ సంఘం, ఎలక్ట్రిక్ పనివారల సంఘము ఉన్నవి. నెల్లూరు జిల్లాలో అభ్రకపు పనివారి సంఘము, ఏనాదివారి సంఘము పనిచేయుచున్నవి. ఆర్థిక బాధలు, నిరక్షరాస్యత నిర్మూలించడానికి ఈ సంఘాలుపనిచేయుట ముదావహము. ఈ సంఘములు వెన్నెలకంటి వీరరాఘవయ్యగారి నాయకత్వంక్రింద పనిచేయుచున్నవి. మాంద్యం నశించి, చైతన్యంకలిగి సంఘాలు ముందంజ వేస్తున్నవి.

ఆంధ్రరాష్ట్ర మ్యునిసిపల్ అండ్ లోకల్ బోర్డ్సు పనివారల సంఘం స్థాపించి సంవత్సరం దాటినది. రాష్ట్రీయ సంఘము ఏర్పడక పూర్వమే కొన్ని మ్యునిసిపాలిటీలలో ఈ సంఘాలు ఏర్పడి పని చేయుచున్నవి. గుంటూరు, నెల్లూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలో ఈ సంఘాల కేంద్రాలున్నవి. ఈ కార్మికుల సంఖ్య దాదాపు 60 వేలు దాటుతుంది. అనంతమైన కార్యదీక్షతో, పట్టుదలతో కృషిచేసినచో ఈ సంఘానికి సంఘటితశక్తి ఏర్పడి, ఆంధ్రదేశంలో బలవత్తర శక్తిగా తయారు అగును.

ఈ సంఘాలుకాక ఇట్లాంటివి దేశంలో అన్నిచోట్లా పనిచేస్తున్నవి.

వ్యవసాయం, నాగలితో నేలదున్ని బ్రతకుట మనలో అసంఖ్యాకులకు పారంపర్యావస్తున్న అనువంశికవృత్తి. ఇన్ని సంఘాలు పనిచేస్తూ, ఇంతచైతన్యం వున్నప్పటికీ వ్యవసాయ కూలీల సంఘాలు ఇంకా కావలసినన్ని ఏర్పడలేదు.

**వ్యవసాయ కూలీ సంఘాలు-వాటి ప్రాముఖ్యము**

వీరిది అసలు ఈ ప్రధానమైన కూలీ సంఘములలో ఒక ప్రత్యేకవర్గము. వీరిలో చాలామంది సెంటుభూమి కూడా లేనివారు గనుక, వీరు నికృష్టమైన జీవితం గడుపుతూ ఉండడంచేత వీరిలో సంఘైక్యం, చైతన్యం తక్కినవారిలోకన్నా త్వరలో ఏర్పడుతుంది. ఈ వ్యవసాయం మనకు నిన్నామొన్నా వచ్చినది గాదు. అనాది నుంచీ వచ్చినవృత్తి. ఈ వృత్తిలో కొన్నిచోట్ల యజమానికి-కూలీకిమధ్య, పెట్టుబడికి - కూలికి మధ్య అంతరం అంతగాలేదు. చాలామంది రైతులకు స్వంతకవతం వున్నది. కొందరు, కూలీలను పెట్టి పని చేయించుకుంటారు. వీరిలో పరస్పరం ప్రేమ, పరిచితి వుంటుంది. కొన్నిగ్రామాలలో కొన్నికుటుంబాలు అరకలు కట్టుకొని, ఒకరికొకరు సాయంగా పండించుకోవడమూ కలదు. మళ్ళీ కూలి విషయములో, డబ్బు రూపకంగా గాక గింజలు, ధాన్యం మూలకంగా వుంటుంది. వ్యవసాయక కూలీకి, "పాలేరు" అనే పదం వ్యవహరిస్తాము. ఇది భాగస్వామి అని అర్థం ఇస్తుంది. మొత్తంమీద కూలి ధాన్యరూపంగానే వుంటుంది. ఇప్పుడు ఈ పద్ధతి నశించి, ఐకమత్యం పోయినది. పొలందున్ని, నట్టనడి ఎండలో పని చేయు కాపుకు కడుపుకు పిడికెడు కూడైన లేక పూరిగుడిసెలో కండ్లల్లో ప్రాణాలు పెట్టుక



శ్రీ వి. వి. నరసింహం,
కార్మిక పక్షమున మద్రాసు శాసన సభా సభ్యులు.

బ్రతకవలసి వచ్చిందంటే, వారి కష్టాలు అధికతమమై విషమిస్తున్న వన్నమాట.

వీటికితోడు, సాంఘికంగా వ్యవసాయ కూలీలకు తగినస్థానం లేకున్నది. హరిజనులు, యానాదులు, ఎరుకల వారెంతోమంది వ్యవసాయ కూలీలలోని రకమువారు. విశాఖపట్ణం జిల్లా నుండి, తూర్పు గోదావరిజిల్లాకు వచ్చిన కూలీలు కొందరు భూమిని సంపాదించుకొనిరి. కానీ హరిజనులేమీ సంపాదించ లేకుండుట విచిత్రము. ముఖ్యంగా మనవ్యవసాయపు పద్ధతులమీద ఆధారపడ్డ రైతుకు, వాన సకాలంలో లేకపోయి కొన్ని కష్టాలు కలుగుచున్నవి. రాష్ట్రంలో ఏర్పడ్డ వ్యవసాయ కూలీ సంఘానికి, అనేక ఉపశాఖలుగా, అన్నిచోట్ల వివిధ సంఘాలు ఏర్పడి పనిచేస్తే వీరి దారిద్ర్య పిశాచమును పారద్రోలవచ్చును. ఈ కార్మికోద్యమమునకు పై చెప్పినవారేకాక పులుపుల శివయ్యగారు, పుచ్చలపల్లి సుందరయ్యగారు, ప్రతాప రామసుబ్బయ్యగారు, కేలం అప్పలస్వామిగారు, మరుపిళ్ళ చిట్టిగారు, దిగుమర్తి రామారావుగారు, టి. వెంకటేశ్వరరావుగారు, గిరిరాజు సత్యనారాయణగారు మొదలైనవా రనేకులు తోడ్పడుచున్నారు. రాజమహేంద్రవరములో శ్రమజీవి అనే వారపత్రికను చిలకమర్రి సత్యనారాయణాచార్యులుగారు నడుపుచున్నారు.

ఈ ఉద్యమం భారత దేశ భావిస్వాతంత్ర్య చరిత్రలో ఒక స్వర్ణపుటను వ్రాసుకొని, తన ధర్మం నెరవేర్చుకోగలదని ఆశించవచ్చును!





అవని అంతా పెద్ద అక్షయ పాత్ర!
అఖిలేశు హస్తమే అన్నపూర్ణమ్మ!
ఆరిపోవనిది నా ఆకలే ఐతే
అంతు దొరకనిది ఆ అమృతాబ్ధి కాదా?
అన్నమో, అమృతమో ఆకొన్న పేదకో
కన్నతల్లీ బ్రతుకునిండ భిక్షాందేహి!

—దేవులపల్లి కృష్ణశాస్త్రి.

# 6. విద్యార్థి ఉద్యమము

విషయ సంగ్రహము :—ఉద్యమము—దాని ప్రారంభము ; తక్కిన దేశీయ జాతీయోద్యమములతోపాటు విద్యార్థుల ఉద్యమముకూడా 1920-'23, '30-'31 లో బయలుదేరి '34-'36 లోని అంతర్జాతీయ సంఘటనలవల్ల బలపడినది ; '36 లో అఖిల భారత విద్యార్థి సంఘము ఏర్పడి రాష్ట్రీయోద్యమాలకు దారి తీసినది ; తత్పూర్వము ప్రతి కళాశాలలోను గల విద్యార్థి సంఘములు ఈ ఉద్యమానికి పునాదులు ; అందులో ఆంధ్ర విశ్వకళా పరిషత్ విద్యార్థి సంఘము ప్రధానమైనది. 1937 లో గుంటూరిలో బాట్లీవాలాగారి అధ్యక్షతను ఆంధ్రరాష్ట్రి విద్యార్థి సభ జరిగినది; కామ్రేడ్ ఎం. బసవపున్నయ్యగారు దానికి కార్యదర్శి; ఉద్యమాదర్శములు ; ఆంధ్రరాష్ట్రి విద్యార్థిసంఘ కార్యనిర్వహణమునకు ప్రధాన అంగములు. స్థానిక సంఘములు మొ॥ ; ఇవి పాల్గొనుచున్న స్థలములు.

విద్యార్థుల ఆంధ్రోద్యమము—సర్ రామలింగా రెడ్డిగారి ప్రోత్సాహము : '37 లో వాల్తేరునందు ఆంధ్రవారము : చెన్నపురిలో నైతము :

ఈ ఉద్యమమునకు ప్రతిబంధకములు : దానినిగూర్చి గాంధీగారి అభిప్రాయము—.

"ఆధునిక నాగరికత నశించకుండా రక్షించి, దానిని ఉజ్జీవిత మొనర్చే ఆశయం అవసరం. ఈనాటిజగత్తులో విజ్ఞానం వహించవలసిన పవిత్ర కర్తవ్య మేమంటే, సంఘ జీవనంలో దానిని ప్రవేశపెట్టడం, ఆమూలంగా మానవజాతి సంపూర్ణ వికాసం చెందగలదన్న విశ్వాసం కలిగించడమూను."

ఉత్తమ ఆశయముల కలిగి, విజ్ఞానవికాసముల వ్యాప్తికి అనవరతమూ కృషిచేయుచున్న ఈ నవయుగపు ఉద్యమములలో ఆంధ్రరాష్ట్రి విద్యార్థి ఉద్యమము ఒకటి. ఆంధ్రరాష్ట్రి విద్యార్థి సంఘము అఖిల భారత విద్యార్థి సంఘముతో కలసి కార్యక్రమము నిర్ణయించుకొని పనిచేయును.

ప్రపంచపు పునాదులనే కదలించిన 1929 ఆర్థిక సంక్షోభమువల్ల సామ్రాజ్యవాదదేశములలో తీవ్రమైన కార్మికోద్యమములు బయలుదేరినవి. ఆపైని, ఆసియ దేశములలో జాతీయ ఉద్యమములు విలసిల్లి బలపడినవి. ఆర్థికంగాను, రాజకీయంగాను, సారస్వతంగాను, సాంఘికంగాను, వ్యుత్పన్నతాపరంగాను తీవ్రమైనమార్పులు జరుగుచున్నవి.

ఉద్యమ ప్రారంభము

గాంధి, మాల్తస్, మార్క్స్, లెనిన్, షా, రోమేఁరోలా, రవీంద్రుడు, అరవిందుడు, స్టాలిన్ మొదలైన మహానీయులు ఉద్భవించి, నిత్యనూతనత్వాన్ని అనుసంధానిస్తూ స్రష్టలై, మానవకుటుంబములో మహత్తరమైన ఆవేశమునూ, ఊహలను ప్రజ్వలింపజేసిరి. ఈ ప్రముఖ సన్నివేశములన్నీ విద్యాలయములలోను విద్యార్థుల జీవితములోను, శరవేగముతో అనేక మార్పులను తెచ్చినది. ప్రజాశక్తి ప్రస్ఫుటమైనది.

1920-23, 1930-31 జాతీయ ఉద్యమములు విద్యార్థుల నాకర్షించి వారిలో తీవ్రసంచలనము, రాజకీయ చైతన్యము కలిగించినవి. 1934-36 మధ్య జరిగిన అంతర్జాతీయ, జాతీయ సంఘటనలు కూడా విద్యార్థుల కొక పాఠమును చెప్పినవి. ఫాసిజానికి గురియైన ప్రజాస్వామ్య రాజ్యములు, చీనా స్వాతంత్ర్య పోరాటము, 1936 ప్రపంచ విద్యార్థుల సమ్మేళనం, గాంధీజీ నాయకత్వం, 1934 కాంగ్రెసు సోషలిష్టుపార్టీ



బందరులో విద్యార్థులు సమ్మె సందర్భమున పికెటింగ్ చేయుట.

విద్యాలయములలోని జీవితమునకు బయటి ప్రాపంచిక జీవితమునకు సామరస్యము కుదర్చి తమ వ్యక్తిత్వమును స్థిరపరచుకోవలెనన్న వాదపిపాసా ఫలితమే ఈ విద్యార్థిసంఘ నిర్మాణము.

ఈ విద్యార్థి సంఘముల నిర్మాణమునకు పూర్వము ప్రతి కళాశాలలోను, పాఠశాలలోను విద్యార్థి సంఘములున్నవి. అవి, సారస్వత సంఘమని, చారిత్రక సంఘమని వివిధమైన ఉపసంఘములు కలిగియుండెడివి. విద్యార్థుల సారస్వత, వైజ్ఞానికాభివృద్ధికి కొంత ఉపకరించుచుండెడివి. ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘము గూడా ఈ సారస్వత సంఘ స్వరూపమునే కలిగియుండెడిది. కానీ అప్పటిలో అవి, ఇప్పటి విద్యార్థి ఉద్యమములాగు ప్రజాఉద్యమములో ఒకభాగమై యుండలేదు. నూతనమైన ఈ ఉద్యమానికి, దాని పరిణామానికి ముఖ్యముగా జీవము నిచ్చినది—ఇప్పటి ప్రాపంచిక పరిణామము, ముఖ్యముగా మన దేశములోని రాజకీయ సంచలనమని వేరే చెప్పనక్కరలేదు.

స్థాపన, కిసాన్ పార్టీ ప్రచారము, కాంగ్రెసుకు నెహ్రూ అధ్యక్షత మొదలైనవన్నీ, ఇప్పటి విద్యార్థి ఉద్యమునకు తోడ్పడిన అంశములు. విద్యార్థులు విద్యార్థి సంఘముల ద్వారా ఉన్నతికి రావలెననే నెహ్రూపండితుని సందేశము విద్యార్థుల హృదయములలో నాటుకొనెను. 1936లో వివిధరాష్ట్ర విద్యార్థుల మధ్య వైజ్ఞానిక సామరస్యమును కల్పించుటకు, విద్యార్థులను భావి పౌరులుగా తయారుచేసి జాతీయ స్వాతంత్ర్యసమరములో పాల్గొనుటకు సన్నద్ధుల చేయుటకు అఖిల భారత విద్యార్థి సంఘము నెలకొల్పబడి, రాష్ట్ర ఉద్యమాలకు దారి తీసినది. ప్రస్తుత విద్యావిధానం లోపభూయిష్ఠముగానుండి విద్యార్థుల నిర్మాణశక్తికి (Creative intellect) దోహద మివ్వలేక పోవుటచేతను, విద్యాలయాధికారులు విద్యార్థుల స్వేచ్ఛను కొంత అరికట్టుటచేతను విద్యార్థులలో విజృంభించుచున్న స్వాతంత్ర్యకాంక్ష, ప్రజాసేవాభిలాష

గుంటూరు విద్యార్థులు 1937వ సంవత్సరమున గుంటూరులో బాట్లీవాలాగారి అధ్యక్షతక్రింద ఆంధ్రరాష్ట్ర విద్యార్థిసభ జరిపిరి. ఈ సమావేశము విద్యార్థి ఉద్యమమునకొక స్థిరస్వరూపము దిద్దగలిగినది. ఆ సభకు గుంటూరు, కృష్ణా, తూర్పు-పశ్చిమ గోదావరి, విశాఖపట్నం జిల్లాలనుండి

సభ్యులువచ్చి పాల్గొని, సంఘ విషయములను చర్చించిరి. కామ్రేడ్ ఎం. బసవపున్నయ్య గారు దానికి కార్యదర్శిగా ఎన్నుకొనబడిరి.

**ఆదర్శములు**

విద్యార్థుల భౌతిక మానసికాభివృద్ధికి వైజ్ఞానిక అభ్యుదయము, ఐక్యత - జాతి మత విద్వేషముల నశింపజేయుట-నేటి విద్యావిధానమున దైనందిన జీవితానికి అనుగుణమైన మార్పులు చేయ సూచించుట-విద్యార్థుల హక్కులను సంరక్షించుకొనుట-విద్యార్థులలో రాజకీయ చైతన్యముకల్పించి పౌరులుగా తయారుచేయుట-విద్యార్థి సంఘముల గుర్తించుమనీ, ఇప్పటి ఆర్థిక పరిస్థితులలో అధికముగానున్న విద్యార్థుల ఖర్చులు, పరీక్షరుసుములు తగ్గించుమని, ఎక్కువమందికి చదువుకొను అవకాశము కల్పించుమని, హిందీ దేశభాషగా చేయవలెనని అధికారులను కోరుట-ఉచిత నిర్బంధ సైనిక శిక్షణ విద్యాలయములలో ప్రవేశపెట్టుట-పాఠ్య గ్రంథములు జాతీయ జీవితమును చిత్రించేవిగా ఉండునట్లు చేయుట మొ॥ ఉన్నతాదర్శములతో 1937 సంవత్సరములోనే విద్యార్థి సంఘము ప్రారంభమైనది. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘ శైశవదశలో, సంచలనము కలిగించి మార్గదర్శకులైనవారు గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలా విద్యార్థులు.

విద్యార్థుల కనీసపు కోర్కెలు అధికారులు నెరవేర్చుటలేదనియు, డిటెన్షన్ పద్ధతి విద్యార్థులకు కేవలము హానికరముగా నున్నదనియు విద్యార్థులందరూ అనేకచోట్ల ప్రతిఘటించిరి. కొన్నిచోట్ల ఈ ప్రతిఘటన సమ్మెల రూపము దాల్చినది.

**ఆం. రా. వి. సంఘము-దాని శాఖలు**

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘ కార్య నిర్వహణమునకు ప్రధాన అంగములు స్థానిక సంఘములు, జిల్లా సంఘములు, ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘ కార్య నిర్వాహకవర్గము, రాష్ట్ర మహాసభ. 1937 లో కృష్ణా, గుంటూరు జిల్లాలలోను, 1938 లో నెల్లూరు, తూర్పు-పశ్చిమ గోదావరి, విశాఖపట్నం జిల్లాలలోను సంఘములు ఏర్పడినవి. విద్యార్థుల ప్రాథమిక హక్కులకోసం, ఆశయములకోసం కృషిసల్పుటకు 1940 నాటికి అన్నిచోట్ల విద్యార్థి సంఘము లేర్పడినవి. 1941 లో రాయలసీమ విద్యార్థి సంఘములుకూడా ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘములో కలియుటచే విద్యార్థుల ఐక్యం మరింత బలిష్ఠమైనదని చెప్పవలెను. 1940 నాటికి మొత్తపు రాష్ట్ర సభ్యత్వపు సంఖ్య 4000.

గుంటూరు, బాపట్ల, ఒంగోలు, నర్సారావుపేట, తెనాలి, పొన్నూరు, కొవ్వూరు, పెదనందిపాడు, రేపల్లె స్థానిక విద్యార్థిసంఘాలతోకూడిన గుంటూరు జిల్లా సంఘ సభ్యత్వపుసంఖ్య 1280. కృష్ణాజిల్లా విద్యార్థి సంఘములో 11 స్థానిక సంఘములు పనిచేయుచున్నవి. బందరు, గుడివాడ, బెజవాడ, జగ్గయ్యపేట, కైకలూరు, పామర్రు, పునాదిపాడు, నందిగామ, అవనిగడ్డ, గన్నవరం, చల్లపల్లుల సభ్యత్వము 1000. పశ్చిమ గోదావరి జిల్లాలోని ఉండి, మారుటేరు, తణుకు, ఏలూరు, పాలకొల్లు, కొవ్వూరుల స్థానిక సంఘములలోని సభ్యత్వము 244. తూర్పు గోదావరి జిల్లా సంఘమునకుచెందిన కాకినాడ, రాజమండ్రి, పెద్దాపురం, పిఠాపురం, రామచంద్రపురం, అమలా



శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య.
విద్యార్థి, యువజనోద్యమముల కై ఎక్కువ పాటుపడిరి.

పురం కొత్తపేట, రాజోలు, సామర్లకోటలలోని స్థానిక సంఘముల సభ్యత్వపు సంఖ్య 636. విశాఖపట్నం జిల్లాలోని విజయనగరం, వాల్తేరులలో మాత్రమే స్థానిక సంఘము లున్నవి. నెల్లూరి జిల్లాలో కావలి, గూడూరు, వెంకటగిరి, కందుకూరు, బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరులలో స్థానిక సంఘములు గలవు. 1941 నాటికి రాష్ట్ర సంఘ సభ్యత్వము 6000 పైబడియున్నది. సభ్యత్వములో కృష్ణా జిల్లా ప్రధానస్థానము అలంకరించినది.

**విద్యార్థులు-ఆంధ్రోద్యమము**

1937 నాటినుంచి విద్యార్థులు ముఖ్యముగా అనేకచోట్ల సారస్వత, చారిత్రక కృషి చేయుచుండిరి. ముఖ్యముగా ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు వాల్తేరులో ఆంధ్రవారము జరిపి, సత్వర ఆంధ్రరాష్ట్రసిద్ధికి తోడ్పడుటకై సంచలనము ప్రారంభించిరి. ఆంధ్రదేశపు చరిత్ర, సారస్వతము, కళ, రాజకీయములు మొదలయిన ప్రధాన విషయములకు సంబంధించిన పుస్తకములను, కరపత్రములను ప్రకటించిరి. దీనికి డాక్టరు సర్ కట్టమంచి రామలింగారెడ్డి మొదలయినవారున్ను, ఆంధ్రదేశపునాయకులున్ను ప్రోత్సాహమిచ్చి, జయప్రదముగా సాగించిరి. 1937 లో వాల్తేరులో ఆంధ్రవారము జరిపి కార్యక్రమము నిర్వహించిన ప్రధాన విద్యార్థులు—శ్రీ ఎ. వి. కృష్ణమూర్తి, డి. ముకుందరావు గార్లు. ఈ ఆంధ్రవారమును ప్రతి సంవత్సరము కొన్ని కళాశాలలు చేయుచున్నవి. మద్రాసు విద్యార్థులున్ను ఈ ఆంధ్రవారముల నతి జయప్రదముగా నిర్వహించినారు. మద్రాసులోని విద్యార్థి ఉద్యమమునకు పుచ్చలపల్లి రామచంద్రా రెడ్డిగారు, తోటలక్ష్మయ్యనాయుడుగారు తోడ్పడిరి. మన విద్యార్థి ఉద్యమములలో ప్రధానపాత్ర వహించి పనిచేయుచున్న వారిలో కంభంపాటి శ్రీరామమూర్తిగారు, ఎమ్. రాధాకృష్ణ ఎమ్. ఏ. గారు మొదలైనవారు అనేకులున్నారు.

ఇవేకాక విద్యార్థులు రాజకీయ కార్యక్రమములోను, విద్యావ్యాపక కార్యక్రమములోను వైజ్ఞానిక సమావేశముల నేర్పరచి పాల్గొని, స్వాతంత్ర్యము-శాంతి-అభ్యుదయములకై తమ పతాకము ప్రతిష్ఠించి, ముందంజ వేయుచున్నారు.

"రైతు సంఘ కార్మిక సంఘముల పద్ధతిని విద్యార్థి సంఘములు స్థాపించుటవసరము. కాని ఇప్పటి మనస్థితిలో విద్యాశాఖాధికారులు నిజమైన సంఘసేవకుల రీతిగా లేరు. వారు సర్కారు ఉద్యోగులు. సర్కారు ఉద్దేశములు దేశీయుల ఉద్దేశములు భేదించుచున్నవి. బ్రిటిషు ప్రభుత్వం వారు ఒక ప్రత్యేకోద్దేశంతోనే ఇప్పటి విద్యను నేర్పుచున్నారు. కనుక జాతీయాశయాలతో ప్రేరి

తులైన విద్యార్థులకూ, జాతీయతా వ్యతిరేకులయి సర్కారు ఆజ్ఞకులోబడు ఉపాధ్యాయులకూ మధ్య సంఘర్షణము జనించెను. విద్య నిమిత్తం, పిమ్మట జీవిత వృత్తి నిమిత్తం ప్రభుత్వము పైన ఆధార పడునంతవరకు దానితో పోరి నెగ్గుట విద్యార్థుల కసాధ్యము. అట్టి సర్కారుసంస్థలలో నుండి యే రాజకీయాలలో చిక్కుకొనుటవల్ల వారి విద్యాభ్యాసపు పటుత్వము తగ్గిపోవును. కనుక దేశబాధల వెల్లడించి, అందుకు పరిహారము పొందుటకుగాక, తమకిప్పటి విద్యలోని లోప ములను పోగొట్టుటకే విద్యార్థి సంఘములు...." అని గాంధీగారు—తమ నిర్మాణ కార్యక్రమ ములో-విద్యార్థి సంఘములనుగూర్చి వ్రాయుచు చెప్పియున్నారు.

---

## 7. యువజన సంఘములు

రాజకీయ సంచలనము తీవ్రముగానున్న సమయములో దేశమంతటా అనేక యువజన సంఘములు వెలసినవి. బానిసత్వ నిర్మూల నకూ, విజ్ఞాన ప్రచారమునకూ, రాజకీయ పరిజ్ఞానం కలిగించుటకూ ఇవి ఏర్పడినవి. కొన్ని ప్రదేశములలో ప్రత్యేక వృత్తులనుబట్టి, కులము లను పురస్కరించుకొని సంఘములు స్థాపించిరి. కొందరు యువకులు తమ రాజకీయోద్దేశములు, తమ దృక్పథము ననుసరించి కొన్ని భిన్న భిన్న సంఘములు ఏర్పచిరి.

యువజన సంఘములలో పాల్గొన్న వారంద రున్నూ కాంగ్రెసు, రైతు, విద్యార్థి సంఘములతో సంబంధమున్న యువకులు. అతివాద సంఘ ములు, రైతు సంఘములు, విద్యార్థి సంఘములు ప్రధానపాత్ర ధరించి, ప్రజాజీవిత రంగంలో పనిచేయ మొదలుపెట్టినప్పటి నుంచి, అందలి యువకులు ఆయా సంఘములలోనే పనిచేయ మొదలుపెట్టిరి. దేశస్వాతంత్ర్యము, జాతీయఐక్యం మొదలైన సదాదర్శములుగల ఈ సంఘము లన్నియు కులభేదములను పాటించరాదు.

పైని పేర్కొన్న సంఘములకు పూర్వము, సమిష్టిగా వాటి కార్యక్రమము యువజన సంఘ ములే నిర్వహించుచుండెడివి. అనేకులు యువ కులు వీటిలో పనిచేసిరి. కాట్రగడ్డ రాజగోపాల రావు, తాపీ మోహనరావుగార్లు మొదలైనవారు యువజన సంఘములలో అధికముగా పాల్గొని పనిచేయుచున్నారు.

యువజన సంఘములు ప్రజాహితైక జీవిత ములో ఉత్తమ భూమిక ధరించినవని చెప్ప వలెను!

---

జాతిశౌర్యమే తాండవింపగా
జాతి తేజమే దిక్కులబారగ
ఉబికుబికొచ్చే వేడిరక్తమున
వెలిగించండీ జ్ఞానజ్యోతిని;
స్వేచ్ఛాహోమపు సమిధలుగండీ,
యువకుల్లారా రండీ ముందుకు!

—కృత్తివాసతీర్థులు.

# 8. కులసంఘములు

విషయ సంగ్రహము :— ప్రతికులమందును కలుగుతూఉన్న సాంఘికాచార సంబంధములైన మార్పులవలన, ఆచారములను నియమబద్ధములుగా చేసుకొని తమ కులోన్నతికి పాటుపడవలెనన్న కోరిక అన్ని కులములవారికిని పుట్టినది ; తత్ఫలితముగా వైశ్య, మహాజన సంఘములు మొదలగునవి పుట్టినవి; 1910 ఆర్యవైశ్య మహాసభ ; నాటనుండిన్ని దానికి సంబంధించిన సంఘములు, సభలు; ఈ సంఘశ్రేయస్సుకై కృషిసల్పినవారు కీ. శే. ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజిగారు; 1926 లో సామి వేంకటాచలం చెట్టిగారు 'ఆర్యవైశ్య వ్యవస్థా వివక్షిణి' అనే గ్రంథము ప్రకటించినారు ; 1914 లో కమ్మ మహాజన సంఘము ; దీనికి 29 వేల రూ॥లకు పైగా మూలధనము ; 1920 లో రెడ్డిమహాజన సంఘము ; దీనికి 85 వేల రూ॥లకు పైగా మూలధనం; 1918 లో ఆంధ్రఅగ్నికుల క్షత్రియ మహాజన సంఘము ; ఈ కులసంఘములు తమ కులమువారికి చేస్తూఉన్న సేవ, ఉపకారము—.

ఆంధ్రదేశమున ఈ శతాబ్దిలో అనేక క్రొత్త క్రొత్త మార్పులు వచ్చినవి. దైనందిన జీవితములో రైళ్లు, కోర్టులు, కళాశాలలు మొదలైనవి ప్రాధాన్యము వహించినవి. ఈ క్రొత్త జీవితమువల్ల ప్రతికులములోను, మతములోను మార్పులు వచ్చినవి. జాతి కులధర్మములు మారుచుండుట గమనించి వాటిని సంస్కరించి, తమ ధర్మములను నియమబద్ధము జేసుకొన వలెనన్న కాంక్ష అందరిలోను అంకురించినది. దీనికి తోడు ప్రతికులమువారికిన్నీ తమ పిల్లలకు పాఠములు చెప్పుటకు తమకులమునందలి ఉపాధ్యాయులు కావలెననియు, తమ వ్యవహారముల నడపుటకు తమ కులమందలి ప్లీడర్లు కావలెననియు భావము లేర్పడినవి. దానితో ప్రతికులమువారు తమ సంస్థల స్థాపించి, తమ కులమువారి అభ్యున్నతికై కృషి చేయుటకు పూనుకొనిరి. తత్ఫలితముగా ఆంధ్రదేశములో వైశ్యమహాజన సంఘములు, కమ్మ మహాజన సంఘములు, రెడ్డి మహాజన సంఘములు మొదలైనవి వెలసినవి.

ఆర్యవైశ్య సంఘస్థులు, వైశ్య కులముయొక్క సాంఘిక నైతిక మత విద్యా విషయములలో అభివృద్ధిచెందవలెననియు, దేశములో కృషి-వాణిజ్యములలో పెంపుగాంచి, ధనాభివృద్ధి గలిగియుండవలెననియు లక్ష్యములుగా పెట్టుకొని, 1910 సంవత్సరమున "ఆర్యవైశ్య మహాసభ" జరిపిరి. అప్పటినుండియు ఆంధ్రదేశమున అనేక ప్రాంతముల ఆర్యవైశ్య సంఘములు వెలయుచు, నేటికి ప్రతి గ్రామమునను అల్లుకొనిపోయినవి. ఈ సంఘమువారు అనేకవేల రూపాయల ధనము ప్రోవుచేసి, బీద విద్యార్థులకు ఉచిత విద్య నిప్పించుట, సత్రములు నిర్మించుట, అన్నదాన సమాజములు స్థాపించుట, ఆలయ నిర్మాణము గావించుట మొదలైన అనేక సత్కార్యములను చేసిరి. ఆదిలో ఈ సంఘ శ్రేయస్సుకై కృషి సల్పినవారు కీ. శే. ఆత్మూరి లక్ష్మీనర్సింహ సోమయాజిగారు. ఆర్యవైశ్య సంఘమునకు సంబంధించిన సర్వవివరణములను తెలుపుచూ, సామి వేంకటాచలం చెట్టిగారు 'ఆర్యవైశ్య వ్యవస్థావివక్షిణి' అనే గ్రంథమును వ్రాసి, 1926 లో ప్రకటించినారు.

కమ్మ మహాజనులలో ప్రబోధముచేసి వారి నైతిక, వ్యావసాయిక, పారిశ్రామిక, శాస్త్రీయ విద్యాభివృద్ధి చేయుటకు, దురాచారములు తొలగించుటకు, కమ్మ మహాజన సభలు జరుపుటకు "కమ్మ మహాజన సంఘము" ఏర్పాటు చేయబడి

నది. (1914). ఈ సంస్థకు రు 29,000 లకుపైగా మూలధనము కలదు. సంఘమువారి యాజమాన్యముక్రింద ఇప్పటికి 14 మహాజన సభలు జరిగినవి.

కమ్మ సంఘములో వీరు ముఖ్యముగా ప్రశంసనీయమైన విద్యావిషయిక కృషి చేయుచున్నారు. ఇప్పటికి వేతనములు పొందిన విద్యార్థుల సంఖ్య 1433. ఈ సంస్థకు బెజవాడ, గుంటూరు మొదలైన పట్నములలో స్వంత భవనములున్నవి. వేతనములు ఒక్క మద్రాసు రాష్ట్రములోని విద్యార్థులకేగాక మైసూరు, నిజామురాష్ట్రములలోని విద్యార్థులకుగూడా నిచ్చుచున్నారు. ఇప్పటికి వేతనముల మూలమున వెచ్చింపబడిన ధనము రు 26,425 లు. కమ్మ సంఘీయుల అభివృద్ధికి కృషిచేయుటే దీని ముఖ్య ఆదర్శము.

పై సంఘమువలెనే రెడ్డి మహాజనుల అభ్యుదయమునే వాంఛించుచూ 1920 సంవత్సరములో రెడ్డి మహాజన సంఘము స్థాపించబడినది. రెడ్డి విద్యార్థులకు సాయపడుటకు వసతి గృహముల నిర్వహించుట, సంఘశ్రేయస్సుకై సద్గ్రంథ ప్రకటన, వివిధ అంతశ్శాఖలలోని భేదముల నివారించుట—ఈ సంఘ ప్రధానాశయములు. ఈ సంఘమువారి కార్యరంగములో మద్రాసు రాష్ట్రమే కాకుండా హైదరాబాదు గూడా చేరియున్నది. సంస్థకు రు 85,800 ల మూల ధనమున్నది. విద్యార్థి వేతనములక్రింద సంవత్సరమునకు అయిదువేల రూపాయిలు వెచ్చించుచున్నారు. వీరున్నూ వార్షిక సమావేశములు నేటేటా జరిపెదరు.

సంఘీభావముతో తమ కులాభివృద్ధికి పాటుబడుటకై 1918 సంవత్సరములో ఆంధ్ర అగ్నికుల క్షత్రియ మహాజన సంఘము, రావుసాహెబు పెర్సింగు వెంకటరంగయ్యగారి అధ్యక్షతక్రింద స్థాపించబడినది. 1885 సంవత్సరమున దక్షిణార్కాటు జిల్లా పరింపేటలో డాక్టరు పి. గురుస్వామి రాయరుగారి నాయకత్వమున 'అగ్నికుల క్షత్రియ సంఘము' అను పేరుతో ఈ జాతి సంస్థ అభివృద్ధిచెంది, పై పేర్కొనినట్లు మహాజన సంఘమైనది. వీరునూ అనేకచోట్ల విద్యార్థులకు వసతిగృహము లేర్పరచియు, వేతనము లిచ్చియు తోడ్పడుచున్నారు. పెర్సింగు వెంకటనారాయణగారు ఈ సంఘ కార్యదర్శి.

ఇట్లే ఇతర కులములకు జెందినవారు తమ తమ సంఘస్థుల శ్రేయస్సును వాంఛించుచూ పనిచేయుచున్నారు. గానీ, కొన్ని కొన్ని ప్రాంతములలో ఈ సంఘములు గమ్యస్థానమున వక్రించి, కులకక్ష్యలకు త్రోవతీయుటయు తటస్థించుచుండుట పరితాపకరమైన విషయము. ఎవరి అభివృద్ధికి వారు పాటుబడుట తప్పుకాదుగానీ, కుల భేదముల పెట్టుకొనుట కూడదు. "వెన్నా మీగడ వంటి శబ్దముల నొప్పు" నట్లు అన్ని కులముల వారు ఐక్యముగలిగి ఆశయసిద్ధికి యత్నించుట శుభకరము!



# 9. నిర్మాణ కార్యక్రమము

భారతదేశ స్వాతంత్ర్యోద్యమమును కొనసాగించుచున్న ఈరోజులలో నిర్మాణకార్యక్రమము యొక్క ప్రాముఖ్యము అనిర్వచనీయమైనది. సంఘ వివక్షతలు పాటించకుండా, దాస్యశృంఖలావిచ్ఛేదన కొరకు ప్రతి భారతీయుడు కృషి చేయుచున్నాడు.

గాంధీ మహాత్ముడు, అసహాయోద్యమ కార్యక్రమము, రాజకీయాందోళనలతో పాటు నిర్మాణ కార్యక్రమమును గూడా సూచించి, సత్యాగ్రహముకు—స్వాతంత్ర్యోద్యమమునకును గలసంబంధమును నిరూపించి, జీవితరంగములన్నిటిని దానిలో నిమిడ్చి, ప్రతి భారతీయునకు అనుగుణముగా దానిలో అన్ని అంశములకున్నూ అభివృద్ధిని సూచించు ఏర్పాట్లు చేసియున్నాడు.

సాంఘికమైత్రి, అస్పృశ్యతానివారణ, త్రాగుడు నిషేధము, ఖాదీ-గ్రామ పరిశ్రమలు, గ్రామపరిశుద్ధి, వయోజన విద్య మొదలైనవన్నియు అందలి ప్రధాన ఖండములు.

అస్పృశ్యతానివారణకు హరిజన సేవాసంఘములు; మన గ్రామములు స్వయంపోషకములుగా నుండుటకు, జీర్ణించి పోవుచున్న గ్రామ పరిశ్రమలను పునరుద్ధరించుటకు (అనగా నేత, కమ్మరి, కుమ్మరి, వడ్రంగము మొదలైనవన్నీ), ఖద్దరు వ్యాపకము మొదలైన కార్యక్రమము ఏర్పరచ బడియున్నది. గాంధీగారు, 13 అంగాలుగల నిర్మాణ కార్యక్రమమును, 18-8-1940 తేదీ హరిజన పత్రికలో వివరించియున్నారు.

క్రింద వివరించు—ఖద్దరు, హరిజనసేవ, వయోజన విద్య మొదలైన వన్నియు ఈ నిర్మాణ కార్యక్రమములోని భాగములే.

## (అ) హరిజనోద్యమము

విషయ సంగ్రహము :— హరిజనులను అస్పృశ్యులుగ నెంచు ఆచారము కొంతకాలమయి ఏర్పడియున్నది ; ఇది ఆచారమేకాని శాస్త్రసమ్మతముకాదు; హరిజనుల బాధలు; వారిలో జాతీయోద్యమమువల్ల కలిగిన ప్రబోధము; డాక్టర్ అంబేద్కర్ నిమ్నజాతులకు ప్రత్యేక నియోజన వర్గాధికారము కోరుటను ప్రతిఘటించుచు గాంధీమహాత్ముని ప్రాయోపవేశము; ఆంధ్రదేశమున హరిజనోద్యమము వీరేశలింగం, వేంకటరత్నంనాయుడుగార్లే ప్రారంభించియుండిరి; దానికి మహాత్ముని ఉద్యమము తోడయినది ; 1932 ఆంధ్రరాష్ట్ర అస్పృశ్య సేవాసంఘము—అఖిల భారత హరిజనసేవాసంఘమునకు ఆంధ్రశాఖగా ఏర్పడినది ; ఇందలి ప్రచారకులు ; హరిజననిధి ; హరిజన యాత్రలు ; తిరువాన్కూరు యాత్రలు ; అక్కడి దేవాలయములలోనికి హరిజనులు ప్రవేశించుటకుండిన నిర్బంధము తొలగిపోవుట ; ఆంధ్రదేశమందలి హరిజనుల సంఖ్యలు ; హరిజనులలో విద్యావ్యాప్తికిగల నేటి సౌకర్యములు ; మహాత్ముని హరిజన యాత్ర, మహాత్ముని హితవాక్యములు—.

సాంఘిక జీవితమును భయంకర మొనర్చి, ఐక్యము నిర్మూలించి మాలలనీ, మాదిగలనీ అంటరాని తనమును సృష్టించిన హింసాత్మకమైన పెను భూతము—హిందూ సంప్రదాయము. ఇది నింద్యమైన పరిగణన. దీనిని మతాచారమనుటకన్న అసత్యము మరియొకటి లేదు. అసలు సవర్ణులచే, మాలమాదిగ లంటరానివారిగా నెంచబడుచున్నప్పుడు, వీరిలో కొన్ని శాఖలవారు (మాలలు, మాదిగలు, శబరులు) ఇంకొక శాఖవారిని అస్పృశ్యులుగా నెంచుచున్నారు. ఈ అంటరానితనము వేళ్లు పాతుకపోయినది. నీచము, మలినమని సవర్ణు లెంచు వృత్తులే ఈ నిమ్నజాతుల వృత్తులై, వారికి సంఘమున 'చ్యుతి' కలిగించినది.

**హరిజనులలో ప్రబోధము-ప్రారంభ దశ**

దానితో వారికి దేవాలయములు, బడులు, నూతులు, చెరువులు మొదయిన చోట్ల అర్హత పోయినది. పాఠశాలలు మొదలయిన వానిలో ప్రవేశము, సంఘములో తగిన స్థానము లేక పోవుటచేత వీరు విద్యా విషయికముగా వెనుకబడి బీదలై, సంఘములో ఉన్నతస్థానమును కోల్పోయిరి. సంఘములో వీరికున్న బాధలు, కష్టములు అనిర్వచనీయములు. హరిజనులు తరతర



**మహాత్ముడు 1933 సం॥లో ఆంధ్రదేశ హరిజన యాత్రకు బయలుదేరుట.**

ములుగా బాధపడుచు, హీనులమను భావముతో త్రాగుడు మొదలైన కొన్ని దురభ్యాసముల పాలైనారు. అంటరానితనము నిర్మూలించి, నిమ్నజాతులను సంస్కరించుట ప్రతి జాతీయ సేవకుని కర్తవ్యము!

మానవులందరినీ భగవంతుడు సమాన హక్కులతో సృష్టించి యున్నాడు. ఆ దివ్యసృష్టిలో హెచ్చు తగ్గులు, అంట తగినవారు, అంటరానివారు అను వివక్షతలు లేవు. మన మందరము హరిజనులము ; అనగా హరికి జెందిన మనుష్యులము. సంఘములో ఏర్పడిన అంటరానివారనే ఈ కాలుష్యమును తుడిచివేసుకొనవలెనని మహాత్ముడు ఉద్బోధించుచు, అస్పృశ్యతానివారణకు కృషి జేయుచున్న మాట జగద్విదితమే కదా!

రెండవ రౌండు టేబిల్ సభకు, నిమ్నజాతి ప్రతినిధులుగా వెళ్లిన డా॥ అంబేద్కర్ మొదలయినవారు, నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గములు ఇవ్వవలసినదిగా ప్రభుత్వము వారిని కోరిరి. దీనికి గాంధీగారు ఎంత మాత్రమూ అంగీకరించ లేదు. అస్పృశ్యులు హిందూ సంఘములో ఒక శాఖ అనిన్నీ, హిందూ సంఘసౌష్ఠవమునకు

**మహాత్ముడు-హరిజనుల సేవ**

గానీ, భారతదేశ పురోభివృద్ధికి గానీ ప్రత్యేక నియోజక వర్గములు హానికరములనిన్నీ, నిమ్నజాతులకు అట్టి ఏర్పాటులు చేసిన తన ప్రాణముసైనా అర్పించి దానిని ప్రతిఘటింప సిద్ధముగా నుంటిననని ఆయనచెప్పెను. తరువాత కమ్యూనల్ ఎవార్డు ప్రసాదించబడి, నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గములే గత్యంతరములని నిర్ణయింపబడుటచేత, మహాత్ముడు దానిని ప్రతిఘటించుచు ప్రాయోపవేశము చేయసంకల్పించితి నని, లేఖాముఖమున మాక్డొనాల్డ్ మంత్రికి తెలిపెను. ప్రతిజ్ఞాపాలకుడగు మహాత్ముడు 1932 అక్టోబరు 26 వ తేదీన, తన నిశ్చయానుసారము ప్రాయోపవేశమును ప్రారంభించెను. అంతటితో ప్రపంచమంతటినీ గాంధీ ప్రాయోపవేశము కళవర పరచినది. ఆంగ్లేయ ప్రభుత్వమువారు కూడా మహాత్ముని ప్రభావమును గుర్తెరిగి, తమ దృక్పథమును మార్చుకొని, నిమ్నసంఘీయులకు ప్రత్యేక ప్రాతినిధ్య ముండనక్కరలేదని నిశ్చయించిరి. 1932 సెప్టెంబరు 7 వ తేదీన గాంధీమహాత్ముడు తన ప్రాయోపవేశ ఉపసంహారమును శ్రీ సప్రూ, జయకర్, అంబేద్కరు, సరోజిని, రవీంద్రుల సమక్షములో జరిపెను. తరువాత, మహాత్ముడు పూనా ఒడంబడిక పిమ్మట హరిజనోద్యమమునకు కృషిచేయ మొదలుపెట్టెను.

ఆధునికాంధ్ర జాతి వికాసమునకు మూల పురుషులగు వీరేశలింగంగారు వెదజల్లిన సంఘసంస్కరణ బీజములు, యుగపురుషుడగు మహాత్ముని పిలుపు నందుకొని అస్పృశ్యతా నివారణమునకు అనుకూల వాతావరణము సృష్టించెను. మహాత్ముని చరిత్రాత్మకమగు ప్రాయోపవేశము సహజ సంస్కరణాభిలాషులగు ఆంధ్రుల నాకర్షించి, అమానుషాచారమైన

అస్పృశ్యతను నివారించు ప్రయత్నములకు పురికొల్పెను.

**ఆంధ్రి దేశమున హరిజనోద్యమము- ఆంధ్ర-రాష్ట్ర హరిజన సేవా సంఘము**

యేలూరులో జరిగిన సప్తమ ఆదిమాంధ్రి సభయందు సమిష్టి నియోజకవర్గముల బలపరచుచు, మహాత్ముని యందు సంపూర్ణ విశ్వాసము ప్రకటించబడి, పూనా ఒడంబడిక కూడా ఆమోదించబడినది. ఈ సమయముననే ఆంధ్రిరాష్ట్రి అస్పృశ్య నివారణ సభ, విజయవాడలో ఆంధ్రిభీష్మ న్యాపతి సుబ్బారావు పంతులుగారి అధ్యక్షత క్రింద జరిగి, ఆంధ్రిరాష్ట్రి అస్పృశ్య సేవా సంఘము 16-10-32 తేదీన నిర్మించబడెను. దానికి దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు అధ్యక్షులుగను, మాగంటి బాపినీడుగారు ప్రధాన కార్యదర్శిగను, నరాల శెట్టి దేవేంద్రుడు, వేముల కూర్మయ్యగార్లు (హరిజనులు) సంయుక్త కార్యదర్శులుగాను ఎన్నుకొనబడిరి. ఈ సంఘము అఖిల భారత హరిజన సేవాసంఘమునకు ఆంధ్రి శాఖగా చేర్చుకొనబడినది. రాష్ట్రి సంఘమునకు అనుబంధముగా జిల్లాసంఘములున్నవి. మాగంటి బాపినీడుగారితో సంయుక్త కార్యదర్శిగా ఇప్పుడు బి. ఎస్. మూర్తిగారున్నారు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్థానమున వేమవరపు రామదాసు పంతులుగారు అధ్యక్షులైరి.

**ఆంధ్రిదేశము- అస్పృశ్య నివారణ- హరిజనోద్యమప్రచారము ప్రచారకులు**

అస్పృశ్యతా నివారణోద్యమమునకు మహాత్మని ఆంధ్రిరాష్ట్రి హరిజన యాత్ర (1933) కొంత బలమిచ్చినది. అంతియగాక రాజకీయ సభలలో, ఆస్తిక మహాసభలలో అస్పృశ్యతా నివారణము గూర్చి ఆందోళన చేయబడుచున్నది. వీరేశలింగం పంతులుగారు, చి|| లక్ష్మీనరసింహంగారు ఆది ఆంధ్రులకు పాఠశాలల పెట్టిరి. పిఠాపురం రాజాగారి కళాశాలలో ఆదిఆంధ్రులకు ప్రవేశమిచ్చిరి. గుడివాడలో గూడూరు రామచంద్రా రెడ్డిగారు సేవాశ్రమము నెలకొల్పిరి. ఈ ఉద్యమమునకు పెదపాలెములో నల్లపాటి హనుమంతరావుగారు, బందరులో వేమూరి రాంజీరావుగారు, మోచెర్ల రామచంద్రరావుగారు, డా|| జోగయ్య శర్మగారు సర్వవిధముల తోడ్పడిరి.

*హరిజన యాత్రకు ముందు మహాత్ముని సందేశము.

My dear Bapineedu,
Please tell all the workers that I expect great things from Andhradesh not merely fat donations but also many pure-hearted and self-sacrificing servants of Harijans.
Yours [illegible]
26/11/33 Bapu

* నా ప్రియమైన బాపినీడూ: నేను, గొప్ప విరాళములు, హృదయ పూర్వకమగు త్యాగశక్తి గలిగిన హరిజన సేవకులనే కాకుండా ఇంకను అనేక విశేష కార్యములను ఆంధ్ర దేశమునుండి కోరుచున్నానని సహచరులందరికీ చెప్పుము.

ఇట్లు
26-11-33. 'బాపు'



వేనకువేలు ప్రజలు మహాత్ముని ఉపన్యాసమధువును గ్రోలుచుండుట.

బ్ర॥ శ్రీ॥ బం డమల్లి మల్లయ్య శాస్త్రిగారు, నరాలశెట్టి దేవేంద్రుడుగారు, కుసుమ ధర్మన్న కవిగారు, ఉండూరి సుబ్బారావుగారు, రాయుడు గంగయ్యగారు, మంగళగిరి రాఘవదాసు గారు సాకేటి గురువులు గారు, కుసుమ వెంకట్రాయుడు గారు, వెన్నేటి సత్యనారాయణ గారు, తలారి గోపాలరావు నాయుడుగారు, దుగ్గిరాల సూర్యప్రకాశరావు గారు, తల్లాప్రగడ నరసింహాశర్మగారు, అన్నదాత ఆదినారాయణగారు, స్వామి నారాయణానందగారు, కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు, ఉన్నవ లక్ష్మీనారాయణగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు, రాయసం వెంకటశివుడుగారు, కల్లూరి సుబ్బారావుగారు, ఆచార్య రంగాగారు మొ॥వారు ప్రచారములో పాల్గొని ఉద్యమమును వికసింపజేసిరి. కవుతం షణ్ముఖము గారు తమ నందనారు హరికథలతోను, చెరుకువాడ నరసింహంపంతులుగారు హాస్యరసోక్తియుక్తములైన ప్రసంగములతోను, మాగంటి బాపినీడుగారు మ్యాజిక్ లాంతరు ఉపన్యాసములతోను ప్రజాదృష్టి నీవిషయముపై మరల్చిరి. మంగిపూడి వేంకటశర్మగారు నిరుద్ధభారతమును రచించి, హరిజనుల దైన్యస్థితి—రాతిబొమ్మైన కన్నీరు రాల్చునటుల— చిత్రించి, హరిజనాభ్యుదయమునకై పాటుపడిరి.



సభలో మహాత్ముడు హరిజన ప్రబోధము గావించుచుండుట.

ఉత్సాహముగల యువకులతో యాత్రలు, సేవాదళములు బయలుదేరి పాటలుపాడుచు, ఉపదేశములను ఉద్బోధించుచు, ప్రదర్శనముల నేర్పాటు చేయుచు దేశములోని పల్లెపల్లెలకువెళ్లి సంచారము చేసెను.

హరిజన యాత్రలు- ఇట్టివి ప్రథమమున తల్లాప్రగడ తిరువాన్కూరుయాత్ర నర్సింహాశర్మ గారిచే నర్సాపురం తాలూకాలో జరుపబడెను. ఆంధ్ర



శ్రీ మాగంటి బాపినీడు,
ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవాసంఘ కార్యదర్శి.

దేశమునే హరిజనులు, సవర్ణ హిందువులు గలసి 149 స్థలములయందు సంయుక్తభజనలు చేసిరి. మొత్తము మీద ఈ ఉద్యమ ఫలితముగా హరిజనులకు ఆలయప్రవేశము లభించి, వారికిగల ఆలయప్రవేశార్హత స్థిరపడినది. నూతులు, చెరువులు సవర్ణులతోపాటు హరిజనులు ఉపయోగించుకొనుట ఆరంభమై, సవర్ణుల దృక్పథములో కొంత మార్పు వచ్చినది. హరిజనులకై ప్రత్యేకముగా హరిజనసేవా సంఘమువారు 53 నూతులను, రెండు చెరువులను త్రవ్వించి సాయపడిరి. శ్రీ పద్మనాభదాస వంచిపాల సర్ బలరామవర్మ—తిరువాన్కూరు మహారాజు—తన రాజ్యమందలి దేవాలయము లన్నిటిలో నూ సమస్త హిందువులకు సమానముగ దర్శనపూజా ప్రసాద స్వీకరణాది హక్కులను కలిగించుచు మహోత్కృష్టమైన ప్రకటన చేసెను. దీనితో అక్కడ హిందూమత మాలిన్యము, నికృష్టావస్థ రూపుమాసెను. ఆదర్శవంతమైన ఆ యాలయముల సంస్కరణ ఫలితముల దర్శించుటకై 'ఆంధ్రహరిజన తిరువాన్కూరు యాత్ర'ను హరిజన నాయకులు చేసి వచ్చిరి.



డా. ఘంటశాల సీతారామశర్మ,
ప. కృ. జిల్లా హ. సేవా సంఘ కార్యదర్శి.



కీ. శే. శ్రీ మండపాక రంగయ్య,
తూ. గో. జిల్లా హ. సేవా సంఘ కార్యదర్శిగా నుండిరి.

ఆంధ్ర దేశములో—విశాఖపట్నం జిల్లాలో నూటికి 10 మంది, తూర్పు గోదావరి జిల్లాలో నూటికి 21 మంది, పశ్చిమ గోదావరి జిల్లాలో నూటికి 20 మంది, కృష్ణా జిల్లాలో నూటికి 16 మంది, గుంటూరు జిల్లాలో నూటికి 8 మంది, నెల్లూరు జిల్లాలో నూటికి 18 మంది, కడప జిల్లాలో నూటికి 12 మంది, కర్నూలు జిల్లాలో నూటికి 11 మంది, బళ్లారి జిల్లాలో నూటికి 11 మంది, అనంతపురం జిల్లాలో నూటికి 11 మంది, చిత్తూరు జిల్లాలో నూటికి 17 మంది చొప్పున—జనసంఖ్యలో హరిజనులున్నారు. వీరిలో విద్యా విషయిక కృషి, ముఖ్యముగా ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవాసంఘమువారి ద్వారా జరుగు

ఆంధ్ర దేశములోని హరిజనులు



శ్రీ తాడిమేటి కుటుంబశాస్త్రి,
ప. గో. జిల్లా హ. సేవా సంఘ కార్యదర్శి.



శ్రీ వీరపనేని గోపాలకృష్ణయ్య.
తూ. కృ. జిల్లా హ. సేవా సంఘ కార్యదర్శి.

చున్నది. ఆంధ్రి రాష్ట్రి హరిజన సేవా సంఘము వారి యాజమాన్యము క్రింద 27 వసతి గృహాము లున్నవి. వానిలో 4 ప్రత్యేకముగా లా, ఇంజనీరింగ్, వైద్యము మొ॥గు ఉన్నత పరీక్షలు స్త్రీల కొరకు ఏర్పరచ బడినవి. వ్యవసాయిక పరీక్షలకు చదువుటకు హరిజన విద్యార్థులకు అవకాశములు ఏర్పడినవి. విద్యార్థులకు, విద్యార్థినులకు వసతి గృహములలో భోజన సౌకర్యములు కల్పించియు, ఉచిత వేతనములు ఇచ్చియు తోడ్పడుచున్నారు. కొన్నికొన్ని ప్రాంతముల వృత్తి పాఠశాలలు, రాత్రి-పగటి పాఠశాలు, విద్య నేర్పు పాఠశాలలు నడిపిరి. కొన్ని జిల్లాబోర్డు పాఠశాలలలో హరిజనులకు ఉచితవిద్య నిచ్చుచున్నారు.



శ్రీ భూత రాజారావు. హ. సే. సంఘ గాంధీ విద్యార్థి వేతనముతో ఉన్నత న్యాయపట్టమును పొంది, జిల్లా పంచాయతీ ఆఫీసరు పదవియం దున్నారు.

**ఆంధ్రి హరిజనసేవా సంఘ కృషి- విద్యావ్యాప్తి**

చాలమంది హరిజనులు ఉన్నత పదవులలో నుండుట ముదావహము. హరిజన విద్యార్థులకు వసతి గృహములతో పాటు గ్రంథాలయములుగూడా ఏర్పరచబడినవి. నాగేశ్వరరావు పంతులుగారు హరిజన నాయకులకు, గ్రంథాలయములకు ఉచితముగా పత్రికలను, ప్రచురణములను ఇచ్చి తోడ్పడిరి. మాగంటి బాపినీడుగారు ఏడువేల గ్రంథములకుపైగా సేకరించి గ్రంథాలయముల కిచ్చిరి. అ నేకులు



శ్రీ. బి. ఎస్. మూర్తి బి.ఏ., బి.ఇడి.,
మాజీ పార్లమెంటరీ కార్యదర్శి, రాష్ట్ర సంఘ స. కార్యదర్శి

ఈ ఉద్యమమునకు పలువిధముల సాయపడిరి. హరిజనాభ్యుదయమునకై రాష్ట్రి సంఘము చేయుచున్న కృషిని గుర్తించి, మద్రాసు ప్రభుత్వము హరిజన వసతి గృహములకు కొన్ని గ్రాంటులను, హరిజనులకు రాష్ట్రి సంఘములలోను, పాలనా నిర్వాహక సంఘములలోను సభ్యత్వమును ఇచ్చెను. భారతదేశపు హరిజన బాలికా వసతిగృహములలో ఆంధ్రిదేశ హరిజన బాలికా వసతి గృహములదే ప్రధాన స్థానము. ఆంధ్రిరాష్ట్రి హరిజన సేవాసంఘము హరిజనుల అభ్యున్నతికై అన్నివిధముల కృషిచేయుచున్నది.

### ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవా సంఘమువారి యాజమాన్యము నందలి వసతి గృహములు

#### తూర్పు గోదావరి జిల్లా

| | | | సంఖ్య |
|---|---|---|---|
| 1 | హరిజన విద్యార్థుల వసతి గృహము | కాకినాడ | 34 |
| 2 | ,, విద్యార్థినుల ,, | ,, | 22 |

#### పశ్చిమ గోదావరి జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1 | హరిజన విద్యార్థుల వసతి గృహము | తణుకు | 32 |
| 2 | ,, ,, ,, | నిడదవోలు | 19 |
| 3 | ,, ,, ,, | నర్సాపురం | 28 |
| 4 | ,, విద్యార్థినుల ,, | ఏలూరు | 24 |

#### పశ్చిమ కృష్ణా జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1 | హరిజన విద్యార్థుల వసతి గృహము | గుడివాడ | 54 |
| 2 | ,, ,, ,, | పెడసనగల్లు | 24 |

#### నెల్లూరు జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1 | హరిజన విద్యార్థుల వసతి గృహము | బుచ్చిరెడ్డిపాలెం | 46 |
| 2 | ,, విద్యార్థినుల ,, | నెల్లూరు | 11 |
| 3 | ,, విద్యార్థుల ,, | కందుకూరు | 11 |

#### గుంటూరు జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1 | హరిజనవిద్యార్థుల వసతి గృహము | బ్రాహ్మణకోడూరు | 20 |
| 2 | ,, ,, ,, | గురిజాల | 48 |
| 3 | ,, ,, ,, | సంతనూతలపాడు | 15 |
| 4 | ,, ,, ,, | సత్తెనపల్లి | 10 |
| 5 | ,, ,, ,, | గుంటూరు | 18 |
| 6 | శ్రీ కృష్ణాశ్రమ వసతి గృహము | ,, | 40 |
| 7 | హరిజన విద్యార్థుల వసతి గృహము | పెదనందిపాడు | 24 |

#### అనంతపురం జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1 | హరిజన విద్యార్థుల వసతిగృహము | పురవకొండ | 33 |
| 2 | శ్రీ కేశవ విద్యానికేతనము | అనంతపురం | 25 |

#### కడప జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1 | హరిజన విద్యార్థి వసతి గృహము | కడప | 22 |

#### చిత్తురు జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1 | హరిజన విద్యార్థి వసతి గృహము | తిరుపతి | 34 |

#### కర్నూలు జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1 | హరిజన విద్యార్థి వసతి గృహము | కర్నూలు | 15 |
| 23 | | | 609 |



ఏలూరు హరిజన బాలికల వసతిగృహము. ప. గో. జిల్లా హరిజన సేవా సంఘమువారిచే నడుపబడుచున్నది : హిందూదేశమున హరిజన సేవాసంఘము వారిచే మొదట స్థాపించబడిన దిదియే.



హరిజన బాలుర వసతిగృహము, అనంతపురము.

## మహాత్ముని హరిజన యాత్ర

మహాత్ముడు అఖిలభారత హరిజన యాత్ర 1933 వ సం॥ నవంబరు 8 న మొదలు పెట్టి—జూలై నెలాఖరువరకు వివిధ రాష్ట్రములలో సాగింపవలెనని సంకల్పించి—16-12-33 వ తేదీనుండి 4-1-34 తేదీ వరకు ఆంధ్రదేశమున సంచారము చేసెను. ఆ సంచార ఫలితముగా ఆంధ్రరాష్ట్ర హరిజనోద్యమము బలపడినదని యిదివరలోనే చెప్పియుంటిమి. అస్పృశ్యతా నివారణమునకై ప్రబోధముగావించుచు మొత్తము 10 జిల్లాలు సంచారము చేసెను. 1024 మైళ్లు రైలు మీదను, 662 మైళ్లు మోటారు మీదను, 15 మైళ్లు స్టీములాంచీల మీదను, 2 మైళ్లు కాలినడక మీదను—మొత్తము 1708 మైళ్లు సంచారము చేసెను. 76 గ్రామములు, పట్టణములు దర్శించెను. 60 సభలలో ఉపన్యసించెను. 620000 మందికి వారి ఉపన్యాసము వినుటకు అవకాశము కలిగెను. దాదాపు 120000 మందికి వారిని దర్శించు భాగ్యము కలిగెను. యాత్ర మొత్తముపై రమారమి 69000 రూపాయలు హరిజన నిధికి సేకరించెను. ఈ మొత్తపు నిధిలో సుమారు 50000 రూపాయలు జిల్లా సంఘములకు వచ్చెను. మహాత్ముని ప్రబోధము, మహితదీక్ష ఉద్యమముపట్ల అనుకూల వాతావరణ మేర్పరచి ప్రజలలో తీవ్రసంచలనము కలిగించెను.

## మహాత్ముని హరిజన నిధి

### వివిధ జిల్లాలలో విరాళములు, ఖర్చులు

| జిల్లా పేరు | రొక్క రూపమున | నగల రూపమున | మొత్తము జమ | ఆహ్వాన సంఘమువారు చేసిన ఖర్చు | నూటికి 75 వంతున జిల్లాలకువచ్చు మొత్తం |
|---|---|---|---|---|---|
| విశాఖపట్నం | 7538 | 838 | 8376 | 87 | 6283 |
| తూ. గోదావరి | 7257 | 443 | 7700 | 105 | 5775 |
| ప. గోదావరి | 8186 | 2315 | 10501 | 243 | 7876 |
| ప. కృష్ణా | 5988 | 1387 | 7375 | 476 | 5532 |
| తూ. కృష్ణా | 3855 | 1172 | 5027 | 396 | 3770 |
| గుంటూరు | 6997 | 1035 | 8032 | 696 | 6025 |
| నెల్లూరు | 10682 | 1576 | 12258 | 496 | 9193 |
| చిత్తూరు | 1308 | — | 1308 | — | 981 |
| కడప | 1423 | 49 | 1472 | — | 1104 |
| అనంతపురం | 5389 | 434 | 5823 | — | 4368 |
| | 58628 | 9252 | 67881 | 2503 | 50910 |
| రాష్ట్రసంఘము | 549 | | 549 | 408 | |
| | 59177 | 9252 | 68430 | 2911 | 50910 |



శ్రీ వేముల కూర్మయ్య, శ్యామలాదేవి దంపతులు బెజవాడలో నడుపుచున్న హరిజన బాలికల వసతిగృహము.



ఆంధ్రరాష్ట్ర హరిజన సేవాసంఘ పక్షమున హరిజన నాయకులు. సేవకులు తిరువాన్కూరు హరిజన దేవాలయ ప్రవేశము సందర్భములో (1938). మాగంటి బాపినీడుగారి నాయకత్వముక్రింద అచటికి యాత్రచేయుట.



చెన్నపురి ఆంధ్ర మహాసభా రజతోత్సవ సందర్భమున హరిజన నాయకులకు, సేవకులకు సన్మానమిచ్చిన దృశ్యము.

మహాత్ముడు హిందూపురమునందు తన సంచారమును ముగించి, ఆంధ్రులకు అమూల్య సలహాల నొసంగుచు యిచ్చిన ఉపన్యాసములలోని కొన్ని అంశములను ఉదాహరించుట అవసరము. “నా ఆంధ్రదేశ పర్యటనము ముగియుచున్నది. గంజాం, కర్నూలు జిల్లాలు తప్ప మిగతా జిల్లాలలో పర్యటనము సల్పితిని. ఈ పర్యటనమున హరిజన నిధికై సుమారు అరువదివేలరూపాయలు సంపాదింప గల్గితిని. ఈ అస్పృశ్యతా పెనుభూతమును నేడే పారద్రోలుడని భారతీయులతో నేను మొరపెట్టుచున్నాను. నేను ఆంధ్ర దేశమున లక్షలకొలది జనులనుచూచి యుంటిని. అస్పృశ్యతా పెనుభూతము మరణశయ్యయందు మూల్గుచున్నదని నాకు ధృడమైనది. నా అభిప్రాయము సత్యమో, అసత్యమో ధృవపరచు భారము మీపై నున్నది. మీరందరునూ అస్పృశ్యతాభావమును మీహృదయక్షేత్రములనుండి పెకలించి వేయుదురని సంపూర్ణముగా విశ్వశించుచున్నాను. ఈశ్వర సృష్టి విచిత్రమైన దనుటకు సందియము లేదుగానీ, ఆసృష్టియందు ఉచ్చ, నీచ భావములు గలవని ఎవరును చెప్పజాలరు. భగవత్సృష్టిలో వృక్షమునకు అసంఖ్యాకములగు ఆకులు కలవుగదా! అందొకయాకు గొప్పది, రెండవ యాకు తక్కువదని ఎవరైనను నుడువగలరా? దేవుడు మానవుల నందరిని సమానహక్కులతో సృష్టించి యున్నాడు. మన మావిషయము గుర్తెరింగి, హరిజనులపట్ల భేదభావముల నిర్మూలించిన, అంతఃకలహములు నశింపగలవు.”

ఆంధ్ర దేశమున అత్యధికమయిన భావోద్రేకమును, శ్రద్ధాభక్తులును గలవు. శ్రద్ధాభక్తులతోపాటు విమర్శనా యుక్తమైన జ్ఞానమును సంపాదింప గోరుచున్నాను. మీ రట్టి జ్ఞానమును సంపాదింప గలిగినచో మీశక్తి ఇనుమడించ గలదు. అప్పుడే మీరుచేసిన సేవ సార్థకమై, ప్రయోజనకారికాగలదు!”

—○—

మాల మెట్టిన నేల—మాలముట్టిన సీమ
మాలపాడిన పాట—మాలలాడిన మాట
మైలపడెనంటారు—పనికిరాదంటారు
నీగుడికిరానీరు—నినువేడికోనీరు
నిన్ను రాతిగజేసి నిలుపుకున్నారు
గుడిలోనిదైవమా ఆలింపవోయి!

—పురిపండా అప్పలస్వామి.



# (ఆ) ఖద్దరు ఉద్యమము

విషయ సంగ్రహము :—ఆల్ ఇండియా స్పిన్నర్సు అసోసియేషన్‌వారి మూడు ప్రధాన రాష్ట్రీయ శాఖలలో నొకటి మన ఆంధ్రరాష్ట్ర చరఖా సంఘము; ఆంధ్రదేశములో ఖద్దరు వ్యాపకము; ఆంధ్ర బ్రాంచికి బందరు ప్రధాన కేంద్రము; 1929 వరకు కొండా వేంకటప్పయ్య పంతులుగారు, 1929 నుండి డాక్టర్ పట్టాభిగారు ప్రధాన కార్యదర్శులు ; ఖద్దరు నిధి, పట్టిక: రు. 256000 లు వసూలు; 1931 లో ఆర్థికమాంద్యము, ఖద్దరునకు అరిష్టము ; 1936 లో ఢిల్లీ షెడ్యూల్ వేజెస్ పద్ధతి ఉద్యమమునకు ఉపయోగకరమయినది ; 1937 కాంగ్రెస్ మంత్రుల వల్ల ఉద్యమము వృద్ధి పొందినది; ఖద్దరుచేసిన మహోపకారము: 1925-1940 ఆంధ్ర దేశమందలి ఖద్దరు వ్యాపకమును సూచించు పట్టిక ; కరువు బాధ నివారించుటకు 1937-39 లో ఖద్దరు కేంద్రము లేర్పడినవి; గూడూరు, యమ్మిగనూరు క్షామబాధ నివారణ కేంద్రములు—

**ఖద్దరు అననేమి ?**

ఇప్పుడు 'ఖద్దరు' అనే పదము విననివారు లేరు. ఈ పదము మహాత్ముని నాయకత్వములోనే ఇంత ప్రచారమునకు వచ్చినది. మనదేశపు పనివారిచేత, మన పొలములోని ప్రత్తినుపయోగించి, మన బట్టలను మనమే తయారుచేసుకొనవలెను. స్వాతంత్ర్య సముపార్జన కుపకరించు ప్రబల సాధనమే ఈ ఖద్దరు. గాంధిజీ ఈ ఖద్దరు ఉద్యమ వ్యాపకమునకు 'అఖిల భారత స్పిన్నర్సు అసోసియేషన్'ను స్థాపించి, దాని ప్రధాన శాఖల రాష్ట్రములలో నెలకొల్పి, అనన్యమైన కృషిచేయుచున్నాడు.

**ఆంధ్రదేశములో ఖద్దరు వ్యాపకము**

ఆంధ్రరాష్ట్ర చరఖా సంఘము, 'ఆల్ ఇండియా స్పిన్నర్సు అసోసియేషన్'వారి మూడు ప్రధానరాష్ట్రీయ శాఖలలో ఒకటిగా పరిగణింప బడుతూ, రాష్ట్రమంతటా ఖద్దరు ప్రచారము చేయుచున్నది.

1929 సం॥మునకు పూర్వము దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు ఏజెంటుగను, గొల్లపూడి సీతారామశాస్త్రిగారు ఆంధ్ర బ్రాంచికి కార్యదర్శిగను వుండి, గుంటూరు ప్రధాన కేంద్రముగా పనిచేసిరి. 1929 సం॥ ఆగస్టు నెలలో, ఇప్పుడు ఏజెంటుగను, ఆంధ్ర బ్రాంచికి గౌరవ కార్యదర్శిగను ఉన్న డాక్టరు పట్టాభిసీతారామయ్యగారున్ను, వారి సహాయ కార్యదర్శిగ వేమూరి నారాయణమూర్తిగారున్ను నియమితులైరి. అప్పటినుండి సీతారామయ్యగారు మచిలీపట్నము ప్రధాన కేంద్రముగా పెట్టుకొని పనిచేయుచున్నారు.

**ఖద్దరు నిధి**

మహాత్ముడు తన సంచారమున ఆంధ్రరాష్ట్రమునకు వచ్చి ప్రజల నుద్బోధించినపిమ్మట, ప్రజలు రెండులక్షలయాభై వేలకుపైగా రూపాయలు, ఖద్దరు ఉద్యమమునకు విరాళముగా నర్పించిరి. అందులో ఒకలక్ష 86 వేల రూపాయలు ఆంధ్రరాష్ట్ర స్పిన్నర్సు అసోసియేషన్‌వారికి యివ్వబడినది. దీనిని, మహాత్ముడు జాతీయకార్యక్రమమున ప్రధాన విషయముగా పరిగణించి పనిచేయుచున్న విషయము జగమెరిగినదేగదా !

**1929 సం॥లో గాంధీగారి ఖాదీనిధి వసూళ్లు.**

| జిల్లాల పేరు | సంచారము చేసిన గ్రామములు | వసూళ్లు ఖాదీ | వసూళ్లు నగలు | మొత్తము జమ |
|---|---|---|---|---|
| | | రు. | రు. | రు. |
| విశాఖపట్నం | 16 | 13446 | 700 | 14146 |
| తూర్పు గోదావరి | 50 | 43520 | 2500 | 46020 |
| పశ్చిమ గోదావరి | 48 | 39436 | 2000 | 41436 |
| పశ్చిమ కృష్ణా | 27 | 22189 | 850 | 23039 |
| తూర్పు కృష్ణా | 52 | 27341 | 1500 | 38841 |
| గుంటూరు | 52 | 45253 | 2000 | 47253 |
| నెల్లూరు | 31 | 27217 | 200 | 27417 |
| కడప | 8 | 4579 | | 4579 |
| కర్నూలు | 13 | 5813 | 100 | 5813 |
| బళ్లారి | 2 | 1591 | | 1591 |
| అనంతపురము | 8 | 5836 | | 5936 |
| చిత్తూరు | 10 | 7255 | | 7255 |
| హైదరాబాదు (దక్కను) | 2 | 13 | | 13 |
| | 319 | 243495 | 9850 | 253345 |

1930 సం॥, శారదాచట్టపు నిర్బంధములనుండి తప్పించుకొనుటకు దేశములో అంతటా అనేక వివాహములు జరిగినవి. అప్పుడు ఖద్దరు విరివిగా అమ్ముడుపోయినది. ఉప్పుసత్యాగ్రహోద్యమం, అభివృద్ధిచెందుచున్న ఈ ఉద్యమమునకు అభివృద్ధి చేకూర్చెను. ఆ రోజులలో ఖద్దరే విరివిగా అమ్ముడుపోయినది. వాడుక అధికమై భాండాగారము లన్నిటిలోని ఖద్దరు అమ్ముడయి, అధికముగా ఉత్పత్తి చేయవలసివచ్చినది. అప్పుడు విరివిగా ఖద్దరు ఉత్పత్తిచేయు అవకాశము కల్పించుటకు పై విరాళములు, ప్రజలిచ్చిన దృఢమైన ప్రోత్సాహములే పునాది.



బందరులో అఖిల భారత చరఖా సంఘమువారిచే తయారు చేయబడుచు ప్రసిద్ధికెక్కిన కలంకారీ అద్దకపు దుప్పటి.

**ఆర్థికమాంద్యము-ఖద్దరునకు అరిష్టము**

1931 సం॥లో వచ్చిన ఆర్థికమాంద్యమువల్ల ఈ ఖద్దరు వ్యాపకమునకుకూడా కొంతముప్పు వచ్చినది. అప్పుడు ఈ అరిష్టము ఒక్క ఖద్దరుకేగాదు, ప్రపంచమంతటను ఆర్థిక మాంద్యము ఆవరించినది. ప్రత్తి ధరలు పడిపోవడముతో ఖద్దరు ధరలు విపరీతముగా తగ్గి, భాండాగారములకు అపారమైన నష్టము వచ్చినది. 1930-36 సంవత్సరములవరకున్ను పడిపోయిన ధరలు, వక్రించిన వ్యాపారమును సరళమైన పద్ధతులలో పెట్టుటకు ఖద్దరు ప్రచారకులు విపరీతమైన కృషిచేయవలసి వచ్చినది. మన ఆంధ్ర రాష్ట్రి ఖద్దరు ప్రచారకులు 1932 లో తమ సర్వస్వమును ఉద్యమమునకు ఇచ్చి ఖద్దరు కొనువారికి, గాంధీజయంతి సందర్భములో ఖద్దరు అమ్ముడుపోవుటకు, ఉత్పత్తిఅయిన సరుకు విడుదలగుటకు ఆడబ్బు కమీషనులుగా యిచ్చి ఖద్దరు ప్రచారము బాహుళ్యముగా చేసిరి.

1936సం॥రం, అఖిలభారత ఉద్యమచరిత్రలో క్రొత్తశకం. ఖద్దరు ఉత్పత్తిదారులకు కూలీయిచ్చు విధానములో 'ఢిల్లీ షెడ్యూల్ వేజస్' అను నవీనపద్ధతి మహాత్ముడు ప్రవేశపెట్టెను. పనివారలకు శ్రమకుతగ్గ ఫలమిచ్చి, వారి లాభాలను అధికము జేయుటచే ఈ ప్రయత్నము ఫలించి, ఉద్యమమునకు ఉపయోగకారియైనది. దీనికితోడు 1937 లో కాంగ్రెస్ మంత్రులు అధికారము వహించుటచే విజయోన్ముఖమైనది. మన మద్రాసు రాజధానిలోని ఆల్ ఇండియా స్పిన్నర్సు అసోసియేషన్ వారికి అనల్పమైన తోడ్పాటు లభించినది.

**ఢిల్లీ షెడ్యూల్ వేజెస్ ఫలితము—కాంగ్రెస్ చేయూత।**

కాంగ్రెస్ మంత్రివర్గమువారిచ్చిన గ్రాంటులు సబ్సిడీలు, ఉత్పత్తి విరివిగా చేయుటకు, పనివారికి హెచ్చు వేతనములు యిచ్చుటకు, హెచ్చువేతనములు ఇచ్చినను మునుపటి ధరలకే విక్రయించు సౌలభ్యము నేర్పరచుటకు తోడ్పడినవి. ఇంతేకాక ఉత్పత్తిదారులకు క్రొత్త పరికరములు ఇచ్చుటకు, వడకుట నేయుట మొదలైన శిక్షణ దాదాపు పదివేలమంది విద్యార్థుల కిచ్చుటకు ఉప

యోగపడినవి. 44 గురు ప్రచారకులుగూడా శిక్షితులైరి. ప్రజలకుకూడా ఇది లాభదాయకముగదా!

ఈ దిగువ పథకములోని అంకెలు ఖద్దరు ప్రాశస్త్యమును ధృఢపరచుచు, అది గ్రామీణుల కెంత ఆధారభూతమైనదిన్నీ, ఈ ఉద్యమ ప్రచారకులు కొద్ది కాలములో చేసిన సఫలీకృత యత్నములను ఉద్ఘాటించుచున్నది!

### 1925-1940 సంవత్సరములలో ఆంధ్ర దేశము నందలి ఖద్దరు వ్యాపకపు సూచిక.

| | | |
|---|---|---|
| ఖద్దరు ఉత్పత్తి | | |
| విలువ | రు॥లు | 69,51,358 |
| మొత్తము | చ॥ గజములు | 123,71,456 |
| బరువు | (పౌనులు) | 32,89,266 |
| ఖద్దరు అమ్మకము | రు॥లు | 64,50,915 |
| ప్రచారము చేయబడిన గ్రామములు | | 8,526 |
| లాభము పొందినవారు | | 3,01,989 |
| లాభముపొందిన నేతగాండ్రు | | 18,885 |
| ,, యితరపనివారు | | 3,014 |
| ఇచ్చినకూలి:— | | |
| వడకుటకు | రూ | 16,44,812 |
| నేయుటకు | ,, | 17,55,888 |
| ఇతరపనులకు | ,, | 3,67,191 |
| మొత్తము | ,, | 37,67,921 |

ఈ 37,67,921 రూ॥ లున్నూ—పనివారు తమతమ గృహములలో ఒక రిద్దరు కుటుంబీకుల సహాయముతో, విశ్రాంతి వేళల పనిచేసి సంపాదించిరి. వారిస్వాతంత్ర్యాన్ని అరికట్టే కర్మాగార నిబంధనలుగానీ, వారి వ్యావసాయిక జీవనోపాధిని ఆటంకపరిచే ఘట్టాలుగానీ ఈ క్రొత్త వృత్తివల్ల వారికి ఏర్పడలేదు. ఇదివారికి ఉపరి జీవనోపాధి. ఇంకా 1938 సం॥ నుండిన్నీ పనివాళ్ల సామర్థ్యం అధికం చెయ్యడానికి అనేక ప్రయత్నాలు చేయబడుచున్నవి. ఢిల్లీ షెడ్యూలు ప్రకారం, రోజుకు మూడు అణాలకన్న అధమం ఆర్జించే పనివాడు వుండవీలులేదు. ప్రజాభ్యుదయాన్ని వాంఛిస్తూ, ప్రజాసేవ పరామార్థంగా పెట్టుకున్న ఈ ఆలిండియా స్పిన్నర్సు అసోసియేషన్ వంటి అనధికార సంస్థ యొక్క ఆమోఘకృషి ఫలితంగానే ఇంత కార్యసిద్ధి కలిగినది.

ఢిల్లీ షెడ్యూలు గాంధీజీ ప్రవేశపెట్టిన పిదప, ఖద్దరుకు ఒక క్రొత్త నిర్వచనం ఏర్పడినది. ఇది మనచేతులతో మన దేశములో, మన పనివారలతో తయారుచేయబడిన దేశీయమైనదేకాక, ఖద్దరు పనివాళ్లకు అధికలాభములను చేకూర్చే ఉపరి సాధనముగా కూడా పరిణమించినది. ఖద్దరుకు ఆదరణ వచ్చిన తర్వాత అనేకులు ఈ వర్తకము చేయుచున్నారు. ధృవపత్రము పొందని ఖద్దరు వర్తకులు తక్కువ వేతనములిచ్చి వడకించి, గుడ్డ తయారు చేయించి, అధికధరలకు విక్రయించి, అటు పనివారికి ఇటు ఖద్దరు ఉద్యమమునకు అపకారముచేసి, అపారనష్టముగలిగించుచున్నారు. ప్రజలకు మంచిసరుకు నివ్వక, కొన్నిచోట్ల మోసము చేయుటకూడా కద్దు. అందుచే ప్రజలు, ప్రజాసేవకులు ఇట్టి వినాశకరమైన, హానికరమైన వర్తకులను ప్రోత్సహించరాదు. ఒక వేళ కొన్నిసమయములలో ఆల్ఇండియా స్పిన్నర్సు అసోసియేషన్‌వారి ఖద్దరు ధరలు కొంచెము ఇంచుమించు అధికముగా కనిపించినప్పటికీ దానినే కొని, ఉద్యమమును పెంపొందించుటే లక్ష్యము నందుంచుకొనవలెను.

ఈ ఖద్దరు ఇంతగా వ్యాపకమునకు రావడానికి కారణం-ప్రజలలో చైతన్యం, రాజకీయ సంచలనము కలుగుటచేతను పేదలకు, పనిలేక ఆకటిచిచ్చుతో మలమలమాడుచున్న మన సోదరులకు తోడ్పడ వలెననే భావం నాటుకపోవడమే. దారిద్ర్య పిశాచాన్ని పారద్రోలాలను విశాల హృదయం దూరదృష్టి గలవారు ఖద్దరు ప్రోత్సహించితేనే చాలు. ఖద్దరు విలువను గూర్చి గాంధీగారు: "ఖద్దరు ఒక్కటే దేశమును ఆవరించిన బానిసత్వం పారద్రోలి, మన యిండ్లలో నట్టింట దీపం పెట్టుకోవడానికి శక్తిలేక, అంధకారంలో ఆకలితో మాడిపోవుచున్న పేదలకు-పెట్టనిదీపం కట్టనికోట" అని చెప్పాడు. ఖద్దరును పోషించడమంటే వేరే మాటలలో పేదలను సంరక్షించడమే!

ఇటీవల కొన్ని అనుభవాలవల్ల, చారిత్రకఘట్టాల ననుసరించీ, ఉద్యమంవిలువ అధికమైనది.

**ఖద్దరు- కరువు బాధానివారణ**

అసలు కరువుకాలములో యిది ముఖ్యమైన జీవనాధారమైనది. మన తెలుగు సీమలో కర్నూలు జిల్లాలోని గూడూరులోను, బళ్లారి జిల్లాలోని యెమ్మిగ



ఆంధ్ర మజిలిన్లు తయారుచేయుటకై సన్నని పొందూరు నూలు తీయుచున్న ఆంధ్ర స్త్రీ.

నూరులోను కరువు వచ్చినప్పుడు (1937), మద్రాసు గవర్నమెంటువారు అక్కడ క్షామ నివారణ పనులకును, ఖద్దరు కేంద్రముల స్థాపనకును కొంత గ్రాంటునిచ్చిరి. కొంత కాలవ్యవధితో 1938 లో అక్కడ పని ప్రారంభమైనది. క్రమాభివృద్ధి చెంది, ఇప్పుడు అక్కడ నెలకు 100 రూ॥లు మొదలు 400 రూ॥లు వరకు విలువైన సరుకు ఉత్పత్తి చేయబడుచున్నది. మరల ఈ ప్రాంతమున ప్రతిష్ఠించబడిన ఈ పరిశ్రమ వేళ్లునాటుక పోయినది. పెడకడుబూరులో గూడా ఇట్లాంటి కేంద్రం, కరువుబాధ తప్పించడానికి 1939 లోనే నెలకొల్పబడినది. ఈ కేంద్రానికి అనువైన, అవసరమైన పరిస్థితులు కొన్ని లోపించుటచే, యిచ్చటినుండి యెమ్మిగనూరుకు మార్చబడినది. 1941 సం॥ మొదటి అర్ధభాగంలో ప్లేగు బాధ ఈ ప్రాంతమున ప్రబలి, ఖాదీ ప్రచారానికి ఆటంకం కలిగించినది. 1941-42 సం॥ లకు కూడ ప్రభుత్వము గ్రాంటు నిచ్చుటచేతను, మళ్లీ ఆ కేంద్రము పెడకడుబూరులో ప్రారంభించబడినది. ప్రస్తుతపు రిపోర్టులను బట్టి, ఈ ఖద్దరు ఉత్పత్తి తృప్తికరముగా సాగుచున్నట్లు తెలియుచున్నది. జూన్ 1941 నుండి యిక్కడ ఖాదీ ఉత్పత్తి దినదిన ప్రవర్ధమానమై అనేకవేల మందికి జీవనోపాధి కల్పించినది. 1941 జూన్ నుంచీ గూనూరులో 1100 మొదలు 1200 రూపాయలు విలువగల సరుకు ప్రతి మాసము తయారగుచున్నది. యెమ్మిగనూరులో మాసమునకు 400 రూ॥లు విలువగల సరుకు ఉత్పత్తి అగును.

1941 నుండి అక్టోబరు మాసాంతము వరకు యిక్కడ, 1940 సం॥పు అమ్మకముకన్న ఒక లక్షరూపాయలు ఎక్కువ విలువగల సరుకు అమ్ముడయినది. 1940 సం॥లో ఉత్పత్తి అయిన సరుకుకన్న ఈయేట 50 వేల రూపాయల విలువైన సరుకు అధికముగా తయారైనది. ఢిల్లీ షెడ్యూలు ప్రకారము ఇవ్వబడు వేతనముల ననుసరించి, నూటికి 12½ రూ॥లు చొప్పున ధర పెంచవలసి వచ్చినప్పటికీ—దాదాపు రెండు అణాల వేతనము యిచ్చునాడు అమ్మిన ధరలకే అమ్ముచున్నారు. ఇందుకు మద్రాసు ప్రభుత్వం, ప్రజల ఔదార్యం, తోడ్పాటులు కారణమని మళ్లీ విస్తరించి చెప్ప నవసరము లేదు.

దేశ సేవాభిమానులు, స్వాతంత్ర్యం కాంక్షించే ఉదాత్తులు, పీడిత జనోద్ధరణానికి నడుంకట్టుకొన్న త్యాగులు, ప్రజా ఉద్యమాభిమానులు, ప్రజ్ఞావంతులు ఇంకా ఈ ఖద్దరుకు అధికమైన ప్రోత్సాహం యిచ్చి, ఖద్దరు వాడకము అంతటా విరివిగా ఉండునట్లు జేసిన, ఒక క్రొత్త ఒరవడి దిద్దిన మేలుబంతులు కాగలరు !



# (ఇ) వయోజన విద్య

విషయ సంగ్రహము :—కష్టజీవులైన వయోజనులకు విద్య నభ్యసించుటకుగల అవకాశములు తక్కువ ; ప్రభుత్వము వారి తోడ్పాటులేదనే చెప్పవలెను ; జర్మనీ, టర్కీ మొదలగు దేశములలో వయోజనవిద్య చక్కగా సాగుతున్నది ; విద్య జనులలో వ్యాపించనియెడల దేశములో ఏ ఉద్యమమైనా సాగదు గనుక వయోజన విద్య తన నూతన నిర్మాణ కార్యక్రమములో ఒక ముఖ్యమైనకార్యంగా మహాత్ముడు పెట్టుకొన్నాడు—.

వయోజన విద్య సాగించుటకు ప్రతి పల్లెలోను పట్టణమందున్ను సంఘమొకటి ఏర్పడవలెను; వార్తాపత్రికలు కావలెను ; గ్రంథాలయ మొకటి ఉండవలెను; చదువుచెప్పేవారు కావలెను ; పురాణపఠనము, హరికథలు. తోలుబొమ్మలు. నాటకాలు మొదలగునవి ఏర్పడవలెను ; ఉపన్యాసములు, మాజిక్ లాంటెర్న్ ప్రదర్శనములు మొదలగునవి సైతము ఉండవలెను—.

బాపినీడుగారు తయారుచేసిన ప్రణాళిక; శనివారపు సుబ్బారావు గారు మొదలగువారు చేసినసేవ ; నిడుబ్రోలులో రామానీడు వేసంగి పాఠశాల ; ఇతర స్థలములలోని వేసంగి పాఠశాలలు : 1939 గుంటూరు, బెజవాడ, విశాఖపట్నం మొదలగు స్థలములలో వయోజన విద్యా కేంద్రములు; జరిగినపని కొంచెము ; ఇంకా జరగవలసినపని ఎంతోఉన్నది—.

భారత దేశము విద్యా విషయకముగా ఇప్పుడు వెనుకబడియున్న దేశము. పైగా, దినమంతా కూలీనాలీ చేసుకొని జీవించేవారి సంఖ్య అత్యధికముగా నున్నది. కర్మాగారాలలో పనులు చేసుకొనువారికి వారమున కొకరోజు తీరిక దొరుకును. ఇట్టి వారు చదువుకొని, విజ్ఞాన మలవరచుకొనుటకు అతి స్వల్పకాలమే యుండును. వారు పాఠశాలలకుగానీ, కళాశాలలకుగానీ పోవు అవకాశముండదుగదా !

మన ప్రభుత్వము వారు ప్రాథమిక విద్యను ఉచితముగా ఇస్తున్నారు. మాధ్యమిక, సెకండరీ విద్యలకు అగుఖర్చు మాధ్యమిక తరగతివారికే అందుబాటులో లేదనుట ప్రస్తుత ఆర్థికస్థితిని బట్టి చూచిన నిస్సంశయము. ఇంక కళాశాల విద్య అసలే ధనికులకు తప్ప మరెవరికి అందుబాటులో లేదు. కాబట్టి పనిపాటలు చేసుకొనే అనేకమందికి విద్య దూరమగుచున్నది. పనిచేసుకొంటూ, తీరిక కాలములలో చదువుకొని, పెద్దపెద్ద యూనివర్సిటీ పరీక్షలకు వెళ్లుటకు వారి కవకాశములు లేవు. ప్రభుత్వము ప్రజాసామాన్యంలో విద్యావ్యాపకానికి వీసమెత్తైనా తోడ్పడుట లేదు.

గత పది సంవత్సరాలలో జర్మనీ, టర్కీ, ఇటలీ, రష్యా దేశములు ప్రజానీకంలో విద్యావ్యాప్తికి అనేక నూతన మార్గముల నవలంబించి, ఇంగ్లాండు, అమెరికా మొదలగు దేశముల నతిక్రమించినవి. అసలు ప్రజలలో విద్యా-విజ్ఞాన ప్రచారము లేకున్న ఏ ఉద్యమము ముందునకు రాలేదు. కాంగ్రెసు-ఆంధ్రోద్యమముల వంటి ప్రజాఉద్యమములకు ముఖ్యముగా ప్రజలలో విజ్ఞానము, విద్యా-చైతన్యమున్ననే బలము. అందుచేతనే మహాత్ముడు తన నిర్మాణ కార్యక్రమములో వయోజనవిద్య ఒక ప్రధాన ఘట్టముగా పేర్కొని యున్నాడు.

ముఖ్యముగా చదువు కోదలచినవారిని ఒక సంఘముగా కూర్చి, వయోజన విద్యా సంఘము అని పేరుపెట్టి, వారమునకు ఏరెండు గంటలో వినియోగించి,-వారికి వార్తా పత్రికలు,



శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, ఏమ్. ఏ., ఆంధ్ర రాష్ట్ర గ్రంథాలయ సంఘాధ్యక్షులు, వయోజన విద్యా ప్రచారము సాగించుచున్నవారు.



శ్రీ శరణు రామస్వామిచౌదరి
గ్రంథాలయ సేవకులు.

ఉత్తమగ్రంథములు చదివి వినిపించి, అట్టి సంఘము గ్రంథాలయమున్న గ్రామములో నున్నచో గ్రంథాలయము నుపయోగించు కొనునట్లు వారినిచేసి, వారికి చదువు నేర్పవలెను.

'వయోజనవిద్య' అనగానే వట్టి అక్షరాలూ, అంకెలూ, వ్రాత మాత్రమే బోధించుటగాదు. మనోవికాసం, బుద్ధి సూక్ష్మత, లోకానుభవము నిచ్చే సామాన్య విద్యను గూడా బోధించవలెను. పూర్వము జ్ఞానబోధకు పురాణములు (మత గ్రంథములు, కథలు చెప్పుట) హరికథలు తోలుబొమ్మలు ఉపయోగించేవారు. మహమ్మదీయులు 'మిలాద్ షరీఫ్' సాగించేవారు.

వార్తా పత్రికలను, గ్రంథములను చదివిన తర్వాత ఆ యాశములకు సంబంధించిన ఉపన్యాసములను, చర్చలను జరుపుచుండవలెను. ఈ చర్చలలో ఆ యా యంగములలో ఆరితేరిన అనుభవజ్ఞులను పాల్గొనునట్లు వయోనజ విద్యా సంఘము వారు చూచుచుండవలెను. వయోజన విద్యా కార్యక్రమమును ప్రతిఘటించు వారున్నప్పటికిన్నీ, అనేక వార్తా పత్రికలు, గ్రంథములు దీనికి తోడ్పడుచున్నవి. విజ్ఞానాన్ని సంపాదించక వెనుక బడితే, విజ్ఞానవంతుడు విజ్ఞానం లేనివానిని బానిసగా ఉపయోగించు కుంటాడు.

ఈ వయోజన విద్యా వ్యాపకమునకు ఉన్నంత ప్రాధాన్యము మరిదేనికిన్నీ లేదు. అధమం ఒక్కొక్క సంఘమునకు 50, 60 మంది ఉన్నాచాలును. అనేకులు రాజకీయ, ఆర్థిక వేత్తలు, విద్యార్థులు అనల్పమైన సహాయం చేస్తున్నారు.

ఐకమత్యము, స్వేచ్ఛ, సర్వసమానత్వము మానవసంఘమున వర్ధిల్లచేయుటే ఉన్నత ధృక్పథము. ఈ ధృక్పథమే మానవ నైతిక, భౌతిక, ఆర్థికాభివృద్ధికి దారితీయును. శాస్త్రములు, గ్రంథములు, సాహిత్యము అన్నియు ఈఆశయ సిద్ధికే దోహదములగును. కాబట్టి మానవుడు తనకు తోడ్పడే, తన ఉన్నతిని వాంఛించే ఈ విజ్ఞానమునకు విముఖుడుగా ఉండుట శోచనీయము. వయోజనవిద్యా వ్యాపక కార్యక్రమమునకు చిత్రములు, మ్యాజిక్ లాంతరులు మొదలైనవి తోడ్పడగలవు. మన దేశము అన్ని దేశములలోనికి ఆదర్శవంతమైన దన్నమాట బుజువుపరచు బాధ్యత యువకుల పైని, వయోజనుల పైని యున్నది.

వయోజన విద్యావ్యాపకమునకు ఒక ప్రణాళికను మాగంటి బాపినీడుగారు అమెరికానుండి రాగానే, రామలింగారెడ్డిగారి కోరికపై తయారుచేసిరి.

వయోజన విద్యవ్యాపకము చేయుటకు ఆంధ్ర దేశములో తోడ్పడినవారు కీ.శే. శనివారపు సుబ్బారావుగారు, ఆచార్య రంగాగారు, నరసింహదేవర సత్యనారాయణగారు, కలిదిండి గంగరాజుగారు మొదలైనవారు. శనివారపు సుబ్బారావుగారు వయోజన విద్యా వ్యాపక కార్యక్రమమునకు ఒక ప్రణాళికను గూడా తయారుచేసిరి. మరియు వీరే తాడేపల్లిగూడెములో ఉపాధ్యాయులకొక పాఠశాల పెట్టిరి. నరసింహదేవర సత్యనారాయణగారిచే ఆలమూరులో స్థాపించబడిన గ్రామ పునర్నిర్మాణ కేంద్రమును బాపినీడుగారు అమెరికా నుండి రాగానే ప్రారంభము చేసియుండిరి. ఆ విద్యాలయములో చదివిన విద్యార్థులలో కొందరు, జిల్లా బోర్డులలో గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమమునకు ప్రచారకులుగా నున్నారు. అనేక రైతు సమస్యలను, రాజకీయ విషయములను అవగతం చేయుటకు, రాజకీయ పరిజ్ఞానము కల్పించుటకు ఆచార్య రంగాగారు ప్రతి వేసంగిలోను 'రామానీడు పాఠశాల'ను నిడుబ్రోలులో పెట్టి కొంత మంది రైతు సేవకులను తయారు చేయుచున్నారు. క్రొత్త పట్నంలో అన్నాపగడ కామేశ్వర

రావుగారు పెట్టిన వేసంగి పాఠశాల—దానిని పోలీసులు ముట్టడించుట అందరును ఎరిగినదే గదా! అనేక చోట్ల ఇప్పుడిప్పుడు వేసంగి పాఠశాలలు, రాత్రి పాఠశాలలు వయోజనులకు ఏర్పరచబడుచున్నవి.

విద్యార్థులు గూడా, అభివృద్ధిదాయకమై జాతీయ జీవితమును పునరుజ్జీవింపజేసే ఈ ఉద్యమమునకు తమ సంఘముల ద్వారా చేయూత నిచ్చుచున్నారు. గుంటూరు, బెజవాడ, విశాఖపట్నములలో 1939 లో వయోజన విద్యా కేంద్రముల నేర్పరచిరి. తరువాత తూర్పు-పశ్చిమ గోదావరి, నెల్లూరు జిల్లాలలో ఈ కేంద్రములు ఏర్పాటు చేయబడినవి.

అసలు మన భారత దేశములో చదువుకున్నవారి సంఖ్య నూటికి పదిమంది. అందులోను ఆంధ్ర దేశంలో నూటికి ఆరుగురు మాత్రమే. ఇంత వెనుకపాటుగా ఉన్న ఈ తరుణములో వయోజన విద్యా వ్యాపక కార్యక్రమము యొక్క అవసరము వర్ణించుట కష్టము.

భావి దేశభాగ్యోదయానికి వయోజన విద్యా ప్రచారం ఆయువుపట్టు అన్నమాట విస్మరించరాదు! వయోజన విద్యా వ్యాపక కార్యక్రమమువలన కొద్ది వ్యయముతో ఎక్కువ ఫలితములను పొందవచ్చును. గ్రంథాలయోద్యమము వయోజన విద్యా వ్యాపకమున కెట్లు తోడ్పడినదో ఆ భాగములో విపులీకరించ బడినది.

---

ఉ॥ హర్తకుఁ గాదు గోచర మ
హర్నిశమున్ సుఖపుష్టి సేయు స
త్కీర్తి ఘటించు విద్యయను
దివ్య ధనం బఖిలార్థ కోటికిం
బూర్తిగ నిచ్చినన్ బెరుఁగుఁ
బోదు యుగాంతపు వేళ నైన భూ
భర్తలు తద్ధనాధికుల
పట్టున గర్వము మాను టొప్పగున్.

—ఏనుగు లక్ష్మణకవి : భర్తృహరి సుభాషితం.



# 10. హిందీ ప్రచారోద్యమము

భారతభూమియందు పరిపూర్ణమయిన జాతీయత ఏర్పడుటకు దేశమంతటికి ఒక సామాన్య భాష కావాలన్న విషయం దృఢపడింది. అట్టి భాష ఒక్క హిందీభాష మాత్రమే. అందుకు తగిన పునాదులు గాంధీగారు 1918 సంIIలో వేయుటయు తటస్థించినది. ఈ ప్రచారమును సక్రమముగా సాగించుటకు, గాంధీగారు తన కుమారుడయిన దేవదాస్ గాంధీగారిని దక్షిణ హిందూదేశానికి పంపించినారు. ఆయన ఈ కార్యక్రమము మద్రాసులో పండిత హరిహర శర్మగారితోడ్పాటుతో ప్రారంభించి, క్రమముగా 1919 సంIIరమునాటికి పండిత హృషీకేశశర్మగారి ద్వారా బందరులోని ఆంధ్రజాతీయ కళాశాలలో హిందీ భాషాబోధన జరుగునట్లు ఏర్పాట్లు చేసిరి.

1920 సంIIరంలో రాజమహేంద్రవరంలో, ఒక విద్యాలయము ఏర్పాటు చేయబడినది. 1921 సంIIరంలో ప్రచారకులను తయారుచేయుటకుగాను నెల్లూరిలో ఒక ప్రచారక విద్యాలయము ప్రారంభింపబడినది. ఆంధ్రదేశములోని వివిధ జిల్లాలనుండి చాల మంది ప్రచారకులు శిక్షణపొందిరి. ఉత్తరదేశీయులగు శ్రీ అవధ నందన్, భాలచంద్ర ఆప్టే, దేవదూత విద్యార్థి, వ్రజనందన్‌గార్లు ఆంధ్రదేశములో హిందీ భాషా ప్రచారమునకు ఇతోధికాభివృద్ధిని చేకూర్చిరి. ఈ ప్రచారకుల ప్రయత్నముల ఫలితముగా రాజమండ్రి, మచిలీపట్టణము, నెల్లూరు మొదలగు స్థలములలో హిందీ విద్యాలయములు తెరువబడ్డాయి. హిందీ ప్రచారకుల సంఖ్యకూడ పెరుగ నారంభించినది. 1927 సంIIరము మద్రాసులో 'దక్షిణ భారత హిందీ ప్రచార సభ' స్థాపించబడినది. దీనికి ప్రస్తుత ప్రధాన మంత్రి యగు శ్రీ మోటూరి సత్యనారాయణగారిది ఆంధ్ర దేశంలో హిందీ ప్రచారోద్యమ చరిత్రలో అందరికంటెను అధిక మహత్త్వపూర్ణమైనస్థానము. 1930 లో ఆంధ్ర దేశములో వాడ వాడల హిందీ భాషాధ్యయనం చేయువారి సంఖ్య విపరీతముగా పెరిగినది. డాక్టర్ పి. సుబ్బరాయన్‌గారు ప్రధాన మంత్రిగా ఉన్న సమయ మందు ఆంధ్రదేశములోని అనేక విద్యాలయములలో హిందీ ఐచ్ఛికముగా నేర్పుట ప్రారంభమయినది. ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘం 1936 సంIIరంలో బెజవాడలో స్థాపించబడినది. దీనికి అధ్యక్షులు శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారు; ఉపాధ్యక్షులుగ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు కొంతకాలము, ప్రస్తుతము బెజవాడ గోపాలరెడ్డిగారు, కార్యదర్శిగ మొదట శ్రీ పీసుపాటి వెంకటసుబ్బారావుగారును వారి మరణానంతరము ప్రస్తుతం శ్రీ ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారును; కోశాధ్యక్షులుగ శ్రీ ఎర్నేని లక్ష్మీనారాయణగారును ఇంకను కొందరు పాలకవర్గ సభ్యులుగను వుండి ఆంధ్ర దేశములో హిందీ ప్రచారమునకు ఎక్కువ కృషిజేయుచున్నారు.

ఈ సంఘము బెజవాడలో కార్యాలయము పెట్టుకుని ఒక హిందీ గ్రంథాలయమును, ఒక హిందీ పుస్తక విక్రయ శాలనుగూడ నిర్వహించుచున్నది.

ఈ సంఘము తరపున 20 మందివరకు ప్రచారకులు, స్వతంత్రముగా ఇంకను చాల మంది ప్రచారకులు హిందీ ప్రచారము చేయుచున్నారు. మరల 1937 సం॥రములో కాంగ్రెస్ ప్రభుత్వము ఏర్పడిన తర్వాత ఈ హిందీ నభ్యసించు వారి సంఖ్య ఒక్కసారిగా దేశమంతటను విపరీతముగా పెరిగిపోయినది. ఇందుకు ముఖ్య కారణము కాంగ్రెసు ప్రభుత్వము హిందీభాషను విద్యాలయములలో లోయర్ గ్రేడ్ వరకు నిర్బంధ విద్యగా చేయుటయే.

ఆంధ్ర దేశములో హిందీ భాషాధ్యయనము సులభమే. ఎందుచేతనగా నైజాం రాజ్యము వారికి దగ్గరగ నేయున్నది. వేలకొలది ఉర్దూపదములు తెలుగు వారికి సుపరిచితములగుటయే కాక చాలపదములు తెలుగు భాషలో మిశ్రితములై యున్నవి.

---

# 11. జస్టిస్ పార్టీ

క్రొంత పలుకుబడి, ప్రతిభ, ఉద్యోగాధికారము, సంపదగల బ్రాహ్మణేతర నాయకులు కొందరు బ్రాహ్మణేతరుల యభివృద్ధి కోసము ఒక సంస్థ స్థాపించి, ఒక వార్తా పత్రిక నడపవలెనని 1916 సం॥ డిసెంబరు నెలలో "సౌత్ ఇండియన్ పీపిల్‌జు అసోసియేషన్" అనే జాయింట్‌స్టాక్ కంపెనీ నెలకొల్పి, దాని తోడ్పాటుతో ఇంగ్లీషులోను, అరవంలోను, తెలుగులోను దిన ప్రతికలు నడపుటకు పూనుకొనిరి. "సౌత్ ఇండియన్ లిబరల్ ఫెడరేషన్" అనే రాజకీయ సంస్థను 1917 లో స్థాపించిరి. ఈ సంస్థకు కార్యదర్శిగానుండిన కీ. శే. రావుబహదూర్ పి. త్యాగరాయచెట్టిగారు ఈ సంస్థయొక్క ఆదర్శములను, ఆశయములను తెలియజేస్తూ ఒక బ్రాహ్మణేతర ప్రకటనము గావించిరి.

ఈ బ్రాహ్మణేతర ఉద్యమములు దక్షిణదేశమంతటను శీఘ్రకాలములో వ్యాపించినవి. కోయంబత్తూరు, బిక్కవోలు, పులివెందల, బెజవాడ, తిన్నవెల్లి, సేలం మొదలయిన స్థలములలో కాన్ఫరెన్సులు జరిగినవి.

1920-21 లో రాజకీయ సంస్కరణల ఫలితముగా ద్వంద్వ ప్రభుత్వము ఏర్పడి శాసనసభలకు ఎన్నికలు వచ్చినప్పుడు కాంగ్రెస్‌వారే కాదు, మితవాదులు (జస్టిస్‌పార్టీవారు) తప్ప, తక్కిన అన్ని పార్టీలవారున్ను ఈ నూతన రాజకీయ సంస్కరణలు తృప్తికరమైనవి కావని శాసన సభలను బహిష్కరించినారు. మరల 1924 లో ఎన్నికలు జరిగినప్పుడు కాంగ్రెస్‌వారు శాసనసభలను బహిష్కరించకపోయినను ఉద్యోగములలో ప్రవేశించలేదు. అందుచేత, 1920-21 నుండి 1936 వరకున్ను చెన్నపురి రాష్ట్రములో జస్టిస్‌పార్టీవారే శాసనసభలందు ఎక్కువగా ఉండి, వారి నాయకులేమంత్రి పదవుల నలంకరించి యుండిరి.

1937 లో కాంగ్రెస్‌వారు ఈ సభలలో ప్రవేశించి, అందలి ఉద్యోగపదవులను సైతము పొందుటకు సంకల్పించుటవలన జస్టిస్ పార్టీవారికి అన్నిచోట్లను అపజయము కలిగినది. జస్టిస్, న్యాయదీపిక మొదలయిన పత్రికలుసైతము అంతరించినవి. నాలుగేండ్లనుండి 'సన్‌డే అబ్జర్వర్'

అను వారపత్రికమాత్రము పీ. బాలసుబ్రహ్మణ్య మొదలియారు గారి సంపాదకత్వమున, ఉత్సాహ కరముగా సాగుతూఉన్నది. ఇటీవల కాంగ్రెస్ నాయకులు, ప్రస్తుత మహాసంగ్రామ మందు బ్రిటిష్ ప్రభుత్వమువారికిగల ఆశయ విషయ ములో వైషమ్య మేర్పడుటవల్ల తమ పదవులకు రాజీనామాలిచ్చి మరల సహాయ నిరాకరణోద్య మము ప్రారంభింపగానే, జస్టిస్‌పార్టీ వారు కొంత వరకు మరల విజృంభించుటకు అవకాశము కలి గినది. 1942 సంII సెప్టెంబరు 14 తేదీని 'యంగ్ జస్టిసైట్ లీగ్ ' వారి మహాసభ సమావేశమై స్వర్గస్థులైన సర్ కె. వి. రెడ్డి గారియెడల తమ కుగల భక్తికిసూచనముగా సభనాపి, మరల 18వ తేదీని కలుసుకొని ప్రస్తుత యుద్ధములో ప్రభు త్వమువారికి తగిన తోడ్పాటు సమకూర్చుటకు తీర్మానముచేసిరి.

---

# 12. పీపిల్స్ పార్టీ

1935 సంIIరపు ఇండియా చట్టం క్రింద రాష్ట్రీయ శాసనసభలకు కొంత స్వాతంత్ర్యము కలుగుటయు, ప్రజలకు వాటిపై మునుపటికంటె కొంత పలుకుబడికలుగుటయు, తిర్గి 1937 సం వత్సరములో దేశములోని అన్ని రాష్ట్రములలోని ఉభయశాసనసభలకు ఎన్నికలు జరుగుటయు భారతదేశ చరిత్రలో నూతనాధ్యాయమును ప్రారంభించె ననకతప్పదు. అంతవరకూ శాసన సభలను బహిష్కరిస్తూవుండిన కాంగ్రెసుపార్టీ వారుకూడ పోటీ చేసిరి. ఆ సమయములోనే మద్రాసు రాష్ట్రమునందు ఈ ఎన్నికలలో పోటీ చేయుటకై, నూతనముగా 'పీపిల్స పార్టీ' అనుపేర నొక పార్టీ బయలుదేరినది. దీని స్థాప కులు శ్రీ పీఠికాపురం మహారాజావారు, యువ రాజుగారున్నూ. వీరి ఆదర్శములలో—రైతులకు- జమీందారులకు ఉండిన వైషమ్య విషయముల లో రైతులకు తదితర జనసామాన్యమునకు మైత్రి సమకూర్చుట ; జస్టిస్ పార్టీ వారంత తీవ్రముగకాక పోయినను కొంతవరకైనను బ్రా హ్మణేతరోద్యమమును బలపరచుట ; కాంగ్రెస్ వలె ప్రభుత్వాన్ని ప్రతిఘటించకుండా క్రమ క్రమముగా స్వరాజ్యప్రాప్తికి పాటుపడుట— మొదలగునవి అని తెలియుచున్నది. ఇంతకూ శాసనసభలకు తమ ప్రతినిధులను పంపించ వలెనన్న కుతూహలముతో ఆ ఎన్నికల సమ యమందు పుట్టి, ఎన్నికలలో తమ కపజయము కలుగుటచేత శీఘ్రకాలములోనే అంతరించుట చేత ఈ పార్టీ పనిగాని, అభివృద్ధిగాని గుర్తించు టకు అవకాశము లేకపోయినది.



# 10వ భాగము – 29వ అధ్యాయము

# ఆంధ్ర జిల్లాల చరిత్ర

డా. గిడుగు వేంకట సీతాపతి

ఏయే దేశములం వసించితిరి మీ రేయేగిరుల్ చూచినా
రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళి(ద్రిమ్మరితి రేయే తోయధుల్ డాసినా
రాయా చోటులఁగల్గువింతలు మహాత్మా నాకెఱింగింపరే ॥

—మనుచరిత్ర.

విషయసంగ్రహము :— ఈ అధ్యాయములో ఆంధ్ర జిల్లాల చరిత్ర మొదటనుండి బ్రిటిష్ ప్రభుత్వమేర్పడినవరకున్ను సంగ్రహించి చెప్పినాము. అంతేకాక, ప్రతి జిల్లాలోను చారిత్రక ప్రసిద్ధ స్థలములున్ను పుణ్యక్షేత్రములున్ను పేర్కొని ముఖ్య విషయములు తెలియజేసినాము.

విశాఖపట్టణం జిల్లా చరిత్రలో మునుపటి గంజాం జిల్లాయందుండి ఇప్పుడు ఒరిస్సా రాష్ట్రమేర్పడ్డ తర్వాత విశాఖపట్టణం జిల్లాలో చేర్చిన స్థలముల చరిత్ర నైతముకలదు.

## నూతన విశాఖపట్టణము జిల్లా చరిత్ర

1936 లో నూతన ఒరిస్సా రాష్ట్రము ఏర్పడినప్పుడు ప్రాత గంజాము జిల్లాలోనుండిన శ్రీకాకుళము తాలూకా, నరసన్నపేట తాలూకా, టెక్కలి తాలూకా, ఇచ్ఛాపురము తాలూకా, పాతపట్నము తాలూకాలను విశాఖపట్టణము జిల్లాలో చేర్చినారు. ఈ అయిదు తాలూకాల చరిత్రతో పాటు ప్రాత విశాఖపట్టణము జిల్లా చరిత్ర నైతము తెలియజేస్తున్నాము.

పైనిచెప్పిన తాలూకాలలో ప్రాచీనకాలమందు ఉత్తర వాయవ్య భాగములు సవరలతోను, పడమటి భాగములు గదబలు, జాతపులు, కోదులు మొదలయిన ఆదిమనివాసులతోను, సముద్రతీర ప్రదేశము కాళింగులు, కాపులు, తెలగాలు మొదలయిన తెలుగు జాతులవారితోను నిండియుండెను. క్రీ. పూ. 9 వ శతాబ్దమునాటికే వంగదేశపు (బెంగాల్) దక్షిణసీమనుండి గోదావరినదివరకును వ్యాపించిన దేశమునకు కళింగదేశ మన్నపేరు వచ్చియుండెను. అందు ఉత్తరమునుండి ఋషికుల్యావరకును వ్యాపించిన దేశమునకు ఉత్కళింగమనిన్ని, అక్కడనుండి నెల్లిమర్లవరకు వ్యాపించిన దేశమునకు మధ్యకళింగమనిన్ని, దానికి దక్షిణముననున్న ప్రదేశమునకు దక్షిణకళింగమనిన్ని అనేవారు. ఓఢ్రులు ఉత్కళింగదేశమం దుండేవారు గనుకనే ఉత్కళు లయినారు. క్రీ. పూ. 261 లో అశోకుడు కళింగదేశమును జయించెను; అప్పుడక్కడ జరిగిన యుద్ధములో పెక్కువేల జనులు చనిపోవుట చూచి పశ్చాత్తప్తుడై బౌద్ధ మతము నవలంబించి, యుద్ధములతో రాజ్యములు జయించుపని మానుకొనెను. అతని ప్రోత్సాహమువల్లను ఆ తరువాతి రాజుల ఆదరమువల్లను కళింగదేశమందు బౌద్ధమతము వ్యాపించినది. అందుకు నిదర్శనముగా కళింగపట్టణమునకు చేరువగానున్న సాలిహుండామువద్దను, విజయనగరమునకు చేరువగానున్న రామతీర్థమువద్దను, అనకాపల్లికి చేరువగానున్న బొజ్జన్న కొండమీదను బౌద్ధ విగ్రహములు, గుహలు, స్తూపములు, డగోబాలు మొదలయినవి నేటికిని కనబడుతున్నవి.

అశోకుని తర్వాత మౌర్యవంశము అంతరించినతోడనే కళింగ రాజ్యము స్వతంత్ర్య రాజ్యమయినది. సుమారు క్రీ. పూ. 160 లో ఖారవేలుడు కళింగరాజ్యాధిపతి. ఆకాలమున ఆంధ్రుల ప్రాభవము ఎక్కువగుటకు ప్రారంభించినది. క్రీ.శ. 275 లో సింహళ ద్వీపరాజయిన మహేంద్రుడు కళింగ రాజునుండి బుద్ధుని దంతమొకటి సంపాదించి కాండీ పట్టణమున ఒక బౌద్ధాలయములో భద్రపరచెను. దక్షిణభాగమందు శాతవాహనులకును, పిమ్మట ఇక్ష్వాకులకును, ఆపిమ్మట విష్ణుకుండినులకును చెందిన ఆంధ్ర రాజ్యములుండెనని చెప్పవచ్చును ; గాని, అవి ఎప్పుడెప్పుడు ఎంత మేర వ్యాపించియుండెనో తెలియదు.

క్రీ. శ. 326-375 లో గుప్త సామ్రాజ్యము నేలిన సముద్రగుప్తుడు దక్షిదేశమందు దండయాత్ర చేసినప్పుడు కళింగ

దేశములో నాలుగు రాజ్యములు—గిరికొత్తూరను స్వామి దత్తుడును, ఏరండపల్లెను దమనుడును, దేవరాష్ట్రమున కుబేరుడును, పిష్ఠపురమున మహేంద్రుడును-ఆయా ప్రాంతముల నేలుచుండిరి. వీరేవంశమువారో తెలియదు. వీరు స్వతంత్ర రాజులో లేక వేంగీపుర మహారాజయిన సాలంకాయనవంశ హస్తివర్మునికి కప్పము చెల్లించుచుండిన రాష్ట్రాధిపతులో తెలియదు. పైని చెప్పిన స్థలములలో గిరికొత్తూర మహేంద్రగిరికిని సోంపేట గ్రామమునకును నడుమనున్న కొత్తూరు గ్రామము కావచ్చును; ఏరండపల్లె ఆముదాలవలస (శ్రీకాకుళమురోడ్డు స్టేషనువద్ద నున్నది) కావలెను. దేవరాష్ట్రము విశాఖపట్టణము జిల్లాలోని దక్షిణభాగమందు వెలసి ఉండవచ్చును. పిష్ఠపురము=పిఠాపురము. పిమ్మట కొద్ది కాలమునకే పిష్ఠపురమున వెలసిన మాఠర వంశరాజ్యము, కళింగదేశమందు పిఠాపురమునుండి మహేంద్రగిరి వరకును వ్యాపించినది. గాని రాజధాని నగరములలో మార్పు కలిగినది. వేంగి రాజ్యమును పాలించుచుండి, సాలంకాయనులు పిష్ఠపురమువరకును తమ రాజ్యమును వ్యాపింపజేసుకొనుట చేత, మాఠర వంశరాజులు నాల్గవ శతాబ్దము అంతమొందిన సరికి విజయసింహపురమునకు తమ రాజధానిని మార్చుకొనిరి. ఇది శ్రీకాకుళమునకు చేరువగానున్న సింగుపురము కావచ్చును. మరికొద్ది సంవత్సరములకే టెక్కలి వద్దనున్న విజయవర్థమానపురము రాజధాని నగరమయినట్లు కనబడును. పిమ్మట దక్షిణమందు విష్ణుకుండినులు ప్రబలులయి సాలంకాయనులను అణచివేయుటచేత మాఠర రాజ్యము మరల పిష్ఠపురమువరకును వ్యాపించినది గాని అట్టేకాలము నిలువలేదు. విష్ణుకుండినుల విజయమువలన కళింగదేశమందలి దక్షిణభాగము మాఠరరాజుల అధికారమునుండి జారిపోయినది. విష్ణుకుండినుల నాణెములు-సింహముఖ చిహ్నములు గలవి-విశాఖపట్టణము జిల్లాలో దొరికినవి. అంతేకాక క్రీ.శ. 440 తర్వాతిరాజులు మధ్యకళింగ దేశమందు రాజ్యమేలుచుండిరిగాని, త్రికళింగాధిపత్యము మరి వహింపలేదు. ఎంత కాలము ఏప్రాంతమందు వీరు రాజ్యముచేస్తూఉండిరో ఆ విషయము స్పష్టముగా తెలియదు.

పిమ్మట గంగవంశము రాజుల పాలనము ఈ ప్రదేశమున వెలసినదిగాని, అందులో రెండుశాఖలు కనబడుతున్నవి. సుమారు క్రీ. శ. 720 నుండి కామార్ణవుని సంతతిరాజుల విషయము తెలిసినంత స్పష్టముగా అతని పూర్వము వెలసిన మొదటి గంగవంశపురాజులపేళ్లు వరసగా కొన్ని పేర్కొనుటకు అవకాశము కలుగదుగాని, ఈ మొదటివంశపువారిలో మొదటివాడు ఎవడో, ఏనాటివాడో, ఈ వంశమువారికిని కామార్ణవుని సంతతివారికిని గల సంబంధమెట్టిదో స్పష్టపడుటలేదు. మొదటి గంగవంశమురాజుల శాసనములను బట్టి ఈ వంశరాజ్యము క్రీ. శ. 497 లో ప్రారంభమైనట్లు కనబడుతుంది. రెండవ గంగవంశమురాజుల శాసనములను బట్టి క్రీ. శ. సుమారు 720 లో ఈ వంశరాజ్యము ప్రారంభమైనట్లు కనబడుతుంది. మొదటివంశమురాజులు గంగాతీరమునుండి కోల్హాపురము (కోలాహలపురము) పోయి, గంగవాడి వంశము ఏర్పరచుకొన్న పశ్చిమ గంగవంశమువారికి సంబంధించినవారు అయిఉండవలెను. క్రీ. శ. 720 తర్వాతను రెండువంశముల రాజులును కొంతకాలము రాజ్యము లేలుచుండిరి. ఈ రెండును ఎట్లు కలిసిపోయినవో, లేదా మొదటిది ఎట్లు అంతరించినదో తెలియదు.

రెండవ గంగవంశము రాజులలో ఎక్కువ ప్రసిద్ధిపొందినవాడు అనంతవర్మచోడగంగదేవు. ఇతడు గంగవంశపు రాజరాజునకును చోళవంశపు రాజేంద్రచోళుని కూతురయిన రాజసుందరికిని పుట్టినవాడు. క్రీ. శ. 1078 నుండి సుమారు 1142 వరకును కళింగదేశమందలి మధ్యభాగమును, కొంత వరకు దక్షిణభాగమును పరిపాలించెను; 1136 లో ఉత్కళ రాజ్యమును జయించి కటకపురి రాజధాని నగరముగా చేసుకొనెను; అదివరకు రాజధాని నగరముగానుండిన ముఖలింగమునందు తన కుమారుని రాష్ట్రపాలకునిగా నియమించెను. ఈ విధముగానే అతనితర్వాతి గంగవంశపు మహారాజులును కటకపురి రాజధానిగా నుంచుకొని, ముఖలింగము మండలాధిపతి రాజధానిగాచేసి, కళింగ సామ్రాజ్యమును 1430 వరకును పరిపాలించుచుండిరి.

కటకపురిలో 1430 సరికి గంగవంశము అంతరించి సూర్యవంశపు కపిలేంద్రరాజుల వంశము ప్రారంభించినా, గంజాం జిల్లాలో గంగవంశపు పిల్లరాజ్యము అంతకుముందే ప్రారంభమైనది. ఇదియే కిమిడిరాజ్య మనుపేరుపొందినది. దీనినుండియే పెద్దకిమిడి, చిన్నకిమిడి, పర్లాకిమిడి రాజ్యములు పుట్టినవి. ఇందులో మొదటి రెండును ఇప్పుడు క్రొత్తగా ఏర్పడిన ఒరిస్సా రాష్ట్రమందు చేర్చిన గంజాం

జిల్లా భాగములందు పూర్తిగా కలిసియున్నవి. పర్లాకిమిడి రాజ్యమందు ఒక మూడవ భాగము మాత్రమే ఒరిస్సా రాష్ట్రములో చేరినది. కడమ రెండు భాగములున్ను చెన్నపురి రాష్ట్రమందే నిలిచియున్నవి.

కపిలేంద్రదేవునితో 1430 లో ప్రారంభమైన సూర్య వంశపు రాజ్యము దక్షిణదేశమున ఎక్కువగా వ్యాపించినది. కపిలేంద్రుడు, అతని కొడుకు పురుషోత్తముడు, అతని కొడుకు ప్రతాపరుద్రగజపతి క్రమక్రమముగా నెల్లూరి జిల్లాలోని ఉదయగిరివరకును తమ అధికారమును వ్యాపింపజేసుకొనిరి. కిమిడి రాజులు వారికి లోబడి కప్పము చెల్లిస్తూ తమ రాజ్యము నేలుకొనుచుండిరి.

1520 లో కృష్ణదేవరాయలు ఒరిస్సా ప్రతాపరుద్రుని ఓడించి, సింహాచలమువరకును తన అధికారమును బలపరచుకొనెను. 1565 లో తల్లికోట యుద్ధమందు విజయనగర సామ్రాజ్య మంతరించిన తర్వాత కొంతకాలము(1575-1687) గోల్కొండ నవాబుల అధికారము గంజాం జిల్లాలో సైతము వ్యాపించినది. పిమ్మట ఔరంగజేబు (మోగల్ పాదుషా) దక్కను దేశమును జయించి, 1687 లో దక్కను సుభా ఏర్పరుచుట జరిగినది. మరికొద్ది కాలమునకే హైదరాబాద్ నైజాము స్వతంత్రాధికారముపొంది ఉత్తర సర్కారులు ఏలుతూ, శ్రీకాకుళంవద్ద ఒక సర్కార్ అధికారిని నిలిపి కప్పము రాబట్టుకొనుచుండెను. అతనికి తోడుగా ఇచ్ఛాపురమందు ఒక నవాబు నియమితుడై ఉండెను. ఈ మహమ్మదీయుల అధికారము 1575 మొదలు 1768 వరకును సాగినది. ఈ కాలములో పర్లాకిమిడిరాజులు శ్రీకాకుళము సర్కారుకు కప్పము చెల్లిస్తూ, తమ ప్రదేశమందు రాజ్యమేలుకొనుచుండిరి. 1753 లో నైజాము ఫ్రెంచి వారికి ఉత్తర సర్కారులు ఇచ్చివేయుటచేత, ఫ్రెంచిబుస్సీ దొర విజయనగరము రాజైన విజయరామరాజును శ్రీకాకుళం సర్కారుకు మానేజరుగా నియమించెను. 1756 నాటికి శిస్తు వసూళ్లు తిన్నగా కాకపోవుటవల్ల బుస్సీ దొర స్వయముగా విశాఖపట్టణము జిల్లాకు దండుతోవచ్చెను. ఆ కాలమున విజయనగరము బొబ్బిలి రాజులకు వైరము ఎక్కువగా నుండుటచేతను, బొబ్బిలిరాజు పైకము చెల్లించుటమాని ఫ్రెంచివారి అధికారమును ఎదిరించినట్లు వినుటచేతను బుస్సీ విజయరామరాజు సాయముతో బొబ్బిలికోట ముట్టడించుటయున్ను, బొబ్బిలి నాశనమగుటయున్ను, బొబ్బిలి నాయకులతోపాటు విజయరామరాజు సైతము మరణించుటయున్ను జరిగినవి. 1758 లో బుస్సీ గంజాం జిల్లా విడిచిపెట్టి హైదరాబాదుకు పోయెను. ఆవెంటనే అతడు ఫ్రెంచివారికిని ఆంగ్లేయులకును జరుగుతూ ఉన్న యుద్ధములో పని చేయుటకు చెన్నపట్టణము పోవలసివచ్చినది. ఈలోగా విజయరామరాజు కుమారుడైన ఆనందరాజు ఫ్రెంచివారికి విరుద్ధముగా ఆంగ్లేయులతో కలిసి కుట్రలు పన్నుటచేత ఆంగ్లేయులు ఆశగలవారై, కర్నల్ఫోర్డును విశాఖపట్టణమునకు పంపించిరి. అతడు త్రోవలో పిఠాపురమునకు చేరువగానున్న గొల్లప్రోలులో ఫ్రెంచివారిని ఓడించెను. బుస్సీ వెడలిపోయిన తర్వాత నైజాం ప్రభువు సలాబత్‌జంగు ఆంగ్లేయులకు గుంటూరు తప్ప తక్కిన ఉత్తర సర్కార్లన్నిటిని 1759 లో ఇచ్చివేసెను. అతనికి అన్ని విధములను తోడు పడుటకు ఆంగ్లేయులున్ను, వారి సాహాయ్యముతో దక్కను నుండి ఫ్రెంచివారిని పారదోలుటకు నైజామున్ను ఒప్పుకొనిరి. 1759 లో సలాబత్‌జంగుచేసిన ఈఏర్పాటు, 1760 లో అతనిని చంపి నైజాం రాజ్యమునకు ప్రభువైన అతని సోదరుడు నిజామ్‌అలీ సైతము సమ్మతించెను. 1762 లో మోగల్ ప్రభుత్వమువారు సైతము దీనిని అంగీకరించిరి. 1764-1766 లో ఆంగ్లేయులు ఉత్తర సర్కారుల పరిపాలనము సాగించుకొనుటకు ప్రారంభించిరి. 1767 లో చెన్నపురిలోనున్న ఆంగ్లేయ ప్రభుత్వమువారు కాట్సుఫర్డుదొరను విశాఖపట్టణము, గంజాం జిల్లాలకు అధికారిగా నియమించి పంపించిరి. 1759 లో ఫ్రెంచి అధికారము జిల్లాలనుండి తొలగిపోయినది మొదలు కాట్స్‌ఫర్డుదొర వచ్చినవరకును విజయనగరపు రాజయిన ఆనందరాజుతమ్ముడు సీతారామరాజు విశాఖపట్టణము జిల్లాయున్ను, పర్లాకిమిడి రాజయిన నారాయణదేవు గంజాం జిల్లాయున్ను స్వతంత్ర రాజులవలె పరిపాలించుకొనిరి. కాట్స్‌ఫర్డుదొరకు విజయనగరరాజున్ను అతనితమ్ముడు సీతారామరాజున్ను లొంగిరిగాని నారాయణదేవు లొంగలేదు. అంతేకాక ఆంగ్లేయులతో యుద్ధమునకు సిద్ధపడెను. 1768 లో కాట్స్‌ఫర్డుదొర, నైజాంవారు ఆంగ్లేయులకిచ్చిన ఫర్మానా శ్రీకాకుళం కచ్చేరీలో బహిరంగంగా చదివించెను. అప్పటికిని నారాయణదేవు ఆంగ్లేయులను ఎదిరించెను. అప్పుడు టిలారు స్టేషనుకు చేరువగానున్న జలుమూరు గ్రామమువద్ద అతనికిని ఆంగ్లేయులకును

యుద్ధమయినది. నారాయణదేవు ఓడి, మాళువా ప్రదేశములకు పారిపోయెను. సుమారు 40 సంవత్సరములకాలము పర్లాకిమిడి రాజులు ఆంగ్లేయుల అధికారమునకు లోబడక అధికారులను ఎదిరిస్తూనే ఉండిరి. విశాఖపట్టణము, విజయనగరము మొదలయిన దక్షిణభాగములు సులభముగానే ఆంగ్లేయుల అధికారమునకు లోబడినవి. 1802 లో పెర్మనెంట్ రివెన్యూ సెటిల్‌మెంటు చట్టము ననుసరించి జిల్లాలోని జమీందారీలు ఏర్పడినవి. అదివరకు స్వతంత్రులై రాజ్యము లేలుకొంటున్న రాజులు జమీందారులయినారు.

ఈ జిల్లాలో చారిత్రక ప్రసిద్ధిపొందినవి :—

ముఖలింగము :—రెండవ గంగవంశము రాజులకు కళింగనగరమనుపేర రాజధాని నగరమయి యుండెను. పర్లాకిమిడికి దక్షిణమున 20 మైళ్లు దూరముగా నున్నది.

కళింగపట్టణము :—గంగవంశరాజులకు ప్రధానమైన రేవు పట్టణము. వంశధారానది సముద్రమున కలిసేచోట నున్నది.

దీర్ఘాసి :—కళింగ పట్టణమునకు చేరువగా నదికి ఆవలి యొడ్డున ఉన్నది. ఇక్కడ ప్రాచీన శిలాశాసనమున్నది.

దంతవక్త్రుని కోట :—శ్రీకాకుళంరోడ్డు స్టేషనుకు వాయవ్యముగా ఆరుమైళ్లదూరమున ములగాలవలస గ్రామమునకు చేరువగా ఉన్నది. పురాణములలో చెప్పిన దంతవక్త్రుడు కట్టించిన కోట కాబోలు! కోట గోడలు, బురుజులు పడిపోయినవి గాని వాటి చిహ్నములు మాత్రము నేటికిని కనబడుతున్నవి. ఇదియే అనంతవర్మ చోడగంగుదేవుని శాసనములలో చెప్పిన దంతాపురము అయిఉండును. రెండవ గంగవంశమును స్థాపించిన కామార్ణవుడు, ఆ ప్రాంతమును పరిపాలించుచుండిన శబరాదిత్యుని (సవరరాజును) ఓడించిన స్థలము. (చూ. భారతి 1925-కొర్ని శాసనములు.)

జలుమూరు :—1768 లో ఆంగ్లేయుల కాట్స్‌ఫర్డు పర్లాకిమిడి రాజయిన నారాయణదేవుని ఓడించిన స్థలము. తిలారు స్టేషనుకు చేరువగా ఉన్నది.

శ్రీకాకుళము :—1575 (గోల్కొండ నవాబుల కాలము) నుండి 1767 వరకును మహమ్మదీయుల అధికారమున ఉన్న కాలమందు చికాకోల్ సర్కారు ఫౌజ్‌దారులకు రాజధాని నగరము. 1641 లో గోల్కొండనవాబు అబ్దుల్లాకుతుబ్‌షా శ్రీకాకుళం సర్కారుకు షేర్ మహమ్మద్‌ఖానును ఫౌజ్‌దారుగా పంపెను. అతడు శ్రీకాకుళంలో అప్పుడుకట్టించిన మసీదు నేటికిని నిల్చియున్నది.

ఇచ్ఛాపురం :—గోల్కొండ కుదుబ్‌షా-నైజాం అధికారముగల కాలమందు శ్రీకాకుళం సర్కారుకు సహాయముగా నుండిన నవాబు నివాసస్థలము. (1575-1758)

విజయనగరం :—పదమూడవ శతాబ్దమునుండి పూసపాటివారి సంస్థానమునకు ప్రధాన నగరము.

బొబ్బిలి :—15వ శతాబ్దములో వెలమదొరలు రాజ్యమేర్పరచుకొనిరి. 1757-8లో బుస్సీ విజయరామరాజు సాయముతో బొబ్బిలికోట ముట్టడించి యుద్ధముచేసి జయముపొందెను.

మహేంద్రగిరి :—సుమారు 5000 అడుగులు ఎత్తుగల కొండ; మందసావద్ద నున్నది. అందు గోకర్ణస్వామి ఆలయము చాల ప్రాచీనమైనది. చోళరాజయిన రాజరాజు చెక్కించిన శాసనములు రెండు అరవభాషలో నున్నవి.

ఆముదాలవలస :—సముద్రగుప్తుని విజయయాత్ర విషయమున పేర్కొనబడిన ఏరండపల్లి; చికకోల్ రోడ్ స్టేషన్ వద్ద నొక గ్రామము.

సింగుపురము :—క్రీ. శ. 400 సరికి మాఠరవంశరాజులకు రాజధాని నగరము; అప్పుడు సింహపురమని పేరు.

పొట్నూరు:—క్రీ.శ. 1516-20 కృష్ణదేవరాయలు ఒరిస్సా ప్రతాపరుద్రగజపతి సేనలను ఓడించి పారదోలిన స్థలము.

ఆరోగ్య విషయమున ప్రసిద్ధికెక్కినవి :—

(1) వాల్తేరు, విశాఖపట్టణము ;—ఇక్కడ ఉష్ణతీవ్రత వేసవికాలములో సైతము తక్కువగానుండును.

(2) భీమునిపట్టణము :—ఆరోగ్యవిషయములో విశాఖపట్టణం తర్వాత చెప్పదగిన స్థలము. ఇక్కడి బావులలోని నీరు తీయగానుండును.

పుణ్యక్షేత్రములు :—

1. సింహాచలము :—స్టేషనుకు చేరువగానున్న కొండపేరు. కొండ కీవలితట్టు నరసింహస్వామి ఆలయమున్ను, త్రోవలో అనేకధారలున్ను, ఆవలితట్టు మాధవధారయున్ను, మాధవస్వామి ఆలయమున్ను కలవు. గంగవంశ రాజులు, ఒరిస్సారాజులు, కృష్ణదేవరాయలు చెక్కించిన దానశాసనములనేకముగా కలవు.

2. ముఖలింగము :— మధుకేశ్వరస్వామి ఆలయము, సోమేశ్వరాలయము, భీమేశ్వరాలయములు కలవు. ఇందు మొదటిది, ఎనిమిదవ శతాబ్దమున రెండవ కామార్ణవుడను గంగ వంశపురాజు కట్టించినది. ఇక్కడ శివరాత్రికి గొప్ప ఉత్సవము జరుగును.

3. శ్రీకూర్మము :—శ్రీకాకుళమునకు తూర్పున 6 మైళ్ల దూరాన సముద్రతీరమం దున్నది. కూర్మావతారమెత్తిన విష్ణువుగల ఆలయము ఇక్కడతప్ప మరియెక్కడను లేదు.

4. భీమునిపట్టణము :— విజయనగరమునకు దక్షిణమున 16 మైళ్ల దూరములో సముద్రతీరమం దున్నది. ఇక్కడి కొండపై నరసింహస్వామి ఆలయముకలదు.

5. అరసవల్లి :—శ్రీకాకుళమునకు ఒకమైలు దూరమున ఉన్నది. ఇక్కడ సూర్యుని ఆలయముకలదు.

6. సోంపేట :—బి. ఎన్. ఆర్. రైల్వే స్టేషనుకు రెండు మైళ్లదూరాన కలదు. ఇక్కడ బిడారు లింగేశ్వరాలయ మున్నది. చాల ప్రాచీన దేవాలయము.

# తూర్పుగోదావరిజిల్లా చరిత్ర

ప్రాచీనకాలమందు కొండలలోను, కొండల దిగువనున్న అడవులలోను కోదులు, చెంచులు, ఎఱుకులు మొదలయిన ఆదిమనివాసు లుండేవారు. ఇప్పటికిని వీరి సంతతివారు ఈ తూర్పు గోదావరి జిల్లాలో పెక్కుచోట్ల అడవులకు చేరువగానున్న పల్లెలలో కనబడుతున్నారు.

ప్రాచీన కళింగరాజ్యము గోదావరినది వరకును వ్యాపించి యుండెను. శాతవాహనులును, వారితర్వాత ఇక్ష్వాకులును, కదంబులును ఈ జిల్లాలో సైతము తమ రాజ్యములను వ్యాపింపజేసుకొనిరి. కాని, వీరి రాజ్యములలో ఈ జిల్లాకు సంబంధించిన వివరణములు మాత్రము తెలుసుకొనుటకు ఆధారములులేవు. సముద్రగుప్తుడు (క్రీ. శ. 326-375) దక్షిణదేశమందు విజయయాత్ర సలిపినప్పుడు పిష్ఠపురమున (పిఠాపురము) మహేంద్రుడు రాజ్యమేలుచుండెను. ఇత డేవంశపు రాజో తెలియదు; స్వతంత్రరాజో లేక వేంగీ పురమందలి సాలంకాయనవంశ హస్తివర్మ మహారాజునకు లోబడి కప్పము చెల్లిస్తూఉండిన మండలాధిపతియో లేక పల్లవులకు సంబంధించిన రాజో స్పష్టముగా చెప్పలేము. పిమ్మట కొద్దికాలమునకే పిష్ఠపురమున మాఠర వంశరాజుల రాజ్యమేర్పడినది. మరికొద్ది సంవత్సరములకు సాలంకాయన మహారాజులు (400-450) తూర్పుగోదావరి జిల్లాలో ప్రబలి యుండిరి. పిమ్మట 5 వ శతాబ్దములో విష్ణుకుండినులు ప్రబలి సాలంకాయనులను అణచివేయుటచేత, మాఠరవవంశ రాజులు మరల పిష్ఠపురమువరకును తమ అధికారమును వ్యాపింపజేసుకొనిరి. కాని, వారి రాజ్యపాలనము ఈ జిల్లాలో అట్టేకాలము నిలువలేదు. విష్ణుకుండినుల అధికార మైనను అట్టేకాలము నిలువలేదు. పిమ్మట పల్లవులు కొంత కాలము ఈ జిల్లాలో సైతము కొంతమేర తమ అధికారం వ్యాపింపజేసుకొని యుండవచ్చును.

ఏడవ శతాబ్దములో (615) చాళుక్య రాజులు వేంగిదేశ మును జయించిరి. రెండవ పులకేశి వేంగినగరమున తన సోదరుడైన కుబ్జవిష్ణువర్ధనుని మండలాధిపతిగా నియమించెను. ఇతడు కొద్దికాలములోనే స్వతంత్రుడయి, 642 లో వేంగీ దేశమందు తూర్పు చాళుక్య రాజ్యమును స్థాపించెను. ఈ రాజ్యము శీఘ్రకాలములో విస్తరించి తూర్పు గోదావరి జిల్లాలో సైతము వ్యాపించినది. 10 వ శతాబ్దమున రాజ మహేంద్రుడు (అమ్మరాజు విష్ణువర్ధనుడు) తన రాజధాని వేంగీనగరమునుండి రాజమహేంద్రవరమునకు మార్చుకొనెను. ఆ రాజమహేంద్రుని పేరే ఈపురమునకు పెట్టుటవలన రాజమహేంద్రవరమను పేరు వచ్చినది. రాజరాజనరేంద్రుని కాలమున (1022-1063) ఈ నగరము మంచి ఉన్నతదశలో నుండెను. అతని ఆస్థానకవి నన్నయభట్టు సంస్కృత మహా భారతమును ఆంధ్రీకరించుటకు పూనుకొని, ఆది సభాపర్వ ములున్ను, అరణ్యపర్వమందలి కొంత భాగమున్ను రచించెను.

గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాలలో వ్యాపించి యుండిన చాళుక్యరాజ్యపు రాజులకున్ను, దక్షిణదేశమందు వ్యాపించియుండిన చోళరాజ్యపు రాజులకున్ను సంబంధ బాంధవ్యము లుండేవి. రాజరాజనరేంద్రునితల్లి రాజరాజ చోళుని కూతురు. ఆమె సోదరుడైన రాజేంద్రచోడుని కూతురిని రాజరాజనరేంద్రుడు పెండ్లియాడెను. రాజరాజ నరేంద్రునికొడుకు రాజేంద్రచోడుడు సైతము తన మేన మామ కూతురిని పెండ్లియాడెను. అంతేకాక అతడు తన మేనమామలకు పుత్రసంతానము లేనందున చోళరాజ్యమునకు

సైతము రాజయి, కులోత్తుంగచోళదేవు అను పేరు వహించెను. ఇతని కూతురైన రాజసుందరిని కళింగదేశపు గంగ వంశరాజయిన రాజరాజు పెండ్లియాడెను. ఈ రాజరాజునకు రాజసుందరివలన పుట్టిన అనంతవర్మ చోడగంగదేవే కళింగ గంగవంశపు రాజులలో పెద్ద పేరుపొందినవాడు. ఈ విధముగా కళింగవంశపు రాజులున్ను, తూర్పు చాళుక్య రాజులున్ను, చోళవంశపు రాజులున్ను సంబంధ బాంధవ్యములు కలిగియుండిరి.

కులోత్తుంగచోళదేవు చోళరాజ్యమునకు రాజయిననాటి నుండిన్ని తూర్పు చాళుక్య రాజ్యము చోళసామ్రాజ్యమందొక భాగముగానుండి, చోళ సామ్రాజ్యాధికారమునకు లోబడి యుండుటచేత మండలాధిపతులయిన వెలనాటి చోళప్రభువుల పరిపాలనము ఈ జిల్లాలో కొంతకాలము ప్రబలియుండెను. ఈ ప్రభువులకు లోబడి హైహయ నాయకులు కోనసీమలో ప్రజాపాలనము సాగిస్తూఉండిరి. ఈకాలమందే స్థానిక ప్రభువులు—ఏలూరిలో నాదెండ్ల నాయకులున్ను, రాజమహేంద్రవరం తాలూకాలో కోరు కొండవద్ద అన్నలరెడ్డి మొదలయిన రెడ్డినాయకులున్ను తమ ప్రభుత్వమును సాగించుకొంటూ ఉండిరి. క్రీ.శ. 1300 నాటికి చోళసామ్రాజ్యము క్షీణించినది. కాకతీయ ప్రతాపరుద్రుడు ఈ జిల్లాను జయించెను. ఇతడు ఈ జిల్లా పరిపాలనమునకై పెద్దమల్లరాజు, చిన్న మల్లరాజు అనే ఇద్దరన్నదమ్ములను మండలాధిపతులుగా నియమించెను. వీరు చాలా క్రూరులై ప్రజలను హింసిస్తూ ఉండుటచేత, ప్రతాపరుద్రుడు వీరిని తప్పించి, ప్రజలకు హితమైన రాజ్యపాలనమునకు కావలసిన ఏర్పాట్లుచేసెను.

కోరుకొండ రెడ్డిరాజులు 1325 నుండి 1395 వరకున్ను స్వతంత్రరాజులయి ఇప్పటి రాజమహేంద్రవరము తాలూకా ఏలుచుండిరి. కోన (కూన) రెడ్డి ఈ రెడ్ల రాజులలో మొదటివాడు. పిమ్మట ముమ్మిడిరెడ్డి తుని వరకును తన రాజ్యము విస్తరింప జేసుకొనెను.

పిమ్మట రాజమహేంద్రవరము కొండవీటి రెడ్ల అధికారమునకు కొంతకాలము (1422-1450) లొంగియుండెను. ఈ జిల్లాలోగల ప్రసిద్ధనగరములనుగూర్చి చెప్పిన ప్రకరణములో ఈ రెడ్ల పరిపాలనావిశేషములు రాజమహేంద్రవర చరిత్రలో వివరించినాము.

ఇంతలో ఉత్తర దేశమందు కళింగ గంగవంశపురాజుల అధికారము పడిపోయినది. అందు కడపటి రాజైన నాల్గవ భానుని అతని మంత్రియైన కపిలేంద్రదేవు తొలగించి, క్రొత్తఒరిస్సా రాజ్యమును 1430 లో స్థాపించెను; 1454 లో భామినీసుల్తానురాజు సాయమున తెలుగుదేశమును సైతము జయించి, తన అధికారమును కొండవీటిసీమ పర్యంతము వ్యాపింపజేసుకొనెను. అతని మంత్రి 1458 లో రాజమహేంద్రవరమందు నిలిచి, మండలాధిపతిగా రాజ్య పరిపాలనము సాగిస్తూ ఉండెను. అంతకంతకు ఈ ఒరిస్సారాజుల అధికారము కపిలేంద్రదేవుని కుమారుడైన పురుషోత్తమదేవు కాలమందును, అంతకంటె ఎక్కువగా అతని కొడుకైన ప్రతాపరుద్రగజపతి కాలమందును అధికమయి, నెల్లూరి జిల్లాలోని ఉదయగిరి వరకును వ్యాపించినది.

16 వ శతాబ్ద మారంభమైన కొద్ది సంవత్సరములకు విజయనగర సామ్రాజ్యము కృష్ణదేవరాయలతో అత్యున్నత దశకు వచ్చినది. 1515 లో కృష్ణదేవరాయలు కొండపల్లి స్వాధీనము చేసుకొని, కొండవీడు నగరమున ప్రతాపరుద్ర గజపతి సేనల నోడించి పారదోలి, అతని భార్యను, కొమార్తెను చెరయందుంచెను. అంతేకాక గజపతిని వెంటదరిమి, విశాఖపట్టణము జిల్లాలోని పొట్నూరివద్ద మరియొకసారి పూర్తిగా ఓడించి, సింహాచలమున తన విజయ స్తంభమును ఎత్తించెను. అప్పుడు జరిగిన ఒడంబడిక ననుసరించి గజపతి కూతురిని కృష్ణదేవరాయలు వివాహమాడుటయున్ను, కృష్ణదేవరాయలు గజపతి భార్యను చెరనుండి విడిపించుటయున్ను జరిగినవి.

కృష్ణదేవరాయలు 1530 లో చనిపోయిన తర్వాత విజయనగర సామ్రాజ్యము క్షీణించుటకు మొదలుపెట్టుట చేతను, తుదకు 1565 లో తళ్లికోట యుద్ధమందు విజయనగరమువారు పూర్తిగా ఓడిపోవుటచేతను గోల్కొండ కుతుబ్‌షా అధికారము ఎక్కువయినది. 1540 లోనే కృష్ణా జిల్లా అతనికి లోబడినది. 1571 లో గోదావరి జిల్లా సైతము గోల్కొండవారికి స్వాధీనమయినది. నాటినుండిన్ని ఈ జిల్లాలో మహమ్మదీయుల బలము ఎక్కువగుతూ వచ్చినది. 1687 లో మొగల్ పాదుషా ఔరంగజేబు దక్కను దేశమును జయించి, దక్కను సుభా ఏర్పరచెను. ఈ సుభాదారు పరిపాలనమందు సముద్రతీరమునగల తెలుగు దేశములో

శ్రీకాకుళము, రాజమహేంద్రవరము, ఏలూరు, కొండపల్లి, గుంటూరు, సర్కారులు ఏర్పడినవి.

ఔరంగజేబు 1708 లో చనిపోయిన కొద్దికాలముననే మొగల్ సామ్రాజ్యము క్షీణించుటచేత, 1724 నాటికి దక్కను సుభాదారైన నైజామ్-ఉల్-ముల్కు స్వతంత్రుడైనాడు. గాని 1748 లో అతడు చనిపోగానే అల్లరులు ప్రారంభమైనవి. ఈలోగా వాణిజ్య వ్యాపారముల్కై మన దేశమునకు వచ్చి, అనేక స్థలములందు తమ నిలయముల నేర్పరచుకొనియుండిన ఫ్రెంచివారును, ఆంగ్లేయులును దేశములో తమ అధికారమును సైతము నెలకొల్పుకొనుటకు ప్రయత్నిస్తూ, తమలో తాము కలహించుకొంటూ ఉండిరి. 1750-3 లో ఫ్రెంచివారి పలుకుబడి నైజాం రాజ్యములో అధికమయినది. బుస్సీ హైదరాబాదులో నివాస మేర్పరచుకొని సముద్రతీరమందలి తెలుగు దేశములోగల సర్కారులు ఫ్రెంచివారి అధికారమునకు లోబడునట్లు నైజామునుండి యొక ఫర్మానా ఫ్రెంచి ప్రభుత్వమువారి కిప్పించెను. పిమ్మట జరిగిన చరిత్ర విషయములు విశాఖపట్టణము జిల్లా చరిత్రలో చెప్పినవే కనుక ఇక్కడ మరల చెప్పనక్కరలేదు.

## తూర్పుగోదావరి జిల్లాలో పేరుపొందిన స్థలములు.

చరిత్ర విషయములో ప్రసిద్ధిపొందినవి :—

1. పిఠాపురము :—దీనికి ప్రాచీనకాలమందలి పేరు పిష్టపురము. సముద్రగుప్తుడు దక్షిణదేశమందు విజయయాత్ర సలిపినప్పుడు ఇక్కడ మహేంద్రుడు రాజ్యమేలుచుండెను. పిమ్మట మాఠరవంశ రాజులును ఇక్కడనే రాజ్యమేలుచుండిరి. 1186 నుండి 1301 వరకు ఈ ప్రాంతమందు రాజ్యమేలిన వెలనాటి చోడులకు ఇదియే రాజధాని నగరము.

2. రాజమహేంద్రవరము :—తూర్పు చాళుక్య రాజు రాజమహేంద్రుడు కట్టించిన నగరము. నాటినుండిన్ని తూర్పు చాళుక్య రాజ్యమునకు రాజధాని నగరము. కుళోత్తుంగ చోళదేవుడు చోళరాజ్యమునకు రాజయిన తర్వాత ఇది అతని మండలాధిపతులకు ముఖ్యనగరమయినది. చోళ సామ్రాజ్యము క్షీణించుటకు మొదలుపెట్టగానే రాజమహేంద్రవరం తాలూకాలోని కోరుకొండ వద్ద రెడ్డిరాజులు తమ ప్రభుత్వమును నెలకొల్పుకొనిరి. వీరిలో అన్నల రెడ్డి ప్రభుత్వము 1300 వరకు సాగినది. అప్పుడు కాకతీయ ప్రతాపరుద్రుడు తెలుగు దేశములో చాలభాగము జయించి తన అధికారమును రాజమహేంద్రవరప్రాంత ప్రదేశమందును వ్యాపింపజేసుకొనెను. పిమ్మట కొండవీటిరెడ్ల ప్రభుత్వము వ్యాపించినది. వారిలో కుమారగిరి తన మరదియు, మంత్రియు అయిన కాటయవేమారెడ్డిని రాజమహేంద్రవరమున మండలాధిపతిగా 1385 లో నిల్పెను. 1422 లో ఇతడు చనిపోయిన తర్వాత మరియొక రెడ్డివంశమునకు సంబంధించిన దొడ్డారెడ్డి కుమారుడు అల్లారెడ్డి రాజమహేంద్రవరరాజ్యమును జయించి తన రాజవంశమును స్థాపించెను. అంతకుముందే 1415-1417 లో అతని శాసనములు పాలకొల్లు, పలివెల, దాక్షారామములలో గలవు. వాటినిబట్టి చూడగా ఇతడు కాటయవేమునికి మిత్రుడైనట్లును, ఒరిస్సా ప్రభువైన కపిలేంద్రదేవుతోను, విజయనగరరాజుతోను కలిసి అల్ప్ఖాన్ అను మహమ్మదీయవీరుని ఓడించినట్లును, పిమ్మట కొండవీటి రెడ్లను ఎదిరించి తుదకు రాజమహేంద్రవరరాజ్యమును జయించినట్లును కనపడుతున్నది. 1458-1459 లో ఒరిస్సా కపిలేశ్వరుని మంత్రి రాజమహేంద్రవర రాజ్యమేలుచుండెను. 1470-71 లో భామినీసుల్తానులు రాజమహేంద్రవరమును ముట్టడించి పట్టుకొనిరి. ఆ కాలమందు ఈ నగరమును స్వాధీన పరచుకొనుటకు ఒరిస్సా గజపతులున్ను, భామినీసుల్తానులున్ను, విజయనగరరాజులున్ను ప్రయత్నిస్తూ ఉండిరి. అందుచేత ఒకప్పుడు వారు, ఒకప్పుడు వీరు ఈ నగరమును ఏలుచుండిరి. 1478 లో దీనిని విజయనగరము వారు పట్టుకొనిరి. 1479-80 లో కులబర్గ మహమ్మదీయులు స్వాధీనపరచుకొనిరి. పిమ్మట ఇది ఒరిస్సా గజపతి యధికారమునకు లోబడినది. 1515 లో కృష్ణదేవరాయలు ప్రతాపరుద్రగజపతిని పారదోలి రాజమహేంద్రవరమును స్వాధీనపరచుకొనెను. కృష్ణదేవరాయలు చనిపోయిన తర్వాత విజయనగర సామ్రాజ్యము క్షీణింపగానే ప్రతాపరుద్రుని తర్వాతి ఒరిస్సా రాజులు మరల ఈ జిల్లాలో తమ అధికారమును వ్యాపింపజేసుకొనిరి. 1545 లో విజయనగరమువారు ఒరిస్సా విద్యాధరరాజును రాజమహేంద్రవరమునుండి పారదోలిరి. తుదకు 1571 లో ఇది గోల్కొండ నవాబుల పాలనములోనికివచ్చి ఈ జిల్లా చరిత్రలో చెప్పినట్లు మొగల్ సామ్రాజ్యమందలి దక్కన్ సుభాదారు అధికార

మునకు లోబడి, ఫ్రెంచివారి చేతులలో పడి, తుదకు ఆంగ్లేయుల ప్రభుత్వములోనికి వచ్చియున్నది.

3. కోరుకొండ :—రాజమహేంద్రవరం తాలూకాలో, రాజమహేంద్రవరమునకు ఈశాన్యదిక్కున 11 మైళ్లదూరాన కలదు. 1263 లో అన్నలరెడ్డి ఇక్కడ నొక కోట కట్టించెను. 1320-3 లో ఇది కాకతివంశ ప్రతాపరుద్రుని అధికారమందుండెను. పిమ్మట కోన (కూన) రెడ్డితో మరియొక రెడ్డి రాజులరాజ్యము 1325 నుండి 1395 వరకును సాగినది. వీరిలో ముమ్మిడిరెడ్డి యధికారము ఉత్తరమున తుని వరకును వ్యాపించియుండెను.

4. బెండపూడి :—14 వ శతాబ్దము ప్రారంభింపగానే కాకతీయప్రతాపరుద్రుడు ఈ జిల్లాసైతము జయించినప్పుడు, పెద్ద మల్లరాజు, చిన్న మల్లరాజు అనే ఇరువురు సోదరులను మండలాధిపతులుగా నియమించెను. వారు తుని తాలూకాలో ఈ బెండపూడి వద్ద నివాసమేర్పరచుకొని ఈ జిల్లా ప్రదేశమును ఏలుచుండిరి.

5. గొల్లప్రోలు :—విశాఖపట్టణము జిల్లా చరిత్రలో చెప్పినట్లు బొబ్బిలి యుద్ధానంతరము విజయనగరపు ఆనందరాజు ఫ్రెంచివారికి విరుద్ధముగా ఆంగ్లేయులతో కలిసి కుట్రలు పన్నుటచేత ఆంగ్లేయ ప్రభుత్వమువారు ఆశగలవారై, కర్నల్ ఫోర్డును విశాఖపట్టణమునకు పంపించినప్పుడు అతనికిని ఫ్రెంచి వారికిని మార్గములో పిఠాపురమునకు చేరువగానున్న ఈ గొల్లప్రోలు వద్ద యుద్ధము జరిగినది. 9-12-1758 లో కర్నల్ ఫోర్డు పిఠాపురము ప్రవేశించినప్పుడు ఫ్రెంచివారు గొల్లప్రోలులో విడిసియుండిరి. గనుక, అప్పుడు జరిగిన యుద్ధము గొల్లప్రోలు వద్ద జరిగినదని చెప్పుదురుగాని, వాస్తవముగా యుద్ధము జరిగిన స్థలము చందుర్తి (చందుర్రు) గ్రామము నంటియున్నది.

6. కాండూర్ :—ఇదియే పైని చెప్పిన చందుర్తి (చందుర్రు) పిఠాపురమునకు ఈశాన్యదిక్కున 7 మైళ్ల దూరాన కలదు. చందుర్రు విదేశీయుల నోట చాండూర్, కాండూర్‌గా మారినది. పైని చెప్పిన యుద్ధము ఇక్కడనే జరిగినది.

7. పెద్దాపురము:—ఇచ్చట పాండవుల మెట్ట కలదు. అక్కడ నొక గుహలో రాజమహేంద్రవరము వరకును పోవు సొరంగము కలదట !

## పుణ్యక్షేత్రములు

1. అన్నవరము:—పెద్దాపురమునకు ఈశాన్యమందు 25 మైళ్ల దూరాన కలదు. ఇక్కడ సత్యనారాయణాలయమున్నది. సంతానము లేనివారు ఈ దేవుని ఆరాధించి, మొక్కుబడి చెల్లించిన యెడల సంతానవతు లగుదురన్న నమ్మకము కలదు.

2. మూలపేట:—పిఠాపురమునకు తూర్పున 7 మైళ్ల దూరాన ఉన్నది. ఇక్కడ మొండిజగ్గన్న దేవాలయము కలదు. ఒరిస్సారాజుల దండయాత్రల తర్వాత ఒరిస్సావారి సంపర్కము కలుగుటచేత నిర్మితమైన దేవాలయము. ఆషాఢ శుద్ధ విదియ మొదలు ఏకాదశి వరకును రథోత్సవము జరుగును.

3. ధవళేశ్వరము:—రాజమహేంద్రవరమునకు చేరువగానున్నది. ఇక్కడ ప్రాచీనకాలములో నారదుడు కొంతకాల ముండెనని, ఇక్కడనున్న ధవళగిరిపై జనార్దనస్వామి ఆలయము కట్టించెనని ఇక్కడి వారు చెప్పుదురు. ఈ ధవళగిరి కొకప్రక్కనున్న గుహలో సొరంగము కలదు. దానిగుండా కాశివరకును పోయే మార్గమున్నదట ! ఆ గుహలో సంతానగోపాలస్వామి విగ్రహము కలదు. సంతానము లేనివారు ఈ గోపాలస్వామిని ఆరాధించిన సంతానవంతు లగుదురన్న నమ్మకము కలదు. ఇక్కడనున్న ఆంజనేయాలయములోగల రెండు పెద్ద రావిచెట్లు పూర్వము సీతారాములు నాటిన రావి మొక్కలకు సంబంధించినవేనట! ఈ కొండమీదనున్న పాదముద్రలు సీతారాముల పాదముద్రలే అందురు. పండ్రెండేండ్ల కొకసారి ఇక్కడ పుష్కరములకు సంబంధించిన ఉత్సవములు జరుగును.

4. కోటిలింగాలు :—రాజమహేంద్రవరమునకు చేరువనున్న కోటిలింగాలను 101 శివాలయములను రాజరాజనరేంద్రుడు ప్రతిష్ఠించి కట్టించెనట.

కాశీనుండి వచ్చిన యాత్రికులు ఈ కోటిలింగాల రేవు వద్ద తాము తెచ్చుకొన్న కాశీగంగ కొంత గోదావరిలో పోసి, గోదావరినీరు కలుపు కొందురు.

5. బిక్కవోలు :—(బిక్కవానిప్రోలు బిక్కనిప్రోలుగా మారి బిక్కవోలయినది ; బిక్కోలు అనికావచ్చును) రామచంద్రపురమునకు ఉత్తరమున 9 మైళ్లు దూరముగా ఉన్నది. ఇక్కడ సుబ్బారాయుడి (సుబ్రహ్మణ్యస్వామి) ఆలయం కలదు. మార్గశిర కృష్ణ షష్ఠికి ఉత్సవము జరుగును.

6. దాక్షారామము :—(దక్షుని ఆరామము) రామచంద్ర పురమునకు ఆగ్నేయ దిక్కున 4 మైళ్ల దూరములో ఉన్నది. ఇక్కడనే దక్షయజ్ఞము జరిగినదట. దక్షునిపై తీవ్రమైన కోపము వచ్చుటచేత, శివుడు తన స్వేదమునుండి వీరభద్రుని సృజించి, అతనిచేత దక్షుని చంపించెను.

ఇక్కడి దేవాలయములలో గొప్పది :—

భీమేశ్వరాలయము :—సుబ్రహ్మణ్యము తారకాసురుణ్ణి చంపినప్పుడు అతని మెడలోనున్న శివలింగము ముక్కలయి 5 చోట్ల పడినది—(1) కాకినాడ తాలూకాలోని భీమవరమందు (2) రామచంద్రపురం తాలూకాలోని దాక్షారామమందు (3) గుంటూరు జిల్లాలోని అమరావతి యందు. (4) పశ్చిమ గోదావరి జిల్లాలోని పాలకొల్లు నందు (5) కుమారారామమందు (ఎక్కడిదో తెలియదు)

ఈ దాక్షారామమందలి చెరువు సప్తగోదావరీజలము కల దట! ఇక్కడ వ్యాసుడు ప్రతిష్ఠచేసిన లింగము, నాటిన రావి చెట్టు కలవు. ఈ పుణ్యక్షేత్రమునకు దక్షిణకాశి యందురు. ఈ స్థలము మహమ్మదీయులకును పవిత్రస్థలమే. ఇక్కడ సాధు సయ్యద్ సాభాజీఆలియా ఘోరీ, మసీదు కలవు. 550 సంవత్సరముల క్రిందట అతడు ఇక్కడ ఉండేవాడట. ఒకసారి హిందువులకును అతనికిని ఎవరిదేవుని మాహాత్మ్య మెక్కువో పోటీ పరీక్ష వచ్చినప్పుడు ఒక లింగమును అక్కడి చెరువులో పడవేసి, ఎవరు తమమంత్రశక్తి ప్రభావమున పైకి తెప్పించగలరో చూతమని పందెము వేసిరట. అప్పుడు హిందూవులలో ఎవరును నెగ్గలేకపోయిరట. అతడు మాత్రము నెగ్గెనట.

7. గంగవరము :—రామచంద్రపురమునకు దక్షిణమున 7 మైళ్ల దూరములో నున్నది. ప్రాచీన కాలములో గంగానది ఇక్కడికి కాకి రూపమున వచ్చి పవిత్రమై, హంస రూపమున ఎగిరిపోతూ ఉండేదట.

8. కోటిపల్లి :—రామచంద్రపురమునకు దక్షిణమున సుమారు 10 మైళ్ల దూరాన ఉన్నది. ఇక్కడచేసిన మంచి కార్య మొక్కటియైనా చాలును-కోటి ఫలమును ఇచ్చును గనుక కోటిఫలి అన్న పేరు వచ్చినదనిన్ని, అదే కోటిపల్లిగా మారినదనిన్ని అందురు. ఎంత ఘోరమైన పాపములు చేసినవాడైనా సరే ఈ పుణ్యస్థలమునకు వచ్చిన యెడల అతని పాపములు నశించును; గనుక, ఇది మాతృగమనాఘహారి అనిన్ని యెన్నుదురు. గురుభార్యను గూడిన చంద్రుడు, తన పాపవిముక్తికై ఒక ఆలయమును కట్టించెనట. అదియే ఇక్కడి సోమేశ్వరాలయమట. అహల్యను మోసపుచ్చి కూడిన ఇంద్రుడు సైతము ఇక్కడనే ఒక ఆలయము కట్టించెనట. అదియే ఇక్కడి కోటీశ్వరాలయమట. ఇక్కడ శివరాత్రికి గొప్ప ఉత్సవము జరుగును. 12 సంవత్సరముల కొకసారి పుష్కర-ఉత్సవములు సైతము జరుగును.

9. రామఘట్టాలు :—ఇక్కడ నొక శివాలయముకలదు. రాములవారు, రావణుని చంపినందువల్ల వచ్చిన పాపమును పరిహరించుకొనుటకై అనేక శివాలయములను కట్టించిరనిన్ని అందులో ఒకటి ఇక్కడి శివాలయమనిన్ని చెప్పుదురు. యాత్రికులు చుట్టుపట్ల గ్రామములనుండి ఇక్కడికి వచ్చి, మాఘమాసమందు ఆదివారస్నానాలు చేస్తూఉందురు. ఇక్కడ నొకరాతిపలకపై కనబడుతున్న పాదముద్రలు రామపాదముల ముద్రలని ఇక్కడివారి నమ్మకము.

10. తిరుపతి వేంకటేశ్వరస్వామి ఆలయము :— తుని తాలూకాలో తిరుపతి అగ్రహారమం దున్నది. చైత్రమాసములో 5 దినములు ఉత్సవము జరుగును.

11. కేశనకుర్రు :— అమలాపురమునకు ఈశాన్యమున 11 మైళ్ల దూరమున నున్నది. ఇక్కడి చెరువులో ఒక్కసారి స్నానముచేసిన చాలును. పాపములు నశించునన్న నమ్మకము చాలామందికి కలదు. వ్యాసులవారు దాక్షారామమును కాశీ అంతటి పుణ్యక్షేత్రముగా చేయుటకు చూడగా ఇక్కడ "కాశీ న కురు" అన్న ఆకాశవాణి శబ్దము వినబడినదట. అదే కేశనకుర్రుగా మారినదట.

12. కడలి కపోతేశ్వరాలయము:—రాజోలు(రాజవోలు)కు ఆగ్నేయ దిక్కున $3\frac{1}{2}$ మైళ్ల దూరములో ఉన్నది. కడలి గ్రామములో ఒక సాధువు కపోతరూపమున ఈశ్వరుని పూజిస్తూ ఉండుటచేత కపోతేశ్వరుడు అనే పేరున్ను, కాదంబరి వారున్ను, కాశీభట్లవారున్ను, కటికరెడ్డివారున్ను ఉండుటచేత ఈ స్థలమునకు కకారపంచకస్థలమన్న-పేరున్ను వచ్చిన దందురు.

13. శివకోడు :—రాజోలుకు ఆగ్నేయదిక్కున 2 మైళ్ల దూరమున గలదు. రాములవారు రావణుని చంపినందువల్ల వచ్చిన పాపమును పరిహరించుకొనుటకు కట్టించిన కోటి శివాలయములలోను ఇక్కడ కట్టించిన శివాలయము కట్టకడపటి దందురు.

**14.** భీమవరము :—(కాకినాడ తాలూకాలోనిది)

దాక్షారామము గురించి చెప్పినదానిలో ఇక్కడి విష యముకలదు. ఇక్కడి భీమేశ్వరాలయమును బట్టి భీమ వరమన్న పేరు వచ్చినది.

**15.** కోరంగి :—ఇది ప్రసిద్ధ స్థలమగుటకు కారణము దీని ప్రక్కనున్న మసకపల్లి గ్రామము. ఈ గ్రామమం దున్న కోరంగినది అత్రిమహర్షి తెచ్చిన నదియట. సప్త సాగర యాత్రచేసే యాత్రికులు ఆత్రేయ సాగరసంగమము కలదని ఇక్కడికి తప్పకుండ వత్తురు. ఇక్కడనే మాయా మృగవేషమున వచ్చిన మారీచుణ్ణి రామలవారు చంపిరని చెప్పుకొందురు.

**16.** సర్పవరము :—కాకినాడకు ఉత్తరమున 4½ మైళ్ల దూరమున ఉన్నది. ఇక్కడనే తక్షకుడు పరిక్షిత్తును కరచి చంపెనట. అందుచేతనే దీనికి సర్పవరమను పేరు వచ్చినదట. అంతేకాక దీనికి నారదక్షేత్రమను పేరు సైతము గలదు. నారదుడు ఇక్కడి గుండములందు ఒక దానిలో మునిగి ఆడరూపము దాల్చి, మరి యొకదానిలో మునిగి మరల పురుషరూపమును పొందెనట. మొదటిది నారదగుండము ; రెండవది ముక్తిగుండము.

**17.** అంతర్వేది :—రాజోలు తాలూకాలో వసిష్ఠగోదా వరీ ముఖమున నున్నది. సప్తసాగర యాత్రాస్థలములలో ఇది కడపటిది ; చాలా ముఖ్యమైనది. వసిష్ఠుని కోరిక నను సరించి విష్ణువు రక్తవిలోచనుని చంపిన స్థలము. లక్ష్మీనర సింహస్వామి ఇక్కడ ఒక పుట్టలో ఉండిపోయెనట. ఒక గొల్లవాని ఆవు ఈ పుట్టపై, నిలిచి బాలరూపమున పైకి వస్తూ ఉండిన విష్ణువుకు పాలుకుడుపుతూ ఉండుట గొల్లవాడు కనిపెట్టిన తర్వాత, ఆలయ నిర్మాణము జరిగినదని కథగా చెప్పుకొందురు. ప్రతి సంవత్సరము మాఘమాసములో స్వామి కళ్యాణోత్సవము జరుగుచుండును. అప్పుడు సుమారు లక్షజనులు చూడవత్తురు. ఈ కళ్యాణమందు కోనసీమ ద్రావిడులు పెండ్లికూతురు వంకవారుగా గౌరవము పొందుతూ ఉందురు.

**18.** పట్టిసము :—(పాతపట్టిసము కొత్త పట్టిసము అని రెండు గ్రామాలు, అందులో పాతపట్టిసమే ముఖ్యమైన పుణ్యక్షేత్రము) ఇది ఏజెన్సీ మన్య ప్రాంతములోనే పోల వరమునకు దక్షిణముగా మూడుమైళ్ల దూరాన గోదావరీనది నడుమను ఒక రాతి దిబ్బగానున్న లంకలో ఉన్నది. ఒకసారి యావద్భారతదేశ పర్వతాల మహాసభ జరిగినప్పుడు ఇక్కడి పట్టిసం కొండకూడా ఆ మహాసభకు వెళ్లిందట. గాని అక్కడ దీనికి ఆదరం జరుగలేదు. అందుచేత ఈ పట్టిసం కొండ తిరిగివచ్చి ఘోరమైన తపస్సు చేసినదట. అప్పుడు శివుడు దాని పట్టుదలకు, భక్తికి మెచ్చి హిమాలయ పర్వత మును విడిచి ఈ పట్టిసం కొండపై కాపురముండడానికి వచ్చి ఇక్కడి వీరభద్రాలయంలో ఉన్నాడట !

**19.** భద్రాచలము :—ఇది తూర్పు గోదావరిజిల్లా ఏజెన్సీ మధ్యప్రదేశమందు గోదావరి ఒడ్డున ఉన్న పుణ్యక్షేత్రము ప్రాచీనకాలమందు రాములవారు సీతను రావణాసురు డెత్తు కొనిపోయిన తర్వాత ఆమెకై వెదకుతూ ఈ భద్రాచల ప్రాంతానికి వచ్చినపుడు, ఇక్కడ భద్రుడనే ఒక సిద్ధు డుండేవాడట. అతడు రాములవారిని సత్కరించి అక్కడ కొన్నాళ్లుండవలసినదని కోరగా సీతను తెచ్చుకొని వచ్చునప్పుడు అక్కడ కొన్నాళ్లు సీతతోకూడా ఉందునని చెప్పి, రాములువారు తమమాట ప్రకారం వచ్చి ఆ సిద్ధునకు ముక్తి ఒసగిరట. ఆ భద్రుడున్న కొండ గనుక ఆ ప్రదేశ మునకు భద్రాచలమను పేరు వచ్చినది. ఇక్కడ రాముల వారు వచ్చి ఉండిరి గనుక ఇది పుణ్యక్షేత్రమైనది. ఒక బైరాగి రాములవారి విగ్రహము కర్రపై చెక్కి ఒక చిన్న గుడి కట్టించి అందులో ఈ విగ్రహాన్ని పెట్టి ప్రతిష్ఠ చేసి నాడట. అదే క్రమక్రమముగా భద్రాద్రి రామదేవాలయ ముగా వృద్ధిపొందినది. 1725 లో నైజామ్ ప్రభువు (తానీషా అని వాడుక) కొలువులో ఉండిన గోపన్న (రామదాసు) సర్కారు పైకము 6 లక్షలు కర్చుపెట్టి ఈ దేవాలయాన్ని వృద్ధిపరచి దీనికొక గోపురము కట్టించి, రాములవారికి లక్ష్మణస్వామికి సీతాదేవికి ఆభరణాలు చేయించినట్లును, అందుకు నవాబు ఆగ్రహించి రామదాసును చెరసాలలో పెట్టించి హింసించినట్లును ఇతి వృత్తము కలదు. చెరసాలలో ఉండి రామదాసు చని పోయినట్లు ఒక కథగలదు. అతడు చెరసాలలో బాధ పడుతూ ఉండగా రామలక్ష్మణులు నవాబుకు రాత్రి అతని పడకగదిలో ప్రత్యక్షమై, రామదాసు బాకీపడిన మొత్తం చెల్లించి, రామదాసును చెరనుండి తప్పించినట్లు ఒక కథ దేశ మందు ప్రచారము చెంది ఉన్నది. చెరనుండి విముక్తుడైన రామదాసు భద్రాచలమునకు వచ్చి భద్రాద్రి రామశతకము,



భద్రాచలంలోని శ్రీరామ దేవాలయము.

భద్రాద్రి కీర్తనలు రచించి దేవునిలో లీనమయిపోయి పరమ పదించినట్లు భక్తులు చెప్పుకొంటూ ఉంటారు.

శ్రీరామనవమికి భద్రాచలంలో గొప్ప ఉత్సవం జరుగుతూ ఉంటుంది.

# పశ్చిమ గోదావరి జిల్లా చరిత్ర

ఈ జిల్లా 1918 లో ఏర్పడినది. అంతకుముందు ఇది కొంత కాలము గోదావరి జిల్లాలోను, కొంతకాలము కృష్ణా జిల్లాలోను ఉండుటచేత దీనిచరిత్ర ఆ జిల్లాల చరిత్రల ననుసరించి ఉన్నది; గనుక, ప్రత్యేకించి ఇక్కడ వ్రాయనక్కర లేదు; ఆ జిల్లాల చరిత్రలచూచి తెలుసుకొనవచ్చును. చరిత్ర విషయమున ప్రసిద్ధికెక్కిన స్థలములగురించి చెప్పి నప్పుడు ఈ జిల్లా చరిత్రకు సంబంధించిన విషయములు కొన్ని తెలియ జేస్తున్నాము.

ఈ జిల్లాలో చారిత్రక ప్రఖ్యాతి గల స్థలములు :—

(1) ఏలూరు :—ఇది పూర్వము కొంతకాలము రెడ్డి రాజులకు ముఖ్యనగరముగా నుండెను. ఆ రెడ్డిరాజుల కోట ఇప్పుడు శిథిలమై పోయినది. ఆ కోట ఏదిబ్బపై నుండెనో ఆ దిబ్బమీదనే ఇప్పుడు తాలూకా కచేరీ, పోలీస్ స్టేషను, మ్యునిసిపల్ హైస్కూల్ కలవు. దీని పూర్వ చరిత్ర పెదవేంగి చరిత్ర ననుసరించి యున్నది. 1480 సరికి ఉత్తరమునుండి ఒరిస్సా రాజు సైన్యములున్ను వాయవ్యము నుండి ముసల్మాన్ సైన్యములున్ను పడమటనుండి విజయ నగరంవారి సైన్యములున్ను వస్తూ, ఏలూరు పరిసర ప్రాంతములను తమ అధికారములోనికి తెచ్చుకొనుటకు యుద్ధములు చేస్తూ ఉండెను. 16 వ శతాబ్దమున గోల్కొండ నవాబు అధికారమునకు ఏలూరు లోబడినది. ఆ పిమ్మట జిల్లా చరిత్రలలో చెప్పినట్లు ఈ ప్రదేశమంతా మొగల్

సామ్రాజ్యములో చేరి దక్కన్ సుభాదారైన నైజాం ప్రభుత్వమున నిలిచి, తుదకు బ్రిటిష్‌వారి ఆధీనమునకు వచ్చినది. బ్రిటిష్ ప్రభుత్వమేర్పడ్డ తర్వాత ఏలూరు మొదట మచిలీపట్టణం జిల్లాలో ఉండేది; పిమ్మట 1859లో గోదావరి జిల్లాలో చేర్చినారు. ఇటీవల పశ్చిమగోదావరి జిల్లా ఏర్పడిన తర్వాత దీనికి ముఖ్యపట్టణమైనది.

(2) పెదవేంగి :—కుబ్జవిష్ణువర్ధనుడు ఇక్కడ నే తూర్పుచాళుక్యరాజ్యమును స్థాపించెను. అతని కాలమునుండి రాజమహేంద్రుని కాలముపరకును (642-935), ఇదియే ఆ రాజ్యమునకు రాజధాని నగరము. తత్పూర్వము (275 నుండి 450 వరకును) సాలంకాయనులు వేంగీపురమున రాజ్యము స్థాపించి పశ్చిమ గోదావరీ మండలమును పరిపాలించుచుండిరి. వీరుకట్టించిన సూర్య దేవాలయము ఇటీవల శిథిలమైనను నేటికిని వారికీర్తికి చిహ్నముగా నిల్చియున్నది. ఈ సాలంకాయనరాజులలో విజయనందివర్మ సూర్యవిష్ణు భక్తుడనిన్ని, ఇక్కడి విష్ణు దేవాలయమునకు అనేకముగా దానాలు చేసినవాడనిన్ని పెదవేగి శాసనమువల్ల తెలిసినది. సాలంకాయనుల తర్వాత విష్ణుకుండినులు (350-610) వేంగిలో (460 నాటికి) రాజ్యము స్థాపించిరి.

(3) దెందులూరు :—(లెందులూరు) వేంగికి సమీపమున ఉన్నది. పైని చెప్పిన విష్ణుకుండినులకు ముఖ్యపట్టణము.

(4) నరసాపురం :—ఏలూరుకు తూర్పు ఆగ్నేయ ములుగా 43 మైళ్ల దూరాన ఉన్నది. 1665లో ఇక్కడ డచ్‌వారు (ఒలందులు) ఇనుపకార్ఖానా పెట్టుకున్నారు. 1677 లో ఈ నరసాపురానికి ఉత్తర భాగాన ఉన్న మాడపాలెం ఆంగ్లేయులు ఆక్రమించి ఒక కార్ఖానా పెట్టుకొన్నారు. 1658 లో ఫ్రెంచివారుకూడా ఒక కార్ఖానా పెట్టుకొన్నారు.

### పుణ్యక్షేత్రములు

(1) ద్వారకాతిరుమల :— ఏలూరు తాలూకాలో ఉన్నది. ఇక్కడ కొండమీద శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయముకలదు. అందుచేత దీనికి చిన్న తిరుపతియను పేరు నైతము కలదు.

(2) పెనుగొండ :— తణుకు తాలూకాలో ఉన్నది. ఇక్కడ కన్యకాపరమేశ్వరి ఆలయము కలదు. అందుచేత ఇది వైశ్యులకు గొప్పపుణ్యక్షేత్రము.

(3) తడికలపూడి :—ఏలూరుకు ఈశాన్యంగా 14 మైళ్ల దూరాన ఉన్నది. ఇక్కడ ప్రాచీనకాలపు గంగేశ్వరస్వామి ఆలయం కలదు. ఇది భీష్ములవారు కట్టించిన దంటారు.

(4) బలివె :—ఏలూరు తాలూకాలో ఉన్నది. ఇక్కడ మహాశివరాత్రికి ఉత్సవం జరుగుతుంది.

(5) కొండగనిజెర్ల :— చింతలపూడి తాలూకాలో ఉన్నది. ఇక్కడ శ్రీరామనవమికి ఉత్సవం జరుగుతుంది.

చింతలపూడి, ధర్మాజీగూడెములలో భద్రాచల యాత్రికులకు తగిన సౌకర్యములు ఆరోగ్యశాఖవారు చేస్తూ ఉంటారు.

(6) తేతలి :—(తణుకు తాలూకా) శ్రీరామనవమికిన్ని మహాశివరాత్రికిన్ని ఉత్సవములు జరుగును.

(7) తీపర్రు
(8) దువ్వ
(9) నత్తారామేశ్వరం

} ఈ మూడు స్థలములలోను మహాశివరాత్రి ఉత్సవం జరుగుతుంది.

దువ్వలో వేణుగోపాలస్వామి కల్యాణంకూడా ఎక్కువగా జరుగుతుంది.

(10) నడుపూడి
(11) కొడమంచిలి
(12) ఆచంట

} నరసాపురం తాIIలో ఉన్నవి. ఇక్కడ సుబ్రహ్మణ్య షష్ఠి ఉత్సవం ఎక్కువగా జరుగును.

నరసాపురంలో అంతర్వేది తీర్థమునకు తగిన యేర్పాట్లు జరుగును.

# కృష్ణ జిల్లా చరిత్ర

ప్రాచీన కాలములో ఆదిమనివాసులయిన చెంచులు, యేనాదులు కోదులు ఉండేవారు. తర్వాత ద్రావిడులు చేరినారు. క్రీ. శ. రెండవ శతాబ్దమున ఆంధ్రులు తమ రాజ్యమును ఈ జిల్లాలో వ్యాపింపజేసుకొని కృష్ణానదీతీరములందు నగరములు నిర్మించుకొనిరి. బౌద్ధమతమును అవలంబించినవారు గనుక బౌద్ధస్తూపములు, చైత్యములు, ఆలయములు పెక్కుచోట్ల వెలసి యుండెను. నాల్గవ శతాబ్దము నాటికి పల్లవరాజ్యమందు ఈ జిల్లా చేరియుండెను. పిమ్మట

కొంతకాలము సాలంకాయనులు విష్ణుకుండినులు రాజ్యమేలిరి. ఏడవ శతాబ్దము నుండి 11 వ శతాబ్దము వరకును ఇది తూర్పు చాళుక్యరాజ్యమందున్ను పిమ్మట 17 వశతాబ్దము ప్రారంభించిన వరకు వెలచోళరాజ్యమందున్ను ఉండేవారు. పిమ్మట కొద్దికాలము మాత్రము కాకతీయులకు లోబడి 1328 నుండి 1424 వరకు కొండవీటి రెడ్ల పరిపాలనమం దుండెను. ఆ పిమ్మట కటకపురి ఒరిస్సారాజ్యము నేలుచుండిన కపిలేంద్రదేవు, పురుషోత్తమదేవు, ప్రతాపరుద్రగజపతి రాజులు నెల్లూరి వరకును తమ దండయాత్రలు సాగించి, తమ యధికారమును వ్యాపింప జేసుకొనుచుండిరి. 1516 నాటికి కొండపల్లిలోనున్న దుర్గము ఒరిస్సారాజుల అధికారమం దుండిన ప్రదేశమందలి దక్షిణపు పొలిమేర దుర్గమై యుండెను. పిమ్మట కృష్ణదేవరాయల విజయమువలన ఒరిస్సారాజుల అధికారము ఉత్తర సర్కారులనుండి తొలగిపోయినది గాని, ఈ జిల్లా సైతము మరి కొంతకాలమునకు మొగల్ సామ్రాజ్యమందలి దక్షిణ సుభాలోచేరి నైజాంవారి అధికారమునకు లోబడినది. 1750 సరికి ఫ్రెంచివారును ఆంగ్లేయులును దేశములో తమ పలుకుబడిన్ని అధికారమున్ను విస్తరింప జేసుకొనుటకు,ఒకరితో నొకరు పోటీగా దేశమందలి పరిపాలకులతో కలిసి యుద్ధములు సైతము జరుపుకొనుచుండిరి. ఉత్తర సర్కారులలో మొదట ఫ్రెంచివారి పలుకుబడియే ఎక్కువయినది. ఫ్రెంచి బుస్సీ నైజామునకుతోడుగా అతని వద్దనే ఉండి అధికారము చెలాయించుచుండెను. మచిలీపట్టణము (బందరు) ఫ్రెంచివారికి ముఖ్యస్థానమై ఉండెను. పిమ్మట ఈ జిల్లా, విశాఖపట్టణము జిల్లా మొదలయిన ఉత్తర సర్కారుల జిల్లాలవలెనే 1762-1765 లో ఆంగ్లేయుల పరిపాలనములోనికి వచ్చినది.

ఈ జిల్లాలో చారిత్రక ప్రఖ్యాతిగల స్థలములు :—

(1) మోటుపల్లి :— బాపట్లకు 6 మైళ్ల దూరమున ఉన్నది. మొదటి శతాబ్దమునుండి 15 వ శతాబ్దమువరకును ప్రఖ్యాతిపొందిన ఓడరేవు. దీని ప్రాచీన నామము మోసలపురము. ఈ ప్రదేశము కాకతీయ రాజ్యములో చేరియున్నప్పుడు మంచి ఉన్నతదశలో ఉండెను. కర్పూరము, ముత్యములు, పన్నీరు, దంతము, కస్తూరి, జవ్వాజి, సుగంధద్రవ్యములు, మిరియములు, పట్టునూలు, రాగి, సత్తు మొదలయిన సామగ్రి ఈ రేవులో మన దేశమునకు పై దేశములనుండి దిగుమతియగు చుండెను. ' మార్కోపోలో ' ఈ పట్టణమును చూచి దాని వైభవమును మెచ్చుకొనెను.

(2) నంగెగడ్డు :— దీని ప్రాచీన నామము నానెగెట్టు. కాకతీయుల కాలమున ఇదియును గొప్ప ఓడరేవు. జయపనాయకుడు కాకతీయగణపతి పేరను గణపేశ్వరమను ఒక గ్రామమును, ఆలయమును ఇక్కడ కట్టించెను.

(3) కోటూరు :— ఇది మరియొక ఓడరేవు. బృహత్పాలాయనులకు కొంతకాలము రాజధానిగా నుండెను.

(4) శ్రీకాకుళము :— ఇది ప్రాచీనాంధ్ర రాజులకు మొట్ట మొదటి రాజధాని.

(5) ఘంటసాల :— ఇప్పుడిది దివి తాలూకాలో ఒక పెద్ద గ్రామముగా మాత్రమే నిలిచియున్నది. ప్రాచీన కాలములో ఇదియొక పెద్ద నగరము. అప్పుడు దానిపేరు కంటకసెల. ఇదియును ప్రాచీన కాలపు ఓడ రేవులలో పేరు పొందినది. ' టాలమీ ' దీనిని వాణిజ్యకేంద్ర స్థలముగా పేర్కొని కీర్తించెను. ఇక్కడనుండి ఈజిప్ట్, రోమ్ మొదలగు విదేశములకు మన దేశమునుండి వజ్రములు, వస్త్రములు ఎగుమతియగు చుండెను. అందుచేతనే ఇక్కడ ఆంధ్రుల నాణెములతోపాటు క్రీ.శ. 2 వ శతాబ్దినాటి రోమన్ చక్రవర్తుల నాణెములు సైతము దొరుకుచుండును. మొదటి శతాబ్దపు బౌద్ధస్తూపమొకటి ఇక్కడ నున్నది. దీనివంటి మంచిస్తూపము దక్షిణ దేశములో మరి యెక్కడను లేదు. ఇక్కడనే ఆంధ్రుల శిల్పిచాతుర్యమును కన బరచు సరస్వతీ విగ్రహముకలదు. [చూ. పు. 113] జావా, సుమిత్రా, బోర్నియో మొదలయిన ప్రాక్ద్వీపములకు ఈ రేవునుండియే ఎక్కువగా ఆంధ్రులు పోయి, తమ నాగరికత వ్యాపింప జేసుకొంటూ ఉండిరి. తూర్పు చాళుక్యరాజుల కాలములో సైతము ఇది గొప్పరేవు పట్టణముగానే ఉండెను. 13 వ శతాబ్దము వరకును ఇది ప్రఖ్యాతి పొంది యుండెను.

(6) కొండమూడి :—బందరు సమీపమున గలదు. ఇక్కడ క్రీ. శ. 275 నాటి బృహత్పాలాయనుల శాసనము దొరికినది.

పుణ్యక్షేత్రములు :—

1. చిలుకలపూడి :— బందరునకు మూడు మైళ్ల దూరములో నున్నది. ఇక్కడ పాండురంగదేవాలయము

కలదు. ఒక భక్తుడు తదేకదీక్షతో ప్రార్థింపగా పాండురంగడు ఇక్కడ వెలసెనట. ఆ వెంటనే ఒక పెద్ద దేవాలయము నిర్మించిరి. కొద్దికాలము క్రిందట నుండిన్ని దీని ఆధిక్య మెక్కువయి పండరపురమందలి పాండురంగ దేవాలయముతో తులతూగుతున్నది. ఆషాఢశుద్ధ ఏకాదశినాడు ఇక్కడ గొప్ప ఉత్సవము జరుగును.

2. మోపిదేవి :—ఇక్కడ శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాలయము కలదు. మార్గశిర శుద్ధషష్ఠికి ఉత్సవము జరుగును.

3. శ్రీకాకుళము :—ఇక్కడ శ్రీకాకుళేశ్వరస్వామి (ఆంధ్ర విష్ణువు) ఆలయముగలదు. వైశాఖ పూర్ణిమనాడు స్వామి కల్యాణోత్సవము జరుగును. శ్రీ కృష్ణదేవరాయలు 11-2-1509 లో ఇచ్చటికి వచ్చి స్వామిని సేవింపగా, స్వామి అతని స్వప్నమున ప్రత్యక్షమై విష్ణుచిత్తీయము (ఆముక్తమాల్యద) కథావస్తువుగా ఎత్తుకొని ఆంధ్రప్రబంధము రచించవలసినదని కోరెనట. స్వామియాజ్ఞ ననుసరించి అతడా ప్రబంధమును రచించెను.

4. కళ్లేపల్లి :—దీని ప్రాచీన నామము కడలుపల్లి, కృష్ణాతీరమున గలదు. ఇందు నాగేశ్వరాలయమున్నది. శివరాత్రికి గొప్ప ఉత్సవము జరుగును. వేలకొలది యాత్రికులు వత్తురు. దీనికి దక్షిణకాశి యను నామాంతరము సైతముగలదు.

5. ఘంటసాల :—ఇక్కడనున్న కాలభైరవ సరస్వతి విగ్రహముల శిల్పము మొహెంజదారో శిల్పమును బోలియున్నది. నరసింహస్వామి విగ్రహము చాలా అందముగా నుండును. బౌద్ధుల స్తూపము, పాలరాతి విగ్రహములును గలవు. ఇక్కడి సరస్వతీ విగ్రహము ఆంధ్రుల శిల్పిచాతుర్యమును తెలియజేయును (చూ. పు. 113).

6. హంసలదీవి :—దీనినే త్రివేణీ సాగర సంగమమని సైత మందురు. మాఘపౌర్ణమికి పెద్ద ఉత్సవము జరుగును. ఇక్కడ కృత్తివెంటి వేంకటాచలముగారు గోపాలస్వామి ఆలయమును కట్టించినారు. కాసుల పురుషోత్తమకవి హంసలదీవిగోపాలశతకము రచించెను.

7. విశ్వనాథపల్లి :—ఇక్కడ నాంచారమ్మగుడి కలదు. ఫాల్గుణశుద్ధ పౌర్ణమినాడు పెద్ద ఉత్సవము జరుగును. నాంచారమ్మకు మ్రొక్కుబడి చెల్లించుటకు జనులనేకముగావచ్చి కోళ్ళు, గొఱ్ఱెలు, దున్నలు మొదలయిన జంతువులను బలిగా ఇస్తూఉంటారు.

# గుంటూరు జిల్లా చరిత్ర

**జిల్లా ఏర్పాటు** :—దక్కనులో నైజాం రాజ్యము 18 వ శతాబ్దములో ఏర్పడినప్పుడు సముద్రతీర మందున్న తెలుగు ప్రదేశమంతా నైజాం ప్రభుత్వమునకు లోబడినది. పరిపాలన సౌకర్యములకోసము నైజాం ప్రభుత్వమువారు తమ రాజ్యములో సర్కారు లనుపేరను మండలము లేర్పరచి ఒకొక్క సర్కారు ఒకొక్క అధికారి పాలన మందుంచిరి. ఉత్తర సర్కారులనేవి ఈవిధముగా ఏర్పడినవి. నేడు తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు అనే నాలుగు జిల్లాలున్న నైజాం ప్రభుత్వమున్న కాలములో రాజమహేంద్రవరము సర్కారు, మచిలీపట్టణము (బందరు) సర్కారు, గుంటూరు సర్కారు అని మూడు సర్కారులక్రింద ఉండెను. ఉత్తర సర్కారులు ఆంగ్లేయుల అధికారములోనికి వచ్చినతర్వాత సైతము ఈ యేర్పాటే కొంతకాలము నిలిచినది. 1859 లో పైని చెప్పిన మూడు సర్కారులున్ను కృష్ణా జిల్లా, గోదావరి జిల్లా అనే రెండు జిల్లాలుగా ఆంగ్లేయప్రభుత్వమువా రేర్పరచినారు. కృష్ణ జిల్లాలో ఈ గుంటూరు జిల్లా చేరియుండెను. ఆ పిమ్మట పైని చెప్పిన నాలుగు జిల్లాలున్ను ఏర్పడినవి.

చరిత్ర

గుంటూరు జిల్లా చరిత్ర కొంతవరకును కృష్ణా జిల్లా చరిత్ర వలెనే సాగినది. అందుచేత ఈ జిల్లాకు విశిష్టమైన చరిత్ర విషయములనే ఇక్కడ తెలియజేస్తున్నాము. ఆదిమ నివాసులలో చెంచులు, ఎఱుకులు మాత్రమేకాక నాగులు సైతము ఈ జిల్లాలో ఉండేవారు. నాగులే రనేపేరు ఈ నాగులనుండే వచ్చినది. మొదటి మూడు శతాబ్దముల కాలములోను ఆంధ్రులు, తర్వాత కొన్నాళ్లు పల్లవులు (240-340), ఇక్ష్వాకులు (250-340), కొద్దికాలము బృహత్పాలాయనులు (275), విష్ణుకుండినులు (350-610) తమ ప్రభుత్వమును ఈ జిల్లాలో సైతము వ్యాపింపజేసుకొనిరి. క్రీ. శ. 620 నుండి 1080 వరకును తూర్పు చాళుక్యులును

1080 నుండి 1280 వరకును చోళులును, పిమ్మట 1328 వరకును కాకతీయులును తమ ప్రభుత్వ మిక్కడ సైతము సాగించిరి. పిమ్మట ఈ జిల్లాలో కొండవీటి ప్రదేశమున రెడ్లరాజ్య మదయించి పై జిల్లాలకు సైతము వ్యాపించినది. పోలయవేమారెడ్డితో 1328 లో ప్రారంభమైన రెడ్లరాజ్యము రాచవేమారెడ్డి (1424-1427) నాటివరకును—ఒక నూరేండ్లు సాగినది.

కొండవీటి రెడ్డి రాజులలో అనేకులు విద్యను కవిత్వమును కళలను పోషించిరి. అందులో కొందరికి ఆంధ్ర సంస్కృత భాషలందు ఎక్కువ పాండిత్యము సైతము ఉండెను. కుమారగిరిరెడ్డికి (1382-1395) సంస్కృత భాషా పాండిత్యము ఎక్కువగానుండెను. అతని మరది కాటయవేమరెడ్డి కాళిదాస మహాకవి నాటకముల మూడింటికిని కుమారగిరిరాజీయ మనే పేర వ్యాఖ్య రచించెను. పెదకోమటి వేమారెడ్డికి గల సంస్కృత భాషా పాండిత్యము సుప్రసిద్ధమగుటచేత అతడు "సర్వజ్ఞ చక్రవర్తి" యను బిరుదము వహించినవాడు. ఇతడనేక గ్రంథములు రచించెను. అందులో అమరు శతకమునకు వ్యాఖ్యయైన శృంగారదీపిక, సాహిత్య చింతామణి ముఖ్యమైనవి. 'గద్య కవిసార్వభౌమ' డను బిరుదమువహించిన వామనభట్ట బాణ కవి అతని ఆస్థానమున విద్వాంసుడుగానుండి, వేమభూపాల చరిత్ర మొదలయిన గ్రంథములను రచించెను. ఈ పెద కోమటి వేమారెడ్డి ఆస్థానమునందే విద్యాధికారిగాను, కవీశ్వరుడుగాను ఉండిన శ్రీనాథుడు తెలుగు ప్రబంధములేకాక సంస్కృత భాషలో సైతము ఉత్కృష్టములయిన గ్రంథములను రచించెను.

1360-1482 ఈ కాలములో వాయవ్య దిక్కునుండి గోల్కొండ నవాబులున్ను, ఈశాన్యమునుండి ఒరిస్సారాజులున్ను ఈ జిల్లాకు దండెత్తి వచ్చుచుండిరి. 1516 సరికి విజయనగరపు కృష్ణదేవరాయలు కొండవీటి రాజ్యమును జయించెను. 1536 సరికి నల్లకొండ, కొండవీడు దుర్గములు గోల్కొండ కుతుబ్‌షాకు లోబడినవి. పిమ్మట ఈ జిల్లా సైతము గోల్కొండ నవాబులకు లోబడి, మొగల్ సామ్రాజ్యములో చేరి, పిమ్మట నైజాం రాజ్యమందుండి, ఫ్రెంచివారి అధికారమునకు కొద్దికాలములోబడి, తుదకు 1770 సరికి ఆంగ్లేయుల పరిపాలనములోనికి వచ్చినది.

గుంటూరు జిల్లాలో పేరుపొందిన స్థలములు.

చరిత్ర విషయమున ప్రసిద్ధిపొందినవి :—

(1) అమరావతి :—ఇది గుంటూరు నగరమునకు ఉత్తరమున సత్తెనపల్లి తాలూకాలో 20 మైళ్లదూరముగా కృష్ణానది యొడ్డున ఉన్నది. ఆంధ్రరాజ్య మీ ప్రదేశమున విస్తరించి యున్న కాలములో, అనగా క్రీస్తు శకము రెండవ శతాబ్దములో గొప్ప పట్టణమై యుండెను. ఆ కాలమున బౌద్ధులయిన ఆంధ్రులు నిర్మించిన పెద్దపెద్ద కట్టడములలో కొన్ని నేటికిని కనబడుతున్నవి. అప్పటి బౌద్ధస్తూపములలో ఇక్కడ కట్టించిన స్తూపము కడుపెద్దది.

(2) ధరణికోట :—అమరావతికి సమీపమందే పడమటి వైపున వున్నది. పూర్వకాలమున ఇది ధాన్యకటకమను పేరను ఆంధ్రరాజులకు రాజధాని నగరమై ఉండెను. పిమ్మట కోట రాజులకును రాజధానిగ నుండెను. ఆ పిమ్మట దీని వైభవము క్షీణించినది; నగరము పాడయినది.

(3) బెల్లంకొండ :—సత్తెనపల్లి తాలూకాలో గుంటూరు మాచెర్ల రైలుమార్గమున ఉన్నది. 1516 సరికి కొండపల్లి, ఒరిస్సా గజపతుల దక్షిణపు పొలిమేర దుర్గమయి ఉన్నప్పుడు బెల్లంకొండ సీతాపతిరాజు వశమైయుండెను. అతడు ఒరిస్సా గజపతులకులోబడి వరంగల్, కమ్మంమెట్ట దుర్గములు సైతము స్వాధీనము చేసుకొనియుండెను. అప్పుడు కుతుబ్‌షాకును సీతాపతి రాజుకును యుద్ధము జరిగినది. సీతాపతిరాజు ఓడి, కమ్మంమెట్టకు పారిపోయెను. బెల్లంకొండ కుతుబ్‌షా స్వాధీనపరచుకొనెను. సీతాపతిరాజు అంతటితో ఊరుకొనక, చుట్టుప్రక్కలనున్న హిందూనాయకుల సాహాయ్యముపొంది కుతుబ్‌షాను ఎదిరించెను. కమ్మంమెట్టలో యుద్ధమైనది. అందును మహమ్మదీయులకే విజయము కలిగినది. పిమ్మట సీతాపతిరాజు కొండపల్లెకు పారిపోయెను. అక్కడి ఒరిస్సా గజపతి విజయనాథదేవురాజు కొడుకైన రామచంద్రదేవు ఉండెను. అతని సాహాయ్యముపొంది కుతుబ్‌షాతో యుద్ధము సాగించెను. పాలంచెన్నూరు (పెనుకంచిప్రోలు) వద్దయుద్ధము జరిగినది. అక్కడను మహమ్మదీయులే గెలిచిరి. దానివలన కుతుబ్‌షా అధికారము గోదావరివరకును వ్యాపించినది. 1536 సరికి నల్లకొండ, కొండవీడు దుర్గములు సైతము మహమ్మదీయులకు పూర్తిగా స్వాధీనము లయినవి.

(4) పల్నాడు తాలూకాలో పల్నాటి వీర చరిత్రకు సంబంధించిన గ్రామములు గురిజాల, మాచర్ల, కారెంపూడి మొదలగునవి కలవు.

గోలి :—కృష్ణానదీతీరమున ఉన్నది. ఇక్కడ ప్రాచీన శిల్పము లెక్కువగా దొరికినవి.

(5) ఉండవల్లి :—గుంటూరు తాలూకాలో ఉన్నది. ఇక్కడ ప్రాచీనకాలపు బౌద్ధ విగ్రహములున్ను కొండల యందు గుహలును కలవు.

**పుణ్యక్షేత్రములు :—**

1. మంగళగిరి :—గుంటూరు తాలూకాలో ఉన్నది. ఇక్కడ మంగళాద్రియను కొండమీదను పానకాలరాయని దేవాలయమున్ను, కొండదిగువను నృసింహస్వామి ఆలయ మున్ను కలవు.

2. క్రోసూరు :—సత్తెనపల్లి తాలూకాలో ఉన్నది. ఇక్కడ ఒక చిన్న కొండమీదను విష్ణుదేవాలయమున్నది.

3. అమరావతి:—ఇచ్చట క్రౌంచగిరిపై ఒక గొప్ప శివాల యమున్నది. ఆ శివలింగమునకు అమరేశ్వరస్వామి యనిపేరు.

4. అమీనాబాద :—సత్తెనపల్లి తాలూకాలో ఉన్నది. ఇక్కడి గుట్టలమీద దేవాలయము లనేకముగా కలవు. అందు రాతిస్తంభములమీదను రాతిగోడలమీదను పురాణకథ లకు సంబంధించిన చిత్రములు అనేకముగా చెక్కియున్నారు.



కోటప్పకొండపైని కోటీశ్వరాలయము

5. కోటప్పకొండ :—కోటీశ్వరాలయముకలదు. ఇక్కడ శివరాత్రికి గొప్ప ప్రభల మహోత్సవము జరుగును.

6. కోర్లూరు :—ఇదిన్ని సత్తెనపల్లి తాలూకాలోనే ఉన్నది. ఇక్కడ ప్రసిద్ధిపొందిన హనుమంతుని విగ్రహము గలదు.

7. చేజెర్ల :—పూర్వము శిబిచక్రవర్తి, డేగకు లేన తొడ లోని మాంసము కోసియిచ్చిన స్థలమని ప్రతీతి. ఇక్కడ కపోతేశ్వరస్వామి ఆలయమున్నది.

8. చేబ్రోలు :—ఇక్కడ నాలుగు ముఖములుగల బ్రహ్మ దేవుని ఆలయమున్నది. శివరాత్రికి గొప్ప ఉత్సవముజరుగును.

9. పొన్నూరు :— భావనారాయణస్వామి ఆలయ మున్నది. వైశాఖ శుద్ధపౌర్ణమికి గొప్ప ఉత్సవము జరుగును.

# నెల్లూరు జిల్లా చరిత్ర

ఇతర జిల్లాలవలెనే ఈ జిల్లాలో సైతము ప్రాచీన కాల మందు ఏనాదులు, ఎరుకులు, చెంచులు మొదలయిన ఆదిమ నివాసులు మెండుగా ఉండేవారు. ఈ జిల్లా ప్రాచీన చరిత్ర విషయములు స్పష్టముగా కాలనిర్ణయముచేసి చెప్పు టకు తగిన ఆధారములు లేవుగాని, తెలిసినంతమట్టుకు ప్రాచీన పల్లవరాజ్యము (క్రీ. శ. 225-340) ఈ జిల్లాలో సైతము కొంతవరకు వ్యాపించినదనిచెప్పవచ్చును. కొంతకాలం పిమ్మట ఆంధ్ర చోళరాజులు ఈ ప్రదేశమును స్వాధీనము చేసుకొనిరి. అప్పుడీ ప్రదేశమునకు పాకనాడని పేరు. 11 వ శతాబ్దములో, చోళరాజులకు కప్పముచెల్లిస్తూ నెల్లూరు జిల్లాలో రాజ్యమేలుచుండిన ముకుంటిరాజు తన దేశమునకు దండెత్తివచ్చిన చాళుక్యులను పారదోలెను. 13 వ శతాబ్ద ములో నెల్లూరి జిల్లాయందలి దక్షిణ భాగమున సూర్యవంశపు రాజయిన మనుమసిద్ధి రాజ్యమేలుచుండెను. అతని ఆస్థాన మున తిక్కనసోమయాజి మంత్రిగానుండెను. ఇతడు కాకతీయ గణపతి రాజునకు (1190-1256) సమకాలికుడు. మనుమసిద్ధిని అతని జ్ఞాతులయిన అక్కన బయ్యనలు రాజ్య మునుండి తొలగించినప్పుడు, తిక్కనసోమయాజి ఓరుగంటికి పోయి, తన ప్రభువును మరల రాజపదవియం దుంచుటకు తగిన సహాయ్యము చేయవలసినదని గణపతి రాజును వేడు కొనెను. అతని కోరిక ప్రకారము గణపతిరాజు పెద్ద సైన్యముతో వెడలి అక్కన బయ్యనలను పారదోలి, మనుమ సిద్ధికి మరల రాజ్యము లభించునట్లు తోడుపడెను. ఇట్లు చేయుటవల్ల నెల్లూరు జిల్లాపై సైతము కాకతీయ రాజుల

యధికారము చెల్లుచుండెను. ఢిల్లీసుల్తానుల దండయాత్రల వలన కాకతీయ సామ్రాజ్యమునశించిన తర్వాత గుంటూరు జిల్లాలో కొండవీటి సీమ వెలసిన రెడ్లరాజ్యము (1328-1427) ప్రబలినది. నెల్లూరు జిల్లాలో చాలాభాగము సైతము రెడ్డి రాజుల అధికారమునకు లోబడినది. ఇంతకు పూర్వమే రేచెర్ల చెవిరెడ్డిన్ని అతని వంశమువారున్ను వేంకటగిరిలో రాజ్య మేర్పరచుకొనిరి. చెవిరెడ్డి రాజ్య మేర్పడుటకున్ను రేచెర్ల అనేపేరు కలియుటకున్ను ఒక కథ ఆనాటనుండిన్ని అను శ్రుతంగా వస్తూఉన్నది. చెవిరెడ్డి అనమగల్లు అనే గ్రామంలో ఒకరైతు భూమి దున్నుతుండగా ఒకచోట 9 లక్షల రూపాయలు విలువగల నిక్షేపమున్ను, ఒక రాగి పట్టాశాసన మున్ను దొరికినవి. ఇవి ఎవరికి దొరుకునో వారు నరబలి ఇచ్చి ఆ ధనము వాడుకోవలెననిన్ని అట్లు చేసినయెడల సంపన్ను లగుదురనిన్ని ఆ శాసనములో ఉన్నది. అప్పుడా రైతువద్దనున్న సేవకుడు రేచెర్ల అనువాడు రెండు షరతులకు చెవిరెడ్డి ఒడబడినయెడల తానేబలియగుటకు ఒడబడుదునని చెప్పెనట. చెవిరెడ్డిన్ని అతని సంతతివారున్ను రేచెర్ల అనే పేరు తమ ఇంటిపేరుగా పెట్టుకోవలెననిన్ని, రెడ్డి సంతతివారు తమఇంట పెండ్లికార్యము తలపెట్టినప్పుడు రేచెర్ల కులము వారిలో ఒకరికి పెండ్లి చేయకుండా తమ ఇంటి పెండ్లి పని జరిపించకూడదనిన్ని ఆ సేవకుడుకోరెను. చెవిరెడ్డి అందుకు సమ్మతించగా రేచెర్ల బలియయ్యెను. కాకతీయరాజుల అధికారము చెల్లినన్నాళ్లు చెవిరెడ్డి సంతతి నాయకులు కాకతీయులకు కప్పము చెల్లిస్తూ ఉండిరి.

ఒరిస్సా ప్రతాపరుద్రగజపతి 15 వ శతాబ్దము ప్రారంభించిన సరికి ఉదయగిరివరకును తన రాజ్యాధికారము వ్యాపింప జేసుకొనెను. పిమ్మట కొద్దికాలమునకే విజయనగరపు కృష్ణదేవరాయలు ప్రతాపుని ఉదయగిరికోట ముట్టడించి అతని సేనలను పారదోలెను. అప్పటనుండిన్ని కొంతకాలము ఈ జిల్లా విజయనగరమువారి అధికారమునకు లోబడి యుండెను. తల్లికోట యుద్ధములో విజయనగరము వారు పూర్తిగా ఓడిపోవుటవలన ఈ జిల్లా సైతము గోల్కొండనవాబుల అధికారమునకు లోనైనది.

### నెల్లూరు జిల్లాలో పేరుపొందిన స్థలములు

ఈ జిల్లాలో చారిత్రక ప్రసిద్ధిపొందినవి :—

(1) శ్రీహరికోట :—ఇది ఒక ద్వీపము. ఆదిమనివాసులైన ఏనాదులకు మాతృస్థానము.

(2) ఉదయగిరి :—కావలి రైల్వేస్టేషనుకు పడమట 50 మైళ్ల దూరాన ఉన్నది. ఒరిస్సా రాజులలో ప్రతాపరుద్రగజపతి, 15 వ శతాబ్దాంతముసరికి తన అధికారమును ఉదయగిరివరకును వ్యాపింపజేసుకొని, ఇక్కడ దుర్గమును నిలబెట్టుకొనెను. పిమ్మట కొద్దికాలమునకే కృష్ణదేవరాయలు ప్రతాపరుద్రుని సేనలను పారదోలి, ఉదయగిరి జయించి తన అధికారమును నెలకొల్పెను.

(3) వడుగుపాడు :—నెల్లూరు పట్టణమునకు ఈశాన్యమున ఉన్నది. కుమ్మరి మొల్ల జన్మించి, నివసించిన ఊరు.

(4) కందుకూరు :—పల్లవ శివస్కందవర్మ కాంచీపురము నుండి ప్రకటించిన తామ్రశాసనములలో ఒకటి ఈ గ్రామములో దొరికినది. (చూ. పు. 112)

పుణ్యక్షేత్రములు :—

1. నెల్లూరు :—జిల్లా ముఖ్యపట్టణము ; పినాకినీ తీరమున ఉన్నది. నదికి సమీపముగా శ్రీరంగనాయకుల దేవాలయము కలదు.

2. మూలస్థానేశ్వర దేవాలయము:—నెల్లూరిలో నైరృతి మూల నున్నది.

3. జొన్నవాడ :— నెల్లూరికి 8 మైళ్ల దూరాన ఉన్నది. కామాక్షమ్మ ఆలయము గలదు.

4. నరసింహులకొండ :— నెల్లూరికి సమీపముననే ఉన్నది. ఇక్కడ నరసింహస్వామి దేవాలయము కలదు. ఇదిగాక 'పెంచెలికోన' అనే నరసింహక్షేత్రము సైతము కలదు.

5. బుచ్చిరెడ్డిపాలెము :—ఇచ్చట ఒక పెద్ద దేవాలయ మున్నది.

6. తిరుమడికొండ :— అహోబల నరసింహస్వామి ఆలయము-క్రీ శ. 1435 లో కట్టినది-కలదు.

7. సోమసిల్ల :—(ఆత్మకూరు తాలూకా) సోమేశ్వరాలయమున బ్రహ్మోత్సవము మే, జూన్ మాసముల నడుమ జరుగుతుంది.

8. కోటీశ్వరస్వామి ఆలయం:-(ఆత్మకూరు తాలూకా) కోటరాజులకు కోటీశ్వరుడు ప్రత్యక్షమైనప్పుడు కట్టినదట.

9. కలువాయి :—(ఆత్మకూరు తాలూకా) చెన్నకేశ్వరస్వామి ఆలయము గలదు.

10. నసిరి :—వరదరాజస్వామి ఆలయము ; చోళ రాజులు కట్టించినది కలదు.

# కడప జిల్లా చరిత్ర

జిల్లాచరిత్ర :—చరిత్రకందని ప్రాచీన కాలమునాటి చిన్న చిన్న రాతి గుహలు జిల్లా అంతటను అక్కడక్కడ అనేకముగా కనబడుతున్నవి. వీటిని పాండవుల గుడులు అని అంటారుగాని, వాస్తవముగా ఇవి ప్రాచీనకాలమందు మనుష్యులు నివసించిన ఇండ్లయి యుండును. పల్లవులనాటి వరకును ఈ జిల్లా చరిత్ర మనకు తెలియదు. క్రీ. శ. 225-630 లో పల్లవులు, రాయలసీమ జిల్లాలోను, చిత్తూరు, చెంగల్‌పట్టు, నెల్లూరు, గుంటూరు జిల్లాలలోను ప్రబలి యుండిరి. మొదట అదోని, తర్వాత కంచి (కాంచీపురము-కాంజీవరము) ఈ రాజ్యమునకు రాజధాని. ఆ కాలమున కడపజిల్లా పల్లవుల రాజ్యములో చేరియుండెను. వింధ్య పర్వతములకు దక్షిణమున చాళుక్య రాజ్యము వ్యాపించి యుండెను. పల్లవులును చాళుక్యులును తమ రాజ్యములను దేశములో ఎక్కువగా వ్యాపింపజేసుకొనుటకు ప్రయత్నించుచు ఒకరితోనొకరు కలహించుచుండిరి. రెండు రాజ్యముల వారికిని యుద్ధములు జరుగుచుండెను. అట్టి యుద్ధములలో ఒకటి జమ్మలమడుగు తాలూకాలో పెద్దముడియము వద్ద చాళుక్య విజయాదిత్యునకును, త్రిలోచన పల్లవునకును జరిగినది. ఆ యుద్ధములో చాళుక్యులకు విజయము కలిగినను కడప జిల్లా చాళుక్యుల వశము కాలేదు.

పల్లవుల తర్వాత కడపజిల్లా చోళరాజ్యములో చేరినది. 7 వ శతాబ్దములో మన దేశమునకువచ్చిన హ్యూన్‌త్సాంగ్ అను చీనాయాత్రికుడు రచించిన గ్రంథములో 'చూల్యరాజ్య'మని చెప్పినది చోళరాజ్యము. అందు కడప, కర్నూలు, అనంతపురంజిల్లాలలో పెక్కు భాగములు చేరియుండెను. 9 వ శతాబ్దము అంతమయినసరికి కడపజిల్లా అంతా కాకపోయినా అందులో ఉత్తరభాగము బాణవంశరాజుల పరిపాలనములో ఉన్నట్లు కడబడుతుంది. రాష్ట్రకూట రాజ్యమేలుచుండిన రాజులలో మూడవ కృష్ణరాజు రాజ్యమేలుచుండిన కాలమందు—అనగా క్రీ. శ. 940 నుండి 956 వరకు కడప జిల్లాలో తూర్పు భాగము తప్ప తక్కిన జిల్లా అంతా రాష్ట్రకూటరాజుల పరిపాలనములో నుండెను. పండ్రెండవ శతాబ్దములో ఈ జిల్లా మరల చోళుల వశమయినది. నెల్లూరు, కడప, కర్నూలు జిల్లాలుగల చోళరాజ్య భాగము నేలుచుండిన చోళరాజులకు తెలుగుచోళులని పేరు. ఇందులో పడమటనున్న కడప, కర్నూలు జిల్లాలకు మేర్ (ఎగువ) పాకనాడు, నెలూరు జిల్లాకు పాకనాడు, తూర్పుతీర ప్రదేశమునకు కీర్ (దిగువ) పాకనాడు అని ఆనాటి పేళ్లు. పిమ్మట 13 వ శతాబ్దములో కాకతీయులు కడప జిల్లాలో ప్రవేశించి పడమటి భాగము కొంత, మధ్య భాగము కొంత స్వాధీన పరచుకొన్నారు. మరికొద్ది కాలమునకే హొయ్‌సలారాజులు, రాయచోటి తాలూకా తప్ప తక్కిన జిల్లా అంతా తమ ఏలుబడిలోనికి తెచ్చుకొన్నారు. గాని మరికొద్ది కాలములోనే మాలిక్‌కాఫురు దండయాత్రలు జరిగినవి. దక్షిణ దేశమందలి చాలా ప్రదేశములతోపాటు కడపజిల్లా సైతము మహమ్మదీయులకు వశపడినది. క్రీ. శ. 1336 లో విజయనగరరాజ్యము వెలసిన తర్వాత క్రీ. శ. 1646 వరకున్ను కడప జిల్లా అంతా రాయలసీమలో చేరియుండెను.

విజయనగర సామ్రాజ్య చక్రవర్తులలో ప్రఖ్యాతిపొందిన కృష్ణదేవరాయలు చనిపోయిన తర్వాత, సదాశివుని కాలములో అతని బావలు—రామరాజు, తిరుమలరాజు—సర్వాధికారులయి, పరిపాలనము సాగించుచుండిరి. క్రీ. శ. 1565 లో తల్లికోట యుద్ధములో హిందువులు పూర్తిగా ఓడిపోయిన తర్వాత, రామరాజు చనిపోగా తిరుమలరాజు పెనుకొండ రాజధానిగా పెట్టుకొని కడప నేలుతూ ఉండెను. క్రీ. శ. 1576-7 లో మహమ్మదీయులు పెనుకొండ సైతము పట్టుకోగా తిరుమల కొడుకు రంగ, చంద్రగిరికి పారిపోయి నివసించినాడు. క్రీ. శ. 1646 వరకున్ను కడప జిల్లా ఈ రంగని సంతతివారే ఏలుతూ ఉండిరి. తల్లికోట యుద్ధమైన తర్వాత బిజాపురం గోల్కొండ నవాబులు తక్కిన రాయలసీమ జిల్లాలు తీసుకొనిరి గాని; కడపజిల్లా మాత్రము రాయలవారికి సంబంధించిన హిందూ రాజుల పరిపాలనములోనే ఉండేది. క్రీ. శ. 1646 లో కడప సైతము గోల్కొండ నవాబులు తీసుకొన్నారు. క్రీ. శ. 1687 లో మొగల్ పాదుషా ఔరంగజేబు గోల్కొండ రాజ్యాన్నే జయించడం వల్ల కడపజిల్లా మొగల్ సామ్రాజ్యంలో చేరిపోయినది.

తల్లికోట యుద్ధమైన తర్వాత జిల్లాలో తగిన పరిపాలనము లేకపోవుటవల్ల, జిల్లాలో ఎక్కువ బలము, పలుకుబడిగలవారు అధిరాజులయినవారికి లోబడి కప్పము చెల్లిస్తూ, వాస్తవమైన

పరిపాలకులయి ప్రజలపై అధికారము చెలాయిస్తూ ఉండేవారు. అట్టివారికి పాలిగార్లు అని పేరు. ఆ పాలిగార్లలో మట్లి వారు ముఖ్యులు. 'కాకుస్థ విజయము' అనే తెలుగు ప్రబంధము రచించిన మట్లి అనంతుడు ఈ మట్లి కుటుంబమునకు చెందినవాడే. క్రీ. శ. 1775-1779 లో హైదర్, టిప్పు సుల్తానులు కడప జిల్లా సైతము జయించి స్వాధీనపరచుకొనిరి. ఈలోగా మొగల్ సామ్రాజ్యమందలి సూబాలలో దక్కను సూబా పరిపాలకుడైన నైజాం (అనగా హైదరాబాద్ పరిపాలకుడు) స్వతంత్రుడై, దక్షిణదేశములో ప్రబలియుండెను. ఆంగ్లేయులు ఫ్రెంచివారిని అణగ ద్రొక్కి, చెన్నపురి రాజ్యము స్థాపించి, ఉత్తర సర్కారులు స్వాధీనపరచుకొని, రాజ్య మభివృద్ధి చేసుకొంటూ ఉండిరి. నైజామువారున్ను ఆంగ్లేయులున్ను మిత్రులయి హైదర్, టిప్పు సుల్తానులను ఓడించి, అతని రాజ్యములో కొంతభాగము తీసుకొనిరి.

టిప్పుసుల్తానుతో క్రీ. శ. 1792-1799 లో ఆంగ్లేయులు చేసుకొన్న ఒడంబడికల ప్రకారము, టిప్పుసుల్తాను నైజామువారికి రాయలసీమ జిల్లాలు అన్నీ ఇచ్చుకోవలసి వచ్చినది. ఆ సమయములో రాయలసీమ జిల్లాలు నైజాం వారికి ఇప్పించకుండా, ఆంగ్లేయులు తామే తీసుకొనియుందురు. అందుకు తగిన సమర్థత వారికి లేకపోలేదు గాని, నైజాము మైత్రి కోరి వారా పనిచేయలేదు. అప్పుడు ఆంగ్లేయులకును నైజామువారికిని కలిగిన మైత్రి నిబంధనల ప్రకారము ఉభయులకును కావలసిన సైన్యములను నిలబెట్టుకొనుటకుగాను సిబ్బంది కర్చులకు నైజామువారు ఆంగ్లేయులకు కొంత ధనము చెల్లించవలసియుండెను. అది నైజామువారు చెల్లించలేక రాయలసీమ జిల్లాలు క్రీ. శ. 1800-1 లో ఆంగ్లేయులకు ఇచ్చివేసి, వీటిపై వచ్చేశిస్తు ఆ సిబ్బంది కర్చుల కుపయోగించుకొండన్నారు. అట్లు నైజాము వారు ఇచ్చిన మండలము గనుక ఈ జిల్లాలకు దత్తమండలము జిల్లా లనుపేరు వచ్చినది. నాటినుండిన్ని కడపజిల్లా ఆంగ్లేయుల పరిపాలనమునకు లోబడి యున్నది.

## కడప జిల్లాలో పేరుపొందిన స్థలములు

చారిత్రక ప్రసిద్ధి పొందినవి :—

(1) గండికోట :—ఇక్కడ పెన్నానది ఎత్తైన గండి గుండా ప్రవహిస్తూ ఉన్నది. ఆ నదికి దక్షిణపు ఒడ్డున ఒక పురాతనమైన కోటగలదు. ఆ గండియు ఈ కోటయు గల పురము గనుక దీనికి గండికోట యనే పేరువచ్చినది. ఈ కోటలో కొంతకాలము హిందూ రాజులున్ను కొంత కాలము మహమ్మదీయ పాలకులున్ను నివసించియుండిరి.

(2) మారెల్లమడక :—పాపఘ్నినది, పాలకొండనుండి వచ్చే కనుమద్వారమున ఇదిగలదు. ఇక్కడ చాలాపురాతనమైన ఆంజనేయ దేవాలయమొకటి కొండమీద నున్నది. వాయుదేవుడిక్కడ తపస్సుచేసుకొంటూ, రాములవారు యుద్ధానంతరము అయోధ్యకు ఈ దారిని మరలిపోతూ ఉండగా వారిని ఆహ్వానించి ఆతిథ్య మిచ్చెనట. అక్కడనుండి అయోధ్యవరకును రాములవారుపోయే మార్గమంతా పూవుల దారిగా వాయుదేవుడు ఏర్పరచెనట. రాముడు ఆ ప్రదేశమునుండి బయలుదేరేముందు తన ధనుస్సు చిహ్నమును అక్కడ నొక శిలపై నుంచెనట. వ్యాసుడు, అక్కడ వాయుపుత్రుడైన హనుమంతుని విగ్రహము చెక్కించెనట. పిమ్మట నొక దేవాలయము ఎవరో కట్టించి అందులో ఈ విగ్రహమును ప్రతిష్ఠించిరి. వాయుదేవు డేర్పరచిన పువ్వుల దారిలో పుణ్యాత్ములయినవారికి, చచ్చుటకుముందు ఇప్పుడు పువ్వులుకనబడునన్న నమ్మకము కలదు. సర్ టామస్ మన్రో గారికి పువ్వులు కనబడినవట ; కనబడిన మరికొద్దిదినములకే వారు మరణించినారు.

(3) పోరుమామిళ్ల :—బద్వేలు కుత్తరమున 20 మైళ్ల దూరములో కడప—కంభం రోడ్డు ప్రక్క నున్నది. అక్కడ నొక పెద్ద చెరువుగలదు. ఆ చెరువు కట్టమీదను భైరవ స్వామి కెదురుగా రెండు శిలాశాసనము లున్నవి. హరిహర బుక్కరాయని కాలమున అతని కుమారుడు భాస్కర రాయడు ఉదయగిరి రాష్ట్రాధిపతియై, ఈ చెరువు త్రవ్వించెనని శాసనములలో ఉన్నది.

పుణ్యక్షేత్రములు :—

1. రామేశ్వరము :— ప్రొద్దుటూరు తాలూకాలో ఉన్నది. శ్రీరాములవారు రావణుని చంపి అయోధ్యకు వెళ్తూ ఇక్కడ ఆగి, లింగప్రతిష్ఠ చేశారట. మంచిలింగం కాశీనుండి తెమ్మని ఆంజనేయుని పంపించారటగాని, అతడు ఆలస్యంచేసినందున వేళలేదని ఇసుకలింగం పెట్టించినారట.

2. ఒంటిమెట్ట :—కోదండ రామస్వామి ఆలయము సిద్ధవట్టం తాలూకాలో ఉన్నది. ఏప్రెల్ నెలలో రథో


శ్రీ కోదండ రామస్వామి ఆలయము, ఒంటిమెట్ట.

త్సవమున్ను, శ్రీరామనవమికి తెప్ప ఉత్సవమున్ను జరుగుతూ ఉంటవి.

3. పుష్పగిరి :—కడప తాలూకాలో పెన్నేరు ఒడ్డున ఉన్నది. ఇక్కడ చెన్న కేశవస్వామి ఆలయం కలదు. స్వామి ప్రసాదం పుచ్చుకొన్న యెడల వటునకు వివాహమున్ను, గొడ్రాలికి కాన్పున్ను వేగముగా కలుగునన్న నమ్మకము చాలామందికి కలదు.

4. రాయచోటి :—వీరభద్రస్వామి ఆలయమున్నది. ఫెబ్రువరి నెలలో 7 దినాలు రథోత్సవము జరుగుతుంది. ఉత్సవ దినాలలో గర్భగుడి తలుపులువేసి లోపల స్వామి కనుబొమలనడుమ జాజికాయ అంత కెంపు తగిలించి స్వామిని ముక్కంటిగా తయారుచేస్తారు. వెలుపలను స్వామి కెదురుగా అన్నము రాసిగాపోసి ఉంచుతారు. అప్పుడు తలుపులు తీస్తారు. ఆ సమయంలో స్వామి కండ్లకు అన్నమురాసి తప్ప మరియేదిన్ని కనబడరాదు. ఎవరైనావచ్చి స్వామికి కనబడిన యెడల వారు వెంటనే నశిస్తారన్న భయము భక్తులందరికిని కలదు.

రాయచోటికి పూర్వము రాచవీడు అనేవారు. పురాతన శాసనములలో రాచవీడు అనే పేరు కనబడుతున్నది.

5. కందిమల్లయపల్లె :—ఇక్కడ వీరబ్రహ్మంగారి మఠమున్నది. రాబోవు పరిస్థితులు చెప్పటలో వీరబ్రహ్మానికి పెద్ద పేరుగలదు. శివరాత్రికి ఇక్కడ గొప్ప ఉత్సవము జరుగును.

# కర్నూలు జిల్లా చరిత్ర

జిల్లా చరిత్ర :—ఈ జిల్లాలోను దీనికి ఉత్తరమునగల నైజాం రాజ్యమందలి మహబూబ్‌నగర మండలమందున్ను నేడు కనబడుతూఉన్న చెంచుల మూల పురుషులు, కిరాతులు ఈ ప్రదేశమందు ప్రాచీన కాలములో ఆదిమనివాసులుగాఉండే వారని ఇక్కడివారు చెప్పుకొంటారు. అంతకంటె ఎక్కువగా ఈ జిల్లా ప్రాచీన చరిత్ర తెలుసుకొనుటకు ఆధారములేవీ లేవు. పాండవవంశపు ఉత్తుంగభోజుని కుమారుడైన నందన చక్రవర్తి రాజమహేంద్ర వరప్రాంతము నుండి వెన్న దేశానికి వచ్చి ఇక్కడ నొక రాజ్యము స్థాపించినాడనీ ; అతడే ఉత్తర దేశమునుండి 500 బ్రాహ్మణకుటుంబాలను తెప్పించి వారికి నందవరమనే అగ్రహారమిచ్చాడనీ ప్రతీతి. నందనగుళ్లను గ్రామము నంద్యాలపొలిమేర బంగనపల్లి రాజ్యములో నున్నది. ఈ ప్రాంతమందు నందవరీకులనే బ్రాహ్మణులు ఎక్కువగా ఉన్నారు. వీరందరును ఆనాటి ఆ 500 బ్రాహ్మణ కుటుంబములవారి సంతతివారే కావలెను. ఈ నందవరీక బ్రాహ్మణులకు చౌడేశ్వరి కులదేవత.

అదోని రాజధానిగా వెలసిన పల్లవ రాజ్యములో (క్రీ.శ. 225-340) ఈ జిల్లా నైతము చేరియుండెను. పిమ్మట మరికొన్ని శతాబ్దములు గడచినవరకు ఈ జిల్లా చరిత్ర స్పష్టముగా తెలియదు.

పశ్చిమ చాళుక్య రాజ్యములో కర్నూలు జిల్లా క్రీ. శ. 1060 నాటికి చేరియుండెను. ఆకాలమందున్ను, తర్వాత కొంతకాలము వరకున్ను చాళుక్యులకున్ను చోళులకున్ను తరుచుగా యుద్ధములు జరుగుతూ ఉండేవి. చోళులు కర్నూలు మీదికి దండెత్తివచ్చి కొల్లబెట్టి పోవుచుండిరి. క్రీ. శ. 1120 నాటికి కర్నూలు జిల్లాలో ఎఱ్ఱమల కొండలకు తూర్పునగల పెద్ద భాగము చోళులున్ను, పడమటగల చిన్న భాగము యాదవులున్ను తీసుకొనిరి.

13 వ శతాబ్ద మారంభించిన కొద్దికాలమునకు కాకతీయ గణపతి నెల్లూరివరకు దండెత్తి వచ్చి కర్నూలు, నెల్లూరు జిల్లాలు జయించెను. మార్కాపురం తాలూకాలో ఉన్న త్రిపురాంతక గ్రామంలో కొంతకాలముండి, తాను జయించిన ఈ ప్రదేశమందలి పరిపాలనమునకు కావలసిన యేర్పాట్లు చేసెను. అవికొనసాగుటకు అక్కడ అతని మంత్రియైన గోపరాజు రామన్న అనే ఆరువేల నియోగిబ్రాహ్మణుడు గణపతి యనుమతిని పొంది. గ్రామకరణాలుగా ఆరువేల నియోగిబ్రాహ్మణులనే నియమించెను. అంతకుముందు బలిజ వంశపు కవరీలు గ్రామకరణాలుగా ఉండేవారు. ఇప్పటికినీ సముద్ర తీరమందలి గ్రామాలలో వీరే కరణాలు. కాకతీయ ప్రతాపరుద్రుని కాలములో కర్నూలు జిల్లా అంతా కాకతీయుల పరిపాలనమందే ఉండేది. పిమ్మట జిల్లాలోని స్థానిక ప్రభువులు స్వతంత్రులయి అధికారము చెలాయిస్తూ ఉండేవారు. క్రీ. శ. 1328-1460 లో జిల్లాలోని తూర్పు భాగము, కంభం, మార్కాపురం తాలూకాలు అనవేమరెడ్డి పరిపాలనములోనికి వచ్చినవి. నంద్యాలభాగము విజయ నగరపు బుక్కరాయలు వశపరచుకొన్నారు. క్రీ. శ. 1520 నాటికి కర్నూలు జిల్లా అంతా కృష్ణదేవరాయల రాజ్యంలో చేరినది. క్రీ. శ. 1565 లో తల్లికోట యుద్ధమందు విజయనగరంవారు పూర్తిగా ఓడిపోగానే ఈ జిల్లాలో చాలాభాగము బిజాపురం నవాబు తీసుకొన్నాడు; గాని, క్రీ. శ. 1625 వరకు జిల్లా అరాజకంగానే ఉండేది. పిమ్మట బిజాపురం నవాబు పరిపాలన విషయములో కొంత శ్రద్ధ తీసుకొన్నాడు. క్రీ. శ. 1674 లో జిల్లా బిజాపురంవారి పరిపాలనలో ఉండగానే, శివాజీ దండెత్తివచ్చి దోచుకుంటూ ఉండేవాడు. పిమ్మట ఔరంగజేబ్—మొగల్ పాదుషా—దక్కనుజయించుటయున్ను, దక్కన్ సూబాకు ప్రభువైన నైజామ్ స్వతంత్రుడై నైజామ్ రాజ్యము స్థాపించడమున్ను జరిగినవి. క్రీ. శ. 1775-1779 లో హైదర్ కర్నూలు కడప జిల్లాలు స్వాధీనపరచుకొన్నాడు. తర్వాత, కడప జిల్లావలెనే ఈ జిల్లా సైతము నైజామువశమై తుదకు క్రీ. శ. 1800-1 నాటికి బ్రిటిష్ ప్రభువులకు దత్తమండలమయి, నేటివరకును ఆంగ్లేయుల పరిపాలనమం దున్నది.

బంగనపల్లె రాజ్యమును పరిపాలించు రాజొక నవాబు. హైదరాబాదు నవాబు వలెనే ఇతడు స్వతంత్రుడు; సర్వాధికారి.



శ్రీశైల మల్లికార్జునస్వామి దేవాలయము.

పుణ్యక్షేత్రములు :—

1. శ్రీశైలము :—దక్షిణ దేశములో మిక్కిలి పురాతనమైన పుణ్యక్షేత్రము. దీని మాహాత్మ్యము స్కాందపురాణమందును, మహాభారతమందును కలదు. ఈ శ్రీశైలమందు ప్రాచీనకాలములో శిలాధిముని గొప్ప తపస్సు చేసెనట. అతనికి పర్వతుడను నొకకొడుకు సైతము ఉండెనట. ఆ తపస్సనున్ను పర్వతుని ప్రార్థనలనున్ను మెచ్చి, శివుడు లింగాకారమును దాల్చి శ్రీశైలమున ప్రత్యక్షమయ్యెనట. దేశమునగల 12 జ్యోతిర్లింగములలో ఇదియొక ప్రధానమైన లింగమట. ఈ లింగముతోపాటు దేశమందుగల 18 శక్తులలోను ప్రధానమైనశక్తి—భ్రమరాంబయను పేరుగలశక్తి—సైతము ఇక్కడ వెలసినది. గుప్తవంశపు రాజకన్య, చంద్రావతియను భక్తురాలు, మల్లికాపుష్పములతో ఈ లింగమును పూజించుటవల్ల ఈ దేవునకు మల్లికార్జునస్వామి యనిపేరు వచ్చెను.

శ్రీశైలమునకు చేరువగానున్న కృష్ణానదిలో నొక భాగమునకు పాతాళగంగయని పేరు. యాత్రికులు ముందుగా ఈ గంగలో స్నానముచేసి దేవుని దర్శించవలెను. ఉత్సవదినములలో ధనవంతులు ఇక్కడ అన్నదానము చేస్తూ ఉంటారు. శ్రీశైలశిఖరము చూచి స్వామిని దర్శించి కొలచినవారికి మరి పునర్జన్మ లేదన్న నమ్మకము భక్తులకు మెండుగాగలదు. ఇది ఇంత పుణ్యక్షేత్రము గనుకనే, దూర

దేశములనుండి నైతము వేలకొలది యాత్రికులు వస్తూ ఉందురు.

క్రీ. శ. 1058 లో చాళుక్య రాజయిన త్రైలోక్యుడు శ్రీశైలమునకు వచ్చి స్వామిని దర్శించెను. అతడును తక్కిన హిందూరాజుల నేకులును, ఈ అలయమునకు స్వామి వారి రాగభోగాదుల నిమిత్తము చాలా దానములు చేసి యున్నారు.

(2) మహానంది:—ఇదిన్ని అడవులనడుమ నున్నది. ఇక్కడమహానందియొక్క ఆలయముకలదు. ఇక్కడ నైతము శివరాత్రినాడు ఉత్సవము జరుగును.

(3) అహోబిలము :—ఇది సిరివేల్ తాలూకాలో రుద్ర వనమువద్ద నున్నది. ఇదిన్ని అడవుల నడుమనే కలదు. ఇక్కడ నొక కొండమీదను శ్రీ నరసింహస్వామి ఆలయమున్నది. విష్ణువు నరసింహావతార మెత్తి, హిరణ్యకశిపుని చీల్చిచంపిన స్థలము ఇక్కడనే కలదని క్షేత్రమాహాత్మ్యములో ఉన్నది. ప్రతి సంవత్సరము ఫాల్గున మాసములో ఉత్సవము జరుగును. కొండవీటి రెడ్డిరాజులును విజయనగర రాజులును ఈదేవాలయ మునకు అనేక దానములు చేసియుండిరి.

(4) ఓంకారము :—నంద్యాలకు చేరువగానే ఉన్నది. ఇక్కడ ఆంజనేయ దేవాలయము, శివాలయము గలవు. అవి గాక ఇక్కడ నాకరావిచెట్టు కలదు.

(5) సంగమేశ్వరము :—నందికొట్కూరు తాలూకాలో కృష్ణా, తుంగభద్ర, భవనాశి కలసినచోట నుండుటచేత గొప్ప పుణ్యక్షేత్రమయినది. నదీతీరమున ఒక శివాలయమున్నది. అది ఎత్తైన ప్రదేశమం దుండుటచేత అక్కడనుండి చూచిన యెడల దిగువను పారుతున్న నదులు, పల్లపునేలలు కడు రమ్యముగా కనబడును.

(6) చెన్నకేశవస్వామి ఆలయము :—మార్కాపురం తాలూకాలో కలదు. స్వామి ఆదిఆంధ్రులకు, అందులో చెన్నయ్య దాసరులకు ఇష్టదేవత.

(7) మల్లంపల్లి వేణుగోపాలస్వామి ఆలయము :—మార్కాపురం తాలూకాలో ఉన్నది. ఆలయమును క్రీ. శ. 1518లో విజయనగరరాజ వంశములోనివాడైన వరదరాజు నిర్మించెను ; గాని, విగ్రహము మాత్రము చాలా పురాతన కాలమునుండిన్ని ఉండెనట.

(8) నెమలిగుండము రంగస్వామి ఆలయము :— కంభం తాలూకాలో నల్లమలల అడవుల నడుమ, ఒక జలధార దిగువ నొక మడుగు వెనుక తట్టున ఉన్నది. కార్తవీర్యార్జున పరశు రాముల యుద్ధమును సూచించు చిత్రము కలదు.

(9) తురిమెల్లేశ్వరాలయము :—శివాలయము. ఇక్కడ లింగముయొక్క తలపై నొక ముక్క ఊడినట్లు కనబడును. దానికికారణముగా ఒక కథ కలదు. కార్తవీర్యుని ఎదిరించుటకు సాహాయ్యముకొరకు తిరుగుతూ, కామధేనువు తన కాలి డెక్కలను లింగము తలమీద పెట్టినప్పుడు, దాని రాపిడికి ఒక ముక్క విరిగిపోయినదట.

(10) భైరవస్వామి ఆలయము :—అకవీడు అనే అడవు లలో ఒక రాతిపైని గలదు. అక్కడి గుహలో ప్రాచీనకాల మందు సిద్ధులు ధ్యానతత్పరులై కూర్చుంటూ ఉండేవారట.

(11) చెన్న కేశవాలయము :—పత్తికొండ తాలూకాలో గుండాల గ్రామమువద్ద నున్నది. ఈ అలయనిర్మాణములో ఒక చిత్రమైన విశేషముగలదు. గుడి తలుపులు అన్నియు మూసి, ఒక చిన్న కన్నము గుండా మాత్రము వెలుతురు లోపలికి పోనిచ్చిన యెడల, మీది గోపురపు ప్రతిబింబము అడుగు నేలపై కనబడును.

(12) కొలుట్ల చెన్నకేశవాలయము :—కర్నూలుజిల్లాలో పడమటి దిక్కున, కర్నూలునుండి బళ్లారికి పోయే మార్గము నకు 5 మైళ్లు దూరాన గల కొండప్రదేశమునకు కొలుట్ల స్వామిమలై అని పేరు. అక్కడి అడవి నడుమ ఒక కోనలో ఒక దేవాలయమున్నది. అందలి దేవునికి కొలుట్ల స్వామి యనిన్ని, కొలుట్ల చెన్నకేశవస్వామి యనిన్ని నేటి వాడుకలోనున్న పేళ్లు. గాని ప్రాచీనకాలమున కౌండిన్య చెన్నకేశవస్వామి అనే పేరుండేది. ఈ ప్రాంతమందు కౌండిన్య మహాముని ప్రాచీనకాలమందు తపస్సు చేసు కొనుచుండగా జనమేజయమహారాజు ఆ ముని ఆశ్రమ మునకు వచ్చి, అక్కడి ప్రశాంతస్థలమునుజూచి ఒక దేవాల యము కట్టించి, అందు శ్రీ చెన్న కేశవుని విగ్రహము ప్రతి ష్ఠింపజేసెనట. కౌండిన్యమహాముని యెడల తనకుగల గౌర వమును చూపిస్తూ, ఆ దేవునికి కౌండిన్యచెన్న కేశవుడనే పేరు పెట్టెను. కొంతకాలమునకు పూజాపురస్కారములు లేక ఆ దేవాలయము పాడయినది. పిమ్మట నేటికి 2000 ఏండ్ల క్రిందట ప్రాగ్దేశమందు అనగా గుంటూరు సీమలో గొప్ప కరవు పట్టినప్పుడు కొలుట్ల అనే ఒక ఎర్రగొల్ల తన పశువులను తోలుకొంటూ ఆ తూర్పు సీమనుండి ఈ ప్రాంతమునకు వచ్చెను. ఇక్కడ పచ్చికబీళ్లు మెండుగా

నుండుటచేత, తన పశువులను ఇక్కడ మేపించుకొంటూ జీవనము చేయుచుండెను. తన ఆవులలో ఒక ఆవు తనకు ప్రతిదినము ఈయవలసిన పాలు ఈయక వట్టిదగుట చూచి ఆశ్చర్యపడి, ఒకదినము రాత్రింబవళ్లు కనిపెట్టి చూచెను. ఒక పుట్టలోనుండి ఒక బాలుడు పైకివచ్చి, ఆ ఆవు పొదుగులో తలపెట్టి దానిపాలు కుడుచుకొనిపోవుట తెలిసికొనెను. ఆ బాలుని పట్టుకోవలెనని కొలుట్ల ప్రయత్నించెనుగాని ఆ బాలుడు వానికి పట్టుపడక పుట్టలోనికి పారిపోయి, ఆ పుట్టలోనుండి తాను చెన్నకేశవుడైనట్లును, తన ఆలయము పాడైనది గనుక మరల ఒక ఆలయముకట్టి తనను ప్రతిష్ఠింప జేయవలెనన్ని అందుకు కావలసిన ధనము ఆ పుట్టలోనే కలదనిన్ని పలికి మాయమయ్యెను. ఆ మాటల ననుసరించి కొలుట్ల దేవాలయము కట్టించి, చెన్నకేశవుని విగ్రహము అక్కడనే నిలిపి ప్రతిష్ఠకావించెను. ఆ దేవుని విగ్రహము ముందు కొలుట్లయొక్క పుట్టు-శిలావిగ్రహము కొద్ది కాలములో దానంతట అదే లేచినది. రెండును ఒక్క పాను వట్టమందే ఉన్నవి. అందుచేత ఆ దేవాలయమునకు కొలుట్లస్వామి ఆలయము, కొలుట్ల చెన్నకేశవస్వామి ఆలయము అనే పేళ్లు వచ్చినవి. ఆలయ శిఖరమందొక ఇత్తడికలశ గలదు. దానిపై శకసంవత్సరములు 1155 అని ఉన్నది. గనుక క్రీ. శ. 1253 లో ఎవరో ఆలయ శిఖరము కట్టి, కలశ పెట్టించినట్లున్నది. ప్రతి సంవత్సరము మాఘమాసములో జరిగే బ్రహ్మోత్సవమునకు వేలకొలది యాత్రికులు పై జిల్లాలనుండి సైతము వస్తూఉందురు.

# అనంతపురము జిల్లా చరిత్ర

కల్యాణదుర్గమునకు తూర్పున మూడుమైళ్ల దూరానగల ముదిగల్లువద్దను దేవదులబెట్ట పైని పురాతన శిలాగుహలు కడపజిల్లాలో కనబడునట్లే ఈ అనంతపురము జిల్లాలో సైతము కనబడును. వీటినిబట్టి పురాతనకాలములో ఇక్కడ సైతము ఆదిమనివాసులు నివసించియుండే వారన్న విషయము మాత్రము తెలియగలదు; గాని, ఇంతకుమించి ఈ జిల్లా పురాతన చరిత్ర తెలిసికొనుటకు ఆధారము లేవీ లేవు. తక్కిన రాయలసీమ జిల్లాలతో పాటు ఈ జిల్లా సైతము క్రీ. శ. 225-340లో వెలసిన పల్లవుల రాజ్యములో చేరియుండెను. 7వ శతాబ్దములో ఈ జిల్లాలో చాలాభాగము పశ్చిమ చాళుక్యుల పరిపాలనమందుండెను. పిమ్మట రెండు శతాబ్దములు (750-950) పల్లవుల శాఖవారయిన నొలంబుల పరిపాలన మందుండెను. ఈ నొలంబు లయినను స్వతంత్రాధికారము గలవారు కారు. ఆ కాలములో రాష్ట్రకూటులు బళ్లారి జిల్లా ఏలుచుండిరి. వారికి లోబడి కప్పము చెల్లిస్తూ, ఈ నొలంబులు అనంతపురముజిల్లా పరిపాలిస్తూ ఉండిరి. పిమ్మట కోలాహలపురమందు (కొల్హాపూర్) రాజ్యము స్థాపించు కొన్న పశ్చిమ గంగవంశపురాజు మారసింహుడు నొలంబుల నోడించి అనంతపురముజిల్లా జయించెనుగాని, మరి 40 సంవత్సరములకే దీనిని చోళులు జయించిరి. రాజరాజచోళుని కాలము మొదలుకొని కుళోత్తుంగచోళుని కాలమువరకును (అనగా 985-1076 వరకును) ఇది చోళరాజ్యములో చేరి యుండెను. పిమ్మట 1076 నుండి 1191 వరకును పశ్చిమ చాళుక్యులును; 1191 నుండి 1212 వరకును ద్వారసముద్రపు హొయసలావంశపు బెల్లాలరాజులును; 1212 నుండి 1247 వరకును యాదవవంశపు సింగనరాజును ఈ జిల్లాకు పరిపాలకులయి ఉండిరి. పిమ్మట మాలిక్ కాఫూర్ దండయాత్రల వలన హొయసలా, యాదవుల రాజ్యము లంతరించినవి. ఆ పిమ్మట శీఘ్రకాలములోనే విజయనగరరాజ్య మేర్పడినది. గుత్తి, పెనుకొండ దుర్గములను విజయనగర రాజులు కట్టించి, ఈ జిల్లా స్వాధీనపరచుకొనుటకు ప్రారంభించిరి. కృష్ణదేవ రాయలనాటికి జిల్లా అంతా విజయనగరరాజ్యములో చేరియుండెను. 1565లో తల్లికోట యుద్ధమందు విజయనగరము వారు పూర్తిగా ఓడిపోవుటచేత సదాశివరాజును తోడుకొని తిరుమలరాయడు, కోట్లకొలది విలువగల జవాహరితో పెనుగొండ పారిపోయెను. 1568లో సదాశివుని చంపి తిరుమల రాయడు పెనుగొండలో సింహాసనమెక్కి రాజపదవిని పొందెను. అక్కడనైనను మహమ్మదీయుల బాధ తప్పక పోవుటవల్ల తిరుమలరాయని కుమారుడైన రంగ చంద్రగిరికి 1575లో వచ్చి నివసించెను. ఈ రంగని వంశమువాడే 1639లో చెన్నపట్టణము ఆంగ్లేయుల కిచ్చినవాడు. 1590-1680 అనంతపురంజిల్లా బిజాపురంవారి పరిపాలనములో ఉండేది. 1687 లో మొగల్ పాదుషా ఔరంగజేబు దక్షిణ దేశమును జయించినప్పుడు ఈ జిల్లా సైతము మొగల్

సామ్రాజ్యములో చేరినది. 1723 లో దక్కన్ సూబాదారుగానుండిన నిజామ్ స్వతంత్రుడై రాజ్య పరిపాలనము చేస్తూ ఉండెను. అయితే 1680 లో శివాజీ ఈ జిల్లాకు వచ్చినప్పుడు జిల్లా భాగములకు అధికారులుగానుండిన పాలిగార్లు అతనికి కప్పము చెల్లించిరి; గాని మహారాష్ట్ర రాజ్యములో చేరలేదు. 1746 లో మురహరరావు మాత్రము గుత్తిలో ప్రవేశించి పెనుగొండ సైతము స్వాధీనపరచుకొని శిస్తు వసూలుచేస్తూ ఉండెను. 1761 లో హైదరు మురహరరావును చెరలో పెట్టించి, 1775 లో బళ్లారి, గుత్తి తీసుకొని తన అధికారమును ఈ జిల్లాలో సైతము నెలకొలుపుకొనెను. కడప, కర్నూలు, బళ్లారి జిల్లాలవలెనే ఈ జిల్లా సైతము 1792-1799 లో మైసూరు యుద్ధములలో ఆంగ్లేయులు జయించి నైజామువశము చేయుటయున్ను, నైజాము వద్దనుండి ఆంగ్లేయులు మరల 1800-1 పుచ్చుకొనుటయున్ను జరిగినవి. నాటనుండిన్ని ఈ జిల్లా సైతము ఆంగ్లేయుల పరిపాలనమందున్నది.

## అనంతపురం జిల్లాలో పేరుపొందిన స్థలములు

చరిత్రలో ప్రసిద్ధికెక్కిన స్థలములు :—

(1) గుత్తి దుర్గము :—గుత్తినగరమునకు ఎగువను రాతికొండలపై రాతికోటగానున్నది. దుర్గము మొదట కట్టించినవాడు కృష్ణదేవరాయలు (1509-1530). తర్వాతను సైతము విజయనగరమురాజులు దుర్గమును కట్టుదిట్టముగా నుంచిరి. త్రాగుటకు నీరున్ను తినుటకు భోజన పదార్థములున్ను దుర్గములోనివారికి అందకుండజేసి దుర్గమును పట్టుకొనవలెనేకాని దుర్గములోనివారిని ఓడించి దుర్గమును పట్టుకొని లోనికి ప్రవేశించుటకు మాత్రము సాధ్యముకానంత దిట్టముగా ఈ దుర్గము కట్టియుండిరి. అందుచేత, ఈ దుర్గమును 1775 లో హైదరు ముట్టడించెనే కాని పట్టుకొని స్వాధీనము చేసికొనలేకపోయెను. పిమ్మట దుర్గములోనివారికి త్రాగుటకు నీరు పోకుండ జేయుటవలన దుర్గములోనివారు హైదరునకు పూర్తిగా లోబడిరి. ఆ దుర్గముయొక్క శిఖరము అక్కడి భూతలమట్టమునకు 989 అడుగులున్ను, సముద్ర మట్టమునకు 2,171 అడుగులున్ను ఎత్తుగానుండును. ఆ దుర్గముగల కొండపై ఒక ఎత్తైన ప్రదేశమందు మురహరరావు కూర్చుండి దర్బారు చేయుచుండిన మందిరము కలదు. మహారాష్ట్రనాయకులు అక్కడ కూర్చుండి చదరంగమాడుకొంటూ, ముచ్చటలు చెప్పుకొంటూ, దిగువనున్న నగరమందలి ముచ్చటలు చూస్తూ కాలక్షేపము చేస్తూ ఉండేవారు. ఈ దుర్గముగల రాతికొండ దిగువను జిల్లా కలెక్టరుగాను, పిమ్మట చెన్నపురి రాజ్యమునకు గవర్నరుగాను పనిచేసి, రైతులపాలిటి తండ్రివలెనుండి, 1827 లో పత్తికొండలో కలరా వచ్చి చనిపోయిన సర్ టామస్ మన్రో దొరగారి సమాధి గలదు.

(2) పెనుగొండ :—(పెనుకొండ) ఇది హిందుపురం-గుంటకల్ రైలుమార్గమున ఉన్నది. విజయనగర రాజ్యము ఉన్నతదశలో నున్నప్పుడు పెనుగొండ సైతము మంచి దశలో ఉండేది. 1565లో తల్లికోటయుద్ధము అయిన తర్వాత విజయనగరము రాజున్ను అతని అనుచరులున్ను ఇక్కడికే వచ్చి నివాసము ఏర్పరచుకొనిరి. కొంతకాలము హిందూరాజులున్ను, కొంతకాలము మహమ్మదీయ సుల్తానులున్ను పెనుగొండ స్వాధీనము చేసుకొని యుండుటవల్ల ఇక్కడి కట్టడములందు హిందూ ముసల్మానుల శిల్ప లక్షణములు రెండున్ను మిళితములై కనబడుతున్నవి. ఇక్కడి గగనమహల్, రామస్వామి ఆలయము, ఈశ్వరాలయము, బాబాఫకిరుద్దీను గోరీ, షెర్‌అలీ మసీదు ముఖ్యమైన కట్టడములు.

పెనుకొండ సముద్ర మట్టమునకు 2000 అడుగుల ఎత్తైన భూతలమున నుండుటచేతను, మంచి శీతోష్ణస్థితి గలిగి మన ఆరోగ్యమునకు అనుకూలమయిన తావుగా నున్నది.

పుణ్యక్షేత్రములు :—

1. లేపాక్షి :—హిందూపురమునకు తూర్పున 9 మైళ్ల దూరములో ఈ గ్రామము కలదు. ఇక్కడ అపూర్వ శిల్పకళానిలయమైన వీరభద్రేశ్వరాలయము కలదు. అచ్యుత దేవరాయలకాలమున పెనుగొండలో కోశాధిపతిగా నుండిన లక్కిసెట్టి కొడుకు విరుపణ్ణ, వీరభద్రుని ప్రతిష్ఠించి కట్టించిన దేవాలయము. అంతకుముందు ఇక్కడి కూర్మశైలముమీద (తాబేటి ఆకారమున ఉన్న రాతిమీదను) "చిన్నచిన్న గుళ్లు, చిల్లర దేవుళ్లు" మాత్రమే ఉండేవి. ఈ దేవాలయమందే రామాలయము సైతము కలదు. లేపాక్షి రామాయణమనే యక్షగానము ఈ గ్రామకవులే రచించినారు. ఇక్కడి చిత్రములలో కళానైపుణ్యము ఎక్కువగా గలవి 'పద్మినీజాతి స్త్రీ-పాంచాల పురుషుడు', శివతాండవకేళి,

తుంబురుడు మొదలయినవారుగల విగ్రహము, నాగేంద్రుని విగ్రహము, లేపాక్షికి తూర్పున ఒక ఫర్లాంగు దూరమున బసవణ్ణ విగ్రహము ఎక్కువగా మెచ్చుకోదగినవి. ఇంత పెద్ద నందివిగ్రహము దక్షిణదేశములో మరి ఎక్కడను లేదు. ఎత్తు 14 అడుగుల 10 అంగుళములు, పొడవు 27 అడుగుల 4 అంగుళములు, వెడల్పు 23 అడుగుల 7 అంగుళములు.

2. కదిరి :—పాకాల-ధర్మవరము రైలుమార్గమున కదిరి స్టేషనుకు అరమైలు దూరాన శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయము గలదు. 1000 సంవత్సరములక్రిందట భృగుమహర్షి కట్టించినట్టు చెప్పుకొంటారు. ఇక్కడ ప్రతి సంవత్సరము ఫిబ్రువరి 26 నుండి మార్చి 10 వరకు జరిగే రథోత్సవము చాలా గొప్పది. రథోత్సవము జరిగిన రెండుదినాలకు ఆదియాంధ్రులు సైతము గుడిలోనికి పోవచ్చును.

3. కొత్తచెరువు :—పెనుగొండ తాలూకాలో ఉన్నది. ఇక్కడ ఒక ఆలయములో మాస్తాన్‌సాహెబు మొన్న మొన్నటివరకు ఉండెను. అతడు గొప్ప మహాత్ముడనిన్ని అతని దర్శన ప్రసాదములవల్ల కష్టములు నివారించి సుఖము పొందవచ్చుననిన్ని ఎంచి, అనేకులు హిందువులు, మహమ్మదీయులు తీర్థయాత్రకు పోవునట్లు వెళ్తూ ఉంటారు.

4. తాడిపత్రి :—ఇక్కడ చింతల తిరువేంకటస్వామి ఆలయమున్ను, రామేశ్వరాలయమున్ను కలవు. ఇందు మొదటి దానిలో రామాయణ, మహాభారత పురాణగ్రంథములలోని కథలకు సంబంధించిన చక్కని చిత్రము లనేకము గోడల మీదను స్తంభములమీదను చెక్కియున్నారు. రెండవది జైనులది. క్రీ. శ. 1198 లో జైనులకిచ్చినట్లు కనబడును. పెన్నేటి వరదలకు పాడయినది.

5. గంపమల్ల :—ఇది అనంతపురమునకును గుత్తికిని నడుమ నున్నది. ఇక్కడ వెంకటాచలపతి అలయము కలదు. ఇక్కడ దాసరిగొల్ల పూజారి. ఆది ఆంధ్రులు (మాల మాదిగలు) గుడిలోనికి పోయి, దేవుని దర్శించి పూజలు జరిపించుకోవచ్చును.

6. ధర్మవరం :—కాశీ విశ్వనాథాలయము కలదు. ఇక్కడనున్న నీటిగుండములో నీరు ఎప్పుడును మెండుగా నుండును. వానలులేక ఎన్నాళ్లు ఎండలుపెట్టినా ఆ గుండ మెండిపోదు.

7. చిత్రచేదు :—గుత్తితాలూకాలో ఆగ్నేయమూల నున్నది. ఇక్కడ కొండపై హనుమంతుని ఆలయమున్నది. హనుమంతుని విగ్రహము చాల పెద్దది. 15 అడుగులు ఎత్తుగాను, 9 అడుగులు వెడల్పుగాను ఉన్నది. ఇంత పెద్ద హనుమంతుని విగ్రహము మరెక్కడను లేదు.

8. హేమావతి :—ఇది నొలంబులనాటి దేవాలయమట! ఇక్కడి దొడ్డేశ్వరాలయములో రాతి స్తంభములపైని రామాయణ మహాభారత కథలకు సంబంధించిన చిత్రము లనేకము చెక్కియున్నారు.

# బళ్లారి జిల్లా చరిత్ర

విజయనగర రాజ్యము ఆనగొందివద్ద వెలసినవరకు బళ్లారి జిల్లా చరిత్ర స్పష్టముగా తెలిసికొనుటకు తగిన ఆధారములు లేవు. ఇంచుమించుగా అనంతపురము, కర్నూలు జిల్లాల చరిత్రవలెనే ఉండునని ఊహించవచ్చును. రామాయణములో చెప్పిన విషయములు యథార్థములయితే కిష్కింధ దేశము ఈ జిల్లాలోనే ఉండియుండునని యనుకొనవచ్చును. క్రీ. శ. 225-340 లో వెలసిన పల్లవులరాజ్యము రాయలసీమ జిల్లాలందును చిత్తూరు, నెల్లూరు గుంటూరు జిల్లాలలోను వ్యాపించియుండెను. శివస్కందవర్మయొక్క హిరహడగల్లి (హర్పణహల్లి) శాసనమునుబట్టి అదోని ఈ పల్లవ రాజ్యమునకు రాజధానిగా ఉండేదని తెలియవచ్చినది.

కంప యను నతడును, అతని కొమారుడైన సంగమ యను నతడును బళ్లారిరాజులకో కాకతీయ ప్రతాపరుద్రునకో లోబడి బళ్లారి జిల్లా ప్రాంత ప్రదేశమునందు రాజ్యమేలుచుండిరి. ఆకాలమున మాలిక్ కాఫుర్ దండయాత్రల వలన దక్కను దేశము మహమ్మదీయుల యధీనమున నుండవలసి వచ్చునన్న భయము దేశములో వ్యాపించియుండెను. సంగమునివద్ద మంత్రిగానుండిన మాధవుడు- శంకరాచార్యులు స్థాపించిన శృంగేరీ పీఠమునందు వేదవేదాంగాది విద్యల నభ్యసించి, విద్యారణ్యులను బిరుదము పొందియుండెను. మహమ్మదీయుల దాడివలన స్థిరమైన రాజ్యములేక, ఏమి చేయుటకును తోచక తగుమాత్రమైన అనుచరులతో తిరుగుచున్న సంగముని కుమారులను, బుక్క హరిహరులను—ఇరువురను కలుసుకొని తనకెట్లో సంప్రాప్తమైన ధనమునిచ్చి

ఒక హిందూ రాజ్యము స్థాపించవలెనని కోరెను. జైనుల వల్లను మహమ్మదీయులవల్లను హిందూమతము నశించిపోవు చున్నది గనుక హిందూమత సంరక్షణార్థమొక హిందూ రాజ్య ముండవలెనన్న దీక్షతో విద్యారణ్యులును, రాజ్యాభిలాషతో బుక్క హరిహరులున్ను ఆనగొందివద్ద నొక రాజ్యము క్రీ. శ. 1336 లోనో 1370 లోనో స్థాపించిరి. అది క్రమముగా వృద్ధిచెంది బళ్లారి జిల్లా అంతా మాత్రమేకాక దాని చుట్టునుగల ప్రదేశములకు సైతము వ్యాపించినది. 1510-1530 లో కృష్ణదేవరాయల ప్రాభవమువలన అత్యున్నతదశకువచ్చిన విజయనగర సామ్రాజ్యము అతని తర్వాత క్షీణించుటకు మొదలుపెట్టి, 1565 తల్లికోట యుద్ధములో విజయనగరమువారు పూర్తిగా ఓడిపోవుటచేత, నాశనమయి పోయినది. బిజాపురపు నవాబు అదోని, నంద్యాల ప్రదేశములు తీసుకొన్నాడు. అతని అధికారమునకు లోబడి, పాలిగార్లు బళ్లారి జిల్లాభాగములను పరిపాలించుచుండిరి. ఒక నూరుసంవత్సరములు గడచిన తర్వాత శివాజీ, బిజాపురమువారి దుర్గములను పట్టుకొనుటకు మొదలుపెట్టి బళ్లారి జిల్లాలోగల బళ్లారి, అదోని మొదలయిన దుర్గములను సైతము పట్టుకొనెను. శివాజీ విజృంభణమును అడచివేయుటకు ప్రయత్నించి విఫల మనోరథుడైన బిజాపురపు సుల్తాను, తుదకు శివాజీని మంచి చేసుకొని అతని తోడ్పాటు సంపాదించుకొనుటే మేలని యెంచి, అతనికి బళ్లారి, ఆదోని కోటలు ఇచ్చివేసితినని ప్రకటించి శివాజీకి స్వాధీనపరచెను. రాయదుర్గం, అనంతపురం, హర్పనహాల్లి పాలిగార్లు మాత్రము తమ ప్రదేశములను తామే పరిపాలించుకొనుచుండిరి; అయినను మహారాష్ట్రులు చౌత్ మాత్రము చెల్లిస్తూ ఉండిరి. 1680 లో శివాజీ చనిపోయిన తర్వాత అతని కుమారుడు సాంభాజీ సమర్థతగల పరిపాలకుడు కాకపోవుటచేత, మొగల్ దండయాత్రలను అరికట్ట లేకపోయెను. అదివరకే దక్కను దండయాత్రలు ప్రారంభించిన ఔరంగజేబు 1688 బళ్లారి అంతా స్వాధీనపరచుకొనెను. తర్వాతి చరిత్ర అనంతపురం జిల్లా చరిత్రనే పోలియుండును. 1800-1801 నాటికి ఈ జిల్లా సైతము ఆంగ్లేయుల పరిపాలనమునకు లోబడినది.

## బళ్లారి జిల్లాలో పేరుపొందిన స్థలములు

చరిత్ర విషయములో పేరుపొందినవి :—

(1) హంపి :—తుంగభద్రానది ఒడ్డున హాస్పెట్ స్టేషనుకు చేరువగా 8 మైళ్ల దూరములో ఉన్న విజయనగరమునకు సంబంధించిన కట్టడములు, రాజమందిరములు, దేవాలయములు మొదలయినవి తల్లికోట యుద్ధమయిన తర్వాత మహమ్మదీయులవలన నశించినవి. వాటి జీర్ణమైన శిథిలభాగములు నేటికిని కనబడును. వీటినిబట్టి సైతము విజయనగరము మంచి ఉన్నతదశలో నున్నప్పుడు ఎట్లుండెనో ఊహించుటకు సాధ్యమగును. అందుచేత వీటిని చూచుటకు తీర్థయాత్రికులవలె ప్రతిసంవత్సరము వేలకొలది జనులు—మన దేశములో వారేకాక పై దేశములవారు సైతము—వస్తూ ఉందురు. ఇందులో విట్ఠలరాయని దేవాలయము, రాజమందిరము, ఏనుగుల సాలలు, స్త్రీలు జలక్రీడలాడి స్నానములు చేయుటకు నిర్మించిన కట్టడములు మొదలయినవి ఆ నాటి శిల్పిచాతుర్యమును వేనోళ్ల చాటుతూ ఉన్నవి.

(2) అదోని :—(ఆదవాని) క్రీ. శ. 225-340 లో వెలసిన పల్లవులరాజ్యమునకు రాజధానిగా ఉండేది.

(3) హర్పణహల్లి :—(హిరహడగల్లి) పల్లవ శివస్కందవర్మ తామ్రశాసనములలో ఒకటి ఈ హిరహడగల్లి లోనిది.

పుణ్యక్షేత్రములు :—

1. హంపి :—ఇచ్చటి విరుపాక్షస్వామి ఆలయములో ఏప్రెల్ నెల నడుము పెద్ద ఉత్సవము జరుగును. పంపాపతి గోపురము అందమైనది.

2. కుడ్లిగి :—తాలూకాలో కొత్తూరువద్ద బసవేశ్వర స్వామి ఆలయము కలదు. ఫెబ్రువరినెలలో కడపటి దినములందు ఉత్సవము జరుగును.

3. మైలారు :—(హుడగల్లి తాలూకా) ఇచ్చట లింగప్ప స్వామి ఆలయము కలదు. ఫెబ్రువరినెల నడుమ ఉత్సవము జరుగును. ఉత్సవదినములలో ఒకనాడు లింగప్పస్వామి ఒక చిన్న బాలునిలో ప్రవేశించి రాబోవు సంవత్సరము ఎట్లుండునో ఏమి జరుగునో ఆ బాలుని నోట పలికించును. స్వామి పూనిన బాలుని ఒక పూజారి తన భుజములపై కూర్చుండబెట్టుకొనును. అప్పుడా బాలుని చేతులలో స్వామి తాలూకు విల్లుపెట్టి అది ఇనుపవిల్లు గనుక బరువుగా నుండుటచేత మరియొక పూజారి పట్టుకొనును. అప్పుడు ఆ బాలుడు పలికిన మాటలు స్వామి పలుకులుగా భావించి వాటిని వినుటకు వేలకొలది జనులు అక్కడ చేరుదురు.

4. కురువల్లి :—(హర్పణహల్లి తాలూకా) ఇచ్చట గోని బసప్పస్వామి ఆలయము కలదు. మార్చి నెల నడుమ ఉత్సవములు జరుగుచుండును.

5. మంచాల:—(అదోని-ఆదవాని-తాలూకా) ఇచ్చట రాఘవేంద్రస్వామి ఆలయం కలదు. ఆగస్టు నెల నడుమ ఉత్సవము జరుగుచుండును.

6. శ్రీ రాఘవేంద్రస్వామి ఆలయము :—ఇది మద్రాసు-రాయచూరు రైలుమార్గమున తుంగభద్ర మంత్రాలయమను స్టేషనుకు తూర్పున 9 మైళ్ల దూరములోగల మంత్రాలయ మువద్దనున్నది. ప్రతిసంవత్సరము ఇక్కడ ఆగస్టునెలలో గొప్ప ఉత్సవము జరుగును.

# చిత్తూరు జిల్లా చరిత్ర

ప్రాచీనకాలమందు ఈ జిల్లాలోని ప్రదేశమంతయు—కొండలే కాక పల్లపునేలలు సైతము—అడవులతో నిండి యుండెను. ఇందులో దక్షిణమునగల పల్లపు ప్రదేశము అరవ దేశముతోను, ఉత్తరమునగల పీఠభూమి భాగములో పడమటి ప్రదేశము కర్ణాటక దేశముతోను, తక్కిన ప్రదేశము తెలుగు దేశముతోను సంబంధము కలిగియుండెను. ఈ ప్రదేశముల ప్రాచీన చరిత్ర తెలుసుకొనుటకు ఆధారములు లేవు.

క్రీ. శ. 3 వ శతాబ్దమునుండి కొంతకాలము పల్లవుల రాజ్యములో ఈ జిల్లా ప్రదేశము చేరియుండెను. తర్వాత ఇది చోళ రాజ్యములో నొక భాగమయినది. 13 వ శతాబ్దమున చోళ సామ్రాజ్యము క్షీణించిన తర్వాత, కార్వేటినగర జమీనులో పుత్తూరు డివిజనుకుచేరిన నారాయణవనమను ఒక గ్రామము రాజధానిగా చేసుకొని కొంతకాలము సాలువ రాజులును, పిమ్మట కొంతకాలము యాదవరాజులును రాజ్యమేలిరి. ఇతర ప్రదేశములలో సామంతరాజులు తమ పరిపాలనము సాగించుకొనుచుండిరి. పిమ్మట కొద్దికాలము ఢిల్లీ సుల్తానులకు లోబడినది. విజయనగరరాజ్యము విస్తరించిన కొద్ది కాలములోనే ఈ జిల్లా ప్రదేశము ఆ రాజ్యమందొకభాగ ముగా నుండెను. తల్లికోట యుద్ధము (1565) లో హిందూ రాజులు పూర్తిగా ఓడిపోయి విజయనగరమున్ను దాని తర్వాత 1576-7 లో పెనుగొండయున్ను మహమ్మదీయుల వశము కాగానే విజయనగరపు తిరుమలుని కొడుకు రంగ రాజు చంద్రగిరికి పారిపోయి అక్కడ ఒక చిన్న రాజ్య మేర్పరచుకొనియుండెను. మరికొన్ని చిన్న చిన్న రాజ్యములును అప్పుడే పుట్టినవి. గోల్కొండ నవాబు అధికారము వ్యాపించినది. అతని అధికారులలో కడప నవాబు పుంగనూర్, మదనపల్లి, వాయల్పాడు తాలూకాలున్ను, ఆర్కాటు నవాబు తక్కిన భాగములున్నూ పాలించు చుండిరి. 17-18 వ శతాబ్దములో మహారాష్ట్రులు దండెత్తి వచ్చి చౌత్ (శిస్తులో నాల్గవభాగము) వసూలు చేసు కొంటూ ఉండిరి. క్రీ. శ. 1760 నుండి మైసూరు రాజ్య మేలుచుండిన హైదర్ అలీ యున్ను ఆ పిమ్మట, అతని కుమారుడైన టిప్పుసుల్తానున్ను ఈ జిల్లా ప్రదేశమందు సైతము తమ అధికారమును నిలబెట్టుకొనిరి. పిమ్మట కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి జిల్లాల చరిత్రవలెనే ఈ జిల్లా చరిత్రయు సాగినది. ఈ జిల్లా ప్రదేశము టిప్పు అధికారమునుండి తప్పించినప్పుడు మదనపల్లి, వాయిల్పాడు, చంద్రగిరి తాలూకాలు నైజామునకున్ను, తక్కిన భాగములు ఆర్కాట్ నవాబునకున్ను ఆంగ్లేయులు ఇప్పించిరి; గాని, మరికొద్దికాలమునకే సేన సిబ్బంది కర్చులకుగాను నైజాము వారున్ను ఆర్కాట్ నవాబున్ను తాము పుచ్చుకొన్న ప్రదేశములు ఆంగ్లేయులకు ఇచ్చివేయవలసివచ్చినది. అప్పటి నుండియు అనగా 1801 నుండిన్ని ఈ జిల్లా ప్రదేశమంతా ఆంగ్లేయుల పరిపాలనములోనికి వచ్చియున్నది.

## చిత్తూరు జిల్లాలో పేరుపొందిన స్థలములు

చరిత్ర విషయమున ప్రసిద్ధి పొందినవి :—

(1) వేల్కూరు :—చిత్తూరు తాలూకాలో ఉన్నది. ఇది పూర్వము ఒక గొప్పనగరముగా నుండెననిన్ని, ఇక్కడి మార్కండేయాలయము పూర్వము జనమేజయరాజు కట్టించిన దనిన్ని ఇక్కడివారు చెప్పుకొంటూ ఉందురు.

(2) వల్లిమలై :—ఇదిన్నీ చిత్తూరు తాలూకాలో ఉన్నది. ఈ గ్రామములోను, దీని చుట్టుపట్లను జైనుల కట్టడములున్ను పురాతనపు కోటలున్ను గలవు.

(3) బాపనత్తము :—ఇది పలమనేరు తాలూకాలో ఉన్నది. దీనికి సమీపమున పాండవగుళ్లు అనే ప్రాచీనజనుల సమాధులు కలవు.

(4) దండపల్లి :—ఇదిన్ని పలమనేరు తాలూకాలో ఉన్నది. ఇక్కడి ఆలయము పూర్వము చోళరాజులు కట్టినది.

(5) సోమపల్లి :—మదనపల్లి తాలూకాలోనిది. ఇక్కడ పురాతన దేవాలయములు కలవు.

(6) వాయల్పాడు :—తాలూకాకు ముఖ్య పట్టణము. దీనిని వల్మీకపుర మందురు. ఇక్కడి శ్రీరామాలయము చాల పురాతనమైనదట ; రామ విగ్రహము ఒక పుట్టలో దొరికినదట.

(7) చంద్రగిరి :—క్రీ. శ. 1576-77 లో మహమ్మదీయులు పెనుగొండ సైతము పట్టుకొనగా తిరుమలరాజు కొడుకు రంగరాజు చంద్రగిరికి పారిపోయి, రాజ్యము స్థాపించుకొనెను. కొండపై నరసింగరాజు కట్టిన కోట నేటికిని నిలిచి యున్నది.

(8) నారాయణవనము :—(పుత్తూరు డివిజన్‌లోనిది) పూర్వము ఇక్కడి ప్రదేశమేలిన సాలువ రాజులలో అక్కరాజు కూతురైన పద్మావతిని తిరుపతి వేంకటేశ్వరులు పెండ్లి చేసుకొనిరట.

(9) పళ్లిపట్టు :—(తిరుత్తణి డివిజన్‌లోనిది) ఇక్కడి ప్రదేశము మహమ్మదీయుల పరిపాలనములోనున్నప్పుడు ఇది యొక సైన్య స్థానమై యుండెను.

(10) గుఱ్ఱంకొండ :—(వాయల్పాడు తాలూకాలోనిది) విజయనగర సామ్రాజ్యములో ఈ ప్రదేశమున్నప్పుడు ఇక్కడ కోటకట్టి పరిపాలకాధికారులకు ఠాణాగా ఉంచిరి. ఆ కోట ఇప్పటికిని నిలిచియున్నది.

(11) తరిగొండ :—పేరు పొందిన ఆంధ్రకవయిత్రి తరిగొండ వేంకమాంబ నివసించిన స్థలము.

పుణ్యక్షేత్రములు :—

1. మొగిలి :—(చిత్తూరు తాలూకా) ఇక్కడి శివాలయము చాలాప్రాచీనమైనది.

2. మేల్పాడి :—(చిత్తూరు తాలూకా) ఇక్కడి శివాలయమున్ను చాలా ప్రాచీనమైనది. శైవ మతాచార్యులు ఈ స్థలమును గూర్చి రచించిన పాటలు పెక్కు గలవు.

3. వళ్లిమలై :—మేల్పాడికి రెండుమైళ్ల దూరములో ఉన్నది. ఇక్కడ సుబ్రహ్మణ్యస్వామి ఆలయము కలదు. కుమారస్వామి ఇక్కడనే వళ్లిని పెండ్లి చేసుకొనెనని చెప్పుకొందురు.

4. కలకడ :—వాయల్పాడు తాలూకాలో కడప జిల్లా సరిహద్దున ఉన్నది. ఇక్కడి సిద్దేశ్వరాలయము చాలా పురాతనమైనది. శివరాత్రికి గొప్ప ఉత్సవము జరుగును.

5. తనకోన :—(వాయల్పాడు తాలూకా) శివాలయములో శివరాత్రికి గొప్ప ఉత్సవము జరుగును. ఇక్కడ 80 అడుగుల ఎత్తునుండి పడే జలప్రపాతము కలదు.

6. తిరుపతి :—ఈ క్షేత్రము దేశమంతటను ప్రసిద్ధి పొందిన పుణ్యక్షేత్రము. తిరుపతి యనే పేరు దిగువనున్న పట్టణమునకున్ను కొండలపైనున్న క్షేత్ర స్థలమునకున్ను కలదు. అందుచేత మొదటిది దిగువ తిరుపతి. రెండవది ఎగువ తిరుపతి రెండింటికిన్ని 7 మైళ్లు అంతరము. దిగువ తిరుపతిలో గోవిందరాజుల గుడికలదు. ఎగువ తిరుపతిలో గల వేంకటేశ్వరుల దేవాలయమే దేశ ప్రఖ్యాతిగలది. ఏడుకొండలు (శేషాద్రి కొండలు) ఎక్కినగాని వేంకటేశ్వరాలయము చేరలేము. అందుచేతనే ఈ దేవునికి ఏడుకొండలవాడని పేరు వచ్చినది. ఆ కొండలపైని ముందున్న గాలిగోపురము, దాని వెనుకనున్న ప్రాంగణము, వేయి స్తంభముల మంటపము, బంగారు ధ్వజస్తంభము ఆ వెనుకనున్న వేంకటేశ్వరాలయము భక్తులయిన మన దేశస్థులకే కాక విదేశస్థులకును దర్శనీయములై ఆనందమును కలిగించును. సెప్టెంబరు మాసములో బ్రహ్మోత్సవము జరుగును. ఈ దేవత, శివ విష్ణుమూర్తులు రెండును కలిసిన దేవతయని శైవులును వైష్ణవులును యాత్రికులుగావచ్చి స్వామిని దర్శింతురు.

7. తిరుచానూరు :—తిరుపతి పట్టణమునకు 3 మైళ్ల దూరాన స్వర్ణముఖీ నదీతీరమున గలదు. ఇక్కడ వేంకటేశ్వరులు పెండ్లియాడిన పద్మావతీదేవి ఆలయము గలదు. ఆమెకు అలువేలుమంగమ్మ అనియు పేరుగలదు.

8. కాళహస్తి :—ఇదిన్ని స్వర్ణముఖీ నదీతీరమున ఉన్నది. కాట్పాడి-రేణిగుంట-గూడూరు రైలుమార్గమున గలదు. శివుని అయిదు లింగములలోను వాయులింగము ఇక్కడి ఆలయములో ప్రతిష్ఠ అయిన దందురు. మహాశివరాత్రికి ఇక్కడ గొప్ప ఉత్సవము జరుగును. ఒక సాలెపురుగు, ఒక సర్పము, ఒక ఏనుగు మూడున్ను ఇక్కడ శివుని ఆరాధించి మోక్షము పొందెనని చెప్పుదురు.

9. నారాయణవనము :—(అలమేలుమంగమ్మ) పద్మావతి పుట్టిన ఊరు. ఇక్కడ కల్యాణ వెంకటేశ్వరుల ఆలయమున్నది.

10. తెంపులపాళెము :— (నారాయణవనమునకు $3\frac{1}{2}$ మైళ్ల దూరాన) అమ్మాయజాక్షి గుడి కలదు. ఇక్కడ ఆవణి నెలలో గొప్ప ఉత్సవము జరుగును.

11. తిరుత్తణి :—పట్టణమునకు పడమటిభాగమున గల కొండలమీద శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ఆలయము కలదు. ప్రతి కృత్తికకును ఉత్సవము జరుగును.

12. ఆరుంగుళము :—(తిరుత్తణి డివిజనులో) ఇక్కడ పురాతనమైన జైనాలయము కలదు.

13. తిరువాలాంగాడు :—శివుడు నర్తనముచేసి, కాళిని ఓడించిన స్థలమని చెప్పుదురు. మార్గశిర మాసములో ఆరుద్ర దర్శనమునకు వేలకొలది యాత్రికులు వత్తురు.

ఆరోగ్య విషయమున పేరు పొందిన స్థలములు :—

1. మదనపల్లి :—ధర్మవరం - పాకల - కాట్పాడి రైలు మార్గములో ఉన్నది. మదనపల్లిరోడ్డు స్టేషనుకు 8 మైళ్ల దూరాన ఈ ఆరోగ్యవర స్థలము కలదు. క్షయరోగము నివారించుటకు తగిన శీతోష్ణస్థితి, గాలి, నీరు గల ప్రదేశము. రైల్వేస్టేషనుకు నాలుగు మైళ్ల దూరాన క్షయరోగుల చికిత్సాలయము కలదు. ఇక్కడి ప్రదేశము సముద్ర మట్టమునకు 2,500 అడుగులు ఎత్తున ఉన్నది.

2. పలమనేరు:—తాలూకాకు ముఖ్య పట్టణము. ఇదిన్నీ 2240 అడుగులు ఎత్తుగానుండుట చేత చల్లగానుండును. వేసవికాలము వాసయోగ్యమయిన స్థలము.

# ఓరుగల్లు (వరంగల్) జిల్లా చరిత్ర

ఇది ప్రస్తుతము నైజాం రాజ్యములో ఉన్నా, తెలుగు దేశమే కనుక దీని చరిత్రయున్ను, ఈ ప్రాంతమందలి ప్రసిద్ధ స్థలముల విశేషములున్ను తెలియజేస్తున్నాము.

ఓరుగల్లు నగరము చాలా ప్రాచీనమైనది. దీని పేరుగురించి భిన్నాభిప్రాయము లున్నవి. ఇది ఒక పెద్ద రాతిమీద నున్నది గనుక ఒక రాయి అనే అర్థములో దీనిమొదటి పేరు ఒరుక్కల్ అనిన్ని, దానినుండే ఓరుగల్లు, ఒరుంగల్, ఒగంగల్, వరంగల్, వోరంగల్ అనే పేళ్ళు వచ్చినవనిన్ని వ్యుత్పత్త్యర్థము ననుసరించి దీనిని సంస్కృత భాషలో ఏకశైలనగరమని పేర్కొనిరనిన్ని కొందరి అభిప్రాయము. టాలమీ (ఈజిప్టు జ్యోతిశ్శాస్త్రవేత్త) క్రీ. శ. 2వ శతాబ్దమందు రచించిన భూగోళశాస్త్రములో ఈ ప్రదేశమున గలదని పేర్కొన్న కోరుంకుల నగరమే ఓరుంకులరై ఒరుంగులరై తుదకు వరంగలయినదని జనరల్ కనింగ్‌హాము చెప్పెను. ఏదైనా శాతవాహనుల (అనగా ఆంధ్రుల) వంశపు రాజులే ఈ ప్రదేశమున ఈ నగరము నిర్మించినారనవచ్చును. మొట్టమొదట ఆంధ్రులు, తర్వాత ఇక్ష్వాకులు, తర్వాత పశ్చిమ చాళుక్యులు దక్కను ఆంధ్రదేశమునకు పరిపాలకులు గనుక అందులో ఉన్న ఈ ప్రదేశము సైతము వారిపరిపాలనమందే ఉండె ననవలెను. అయితే, 7వ శతాబ్దమునందే కాకతిరాజవంశమువారు ఓరుగంటి రాజ్యము నేలుచుండిరనుటకు బలమైన ప్రమాణము గలదు. హ్యూన్‌త్సాంగు దక్కనులో దాన కాకత్యరాజ్యమును పేర్కొనెను. బహుశా ఈ కాకతిరాజులు పశ్చిమ చాళుక్య మహారాజుల అధికారమునకు లోబడి తమ చిన్న రాజ్యము నేలుకొనుచుండిరి కాబోలు. 8వ శతాబ్దములో దక్కను దేశమందు పశ్చిమ చాళుక్య మొదటివంశము అంతమొంది, రాష్ట్రకూట వంశరాజుల అధికారము ఏర్పడినప్పుడు ఈ కాకతిరాజులు స్వతంత్రులయి క్రమక్రమముగా ఎక్కువ బలము సంపాదించి—పశ్చిమ చాళుక్య రెండవవంశము రాష్ట్రకూటలను జయించి వృద్ధిలోనికి వచ్చేసరికి—మరల వారికి లొంగకుండిరి. క్రీ. శ. 1150-1163 పశ్చిమ చాళుక్య కుల తిలకుడని గొప్ప పేరుపొందిన మూడవ తైలపుని కాకతి ప్రోలరాజు ఓడించి, తన స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనెను. ప్రోలరాజు కొడుకు మొదటి రుద్రదేవుడు అనుమకొండలో దేవాలయము కట్టించెను. ఇతని కాలములోను, అంతకంటె ఎక్కువగా ఇతని తర్వాత రాజ్యమునకు వచ్చిన గణపతి దేవుని కాలములోను కాకతిరాజ్యము ఎక్కువమేర వ్యాపించినది. "ప్రాక్తీరమునందలి విశాఖపట్టణమునుండి బస్తరు సంస్థానపు టుత్తరపు సరిహద్దు ననుసరించి; మధ్య పరగణాల లోని చాందా జిల్లాను, బేరారులోని దక్షిణ భాగమును, నైజాం రాజ్యములోని తెలుగు జిల్లాలను, చిత్తూరు మండలమును, కడప, కర్నూలు, అనంతపురము జిల్లాలను గలుపుకొని కాంచీపురము వరకును, అటనుండి తూర్పు సముద్రము వరకు నొక గీతను గీచినచో నేర్పడు సువిశాలభూభాగము నాటియాంధ్ర మహాసామ్రాజ్య మగును" అని గణపతి దేవ

చక్రవర్తి సామ్రాజ్య వైభవమును గురించి డా॥ మారేమండ రామారావుగారు తమ 'తెలుగు వెలుగు'లో (పు. 21.) వ్రాసినారు. ఈ వైభవము ప్రతాపరుద్రదేవు అస్తమించిన వరకును నిలిచియుండెను. గాని, తర్వాత క్రమక్రమముగా ఢిల్లీ సుల్తానుల దాడివలన క్షీణించి నశించినది. పిమ్మట గోల్కొండ నవాబుల అధికారము 15 వ శతాబ్దమునుండి 16 వ శతాబ్దములో కడపటికాలము వరకును నిలిచినది. పిమ్మట ఔరంగజేబు పాదుషావారి విజయమువలన ఓరుగల్లు మోగల్ సామ్రాజ్యమం దొక భాగమైనది. ఆ పిమ్మట నైజాం స్వతంత్రత పొందినప్పటినుండిన్ని ఇది నైజాం రాజ్యములో చేరియున్నది.

## ఓరుగల్లు ప్రదేశమందలి ప్రసిద్ధ స్థలములు

1. అనుమకొండ :—(హనుమ-కొండ) ఇచటి వేయి స్తంభముల దేవాలయము క్రీ. శ. 1162-1163 నాటిది. ఇందు శివుని కొకగుడి, విష్ణువు కొకగుడి, సూర్యున కొకగుడి కలవు. శివాలయము నెదుటనున్న నంది విగ్రహము ఏక శిలా విగ్రహము. ముఖద్వారమునందలి రాతిపలకలపై చెక్కిన శాసనములో కాకతి (కాకతీయ) రాజుల వంశావళి గలదు.

2. ఓరుగంటికోట :—గణపతిదేవు కట్టుటకు ప్రారంభించెను; రుద్రమదేవి పూర్తిచేసెను. ఈ కోటచుట్టును రెండు ప్రాకారములు గలవు. లోపలి ప్రాకారము రాతిగోడలును వెలుపలి ప్రకారము మట్టిగోడలును గలవి. వెలుపలి ప్రాకారము చుట్టును నీటితో నిండియున్న కందకము గలదు. అనుమకొండకు దక్షిణమునకు ఆరుమైళ్ల దూరములోగల తిమ్మాపురము నరసిమలిగూడెము అనే గ్రామాలవద్దను నేటికిని కనబడుతున్న మట్టిగోడ మొండిభాగములనుబట్టి ఓరుగంటి కోటచుట్టును మూడవమట్టిప్రాకారము సైతము ఆ కాలమున నుండెనని ఊహించవచ్చును. కోట సమమైన భూతలమున నుండుటచేత మూడు ప్రాకారములు కావలసివచ్చెను. కోటలో నడుమనొక దేవాలయము-గణపతిదేవు కట్టించినది-కనబడునుగాని అది పూర్తియైనట్లు కనబడదు. కోటకు లోపలి ప్రాకారమందు నాలుగు ద్వారములు గలవు. ఉత్తర దక్షిణ ద్వారములు మూసియున్నవి. పడమటి ద్వారము (హైదరాబాద్ దర్వాజా), తూర్పుద్వారము (బందరు దర్వాజా) తెరచియున్నవి.

3. పాలంపేట :—వరంగల్ జిల్లా ములగు తాలూకాలో ఒక గ్రామము. అనుమకొండకు వాయవ్యదిక్కున 40 మైళ్ల దూరాన ఉన్నది. ఇక్కడను ఒక పెద్ద దేవాలయము, మూడు చిన్న దేవాలయములు, మరి రెండు మూడు చిన్న గుడులు కలవు. దేవాలయములందలి రాతిగోడలపైని రాతి స్తంభములపైని అనేక చిత్రములు చెక్కియున్నారు. రామాయణ మహాభారత కథలకు సంబంధించిన చిత్రములు గలవు.

ఆంధ్రులలో ఇంటి పేళ్లకు ఆధారములైన వాటిలో ముఖ్యము లయినవి గ్రామనామములు. వాటిలో కొన్ని ఈ దిగువను తెలియజేస్తున్నాము :—

అందుర్తి, అక్కుర్తి అజ్జవరము, అజ్జాడ, అత్తిలి, అత్తలూరు, అద్దంకి, అన్నవరము, అప్పికట్ల, అబ్బూరు, అల్లూరు, ఆకివీడు, ఆచంట, ఆత్మకూరు, ఆదపర్రు, ఆలపాక, ఆలపాడు, ఆలమూరు, ఇచ్ఛాపురము, ఈదర, ఈదరపల్లి, ఉప్పులూరు, ఏలూరు, ఐతవరము, ఒంగోలు, ఓలేరు, కందుకూరు, కదిరి, కనగాల, కంభంపాడు, కానుకుర్రు, కాపూరు, కాళీపట్టము, కాళూరు, కొత్తపల్లి, గంజాం, గండికోట, గరికవలస, గార్లపాడు, గుంటూరు, ఘంటసాల, చుండూరు, చెందుర్తి, చేబ్రోలు, చేమకూరు, చోడవరము, జలుమూరు, జూలూరు, జొన్నలగడ్డ, ఝాడుపూడి, టంగుటూరు, డొంకినవలస, తటవర్తి, తరిగొప్పుల, తాడిపర్రు, తాడూరు, తాడేపల్లి, తుమ్మలపల్లి, తూమకూరు, దెందులూరు, దేవగుప్తాము, దేవులపల్లి, నడింపల్లి, నండూరు, నందివాడ, నంద్యాల, నిడదవోలు, నెల్లూరు, పాకనాడు, పాకల, పాలకొలని, పాలకొల్లు, పాలూరు, పులకుర్రు, పుల్లా, పూండ్ల, పెనుమర్రు, ప్రత్తిపాడు, బయ్యవరము, బళ్లారి, బాపట్ల, బిజాపురము, బిట్రగుంట, బెజవాడ, భట్టిప్రోలు, భీమవరము, మల్లవరము, మల్యాల, మండపాక, మండపల్లి, మాకవరపు, మాచర్ల, మేడపాడు, మేడేపల్లి, మోచర్ల, మోడేకుర్రు, మైసూరు, యర్రగుంట్ల, యర్రమిల్లి, రాయప్రోలు, రాయవరము, రేపల్లి, లక్కవరము, వడ్డాది, వడ్లమన్నాడు, వెణుతురుపల్లి, వేజండ్ల, శ్రీరంగం, సత్తెనపల్లి, సాలూరు, సిరిపురం మొదలనునవి.



# 11వ భాగము – 30వ అధ్యాయము

# ఆంధ్రదేశాభివృద్ధి ఎట్లు చేయనగును?

డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య బి. ఏ., ఎమ్. బి., సి. ఎమ్.

ఆంధ్రదేశము నవీనవికాసమును పూర్తిగా పొంది, భారతదేశజాతీయతా నిర్మాణమునకు సకలవిధముల సహకారి యగునట్లు చేయుటకు ఏమి కావలెనని అడిగితే నేను మొట్టమొదట చెప్పవలసిన విషయములు మనవిచేస్తున్నాను.

ఆంధ్రయువకులు శుచిశుభ్రతలందు తమకుగల నిర్లక్ష్యము, కష్టపడి పనిచేయడానికి బద్ధకించి కులాసాగా కాలక్షేపం చేదామనే అభిలాష, అమితవ్యయము, దీనిలో ఏముందని ప్రతీది చులకనగా చూచే నిరసనభావము మొదలయిన దురభ్యాసములు విడిచిపెట్టుకోవాలి. విశ్వకళాపరిషత్తు విద్యయందు తమకు విశ్వాస మున్నంతకాలము అది చక్కగా అలవరచుకొందామనే సంపూర్ణాసక్తితో విశ్వవిద్యాకళాశాలలలో ప్రవేశించవలెను. అందులో ప్రవేశించినవారు పరీక్షలందు ఉత్తమశ్రేణిలో మొదటివారుగా ఉత్తీర్ణులగుటకు ప్రయత్నించవలెను. అంతేకాని, ఏదో నీచంగా ఉత్తీర్ణులయి, ఉత్తీర్ణులయినవారి పేళ్లపట్టికలో కట్టకడపటి సంతకము పెట్టిన రెజిస్ట్రారువారి పేరికి చేరువగానైనా తమపేరు ఉన్నదిగదా అని తృప్తిపొందరాదు. ఐ.ఎమ్.ఎస్; ఐ.సి.ఎస్., పోటీ పరీక్షలకు మన ఆంధ్ర యువకులు ఎక్కువగా వెళ్లక పోవడానికి ప్రతిబంధక మేమి వచ్చినది? వెళ్లిన కొద్దిమందిలోను కడుకొద్దిమంది మాత్రమే విజయం పొందడమేమి? అందులో విశ్వాసంలేని వారు వెళ్లనే వద్దు. పోనీ, జీవనంకోసం తమ కిష్టమైన పని సంపూర్ణమైన తత్పరతతోను, భక్తిశ్రద్ధలతోను చేయడానికి పూనుకోరాదూ? అదీచేయరు! ప్రతి విషయంలోను దిల్‌ఖుషీగా వ్యవహరిస్తారు. శాంతియుత జీవనానికి భంగకరముగా కలహాస్పర్ధలతో దేశాలు కొట్టుకొంటూ ప్రయాస పడతూఉన్న ఈ యుగంలో ఇటువంటి ఉదాసీనత, నిర్లక్ష్యం ఎందుకూ పనికిరావు. అద్భుతచర్యలకు, తీక్షభావోద్రేకానికి, చిత్తప్రవృత్తులకు, చైతన్య విడంబనానికి యౌవనం తగినదశ. కార్యములు ప్రారంభించి, ప్రయత్న పూర్వకంగా నిర్వహించి సాధించడానికి తగినదశ ఆతర్వాతిది. అందుకు కావలసిన పునాది యౌవనదశలోనే పడవలెను. శాస్త్రజ్ఞాన విషయంలోను, స్వతంత్రబుద్ధికుశలతలోను, కల్పనాశక్తిలోను, పరిశ్రమలలోను, వాణిజ్యములోను, పరీక్షలలోను, జీవయాత్రయందలి ఉద్యోగాలలోను, ఆశయాలలోను, విజయార్హతలలోను ఆంధ్రులు వెనుకబడి యున్నారంటే, అందుకు కారణము వంశపరంపరగా వస్తూఉన్న దురభ్యాసమేకాని పరిసరముల ప్రభావముకాదు. చేయవలసిన ప్రయత్నంచేయక, ఏదో నెమ్మదిగా ఉన్నదానితో తృప్తిపొంది ఉందామనే కోరికే కాని దుస్తరమైన పరిస్థితులు కావు.

సంఘంలోను, జీవితంలోను ఈర్ష్యతగ్గిపోవాలి. నియమానికి విధేయత ఎక్కువకావాలి. సంఘంలో మొత్తంమీద అందరిమన్ననను పొందిన నాథు డుండవలెను. అతడు లేని లోపం సంఘంవారి సమర్థత మొత్తము మీద సగటున చూస్తే అధికంగానే ఉందని తృప్తిపడి ఊరకుంటే తీరుతుందా? ఆంధ్రులు విమర్శకులు; జాగ్రత్తగా పరిశోధించి మంచి చెడ్డలు గ్రహిస్తారు. కనుక ఎవరుచేసిన పనియైనా సరే స్తనశల్యపరీక్షచేసి ఖండించి, కార్యం భగ్నంచేసే బుద్ధిగలవారు కావచ్చు ననవచ్చునా? ఒక వ్యక్తియేకాని, ఒక దేశంవారేకాని తమగురించి ఇతరులు ఏమనుకొంటున్నారో తెలుసుకోవడంవల్ల మేలు కలుగకపోదు. ఇతరులు చెప్పనక్కరలేకుండా తమలోపాలను తామే గ్రహించి దిద్దుకోవడం మరీమంచిది; మెచ్చుకోదగినదే.

ఇంతవరకు, వ్యక్తిగతంగా నాకుతోచినది నేను మనవి చేశాను. అందుకు నన్ను మన్నింతురుగాక! ఇకను ఆంధ్రదేశానికి కావలసినదేమిటో మనవి చేస్తాను. వ్యవహారములో నలుగురుచేరి సుఘటితమైన పని ఐక్యంతో చేయడం కావాలి. చూడండి—బందరులో సుమారు 25 సంవత్సరాల క్రిందట స్థాపించిన చక్కెర ఫ్యాక్టరీ, బెజవాడలోని బట్టలునేసే మిల్లు, ఏలూరిలోని నారమిల్లు, గుంటూరు నారమిల్లు, రాజమహేంద్రవరంలోని కాగితం మిల్లు, విశాఖపట్టణంలోని చలనచిత్ర నిర్మాణాలయం, చెన్నపట్టణంలోని 'స్వరాజ్య' దిన పత్రిక—వీటిలో ప్రతీదానికి వ్రాసి పెట్టుకోదగిన చరిత్రభాగం వుంది. వుయ్యూరు కో-ఆపరేటివ్ సుగర్

ఫ్యాక్టరీ ఇంకా సాగుతూవుంది. వీటిలోకొన్ని చచ్చి శవములుగా ఉన్నవి; కొన్నిరోగంతో మంచము పట్టి ఉన్నవి. వీటికి మృతపరీక్షా వద్దు, చికిత్సా వద్దు. స్థూల దృష్టితో చెప్పాలంటే, ఆంధ్రజాతి యొక్క మానసిక వికాస విషయమై మీద చెప్పిన వాక్యాలే ఆంధ్ర పారిశ్రామిక విషయంలో కూడా వర్తిస్తవి. సాంఘిక జీవనము మన ఆదర్శమై ఉండాలి. సంస్థాగతమైన కార్యనిర్వహణము మన సంఘాభివృద్ధికి సాధనముగా చేసుకోవాలి. పరస్పర విశ్వాసము పుట్టి అధికం కావడానికి ఇరు పక్షములవారికిన్ని సరళత్వం, నిష్కాపట్యం అధికంగా ఉండాలి. అన్నిటికంటె ఎక్కువగా కావలసినదేమంటే సంఘంలో ప్రతివాడు పెద్దలు నలుగురు చెప్పినదానికి తన నిర్ణయాన్ని లోబరచు కొంటూ ఉండాలి. ప్రధాన విషయాలేవో అప్రధాన విషయాలేవో గుర్తించే బుద్ధిసూక్ష్మత ఉండాలి. మన ఇరుగు పొరుగుల నున్న వారు, సహకారులు, సహచరులు తెలివితేటలలోగాని బుద్ధికుశలతలోగాని, సంస్కృతిలోగాని మనకంటె తక్కువవారని అహంభావంతో తలచి, వారిని మనము చులకనగా చూచి సాటోపంగా నిరసించగూడదు. ఇట్టి అహంభావ ముండబట్టే, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు విషయంలో నష్టం పొందాము. దాని కేంద్రనిలయం బెజవాడనుండి గుంటూరికి, రాజమహేంద్రవరంనుండి అనంతపురమునకూ నెట్టుకొంటూ చివరకు వాల్తేరులో ఎట్లు స్థిరపరచడ మయినదో ఆ విచారకరమైన కథ ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకోవలసినదే. అయితే, ఎందుకు? మన భావి కార్యాలకు మార్గదర్శకంగాను ఆదర్శ పూర్వకంగాను ఉంటుందనికాదు; ఇట్టి తప్పు మరియెన్నడును చేయరాదని చెప్పడానికి మాత్రమే. ఈ విశ్వకళాపరిషన్నివాసము వాల్తేరులోనే ఉండనీయడానికి రాయలసీమలోని మన ఆంధ్ర సోదరులు సైతము ఉదారభావంతో తమ అంగీ కారములను సగౌరవముగా శ్రీబాగ్‌సమాఖ్య సమయమున తెలియజేసినారు. అందరూ ఏకీభవించి కోరితేనే తప్ప దాని శాశ్వతనివాసము మార్చనేవద్దు. ఇకముందు రాజ ధాని నగరము ఏది కావలెను? హైకోర్టు ఎక్కడుండ వలెను? అనే విషయాలనుగురించి మనము మరి తగవు లాడవద్దు. ఆ శ్రీబాగుసమాఖ్య భక్తితో అనుసరించి వ్యవహరిద్దాము. ఆ విధంగా వ్యవహరిస్తే ఆంధ్రరాష్ట్రము 1946 సరికి ఏర్పడి తీరుతుంది.

మన విద్యావిధాన పద్ధతి మన దేశానికి, సంఘానికి, జాతీయతకు కావలసిన ప్రయోజనములను అనుసరించి మార్పు చెందవలసియున్నది. ఈ విద్యార్థిగణశ్రేణులలో 3 వ ఫారము చదువు పూర్తి అయిన తర్వాత ఒక మజిలీయున్ను, స్కూల్ ఫైనల్ చదువు పూర్తి అయన తర్వాత ఒక మజిలి యున్నూ విద్యార్థులకు కావలసియున్నది. మొదటి మజిలీకి విద్యార్థులు,తమకు వ్యవసాయ విద్యావ్యాసంగము కావలెనో, పారిశ్రామిక విద్యావ్యాసంగము కావలెనో ఎంచుకొని, అందుకు ప్రత్యేకంగా ఏర్పడిన విద్యాలయములలో ప్రవేశించ వలెను. రెండవ మజిలీకి విశ్వకళాపరిషద్విద్యల నభ్యసించు టకు అర్హులైన వారెవరో తెలుసుకొనుటకు ఒక వడబోత కావలెను. అన్నివిధములా అర్హులైన వారినే ఆ విద్యకు విడిచిపెట్టి తక్కినవారిని పరిశ్రమలలోనో, వాణిజ్యము లోనో, సైన్యములోనో, ఉద్యోగాలలోనో ప్రవేశ పెట్ట డానికి తగిన ఏర్పాట్లు చేయవలెను. విశ్వకళాపరిషద్విద్యా లయములందు ప్రవేశింపదలచిన విద్యార్థులలో ఎవరు అందుకు తగిన తెలివితేటలు, సమర్థత గలవారో వారినే చేర్చుకో వలెను. విశ్వకళాపరిషత్తువారి పరీక్షలలో ఉత్తీర్ణులైన వారికే ప్రభుత్వశాఖల ఉద్యోగములు లభిస్తవన్న అభి ప్రాయం కలగనీయకపోతే ఆ విద్యనభ్యసించవలెనన్న కోరిక కేవలం ఆ విద్యయెడల మక్కువగలవారికేకాని ఉద్యోగవ్యామోహ మున్నవారికి ఉండదు. వాస్తవంగా పరీక్షల పద్ధతే పోవాలి. విద్యార్థులు తమ గురుకులవాస యోగ్యతను బట్టి తమ విద్యాగౌరవము నిలబెట్టుకోవాలి. డాక్టర్ మిల్లర్, డా. స్కిన్నర్, ప్రొఫెసర్ లక్ష్మీనరసు నాయడు, ప్రొ. చిన్నతంబిపిళ్లై, పండిత వీరేశలింగం, సర్ ఆర్. వెంకటరత్నం నాయడు, మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రి, కళాప్రపూర్ణ వేదం వేంకట రాయశాస్త్రి వంటి మహనీయులక్రింద విద్యనభ్యసించడం వల్లనే విద్యార్థులకు ఘనత రావలెను.

కళలు, వృత్తి విద్యలు—వీటి విషయంలో కావలసిన దేమంటే, ఆట వస్తువులు, నేతవస్తువులు, అచ్చుపోత, రంగు పూత పొందిన వస్తువులు, దంతంతోను చందనంతోను చేసిన వస్తువులు, కర్రమీదను, రాతిమీదను చెక్కి చేసిన వస్తువులు, తివాసీలు, జముఖానాలు మొదలయిన వస్తువులన్నిటిలోను ఇదివరకు వాడుకలోనున్న ధాతు సంబంధమైన రంగులకు మారుగా వృక్షజాతి సంబంధమైన రంగులు కావలెను. లేపాక్షి

దేవాలయములో పైకప్పు లోపలి తట్టుగల తైలవర్ణ చిత్రాల నమూనాలు తీయించి నలుగురికీ తెలిసేటట్టు ప్రచారము లోనికి తెచ్చి, అందరికి ఆదర పాత్రమైనట్లు చేయవలెను. తాడిపత్రి, పెనుగొండ, అమరావతి, నాగార్జునకొండ మొ॥ స్థలములలోని శిల్పముల నమూనాలు సైతము తీయించి నలుగురికి తెలియజేయవలసి యున్నది. తంజావూరిలోని సరస్వతీ మహల్ గ్రంథాలయ మందలి తెలుగు గ్రంథములు (అన్నీ వ్రాతప్రతులే) ప్రభుత్వమువారి అనుమతిని బడసి విశ్వకళాపరిషద్భవనము లందో లేదా ఈ రాయలసీమలోనే ఎక్కడనైనా ఒక కేంద్ర స్థలమందో పెట్టించి, అక్కడ విశ్వకళాపరిత్తుతో సమానాశయములుగలిగి అనుషంగికంగా ఉండే విద్వత్ పరిషత్ కేంద్ర మేర్పరచి, అచ్చు కావలసిన గ్రంథములు అచ్చొత్తించి ప్రకటించవలిసి యున్నది.

ఆంధ్రదేశంలో చెప్పడానికి సాధ్యముకానంత ఎక్కువగా ఖనిజసంపద కలదు. క్రోమియమ్, ఇనుము, మెగ్నీసియమ్, అభ్రకం, గనిబొగ్గు, బంగారం, వెండి, గ్రాఫైట్, వజ్రములు మొ॥ ఎన్నో ఉన్నవి. ఇవి అన్నీ భూగర్భంనుండి బయటకు తీయడానికి ప్రజాసంఘమో ప్రభుత్వమువారో పూనుకోవలసియున్నది. భూగర్భ శాస్త్ర సంబంధమైన పరిశోధనలు మన దేశంలో సరిగా జరగడంలేదు. వజ్రములు దొరికే స్థలములు పరిశోధించడం విషయములో కొందరు మిత్రులు మెచ్చుకోదగినపని సాగించారు. ఆ పని పూర్తి కావలసియున్నది. విద్యుత్‌శక్తి అధికంగా జనింప జేయుటకు కావలసినన్ని అవకాశములు వున్నవి. ఆ విద్యుత్ శక్తి పల్లెలకు సైతము అందజేస్తే కళల వృత్తుల ఆధిక్యం హెచ్చి భూతల స్వరూపమే మారి పోవునట్లు చేయవచ్చును.

రాక పోకల సదుపాయముల గురించి తగినశ్రద్ధ వెంటనే తీసుకోవలసియున్నది. బ్రిటిష్‌వారి పరిపాలనములో బర్మాకు ఉన్నట్లు, ఎక్కడెక్కడైతే ఓడప్రయాణాలకు అవకాశాలున్నవో అక్కడక్కడ ఇండియాకు రైలుమార్గాలు లేకుండా పోయినవి. ఉన్నా తక్కువ. ఎక్కడెక్కడ రైలు మార్గాలున్నవో అక్కడక్కడ నీటిపారుదల, నీటి బాటల రాకపోకలు పాడయినవి. జర్మనీ దేశంలో రైలు మార్గాలు ఎంతముఖ్యమో అంత ముఖ్యముగానే నీటి బాటల రాకపోకలు కూడా చూచుకొంటారు. అంతేకాదు ఇవి చౌకగాకూడా ఉంటవి. బెజవాడనుండి చెన్నపట్టణము పోయే బకింగ్‌హామ్ కాలువ క్రిందటి సంవత్సరము మరల మరమ్మత్తుచేసి రాక పోకల సౌకర్యములకు అనుకూలంగా చేయడం వల్ల వ్యవసాయానికి, ఎగుమతి దిగుమతులకు ఎంతో లాభంకలిగినది. శ్రీ. శే. ఎస్. శ్రీనివాస అయ్యంగారికి, గంగా నదినుండి కావేరీ నదివరకు కాలువ తీయించి రెండు నదులున్ను కలుప వలెనన్న ఆలోచన పుట్టినది. అది దివ్యమైన ఆలోచనేకాని పిచ్చితలంపు కాదు. కృష్ణా గోదావరీ నదులను కలుపుతూ తీసిన కాలువలు, మరిమూడింతలు వెడల్పుగా త్రవ్వించి స్టీమ్‌బోట్లుకూడా పోవుటకు వీలగునట్లు చేయవలసి యున్నది. గోదావరినుండి ఉత్తరముగా మహానదికి-రూపవాణి, హుగ్లీకిన్ని; దక్షిణంగా పెన్నార్, కూమ్‌నదులకున్ను కాలువలు తీసి చెన్నపట్టణము నుండి కలకత్తాకు కాలువలద్వారా సంబంధము కలుగజేయవలసి యున్నది. కాలువ మీదుగా చెన్నపట్టణము నుండి బెజవాడకు పంపించే సామాను 12 దినాలకు బెజవాడ చేరుతున్నది. అదే గుడ్స్‌ట్రెయినులో పంపిస్తే 24 దినాలకో 36 దినాలకోగాని చేరడంలేదు. ఇప్పుడీయుద్ధం వచ్చినట్లు ఏదైనా ఆపదకాలంవస్తే కాలువల ఉపయోగం



తెలుస్తుంది. అప్పుడు కాలువ లెందుకని వాదించేవారు సైతము వాటివల్ల కలగే మేలు ఒప్పుకోకతప్పదు.

రైలు మార్గాలు సైతము ఇంకా ఎక్కువగా వ్యాపించవలసియున్నది. గోదావరి జిల్లా ఏజెన్సీ ప్రదేశంలోనికి రైలుపడితే కోయస్థాన దేశభాగ్యం అభివృద్ధి పొందుతుంది. కోయలపరిస్థితులు కూడా చక్కబడతవి. వారిని పీడిస్తూ ఉన్న షావుకార్లు పెట్టే బాధలు, వారి దుస్థితిని తగిన అవకాశంగా తీసుకొని వారిని మోసపుచ్చి స్వలాభం చూచుకొంటూ ఉన్న నాగరికులు పెట్టేబాధలు తగ్గి, కోయలు అనేక విధాల బాగుపడగలరు. మనకు డెల్టాభూములలో ఉన్న నాగరికులు ఎంతకావలెనో, కొండలలోనున్న కోదులు మొదలయిన ఆదిమనివాసులున్ను అంతకావలెను.

పంటకాలువల నీటిపారుదల పను లుద్ధరించి వృద్ధిలోనికి తేవలసియున్నది. వాటివలన దేశమునకు కలిగేమేలు ఎంత ఎక్కువగా చెప్పినా అతిశయోక్తికాజాలదు. పూర్వకాలంలో ఒక చెరువు కొకచెరువు గొలుసు మాదిరిగా అంటిపెట్టుకొని ఉండేవి. ఎగువచెరువు ఎత్తైన స్థలముమీద ఉండేది. అక్కడికి పారుతూవచ్చే నీరంతాచేరి ఆచెరువు పూర్తిగా నిండిన తర్వాత దానినుండి ఒక కాలువ తీసి దిగువను కొంత దూరంలో ఉన్న మరియొక చెరువుకు నీరు పారించేవారు. అదిపూర్తిగానిండిన తర్వాత అక్కడనుండి ఈ విధంగానే మరికొంత దూరంగా దానికి దిగువనుండే మరియొక చెరువు లోనికి నీరు పారించేవారు. ఈ ఏర్పాటు ఇప్పుడు అంతరించి పోయినది. ఈ నీటిపారుదల సదుపాయములు రాయలసీమ జిల్లాలలోను, నెల్లూరు జిల్లాలోను ఎక్కువగా కావలసియున్నది గనుక అక్కడ దీనికి సంబంధించిన ఎంజనీరింగ్ శాఖవారి పనులు వెంటనే పునరుద్ధరించవలసి యున్నది. కలకత్తాలోని పాలిటెక్ పారిశ్రామిక విద్యాలయము, అలాహాబాద్, బెంగళూర్ పారిశ్రామిక విద్యాలయములు వంటి సంస్థఒకటి ఆంధ్రదేశంలో అందరికీ అందుబాటులో ఉండే ఒక కేంద్రస్థలమందు స్థాపించవలసి యున్నది. భౌతిక, శారీరకశాస్త్ర పరిశోధనలు సైతము జరిపించడానికి అనుకూలమైన మానసిక విద్యాసంస్థ ఒకటి కావలసియున్నది. పిచ్చితనమును, ఉన్మాదమును మానసిక రోగములుగా భావించి, చికిత్సకులోబడ గలవని పరిగణింపవలెనేకాని అవమానాస్పదంగాను, జుగుప్సావహంగాను ఎంచి నిరసించరాదు. ఈ పిచ్చితనం, ఉన్మాదం యెడలను మన కిదివరకున్న అభిప్రాయాలు పైనిచెప్పినట్లు మారితే దేశంలో అపరిమితంగా ఉన్న సంతాపం కొంతవరకు ఉపశమిల్ల గలదు.

ఇంకామన ఆంధ్రదేశానికి కావలసినవేమంటే :—

1. ఒక కేంద్ర స్థలమందు రేడియో స్టేషన్
2. ఎక్స్‌రే సంస్థ
3. రేడియం చికిత్సాలయం
4. కుష్టు రోగనివారణాలయం
5. పతిత స్త్రీ శరణాలయం
6. అంధ బధిరైక మూక విద్యాలయం
7. దీన వృద్ధాశ్రయం
8. భ్రష్టజన శరణాలయం
9. అనాథబాల శరణాలయం
10. స్త్రీలకు ప్రత్యేక వైద్యవిద్యా కళాశాల
11. వాస్తుయంత్ర విద్యాకళాశాల
12. ఖని ధాతు సంబంధ విద్యాలయం
13. శిల్పచిత్ర కళాశాల
14. జ్యోతిష విద్యాలయం
15. ఆధ్యాత్మిక విద్యాలయం
16. వివిధమత విమర్శనాలయం
17. సాంఘిక విషయ విద్యాలయం
18. సహకార విద్యాలయం
19. పత్రికా సంబంధ కళాశాల.
20. కళలు, వృత్తిపనులు నేర్పే విద్యాలయం
(ఇది అన్నిటికంటె ఎక్కువ ముఖ్యంగాను, శీఘ్రంగాను కావలసినది)

ఇవిగాక ఆంధ్ర దేశానికి ఒక చక్కని చిత్రవస్తు ప్రదర్శనాలయముండవలెను. అందులో ఆంధ్ర దేశమందు భూగర్భ శాస్త్రమునకు, శిల్ప శాస్త్రమునకు సంబంధించిన వస్తువులు, ఆంధ్రుల కళలకు, వృత్తిపనులకు సంబంధించిన వస్తువులు ఆంధ్రుల పారిశ్రామిక వస్తు సంపద, వ్యవసాయసంపద భూసార నిరూపణవస్తువులు, ఆహార పదార్థములు వాటి శక్తి నిరూపణములు మొ॥ నవి మాత్రమే కాక యావద్భారత దేశమునకు సంబంధించిన వస్తువులు సైతము ప్రదర్శించాలి. ఏదో ఒక పెద్ద జాబితా ఇచ్చాను. ఇవి సేకరించిన తర్వాతమరి యొక జాబితా చేర్చుతాను.



# 12వ భాగము – 31వ అధ్యాయము

# ఎవరెవరు?



సాంకేతికాక్షరముల టిప్పణి :— జ = జననం; గ్రం = రచించిన గ్రంథములు; రా. సా; రా. బ., ది. బ మొ॥ = రావుసాహెబు మొ॥ బిరుదములు; కాం. పా., జ. పా. మొ॥ = కాంగ్రెస్, జస్టిస్ మొ॥ పార్టీలు: వి., తూ. గో., ప. గో., కృ., గు., నె., కడ., కర్నూ., బ., అ = విశాఖపట్నం మొ॥ జిల్లాలు; డా = డాక్టర్.

అనంతశయనం మాడభూషి బి. ఏ., బి. ఎల్. చిత్తూరు జ. 1891. సెంట్రల్ ఎం. ఎల్. ఏ., అఖిల భారత కా. పా. సభ్యులు, ఆంధ్ర మహాసభాధ్యక్షులు (1934, 1939). సంస్కృతాంధ్ర పండితులు.



మాడభూషి అనంతశయనం

అప్పలస్వామి రెడ్డి చుక్కా జ. 1898 రాజమహేంద్రవరం. 1934 నుండి మ్యూనిసిపల్ చైర్మన్. ఉత్తర సర్కార్ల రెడ్డి మహాజన సంఘమునకు మొదటి అధ్యక్షులు. జ. పా.

అప్పారావు దురిసేటి బారిస్టర్. శేషగిరిరావు పంతులుగారి పుత్రులు. జ. 1889 కాకినాడ. హైకోర్టు రెజిస్ట్రార్. మైలాపూర్-మద్రాస్.

అప్పారావు నాయుడు కోకా బి. ఏ., బి. ఎల్. జ. 1888. జ. పా. ఇంగ్లండ్ వెళ్లి రాజకీయ సంస్కరణములగురించి జా. పా. కమిటీ ముందు వాఙ్మూలమిచ్చిరి. 1922 గం. వి. ఆంధ్రసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు.

ఆంజనేయులు ఎస్. వి. డా. జర్మనీలో ఎంజనీరింగ్. కలకత్తా. గవర్నమెంట్ మెటల్ అండ్ స్టీల్ ఫ్యాక్టరీ ఎంజనీర్. ఆంధ్రాభిమాని.

ఈశ్వరదత్తు కుందూరి బి. ఏ. జ. 1898. లేఖరి, రచయిత; 1928 స్వరాజ్య పత్రిక; 1929-30 హిందూ; 1931-34 అల్హాబాద్ లీడర్; పిమ్మట ట్వెంటియత్ సెంచరీ మాస పత్రిక-అల్హాబాద్ పత్రికలలో పని. గ్రం. 'స్టార్జ్ అండ్ ఫ్యూమ్జు' (ఆంగ్లం).

ఓబిరెడ్డి సి బి. ఏ., బి. ఎల్., ఎం. ఎల్. ఏ., కా. పా. అ. జిల్లా బోర్డు అధ్యక్షులుగానుండిరి.

కనకయ్యనాయుడు కొఠారి మేజర్ జ. 1895. నాగపూర్ హిస్లప్ కాలేజీలో చదువుచున్నప్పటినుండిన్ని క్రికెట్ ఆటలో ప్రసిద్ధిపొందిన మేటియాటగాడు. 1931 లో ఇండియన్ జంఖానా తరపున ఇంగ్లండులో జరిగిన పోటీ పందెమందు 1000 పరుగులుచేసి ఘనత చెందియుండెను. ఇందూర్ మహారాజా హోల్కారుకు ఏ డి కాంగ్. "ఇండియన్ బ్రాడ్మన్" అనే బిరుదు పొందిన ఘనుడు.

కామేశ్వరరావు వి. ఐ. సి. ఎస్. మిడ్నపూర్ సబ్ కలెక్టర్. తర్వాత కలకత్తా ప్రభుత్వపు పైనాన్సు డిపార్టుమెంటు అసిస్టెంట్ సెక్రటరి. ఆంధ్ర మహా సభా సభ్యులు.

కామేశ్వరరావు పురాణపండ ఎం. ఏ., ఎం. ఎల్. జ. 1894 మత్స్యపురి, ప. గో. జిల్లా. విద్యాభ్యాసం కాకినాడ కాలేజి, మద్రాసు ప్రసిడెన్సీ, లా కాలేజీలలో. 1925 లో లా కాలేజి అసిస్టెంట్ ప్రొఫెసరు. '26-'38 ప్రాక్టీసు మద్రాసులో. 36-38 బారు లెక్చర్సు నిచ్చిరి. పలుసార్లు ఎఫ్.ఎల్., బి.ఎల్., ఎమ్.ఎల్. బోర్డు ఆఫ్ ఎగ్జామనర్స్లలో సభ్యులు. 1938 నుంచి హిందూరెలిజియస్ ఎండోమెంటు బోర్డు కమీషనరుగా పనిచేయుచున్నారు. ఇంగ్లండు వెళ్లివచ్చిరి.



కామేశ్వరరావు అయ్యదేవర బి. ఏ., బి ఎల్. జ. 1881. కా. పా. 1926-29 ఎమ్. ఎల్. ఏ. కా. మంత్రివర్గమున ప్రధాన పార్లమెంటరీ కార్యదర్శి ; 'ఛీఫ్ విఫ్'.

కుప్పుస్వామి చౌదరి జాగర్లమూడి రా. బ. లక్ష్మయ్య నాయుడుగారి కుమారులు. భూస్వాములు. 1919 సంస్కరణములు జరిగిన తర్వాత మొదటి రెండుసార్లు ఎం.ఎల్.సి. (గుంటూరు). ఆంధ్రాభిమానము ఎక్కువగాగల ఉదారులు.

కుమారస్వామిరెడ్డి యస్. సర్. బి. ఏ., బి. ఎల్. పాళియంకోటలో బహుకాలము లాయరుగాను, పబ్లిక్ ప్రాసిక్యూటరుగాను, తిన్నవెల్లి డిస్ట్రిక్టుబోర్డు అధ్యక్షులుగాను ఉండిరి. చెన్నరాష్ట్ర ప్రభుత్వములో విద్యాశాఖా మంత్రిగా నుండిరి. దక్షిణాంధ్రులు.

కృష్ణ పి. జి. డా॥ బి. ఎస్‌సి., పి ఎచ్. డి. జ. 1900 పికెట్టు. సికింద్రాబాద్ మహబూబ్ కళాశాలలోను, మద్రాసులో కేంబ్రిడ్జి సీనియల్ పరీక్షకు చదివి, 1920 సం॥న అమెరికా ఉన్నత విద్యాభ్యాసమునకై పోయిరి. కార్నెల్ విశ్వవిద్యాలయమున పి హెచ్. డిగ్రీని పొంది, అమెరికన్



శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి.

సొసైటీ ఆఫ్ అగ్రామనీ సభ్యులైరి. రట్జర్సు విశ్వవిద్యాలయమువారు వీరికి ఫెలోషిప్పు నిచ్చి సత్కరించిరి. వ్యావసాయిక రసాయనశాస్త్రములలోను, భూగర్భశాస్త్రములోను ప్రావీణ్యము గణించిరి. ఇంగ్లండు మొదలైన విదేశములకు పోయి, వ్యవసాయిక కళాశాలలను కేంద్రములను సందర్శించిరి. 1930 సంవత్సరమున మాస్కో, లెనిన్ గ్రాడ్ లలో జరిగిన అంతర్జాతీయ సాయిల్ ఫిజిక్సు సమావేశమునకు యిండియా సభ్యులుగా పోయిరి. 1935 సం॥ ఇంగ్లండులో జరిగిన ఈ సభ తృతీయ సమావేశమునకు గూడా వీరు పోయిరి. ఫ్రెంచి, జర్మను భాషలలో ప్రవేశమున్నది. వ్యావసాయిక శాస్త్ర పారంగతులు. 1931 సం॥ నిజాము ప్రభుత్వపు వ్యావసాయిక శాస్త్రజ్ఞులుగా నియోజితులైరి.

కృష్ణమూర్తి కాకర్లపూడి డా. డి. ఎస్‌సి. నాగపూరు విశ్వవిద్యాలయ కళాశాలకు ప్రిన్సిపాలుగా పనిచేయుచున్నారు. వీరు Colloidal Chemistry లో చేసిన పరిశోధనలు విఖ్యాతిగాంచినవి. లండన్ విశ్వవిద్యాలయములో పనిచేసి అక్కడ డి. ఎస్‌సి. డిగ్రీ సంపాదించి యున్నారు.

కృష్ణమూర్తి ఎచ్ బి.ఏ. రా.సా. గంజాం జిల్లా భూస్వామి. సర్ పాత్రోగారి అల్లుడు. 1923లో బి.ఏ. అయి, రెజిస్ట్రేషన్ శాఖలో ప్రవేశించి '26 లో అస్యూరెన్సజ్ రెజిస్ట్రారయి,



రా. సా. ఎచ్. కృష్ణమూర్తి.

ఇప్పుడు ఇన్స్పెక్టర్ జనరల్ ఆవ్ రెజిస్ట్రేషన్ ఉద్యోగమందున్న ప్రతిభావంతులు.

కృష్ణస్వామయ్య అల్లాడి సర్ ది. బ., బి. ఏ., బి. ఎల్. జ. 1883. అడ్వకేట్ జనరల్. ఆంధ్ర విశ్వకళా పరిషత్ వారు ఏర్పరచిన బహుమతులలో నొకదానికి భూరి విరాళము నిచ్చినవారు. ప్రసిద్ధ న్యాయవాది.

కేసరి కె. ఎన్. డాక్టర్ ఆయుర్వేద భిషగ్వరుడు. కేసరీ కుటీరము, రాయపేట. ఆంధ్ర స్త్రీల విద్యాభివృద్ధికి తోడ్పడుతూ ఉన్న గృహలక్ష్మి అనే మాసపత్రికాధిపతి. తమిళ భాషాభివృద్ధికి సైతము సహాయమగు పత్రిక నడుపుచున్న విద్యాభిమాని. ప్రతి సంవత్సరము ఆంధ్రభాషలో ఉత్తమ రచయిత్రులకు సువర్ణ కంకణ బహుమానము చేస్తున్న విద్యాపోషకుడు.

కోటిరెడ్డి కడప బి. ఏ., ఎల్. ఎల్. బి. (లండన్), బి. సి. ఎల్. (ఆక్స్ఫర్డు), బారిస్టర్. ఎం. ఎల్. ఏ. జ. 1887. కాం. పా.

కోటీశ్వరన్ పి. డి. ఎస్సి. గు. జిల్లా. ఆలిపూర్ జ్యోతిస్ పరిశోధనాలయము (అబ్జర్వేటరీ) లో పని. ఆంధ్ర మహాసభా సభ్యులు. ఆంధ్రాభిమానులు.

కోటీశ్వరం పంచేటి డా. జ. 1915 నెల్లూరు. 13వ సంllన స్కూలుఫైనలు పరీక్షలో నుత్తీర్ణులై, ఆంధ్ర విశ్వ విద్యాలయమున ప్రథానులుగా ఇంటర్మీడియేట్ పరీక్షలో నుత్తీర్ణులై, బి. ఎస్సి. (ఆనర్సు) మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో చదివిరి. 1934-36 సంllలలో గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో పనిచేసి, తర్వాత బందరు హిందూ కళాశాలలోను, మద్రాసు పచ్చయప్ప కళాశాలలోను పనిచేసి, ఆంధ్ర మద్రాసు విశ్వవిద్యాలయములచే పరిశోధనలకు డి. ఎస్‌డి. పట్టముల పొందిరి. 1940 సంll నుంచీ "ఇండియా మెట్రొలాజికల్ సర్వీస్" లో కలకత్తాలో పనిచేయుచున్నారు.

గంగరాజు మోతే ఏలూరు ప. గో. జి. జమీందారులు, వ్యాపారులు, ఉదారులు, దాతలు. రా. బ. 1903; షష్టిపూర్తినాడు తులాభారము తూగి, విశేషధనము దానము చేసినవారు. అనేక సంస్థలకు పోషకులు.

గణపతి పంతులు సాదు బి. ఏ., బి ఎల్. వీరు దివాన్ సాదు రామకృష్ణయ్యాగారి అన్నకుమారులు. దక్షిణ దేశమున సకల సాంఘిక సంస్థలలోను వీరు పాల్గొందురు. డిస్ట్రిక్టు బోర్డు, తాలూకా బోర్డు మెంబరుగా బహుజనసేవ చేసియున్నారు. తిరునల్వెల్లి పురపాలక సంఘమునకు చేర్మన్‌గానుండిరి. దివ్యజ్ఞాన సమాజ సభ్యులు.

గిరి, వరహగిరి వెంకట జ. 1894 బరుహంపురం గం. జిల్లా. 1913-16 డబ్లిన్‌లో విద్య, బారిస్టర్. 1922 బి.ఎన్.ఆర్. యూనియన్ వైస్ ప్రెసిడెంట్. 1924 ఆల్ ఇండియా



శ్రీ కడప కోటిరెడ్డి.

రైల్వే ఫెడరేషన్ ప్రెసిడెంట్. 1927 నానాజాతి సమితి జినీవా లేబర్ కాన్ఫరెన్సు డెలిగేట్. 1931లో 2వ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకు ఆహ్వానం పొంది వెళ్లిన సభ్యులు. 1931-36 సెంట్రల్ అసెంబ్లీ సభ్యులు. 1937 ఎమ్. ఎల్. ఏ. చెన్నపురి ప్రభుత్వమందు లేబర్ అండ్ ఇండస్ట్రీస్ శాఖా మంత్రి.

గురుమూర్తిఅయ్యర్ రేమా, బి. ఏ., బి. ఎల్., వీరు చిర కాలము న్యాయవాదిగా ఉండిరి. హిందూ ధర్మశాస్త్ర ములందు మంచి ప్రజ్ఞ, తెలుగుభాషలో మంచి వాగ్ధాటి గలిగియుండిరి. తిరునల్ వెల్లి పురపాలక సంఘ సభ్యులు. ప్రస్తుతము మధురలో నున్నారు.

గోపాలరెడ్డి బెజవాడ జ. 1907 బుచ్చిరెడ్డిపాలెం, నె. జిల్లా. చదువు ఆంధ్ర జాతీయ కళాశాల, రవీంద్రుని విశ్వభారతి, కాశీ విద్యాపీఠం, తిలక్ విద్యాపీఠం. హిందీ, మరాఠీ, గుజరాతీ, బెంగాల్, ఉరుదూ, తమిళ భాషలలో కొంత పరిజ్ఞానమున్నది. తెలుగు నవ్యసాహిత్యాభిమానులు. జాతీ



శ్రీ బెజవాడ గోపాలరెడ్డి.



శ్రీ కల్లూరి చంద్రమౌళి.

యోద్యమములందు పనిచేస్తూ ఉంటారు. అ. భా. కాం. సంఘం, ఆంధ్ర రాష్ట్ర కాం. సం. సభ్యులు. 1937 చెన్న పురి ప్రభుత్వమందు స్థానిక, స్వపరిపాలనా శాఖ మంత్రి. మంత్రి వర్గమందు అందరిలోను చిన్నవారు.

గోపాలరావు గండికోట డా॥ ఆంధ్ర విశ్వవిద్యాలయ మందలి రసాయన శాస్త్ర శాఖలో పరిశోధకులుగా పని చేయుచున్నారు. వీరు కొంతకాలము అలహాబాదులో ప్రొఫెసర్ ఎన్. ఆర్. ధార్ గారివద్ద సోషల్ కెమిస్ట్రీలో పరిశోధనలు సలిపి, అలహాబాదు విశ్వవిద్యాలయమువారి డి. ఎస్‌సి. డిగ్రీని పొందిరి. వీరు Ceramics అను శాఖ యందు ఎక్కువ కృషి సలిపినారు.

గోవిందరాజాచారి వింజమూరి, బి. ఏ., బి. ఎల్., జననం 1896 వి. జిల్లా. 1921 నుండిన్ని చెన్నపురిలో అడ్వొకేట్. శీఘ్రకాలంలో పెద్దపేరుగల లాయరు. 1932 నుండిన్ని మద్రాస్ యూనివెర్సిటీ లీగల్ అడ్వైజరు. దేశీయ సంస్థ లకు ఉద్యమములకు సహాయులు.

చంద్రమౌళి కల్లూరి స్కాట్లండు విశ్వవిద్యాలయ మందలి ఉన్నత పరీక్షలం దుత్తీర్ణులయి వ్యవసాయాభివృద్ధికై మనదేశమందు పనిచేస్తున్నవారు. కాం. పా. గుంటూరు జిల్లా కాం. కమిటీ అధ్యక్షులు. అఖిల భారత కాం. కమిటీ సభ్యులు.

చల్లపల్లి రాజావారు—శ్రీ యార్లగడ్డ శివరామప్రసాద్ రాజా బహదూర్ జ. 1906. కృ. జిల్లా బోర్డు ప్రెసిడెంట్. కళాభిమాని; విద్యాపోషకులు. ప్రజామిత్ర వారపత్రికా స్థాపకులు. సారథి ఫిల్మ్సు స్థాపకులు.

జగన్నాథదాసు బచ్చు. ఎం.ఏ.,ఎం.ఎల్., చెన్నపురి ఆంధ్ర ఆడ్వొకేటులలో పెద్దపేరు గలవారు. గంజాం జిల్లా బరంపురంవారు. కాం. పా. చెన్నపురి కార్పొరేషన్ సభ్యులు. జాతీయోద్యమమందు పాల్గొంటున్నవారు.

జగన్నాథరాజు జి, రా. బ., బి. ఏ., బి. ఎల్., వి. జిల్లా బోర్డు ప్రెసిడెంటుగా కొంతకాలము, ఆంధ్ర సైనిటోన్ డైరక్టరుగా కొంతకాలము పనిచేసినవారు.

జోగినాయుడు ఏ., ఎం. ఎల్. ఏ., జ. 1895 వి. జిల్లా. కాం. పా. ధర్మవరంలో ఖద్దరు పరిశ్రమ కార్యాలయం స్థాపించిరి. స్థానికపరిపాలనా సంస్థలందు జిల్లా బోర్డు నందు మెంబర్. తాలూకా బోర్డు వైస్. ప్రెసిడెంట్.

తిరుమలరావు మొసలికంటి, ఎం. ఎల్. ఏ., జ. 1901. 1923లో ప. గో. జిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శి. తెలుగు



శ్రీ మొసలికంటి తిరుమలరావు.

స్వరాజ్య పత్రికా సంపాదకీయ వర్గమందు సభ్యులు; ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ప్రకటన శాఖాధికారిగా పనిచేసిరి.

నరసింహంచౌదరి-నూతలపాటి శతశిల్పి. జ. నెల్లూరులో. విద్యాభ్యాసములలో గాక వివిధ వస్తు నిర్మాణంలో కృషి సల్పిరి. దేశీయ సామ్రాజ్య మనుపేర శిల్పాన్ని గురించి గ్రంథం రచించేరు. 1916లో బెజవాడలో శిల్పాశ్రమము స్థాపించి వివిధ కళలను బీదల కుచితంగా నేర్పుతున్నారు. 'శతశిల్పి' బిరుదాంకితులు. వీరు నిర్మించిన దేవాలయాలను వివిధ వస్తు నిర్మాణ కౌశలమును విదేశీయులుకూడా మెచ్చుకున్నారు.

నరసింహంపంతులు మంత్రిప్రగడ, బి. ఏ., బి. ఎల్., రా.బ. జిల్లా కలెక్టరు గాను చెన్నపురి సర్వీస్ కమిషన్ మెంబరు గాను పనిచేసి రిటైరయినవారు. చెన్నపురి ఆంధ్ర మహాసభకు ఉపాధ్యక్షులు.

నరసింహరాజు. వి. ఎల్. జ. 1884. వి. జిల్లా. ఎం. ఎల్. ఏ. విజయనగరం తా. బోర్డు అధ్యక్షులుగ 5 సార్లు ఏకగ్రీవంగా ఎన్నుకోబడిరి. దేశీయ సంస్థలందు పాల్గొన్న కాం. పా. (పి. సి. సి.) సభ్యుడు. వి. జిల్లా బోర్డు అధ్యక్షులుగనుండిరి.

నారాయణ వి. ఎస్. జ. 1900. ఛత్రపురము. బరంపురం, విజయనగరం కళాశాలలలో చదివిరి. బ్యాంకింగ్, అకౌంటెన్సీలలో పాండిత్యము గణించిరి. 1920లో సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియాలో పనిచేసి 1921లో కలకత్తా ఇండస్ట్రియల్ బ్యాంకున కధికారి యయ్యెను. తర్వాత ఆగ్రా టెక్నికల్ మిల్లులకు డైరెక్టరు, మేనేజరైరి. 1921 ప్రశస్తమైన లిమిటెడ్ కంపెనీల కార్యదర్శిత్వము వహించిరి. కలకత్తా ఆంధ్రులలో వీరు ప్రముఖులు. ఆంధ్రాభ్యుదయమునకై అచ్చట అనిర్వచనీయమైన కృషిచేసిరి. ప్రస్తుతము లక్నోలో కరమ్‌చంద్ థాపర్ అండ్ బ్రదర్సు కంపెనీ మేనేజరుగాను, గోపాల్ పేపర్ మిల్సు, అసోసియేటెడ్ మైనింగ్ ఇండస్ట్రీల దర్శకులుగాను, మేరిటైమ్‌స్టోర్సు అధ్యక్షులుగా పనిచేయుచున్నారు. ప్రజ్ఞాశాలి. పారిశ్రామిక వర్తకశాలలలో సిద్ధులు.

నారాయణ పెదసింగు వెంకట అగ్నికుల క్షత్రియులు. బందరు, కృ. జిల్లా. అనేక విద్యా సంస్థలతోను అందలి క్లబ్బులతోను సంబంధముగల వారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్ సెనేట్ సభ్యులు. బెజవాడ ఆంధ్ర నావికా సంఘాధ్యక్షులు "పల్లవరత్న" బిరుదాంకితులు. అగ్నికుల ప్రబోధిని అనే పత్రికకు సంపాదకులు. నాకాస్వాములన్, నాకావర్తకులు.



నారాయణరాజు దండు జ. 1889. బి. ఏ., బి. ఎల్., ఎం. ఎల్. ఏ., కాం.పా., ఏలూరు. ప. గో. జిల్లా. బోర్డు అధ్యక్షులు. ఎం.ఎల్.సి 1926-30; ఏలూరు కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు గౌరవ కార్యదర్శి.

నారాయణస్వామిచెట్టి గోపతి, ది. బ. కౌన్సిల్ ఆఫ్ స్టేట్ మెంబరు. జ. 1881 వ్యాపారి; భూస్వామి. 1927-28 కార్పొరేషను (మద్రాసు) మేయరు. ప్రసిడెన్సీ జైళ్ల విజిటరు. మద్రాసు లేబరుబోర్డు, ఎస్. ఐ. కామర్సు ఛేంబరు, సెంట్రల్ రైల్వే బోర్డు, మొ. అనేక సంస్థలలోను, మద్రాసులోని వివిధ ఆస్పత్రుల కమిటీలు, పాఠశాలల కమిటీలు, ట్రస్టులు, ఫండు సొసైటీల కమిటీలు మొ. వాటిలోను సభ్యులు. ఇంపీరియల్ అగ్రికల్చరల్ రీసెర్చి కౌన్సిలు పాలక వర్గ సభ్యులు. బోర్డాఫ్ ఇండస్ట్రీసు, రోడ్సు కమిటీ సభ్యులు. సెంట్రల్ లెజస్లేచరు యొక్క ఒట్టోవా కమిటీలో మెంబరుగా నుండిరి.



నారాయణస్వామి నాయుడు, బి. వి. డా. ఎమ్. ఏ., బి. కాం., పి. ఎచ్. డి., గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త. అన్నామలే విశ్వవిద్యాలయమున 12 సం॥ నుండి అధ్యాపకులు. అన్నామలై, ఆంధ్ర, మైసూరు, మద్రాసు, పంజాబు, లక్నో, ఢక్కా, బొంబాయి, తిరువాన్కూరు, విశ్వవిద్యాలయముల పరీక్షాధికారి. విజ్ఞాన సంపన్నులు, 1941 సం॥ మద్రాసు రాష్ట్ర కో ఆపరేటివ్ కాన్ఫరెన్సుకు అధ్యక్షులు. మద్రాసు పచ్చయప్ప కాలేజి ప్రిన్సిపాల్.

పట్టాభి సీతారామయ్య భోగరాజు డా. బి.ఏ.,ఎం.బి.,సి.ఎం., జ. 1880. 1906 మొ 1916 వరకు వైద్యవృత్తి. పిమ్మట వృత్తి త్యజించి దేశసేవకు గడంగిరి. 1916 నుండియును అ. భా. కాం. కమిటీ సభ్యులు. ఆంధ్ర ఇన్యూరెన్సు కంపెనీ; ఆంధ్ర బ్యాంకు, ఆంధ్ర జాతీయకళాశాల హిందూస్థాన్ మ్యూచుయల్ మొదలగు అనేకాంధ్ర సంస్థల స్థాపనకు కారకులు. ఆం. రా. కాం. కమిటీ మాజీ అధ్యక్షులు. కాంగ్రెసు వర్కింగు కమిటి సభ్యులు. సంస్థాన ప్రజామండలి అధ్యక్షుడు. సంస్థానములన్నీ సంచారము చేసిరి. కాంగ్రెసు మహాసభ చరిత్ర రచించెను. గొప్పమేధావి. మహావక్త. రాజకీయాల్లో పండితుడు. ఆంధ్రనాయక శిఖామణి.

పల్లంరాజు ఎమ్. ఎం. ఎల్. ఎ., జ. 1899 తూ. గో. జిల్లా బాలాంతరం. గ్రామమునసబు. కాం. పా. జాతీయోద్యమ కృషిగలవారు. జిల్లా కాం. కమిటీ కార్యదర్శి, అధ్యక్షులు. జిల్లా బోర్డు అధ్యక్షులు. 1931 సాంబమూర్తి గారితో గలిసి హిందూస్థానీ సేవాదళమును ఏర్పరచిరి. అఖిల భారత కాం. కమిటీ సభ్యులు.



శ్రీ ఎమ్. పల్లంరాజు.

పాత్రో సర్, ఎ. పి., బి.ఏ.,బి.ఎల్.,బరంపురంలో న్యాయవాది. అనేక సంవత్సరములు శాసన సభా సభ్యులు. జస్టీసుపార్టీ నాయకులు ; స్టేటు కౌన్సిలు సభ్యులు. జస్టిస్ పార్టీవారి ప్రభుత్వకాలమందు విద్యాది శాఖా మంత్రి. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు చట్టమునకు ప్రధాన కారకులు. 1931 లో లీగ్ ఆవ్ నేషన్సుకున్ను, 1931-37 లో రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకున్ను, 1933 లో జాయింటు పార్లమెంటరీ కమిటీకిన్ని ఇండియన్ డెలిగేటు.



సర్. ఏ. పి. పాత్రో.

పాపయ్యచెట్టి బి. జ. 1893. రా. సా. ద్వారకానాథ్ అన్డ్ కంపెనీ ప్రొప్రైటరు. దక్షిణ భారత వైశ్యాసంఘ కార్యదర్శి. 1921-22 న్యాయ దీపిక పత్రికా సంస్థలో కార్యదర్శి. ఆంధ్ర చేంబర్ ఆవ్ కామర్సు గౌ. కార్య దర్శి. గ్రంథకర్త-భగవద్గీత, ఉపనిషత్తులు, సాయిలీలా మొ. గ్రంథములు ఆంధ్ర భాషలో రచించిరి.

పిఠాపురం మహారాజా రావు వేంకట కుమార మహీపతి జస్టిస్‌పార్టీ కాలములో విద్యాశాఖా మంత్రి. యూరప్‌లో సంచారము చేసెను. జ. 1885. 1906 లో సింహాస నమెక్కెను. మద్రాసు శాసన సభ, విశ్వ విద్యాలయ ముల సభ్యులు. సంస్కర్త ; బ్రహ్మ సమాజ పోష కులు. సర్. వెంకటరత్నం నాయుడుగారి శిష్యులు. అనాధశరణాలయము, ఒక కళాశాల, రెండు పాఠశాలలు స్థాపించారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపించి పోషిస్తూ, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు వెలువరించిరి. 1937 లో పీపుల్సుపార్టీ నాయకులు. జనవాణి అను ఆంధ్ర దిన పత్రిక పీపుల్సు వాయిస్ అను ఆంగ్ల దినపత్రిక స్థాపించారు. కాని కొద్దికాలం మాత్రమే నిలబడ్డాయి. ఆంధ్ర విశ్వవిద్యాల యం వారు డి. లిట్ బిరుదముతో గౌరవించిరి.



శ్రీ ఓ. పుల్లారెడ్డి.

పుల్లా రెడ్డి ఓ. ఐ.సి.ఎస్ చెన్నపురి కార్పొరేషను కమీ షనరుగా ఉండి అభినందనముల నందుచున్నారు. లోగడ కొంత కాలము జయపుర సంస్థానమునకు దివానులుగా నుండిరి.



పెద్దిరాజు పెన్మచ్చ జ. 1886. ఏలూరు బి.ఏ., బి. ఎల్., ఎం. ఎల్. సి. (1923-26, 32 - 37, 37 - ). ఏలూరు తాలూకా బోర్డు (1920-22) అధ్యక్షులు ; జిల్లా బోర్డు అధ్యక్షులు (1927-32).

ప్రకాశంపంతులు టంగుటూరి. ఆంధ్రులలో మొదటి బారిస్టరు. జ. 1872. 1894లో రాజమండ్రీలో ప్లీడరు. 1901 రాజమండ్రీ మ్యునిసిపాలిటీ చైర్మన్. 1903 లో ఇంగ్లాండు పయనం. 1907 మద్రాసులో బారిష్టరుగా ప్రాక్టీసు. జడ్జికానున్న సమయంలో (1920) వృత్తిమాని కాంగ్రెసులో చేరిరి. జస్టిస్ వెంకట సుబ్బారావు, వెంకట రమణారావు గార్లు వీరి క్రిందజూనియర్లు. 1921 లో స్వరాజ్య అనే ఆంగ్ల దిన పత్రిక స్థాపించి చాలకాలం నడిపేరు.



శ్రీ టంగుటూరి ప్రకాశం.

1926-30 సెంట్రల్ అసెంబ్లీ సభ్యులు. కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం అధ్యక్షులు. 1937 లో కాంగ్రెసు రివెన్యూ మంత్రి. జమీందారీ రైతు రిపోర్టు తయారు చేసిరి. 1939 గ్రామ స్వరాజ్యం అనేవార పత్రికలు అంగ్లాంధ్ర తమిళ, భాషలలో స్థాపించిరి.

బాపినీడు మాగంటి జ. 1895. ఏలూరులో కార్నెల్ విశ్వవిద్యాలయంలో బి. ఎస్‌సి. అగ్రికల్చర్ ప్యాసై, కాలిఫోర్నియాలో ఎం.ఎస్‌సి పట్టమునందిరి. న్యూయార్కు వ్యవసాయ కళాశాల ఇంటర్ నేషనల్ అగ్రికల్చెరల్ సొసైటీ ప్రసిడెంటు. ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనేటు మెంబరు. కాం. పా. మద్రాసు అసెంబ్లీకి ఏలూరునుండి ఎన్నుకోబడి, ప్రచురణశాఖా మంత్రికి కార్యదర్శిగా పని చేసిరి. ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవా సంఘ కార్యదర్శి.

బొబ్బిలి రాజా సర్ స్వేతాచలపతి రామకృష్ణరంగారావు బహద్దూర్. కె. సి. ఐ. ఇ. జ. 1901. 1920 లో గద్దెనెక్కిరి. స్టేటు కౌన్సిలు మెంబరు. 1925-27 ఎమ్. ఎల్. సి. 1930 లో గవర్నరుగారి గౌరవ ఎయిడ్ డి కాంగ్. 1930 మొదలు ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రోఛాన్సలరు. 1932-37 మద్రాసు గవర్నమెంటు ప్రధాన మంత్రి. జ. పా. నాయకులు.

భగవంతం సూరి ఆంధ్ర విశ్వవిద్యాల కళాశాలకు ప్రిన్సిపాలుగ పని చేయుచున్నారు. సుమారు అయిదు సంవత్సరములు కలకత్తాలో 'రామన్ ఎఫెక్టు' మున్నగు విషయముల పరిశోధించిరి. ప్రస్తుతము వీరుపరిశోధనలు జరుపుచున్న Raman effect and Crystal structure మున్నగు విషయములు ముఖ్యములు. వీరి పరిశోధనలకు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు వీరికి ఆనర్స్ డి. ఎస్‌సి. డిగ్రినొసంగి బహూకరించిరి. రామన్ ఎఫెక్టును సంబంధించిన ఉద్గ్రంథముల రచించిరి.

భగవంతంగుప్త తుంపూడి. జ. 1874. విద్యాభ్యాసం కాకినాడ. బి.ఏ. క్రిస్టియన్ కాలేజీ 1894. బి.ఎల్ 1897. నెల్లూరు కలెక్టరాఫీసులో ఉద్యోగం 1899. ఉత్తర ఆర్కాడు జిల్లాలో డిప్టీకలెక్టరు 1917. అనేక ధర్మకార్యములు చేసిరి. మద్రాసులో ప్రసిడెన్సీ మేజస్ట్రేటు. అఖిల భారత ఆర్యవైశ్య మహాసభా స్థాపకులలో నొకరు. ఇండియన్ నేషనల్ సోషల్ కాన్ఫరెన్సు ఉపాధ్యక్షులు. సంస్కరణాభిలాషి.

మాధవరావు న్యాపతి. రాజమంత్ర ప్రవీణ బి.ఏ., బి.ఎల్., జ. బందరులో 1887. విద్య నోబిల్ కాలేజీ మచిలీపట్నం, మద్రాసు పచ్చయప్పకాలేజీ, లా కాలేజీ. 1907 మైసూరు సివిల్ సర్వీసులో ప్రొబేషనరీ అసిస్టెంటు కమిషనరుగా చేరిరి. ట్రెజరీ ఆఫీసరు, సబ్ డివిజన్ ఆఫీసరు, ఆడిట్ ఆఫీసరుగా పని చేశారు. మైసూరు గవర్నమెంటు యొక్క బ్లూబుక్ జర్నల్ అనే పత్రిక మొదటి సంపాదకులు. మైసూరు దివానుకు ప్రైవేటు సెక్రెటరీ 1919. 1924 లో మైసూరు సిటీ మునిసిపల్ కౌన్సిలు ప్రసిడెంటు. 1927-33 గవర్నమెంటు ఛీఫ్ సెక్రెటరీ. 1929 మార్చి-డిసెంబరులలో లండను, న్యూయార్కు వెళ్లి మైసూరు చందనం కొనుగోలు మార్కెటు ఏర్పరచారు. లండనులో మొదటి మైసూరు ప్రభుత్వపు ట్రేడు కమిషనరుగా పని చేశారు. 1933 మైసూరు రివెన్యూ కమిషనరు. పొలిటికల్ అఫైర్సు

కమిటీ అధ్యక్షులు. ఇంపీరియల్ అగ్రికల్చరల్ రీసెర్చి కౌన్సిలు మెంబరు. 1936 దసరాలో 'రాజమంత్ర ప్రవీణ' బిరుదము. కాఫీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డు చైర్మన్. 1938 మైసూరు ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సీనియరు మెంబరు. 1941 మైసూరు దివానుగా నియమింపబడ్డారు.

మీర్జాపురం జమీందారు శ్రీరాజా మేకా వేంకటరామయ్య అప్పారావు బహదూర్ ఎం. ఎల్. ఏ., 1914లో కృ. జి. బోర్డు ఎలెక్టెడ్ ప్రెసిడెంట్లలో వీరే మొదటివారు. వీరి ప్రోత్సాహమున ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు కృ. జిల్లా బోర్డు వారు 3½ లక్షల రూప్యములు ఇచ్చిరి.

మునగాల జమీందార్ శ్రీనాయని వెంకట రంగారావు. ప్రఖ్యాత రెడ్డిరాజ వంశమువారు. జ. 1879. దేశీయ పరిశ్రమలకు ఉద్యమములకు ఆంధ్ర సారస్వతాభివృద్ధికి సహాయులు.

మూర్తి. బి. ఎస్. బి. ఏ., బి. ఇడి., జ. 1906. నగరం తూర్పు గోదావరి జిల్లా. కవి. నవజీవన పత్రికా సంపాదకులు. గ్రంథరచయిత. ఆంధ్ర రాష్ట్ర హరిజన సంఘ సహాయ కార్యదర్శి 1936. అసెంబ్లీ సభ్యులు; పారిశ్రామిక మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి. కృతులు: ఆంధ్ర వీరకుమార శతకము; ఆవేదన.

మూర్తి కె.ఎస్.ఎన్. ఎమ్.ఎ., ఆర్.ఏ., రా.సా. జ. 1890 తుని. తూ. గోదావరి జిల్లా. బెంగాలు నాగపూర్ రైల్వేలో అసిస్టెంటు ఆడిటర్‌గా పని చేయుచున్నారు. కలకత్తా ఆంధ్రులలో వీరు ప్రముఖులు. రివెన్యూ శాఖలో 10 సంవత్సరములు పని చేసి, మద్రాసుకు సామీప్యమున పల్లవరములో మిలటరీలో చేరిరి. గత ఐరోపా మహాసంగ్రామకాలమున ఫిజాబాద్, కామిల్లా, జలుల్పూరులలో పనిచేసి, 1919 సంవత్సరము దాదర్ మిలటరీ ఆఫీసుకు అకౌంటెంటుగ పోయిరి. 1920 సం॥ బెంగాలు నాగపూరు రైల్వేలో చేరిరి. 'బుక్ కీపింగ్' శాస్త్రమునకు సంబంధించిన గ్రంథములను ఆంధ్రమున వ్రాసిరి. వీరి ప్రజ్ఞకు, కుశలతకు మెచ్చి వీరికి ప్రభుత్వమువారు 1936 లో రావుసాహెబ్ బిరుదునిచ్చిరి.

రంగధామారావు కొచ్చెర్లకోట ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఫిజిక్సు శాఖలో ఆచార్యులు. మొదట విజయనగరములో డా॥ ఎ. ఎల్. నారాయణగారివద్ద పరిశోధనలుచేసి, మద్రాసు విశ్వవిద్యాలయమువారి డి. ఎస్‌సి. డిగ్రీని పొంది, తర్వాత ఇంగ్లండులో ప్రొఫెసర్ ఫౌలర్‌వద్ద పరిశోధనలుచేసి, లండన్ విశ్వవిద్యాలయమువారి డి. ఎస్‌సి. డిగ్రీని పొందిరి. వీరు చేసిన Atomic spectra, Band spectra పరిశోధనలు ప్రశంసార్హములు.

రాఘవయ్య దివాన్ బహద్దర్ తొల్ల బి. ఏ., జ. 1872. డిప్యూటీ కలెక్టరు. స్పెషల్ ఫారెస్టరు. కార్పొరేషను రివిన్యూ ఆఫీసరు 1908. రెవెన్యూ బోర్డు సెక్రటరీ 1913. జిల్లా కలెక్టరు 1917-20. 1920 నుండి తిరువాన్కూరుకు దివానుగా పనిచేసిరి.

రాధాకృష్ణయ్య సర్వేపల్లి సర్. డాక్టర్ జ. 1888. చిత్తూరు జిల్లా. క్రిస్టియన్ కాలేజిలో విద్యాభ్యాసం. ప్రసిడెన్సీ కాలేజీలోను మైసూరు కాలేజీలోను ఫిలాసఫీ ప్రొఫెసరు. కలకత్తా విశ్వవిద్యాలయం కింగ్ జార్జి ఫిలాసఫీ ప్రొఫెసరు. ఇంటర్నేషనల్ ఇంటలెక్చుఅల్ కమిటీ మెంబరు. 1931-36 ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు. 1936 లో ఆక్సుఫర్డులో కంపేరటివ్ రెలిజన్సు థియాలజీ స్పాల్డింగు ప్రొఫెసరు. అమెరికా, జినీవా మొ॥ విదేశాల్లో అనేకోపన్యాసాలిచ్చి మేటివక్త అని ప్రఖ్యాతిపొందిరి. 1926 చికాగో, ఆక్సుఫర్డులలో ఉపన్యాసాలిచ్చిరి. ప్రస్తుతం కాశీ హిందూ విశ్వవిద్యాలయోపాధ్యక్షులు. గ్రం. హిందూ వ్యూ ఆఫ్ లైఫ్, కల్కి, ఇండియన్ ఫిలాసఫీ, ఐడియలిస్టు వ్యూ ఆఫ్ లైఫ్ మొ॥

రామ్ వి. ఎస్. డాక్టర్ జ. 1895. అత్తిలి, ప. గో. జిల్లా. 1917 కాలిఫోర్నియాలో బి. ఏ. ఆనర్సు. 1918 హార్వర్డులో ఎం. ఏ. 1920 పి హెచ్. డి. (హార్వర్డు). లక్నో విశ్వవిద్యాలయంలో ప్రధాన రాజకీయార్థికాధ్యాపకులు. 1936-37 అంతర్జాతీయ సభ కార్యదర్శిత్వ సభ సభ్యుడుగా పనిచేసిరి. 1941 ఇండియన్ పొలిటికల్ సైన్సు అసోసియేషనుకు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. లండను, కేంబ్రిడ్జి, జినీవా, హిందూదేశం మొ॥ పలుతావుల్లో రాజకీయశాస్త్రోపన్యాసాల్నిచ్చిరి. అనేక గ్రంథాలు రచించారు. 1934 లో అఖిల భారత గ్రంథాలయ సమావేశం, 1931 లో 10 వ ఆంధ్ర విద్యార్థి మహాజన సభకు, 1934 ప్రథమ యు. పి. విద్యార్థి సభకు అధ్యక్షులు; కాశీ, లక్నో విశ్వవిద్యాలయాల సినేటు, ఫేకల్టీల మెంబరు.



శ్రీ వెలగపూడి రామకృష్ణ.

రామకృష్ణ వెలగపూడి ఐ. సి. ఎస్. జ. 1896. ఎం. ఏ. ఆనర్సు (ఎడింబరో) 1916. బి. ఎస్‌సి. 1916. 1922లో ఐ. సి. ఎస్. చెంగల్పట్టు అసిస్టెంటు కలెక్టరు. 1925లో జయపురం దివానుగా సంస్థానం రాబడి హెచ్చించి అనేకవిధముల అభివృద్ధిచేసిరి; వేద సంస్కృత పాఠశాల స్థాపించిరి. మద్రాసు ఇండస్ట్రీసు డైరెక్టరు. లేబరు కమీషనరుగా మద్రాసు గవర్నమెంటులో నున్నారు. 1942 లేబర్ ట్రిబ్యునల్ బోర్డు ఛైర్‌మన్‌గా నియమింపబడ్డారు.

రామకృష్ణారావు ఇచ్ఛాపురపు ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఫిజిక్సు శాఖలో పరిశోధకులు. మొదట కలకత్తాలో సర్ సి. వి. రామన్‌గారివద్ద క్లాసికల్ అండ్ రామన్ స్కాటరింగ్‌లో పరిశోధనలు సల్పి, కలకత్తా విశ్వవిద్యాలయమువారి పి హెచ్. డి. డిగ్రీని బడసిరి. ఇంగ్లండు వెళ్లి ప్రొఫెసర్ రిచర్డ్సన్ వద్ద రామన్ ఇఫెక్టులో పరిశోధనలు చేసి, లండన్ విశ్వవిద్యాలయమువారి డి. ఎస్‌సి. డిగ్రీని పొందిరి. రామన్ ఇఫెక్టుకు సంబంధించిన అనేక పరిశోధనలుచేసిన ప్రసిద్ధులు.

రామకోటీశ్వరరావు కోలవెన్ను బి.ఏ.,బి.ఎల్., ఎమ్.,ఎల్.ఏ. జ. 1894. 1925లో న్యాయవాద వృత్తినుండి విరమించి, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ప్రచురణ శాఖాధికారిగాను, స్వరాజ్య పత్రిక సంపాదక వర్గములోను, బందరు జాతీయ కళాశాలకు కులపతిగాను పనిచేసిరి. 1927-28లో త్రివేణి మాసపత్రికను స్థాపించి, దానిని ఆంగ్ల పత్రికలలో ప్రశస్తమైనదిగా చేసిరి. 1939లో ఎం.ఎల్.సి. కాం. పా. కళోపాసకులు, రచయిత, సంస్కారి.

రామచంద్రరావు ధన్వాడ డాక్టర్ జ. 1879. క్రైస్తవ మతములో కలిసిన ప్రథమ ఆంధ్ర బ్రాహ్మణుల కుటుంబమునకు చెందిరి. ఎం. ఏ. (ఎడింబరో) ఎం. బి., సి. హెచ్. బి., ఎం. డి. (ఎడింబరో) లండను హాస్పిటలులో 1915-17 డాక్టరు. లండను యుద్ధ కార్యాలయం ఉపన్యాసకులు. 1906-10 వరకు మద్రాసు పచ్చయప్ప కాలేజీ లెక్చరరు. చెవి, ముక్కు, గొంతు, కండ్ల జబ్బులలో ప్రత్యేక వైద్యులు. బెజవాడ మునిసిపల్ ఛైర్మను. బెంగుళూరులో ప్రాక్టీసు చేసిరి. కృష్ణా జిల్లాబోర్డు అధ్యక్షులు. ఆంధ్ర వైద్య సమ్మేళనము అధ్యక్షులు.



శ్రీ పాలూరి రామచంద్రరావు.

రామచంద్రరావు పాలూరి ఎమ్. బి., బి. ఎస్. జ. 1911. కెప్టన్; ప్రస్తుత మహా సంగ్రామ సేవలో ఈజిప్ట్ ప్రాంతమున వైద్యసేవ చేయుచున్నారు.

రామచంద్రా రెడ్డి బెజవాడ బి. ఏ., సి. బి. ఇ., జ. 1894 నెల్లూరు జి. నె. జి. బోర్డు అధ్యక్షులు 1929-30. మె. లెజిస్లేటివ్ కౌన్సిల్ ప్రెసిడెంట్ 1930-37. ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనేటు మెంబరు. లాండ్ రెవెన్యూ కమిటీ



శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి.

మెంబరు (1937) ఆంధ్ర నాట్యకళాపరిషత్తు అధ్యక్షులు కళాభిమానులు.

రామచంద్రారెడ్డి సుద్దపల్లి దత్తమండలములోని ప్రాచీన కుటుంబములో ఉన్నతవంశమున జన్మించిరి. కడప జిల్లాలోని సుద్దపల్లి వీరి స్వగ్రామము. దానధర్మబుద్ధి, పరోపకార గుణము గలిగినవారు ; ధనాఢ్యులు. కర్నూలు జిల్లా ఆగ్ల గడ్డ గ్రామములో 30 వేల రూపాయిల విలువగల శివాలయమును నిర్మించిరి. అహోబిల ఆలయమున తిరునాళ్లలో అన్నసత్రము జరుపుటకు అరవై ఎకరముల భూమిని దానము చేసిరి. పదివేల రూపాయలు కర్నూలు జిల్లా చాగలమర్రి వైద్యశాలకిచ్చి దానిని స్థాపన గావించిరి.

రామదాసు పంతులు వేమవరపు గా॥ బి. ఏ., బి. ఎల్. జ. 1873. విద్యాభ్యాసము క్రిస్టియన్ కాలేజీ, లా కాలేజీల లో (మద్రాసు). 1925 నుండియు స్టేటు కౌన్సిలు మెంబరు. 1926 నుండి కౌన్సిలులో స్వరాజ్యపార్టీ నాయకుడు. మద్రాసు ప్రావిన్షియల్ కో ఆపరేటివు బ్యాంకు, మద్రాసు. ప్రా. కో. యూనియను, దక్షిణ ఇండియా కో. ఇన్సూరెన్సు సొసైటీ, ఇండియన్ ప్రా. కో. బ్యాంకుల అసోసియేషనులకు అధ్యక్షులు. లండనులో జరిగిన 14వ అంతర్జాతీయ కో ఆపరేటివు కాంగ్రెసుకు ఇండియా తరఫున డెలిగేటు. సెంట్రల్ ఛేంబరు ఎన్క్వయిరీ కమిటీలోను, ఇంపీరియల్ అగ్రికల్చరల్ రీసెర్చి కౌన్సిలులోను పరిపాలకవర్గ సభ్యుడు. అఖిల భారత కాంగ్రెసు కమిటీ మెంబరు. ఆంధ్ర మహాసభాధ్యక్షులు.

రామన్ సర్. సి. వి. డా. కే. టి., ఎమ్. ఏ., డి. ఎస్‌సి., పిహెచ్. డి., ఎల్. ఎల్. డి., ఎఫ్. ఆర్. ఎస్., ఎన్. ఎల్. జ. 1886 విశాఖపట్నంలో. 1907-17 ఇండియన్ ఫైనాన్సు కమిటీ ఆఫీసరు. కలకత్తా విశ్వవిద్యాలయం పాలిత్ ప్రొఫెసరు 1917-33. బ్రిటిష్ అసోసియేషను లెక్చరరు(టొరొంటో) 1924. కాలిఫోర్నియా టెక్నాలజీ ఇన్‌స్టిట్యూటు రీసెర్చి అసోసియేటు 1924. ఇండియన్ సైన్సు కాంగ్రెసు (1928) మెటూకీమెడ లిష్టు (1929 రోమ్). 1930 రాయల్ సొసైటీ హ్యూజెన్ మెడలిష్టు. 1929 సర్ బిరుదము. 1930 నోబెల్ లారియేటు ('రామన్ ఎఫక్టు' అను కిరణములలో క్రొత్త విషయము కనిపెట్టినందుకు) బహుమానము పొందెను. విదేశాలల్లోని అనేక సైన్సు సంఘాలలో మెంబరు. భారత దేశంలో అనేక విశ్వవిద్యాలయాల గౌరవ ప్రొఫెసరు. బెంగుళూరు సైన్సు ఇన్‌స్టిట్యూటు డైరెక్టరు.

రామలింగారెడ్డి కట్టమంచి సర్. డా. జ. 1880. చిత్తూరు జిల్లా కట్టమంచి గ్రామం. 1902-6 గవర్నమెంటు విద్యార్థి వేతనంమీద కేంబ్రిడ్జిలో ఎం. ఏ. చదివి ప్రథమ తరగతిలో వచ్చెను. 1906లో కేంబ్రిడ్జి యూనియనుకు ప్రథమ భారతీయ ఉపాధ్యక్షుడు. 1907 అమెరికా సంచారము. బరోడా కాలేజీ వైస్ ప్రిన్సిపాలు. మైసూరులో అసిస్టెంటు ఇన్స్పెక్టరు జనరల్ ఆఫ్ ఎడ్యుకేషన్‌గాను, మైసూరు మహారాజా కాలేజీ ప్రొఫెసర్ గాను ఉండిరి. 1913-14లో విదేశముల లోని విద్యావిధానాన్ని తిలకించి మైసూరు విశ్వవిద్యాలయానికి స్కీము తయారుచేసిరి. తిరిగివచ్చి 1916-18 వరకు మైసూరు కాలేజీ ప్రిన్సిపాలుగాను. 1918-21 ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ ఎడ్యుకేషన్‌గాను పనిచేస్తూ 1921 లో రాజకీయాలవల్ల రాజీనామా నిచ్చిరి. ఆలిండియా ఎడ్యుకేషనల్ ఎడ్వయిజరీ బోర్డు మెంబరు. 1926 ఎం. ఎల్. సి. 1924 ఆంధ్ర మహా సభాధ్యక్షులు. 1926 ప్రధాన ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపకోపాధ్యక్షులు. ఎం. ఎల్. సి. చిత్తూరు జిల్లా బోర్డు ప్రెసిడెంటు. తిరిగి రెండుసార్లు ఆంధ్ర

విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా ఎన్నుకోబడిరి. 1936 లో డి. లిట్ బిరుదము. 1942 సర్ (కె. సి. ఐ. ఇ.) బిరుదము పొందిరి. అనేక గ్రంథముల రచయిత ; తెలుగులో గూడా గొప్ప కవి ; మేధావి ; మహావక్త.

రామారావు పి. ఎమ్., ఎమ్. ఏ., బి. ఎస్‌సి. (ఫారెస్ట్రీ) బి. ఎస్‌సి. (అగ్రికల్చరల్) ఎడింబరో. జ. 1888. ఇండియన్ అగ్రికల్చర్ సర్వీసులోను, కోయంబుత్తూరు అగ్రికల్చరల్ కళాశాలకు ప్రిన్సిపాలుగను, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్లాంటు ఇండస్ట్రీ డైరెక్టరుగాను, మధ్యరాష్ట్రముల, రాజపుత్రస్థానపు సంస్థానముల వ్యవసాయిక సలహాదారులుగను పనిచేసినారు. మద్రాసు వ్యవసాయిక డైరెక్టరుగా ఇప్పుడు పనిచేయుచు, ఈ రాష్ట్రమున గోధుమ, ప్రత్తి ఉత్పత్తుల విషయమై పరిశ్రమచేసిరి.

రామేశం వేపా సర్. జ. 1876. బి. ఏ., బి. ఎల్. ప్యాసై 1896-1900 వరకూ విశాఖపట్నంలో న్యాయవాది. 1900-1920 మద్రాసు హైకోర్టు న్యాయవాది. 1916-20 గవర్నమెంటు ప్లీడరు. 1920 మద్రాసు హైకోర్టు జడ్జీగా నియమింపబడ్డారు. గణిత ఖగోళ జ్యోతిషశాస్త్రాల్లో ప్రవీణులు. సంతాన నిరోధము మొ॥ సాంఘిక సమస్యల్ని ప్రచారంచేసి అనేక గ్రంథాల్ని రచించేరు. సర్ బిరుదము పొందిరి.

రావు జి. వి. బి. ఎస్‌సి. ఇ. జ. 1886. రాజమండ్రి ఆర్ట్సుకాలేజీ, సికింద్రాబాద్ మహబూబ్ కాలేజీ, మద్రాసు ఎంజనీరింగ్ కాలేజీ, స్కాట్లండు గ్లాస్గో విశ్వవిద్యాలయములలో, విద్యాభ్యాసము గావించిరి. కాంక్రీటు కట్టడములు కట్టించుటలో వీరు గణనకెక్కిరి. రెండుకోట్ల రూపాయిల విలువైన నిర్మాణములు వీరి అధ్వర్యముక్రింద జరిగెను. ఎంజనీరింగు శాఖలో వీరు విజయులై మద్రాసు ప్రభుత్వపు ఎంజినీరుగా చాలాకాలము పనిచేసిన అనుభవశాలి.

రుక్మిణి లక్ష్మీపతి ఆచంట బి.ఏ., జ. 1891. డా॥ లక్ష్మీపతిగారి సతి. పదియవ అంతర్జాతీయ మహిళాసమావేశానికి 1926 లో ప్యారిసుకు డెలిగేట్‌గా వెళ్లినవారు. 1930 లో బి.ఏ. రాజకీయ, మహిళాభ్యుదయ కృషి గలవారు. కా. పా. మద్రాస్ శా. సభ. డెప్యూటీ ప్రెసిడెంటు.



శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి.

వరదరాజం పంతులు సాదు. వీరు దక్షిణ దేశమున ఆంధ్రోద్యమారంభకులు. చెన్నపురిలో దక్షిణాంధ్ర భాషాభివర్ధనీ సంఘమును స్థాపించిరి. దక్షిణాంధ్ర పత్రిక సంపాదకులు. కీ. శే. సాధు రామకృష్ణయ్య పంతులు-ఎట్టయాపురం దివాన్ గారి మూడవ కుమారులు. ఉదారులు. త్యాగబుద్ధి, సేవాదీక్ష గలజ్ఞాని. కొంతకాలము మద్రాసు విశ్వవిద్యాలయములో తమిళ నిఘంటువు ప్రచురణశాఖాధికారిగానుండిరి. దక్షిణాంధ్రులు వీరు చేసిన సేవకు కృషికి మెచ్చి వీరికి "దక్షిణాంధ్ర పితామహ" "భాషోద్ధారక" అని బిరుదము లిచ్చి గౌరవించిరి.

విక్రమదేవ వర్మ శ్రీ జయపురం మహారాజా జ. 1869. సంస్కృతం, తెలుగు, ఓఢ్ర భాషల్లో అనేక గ్రంథాలు రచించిన కవి, పండితుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలరు. సాహిత్య సమ్రాట్, డి.లిట్. బిరుదాంకితులు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో శాస్త్రకళాభివృద్ధికి సాలీనా లక్ష రూపాయలు విరాళమిస్తూన్న

దానకర్ణులు. అనేక కవులకృతులకు భర్తలై, కవులను పోషించి ఆంధ్రభోజుడని కీర్తినందిన భాషోద్ధారకులు.

విజయానంద్ మహారాజకుమార్ సర్. జ. 1905. విద్యాభ్యాసము అజ్మీరు రాజకుమార్ కళాశాల, ఇంగ్లండు హెయిలీబెరీ కాలేజీ. చిన్నతనముననే క్రికెట్టు టెన్నిసులలో ప్రవీణులు. గొప్ప వేటకారులు. 1934 సెంట్రల్ అసెంబ్లీ 1936 యు. పి. లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు. 1937 న్యాయశాఖా మంత్రి. అమెరికా, ఇంగ్లాండు మొ॥ దేశములన్నియు తిరిగి గొప్ప ఆటకాడని పేరుపొందిరి. కాశీ హిందూ విశ్వవిద్యాలయ బోర్డు మెంబరు. 1940 కార్యనిర్వాహకవర్గ సభ్యులు. కాశీ విశ్వవిద్యాలయం బ్లూరిబ్బన్ పొందిరి. విశాఖపట్నం 22 వ ఆంధ్ర మహా సభాధ్యక్షులు 1941-.

విశ్వనాథ్ భాగవతుల రావుబహద్దర్ జ. 1889. విజయనగరం. ఏ డిగ్రీలేక భారత దేశమంతటికి రసాయన శాస్త్రంలో అగ్రగణ్యులైన ఆంధ్ర ప్రముఖులు. విజయనగరంలో రసాయన పారిశ్రామికశాల స్థాపించెను. 1934 వరకు కోయంబుత్తూరులో వ్యవసాయ రసాయన శాస్త్రజ్ఞుడుగా నుండెను. మద్రాస్ ప్రభుత్వపు అగ్రికల్చరల్ కెమిస్టు. 1934 పూవన్యావసాయ శాస్త్ర పరిశోధకుడు. 1935 నుండి ఢిల్లీ ఇంపీరియల్ అగ్రికల్చరల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ డైరక్టరు. అనేక శాస్త్ర సభలకు అధ్యక్షత వహించిరి. అనేక పరిశోధనలు చేసిరి. జొన్నలు. వరినుండి మట్టుచేయుపద్ధతి కనుగొన్నవారు వీరే. అనేక గ్రంథాలు రచించిరి.



శ్రీ విక్రమ దేవవర్మ.

విశ్వనాధం తెన్నేటి ఎం. ఏ.. బి. ఎల్. జననం 1896. ప్రెసిడెన్సీ కాలేజి ఎం.ఏ., తిరువాన్కూరు బి. ఎల్. విశాఖపట్నంజిల్లా కాంగ్రెసు సంఘం కార్యదర్శి, పిమ్మట ప్రసిడెంటు. అ. భా. కాం. కమిటీ మెంబరు. 1934 లో ఆంధ్ర మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు. అసెంబ్లీ సభ్యులు, వక్త. రివిన్యూ మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి. ఆంగ్లాంధ్ర సారస్వత పాండిత్యము గలవారు. రెండు భాషలలోను మనోజ్ఞమైన శైలిని రచన సాగించగలవారు. తెలుగులో నవ్యసాహిత్య ప్రియులు; గేయరచయితలు.

విశ్వేశ్వరయ్య మోక్షగుండం సర్ కె.సి.ఐ.ఇ.,ఎల్.ఎల్.డి., డి.ఎస్‌సి., డి.లిట్., ఎం.ఐ.సి.ఇ., జననం 1861. విద్య బెంగుళూరు సెంట్రల్ కాలేజీ, పూనా ఇంజనీరింగు కాలేజీ. బొంబాయి గవర్నమెంటులో 1884 అసిస్టెంటు ఇంజనీరు. 1904 సూపరింటెండింగు ఇంజనీరు. 1908 లో రిటైరయారు. 1909 నైజాం స్పెషల్ సలహా ఇంజనీరు. పి. డబ్లియు. రైల్వే ఛీఫ్ ఇంజనీరు మైసూరు గవర్నమెంటు. 1912-18 మైసూరు దివాను. 1921-22 బొంబాయి ఇండస్ట్రియల్ టెక్నికల్ కమిటీ అధ్యక్షులు. 1922 న్యూకేపిటల్ ఎంక్వయరీ కమిటీ (ఢిల్లీ) మెంబరు. 1924 ఇండియా ప్రభుత్వంవారిచే భారతీయ ఆర్థిక విచారణసంఘం అధ్యక్షులుగా నియమింప బడ్డారు. 'బేక్‌బే' ఇంక్వయరీ కమిటీ మెంబరు. 1928 బొంబాయి ఇర్రిగేషన్ కమిటీ అధ్యక్షులు. అనేకసార్లు ప్రపంచమంతా చుట్టివచ్చిన అనుభవశాలి. ఆర్థికవేత్త. గ్ర-"ఇండియన్ రికన్‌స్ట్రక్షన్", "ప్లేన్‌డ్ ఎకానమీ ఫర్ ఇండియా."

వుయ్యూరురాజా శ్రీ వేంకటాద్రి అప్పారావు బహద్దరు నూజవీటి జమీందార్లలో పెద్ద ఎస్టేటుగల ప్రభువు; కావ్యకళా ప్రపూర్ణులు, కావ్యరచన, కళాపోషణ వీరికి ప్రధానమైన జీవితార్థములు. ప్రత్యేక నాట్య నాటకశాలలు, బెజవాడలో సర్వకళాశాల, నూజవీడులో హైస్కూలు స్థాపించిరి. విద్యా సంస్థలకు సహాయులు. గ్ర. రామదాసు, జ్యోతిర్లీల మొ॥ నాటకాలు ఆంధ్రగీత గోవిందం, ఆంధ్రాష్టపదులు శోభనాచల మహాత్మ్యము మొ॥ కావ్యాలు ఆంధ్ర జాతీయ క్రీడలయెడల అభిమానము గలదు; బాలభట సంఘానికి నాయకత్వం వహించిరి. వేటలో మేటి. ఆంధ్రరాష్ట్రం, ఆంధ్రాభ్యుదయం వాంఛిస్తూ ఆంధ్రోద్యమమునకు పోషకులుగా నుందురు.

వెంకట కృష్ణారావు భావరాజు. ఎం.ఏ.,బి.ఎల్. జ. 1895. రాజమండ్రి. 1920 నుండి వకీలు. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి స్థాపించి ఆ మండలి తరఫున ఒక ఆంగ్ల మాస పత్రికకు సంపాదకులుగానున్నారు. 1938 లో ఆంధ్ర దేశంలోని పురాతన రాజవంశాల్ని గురించి చేసిన పరిశోధనకై ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు ఎం.ఏ. డిగ్రీ నిచ్చిరి. సరియైన హిందూదేశ చరిత్రవ్రాయుటకు ఇండియన్ హిస్టరీ కమిటీవారిచే ఎన్నుకొన బడిన ఆంధ్రు డీతడొక్కడే. గ్ర. - ఆంధ్రుల నౌకాయాన చరిత్రము, ఆంధ్ర దేశము-పాశ్చాత్య యాత్రికులు మొ॥

వెంకట నారాయణ నాయుడు జయంతి జ. 1875. ఏలూరు. పశ్చిమ గోదావరి స్పెషల్ సెటిల్మెంటు ఆఫీసరుగను, జిల్లా కలెక్టరుగను, రెండు రికార్డు సూపరింటెండెంటుగను. పని చేసిరి. 1922 లో ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్‌గా పనిచేసిరి సంస్కర్త. మద్రాసు కార్పొరేషను కమిషనరుగ పని చేసిరి.

వెంకటపతి రాజు భూపతి బి.ఏ., బి.ఎల్., సి. ఐ. ఇ. జ. 1861 వి. జిల్లా కొంతకాలం ఎం. ఎల్. సి. (చెన్నపురి) ఎం. ఎల్. ఏ. (ఢిల్లీ) సాంఘిక సహకారోద్యమ సభలకు అధ్యక్షులుగాను. లిబరల్ ఇండిపెండెంట్‌గా రాజకీయోద్యమందును దేశసేవ చేసినవారు: ఇండియా గవర్నమెంటు తరఫున ఫిజీ దీవులకు వెడలిన రాయబార వర్గమునకు అధ్యక్షులు. విదేశ సంచారము చేసి విద్యా సంస్థల గురించిన్ని. పరిశ్రమలగురించిన్ని అనుభవములు సంపాదించినవారు.

వెంకటప్పయ్య. కొండా దేశభక్త. జ 1866. గుంటూరు బి. ఏ., బి. ఎల్. ప్యాసై బందరులో ప్రాక్టీసుపెట్టెను. కృష్ణా పత్రిక స్థాపకులలో నొకరు. పిమ్మట ప్రాక్టీసు గుంటూరుకు మార్చిరి. ఆ. భా. కాం. క. మెంబరు. 1923 లో అధ్యక్షులు. కాకినాడ కాంగ్రెసు ఆహ్వాన సంఘాధ్యక్షులు, ఆం. ప్రాం. కాం. క. ప్రెసిడెంటు, చరఖా సంఘం మెంబరు. కాంగ్రెసు ఉద్యమంలోను. ఆంధ్ర ఉద్యమంలోను ఎక్కువగా పాటుపడిరి. 1917 లో మాంటేగ్యూ ఛెల్మ్స్‌ఫర్డు రాయభారం (ఆంధ్ర రాష్ట్రం భాషా ప్రయుక్తంగా విడదీయడానికి) 1937 లో అసెంబ్లీ మెంబరు, అసెంబ్లీ కాంగ్రెసు పార్టీ కార్యదర్శి. ఆంధ్ర మహా సభాధ్యక్షులు (1917 నెల్లూరు.)

వేంకటరత్నవర్మ నూకాడ బందరు, కృష్ణా జిల్లా. సంగీత విదుషీమణి. శంఖవీణయను నొక నూతన వీణను నిర్మించి, మద్రాసు మ్యూజికల్ అకాడమీ వారి ప్రశంసయు, విద్వాంసుల మన్ననయు పొందిన ప్రసిద్ధురాలు.

వెంకటరమణయ్య అయ్యంకి బెజవాడ. అఖిల భారత గ్రంథాలయ సంఘాన్ని స్థాపించి, దాని కార్యదర్శిగా

వున్నారు. ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వానికి 25 సంవత్సర ములుగా కార్యదర్శి; ఆ పేరనున్న పత్రికకు సంపాదకులు; ప్రకృతి శాస్త్రవైద్యులు.

వెంకట రామన్ టి. ఎస్. సర్ డి.ఎస్.సి. (ఆంధ్ర) రా. బ., సి. ఐ. ఐ. జ. 1884 ఇండియాలో ఉత్కృష్టమైన చెరకు పండించుట అసాధ్యము కాదని గవర్నమెంటు వారికి నచ్చచెప్పి, పరిశోధనలు చేసి చూపించిన శాస్త్రజ్ఞులు. ఇండియన్ సైన్సు కాంగ్రెస్ అధ్యక్షులు 1937.

వేంకటరావు ఈదర జననం 1881 ఏలూరు. వేంకట రామా ప్రెస్, వేంకటరామా అండ్ కంపెనీ-అధిపతులు. ప్రారంభ విద్య అనే తెలుగు మాస పత్రిక స్థాపించి, బడి పుస్తకముల ప్రకాశకులుగా ప్రారంభించి ఎక్కువ పలుకు బడిగల గ్రంథ ప్రకాశకులుగా ప్రసిద్ధికెక్కినవారు. దేశీ యోద్యమములందు సేవ చేస్తున్నారు. ఏలూరులో ఒక పేట వేంకటరావు పేట అనే పేర నున్నది.

వెంకట్రావు కళా జననం 1900 బందరులో. బి.ఏ. చదువుమాని కాంగ్రెసు ఉద్యమంలో (1921) చేరెను. 1923 గుజరాతు విద్యాపీఠ పట్టభద్రుడు. అ.భా.కాం.క. మెంబరు. తూ. గోదావరి జిల్లా కాం. 13 సంవత్సరములు మెంబరు. ఆం. రా. కాం. కమిటీ కార్యదర్శి. కోన సీమ కో. ఆపరేటివ్ బ్యాంకు కార్యదర్శి. ఎం. ఎల్. ఏ.

వెంకట సుబ్బారావు ముత్తా సర్ ఎం. ఏ., బి. ఎల్. జననం 1878. మద్రాసులో హైకోర్టు న్యాయవాది 1903-21. ఎలక్షన్ కమిషనర్ '21 - '22. మద్రాసు హైకోర్టు జడ్జి 1921-38. 35-36 మద్రాసు హైకోర్టు ఛీఫ్ జస్టిస్ (ఆక్టింగు) రెండుసార్లు. ఇండియన్ డెలిగేషన్ కమిటీ మెంబరు 1935-36. సర్ బిరుదము 1936. సంఘ సంస్కర్త. జడ్జీగా రిటైరయిన పిమ్మట (1939 లో) బీరారులో నైజాం గవర్నమెంటు ఏజంటుగా నియమింపబడ్డారు. మద్రాసు ఛీఫ్ స్కౌట్ కమిషనర్.

వెంకటసుబ్బారావు ముత్తా (అండాళమ్మ) సేవా సదనం అనే స్త్రీ విద్యాలయాన్ని మద్రాసులో స్థాపించి కార్య దర్శినిగాను, కోశాధికారిణిగాను పనిచేస్తున్నారు. అనేక మంది బీదల కుచితంగా విద్యనిస్తూ స్త్రీ విద్యకు లలితకళల అభివృద్ధికి పాటుబడుతున్నారు. 1935 లో సిల్వర్ జూబిలీ పతకమును, 1937 లో కైజర్-ఇ-హింద్ పతకమును పొందిరి.

వెంకటస్వామినాయుడు. కె. బి.ఏ.,బి.ఎల్. జననం 1896. మద్రాసులో స్థిరనివాసులై చెన్న కేశవ మల్లేశ్వరాలయములు కట్టించినది వీరి పూర్వులే. 1924 మద్రాసు హైకోర్టు ఎడ్వొకేటు. 1928 నుండి కార్పొరేషన్ మెంబరు. 1938 లో మద్రాసు మేయరు. పచ్చయప్ప ట్రస్టు బోర్డు, పరశువాకం అన్నదాన సమాజం వగైరా అనేక సంస్థలలో మెంబరు. 1937 లో శాసన కౌన్సిల్ సభా సభ్యులు, ఉపాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. మందులు కిరాణాసామానులు అమ్మే "అప్ప" కుటుంబమునకు చెందినవారు. మద్రాసు ఇండస్ట్రియల్ అసోసియేషన్ ప్రసిడెంటు.

వెంకటాచలం చెట్టి సామి జననం 1887 ఒంగోలు తాలూకా అల్లూరు. 1911 నుండి మద్రాసులో వ్యాపారము. కన్యకా పరమేశ్వరీ దేవస్థాన పాలక బోర్డు సభ్యులు. ప్రెసిడెన్సీ అసోసియేషన్ అధ్యక్షులు. అనేక ధర్మసంస్థలు, పాఠశాలలకు ట్రస్టీ. 1923 నుండి కేంద్రశాసన సభాసభ్యులు. 1925 బందరు ఆంధ్ర మహా సభాధ్యక్షులు. వైశ్యాభివృద్ధికి పాటుబడిరి. మద్రాసు ప్రథమ కాంగ్రెసు మేయరు.

వెంకటేశ్వర్లు వావిళ్ల జననం 1885 నెల్లూరు జిల్లా అల్లూరులో. వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు అను పేరుతో అనేక సంస్కృతాంధ్రాంగ్ల గ్రంథాలు ప్రచురించియు, త్రిలింగ ఫెడరేటెడ్ ఇండియా అను తెలుగు, అంగ్ల వారపత్రికల నడపుచు భాషా సేవచేస్తున్నారు. భాషోద్ధారక బిరుదాంకితులు.

వెంకయ్య ఈదర జ. 1883 ఏలూరు రామా అండ్ కంపెనీ ప్రొప్రైటర్. అనేకాంధ్ర గ్రంథ ప్రకాశకులు' కా. పా. దేశీయ సంస్థలకు సహాయులు.

శకుంతలాకన్య. ఎం.ఏ., పి.హెచ్.డి. కలకత్తా విశ్వవిద్యాలయం ఘోష్‌ట్రావలింగు స్కాలర్‌షిప్పుపొందెను. వివిధదేశములు సంచారముచేసి ఆయా దేశములలో శాస్త్రములునేర్పు పద్ధతులపై సుపన్యసించెను. సర్ సి.వి. రామన్ పొందిన ప్రత్యేక స్కాలర్ షిప్ పొందెను.



ప్రొఫెసర్ శేఖర్.

శేఖర్ ప్రొఫెసర్ ఏలూరు గొప్ప జ్యోతిషులు; మానసిక శాస్త్రవేత్తలు. ప్రశ్న భాగములో దివ్యమైన కృషిచేసినవారు. వీరి ప్రకటనలు వివిధ పత్రికలలో ప్రకటితములగుచున్నవి.

శేషాద్రిశర్మ జనమంచి జ. 1882 కలువాయి, నె. జిల్లా. పండిత కుటుంబము. 11 వ యేటనుండి కాశీలో సంస్కృతాధ్యయనము; పిమ్మట విజయనగరం, కసింకోటలలో జ్యోతిషాధ్యయనము. కడప ఉన్నత పాఠశాలలో అధ్యాపకుడు. గ్ర. బ్రహ్మాండ పురాణము మొll బహు గ్రంథములు.

శ్రీరామమూర్తి డి. ఎం. ఎల్. సి. కొంతకాలము రాజమండ్రి మ్యూనిసిపల్ కౌన్సిల్ కార్యదర్శి; తర్వాత ప్లీడరు. కౌన్సిలరు. అనేక జాతీయోద్యమములందు పాటుపడువారు సీతానగరాశ్రమము నుద్ధరించినవారు.

శ్రీ హరిరావునాయుడు బి. వి. డి. బ., బి. ఏ., బి. ఎల్. ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్ పదవినుండి రిటైరయినారు. జ. 1887. పోలవరము తూ. గో. జిల్లా.

సత్యనారాయణ మోటూరి జ. 1902 దొండపాడు, కృ. జిల్లా. హిందీ భాషలో తీవ్రకృషిజేసి అమితమైన జ్ఞానము సంపాదించి, మద్రాసు నందలి దక్షిణ భారత హిందీ ప్రచార సభకు ప్రచార మంత్రిగాను, పరీక్షా మంత్రిగాను, ప్రస్తుతము ప్రధాన మంత్రిగాను హిందీ భాషా సేవ చేయుచున్నారు.



మోటూరి సత్యనారాయణ.

కొంతకాలము ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘ కార్యదర్శిగను, వర్ధాలోని రాష్ట్రభాషా ప్రచార సమితి ప్రధాన కార్యదర్శిగను కూడ పనిచేసిరి. యావద్భారత దేశమున సంచారముచేసిరి. హిందుస్థానీ సేవాదళమను పేరుతో దేశమంతటను హిందీ ప్రచారము కొరకు ఒక దళముతో సంచారము చేసిరి. యావద్భారత దేశమందలి నాయకులతో విశేష పరిచయము, పలుకుబడికలిగి, దేశములోని హిందీ ప్రచారోద్యమమునకు స్తంభము వంటివారు. వీరు తమ సంఘటనాశక్తికి పలువురు ప్రముఖుల ప్రశంసలబడసిరి. 'హిందీ ప్రచార సమాచార్' అను హిందీ మాస పత్రికా సంపాదకులు. హిందీ భాషయందును తెలుగు భాషయందును అనేక వ్యాసముల రచించియు, గ్రంథములను తెనిగించియు ఉభయ భాషలయందును మంచి వాగ్ధాటి, రచనా శక్తిని సంపాదించిరి.

సత్యనారాయణమూర్తి కొడుకుల రావుసాహెబ్ గుమాస్తాగిరినుండి స్వశక్తివలన పైకి వచ్చిన ఆంధ్రులు. బెంగాల్ నాగపూర్ రైల్వే అసిస్టెంటు ఆడిటరు. అనేక ఆంధ్రులకు బెంగాలు-నాగపూర్ రైల్వేలో ఆస్కారం కలిగించిన ఉదార స్వభావులు; ఆంధ్రాభిమాని.

సాంబమూర్తి బులుసు అనరబుల్ బి.ఏ. బి.ఎల్. జ. 1886. విజయనగరం మహారాజా కాలేజీలో ఫిజిక్సు లెక్చరరు. 1911-20 కాకినాడలో క్రిమినల్ న్యాయవాది. 1921 అసహాయోద్యమంలో చేరి ప్రాక్టీసు మానివేసెను. 1923 కాకినాడ కాంగ్రెసు కార్యదర్శి. 1935-37 ఆం. రా. కాం. సం. అధ్యక్షులు, 1935-37 ఆం. రా. సం. కార్యదర్శి. 1936 కాంపోజిట్ పార్లమెంటరీ కార్యదర్శి. హిందూస్థాన్ సేవాదళం అధ్యక్షులు. వాలంటీరు క్యాంపు పెట్టించెను. 1929 కాంగ్రెసు వర్కింగు కమిటీ



శ్రీ బులుసు సాంబమూర్తి.

సభ్యులు. సర్వము కాంగ్రెసు కర్పించిన త్యాగి. మహర్షి యను బిరుదుపొందెను. 1937 అసెంబ్లీ అధ్యక్షులు. చెన్నపురి ఆంధ్ర మహాసభాధ్యక్షులు.

సాంబశివరావు చేబ్రోలు ఎమ్. ఏ., డి. ఎస్‌సి. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల 1930 సం॥ ఎం. ఏ. పట్టము గైకొనిరి. విద్యా విషయక జీవితములో వీరు అనేక బహుమతులను పొందిరి. 1934 సం॥ 'డాక్టరు ఆఫ్ సైన్సు' బిరుదము మద్రాసు విశ్వవిద్యాలయ మిచ్చినది. ప్రస్తుతము ఇండియా ప్రభుత్వ రక్షణ శాఖలో నియుక్తులై యున్నారు. కలకత్తా 'ఆంధ్ర అసోసియేషన్' గౌరవాధ్యక్షులు. ప్రజా ఉద్యమాభిమానులు.

సాంబశివరావు సి. డాక్టర్ డి. ఎస్‌సి. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఉన్నత విద్యనంది విదేశాల్లో (కలకత్తా) ఆంధ్రుల అభివృద్ధికి పాటుబడుచున్నారు. ఆంధ్ర మహాసభ కార్యదర్శి. గవర్న మెంటు ఆలిపూరు టెస్టుహౌసులో పని.

సీతారామయ్య కొల్చెల డాక్టర్, జ. 1899 కృష్ణా జిల్లా వుయ్యూరు. మద్రాసులో బి.ఎస్‌సి. 1922 అమెరికా వెళ్లిరి. చికాగోలో ఎం.ఎస్‌సి., కార్నెలులో పి.హెచ్.డి., పట్టాన్ని పొందిరి. పెట్రోలియం ఆయిలు కంపెనీలో పని చేస్తూ పరిశోధనలు సాగించారు. కాని అభివృద్ధి కడ్డంవచ్చే ఉద్యోగాన్ని కాలదన్ని 1931 లో రష్యా వెళ్లి తన రసాయన శాస్త్రజ్ఞానం వల్లనూ పెట్రోలియం పరిశోధనల వల్లనూ రష్యా ప్రభుత్వ కంట్రాక్టర్ల ఆటోమోబైలు పరిశోధనాలయం ప్రధాన ఇంజనీరుగా నియమింపబడ్డారు. జర్మన్ సోవియట్ స్త్రీని వివాహమాడేరు.

సీతారామరెడ్డి కె. బి. ఏ., బి. ఎల్. రా. బ. వీరు కొంత కాలము దక్షిణార్కాటు డిస్ట్రిక్టు బోర్డు అధ్యక్షులుగా నుండిరి. ధర్మాదాయచట్ట సంఘమునకు కమీషనర్‌గా, కొంతకాలము తిరుపతి దేవస్థానము స్పెషల్ ఆఫీసరుగా నుండిరి.

సుబ్బయ్యనాయుడు ఆర్. దివాన్ బహద్దర్. జననం 1885. డిప్యూటీ కలెక్టరు 1917 వరకు. 1921 అసిస్టెంటు లేబరు కమీషనరు. 1922 రామనాడ్ దివాను. పిమ్మట మలయాస్టేట్సు ఏజంటు: 1939వరకు మద్రాసు కార్పొరేషన్ కమీషనరు. ప్రస్తుతం ఉత్తర హిందూస్థానంలోని కూచ్ బీహారు దివానుగానుండిన ఆంధ్రులు. గ్ర. రిజనరేషన్ అనే ఆంగ్ల గ్రంథము, సుజనమైత్రి అనే తెలుగునవల.

సుబ్బరాజు నడింపల్లి ఎం. ఎల్. సి. జ. 1886. అమలాపురం తా. బోర్డు అధ్యక్షులు 1932. రాజమండ్రి జిల్లా బోర్డు అధ్యక్షులు. కా. పా. కోనసీమ కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు అధ్యక్షులు.

సుబ్బరామరెడ్డి లేబూరు ఎం. ఎల్. సి. జ. 1892. కా. పా. నెల్లూరు జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు రెండేండ్లు నెల్లూరు ఖద్దరు బోర్డు కార్యదర్శులు. 1924-27 హరిజన సేవాసంఘమందు, అనాధ జనోద్ధరణమందు సేవచేసెరి. బుచ్చిరెడ్డిపాలెము, నెల్లూరు.

సుబ్బారావు కరుణాకరం ఎం. ఎల్. ఏ. జ. 1889. ప్రియ, వి. జిల్లా. 1920 నుండి కా. పా. జిల్లా రాష్ట్ర అ. భా. కా. కమిటీల సభ్యులు. ప్రొ. రంగాగారితో రైతుసంఘము వి. జిల్లాలో స్థాపించిరి; దానికి 4 సం. అయి అధ్యక్షులు.

చిట్టివలప లేబర్ యూనియన్ దక్కన్ చక్కెర ఫ్యాక్టరీ పనివాండ్ర సంఘము (సామల్కోట) ల అధ్యక్షులు.

సుబ్బారావు కె. వి. ఏ. ఎం. ఏ. సి. భిషగ్వర. బి. టి. యు. ఎం. డి. (హోమియోపతి) కా. పా. వెల్నాటి వైదికి పత్రికా సంపాదకులు. పేదలకు వైద్య సహాయ్యము చేయు ఉదారులు. గ్ర. సుబ్రహ్మణ్య నిఘంటు. కళాభిమానులు.

సుబ్బారావు లక్కరాజు ఎం. ఎల్. సి. 1937-40. కా. పా. ఆంధ్ర విశ్వ కళా పరిషత్ లీగల్ అడ్వైజరు. అం దన్ని శాఖలందును సభ్యులు; కాకినాడ మ్యూనిసిపల్ చైర్మను 1916-38 అనేక సంస్థలలో సేవచేయువారు.

సుబ్బారావు, కల్లూరు జననం 1897 పెనుగొండ. మదన పల్లి జాతీయ కళాశాలలో చదివెను. హోంరూలు ఉద్య మంలో చేరెను. 1920 మొ॥ కాంగ్రెసు సేవ ; లోకమాన్య



శ్రీ కల్లూరు సుబ్బారావు.

పత్రిక సంపాదకులు. జిల్లా కాం. కమిటీ అధ్యక్షులు. అ. భా. కాం. సం. సభ్యులు. ఆంధ్ర రాష్ట్ర సంఘ కార్యదర్శి మంచివక్త. అసెంబ్లీ మెంబరు. ఆంధ్ర సెనేటు మెంబరు.

సూర్యనారాయణమూర్తినాయుడు కొమ్మిరెడ్డి దివాన్ బహద్దర్. జననం 1869. వర్తకులు; ఇన్నీస్ కంపెనీ ప్రొప్రైటరు. 15 సం॥ ఆనరరీ మేజస్ట్రేటు. 13 సం॥ మ్యునిసిపల్ ఛైర్మన్. గోదావరి కామర్సు ఛేంబరుకు 20 సం॥ ప్రెసిడెంటు. పోర్టుకన్సర్వెన్సీ బోర్డు మెంబరు 30సం॥ కాకినాడ లిటరరీ అసోసియేషనుకు 15 సం॥ అధ్యక్షులు. సరస్వతీగాన సభ అధ్యక్షులు. 1926 అఖిల భారతగాన సభాధ్యక్షులు గానకళాపోషకులు. లెజిస్లేటివ్ కౌన్సిలుకు 9 సం సం॥ సభ్యులు. జిల్లా బోర్డు ప్రెసిడెంటు. కాకినాడ.

సూర్యప్రకాశరావు వేంకట దుగ్గిరాల బి.ఏ. జననం 1864. రాజమహేంద్రవరము గవర్నమెంటు కాలేజీలో 1887 సం॥ బి.ఏ. పరీక్షలో కృతార్థులైరి. కొంతకాలము కాకినాడ కలెక్టరు ఆఫీసులో ఉద్యోగము చేసి, ప్రస్తుతము సంఘ సేవలో నిమగ్నులైయున్నారు. సుప్రసిద్ధ పత్రికా విలేఖరులు.

స్వామి కె. వి. ఆర్. బారిస్టర్ కా. పా. ఎం. ఎల్. సి 1926-30 పలుసార్లు రాజమండి మ్యూనిసిపల్ చైర్మన్ ఎం. ఎల్. ఏ.



పొట్నూరి స్వామిబాబు.

స్వామిబాబు పొట్నూరి నరసన్నపేట వి. జిల్లా వైశ్యులు సంఘ సంస్కారము, జాతీయోద్యమము ఖద్దరు పరిశ్రమ మొ॥ కృషి గల ధనవంతులు. కా. పా. కొంతకాలము వి. జిల్లా బోర్డు అధ్యక్షులు.

హనుమంతరావు మాడపాటి హైదరాబాదు ఆంధ్రులలో ప్రముఖులు. హనుమకొండలో రాజరాజ నరేంద్ర భాషా నిలయము, శ్రీ కృష్ణదేవరాయ భాషా నిలయముల స్థాపనకు, హైదరాబాదు ఆంధ్రుల అభ్యున్నతికీ మూల పురుషులు. కార్యదీక్షగల ప్రతిభాశాలి.



## 13వ భాగము – 32వ అధ్యాయము

# అవీ-ఇవీ

## 1. –ఉన్నత పదవులలోని ఆంధ్రులు

### (అ) గవర్నర్లుగా పనిచేసినవారు

కీ. శే. సర్. ఈడ్పుగంటి రాఘవేంద్ర రావు జ. 1890. సి. పి. మధ్యరాష్ట్రములలో గవర్నరుగా పనిచేసినవారు, ఆ రాష్ట్ర ప్రభుత్వమందు మంత్రిగను, ప్రధాన మంత్రిగను, ఇండియా కార్యదర్శి ఆలోచన సభా సభ్యులుగను పని చేసిరి. ఆంధ్రులలో ఇట్టి గౌరవము పొందినవారు ఇప్పటికి వీరే. కడపటి దశలో వైసరాయి కార్య నిర్వాహక సంఘ సభ్యులై 15-6-1942 లో దివంగతులయిరి. ప. గో. జిల్లా వారు. వీరి తండ్రి నాగన్నగారు వ్యవహార కారణమున నాగపూరు, బిలాసపూర్ నగరములకు పోవుటచేత వీరు సి. పి. ప్రాంతమందు నివసించిరి. బారిస్టరయి రాజకీయ రంగం లోకి దిగిరి. మొదట బిలాసపూరు చైర్మను; పిమ్మట నాగపూరులో ప్రధానమంత్రి, గవర్నరు. ప్రజ్ఞాశాలి; దేశాభిమాని; అఖండపండితుడు; వాదచతురుడు; వక్త; రైతు బాంధవుడు; నిరాడంబరజీవి; ఆంధ్రాభిమాని.



సర్. ఈ. రాఘవేంద్రరావు.



సర్. కె. వి. రెడ్డి.

కీ. శే. సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడు :—బి. ఏ., బి. ఎల్. రాయ్‌బహాదూర్ ; కె. సి. ఐ. ఇ., డి. లిట్., ఎమ్. ఎల్. సి. 1937లో చెన్నపురి ప్రభుత్వమందు ప్రధాన మంత్రులు. 1936లో చెన్నపురి రాష్ట్ర గవర్నరుగా పని చేసినవారు. అంతకుముందు 1920-1923 అభివృద్ధి శాఖా మంత్రి. 1924లో చెన్నపురి ప్రభుత్వమునకు లా మెంబరుగా నియుక్తులు. మొదటి రెండుసార్లు ఎం. ఎల్. సి. 1934 మరల లా మెంబరు. ప్రారంభదశలో స్థానిక ప్రభుత్వమందు పాల్గున్నవారు. గోదావరి జిల్లా బోర్డు, తాలూకా బోర్డు సభ్యులుగాను తాలూకాబోర్డు అధ్యక్షులుగాను పని చేసియుండిరి. జ. పా. బ్రాహ్మణేతరోద్యమమందు ప్రధానులు. కడపటి దశయందు చిదంబరం అన్నామలై విశ్వవిద్యాలయమందుపాధ్యక్షులు. 1942లో దివంగతులు.

## (ఆ) హైకోర్టు జడ్జీలు—చెన్నపురి.



సర్. వేపా రామేశం బి. ఏ., బి. ఎల్., జడ్జీ (1920-38), చీఫ్ జస్టిస్ (1931, 33, 35)



సర్. పి. వేంకట్రమణరావు బి. ఏ., బి. ఎల్. జడ్జీ (1935-1941)



సర్ ముత్తా వేంకట సుబ్బారావు బి. ఏ., బి. ఎల్. జడ్జీ (1921-38) చీఫ్ జస్టిస్ (1935).



గా॥ బి. సోమయ్యగారు బి. ఏ., బి. ఎల్. జడ్జీ (1939-)

## ఇతర రాష్ట్రములందు హైకోర్టు జడ్జీలయిన ఆంధ్రులు



గౌ. శ్రీ. మా. భవానీ శంకరనియోగి.

గౌ. శ్రీ. మాచిరాజు భవానీ శంకరనియోగి (సి. పి.)
శ్రీ నంబూరి గోపాలకృష్ణరావు (కూచ్ బిహార్)
,, పి. చెంచయ్య (పుదుకోట)

## (ఇ) విశ్వకళా పరిషత్తులందు వైస్ ఛాన్సలర్లుగా పనిచేసిన ఆంధ్రులు.

సర్. రఘుపతి వెంకటరత్నం నాయుడు (మద్రాసు)
సర్. సర్వేపల్లి రాధాకృష్ణ (ఆంధ్ర; ఇప్పుడు కాశీ)
సర్. కె. వి. రెడ్డి నాయుడు (అన్నామలై)
సర్. కట్టమంచి రామలింగారెడ్డి (ఆంధ్ర)
శ్రీ మాచిరాజు భవానీ శంకరనియోగి (నాగపూరు)

## (ఈ) దివానులు, మంత్రులు

### (1) పూర్వులు

శ్రీ అక్కన్న మాదన్నలు
,, తిక్కన్న
,, తిమ్మరుసు
,, పూర్ణయ్య

### (2) ఇప్పటివారు

శ్రీ ఆర్. సుబ్బయ్యానాయుడు
,, సేలం రామదాసునాయుడు
,, ఏ. యస్. శేషయ్య
శ్రీ పానగల్లు రాజా రామారాయణం గారు ఎం. ఏ.
సర్. కె. వి. రెడ్డినాయుడు బి. ఏ., బి. ఎల్.
సర్. ఏ. పి. పాత్రో, బి. ఏ., బి. ఎల్.



రాజమంత్రి ప్రవీణ శ్రీ న్యాయపతి మాధవరావు బి. ఏ., బి. ఎల్. (మైసూరు)

దివాన్ శ్రీ నాగమయ్య తిరువాన్కూరు

శ్రీ బొబ్బిలిరాజా, రావు స్వేతాచలపతి రామకృష్ణ
రంగారావు బి. ఏ., బి. ఎల్. (మైసూరు)

శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు బారిస్టర్

,, వి. వి. గిరి బారిస్టర్

,, బెజవాడ గోపాలరెడ్డి

సర్. మోక్షగుండం విశ్వేశ్వరయ్య (మైసూరు)

(ఉ) చెన్నపురి శాసన సభాధ్యక్షులు

కీ. శే. చింతలపాటి వెంకట నరసింహరాజు
బి. ఏ., బి. ఎల్.

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి

,, బులుసు సాంబమూర్తి బి. ఏ., బి. ఎల్.

కీ. శే. బొల్లిని మునుస్వామినాయుడు బి. ఏ., బి. ఎల్.

(ఊ) ఉపాధ్యక్షులు

శ్రీమతి డా॥ ముత్తులక్ష్మి రెడ్డి

శ్రీ పి. కేశవపిళ్ల

,, జగన్నాథరాజు

శ్రీమతి ఆచంట రుక్మిణీ (లక్ష్మీపతి సతి)

(ఋ) ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లు

కీ. శే. సర్. బయ్యా నరసింహేశ్వర శర్మ బి.ఏ., బి.ఎల్.

బొబ్బిలి రాజా శ్రీ రా. స్వే. రామకృష్ణ రంగారావు

(ౠ) దక్షిణాఫ్రికా ఏజెంటు

సర్. కె. వి. రెడ్డినాయుడు

(ఌ) బెరార్ ఏజెంటు

సర్. ముత్తా వెంకటసుబ్బారావు

(ౡ) ఇండియా కార్యదర్శి, ఆలోచన సభా సభ్యులు

కీ. శే. సర్. ఈడ్పుగంటి రాఘవేంద్రరావు

(ఎ) మద్రాసు మేయర్లు

సర్. పి. టి. త్యాగరాయచెట్టి

శ్రీ శ్రీరాములు నాయుడు

,, సామి వెంకటాచలంచెట్టి

,, కె. వెంకటస్వామి నాయుడు

,, గోపతి నారాయణస్వామిచెట్టి

,, బి. బాసుదేవు

(ఏ) కార్పొరేషన్ కమీషనర్లు

శ్రీ జె. వి. నారాయణస్వామి నాయుడు

జనాబ్ జవద్ హుసేన్

,, ఆర్. సుబ్బయ్యనాయుడు

,, ఓ. పుల్లారెడ్డి

(ఐ) ఇతర ఉన్నతోద్యోగులు

శ్రీ వెలగపూడి రామకృష్ణ—ఇండస్ట్రీస్ డైరెక్టరు, లేబర్ కమీషనర్, జయపూర్ దివాన్

,, పి. సత్యనారాయణరావు డిప్యూటీ కమీషనర్ (నాగపూర్)

జనాబ్ మహబుద్దీన్ జిల్లా జడ్జి

శ్రీ పెండ్యాల సత్యనారాయణ ఐ. సి. ఎస్.

శ్రీ డబ్ల్యు. ఆర్. ఎస్. సత్యనాథన్ కో ఆపరేటివ్ సొసైటీస్ రిజిష్ట్రార్

,, భాగవతుల విశ్వనాథ్, ఢిల్లీ ఎగ్రికల్చరల్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్ డైరెక్టరు

(ఒ) ప్రెసిడెన్సీ ఉద్యోగులు

శ్రీ పి. హెచ్. రామిరెడ్డి-డైరెక్టరు ఆఫ్ అగ్రికల్చర్

,, సి. రామస్వామి నాయుడు-మార్కెటింగ్ ఆఫీసరు

,, ఆనందరావు-ప్రిన్సిపాల్, అగ్రికల్చరల్ కాలేజి

,, శ్రీ బండి శ్రీ హరిరావు నాయుడు ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్

,, రావుసాహెబ్-హెచ్ కృష్ణమూర్తి ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్

,, వెంకట్రావు నాయుడు ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్

,, జి. వి. రావు-శానిటరీ ఇంజనీరు



శొంఠి రామమూర్తి, ఎం. ఎ., ఐ. సి. ఎస్.



## (ఓ) ప్రవక్తలు

శ్రీ నాగార్జునుడు
,, వల్లభాచార్యులు
,, వేమన
,, బసవేశ్వరుడు
,, జిడ్డు కృష్ణమూర్తి

## (ఔ) జాతీయ విద్యావ్యాపకులు

శ్రీ ముట్నూరి కృష్ణారావు
,, కోపల్లె హనుమంతరావు
,, డా. పట్టాభి సీతారామయ్య

## (అం) ఆంధ్ర వికాసానికి తోడ్పడినవారు

శ్రీ కందుకూరి వీరేశలింగం
,, కాశీనాథుని నాగేశ్వరరావు





లెఫ్టెనెంట్ కర్నల్ తాడేపల్లి శంకరశాస్త్రి ఐ. ఎం. ఎస్.
పెక్కు జిల్లాలలో మెడికల్ ఆఫీసర్ 1914-18, 1941-42 సంగ్రామములందు ఈజిప్టురంగమున పనిచేసిరి.

# 2. భావి ఆంధ్ర రాష్ట్రము

విస్తీర్ణము 67,500 చ. మై.

| ఇతర రాష్ట్రములు | చ. మై. | |
|---|---|---|
| అస్సాము | 64,000 | ,, |
| ఉత్కళము | 46,000 | ,, |
| సింధు | 32,000 | ,, |
| నార్త్ వెస్టు ఫ్రాంటియర్ | 13,000 | ,, |

జనసంఖ్యలో 1,77,00,000 పైబడి

| ఇతర రాష్ట్రములు | జనసంఖ్య |
|---|---|
| మధ్య రాష్ట్రములు | 1,55,00,000 |
| అస్సాము | 86,00,000 |
| ఉత్కళము | 83,00,000 |
| సింధు | 39,00,000 |
| నార్త్ వెస్టు ఫ్రాంటియర్ | 24,00,000 |

ఆదాయము 7.5 కోట్ల రూపాయలకు పైబడి

| ఇతర రాష్ట్రములు | ఆదాయము | |
|---|---|---|
| బీహారు | రు. 5.00 | కోట్లు |
| మధ్య రాష్ట్రములు | రు. 4.75 | ,, |
| అస్సాము | రు. 2.84 | ,, |
| ఉత్కళము | రు. 1.88 | ,, |
| సింధు | రు. 1.00 | ,, |
| నార్త్ వెస్టు ఫ్రాంటియర్ | రు. 1.70 | ,, |

# 3. ఊళ్ల పేళ్లు ఉచ్చారణలో మార్పు

వాడుకలోనున్న నాణెము అరిగి పోవునట్టు వాడుకలో నున్న పదములు సైతము ఉచ్చారణములో మారిపోతూ ఉంటవి. అందులో ఏయేపదములుగాని సమాసములుగాని ఎక్కువగా పెక్కుజనుల నోటను నలుగుతూ ఉంటవో అవి మరింత నొక్కుడు పడి వ్యవహారములో చెల్లుబడికి లోపము రాకుండు నంతవరకు అరిగిపోతూ ఉంటవి. " చూచితి వేనిన్ " 'చూస్తే;' 'వింటివేనిన్ ' 'వింటే ' అయినవి. 'యజ్ఞోపవీతము' అనేపదము జన్నిదము, జందియము అయి ఇప్పుడు జందె మయినది. ఇట్టి ఉదాహరణములు వందలకొలదిగా నున్నవి. వెన్న (వెల్ల+నేయి), నూనే (నూవు+నేయి) మొదలయిన మాటలు సమస్త పదములన్న విషయము చాలామందికి తెలియదు. మనుష్యుల పేళ్లు, ఊళ్ల పేళ్లు నిత్యం వాడుకలో ఉండడము వల్ల వీటి ఉచ్చారణములోని మార్పు ఇంకను ఎక్కువగా ఉంటుంది. లచ్చయ్య (లక్ష్మణ-అయ్య), ఐసోల్ల గుర్నాథం (అయ్యలసోమయాజుల గురునాథము), సోదెమ్మ (సోమిదమ్మ), విస్సన్న (విశ్వనాథం), సామినేని ఎంకయ్య (స్వామినాయని వేంకటయ్య) మొదలయినవెన్నో ఉదాహరణములు కలవు. ఇంక ఊళ్ల పేళ్లు ఎట్లు మారిపోయినవో చూడండి!

నగరములు, పట్టణములు మొదలయిన పెద్ద స్థలముల పేళ్లలో ప్రోలు, నగరము, పురము, పట్టణము అనే మాటలు కనబడుతూ ఉంటవి. ఉ॥ గొల్లప్రోలు, విజయనగరము, ఇచ్ఛాపురము, భీమునిపట్టణము మొదలయినవి. ఇవి ఎట్లు మారినవో చూడండి :—

బిక్కోలు = (బిక్కవోలు - బిక్కనప్రోలు - బిక్కవాని ప్రోలు) ; చేబ్రోలు = (చేంబ్రోలు - చేంబ్రోలు) ; నిడుదవోలు = (నిడుదంబ్రోలు); నిడుబ్రోలు = (నిడుంబ్రోలు); ఒంగోలు = (వంగవోలు - వంగంబ్రోలు) ; బరంపురం = (బ్రహ్మపురం) - ఇంగ్లిషు వారి ఉచ్చారణలో బెర్హాంపూర్ బెరంపూర్ ; కొల్హాపూర్ = (కోలాహలపురం) ; పిఠాపురం = (పిష్ఠపురము); వైజాగపటెం = (విశాఖపట్టణము) - ఇంగ్లీషువారి ఉచ్చారణ; బీమ్లిపటెం = (భీముని పట్టణము) - ఇంగ్లీషువారి ఉచ్చారణ; సిధ్ధోటం=(సిధ్ధవట్టం-సిధ్ధపట్టణము).

'ఊరు ' అంతమందున్న ఊళ్ల పేళ్లలో మార్పు:—

టాంజార్ = (తంజావూరు)-ఇంగ్లీషువారి ఉచ్చారణము
బాంగలూర్ = (బెంగుళూరు) ,, ,,
మాంగలూర్ = (మంగళూరు) ,, ,,

కొన్ని గ్రామాలు 'కుఱ్ఱు' అంతముగా కలవి. సంబంధము తెలియజేసే షష్ఠీ విభక్తియందేకాక ప్రథమేతర విభక్తులన్నిటను కుఱ్ఱు కుర్తి గా మారుతుంది. కానుకుఱ్ఱు గ్రామనామము కానుకుర్తి అంటే కానుకుఱ్ఱు అనేగ్రామానికి సంబంధించిన అని అర్థము. ఉ॥ కానుకుర్తి వారు, కానుకుర్తి నరసింగరావు

మొ॥. అంతేకాక కానుకుర్తికి, కానుకుర్తినుండి, కాను కుర్తిలో అనికూడా ప్రయోగాలు. గ్రామనామమయి నప్పుడు ప్రథమావిభక్తిలో కానుకుట్లు అని ఉంటుంది. గాని కొన్ని గ్రామాల పేళ్లు కుర్తితో అంతమగుతున్నవి. ఉ॥ అక్కుర్తి, పులకుర్తి.

కుట్లు వలెనే తుట్లు, పట్లు అంతములుగాగల గ్రామనామ ములలో కొన్నిటను తుర్తి, పర్తి అంతమందు కనబడుతున్నవి. ఉ॥ పెందుర్తి, (పెన్ = తుట్లు), అనపర్తి, వనపర్తి, చింత పర్తి, గూడపర్తి.

ఈ క్రింది పట్టికలో మరికొన్ని గ్రామనామములందలి మార్పులు ఎట్లు కలిగినవో చూడండి :—

ఈ పేళ్లు ఇంగ్లిషువారి ఉచ్చారణములో జరిగిన మార్పుతో ఉన్నవి.

కైకారం = కైకవరము ; పూళ్ల = పూండ్ల ; రాజ మండ్రి = రాజమహేంద్రవరము ; అదోని = ఆదవాని ; మసూలా = మచిలీపట్టణము ; గుంటకల్ = గుంతకల్లు ; గూటీ = గుత్తి ; వరంగల్ = ఒరుగల్లు ; చికాకోల్ = శ్రీకాకుళము ; కాండూర్ = చెందుట్లు ; బెనారిస్ = వారణాసి ; కలకత్తా, కల్కటా = కాళీఘట్టము ; కోక నాడా = కాకినాడ ; కంజీవరం = కాంచీపురము ; సెరింగ పటం = శ్రీరంగ పట్టణము ; సెరంపూర్ = శ్రీరామపురము; మిడ్నపూర్ = మేదినీపురము.

# 4. ఆంధ్రులు – అప్పుడు ఇప్పుడు

సాహిత్యభూషణ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎమ్. ఏ., బి. ఎల్.

యూరప్ ఖండ దేశములకంటె మున్నే భరతఖండము, చైనా, బాబిలన్, ఈజిప్టుదేశములు విశేష నాగరకత నంది యుండెను. ప్రాచీన సభ్యతాంగణమున ఇటాలియన్లతో సంఘం శకమందలి తమిళులవలె ఆంధ్రులును నెయ్యము తోడను వియ్యముతోడను వఱలియుండిరి. ఆంధ్ర ప్రశస్తి ప్రాచీ ప్రతీచీ భూములందు శమంతకమణివలె తేజరిల్లినది. ప్రపంచమందలి మరియేయున్నత సంస్కృతికిని ఆంధ్ర సంస్కృతి తీసిపోలేదనియు, భూతలమున వెలసి సంస్కృతి గల జాతులలో ఆంధ్రజాతియు పేర్కొనదగిన జాతియని యు తెలుపుట నా యాశయము.

ప్రాచీన భారత సారస్వతమున మాత్రమేకాక పాశ్చాత్య సీమల చరిత్రములందును భూగోళ శాస్త్రములందును ఆంధ్ర సంస్కృతి గుఱించియు ఆంధ్ర విభూతి గుఱించియు ఉల్లే ఖనము లొనరింపబడెను. ఉపనిషచ్ఛిఖరములందును, పౌరా ణిక ప్రాంగణములందును చారిత్రిక వీధులందును చరచర నడచినను ఆంధ్ర సంస్కృతిని గుఱించిన బహుళాంశములను గ్రహింపగలము. పురాణములందు ముప్పదుగురాంధ్ర చక్ర వర్తుల అభిధానములు వివరింపబడినవి. శ్రీకాకుళము ధాన్య కటకము, ప్రతిష్ఠానగరము, కల్యాణి మున్నగు నగరములు ఆంధ్ర సామ్రాజ్యమున వెలసినవి. ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యము తర్వాత పల్లవ, ఇక్ష్వాక, బృహత్పాలాయన, సాలంకాయన, తూర్పు చాళుక్య, తెలుగుచోడ, కాకతీయ, విజయనగర, రెడ్డి, నాయక రాజ్యములు ఆంధ్రభూమిని వెలసినవి. గౌతమీపుత్ర శాతకర్ణి, రాజమహేంద్ర, గణపతి దేవ, ప్రౌఢ దేవరాయ, శ్రీకృష్ణదేవరాయ, వీరారెడ్డి, వేమా రెడ్డి మున్నగు రాజులును ; రుద్రమదేవి గణపాంబాదేవి బోలురాణులును తెలుగుతల్లి అంకతలమున వర్ధిల్లిరి. చాణక్య, సిద్ధ నాగార్జున, భావవివేక, భవభూతి, విద్యారణ్య, పండిత రాయలాది మహా విద్వాంసులును; యుగంధర, తిమ్మరసు, అక్కన మాదనలాది సచివోత్తములును; ఖడ్గ తిక్కన, బ్రహ్మ నాయక, వీరబలాది వీరవరులును; నన్నయ, తిక్కన, యెఱ్ఱన నాచనసోమ, పోతన, శ్రీనాథ, పెద్దన, తిమ్మన, సూరనాదుల బోలు కవినాథులును ఆంధ్ర జనయిత్రి స్తన్యమునందిన వారే.

ఆంధ్ర రాజులును, పిమ్మట ఆంధ్రవసుంధరను పరిపా లించిన చక్రవర్తులును యశస్విలకులై విదేశ చక్రవర్తులతో సన్నిహిత సంబంధముల నెలకొలుపుకొని విదేశ రాయ బారుల కాదరానురాగముల జూపుచు-సముద్రయానమున సిద్ధహస్తులగుచు-విదేశములతో వాణిజ్య సంబంధముల నేర్ప ఱచుకొనిరి. ఈ యంశమును దృష్టాంతీకరించుటకై పాళీ ప్రాకృత సారస్వతములనుండి బహు విషయములను పేర్కొనవచ్చును. మౌర్యరాజులు, కళింగ చక్రవర్తులు, ఆంధ్ర సార్వభౌములు మహా జిజ్ఞాసువులై, సాహసో పేతులై, విశాలదృష్టి సమన్వితులై విశాల భారతావధులను

విస్తృతమొనర్చిరి. హిందూ మహాసముద్రమందలి దీవులందును, సయామ్, కాంబోడియా, మున్నగు తావులందును ఆంధ్ర సంస్కృతి నుగ్గడించు వివిధ చిహ్నములును గలవు.

పూర్వము, కొంతకాలము, బ్రాహ్మణ బౌద్ధమతములు రెండును ద్విపద పంక్తులవలె వర్ధిల్లినవి. రాజులును, పరార్ధ పరులైన వణిజులును, తక్కంగల ధనాఢ్యులును విహారములను, విశ్రాంతి గృహములను చైత్యములను గట్టించిరి. ఆ కాలమందే పశ్చిమ భారత సీమయందును గిరిగుహాలందాలయములు నిర్మితములైనవి. వీటిని పరికించినయెడల ప్రాచీనాంధ్రుల భక్తివైభవము, శిల్ప నైపుణ్యము ఎట్టివో గ్రహింతుము. అజంతా గుహాలందలి శిల్ప విభూతియు చిత్ర రచనా చాతురియు ఆంధ్ర ప్రతిభా సముత్పన్నములే. సుమారిరువది మూడేండ్లకు మున్ను కలకత్తాలో కాలేజీ స్క్వేరునందు నిర్మితమయిన 'శ్రీ ధమ్మరాజచేతీయ' విహారమున గంగులీ యను సుప్రసిద్ధ చిత్రకారుడు అజంతా గుహాయందలి చిత్రములకు ప్రతిరూపములు చిత్రించెను. భట్టిప్రోలు స్తూపమున లభించిన బుద్ధదేవుని అస్థి ఇండియా ప్రభుత్వమువారి అనుమతి ననుసరించి అందు ప్రతిష్ఠించిరి. ఈ విహారమున ఆంధ్రత్వమెట్లు వెలయుచున్నదో పరిశీలింపుడు.

బౌద్ధమతబోధకులు సంస్కృతభాషలో గాక ప్రజా భాషయైన పాళీయందు తమ భావములను వ్యక్తీకరింప సాగిరి. ఆంధ్ర భూపతులు బౌద్ధమతమునకు చేయూత నిచ్చినవారు గనుక ఆంధ్ర వాఙ్మయమునకును, పాళీభాషలో నున్న బౌద్ధ వాఙ్మయమునకున్ను కొంత మైత్రిచేకూరెనని నా యభిప్రాయము. పాళీవాఙ్మయము నెఱిగిన పండితులు ఆంధ్రభూమియందు నేడు లేరనియే చెప్పవలెను. కావున ఈ విషయమును గుఱించిన పరిశోధనమేదియు జరుగలేదు. గాని, ఆంధ్ర పాళీ శబ్దములలో అందందు కొంత వియ్యము కలదని సోదాహరణముగా తెలుపగలను.

కనిష్కునికాలమున సంస్కృత భాష మరల మత ప్రవక్తల దృష్టినాకర్షించినది. సుప్రసిద్ధ బౌద్ధ విజ్ఞానియైన అశ్వఘోషును, నాటి యాంధ్ర మహామనీషియైన నాగార్జునుడును సంస్కృతభాషలో తమ రచనలు గావించిరి. నాగార్జునునిబోలు మహిమోపేతుడు ఆంధ్రులందు పుట్టుట ఆంధ్రుల అదృష్టము. ఆతని జన్మవలన ఆంధ్రజాతి పావనమై విశ్వవిఖ్యాతి నందినది. ప్రపంచమందు ఏదేశమందైనను ఏ యుగమందైనను జనించిన ఏ మహాత్మునకును, ఏ ప్రజ్ఞా ధురీణునకును ఆతడు తీసిపోడు. తపో మహిమచే ననుడు, పలుకుల కందని దీక్షా శక్తిచే ననుడు మనుష్యుడు ఈశ్వర సముడు కాజాలుచో సిద్ధనాగార్జునుడు అట్టివాడాయెనని కంఠమెత్తి వచింతును. శ్రీ శంకరుడు మహిమోపేతుడై 'సోఽహమ్' అనెను. శ్రీ శంకరభగవత్పాదులకు సుమారు తొమ్మిదివందల సంవత్సరములకు మున్నె ఆంధ్రమండలమున నాగార్జునుడుదయించి యద్వితీయమైన కీర్తిపొందెను. బ్రాహ్మణుడై జన్మించి, అచిరకాలములోనే వేదవేదాంగ పారంగతుడై, సర్వజ్ఞుడై, బౌద్ధమతమును స్వీకరించి ఇతడు బౌద్ధ మతగురు పరంపరలో నొక్కడై తుదకు రెండవ బోధి సత్త్వుడాయెను. కవీంద్రులందును, మునీంద్రులందును, తత్త్వవేత్తలందును, మంత్రవేత్తలందును, జ్యోతిషకులందును, రసవాదులందును, చికిత్సకులందును, త్యాగులందును యోగులందును ఇతడు శిరోమణియయ్యెను. ఇతడెఱుగని శాస్త్రములేదు, అందని శక్తిలేదు. మహాజ్ఞానియై ఇతడు హీనయాన బౌద్ధమతశాఖనే అనుష్ఠించినను అసంఖ్యాకులయిన పామరులకు భక్తిమార్గము ఎక్కువ సుబోధకమగునని యూహించి మహాయాన శాఖను స్థాపించి, శాక్యసింహుడు బుద్ధభగవానుడని తెలిపి జనుల హృదయములందు అద్భుతమైన మతావేశమును బుట్టించెను. ఈ మహాత్ముని కృషి కతన వివిధ బౌద్ధ సంస్థలు జగతిలో తల సూపినవి. ఆంధ్ర వసుంధరలో అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు, వేంగీపురము, ఆలూరు, ధరణికోట, గుంటుపల్లి, జగ్గయపేట, కామవరపుకోట మున్నగు తావులందు స్తూపములును, చైత్యములును, విహారములును నిర్మితములయియున్నవి. బుద్ధభగవానుని అస్థులీ కట్టడములందు ప్రతిష్ఠింపబడినవి. బౌద్ధ యాత్రికులు బహు సీమలనుండి యరుదెంచి యీ ప్రదేశములను దర్శించి పోవుచుండిరి. నాగార్జునుని యుదంతము కొంత కథా సరిత్సాగరమందుండుట నిక్కమే; కాని, బౌద్ధధర్మము నెడలను, బౌద్ధమత ప్రబోధకులయెడలను గల ద్వేషము కతన ఆనాటి భారతీయులితనికిని ఇతనివలెనే ప్రజ్ఞాధురీణులైన దిఙ్నాగాచార్య భావ వివేకులకును జూపవలసిన గౌరవము చూపరైరి. వీరిని గుఱించిన విపులోదంతములను టిబెట్ జపాను భాషలందు చూడవచ్చును. వీరి మహిమ నుగ్గడించు కథలెన్నో ఆ దేశములలో ప్రచారమందున్నవి. నాగార్జునుని రచనలు టిబెట్ చైనా జపాన్



జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి, ఎమ్. ఏ., బి. ఎల్.

దేశముల వాఙ్మయములలోనికి అనువదింపబడినవి. సుప్రసిద్ధ పద్య కావ్యమయిన "సుహృల్లేఖ"యును, తాత్త్విక మహా గ్రంథమైన "ప్రజ్ఞా పారమితసూత్ర వ్యాఖ్యయు"ను, "గీత", "దశభూమి విభాగశాస్త్రము" "ప్రజ్ఞా ప్రదీపశాస్త్రము" మున్నగు మహా గ్రంథములును సిద్ధనాగార్జునుడు రచించినవి. ఇతడు రచించిన గ్రంథములలో అనేకము నశించినవి; సుమారు ఇరువది గ్రంథములు చైనా టిబెట్ వాఙ్మయము లందు అనువాదములుగా గోచరించుచున్నవి. నాగార్జునుడు అద్భుతమైన శారీరకశక్తిని, అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక శక్తిని బడసెను. ఈ శక్తుల కతన భారత ఋషులు బహు శతవర్షములు మనియుండువారని చదువుచుందుము. నాగార్జునుడును ఆ యద్భుతశక్తుల నంది నూటయిరువదేండ్లు జీవించెనని కొన్ని బౌద్ధ గ్రంథములు తెలుపుచున్నవి. అంతేకాక భీష్మునివలె స్వచ్ఛందమరణము నొందెననికూడ తెలియవచ్చుచున్నది. ఆంధ్రదేశమునబుట్టి పరివ్రాజకుడై బహు సీమ లందు మసలి, పదపడి స్వీయభూమికి మరలి అందేయుసురుల బాసెను. గుంటూరు మండలమున పల్నాటి తాలూకా మాచెర్ల కుత్తరదిశయందు సుమారు పదునేను మైళ్ల దూరమున శ్రీ పర్వత సంఘారామమనియు, భ్రమరగిరియనియు పేరుపొందిన నాగార్జునకొండ ఈ మహనీయుని పేర నేటికిని నిలిచి చరిత్రకారుల మానసములందును బౌద్ధ శాస్త్రవేత్తల హృదయములందును అశేష భావబృందమును బుట్టించుచున్నది. ఈ నాగార్జునకొండ అశేష ప్రబోధ బంధురమైనది.

నాగార్జునునివలెనే మహోపాసకుడై సర్వశాస్త్ర పారంగతుడైన ఆంధ్ర మహాపురుషుడు భావవివేకుడు. ఈతని గ్రంథములుకూడ చైనా టిబెట్ వాఙ్మయములలోనికి అనువదింపబడినవి. ఈతడు క్రీ. శ. 6 వ శతాబ్దమున మఱలి యుండెను.

దిఙ్నాగాచార్యుడు ఆంధ్రుడు కాకున్నను స్వీయ కాంచీపురమును వీడి నలంద, పూరి మున్నగు ప్రదేశములందు సంచరించి పండిత ప్రకాండుడని ప్రసిద్ధినంది వేంగీపుర సమీప మందలి పర్వతములందు వసించి వేంగీ విజ్ఞానపరిషత్తున కధ్యక్షుడై అందే నిర్యాణము నందెను.

రాజ్యవైభవమున వేంగీపురము అమరావతి కీడైనది. ఎనిమిది శతాబ్దము లిది పల్లవ సాలంకాయన పూర్వ చాళుక్య రాజ్యములకు ముఖ్యనగరమై వాసి గాంచెను. "హేతు విద్యాశాస్త్ర" రచయితయైన జినబోధి సత్త్వుని యునికి కతన ఇది పూతవాతావరణపూరిత మైనది.

భారతదేశ పర్యటన మొనరించుచు క్రీ. శ. 637 లో కళింగదేశమున గాలిడి, పదపడి కోసలనాటను సంచారము సలిపి, 638 లో వేంగీపురమును ప్రవేశించిన సుప్రసిద్ధ చైనా యాత్రికుడు హ్యూన్‌త్సాంగు చాళుక్యరాజ్యవైభవమును వర్ణించెను.

తూర్పు చాళుక్యరాజులు బ్రాహ్మణమతమును పునరుద్ధరించి పెక్కుచోట్ల విష్ణుదేవాలయములను శివాలయములను కట్టించిరి. వారిలో క్రీ. శ. 800-843 వరకును ఏలిన రెండవ విజయాదిత్యుడు కళింగ గంగులపట్ల అగ్నిహోత్రుడు; తన నిశితకరవాలముతో శత్రు మస్తకములను రెండు తునకలుగా చీల్చిన వీరపుంగవుడు, పండ్రెండేండ్లలో గంగ రాష్ట్రకూట రాజులను 108 యుద్ధముల నోడించి 108 శివాలయములను నిర్మించెనని శాసనములు తెలుపుచున్నవి. పిమ్మట క్రీ. శ. 918-925 వరకును పాలించిన అమ్మరాజు

వేంగీపురము విడిచి రాజమహేంద్రవరము రాజధానిగా చేసి కొనెను. ఆ పిమ్మట తూర్పు చాళుక్య రాజులకు చోళ రాజులతోను గంగవంశ రాజులతోను వివాహ సంబంధ ములు కలియుచుండెను. దీని ఫలితముగ రాజరాజ నరేం ద్రుని పుత్రుడైన కుళోత్తుంగ చోడుడు చోళ తూర్పు చాళుక్య రాజ్యములకు రాజాధిరాజయ్యెను.

రాజరాజ నరేంద్రుని ఆస్థాన కవీంద్రుడైన నన్నయ భార తమును ఆంధ్రీకరించుటకు ప్రారంభించెను. మనకు తెలిసి నంతవఱకు ఈ గ్రంథరాజముతోనే మన ఆంధ్ర సారస్వ తము వృద్ధిచెందుటకు ప్రారంభించినది.

సారంగధర చరిత్రము ఈ రాజరాజ నరేంద్రునకు ముడి పెట్టి అందలి కథా వస్తువునకు బలమొసగుటకై కాబోలు సారంగధర మెట్టయనియు, చిత్రాంగి మేడయనియు పాతే రనియు పేళ్లు సృష్టించి రాజమహేంద్రవరమున కొన్నిటిని చూపుచుందురు; గాని ఇది కేవలము కల్పితము. ఇందుకు చారిత్రికాధారము లేవియును లేవు, రాజరాజ నరేంద్రునకు కులోత్తుంగచోళు డొక్కడే కుమారుడు.

పూర్వ చాళుక్యుల తర్వాత సామ్రాజ్య వైభవమందిన ఆంధ్రులు కాకతీయులు. కొన్ని శతాబ్దులు వీరు తూర్పు చాళుక్యుల యధికారమును శిరసావహించినవారే కాని కొంతకాలమునకు ఓరుగల్లు పరిసరమున వ్యాపించిన తమ రాజ్యమును స్వతంత్రులుగా పాలించుటకు ప్రారంభించిరి. క్రీస్తుకాలములోనే కాకతి సామ్రాజ్యము నలుదెసల వ్యా పించి ప్రసిద్ధిబడసినది. క్రీ. శ. 1223 లో సింహాసనము నధిష్ఠించిన గణపతిదేవు డొడ్డరాజు. ఇతనికి రుద్రమాంబ గణపాంబయను పుత్రికలే కాని పుత్రులు లేనందున 1260లో రుద్రమాంబకు పట్టాభిషేకము గావించెను. గణపతి యనం తరము ఈమె 31 సంవత్సరములు రాజ్యమేలి గొప్ప విఖ్యాతి బడసినది. 1240-1250లో ధన కటకమును రాజధానిగా గల ఆఱువేలనాటికి రాజయిన కోటవంశపు బేతరాజునకు గణపాంబ అర్ధాంగ లక్ష్మియైనది. అతడు కాంచీపురమునకు గణపతిదేవునితోగూడ దండయాత్ర సలిపి మరణించుట చేతను, బిడ్డలు లేనందునను గణపాంబయే రాజ్యభారము వహించినది. రుద్రమగణపాంబ లిరువురును సమర్థతతో రాజ్యమేలి అనేక సత్కార్యముల నొనరించిరి; తండ్రి శైవుడగుటచే ఇరువురును శివ సేవా తత్పరలయిరి. బేత రాజు విష్ణుభక్తుడై యుండినను గణపాంబ అతనికి శివసా యుజ్యము లభించుటకై ధరణికోట యనమదల పురము లందు మహేశ్వరాలయములు నిర్మించి వాటిపై బంగారు కలసెలను నిలిపెను. తండ్రికి చిన్మయ దీక్షనొసగిన విశ్వేశ్వర శివ మహామునికి రుద్రమాంబ మందర వెలగపూడి గ్రామ ములను దానముచేసెను.

సుప్రసిద్ధ వెనిస్ యాత్రికుడు, మార్కోపోలో 1291 లో ఆఱువేల నాటనుండిన మోటుపల్లి రేవులో ఓడదిగి ఆంధ్రసీమలో కొంతకాలము తిరిగి రుద్రమ గణపాంబా దేవుల రాజ్యపాలన విశేషములను, వారి గుణగణములను, వారి రాజ్య వైభవములను బహుభంగుల నుగ్గడించెను. మోటుపల్లి ప్రాంతమున పెద్ద వజ్రములు లభించుననియు, మేలయిన వజ్రములు ఆంధ్రభూపతులును, ఐశ్వర్యవంతు లును ఉపయోగింతురనియు, తక్కువరకపు వజ్రములే పాశ్చాత్య దేశములకు ఎగుమతియగుచుండుననియు, నాడు ఆంధ్రదేశమునందు సన్నని నూలు దొరుకుచుండుననియు, ఆ నూలుసెల్లాలు రాజులకును రాణులకును ప్రీతికరములుగ నుండుననియు మార్కోపోలో తెలియజేసెను. ఆ కాలమున ఆంధ్రులకును ప్రతీచీ వాసులకును వాణిజ్యవైజ్ఞానికాంగణ ములందు దగ్గఱి చుట్టఱికము కుదిరెను.

రుద్రమాంబ తర్వాత రాజ్యమేలిన రెండవ ప్రతాప రుద్ర దేవు సైతము దొడ్డరాజే: విద్యానాథాది పండితులను పోషించి కీర్తిగన్నవాడే కాని విధివశమున ముసల్మానుల దండయాత్రలకు ఓడిపోయెను.

అతని తర్వాత కాకతి సామ్రాజ్యము క్షీణించి అంత రించినది. ఇందలి చిన్నరాజ్యములు స్వతంత్రత పొందినవి. అందొకటి కొండవీటి రాజ్యము; ఆంధ్ర సాహిత్య లక్ష్మి కొంతకాలము వఱలినస్థానము; రెడ్డి భూపతుల ప్రతిభా విశేషములకు ఆటపందిరి. కవిసార్వభౌముడైన శ్రీనాథుడు బహువిధ రాజసన్మానములను పొందిన ప్రదేశము.

చోళుల యధికారము అస్తమించిన యనంతరము నెల్లూ రురాజ్యము ఆంధ్రదేశమందొక ప్రసిద్ధ రాజ్యమై వెలసినది. మనుమసిద్ధి నెల్లూరిలో వెలసెను. తిక్కన సోమయాజి భారతాంధ్రీకరణమున తన యద్భుత ప్రజ్ఞను ప్రకటించెను. తిక్కన తన ఘంటముతో కీర్తి పొందినట్లు ఖడ్గ తిక్కన తన కత్తితో కీర్తిపొందెను.

ఓరుగల్లు సామ్రాజ్యము తర్వాత విజయనగర సామ్రాజ్యము విశేష ప్రశస్తి నందినది. ఈ సామ్రాజ్యమేలిన రాజులలో క్రీ. శ. 1421-1448 వఱకును రాజ్యమేలిన రెండవ దేవ రాయలనాటికి రాజ్యవైభవము ఎంత ఘనత చెందియుండెనో అతని కాలమున మన దేశమునకు వచ్చిన కాంటియను ఇటలీదేశ యాత్రికుడును అబ్దుల్ రజక్ అను పారశీకపు రాయబారియును రచించిన వర్ణనలను బట్టి తెలియగలదు. ఈ సామ్రాజ్యము దక్షిణదేశమందు ఎక్కువమేర వ్యాపించి యుండెననియు, సముద్రతీరమున మున్నూరు ఓడరేవులుండె ననియు రజక్ తెలిపెను. విజయనగరము గురించియు, ప్రజలనుగురించియు చక్రవర్తి గుణగణముల గురించియు, మహోత్సవముల గురించియు అతడు గావించిన వర్ణనములు మనోహరములు. నిరుపేదలు సైతము రత్నాభరణ భూషి తులైయుండురని ఆతడు తెలిపెను. దేవరాయల పాలనము శాంతియుతముగ నుండెను. అతనికాలమున అన్యదేశములతో వాణిజ్య మెక్కువగా జరుగుచుండెను. అతడు కవి, కవి పోషకుడు. ఆతని ముత్యాలశాలయందే గౌడడిండిమ భట్టునోడించి వాని కంచు ఢక్కను పగులగొట్టించి కవి సార్వ భౌముడైన శ్రీనాథుడు ఈ చక్రవర్తివలననే కనకాభిషేకము నందెను. 'మహా నాటక సుధానిధి'యను శ్రీరామచరిత్ర ము నీ రాజే రచించెను.

దేవరాయల తర్వాత క్షీణించిన విజయనగర సామ్రా జ్యము మరల శ్రీకృష్ణదేవరాయల కాలమున 1509-29 విజృంభించినది. ఇతడు విద్యావంతుడు, కవి, కవిపోష కుడు. ఇతనికాలమున పెద్దన, తిమ్మన మొదలయిన కవులు ఆంధ్ర సారస్వతమందు ప్రబంధ యుగమునకు త్రోవ చూపిరి. వారిలో ఆంధ్ర కవితా పితామహుడని రాయలచే సన్మానితుడైన అలసాని పెద్దన మనుచరిత్ర ప్రబంధమును రచించి ప్రఖ్యాతినందెను. శ్రీకృష్ణదేవరాయలు సంస్కృత భాషలో కొన్ని నాటకములు గ్రంథములు రచించెను; తెలుగుభాషలో ఇతడు రచించిన ఆముక్తమాల్యద ఇతని రాజ్యపాలన చాతురియేకాక, ఇతని కవితా నైపుణ్యము, విస్తృతి చెందియుండిన లోకానుభవము, పరిశీలన, విమర్శన, మొదలయిన ప్రజ్ఞావిశేషములు తెలియజేయును. విజయనగర రాజులు విష్ణుభక్తులు. 11, 12, 13 శతాబ్దములందు చోళ, కాకతిరాజుల యాదరముచే శైవమతము వర్ధిల్లినట్లు, 16-17 శతాబ్దులలో విజయనగరరాజుల యాదరమున వైష్ణవ మతము వర్ధిల్లినది.

ప్రాచీన కాలమునుండి విజయనగర సామ్రాజ్యమును అం దుండి యేర్పడిన తంజావూరు, మధుర మొదలయిన చిన్న రాజ్యములును క్షీణించిన వరకునుగల ఆంధ్రులచరిత్ర పరిశీ లించినపుడు మేధాశక్తియందును, హృదయశక్తియందును, సంకల్పశక్తియందును, భావనాశక్తియందును, చింతనాశక్తి యందును, క్రియాశక్తులందును, ఆంధ్రులు భారతదేశమందే కాక అఖిల ప్రపంచమందునుగల జాతులలో ఏ జాతికిని తీసిపోలేదని పాఠకులు గ్రహింతురు గాక.

ఇంతవఱకును ఆంధ్రులు రాజ్యాధికారము గలిగియుండిరి గావున వివిధ క్రియాంగణములందును సకల సంస్కృతి రంగములందును తమ ప్రజ్ఞను వ్యక్తీకరించుకొనుటకు వారె న్నేని అవకాశములనందిరి. గాని ఆ తర్వాత ఆంధ్రుల యున్నతి అన్ని విషయములలోను క్షీణించుటకు మొదలు పెట్టినది. చిన్న చిన్న ఆంధ్రరాజ్యములన్నియు మొట్ట మొదట బిజాపూర్-గోల్కొండ సుల్తానుల వశమయినవి; ఆ పిమ్మట మొగల్ సామ్రాజ్యమందలి భాగములయి దక్కన్ సుబేదారుగానుండి స్వతంత్రుడైన నైజాం అధి కారమునకు వశపడినవి. మరికొంతకాలమునకు ఫ్రెంచివారి అధికారమునకు లోబడి తుదకు బ్రిటిష్ ప్రభుత్వమునకు లొంగి హైదరాబాదులోనున్న ఓరుగల్లు మొదలయిన కొద్ది ప్రదేశములుకాక తక్కిన తెలుగు ప్రదేశమంతయు చెన్నపురి రాజధానిలో చేరియున్నది. ఆంధ్రులకొక స్వతంత్రరాజ్యమే కాదు ప్రత్యేక రాష్ట్రమైనను నేటికింకను ఏర్పడలేదు! ఆంధ్రులు మద్రాసీలయినారు!

స్వతంత్రత గోల్పోయి బ్రిటిషు ప్రభుత్వమునకు లోబడి నను వంగదేశము ఈ నవీన యుగమందు నూతన వికాసమును పొంది మరల వృద్ధి నందుచుండగలిగినది. అందుకు దగిన కారణములు గలవు. ముప్పదియేండ్ల క్రిందటివఱకును వంగ దేశమునకు ప్రధానమైన కలకత్తానగరము బ్రిటిష్ ఇండియాకు రాజధాని నగరమైయుండుటచేత నవీన సంస్కృతి జీర్ణము చేసుకొని వంగీయులు ప్రాక్ పశ్చిమ సంస్కృతి సమ్మే ళనము పొందుపఱచుకొనగలిగిరి. వారిలో రాజా రామ మోహన, రామకృష్ణపరమహంస, కేశవచంద్రసేన, వివేకా నంద, రవీంద్రనాథఠాకూరు మొదలయినవారు కొందరు తమ

ప్రాభవమును తమ ప్రదేశమందే కాక భారతదేశమందంతటను వ్యాపింపజేసికొనగలిగిరి. వంగీయులు ప్రత్యేక రాష్ట్రమును కలిగియుండుటచేతను, వంగ వాతావరణము గంభీర భావబంధురమై యుండుటచేతను, పైని చెప్పినట్లు వంగ రాష్ట్రమందలి ప్రధాన నగరము 150 యేండ్లు భారతదేశ రాజధానియై ప్రపంచ వైజ్ఞానిక కేంద్రములతో అంతరంగిక బాంధవ్యమందుటచేతను, ప్రపంచ పథికులును వైజ్ఞానిక యాత్రికులును—ప్రాచీనకాలమున గ్రీకులు తక్షశిల జేరినట్లు, కలకత్తా నగరమును జేరి ప్రాచీ ప్రతీచీ విజ్ఞాన స్రవంతులచ్చట గంగాయమునలట్లు సంగమించుటగని వంగ హృదయమున నవ్యభావ ఫలసాయమును పుట్టించుటచేతను, వంగవాసులు బహుళాంతరంగిక శక్తుల నందజాలిరి. రాజ్య రహితులే కాక ప్రత్యేక రాష్ట్ర రహితులును అయిన ఆంధ్రులు సర్వతో ముఖమైన ఆత్మాభివృద్ధికి వలసిన సౌకర్యములను అందక అల్లాడుచున్నారు. ప్రత్యేకాంధ్ర రాష్ట్రము లేనంత కాలము ఆంధ్రులు అభివృద్ధి నందజాలరు; నూతన వికాసమును తగినరీతిని పొందజాలరు.

వంగసారస్వత ప్రాభవము మన తెలుగునాట ఎంత వఱకు గలదో క్లుప్తముగా మరియొక వ్యాసమందు తెలియజేసితిని. ఆ వ్యాససంగ్రహముకూడ ఈ గ్రంథమందు కలదు. ఉత్కృష్టమైనది ఎచ్చటనున్నను ఎవ్వరిదైనను తెచ్చుకొనుట, అనుకరించుట మంచిదేకాని అది మనదిగా జేసికొని ఆంధ్రత్వముతో అనుకూలింప జేసికోవలెను. అంతే కాక స్వతంత్రశక్తి పునరుద్ధరించవలెను.

వంగదేశమందలి రామమోహనాదులవంటి వీరులుదయింపకున్నను ఈ నవీనయుగమున మన ఆంధ్రులందును కొందఱు మహనీయులు పుట్టకపోలేదు; గాని, పైని చెప్పిన కారణములవల్ల వీరి ప్రఖ్యాతి అంతగా వ్యాపింపలేదు. 1780-1836 మధ్యకాలమందు మద్రాసులో నివసించి సూప్రీమ్ కోర్టులో ద్విభాషి పదవియందుండి ఏనుగుల వీరాస్వామయ్యగారు వివిధరీతుల ప్రజాసేవజేసిరి. వీరు భారతదేశ పర్యటనము సలిపి, వివిధ ప్రదేశముల ఆచార వ్యవహారములను పరిశీలించి, కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్లగారికి వ్రాసిన జాబులందు తమ యనుభవముల గుఱించి తమ యభిప్రాయములను తెలిపిరి. నవయుగ మహోద్యమమును గుఱించిన ఉల్లేఖనము వీరి 'కాశీయాత్ర చరిత్ర'లో అంతగా గానరాదు, గాని, మద్రాసులో వీరు ఈ యుద్యమ విజయమునకై శ్రీనివాసపిళ్ల, వెంబాకం రాఘవాచార్యులగార్ల తోడ్పాటున కృషిసలిపిరి. గాజుల లక్ష్మీనరసు సెట్టిగారు వర్తకులును, వదాన్యులును అయి వారి యత్నములకు దోహద మొనర్చిరి. ప్రతికూల పరిస్థితులెదుర్కొన్నను ఆంధ్రుల పారిశ్రామిక వాణిజ్య వ్యవస్థలు తమ కాలమునాటి కింకను నిలిచియున్నవని వీరాస్వామయ్యగారు తమ కాశీయాత్ర చరిత్రలో తెలియజేసినారు. గంజాము, పూడీ, బారువ, స్వర్ణపురము, కళింగపట్టణము మున్నగు ఓడరేవుల గుండా చక్కగా వర్తకము సాగుచుండెననియు, ఈ రేవులకు చేరువగానున్న గ్రామములందు బట్టల నేత జరుగుచుండెననియు, వేటపాలెములో వేయిమంది నేతగాండ్రు నివసించుచుండిరనియు, మనప్రదేశమందు నేసిన బట్టలు తోపుసెల్లాలు, రుమాలా తానులు, చీరెలు మొదలయినవి విదేశములకు ఎగుమతి యగుచుండెననియు వీరస్వామయ్యగారు తమ గ్రంథమున దెలిపిరి.

ఆంధ్రులలో మేధా శక్తిగలవారు లేకపోలేదు. కీ. శే. రా. బ. వీరేశలింగం పంతులు, సర్. ఆర్. వేంకటరత్నం నాయుడుగార్లవంటి సంఘ సంస్కర్తలు, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులువంటి ఉదారులు, సర్. ముత్తా సుబ్బారావుగారివంటి సంస్కృతి పారీణులు, సర్. రాధాకృష్ణగారివంటి మేధావులు గలరు; గాని, వీరి బుద్ధి, ఘనత, ప్రజ్ఞ ఉద్దీపించుటకు తగిన అవకాశములు లేవు. సారస్వతమందును గొప్ప పండితులును కవులును గలరు. మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు దేశ విఖ్యాతులేకాని అట్టివారు మరికొద్దిగా మాత్రమే కలరు. రవీంద్రునివలె లోక విఖ్యాతిగల కవీంద్రుడు ఆంధ్ర సారస్వతమున ఇంకను పుట్టలేదు. గాని పుట్టుట అసాధ్యముకాదు. రాజకీయ సాంఘికార్థిక వాతావరణము అనుకూలమైనది కావలెను. అందుకు ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్ర నిర్మాణము అత్యవసరమైనది. దానికై ఆంధ్రులెల్లరును దీక్షతో పాటుపడి కృతకృత్యులగుదురు గాక!



# 14వ భాగము – 33వ అధ్యాయము

# ఆధార గ్రంథముల పట్టిక

### భాగము 1.

గ్రంథము — రచయిత లేక ప్రకటనకర్త

విశ్వరూపము—కాళీపట్టపు కొండయ్య
హిందూదేశ కథా సంగ్రహము—కో. వేం. లక్ష్మణరావు
జగత్కథ—కో. శఠగోపాచార్యులు
Madras Govt., Departments Administration Reports
Hindustan Year Book, Nalanda Year Book, Times of India Year Book, The Indian Year Book — 1941
Linguistic Survey of India
బౌద్ధ మహా యుగము—వేలూరి సత్యనారాయణ
Is it Indian ?—M. Bapineedu, Secretary, Madras Industrial Association
హిందూదేశ చరిత్ర—డా॥ గిడుగు వేంకట సీతాపతి
Famine reports of the Madras Govt.
ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు—భారతి సంచికలు- గృహలక్ష్మి సంచికలు
ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం—కో. వేం. లక్ష్మణరావు

### భాగము 2.

The C. M. S. Telugu Mission—F. F. Gladstone
ఇస్లాం మతము-అహింస—డా॥ ఎమ్. హెచ్. సయ్యద్

### భాగము 3.

స్వీయచరిత్ర—కం. వీరేశలింగం పంతులు
నానారాజన్య విఖ్యాత జనచరిత్ర—శ్రీరాం వీరబ్రహ్మకవి
సూర్యనారాయణీయము—వల్లూరి సూర్యనారాయణ
మల్లాడి సత్యలింగం నాయకరు విల్లు
ఆర్యవైశ్య వ్యవస్థా వివక్షణి—సామి వెంకటాచలం శ్రేష్ఠి
Rise of Christian Power in India—Major B. D. Basu

### భాగము 4.

ఆంధ్రుల చరిత్ర—చిలుకూరి వీరభద్రరావు
విశాలాంధ్రము—అవుటుపల్లి నారాయణరావు
Census Register of the Madras, Bombay, U. P., C. P. and other Provinces
The Madras Tercentenary Volume (1939)
The official Hand Books of Madras
కాశీయాత్ర చరిత్ర—ఏనుగుల వీరాసామయ్య
జమీందారీ కమిటీ రిపోర్టు-టం. ప్రకాశం
Castes and Tribes of India—Thurston

### భాగము 5.

Problem of India
Planning Committee Reports
National planning—N. Dass
A note on Economic resources of the Province—Green
Live Stock of Southern India—R. W. Littlewood
పండ్లు (భా 1, 2 లు)—గోటేటి జోగిరాజు
A collection of the Telugu Sayings and Proverbs on Agriculture—కా. రామస్వామి శాస్త్రులు
Sea-borne trade of Madras

### భాగము 6.

The Hand book and Souvenir of the VIII All India Medical Conference, Vizagpatam
జంతు వైద్యము—యేజెళ్ల శ్రీరాములు చౌదరి

### భాగము 7.

History of the Telugu language—డా॥ చిలుకూరి నారాయణరావు
వ్యాససంగ్రహము—సం॥ తెలికిచెర్ల వెంకటరత్నం
ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము—కె. వెంకట నారాయణరావు
వైతాళికులు—ముద్దుకృష్ణ
ఆంధ్ర వాఙ్మయ సూచిక—కాశీనాధుని నాగేశ్వరరావు
కవి జీవితములు—గురజాడ శ్రీరామమూర్తి
శతక కవుల చరిత్ర—వంగూరి సుబ్బారావు

Telugu Literature—
P. Chenchiah and Raja M. Bhujanga Rao

A Descriptive catalogue of Telugu Manuscripts
—Andhra University, Waltair

Andhra University Code ('38—40)
" " ('39—41)
The Annual Register
The 4th Annual Report of the Andhra University
} Andhra University, Waltair

ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక—
ఆ. గ్రం. సంఘం, బెజవాడ

మన గ్రంథాలయములు—సురవరపు ప్రతాపరెడ్డి

భాగము 8.

Buddhist remains in Andhra—
K. R. Subramanian

భారతీయ చిత్రకళ—తలిశెట్టి రామారావు

అమరావతి స్తూపములు—మల్లంపల్లి సోమశేఖరశర్మ

Andhra Week Commemoration Vol. Waltair

కృష్ణా పత్రిక (సంక్రాంతి సంచిక)

Ajanta and Ellora Caves—The Archeological Department Reports—Nizam's State Railway

భాగము 9.

కాంగ్రెస్ చరిత్ర—డా॥ భో. పట్టాభి సీతారామయ్య

ఆంధ్ర నారీమణులు—ఆంధ్ర శేషగిరిరావు

భాగము 10.

History of Northern Circars-Grant

District Mannuals

District Gazetteers

జిల్లా భూగోళములు—వెంకట్రామా అండ్ కో

M. S. M. Railway Guide

Cochin calling—Cochin Government

Holiday Tour in Mysore
Where to go and what to see in Mysore?
} Mysore State Railway

Humpi Ruins in pictures—Balasundaram

Warangal—Nizam's State Railway

భాగము 12.

The Directory of Andhra Desh—C. Ranga Rao

Who's who in Madras, 1940.
(The Pearl Press, Cochin).

---

# ఆంధ్ర సర్వస్వ సంపాదకీయ వర్గము

శ్రీ మాగంటి బాపినీడు
బి. ఎస్‌సి., (కార్నెల్)., ఎమ్. ఎస్‌సి., (కాలిఫో)., ఎమ్. ఎల్. ఏ.

డా. గిడుగు వేంకట సీతాపతి
బి. ఏ., ఎల్. టి., డి. లిట్., (ఏ. ఐ. ఏ. వాషింగ్‌టన్).

శ్రీ మోటూరి సత్యనారాయణ
దక్షిణ భారత హిందీ ప్రచార సభా కార్యదర్శి.



# దేశభక్తి

కీ. శే. గురజాడ అప్పారావు.

1. దేశమును ప్రేమించుమన్నా,
మంచి అన్నది పెంచుమన్నా,
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయీ

2. పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్;
తిండికలిగితె కండకలదోయ్,
కండకలవాడేను మనిషోయ్!

3. యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నించవోయీ.

4. అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్,
దేశిసరుకుల నమ్మవలెనోయ్!
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తిసంపద లబ్బవోయీ.

5. వెనకచూసిన కార్యమేమోయ్?
మంచిగతమున కొంచమేనోయ్
మందగించక ముందుఅడుగేయ్
వెనకపడితే వెనకెనోయీ!

6. పూనుస్పర్ధను విద్యలందే
వైరములు వాణిజ్యమందే,
వ్యర్థకలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయీ!

7. దేశాభిమానం నాకుకద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్;
పూనియేదైనాను వొకమేల్
కూర్చిజనులకు చూపవోయీ!

8. ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయీ,
ఒరులమేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయీ!

9. పరులకలిమికి పొర్లియేడ్చే
పాపికెక్కడ సుఖంకద్దోయ్?
ఒకరిమేల్ తనమేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయీ!

10. స్వంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్,
దేశమంటే మనుషులోయీ!

11. చెట్టపట్టాల్ పట్టుకుని దే
శస్థులంతా నడవవలెనోయ్,
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్.

12. మతంవేరై తేను యేమోయ్!
మనసులొకటై మనుషులుంటే
జాతమన్నది లేచిపెరిగీ
లోకమున రాణించునోయీ!

13. దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూ లెత్తవలెనోయ్,
నరులచెమటను తడసిమూలం,
ధనంపంటలు పండవలెనోయ్!

14. ఆకులందున అణగిమణగీ
కవితకోవిల పలకవలెనోయ్
పలుకులనువిని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్!

---

# మంగళం

ఆంధ్రమాత శ్రీసమేత ।
అనుపమ ప్రఖ్యాతచరిత ।
అఖిలభక్త పారిజాత ।
అమల మంగళం ॥

మొల్లముఖ్య కవయిత్రుల ।
మల్లమాది సాధ్వీమణుల ।
అల్లరుద్రమ దేవిగన్న ।
తల్లి మంగళం ॥

రామదాసాది భక్త ।
రత్నములను గన్నతల్లి ।
వల్లభాది మతకర్తల ।
తల్లిమంగళం ॥

తిమ్మరసు యుగంధరాది ।
దివ్యరాజ నీతిపరుల
నన్నయాది కవులగన్న
తల్లిమంగళం ॥

—: సంపూర్ణము :—



హిందీ ప్రచార్ ప్రెస్, త్యాగరాయనగర్, మద్రాస్.